సేవాశ్రమ గ్రంథమాల : ద్వితీయ కుసుమము

A

# బ్రిటిష్ మహాయుగము

మేజర్ బి. డి. బాసు, ఐ. యమ్. యస్. గారి

**RISE OF THE CHRISTIAN POWER IN INDIA**

అను గ్రంథము ననుసరించి




ప్రథమ సంపుటము



గ్రంథకర్త

ప్రకాశకుడు:
చరువు శ్రీశైల మల్లికార్జునుడు
సేవాశ్రమము-పెదపాలెము
(Via) దుగ్గిరాల

మొదటి కూర్పు
1,000 ప్రతులు
1938, అక్టోబరు

కేసరీ ముద్రాక్షరశాల
150, అణ్ణాపిళ్లె వీథి
జార్జిటౌన్, మద్రాసు

# ప్రకాశకుల విజ్ఞప్తి.

ఆరు సంవత్సరముల క్రితము శ్రీయుత మానికొండ. సత్యనారాయణ శాస్త్రిగారీ గ్రంథమును తెలుగున వ్రాసిరని వినినప్పటినుండియు యెప్పు డీ గ్రంథము అచ్చుపడి అందరికీ అందుబాటులోనికి వచ్చునా యని ఉవ్విళ్లూరుచూ యీ గ్రంథమునకై ఆతురతతో యెదురుచూచుచున్న వారిలో మేమొకర మగుటచేతనే, యీ కార్యమునకు గడంగవలసి వచ్చినది. ఇది తలవనితలంపు. విచిత్రసంఘటనము.

శ్రీ మానికొండ, సత్యనారాయణ శాస్త్రిగారి రచనా కౌశలము, వారి జాతీయభావ విస్ఫారత, విషయ సంగ్రహణశక్తి సామర్థ్యములనుగూర్చి మే మెక్కువగ వ్రాయుటకన్న, వారిచే రచింపబడిన 'తిలక్ మహాశయుని జీవితము-ఉపన్యాసములు,' 'ఆంగ్ల రాజ్యస్థాపన' మొదలగు గ్రంథములు చదివిన బాగుగా తెలియగలదు. వారిగ్రంథములను చదువుచున్నపుడు వారి లేఖినీధురి సామాన్య విజ్ఞానముగలవారి హృదయాంతరాళములలోనికి సహితము ప్రవహించి యెల్లు కదలించి, ఉత్తేజము కలుగచేయునది యెక్కువగ వ్రాయ నవసరములేదు. అయ్యది అనుభవించవలసినదేగాని చెప్పుటకు వీలులేదు.

ఇందుతోగూడ ప్రచురించుచున్న 'పట్టాభిగారి పరిచయవాక్యము', 'గ్రంథకర్తృ నివేదము' తిలకించిన యీ గ్రంథమునొక్క పరిచయము, ప్రాశస్త్యము, అవసరములనుగూర్చి విదితముకాగలదు.

సుప్రసిద్ధులును, ఆంధ్ర విశ్వవిద్యాలయ ఆచార్యులును అగు శ్రీ మామిడిపూడి, వెంకటరంగయ్యగారిని మేము ఈ గ్రంథమునకు పీఠిక వ్రాయవలసినదని కోరగా, అందులకు వారు తమప్రేమ పురస్సరమగు నంగీకారమును తెలిపిరి. మొదట యీపుస్తకమును ఒక సంపుటముగనే వేయదలచితిమి. కాని యిపుడు గ్రంథము అనుకొన్న దానికన్న పెరుగుటచే రెండుసంపుటములుగ వేయుట అనివార్యమైనది. ఈకారణమున వారిపీఠిక సకాలమున నందుకొని ఈ ప్రథమ సంపుటములో ప్రచురించి పాఠకులను రంజింపచేయలేక పోయినందుకు చింతిల్లుచున్నాము. అద్దానిని రెండవ సంపుటములో ప్రకటింతుము. అయ్యది ఈగ్రంథమునకు తప్పక వన్నె తేగలదని నమ్ముచున్నాము.

తన జీవితములో సర్వతోముఖవికాసము నాకాంక్షించు ప్రతి ఆంధ్రుడును జాతీయైక్యత, వాఙ్మయాభివృద్ధి తప్పక కోరునని నమ్ముచూ మాయీయుద్యమమునకు తప్పక ఆదరాభిమానములు జూపునని ఆశించుచున్నాము.

ఈ గ్రంథమును త్వరత్వరగ ప్రకటించుచున్నందున యిందు దొరలిన యెట్టి దోషములనుగాసి పాఠకులు సహృదయముతో మన్నింప గోరుచున్నాము.

ఇట్టి గ్రంథమును, శ్రీ ఆంధ్రమాత మృదుపద పంకేరుహములకడ మా 'సేవాశ్రమ గ్రంథమాల' ద్వితీయ కుసుమముగ సర్పింప నవకాశము గల్పించిన శ్రీయుత మానికొండ, సత్యనారాయణ శాస్త్రిగారికి ఆయుఃశ్రీల నొసగి యిటులనే ఆబిడ సేవజేయునట్లు ప్రసాదించవలసినదిగ ఆ జగన్మాతను ప్రార్థించు చున్నాము.

౧-౧౧-౩౮. సేవాశ్రమము-పెదపాలెము.



# INDIAN HISTORY, BRITISH PERIOD

TORRENS & BASU

*(Need for publication in Telugu)*

NOTE BY DR. B. PATTABHI SITARAMAYYA

The study of Indian History is largely vitiated in Indian schools by the perverse stand-points adopted by Anglo-Indian Text Book writers. But it must be said to the credit of the English scholars and savants that whenever they deal with historical matters they generally display a spirit of detachment and impartiality. One such writer is Mr. W. M. Torrens, M.P., author of "Empire in Asia, How we came by it, A Book of Confessions." This has been already published in Telugu by the present author, Mr. M. Satyanarayana Sastri, under the Caption "Angla-Rajya-Stapana"

It is a book which till recently was out of print. But owing to the enterprising spirit of Panini Office, Allahabad, it has been re-published in India. As the author himself states, it is a book of confessions and gives the reader an insight into the realities of the acquisition of the Indian Empire. It is but right that, in the interest of Truth, if of nothing else, the Indian student should be told that Truth, in all its fulness and may be in all its nakedness while yet he is in the formative period of his life. For, impressions once made during that receptive age are almost indelible, whatever corrections and corruptions might be applied in later life.

Opinion is almost unanimous in the country that the study of Indian History should be pursued in Indian Schools and Colleges so as to nurture a feeling of genuine pride in the country over its achievements and genuine sense of shame over its failures, albeit, that this pride or this shame, are subject to the over-riding considerations of loyalty to Truth. It is therefore as devotees at the shrine of Truth not merely of patriotism, that we turn to authors like Torrens and Basu for glimpses of that eternal truth, which alas! has been glossed over or even tarnished by the interested and partisan writings of Anglo-Indian Educationists.

Major B. D. Basu's (I.M.S.) works are only too well-known and his stand-point in dealing with the British Period of Indian History (" Rise of the Christian power in India ") needs no comment as he is an Indian without however that bias which Anglo-Indian authors and Indian Educationists labour under.

There is equal unanimity in the opinion that the study of History, more than any other subject, should be conducted through the medium of vernacular languages. If that should be so, it would be none too soon to attempt publications of this character in Telugu, for it is often complained that Universities are not able to embark upon this reform merely for want of suitable Text Books. Equally loud is the complaint of authors and publishers of books in Telugu that they cannot command any patronage or sale at the hands of the Universities or the public. Really then there is a state of dead-lock, or if you will, a vicious circle. Books won't be forthcoming unless there is patronage and patronage won't be forthcoming unless there are books. It is the part alike of wisdom, patriotism, and statesmanship to strive to cut this circle at some point, to solve this dead-lock in a suitable manner. For this, the co-operation of authors and publishers and patrons is essential. Mr. Manikonda Satyanarayana Sastri, about whose position in the literary world no unnecessary words of introduction need be interposed here, has done his duty in undertaking that arduous task on the off-chance of some good friend finding the means which would enable his manuscripts to see the light of day and a search is made for that good friend by whose bounties alone the labours of scholars would be made available to the students of future generations. I am glad that that good friend has been found in the Ashramites of the Sevasram of Pedapalem, Guntur Dt.

I congratulate the author and the publishers who have at last found each other. They are bound to earn the sincere thanks of a grateful posterity for the abiding services they have rendered to the nation.



# పట్టాభిగారి పరిచయ వాక్యము

స్కూలు పుస్తకములు వ్రాసిన ఆంగ్లో యిండియనులు హిందూదేశచరిత్రను చాలవరకు వక్రమార్గములో పెట్టిరి. సత్యమును మరుగు పుచ్చి వారే మేమో వ్రాతల వ్రాసిరి. అయితే భరతఖండ చరిత్రను నిష్పాక్షిక దృష్టితో వీక్షించిన ఆంగ్ల విద్వాంసులు, ఉదారులు, లేకపోలేదు. ఇది మెచ్చుకోదగిన విషయము. అట్టివారిలో టారెన్సు అను వారొకరు. వీరు బ్రిటిష్ పార్లమెంటు మెంబరుగనుండి (సుమారు 75 సం॥ ల క్రిందట)–" Empire in Asia—How we came by it—A book of confessions" అను గ్రంథమును రచించిరి. ఇది మొన్న మొన్నటివరకు అజ్ఞాతముగ నుండెను. ఈ మధ్యనే అలహాబాదులోని పాణిని ఆఫీసువారు దీనిని తిరిగి ముద్రించిరి. టారెన్సుగారు చెప్పినట్లు యిది "తప్పుల నొప్పుకొను గ్రంథము" (A book of confessions)—అనగ, ఇండియాను ఇంగ్లీషు వారు నిజముగ నెట్లు సంపాదించిరో యీ పుస్తకము దాపరికములేక చెప్పు చున్నది. ఇట్టి నిజమును మనవిద్యార్థులు చిన్నతనమందే—అనగ వారి మనస్సులింకను కోమలముగ నున్నప్పుడే—తెలిసికొనుట అవసరము. ఎందుకు కాక పోయినను, అసలు సత్యమును, బట్టబయలైన సత్యమును, తెలుసుకో వలెనను జిజ్ఞాసకోసమైనా—మనవిద్యార్థులకీ సంగతులు చెప్పవలెను. ఏలననగ, చిన్న తనమందు చెప్పిన సంగతులే వారి మనస్సులకు బాగా అతుకును. తరువాత జీవితములో నెట్టి విరుపులు, సంకరములు సోకినా, చిన్ననాటి ముద్రలు చెరిగిపోవు.

మనవారుచేసిన గొప్ప కార్యములయెడ ఉత్సాహానందములను, చెడుకార్యములయెడ లజ్జావిషాదములను పొందునట్లు జాతిని తయారుచేయగల పద్ధతినే పాఠశాలలలో మనవిద్యార్థులకు హిందూదేశ చరిత్ర బోధించవలసి యున్నది. అయితే యీ యుత్సాహా నందములు, యీరోష విషాదములు, అసలు సత్యమును మించి పోరాదు. అవి దానికి లోబడియే యుండవలెనను విషయమై భిన్నాభిప్రాయ మెవరికిలేదు. కేవలము దేశాభిమానులుగనే గాక, సత్యాన్వేషులుగనే మనము టారెన్సు, బాసూలవంటి చరిత్రకారుల గ్రంథముల పఠింప బూనుచున్నాము.

టారెన్సుగారిని గూర్చి చెప్పితిమి. ఇక మేజర్ బాసూ I.M.S. గారన్ననో సుప్రసిద్ధ వంగదేశస్థులు. వీరి వ్రాతలు అనేకములు చాల ప్రచారములో నున్నవి. హిందూదేశ చరిత్రలో బ్రిటిష్ ఆక్రమణకాలమునుగూర్చి వీరు రచించిన " Rise of Christian Power in India" అను పుస్తకము చాల అమూల్యమైనది. దీనిని

గూర్చి వేరుగ వ్యాఖ్యాన మవసరములేదు. ఆంగ్లో యిండియన్ చరిత్రకారుల కును, పాఠశాలలకోసం పుస్తకాలు వ్రాసేవారికిన్నీ ఉన్న సాక్షిక దృష్టి వీరికిలేదు.

అన్నిటికంటె ముందు చరిత్రను దేశభాషలో బోధించవలెననే అభిప్రాయము అందరంగీకరించి యున్నారు. ఆ పనికిగాను, యిట్టి పుస్తకములు తెలుగులో ప్రచురమగుట చాల అవసరము. తెలుగులో పాఠాలు చెప్పమంటే, పుస్తకాలు లేవని యూనివర్శిటీ వారంటారు. వ్రాసిన పుస్తకాలు ప్రచురించేవారు, ఆదరించే వారు లేరని గ్రంథకర్తలు ప్రచురణకర్తలు అంటారు. ఈ రీతిగ విషమ సమస్య యేర్పడినది. ఆదరించేవారు లేరని పుస్తకాలు రావడంలేదు—పుస్తకాలు లేవని ఆదరించేవారు రావడంలేదు. ఈ చిక్కును విడగొట్టేపని బుద్ధిమంతులగు దేశాభిమానులది, రాజనీతిజ్ఞులది. గ్రంథకర్తలు, ప్రచురణకర్తలు, యిద్దరు సమకూడాలి. ఆంధ్రమునకు చిరపరిచితులును, బహుగ్రంథకర్తలును నగు శ్రీ మానికొండ సత్యనారాయణ శాస్త్రిగారు తమ వంతుపనిని చాలకాలమునాడే పూర్తిచేసిరి. పెట్టుబడిపెట్టి ప్రచురించే ఆదరాభిమానములుగల వారెవరైనా దొరకక పోతారా యనే తలంపుతో వీరు టారెన్సు, బాసూగార్ల గ్రంథరాజములను తెలుగులోనికి అనువదించిరి. టారెన్సుగారి గ్రంథమును వారే వెట్లో 1936 సం॥ లో "ఆంగ్ల రాజ్య స్థాపన" యనుపేరుతో ప్రచురించిన సంగతి ఆంధ్రపాఠకులకు తెలిసియే యున్నది. ఇక, రెండవదియగు బాసూగారి 1300 పేజీల యీ గొప్ప గ్రంథమును "బ్రిటిష్ మహాయుగము"ను ప్రచురించుటకు నేటికి గుంటూరు జిల్లా పెదపాలెము సేవాశ్రమ మువారు ఉత్సాహముతో ముందుకు వచ్చుట యెంతయు ముదావహము. దైవమీ రీతిగ యిట్టి గ్రంథకర్తను, యిట్టి ప్రచురణకర్తలను సమకూర్చి నందుకు నేను వారిని మనఃస్ఫూర్తిగ అభినందించు చున్నాను. వీరు ఉభయులుగావించిన యీ సేవకు ఆంధ్రదేశీయులెల్లరు, తరతరములవరకు సదా కృతజ్ఞులై యుండక తప్పదు.

భో. పట్టాభి సీతారామయ్య.





మేజర్ బి. డి. బాసూ

(ఆంగ్లమున ఈ యుద్ధగ్రంథము రచించిన వంగ శేఖరుడు
—వీరు 1930 సం॥ లో చనిపోయిరి.)

# గ్రంథకర్తృ నివేదము.

ఆంధ్రమున చరిత్ర గ్రంథములు చాలతక్కువ. ఈ కొరతను తీర్చుటకై కీ॥ శే॥ కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారు 'విజ్ఞాన చంద్రికా మండలి' ద్వారా చాలవరకు కృషిసలిపి యున్నారు. వారు హిందూ, మహమ్మదీయ మహాయుగములను మాత్రము రచించిరి. తదుపరి శ్రీ వేలూరి సత్యనారాయణగారు బౌద్ధమహాయుగమును రచించిరి. ఆ వరుసనే బ్రిటిష్ మహాయుగమును ప్రచురించు సంకల్పము శ్రీ లక్ష్మణరావుగారికుండెను. కాని, వారికి కాలము అంతటితో సరిపోయినది. వారి సంకల్పము నెరవేర్చుపని నాబోటి కించిజ్ఞునిమీద పడినది. వారికున్న విజ్ఞాన సామర్థ్య గరిమ నాకు లేకపోయినను, కేవల ఉత్సాహావేశముచే, ముందుగ వారి పవిత్రాత్మకు జోహారొనర్చి, యీ కార్యమునకు పూనుకొన్నాను గాన విజ్ఞులు మన్నింపకపోరు.

దైవము రక్షిస్తే, యీ వరుసనే "మహారాష్ట్ర మహాయుగము"ను కూడ రచించి, ఆంధ్రుల కర్పించుకొనవలెనను కోరిక నాకుగలదు. ఆంధ్ర పాఠకుల సహాయ సంపత్తులతో ఆ కోర్కె త్వరలోనే సిద్ధించుగాక.

నేనీ గ్రంథమును రచించి ఆరుసంవత్సరములు దాటినది. ఇప్పటికి యీ ప్రచురణయందలి వ్యయప్రయాస భారములను సంతోషముతో వహించుటకు గుంటూరుజిల్లా పెదపాలెము సేవాశ్రమమువారు పూనుకొన్నందులకు నేనును, ఆంధ్ర మహాజనులును తదాశ్రమవాసుల కెంతయు కృతజ్ఞులమై యున్నాము.

ఈ గ్రంథ మూలమును ఆంగ్లమున రచించినవారు కీ॥ శే॥ మేజర్ బి. డి. బాసుగారు. వీరు సుప్రసిద్ధ వంగ శేఖరులు-వైద్యశాస్త్రమందు అత్యుత్తమ పట్టమును (ఐ. యం. యస్ పట్టమును) బడసి, మిలిటరీ యుద్యోగమందుండి, యీ గొప్ప గ్రంథమును రచించుటకు యెట్లో తీరిక చేసికొనిరి. వీరు సంగ్రహించినట్టియు, పరిశోధించినట్టియు గ్రంథరాశి అపారము. ఎంతమంది గొప్ప ఉద్యోగముల చేయలేదు ? గొప్పగొప్ప జీతముల సంపాదించలేదు ? కాని, వారికిగల అవకాశముల నీరీతిగ దేశ మాతృసేవకై వినియోగించినవారు అరుదు. వీరు సమకూర్చిన విజ్ఞాన రాశి అన్ని దేశభాషలలోనికి తర్జుమా కావలసియున్నది. దానిని తెలుగులోనికి అనువదించు భాగ్యము నాకు గలిగినందుకు ఉప్పొంగుచు, శ్రీ బాసూగారి పవిత్రాత్మకు నా నమస్కృతు లర్పించుచున్నాను. శ్రీ బాసూగా రటీవల శాసనోల్లంఘనోద్యమము ప్రారంభమైన కొలదికాలమునకే కీర్తిశేషులైరి. వారి యాత్మకు శాంతిగలుగు గాక.

టారెన్సు అను ఆంగ్లచరిత్రకారుడు సుమారు 75 సంవత్సరముల క్రిందట "Empire in Asia" అను గ్రంథమును ప్రచురించి యున్నాడు. దానిని నేను రెండు సంవత్సరముల క్రితము తెలుగులో "ఆంగ్లరాజ్య స్థాపన" యను పేరుతో ప్రచురించి యున్నాను. దానిని ఈ బాసూగారి గ్రంథమునకు అనుబంధముగ చదువుకొనవలెను. ముఖ్యముగ, వారన్ హేస్టింగ్సుకు సంబంధించిన ఆరు అధ్యాయములును ఈ గ్రంథములో భాగములుగ నెంచుకోవలెను.

గ్రంథవస్తువు బ్రిటిష్‌వారి భరతఖండ ఆక్రమణ. ఈ ఆక్రమణ కార్యమందు పాల్గొన్న బ్రిటిష్ సేనానులయు, రాయబారులయు, పరిపాలకులయు వ్రాతలే యీ చరిత్రకు ఆధారములు. ఇవే యిందు నెక్కువగ క్రోడీకరింపబడినవి. ఇంతవరకు విజేతలగు బ్రిటిష్ పక్షమువారి వ్రాతలే మనకు లభించినవి. వీనిని బట్టియే యీ ఆక్రమణచరిత్ర విషాద భరితముగ గన్పట్టుచున్నది. బ్రిటిష్‌వారు రాజ్యాక్రమణకు గడంగునాటికి ఇండియాలో చాలభాగము మహారాష్ట్రుల క్రిందనే యుండెను. కాబట్టి ఇంగ్లీషువారికి ప్రతికక్షిగ నుండినవారు మహారాష్ట్రులనియే చెప్పవలెను. ఈ చరిత్రకాలమునాటి "పీష్వాల డైరీలు" కొన్ని యిటీవల మహారాష్ట్రములో ప్రచురమైనట్లు వినుచున్నాము. అవి పూర్తిగ బయటపడినచో పరాజితపక్షము నుండి సత్యమును మనము చూడగలము. "ఓడిపోయినవారు వట్టి పనికిమాలిన వారని, జయించినవారు చాల గొప్పవారని లోకములో జనులు సాధారణముగ అనుకొనుచుందురు. అయితే, ఓడిపోయినవారిగతి అంతేనా? వారిచరిత్ర నెవరు చెప్పుకొందురు? వారిలో అప్రతిమాన పౌరుషము నెరపి పోరాడి రణక్షోణి నొరగిన వీరాధివీరుల పేరుల నెవరు చెప్పుకొందురు? వీరి వీరశయనముల నలంకరించుట కెవరు పుష్పమాలికల నెత్తురు?" అని 'టారెన్సు' చరిత్రకారుడు వాపోయినాడు. ఈ బ్రిటిష్‌మహాయుగ చరిత్రలో పరాజితపక్షమున అప్రతిమాన పౌరుషము నెరపి పోరాడిన హైదరాలీ, టిప్పూసుల్తాన్, బలభద్రసింహ, బాపూగోక్లా, మహాబందూలా, జస్వంతరావు హోల్కార్, రాణీలక్ష్మీబాయి మున్నగువారి నామధేయములు భారతీయులకెల్లరకు చిరస్మరణీయములు. భావిభారత సంతతులకు ఉత్సాహజనకములు. అయితే, వీనినింతగ ఉద్ఘాటించిన చరిత్రకారు లెవరును యింతవరకు కానరారు. ఈ కొరతను యీ గ్రంథము తీర్చగలదని నమ్ముచున్నాను.

అయితే, దీనికి రెండవపక్షమున యింకొకమాట చెప్పవలసియున్నది. భారత జాతియందు యేదో గొప్పలోపము లేనిది భరతఖండము యింత సులభముగ ఇంగ్లీషు వారికి దక్కదను మాటయు నిశ్చయము. భారతీయులు ఏకజాతీయతా భావమును మరచి, పరాయివారు వేసిన లంచములు మొదలగు ఎరలకు లోబడి దేశమును అమ్ము

కొనుట జూడ ఈ జాతికి దాస్యశిక్ష తగియున్నదనియు అనిపించును. "ఇంగ్లీషువారు లంచము లిచ్చిరి, మోసముచేసిరి, కపటజయము గాంచిరి" అని వారిని నిందించ నేల? మనబంగారము మంచిదైతే కంసాలినేల దూరవలెను?

కంపెనీ నౌకర్లును పత్తిత్తులుగారు. కంపెనీగవర్నర్ జనరలులు, సేనాపతులు, రాయబారులు ఇండియాలో అనేక మందికి లంచములిచ్చిరి; మాయమాటల జెప్పి టోపీవేసిరి; తార్చిరి; మిత్రద్రోహములను స్వామిద్రోహములను చేసిరి; చేయించిరి; చంకబిడ్డల జారదీసిరి; తిన్నయింటి వాసములు లెక్కించిరి; ఎన్ని పనులు చేయవలెనో అన్నిపనులు చేసిరి; తాము రాజులనుండి లంచముల పుచ్చుకొనిరి. కాని, ఏ ఆంగ్లేయుడుగాని తనవ్యక్తి లాభముకోసము తన దేశాన్ని అమ్ముకోలేదు. కంపెనీ శ్రేయమునకు భిన్నముగ వర్తించిన ఇంగ్లీషువా డొక్కడుకూడ యీ చరిత్రలో కలికమున్నకైన కానరాడు. ఇది గొప్ప సుగుణము—అపూర్వమైనది. ఇట్టి గొప్ప సుగుణమును మన భారతీయులు ఇంగ్లీషువారివద్ద నేర్చుకొనవలెను. వారికి తమ దేశమందు యెంతటి గాఢానురాగ మున్నదో ఈ ఒక్క అంశమును బట్టి తెలియగలదు.

తమయెందెంత రాగమున్నదో, అది పరులయందంత ద్వేషముగ ప్రతిఫలించి తీరును. ఏలననగ, రాగద్వేషములు ఒక పత్రముయొక్క రెండు ప్రక్కలు. మన భారతీయులకు తమ స్వదేశమందెట్లు అభిమానములేదో అట్లే పరాయిదేశస్థులయందును ద్వేషములేదు. అందువల్లనే మనరాజులు, నబాబులు, పరాయివారగు బుడతకీచు, ఒలందా, పరాసు, ఇంగ్లీషు, మున్నగువారికి అంత సులభముగ, అంత నిశ్శంకముగ, దేశములో చోటిచ్చినారు! ఇంగ్లీషువారుగాని, లేక మరియే యితర యూరోపియన్ జాతిగాని పరాయివారిని తమ దేశములో యెన్నడైనా యిట్లు అడుగుపెట్ట నిచ్చినారా? ఇప్పటికీ, కూలిచేసికొని బ్రతకడానికికూడ హిందూదేశస్థులను అమెరికా మున్నగు రాజ్యాలలో అడుగుపెట్ట నీయరే!! ఐరోపీయ దేశములలోగల యింతటి కటికస్వాభిమానమే నాడు భారతదేశమును దాస్యములో ముంచినది—నేడును లోకకంటకముగ పరిణమించు చున్నది. జర్మనీ, ఇంగ్లీషు, ఫ్రెంచి, ఇటలీ మున్నగు జాతుల కటిక దురహంకార జాతీయాభిమానములే నేడు విశ్వమానవ సౌభ్రాతృత్వసిద్ధికి అడ్డంకులుగ నున్నవి. ఇంగ్లీషువాడు జర్మనీవానిని ద్వేషించినంత పచ్చిగ హిందువుడు మహమ్మదీయుని ద్వేషించలేదు. అయితే, తన స్వలాభమునకు అనుకూలముగవుంటే ఇంగ్లీషువాడు జర్మనీవాణ్ణి యెంతో ప్రేమ ఒలికిపోతున్నట్లు నటించి, కౌగలించుకొనును! ఇట్టి కపటనటనకూడ స్వాభిమానముయొక్క ప్రతిబింబమే. భారతీయులయందిట్టి స్వాభిమానము లేదు. ఇట్టి స్వాభిమ్మానము లేకపోవుట లోపమనే టట్టయితే, ఇంతటి ద్వేషము లేకపోవ

డంకూడ లోపమనియే అనవలసి వచ్చును. ఐరోపీయ జాతులలోగల యిట్టి పచ్చి స్వజాతి మదహంకారపు తీక్షణతను కొంత తగ్గించి, భారతీయులలో అసలేమృగ్య మైయున్న యేకజాతీయాభిమానమును కొంతపూరించి, రెంటిని సమపాళముగ సమన్వయము చేసినగాని లోకమునకు ముక్తిలేదు. రైళ్లు, టెల్లిగ్రాములు, విమానములు, రేడియోలు మొదలగువానిచే ప్రపంచమంతయు నేడు ఒక్క సన్నిహిత కుటుంబము కావలసి యున్నది. యూరోపియను జాతులలోగల ఈ కటిక ద్వేష మంతరించినగాని, యిది సాధ్యముకాదు.

మానవ హృదయ క్షేత్రమందు తరంగితమగు భావపరంపరలే చరిత్ర. ఇట్టి భావపరంపరల ప్రకోపింప జేయుటయే నిజమగు చరిత్రకారుని పని. కాబట్టి, పాఠక మహాశయులారా! నేపాళ యుద్ధములో బలభద్ర సింహుని పరాక్రమము జూచి గంతులు వెయ్యండి ; పీష్వా నారాయణరావు వధా ఘట్టమునబడి విలపించండి; బుద్ధిహీనుడగు బాజీరావు చర్యలజూచి పటపట పండ్లు కొరకండి; టిప్పూసుల్తాన్ బిడ్డల తాకట్టు దృశ్యమును జూచి కన్నీరు నింపండి; వెల్లస్లీ ప్రయోగించిన దగా, దబ్బర, దౌర్జన్య ప్రయోగముల జూచి నిలువున నీరై క్రుంగిపొండి; దేశీయ మంత్రులయు, సేనాపతులయు లంచపు మేతలను, స్వామిద్రోహములను, కుట్రలను జూచి సిగ్గుచే తలవంచుకోండి; భరతపురం రాజగు రంజిత్తుని శరణాగత రక్షా దీక్షను జూచి భళిభళీయని పొగడండి; భరతపురం మట్టికోటను సంరక్షించిన శ్రీ విష్ణుమూర్తికి హారతులెత్తండి; ఆ కోటను కబళించిన 'కుంభీరమూర్తి'కి— ఆ ఆలిఘుర్, ఆగ్రా, గ్వాలియర్ మున్నగు దుర్భేద్య పాషాణపు కోటలను గారడీ వానివలె తన పాదఘట్టనములచే కాలగర్భమున అవలీలగ కరగించివేసిన ఆ మహా నటరాజమూర్తికి నతులొనర్చండి; — ప్రళయాగ్నికీలల చివుళ్లయందు నూతన సృష్టిబీజముల తిరిగి మొలకలెత్తించిన ఆ కాలమూర్తికి జేజే లొనర్చండి.

ఈ రీతిగ పాఠకులను నేను ఆ యా ఘట్టములందు నవ్వించ గలిగినచో, ఏడ్పించ గలిగినచో, పటపట పండ్లు కొరికించ గలిగినచో, భళిభళీయని గంతులు వేయించ గలిగినచో, హాయి హాయియని యనిపించ గలిగినచో నేను చేసిన కృషి సిద్ధించినదని సంతోషించెదను. నాకిదే ప్రతిఫలము.

5, మోతీలాల్ వీధి,
త్యాగరాయనగర్,
మదరాసు.
1—10—38.

మానికొండ - సత్యనారాయణ శాస్త్రి,
గ్రంథకర్త.

॥ ఉత్తరకాణ్డవర్ణనమ్. ॥

నారదః ॥ రాజ్యస్థం రాఘవం జగ్మురగస్త్యాద్యాస్సుపూజితాః । ధన్యస్త్వం విజయీ యస్మాదిన్ద్రజిద్వినిపాతితః॥ ౧॥ బ్రహ్మాత్మజః పులస్త్యోఽభూద్విశ్రవాస్తస్య నైకషీ । పుష్పోత్కటాభూత్ప్రథమా తత్పుత్రోఽభూద్ధనేశ్వరః ॥ ౨ ॥ నైకష్యాం రావణో జజ్ఞే వింశద్బాహుర్దశాననః। తపసా బ్రహ్మదత్తేన వరేణ జితదైవతః ॥ ౩ ॥ కుమ్భకర్ణస్సనిద్రోఽభూద్ధర్మిష్ఠోఽభూద్విభీషణః । స్వసా శూర్పణఖా తేషాం రావణాన్మేఘనాదకః॥ ౪॥ ఇన్ద్రం జిత్వేన్ద్రజిచ్చాభూద్రావణాదధికో బలీ । హతస్త్వయా లక్ష్మణేన దేవాదేః క్షేమమిచ్ఛతా ॥ ౫॥ ఇత్యుక్త్వా తే గతా విప్రా అగస్త్యాద్యా నమస్కృతాః। దేవప్రార్థితరామోక్తశ్శత్రుఘ్నో లవణార్దనః ॥ ౬ ॥ అభూత్పూర్మథురా కాచిద్రామోక్తో భరతోఽవధీత్ । కోటిత్రయం చ శైలూషపుత్రాణాం నిశితైశ్శరైః॥ ౭॥ శైలూషం దుష్టగన్ధర్వం సిన్ధుతీరనివాసినమ్ । తక్షం చ పుష్కరం పుత్రం స్థాపయిత్వాథ దేశయోః॥ ౮॥ భరతో గాత్సశత్రుఘ్నో రాఘవం పూజయన్స్థితః । రామో దుష్టాన్నిహత్యాజౌ శిష్టాన్సమ్పాల్య మానవః ॥ ౯ ॥ పుత్రౌ కుశలవౌ జాతౌ వాల్మీకేరాశ్రమే వరౌ। లోకాపవాదాత్త్యక్తాయాం జ్ఞాతౌ సుచరితశ్రవాత్ ॥ ౧౦॥ రాజ్యేఽభిషిచ్య బ్రహ్మాహమస్మీతి ధ్యానతత్పరః। దశవర్ష సహస్రాణి దశవర్షశతాని చ ॥ ౧౧ ॥ రాజ్యం కృత్వా క్రతూన్కృత్వా స్వర్గం దేవార్చితో యయౌ । సపౌరస్సానుజస్సీతాపుత్రో జనపదాన్వితః॥ ౧౨॥ అగ్నిః॥ వాల్మీకిర్నారదాచ్ఛ్రుత్వా రామాయణమకారయత్ । సవిస్తరం యదేతచ్చ శృణుయాత్స దివం వ్రజేత్ ॥ ౧౩॥ * * *

ఇతి శ్రీమహాపురాణే ఆగ్నేయే అగ్నివసిష్ఠసంవాదే శ్రీరామ చరిత్రే ఉత్తరకాణ్డవర్ణనం నామ ఏకాదశోధ్యాయః.

---

॥ శ్రీకృష్ణావతారచరిత్రమ్. ॥

అగ్నిః ॥ హరివంశం ప్రవక్ష్యామి విష్ణునాభ్యమ్బుజాదజః । బ్రహ్మణోఽత్రిస్తతస్సోమస్సోమాజ్జాతః పురూరవాః ॥ ౧ ॥ తస్మాదాయురభూత్తస్మాన్నహుషోఽతో యయాతికః । యదుం చ తుర్వసుం తస్మాద్దేవయానీ వ్యజాయత॥ ౨॥ ద్రుహ్యం చానుం చ పూరుం చ శర్మిష్ఠా వార్షపర్వణీ। యదోః కులే యాదవాశ్చ వసుదేవస్తదుత్తమః॥ ౩॥ భువో భారావతారార్థం దేవక్యాం వసుదేవతః। హిరణ్యకశిపోః పుత్రాష్షడ్గర్భా యోగనిద్రయా ॥ ౪ ॥ విష్ణుప్రయుక్తయా నీతా దేవకీజఠరం పురా । అభూచ్చ సప్తమో గర్భో దేవక్యా జఠరాద్బలః ॥ ౫ ॥ సఙ్క్రామితోఽభూద్రోహిణ్యాం రౌహిణేయస్తతో హరిః । కృష్ణాష్టమ్యాం చ నభసి అర్ధరాత్రే చతుర్భుజః ॥ ౬ ॥ దేవక్యా వసుదేవేన స్తుతో బాలో ద్విబాహుకః। వసుదేవః కంసభయాద్యశోదాశయనేఽనయత్ ॥ ౭॥

యశోదాబాలికాంగృహ్య దేవకీశయనే ఽనయత్ । కంసో బాలధ్వనింశ్రుత్వా తాంచి
క్షేపశిలాతలే ॥ ౮ ॥ వారితో ఽపిసదేవక్యా మృత్యుర్గర్భో ఽష్టమోమమ । శ్రుత్వా ఽశ
రీరిణీంవాచంమత్తో గర్భాస్తుమారితాః ॥ ౯ ॥ సమర్పితాస్తు దేవక్యా వివాహసమయే
ఽరితాః । సాక్షిప్తాబాలికాకంసమాకాశస్థాబ్రవీదిదమ్ ॥ ౧౦ ॥ కింమయాక్షిప్తయా
కంసజాతో యస్త్వాంవధిష్యతి । సర్వస్వభూతో దేవానాంభూభారహరణాయ
సః ॥ ౧౧ ॥ ఇత్యుక్త్వా సాచశుమ్భాదీన్హత్వేన్ద్రేణచసంస్తుతా । ఆర్యాదుర్గావేదగ
ర్భాఅమ్బికాభద్రకాల్యపి ॥ ౧౨ ॥ భద్రాక్షేమ్యాక్షేమకారీ నైకబాహుర్నమా
మితామ్ । త్రిసన్ధ్యంయఃపఠేన్నామసర్వాన్కామానవాప్నుయాత్ ॥ ౧౩ ॥
కంసో ఽపిపూతనాదీంశ్చప్రేషయద్బాలనాశనే । యశోదాపతినన్దాయవసుదేవేనచా
ర్పితౌ ॥ ౧౪ ॥ రక్షణాయచకంసాదేర్భీతేనైవహిగోకులే । రామకృష్ణౌచేరతుస్తౌ
గోభిర్గోపాలకైస్సహ ॥ ౧౫ ॥ సర్వస్యజగతఃపాలౌ గోపాలౌతౌబభూవతుః । కృష్ణ
శ్చోలూఖలేబద్ధో దామ్నావ్యగ్రయశోదయా ॥ ౧౬ ॥ యమళార్జునమధ్యే ఽగాద్భ
గ్నౌచయమళార్జునౌ । పరివృత్తశ్చశకటఃపాదక్షేపాత్ స్తనార్థినా ॥ ౧౭ ॥ పూత
నా స్తనపానేనసాహతాహన్తుముద్యతా । బృన్దావనగతఃకృష్ణఃకాళియంయమునా
హ్రదాత్ ॥ ౧౮ ॥ జిత్వానిస్సార్యచాబ్ధిస్థంచకారబలసంస్తుతః । క్షేమంతాళవ
నంచక్రేహత్వాధేనుకగర్దభమ్ ॥ ౧౯ ॥ అరిష్టవృషభంహత్వా కేశినంహయరూపి
ణమ్ । శక్రోత్సవంపరిత్యజ్యకారితోగోత్రయజ్ఞకః ॥ ౨౦ ॥ పర్వతంధారయిత్వా
చశక్రాద్వృష్టిర్నివారితా । నమస్కృతోమహేన్ద్రేణగోవిన్దో ఽథార్జునో ఽర్పితః ॥ ౨౧ ॥
ఇన్ద్రోత్సవస్తుతుష్టేనభూయఃకృష్ణేనకారితః । రథస్థోమధురాంచాగాత్కంసోక్తా
క్రూరసంస్తుతః ॥ ౨౨ ॥ గోపీభిరనురక్తాభిఃక్రీడితాభిర్నిరీక్షితః । రజకంచాప్రయ
చ్ఛన్తంహత్వావస్త్రాణిచాగ్రహీత్ ॥ ౨౩ ॥ సహరామేణమాలాభృన్మాలాకారే
వరందదౌ । దత్తానులేపనాంకుబ్జామృజుంచక్రే ఽహనద్గజమ్ ॥ ౨౪ ॥ మత్తంకువలయా
పీడంద్వారిరఙ్గంప్రవిశ్యచ । కంసాదీనాంపశ్యతాంచమఞ్చస్థానాంనియుద్ధకమ్ ॥ ౨౫ ॥
చక్రేచాణూరమల్లేనముష్టికేనబలో ఽకరోత్ । చాణూరముష్టికౌతాభ్యాంహతౌ
మల్లౌతథాపరే ॥ ౨౬ ॥ మధురాధిపతింకంసంహత్వాతత్పితరంహరిః । చక్రేయా
దవరాజానమస్తిప్రాప్తీచకంసగే ॥ ౨౭ ॥ జరాసన్ధస్యతేపుత్ర్యౌజరాసన్ధస్తదీరి
తః । చక్రేసమధురారోధంయాదవైర్యుయుధేశరైః ॥ ౨౮ ॥ రామఃకృష్ణౌచమధు
రాంత్యక్త్వాగోమన్తమాగతౌ । జరాసన్ధంవిజిత్యాజౌపౌణ్డ్రకంవాసుదేవకమ్ ॥ ౨౯ ॥
పురీంచద్వారకాంకృత్వాన్యవసద్యాదవైర్వృతః । భౌమంతునరకంహత్వాతేనానీ
తాశ్చకన్యకాః ॥ ౩౦ ॥ దేవగన్ధర్వయక్షాణాంతాఉవాహజనార్దనః । షోడశస్త్రీ
సహస్రాణిరుక్మిణ్యాద్యాస్తథాష్టచ ॥ ౩౧ ॥ సత్యభామాసమాయుక్తోగరుడేనర
కార్దనః । మణిశైలంసరత్నంచఇన్ద్రంజిత్వాహరిర్దివి ॥ ౩౨ ॥ పారిజాతంసమా

నీయ సత్యభామాగృహేఽకరోత్ । సాన్దీపనేశ్చ శస్త్రాస్త్రం జ్ఞాత్వా తద్బాలకం దదౌ ॥ ౩౩ ॥ జిత్వా పఞ్చజనం దైత్యం యమేన చ సుపూజితః । అవధీత్కాలయవనం ముచుకున్దేన పూజితః ॥ ౩౪ ॥ వసుదేవం దేవకీం చ భక్తవిప్రాంశ్చ సోఽర్చయత్ । రేవత్యాం బలభద్రాచ్చ జజ్ఞాతే నిశఠోల్ముకౌ ॥ ౩౫ ॥ కృష్ణాత్సామ్బో జామ్బవత్యామన్యాస్వన్యేఽభవన్సుతాః । ప్రద్యుమ్నోఽభూచ్చ రుక్మిణ్యాం షష్ఠేఽహ్ని స హృతో బలాత్ ॥ ౩౬ ॥ శమ్బరేణామ్బుధౌ క్షిప్తో మత్స్యో జగ్రాహ ధీవరః । తం మత్స్యం శమ్బరాయాదాన్మాయావత్యై చ శమ్బరః ॥ ౩౭ ॥ మాయావతీ మత్స్యమధ్యే దృష్ట్వా స్వం పతిమాదరాత్ । పుపోష సా తం చోవాచ రతిస్తేఽహం పతిర్మమ ॥ ౩౮ ॥ కామస్త్వం శమ్భునానఙ్గః కృతోఽహం శమ్బరేణ చ । హృతా న తస్య పత్నీ త్వం మాయాజ్ఞః శమ్బరం జహి ॥ ౩౯ ॥ తచ్ఛ్రుత్వా శమ్బరం హత్వా ప్రద్యుమ్నః సహ భార్యయా । మాయావత్యా యయౌ కృష్ణం కృష్ణో హృష్టోఽథ రుక్మిణీ ॥ ౪౦ ॥ ప్రద్యుమ్నాదనిరుద్ధోఽభూదుషాపతిరుదారధీః । బాణో బలిసుతస్తస్య సుతోషా శోణితం పురమ్ ॥ ౪౧ ॥ తపసా శివపుత్రోఽభూన్మాయూరధ్వజపాతితః । యుద్ధం ప్రాప్స్యసి బాణ త్వం బాణం తుష్టః శివోఽభ్యధాత్ ॥ ౪౨ ॥ శివేన క్రీడతీం గౌరీం దృష్ట్వోషా సస్పృహా పతౌ । తామాహ గౌరీ భర్త్తా తే నిశి సుప్తేతి దర్శనాత్ ॥ ౪౩ ॥ వైశాఖమాసద్వాదశ్యాం పుంసో భర్త్తా భవిష్యతి । గౌర్యుక్తా హర్షితా చోషా గృహే సుప్తా దదర్శ తమ్ ॥ ౪౪ ॥ ఆత్మనా సఙ్గతం జ్ఞాత్వా తత్సఖ్యా చిత్రలేఖయా । లిఖితాద్వై చిత్రపటాదనిరుద్ధం సమానయత్ ॥ ౪౫ ॥ కృష్ణపౌత్రం ద్వారకాతో దుహితా బాణమన్త్రిణః । కుమ్భాణ్డస్యానిరుద్ధోఽగాద్రరామ హ్యుషయా సహ ॥ ౪౬ ॥ బాణధ్వజస్య సమ్పాతై రక్షిభిస్స నివేదితః । అనిరుద్ధస్య బాణేన యుద్ధమాసీత్సుదారుణమ్ ॥ ౪౭ ॥ శ్రుత్వా తు నారదాత్కృష్ణః ప్రద్యుమ్నబలభద్రవాన్ । గరుడస్థోఽథ జిత్వాగ్నీన్జ్వరం మాహేశ్వరం తథా ॥ ౪౮ ॥ హరిశఙ్కరయోర్యుద్ధం బభూవాథ శరాశరి । నన్దివినాయకస్కన్దముఖాస్తార్క్ష్యాదిభిర్జితాః ॥ ౪౯ ॥ జృమ్భితే శఙ్కరే నష్టే జృమ్భణాస్త్రేణ విష్ణునా । ఛిన్నం సహస్రం బాహూనాం రుద్రేణాభయమర్థితమ్ ॥ ౫౦ ॥ విష్ణునా జీవితో బాణో ద్విబాహుః ప్రాబ్రవీచ్ఛివమ్ । త్వయా యదభయం దత్తం బాణస్యాస్య మయా చ తత్ ॥ ౫౧ ॥ ఆవయోర్నాస్తి భేదో వై భేదీ నరకమాప్నుయాత్ । శివాద్యైః పూజితో విష్ణుస్సానిరుద్ధ ఉషాదియుక్ ॥ ౫౨ ॥ ద్వారకాం తు గతో రేమే ఉగ్రసేనాదియాదవైః । అనిరుద్ధాత్మజో వజ్రో మార్కణ్డేయాత్తు సర్వవిత్ ॥ ౫౩ ॥ బలభద్రః ప్రలమ్బఘ్నో యమునాకర్షణోఽభవత్ । ద్వివిదస్య కపేర్భేత్తా కౌరవోన్మాదనాశనః ॥ ౫౪ ॥ హరీ రేమేఽనేకమూర్త్తీ రుక్మిణ్యాదిభిరీశ్వరః । పుత్రానుత్పాదయామాస త్వసఙ్ఖ్యాతాన్స యాదవాన్ ॥ ౫౫ ॥ హరివంశం పఠేద్యస్స ప్రాప్తకామో హరిం వ్రజేత్ ॥ ౫౬ ॥

* * * *

ఇతి శ్రీమహాపురాణే ఆగ్నేయే అగ్నివసిష్ఠసంవాదే శ్రీకృష్ణావతారవర్ణనాదికథనం నామ ద్వాదశోధ్యాయః.

## ౧౩ కురుపాణ్డవోత్పత్త్యాదికథనం తచ్చరిత్రం చ. ౧౩

అగ్నిః ॥ భారతంసమ్ప్రవక్ష్యామికృష్ణమాహాత్మ్యలక్షణమ్ । భూభారమహరద్విష్ణుర్నిమిత్తీకృత్యపాణ్డవాన్ ॥ ౧ ॥ విష్ణునాభ్యబ్జజోబ్రహ్మాబ్రహ్మపుత్రోఽత్రిరత్రితః । సోమస్సోమాద్బుధస్తస్మాదైళఆసీత్పురూరవాః॥ ౨॥ తస్మాదాయుస్తతోరాజానహుషోఽతోయయాతికః । తతఃపురుస్తస్యవంశేభరతోఽథనృపఃకురుః॥ ౩॥ తద్వంశేశాన్తనుస్తస్మాద్భీష్మోగఙ్గాసుతోఽనుజౌ । చిత్రాఙ్గదోవిచిత్రశ్చసత్యవత్యాంచశాన్తనోః॥ ౪ ॥ స్వర్గంగతేశాన్తనౌచభీష్మోభార్యావివర్జితః । అపాలయద్భ్రాతృరాజ్యంబాలశ్చిత్రాఙ్గదోహతః ॥ ౫ ॥ చిత్రాఙ్గదేనద్వేకన్యేకాశిరాజస్యచామ్బికా। అమ్బాలికాచభీష్మేణఆనీతేవిజితారిణా ॥ ౬ ॥ భార్యేవిచిత్రవీర్యస్యయక్ష్మణాసదివంగతః । సత్యవత్యాహ్యనుమతాదమ్బికాయాంనృపోఽభవత్ ॥౭॥ ధృతరాష్ట్రోఽమ్బాలికాయాంపాణ్డుశ్చవ్యాసతస్సుతః। గాన్ధార్యాంధృతరాష్ట్రాచ్చదుర్యోధనముఖంశతమ్ ॥ ౮ ॥ శతశృఙ్గాశ్రమపదేభార్యాయోగాద్యతోమృతిః । ఋషిశాపాత్తతోధర్మాత్కున్త్యాంపాణ్డోర్యుధిష్ఠిరః ॥ ౯ ॥ వాతాద్భీమోఽర్జునశ్శక్రాన్మాద్ర్యామశ్వికుమారతః । నకులస్సహదేవశ్చపాణ్డుర్మాద్రియుతోమృతః॥ ౧౦ ॥ కర్ణఃకున్త్యాంహికన్యాయాంజాతోదుర్యోధనాశ్రితః। కురుపాణ్డవయోర్వైరందైవయోగాద్బభూవహ ॥ ౧౧ ॥ దుర్యోధనోజతుగృహేపాణ్డవానదహత్కుధీః । దగ్ధాగారాద్వినిష్క్రాన్తామాతృయుక్తాస్తుపాణ్డవాః ॥ ౧౨ ॥ తతస్తుఏకచక్రాయాంబ్రాహ్మణస్యనివేశనే । మునివేషాస్థితాస్సర్వేనిహత్యబకరాక్షసమ్ ॥ ౧౩ ॥ యయుఃపాఞ్చాలవిషయంద్రౌపద్యాస్తేస్వయంవరే । సమాప్తాబాహువేధేనద్రౌపదీపఞ్చపాణ్డవైః ॥ ౧౪ ॥ అర్ధరాజ్యంతతఃప్రాప్తాజ్ఞాతాదుర్యోధనాదిభిః । గాణ్డీవంచధనుర్దివ్యంపావకాద్రథముత్తమమ్ ॥ ౧౫ ॥ సారథించార్జునస్సఙ్ఖ్యేకృష్ణమక్షయ్యసాయకాన్ । బ్రహ్మాస్త్రాదీంస్తథాద్రోణాత్సర్వేశస్త్రవిశారదాః ॥ ౧౬ ॥ కృష్ణేనసోఽర్జునోవహ్నింఖాణ్డవేసమతర్పయత్ । ఇన్ద్రవృష్టింవారయంశ్చశరవర్షేణపాణ్డవః ॥ ౧౭ ॥ జితాదిశఃపాణ్డవైశ్చరాజ్యంచక్రేయుధిష్ఠిరః । బహుస్వర్ణంరాజసూయంనసేహేతంసుయోధనః ॥ ౧౮ ॥ భ్రాత్రాదుశ్శాసనేనోక్తఃకర్ణేనప్రాప్తభూతినా । ద్యూతకార్యేశకునినాద్యూతేనసయుధిష్ఠిరమ్ ॥ ౧౯ ॥ అజయత్తస్యరాజ్యంచసభాస్థోమాయయాహసత్ । జితోయుధిష్ఠిరోభ్రాతృయుక్తశ్చారణ్యకంయయౌ ॥ ౨౦ ॥ వనేద్వాదశవర్షాణిప్రతిజ్ఞాతానిసోఽనయత్ । అష్టాశీతిసహస్రాణిభోజయన్పూర్వవద్ద్విజాన్॥ ౨౧ ॥ సధౌమ్యోద్రౌపదీషష్ఠస్తతఃప్రాయాద్విరాటకమ్ । కఙ్కోద్విజోహ్యవిజ్ఞాతోరాజాభీమోఽథసూపకృత్ ॥ ౨౨॥ బృహన్నలార్జునోభార్యాసైరన్ధ్రీయమజౌతథా । అన్యనామ్నాభీమసేనఃకీచకంచావధీన్నిశి॥ ౨౩ ॥ ద్రౌపదీంహర్తుకామంతమర్జునశ్చాజయత్కురూన్ । కుర్వతోగోగ్రహం

# విషయసూచిక

అధ్యాయము. పుటలు.

# పటముల పట్టిక.


హిందూదేశము
1857
టిబెట్టు
కాశ్మీరము
రాజపుత్రస్థానము
సింధుదేశము
గుజరాతు
నాగపూరు
అలహాబాదు
కాశీ
నైజాము
మైసూరు
గోవా
మచిలీపట్నం
మదరాసు
పుదుచ్చేరి
బంగాళా
ఖాతము
సముద్రము
అరేబియా
ఇంగ్లీషు రాజ్యం
ఆంగ్ల రక్షితరాజ్యములు.

సబ్ లాల్ హోగయా

# బ్రిటిష్ మహాయుగము

## మొదటి అధ్యాయము



### "సబ్ లాల్ హోజాయగా"

పాంచాల కేసరి యగు రణజిత్ సింగ్ మహారాజునకు ఒకనాడు ఆతని క్రైస్తవ యుద్యోగి యొకడు భరతఖండ పటము నొకదానిని చూపెనట. రణజిత్ సింగ్‌నకు వ్రాయుట *తెలియదు. ఈ పటమందు కొన్నిచోట్ల ఎరుపు, కొన్ని చోట్లపసుపు, మరికొన్నిచోట్లపచ్చ, నీలి మున్నగు రంగులేల వేయబడెనో ఆయనకు బోధపడలేదు.

ఈ రంగుల యర్థమేమో తనకు విప్పిచెప్ప వలసినదని రణజిత్ సింగ్ ఆ యుద్యోగినడిగెను. ఆతడారంగుల యర్థమును విశదపరచుచు, ఎఱ్ఱరంగు వేయబడిన చోట్లు యీష్టిండియా కంపెనీ యనుపేరుతో యింగ్లండునుండి దిగిన క్రైస్తవ వర్తకుల చేతిలోనికి పోయిన ప్రదేశములను సూచించుచున్నవని చెప్పెను. ఈ మాటలు వినగనే, "సబ్ లాల్ హోజాయెగా" "ఓహో! ఇక ఇండియా పటము యావత్తు రక్త వర్ణమైపోవును!" అని రణజిత్ సింగ్ కేక వేసెను. ఈ కేక భవిష్యత్తును సూచించు దైవజ్ఞ ప్రకటనగ ప్రతిధ్వనించినది. ఈ మహారాజు చనిపోయి యిరువదిసంవత్సరములైనను పూర్తిగ నిండకమునుపే, ఆయనమాటలు అక్షరశః జరిగితీరెను. యావద్భరతఖండమునకు క్రైస్తవ వర్తకులు యజమానులైరి; ఇండియాపటము యావత్తు రక్తవర్ణముతో చిత్రింపఁబడెను.

ఈ సంఘటన మెట్లుజరిగెనో వివరించుట యీ గ్రంథముయొక్క పని. భరతఖండమందు ఆంగ్ల రాజ్యాధిపత్యము స్థాపనమయిన చరిత్ర మిగులఅద్భుతము. అది కవికల్పిత కావ్యమువలె గనబడును. ఏలననగ, భరతఖండమున అడుగిడిన యే క్రైస్తవ జాతిగాని, రాజ్యస్థాపనోద్దేశ్యముతో రాలేదు. అది విచిత్ర దైవ సంఘటనగ ఇంద్రజాలమువలె జరిగినది. ఈశ్వరుడు ఘటనాఘటన సమర్థుడు.



* ప్రాచ్యఖండమందు చాలమంది మహాపురుషులకు వ్రాత తెలియకపోవుట విచిత్రము! మహమ్మదీయ ప్రవక్తయగు మహమ్మదుగాని, అక్బరు చక్రవర్తిగాని, శివాజీ మహారాజుగాని, జంగ్ బహద్దరుగాని, భరతఖండచరిత్రయందు ప్రఖ్యాతిగాంచిన యింకెందరో మహానుభావులుగాని, వ్రాత యెరుంగరన్నచో యిక్కాలమువారికి ఆశ్చర్యము కలుగకమానదు!

## 2. యూరోపియన్ జాతులు ఇండియాకు సముద్రపు దారిని కనుగొనుట

అనాదినుండియు భరతఖండము * ప్రపంచజాతులన్నిటిలో సభ్యతయందు నగ్రస్థానము వహించియుండెను. ఇండియాకు సముద్రపు దారిని కనిపెట్టుటకయియే స్పెయిన్ దేశస్థుడగు "కొలంబస్" అను నావికుడు తనకొక నౌకాదళమును సమకూర్చి పెట్టవలసినదని యూరపులోని నానాక్రైస్తవ రాజాస్థానముల కరిగి ప్రార్థించెను. మరియు, యిండియాకు సముద్రపుదారిని కనిపెట్టుటకయి యూరోపియన్ జాతులు ఒకరినిమించి ఒకరు ఎట్లెట్లు పరుగెత్తినదియుకూడ ప్రతి బడి పిల్లవానికి తెలియును. పోర్చుగల్ (బుడతకీచు) దేశస్థుడగు "వాస్కో-డి గామా" యను నతడు తుట్టతుదకు యిండియాకు సముద్రము మీదుగ త్రోవను కనిపెట్టెను. మొట్టమొదట యూరోపియన్ జాతులకు యిండియాను జయింతమను తలంపులేదు. ఇండియాతో వర్తక సంబంధమేర్పరచుకొనుటయే వారి పరమసంకల్పము. ఇండియాకు సముద్రపు దారిని కనుగొనుటలో వారి కప్పుడు వర్తకాభిలాష తప్ప వేరొండు అభిలాష లేదు. (బంగారుకాంతుల రోదోంతరాళముల ప్రసరింపజేయు భరతఖండము - కవివరేణ్యుల వాగంచలముల నాట్యమాడు భరతఖండము - నానాదేశాగత యాత్రికజన వరవర్ణిత స్వర్గధామమగు భరతఖండము - యూరోపియన్ జాతుల స్వప్నములలోకూడ గాన్పించి వారిని పరవశుల గావించెను. వారి భావనా ప్రపంచమందు భరతఖండము ప్రపంచమంతటిలో భాగ్యవంతమగు దేశము; యూరపులోని పణ్యస్థలముల కన్నిటికిని యసంఖ్యాకములగు చిత్రవిచిత్ర వస్తుసామాగ్రుల సప్లయిచేయు కొఠారము.)

పదునొకొండవ శతాబ్దమందు యూరపులోని క్రైస్తవజాతులు—"క్రూసేడరు" లనబడువారు—ప్రాచ్యఖండముల సేవించినచో తమ పాపము లన్నియు పోవుననియు, తమకు ముక్తిలభించుననియు తలచి, ప్రాచ్యఖండ భూములకు పుణ్యతీర్థయాత్రల బయలుదేరుచుండిరి. కాని 1400 సం॥ల యనంతరము 15-వ శతాబ్దములో వారిసంతతి వారే ధనరాసుల గడించు నాశచే ప్రేరితులై ప్రాచ్యఖండముల కెగబ్రాకసాగిరి. ఇంతకంటె వారి కప్పుడెక్కువ ఉన్నతమగు ఆదర్శములు

---

* సర్వతోముఖమగు తన యాధిక్యముచే భరతఖండము ప్రపంచములోని సమస్తజాతుల వారిని సమ్మోహన మొనర్చెను. ఈభరతఖండమును చేరుటకై 5, 6 శతాబ్దములకు పూర్వము ప్రపంచములోని సమస్తజాతులు యెన్నియోరీతుల ఒకరినిమించి యొకరు ప్రయత్నములజేసిరి. వారు పడిన శ్రమ, వారు పడినపాడిట్లు, వారు ధన మాన ప్రాణములకు జంకక చేసిన అతి సాహసకృత్యములు, పరిశోధనలు సమస్తముకూడ యీభరతఖండస్థమగు సిరి సంపదలను, బంగారుగనులను రత్నరాసులను దోచుకొని పోవుటకే యని యెరుంగవలెను. భరతవర్షసువర్ణ శోభయే వారి కండ్లను మిఱుమిట్లు గొలిపెను.



వాస్కో డి గామా
ఇండియాకు సముద్రము మీదుగ
త్రోవను కనిపెట్టిన బుడతకీచు
నావికుడు—(2వ పేజీ)



వాస్కోడిగామా ఎక్కివచ్చిన ఓడ—(2వ పేజీ)



ఆల్ ఫన్ జో–డీ–ఆల్బ్యూకర్ క్
తిన్నయింటి వాసముల లెక్కించిన
బుడతకీచు బచ్చు—(4వ పేజీ)



వాస్కోడిగామా మలబారు దేశపు హిందూ ప్రభువగు "జామరిన్" పాదముల నాశ్రయించుట—(4వ పేజీ)



సూరత్తు రేవు----(12వ పేజీ)



పాత బొంబయి రేవు

లేవు. మెట్టదారిలోనుండు కష్టములను, అసౌకర్యములను, మూటలను మాటి మాటికి యెత్తుట, దింపుటమున్నగు యిబ్బందులను, ఖర్చులను, తగ్గించుకొనుటకే వారు సముద్రపుదారి యేమైన దొరికిన బాగుండునని యెంతో ఆత్రపడుచుండిరి. ఇదిగాక, ఆ కాలమున * మెట్టదారిలో నింక ననేక కష్టములుండెను. మనుష్యుల ప్రాణములకు, సొత్తులకు క్రూరమృగములచేతను, చోరులచేతను అపాయములు బహుళములుగ నుండెను. త్రోవలో టోలుగేటులవద్దను, సంతలలోను సరకులకు సుంకములు కట్టవలసియుండెను. ఈ సుంకములు వసూలుచేయు యుద్యోగులు వర్తకులను పీడించి వారివద్ద అధికమగు ధనమును అక్రమముగ లాగుచుండిరి. అదిగాక ఆరోజులలో "వెనీసు" "జెనీవా" మున్నగు యిటలీదేశపు రేవుపట్టణములే ప్రాచ్యఖండములతో విరివిగ వ్యాపారమును సాగించుచు, వాణిజ్యమందు నాయకత్వము వహించి, లోకమున పేరు ప్రఖ్యాతులగాంచెను. కాని యూరపు ఖండమందలి పశ్చిమ, ఉత్తర భాగములు ప్రాచ్యఖండముతో వ్యాపారముచేయుట కెట్టి సౌకర్యములు లేకుండెను. కాబట్టి ఇండియాకు సముద్రపు దారిని గనిపెట్టి, తద్వారా హిందూదేశపు సరుకులను యిదివరకుకంటె యెక్కువ చౌకగ తెచ్చుకొని, లాభము పొందవలెనను అభిలాష యీ పశ్చిమోత్తర యూరోపీయ దేశముల వారికి కలుగుట సహజము. యూరపుఖండ మారోజులలో యిప్పుడున్నంత భాగ్యవంతముగ లేదు. ఇప్పటివలె యూరోపియన్ క్రైస్తవజాతులు అప్పుడు క్రైస్తవేతర జాతులను నాశనమొనరించి, తమ కాలిక్రింద పడవేసికొని యుండలేదు. ఇండియాకు సముద్రపుత్రోవను కనుగొనుటకై వెనుక ప్రారంభించిన నాటనుండి వారు నానాట ధనాఢ్యులుగాజొచ్చిరి. ప్రాచ్యదేశములయొక్క - అందు ముఖ్యముగా భారతఖండముయొక్క సంపదలను జూచి వారినోరు ఊరెను. ఇట్టి ధన

---

* సముద్రపు దారిలోకూడ కష్టములు లేక పోలేదు. "హల్లం" అను నతిడిట్లు వ్రాయుచున్నాడు:—బహుకాలముగ నేరస్థులు దండనాధికారులను ధిక్కరించి తిరుగు ఆ యరాచకపు, దారుణపురోజులలో వారికి నేలమీదకంటె సముద్రము మీదనేయెక్కువ దొంగతనములు చేయుటకు వీలుగనుండెను. నేలమీద శాంతినెలకొని, దొంగతనములు, దోపిడీలు సాగకుండ కట్టుదిట్టములు చేయబడిన తరువాత, నేరస్థులకు అనువైనచోటు ఒకసముద్రమే మిగిలెను. అక్కడ రాజెవడును లేడు; సముద్రము అందరికి హక్కు అయిపోయెను. సముద్రముమీద ఎవడేమి చేసినను అడుగు దిక్కులేకుండెను. సముద్రము మీద స్వేచ్ఛయనునది దోపిడిగాండ్ర దుండుగీడుచేష్టలకు పెట్టని కోటయైనది. ("మధ్యమయుగములో యూరపుస్థితి"—యను గ్రంథమునుండి)

ఐనప్పటికి, సముద్రప్రయాణము మెట్టప్రయాణమంత భయభరితము గాకుండెను. కెప్టన్ మాహన్ అనునత డిట్లు వ్రాసెను. "సముద్రపుదారి సులభతరముగనుండెను; పెద్దసరుకులు నేలమీదకంటె సముద్రముమీదనే ఎక్కువ త్వరితగతిని పోవచ్చును. రోడ్లుబాగుండక, బండ్లుసరిగ లేక యున్న ఆ రోజులలో సముద్రయాన సౌకర్యము మరింత హెచ్చుగనుండెను."

తృష్ణయే క్రైస్తవజాతులను ప్రేరేపించి నేడు వారు ప్రపంచమం దాక్రమించిన స్థానమునకు వారిని క్రమక్రమముగ నీడ్చి తెచ్చెను.

ఇండియాను కనుగొందుమనని చెప్పి కొలంబస్ లంగరెత్తెను. కాని యిండియాకు బదులుగ అతని కింకొక దేశము (అమెరిక) దొరికెను. ఇదియే హిందూ దేశమని యాత డనుకొనెను. ఇది హిందూదేశమను ఊహతోనే ఆతడు పరలోకమున కేగెను. ఇండియాకు సముద్రమార్గమును కనుగొన్నకీర్తి నిజముగ పోర్చుగీసు వారిది. (బుడతకీచులది)



## 3 ఇండియాలో బుడతకీచుల (పోర్చుగీసుల) చర్యలు

ఇండియాకు నీటిమార్గమును కనుగొన్నవాడు వాస్కోడిగామా. సదా తుపానులచే నతిభయంకరముగా గన్పట్టు "కేప్ ఆఫ్ గుడ్ హోప్" అను దక్షిణాఫ్రికాగ్రమును యీతడు మిగుల సాహసించి దాటి, 1498 సం॥ మే నెల 22-వ తేదీని కల్లికోట రేవులో దిగెను. అతనివెంట కొలది పరివారము మాత్రమే యుండెను. వారు వాస్కోడిగామా వలెనే ధైర్యసాహసములు గలవారు; పాపభీతి లేనివారు. ఆకాలమున కల్లికోట "జామరిన్" అను హిందూరాజుచే పాలింపబడుచుండెను. ఈరాజు వాస్కోడిగామాకును, అతని క్రైస్తవ పరివారమునకును, ప్రేమపూర్వకముగ నాతిథ్యమిచ్చెను. భరతఖండస్థులకు అతిథిపూజ సనాతన ధర్మము. ఏ విమత క్రైస్తవ ద్రిమ్మరీడులు యిప్పుడు తన పాదకమలములవద్ద కూర్చుని యిండియాలో తమ సరకుల నమ్ముకొనుటకు అనుజ్ఞ నివ్వవలసినదని తనను వేడుకొనుచున్నారో, ఎవరికి తానిప్పుడు హృదయపూర్వకముగ నాతిథ్యమిచ్చుచున్నాడో, అట్టి యతిథులు, రేపు తన యధికారమును త్రోసిపుచ్చి, తన వంశమును కూకటివ్రేళ్లతో పెళ్లగింతురనిగాని, తానిప్పు డేలుచున్న యీ భూభాగము యీ క్రైస్తవ ద్రిమ్మరీడుల చేతులలోనికి పోవుననిగాని పాపమానాడు జామరిన్ రాజు కలలోనైన తలంచి యుండలేదు.

ఆన 1500 సం॥ లో కల్లికోటవద్ద "పెడ్రోఆల్వరెజ్ కబ్రాల్" అనువాని యాజమాన్యమున బుడతకీచులొక గిడ్డంగిని (ఫ్యాక్టరీని) స్థాపించుకొనిరి. 3 సం॥ల యనంతరము అచటనే వారొకకోటను కట్టుకొనిరి. దీనికి "ఆల్ ఫన్ జో-డీ-ఆల్ బూకరక్" అను నతడు అధిపతిగా నుండెను. (ఈతడు 1506 సం॥లో గోవాపట్టణమును పట్టుకొని 1510 సం॥లో కల్లికోటనగరమును దోచుకొని రాజమందిరముల నన్నింటిని కాల్చివేసెను! తమకు మొట్టమొదట కాలుబెట్టుటకు తావిచ్చి, తమ కెంతో గౌరవముగ నాతిథ్యమిచ్చి, తమ సరకుల నిచట నమ్ముకొని బ్రతుకుటకు అనుజ్ఞనిచ్చిన ఆ "జామరిన్" హిందూరాజు నెడ యీ క్రైస్తవ














యూరోపియనులు ఇండియాకు సముద్రపు దారిని కనుగొను యత్నములు.

బుడతకీచు బచ్చు చూపిన కృతజ్ఞత యిట్లున్నది! * "తిన్నయింటి వాసములు లెక్కించుటయన నిదిగాదా!।

---

* లెఫ్టినెంట్ కర్నల్ అలెగ్జాండర్ వాకర్ అను నతడు 1818 సం॥ జనవరి 31-వ తేదీన బి. యస్. జోన్సు అను నతనికి "బఫ్ల్యాండు" అను చోటునుండి వ్రాసిన ఉత్తరములో నీరీతిగ నున్నది.

యూరప్ ఖండములోని నానాదేశములనుండి వర్తకులమని పేరుపెట్టుకొనివచ్చిన దిమ్మరీంద్ర యెడ భరతఖండపురాజులుచూపిన యాదరణ సర్వత్ర సమముగను ఏకరీతిగను ప్రోత్సాహకరముగ నుండెననుట నిశ్చయము. భరతఖండము భాగ్యవంతమును సర్వవస్తుసంపన్నము నగుటచే పరదేశస్థులిచట వర్తకము చేసికొందుమని ప్రార్థించినపుడు అట్టివారిని యాదరించి వారికి దగినసౌకర్యము నొసంగుటతమ సంపన్నరాజ్యములకు తగిన లక్షణముగ ఆనాటిరాజులు భావించుకొనిరి. అనేకమంది రాజులు తామేస్వయముగా, అమూల్యమగు ననేకవస్తువులను గొనుచుండిరి; అమ్ముచుండిరి. తమ ప్రజలు చేసికొను వర్తకముపై సుంకముల విధించుచుండిరి. తద్వారారాజులకు మంచి యాదాయము వచ్చుచుండెను. కాబట్టి, యూరప్ ఖండమునుండి నావికులు వచ్చినపుడు అది తమకు మంచిదని వారు తలంచుటయే గాక, వారికి మిక్కిలి వైభవముతో - మేళతాళములతో - స్వాగతమిచ్చుచుండిరి. తనకు మొట్టమొదటి పర్యాయము కళ్ళికోటలో నొసంగబడిన స్వాగతమునుగూర్చి 'వాస్కోడిగామా' తన యింటికిట్లు ఎంతో అబ్బురముతో వ్రాసుకొనెను:—"నాకిక్కడ ఎంతటి గౌరవము జరిగినదో, మీరుకలలోగూడ ఊహించుకోలేరు." "కబ్రాల్" అనునతనికిగూడ నిట్లే మిగులహృదయపూర్వక మగుస్వాగతము జరిగెను. కాని, యీ మర్యాదలన్నియు అచిరకాలములోనే విరసములయ్యెననుట నిజమే. అయితే ఇందు "జామరిన్" రాజు తప్పేమియులేదు. ఈసంగతిని ఆబుడతకీచునాయకులే ఒప్పుకొనిరి. క్రొత్తగావచ్చిన యీ విదేశస్థులు తమ వర్తకమును పడగొట్టుదురేమోయను నీర్ష్యచే కళ్లికోటలోనుండు అరబ్బీవర్తకులు రాజుతో చాడీలు చెప్పుటచే యిట్టి విపరీతము జరిగెనని బుడతకీచులేచెప్పిరి. అయితే, మనమిప్పుడింకొక విషయమును విచారించవలసియున్నది. అరబ్బులు చెప్పినవి నిజముగా చాడీలా? బుడతకీచులదేమియు తప్పులేదా? బుడతకీచులు చెప్పినట్లు తాము చేసినచేష్టలు స్వరక్షణార్థమైచేసినవని వాదసౌకర్యమునకు ఒప్పుకొన్నను అవి యతితీవ్ర స్వభావము గలవిగను, ఏప్రభుత్వమునకైనను సహేతుకముగ ననుమానము, వైరభావమును గలిగించునవిగనున్నవనుటలో సందేహములేదు. ఇండియాలో కాలుబెట్టినది మొదలు యీ బుడతకీచులు చేసినచేష్టలు యూరోపియన్ జాతులకు మంచిపేరు తెచ్చునవిగా గన్పట్టలేదు. ఇటీవల అకారణముగా ఆల్బూకర్కు ఆర్మజ్ పట్టణమును ముట్టడించుటయు, జామరిన్‌తో సమాధానపడినవెంటనే యితడు కళ్లికోటలో నొకయోడను పట్టుకొనుటయు, కనపడినయోడనెల్ల ముట్టడించి దోచుకొనుటయు, ఓడదొంగతనము ఏకరీతిగ సాగించుటయు,-ఇవన్నియుగూడ జాతులు పరస్పరము మన్నించుకోవలసిన ధర్మములకు కేవలము విరుద్ధము లగుచున్నవి. ఇట్టివిపరీతము ప్రపంచములో మరెచ్చటను గానరాదు. ఈదుశ్చేష్టలచేతను, యింతకంటె మెరుగుగాని, తదితర సాధనములచేతను, బుడతకీచులు కొంతవిశాలరాజ్యమును స్థాపించుకొనగల్గిరి. ఇట్టిపరిస్థితులలో ఈపోర్చుగీసు జాతియెడ భరతఖండ రాజులకు రోతయు, భయమును కలుగకుండినచో ప్రపంచ మాశ్చర్యపడి యుండవలెను." [ఈస్టిండియా కంపెనీ•వ్యవహారములగూర్చిన సెలక్టుకమిటీ రిపోర్టు 6-వ వాల్యూం. 1832 సం॥ న ముద్రితము. 20. అనుబంధము - 299-300 పేజీ]

బుడతకీచులు ఇండియాలో అడుగిడు నాటికి హిందూదేశస్థులకు తుపాకుల నుపయోగించుట తెలియదు. అందుచే వారు పోరాటములలో హిందూదేశస్థులను సులభముగ జయించగలుగుచుండిరి. ఇచ్చటికి వచ్చిన నూరు సం॥ల లోపలనే వారు హిందూమహాసముద్రమును జపాన్ వరకు శోధించిరి; వారిజెండా ప్రాచ్యభూములలో చాలచోట్ల యెగురుచుండెను. మంగళూరు, కొచ్చిన్, సింహళము, ఆర్మజ్, డయ్యూ, గోవా, నాగపట్టణములకు వారు ప్రభువులయిరి. ప్రాచ్యభూములలో వర్తకము చేసుకొందమను తలంపుతో వార్చిటకువచ్చిరి. ఈ పనియందు వారికి విజయము గలిగినప్పుడు వారు సంతుష్టులయిరి. ఒక నూరు సం॥ల పైకాలము వరకు వారు హిందూమహాసముద్రముమీద వ్యాపారమునంతను గుత్తగొనిరి. ఇది మిక్కిలి లాభకారిగనుండెను. వారు అపరిమిత ధనరాసులగడించి, తక్కిన యూరపుఖండస్థులకు * దిగ్భ్రమను గల్గించిరి.

---

* బ్రూస్ అనునతడిట్లు వ్రాయుచున్నాడు:—అనాదినుండియు హిందూదేశపు సరుకులు అరేబియా, పర్షియన్ గల్ఫులద్వారా యూరఫ్ ఖండమునకు పోవుచుండెను. ఈ మార్గమునుండి తప్పించి వ్యాపారమునంతను పూర్తిగ సముద్రము మీదనే సాగునట్లు త్రిప్పి, దానిని తామే గుత్త గొనవలెనని పోర్చుగీసులు ముఖ్యముగ పూనుకొనిరి. ఇందువల్ల ఎక్కువ సరుకులు రవాణా యగుట యేగాక, ధరలు తగ్గుననియు, వర్తకమునంతను తమరాచకీయాధికారమునకు లోబడునట్లు చేసికొనవచ్చుననియు పోర్చుగీసులు తలంచిరి..... (ఈస్టిండియా కంపెనీ చరిత్ర (Annals) వాల్యూం I పేజీ 41.)

లెప్టినేంట్ కర్నల్ వాకర్ బి. యస్. జోన్సుకు వ్రాసినట్లు పైనచెప్పిన లేఖలో నిట్లున్నది:—"తమకు భరతఖండపు రాజులవల్లగల్గిన అనుకూల ఆతిథ్యమునుగూర్చి డచ్చివారు (ఒలందాలు) కూడ ఎంతో గొప్పగ చెప్పకొనిరి. ఇందుకింకొక కారణముకూడ గలదు. వీరికి పూర్వమువచ్చిన బుడతకీచుల దుండగములచే భరతఖండపు రాజులకు వారియెడ రోతపుట్టియుండెను. (అయినప్పటికి, భరతఖండపు రాజులు విదేశస్థులయెడ యీర్ష్యను వహింపక) తరువాతవచ్చిన ఒలందాలకుకూడ ఆదరణ పూర్వకమగు స్వాగతమిచ్చుట, వారి యౌదార్యమును ద్విగుణీకృత మొనర్చెను. కోటలనుకట్టుటకు తమకెట్టి యిబ్బందికలుగలేదని ఒలందాలు చెప్పకొనిరి. దేశీయులు మాత్రము వారియొద్ద పని చేయుటకు యిష్టపడకుండిరట. అయితే, తామే కట్టుకొన దలచినయెడల, అందుకు రాజులు సంపూర్ణమగు అనుజ్ఞ నిచ్చుచుండిరట! దేశీయులయెడ బుడతకీచులు చేసినంత దుండగములను ఒలందాలుచేసినట్లు కనపట్టదు. (దీనికొక కారణ ముండవచ్చును) ఒలందాలు దుర్బలులై చిరకాలము తమ స్వదేశములోనే స్వాతంత్ర్యమునకై పోరాడుచుండిరి. కాబట్టి యితరులయెడల తాము కొంత సహనమును, సానుభూతిని చూపవలసివచ్చెను. ఒలందాలు యిండియాలోచేసిన దౌర్జన్యములు హిందూదేశస్థులమీదకాక, తమకు పోటీగనున్న బుడతకీచులు మున్నగు యితర యూరోపియన్ జాతులవారిమీద చేసిరి. దేశీయరాజులతో స్నేహము గట్టియు వారిసేనలలో శిపాయిలుగ చేరియు, యిటీవల యింగ్లీషు కంపెనీవారు చేసినమాదిరిగ రాజులతో సైనికపుటొడంబడికల నేర్పరచుకొనియు, ఒలందాలు హిందూదేశములో తమ యధికారమును స్థాపించుకొనుట ప్రశంసనీయము. [సెలెక్టు కమిటీ వాల్యూం. 6. 1832 సం॥లో ముద్రితము. పేజీ 300]

కాని బుడతకీచుల పాలబడిన ప్రాంతములలోని ప్రజలు ఘోరబాధల ననుభవించుచుండిరి. ఒక యింగ్లీషు గ్రంథకర్త యిట్లు వ్రాయుచున్నాడు :—17-వ శతాబ్దములో శివాజీమహారాజు చేసినట్లుగ, బుడతకీచులు తమపాలనలో నున్న దేశీయ ప్రజల సంరక్షణకు గాని, వారి యభివృద్ధికిగాని, యెట్టి ప్రయత్నముగాని చేసినట్లు నిదర్శనము లెక్కడను గానరావు. ఇదిగాక, యింకొక సంగతి యేమనగ :—బుడతకీచులు ఆఫ్రికాఖండమునుండి నీగ్రోబానిసలను తెచ్చి యిండియాలో తామున్న ప్రాంతములలో మిక్కిలి చవకధరలకు విక్రయించుచుండిరి......... నేటి, గోవా ప్రజలలో నీగ్రోలక్షణములు గాన్పించుటకు యిదికొంతకారణము అని చెప్పవచ్చును. ("నైరన్ అనునతడు వ్రాసిన" కొంకన్ చరిత్ర-పేజీ 54).

అయితే బుడతకీచుల పక్షముగ ఒకమంచి సంగతి మాత్రము చెప్పవలసి యున్నది. వీరు ఆకాలపు రాజుల కొలువులోనున్న సైన్యములకు తుపాకులను గాల్చుట నేర్పి యూరపుఖండమందున్న యుద్ధపద్ధతులలో హిందూదేశస్థులను తరిబీయతుచేసిరి. అమెరికాలో తీవ్రక్రైస్తవమతస్థులే యగు స్పెయిన్, వారు చేసినట్లుగ యిండియాలో బుడతకీచులు హిందూదేశస్థులను యూపువూపలేదు. కాబట్టి బుడతకీచులుగాక తుపాకుల గాల్చుట నెరింగిన యే యితర క్రైస్తవజాతి గాని హిందూదేశమునకు సముద్రపుత్రోవను కనుగొనక పోవుట దైవసంకల్పమే యని చెప్పవచ్చును. కొలంబస్ యాజమాన్యమున స్పెయిన్ దేశస్థులే గనుక యిండియాను కనుగొనియుండినచో అమెరికాలో పెరూ, మెక్సికో దేశస్థులకు పట్టినగతియే, మనహిందూదేశస్థులకును స్పెయిన్‌వారివల్ల గలిగియుండెడిది.

బుడతకీచులు ద్రవ్యమార్జించి, నానాటికి ధనరాసులలోపడి పొర్లుచున్న కొలదియు క్రమక్రమముగ వారి ప్రాముఖ్యత యిండియాలో క్షీణింపసాగెను. (ఇందునుగూర్చి వారి గవర్నర్‌అగు ఆల్‌ఫన్‌జో-డీ-సౌజా యను నతడు 1545 సం॥ లో యిట్లు వ్రాసెను :—ఒకచేతితో కత్తిని, ఇంకొకచేతితో శిలువను బుచ్చుకొని బుడతకీచులు ఇండియాలో ప్రవేశించిరి. ఇండియాలో బంగారురాసులను చూడగనే వారు శిలువను క్రిందపారవేసి, తమ జేబులను నింపుకొన మొదలిడిరి. జేబులు బరువెక్కినకొలది వానిని మోయలేక, కత్తినిగూడ క్రిందపారవేసి, రెండుచేతులతోను జేబులనెత్తి పట్టుకొనిరి. వీరిట్టిస్థితిలోనుండగ, వీరి తరువాత వచ్చినవారు, వీరిని బహుసులభముగ త్రోసి రాజనిరి.")

బుడతకీచులకు ఒలందావారు కొక్కుపెట్టిరి. ప్రాచ్యభూములనుండియు, లంకలనుండియు బుడతకీచులను లేవగొట్టి ప్రతిచోట వారిస్థానములను ఒలందావారు ఆక్రమించుకొనిరి. వారిఓడల నన్నిటిని తగులబెట్టిరి. ప్రస్తుతము యిప్పటికి యిండియాలో బుడతకీచులకు మిగిలినది గోవాపట్టణ మొక్కటే.

## 4. ఒలందాలు - (డచ్చివారు)

పదునారవశతాబ్దము చివరభాగమున ఒలందాలు ఇండియాతో వర్తకము చేయుటకు వచ్చిరి. వారు స్పెయిన్ వారికి లోబడి యున్నంతకాలము, స్పెయిన్ రాజధానియగు లిస్బన్ నగరమునుండి తమకు కావలసిన యిండియా సరకులను ఒలందావారు తెచ్చుకొనుచుండిరి. కొంతకాలమునకు ఒలందాలు స్పెయిన్ వారి రాజ్యాధిపత్యమును త్రోసివేసిరి. 1580 సంIIలో స్పెయిన్, పోర్చుగలు రాజ్యములు రెండును సమాన స్వతంత్రరాజ్యములుగ ఏర్పడి, రెండును సమష్టిగ స్పెయిన్ చక్రవర్తి యాజమాన్యమున వ్యవహరించుకొనుటకు ఏర్పాటుచేసికొనెను. ఈ కారణముచే ఒలందాలకు "లిస్బన్" నగరమునకు పోవుటకు ఆటంకము గలిగెను. వారికి యిండియాసరకులు దొరుకుట దుర్లభమయ్యెను. స్పెయిన్ వారు ఒలందాల ఓడలనుపట్టుకొని, ఓడయజమానులను ఖైదుచేయుచుండిరి. ఈవిధముగ ఖైదుచేయబడిన ఒలందా నావికుడొకడు బుడతకీచు నావికులనుండి యిండియా సంగతి వినెను. ప్రాచ్యభూములనుగూర్చియు, అచ్చటి సముద్రములనుగూర్చియు, లంకలను గూర్చియు వినెను. ఆతడెట్లో ఖైదునుండి తప్పించుకొని, తన స్వదేశమగు ఒలందాదేశము చేరెను. ఒలందాలు మందబుద్ధులు, స్థబులునని ప్రఖ్యాతి. అయినను, యీ నావికుడు హిందూదేశమునుగూర్చి తాను విన్నసంగతులను యెంతో మనోహరముగ, నోరూరునట్లుగ తన దేశప్రజలకు వినిపించెను. ఈ మాటలు వినగానే, ఆ మందబుద్ధులకుకూడ చురుకుపుట్టి, బుడతకీచులు సంపాదించుకొన్నట్లుగానే తాముకూడ కావలసినన్ని ధనరాసులను గడించుకొని, భాగ్యభోగ్యములలో పొర్లాడవచ్చునను నాసతో, వారు తక్షణమే ఎనిమిదిఓడలను తయారుచేసి, ప్రాక్ ఖండములకు లంగరెత్తిరి. ఈ ఎనిమిదిలో నాలుగు దక్షిణాఫ్రికా మార్గమునను, మరినాల్గు యీశాన్యమార్గమునను పోవునట్లు ఏర్పాటుచేసికొనిరి.

ఇచ్చట ఈశాన్యమార్గము, వాయవ్యమార్గము, ఉత్తరమార్గము అను పదముల కర్థమేమో కొంత చెప్పవలసియున్నది. కోస్తాలుగల యూరపు ఖండదేశములు యిండియాతో నేరుగ సముద్రమార్గమున వ్యాపారము చేయదలంచినప్పుడు, వారికి భూగోళజ్ఞానము లేకుండెను. సరాసరి పడమటగపోయిన "కొలంబస్" అమెరికాచేరి, అదే యిండియాయని భ్రమపడెను. వాస్కోడిగామా దక్షిణాభిముఖముగ బయలుదేరెను. ఉత్తరముఖముగ బయలుదేరినచో తమకు ఇండియా తగులునని యింగ్లీషులు, ఒలందాలు తలంచిరి. ఈ ప్రయాణములన్నియు తుదకు నిరర్థకములయ్యెనని వేరుగచెప్ప నక్కరలేదు. కాని, యీ ద్రిమ్మరుటలో ఉత్తర ప్రాంతములనున్న కొన్నిలంకలు, ద్వీపకల్పములు మున్నగునవి కనుగొనబడెను. ఒలందా వారికి "నోవాజెంబ్లా" యను లంక కనబడెను.

దక్షిణాఫ్రికా మార్గమున తూర్పుముఖముగపోయిన ఒలందావారి యోడలు జావా (యవ) ద్వీపమును జేరెను; దీనిద్వారా ఒలందాలు ప్రాగ్భాగములతో వర్తకముచేయ వీలుకలిగెను. కాని, 1598 సం॥ నాటికిగాని ఒలందాలు తూర్పు లంకలలో స్థిరముగ పాదుకొనలేకపోయిరి. మదరాసునకు ఉత్తరముననున్న పులికాటు, దక్షిణముననున్న సద్రాస్, అనుచోట్ల ఒలందాలు గిడ్డంగుల నేర్పరచుకొని, కోటలను గట్టుకొనిరి. క్రమక్రమముగా యిండియాలో మరికొన్ని ప్రాంతములలో కూడ గిడ్డంగుల నేర్పరచుకొనిరి. బర్నియర్ అను పరాసుయాత్రికుడు 1663 సం॥ జూలై 1-వ తేదీన ఢిల్లీనుండి యిట్లు వ్రాసెను. "ఒలందావారికి ఆగ్రాలో ఒక సారా గిడ్డంగికలదు. ఇచ్చట సాధారణముగ నలుగురైదుగురు మనుష్యుల నుంచుదురు"......బంగాళా, పాట్నా, సూరత్, అహమ్మదాబాదు మున్నగు చోట్ల నున్న గిడ్డంగులనుగూర్చికూడ యితడు వ్రాసెను.

వర్తకముమీద తమ దృష్టిని యావత్తు పెట్టినంతకాలము ఒలందాలు అభివృద్ధికాజొచ్చిరి. వారి పని బాగుండెను. బంగాళా దేశమునందంతటను వారి వ్యాపారము బాగుగ అల్లుకొనెను. 1675 సం॥లో చించూరా యనుచోట వారు స్థిరవాసమేర్పరచుకొనిరి. ఇది బటేవియా లంకలోనున్న తమ గిడ్డంగికి లోబడియుండెను.

(చివరకు, కొంతకాలమునకు, వీరికి వట్టివర్తకముతో విసుగుపుట్టెను. ఇండియాను పరిపాలింతమను ఆశపుట్టెను. ఇండియానుండి యింగ్లీషువారిని తరిమివేయవలెనని వీరికి బుద్ధిపుట్టెను. కాని ముఖాముఖిని యుద్ధమేమియు చేయకయే, యింగ్లీషువారెట్లో ఒలందావారి యాశలను మొగ్గలోనే త్రుంచివేసి సంతుష్ట హృదయులు గాగలిగిరి.)

(ప్లాశీ) పలాశయుద్ధమైన తరువాత బంగాళాదేశము మీర్జాఫర్ అనునొక మహమ్మదీయద్రోహి చేతులలోనికి పోయెను. ఈతడు తన యజమానియగు సురాజుద్దౌలాకు స్వామిద్రోహమొనర్చి, క్లైవుతోడను అతని యనుచరవర్గముతోడను కుట్రపన్నెను. ఇందుకు ప్రతిఫలముగ యీతడు బంగాళాకు నవాబు చేయబడెను. ఈతడు పేరునకుమాత్రమే నవాబుగాని, నిజమునకు క్లైవుచేతిలో పిండిబొమ్మ. క్లైవును, అతని కిరస్తానీ వర్తకపుగుంపునుచేరి నవాబును పిండిబొమ్మవలె నాడించుచుండిరి. నవాబు యిందుకు లోలోపల కుళ్లుచుండెను. తాను తన యిచ్చ చొప్పున అధికారము చెలాయించుటకు వీలులేకుండ, తనకట్టి యాటంకములు గలుగుట కాతడెంతయో కటకటబడుచుండెను. ఇంగ్లీషువారినుండి యెట్లయిన తప్పించుకొనుటకు ఆతడు చూచుచుండెను. అందుచేత, రహస్యముగ సేనల దిగుమతి చేయవలసినదని ఆతడు ఒలందావారికి కన్ను గీటుచుండెను. ఆప్రకారమే ఒలందావారు తమ బటేవియా లంకనుండి పెద్ద నావికాదళమును తీసికొనివచ్చి హుగ్లీనదిలో దింపిరి. ఈ దళములో ఏడు ఓడలుండెను. మూడింటిమీద ఒక్కొక్క

దానిలో నిరువదియారేసి ఫిరంగులుండెను. ఇవిగాక పదునొకొండువందల సేన యీ ఓడలపై వచ్చెను. ఈసేనలో యూరోపియనులు, మలాయావారుకూడ నుండిరి. ఒలందాల యీ పన్నాగమును క్లైవ్ కనిపెట్టెను. (తన మెడమీదపడిన యింగ్లీషు వారి కాడిని క్రిందపడవేయుటకుగాను తన పిండిబొమ్మయైన మీర్జాఫరు ఒలందా వారిని ప్రేరేపించి, యీ నౌకాదళమును హుగ్లీనది యెగువకు తెప్పించెనని క్లైవు వెంటనే గ్రహించెను. ఆ సమయమందీ క్రైస్తవజాతులు పరస్పరము మైత్రితో నుండెను. అయినప్పటికి, ఒలందావారి పన్నాగమును గ్రహించినవాడగుటచే తక్షణమే ఒలందావారి సేనను ముట్టడించి, వారు చించూరాకు రాకుండ నిరోధించ వలెనని చెప్పి క్లైవు తన ఉద్యోగులలో నొకడగు కర్నల్ ఫోర్డుకు ఆజ్ఞాపించెను. ఫోర్డు వెంటనే ఒలందావారిని ముట్టడించి, ఓడించెను. ఒలందాలు గాభరాపడిరి. ఇంగ్లీషువారికి కొక్కుపెట్టు ప్రయత్నము భగ్నమయ్యెను. ఇంతనుండి యిండియాలో ఒలందాల వ్యాపారము క్షీణింపసాగెను.) ఇండియాలోనున్న గిడ్డంగులవల్లను, తదితర స్థానములవల్లను వారికేమియు లాభము వచ్చుటలేదు—పైగా దండుగగ నుండెను. కాబట్టి వీనినెట్లయిన వదిలించుకొనవలెనని వారు చూచిరి. 1805 సం॥లో యింగ్లీషు ఈస్టిండియా కంపెనీవారు సుమత్రాలంకను ఒలందాలకిచ్చి దానికి బదులుగ వారినుండి చించూరా, మలక్కాలను తీసికొనిరి. ఆనాడు ఇండియాలో ఒలందాలకుండిన స్థానములేమియు నేడు కానరావు. ఒకానొక కాలమందు హిందూ దేశమందు తమ రాజ్యాధిపత్యమును స్థాపించుటకై యాశించిన ఆ ఒలందాల సంగతియే యీనాటి విద్యాధికులకుకూడ తెలియదు. వారిపేరు యిండియాలో మాసిపోయినది.



## 5. ఇంగ్లీషువారు

బుడతకీచులు ఇండియాకు సముద్రమార్గమును కనుగొన్నప్పుడు వారి రాజ ధానియగు లిస్బన్ నగరము యిండియాసరకులకు ప్రధానస్థానమై యుండెనని యిది వరకే వివరించియుంటిమి. అందుచే యింగ్లీషువారికి బుడతకీచులయెడ అసూయ గలిగెను. ఆరోజులలో బ్రిస్టల్ నగరము యింగ్లండులో మంచి ఓడరేవుగ ప్రా ముఖ్యములోనికి వచ్చుచుండెను. ఆనగరమందుండు నావికులు తమ పూర్వులవలెనే గొప్ప ఓడదొంగలు, సాహసులు. వాయవ్యమూలగ యిండియాకు త్రోవ నేర్పరుపవలెనని 1527 సం॥లో "రాబర్టుత్రోన్" అను * బ్రిస్టల్ వర్తకుడొకడు ఎనిమిదవ హెన్రీరాజునకు మనవిచేసికొనెను.

* ఇండియాదేశస్థులుగాని, యింగ్లీషుదేశస్థులుగాని బ్రిస్టల్ పేరును మరువరాదు. ప్రాచ్య పాశ్చాత్యఖండములకు సంబంధమేర్పరచి, యిండియా, యింగ్లండులను పరస్పరము చేరువకు చేర్చుట కీ నగరమే కారణభూతము. నేరుగ సముద్రమార్గమున యిండియాలో వర్తకముచేయుటకు మొట్ట

వాయువ్యమార్గమున యిండియానుచేరుటకై యింగ్లీషునావికులు ఒక అర్ధశతాబ్దము బహుతంటాలుపడిరి. కాని, వారి ప్రయత్నములన్నియు నిష్ఫలమయ్యెను. (1578 సంll లో యిండియానుండి లిస్బన్ నగరమునకు తిరిగివచ్చుచున్న ఒకానొక బుడతకీచుఓడను "సర్ ఫ్రాన్సిస్ డ్రేక్" అను ఆంగ్లనావికుడొకడు పట్టుకొని దోచుకొనెను. అట్లు దోచుకొన్న వస్తువులలో ఆతని కొక పటము దొరికెను. ఆ పటములో దక్షిణాఫ్రికాగ్రముగుండా యిండియాకు పోవుమార్గము చిత్రింపబడి యుండెను. రహస్యము బయటబడెను. 1594 సంll లో "సరెజార్జి లంకాస్టరు" అనువాడు యీ మార్గముగుండా బయలుదేరి యవ (జావా) ద్వీపమును చేరెను. ప్రాచ్యదేశములతో వర్తకముచేసికొనుటకై యింగ్లీషు వారప్పుడొక కంపెనీని యేర్పరచుకొనిరి. "తూర్పులంకలతో వర్తకముచేయుట కేర్పడిన లండన్ వర్తకులయు, గవర్నరులయు కంపెని" (Governors and Company of Merchants of London, trading with the East Indies) అని దానికి పేరు. ఈ రీతిగ వర్తకముచేసికొనుట కనుజ్ఞ యిచ్చుచు 1600 సంll లో యింగ్లండు రాణియగు "ఎలిజబెత్తు" వీరికి పట్టా (చార్టర్) నిచ్చెను.

ఎలిజబెత్తు రాణి వర్తకపు పట్టానిచ్చిన దెవరికి? ఒకానొక "ద్రిమ్మరీడుల సంఘము"నకు (Society of Adventurers). ఇదియే "యీస్టిండియా కంపెనీ" యయ్యెను.)

ఈ కంపెనీ డైరక్టరులందరు సమావేశమై "పెద్దమనుష్యులను అనగ సంపన్న గృహస్థులను (Gentlemen) ఎవరిని మన కంపెనీలో చేర్చుకొనరాదు" అను తీర్మానము చేసికొనిరి! "మా రకము మనుష్యులతోనే మమ్ములను వ్యాపారము చేసికోనివ్వండి" అని ప్రార్థించిరి! "ఏలననగ, సంపన్న గృహస్థులు గనుక యీ కంపెనీలో చేరి నారంటే, యిందు చేరియున్న ద్రిమ్మరీడు లందరు తమ పెట్టుబడి డబ్బును తీసికొని లేచిపోదురు" అని వీరనిరి. [బ్రూసుగారి యీస్టిండియా చరిత్ర (annals) వాల్యూం I. పేజి 128]

ఈ కంపెనీయొక్క నిర్మాణ మెట్లుండవలెనో యెవరును అప్పుడు స్పష్టముగ నిర్దేశించి యుండలేదు. దీని కొక కారణముగలదు. ఈ కంపెనీ పెద్దమనుష్యుల కంపెనీ కాదు. ఇది దేశద్రిమ్మరుల గుంపు. పెద్దమనుష్యులు తమ కంపెనీలో నుండడానికి వీరు ఒప్పుకోలేదను సంగతిని మనము జ్ఞాపకముంచుకొనవలెను. (పెద్దమనుష్యులుంటే తమ యాటలు, దుండగములు సాగవని వీరి భయము.) ఈ

---

మొదట యింగ్లీషురాజునకు సలహా చెప్పినవా డీ నగరవాసియే. భరతఖండ నాయకులలో ప్రథముడగు (రాజా రామమోహనరాయలవారు) యీనగరముననే పరమపదించిరి. వారి సమాధి యీ నగరమందే గలదు. కాలము గడచినకొలది, భారతీయులు వీరపూజను గ్రహించినకొలది, యీ నగరము భారతీయ విద్యార్థులకు యాత్రాస్థానము కాగలదు.

కంపెనీవారు ప్రాచ్యఖండములలో క్రైస్తవేతర జాతులయెడ గావించిన యత్యాచారము లన్నిటికి మూలకారణ మేమిటో యీ కంపెనీలో చేరిన మెంబర్ల పుట్టు పూర్వోత్తరములను బట్టియే యెల్లరకు బోధపడగలదు. ఈ కంపెనీ మొదలు పెట్టిన రోజు మొదలు, అంత్యమయిన ఆఖరు రోజువరకు యిందులోచేరుచు వచ్చినవారు కేవలము అల్పబుద్ధులగు దేశద్రిమ్మరులేగాని, పెద్దమనిషియని చెప్ప దగినవాడు ఒక్కడును లేడు. దేశద్రిమ్మరులకు నీతి యెక్కడ? జాతియెక్కడ? పేరు ప్రతిష్టలు, పరువు మర్యాదలు గల సద్వంశమందు పుట్టి పెరిగిన వాని కుండు లక్షణములు వీరికెట్లు అబ్బును? అట్టి మంచి చార వీరియం దెట్లు కాన నగును?

ఇండియా మట్టిమీద మొట్టమొదట కాలుపెట్టినవాడు "హాకిన్సు" అను ఓడసరంగు (కేప్టాను.) 1608 సం॥ లో "హెక్టర్" అను పేరుగల తన ఓడలో యీతడు సూరత్తురేవులో లంగరు వేసెను. అప్పుడు "మొదటి జేమ్సు" అను నతడు యింగ్లండుకు రాజుగ నుండెను. జేమ్సురాజు మొగలాయి చక్రవర్తికి యీ కెప్టన్ హాకిన్సు ద్వారా ఒక లేఖ నంపుకొనెను. జహంగీరు పాదుషా అప్పుడు ఆగ్రాపట్టణములో నుండెను. చక్రవర్తి హాకిన్సును చాల మర్యాదగ చూచెను; ఆర్మీనియన్ దేశమునకు చెందిన ఒక క్రైస్తవస్త్రీనిచ్చి హాకిన్సుకు వివాహముకూడ చేసెనట! కాని త్వరలోనే హాకిన్సు సూరత్తుకు తిరిగి వచ్చివేయవలసి వచ్చెను; ఏలననగ, జహాంగీరు దర్బారులో నున్న బుడత కీచులు తనయెడ కుట్ర పన్ను చున్నట్లు యితనికి అనుమానము తగిలెను.

1612 సం॥ లో కెప్టన్ తామస్ బెస్టు అను నతడు నాలుగు యుద్ధనావలతో బయలుదేరి సూరత్తులోనున్న బుడత కీచు దళమును ముట్టడించి, వారి యోడలను పట్టుకొనెను. బుడత కీచులు ఓడిపోయిరి; సూరత్తు యింగ్లీషువారి వశమయ్యెను. దీనితో ఇంగ్లీషు వారిపేరు కొంచెము పైకివచ్చెను. 1613–వ సం॥ ఫిబ్రవరి 6–వ తేదిన యింగ్లీవారు మొగలాయి చక్రవర్తితో సఖ్యమేర్పరచుకొనిరి. మొగ లాయి దర్బారులో యింగ్లీషు రాయబారి యొకడుండునట్లును, సూరత్తులో యింగ్లీషువారొక గిడ్డంగి నేర్పరచుకొనుటకును జహంగీరు చక్రవర్తి యనుమతి చ్చెను. "సర్ తామస్ రో" అను నతడు మొట్టమొదటి రాయబారిగ నుండెను. ఈతడే ఇంగ్లీషు వర్తకమునకు ఇండియాలో పునాదివేసినవాడు.

పడమటి కోస్తాయందు సూరతుతోపాటు మరికొన్నిచోట్ల యింగ్లీషువారు గిడ్డంగుల నేర్పరచు కొనిరి. 1640–వ సం॥ లో కలకత్తాలో గిడ్డంగిని పెట్టు కొనుటకు చక్రవర్తి యనుజ్ఞనిచ్చెను. ఇంతకు పూర్వము బంగాళాదేశములో వర్తకము బుడతకీచుల చేతులలో నుండెను. కాని, బుడతకీచులు యిటీవల తా మొనర్చిన కొన్ని చేష్టలచే (బానిసలను అమ్ముట, బంగాళా నబాబును,

అతని యధికారులను ధిఃకరించుట - మున్నగు కొన్ని చేష్టలచే) మొగలాయి చక్ర వర్తి ఆగ్రహమునకు పాత్రులై యుండిరి. వీరి పోగరుబోతు ప్రవర్తనను సహింపక అప్పుడు పాదుషాగనున్న షాజహాన్ చక్రవర్తి బుడతకీచుల మీదికొక దండును పంపెను. బుడతకీచులు ఓడిపోయిరి ; హుగ్లీవద్దనున్న వీరి యోడల నన్నింటిని తగులబెట్టి, చాలమంది బుడతకీచులను పట్టుకొని ఆగ్రాకు ఖైదీలుగ తెచ్చిరి. బుడతకీచు లీ విధముగా నాశనము కాగా, యింగ్లీషువారీ సందులోదూరి, వర్తక మును తాము చేజిక్కించుకొనవలెనని ఉవ్విళ్లూరు చుండిరి. చక్రవర్తిని ప్రార్థించి, బంగాళాలో వర్తకము చేసుకొనుటకు అనుజ్ఞ పొందిరి. కాని, వారు భారమగు సుంకముల చెల్లింపవలసి వచ్చెను. వారి యోడలు హుగ్లీనది యెగువకు రావల్ల కాదనిరి. "కెడ్‌గేరి" సమీపమున "పిప్లీ" రేవువద్దనే అవి నిలిచి పోవలసి వచ్చెను.

1640 సం॥లో మొగలాయి పాదుషా కుమార్తెకు ప్రమాదవశమున ఒడలు కాలెను. రాజవైద్యులు బాధను మాన్పలేకపోయిరి. సూరత్తుతో నున్న యింగ్లీషు వైద్యు నెవరినైనా పంపవలసినదని చక్రవర్తి కబురంపెను. "గేబ్రియల్ బౌటన్" అను నతనిని యింగ్లీషువారు యేరిపంపిరి. అతని హస్తవాసిచే చక్రవర్తి కుమార్తె స్వస్థత గాంచెను. "నీకేమి బహుమతి కావలెనని" చక్రవర్తి యడిగెను. సుంక ములులేకుండ బంగాళా దేశములో వర్తకము చేసికొనుటకును, ఆ దేశములో యితర చోట్లగూడ గిడ్డంగుల పెట్టుకొనుటకును, యింగ్లీషు ఓడలు హుగ్లీ ఎగువకు కూడ వచ్చుటకును అనుగ్రహించవలసినదని యా యింగ్లీషువైద్యుడు తనకుగల స్వదేశాభిమానముతో కోరెను. చక్రవర్తి వెంటనే ఆ ప్రకారము ఫర్మానాను ఇచ్చివేసెను. ఈ ఫర్మానా పుచ్చుకొని, బౌటన్ స్వయముగ బంగాళా దేశములో నున్న "రాజమహల్" పట్టణమునకు వెళ్లెను. అప్పు డక్కడ షాజహాన్ పాదుషా రెండవ కుమారుడగు "షాషుజా" బంగాళాకు రాజప్రతినిధిగ కొలువు దీర్చి యుండెను. అప్పు డతని భార్యలలో నొక . యామెకు చాల జబ్బుగ నుండెను. బౌటన్ ఆజబ్బును కుదిర్చెను. ఆ విశ్వాసముచే షాషుజా బంగాళములో ఇంగ్లీషు వారు తమ వర్తకమును సుస్థిరముగ స్థాపన చేసికొనుటకు వలయు సమస్త సౌక ర్యములను చేసెను.

1661 సం॥లో బొంబాయి లంకను బుడతకీచురాజు యింగ్లీషు రాజగు రెండవ చార్లెస్ భార్య కేతరీనుకు పసుపు కుంకముక్రింద యిచ్చెను. ఆమె యీ లంకను 1688 సం॥లో యీస్టిండియా కంపెనీవారికి అమ్మివేసెను.

ఈ ప్రకారముగ తూర్పు కోస్తాలోను, పడమరకోస్తాలోను కూడ యీస్టిం డియా కంపెనీవారు కూడ తమ గిడ్డంగుల నేర్పరచుకొనిరి. వర్తకములో మంచి లాభము తీయుచుండిరి. కంపెనీతో యేమాత్రము సంబంధమున్నవాడు కూడ

కావలసినంత డబ్బును మూటగట్టుచుండెను. ఇండియాను జయించి, యిండియాను యింగ్లండు క్రిందకు తెచ్చి, యిండియాను పాలింతమను తలంపు యీ అణా, పైసల లెక్కచూచుకొనుచు చిల్లర గల్లాపెట్టెముందు కూర్చుండు దేశద్రిమ్మరి కిరస్తానీ కిరాటులపుర్రెలలో నిప్పటి కింకను పుట్టలేదు.

ఇంగ్లీషురాజు సర్ తామస్‌రోను చక్రవర్తి దర్బారులోనికి రాయబారిగ పంపెను. ఆతడు 1615-వ సం॥ సెప్టెంబరు 26-వ తేదీన సూరత్తుచేరెను. ఇంగ్లీషు వారికి అనుకూలముగ ఆతడు చక్రవర్తినుండి అనేకమైన సౌకర్యములను సంపాదించెను. ఇందునుగూర్చి మిల్లు అను చరిత్రకారుడిటుల వ్రాయుచున్నాడు :—

( "సర్ తామస్‌రో దూరదృష్టిగలవాడు. నెమ్మదియైనవాడు. తనను పంపిన యుద్దేశ్యము దుష్టమైనదని యతడు త్వరలోనే గ్రహించెను. ఇట్లు గ్రహించినను, యీతడు తానున్న పరిస్థితులలో తనచేత నైనంతవరకు, వీలున్నంతవరకు వ్యవహారముల చక్కబెట్టెను......ఈతడు కంపెనీకి చేసిన యితరమేళ్లుగాక, కంపెనీకి సలహాలకూడ నిచ్చుచుండెను. "నేను ఓడదిగగానే, మనకొక కోట ఉండడము అవసరమని తోచినది. కాని, చక్రవర్తి అదిమనకు యివ్వకపోవడం మంచిదే యని అనుభవమును బట్టి ఎవరికైనా తెలుస్తుంది. చక్రవర్తి మనకు పది కోటలిచ్చినా, నేను ఒకటియైనా పుచ్చుకోను......మీ రొక్కటే మాటను గుర్తుంచుకోండి ; మీ కేమైనా సౌకర్యాలు కావాలంటే, అవి సముద్రముమీద కావాలని కోరండి ; శాంతమగు వర్తకములో కావాలని కోరండి ; సైన్యాలను తీసికొనివచ్చి, యిండియాలో యుద్ధములు ప్రవేశపెట్టడం చాల పొరపాటు : అది అనేక తగాదాలకు, చిక్కులకు కారణమగును."

ఇండియాలో తాము జాగ్రత్తగ, పొదుపుగ, సంసారముల గడుపు కొనవలెననియు, వట్టివర్తకులవలె నిరాడంబరముగ నుండవలె ననియు, తమ పెండ్లము పిల్లలను యింటికి పంపివేయవలసినదనియు, సర్ తామస్‌రో కంపెనీ నౌకర్లకందరకు నిరంతరము సలహాచెప్పుచుండెను.

మొదటి రోజులలో కంపెనీవారు "రో" చెప్పిన సలహాచొప్పున నడచుకొనిరి. కాని, యింగ్లండులో రెండవచార్లెస్ రాజుగవచ్చిన తరువాత వ్యవహారములు తలక్రిందయ్యెను. ఇతడు యింద్రియలోలుడు ; ధృతివిహీనుడు. ఈతఁడు ఈస్టిండియాకంపెనీకి రాచకీయాధికారముల నొసంగెను. క్రైస్తవులుకాని ఏ ప్రజలతోగాని, ఏ రాజుతోగాని, యుద్ధమొనర్చుటకును, సంధిచేసికొనుటకును, ఈతడు యీస్టిండియా కంపెనీకి అధికారమిచ్చుచు 1661 సం॥ ఏప్రిల్ 3-వ తేదీన ఒక పట్టానిచ్చెను.) దీనినిబట్టి, క్రూసేడరుల మనోభావములు (అనగ పరమతస్థులపై దండెత్తుదమను బుద్ధి) యింగ్లండు ప్రజల కింకను పోలేదని స్పష్టమగు

చున్నది. క్రైస్తవులకు, క్రైస్తవులు కాని వారలకు వీరు భేదము తీసిరి. క్రైస్తవులు కానివారందరు పాపులనియు, వారిహక్కులను, వారి యాస్తులను, వారి ప్రాణములను సహితము మన్నింపపనిలేదనియు వీరి భావము. తనదేశ ప్రజలు "క్రైస్తవులు" అను పేరుతో నెరుంగబడవలెనని రెండవచార్లెస్ రాజు కోరిక. ఆకారణము చేతనే యింగ్లీషువారిని గూర్చి చెప్పవలసినచోట్ల "క్రైస్తవుల"ను పదము యీ గ్రంథమందు తరుచు ప్రయోగింపబడినది.

ఏది యెట్లున్నను, ఇండియాను జయించి దానిపై సర్వాంసహాధికారమును చెలాయింతమనుతలంపు ప్రథమమున యింగ్లీషువారికి పుట్టినది కాదు. తన బ్రిటిష్ ఇండియాచరిత్ర 4-వ సంపుటం ఒకటవ అధ్యాయమునకు దిగువ నోటు వ్రాయుచు మిల్లుయిట్లు వ్రాసెను:—"ఇండియాను జయించుటకు రెండు రహస్యములు కనిపెట్టబడెను. ఒకటి:—తరిబీయతు అయిన యూరోపియన్ సేనల యెదుట దేశీయసేనలు దుర్బలమైపోవుట:—ఇక రెండవది:—దేశీయసేనలకు సులభముగ యూరోపియన్ తరిబీయతు నిచ్చుటకు వీలుండుట:—ఈ రెండు రహస్యములను కనిపెట్టిన వారు ఫ్రెంచివారు."

"యూరోపియనులు దేశీయ రాజులకు లొంగియుండవలెనను భ్రమను మొదట వదల గొట్టినవారు ఫ్రెంచివారు." 1764 సం॥లో ఫ్రెంచివారు 1200 సేనతో మాత్రమే కర్ణాటక నబాబుయొక్క యావత్తు సైన్యమును ఓడించగలిగిరి. దీనినిగూర్చి "ఆర్మ్" అను నతడిట్లు వ్రాసెను.

"మొగలాయి సైన్యములను యూరోపియన్ జాతి నిష్కర్షగ జయించి యిప్పటికి నూరువత్సరములు దాటినది. అదివరకు యూరోపియన్ జాతులు మొగలాయి సైన్యములవల్ల అనేకసార్లు ఓడిపోవుటచేతను, చిరకాలము తాము పోయిన చోట్ల యుద్ధములులేక యూరోపియన్ జాతుల రణకౌశలము తరిగిపోవుటచేతను, తమకంటె మహమ్మదీయసేనలే బలవత్తరమైన వనుభ్రమ యొకటి యూరోపియన్ జాతులకు కలిగెను. కాని, ఒక్కచిన్నదళముతో నబాబుయొక్క సైన్యవాహిని నంతను ఎప్పుడైతే ఫ్రెంచివారు చెదరగొట్టిరో, అంతటితో ఆభ్రమ పటాపంచలై పోయెను."

హిందూస్థాన ప్రజలపైనను, రాజులపైనను తమ యధికారమును స్థాపించవచ్చునని యింగ్లీషువారికి మొట్టమొదటగ దారిచూపిన వాడు పరాసువీరుడు "డూప్లె." డూప్లే ఇండియాలో పరాసు (ఫ్రెంచి) రాజ్యమును స్థాపించుటకు గొప్ప యెత్తులను వేసెను. కాని, తన యింటివద్దనున్న పరాసువారే ఆతని యెత్తులను సాగనీయకుండ అడ్డుతగిలిరి. అయితే అతడు వేసిన యెత్తులు యింగ్లీషువారికి ఉపయోగపడినవి. అతడుచూపిన త్రోవనే యీస్టిండియా కంపెనీవారు మిక్కిలి దీక్షతోడను, ఉత్సాహముతోడను పోయిరి. డూప్లేవేసిన పంథాను యింగ్లీషు కంపెనీ

కొలువులో నున్న రాబర్టు క్లైవ్ అనునతడు చేపట్టెను. దక్షిణాపథమునుండి ఫ్రెంచి వారిని త్రోసివేసి, తానాపదవి నధిష్ఠించవలెనని క్లైవ్ పూనుకొనెను. "ఈ దక్షిణా పథమందు చేతితో కత్తిపుచ్చుకొన్న ఒక్క పరాసువాడు ఉన్నంతకాలము, దేశము నకు శాంతిలేదు." అని యతడనెను. పరాసువారిని త్రోసిరా జొనర్చిన తరువాత క్లైవ్ పనియు, ఈస్టిండియా కంపెనీవారి పనియు బహు తేలికయయ్యెను.

ఇండియాలో యింగ్లీషు కిరస్తానీ వర్తకుల రాజ్యాధికార ప్రాబల్యము 1757 సం॥లో పలాశయుద్ధమైన నాటనుండి ప్రారంభమైనది.



## 6. ఫ్రెంచివారు (పరాసులు)

సముద్రమార్గమున యిండియాతో వర్తకము చేయవచ్చిన క్రైస్తవజాతు లలో ఆఖరువారు ఫ్రెంచివారు. ఇందునిమిత్తమై 1664 సం॥లో ఫ్రెంచివారొక కంపెనీ (కంపెనీ-డిస్-ఇండీస్ Compagnie des Indes) అను పేరుతో స్థాపించిరి. ఈ కంపెనీని నిర్మించిన కీర్తి పరాసు మంత్రియగు కోల్బర్టు అనువానిది. ఫ్రెంచిరాజగు పదునాల్గవ లూయితో చెప్పి, యీతడీ కంపెనీకి అనేకమైన సౌకర్యముల నిప్పిం చెను. ఇండియాతో వర్తకము చేసికొనుటకు యాభై యేండ్లవరకు యీ కంపెనీకి తప్ప యితర పరాసులకెవరికిని హక్కు లేకుండునట్లును, వీరిపై యేవిధమైన పన్ను లేకుండునట్లును, మొదట పదియేండ్లలో కంపెనీకి యే నష్టమువచ్చినను దానిని ఫ్రెంచిప్రభుత్వము భరించునట్లును, యింకనిట్టివే యితరమైన సౌకర్యములు పెక్కిం టిని యీ మంత్రి యీ కంపెనీకి యిప్పించెను.

1668 సం॥లో పరాసులు సూరత్తులో నొకగిడ్డంగిని పెట్టుకొనిరి. మరు సం॥ మచిలీపట్టణములో నింకొకగిడ్డంగిని కట్టుకొనిరి. 1674 సం॥లో పుదుచ్చేరిలో మరియొకదాని నేర్పరచుకొనిరి. పుదుచ్చేరిలో పరాసు గిడ్డంగి నేర్పరచిన వాని పేరు ఫ్రాన్సిస్ మార్టిన్. ఇతడు 1706 లో చనిపోవు వరకు పుదుచ్చేరీలోనే యుండెను. ఆతడు శాంత స్వభావముతోనుండి దేశీయరాజులతో సఖ్యము సంపా దించెను. ఈతని తరువాత "డాక్టర్ వినోయిర్" అనునతడు వచ్చెను. ఇత డును మార్టిన్ అవలంబించిన సఖ్యమార్గముననే పోయెను. ఇతని పిమ్మట డూమాస్ అనునతడు వచ్చెను. ఆతడు విశేషముగ శ్రమపడి పుదుచ్చేరిని మిక్కిలి యందమైన పట్టణముగచేసి, దేశీయరాజులకు అకర్షవంతముగ జేసెను. ఈ ప్రకారముగ ఆతడు ప్రఖ్యాత కర్నాటకనబాబైన "దోస్తు ఆలీఖాన్" యొక్క స్నేహమును సంపాదించెను. ఇండియాలో క్రైస్తవసామ్రాజ్యము నొకదానిని స్థాపించుటకై డూమాస్ అంకురార్పణచేసెను. ఈ అంకురమునకు దోహదమొనర్చు టకై అతని తరువాతవచ్చిన డూప్లే చాలతంటాలుపడెను. మహారాష్ట్రులు దండెత్తి

వచ్చినప్పుడు దోస్తు ఆలీకిని, అతని యల్లుడగు చందాసాహెబ్‌కును డూమాస్ సహాయముచేసెను. ముందు రాబోవు యుద్ధములలో బందోబస్తుగ నుండుటకై పుదుచ్చేరికోటను, బురుజులను డూమాస్ మిక్కిలి బలపరచెను. 1200 మంది యూరోపియన్ బలమును, నాలుగైదువేల యిండియనుసేనను, తయారుచేసెను. ఇండియన్ సేనకు యూరోపియన్ రణశిక్ష గఱపెను. ఇదియే మొదటి సిపాయిదళము. కర్ణాటరాజ్యమును దోస్తు ఆలీచేతినుండి లాగికొనుటకై మహారాష్ట్రులు పడిన శ్రమయంతయు యిట్లు నిరర్థకమయ్యెను. మహారాష్ట్రుల పేరుచెప్పిన ఢిల్లీపాదుషాకు హడలుగనుండెను. కాబట్టి, డూమాస్ మహారాష్ట్రులను జయప్రదముగ నిలిచి యెదిరించెనన్న వార్తవిన్నప్పుడు ఆడంగిరేకుల వాడగు ఢిల్లీపాదుషాకు పట్టరాని సంబరముగలిగెను. ఆతడు వెంటనే డూమాస్‌కు "నవాబు" అనుబిరుదు నొసంగెను; మరియు 2,000 అశ్వదళము నాతనికి అంగరక్షగ నొసంగెను. మొగల్ సామ్రాజ్యములో ఆతడొక యుద్యోగిగ యేర్పాటయ్యెను.

~

## 7. డూప్లే.

డూమాస్ తరువాత 1741 సం॥ అక్టోబరులో జోసఫ్ ఫ్రాన్సిస్ డూప్లే పుదుచ్చేరికి గవర్నరుగవచ్చెను. డూప్లే అద్భుతమైన వ్యక్తి, గొప్ప ప్రజ్ఞగలవాడు. అంతులేని కాంక్షగలవాడు. నెపోలియన్ వీరునివలె జన్మంతః జనసంఘములను నడిపింపగల నాయకుడు, ఇండియాలో క్రైస్తవసామ్రాజ్యమును స్థాపించుకుట పూనుకొనిన యూరోపియనులలో మొట్టమొదటివాడు. ఇండియానంతను ఫ్రెంచియధికారము క్రిందికి తీసికొనివచ్చుటలో యీతడు నిజముగ నెగ్గెడివాడే యని చరిత్రకారులెల్లరు అంగీకరించుచున్నారు. కాని, యీతని మహోత్కృష్ట ప్రతిభయే యీతని కడ్డమువచ్చెను. తమ ప్రజ్ఞకంటె గొప్పది యగు యితని ప్రజ్ఞను చూచి, యితని సోదరదేశీయులే యీర్ష్యనొందిరి! ఈ యీర్ష్యచే వారాతని పనిని సాగనీయలేదు. ఇండియాను జయించుటకు డూప్లేవేసిన పథకమునకు ఫ్రెంచిదేశము సమ్మతింపలేదు. స్వసామ్రాజ్యవైభవమునకు మారుగ ఫ్రెంచిదేశము శాంతినేకోరెను.

డూప్లే యధికార పదవిని వహించగనే, నవాబను బిరుదమును ప్రకటించుకొనెను. ఈ బిరుదము మొగలాయి చక్రవర్తి తన వెనుకటి వాడగు డూమాస్‌కు యిచ్చినదను సంగతిపాఠకులకు తెలియును. ఇతడు వచ్చిన కొలదికాలముననే యూరపుఖండములో యింగ్లండుకును, ఫ్రాన్సుకును యుద్ధము తటస్థించెను. ఒక శతాబ్ది పైకాలమునుండి మదరాసు పట్టణము యింగ్లీషువారిచేతులలో నుండెను. అది యిప్పుడు వారికి ప్రధానమగు వర్తకస్థానముగనుండెను. వర్తకములో తమకు

యింగ్లీషువారి పోటీలేకుండ అణగగొట్టివేయవలెనను సంకల్పముతో డూప్లే మద్రాసు నెట్లయిన పట్టుకొనవలెనని చూచుచుండెను. ఈపని నెరవేర్చుటకై ఆతడు "లాబోర్డోనాయ్" అను నొకపరాసు నావికుని పంపించెను. ఈ నావికుడు మదరాసునకు లంగరెత్తి సులభముగ మదరాసును స్వాధీనమొనర్చుకొనెను.

అయితే అప్పుడు డూప్లేకును, యీ "లాబోర్డోనాయ్"కిని సరిపడుటలేదు. ఒకరి నొకరు ద్వేషించుకొనుచు, ఒకనియెడ నొకడు యీర్ష్యతోనుండిరి. తాను కవ్వించి కాలుద్రవ్వుచున్న సంగతి కర్ణాటక నబాబు కనిపెట్టినాడని డూప్లే గ్రహించి, యతని యనుమానము తీసివేయుటకై, కోటబురుజులను పడగొట్టివేసిన పిమ్మట మదరాసు నగరమును మీకే యిచ్చివేసెదనని యతడు నబాబుకు వాగ్దానము చేసెను. కాని "లాబోర్డోనాయ్" డూప్లేతో సంప్రతించకుండ, ముందుగానే కొంతడబ్బు పుచ్చుకొని మదరాసు నగరమును తిరిగి యింగ్లీషువారికి యిచ్చివేసెను. తన మట్టుకు తాను యింగ్లీషువారివల్ల నలభయువేల నవరసుల బహుమతిని జేబులోవేసుకొని తన యుద్ధనౌకాదళమును మదరాసునుంచి మరలించెను. కర్ణాటక నబాబుతో డూప్లేచేసిన వాగ్దానము భంగపరుపబడెను. అందుచే నబాబు మదరాసును ముట్టడించెను. కాని, డూప్లే నబాబుసేనను ఫిరంగులతో ముట్టడించి చెదరగొట్టెను. ఇది 1746 సం॥ నవంబరు నాల్గవ తేదీన జరిగినది.

డూప్లే అప్పుడు బురకాను తీసివేసి, తన నిజస్వరూపమును జూపెను. నబాబు డూప్లేచేతులలో ఓడిపోయి, జిగుప్సనొంది, తనపంతము నెట్లయిన నెగ్గించుకొనవలెనని యింగ్లీషువారి సహాయమును కోరెను. ఇంగ్లీషుసేన 1748 సం॥లో "అడ్మిరల్ బస్కోవెన్" అనునతని యాధిపత్యమున పోయి ఫ్రెంచిస్థానమగు పుదుచ్చేరిపై పడెను. ఈ పర్యాయముకూడ డూప్లేకే జయముకలిగెను. తన విజయమును దేశమందంతట విరివిగ చాటుటకయి డూప్లే తక్షణమే ఆర్కాటుకు, హైదరాబాదుకు, ఢిల్లీకికూడ మనుష్యులను పంపించి, తాను యింగ్లీషువారి నెట్లు ఓడించినది అచ్చటి రాజులకు, నబాబులకు, చక్రవర్తికి ప్రకటింపజేసెను. అభినందన పరంపరలు అతనికి నలుముఖములనుండి వచ్చి పడుచుండెను. డూప్లే యీ యానంద తరంగముల మధ్య నుండగ యూరప్‌లో ఫ్రెంచివారికి "ఎక్సు - లా - చాపెల్" వద్ద సంధిజరిగినదనియు, ఆ సంధిప్రకారము మదరాసు పట్టణమును యింగ్లీషు వారికిచ్చివేయ వలసినదనియు, పిడుగువంటి వార్తవచ్చెను. అప్పుడు విధిలేక తాను చక్కగ బురుజులను దిట్టపరచి యుంచినటువంటి మద్రాసును డూప్లే యింగ్లీషువారికి చేతులారా యిచ్చివేయ వలసివచ్చెను. కర్ణాటకమునుండి యింగ్లీషువారిని తరిమి వేయవలెనని యిప్పటి కెన్నాళ్లనుండియో డూప్లే వేసిన యెత్తంతయు ఒక్కసారిగ భగ్నమైపోయెను.



18 A

పాత ఢిల్లీ



జహంగీర్ బాదుషా దర్బారులో మొదటి ఆంగ్లరాయబారి సర్ తామస్ రో. (12వ పేజీ)

1

18 B



డూప్లే - పరాసు నేత - ("ప్రేమించివారే జయించివుంటే..." (17వ పేజీ.)



'లాబోర్డొనాయ్'—లంచముతిని మదరాసును కంపెనీ కిచ్చివేసిన పరాసు నౌకా దళాధిపతి. (18వ పేజీ.)



మద్రాసు రేవు. (18వ పేజీ.)

## 8. ఆంగ్ల, పరాసుల, కొట్లాటలు.

యూరపులో ఫ్రెంచివారును, యింగ్లీషువారును, సఖ్యపడి యున్నప్పటికి, యిక్కడ యిండియాలో యింగ్లీషు ఫ్రెంచికంపెనీలు రెండును పూర్తిగ సమాధాన పడక యెప్పటి కప్పుడు కోడిపుంజులవలె కాళ్లకు కత్తులను కట్టుకొనియే కూర్చుండి, ఎల్లప్పుడు సేనలను తయారులో నుంచుకొని, ఏ దేశీయ రాజయినను అడుగుట తరువాయిగ ఆ సేనలను చెరియొక వైపున అద్దెకిచ్చుటకు ఆత్రపడుచుండిరి. ఎందుకీ ఆత్రము? దేశీయ రాజులకు నిజముగ సహాయముచేయుటకు కాదు. ఫ్రెంచి, యింగ్లీషువార్లు, ఒకరిపై నొకరు కసితీర్చుకొని, ఒకరి నొకరు రూపుమాపు కొనుటకు!

అట్టి యవకాశము అచిరకాలములోనే ఆసన్నమాయెను. తంజావూరు హిందూరాజగు సాహూను, చందాసాహెబ్ అనువాడు పదభ్రష్టుని గావించి వెడలగొట్టెను. తన సింహాసనము నెట్లయిన తిరిగి సంపాదించుకొనుటకై సాహూ యింగ్లీషువారి సహాయమును కోరెను. తన సింహాసనమును తనకు తిరిగి యిప్పించినచో యింగ్లీషువారికి అపారమగు ధనమును, దేవకోట పట్టణమును యిచ్చెదనని సాహూ ఆశపెట్టెను. ఇందుకు యింగ్లీషువారు సమ్మతించి, సాహూసహాయార్థమై వెడలిరి. కాని, యప్పటికే చందాసాహెబ్ మహారాష్ట్రులచేతులలో ఖైదీగ చిక్కి యుండెను; తంజావూరుకు ప్రతాపసింగ్ అను నతడు పరిపాలకుడుగ నేర్పడెను. ఈతని పరిపాలనతో తంజావూరు ప్రజలు సంతుష్టులై యుండి సాహూతిరిగి సింహాసనమునకు వచ్చుటకు యిష్టపడకుండిరి. అందుచేత, యింగ్లీషువారు సాహూ తమ కిచ్చెద నన్న దేవకోట పట్టణమును బలాత్కారముగ లాగుకొని, సాహూకు ఫించ నిచ్చి పంపివేసి ప్రతాపసింగ్‌తో నేస్తము గట్టిరి!

ఇంగ్లీషువారు రోజురోజు యెట్లు బలవంతు లగుచున్నదియు డూప్లే కనిపెట్టు చుండెను. కాబట్టి డూప్లే తక్షణమే మహారాష్ట్రులకు కొంతడబ్బుయిచ్చి, చందా సాహెబ్‌ను చెరనుండి విడిపించుకొనివచ్చి, ఆతనిని కర్ణాటక నబాబుగా చేయ దలచెను. కాని, యదివరికే కర్ణాటక నబాబుగ యింకొకడుండెను. ఆతనిపేరు "అన్వరుద్దీను." ఈతడు మద్రాసును పట్టుకొనబోయి, డూప్లే చేతులలో నోడిపోయి, తిరిగి తన పంతము నెగ్గించుకొనుటకై యింగ్లీషువారి సహాయముకోరి యుండెనని పైన చెప్పియుంటిమి. ఈ అన్వరుద్దీన్ అను నతడు డూమాస్‌ను ఆదరించిన దోస్తు అలీకి తరువాత కర్ణాటక నబాబయ్యెను. అయితే చందాసాహెబ్ దోస్తు అలీకి అల్లుడు. కాబట్టి, యీ యల్లుని సింహాసనము మీద కూర్చుండపెట్ట వలెనని డూప్లే ఆత్రపడుచుండెను. చందాసాహెబ్ ఫ్రెంచివారి సహాయముతో అన్వరుద్దీన్‌తో పోరాడి, 1749 సం॥ అగస్టు మూడవ తేదీన అంబూరువద్ద అతని

నోడించి చంపెను. ఈ విజయమువల్ల డూప్లేకు యింకొక క్రొత్త స్నేహము కలిసెను. అతని పేరు ముజఫర్ జంగ్. ఈత డిదివరకు తన పినతండ్రియగు నాజర్ జంగ్ చే ఖైదుచేయబడి యుండెను. కాని యీతడెట్లో ఖైదునుండి తప్పించుకొని వచ్చి, చందాసాహెబ్ తో కలిసి, డూప్లేమద్దతుతో డక్కనుకు సుబేదారుగ ప్రకటించుకొనెను. ఈ సుబేదారు పదవిలో గల అధికారమేమి? నవాబులందరు యీ సుబేదారు పదవిలో గల అధికారమునకు లోబడియుండవలెను. తన క్రింద నున్న నవాబులను (కర్ణాటక నవాబువంటివారిని) తీసివేయుటకుగాని, క్రొత్త వారిని నియమించుటకుగాని, యీ సుబేదారునకు అధికారము కలదు! ఒక్కమాటు ఢిల్లీ చక్రవర్తికి తెలియపరచి తానీ పనిని చేయవచ్చును. ఇట్టిది సుబేదారు పదవి.

తిరుచునాపల్లిలో బలిష్టమైన కోటగలదు. ఇది అన్వరుద్దీను కుమారుడగు మహమ్మదాలీ వశమందుండెను. ఈ తిరుచునాపల్లిని సంపాదించవలెనని డూప్లే చూచెను. దీనిని ముట్టడించవలెనని ముజఫరెజంగ్, చందాసాహెబ్ లను డూప్లే ఉసుకొలిపెను. కాని వారాతని యాజ్ఞ పాటించలేదు. తిరుచునాపల్లిని ముట్టడించుటకు బదులు వారు తంజావూరును ముట్టడించిరి. దీనియందు వారు జయము గాంచలేక పోయిరి. ముజఫర్ జంగ్ పినతండ్రియగు నాజర్ జంగ్ వీరిరువురను పలాయనుల గావించెను. ముజఫర్ జంగ్ తన పినతండ్రికి లొంగిపోయి తిరిగి చెరసాలలో నుంచబడెను. నాజర్ జంగ్ తక్షణమే దక్కనుకు సుబేదారుగ ప్రకటించుకొనెను; చందాసాహెబ్ ను పదభ్రష్టుని గావించి తత్ స్థానమున అన్వరుద్దీను కొడుకగు మహమ్మదాలీని కర్ణాటక నవాబుచేసెను. కాని డూప్లే యెట్లో రహస్యముగ కుట్రపన్ని నాజర్ జంగ్ ను చంపించి, తిరిగి ముజఫర్ జంగ్ ను డక్కనుకు సుబేదారునిగ జేసెను.

కాని, తిరుచునాపల్లి యింకను మహమ్మదాలీ చేతిలోనే యుండెను. ఈతనికి యింగ్లీషువారు మద్దతుగనుండిరి. డూప్లే కొంత పరాసు బలముతో తిరుచునాపల్లిని ముట్టడించెను. కాని, "లారెన్సు" అను ఆంగ్ల సేనాని యీ పట్టణము కాపాడి ఫ్రెంచివారి యత్నము సాగకుండ చేసెను. తిరుచునాపల్లి కొండమీదనే డూప్లే యాశలన్నియు పక్కన బద్దలై పోయిన ట్లెంచవచ్చును. దైవమాతనికి ప్రతికూలముగ నుండెను. తిరుచునాపల్లిని ముట్టడించుటకై డూప్లే శక్తివంచనలేక మిక్కిలి పాటుపడెను. గోరుచుట్టుమీద రోకంటి పోటన్నట్లు యూరపునుండి తన సహాయార్థమై వచ్చుచున్న 700 మంది ఫ్రెంచి సైనికులు ఓడ బ్రద్దలౌటచే సముద్రములో మునిగిపోయిరి. ఇండియాలో డూప్లేయున్నన్నాళ్లు తమ కిరువురకు శాంతియుండదని, ఆంగ్ల ఫ్రెంచి దేశములవా రిరువురును గ్రహించిరి. ఇండియాలో డూప్లే పన్నుచున్నపన్నాగములన్నియు ఫ్రెంచి మంత్రులకు స్పష్టముగ తెలియును; ఏలననగ,

యిండియాను ఫ్రెంచివారి యధికారము క్రిందికి తెచ్చుటకై తానెట్లు పాటుబడు చున్నది డూప్లేయే ఆ మంత్రులకు తెలియపరచెను. డూప్లే తంత్రము విషమ తంత్రమని వా రభిప్రాయపడిరి. కాబట్టి, తక్షణమే యింటికి (ఫ్రాన్సుకు)వచ్చి వేయ వలసినదని వారు డూప్లేను 1754 సం॥ లో నాజ్ఞాపించిరి. డూప్లే తన మానసవీథి యందు నిర్మించుకొనుచున్న ఫరాసు మహాసామ్రాజ్య వైభవమంతయు ఒక్క పెట్టున గాలిలో కరిగిపోయెను. ఈతనికి పరాభవమయ్యెను; అవసాన కాలమందు నిరుపేదగ చనిపోయెను.

డూప్లే యింటికి వచ్చివేసిన తరువాత, భరతఖండపురాజుల అంతఃకల్లోల ములలో తామెట్టి జోక్యమును కలిగించుకొనరాదని ఫ్రెంచివారు దృఢముగ నిశ్చ యించుకొనిరి. డూప్లేస్థానమున ఫ్రెంచిమంత్రులు "గోడ్ హెన్" అను నతనిని యిండియాకు పంపించిరి. ఈతడు మదరాసు యింగ్లీషు గవర్నరగు "సాండర్సు" తో సఖ్య మేర్పరచుకొనెను. "దేశీయరాజుల పోరాటములలో మనమిక యెన్న డును జోక్యము కలిగించుకోరాదని" యిరువురును షరతు నేర్పరచుకొనిరి. ఈ షరతును ఫరాసువారు అక్షరాలా నెరవేర్చిరి. కాని, యింగ్లీషువారు మాత్రము మాటిమాటికి భగ్నపరచుచుండిరి. 1769 సం॥ లో ఫ్రెంచికంపెనీ అంతమొందెను. పుదుచ్చేరి, చంద్రనగరములు మాత్రము వారికి యిండియాలో మిగిలెను.



## 9. ఫరాసు లెందుకు జయము గాంచలేదు ?

ఫ్రెంచివారు పరభూములలో తమ వలసల నేర్పరచుటలో నెక్కువ విజయ మును గాంచలేదు. దీనికి బహుశః ఒక కారణముండవచ్చును. మొత్తము మీద ఫ్రెంచివారు నిజాయితీ బుద్ధికలవారు. ఎంతో ద్రోహము, మోసముచేసినగాని, యిట్టి వలసల నేర్పరచుకొనుటకు వీలులేదు. ఫ్రెంచివారి కిట్టిమోసము, ద్రోహము చేయుట తెలియదు. అందుచే వారీపనియందు నెగ్గలేకపోయిరి! అయినను ఫ్రెంచి వారు ఆఫ్రికాఖండములో "అల్జీర్సు" అను ప్రాంతమున ఒకవలసను సంపాదించిరి. అయితే యిక్కడ వీరు ఆ దేశప్రజలతో మిక్కిలి సఖ్యముగ నున్నారు. ఆప్రజ లును వీరియెడ ప్రీతితోనున్నారు. ఆ ప్రజలు అరబ్బులు. ఈయరబ్బులు క్రమముగ ఫ్రెంచివారై పోవుచున్నారు. ఇంకొక్కతరములో వారు తమ స్వభాషను వదలి వేసి ఫ్రెంచిభాషనే వాడగలరు. ఇందు ఆశ్చర్యమేమియులేదు. ఏలననగ, "ఫ్రెంచి వారికి పరులయెడ గాఢమగు సానుభూతిగలదు. దీనినుండియే ఫ్రెంచిజాతిలోగల ప్రధానమగు సుగుణములన్నియు నుద్భవించినవి. వారి మనోహర మానసిక లక్షణములకు, వారి సాంఘిక సాంప్రదాయములకు, యూరపుఖండములో వారికి గల ఎదురులేని పలుకుబడికి-వీనికన్నిటికికూడ వారియందుగల పరసహానుభూతియే

మూలకారణము. ప్రపంచములో నేదేశములోనైనను, యేప్రజలైనను స్వాతంత్ర్య సంపాదనకై పెనగులాడుచున్నారని విన్నప్పుడు అట్టివారియెడ ఫ్రెంచివారికి విస్పష్ట మగు సహానుభూతి దానియంతటది స్వభావసిద్ధముగ పుట్టుకొనివచ్చును. ఇట్టి నిష్కళంకమగు, సహజప్రేరితమగు సహానుభూతిని జూపగలజాతి మరి యింకొక్కటి యేదిలేదు. పరజాతుల మనోభావములను అంతవిశాలముగను, అంత సమగ్రముగను ప్రదర్శింప సమర్థమైన వాఙ్మయము—వానిని అంత నేర్పుతో నుద్ఘాటించగల వాఙ్మయము - ఫ్రెంచివాఙ్మయముతప్ప యింకొకటిలేదు. బాధపడుచున్న జాతికి చేయూత నొసంగుటకై అనాసక్తభావముతో యుద్ధమాచరింపవలసినప్పుడు అట్టి యుద్ధమును అంత మనస్ఫూర్తిగ ఆమోదించువారు ఫ్రెంచివారుతప్ప మరి యితరు లెవరుగాని కన్పట్టుట దుర్లభము.'' (''లెకీ'') యను నతడు వ్రాసిన గ్రంథము నుండి.

ఫ్రెంచి దేశమునుగూర్చి ఫ్రెంచి దేశభక్తుడగు ''విక్టర్ హ్యూగో''. తన మానసిక వీథియందీ దృశ్యమును గాంచెను:—

''ఇరువదవ శతాబ్దిలో ఒకానొక మహాద్భుతజాతి యుదయించును. ఈ జాతి మహోన్నతమైనదగును. ఆజాతి యిప్పుడింకను లేదు. ఈ జాతికి ''ప్యారిస్'' ప్రధాననగరమగును. కాని, దాని ప్రధాననగర మిప్పుడుండనే ఉన్నది. నూతనభావముల వెదజల్లుటయే ప్యారిస్ నగరముపని. దానికొక్కటే యెడ తెగని ధర్మమున్నది. అదేదనగ - సత్యమును లోకమునందంతట వెదజల్లుట. ఈ ధర్మమును అది అవిచ్ఛిన్నముగ నిరంతరము నెరవేర్చుచున్నది. ప్యారిస్ కర్షకుడు (విత్తువాడు). ఈతడు చీకటి యనుక్షేత్రములో వెలుతురను విత్తనములను చల్లుచువెళ్లును. విశ్వవికాసమను వీతిహోత్రుని యెడ తెరిపిలేకుండ ప్రజ్వలింప చేయుచుండునది ప్యారిస్. ...మీరు ప్రపంచమంతా వెదకండి. గాలికి బాగుగ బూరటిల్లి, దృశ్యాదృశ్యముగనుండు మానవవికాసమను తెరచాపల స్పందములు, రెపరెపలు, మీ కెప్పుడును ప్యారిస్ నొకోపరిభాగమున తప్ప మరియింకెచ్చటను వినరావు.''

పై వాక్యములు విక్టర్ హ్యూగోవంటి యొకానొక దేశభక్తుని యున్మాద ప్రలాపములు కావచ్చును. కాని, యిప్పుడు ఇండియాలో యింగ్లీషువారు ఆక్రమించియున్న స్థానమును, ఫ్రెంచివారే యాక్రమించియుండినచో యిండియా నేడెట్టి స్థితిలోనుండెడిదో సులభముగా ఊహింపవచ్చును. ఆనాడు ఫ్రెంచివారే యింగ్లీషువారిని తరిమివేసి యుండిన యెడల, ఈ పాటికి యిండియా యావత్తు ఫ్రెంచి దేశమైపోయెడిది.

గత శతాబ్దమధ్యమందు ఉత్తరహిందూస్థానమందంతటను పర్యటన మొనర్చిన బిషప్ హెబ్బర్ అనునతడు ఇండియాలో ఫ్రెంచివారి పలుకుబడినిగూర్చి యిట్లు వ్రాసెను:—

"ఉత్తరహిందూస్థానములో ఫ్రెంచివారి యధికారము చాలరోజులు ప్రబలి యుండెనుగద. అయితే, వారి పేరున కిప్పుడీ ప్రాంతములలో యేమాత్రము గౌరవ మున్నదో చూతమని నాకు కుతూహలము కలిగెను. ఫ్రెంచివారు అశాపరులనియు, ప్రజలను పీడించువారనియు చాలమంది యనుకొనుచుండిరట. కాని, యింగ్లీషు దొరలకంటె యెక్కువ సానుభూతియు, ప్రజారంజకమును గలవారని మాత్రము చెప్పిరి. చాలమంది ఫ్రెంచివారు హిందూదేశస్థుల దుస్తులను ధరించుచుండిరి. వారి యాచారముల నవలంబించుచుండిరి. ఇంగ్లీషువారివలె పరులయెడ అసహనము, ఒంటరితనములేదు. ఇంగ్లీషువారు ఎక్కడికి వెళ్లినను అక్కడి ప్రజలతో కలసిమెలసి యుండక వెలిగ నుందురు. ఇతరులతో కలియుడమంటె వారికి అసహ్యము, చిన్నతనముగ చూచుకొందురు. తాము ప్రత్యేకమొక అగ్రకులస్థులమను అహంభావముతో తక్కిన వారిని చిన్నచూపు చూతురు. అసహ్యించుకొందురు. అందువల్ల, వీరువెళ్లినచోట్లనెల్ల ప్రజలును వీరిని అసహ్యించుకొనుచుండిరి. ఈ అవివేకపు జాతీయ దురహంకారమునకు నేను నిత్యము అనేక నిదర్శనముల జూచుచున్నాను. ఇది మనకు చాలనష్టమని గట్టిగ నాకుతోచుచున్నది. నిజమే, మనము ఎవరికి అన్యాయముచేయము; ఎవరిని బుద్ధిపూర్వకముగ పీడించము. కాని దేశీయులను మనదగ్గరకు రాకుండ ఎడముగ నుంచుదుము. మనము వారితో మాట్లాడినప్పుడు పొగరుబోతు తనముగను, అగౌరవముగను, మాట్లాడుదుము." [హెబ్బర్ వ్రాసిన ఇండియా జర్నల్ నుండి]



## 10. ఫ్రెంచివారే జయించివుంటే?

దీనిని బట్టి ఫ్రెంచివారే జయించియుండినచో వారీపాటికి భరతఖండస్థులను ఫ్రెంచివారిగ మార్చివేసెడి వారని యూహించుట కవకాశమున్నది.

ఇంతవరకు వివరించిన చరిత్రనుబట్టి, యిండియాకువచ్చిన క్రైస్తవజాతి యింగ్లీషు వారొక్కరే కాదని తెలిసినది. వీరితోపాటు, బుడతకీచులు, ఒలందాలు డేనులు, పరాసులుకూడ యిండియాకు వచ్చియుండిరి. అయితే వీరందరుండగ, తుదకు ఒక్కయింగ్లీషువారు మాత్రమే మిగులుటకు కారణమేమి? వారొక్కరే యిక్కడ రాజ్యమేర్పరుచు కొనగలుగుటకు కారణమేమి? "ఎవడు సమర్థుడో వాడే మిగులువాడు" ("Survival of the fittest") అన్నసామెత కిదియొక నిదర్శనము. ఇంగ్లీషువారే యెండ కాగొడుగుపట్టిరి; అందుచేతవారు మిగిలిరి. తక్కిన వారు మన్నుగొట్టుక పోయిరి. బుడుతకీచులు కొంచెమించుమించుగ మతపిచ్చగల వారు; తమకిరస్తానీ మతమును యితరులపై బలవంతముగ వేసి రుద్దవలెననిచూచిరి; పరమతస్థులను యంత్రములలో వేసిచంపుట వారిదేశములో ఆచారము. ఆయా

చారమునే వీరు గోవాలో సాగింపమొదలిడిరి. ఇట్టి ఘోరములవల్ల వారు తమ చుట్టునున్న ప్రజల సానుభూతిని గోల్పోయిరి.

ఫ్రెంచివారన్ననో యిండియాను జయించుటకు ఉపాయమును కనిపెట్టినను, వారు పాపభీతి గలవారగుటచే అట్టి దురాగతముల జేయుటకు - పాపము - సాహసింపలేక పోయిరి. అదిగాక, హిందువులలోగల కులకట్టుబాటులు వారికి నచ్చలేదు. వానియెడ వారు అసహనమును గట్టిగజూపిరి. అందువల్ల, తమ యత్నములలో వారు దేశప్రజల సహానుభూతిని సంపాదించలేకపోయిరి.

ఒలందాలు, డేనులు మున్నగువారును అట్లే రాజ్యస్థాపన విషయములో జయముగాంచలేక పోయిరి.

ఇంగ్లీషువారికథ మాత్రము వేరుగనున్నది. వీరికి ఉన్నంత కుట్రబుద్ధి, కుటిలస్వభావము, యూరోపియనులలో యే జాతికిని లేదు. 1821-వ సం॥ మే నెల తాలూకు "ఏషియాటిక్ జర్నల్" అను పత్రికలో "కర్నాటికస్" అనుమారు పేరుతో ఒక బ్రిటిష్ ఉద్యోగస్థుడు యిట్లు వ్రాసెను.

"ఇండియాను జయించుటకై పోరాడిన ప్రతిపోరాటములోను, మనము మనస్వసామర్థ్యము వల్లగాక, భారతప్రజల స్వభావములోగల దౌర్బల్యమువల్లనే గెల్చినాము. మనవర్తకమును రక్షించుకొనుటకో, లేక యితరు లెవరైనా మనపై పడినప్పుడు వారిని తరిమివేయుటకో, మనము తంటాలుపడుచుండగ ఒక రాజ్యము తరువాత ఒక రాజ్యము విరుచుకొనివచ్చి (వద్దన్నకొద్దీ) మనపాలబడెను. మనకోసము - గారడీవాడు చేసినట్లుగ - సింహాసనములు ఖాళీయగుచుండెను. ఈరాజ్యములన్నియు ఎంతగారడీగ - ఎంతసులభముగ - మనచేతిలోవచ్చి పడ్డవో, తిరిగి అంతగారడీగానే మాయమైపోతవని మాత్రము మనము నిశ్చయముగ నమ్మవలెను. భారత ప్రజలలో నిరువదియవవంతు జనముగనుక ఎప్పుడైతే మనయంత కుట్రబుద్ధి గలవారై, మనంతమెళకువ గలవారగుదురో అప్పుడు మనములోగడఎంత త్వరగపైకి వచ్చినామో తిరిగియంతటి పరుగుతోనే వెనుకకు పారిపోదుము. మనమిక్కడ కాలుపెట్టినప్పు డెట్టి అనామకత్వ స్థితిలోనుంటిమో, తిరిగి యంతటి అనామకత్వ స్థితిలోనికే దవుడు తీయుదుము."

అయితే, యింగ్లండు ఇండియాను ఎప్పుడు జయించలేదను సంగతిని యెల్లరు జ్ఞాపకముంచుకొనవలెను. ఇంగ్లండు ప్రజలెవరును, యిండియాను జయించుదుమని చెప్పి దండెత్తి రాలేదు. "సర్ జాన్ మాల్కామ్" అను నతడు ఇండియాయొక్క రాజకీయ చరిత్ర అను తన గ్రంథములో 2-వ పుటలో నిట్లువ్రాసెను.



## 11. ఇంగ్లీషువారు ఇండియానెట్లు జయించిరి? కారణముల వివరణ. తాంత్రికమా. భుజబలమా ?

"మనము మొట్టమొదట భుజబలమును చూపుచునే ఇండియాలో ఓడ దిగియుండిన యెడల, మనలను తప్పక భుజబలమే ఎదుర్కొనెడిది. కాని, మనము ఏమియు ఎరుగని అమాయికపు కోమట్లుగ వచ్చినాము. అందుచేత, ఆ కాలపు రాజులు మనకు సమస్త విధములగు ప్రోత్సాహములను ఒసంగిరి. మొట్టమొదట యిక్కడదిగిన మనవారు తమ సరకులను, గిడ్డంగులను, పరులబాధనుండి కాపాడు కొనుటలో చూపిన శక్తిసామర్థ్యములను బట్టి, మనవారు వర్తకములో నెంత నిపుణులో, యుద్ధవ్యవహారములలో గూడ అంత సమర్థులను పేరును సంపాదించు కొనిరి. ఈ సామర్థ్యమును చూచి అప్పుడు ఇండియాలో ప్రధానులుగనున్న రాజు లందరు మనయింగ్లీషు వారియెడ ఈర్ష్యవహించుటకు బదులుగ, మనవారిని మెచ్చు కొనుచుండిరి. కాలక్రమమున యీ రాజులు తమ ప్రతికక్షుల నెదుర్కొనుటకై మనసహాయమును కోరజొచ్చిరి!"

ఈ గ్రంథకర్తయే తన వారికిట్లని ఉపదేశించుచున్నాడు. దీనిని వారెన్నడును మరువరాదు :—

"మనమే యుపాయముల చేతనైతే పైకివచ్చినామో ఆ యుపాయములను మనమెన్నడైనా అధికార గర్వముచే మరచిపోయి, అమూల్యమగు మనపూర్వాను భవపు పంటనంతను గాలిలో నెగురగొట్టివేసి, మనకు స్వశక్తిగలదను భ్రమలో నతితొందరపాటుగ పడి, విర్రవీగి, ఏ జామీనుగోడల బలముచేనైతే యీ సామ్రాజ్య సౌధపుగోడలు ఇంతకాలమునుండి నిలిచియున్నవో అట్టి జామీను గోడల వంకచూడక అశ్రద్ధచేసినయెడల, మనరాజ్యమును మనమే చేతులార పడ గొట్టుకొన్నవార మగుదుము" (పై. గ్రంథము 7 పుట)

"విలియంహోవిట్" అను నతడు "ఇండియాలో ఇంగ్లీషువారు రాజ్యము లను సంపాదించిన విధము" అను తన గ్రంథములో నిట్లు వ్రాయుచున్నాడు :—

"హిందూదేశస్థులు మిక్కిలి బలసంపన్నులుగను, బహుళసంఖ్యాకులుగను నుండిరి. అందుచే యూరోపియనుజాతులు, దక్షిణఅమెరికాలో చేసినట్లుగ సరా సరి దేశ మధ్యమందు జొరబడి, మనుష్యులనందరిని–కంటికి కనబడ్డ వాళ్లనందరిని– కాల్చి చంపివేసియో, లేక వారిని తమ కాలిక్రింద శాశ్వతబానిసత్వములో పడ వేసి త్రొక్కి చంపివేసియో, చేయుటకు వీలులేక పోయెను. ఇంగ్లీషువారు కేవ లము దేశద్రిమ్మరులుగ యిండియాలోకిరాలేదు. మంచి పెద్దమనుష్యులగు వర్తకు లుగవచ్చిరి. ఇండియాలో మంచిమర్యాదగ, విరివిగ, శాశ్వతమైన వాణిజ్య మేర్ప రుచుకొనుటకువచ్చిన పెద్దమనుష్యులవలె కన్పట్టిరి. కాని, కాలక్రమేణ, క్రైస్తవ

మతధర్మములు, న్యాయసూత్రములు, మానుషధర్మములు మంటగలప వలసివచ్చి నప్పుడు వారు ఏదో రాజ్యతంత్ర మిషచేతనో, ఏదోచట్టము ("లా") పేరు చెప్పియో లోకముయొక్క కండ్లను గప్పివేయుచుండిరి."

ఇండియా కత్తితో జయించబడిన దేశమని యొప్పుకొన్నప్పటికి, యీవిజయ మును సమర్థించు యింగ్లీషువారు సైతము అరుదుగ గలరు. "యదార్థవాది" యను మారుపేరుతో ఒక్కఆంగ్లేయుడు "ఇండియాకు న్యాయము" అను శీర్షి కతో పామర్‌స్టన్ ప్రభువున కొక్క ఒకలేకలో వ్రాసెను:—

"దురాశ తన అక్రమములను కప్పిపుచ్చుటకై మామూలుగ చెప్పుకునే సాకులలో ఒకటికూడ మనము యిండియాలో గైకొన్న విజయములనుగూర్చి చెప్పుకొనుటకు లేదు. కారణమేమనగ:—మనకు యిండియా (ఆరువేలమైళ్లు) దూరములో నున్నది; ఆదేశమునకు మనకు పాతవైరము లేమియు లేవు; ఆదేశ మువల్ల మనకేదో అపాయం వస్తుందని చెప్పుకొనడానికి కూడలేదు; భూగోళ ములో అది ఒక వైపున నున్నది, మన మింకొక వైపున నున్నాము; మనకు దానికి మొట్టమొదటి సంబంధము కేవలము వర్తకరీత్యా గలిగినది. మనసరుకులు అమ్ము కోడానికి మనము మొట్టమొదటగ సముద్రాలుదాటి అక్కడికి వెళ్లినాము; అక్కడి రాజులు మిక్కిలి ప్రేమతో, ఆదరముతో, గౌరవించి యాతిథ్యమిచ్చి నారు. అయ్యో! పాపము - ఆ దేశపుగుట్టు మనకు దెలిసినది. ఇండియాదుర్బలమైన దని, కజ్జాకు కాలుద్రవ్వునది కాదని, ఐకమత్యవిహీనమైనదని మనము కను గొన్నాము. అందుచే, మనము దానిని జయించినాము. స్పెయిన్ దేశస్థులు (అమెరి కాలో) మెక్సికో, పెరూలను జయించినట్లే మనము ఇండియాను జయించినాము. అంతటి దురాశతోనే, అంతటి పరరాజ్యగ్రసన బుద్ధితోనే, అంతలేసి ద్రోహముల తోనే, దాదాపుగ అంతటి మానుషహీన క్రియలతోనే, మనము యిండియాను జయించినాము."

ఆ లేఖయందే ఆతడు మరియు నిట్లని వాదించుచున్నాడు. "ఇండియాలో మనరాజ్యము బలముచే నిర్మింపబడినది గాని, న్యాయముచే నిర్మింపబడినదికాదు. మనమక్కడ విజేతలుగ నున్నాము. పూర్వము కైమూరువున్నట్లే! మనమాదేశ మునకు న్యాయమైన, ధర్మబద్ధమైన యధిపతులము కాము. ఇండియాలో మన రాజ్యము ప్రత్యేకముగ అన్యాయమైనది, అసహజమైనది యని నేను వాదించి యున్నాను. కారణమేమనగ:—సాధారణముగ నితరపరరాజ్యములలో జరుగు చున్నట్లుగ, సర్వమును మాపివేయగల కాలశక్తికూడ మనపరిపాలనా కాఠిన్య మును మెత్తపరుపలేదు. పైపెచ్చు, పరరాజ్యమునకుండు కర్కశత్వచిహ్నములు తుది వరకు నిలిచియేయుండును. మనరాజ్యము యితర రాజ్యములకంటె మేలైనదని తోపించగల ప్రత్యేక సుగుణములేమియు మనపరిపాలనయందు గానరావు-మనము

దేశీయులయెడ చూపు ప్రవర్తనలో గానరావు. దేశప్రజలను సుఖపెట్టుటకు మనము ఇండియాను జయించలేదన్నమాట ముమ్మాటికి నిశ్చయము. ఇది నా వాదన'' పై లేఖలో 49, 50, 51 పేజీలనుండి)

ఇండియా జయింపబడలేదు. ఇంగ్లండు ఇండియాను ఎన్నడును జయించలేదు. ఇండియాను జయించడమను మాటయే యింగ్లీషువారికి అసహ్యముగ నుండెను. ఈ సంగతిని వారనేకసార్లు తమ పార్లమెంటు చట్టములలోనే వక్కాణించి యుండిరి. 1793 సం॥లోనే కంపెనీ పట్టాను తిరిగి యిచ్చునప్పుడు ఈ సంగతిని సంశయరహితముగ తెగగొట్టిచెప్పిరి. "దేశములను జయించి, రాజ్యములను కలుపుకొనుటయను మాటయే యింగ్లీషుజాతియొక్క కోర్కెకు, గౌరవమునకు, రాజ్యాంగ పద్ధతికి కేవలము విరుద్ధము.''

మహమ్మదీయులుచేసినట్లుగ యింగ్లిషువారు యిండియా నెన్నడును కత్తితో జయించలేదు. అయితే, (కత్తిచేగాక) వీరింక యేయే విధముల యీ భరతరాజ్యమును సంపాదించిరో వివరించుట యీ గ్రంథముపని. ఇంగ్లిషువారు తమ యాధిపత్యమును ఇండియాలో స్థాపించుటలోగల రహస్యమేమో యిట వివరింపవలసి యున్నది.

భారతీయుల అనైక్యత.

ఈ దేశస్థుల సహాయములేనిదే ఏ పరాయి [illegible] స్వజాతియు యిండియాను జయించుటకు కలలోకూడ నాశించజాలదను సంగతిని మొట్టమొదట కనిపెట్టిన వారు ఫ్రెంచివారు. పాశ్చాత్యదేశములలో దేనిని "దేశభక్తి" యను పేరుతో పిలుతురో అట్టి దేశభక్తియనునది యిండియాలో లేదను సంగతిని డూప్లే తన తెలివి తేటలచే గనిపెట్టెను. హిందూ దేశస్థులలో నైకమత్యములేదు – కాబట్టి, ఒకరి మీద నొకరిని ఉసుకొలుపుట అతనికి సులభముగ గన్పట్టెను. తెలివితేటలలో గాని భుజబలములోగాని వారికి కొరతలేదు. కాబట్టి, వారికి యూరోపియను యుద్ధపద్ధతులు నేర్పుటయు సులభముగనుండెను.

భారతీయుల అమాయికత్వములు మొదలైన సుగుణములే పరాయి వారికి చోటిచ్చెను.

హిందూదేశస్థులు నిరాడంబులు; తమ యజమానులయెడ భక్తివిశ్వాసములు గలవారు; నమ్మకమైనబంటులు; కాబట్టి, కుటిల తంత్రజ్ఞులగు యింగ్లీషు కోమటుల వలలలో వారు సులభముగపడిరి. ఇండియాలో యింగ్లీషువారి యాధిపత్యము నెలకొనుటకుగల కారణముల గూర్చి "కర్నల్ మాలెసన్'' అనునతడు "Decisive Battles of India" అను తన గ్రంథముయొక్క మొట్టమొదటి యధ్యాయములో నిట్లని చెప్పెను :—

"ఇండియాలో యింగ్లీషురాజ్యము పుట్టిపెరిగిన కథ మిక్కిలి చిత్రముగ నున్నది. దేశప్రజలలోగల యే గుణములచేతనైతే, యే లోపములచేతనైతే వారిని జయించుటకు సాధ్యమైనదో, అట్టి లోపములు యీ కథలో బయటపడును. వారు నమ్మకమైనవారు; స్వామిభక్తిపరాయణులు, యితరులయందుండు గొప్పగుణములను వారెంతో ఆప్యాయముగ మెచ్చుకొందురు; సుగుణముల నతిసులభముగ వారు గ్రహించి స్వీకరింతురు. ఈ సుగుణములే వారియందు మనకున్న బలము; యీ సుగుణములే వారికి దౌర్బల్యము. వారితో మనము పోరాడు రోజులలో వారికివి దౌర్బల్యము నాపాదించెను. వారిని జయించిన తరువాత మనకవి బలముగ నేర్పడినవి."

క్రైస్తవులమనియు, పవిత్రులమనియు పేరుపెట్టుకొన్న యింగ్లీషువారి పైపై మెరుగులకు, మోసపుమాటలకు అపవిత్రులనబడు ఇండియాప్రజలు సమ్మోహితులయిరి. హిందూస్థానములో నొక సామెతెగలదు. తళతళమెరయుచు పైకి గాన్పించుచున్న ఏనుగుదంతములు పైమెరుగు కోసమే వున్నవట - అసలు నమలివేయు దంతములు లోపల కనబడకుండ దాగియున్నవట! ఈ యింగ్లీషు కిరస్తానీ దేశద్రిమ్మరుల నిజస్వభావమును పాపము యిండియాప్రజలు మొట్టమొదట సకాలములో తెలిసికొనలేక పోయినారు. వీరు పెద్దమనుష్యులు కారనుమాట వారికి యెలిజబెత్తురాణియిచ్చిన పట్టాను బట్టియే స్పష్టముగ గన్పట్టుచున్నదన్న సంగతిని పాపము యిండియాప్రజలు తమ దురదృష్టవశముచేత మొదట తెలిసికొనలేకపోయినారు. లోకములో దేశద్రిమ్మరుల కెల్లరకు కుచ్ఛితప్రవర్తనయే కూడుగద! విల్లియమ్ హోవిట్టు యిట్లు వ్రాయుచున్నాడు:—

"దేశప్రజల హక్కులకు భంగముకలిగించకుండ తమ నౌకర్లను అదుపులో నుంచుటకై సీమలోనున్న కంపెనీ యధికారులు (డైరెక్టర్లు) యెట్లు తంటాలు పడినదియు ఋజువుపరుచుటకుగాను "ఆబర్" అను చరిత్రకారుడు సదరు డైరెక్టర్లు యిండియాకువ్రాసిన ఉత్తరములలోనుండి యనేకనిదర్శనముల నెత్తిచూపెను. ప్రజలనుపీడించి సొమ్ము లాగికొనవద్దనియు, పరరాష్ట్రములపై దండెత్తి వానినాక్రమింపవద్దనియు, సీమడైరెక్టర్లు యిండియాలోనున్న తమ నౌకర్లను మందలించుచుండిరి. ప్రజలసౌఖ్యమే తాము వాంఛించుచుంటిమని డైరక్టర్లు మాటిమాటికి ప్రకటించుచుండిరి. రాజ్యాక్రమణకాంక్ష తమకులేదని యనేకసార్లు ఒట్టుపెట్టుకొనుచుండిరి. "మేము కేవలము సరుకులమ్ముకొని బ్రతుకు వర్తకులము కాని, రాచకీయసంఘము కామని" వారు పలుసార్లు చాటిచెప్పుకొనిరి. అప్పుడప్పుడు పరరాజ్యాక్రమణతృష్ణను చూపుచువచ్చిన తమ నౌకర్లను చీవాట్లుపెట్టుచుండిరి. ప్రజలను పీడించి ధనమును లాగ యత్నించిన తమ నౌకర్లకాంక్షను నిరోధించుటకై యత్నించుచుండిరి. ఇది "ఆబర్" వ్రాసిన చరిత్రలోనికథ. ఈ

మాటలను బట్టి చూచినప్పుడు డైరక్టర్లు చాల పెద్దమనుష్యులుగ గన్పింతురు. వీరు న్యాయబుద్ధి, ధర్మబుద్ధి, నిగ్రహబుద్ధిగల మంచి మర్యాదస్తులవలె గన్పట్టుదురు. వారు చెప్పినమాటలు నిజముగ హృదయపూర్వకముగ జెప్పినవేయని యనుకొందము. అయితే నేమి? మానవస్వభావము మానవస్వభావమేగదా. అది యెక్కడికిపోవును? ఏ ధర్మసూత్రములనైతే, ఏ సత్సంకల్పములనైతే తామే స్వయముగ ప్రకటించి జారీచేసిరో, అట్టివానికే కేవలము విరోధముగ ప్రవర్తించి, తమ నౌకర్లు యిండియానుండి తమకు కావలసినంత ధనమును, కావలసినంత అధికారమును, కావలసినంత రాజ్యాధిపత్యగౌరవమును కొల్లలుగ తీసికొనివచ్చి తమ కాళ్ళమీద వద్దన్నకొద్దీ పడవేయుచున్నప్పుడు, అట్టివానిని ఎవరుకాదని తన్నివేయగలరు? అంతటి నిగ్రహశక్తి యెవరికుండును? అట్టి వ్యామోహములో పడకుండ ఏ మానవమాత్రుడు నిగ్రహించుకొనగలడు? ఒకరాజ్యముపై మరొకరాజ్యము చేయు ఘోర దురంతకృత్యములన్నియు రణనీతి, రాజనీతి యను మనోహరవాక్యములతో కప్పిపుచ్చబడుచున్నవి. సామాన్యమానవులు యిట్టి పైపై మెరుగులజూచి సంబరపడువారేగాని, దాని పొట్టవిచ్చి నిజముగ నందుండు అసహ్యమగు పురుగుల జూచువా రెవరు? ఈస్టిండియాకంపెనీవారు నిజముగ హిందూస్థానము నెట్లు సంపాదించిరో లోతుగదిగి కనుగొన్నవా డెవడు? నిజమాలోచించినచో అంతకంటె ఘోరమును, అంతకంటె అసహ్యమును, అంతకంటె క్రైస్తవ ధర్మవిరుద్ధమునునగు నుదంత మింకొకటి కలలోగూడ గానము. ఇది కుచ్ఛితములోనికెల్ల కుచ్ఛితము. దుస్తంత్రజ్ఞుడని లోకఖ్యాతిగాంచిన కౌటిల్యునికూడ మించిన కౌటిల్య మిందుగలదు. నీచాతి నీచమగు దౌరాత్మ్యమును పరమధర్మముగ చూపించుటలో దీనికిసాటి యెందునులేదు. ఇంత క్రూరత్వము, యింతటి తడిగుడ్డలతో గొంతుగోయుపద్ధతి, యింతటి నిష్కరుణత, యింతటి అహంకారము, యింతటి మదయుతాసుర భావము, లోకములో మరెచ్చటగానము. ఇట్టి దుర్గుణములన్నియు ఒకదానినిమించి యొకటి యున్నవి. భరతఖండములోని నానాప్రాంతముల రాజులను పదభ్రష్ఠులనుగావించి, వారిరాజ్యముల నన్నిటిని కంపెనీవారు తమ చేతులలో జిక్కించుకొన్న చరిత్ర యందీ యవలక్షణములన్నియు యొకదానినిమించి యొకటియున్నవి. బ్రిటిష్‌వారు తమ నిజాయితీబుద్ధిని, ధర్మబుద్ధినిగూర్చి యితరజాతులవారి యెదుట ప్రగల్భములు కొట్టుకొనుచున్నప్పుడు—“అయ్యో! మీరు యిండియాలో ఏమి చేసివచ్చారో ఒకసారి చూచుకోండి”—అని చూపిస్తే చాలదా? అప్పుడు యింగ్లీషువారు తమ తలను ఎక్కడదాచుకొనవలెను?...... దేశీయరాజులనుండి వారి రాజ్యముల నూడబెరుకుకొను సందర్భములో–అందు ముఖ్యముగ పవిత్రమగు ధర్మస్వామ్యముల పేరు చెప్పి, దేశకాలపాత్రముల పేరుచెప్పి, రాజ్యముల దిగమ్రింగుటలో–నొకశతాబ్దము పైకాలము యీ కంపెనీ వా రవలంబించిన విధానమెట్టిది? ఇది ఘోరమగు చిత్ర

వధా విధానముగాని వేరొండుగాదు. లోకములో నిదివరకు క్రూరుడగు ఏరాజు గాని, దురహంకారియగు ఏమత పీఠాధిపతిగాని కనుగొనియుండలేని క్రౌర్యమిందు గలదు. ఇంతటి యసురకృత్యమును లోక మెన్నడెరుగదు.''

అమాయికులగు హిందూదేశస్థులు మోసగింపబడినకథ యిట్లున్నది. ఈ మోసములోపడి వారు తమ స్వాతంత్ర్యమును, తమ యైహికసంపదలను, పరుల హస్తములలో ధారాదత్తమొనర్చుకొనిరి! తమ సర్వస్వమునకు తిలాంజలి యొసగ్గిరి. అందుకొరకే యిండియాలోని బ్రిటిష్‌రాజ్యస్థాపనను తెల్లచీమల (అనగ చెదపురుగుల) చర్యకు పోల్తురు.

''ఒకయోగ్గి యిండియాలోనున్న యూరోపియనులను తెల్లచీమలకు-అనగ చెదపురుగులకు-పోల్చెను. అవి యెక్కడనుంచి బయలుదేరుతవో యెవరికి తెలియదు. అవి నిశ్శబ్దముగ, ఎవరికి అలికిడితగులకుండ, పైకి ప్రాకివస్తవి. పచ్చని చెట్లనన్నిటిని నాశనముచేసివేస్తవి; చెట్ల మొదళ్లనుతొలిచి, ఆ తొర్రలలో మట్టి పుట్టలను కట్టుకొంటవి. ఇదివరకు అతివిశాలముగ కండపట్టియున్న చెట్లమొదళ్లు, కొమ్మలు, యావత్తు యిప్పుడు మట్టి పుట్టలై పోవును. కనపడ్డ ప్రతివస్తువుమీదికి ప్రాకి, ప్రతివస్తువును తినివేసి, ప్రతిదానిరసమునుపీల్చి, బెండుచేసివేయును; అంతయు బీడుచేసి, మట్టిగొట్టిపోవును. ఈ ఉపమానమునుచూచి మన యింగ్లీషువారమంత సంతోషపడవలసిన దేమియులేదు...ఇందు సత్యము లేకపోలేదు...నిజమాలోచించినచో, మనమిక్కడికివచ్చిన మొట్టమొదటిరోజులలో మనవారుచేసిన పనులను గూర్చితలచుకుంటే, మనము మనతలను తీసికొనివెళ్లి యెక్కడనో దాచుకొనవలెను. ఏమాత్రము నీతిగలవాడైనను వానిని తలంచుకొన్నప్పుడు సిగ్గుచే కృంగిపోవును. క్రైస్తవ మతధర్మమందు ఏమాత్ర మభిమానమున్నవాడైనను, వానిని తలచుకొన్నప్పుడు రోతపడకమానడు'' (కలకత్తా రివ్యూ వాల్యూమ్ 7—(1847) 226 పేజీ.)



## 12. ఒడంబడికల వాటంవారీగా త్రోసివేసే యింగ్లీషు రాజనీతి.

దేశీయరాజులతో ప్రమాణపూర్వకముగ చేసికొన్న యొడంబడికల నింగ్లీషువారు తమ కనుకూలమైనప్పుడు భగ్నపరచుచువచ్చిరి. వారి రాజ్యాధిపత్యమిచ్చట నెలకొనుటకుగల కారణములలో నిది ప్రధానమైనకారణము. విల్లియం హోవిట్ యిట్లు వ్రాయుచున్నాడు :—

''ఇంగ్లీషువారితోడిస్నేహము ఒక ఎర. ఈ యెరలోపడిన దేశీయరాజులకా స్నేహము మృత్యుముఖగహ్వరమయ్యెను. ఈ స్నేహము ప్రతి దేశీయరాజును తన సింహాసనమునుండి క్రిందికి పడద్రోసినది. లేదా, సింహాసనముమీద తుచ్ఛమగు

పిండిబొమ్మగ గూర్చుండనిచ్చినది. ఈ పిండిబొమ్మద్వారా యింగ్లీషువారి నిరంకుశాధికారము తన పనిని నేరవేర్చుకొనుచున్నది. స్నేహమైనను, విరోధమైనను తుదకు రెండును ఫలితములో నొక్కటిగానే పరిణమించెను. మీదికి కవ్వించివచ్చుచున్న యింగ్లీషువారితో స్నేహముచేసికోడానికి యిష్టపడడా, వెంటనే యారాజునకేదో దురుద్దేశమును అంటగట్టి, వానిమీదపడి, వానిని జయించేవారు! స్నేహము చేసికోడానికి యిష్టపడతాడా, వెంటనే కుటిలతంత్రములనబడు నురిత్రాళ్లను వాని చుట్టు నల్లుచుండిరి. ఈ యురిత్రాళ్లనుండి యారాజు జన్మములో తప్పించుకోలేడు. తుదకు వాని వంశగౌరవమును, పితృపైతామహమగురాజ్యమును, సర్వస్వము పోవును. ఒకప్పుడు రాజుగనున్నచోట ఇప్పుడు ఖైదీగనుండుటతప్ప అతనికింకనేమియు మిగులదు.''

విల్లియం హోవిట్ మరల నిట్లు చెప్పుచున్నాడు :—

"రాజుల రాజ్యములన్నిటిని వారినుండి వడివేసి లాగుకొన్న పీడావిధానమెట్టిది? అది యిది :—ఒకనియాస్తిని దిగమ్రింగుదామనుకొన్నవాడు సాధారణముగచేసే పద్ధతియేమి? ముందుగ వానికి అప్పుపెట్టడం. వాడు చెల్లించలేని షరతులుపెట్టి, వాడు చిక్కులలోనున్న తరుణము కనిపెట్టి, "తే, నాసొమ్ము నాకు తే"యని కంఠముమీద కూర్చోడం. (ఇది యింగ్లీషు రాజు లవలంబించిన పద్ధతి) మరియు, రాజులను "చీలదీసి పాలించవచ్చు" నను ధైర్యము కొంచెము యింగ్లీషువారికి కలిగినదిమొదలు వారు నెమ్మదిగ నీ కపటోపాయము నవలంబించిరి. నెమ్మదిగ తడిగుడ్డలతో గొంతుకోయు యీ కుటిలపద్ధతినే వారు అవలంబించిరి గాని, మొగసిరిగ 'మేము మీరాజ్యాలను భుజబలముచే జయించదలచుకున్నామ'ని చెప్పలేదు. రాజ్యములు వీరభోజ్యములను సనాతనధర్మమును వారు ప్రకటించలేదు. ఈ మాటచెపితే తమపని యసలు సాగదని వారు గుర్తించిరి.''

అప్పులవల.



## 13. ఒడంబడికల ఉల్లంఘించేహక్కు ఒక్క యింగ్లీషువారికే!

సింధురాష్ట్ర జయమునుగూర్చి సర్ జాన్ కే యను నతడు "కలకత్తా రివ్యూలో'' నిట్లు వ్రాసెను:—

''సింధుఅమీరులు ఒడంబడికలను ఉల్లంఘించిరని మనవా రనుచున్నారు. ఒడంబడికల నుల్లంఘించే మిరాశీహక్కు ప్రత్యేకముగ మన యింగ్లీషువారికితప్ప నింకెవరికి లేనట్లు! ఒడంబడికలను ఉల్లంఘించడమే రాజ్యాలుపోవడానికి కారణమయ్యేటట్లయితే, సింధు బ్రహ్మపుత్రానదులమధ్య మనకిప్పుడు ఒకగజము స్థలము కూడ నుండకూడదు.''

ఇండియాలో సిపాయిల తిరుగుబాటు కలగడానికి కారణములను "కర్నల్ మాల్‌సన్" అను నతడు చక్కగ రెండు ముక్కలలో చెప్పినాడు. "నమ్మిన వాళ్లను చెరచడం"—అదేకారణము. దేశప్రజలతో, రాజులతో, ప్రమాణపూర్తిగ చేసికొన్న యొడంబడిక బుద్ధిపూర్వకముగ నుల్లంఘించడము నమ్మినవానిని చెరచడంకాదా? ఈసమ్మకద్రోహమే-యీ విశ్వాసఘాతుకమే - శిపాయిల కలహమునకు కారణమై, ద్రిమ్మరీంద్రసంఘమును (యీస్టిండియా కంపెనీని) ఎత్తివేయించినది.

యూరోపియన్ నౌకర్ల స్వామిద్రోహం.

అర్హమైన యూరోపియనుజాతివాళ్లను తమ కొలువులో చేర్చుకొని యనేకమందిరాజులు తమ ప్రాణముమీదికి తెచ్చుకొనిరి. ఈ జాతివాళ్లు తిన్నయింటి వాసములు లెక్కపెట్టిరి. రాజుల గుట్టుమట్టులను కనిపెట్టి, వారి ప్రాణముమీది కెప్పుడు తెత్తుమాయని కనిపెట్టి చూచుచుండిరి. తమ యజమానులగు రాజులు సంకటములలో జిక్కుకొన్నప్పుడు యీ జాతివాళ్లు లోలోపల సంబరపడుచు చూచుచుండిరేగాని, వారిని రక్షించుటకు కించిత్తయినను పూనుకొన్నపాపమున పోరైరి! యూరపుఖండములో ననేకమందిరాజులు తమ కొలువులో పరదేశస్తులను చేర్చుకొని, వారివల్ల ననేకసౌకర్యములను పొందినసంగతి వాస్తవమే. ఇందుకు నిదర్శనముగ, బొంబాయిలో ప్రఖ్యాత పత్రికాధిపతిగనుండిన గ్రాంట్ గ్రియరి యను నాతడిట్లు వ్రాసెను:—

"స్విస్, స్కాటిష్, జర్మన్ దేశస్తుల సహాయముతో, వారి సలహాతో ఘనత వహించిన పీటర్ చక్రవర్తి రష్యాదేశమును వృద్ధిలోనికి తెచ్చిన సంగతి యెల్లరెరుంగుదురు. ప్రష్యారాజ్యములో ఆర్థికవిధానమును చక్కబరచుటకై ఘనతవహించిన ఫ్రెడరిక్ చక్రవర్తి ఫ్రెంచి ఆర్థికవేత్తలను తన కొలువులోనికి తీసికొనెను." [యాత్రలు - Travels - వాల్యూం I. పేజీ 250]

కాని, యిండియాలో కథ వేరుగనుండెను. ఇంతటి పాప మే దేశములోను యెరుగము. దేశీయరాజుల కొలువులలోచేరిన తెల్లవారు తిన్నయింటివాసముల లెక్కపెట్టిరేగాని, యారాజులను బాగుచేయలేదు. తమకు వాటమనితోచినప్పుడు, తమ్మును పోషింపుచున్నరాజులకు ద్రోహమొనర్చుటకు వారు కించత్తయినను జంకరైరి!

ఇంగ్లీషు రెసిడెంటుల నెలకొల్పు దుష్టపద్ధతి—రాజవంశాలలో గృహకల్లోలాలు పెంచడానికే!

దేశీయరాజుల దర్బారులో యింగ్లీషు రెసిడెంటులను నెలకొల్పుట యనునది కూడ వారి రాజ్యములు కూలి, యింగ్లీషురాజ్యము స్థాపనయగుట కొక కారణముగనున్నది. దీని ప్రాముఖ్యతనుగూర్చి యిదివరలో యిండియాచరిత్ర వ్రాసిన వారెవరును అంతగ నొక్కిచెప్పియుండ లేదు.

ఈ రెసిడెంటులను రాజుల దర్బారులలోనికి పంపుటలో ప్రధాన అంతరంగికోద్దేశ మొకటికలదు. అదేదనగ:—"రాజవంశములలో అంతఃకల్లోలముల గల్పించుట." తన మహారాష్ట్రులచరిత్రలో "కెప్టన్ గ్రాంటు-డఫ్" యిట్లు వ్రాసెను:—

"బొంబాయి గవర్నమెంటువారు "మోస్టిన్" అను నతనిని పునహాలో నున్న పీష్వాదర్బారులోనికి రెసిడెంటుగ నంపిరి...ఎందుకు? గృహకల్లోలముల రేపెట్టియో, మరియితర ఉపాయములచేతనో, మహారాష్ట్రులు హైదరాలీతో గాని, నైజామాలీతోగాని చేరకుండ, చేతనైనన్నిరీతుల ప్రయత్నించడానికి." మహారాష్ట్రుల చరిత్ర పేజీ 340. టైమ్సు ఆఫ్ యిండియా ప్రచురణము, బొంబాయి 1873)

ఈ పైవాక్యములనుగూర్చి వేరుగ వ్యాఖ్యాన మవసరములేదు.

దేశీయరాజుల దర్బారులలో రెసిడెంట్లు నడుచుకొను నడతనుగురించి చెప్పుచు వెనుక గవర్నర్ జనరల్ గనుండిన హేస్టింగ్స్ తన ప్రయివేటుపుస్తకములో నిట్లని వ్రాసికొని యున్నాడు :—

"రాజుల కొలువులో రాయబారిగ నుండుటకు బదులుగ యీ రెసిడెంటు అచ్చట సర్వాంసహాధికారిగ—సర్వనియంతగ—ప్రవర్తించుచున్నాడు. అన్ని ప్రయివేటు విషయములలోను జోక్యముకలిగించు కొనుచున్నాడు. పొగరుబోతుగ తిరుగు ప్రజలను రాజుమీదికి ఉసుకొలుపుచున్నాడు. తన యధికారమును మహాగర్వముతో ప్రచురించుకొనుచున్నాడు. అతడేదో సాపేక్షమగు విషయము నెత్తుకొని, దానికేదో రంగుపూసి పైకి రిపోర్టుపంపును. దానిని మనయింగ్లీషు గవర్నమెంటువారు యెంతో ఆప్యాయముగ చర్చించి, ఆతనితో సంపూర్ణముగ నేకీభవింతురు. ఈ యొక్క విషయమును గురించియే గాక ఆతని నడవడికను యావత్తు సంపూర్ణముగ ఆమోదింతురు."

"బ్రిటిష్ రాజ్య విధానమును గూర్చిన కొన్ని నిదర్శనములు" అను పేరుతో యం. డి. కవనగా యను బారిష్టరు 1884 సం॥లో నొకగ్రంథమును ప్రచురించెను. ఈ గ్రంథ పీఠిక మూడవపుటలో ఆయన యిట్లు వ్రాసెను :—

"ఈస్టిండియాకంపెనీవారు దేశీయరాజులతో నొడంబడికలు చేసికొన్నప్పుడు వానిలో నొకషరత్తు విధించుచుండిరి. ఏమని? ఫ్రెంచివారుగాని, అమెరికావారుగాని, మరియే యితర యూరోపియన్ జాతివారుగాని, సదరురాజుల రాజ్యములో వర్తకము చేసికోకూడదు. అదిగాక, వారిక్కడ కాపురముకూడ నుండగూడదు...ఇంతటి యసాధారణమైన, యింతటి స్వార్థపూరితమైన, యేర్పాట్లు లోకములో నేజాతుల మధ్యగాని జరిగియుండలేదు. అంతర్జాతీయ ధర్మములకిది కేవలము విరుద్ధము. ఇట్టి దిక్కుమాలినషరతులను దేశీయరాజులపై కంపెనీ వారు

విధించుచుండిరి. ఇట్టి యేర్పాట్లవల్ల బ్రిటిష్ రెసిడెంట్లు దేశీయరాజుల దర్బారులలో దూరి, నుసిపురుగులవలె లోనికి తొలుచుకొనిపోయి, వారిగుట్టుమట్టుల తెలిసికొని, గృహచ్ఛిద్రముల గల్పించుటకు వారికి మిక్కిలి వాటముగనుండెను. ఇంతేగాక, దేశములో పలుకుబడిగలిగిన ప్రముఖుల నెవరిని దరికిరాకుండ చేయుటకును, యీ సందులో యేదో అల్పమగు సాకులజెప్పి రాజుల నోళ్లుమూసి, వారినిబలాత్కరించి, నొక్కుటకును, వేయేల వారిని రాజమందిరములలోనే ఖైదీలుగజేసి పడవేసి యుంచుటకును మహావాటముగనుండెను. మరియు, దేశీయులలో దుర్మార్గులు కొందరును, బ్రిటిష్ రెసిడెంటులును చేరి యీ రాజులయెడ కుట్రలుపన్నుటకును, ద్రోహకార్యముల నొనర్చుటకును, పరస్పరము అపనమ్మకముల పుట్టించుటకును, అభూతకల్పనల జేయుటకును, అసత్యముల ప్రకటించుటకును, వేయేల రాజ్యము నంతను నానాక్షోభ పెట్టుటకును యీ రెసిడెంట్ల నెలకొల్పు పద్ధతి మహావాటముగ నుండెను. ఇట్టి దుష్కృత్యములలో జేరని రెసిడెంట్లు అరుదు.''

ఇందు కనేక నిదర్శనములు డాక్టరు కవనగారు చూపియుండిరి.

''చాలమంది రెసిడెంట్లు తుచ్ఛమగుతలంపులతో రాజుల ఆంతరంగికకృత్యములలో-వినోదములలో-కూడ తొంగిచూచునంతటి నైచ్యమునకు పాల్పడుచుండిరి. అయోధ్యరాష్ట్రపు గవర్నమెంటురికార్డులలో నెంతటి తుచ్ఛమగు చెత్తయున్నదో చూడుడు :—మే నెల 17-వ తేదీ. ఈ ఉదయం రాజు తన కొజ్జాలకును, దర్బారీలకును దర్శనమిచ్చెను; పావురములతో నాడుకొనెను. మార్చి 30 :—నిన్న సాయంకాలము రాజు బోగమువాళ్లయాటచూచుచు కాలముపుచ్చెను. మే నెల 11-వ తేది. నిన్న సాయంకాలము రాజు బాణసంచా కాల్పించుకొనుచు వినోదించెను. ''మొసహి బలి'' యను ఫిడేలుగానికిని, ఒక ఆఫ్రికన్ స్త్రీకిని నీ యుదయము రాజు శాలువలను, జేబు రుమాళ్లను బహుమతిచేసెను. మే 23. రాజుగారికి పిల్లులను పట్టుటకుగాను యీ రోజున ఆరుగురను నియమించిరి.'' ఇట్టివే యంతులేనిచెత్త యెంతయో నుండెను.

సతారా రాజాస్థానములో బ్రిటిష్ రెసిడెంటు చేసిన చేష్టలనుగూర్చి ''ఇండియాకు బ్రిటిష్ మిత్రుడు'' (British Friend of India Magazine) అను పత్రిక 1843 సం॥లో నిట్లు వ్రాసెను.

''మేజర్ ఓవన్సు (రెసిడెంట్) సాక్షులకు లంచమిచ్చి వారిని కొనివేసెనను సంగతి స్పష్టముగ రికార్డయియున్నది...ఆతడట్లు చేసియుండనిచో, కంపెనీవారు ఏపని నిమిత్తమై తన నక్కడకు పంపించిరో, అట్టిపనిని—అట్టివిధిని—తాను తప్పిపోయినవాడయి యుండును. కంపెనీవారు బంగాళారాజ్యము నెట్లు సంపాదించిరి ?

* ఫోర్జరీవల్లను, పర్జరీవల్లనుకాదా? ఇట్లే ఆర్కాటురాజ్యముగాని, వేయేల మరి యేరాజ్యముగాని యిట్టి ఫోర్జరీలవల్లను, పర్జరీలవల్లను గాకపోతే వీరికి దక్కెడివా?"

పై పేరాలో నడుమున గీతగీచిన వాక్యములకు వేరుగ వ్యాఖ్యానముచేయ బనిలేదు.

## 14. అద్దెసేనల పద్ధతి.

(Subsidiary alliances) "సైన్యసహాయపు టొడంబడికలు" లేక "అద్దె సేనల పద్ధతి" కూడ దేశీయరాజుల స్వతంత్రపు బ్రతుకును తుడిచివేయుటకే పన్నబడినది. ఇందునుగూర్చి తగిన అభిప్రాయమివ్వగల బ్రిటిష్ యుద్యోగులే 1832 సం॥ లో పార్లమెంటు కమిటీముందు ఈ రహస్యమును బ్రద్దలుగొట్టి చెప్పివేసిరి. డబ్లియు. రసల్ అనునతడు హైదరాబాదురాష్ట్రములో 21 సం॥ లు రెసిడెంటుగను, అసిస్టెంటుగను పనిచేసెను. ఈ ఒడంబడికవల్ల హైదరాబాదురాష్ట్రము ఆఖరుకు నాశనమైనదనియాయన చెప్పెను. ఇది యిట్లుగాక మరి యెట్లగుననికూడ ఆయన చెప్పెను. ఈ తంత్రమున చిక్కుకొని నైజాము మతిచెడి, మూర్ఛితుడై, దీర్ఘనిద్రనొందెననియు, పీష్వా గంగవెల్లులెత్తిచచ్చెననియు రసెల్ చెప్పెను.

1817 సం॥ ఆగష్టు 12-వ తేదీన సర్ తామస్ మన్రోయను నతడు హేస్టింగ్స ప్రభువుకు వ్రాసిన యుత్తరములో నిట్లున్నది :—

"ఏ రాజ్యములో నైతే యీ తంత్రము ప్రవేశపెట్టబడునో, ఆ రాజ్యము నేడుగాకున్న రేపైనను సంపూర్ణముగ బ్రిటిష్‌గవర్నమెంటు వారి యధికారము క్రిందికి రాకతప్పదు. ఇది యనివార్యమగు ఫలితముగ నున్నది .....ఈ తంత్రము పూర్తిగ ప్రతిచోట నిరాఘాటముగ సాగవలసినదే—ఏ రాజ్యమునైతే రక్షిస్తానని యీ తంత్రము అభయహస్త మిచ్చినదో, ఆ రాజ్యమునే యది భక్షించి దిగమ్రింగ వలసినదే! దీని లక్షణమిదిగ గన్పట్టుచున్నది. ఇందు సంకోచమేమియు లేదు."

## 15. రాజుల ఔదార్యమే వారికొంప తీసింది.

విదేశీయ క్రైస్తవవర్తకులకు భరతఖండపు రాజులు మొట్టమొదట సకల సౌకర్యముల నొసంగుటయే తప్పు. ఇదే తుదకు రాజుల ప్రాణములను దీసినది. బ్రిటిష్‌రాజ్యమిచ్చట తలయెత్తుటకు కారణమైనది. ఇందునుగూర్చి జే రసెల్‌స్మిత్

* "ఫోర్జరీ"—అనగ అందరెరింగినదే. దొంగసంతకములతో దస్తావేజులు సృష్టించడము - "పర్జరీ" అనగ అబద్ధములు, అప్రమాణములు చేయడం.

అను అమెరికాదేశస్తుడు "Industrial and Commercial Geography" అను తన గ్రంథములో 1913 సంllలో నిట్లు వ్రాసెను :—

"రాజ్యాలను కలుపుకోవడములో నాజూకైన పద్ధతులు రెండున్నవి. అవే వనగ, అప్పులుపెట్టడము, రైళ్లువేయడం. పోలీస్ రక్షణకు సైన్యరక్షణకు అట్టే తేడాలేదు. ఈ రహస్యమును కనిపెట్టు వాడెవడును లేడు...మొట్టమొదట యిట్టి ఉపకారాలు పొందినవాళ్లే తుదకు ఏకుమేకైన సామెతకువచ్చి, రాజ్యాలను దిగమ్రింగినారు. చీనారాజ్యము విచ్ఛిన్నమై పోయినది యిట్లే."

ఏనాడైతే మొగలాయి పాదుషా ప్రాచ్యఖండ ప్రభువులకు సహజమగు మహోదార భావముతో నేడు యేపాశ్చాత్య క్రైస్తవజాతిగాని, ఎవరికి, యెన్నడు, కలలోగూడ నివ్వనిచ్ఛగింపని సౌకర్యములను బ్రిటిష్‌వర్తకుల కిచ్చెనో, ఆనాటినుండియే మనవాణిజ్యము, మనవృత్తులు నాశనమై మనభారత సామ్రాజ్యము కూలి పోయినది. వర్తకులమను వేషముతో వారు ఇండియాను జయించుటకు కుట్రపన్నుచుండిరి.

## 16. భారత నౌకాదళ నాశనము.

సముద్రాధిపత్యము ప్రపంచచరిత్రయందు ప్రాధాన్యము వహించెనని కెప్టన్ మాహన్ అను అమెరికాదేశీయుడు వ్రాసియుండెను. ఇండియాకు స్వీయమగు నౌకాబలముండెను. ఇంగ్లీషువారీ నౌకాదళమును నాశనమొనర్చిరి. ఇంగ్లీషు రాజ్యమిచ్చట స్థాపన యగుటకు నిదిగూడ నొకకారణము. కాని, యీసంగతిని యిదివరకు చరిత్రకారులెవరును తగినంతగ వివరించియుండలేదు. "ప్రబాసీ" యను బంగాలీ మాసపత్రిక నాల్గవసంపుటము, 8-వ సంచిక 442-445 పేజీలలో మహారాష్ట్ర నౌకాదళమునుగూర్చి యీగ్రంథకర్త (బి. డి. బాసుగారు) ఒక వ్యాసమును ప్రచురించియుండెను. సదరు నౌకాదళము 1756 సంll అడ్మిరల్ వాట్సన్, కర్నల్ క్లైవులచేత నాశనమొనర్పబడుటవలన. యింగ్లీషు వారిచ్చట పాదుకొనుటకు వీలుచిక్కెనని ఆవ్యాసమందు నిరూపింపబడెను.

"బంగాళాదేశములో నింగ్లీషువారి మొదటిరోజులచరిత్ర" వ్రాయుచు డాక్టర్ విల్సన్ అను నాతడు యిట్లు వ్రాసెను.

"ఇంగ్లీషురాజ్యము మొట్టమొదట మదరాసులోగాని, బొంబాయిలోగాని తలయెత్తక, బంగాళాదేశములో నేల తలయెత్తెనో, మనమింకను తెలిసికొనవలసి యున్నది."—(పైగ్రంథము మొదటి సంపుటము ఉపోద్ఘాతములో 7-వ పేజీ)

ఈప్రశ్నకు తృప్తికరమైన సమాధానమును యింతవరకు ఏ చరిత్రకారుడును చెప్పియుండలేదు.

సర్ ఆల్ఫ్రెడ్ లయల్ అను నతడు తన "బ్రిటిష్ రాజ్యోదయము" అను గ్రంథములో నిట్లు వ్రాసెను.

"బంగాళా దేశములో ప్రవేశించుట యనగ మెత్తని, అరక్షితమగుచోటు నుండి యిండియాలోకి దూరుటయని యర్థము."

అయితే యింగ్లీషువారు తమ భుజబలముచే బంగాళా దేశములో కాలుపెట్ట లేదుసుమా యను సంగతినిమాత్రము పై గ్రంథకారుడు తెలిసికొనవలసియున్నది. వారు బంగాళా దేశమునకు రాకపూర్వము మొట్టమొదటగ సూరత్తులోను, పిమ్మట బొంబాయిలోను, అటుతరువాత మద్రాసులోను స్థావరముల నేర్పరచుకొనిరి. కాని తక్కిన ప్రదేశములకంటె బంగాళా దేశము సారవంతమైనదని వారు కనిపెట్టిరి. బంగాళా దేశములో వర్తకముచేసికొన్నయెడల తమ కెక్కువలాభము వచ్చునని వారు కనిపెట్టిరి. అందుకొరకే యిక్కడ వర్తకముచేసికొనుటకు అనుజ్ఞనివ్వవల సినదని కంపెనీవారు మొగలాయి పాదుషాను ప్రార్థించిరి. పాదుషా వారిప్రార్థన నంగీకరించుటచే యింగ్లీషువారు వంగదేశములో సుస్థిరముగ పాదుకొనిరి. జాబ్ చార్నాక్ అను ఆంగ్లేయుడు కలకత్తాలో యింగ్లీషువారి స్థాపనమునకు పునాది వేసెను. అతడా పునాదిని యేదో గ్రుడ్డివాటుగగాక, ఆ రాష్ట్రములో యాభై యేండ్ల వర్తకానుభవమునుబట్టి వేసెను. కలకత్తాకుగల వర్తకప్రాముఖ్యమును ఆతడు గుర్తించెను. సైన్యవ్యూహములకుకూడ కలకత్తా మిక్కిలి అనువైనస్థాన మని ఆతడు గ్రహించెను.

మొగలాయీలకు అంతగ చెప్పుకొనదగిన నౌకాబలము లేకుండెను. బుడత కీచు ఓడదొంగలు తరుచుగ బంగాళా కోస్తాను ముట్టించి, అచ్చటి జనులను బాధించుచుండిరి. మహారాష్ట్రులకు మంచి నౌకాబలముండుటచే, యింగ్లీషువారు బంగాళా దేశములోవలె పడమట సముద్రతీరమున పాదుకొనలేకపోయిరి. ఈసంగతి గ్రహించియే జాబ్ చార్నకును, అతని తోడియింగ్లీషువర్తకులును కలకత్తాలో పీఠముపెట్టుకొనుటకు ఆలోచించిరి.

భరతఖండమునకు వంగదేశము సువర్ణభాండారము. ఇంగ్లీషు వారిచ్చట కాలుపెట్టుటచే వారు పట్టినదెల్లను బంగారమైనది. వారు అదృష్టవంతులు.

వర్తకములో మంచిచాకచక్యమువల్లను, తమవద్దకు వచ్చినవారిని న్యాయ ముగ, ఆదరముతో చూచుటవల్లను, యింగ్లీషువారు వంగప్రజలకు ప్రీతిపాత్రు లయిరి. బంగాళా దేశములో యింగ్లీషువారి మొదటిరోజుల చరిత్రకు ఉపోద్ఘాత మును ముగించుచు డాక్టర్ విల్సన్ యిట్లు చెప్పుచున్నాడు:—

"ఈ కథలో నే నిప్పుడు చెప్పినంతవరకు ఇంగ్లీషువారు బంగాళా దేశములో నెలకొనుటవల్ల దేశీయ ప్రజలయం దెట్టి మార్పుగాని గలిగినట్లు గాన్పింపదు.

అయితే యిక్కడ ఒక సంగతిని మాత్రము అన్నిటికంటె ముఖ్యముగ గమనించ వలసియున్నది. ఇండియాను పాలించుటలో యింగ్లీషువారు మొదటిరోజులలోచేసిన నానారకముల ప్రయోగములలో పెక్కింటిని యీ కలకత్తాయందే జేసిరి...ఈ నాటిదృష్టితో చూచినప్పుడు ఆ రోజులలో వారుచేసిన పరిపాలనా పద్ధతులు చాల హీనమైనవిగను, అనుచితమైనవిగను కన్పట్టినను, ఆ రోజులలో చుట్టుపట్టులనున్న ప్రభుత్వపద్ధతులతో పోల్చిచూచినప్పుడు మాత్రము మనయింగ్లీషువారి పద్ధతులే బాగున్నట్లు నిస్సంశయముగ చెప్పవచ్చును. ఈ తేడా 1757 సం॥ నాటికికూడ మరపునకు రాలేదు.''

## 17. మొదటి రోజులలో యింగ్లీషువారి పేరు ప్రతిష్ఠలు.

సూరత్తులో ఇంగ్లీషువారు సంపాదించిన ప్రఖ్యాతి యీ క్రింది వాక్యముల వల్ల తెలియగలదు :—

'' ఈ దిమ్మరీండ్ర సంఖ్య హెచ్చుచున్నకొలది, ఇంగ్లీషువారి పేరు మాత్రము బాగుపడలేదు. చాలమంది ఇంగ్లీషువాండ్లు దౌర్జన్యములను, మోసకార్యములను చేయుచుండిరి...వీరు గోమాంస భక్షకులనియు, త్రాగుబోతులనియు, హిందువు లును మహమ్మదీయులును అసహ్యించుకొనుచుండిరి—ఇంగ్లీషువారు విషమృగ ములు. నీతిబాహ్యులు, వీరు తమ వెంట తెచ్చు వేటకుక్కలకంటె క్రూరులు,...* కన్న తండ్రులనే మోసపుచ్చువారు; గుండుదెబ్బలను, యీటెపోటులను యెంత జంకులేక తీసికొందురో, సరకులబేళ్లను, రూపాయల మూటలనుకూడ అంత జంకు కొంకు లేకుండగనే తీసికొందురు. అని హిందూమహమ్మదీయ ప్రజలుతలంచు చుండిరి.'' (రెవరెండు ఫిలిప్ ఆండర్సన్ అనునతడు వ్రాసిన ''**The English in Western India**'' అను గ్రంథములో 22-వ పేజీనుండి)

ఇంగ్లీషువారిని గూర్చియు, క్రైస్తవమతమును గూర్చియు పశ్చిమభారతీయులు యెట్లు తలంచుచుండినదియు పై గ్రంథకర్తయే తిరిగి యిట్లు చెప్పు చున్నాడు:—'' ఫ్రెరియను నతడు చెప్పినట్లు క్రైస్తవమతమునుగూర్చి దేశీయులకు చాలనీచమైన అభిప్రాయముకలిగినది. క్రీస్తుమతమునుగూర్చి సూరత్తుబజారులలో సాధారణముగ దేశప్రజలనుకొను మాటలివి-'' కిరస్తానీమతం, దెయ్యంమతం, సైతానుమతం, కిరస్తానీవాడు తెగతాగుతాడు, కిరస్తానీవాండ్లుచేసేవన్నీ తప్పుడు పనులే, అందరిని కొడతాడు'' దేశప్రజలు చాలామర్యాదస్తులనియు, అన్నమాట తప్పరనియు ఫ్రెరీచెప్పుచున్నాడు. తానుచెప్పిన ధరకంటె ఎవరైనా తన సరుకుకు తక్కువ ధరఅడిగితే,—'' ఏమి, నేను కిరస్తానీవాణ్ణి అనుకున్నావా యేమిటి నిన్ను

---

* (తల్లికి మొగుళ్లు)

మోసంచెయ్యడానికి?'' అని దేశీయవర్తకుడు గద్దరించును.'' (పై గ్రంథములో 22 పేజీ)

డాక్టర్. సి. ఆర్. విల్సన్ ఇట్లు వ్రాయుచున్నాడు:—

"కొల్లాటలకు బంగాళాదేశములోనున్న యింగ్లీషువారుకూడ ప్రసిద్ధియే. డబ్బు ప్రోగుచేసుకుందామనే దురాశయే దీనికి కారణము. ఇదిగాక, ఒకరిపై నౌకరు చాడీలు చెప్పుకొని, ఒకరి రహస్యము నౌకరు బయటవేసుకొనునట్లుగ కంపెనీ యజమానులు తమ నౌకర్లలో వేగులపద్ధతిని ప్రోత్సహించుచుండిరి. ఇదిగాక మరియొక కారణముగలదు. "కంపెనీవారు నీచులు, కొల్లాట స్వభావము గలవారు; మోసగాండ్ర గుంపు'' అని సయ్యద్ఖాను అను వైస్రాయి యనుచుండెను. ఈమాట లనుట కాతనికి కారణములు లేక పోలేదు. ఆకాలపు రికార్డులను సమగ్రముగ పరిశీలించిచూచిన "సర్ హెన్రీయూల్'' అను నతని మనస్సుకు బంగాళాదేశములో కంపెనీనౌకర్ల నైతిక సాంఘికప్రవర్తననుగూర్చి గలిగిన యభిప్రాయము కేవలము "విషాద భరితముగ'' నున్నది. ఆకాలములో కంపెనీ నౌకర్లయందు ప్రబలియున్న ప్రవర్తన ధోరణినిబట్టి చూడగ, యీమూకనుండి *ఎల్ఫిన్‌స్టన్, మన్రో, మాల్కామ్, హెన్రీ, సర్‌జాన్ లారెన్సు, మార్టిన్, హెబ్బరులవంటి మహాపురుషులు ఉద్భవింపబోవుచున్నారని ఆతడు ఊహించుటకు కష్టసాధ్యమయ్యెను.'' (వాల్యూం 1-వ పేజీ. 66)

పశ్చిమతీరమందును, బంగాళములోను కంపెనీనౌకర్లు చేయుచున్న దుర్మార్గములు సీమలోని యజమానులకు తెలియనివికావు. అయితే, తమ నౌకర్లు సరిగ ప్రవర్తించుచు, దేశప్రజలకు న్యాయస్థులవలె కనబడవలెను సుమా యని మాటిమాటికి సీమనుండి యిచ్చటి తమ నౌకర్లను హెచ్చరించుచు వ్రాయుచుండిరి. డాక్టర్. సి. ఆర్. విల్సన్ యిట్లు వ్రాయుచున్నాడు.

"తమ డబ్బువ్యవహారముల నెట్లు బాగుపరచుకొనవలెనో యిక్కడి నౌకర్లకంటె సీమలోనున్న డైరెక్టర్లకు యెక్కువ బాగుగ తెలియును. జనసంఖ్య హెచ్చినట్లయిన తమ రాబడి హెచ్చును. గవర్నమెంటు న్యాయముగ నుండిన-, పట్టణములు సురక్షితముగను ఆరోగ్యముగనుండిన—జనసంఖ్య హెచ్చును. కాబట్టి ధర్మమే ఐశ్వర్యమునకు మూలమని కంపెనీడైరెక్టర్లు మాటిమాటికి మొత్తుకొనుచుండిరి. "ప్రజల మొరల వినుటకు మీచెవుల నెల్లప్పుడు తెరచియుంచుడు; ప్రజాపీడయను శబ్దము మీ బజారులలో వినరాకుండ జేయండి; అధికారగర్వముచే

---

* క్లైవు, వారన్‌హేస్టింగ్సులు ఎంతటి కపటులో, ఎంతటి తంత్రజ్ఞులో మాల్కామ్, ఎల్ఫిన్‌స్టన్, మన్రో, జాన్ లారెన్సులుకూడ అంతటివారే. వీరు వారికి తీసిపోరను సంగతిని మాత్రము పాఠకులు గుర్తించుకొనవలెను.

మన దళారులుగాని, వారి నౌకర్లుగాని, మీ నౌకర్లుగాని ప్రజలకు హానికల్గించ కుండ చూసుకోండి. పట్టణములో నలువైపులకువెళ్లి, ప్రజలకు ఖర్చుగాని, ఆల స్యముగాని లేకుండ న్యాయము గలిగించండి. మన పట్టణములను పెంచి మన రాబ డిని హెచ్చించుకొనుటకు యిదియే సర్వోత్తమమైన మార్గము." (వాల్యూం II భాగము I పేజీ 49)

క్రైస్తవ దిమ్మరీడులు మొట్టమొదటిరోజులలో పైకివేసికొన్న ధర్మవేష ములజూచి, వంగదేశప్రజలు మోసపోయిరి. వారి బాహ్యవేషభాషలచే ప్రజలు మోసపోయిరి. వారిమాటలను వేదవాక్యములుగ నమ్మిరి. ఇట్టి నమ్మకముచేతనే, ప్రజల వెర్రిబాగులతనముచేతనే, బంగాళాదేశములో యింగ్లీషువారు పైకివచ్చిరి.

## 18. దేశీయరాజుల ఆర్థికాది దౌర్బల్యములు.

బంగాళాదేశములో రాజకీయాధికారమును సంపాదించుకొన్న తరువాత ఇంగ్లీషువారికి దానిని నిలువబెట్టుకొనుటకుగూడ కష్టముగ దోచలేదు. ఇందును గూర్చి వర్‌ల్‌స్ట్ అను గవర్నరు సీమలోనున్న యజమానుల కిట్లు వ్రాసెను:—

మన రాజ్యముయొక్క భద్రతకు మొగలాయిసామ్రాజ్యపు ఆర్థికదుస్థితియే మొట్టమొదటి కారణము. ఇది పెద్దకారణము. నాదర్‌షా దండయాత్రయే మొగలాయిరాజ్యమునకు మొదటిదెబ్బ. దానితో సదరు సామ్రాజ్యముయొక్క ఆర్థికస్థితికి దెబ్బతగిలెను......

ఇట్టి స్థితిగతులవలన గలిగిన ఫలితమేమనగ:— దేశీయరాజుల ఖజానాలలో సొమ్ములేదు. అందుచే వారు తగుమైన సేన నుంచుకొనలేనిస్థితిలో నున్నారు. పట్టు మని యేమాత్రము కాలమైనను నిలువబడి యుద్ధముచేయలేని స్థితిలోనున్నారు. ఆశచేతగాని, అవసరముచేతగాని యేదైన దండయాత్రచేయవలసి వచ్చినట్లయితే, అప్పటి కప్పుడు దూరాలోచనలేక, యేదో ముక్కడిమూకను కూర్తురు. తమకున్న యావత్తు బలమును ఒక దండయాత్రపైననే ఒడ్డుదురు. ఏలననగ, రెండవ దండ యాత్రకువారికి తాహతులేదు. తుట్టతుదకు ఎట్లయినను వారు సంధికిరాక తప్పదు. ఏలననగ, సైనికులకు జీతములు ముట్టనికారణముచే వారు అసంతృప్తిజెంది, ద్రోహులై, యెక్కడివా రక్కడ లేచిపోవుటవల్ల వచ్చు చెడుగులకంటె, ఓటమి నంగీకరించి ఏదోవిధముగ శత్రువుతో రాజీపడుటయే మేలుగ వారికి గన్పట్టును.

"బహుళ సంఖ్యాకములగు దేశీయసేనలపై మనము మాటిమాటికి విజ యము నొందుటకుగల మూలకారణమిదియే యని నామనవి. కొలదిపాటి మన సైన్యదళముల ముందర వారి సైన్యవాహినులు పలాయనములగుచుండుటకును యీ పరిస్థితులేకారణము. ఈకారణములను బట్టియే సుశిక్షితమై, అవిచ్ఛిన్న

జయపరంపరలచే ప్రఖ్యాతమైయున్న మనసేనల నెదుర్కొనుటకు యికముందింకెవరును సాహసింపరు. అథవా, ప్రాణములపై ఆశవదలి యెవరైనను మనపైకి రా సాహసించినను జయము మనకే సుస్థిరమగుననియు నా విశ్వాసము.''

"ఇక రెండవకారణ మింకొకటియున్నది. ఇది మొదటి దానికి తీసిపోదు. అదేదనగ :—ఇచ్చటగల రాజులలో ఒకరిపద్ధతికిని, యింకొకరి పద్ధతికిని సామరస్యములేదు. ఎవరిదోవ వారిది; ఎవరిదృష్టివారిది; ఎవరి అపేక్షలు వారివి. ఒకరివి యింకొకరితో కలియవు. కాబట్టి వీరందరు కలిసి మనమీాదికి వస్తారనేభయము లేదు. ఒకవేళ వీరు కలిసి యెత్తువేయదలచుకొన్నను అదిసాగదు. నిజముగ వీరందరు కలిసేటట్లయితే, మన ఒక్కరి ధనము, బలము ఏమిచేయగలదు? అదిగాక, యిప్పుడు హిందూస్థానములోనున్న రాజులలో చాలమందికి వారి రాజ్యములకు వారికి న్యాయమగు హక్కులేదు. దాదాపు అందరు అక్రమముగ యేద్రోహము చేసియో సింహాసనమునకు వచ్చినవారే. ఈ ఉలుకు వారికడుపులోనున్నది. కాబట్టి తమతోడి రాజులలో యెవరుగాని, అట్టే పైకిగాని,అట్టే క్రిందికిగాని పోకుండ ఉండేటట్లు చేస్తేనేగాని, తమ పదవి నిలువదని వారెరుగుదురు. ఇందు నిమిత్తమె వారు ఒకరిచర్యలనొకరు అప్రమత్తతతో, అలికిడితో జూచుచు, ఒకరియందొకరు యీార్ష్యాళువులై యుందురు. మామూలు మట్టముకంటె యేరాజైన పైకిలేచుచున్నాడని కనబడగానే, వానిని అణచుటకుగాను ఇంకొకనితో చేరుచుందురు. ఈ కారణముచేతనే, మనము ప్రతియుద్ధములోను గెలిచి వచ్చుచున్నప్పుడు దేశీయ రాజులు యీార్ష్యతో మనయందొకకన్ను వేసి చూచుచుండిరి. కాని మనము సుజాద్దాలాయెడల ఔదార్యమును చూపుటయు, ఒడంబడికలను విశ్వాసముతో పాటించుటయు, జయము పొందినప్పుడు శత్రువులను అట్టే నొక్కక మితత్వముతో నుండుటయు, మున్నగు మనచర్యలనుచూచి దేశీయరాజులకు మనయందెక్కువ నమ్మకముకుదిరెను. తమలో తమ సోదరరాజులయెడ లేని నమ్మకము మన యింగ్లీషువారియందుకలిగెను. కాబట్టి మనబలమునుచూచి యీార్ష్యనొందుటకు బదులుగ వారు మనస్నేహమును సంపాదించుకొనుటకు ఆశపడుచుండిరి.''

"ఇట్టి పరిస్థితులలో మనము కొంచెము జాగ్రత్తగ, చురుకుగఉండి పని చేసుకున్నట్టయితే, రాజ్యాధిపత్యమును మనము సులువుగ, నిరపాయముగ, నిలుపుకొనవచ్చును. ఎవరైనారాజులు ఏకమై మనమీాదికి రాజూచినయెడల, ప్రక్కనున్న ఏరాజునో, ఏవిరోధినో గిల్లి వారిమీాదికి ఉసుగొలిపి, వారినినొక్కి పారవేయవచ్చును.'' (టాల్‌బాయి వీలర్ వ్రాసిన "Early Records of British India''—అను బ్రిటిష్ ఇండియా రికార్డులు - మొదటిరోజులవి.'' అను గ్రంథము యొక్క పుటలు 376-378)

## 19. ఆంగ్ల శాంతి ఎట్టిది?

ఇండియాలో అంతఃకల్లోలములబాపి శాంతి నెలకొల్పితిమనియు, తాము ఇండియాకువెళ్లి తమ రాజ్యమును స్థాపించువరకు "ఇండియా" యను యేకజాతి లేనేలేదనియు బ్రిటిష్‌వారు విసుగు విరామములేకుండ మాటిమాటికి చెప్పుకొనుచుందురు. ఇండియాలో ప్రబలియున్నదనబడు అరాచకమునుగూర్చి, ఒకవ్యక్తి—బహుశః ఆంగ్లేయుడు కానోపును—ఇట్లు వ్రాయుచున్నాడు.

"ఆంగ్లరాజ్యస్థాపనకు పూర్వము ఇండియా అనాదినుండియు పరదేశ దండయాత్రలచే పీడింపబడుచు, అంతఃకల్లోలములచేతను, దౌర్జన్యములచేతను, సంక్షుభితమైయుండెను. మానవసంఘముల స్వభావమును, చరిత్రను కొంచెము పరిశీలించి చూచినయెడల అరాచకమునకును స్వరూపనాశనమునకును చాల అంతరమున్నట్లు తేటపడగలదు. (ఒకచోట అరాచక ముండవచ్చుగాక, అంతమాత్రముచేత ఆదేశము, ఆప్రజ, స్వరూపనాశనముగావలసిన పనిలేదు.) దౌర్జన్యములు, రక్తపాతములు జోరుగ రేగుచున్నసమయములలోకూడ మానవసంఘములు నిర్దుష్ట పరివర్తన పరంపరలద్వారా పోయిపోయి, పునరుజ్జీవమునొంది, ఒకానొక అదృశ్య హస్తముచే శాంతిసుఖధామము వైపునకు కొనిపోబడుచున్నట్లు తెలియగలదు... మహమ్మదీయుల రాజ్యకాలములో పట్టణములు, పల్లెలు దోచుకొనబడినవి. తగులబెట్టబడినవి. అసంఖ్యాకులగు ప్రజలు చచ్చిరి. ఖడ్గధారలకు, అగ్నిజ్వాలలకు, హోమదేవతకు గురియై యెందరో తుడిచిపెట్టుకొనిపోయిరి. కాని, కాలక్రమేణ, తిరిగి ప్రజల హృదయక్షేత్రములందు ప్రతీకారభావ ముత్పన్నమయ్యెను. ఈ సంక్షోభములో పుట్టిన శౌర్యవివేకాదిగుణములవల్లనే అసంఖ్యాకులగు ప్రజలయిండ్లు వాకిళ్లు చెడకుండ నిలిచియున్నవి. ఇది వట్టి ఊహకాదు. నిస్సంశయముగ ప్రతిప్రాణిలోగల ఆత్మరక్షణతత్వము నిది సూచించుచున్నది. సహజముగ ప్రతిప్రాణిలోగల యీ ఆత్మరక్షణతత్వము ఇంగ్లీషువారికి లోబడియున్న రాష్ట్రప్రజలలో చాలవరకు సమూలముగ ఊడబెరికివేయబడినది. కాని, దేశీయరాజుల సంస్థానప్రజలలో యిది మిక్కిలి చురుకుగ పనిచేయుచునేయున్నది. ఇందుకొక నిదర్శనము చూడుడు. (దేశీయరాజు పరిపాలనలోనున్న) అయోధ్యరాజ్యములో అరాచకమే, నిత్యధర్మముగ నున్నదని చెప్పవచ్చును. అయినప్పటికి, అక్కడ ప్రజలింకను బ్రతికి కాపురముండనే వున్నారు! ప్రజాసంఖ్య తగ్గలేదు. బహిరంగముగ దోపిడీలు దెబ్బలాటలు జరిగి, నిరంతరము రక్తము కాల్వలుగట్టుచున్నను అయోధ్యదేశము కించిత్తయినను స్వరూపనాశనము కాలేదే. సృష్టిలో క్రియ, ప్రతిక్రియ యను శక్తులు—హింస, ఆత్మరక్షణ యను శక్తులు—పరస్పరము పనిచేయుచు, లోకవ్యవహారము పాళము చెడకుండ సర్దుబాటుచేసికొనుచు పోవును. ఇది సృష్టినడకయొక్క లక్షణము. సంక్షుభితమగు అయోధ్యరాష్ట్రములో నిరంతరాయమానముగ జరుగుచుండు

కల్లోలములన్నియు సాంఘికరాచకీయములందా ప్రజలు ప్రదర్శించు నిర్మలచైతన్య విలసనలక్షణములని మనము చెప్పవచ్చును. ఇక బ్రిటిష్‌పరిపాలనలోనున్న ప్రజల వంక జూడుడు. వారు కుళ్లి కూలబడి పోవుచున్నారు. వారు పక్షపాతమువచ్చి పడి పోయినారు. వారిని నిస్పృహ, మాంద్యము వెన్నంటి విడువకయున్నది. ఇట్టి చేతనా రహితమగు లక్షణములకంటె, పైనజెప్పినట్లు దేశీయరాజ్యములలోని ప్రజలు జూపు చైతన్య విలసనలక్షణములు మేలుకాదా? కేవలము మానవుని దుష్టస్వభావము వల్లగాని, లేక ఆతని ప్రమాదబుద్ధివల్లగాని మానవజాతి రూపనాశనమగుటయే సంభవించునెడల, ప్రపంచములో అన్నిజాతులకంటె యెక్కువగ బ్రిటిష్‌ఇండియా ప్రజలే ఈ అగాధమువైపునకు జారి పడిపోవుచున్నారని ప్రమాణపూర్తిగ చాటి చెప్పుటకు మేము జంకము" (కలకత్తా రివ్యూ. వాల్యూం I (1844) పేజీలు 190-191)



# బ్రిటిష్ మహాయుగము

## రెండవ అధ్యాయము



### సురాజ్ - ఉద్ - దౌలా

భరత ఖండమున ఆంగ్లరాజ్యోదయాభ్యుదయములు ఈస్టిండియాకంపెనీ వారు బంగాళానబాబగు సురాజ్-ఉద్-దౌలా యెడ గావించిన ద్రోహముల వల్లను, ఆతని రహస్యముగ చంపించుటవల్లను సమకూరినవని చెప్ప నగును. దైవోపహతుడగు ఈ సురాజ్-ఉద్-దౌలా పితృపైతామహమగు సింహాసనమునకుగాక, ఒకానొక ద్రోహి సంపాదించిన సింహాసనమునకు వచ్చెను. ఇతని మాతామహుడు అలివర్దీఖాన్ అదృష్టజాతకుడగు శిపాయి. రాజ్యతంత్రమందు తప్పుగ యెంచబడని కుటిలోపాయములచే యీతడు రాజ్యాధిపత్యమునకు వచ్చెను. ఈతడు బంగాళాదేశములో తనరాజవంశమును స్థాపింపనెంచెను. ఇతనికి కంపెనీసొకర్ల స్వభావము బాగుగ తెలియును. వారికి మానాభిమానములు, ఉచ్ఛనీచములు లేవనియు, వారు తిన్నయింటివాసములు లెక్కపెట్టువారనియు, కుటిలస్వభావులనియు, ద్రోహచింతకులనియు అలివర్ధిఖానుకు బాగుగ తెలియును. అయితే ఆతడు విశేషకాలము జీవించలేదు. ఈతడు రాజ్యాధిపత్యములో నుండిన కొలదికాలమును మహారాష్ట్రదండయాత్రల నెదుర్కొనుటలోను, ఇతర గృహకృత్యముల సర్దుకొనుటలోను సరిపోయెను. కాబట్టి, ఇంగ్లీషువారి పని పట్టించుటకు ఇతనికి తీరికలేకపోయెను. అయినను, తనయెడను తనవంశము నెడను కంపెనీవారు వర్తకులవేషముతో పన్నుచున్న * పన్నాగములను ఆలివర్ధిఖాను

(ఆలివర్దీఖాన్.)

* కర్నల్ మిల్ అను ఇంగ్లీషువాడు 1764 సం॥లో ఫ్రాన్సుకు ఉత్తరమున "లొరెయిన్" లో నున్న ఫ్రాన్సిస్ అను వానికొక జాబు వ్రాసెను. జర్మన్ చక్రవర్తి బావుటాక్రింద బెంగాల్ బీహార్, ఒరిస్సా రాష్ట్రములను జయించుటకొక పథకమును అతడాలేఖయందు సూచించెను. ఈ సంగతి అలివర్ధఖానుకు బహుశః తెలిసియుండును. మిల్లుసూచించిన పథకమిది:—మొగలురాజ్యములో వెండి బంగారములు పొంగి పొరలుచున్నవి. మొగలురాజ్యము దుర్బలమై, అరక్షితముగనున్నది. ఇట్టి రాజ్యమును జయించుటకు నౌకాబలముగల మనయూరోపియన్ రాజులెవరును ఇంతవరకు ప్రయత్నింపక పోవుట వింతగనున్నది. ఒక్కదెబ్బతో కావలసినంతధనము దొరుకుతుంది. బ్రెజిల్, పెరూ, బంగారు గనులలో దొరికినదానికంటె ఎక్కువగ దొరుకుతుంది."

"మొగల్ రాజ్యపద్ధతిమంచిదిగాదు; సైన్యము అంతకంటె అధ్వాన్నముగ నున్నది. నౌకాబలము అసలే లేదు. రాజ్యములో నిరంతరము అల్లకల్లోలములు చెలరేగుచున్నవి. నదులు, రేవు

తన అవసానకాలమందు గ్రహించకపోలేదు. ఇంగ్లీషువారు చిల్లరదుకాణదారులు. అట్లే హిందువులును. 18-వ శతాబ్దమంతయు క్రైస్తవులును, తద్విమతస్థులగు హిందువులును కలిసి మహమ్మదీయ రాజ్యమును కూలద్రోయుటకు పన్నుకుట్రలో చెల్లిపోయెను. 1756-57 సం॥ల మధ్యబంగాళా చరిత్రనువ్రాయుచు, దాని యుపోద్ఘాతములో యస్. సి. హిల్ అను నతడిట్లు వ్రాసెను.

"దేశములోని వాణిజ్యము, వృత్తులు, దాదాపు యావత్తు హిందువుల చేతులలోనే యుండెను. కాబట్టి, వర్తకము చేసికొని బ్రతుకవచ్చిన యూరోపియన్ వర్తకులకును, హిందువులకును సహజముగ సంబంధమేర్పడెను. ఇరువురును ఏకఫలార్థులగుటచే ఉభయులకును ఒకవిధమగు సఖ్య మేర్పడెను. (వాల్యూమ్ I పేజీ 23.)

## ఇంగ్లీషువారి కుట్ర.

సురాజ్ - ఉద్ - దౌలా సింహాసనమునకు రాక పూర్వమే ఇంగ్లీషువారు హిందువులతోచేరి కుట్రపన్నుచున్నట్లు 1754 సం॥ ఫిబ్రవరిలోనే కర్నల్ స్కాట్ అనునతడు చార్లెస్ నోబుల్ అను తన మిత్రునకు వ్రాసిన లేఖనుబట్టి తెలియు

---

పట్టణములు నిరాఘాటముగ విదేశస్థులకు చొర వీలుగనున్నవి. ఇట్టి దేశమును బహుసులభముగ జయించి స్వాధీనపరచుకొనవచ్చును; లేదా వానినుండి కప్పముగైకొనవచ్చును. అమెరికాఖండములో దిగంబరులుగనున్న "ఎర్రయిండియనులను స్పెయిన్ వారు జయించినంత సులభముగనే మనము వీరిని జయించవచ్చును"

"ఆలివర్దీఖాను అను నొక తిరుగుబాటుదారుడు మొగలాయీ పాదుషామీద తిరుగబడి బెంగాల్, బీహార్, ఒరిస్సా యను మూడు రాష్ట్రములను తన స్వాధీనమొనర్చుకొనెను. అతని ఖజానాలో మూడుకోట్ల నవరసులున్నవి. అతనికి సాలుసరి ఆదాయము కనీసము ఇరవైలక్షలైనా వుండును. ఈ మూడు రాష్ట్రములు సముద్రమునకు అందుబాటులోనున్నవి. 1,500 లేక 2,000 మంది సైన్యముతో మూడు ఓడలున్నచాలును. మన పని నెరవేరుతుంది. ఈ సందులో బాగా దోచుకోడానికి తమకు వీలు చిక్కుతుంది గనుక మనకు ఇంగ్లీషువారుకూడ సహాయముచేస్తారు. ['బోల్ట్సు' (Bolts) అను నతడు వ్రాసిన Considerations of the Affairs of Bengal-Appendix నుండి"]

ఆలీవర్దిఖాను మిక్కిలి దూరదృష్టి, జాగ్రత కలవాడు! తనరాజ్యములో యెక్కడ ఏమూల ఏమిజరుగుచున్నది తెలిసికొనుటకై అనేకమంది మెరికెలవంటి వేగులవాండ్లను బాగాడబ్బుయిచ్చి, పెట్టియున్నాడు. ఇట్టివానికి యీ కిరస్తానీకిరాటులు తనపై పన్నుచున్న ఈ కుట్రసంగతి తెలియకయుండదు. ఈ కిరస్తానీ వర్తకులయందు ఆలివర్దీఖానుకు అంతటి అసహ్యము గలుగుటకును, వారికెట్టి వర్తకసౌకర్యముగాని, ప్రోత్సాహముగాని యివ్వక పోవుటకును బహుశః యిదియే కారణమైయుండవచ్చును.

చున్నది. ఇందునుగూర్చి 1756 సం॥ సెప్టెంబరు 22-వ తేదీన ఫోర్టుసెంట్‌జార్జి సెలెక్టు కమిటీ వారికి సదరు చార్లెస్ యిట్లు వ్రాసెను.

"బంగాళాదేశములో హిందూరాజులును, ప్రజలును మహమ్మదీయ ప్రభుత్వమునెడ అసంతృప్తులైయున్నట్లు కర్నల్‌స్కాట్ వ్రాసినదానినిబట్టి తెలియుచున్నది. క్రూరమగు మహమ్మదీయరాజ్యము నెట్లయిన త్రోసివేసి, క్రొత్తరాజ్యము నేర్పరచుకొనవలెనని హిందువులు రహస్యముగ ఆలోచనలు చేయుచున్నట్లును తెలియుచున్నది. ఏ యూరపియన్ సైన్యమైనను ఇందుకు కొంచెము విజయవంతముగ పూనుకొన్నయెడల, హిందువులు వారితో చేరుటకు యిష్టపడుదురట. అయితే మహమ్మదీయ రాజ్యమును పూర్తిగ త్రోసివేయవచ్చునను ధైర్యము వారికి తోచేవరకు మాత్రము వారు బహుజాగరూకతతో నుందురు. కాబట్టి వారిని మనము సరిగ సమీపించి, తగు ప్రోత్సాహము ఇచ్చినగాని, వారు మనలోకి రారు" (పైగ్రంథము. వాల్యూం III పేజీ 328.)

ఇందులో చెప్పిన అభిప్రాయము నిజముకాదు. ఇంగ్లీషువారి సంకల్పమునకిది యొక వేషము. వారి మనస్సులో నున్నవాంఛ కిది యొక ప్రేరణ. రాజ్యములో మార్పుకావలెనని హిందువులు తమంత తాముగ కోరలేదు. వారు మహమ్మదీయ రాజ్యములో సుఖముగను భాగ్యవంతులుగనునుండిరి. ఇందునుగూర్చి ఎస్. సి. హిల్లుకూడ యిట్లు వ్రాయకతప్పినదికాదు.

"మహమ్మదీయరాజ్యమునుగూర్చి మహమ్మదీయగ్రంథకర్తలు వ్రాసిన దానినిబట్టి చూడగ, ప్రజలు తిరుగుబాటు చేయునంతటి దుష్టముగ సదరు రాజ్యము లున్నట్లు గాన్పించదని నేను ఒప్పుకొని తీరవలెను. 18-వ శతాబ్దమధ్యమందు బంగాళారైతుల స్థితిగతులను ఆకాలములో ఫ్రాన్సు జర్మనీదేశపు రైతులస్థితిగతులతో పోల్చి చూచినట్లయిన అవియెంతమాత్రము చెడుగుగలేవని చరిత్రకారులెల్లరు అంగీకరింపక తప్పదు. (పై గ్రంథము. వాల్యూం I, పేజీ 22)

అయితే యీకిరస్తానీ కిరాతులు, తమస్వార్థమును సాధించుకొనుటకై అమాయికులగు హిందువులకు పుల్లలుపెట్టి, వారికేదోయెరనుజూపి, మహమ్మదీయ రాజ్యమునెడ అసంతృప్తిని గలిగించి, వారిరాజ్యమును పడద్రోయుటకై కుట్ర పన్ని యుండవలెను.

ఈ రీతిగ హిందువులతో కుట్రపన్నుచున్నవారిలో కర్నల్ స్కాట్ ఒకడై యుండవలెను. ఏలననగ, ఇతడు పైనచెప్పినట్లు చార్లెస్ నోబుల్‌కు వ్రాసిన యుత్తరములో నిట్లున్నది.

"మూర్షిదాబాదులో నున్న నబాబు దర్బారునుగూర్చియు, రాజ్యవిధానమును గూర్చియు, ఆదేశమును, ప్రజలను గూర్చియు, ఆమూలాగ్రముగ తెలిసి

కొనుటకై కర్నల్ ఎంతో శ్రమపడెను. అతను చనిపోయేకాలమునకు అతనికి తెలిసినన్ని సంగతులు ఇంకెవరికి తెలియవనుకొనెదను.

"ఒమిాచందను నతడు కలకత్తాలో గొప్పవర్తకుడు. కంపెనీ వ్యవహార ములు ఇతనికి తెలిసినట్లుగ ఇండియాదేశస్థుల కింకెవరికిని తెలియవు. ఇతనిద్వారా దేశములోగల ప్రముఖులింకెదరితోనో మన కర్నల్‌కు పరిచయము కలిగెను. ముఖ్య ముగ బర్ద్వాన్ ప్రాంతమునకు జెందిన రాజా తిల్లాచెందుతోడను, హుగ్లీ వాస్తవ్యు డగు కాశీవాస్‌జిత్‌తోడను మనకర్నల్ అనేకసార్లు ప్రసంగించి యుండెను. (పై గ్రంథము. వాల్యూమ్ III, పేజి 326)

సహజముగ అలివర్దీఖాన్ ఇంగ్లీషువారియెడ ఈర్ష్యవహించి యుండెను. ఇందునుగూర్చి "కాసింబజారు"లో ఫ్రెంచి గిడ్డంగికి యజమానియైన "మాన్షి యర్ - జీన్ - లా"యనునత డిట్లు వ్రాసెను.

"తూర్పుతీరమందును, దక్షిణాపథమందును, ఆంగ్లపరాసుకంపెనీలు పొందు చున్న దినదినాభివృద్ధినిగాంచి నబాబుకు రోషము, ఆశ్చర్యముకూడ గలుగు చుండెను. ఏలననగ, అక్కడ జరుగుచున్న ప్రతిసంగతి, అతనికి తనవేగులవాండ్లు వచ్చి - ఎప్పటి సంగతి అప్పుడు చెప్పిపోవుచుండిరి......అందుచే, అతనికి మన శ్శాంతిలేకుండెను. ఏలననగ, ఈ యూరపియనులు తన రాజ్యములోకూడ యిట్టి పనులనే చేయసాగింతురేమోయని యతడు భయపడుచుండెను.

"ముఖ్యముగ యూరోపియనులు ఏ చంద్రనగరములోనో, ఏ కలకత్తా లోనో, క్రొత్తకోటనేదియో కట్టుచున్నారని తన వేగులవాండ్రు వచ్చి చెప్పినప్పు డెల్ల నబాబునకిట్టి భయోత్పాతము స్పష్టముగ గలుగుచుండెను. యూరపియనుల కోటలో యేమాత్రము మరమ్మతు జరిగినను, లేక, కోట దగ్గరనున్న ప్రాతయింటి గోడను పడగొట్టినను, చాలును నబాబు ఉలికిపడుచుండెను. ఈ పనిని తక్షణమే ఆపివేయవలసినదని నబాబు వెంటనే హుకుము బంపుచుండెను......ఏ యూరో పియను జాతికిగాని, ఎట్టి కోటగాని లేకుండ చేయవలెనని నబాబు సంకల్పము."మిారు కోమట్లు, మిాకు కోటలెందుకు ? నారక్షణలో మిారు భయపడవలసిన శత్రువులు లేరు" అని నబాబు మన ఫ్రెంచి వకీళ్లతోను, ఇంగ్లీషు వకీళ్లతోడను తరుచు అనుచుండెడివాడు. ఆతడు విశేషకాలము జీవించియుండినచో, తన మనస్సులో ఉన్న పనిని బహుశః నెరవేర్చెడివాడేమో! కాని, ఆతడు అప్పటికే ముసలివాడై యుండెను. అందుచే, తాని ఒడుదుడుకులో దిగుటకు ఇష్టపడక, తన తదనంతరము రాజ్యమునకు వచ్చు తన మనుమడు సూరాజాఉద్దాలాకు తనమనస్సులోవున్న పతకమునంతను ఉపదేశించిపోయెను. ఈ ఉపదేశమేమో, అతని తదనంతరము నబాబుగవచ్చిన సురాజా-ఉద్దాలా నడవడికలో మనకు తెలియనే తెలిసినది."

(వాల్యూం III, పేజీలు 161, 162)

## అలివర్ధీఖాన్ ఉపదేశము.

అలివర్ధీఖాను మిక్కిలి దూరదృష్టిగలవాడు. మరియు, అవసానకాలమందాతనికి భవిష్యత్ సాక్షాత్కారముకూడ గలిగెను. మరణాసన్నుడై యున్న అలివర్ధిఖానుడు తన మనుమనిజూచి యిట్లు ఉపదేశించెను.

"దేశములో యూరోపియన్ జాతుల బలమును నీమనస్సులో ఉంచుకో. అల్లా నాకు ఆయుర్దాయమిచ్చియుండినచో, యీ భయముకూడ నీకు లేకుండ నేనే చేసేవాడను. ఈపని—నాయనా—నీపాలబడినది. తెలింగ్‌రాష్ట్రములో వారు చేయుచున్న యుద్ధములు, కుట్రలు, నీవు మరువవద్దు. నీవు సదా మెళుకువతో నుండవలసిన ఆవశ్యకతను అవి బోధించుచున్నవి. రాజుల ప్రయివేటువ్యవహారములలో దూరి వారు మొగలాయిపాదుషా రాజ్యమును విచ్ఛిన్నమొనర్చి పంచుకొన్నారు. ప్రజలసొత్తును దోచుకొని పంచుకొన్నారు. ముగ్గురను ఒక్కసారిగ వంచవలెనని చూడకు. వారిలో యింగ్లీషువారు బలవంతులు. వారు ఇటీవలనే అంగ్రియారాజ్యమును జయించి, స్వాధీనపరచుకొన్నారు. ముందు వారిని లొంగదీయుము. అట్లయిన, తక్కినవారు నీజోలికి రారు. వారిని సులభముగ వంచవచ్చును—నాయనా, వారిని కోటలు గీటలు కట్టుకొన నీయవద్దు—శిపాయిలను చేర్చుకొన నీయవద్దు. వారిని యీపనులు చెసికొన నిచ్చినావా, దేశము నీది కాదు *

1756–వ సం॥ ఏప్రిల్ 10–వ తేదీన ఆలీవర్ధీఖాన్ నంజువ్యాధిచే చనిపోయెను. అతని తరువాత అతని మనుమడు (కూతురు కొడుకు) సురాజాద్దౌలా రాజ్యమునకు వచ్చెను. అప్పటికి అతనికి 24 సం॥లకంటె ఎక్కువ వయస్సు ఉన్నట్లు కనప్పడు. పై యుపదేశవాక్యములు నిజమైనను కాకున్నను, సురాజాద్దౌలా ఎక్కిన సింహాసనము మెత్తని గులాబీపువ్వులతో కప్పబడియుండలేదనుట స్పష్టము. ఈ పువ్వులకు ఇంగ్లీషువర్తకులనబడు ముండ్లుఉండి, కూర్చుంటే గుచ్చుకొంటున్నవి. అన్నిప్రక్కలనుండి యీముళ్లు గ్రుచ్చుకొనుచుండెను. ప్రతివిషయములోను వారు ఇతనికి బాధకల్గించుచుండిరి. ఇతడనిన ఇంగ్లీషువారికి మొదటినుండియు—అదేమి కర్మమోగాని—బొత్తుగ పడకుండెను. ఇందునుగూర్చి "జీన్‌లా" యిట్లు వ్రాయుచున్నాడు:—

---

* పైగ్రంథము. వాల్యూం II; పేజీ 16. ఈ యుపదేశవాక్యములు నిజముకావనియు, తన దురుద్దేశమును కప్పిపుచ్చుటకై "హవెల్" అను నతడు సృష్టించినవనియు చాలమంది తలంచుచున్నారు. పైగ్రంథము వాల్యూం II, పేజీలు 129, 162 ను వాల్యూం III, 352, 355 ను చూడనగును.

## ఇంగ్లీషువారు సురాజ్ ఉద్దాలాను అవమానించుట.

"ఇంగ్లీషువారు తమ వర్తకవ్యవహారములనుగూర్చి సురాజ్ ఉద్దాలా దర్బారులోనికివచ్చి యెన్నడు చెప్పుకొనకుండ, ముఖము చాటువేయుచుండిరి. కొన్నిపర్యాయములు కాశింబజారులోనున్న తమ గిడ్డంగిలోనికికూడ అతనిని రానివ్వలేదు. అట్లే అనేకచోట్లకు సురాజ్ ఉద్దాలను రానివ్వలేదు........" (పైగ్రంథము వాల్యూము III పేజీ 162)

సురాజ్ ఉద్దాలా పట్టాభిషేకముచేసికొన్నప్పుడు ఇంగ్లీషువారు మామూలుగ పంపవలసిన నజరానాను, కానుకలనుకూడ పంపక, అతనిని అగౌరపరచిరి. "కలకత్తా ముట్టడి" (Capture of Calcutta) అను గ్రంథము వాల్యూము I పేజీ 278 లో "విలియం టూక్" అనునత డిట్లు వ్రాసెను:—

---

"సురాజ్-ఉద్-దౌలా సింహాసనమున కెట్లువచ్చెనో చెప్పియుంటిని. నవాబులు పట్టాభిషేకము చేసుకొన్నప్పుడు రాజ్యములోనున్న పరజాతుల వారెల్లరు నజరానా లర్పించుట యీదేశములో ఆచారము. మనమీపనిని చేయలేదు. ఇది మొదటితప్పు. నవాబు (సమస్త దురాచారములు గలవాడైనను) అపరిమితమగు రాజ్యగర్వము, దర్పముగలవాడు. అందుచే మన మిట్లతనిని చులకనగజూచుట అతని కెంతయో, మనోవ్యథను, రోషమును గల్గించెను. అదిగాక, రాజ్యములో అతనికి శత్రువులున్నారు. మనమీ శత్రువులతో చేరితిమేమో యనికూడ అతని మనస్సు కటకటబడెను."

ఇందుకు సందేహమేమి? ఇంగ్లీషువారు నవాబును పడద్రోయుటకై కుట్ర పన్నుచున్నమాట వాస్తవమేగదా? అందుకొరకేగద ఇంగ్లీవారు నవాబు నిట్లు చులకనజేసినది? ఇంగ్లీషువారు తననిట్లు కావలెనని అవమానపరుచుటనుజూచి సురాజాఉద్దాలా - అతడు నవాబను మాటను వదలివేసినను - వేయేల మానవమాత్రుడెవడైనను ఎట్లు సహించి యూరుకొనగలడు? కాబట్టి, అతనికిని యింగ్లీషువారియెడ అసహ్యముగలిగి, వారిని తనరాజ్యములోనుండి తరిమివేయవలెనను బుద్ధి పుట్టినదన్నచో ఎవరుగాని ఆశ్చర్యపడవలసినపనిలేదు.

పైనచెప్పిన కారణమేగాక, యింక ననేక కారణములునుగలవు. ఈ కారణములచే ఇంగ్లీషువారిని తనరాజ్యములోనుండి వెడలగొట్టుటకు యత్నించుట తప్ప నవాబుకు ఇంకొకమార్గము గోచరముకాలేదు.

ఇంగ్లీషువారి విశ్వాసఘాతుకబుద్ధి వల్లనే సురాజ్ ఉద్దాలాకు వారిపై రోత కలిగెననుమాటను ఎవరుగాని కాదనజాలరు. ఇంగ్లీషువారు "కాస్త యిస్తే గంపంత లాగుకొనుస్వభావము గలవారు" అను సామెతగలదు. ఇంగ్లీషువారు తాము నిత్యమొనర్చు చేష్టలవల్ల యీ సామెతను నిజమొనర్చిరి. "కలకత్తాకు

పోవుటకుగల కారణముల '' గూర్చి 1756 సం॥ ఆగష్టునెలలో మూడవవాల్యూం 384 పేజీలో '' డేవిడ్‌ర్యానీ '' యనునతడిట్లు వ్రాసెను.

''మహమ్మదీయప్రభువులు తమదాక్షిణ్యబుద్ధిచే మనల నిక్కడ సరుకు లమ్ముకొని బ్రతుకనిచ్చినారు. మనవర్తకముపై సుంకములులేకుండ జేసినారు. మన వర్తకులను, మన నౌకర్లను మనమే రక్షించుకొని, శిక్షించుకొనుటకు అనుజ్ఞయిచ్చినారు. వారు దయతోనిచ్చిన ఇట్టి సౌకర్యములను చాటుపెట్టుకొని, మనమేమి చేసినాము ? మననౌకర్లు, మనవర్తకులు, కాని నబాబుమనుష్యులనుకూడ మనము శిక్షింపసాగినాము. వారికి మనరక్షణ యొసంగెదమన్నాము. సుంకములులేకుండ వర్తకముచేసికోడానికి మనచీట్లను (దస్తకులను) దేశప్రజలందరికి యిచ్చినాము. ఇందువల్ల నబాబు రాబడికి నష్టముగలిగించినవారమైనాము. ఇంతకంటె ఘోరమేమనగ, ఏ నబాబైతే మనకు సుంకములులేకుండ జేసినాడో, అట్టినబాబు రాజ్యములోనుంచి వచ్చేసరుకులమీదనే మనము భారమగుపన్నుల విధింపమొదలిడినాము! కంపెనీ రాబడిని హెచ్చించుకొనుటకై ఇట్లు వేయబడిన అసంఖ్యాకములగు పన్నులలో కొన్ని మనకే నష్టదాయకముగనుండెను. మరియు, వీనివల్ల దేశములో పెద్ద గగ్గోలుపుట్టి, మనమీద నబాబుదర్బారులో అనేక ఫిర్యాదులుపుట్టుటకు కారణమయ్యెను.''

నబాబుఆజ్ఞకు వ్యతిరేకముగ యింగ్లీషువారు కోటలుకట్టుట.

నబాబు హుకుములకు వ్యతిరేకముగ ఇంగ్లీషువారు తమ కోటలను—ముఖ్యముగ కలకత్తాకోటను—మరమతుచేసికొని బలపరుచుకొనుచుండిరి. ఇందుకు వారు చెప్పిన సమాధాన మేమనగ : తమకును ఫ్రెంచివారికిని యుద్ధము రాబోవుచున్నదనియు, కావున స్వరక్షణార్థమై తామట్లు చేసికొనుచున్నామనియు వారు సమాధానము చెప్పిరి. ఈ మాటలో సత్యమే యుండియున్నయెడల, ఇందునుగూర్చి తమ సీమయజమానులగు కంపెనీ డైరెక్టరులుచెప్పిన సలహాప్రకారము ఇక్కడ కంపెనీ నౌకర్లేల చేయలేదు ?

1755 సం॥ డిశంబరు 29-వ తేదీగల తమ ఉత్తరములో యిందునుగూర్చి డైరెక్టర్లు యిట్లు వ్రాసిరి :—

'' అక్కడి పరిస్థితులనుబట్టి మీరు మన బంగాళారాజ్యం కాపాడుకొనుటకై అతిజాగరూకతతో మెలగవలెను. మన స్థానములను కాపాడుకొనుటకు మనకు నబాబు ఒక్కడే దిక్కు. అంతకుమించిన అండ మనకులేదు. కాబట్టి ఆతడెట్లుయినను వచ్చి మనకు సంరక్షణనొసంగునట్లుగ మీరు మీ శాయశక్తులతో ప్రయత్నించండి.''

కాని, పై వాక్యములలోగల సలహాప్రకారము కలకత్తాలోని కంపెనీ నౌకర్లు చేయలేదు. వీరి నడతనుబట్టిచూడగ, వీరియెడ కించిత్తయినను మర్యాద చూపవలసిన అవసరము నబాబుకులేదు. అయినను, కోటలను కట్టవద్దనియు, మరమ్మతులుచేయవద్దనియు నబాబు ఉభయులకును—ఫ్రెంచివారికిని, ఇంగ్లీషు వారికినికూడ—మర్యాదగ వ్రాసెను. కాశింబజారులో ఫ్రెంచిగిడ్డంగికి యజమానిగనున్న జీన్‌లా యను నతడు ఇందునుగూర్చి యిట్లు వ్రాయుచున్నాడు :—

“ఇందునుగూర్చి, నేనొక అర్జీని వెంటనే వ్రాసి నబాబుకు పంపుకొంటిని. ఇట్టి అర్జీనే మరియొకదానిని చంద్రనగరమునుండియు తెప్పించి పంపితిని. ఈ రెండు అర్జీలను చూచుకొని నబాబు సంతుష్టుడయ్యెను. అదిగాక, “పాతకోటలను మరమ్మతు చేసుకోవద్దని నేననలేదు. క్రొత్తవి కట్టవద్దంటిని. అంతే” అనికూడ నబాబు నాకు వ్రాసెను. మరియు, చంద్రనగరమునకు పంపబడిన నబాబు హర్కారులకు మావారచ్చట మంచి గౌరవముచేసి, బహుమతులకూడ నొసంగిరి. వారు మమ్ములగూర్చి అనుకూలమగు రిపోర్టును నబాబుకు పంపిరి. అంతటితో ఈ వ్యవహారము ముగిసెను.”

కాని ఇంగ్లీషువారన్ననో ఎట్లయినను నబాబుకు తొందరగలుగజేయ సంకల్పించుకొనిరి. ఇందునుగూర్చి సదరు ‘జీన్‌లా’ యిట్లు వ్రాయుచున్నాడు.

“ఇంగ్లీషువారి నడవడిక వేరుగనుండెను. నవాబు పంపిన హర్కారులను కలత్తాలో అవమానపరచిరట. నబాబును శాంతపరచుటకు మారుగ, ఇంగ్లీషు వారు అతని హుకుముకు పొగరుబోతుజబాబును పంపించిరి. నేనైతే ఆజబాబును కండ్లారచూడలేదుగాని, నమ్మకమైనమనుష్యులు నాతోగట్టిగ చెప్పిరి.”

దిగువ నింకొక నోటువ్రాయుచు “జీన్‌లా” యిట్లు చెప్పుచున్నాడు.

“నబాబుపంపిన హర్కారులతో “డ్రేక్” (అను ఆంగ్లేయుడు) యిట్లు చెప్పెనట. మాకోటచుట్టునున్న కందకమును పూడ్చివేయవలెననిగద మీనబాబు కబురంపెను. సరే, నేనందుకు ఒప్పుకొంటినని చెప్పుము. ఆకందకమును మహమ్మదీయుల తలలతో పూడ్చుటకైతే నేనొప్పుకొంటిననుము. “డ్రేకు” ఈ మాటలను చెప్పెనని నేననుకొనను. కాని, తొందరపాటుగల ఏ యింగ్లీషు కుఱ్ఱవాడో అనాలోచితముగ, యీ మాటలను జారియుండవచ్చును. ఈ మాటలనువిన్న ఆ హర్కారులు వీనిని నబాబుకు చెప్పియుందురు.”

ఇంగ్లీషువారు నబాబుయెడ మిక్కిలి పొగరుబోతుగనుండిరి. ఏలననగ వారు పూర్ణియా పరగణా నబాబగు షౌకత్ జంగ్‌తోచేరి కుట్రపన్నుచుండిరి. ఈ షౌకత్ జంగ్ అనునతడు అలివర్ది ఖానుకు చుట్టము. ఈతడు బంగాళాకు నబాబు కావలెనని ఆశించుచుండెను. ఈతడు టక్కరిమాటలచేతను, నజరానాలచేతను

ఢిల్లీపాదుషాను మాయజేసి, తనపై బెంగాల్, బీహార్, ఒరిస్సా, రాష్ట్రముల సుబేదారీగిరిని ప్రసాదించు ఒక సన్నదును తెచ్చుకొనెను. సురాజఉద్‌దౌలాను తోసివేసి, తనపని నెరవేర్చుకొనుటకు బహుశః యితడు ఇంగ్లీషువారి మద్దతును కూడ చూచుకొని యుండనోపును. ఇందుచే సురాజ్‌ఉద్దౌలా యితనిపై దండయాత్ర వెడలవలసివచ్చెను. "జీన్‌లా" యిట్లు చెప్పుచున్నాడు.

"షౌకత్‌జంగ్ తనమీదికి రానున్నాడని తెలిసి, ముందుగ సురాజ్‌ఉద్దౌలాయే దండయాత్ర వెడలెను. అది సురాజ్‌ఉద్దౌలాకు విలాసమాత్రముగనుండెను. కాని, షౌకత్‌జంగ్‌కు ధైర్యము నిలువలేకపోయెను. సురాజ్‌ఉద్దౌలా తనమీదికి వచ్చుచున్నాడన్న వార్తవినగనే, షౌకత్‌జంగ్‌కు హడలుపుట్టి అతనికి కానుకల బంపుచు, అతనిని శాంతపరచుటకై ఒక లేఖనుకూడ అందులో పంపుకొనెను. తన మీద పుట్టినపుకారులు శుద్ధ అబద్ధమనియు, తనపై కరుణవహింపవలసినదనియు అతడందులో విన్నవించుకొనెను. సురాజ్‌ఉద్దౌలా అతనికట్లే అభయహస్తమిచ్చెను; లేదా యిచ్చినట్లు నటించెను. ఇంగ్లీషువారు తన శత్రువులతోచేరి కుట్రలు పన్నుచున్నారను సంగతి అప్పటికి సురాజ్‌ఉద్దౌలా మనస్సుకు బాగా స్పష్టమైపోయెను. ఇంగ్లీషువారు తనకు వ్రాసిన ఉత్తరములకొన్నింటిని షౌకత్‌జంగ్ సురాజ ఉద్దౌలాకు చూపెనట!"

## నవాబు శత్రువులకు యింగ్లీషువారు శరణమిచ్చుట.

తనపై ఇంగ్లీషువారిట్లు కుట్ర పన్నుచున్న సంగతి నవాబు మనస్సుకు నిశ్చయమైపోవుటకు మరికొన్ని సందర్భములుకూడ గలవు. కృష్ణదాస్ అను నతనిని యింగ్లీషువారు తమ కలకత్తాకోటలో పెట్టుకొని దాచియుంచిరి. ఇతడు సురాజ్‌ఉద్దౌలాకు విరోధియైన "రాజావల్లభ" యను వాని కుమారుడు. నవాబు దౌర్జన్యమునుండి తప్పించుకొనుటకై యితడు తన చరాస్తిని, జనానాను, తన కొడుకు కృష్ణదాస్ చేతికిచ్చి ఇంగ్లీషువారికోటలోనికి పంపించెను. రాజావల్లభుడు డక్కాలో దివానుగనుండగ ఇంగ్లీషువారికి చాల ఉపకారిగనుండెను. 1756 సం॥ జులై 19-వ తేదీన గవర్నర్‌డ్రేకు యిట్లు వ్రాసెను.

"1756 సం॥ మార్చి 16-వ తేదీన కాశింబజారు గిడ్డంగి యజమానియగు విలియం వాట్సునుండి కలకత్తాలోని కంపెనీ ప్రెసిడెంటునకొక జాబు వచ్చినది. దానిపై మానింగ్‌హాముగారి శిఫార్సునుకలదు. రాజావల్లభ యను నతడు తన కుటుంబమును రెండు నెలలపాటు కలకత్తాకోటలో ఉండనివ్వవలసినదనియు,—తన కుమారుడు కృష్ణదాసు స్వస్థతగాంచి, తిరిగి పయనమగుటకు వీలుగనుండువరకు వారి నచ్చట ఉండనివ్వవలసినదనియు—కోరెనని ఆ లేఖలో గలదు. ఈ రాజా

వల్లభునికోర్కె తప్పక మన్నింపవలసినదనియు, యీ 'రాజా' నబాబురాజ్యములో పెద్దయుద్యోగములోనికి రావచ్చుననియు, ఈ ఉపకారమునకు ప్రతిఫలముగ అప్పుడు మనకితడు చాల సహాయముచేసి డక్కా మున్నగుప్రాంతములలో మన వర్తకము బాగుగ సాగుటకు సర్వవిధముల తోడ్పడగలడనియు, కావున, యితని కోర్కెను నిరాకరింపరాదనియు, ఆ వుత్తరములో గట్టిగా శిఫార్సుచేయబడియుండెను..." (పైగ్రంథము వాల్యూం I. పేజీ 120)

కృష్ణదాసును అమీచంద్ అను పంజాబీ వర్తకునింట ప్రవేశపెట్టిరి. ఇతనినే "టక్కరి బంగాలీ"వాడగు "ఒమీచంద్" అని క్రైస్తవ చరిత్రకారులను చుందురు! తామక్కడికి మహాసత్య సంధులైనట్లు! ఈ ఒమీచందును మోసపుచ్చుటకే "స్వర్గమునుండి దిగివచ్చిన మహావీరపురుషుడు" క్లైవు ఫోర్జరీచేసినది!

కృష్ణదాసును అతని ఆస్తితోసహా తనకు అప్పగించవలసినదని సురాజ్ ఉద్దౌలా కోరెను. ఇందుకు ఇంగ్లీషువారు నిష్కర్షగ నిరాకరించిరి. ప్రాచ్య ఖండస్థులకు సహజమగు ఓర్పుతో సురాజ్ ఉద్దౌలా తనకు కంపెనీవారుచేసిన అవమానములనన్నిటిని భరించి, యింగ్లీషువారితో యెట్లయినను సఖ్య పడుదమను తలంపుతో కాశింబజారులో ముఖ్యుడుగనున్న వాట్సును తనవద్దకు రమ్మని కబురంపెను. బ్రిటిషు మ్యూజియములోనున్న హేస్టింగ్స వ్రాత ప్రతులు - వాల్యూము 29, పేజీ 209 లో యిట్లున్నది.

"ఇటీవల సర్వసాధారణముగ ఇంగ్లీషువారి నడతవల్ల నబాబుకు మన యెడల చాల అసంతుష్టి గలిగినట్లు దర్బారునుండి తనకు కబురువచ్చెనని కాశింబజారు గిడ్డంగికి యజమానుడగు వాట్సు యింగ్లీషు గవర్నరునకును, అతని కౌన్సిలుకును తెలియపరచెను. ఇది కాశింబజారును నబాబు ముట్టడించుటకు పూర్వము జరిగినది. 'ఇదిగాక, ఇంగ్లీషువారు తనతో సంప్రతించకుండ, తన అనుజ్ఞ నడుగకుండ కలకత్తా సమీపమున కొత్తకోటలు కట్టుచున్నట్లు నబాబుకు తెలిసెను. ఇది నబాబుకు ఎంతమాత్రము ఇష్టములేదు. ఏలననగ, ఇంగ్లీషువారు కేవలము వర్తకులు; కాబట్టి వారికి కోటలెందుకు? వారు యీ దేశములో వర్తకులుగ బ్రతుకదలచినచో, నబాబుకు ఎట్టి ఆక్షేపణయులేదు. అందుకొరకే మనము (ఇంగ్లీషు వారము) కొత్తగకట్టిన కట్టడములనన్నిటిని వెంటనే పగులగొట్టివేయవలసినదని రాజ్యాధికారియగు సురాజ్ఉద్దౌలా గట్టిగ హుకుము చేసెను."

"సురాజ్ఉద్దౌలా ఇంగ్లీషువారిపై మోపిన నేరముల నన్నిటిని వాట్సు కలకత్తాలోనున్న ప్రెసిడెంటుకును, కౌన్సిలుకును, పూర్తిగ తెలిసియుండలేదని "ఆర్మ్" అను నతడు అనుచున్నాడు. (రెండవ వాల్యూము, 55 పేజ)

వాట్సు తెలియపరచినను, తెలియపరచకపోయినను నబాబు మోపిన నేరములగూర్చియు, అతడు కోరిన కోర్కెల గూర్చియు, కలకత్తాలోని కంపెనీ యధి

కారులకు పూరాగా తెలియనే తెలియును- తెలియదనుటకు వీలులేదు. కాని, యెట్లయిన అల్లరిచేయవలెనని కూర్చున్న వీరు నబాబు మాటలనన్నిటిని పెడచెవిపెట్టిరి. అతని మాటలనన్నిటిని తృణీకారభావముతో తోసివేసిరి. ఇట్టిస్థితిలో ఇంగ్లీషువారిని తన రాజ్యములోనుండి తరిమివేయుటకు పూనుకొనుట తప్ప నబాబుకు వేరొండు మార్గములేకుండెను. 1756 సం॥ జూన్ 1-వ తేదీన కోజావాజిల్ అను ఆర్మీనియన్ దేశస్థునకు నబాబు యిట్లు వ్రాసెను.

ఇంగ్లీషువారిని నాదేశములోనుండి తరిమివేయడానికి నాకు ముఖ్యముగ మూడు కారణములున్నవి. రాజ్యశాసనములకు విరుద్ధముగ వారు నారాజ్యములో బలిష్టమగు కోటలను కట్టుకొని, పెద్ద కందకములను త్రవ్వుకొనిరి. ఇది ఒక కారణము. సుంకములులేకుండ వర్తకము చేసుకొనవచ్చునని నేను వారికిచ్చిన ఫర్మానాను వారు దుర్వినియోగపరచి, యిందుకేర్పడిన చీట్లను (దస్తకులను) అట్టి హక్కులేనివారి కమ్ముకొని, నారాజ్యాదాయమునకు నష్టము గలిగించిరి. ఇది రెండవ కారణము. ఇక మూడవకారణము ఏమనగ:—నా కొలువులోఉండి, నేను వారికిచ్చిన ఉద్యోగములలో తప్పుడు పనులుచేసి, నాకు జబాబు చెప్పవలసియున్న నా నౌకర్లను ఇంగ్లీషువారు తమ కోటలో దాచియుంచి, నేను కోరినప్పుడు వారిని నాకు అప్పగించరైరి. ఈ రీతిగ వారు నా న్యాయ నిర్వహణ విధియందు అడ్డము వచ్చుచున్నారు. ఈ మూడు కారణములచేత నేను వారిని రాజ్యమునుండి తరిమి వేయవలసిన అవసర మేర్పడినది.'' (వాల్యూం I, పేజీ 4)

ఇంగ్లీషువారిపై చర్యతీసుకొనుటకు నబాబుకు న్యాయమైన కారణము లుండెనని చరిత్ర నిశ్చయముగ తీర్పుచెప్పుచున్నది. వీరి దుర్నడతవలన నబాబుకు వీరియందు చాల రోతపుట్టెననుట నిర్వివాదము. కలహమునకు సంబంధించిన యావత్తు స్థితిగతులను బాగుగ నెరింగిన యస్. సి. హిల్లుకూడ యిట్లని ఒప్పుకొనక తప్పినదికాదు:—

ఇంగ్లీషువారిపైకి తాను దండెత్తివచ్చుటకు నబాబుచెప్పిన కారణములన్నిటియందుకూడ సురాజ్ఉద్దౌలాయెడ పైకి న్యాయము గన్పించుచున్నదనుట స్పష్టము (వాల్యూం I, పేజీ LV)

## కలహ ప్రారంభము-కాశింబజారు ముట్టడి

తనరాజ్యములో సరుకులు అమ్ముకొని బ్రతుకుచున్న యీ కిరస్తానీ కిరాట కీచకులచే మాటిమాటికి యిట్లు అవమానింపబడి, తృణీకరింపబడిన నబాబు సురాజ్ఉద్దౌలా వీరి నెట్లయినను తనరాజ్యములోనుండి తగిలివేయవలెనని గట్టిగ పట్టుపట్టెను. ఈ ఉద్దేశముతో అతడు మొట్టమొదటగ చేసినపని యేమనగ:—

కాశింబజారులోనున్న ఇంగ్లీషువారి గిడ్డంగిని ముట్టడించుటకై మే నెల 24-వ తేదీన ఒక దండునుపంపెను. ఆ గిడ్డంగి యీ దండుముందు నిలువగలిగినంత బలమైన స్థితిలో లేకుండెను. కాబట్టి, ఎంతమాత్రం యీదండును ఎదిరింపక అక్కడ యజమానిగనున్న "వాట్సు" అను ఇంగ్లీషువర్తకుడు నబాబు అధికారులచేతులలో చిక్కెను. ఇంగ్లీషువారి ప్రతిష్టకిది యెంతయో దెబ్బగనుండెను. ఇంగ్లీషువారు తిరుగుబాటుదారులు. అయినను, దయాళువగు నబాబు వారి నట్లు యెంచి శిక్షించలేదు. వారినందరిని చంపించి తనపని తేలికచేసికొని యుండలేదు. ఆతడట్లు చేసి యుండినచో, తాను దయజూపిన యీ కిరాటకీచకులవల్ల తదుపరి తనకట్టిగతి పట్టెడిది కాదుగద! ఈ కిరాటులకు కృతజ్ఞతయనున దెక్కడవున్నది? సురాజ్ ఉద్ దౌలా తమయెడజూపిన కారుణ్యమును వారెట్లు గ్రహించగలరు? సురాజ్ ఉద్ దౌలాచే పట్టుపడిన వాట్సునుగూర్చి 'జీన్ లా' యిట్లు వ్రాయుచున్నాడు. "సురాజ్ ఉద్దౌలా మోసములో యితడు పడియున్నమాట వాస్తవమేయైనయెడల, యితడు మాత్ర మేమిచేసెను? ఇతడు కసిదీర్చుకొనెనుగద." (వాల్యూం III. పేజీ 167.)

యస్. సి. హిల్లు యిట్లు వ్రాసెను. "వాట్సు తెలివితక్కువవాడుకాడు. సురాజ్ ఉద్దౌలా పదభ్రష్టుడగుటకు క్లైవు పలాశయుద్ధములోగొన్న జయము ఎంత కారణమో, యీవాట్సు మూర్షిదాబాదులోచేసిన మంత్రాంగమును "అంతకారణమే" (వాల్యూము I పేజీ LXII)

ఇక్కడ మంత్రాంగమనుమాటకు "విశ్వాసఘాతుకమని" యర్థము చెప్పుకొనవలెను.

కాశింబజారు గిడ్డంగిని నవాబుదండుకు సులభముగ వప్పగించినందుకు వాట్సును "హాల్ వెల్లు" నిందించెను. 1756 సం॥ నవంబరు 30-వ తేదీన యితడు కంపెనీడైరెక్టర్లకు వ్రాసిన యుత్తరములో నిట్లున్నది:—

"..............." నబాబుదండును బహుకాలమెదిరించి నిలుచుటకు తగినంతబలము మనవద్ద లేకుండెనను సంగతిని నేను అంగీకరింతును. కాని, మనము కొద్దిగనైనను యెదిరించి నిలిచియుండినచో, నబాబు మన గిడ్డంగిని ముట్టడించి. అంతసులభముగ గైకొనెడివాడుకాడని నేను తలంచుచున్నాను. అతనికి కొంతకాలము పట్టెడిది. అతనిసైన్యము కొంత నష్టమయ్యెడిది. అతని ప్రధాన దండునాయకులు కొందరైనను చచ్చెడివారు. మనమాతనికి యిటువంటిదెబ్బ కొంచెము తగిలించియున్నచో, మనమంటే కొంచెము కబడదారుగనైనా ఉండేవాడు. అది మనకెంతో భవిష్యత్తుకు లాభకారిగ వుండేది. తన తీవ్రతను, తన యుద్యోగుల తీవ్రతను, తగ్గించుకొని ఒక మెట్టుదిగి మనతో నబాబు రాయబారమునకు దిగేవాడు......మనము కనీసము 24 గంటలైనా నిలువబడియుంటే ఎంతో బాగుం

డేది. అతడు తిరిగి కలకత్తామీదికి అంతత్వరలో వచ్చెడివాడుకాడు........" (వాల్యూం I, పేజీ 12)

కాని, కాశింబజారులోని గిడ్డంగి అంతమాత్రముకూడ నిలువబడగలస్థితిలో లేదని సమర్థులగు పెక్కండ్రు తలంచుచున్నారు.

సురాజాఉద్దౌలాపై విజయదేవత ప్రసన్నమైనట్లు గాన్పించెను. ఒక్క తుపాకికూడ కాల్చ నవసరములేకయే కాశింబజారు గిడ్డంగి సురాజ్ఉద్దౌలాచేత చిక్కెను. జూన్ 5-వ తేదీన నబాబు కలకత్తామీదికి దాడి బయలుదేరెను. కాశింబజారులో అతనికి కనీసము కొద్దిరోజులయినను పని పట్టియుండినయెడల, అతడు కలకత్తామీదికి వచ్చుటకే దుస్సాధ్యమయ్యెడిది. ఇందునుగూర్చి 'హాలోవెల్లు' యిట్లు వ్రాయుచున్నాడు:—

"నబాబుసేనకు కాశింబజారులో కనీసము రెండు మూడు రోజులైనను పని పట్టియుండిన యెడల వారు తరువాత కలకత్తాకు వచ్చుటయే దుర్ఘట మయ్యెడిది. ఏలననగ, అప్పుడు పెద్ద మురికి వానలు కురిసెను. ఈ వానలో, బురదలో, నబాబు సేనకు చాల యిబ్బంది గలిగెడిది. వారి నడకకు, వారి ఫిరంగులకు, చాల యిబ్బంది గలిగెడిది. వారు మన కలకత్తా నంత సులువుగ ముట్టడించలేక పోయెడివారు. కాని, కాశింబజారు అనాయాసముగా అతనిచేత బడుటచే నబాబు త్వరితగతిని మన కలకత్తామీదికి నిరాటంకముగ—వానవల్ల బాధలేకుండ—వచ్చి పడుటకు మంచి వీలు చిక్కెను. కలకత్తా నబాబుచేతపడి, నేను అతని ఖైదీగనున్న రాత్రి,-21-వ తేది రాత్రి-కుంభవర్షముకురిసెను. తరువాత చాల రోజులవరకు మురికి వాన కురియుచునే యుండెను. నబాబు తుపాకులన్నియు మందుకూరేకట్టెలగుటచేత, దమ్ముకుపోయి, పనికిరాకుండపోయెడివి." (వాల్యూం II, పేజీ 13-21)

## కలకత్తా ముట్టడి.

సురాజ్ఉద్దౌలా కలకత్తామీదికి చేసినయాత్ర అత్యద్భుతము. అతని నౌకర్లే గనుక అతనియెడ విశ్వాసముతో పనిచేసియుండినచో, ఆతడెంతటి ఖ్యాతి కెక్కెడివాడోగద! యస్. సి. హిల్లు యిట్లు వ్రాయుచున్నాడు.

"మండు వేసవిలో, రోడ్లులేనిదేశములో, ఏనుగులచేతను, ఎడ్లచేతను ఈడ్వబడే అతిభారమగు ఫిరంగులతో, నబాబుసేన పదకొండు రోజులలో 160 మైళ్లదూరము గడచి వచ్చెను." (వాల్యూం I, పేజీ LXIII)

అప్పటి పరిస్థితుల నన్నిటిని పరిశీలించి చూచినచో యిది అనన్య సామాన్యమగు సైన్యధాటియని చెప్పనొప్పును.

కలకత్తా దాడిలో మధ్య "తానా" * కోటను సురాజ్-ఉద్దౌలా ఇంగ్లీషు వారినుండి లాగికొనవలసివచ్చెను. నబాబు సేనలు ధైర్యముతోపోరి, ఇంగ్లీషు వారిని పూర్తిగ నోడించెను.

కలకత్తాను వశపరచుకొనుటకై జరిగిన పోరాటము నిట విపులముగ వివరింపవలసిన పనిలేదు. ఇంగ్లీషువారిని శిక్షించువిషయములో తనరాజ్యములో వర్తకముచేసికొనుచున్న పరాసులును, ఒలందాలును, తనకు సహాయముచేయుదురని సురాజ్ఉద్దౌలా తలచెను. ఈ యుభయజాతులవారిలో మాత్రము దూరదృష్టి గల రాజనీతిజ్ఞులుండియున్నను వారు తప్పక నబాబుకు శాయశక్తుల సహాయము చేసెడివారే. ఏలననగ, అట్లు చేయుటవలన తమకు వర్తకములో గొప్ప పోటీగ నున్న ఇంగ్లీషువారిని తరిమివేసికొన్నవారై యుందురు. కాని, వారి దురదృష్ట వశాత్తు వారటుచేయరైరి. అందుకు ప్రతిఫలముగ తుదకు తామే యింగ్లీషువారి వల్ల దేశమునుండి తరిమివేయబడిరి.

సురాజ్ఉద్దౌలాకుగల శాంతిప్రియత్వమును మనమెంత పొగడినను తీరదు. కాశింబజారును పట్టుకొన్నపిమ్మటనైనను ఇంగ్లీషువారు తనతో సంధికివత్తురని నబాబు తలచెను. కాశింబజారుగిడ్డంగికి యజమానుడగు వాట్సు నబాబుకు ఖైదీగ చిక్కెను. ఇతడును, ఇతనితో ఖైదీగనున్న కోలెట్ అను ఇంకొక ఆంగ్లేయుడును కలిసి 1756 సం॥ జూలై 17-వ తేదీన చంద్రనగరమునుండి సీమలోని డైరక్టర్లకు ఇట్లని వ్రాసిరి :—

"బంగాళాదేశములో మీా ఎస్టేటు దోచుకొనబడుట, మీాస్థానము లన్నియు నష్టమగుట, మీా నౌకర్లందరు నాశనమగుట, వీరితోపాటు వేలకొలది కలత్తా పౌరులును సకల అవస్థలపడుట - ఘోరమగు యీాదుర్దశయంతయు మన కలకత్తా గవర్నరును కౌన్సిలువారును నబాబుకు కొంతసొమ్మిచ్చి సఖ్యపడి యుండినచో తలస్థించి యుండకపోవునని మా నమ్మకము. ఇందుకొక్క నిదర్శనమును జూడుడు. నబాబు కాశింబజారులో యుద్ధసామగ్రితప్ప మన తాలూకు వస్తువులను వేనినికూడ ముట్టుకొనగూడలేదు. మరియు, కలకత్తాను స్వాధీనపరుచుకొనువరకు అతడు ఏ పట్టణములోగాని, ఏ గిడ్డంగిలోగాని, మనసామానులను వేనిని ముట్టుకొనలేదు. నబాబు దివానగు "రాయదులాబ్" అను ఆయన నేను ఖైదులోనుండగ నన్నునేక పర్యాయములు తనవద్దకు పిలిపించుకొని "మీారు కోటిరూపాయలు అపరాధము చెల్లించితే మిమ్ములను వదలిపెడతాము" అని నవ్వుచుచెప్పెను. "మా ఎస్టేటుఅంతా కలిపినాగాని కోటిరూపాయలవిలువలేద"ని

* ప్రస్తుతము కలత్తాలో 'సిబ్బిపురం' అనుచోట నున్న (Royal Botanical Gardens) అనబడు తోటఉన్న ప్రదేశములోనే యీాతానాకోటగలదని రెవరెండ్ లాంగ్ తలంచుచున్నాడు;

నేను చెప్పినప్పుడు "అట్లయితే, యిరవై లక్ష లిస్తారా"యని దివానడిగెను. కంపెనీ తాలూకు బంగాళాదేశములోని సాలుసరి వర్తకమంతా కలిపినా ఇరవై లక్షలకు మించదని" నేనంటిని. "ఐతే, మీరెంత యిచ్చుకోగలరో చెప్పండి" అని దివానడిగెను. "ఎటుచెప్పడానికి, మాకు అధికారములేదు. మమ్ములను కలకత్తాకు ఉత్తరము వ్రాసుకోనిస్తే, మావారిని కనుక్కొని చెబుతాము" అని నేనంటిని. ఇందుకు దివాను ఎంతమాత్రము ఒప్పుకోలేదు. "ముందుగ కలకత్తా నుంచియే, యేమైనా రాయబారపు మాటలువస్తే, అప్పుడు చూసుకుందాము. అవసరమైతే అప్పుడు మీరు మీ యిష్టమువచ్చినన్నిసార్లు వ్రాసుకోవచ్చును" అని దివాననెను. మాచుట్టును నబాబు మనుష్యులుఉండి, మమ్ము నెల్లప్పుడు కాపలాకాయుచుండుటచే మేము కలత్తాకు ఉత్తరమువ్రాసుకొనుటకు వీలుచిక్క లేదు. హుగ్లీని సమీపించిన పిమ్మట మాకు కావలసిన యేవో వస్తువులకొరకై అక్కడనున్న ఒలందాడైరక్టరుకు వ్రాసుకొనుటకు మాకు అనుజ్ఞ ఇవ్వబడెను. ఈఅవకాశము చూసుకొని మేమొక ఉత్తరమువ్రాసి ఒలందాడైరక్టరుద్వారా కలకత్తాకు పంపుకొంటిమి. "తగు మనుష్యుని నబాబునద్దకు పంపిగాని, లేక మాకే అధికారమిచ్చిగాని, నబాబుతో సంధిచేసికొనుటకు ఏర్పాటుచేసినయెడల, నబాబుకేదో కొంతసొమ్మిచ్చి అతనితో సమాధానపడుటకు ఇప్పటికైనను అవకాశమున్నది సుమా" అని మేమెంతో ఆశతో ఆఉత్తరములో వ్రాసితిమి." (పై గ్రంథము వాల్యూం I, పేజీ 103)

కాని, నబాబుతో యెట్టి సంధిగాని చేసికొనకుండుటకు కలకత్తాలోని కంపెనీ యధికారులు కృతనిశ్చయులై యుండిరి. సురాజ్ఉద్దౌలా కోర్కె మితముగ నుండెను. అతడు తన ఇరుగు పొరుగు వారితో సఖ్యపడి యుండవలెననియే కోరుచుండెను. కాని, పాపమతనికి తనచుట్టూచేరిన కిరస్తానీ కోమటుల సంగతి పూర్తిగ తెలియదు. వారు తనపై కత్తులునూరుచున్నారన్నసంగతి అతనికి పూర్తిగ తెలియదు.

## ఇంగ్లీషు వారి కుట్ర.

అయితే, నబాబుసేనలను బహిరంగముగ, న్యాయమైన యుద్ధములో, ఎదిరించుటకు తమకు శక్తిలేదని యింగ్లీషువారికి బాగా తెలియును. కాబట్టి, వారు చేసిన పనియేమి? నబాబుకొలువులో స్వామిద్రోహులను పురికొల్పుటకును, అతని కొలువునుండి కొందరిని చీలదీయుటకును కంపెనీవారు పూనుకొనిరి. 1756 సం॥ జూలై 19-వ తేదీన డ్రేకు అను ఇంగ్లీషుగవర్నరు ఇట్లు వ్రాసెను.

"నబాబుసేనలో పనిచేయుచున్న యూరోపియనులను, బుడతకీచులను చీలదీయుటకొరకు పన్నాగము పన్నితిమి. క్రైస్తవమత పీఠాధిపతులనుండి మూడు శ్రీ

ముఖముల తెప్పించితిమి. మహమ్మదీయుల కొలువులోచేరి కైస్తవులకు వ్యతిరేకముగ పోరాడుట కైస్తవధర్మమునకు విరుద్ధముగావున, సదరు కొలువును తక్షణమే వదలివేసి, ఇంగ్లీషువారికొలువులో చేరకపోయినచో కైస్తవమతమునుండి వెలివేతుమనియు, శిక్షింతుమనియు ఆ శ్రీముఖములో భయపెట్టబడెను. మరియు, మహమ్మదీయుల కొలువునువదలి, ఇంగ్లీషువారి కొలువులో చేరినయెడల తమకు మంచిజీతము లివ్వబడునని సదరు శ్రీముఖములలోగలదు. ఈ మూడు శ్రీముఖములను నబాబుశిబిరములోనికిపంపి, మొట్టమొదటగ కనిపించిన కైస్తవోద్యోగికి ఇచ్చునట్లు ఏర్పాటు చేసితిమి. ఈ శ్రీముఖముల జూచుకొగానే, అక్కడి కైస్తవు లేమనిరి ? ఈ పాపపు సంగతి తమకు ముందుగనే తెలిసియుండినచో తామీ కొలువులో చేరకపోయి యుందుమనియు, తీరాచేరినతరువాత, ఇప్పుడెట్లు విడిచిపెట్టిరావచ్చుననియు వారు తలచిరి. ఇప్పుడు తప్పించుకొనివచ్చుటకు అవకాశములేదని వారనిరి.'' (పై గ్రంథము వాల్యూం I, పేజీ 140-141)

అడ్డమైన కిరస్తానీ వాళ్లను, నీతి జాతిలేని వాళ్లను, తిన్నయింటి వాసముల లెక్కపెట్టు స్వభావము గలవాళ్లను, నీచమగు డబ్బుకు గడ్డితిని తనను పోషించు యజమానికి ద్రోహమొనర్చుటకు జంకని నీచులను, దేశ ద్రిమ్మరులను తమ కొలువులో చేర్చుకొనుటవల్ల అనేకమంది భరతఖండపురాజులు దుర్దశలపాల్గావలసివచ్చెను. ఇంగ్లీషువారు చేసినట్లుగనే, భరతఖండపురాజులును, తమ హిందూమత పీఠాధిపతులనుండియు, మహమ్మదీయ ముల్లాలనుండియు యిట్టి శ్రీముఖములనే తెప్పించి, కిరస్తానీ కొలువులోచేరి తమ తమ మతములకు విరుద్ధముగ పోరాడుట ధర్మ విరుద్ధమని, పాపమని, బెదరించి, ఇంగ్లీషుసేనలోనున్న హిందూమహమ్మదీయ శిపాయిలను చీలదీయుటకు ప్రయత్నించి యుండినచో యేమయ్యెడిది ? ఈ కిరస్తానీ ఇంగ్లీషురాజ్య మిక్కడ అసలు ఏర్పడేదేనా ?

నబాబుతో సంధిచేసుకొనుటకు ఇంగ్లీషువారికి ఇష్టములేకున్నను, తాము నబాబుతో యెదురుబడి, న్యాయముగ, ముఖాముఖిని పోరాడలేమను సంగతి వారికిని తెలియును. వారివద్ద ఫిరంగులుగాని, మందుగుండుగాని లేకుండెను. ఇవి వారికిగల రెండు పెద్దలోపములు. ఇంగ్లీషువారికి స్వార్థపరత్వము లేదని యెవరుగాని కలలోకూడ తలంపరు. స్వార్థరహితమను గుణమును ఇంగ్లీషువారికింతవరకెవరును ఆరోపించియుండలేదు. స్వార్థము ముందర వారికిక యెట్టి యోచనగానితట్టదు. నబాబు కలకత్తా మీదికి దండెత్తి వచ్చుచున్నాడన్నకబురు వినగానే, కలకత్తాలో దేశీయులున్న భాగమును రక్షింపక వదలివేయుదమని అక్కడనున్న ఇంగ్లీషువారు తక్షణమే తీర్మానించుకొనిరి. ఇందునుగూర్చి గవర్నర్ డ్రేకు ఇట్లు వ్రాయుచున్నాడు.

''సురాజ్ ఉద్దౌలా సేనవచ్చుచున్నదని వినగనే నల్లజనమంతా, నల్లవర్తకులందరు హడలిపోయిరి. తమ పెళ్లము బిడ్డలను, సామానులను, ఎక్కడికో పంపించి,

సేన పట్టణములోనికిరాకుండ రోడ్లకు చెట్లు బండలు అడ్డము వేయవలసినదని చెప్పితిమి'' (వాల్యూము I పేజీ 139)

''కాని, ప్రజలెవరును ఈ మాటలను పాటించలేదు. ఏలననగ, ఎట్లయినను, యీ కిరస్తానీ కోమట్లవల్ల తమకు రక్షణ గలుగదన్న సంగతి వారెరుగుదురు. ఈ చెట్లు బండలు వేసినంత మాత్రముచేత నవాబుసేన ఆగిపోదనియు వారెరుగుదురు. కాబట్టి, 'గోవిందరామ్ మిత్తర్' అను నతడు తప్ప, ఇంకెవరును ఇంగ్లీషువారు చెప్పిన ప్రకారముచేయలేదు. ఈ గోవిందరాముడు ''తాను కాపురమున్న బాగ్ బజారులో చెట్లను పడగొట్టించి దోవకడ్డముగ వేయించెను. రోడ్లను పగుల గొట్టించి గోతులజేసెను. మనఇంగ్లీషువారు కాపురమున్న చోటికివచ్చే త్రోవల నన్నింటిని మూయించెను. ఈ రీతిగ సేనకు త్రోవ లేకుండునట్లుగ చేసెను. సేనవచ్చి ఇండ్లలో మకాముచేయకుండుటకై, చుట్టుపట్టులనున్న చాలయిండ్లను పడగొట్టించెను,'' అని గవర్నర్ డ్రేకు (పై గ్రంథము 140 పేజీలో వ్రాసియున్నాడు.)

ఈ గోవిందరాముడు తప్ప ఇంకెవరును ఇంగ్లీషువారు చెప్పిన ప్రకారము చేయలేదని చెప్పితిమి. కారణమేమనగ, ఇంగ్లీషువారు నల్లప్రజలను సంరక్షించుటకు బదులుగ, కేవలము తమ్మును మాత్రమే రక్షించుకొనుటకు గాను చుట్టుపట్టుల నున్న నల్లవాండ్ర ఇండ్లను ఇంగ్లీషువారు తగులబెట్టించుచుండిరి. ఇందును గూర్చి డ్రేకు పై గ్రంథము 144 పేజీలో ఇట్లు వ్రాయుచున్నాడు:—

''శత్రుసేన దగ్గరకు వచ్చుచున్నదన్న భయంకరవార్తలు తరుచు వినవచ్చుచుండెను. ఈదెబ్బను తట్టుకొనుటకు మార్గము ఎంతవిశాలముగఉంటే అంత మంచిదనితలచి, మేము చుట్టుపట్టులనున్న పూరియిండ్లకన్నింటికి నిప్పంటించితిమి. ఈ నిప్పు చాలదూరమువరకు వ్యాపించెను.''

ఇట్టిస్థితిలో కూలీలు, లాస్కర్లు, నౌకర్లు ఇంగ్లీషువారిని వదలిపోయిరన్నచో ఆశ్చర్యమేమి? కలకత్తాలో క్రైస్తవేతరులగు దేశీయులకెవరికిని ఎట్టిరక్షణను ఒసంగక, క్రైస్తవులగు ఆర్మీనియనులకు, బుడతకీచులకు,—తమ ఆడవాళ్లతో, పిల్లలతో, సామానులతోసహా—గిడ్డంగిప్రక్కనున్న ఇండ్లలో సురక్షితముగ శరణమిచ్చిరి!

జూన్ 16-వ తేదీన నవాబు కలకత్తా చేరెను. ఆరోజు మరునాడుకూడ చిల్లరపోరాటములు జరిగెను. కాని, పెద్దముట్టడి 18-వ తేదీవరకు నవాబు ఆపుదల చేసియుంచుకొనెను. ఏలననగ, ఆరోజు శుక్రవారము. మహమ్మదీయులకు శుక్రవారము శుభప్రదమైనరోజు. అదిగాక, ఆరోజు మొహర్రం. ఉపవాసదీక్షాదినములలో శుభప్రదమగు 19-వ రోజుకూడ అయెను. ఆరోజుననే, ఇక ముట్టడి జరుగబోవుచున్నదని తెలిసి, చేచిక్కిన శత్రువు నెవరిని ప్రాణముతో పోనీయవద్దని ఇంగ్లీషువారొక దురంతమగు శాసనమును తమ నౌకర్లకు జారీచేసిరి.

అంతయేల, కలకత్తాలో ఇంగ్లీషువారు చేయుచున్న ఘోరకార్యములను తలచుకొన్నప్పుడు యీశాసనమొక ఘోరముగ గన్పట్టదనియు చెప్పవలెను. ఒమీచంద్ ఇంగ్లీషువారికి చాల అండగనుండెను. ఇతని తోడ్పాటులేనిదే కంపెనీవారు బంగాళాదేశములో అంతపెద్ద వర్తకమును నిర్మించుకొనుటకు వీలే లేకపోయెడిది. కాని, వారికిచేసిన మేలుకు ప్రతిఫలముగ యితనికేమి ముట్టెను? తొట్టతుదకు వారివల్ల ఇతనికి చీవాట్లు, చెప్పుదెబ్బలుతప్ప ఇంకేమియు ముట్టలేదు. కలకత్తాను సురాజ్ ఉద్దౌలా ముట్టడించబోవు సమయమున ఈ ఒమీచందు పోయి, తీరా అతనిలోచేరి, తమకు అపకారముచేయునేమోయను ఉలుకు ఇంగ్లీషువారి కడుపులో పుట్టెను. పాపపు మనస్సాక్షికి ఇట్టి ఉలుకే పుట్టునుగదా! అంతట ఇంగ్లీషువారేమిచేసిరి? ఒమీచందును పట్టి బంధించి చెరసాలలోవేసిరి! ఇతనిని పట్టుకొనుటకు ఇంగ్లీషుశిపాయిలు యితని యింటికి వెళ్లినప్పుడు, ఇతడు ఎంతమాత్రమును ఎదిరించక, శిపాయిలకు వశుడయ్యెను. కాని, మన కిరస్తానీ ఇంగ్లీషువారికి అప్పటికిని ధైర్యము నిలువలేదు. ఇతని బావమరిది హజారీమాలును, ఇతనిఇంట అతిథిగనున్న కృష్ణదాసునుకూడ ఖైదుచేయవలెనని వారు చూచిరి. కాని, వీరిరువురును అంతసులువుగ స్వాధీనము కాలేదు. తమ్మును పట్టుకొనవచ్చిన ఇంగ్లీషు శిపాయిలపై తమ నౌకర్ల చేత వీరిరువురును తుపాకుల గాల్పించిరి. హజారీమాల్ ధైర్యముతో పోరాడి, తన ఎడమచేయి తెగిపోవువరకు శిపాయిలకు దొరకలేదు.

కృష్ణదాసు ఇంగ్లీషువారికి అతిథిగనుండెను. అతిథిని అగౌరవపరచుట భరతఖండవాసులకు చాల ఘోరపాపముగ గన్పట్టును. భరతజాతికిది అవమానము. కాబట్టి ఇంగ్లీషువారు కృష్ణదాసును బంధించుటవల్ల అందరికి వారియెడ పరమ అసహ్యము గలిగెను.

కాని, యింతకంటె ఘోరమగు అత్యాచారము జరిగినది. ఇంగ్లీషువారు తమ శిపాయిలను ఒమీచందు ఇంటిలో స్త్రీలున్న జనానా లోనికికూడ పంపించిరి. దీనికి కారణము సులభముగ ఊహింపనగును. ఈదృశ్యమును జూచినప్పుడు అక్కడనున్నవారి రక్తము ఉడుకెత్తెను. ఒమీచందుని జమేదారు ఈ దృశ్యమునుచూచి సహించలేకపోయెను. అత డప్పుడు చేసిన పని అత్యద్భుతము. రోమక సామ్రాజ్యచరిత్రను చిత్రించిన గిబ్బన్ వంటి ప్రతిభాశాలియగు చరిత్రకారుడే యీ సంఘటనమును చిత్రించియుండి యున్నచో, ఆజమేదారుని చర్య ప్రపంచమును ఆశ్చర్యనిమగ్నమొనర్చియుండును. ఇందునుగూర్చి 'ఆర్మ్' అను నతడు తన గ్రంథమందు యిట్లు వ్రాసెను.

“ఒమీచందుని నౌకర్లలో పెద్దవాడగు ఈ జమేదారు పెద్దవంశమున పుట్టినవాడు. ఇతడు తక్షణమే యింటికి నిప్పంటించెను. పరులు జానానా లోనికి జొరబడు అగౌరవమునుండి స్త్రీలను రక్షించుటకుగాను, ఆతడు వెంటనే స్వయ

ముగ జనానాలోనికి జొచ్చుకొనిపోయి, తనచేతితో పదముగ్గురు స్త్రీలను నరికి వేసెను. అటుపిమ్మట, తాను పొడుచుకొనెను. కాని, అతడనుకొన్నట్లు అతడు చావలేదు.'' (వాల్యూం II పేజీ 60)

తమరక్షణలోనున్నవారిపై యింతటి ఘోరకార్యములగావించినను, ఇంగ్లీషు వారికి నబాబుచేతిలో ఓటమితప్పలేదు. నబాబుసేనలో ఫిరంగులు కాల్చుట కేర్పడిన క్రైస్తవులు విశ్వాసముతో ప్రవర్తించక స్వామి ద్రోహముచేసిరి. ఎస్. సి. హిల్లు కూడ యిట్లు వ్రాయక తప్పినది కాదు.

''శత్రుసేనలోవున్న పెద్దఫిరంగులను అచ్చటనున్న పరాసు, బుడతకీచు సైనికులు కావలెనని సరిగకాల్చలేదు. అందుచే తగినంతపని జరుగలేదు......'' (పై గ్రథము వాల్యూ I, పేజీ LXXXVII)

క్రైస్తవేతరులగు సైనికులు మాత్రము సరిగపనిచేసిరి. 1756 సం॥ డిశంబరు 15-వ తేదీన ఈస్టిండీస్‌నుండి వ్రాయబడి, 1757 సం॥ జూన్ నెల తాలూకు **Gentleman's Magazine** అను పత్రికలో ప్రచురమైన ఒకానొక లేఖలో యిట్లున్నది:-

''కోటచుట్టు కంపెనీ కౌన్సిలర్ల యిండ్లున్నవి. చిక్కంతయు దీనివల్లనే జరిగి నది. ఈ యిండ్లలో శత్రువులుచేరి, ఇంగ్లీషువారిని చాల వేధించిరి.'' (పై గ్రంథము వాల్యూం III పేజీ 73)

తాము కోట బురుజులపై నిలువబడి శత్రువులు కాల్చుచున్న ఫిరంగుల నెదిరించుటకు ఇంగ్లీషువారికి దుస్సాధ్యమయ్యెను. నబాబు సేనలో ఫిరంగులవద్ద నున్న క్రైస్తవులు నబాబు యెడ ద్రోహముగ ప్రవర్తించినను ఇంగ్లీషువారి కేమియు లాభము లేకపోయెను. పైపెచ్చు వారు నబాబుసేనచే పూర్తిగ ఓడింప బడిరి. ఇంగ్లీషువారి ప్రయత్నములన్నియు నిష్ఫలములయ్యెన్ను. ఇంగ్లీషు జాతికి చెందిన చరిత్రకారుడే ఒక డిట్లు వ్రాయుచున్నాడు.

'' అట్టి పరిస్థితులలో కోటను వదలిపెట్టి, ఓడలమీదికి పారిపోవుద మను తలంపు కోటలోని వారికి గలుగుట సహజమే. అయితే, యీ పలాయనము గౌరవ హీనముగాకుండ చేసియుండిన బాగుండెడిది. కాని, కోటలోని వారట్లు చేయలేదు. వారిలో వారికి కలయిక లేకపోయెను. ఎవరికి వారు ఎట్లయినను తప్పించుకొని పారిపోదమని కంపెనీవారిలో ప్రధానులే కాళ్లు విరుగద్రొక్కుకొనిరి. తక్కినవారి గతి ఏమైననుసరే యను ఆతురతతో పారిపోయిరి. ఇది ఘోరము. ఈకారణముచే యీ ముట్టడి ఆఖరుకు యింగ్లీషువారికి తలవంపులు ఘటించునదిగ పరిణమించెను. వారిట్టి నీచమగు అవమానమును ఎన్నడును పొంది యుండలేదు.'' (తారన్‌టన్ వ్రాసిన '' బ్రిటిష్ సామ్రాజ్య చరిత్ర వాల్యూమ్ I. పేజీ 190)

ఇంగ్లీషువారు సహజముగ పిరికివారు. సురాజ్ ఉద్దౌలా చూపిన ఉత్తమ రణ ప్రావీణ్యముముందు వారు గాబరాపడి చెల్లాచెదరైరి. యస్. సి. హిల్లు యిట్లు వ్రాయుచున్నాడు :—

"కోటలో నున్న మనుష్యులు అదుపులో లేకుండిరి. వారందరు తప్ప త్రాగియుండిరి. పనిలోనికి రమ్మని పిలిచిన తమ ఉద్యోగులపైననే వారు తుపాకులగాల్ప బూనిరి." (వాల్యూం I. పేజీ LXXX)

కోటలోనున్నవారెంత గాభరాపడినది జాన్ కుక్ అనునతడు వ్రాసినదానిని బట్టి తెలియును. ఇతడప్పుడు కోటలోనుండి సర్వమును కండ్లారజూచెను :—

"కోటను రక్షించుకోవలసి వచ్చేటప్పటికి యిక మా అవస్థచూడండి. ఎక్కడచూచిన అల్లరి ఆగము తప్ప వేరులేదు. ప్రతివాడు సలహా చెప్ప జూచేవాడే గాని, (క్రియ ఒక్కడు చెయ్యడు). నిజముగ సలహా చెప్పదగినవా డొక్కడును లేకుండెను." [వాల్యూం III. పేజీ 296]

కోటలోనున్న విదేశస్థులు పూర్ణాహుతి గాకపోవుటకు నబాబు దయాదాక్షిణ్యములుతప్ప యింకొకటిలేదు. దీనికి పైన పేర్కొన్న "కుక్కు" మాటలే సాక్షి. ఆత డేమనుచున్నాడో వినండి :—

"కోటనిండ జనము కిటకిటలాడుచుండిరి. బుడతకీచుస్త్రీలును, ఇంక అనవసరమైన మనుష్యులును పెక్కండ్రుడుండిరి. శత్రుసేనల నెదుర్కొని, కోటగోడలను బురుజులను మేము రక్షించుకోగలిగినను కోటలోని వారికందరికి తిండిపెట్టడానికి ఒకవారము రోజులకైనను సామగ్రిలేకుండెను. ఇట్టిస్థితిలో మా అదృష్టవశాత్తు మాకొక సహాయము దొరికినది. మహమ్మదీయులు రాత్రిళ్లు యుద్ధముచేయరు. చీకటిపడగనే వారు ముట్టడిని ఆపుచుండిరి. ఇందువల్ల ముందెట్లు చేయవలెనో మేము కొంచె మాలోచించుకొనుటకు అవకాశము దొరికెను."

ఇట్టియవస్థలో ఇంగ్లీషువారు నబాబుతో రాయబారము నడుప యత్నించిరి.

"(కోటయజమానిగనున్న) హాల్‌వెల్లు యింతకాలమునుండి ఖైదీగనున్న ఒమీచందు వద్దకుపోయి, "నబాబు దగ్గరకు వెళ్లి యేమైన సంధికుదురుస్తావా" యని యడిగెను. తనకు యింగ్లీషువారు చేసిన అవమానమునకు ఆతనికి ఒడలు మండియో, లేక, నబాబుయెట్లును తనమాట వినడనియో, ఒమీచందు ఈరాయబారపు పనికి ఒప్పుకొనలేదు. ఎట్టి సహాయముచేయుటగాని ఆతడు నిరాకరించెను. అందుచే, తన క్రోధాగ్నిని ఖైదుఖానాలోనే రగుల్చుకొనుచు, ఒమీచందు అచ్చటనే పడియుండ వలసిన వాడాయెను." (వాల్యూం I. పేజీ LXXXI)

కాబట్టి, యింగ్లీషువారు ఓడిపోయి, పారిపోవుటతప్ప, వారికి వేరొండుగతి లేకుండెను. వారిని తీసికొని పోవుటకు ఓడలు సిద్ధముగనుండెను. వారు అతినీచముగ తమ కాళ్లకు బుద్ధిచెప్పిరి.

"ఈపలాయనములో కూడ, అక్కడి స్థితిగతులనుబట్టి, చాల అపాయము గలుగు నట్లుండెను. ఓడల మీద యెట్టి కట్టుబాటుగాని లేకుండెను. ఓడ పైభాగమందున్న హీనకుల స్త్రీలు ఒడలు తెలియకుండిరి. థానాకోటను దాటిపోవుచుండగ, ఓడలపైకి అగ్నిగోళములువచ్చి పడుచుండెను. ఈ సంగతికూడ ఎరుగకుండ స్త్రీలు ఓడటాపులపై పడియుండిరి. వీరిని ప్రబోధించి ఓడలోపలి భాగములోనికి పంపుట బహుప్రయాసమయ్యెను. నబాబుసేనలోనే గనుక దిట్టమైన ఫిరంగివాళ్లు ఉండియున్నయెడల, ఒక్క ఓడకూడ తప్పించుకుపోయేదికాదని ఫ్రెంచిలేఖకుడు చెప్పుచున్నాడు. ఓడలు పోవుచుండగ త్రోవలో "వీ-సిల్ హూాట్" అను పేరుగల ఒక పరాసుఓడ వీరికి గనిపించెను. "మాకు కొన్ని తినుబండారములు కావాలి; యిస్తావా, యివ్వవా" యని ఇంగ్లీషు ఓడలవారు సదరు పరాసు ఓడ యజమానుని బలవంతపెట్టిరి. ఇంగ్లీషువారిస్థితి కడుఘోరముగనుండెను. వీరికి తిండి లేకుండెను. కాబట్టి, వీరు దౌర్జన్యముగ యెక్కడనైననుపడి తినుబండారములు దోచుకొందురేమో యను భయము పరాసువారికి దోచెను. వీరికి తినుబండారములను సప్లయిచేసితిరను నేరము నబాబు తమపై మోపునేమోయను భయము కూడ పరాసువారికి కలిగెను. నబాబుతో పేచీపెట్టుకొనుటకు పరాసులకు యిష్టము లేకుండెను. అందుచే వారు ముందుగనే జాగ్రత్తపడిరి. ఇందువిషయమై మిగుల హెచ్చరికతో మెలంగవలసినదని తమ ఓడకెప్తానులకందరికి అదివరకే పరాసు కంపెనీవారు హుకుముల జారీచేసియుండిరి." (వాల్యూం I, పేజీ LXXV)

## కలకత్తా నబాబువశమగుట.

కంపెనీనౌకర్లకు పరాభవము పూర్తిగజరిగెను. వారు బుద్ధిపూర్వకముగ సురాజ్ఉద్దౌలాను తిరస్కరించి, అవమానించిరి. అందుకు తగినఫలితమును వారిప్పుడు అనుభవింపక తప్పినదికాదు. కాశింబజారును పట్టుకొన్నపిమ్మట సురాజ్ ఉద్దౌలా యిట్లని చెప్పెనట :—

"ఇదిగో చూడండి ఇంగ్లీషువారిని—వారెంత గర్విష్ఠులో, ఒకప్పుడు నన్ను తమ యిండ్లలోనికికూడ రానివ్వనివారిగతి యిప్పు డేమైనదో!" (వాల్యూం III పేజీ 162-163)

ఈ మాటలనే కలకత్తాను పట్టుకొన్నపిమ్మటకూడ నబాబు మరింత గట్టిగ కూడ అని యుండవచ్చునుగద.

బంగాళా దేశమును మహమ్మదీయ గ్రంథకారులు "భూలోకస్వర్గమ"ని పిలుచుచుండెడివారు. జీన్‌లా యిట్లు వ్రాయుచున్నాడు. "మొగలాయి చక్రవర్తులు జారీచేయుచుండిన అన్ని ఫర్మానాలలోను, పర్వానాలలోనుకూడ బెంగాల్ పేరువచ్చిన చోట్ల నెల్ల, దానిముందు "భూలోకస్వర్గమను" విశేషణమును చేర్చకుండ యెన్నడును వ్రాసెడివారుకారు. ఈ బిరుదు దానికి సర్వవిధముల తగియున్నది. దేశము మిక్కిలి ఫలవంతమైనది. ఇచ్చట పండనివస్తువులేదు. ఈ దేశము తనకు కావలసిన నానారకముల వస్తువులను పండించుకొనుటయేగాక, సామ్రాజ్యములో యితరప్రాంతములకు కావలసిన వస్తువులనుకూడ సప్లయిచేయుచుండెను."

కాబట్టి, ఈరూపాయలు, అణాలు, పైసలనబడు త్రిమూర్తుల నుపాసించు కిరస్తానీ కోమట్లకు కలకత్తా తమ చేతిలోనుండి పోవుట ఎంతో దురదృష్టముగను పరాభవముగను నుండెను. ఈ దురదృష్టమునుగూర్చి 1756 సం॥ నవంబరు 30-వ తేదీన హాలోవెల్లు సీమడైరక్టరుల కిట్లు వ్రాసెను.

"కలకత్తానుండి మనవారు తరిమివేయబడుట మనకు గొప్ప దురదృష్టము. ప్రాణాంతకమును, దుఃఖభాజనమును నగు నిట్టి దుర్దశ సృష్టికాలమునుండి ఏప్రజకుగాని, ప్రాప్తించి యుండలేదు."

కిరస్తానీలు భూలోక స్వర్గమునుండి తరిమివేయబడిరి. అయితే, వారి మూలపురుషుడగు ఆదామువలె శాశ్వతముగ తరిమివేయబడలేదు. వీరిసంగతి సురాజ్ ఉద్దాలాకు పూర్తిగ తెలియకపోవుట దురదృష్టము. వీరిసంగతి బాగుగ యెరిగియున్నట్టయిన, ఆతడు వీరిని ఆనాడే కూకటి వ్రేళ్లతోసహా దేశమునుండి ఊడబెరికి పారవేసెడివాడు. ఇంగ్లీషువారు అతనిరాజ్యముపై తిరుగబాటుచేసిరి. తిరుగబాటుదార్లకు నిజముగ జరుగవలసిన ప్రాయశ్చిత్త మాతడు చేసెడివాడు. వీరిని ఖైదీలుగ పట్టుకొనుటకుబదులు, అందరిని నరికి పారవేసెడివాడు. నబాబు కలకత్తాపైకి వచ్చునప్పుడు ఇంగ్లీషువారు తమ నౌకర్లకేమని హుకుముజేసిరి? "చేతచిక్కిన శత్రువును ప్రాణముతో పోనివ్వద్దని" కాదా వారు హుకుముచేసిరి? కాబట్టి, యీ పనిని సురాజ్ ఉద్దాలాయే చేసియుండినచో తప్పేమి? కాని సురాజ్ ఉద్దాలా ప్రాచ్యఖండస్థుడు; బుద్ధుడు, ఏసుక్రీస్తు, మహమ్మద్ మొదలగు పుణ్యపురుషులను కన్న పవిత్రభూభాగములో జన్మించినవాడు. క్షమాగుణమీతడు తల్లిపాలతో త్రాగెను. కాబట్టి, విజయముహూర్తమందాతడు ఉదారభావమును, విశాలహృదయమును జూపెను. ఇట్టి ఔదార్యము పాశ్చాత్య ఖండస్థులలో కలికమునకైనను కానముగద.

మానవునిలోగల చెడుగుల నన్నిటిని సురాజ్ ఉద్దాలాకు అంటగట్టిన కొందరు చరిత్రకారులు ఆతనికిట్టి ఔదార్యబుద్ధి అప్పుడు గలుగుటకు ఆలివర్దీఖాన్ భార్య

యగు ఆతని మాతామహియు, ఆతని తల్లియగు అమీనా బీగమును కారణమని చెప్పుదురు. వీరిరువురు యీ కిరస్తానీ ఖైదీలయెడల జాలివహించిరట. వాల్యూం I పేజీ XCII)

"ఈ యింగ్లీషువర్తకులయందిట్లు వారికి జాలి కలుగుటకు కారణము కొంత వరకు బహుశః వారుకూడ వీరితో వర్తకము చేయుచుండుటనుబట్టియే "యని యస్. సి. హిల్లు తలంచుచున్నారు.

ఈ మాటలు నిజమైన యెడల నబాబుకు రాజ్యము, ప్రాణముకూడ పోవుటకు కారణము ఈ ముసలవ్వలేయని చెప్పవలసివచ్చును. వీరు ఆరోజులలో ముఖ్యముగ సూరేకారములో వ్యాపారము చేయుచుండెడివారట; ఈ వ్యాపారములో యీ ముసలవ్వలకువచ్చే నాలుగు డబ్బులకోసము సురాజ్ఉద్దౌలా తన రాజ్యమును, ప్రాణమునుకూడ పోగొట్టుకొనవలసిన వాడయ్యెనని చెప్పవలసివచ్చును. ఈ సందర్భములో టర్కీసుల్తాను ఔరంగజేబు పాదుషాకిచ్చిన సలహాను గనుక యీ ముసలవ్వలు జ్ఞాపకముంచుకొనియుంటే యెంత బాగుండెడిది? ఆ సలహా యేమి?

"ఔరంగజేబుకుగల మతాభిమానము టర్కీసుల్తాను చెవినిబడెను. ఇరువురును సున్నీలు. ఆతడప్పుడు ఔరంగజేబు కిట్లని వ్రాసెను. కిరస్తానీలకు సూరేకారము అమ్మకుండ మీ ప్రజలకు హుకుము చేయవలసినది. ఏలననగ సత్పురుషులగు మహమ్మదీయులను చంపుటకై కిరస్తానీలీసూరేకారమును కాల్చుచున్నారు." ఈ సలహా ప్రకారము ఔరంగజేబుచేసెను. అందువల్ల యింగ్లీషువారికి కొంత కాలమువరకు పాట్నాలో సూరేకారపు వర్తకము పోయెను." (టాల్‌బాయి వీలరు వ్రాసిన Early Records of British Indies అను గ్రంథము పేజీ 162)

బంగాళానబాబులు యెల్లప్పుడు యీ సలహాప్రకారము చేసియుంటే బాగుండెడిది.

ఇంగ్లీషువారు అల్పులని సురాజ్ఉద్దౌలా తలచుచుండెను. వారిని సమూలముగ ఆతడు నాశనముచేయకపోవుటకు యిదియే కారణము. ఇదియే తుదకతనికి ప్రాణాంతకమయ్యెను. శత్రువు అల్పుడని యెన్నడును తలంపరాదని పార్సీసామెత ఒకటి గలదు.

## కలకత్తా చీకటికొట్టుకథ అబద్ధము.

కలకత్తాముట్టడిలో "చీకటికొట్ట"నబడు పేరుతో కొన్ని చరిత్రగ్రంథములలో దుష్కీర్తిగాంచిన ఒకానొక ఘోరకార్యమును సురాజ్ఉద్దౌలా గావించెనని ఆంగ్లచరిత్రకారులు వ్రాయుచున్నారు. ఇట్టి ఘోరకార్యము అసలు జరిగినదో లేదో దైవమునకే ఎరుక. ఒకవేళ అది జరిగియున్నను, దానికి సురాజ్ఉద్దౌలా

66 A



కలకత్తా "విలియం" కోట — నబాబు ఆజ్ఞకు వ్యతిరేకముగ కట్టబడినది—(50వ పేజీ)



పాత కలకత్తా పట్టణము—(50వ పేజీ)

66 B



కలకత్తాలో అబద్ధపు "చీకటి కొట్టు" జ్ఞాపకార్థం కట్టబడిన చిహ్నము.
మద్రాస్‌లో నీల్ విగ్రహం తీసివేసినట్లే, దీనినికూడ తీసివేయవలెనని యిప్పుడు కొందరి యత్నము----(66వ పేజీ)



హాల్ వెల్

"కలకత్తా చీకటికొట్టు" కథను కల్పించిన అబద్ధీకుడు—(67వ పేజీ)

యెట్లు జవాబుదారియో యూహింపజాలకున్నాము. దీనినిగూర్చి ఆతనికెట్టి కళంకమునుగాని అంటగట్టుట కెట్లు అవకాశమున్నదో ఊహింపజాలము.

1756 సం॥ జూన్ 20-వ తేదీ ఆదివారమునాడు నబాబుసైనికులు కోటను ముట్టడించి, లోనికి ప్రవేశించినప్పుడు, వారు అక్కడనున్న విదేశస్థుల నెవరిని హింసించలేదు. సురాజ్ఉద్దౌలాకూడ కోటలో ప్రవేశించెను. ఈ సందర్భమున గవర్నర్ డ్రేకు 1756 సం॥ జూలై 19-వ తేదీన యిట్లు వ్రాసెను:—

సురాజ్ఉద్దౌలా కోటలో ఒకవిధమైన దర్బారుచేసి, తన యుద్యోగులు చెప్పుకొను ఫిర్యాదులన్నిటిని వినెను......ఖైదీలనందరిని సురాజ్ఉద్దౌలా యెదుటికి తీసికొనివచ్చిరి. తమపై కరుణవహింపవలసినదని వారు నబాబును వేడికొనిరి. పిమ్మట నబాబు మరియొకచోటికి చూడబోయెను. అప్పుడు "హాల్‌వెల్"ను రెక్కలు విరిచికట్టి సురాజ్ఉద్దౌలా యెదుటికి తెచ్చిరి......ఈరీతిగ మనస్థానము పూర్తిగ నష్టమయ్యెను. కలకత్తా నాశనమయ్యెను." (పైగ్రంథము వాల్యూం I పేజీ 160) యస్. సి. హిల్లు యిట్లు వ్రాయుచున్నాడు:—

"దేశీయసైనికులు యూరోపియనుల ఆస్తులను దోచుకొనిరిగాని, మనుష్యుల జోలికి పోలేదు. తమకు విజయముగలిగినందుకుగాను మహమ్మదీయ ముల్లాలు అల్లాను ప్రార్థించుచుండిరి. ఆకస్మికముగ దృశ్యముమారెను. కొంతమంది యూరపియను సైనికులు తప్పత్రాగి, దేశీయులను కొట్టసాగిరి. వారువచ్చి నబాబుతో చెప్పిరి. దుర్నడతగ ప్రవర్తించిన శిపాయిలను యింగ్లీషువారు సాధారణముగ యీ కోటలో ఏకొట్టులో నిర్బంధించి యుంచుదురు? అని నబాబు అక్కడనున్నవారి నడిగెను. "అదుగో, ఆ చీకటికొట్టులోనే" అని అక్కడివా రొక కొట్టును చూపెరి. ఇంతమంది ఖైదీలను రాత్రివేళ విచ్చలవిడిగ వదలిపెట్టుట అపాయకరమని నబాబు ఉద్యోగస్థులు చెప్పిరి. "అట్లయితే వీరినందరిని యీ కొట్టులోపెట్టి తాళము వేయండి." అని నబాబు ఉత్తరువుచేసెను. కోటముట్టడిసమయమందు యూరోపియను సైనికులు దేశీయులకు చాల నష్టము గలిగించిరి. ఈ ముట్టడిలో దాదాపుగ 7 వేలమంది హతులైరి. ఈ క్రోధము నబాబుఉద్యోగుల మనస్సులలో రగుల్కొనుచుండెను. అందుచే వారు వెనుక ముందు ఆలోచింపక, అక్కడనున్న యావన్మంది ఖైదీలను ఆ కొట్టులోవేసిరి. మామూలుగ ఒకరిద్దరు శిపాయిలకై ఉద్దేశింపబడిన యీ చిన్నకొట్టులో 146 మందిని త్రోసి తాళమువేసిరి. ఈ గది వైశాల్యము 18 అడుగుల చతురముమాత్రమే యుండెను. అదిగాక అది సట్టనడి వేసంగిరాత్రి—వేడి అపరిమితముగనుండెను. ఆరాత్రి ఖైదీలుపడినబాధ ఘోరము—వర్ణనాతీతము. ఖైదీలకు పిచ్చియెత్తి దాహము దాహమని ఒకరినొకరు త్రొక్కుకొనిరి. ఇది మరింత చిత్రవధయయ్యెను. తమ తిట్టులకైనా రోషమెత్తి జైలు వార్డర్లు తమ్మునుకాల్చి చంపివేసి తమ బాధను నివారణచేయుదురేమో యను

ఆశచే ఖైదీలు వార్డర్లనుతిట్టి దుమ్మెత్తిపోసిరి. కాని వార్డర్లు యీ తమాషా యంతయు చూచుచు సంతోషించుచుండిరేగాని, మరేమియు చేయలేదు. ఎంత రాక్షసత్వము! ఈ సంగతులన్నిటిని హాల్‌వెల్ పూసగ్రుచ్చినట్లు చెప్పెను. ఇంత కంటె దైన్యమగు విషాదసంఘటనము యిండియాలో యింగ్లీషువారికి ప్రాప్తించి యుండలేదు. రాత్రి యేడుగంటలుమొదలు ఉదయము ఆరుగంటలవరకు యీ యమబాధ చెప్ప తరముకాదు. ఈ బాధనుచూచి జాలిపడిన దేశీయోద్యోగులు కూడ ఆ రాత్రివేళ నబాబును మేల్కొలుపుటకు ధైర్యము చేయలేకపోయిరి. ఉదయమగునప్పటికి, రాత్రిపెట్టిన 146 గురిలో 23 మాత్రమే కొనఊపిరితో బయటపడిరి. నరకలోకమునుండి బయటపడిన ఘోరభయంకర పిశాచములవలె వీరు బయటబడిరి.'' (పైగ్రంథము వాల్యూం I పేజీ XC)

''చీకటికొట్టుదురంతము''ను గూర్చి యింగ్లీషులేఖకులు వ్రాసిన కథ యిట్లున్నది. ఈకథయంతయు కేవలము అబద్ధమని ఒకానొక బంగాళీ గ్రంథకర్త ''సురాజ్‌ఉద్దౌలా''యను తన గ్రంథములో వాదించియుండెను. ఈ వాదములలో ఒక్కదానినిగాని పై కథను వ్రాసిన ''హిల్లు'' పూర్వపక్షము చేసియుండలేదు.

"**Travels of a Hindu**" ''ఒక హిందువుని యాత్రలు''అను గ్రంథమును వ్రాసిన ప్రఖ్యాత గ్రంథకర్త డాక్టర్ బోలానాథ చందర్‌గారు 1895 సం॥ తాలూకు ''కలకత్తా యూనివర్సిటీ మ్యాగజైన్''లో యిట్లని వ్రాసెను.

''చీకటికొట్టు కథనుగూర్చి నాకు చాల అపనమ్మకముగనున్నది. ఆ కొట్టు లోనుండి బ్రతికివచ్చితినన్న ''హాల్‌వెల్'' యీ కథను ప్రపంచమునకు మొట్ట మొదట తెలిపినవాడు. కాని, నా కెప్పుడు ఒక సందేహము మనస్సున బాధించు చుండెను. దానిమ్మకాయలో గింజలున్నట్లు మధ్య సందులులేకుండ, పడవ కడు పులో బస్తాలుకూరినట్లు కూరినను 18 అడుగుల చతురప్రదేశములో 146 మందిని యెట్లుకూరుటకు సాధ్యమున్నది? ఈ కథ కేవలమబద్ధమని రేఖా గణితశాస్త్రములే సాక్ష్యమిచ్చుచున్నవి. ఇది కేవలము కట్టుకథ. ఈ వట్టి అభూతకల్పనను పట్టుకొని లోకమంతా ''అయ్యో అయ్యో''యని గోల పెట్టినది!''

చీకటికొట్టు కొలతలు తలొకరు తలొకవిధముగ చెప్పుచున్నారు. దీనిని గూర్చి కెప్టన్ గ్రాంటు అను నతడు 1756 సం॥ జులై 13-వ తేదీన ''ఫుల్టా'' నుండి యిట్లు వ్రాయుచున్నాడు.

''ఆ రాత్రిపూట ఖైదీలుగ చిక్కిన దురదృష్టవంతులు చీకటి కొట్టులో పెట్టబడిరి. దీనిలో యూరోపియనులు, బుడతకీచులు, ఆర్మీనియనులు అంత కలిసి సుమారు 200 మందిని పెట్టిరి. వీరిలో కొందరికి గాయములుకూడ తగిలియుండెను. ఈ యిరుకు కొట్టులో వారికి ఊపిరి ఆడక, అపరిమితమగు వేడిచేత, ఉదయమునకు

పదిమందికంటె యెక్కువ బ్రతికి బయటపడలేదు. (Old Fort William in Bengal) అను గ్రంథము డాక్టర్ సి. ఆర్. విల్సనుచే వ్రాయబడినది. వాల్యూం II పేజీ 59)

చీకటికొట్టు కొలతలను గూర్చియు, అందు పెట్టబడిన మనుష్యులసంఖ్యలను గూర్చియు, బ్రతికి బయటపడినవారి సంఖ్యనుగూర్చియు యాగ్రాంటు చెప్పిన కథకును, తదితర యింగ్లీషులేఖకులు వ్రాసిన వ్రాతలకును చాల ముఖ్యమైన తేడాలు గన్పించుచున్నవి.

డాక్టరు. సి. ఆర్. విల్సన్ యిట్లు వ్రాయుచున్నారు. "చీకటికొట్టు 18 అడుగుల, 14 అడుగుల 10 అంగుళముల వెడల్పు. ఈ లెక్క ప్రకారము 146 మందికి 267 చతురపు అడుగులస్థలమువచ్చుచున్నది. అనగ, మనిషి ఒక్కంటికి రెండు చతురపు అడుగులైనను నిండాలేదు. (పై గ్రంథము: వాల్యూము II పేజీలు 245)

అయితే, 146 మందిని 267 చతురపు అడుగులస్థలములో అసలు యెట్లు కూరుటకు వీలగునో డాక్టర్ విల్సన్ కొంచెమైనను యోచించినట్లు కనబడదు. మనిషికూర్చున్నను, నిలుచున్నను, సర్వసాధారణముగ ఒక్కొక్క మనిషికి మూడు చతురపు అడుగులకంటె తక్కువస్థలము అసలు చాలనేచాలదు. ఈలెక్క ప్రకారము ఈ కొట్టులో 89 మందికంటె యెక్కువమంది మనుష్యులను పెట్టుటకు అసలు వీలేలేదు.

ఈ లెక్కలన్నియు అసలు ఈ కథ జరిగినమాట నిజమైతేనేగద! ఈ కథ అసలు జరుగలేదని తలంచుటకు బలవత్తరమైన కారణములున్నవి. ఆకాలమునాటి ముసల్మానుచరిత్రలలోగాని, యితర లేఖనములలోగాని, యీకథ యెక్కడను కానరాదు. సయ్యద్ గులామ్ హుస్సేను వ్రాసిన "సేర్-ఉమ్ ముతాఖారీన్" అను గ్రంథములోగాని, కోటనుండి పారిపోయి 'ఫుల్టా'లో దాగికొన్న యింగ్లీషువారి ప్రొసీడింగ్స్ పుస్తకములోగాని, ఆనాటి మదరాస్ కౌన్సిలుచర్చలలోగాని, యీ చీకటికొట్టుకథయే వినరాదు. క్లైవ్, వాట్సనులు నబాబుకు వ్రాసిన జాబులోగాని, ఆలీనగరముసంధిలోగాని యీ చీకటికొట్టు మాటయే కానరాదు. సురాజ్ ఉద్దౌలా పదభ్రష్టుడైన కారణములను క్లైవ్ సీమడైరక్టరులకు తెలుపుచు వ్రాసిన ఉత్తరములోకూడ యీ చీకటికొట్టు ప్రశంసయే తేలేదు. ఇంగ్లీషువారు మీర్జాఫరుతో చేసికొన్న కుట్రఒడంబడికలో తమకు సురాజ్ఉద్దౌలావల్ల గలిగిన సమస్త నష్టములకు——పేరుపేరున పరిహారము పేర్కొనబడినదిగాని, యీ చీకటికొట్టులో చచ్చిపోయిరన్న వారి కుటుంబములకు నష్టపరిహారము మాటయే యెత్తుకొనబడలేదు. 1760 సం॥ ఆగష్టు 4-వ తేదీన సెలెక్టుకమిటీవారియెదుట "హాల్‌వెల్" చదివిన కాగితములో యీ చీకటికొట్టుమాటయే లేదు.

రాబర్టుఆర్మ్సు అనునతడు ఆంగ్లచరిత్రకారుడు; క్లైవ్‌కు మిత్రుడు. ఇతని శిఫార్సుమీద క్లైవు బెంగాలుకు పంపబడెను. చీకటికొట్టు దురంతమొనర్చుటలో సంబంధమున్నవారిని శిక్షించుటకే యితనిని పంపిరట. కాని, యీ సందర్భమున, యీత డెవరినిగాని శిక్షించియుండలేదు. ఈకథ జరుగలేదని చెప్పుటకు యీసందర్భ మొకటి చాలదా?

అబద్ధాలు చెప్పడములో హాల్‌వెల్ అంతటివా డింకొకడు లేడనుసంగతి మరువరాదు. ఇతడు వట్టి అబద్ధీకుడని వాళ్లవాళ్లే అనుకొనుచుండెడివారు. అలివర్ది ఖాను చచ్చిపోవుచు తన మనుమనికి చెప్పిపోయెనన్న ఉపదేశవాక్యములు ఈ హాల్ వెల్ కల్పించిన అబద్ధపుమాటలేయని ఆకాలములో యింగ్లీషువారందరు తలంచిరి.

ఇతని పూర్తిపేరు "జాన్ జఫనయ్య హాల్‌వెల్" ఇతడు 1711 సం॥లో డబ్లిన్‌నగరమున పుట్టెను. ఇతడు వైద్యవృత్తిలో ప్రవేశించి 1739 సం॥లో యిండియాకు వచ్చుచున్న మరియొకడాక్టరుతో కలిసి కలకత్తాకువచ్చెను. కొన్నాళ్లు వైద్యములోవున్నపిమ్మట, యితడు కలకత్తాకు 'జమీందారు' డయ్యెను. అనగ, కలెక్టరు, జడ్జీ రెండుపనులు యితనియం దుంచబడెను. కంపెనీవారికి కలకత్తాకౌన్సిలులో మెంబరుగకూడ నియమింపబడెను. సురాజ్‌ఉద్దౌల కలకత్తాను పట్టుకొన్నప్పుడు, యితడు నబాబుకు ఖైదీగచిక్కెను. పిమ్మట వదలివేయబడెను. ఇతడంతట 'ఫుల్టా'లో దాగియున్న తన యింగ్లీషుజనముతో కలిసి కొంతకాలముండి, పిమ్మట 'సైరేన్' అను ఒంటికొయ్యఓడలో యెక్కి యింటికి (సీమకు) పోయెను. వెళ్లేటప్పుడు వెంట కొన్నికాగితములుకూడ తీసికొనిపోయెను. ఈ ఓడమీదనుండగ 1757 సం॥ ఫిబ్రవరి 28–వ తేదీన విల్లియం డేవీస్ అను వానికి 32 పేజీల ఉత్తరమును వ్రాసెను. చీకటికొట్టుకథను మొదటగ యితడు అల్లినది యీ ఉత్తరములోనే. ఇతడు సీమనుండి తిరిగి యిండియాకు రెండవసారివచ్చునప్పటికి, ఇంగ్లీషువారి ద్రోహమువల్ల సురాజ్‌ఉద్దౌలా చంపబడుటయు, మీర్‌జాఫర్ బెంగాల్ నబాబగుటయు జరిగెను. సురాజ్‌హత్యయు, మీర్జాఫర్ తక్తునెక్కుటయు యింగ్లీషువారికెట్లు లాభకారిగ పరిణమించెనో తదుపరి వివరించెదము. ఇక్కడ ఒక సంగతి చెప్పినచాలును. మీర్జాఫర్ హాల్‌వెల్లును మరచిపోలేదు. ఇతనికి క్రొత్త నబాబు లక్షరూపాయలనిచ్చెను. అయితే యేమి, హాల్‌వెల్‌కు కృతజ్ఞతలేదు. అంతయెందుకు, కృతజ్ఞతగల కిరస్తానీ యింగ్లీషువాడను వాడారోజులలో కలికమునకైన గానరాడు. గౌరవము, నీతి, నిజాయితీ యను మాటలవలెనే, కృతజ్ఞతయను మాటకూడ ఆనాటి యింగ్లీషువారి నిఘంటువులో లేకుండెను. అయినప్పటికి, హాల్‌వెల్ దుష్ప్రవర్తన ఆరోజులలోనే అందరికి ఘోరముగ గన్పించినది. తనకు లక్షరూపాయలు బహుమానముచేసిన మీర్జాఫరును కూలద్రోసి, అతనిస్థానే మీర్కాసీమును తక్తుపై కూర్చుండబెట్టుటకు యితడు సృష్టించి ప్రచురణగావించిన అబ

ద్ధములకు మితిలేదు. తనకు మేలుచేసిన వానిపేరును నలుపుగావించుట కీతడుచేయని అసత్కార్య మొక్కటియులేదు. మీర్కాసీమువల్ల యితనికి మూడులక్షల రూపాయలు ముట్టినట్లు 1772 సం॥ పార్లమెంటు కమిటీరిపోర్టునుబట్టి తెలియుచున్నది.

ఈస్టిండియా కంపెనీ స్థితిగతులనుగూర్చి 1772-వ సం॥లో మొట్ట మొదటగ వెలువడిన రిపోర్టునకు చేర్చబడిన 9-వ అనుబంధములోని సంగతులను బట్టిచూడగ, మీర్జాఫరును సింహాసనమునుండి పడద్రోయుటకుగాను యీ హాల్ వెల్ యెంతటి నీచకార్యముల కొడిగట్టినదియు బోధపడగలదు. బెంగాలు తక్తుపై యిటీవల జరిగిన మార్పునకుగల కారణములను వివరించుచు ఇతడొక మెమోను స్వయముగ తయారు చేసెను. అందులో యీతడిట్లు వ్రాసెను.

"నబాబు మీర్జాఫర్ బహుక్రూరుడు. దురాశాపాతకుడు. అతిలోలుడు... కేవలము నిష్కారణముగ యితడు చంపించిన మనుష్యులసంఖ్యకు మితములేదు. ఇందులో అన్నితరగతుల మనుష్యులున్నారు. ఈ చచ్చినవారందరిపేర్లను, ఎట్టి పరిస్థితులలో వీరు చంపబడినదియు, అంతయు బయటపడుటకు చాలకాలముపట్టును. కాని, అందులో యెన్నదగిన మనుష్యులపేర్లను కొన్నిటి నీదిగువ గాననగును:—

(1) "..........గస్సెటాబీగమ్, నబాబ్ షహామత్ జంగ్ భార్య, వితంతువు.

(2) "ఓమ్నాబీగమ్" - నబాబ్ సురాజ్ ఉద్దౌలాతల్లి.

(3) "మజ్డోదౌలా" షహామత్ జంగ్ చే దత్తత చేసుకోబడిన పాద్షా కూలీఖాన్ కొడుకు.

(4) "లట్ఫెన్ నిస్సాబీగమ్" నబాబ్ సురాజ్ ఉద్దౌలాభార్య వితంతువు.

(5) "సురాజ్ఉద్దౌలా కూతురు - పసిపిల్ల" దురదృష్టవంతులగు యీ అయిదుగురును 1760-వ సం॥ జూన్ నెలలో ఢక్కాలో ఒక్కరాత్రిలో చచ్చిరి. మీర్జాఫర్ సింహాసన మెక్కినప్పటినుండియు వీరైదుగురును ఢక్కాలో ఖైదీలుగ నుంచబడిరి. ఆలివర్దీఖాన్, షహామత్ జంగ్, సురాజ్ఉద్దౌలా - యీ ముగ్గురు నబాబుల తాలూకు కుటుంబములలో మిగిలియున్న యావన్మందిని చంపివేయవలసినదని ఢక్కాలో యధికారిగనున్న జసరత్ ఖానుకు హుకుము (పర్వానా) జారీచేయబడెను. క్రూరమగు నట్టిహుకుమును జసరత్ ఖాను అమలుజరుపుటకు నిరాకరించెను. కాని, యితడు నిరాకరించినచో, యీ పనిని తానే నిర్వహించుటకు యీ హుకుము తెచ్చిన హర్కారునకే మొదట అధికార మివ్వబడి యుండెను. కావున యీ హుకుము తెచ్చిన హర్కారుడే పైన పేర్కొన్న యీ అయిదుగురును, మరి

యిరవైమంది ఆడవాళ్లను, నౌకర్లనుకూడ అర్ధరాత్రివేళ ఖైదుఖానాలోనుండి బయటికితీసి నది ఒడ్డునకు తీసికొనిపోయి, అక్కడ అందరిని నరికి, యేట్లో పార వేసెను.''

ఈ కథయంతయు మొదటనుండి చివరివరకు అంతయు అబద్ధముల ప్రోగు. 1766-వ సం॥ సెప్టెంబరు 30-వ తేదీన కంపెనీ వ్యవహారములనుగూర్చి, క్లైవు కలకత్తానుండి సీమడైరెక్టర్లకు వ్రాసిన ఉత్తరముయొక్క అనుబంధములో యిట్లని యున్నది.

''పాపము - గతించిన మీర్జాఫర్ నబాబునుగురించి మనము అన్యాయము ఆడుకోరాదు. కావున, యిక్కడి నిజస్థితిని మేమిప్పుడు వెల్లడింపవలసిన బాధ్యత మామీదనున్నది. కుంపిణీ డైరెక్టర్లకు హాల్వెల్ వ్రాసిన ఉత్తరములో నుదహరింపబడిన ఘోరహత్యలలో దేనినిగాని నబాబు గావించి యుండలేదు. ఇవన్నియు శుద్ధఅబద్ధములు. నబాబు సౌశీల్యమును మిక్కిలి క్రౌర్యబుద్ధితో మలిన మొనర్పుటకై పలుకబడిన దురాగతపు పలుకు లివి. నబాబు చంపెనని చెప్పిన 78 గురులో 76 గురు యిప్పటికి బ్రతికియే యున్నారు. ఇద్దరుమాత్ర మెట్లో నబాబుకు తెలియకుండ, నబాబు అనుమతిలేకుండ చంపబడినట్లు తెలియుచున్నది.''

తనకు ఉపకారముచేసిన మీర్కాసీముపైననే సిగ్గులేక యిట్టి అబద్ధపు వ్రాతలు వ్రాసి, వానిపై దుష్కీర్తిపంకమును పూయుటకు జంకని హాల్‌వెల్, అతనివల్ల కనీసము కొన్ని దెబ్బలైననుతిన్న సురాజ్‌ఉద్దౌలా కీర్తిని నలుపుగావించుటకై చీకటికొట్టుకథను అల్లినాడన్నచో ఆశ్చర్యమేమి ?

''హెర్బర్టు స్పెన్సరు'' అనునతడు ఇంగ్లీషువారిలో పేరుగాంచిన మేధావి, వేదాంతి. ఈ యిరువదియవ శతాబ్దారంభమందు పాశ్చాత్య ఖండస్థులగు క్రైస్తవ జాతులు సత్యము నెంతహీనముగ గాలికి ఎగరగొట్టివేసిరో తెలుపుటకీ దిగువ నుదహరించిన దృష్టాంతమును జూపెను. తాము చీనాపై గావించిన దండయాత్రను సమర్థించుకొనుచు క్రైస్తవజాతులుచెప్పిన సాకునుగూర్చి స్పెన్సరు యిట్లను చున్నాడు :—

''(చీనా రాజధానియగు) పీకిన్‌పట్టణములో గొప్పహత్యలు జరిగినట్లు మొట్టమొదటగ పుకార్లుపుట్టెను. ఈ సందర్భములో యూరోపియనులు మహా శౌర్యముతో నిలువబడి పోరాడుట, అతిఘోరముగ జరిగిన ముష్టాముష్టి యుద్ధములు, ఆఖరుకు అల్పసంఖ్యాకులగు యూరోపియనులు చీనా మూకలలో మునిగిపోవుట, అటుపిమ్మట చీనావారు యూరోపియనులపైపడి చెప్పరాని చిత్రవధలు గావించుట—మున్నగు, వివరము లెన్నియో శరపరంపరలుగ లోకములో కురిపింపబడెను. పిమ్మట కొద్దిరోజులకు యీ సంగతులన్ని శుద్ధ అబద్ధములని ఋజు

వమ్యేను. హత్యలులేవు. దురంతములులేవు. (అంతా హంబక్కే-)" [Fads and Comments అను గ్రంథమునుండి]

రైళ్లు, స్టీమర్లు, టెలిగ్రాములు వున్న యీ రోజులలోనే యిట్టి అబద్ధములు వ్యాపింపజేయుటకు సిగ్గుపడని యూరోపియనుజాతులు యివేవియులేని ఆ రోజులలో అట్టి అబద్ధముల వ్యాపింపజేసిరన్నదో ఆశ్చర్యపడవలసిన పనియేమి? తమ అబద్ధములు నేడుగాకున్న రేపైనను బయటపడక తప్పదని పూర్తిగాగాకున్న కొంతవరకైనను నేటి యూరోపియనులకు తెలియును. అయినప్పటికి వారొకమూల యిట్లు మనస్సులో అనుకొనుచునే యీ అబద్ధములను బుద్ధిపూర్వకముగ వ్యాపింపచేయుచున్నారు. రైళ్లు వగైరాలులేని ఆ రోజులలో తమ అబద్ధములు సుళువుగ బయటపడవనియు, పైపెచ్చు యివే సత్యవాక్యములుగ—వేదవాక్యములుగ భవిష్యత్సంతతులకు ప్రాకుననియు తలంచి, వారట్టి అసత్యములను కల్పించి వ్యాపనచేయుచుండిరి.

చీకటి కొట్టుకథ నిజముగ జరిగినదని మనము వాదసౌకర్యమునకు అంగీకరించినను, ఇందు సురాజ్ ఉద్దౌలా తప్పేమియున్నది? దీని కాతనినెట్లు నిందింపనగును? ఈ కొట్టు ఆతడు కట్టినదికాదు. 'జేమ్సుమిల్లు' అను చరిత్రకారు డిట్లు వ్రాయుచున్నాడు:—

"సురాజ్ ఉద్దౌలాకు సామాన్యముగ దయయను గుణములేకున్నను యీ సందర్భములో మాత్రము అతడు క్రౌర్యము చేయదలంచినట్లు కన్పించదు. కారణమేమనగ, హాల్‌వెల్‌ను రెక్కలువిరిచికట్టి తనవద్దకు తీసికొనివచ్చినప్పుడు, సురాజ్ ఉద్దౌలా ఆకట్ల నన్నింటిని విప్పించెను. "నీ తలమీదగాని, నీ తోడివారి తలమీదగాని ఒక్క వెంట్రుకకైనను నేను అపాయమురానీయనని రణధర్మకోవిదుడనగు నేనిదే ప్రమాణపూర్తిగ అభయమిచ్చుచున్నాను." అని నవాబు వారికి ధైర్యము చెప్పెను. అయితే సాయంకాల మగునప్పటికి వీరిని యెక్కడ పెట్టవలెనను ప్రశ్న అచ్చటనున్న కావలివారికి వచ్చెను. కోటయంతయు వెదకిరి. కాని, తగినచోటు దొరకలేదు. అదివరకు యింగ్లీషువారే ఖైదుఖానాగా ఉపయోగించుచున్న ఒక కొట్టుకలదని సమాచారము వచ్చెను. వేరే ఆలోచనలేకుండ అప్పుడందరిని ఆ కొట్టులోనికి త్రోసిరి. దురదృష్టవశాత్తు అది మిక్కిలి యిరుకుగను, గాలిచొరనిదిగను, అనారోగ్యమైన చీకటికొట్టుగ నుండెను. అయితే, వీరినందరిని ఉంచుటకు తగినచోటని చెప్పి నబాబు ఉద్యోగులకు చూపించిన యింగ్లీషువారి ననవలెను గాని, యిందు నబాబు తప్పేమియున్నది? దీనినసలు మొదటినుండియు ఖైదుఖానాగా ఉపయోగించుచుండిన యింగ్లీషువారే తమ దురదృష్టమును తాము నిందించుకొనవలెను" (వాల్యూమ్ III, అయిదవ ప్రచురణము—(పేజీ 117)

హెచ్. బెవరెడ్జి యనునతడు "Old places in Murshidabad" ను గూర్చి 1892-వ సం॥ ఏప్రియల్ నెల తాలూకు "కలకత్తా రివ్యూ" 345-వ పేజీలో యిట్లని వ్రాయుచున్నాడు:—

"కలకత్తా చీకటికొట్టునుగూర్చి మన మెక్కువగ చెప్పకొనకూడదు. సురాజ్ ఉద్దౌలా—దుర్బుద్ధికిది నిదర్శనముగను మనము భావించరాదు. ఏల సనగ యిట్టి ప్రమాదమే 1857-వ సం॥ ఆగష్టు 1-వ తేదీన అమృతసరముజిల్లాలో జరిగినది. ఇందునుగూర్చి కూఫర్ యిట్లుచెప్పచున్నాడు. పట్టుబడిన శిపాయిలను చాలమందిని గుండ్రనికొట్టులోపెట్టి తాళమువేసిరి. తరువాత, దానిలోనుండి 237 మందిని బయటికితీసి, తుపాకులతోకాల్చి చంపిరి, మిగతావారు యెంతసేపు చూచి నను బయటికిరారే! అప్పడు తలుపులు తీయగా, అహా! ఏమి కన్పించినది? అందరు దాదాపు చచ్చిపడియుండిరి. అనుకొనకుండ హాల్‌వెల్ చెప్పిన కలకత్తా చీకటికొట్టుకథ యిక్కడ జరిగినది......45 శవాలు; భయముచేత, అలసటచేత, వేడిచేత, ఊపిరాడక, ప్రాణము డిల్లపోయి చచ్చిపోయిన మనుష్యులశవములు 45 బయటికి లాగబడెను." (The Crisis in the Punjab పేజీ 162)

యస్. సి. హిల్లు యిట్లు వ్రాయుచున్నాడు:—

"చీకటికొట్టు 'అనగ బహుశః విలియంకోట' యని యేమోభావము, ఏలననగ, ఆ రోజులలో యీ రెండును ఒకదాని కొకటిగ పొరబాటున తరచుగ పేర్కొనబడుచుండెను." Bengal in 1756-57—వాల్యూం I. పేజీ XCVI)

పైమాటయే, నిజమైనయెడల, చీకటికొట్టుకథ కొరకు కీలకము దొరకు చున్నది. అనగ కోటలోనుండి తప్పించుకొని నదిలోనున్న ఓడలమీదికి పారి పోలేక వెనుక దిగబడిపోయిన వారందరు ఖైదీలుగ పట్టుబడి, విలియంకోటలో (చీకటికొట్టులో కాదు) బంధింపబడిరని దీనినిబట్టి అర్థము చేసికొనవలసి యుండును. చీకటికొట్టులో చచ్చిపోయిరన్న, 123 గురిలో ఎంతవెదకి గాలించినను అందరిపేర్లు దొరకలేదు. 'హిల్లు' యిట్లు వ్రాయుచున్నాడు:—"చీకటికొట్టులో 123 గురు చచ్చిరి. వీరిలో 56 మంది పేర్లుమాత్రమే దొరికినవి........." (వాల్యము 1. పేజీ XCIV.)

అయితే, మిగతా 67 మందిపేర్లు యేల దొరకవు? బహుశః సురాజ్ ఉద్దౌలాకోటను పట్టుకొన్నప్పుడు అందులో అంతాకలిపినా 123 గురు కిరస్తానీలు లేరేమో.

పై సందర్భములనన్నిటిని పరిశీలించిచూడగ, యీ చీకటికొట్టుకథ కేవల మబద్ధమనియు, యూరోపియనులు తమ దురుద్దేశమును సాధించుకొనుట కొరక మిషగ దీనిని కల్పించిరనియు ఊహింపవలసి వచ్చుచున్నది. 56 గురు చనిపోయి

నచో వారు చీకటికొట్టులో ఊపిరాడక చావలేదు; తమ రోగములచేతను, గాయములచేతను కోటలో చచ్చిరి. ఏలననగ, కోటలోనుండి పారిపోలేని యిట్టి అవధ్యులే చివరకు కోటలో మిగిలియుండిరి. కాలుగలవారెల్లను పారిపోయిరి.

## నబాబు ఔదార్యము – ఇంగ్లీషువారి కృతఘ్నత, వంచన.

కలకత్తాను ఇంగ్లీషువారి చేతులలోనుండి లాగికొన్న పిమ్మట సురాజ్ ఉద్దౌలా దానిపేరును 'ఆలినగరమ'ని మార్చి దానికి 'రాజామనిక్ చంద్'ను గవర్నరుగ నియమించెను. ఇంగ్లీషువారు అల్పులను తలంపుతో వారిని సమూలముగ పెరికివేయుటకు సురాజ్ ఉద్దౌలా ఉపేక్షించెనని పైన చెప్పియుంటిమి. స్క్రాఫ్టన్ అనునతడు Reflections అను తన గ్రంథము 58 పేజీలో యిట్లు వ్రాసెను.

"మనలను సురాజ్ అంతకాలము ఫుల్టాలో నెమ్మదిగ ఏల ఉండనిచ్చెనో నాకాశ్చర్యమగుచున్నది. ఏసు మేకగువరకు ఆతడేల ఊరుకొన్నాడో ఆశ్చర్యముగ నున్నది. మనము అల్పులమనియు, భుజబలముచే మనము తిరిగి తనపైకి రాలేమనియు, ఆతడు బహుశః తలంచియుండునని నా ఊహ. ఇంతకుమించి వేరే కారణము నాకు గాన్పించదు."

కాశింబజారులో ఫ్రెంచిగిడ్డంగికి అధికారిగనున్న 'జీన్‌లా' యిట్లు వ్రాయుచున్నాడు.

"యూరోపియనులనిన సురాజ్ ఉద్దౌలాకు అమితమగు అసహ్యముండెను. వాళ్లను అదుపులో వుంచడానికి కావలసినదల్లా ఒక చెప్పులజోడే" అని ఆతడను చుండెడివాడు. యూరపులో వాళ్లనందరిని కలిపినా పది, పన్నెండు వేలకంటె యెక్కువవుండరని ఆతని ఊహ. ఆతని మనస్సుకు చతుర్థాంశముకూడ ఆనని యీ యింగ్లీషువారివల్ల అతని కేమి భయము? అతని కేమిలెక్క? కాబట్టి బలవంతముగ యింగ్లీషువారు తిరిగి తనమీదికి వత్తురని ఆతడెంతమాత్రము తలంపలేదు. ఇంగ్లీషువారు శృంగభంగమునొంది, ఒకచేతితో తనకు నజరానా సమర్పించుకొని, యింకొక చేతితో తిరిగి తమ్మును కలకత్తాలో వర్తకముచేసికొన నీయవలసినదని తనను వేడుకొని, తానిచ్చు అనుజ్ఞాపత్రమును కళ్లనద్దుకొని పుచ్చుకొనుటకు యింగ్లీషువారు తమ మనసులో ఆలోచించుకొనుచున్నట్లు సురాజ్ ఉద్దౌలా ఊహించి యుండవచ్చును. కాక పోయినచో, ఆతడు వారినట్లు నెమ్మదిగ ఏమిచేయక, ఫుల్టాలో యెందుకు ఉండనిస్తాడు? (పై గ్రంథము వాల్యూము III పేజ 176)

సురాజ్ అమాయికుడగు ప్రాచ్యుడు. అప్రాచ్యులగు యింగ్లీషువారి సంగతి అతని కేమి తెలియును? వీరివంచకస్వభావము, వీరు అబద్ధములలో పుట్టి పెరిగిన సంగతి పాపమీ సురాజ్ ఉద్దౌలా కేమి తెలియును? తాము మద్రాసు పోదలచితి

మనియు, గాలి అనుకూలమయ్యేవరకు యిక్కడ ఉందుమనియు యింగ్లీషువారు టక్కరిమాటల చెప్పిరి. వెర్రిబాగుల సురాజ్ ఉద్దౌలా యీ మాటల నమ్మెను. "పోనీలే, ఉండనీ, యీసరకు లమ్ముకొనేవాళ్లు మననేమి చేస్తారు" అన్న నిర్లక్ష్య భావముతో సురాజ్ వారిజోలికిపోక దయదలచి ఊరకుండెను.

కలకత్తా ముట్టడినిగూర్చి వ్రాయుచు "టూక్" అనునతడు యిట్లు వ్రాయుచున్నాడు :—

"మేము మొదటగ ఫుల్టాచేరినప్పుడు మా కక్కడ కావలసిన తినుబండారములు వగైరా సామగ్రియేమియు దొరకలేదు. కాని, కొలదికాలముననే మా ఓడలు నదిలోనుండి వెళ్లిపోదలచుకొన్నట్లుగ నబాబుకు తెలిసి మమ్ములను త్వరలో వదలించుకొనుటకును, మేము బజారులను లూటీచేయకుండ ఉండుటకును, బజారులను తెరవవలసినదని నబాబు ఉత్తరువు జేసెను......నబాబు దివానగు మనిక్ చంద్ అప్పుడు బజారులను తెరిపించెను. మేము ఫుల్టాలో ఉన్నంతకాలము బజారులను తెరిచియుంచు నట్లాతడు ఆజ్ఞాపించెను. అందుచే మాకు కావలసిన వస్తువులన్నియు సమృద్ధిగ దొరికెను.''...... (వాల్యూం I పేజీ 301)

నబాబు తమయెడ జూపిన దయకు ప్రతిఫలముగ యింగ్లీషువా రేమిచేసిరి? ఆతనిపై కుట్రపన్నుచుండిరి. 1757-వ సం॥ జనవరి 25-వ తేదీన "మేజరు లేక్ ప్యాట్రిక్" కలకత్తానుండి సీమ డైరెక్టర్ల కిట్లు వ్రాసెను :—

"నేను క్రిందటి పర్యాయము తమకు వ్రాసిననాటినుండి, మన నౌకాదళము యిచ్చటికి వచ్చిచేరువరకు మేమంతగ చేసినపని యేమియులేదు. దేశములో కొందరు ప్రధానపురుషులతో ఉత్తర ప్రత్యుత్తరములు మాత్రము జరుపుచుంటిమి. నబాబు సప్లయిచేయించిన సామగ్రి చక్కగ భోజనముచేయుచు, అనుకూల తరుణము వచ్చువరకు మన మిచ్చట పొంచియుండు యుద్దేశమును వారు పూర్తిగ ఆమోదించిరి.'' (పై గ్రంథము వాల్యూము II, పేజీ 164)

"ఇతరులు నీకెట్లు చేయవలెనని తలంతువో, నీవును యితరులకట్లు చేయుము.'' అను మహోత్కృష్టమగు ఆత్మౌపమ్య సిద్ధాంతమును బోధించు క్రైస్తవమతము నవలంబించిన యీ యింగ్లీషువారి కృతజ్ఞతాభావ మీరీతిగ మండినది!''

ప్రాచ్యఖండవాసుల కలంకార భూషణమగు ఔదార్యబుద్ధితో సురాజ్ ఉద్దౌలా పడిపోయిన శత్రువును చంపుట కిష్టపడక, వారినట్లే వదలివేసి, 1756-వ సం॥ ఫిబ్రవరి 24-వ తేదీన కలకత్తాను విడిచి మరునాడు హుగ్లీచేరెను. ఇచ్చట ఆతడొక దర్బారుచేసెను. ఈ దర్బారులోనికి పరాసు, ఒలందా, గిడ్డంగుల ప్రతినిధులు వచ్చిరి. యుద్ధపు ఖర్చులక్రింద పరాసువారు 3½ లక్షల రూపాయలున్ను, ఒలందా

వారు 4½ లక్షలున్ను, చెల్లించిరి. ఇందులో పట్టాభిషేక కాలమందు చదివించవల సిన నజరానాలుకూడ చేరియున్నవి. ఈ యుభయజాతులవారి స్థానములను నాశ నము చేయవలెనను బుద్ధి నబాబు కెన్నడులేదు. ఆ బుద్ధియే అతనికున్నయెడల యీ తరుణమందే వానిపని పట్టించుట కతనికి మంచి వీలుండెనుగద. 1756-వ సం॥ జూలై 11-వ తేదీన సురాజ్ ఉద్దాలా మహావైభవముతో తన రాజధానియగు మూర్షిదాబాదు నగరమును చేరెను.

కాని, ఆతడచ్చట చిరకాలము శాంతితోనుండుటకు వీలులేక పోయెను. ఏలననగ, యితని జ్ఞాతి షౌకత్ జంగ్ తిరిగి యితనిపై ధ్వజమెత్తెను. వర్షాకాల మైనతరువాత నబాబు షౌకత్ జంగ్‌పై దాడివెడలెను. ఉభయసేనలు రాజమహాల్ వద్ద సమావేశమయ్యెను. 1756-వ సం॥ అక్టోబరు 16-వ తేదీన అక్కడ యుద్ధము జరిగెను. ఆ యుద్ధములో షౌకత్ జంగ్ చచ్చెను. తిరిగి నబాబు మూర్షిదాబాదు చేరెను. పురజనులెల్లరు మహాఆనందము నొందిరి. ఇతనిపై అభినందన పరంపరల గురిపించిరి. ఢిల్లీపాదుషాకూడ మెచ్చుకొని, యితని నబాబుగిరిని ఖాయమొన ర్చెను.

ఈ సందులో ఫుల్టాలో దాగియున్న మన యింగ్లీషువా రేమిచేయున్నారో చూతము. నబాబు వీరిని హింసించక పోవడమేగాక, పై పెచ్చువారియెడ కరుణ వహించి, వారికికావలసిన తినుబండారములువగైరా సామాగ్రినికూడ యిప్పించె ననిగదచెప్పియుంటిమి. ఇందుకు ప్రతిఫలముగ, యింగ్లీషువారు నబాబు యెడ కృత ఘ్నులై, ఆతనిపై కుట్ర పన్నుచుండిరి. అతని యింటిలోతిని అతనియింటి వాసము లనే లెక్కపెట్టుచుండిరి. నబాబు సప్లయిచేయించిన భోజనపదార్థములను ఫుల్టాలో చక్కగ కూర్చుండి తినుచు యింగ్లీషువారతనిపై కుట్రాలోచనల చేయుచుండిరి. తమకు కలిగిన నష్టమునుగూర్చి మద్రాసుకు కబురంపి, తిరిగి కలకత్తాను పట్టుకొను టకై కొంత దండును సహాయముగ పంపవలసినదనికోరిరి. ఈలోపుగ, "తమ కుట్రాలోచన నబాబుకు తెలియకుండ అతని మభ్యపెట్టుటకై, తమ్మును తిరిగి కలకత్తాలో వర్తకముచేసికొని బ్రతుకనివ్వవలసినదని నబాబును ప్రార్థించుచు రాయబారముల సాగించిరి." (పై గ్రంథము వాల్యూము 1, పేజీ CXI)

## మద్రాసునుండి దండు.

బెంగాలులో కలహము పుట్టినసంగతి జూలై 13-వ తేదీన మద్రాసుకు తెలి సెను. అంతట మేజర్ కీల్‌ప్యాట్రిక్ అను నతని యాధిపత్యమున 200 సేన 'దిలా వారి 'యను ఓడపై యెక్కి జూలై 21-వ తేదీన మదరాసులో బయలుదేరి, 31-వ తేదీన 'ఫుల్టా' చేరెను. యస్. సి. హిల్లు యిట్లు వ్రాయుచున్నాడు.

ఈసేన వచ్చుటనుజూచి నబాబు మేలుకొనునేమోయను తలంపుతో, అతనిని మోసపుచ్చుటకై "జరిగిపోయినదేమో జరిగిపోయినది, దానికిగాను మీ

మీద మేమేమియు మనస్సులో ద్వేషము ఉంచుకోము.'' అని నబాబుకు నచ్చ చెప్పి, వ్రాసి, నీవక్కడికిచేరగనే అతనినుండి కొన్ని సప్లయిలు అడిగిపుచ్చుకోవల సినదని జులై 15-వ తేదీననే మదరాసువారు యాకీల్‌ప్యాట్రిక్‌కు చెప్పిపంపిరి. ఈ వుత్తరము నబాబుకు చేర్చుటకుగాను అప్పటికింకను కాశింబజారులోనున్న హేస్టిం గ్సుకు పంపబడినది.''

పైదానిపై వ్యాఖ్యాన మనవసరము. క్రింద గీతగీచిన మాటలు తమగుట్టును తామే బయటవేసికొంటున్నవి.

కాశింబజారు నష్టమైనసంగతి 1756 సం॥ ఆగష్టు 3-వ తేదీనను, కలకత్తా పోయిన సంగతి 16-వ తేదీనను మద్రాసులో తెలిసెను. వెంటనే మద్రాసు కౌన్సి లర్లు 17, 18 తేదీలలో సమావేశమై, తిరిగి కలకత్తాను పట్టుకొనుట యెట్లా యని ఆలోచించిరి. ఇందు విషయమై నౌకాదళాధిపతియగు అడ్మిరల్ వాట్సను సలహా నడిగిరి. వానకాలము వెళ్లేవరకు - సెప్టెంబరు ఆఖరువరకు - దండయాత్ర ఆపితే బాగుంటుందని ఆతడనెను.

అప్పుడు క్లైవు మద్రాసులోలేడు. అతడు వచ్చిన పిమ్మట, బహుశః అతని మిత్రుడు 'ఆర్మ్ 'అను చరిత్రకారుని ప్రోత్సాహముచే అతడు కలకత్తాకు దండు గైకొనిపోదునని తనంతట తానుగ ముందుకు వచ్చెను.

ఆ సమయములో యూరపులో ఫ్రెంచివారికి, యింగ్లీషువారికి యుద్ధము వచ్చేటట్లుగవున్నది. ఫ్రెంచివారు దక్షిణయిండియాలో బలాఢ్యులుగ నున్నారు. యూరపులో యుద్ధమే వచ్చేటట్టుయితే, యిక్కడ యిండియాలో ఫ్రెంచివారు ఊరుకుంటారా? అయినప్పటికి మద్రాసు వారు ధైర్యముచేసి, ఒక పెద్దసేనను సమకూర్చి, కలకత్తాను తిరిగి సంపాదించుపనికై బెంగాలుకు పంపుటకు తీర్మానిం చిరి. 1757 సం॥ ఫిబ్రవరి 21-వ తేదీన మద్రాసు కౌన్సిలువారు, కలకత్తాకౌన్సిలు వారికి వ్రాసిన ఉత్తరములో యిట్లున్నది :—

"కంపెనీయొక్కయు, కంపెనీ తరఫున బాధలుపడ్డ యితర వ్యక్తుల యొక్కయు క్షేమము నాలోచించి, యీదండును మిక్కిలి బలమైన దానినిగచేసి పంపుటకు మేము పడినశ్రమ యింతింత యనికాదు. ఈకోస్తాయందున్న మన స్థాన ములనన్నిటిని ఖాళీచేసి, అక్కడి సేనలనన్నిటిని యిక్కడికి రప్పించి, యీదండును మిక్కిలి బలమైన దానినిగ సమకూర్చితిమి. మనపూనిక తర్వాలో పూర్తిగవిజయ వంత మగుటకుగాను మేము మాశాయశక్తులా శ్రమపడి యీదండునుకూర్చి పంపు చున్నాము.''

"ఏ క్షణమందు ఫ్రెంచివారితో యుద్ధమువచ్చునో యని మేమిక్కడ అను కొనుచున్నాము. ఫ్రెంచివారొక పెద్దనౌకాదళమునుగూడ యిక్కడ తీసికొనివచ్చి

పెట్టేటట్లుగ మాకు రహస్యసంఘమువారి జాబులవల్ల తెలియుచున్నది. ఈ సంధిగ్ధ స్థితిలో అక్కడ బంగాళాలో మనచేతులలో లేని స్థానములను సంపాదించుకొనబోయి ఇచ్చట యీ స్థానములకు రక్షణలేకుండ చేసికొనుటకు మాకు ధైర్యము చాలకున్నది.

"అయితే అటు బెంగాలులో పోయిన స్థానములను తిరిగి సంపాదించుకొనుటకును, యిటు మద్రాసులోనున్న స్థానములుపోకుండ కాపాడుకొనుటకును, యీ రెంటిని సాధించుటకుగాను మేమొక యుపాయమును కనిపెట్టితిమి, అదేదనగ :— అవసరమని తోచినప్పుడు మీకిప్పుడు పంపించుచున్నదండును తిరిగి వెనుకకు పిలుపించుకునే హక్కును మేముంచుకొన్నాము." (పై గ్రంథము. వాల్యూము II పేజీ 233)

ఇట్టి పరిస్థితులమధ్య అక్టోబరు నెలలో 800 మంది యూరోపియనులును, 1300 మంది శిపాయిలును, లాస్కర్లును, గలిగిన సైన్యము మద్రాసునుండి బయలుదేరెను. క్లైవ్ మెట్టదారిని, అడ్మిరల్ వాట్సన్ సముద్రపుదారిని, సేనాధిపత్యముల వహించి బయలుదేరిరి.

బంగాళాదేశములో తమ వర్తకమును తిరిగి స్థాపించుకొనుటకేగాక, నబాబుపై కుట్రపన్ని, అతనిని సింహాసనమునుండి పడద్రోసి, బంగాళాదేశమంతయు అరాచకముచేసి రండని మద్రాసులోని కిరస్తానీ నౌకర్లు తమవారికి చెప్పిపంపిరి. 1756 సం॥ అక్టోబరు 13-వ తేదీని మద్రాసువారు కలకత్తావారికి వ్రాసిన ఉత్తరములో నిట్లుండెను :—

"కలకత్తాను తిరిగి తీసికొనడమను యీ ఒక కార్యముతోనే యీ యెత్తుగడ ఆగకూడదు. మనగిడ్డంగులు, యితర స్థానములు మనవి మనకు వచ్చివేయుటయేగాక, మొగలాయి చక్రవర్తి వెనుక మనకిచ్చిన హక్కులన్నియు పూరాగా తిరిగి మనకురావలెను. మనకీమధ్యగలిగిన నష్టములకన్నిటికి తగు పరిహారముకూడ రావలెను. ఇట్లు జరుగనిచో, మనప్రయత్నమంతయు నిరర్థకము. ఇదివరకు వచ్చిన నష్టమునకుతోడు, యీ యుద్ధపుఖర్చుకూడ అనవసరముగ నెత్తినవేసుకొన్న వారమగుదుము. మనవర్తకమునకు, మనస్థానములకు, యికముందెట్టి అపాయముగాని, నష్టముగాని, అగౌరవముగాని రాకుండ కాపాడుకోలేక పోయినట్టయితే, యీదండయాత్రయే వదలుకోవడము మంచిది."

"మనసైన్యములు వచ్చుటనుజూచి, నబాబు పైనపేర్కొన్న హక్కులు మనవిమనకు యిచ్చివేస్తానని గనక అనేటట్టయితే, మీరు అనవసరమగు యుద్ధములోనికి దిగవద్దు. ఏలననగ, యుద్ధములోనికి దిగిన తరువాత ఏమో, ఏది యెట్లగునో! నబాబు మీద కసితీర్చుకోవలసియున్నమాట వాస్తవమే. న్యాయమే.

కసిదీర్చుకొనవలసిన న్యాయము యిప్పుడు, దీనికి, గాకున్న యింకదేనికి యెప్పుడు గలుగును? అయినప్పటికి, యుద్ధమునల్ల వచ్చు చెడుగులనుండి సాధ్యమైనంతవరకు తప్పించుకొనుటకు మనము చూడవలెను. అదిగాక, కంపెనీ ఖజానాలో సొమ్ము అనవసరముగ ఖర్చుగాకుండ చూడవలెను. అయితే కత్తి ఒకచేతను, కలము ఒక చేతను పట్టి మనము పనిచేయవలెను. ఈసేన అక్కడచేరగనే, వెంటనే, తీవ్రముగ యుద్ధము ప్రారంభించవలెను. ఈ యుద్ధము అన్నిరకములుగను సాగించవలెను. దీనితో నబాబు రాజ్యము, ఎస్టేటు, నాశనమగుటయో లేక మనకప్పారమగు ధనముచేకూరుటయో, జరుగవలెను.''

''నబాబు దౌర్జన్యముల యెడ అసంతృప్తి నొందియున్నగాని, లేక అతని సింహాసనమును కాజేయవలెనని ఆశించుచున్నట్లగాని, అతని శత్రువులతో యెవరితోనైన మనము నేస్తముగట్టి పని చేసుకొనుట మనకు యుద్ధకార్యమందును, నబాబు మంత్రివర్గమందును యెంత అనుకూలముగ నుండునో, మేము మీకు వేరుగచెప్ప పనిలేదు. (పై గ్రంథము వాల్యూం I పేజీ 239-240)

ఇట్టి దుశ్చింతలతో, ద్రోహబుద్ధులతో యింగ్లీషుసేన మద్రాసునుండి బెంగాలుకు పయనమయ్యెను. సముద్రయాన మంతకులాసాగా లేకుండెను. చాల ఓడలలోవారికి జబ్బుచేసెను. అయినను ఎట్లో తంటాలుపడి యింగ్లీషు సేనలు 1756 డిసంబరు మధ్యలో ఫల్టాచేరెను.

## క్లైవు చేష్టలు.

బెంగాల్ చేరిన తరువాత 1756 సం॥ డిశంబరు 15-వ తేదీన క్లైవ్ కలకత్తా గవర్నగనుండిన రాజా మనిక్ చంద్ కొక ఉత్తరము వ్రాసెను. ఇందులో నబాబుకుకూడ ఒక ఉత్తరమును వ్రాసిపెట్టిపంపెను. క్లైవు నబాబుకు వ్రాసిన ఉత్తరములోని మతలబు సరిగలేనందున, నబాబుకు వ్రాయు ఉత్తరముండవలసిన విధానమును క్లైవుకుబోధించుచు రాజా మనిక్ చంద్ దానిని తిరిగి క్లైవుకు డిశంబరు 23-వ తేదీన పంపించెను. క్లైవు మొదట నబాబుకు వ్రాసిన ఉత్తరమునుగూర్చి మనిక్ చంద్ యిట్లనుచున్నాడు :—

''ఈ యుత్తరములో అసభ్యమైన మాటలు చాలఉన్నవి. ఈ యుత్తరమును నాకు పంపించుటవలన యిందుపై నా యభిప్రాయమును మీరు కోరినట్లు నేనుయెంచి, అందులోకొన్ని మార్పులను నేనుచేసి, దీనిని తిరిగి మీకు రాధాకృష్ణ మల్లిక్ చేత పంపుచున్నాను. నేను దిద్దినప్రకారము మీ రా ఉత్తరమును తిరిగి వ్రాసి, నా వద్దకు పంపించండి. నేను దానిని నబాబుకు పంపించెదను. మీరు శాంతిని గోరుచున్నట్లు వ్రాసినారు. నేనును శాంతిని గోరుచున్నాను. శాంతికంటె మేలైన దింకొకటిలేదు. ద్వేషమును, కలహమును, తుడిచివేయుట సత్పురుషుని

లక్షణము. తక్కిన విషయములో నా యభిప్రాయము మీకు యీ రాధాకృష్ణుని వల్ల తెలియును." (పై గ్రంథము వాల్యూం II పేజీ 74)

క్రైస్తవేతరుడగు నబాబును, అతని ప్రతినిధియు శాంతిగావలెనని కోరుచుండగ, "ఈశ్వర రాజ్యము భూమిపై వచ్చుగాక "యని నిత్యము ప్రార్థనలు సల్పు క్రైస్తవులు రక్తము దాహము త్రాగవలెనని నాలుకలు చాచుచుండిరి. 1756 సం॥ డిశంబరు 25-వ తేదీన క్లైవ్ మనిక్ చంద్ కిట్లు వ్రాసెను.

"మీరు సూచించిన శైలిలో నేను నబాబుకు ఉత్తరము వ్రాయుట కంపెనీ యెడను, వారిగౌరవము నెడను, నేనునావిధిని సరిగ నెరవేర్చినవాడనుగానని యనిపించును. ఈశైలి నబాబు కలకత్తాను పట్టుకొనుటకు పూర్వమెంత యుక్తమైనను, ప్రస్తుత స్థితిగతులకిది సరిపోలేదు. మేమిప్పుడు అతనిని వేడుకొనుటకురాలేదు. మాకు కలిగిన నష్టమునకు తగు పరిహారమును అతనినుండి లాగికొనుటకు మేము వచ్చినాము. మా హక్కును మేము స్థిరపరచుకొనుటకు తగినంతబలముతో మేము వచ్చినాము. కాబట్టి, యీస్థితిలో నేనాశైలిలో నబాబుకు ఉత్తరము వ్రాయుట పడదు." (పై గ్రంథము. పేజీ 76)

కాని, అప్పుడు వెంటనే నబాబుపై యుద్ధము ప్రకటించుటకు యింగ్లీషు వారికి అనుకూలముగలేదు. వారప్పుడు సిద్ధముగలేరు. కాబట్టి, జిత్తులమారి నక్కలవలె లోలోపల కుట్రలు పన్నుచు, తరుణమునకై వేచియుండిరి.

యస్. సి. హిల్లు యిట్లు వ్రాయుచున్నాడు.

"నేరుగ నబాబుకే వ్రాయుట మంచిదని క్లైవును, వాట్సనును తలంచి, యిద్దరు చెరియొక యుత్తరమును 17-వ తేదీన వేర్వేరుగ వ్రాసిరి. వారిరువురు ఆవుత్తరములలో నబాబును బెదరించిరనుమాట నిస్సంశయము. ఈ ఉత్తరములు నబాబుకు తప్పక చేరియుండును. అయితే, వాని కతడు జబాబిచ్చెనో లేకో తెలియదు." (పై గ్రంథము వాల్యూము I, పేజీ 79)

ఈ ఉత్తరముల నకళ్లు యీ దిగువ వ్రాయబడినవి :—1756 సం॥ డిశంబరు 17-వ తేదీ ఫుల్టావద్ద హుగ్లీనదిలోనున్న కెంట అను ఓడపైనుండి - అడ్మిరల్ వాట్సన్ వ్రాసిన ఉత్తరమునకు నకలు.

"ఎవరి పేరునైతే ప్రపంచములోని చక్రవర్తులెల్లరు గౌరవింతురో అట్టి నా యేలికయగు మహారాజు యీస్టిండియా కంపెనీవారి వర్తకమును, హక్కులను సంరక్షించుటకుగాను ఒకపెద్ద నౌకాదళముతో నన్నీ ప్రాంతములకు పంపియున్నారు. మా యేలికప్రజలచే గావింపబడుచున్న విస్తారవాణిజ్యమ్ముచే మొగలు రాజ్యమునకెట్టి మేళ్లుచేకూరుచున్నవో యెల్లరకు స్పష్టమేగావున వానినిట వివరింపబనిలేదు.

ఇట్టిస్థితిలో నీవు పెద్దదండుతో సదరు కంపెనీ గిడ్డంగులపై బడి, అక్కడనుండి మా నౌకర్లను బలాత్కారముగ వెడలగొట్టి, అక్కడి ఆస్తులను దోచుకొని, చాలధనమును కొల్లగొట్టి నా యేలికప్రజలను చాలమందిని చంపినట్లు నేను విని చాల ఆశ్చర్యపడితిని.''

''సదరు కంపెనీ నౌకర్లను తిరిగి వారివారి స్థానములలో ప్రవేశపెట్టుటకై నే నిప్పుడు బంగాళమునకు వచ్చియున్నాను. మావారిని తిరిగి వారివారి స్థానములలో ప్రవేశపెట్టి, వారికి అనాదినుండియున్న, హక్కులను, సౌకర్యములను తిరిగియిచ్చు విషయములో నీవు సుముఖుడవుగ నుందువని యాశించుచున్నాను. ఇంగ్లీషువారు నీరాజ్యములో స్థిరముగ నుండుటవలన గలుగులాభములు నీకు తెలిసియే యుండును గాన, వారికిగలిగియున్న నష్టములకు, కష్టములకు తగు పరిహారమిచ్చుటకు నీవంగీకరింతువని నేను నిస్సంశయముగ తలంచుచున్నాను. ఈ కొలదిపాటి న్యాయమును నీవొనర్చి, యీ చిక్కులన్నిటిని శాంతముగ పరిష్కారమొనర్చి, శాంతిప్రియుడును, న్యాయకార్య తత్పరుడునునగు నాయేలికతోడి సఖ్యమును సంపాదించుకొందువు గాక. నే నింతకంటె ఏమిచెప్పగలను.''

1756-వ సం౹ డిశంబరు 16-17-వ తేదీలలో క్లైవు నబాబుకువ్రాసిన ఉత్తరమునకు నకలు :—

'' నే నిక్కడికి వచ్చినసంగతి, నబాబు సలబత్ జంగ్, అన్వరుద్దీనుఖాన్, గవర్నర్ పిగట్టులువ్రాసిన ఉత్తరములవల్ల నీకు తెలిసియేయుండును. ఇంతకు పూర్వ మెన్నడును బెంగాల్‌లో కనిపించియుండనంతటి పెద్దసైన్యమును నేను వెంటపెట్టుకొనివచ్చిన సంగతికూడ నీవు వినియుందువనియే నేను తలంచుచున్నాను. నీ రాజ్యములో నెలకొనియున్న యింగ్లీషువారిని నీ జనమెట్లు హింసించిరో, వారి యిండ్లను గిడ్డంగులనుపట్టుకొని, ఆస్తులను దోచుకొని, చాలమంది కంపెనీ నౌకర్లను యితర ప్రజలను అమానుషముగ నెట్లుచంపిరో నీవు వివేకముతో పారజూచి యోచించుకొనుట నీకును, నీ రాజ్యమునకునుకూడ క్షేమకరమని తలంపుము. ఈ దుండగములను నీవు హర్షింతువని నేనను కొనను. ఈ దుష్కృత్యముల నొనర్చిన వారిని తీవ్రముగ శిక్షించువిషయములో నీవు జాగ్రత్తవహింతువని యనుకొనుచున్నాను. నీబలము, నీకు స్వయముగగల ధైర్యము, లోకమందందరెరింగినదే. నాకు గల రణప్రావీణ్యమును జగత్ప్రఖ్యాతి గాంచినదే. తూర్పుకోస్తాయందు నేను పది సంవత్సరములు విరామములేక యుద్ధరంగములందు విహరించుచుంటిని. ఈ కాలములో యీశ్వరానుగ్రహమువలన నే పూనినకార్యములన్నియు జయప్రదములగుచునేవచ్చెను. ఈ ప్రాంతములలోగూడ నాకట్టి యదృష్టమే పట్టునని నేను దేవునియందు నమ్మకముంచి చెప్పుచున్నాను. అంతదూరము పోవలసిన అవసరము పట్టే

టట్టయితే, మన యిద్దరిలో ఎవరోఒకరు ఓడిపోవలసి వచ్చును. ఇద్దరము గెలువ లేముగద. యుద్ధములో జయాపజయముల నెవరు నిర్ణయించగలరు? కాబట్టి, నీవు బాగా ఆలోచించుకో? ఇట్టి అవస్థ తప్పించుకోదలచినయెడల, కంపెనీకి గలిగియున్న నష్టమునకు నీవు తగిన పరిహారము యివ్వవలెను. కంపెనీ నౌకర్లకు, రైతులకు కలిగిన నష్టమునకును పరిహారము యివ్వవలెను. కంపెనీ గిడ్డంగుల నిచ్చివేసి, వారికి అనాదినుండియున్న హక్కులను, సౌకర్యములను తిరిగి యిచ్చివేయవలెను. ఈ కొలదిపాటి న్యాయమును నీ వొనర్చుటవల్ల నన్ను నీవు నిజమైన స్నేహితునిగ జేసి కొందువు. నీకు శాశ్వతమైనకీర్తి కలుగును. ఏపాపమెరుగని ప్రజలు ఉభయపక్షముల వేలకొలదిగ హతమారకుండ వారిని నీవు రక్షించినవాడ వగుదువు. నే నింత కంటె యేమిచెప్పగలను?''

ఈరెండు ఉత్తరములలోకూడ 'చీకటికొట్టు' మాటయే లేదు చూడండి!

మనిక్‌చంద్ ద్రోహము.

ఈరెండు ఉత్తరములను సరాసరి నబాబుకు పంపినట్లు లేదు. తిరిగి మనిక్ చంద్ ద్వారానే పంపినట్లున్నది. ఏల యిట్లు పంపవలెను? క్లైవును అతనితోడి యుద్యోగులునుకలిసి మనిక్‌చంద్‌ను లోబరుచుకొని, అతనితో చేరి కుట్రపన్నుచున్నట్లు యీ క్రింది "బడ్జి-బడ్జి" వృత్తాంతమువలన అనుమానింపవలసి వచ్చుచున్నది. 'బడ్జి – బడ్జి' యనుచోట జరిగిన పోరాటమునుగూర్చి యస్. సి. హిల్లుయిట్లు వ్రాయుచున్నాడు:—

"ఓడలు రావడానికి నది సరియైనస్థితిలో వున్నదని 26–వ తేదీకి గాని చుక్కాని వాళ్లు చెప్పలేదు. అప్పటికిని, 'శాలిస్‌బరీ' ఓడరావడము ఆలస్యమగుట చేత, 27–వ తేదీకిగాని, నడక సాగలేదు. శిపాయిలు మెట్టదారిని వచ్చునట్లు ఉత్తరవుచేయబడెను...28–వ తేదీకి శిపాయిలు మాయాపురముచేరిరి. అక్కడ వారికి మిగతా కంపెనీసేనలు కలిసెను. 29–వ తేదీకి వారందరు "బడ్జి-బడ్జికి" చేరిరి. ఇక్కడ నదిగట్టుకు దగ్గరగ సేనలు ఆగెను. ఓడలలో వున్నవారు తెరచాపకొయ్య లెక్కి చూస్తే వీరు కనిపించుచున్నారు. కాని, చుట్టు పొదలుండుటచేత, వీరికి మాత్రము బడ్జి-బడ్జికోట కనిపించడములేదు. నమ్మకమైన సమాచారము లేమియు క్లైవుకు వచ్చుటలేదు. అక్కడికిరెండుమైళ్లదూరములో శత్రుసేనలు విడిసియున్నవి. ఈ సంగతి క్లైవుకు తెలియదు. సేనచాలమట్టుకు నలుముఖముల చీలిపోయియున్నది. ఇతని వద్ద కొద్దిదళము 260 మంది యూరోపియను సైనికులు మాత్రము ఉండిరి. అప్పుడు మనిక్‌చంద్ అక్కడికి తీసికొనివచ్చిన రెండువేలశత్రుసేన ఆకస్మికముగ క్లైవుదళము మీదపడెను. అరగంటసేపు పోరాటముజరిగెను. శత్రువులు పలాయను లైరి. బడ్జిబడ్జికోట ముట్టడికై అప్పుడే ఓడ దిగిన కంపెనీసేన యీ ఫిరంగుల మోత విని అక్కడికి రాగా, క్లైవుస్థితి నిరపాయ మయ్యెను..."

బడ్జిబడ్జి వద్ద జరిగిన పోరాటము మిట్టమధ్యాహ్నమప్పుడు జరిగెను. నౌకా దళము, 'టైగర్' అను పేరుగల నావను ముందిడుకొని, రాత్రి యిక 8 గంటలు కొట్టబోవుచున్నారనగ కోటముందుకువచ్చెను. అప్పుడు కోటలో నుండి అగ్ని గోళములు 'టైగర్' నావపైకి రాదొడగెను. శత్రువులే యీరీతిగ ముందు యుద్ధమును ప్రారంభించిరను సంగతిని క్లైవును, కౌన్సిలువారును, తదుపరి నబాబుకును అతని ప్రజలకును వ్రాసిన జాబులో ఉదహరించుచు, యింగ్లీషువారు తమ చర్యను సమర్థించుకొనుటకిది యొక కారణముగ పేర్కొనిరి. శత్రువులు త్వరలోనే ఫిరంగుల నుండి తరిమివేయబడిరి. కోట ముట్టడికై కంపెనీసేనలుదిగెను" (పై గ్రంథము వాల్యూము I, పేజీ CXXIX—CXXX)

బడ్జి - బడ్జి, కలకత్తాలు యింగ్లీషు వారి వశమగుట.

పై పేరాలో అడుగున గీతగీచిన వాక్యములలోని కారణములను బుద్ధిహీనుడో లేక దొంగయో కానివాడు చెప్పియుండడు. అది తమకొక హానిగ భావించి, నబాబుపై దండెత్తుట కదియొకమిషగ చెప్పుకొనుటకు యింగ్లీష్‌వారికే చెల్లెను.

తన తలపాగగుండ ఒకగుండుదెబ్బ దూరిపోగానే, మనిక్‌చంద్ కోటనువిడిచి పారిపోయెను. దీనినిబట్టి, ఆతడు కంపెనీవారితో పరీకయ్యెనని స్పష్టమగుచున్నది. ఈతడు సరాసరి మూర్షిదాబాదుకు పారిపోయెనట ; అతడు పిరికివాడందుమా ? కోటను విడిచి అంత త్వరగా పారిపోవుటకిది తగిన సంజాయిషీగ గన్పట్టదు. "బడ్జిబడ్జి" కోట మిక్కిలి బలిష్టమైనది. దీనిని గూర్చి 1757 సం॥ జనవరి 31-వ తేదీన అడ్మిరల్ వాట్సన్ జాన్ క్లైవులండుకువ్రాసిన ఉత్తరములో నిట్లున్నది.

"ఈకోట రక్షణకుతగిన మంచి స్థలములో వున్నది. దీనిచుట్టు నీటితోనిండిన కందకమున్నది. ఇది చాలవీలు."

ఇట్టి బలిష్టమగు కోటనుండి ఒక అరగంటపోరాటమైన తరువాత పారిపోవడమనేది స్వామిద్రోహమును సూచించునుగాని, పిరికితనమును సూచించదు. మనిక్‌చంద్ అదివరకే యింగ్లీషువారితో పరీకై యిట్టి ద్రోహమును చేసియుండును. గవర్నమెంటు రికార్డులనుండి రెవరెండ్ లాంగ్ యెత్తి వ్రాసిన భాగములలోనుండి తీసికొనబడిన యీ దిగువ వాక్యములవలన యీ ఊహ మరింతబలమగుచున్నది.

"లేటు మనిక్‌చంద్ కొడుకుకు కంపెనీ కొలువులో ఉద్యోగమిచ్చుటకు గవర్నమెంటు వారు (1763 లో) అంగీకరించిరి. గతముప్పది సం॥లలో యీమనిక్‌చంద్ కంపెనీవారికి అనేక విధములుగ ఉపయోగపడి యున్నాడు - బడ్జిబడ్జి యుద్ధములో యింగ్లీషువారిపైకి యితడు నబాబు సేనలను నడిపించుకొని వచ్చినప్పటికి.—"

బడ్జిబడ్జికోట 1756 సం॥ డిశంబరు 29-వ తేదీ రాత్రి పట్టుకోబడెను. "కెప్టన్ (తదుపరి సర్) అయ్యర్ కూట్" యీ కోట ముట్టడినిట్లు వర్ణించెను.

"నేను ఓడమీద నుండగ త్రాగిన నావికుడు మనవాడొకడు రహస్యముగ కోటగేటు దగ్గరకుపోయి, పిస్తోలుపేల్చి, 'యీ కోటనాది' అని అరచెను. అంతట ప్రక్కనేయున్న కంపెనీసేన సరాసరికోటలో ప్రవేశించెను. ఎవరు అడ్డగించలేదు. ఈ విధముగకోట మనచే గైకొనబడినది. ఇందులో ఎవరికిగాని కించిత్తు గౌరవములేదు. కోట చాలబలిష్టమైనదని మేము కనుగొంటిమి. చుట్టు నీటితో నిండిన కందకమున్నది. ఆ రాత్రి యీ కోటకు ఆధిపత్యమువహించు భాగ్యము నాకబ్బినది."

ఈ కోటలోనున్న వారినందరిని మనక్రైస్తవ సోదరులు చంపిరి. బహుశః కొందరు తప్పించుకొని పోయికూడ ఉండవచ్చును.

క్లైవు, వాట్సనుల యాజమాన్యమున కంపెనీ సేనలుచేసిన పనినిగూర్చి 'కెప్టన్ కూట్' యిట్లు వ్రాసికొని యున్నాడు :—

డిశంబరు 30 :—సేనలు తిరిగి ఓడయెక్కెను. శిపాయీలు మెట్టదారిని వచ్చుచుండిరి.

డిశంబరు 31 :—సౌకాదళము నదికెగువకు నడచెను.

1757 సం॥ జనవరి 1-వ తేదీ :—శత్రువులు ఖాళీచేసిన థానాకోట కనబడెను.

జనవరి 2 :—కంపెనీ సేనతో కర్నల్ క్లైవ్ ఓడిదిగెను. "కెంటు," 'టైగర్' అను ఓడలు కలకత్తాకు వెళ్లెను. 9 గంటలప్పుడు కలకత్తా కోటలోనుండి 'టైగర్' మీదికి గుండ్లువచ్చి పడెను. ఇంతలో ఎదురు కాల్చుటకు 'టైగర్' కొక ఫిరంగిదొరకెను. కెంటు, టైగరులనుండి ఫిరంగులు రాగానే, మేము తీవ్రముగ కాల్చితిమి. 12 గంటలగు నప్పటికి శత్రువు పారిపోయెను. క్రిందికి దిగి యింగ్లీషు జెండా పాతి, యిగ్లీషురాజు పేరుచెప్పి, కోటను స్వాధీనపరచుకొనవలసినదని అడ్మిరల్ వాట్సన్ నన్నాజ్ఞాపించెను." (వాల్యూము, III పేజీ 41)

ఈరీతిగ యింగ్లీషువారు కలకత్తాను బహుసులభముగ తిరిగి స్వాధీన పరచుకొనిరి. ఏలననగ :—నబాబుతానక్కడ తనప్రతినిధిగ పెట్టిన మనిక్ చంద్ యింగ్లీషు వారితో పరీక్షై అదివరకే పారిపోయెను *

* ఇందునుగూర్చి యస్. సి. హిల్లు యిట్లు వ్రాయుచున్నాడు :—మనిక్ చంద్ కలకత్తాలో నిలువబడి పోరాడకుండ, అతిత్వరితముగ హుగ్లీకి పారిపోయెను. అక్కడనుండి మూర్షిదాబాదులో నున్న నబాబునకిట్లని కబురు పంపించెను. ఇంగ్లీషువారు వెనుక మీరువారిని కలత్తాలో ఓడించినప్పుడున్నట్లుగలేరు. ఇప్పుడు వారి వ్యవహారము మారిపోయినది." (వాల్యూం I పేజీ CXXXVII)

నాయకత్వమునకై క్లైవు, వాట్సనులు తమలోతామాడుకొన్న అసహ్యమగు కీచులాట నంతయుయిట విచరింపబనిలేదు. కలకత్తాకోటలో తమకు దొరుకుననుకొన్న ధనపుమూటలపంపిణీలో 'నాకెక్కువరావలెనంటే, నాకెక్కువరావలెనని' యిరువురు కొట్లాడుకొనిరి. ఇరువురు సమానముగ ఆశపాతకులే. కాని, వారి ఉభయులకు ఆశాభంగమయ్యెను. కోటలో లూటీచేయదగినదేమియు దొరకలేదు. అదివర కక్కడనుండిన కంపెనీవారి సరుకులలో ఒక్క పూరిపుల్లయైనను నబాబు మనుష్యులు తీసికొనిపోలేదు. ఇది వారికి ఎంత గౌరవప్రదమైనసంగతి! ఆర్మ్ యిట్లు వ్రాయుచున్నాడు. (II, 126 పేజీ)

"నబాబు కలకత్తాకోటను పట్టుకొన్నప్పుడు అక్కడనున్న కంపెనీ తాలూకు వస్తువులలో ఒక్కటికూడ ముట్టుకొనలేదు."

మునల్మానులుగాని, హిందువులుగాని, అసురులుగారు. అప్రాచ్యులగు కైస్తవులవలె వారు యితరులను పీకుకొని తిను రాంబొంములుగారు. ఈ కారణముచేతనే వారు కిరస్తానీ కిరాటుల వస్తువుల వేనిని గాని ముట్టుకొనలేదు.

కంపెనీసేనలు కలకత్తాకోటను స్వాధీనపరచుకొన్న తరువాత, వారు దానిని 1757-వ సం॥ జనవరి 3-వ తేదీన డ్రేకుకు స్వాధీనమొనర్చిరి. అతనికి సలహాచెప్పుటకు ఒక కౌన్సిలునుకూడ యేర్పాటుచేసిరి.

సురాజ్ ఉద్దౌలా యింగ్లీషువారియెడ కావేషీ పెట్టుకొనలేదు. ఇదివరకు వారికున్న వర్తకపు హక్కులను తిరిగి యిచ్చుట కాతడు ఎల్లప్పుడును సంసిద్ధముగనే యుండెను. కాని, వారికిప్పుడు కోట స్వాధీనమగుటచే, తమ యిష్టము వచ్చిన షరతులకు నబాబును ఒప్పించగలమను గర్వముతో వారుండిరి. అందుచే వారతనిని బుద్ధిపూర్వకముగ అవమానపరచిరి. అతనిపై కుట్ర పన్నిరి. ప్రపంచములో శాంతి, సద్భావములనబడు యీశ్వరరాజ్యమును స్థాపించుట యన యీ కిరస్తానీలకు గిట్టదు. వారు తమబలమును చూపుటకై రెండు యెత్తుల నాలోచించిరి :—

హుగ్లీ దోపిడి.

"ఒకయెత్తు ఏమనగ :—నదిమీదుగ కొందరు నావికులను ఢక్కాకు పంపించి, ఆ పట్టణమును పట్టుకొని, అక్కడ ఖైదీలుగనున్న సర్ ఫరజ్ఖాను కొడుకులలో ఒకనిని సురాజ్ ఉద్దౌలాకు పోటీగ నిలువబెట్టుట ; ఇది ఒకయెత్తు. ఇంతకంటె వీలైనది సులభమైనది యింకొకయెత్తు ఏమనగ, హుగ్లీమీద కొకచిన్న దండును పంపి, నబాబక్కడ ప్రోగు చేయించియుంచిన ధాన్యపుకొట్లను, యితర సామగ్రికొట్లను తగులబెట్టించుట. ఇది రెండవయెత్తు." (పైగ్రంథము వాల్యూము I. పేజీ CXXXVIII)

ఈ కిరస్తానీ యింగ్లీషులు యింగ్లండులో పూర్వముండిన ఓడదొంగలకు పుట్టినవారు. ఓడ దొంగతనము వారికి వంశపారంపర్యముగ వచ్చుచున్న వృత్తి. "సర్ చార్లెస్ డిల్క్" అను సుప్రసిద్ధ ఆంగ్లరాచకీయవేత్త యింగ్లీషువారిని గురించి 1870-వ సం॥ ప్రాంతమందు వ్రాయుచు ఏమనెను? "భోజనాల దగ్గరకూర్చొని మాట్లాడుకొంటున్న సమయాలలో వారికి అకస్మాత్తుగ పూర్వజన్మస్మృతిగలిగి, తాము ఓడదొంగలకు పుట్టినవాళ్లమను సంగతి జ్ఞాపకము వస్తూవుండేది. శతాబ్దములవిద్య వారిరక్తమును పరిశుద్ధ మొనర్చలేదు." (వెనుకటిగుణ మేలమాను వినరా సుమతీ!)

కాబట్టి, కుచ్చులు కొరకవలెననుబుద్ధి క్లైవుకు పుట్టుటలో ఆశ్చర్యమేమి? కండ్లఎదురుగ అరక్షితముగనుండిన హుగ్లీని దోచుకొనవలెననుబుద్ధిని క్లైవుమరల్చుకొనలేకపోయెను. కాబట్టి యింగ్లీషువారు హుగ్లీపైబడి, అక్కడనున్న జనము నంతను చంపివేసి, పట్టణమంతయు నెత్తురుకొల్లుచేసి, వారి ఆస్తులనన్నిటిని గొల్ల గొట్టిరి.

హుగ్లీకోట సులభముగ యింగ్లీషువారికి స్వాధీనమయ్యెను. వారింతటితో ఊరుకొనిరా? లేదు.

"1757-వ సం॥ జనవరి 11-వ తేదీయంతయు కోటచుట్టునున్న యిండ్లను దోచుకొనుటతో సరిపోయినది......ఈరోజు మొదలుకొని 18-వ తేదీవరకు శిపాయిలకు దేశీయుల యిండ్లను కొల్లగొట్టుటతో సరిపోయినది. ఒలందావారి యావరణలోనున్న దేశీయుల యిండ్లలోకూడ దూరి కొల్లగొట్టిరి. ఈ ఇండ్లు నబాబు జనమునకు చెందినవనియో, లేక కలకత్తాలో నబాబుజనము తాలూకుఆస్థి యీ యిండ్లలో దాచబడియున్నదనియో వీరు సాకుచెప్పి, యీ యిండ్లలో జొరబడుచుండిరి." (పైగ్రంథము వాల్యూము I, పేజీ, CXL)

కంపెనీవా రొనర్చిన యీ యకారణ రాక్షసకృత్యము నబాబు చెవిని బడెను. ఆతడు నిగ్రహముతో యీ దిగువ జాబును అడ్మిరల్ వాట్సనుకు వ్రాసెను.

"మీరు హుగ్లీనిపట్టుకొని కొల్లగొట్టితిరి. నా జనము పైపడి అల్లరిచేసితిరి. ఇవి వర్తకులు చేయదగిన పనులుకావు. కాబట్టి నేనిప్పుడు మూర్షిదాబాదునుండి కదలి హుగ్లీ సమీపమునకు వచ్చినాను. నేనిప్పుడే నా సైన్యముతో నదిని దాటుచున్నాను. కొంతసేన అప్పుడే మీ శిబిరమువైపుకు నడిచినది. అయినప్పటికి ఫరవాలేదు. పూర్వముమాదిరిగ మీరు మీ వర్తకమును చేసికొందలచుకొన్న యెడల తగినమనిషిని నావద్దకు పంపండి. మీ స్థితిగతులు తెలియచెప్పి, యీ విషయమై పరిష్కరించుకొందగిన మనిషిని పంపండి. మీ గిడ్డంగులు మీకిచ్చివేసి పూర్వము మాదిరిగానే మీ వర్తకమును మీరు చేసుకొనేటట్టుగ నేను హుకు

మును (ఫర్మానాను) యిచ్చుటకు నాకభ్యంతరములేదు. నారాజ్యములో మీరు వర్తకులుగ బ్రతుక దలచుకొన్నట్టయితే, నా యాజ్ఞలప్రకారము నడచుకోండి. నాకు కోపము తెప్పించకండి. మీకేమైన నష్టముకలిగివుంటే, ఆ సంగతి నేను తప్పకుండ ఆలోచిస్తాను. మీకు తృప్తిగ పరిష్కారము చేస్తాను.

"యుద్ధములో దోచుకోనకుండ శిపాయిలను అదుపులోవుంచడము యెంత కష్టమో మీకను తెలియును. కాబట్టి నా సేనలవల్ల మీకుకలిగిన నష్టములో కొంత మీరు వదలుకుంటే, అందువిషయమైకూడ, మీ స్నేహముకోసము, ముందుకుకూడ మీతోమంచిగ ఉండడానికి, నేను కొంతవరకు మిమ్ములను తృప్తి పరుస్తాను."

"మీరు క్రైస్తవులు: కలహమును రగుల్చుకొనుచుండుటకంటే సర్దుబాటు చేసికొనుట యెంతమంచిదో మీరెరుగుదురు. అట్లుగాక, యుద్ధమే కావలెనని మీరు పట్టుపట్టి, మీ కంపెనీయొక్కయు, యితర ప్రయివేటు వర్తకులయొక్కయు శ్రేయమును మీరు ఆలోచించ దలచుకొనకపోతే, నే నేమిచేసేది? అది నా తప్పు కాదు. నాశనకరమగు యిట్టి యుద్ధమువల్లవచ్చు అనర్థములను నివారించుటకై నేనీ యుత్తరమును వ్రాయుచున్నాను." (**Ive's voyages Page** 109)

సురాజ్ వేదాంతివలె వ్రాసెను. అతని దూరదృష్టికి, అతనిశాంతి ప్రియత్వమునకు అతని నెంతపొగడినను తీరదు.

కలహాన్ని చంపడమనేపని యింగ్లీషువారి జన్మములో లేదు. వారితో స్నేహము జారిపోవుచున్న యిసుకదిబ్బమీద యిల్లుకట్టినట్లే. దానిబ్రతుకు స్థిరము కాదు. క్లైవును, యితర యింగ్లీషు ఉద్యోగులును తన దర్బారులోని వారితోచేరి కుట్రాలోచన చేయుచున్నట్లు బహుశః సురాజ్ ఉద్దౌలాకు అలికిడి తగిలినట్లున్నది. యస్. సి. హిల్లు యిట్లు వ్రాయుచున్నాడు :—

"తనకు సహాయము చేయవలసినదని నబాబు దర్బారులోవున్న ప్రధానపురుషులకు చాలమందికి, క్లైవు వుత్తరముల వ్రాసెను. కాని, యింతవరకు (హుగ్లీని కొల్లగొట్టువరకు) యెవరుగాని జబాబిచ్చియుండలేదు." [పై గ్రంథము వాల్యూం **I**, పేజీ **CXLI Foot note]**

సురాజ్ సంధి యత్నము.

క్లైవు నబాబు ఉద్యోగులతో పన్నుచున్నకుట్ర వృథాకాలేదని యింగ్లీషువారి వ్రాతలవల్లనే తెలియుచున్నది. ఇట్టి స్థితిలో యింగ్లీషువారితో యుద్ధముచేయుటకు తనకు సాధ్యముకాదని సురాజ్ గ్రహించెను. ఇంగ్లీషువారు తన ఉద్యోగులలో కుట్రదారులన్ను లేవదీసిరని బజ్జిబజ్జి, కలకత్తాకోటల ముట్టడులలోనే, సురాజ్‌కు తెలిసిపోయెను. ఈ సంగతు

లన్నీ తనకు తెలిసియుండగ, ఆతడు తిరిగి యింగ్లీషువారితో యెట్లు కలహామునకు కాలుద్రవ్వగలడు? కాబట్టి, దేశకాల పాత్రాను గుణ్యముగ అతడు రాజనీతితో ఆలోచించ వలసివచ్చెను. ఇంగ్లీషువారిని శత్రువులుగ చేసికొనుటకంటె, వారితో స్నేహముగ ఉండడమే మంచిదని అతనికి తోచెను. తమతో స్నేహము సంపాదించు కొనుటకై నబాబు ఆత్రపడుచున్నాడన్న సంగతి యింగ్లీషువారు గ్రహించి, వారీ షరతుల గోరిరి.

(1) "వారికి కగిలిన యావత్తు నష్టములకు యింగ్లీషువారికి నబాబు పరిహార మివ్వవలెను.

(2) కంపెనీవా రిదివరకు అనుభవించుచుండిన యావత్తు హక్కులను వారికి తిరిగి యిచ్చివేయవలెను.

(3) తమ యిష్టానుసారము యింగ్లీషువారు తమ కోటలను తమ యితర స్థానములను బలపరచుకొనుటకు యింగ్లీషువారికి హక్కు ఉండవలెను.

(4) కంపెనీవారు కలకత్తాలో ఒకటంకసాలను పెట్టుకొనుటకు హక్కుండవలెను."

నాల్గవషరతు తప్ప తక్కిన మూడుషరతులకు ఒప్పుకొనుటకు నబాబు యిష్టపడెను. టంకసాల విషయములో నబాబుకు అధికారములేదు. అది ఢిల్లీ పాదుషా నుండి రావలసియున్నది. కాని, రోజురోజుకు యింగ్లీషువారు కొత్తషరతులను కోరుచుండిరి. తమ రాయబారులను తన దర్బారుకు పంపించవలసినదని నబాబు యింగ్లీషువారిని కోరెను. వారు అమయత్, హేస్టింగ్సు అనువారి నిరువురను పంపిరి. వీరు పైనాలుగుషరతులుగాక, యీ దిగువ నుదహరించిన మరికొన్ని షరతులనుకూడ చేర్చియడిగిరి.

(1) కలకత్తాలో యేవర్తకులనుగాని, యితర మనుష్యులనుగాని, తనకు అప్పగించమని నబాబు కోరరాదు; వారిని బాధించరాదు.

(2) బ్రిటిష్‌వారిచ్చిన దస్తక్ (చీటి) దేశములో పడవల మీదను, మెట్టదారిని రవాణా యగు సరుకులను సంరక్షించవలెను.

(3) పై షరతుల నన్నిటిని కాగితము మీదవ్రాసి, అందుపై నబాబు యొక్కయు, ఆతని మంత్రులయొక్కయు దస్కతు, మొహరులను వేయవలెను.

దొంగ రాయబారము, నబాబును చంపు యత్నము.

మూర్షిదాబాదునుండి సేనతో కదలిన నబాబు 1757 సం॥ ఫిబ్రవరి 4-వ తేదీన కలకత్తాచేరి, ఒమీచంద్ తోటలోనున్న బంగాళాలో విడిసెను. క్లైవును అతని పరివారమును సురాజ్ ఉద్దౌలాను చంపించగోరి కొన్నిరాయబారపు షరతులతో వాల్షు, స్క్రాఫ్టన్ అనువారలను నబాబు శిబిరములోనికి దింపించిరి.

వీరిని నిజముగ సంధికుదుర్చుటకై పంపలేదు. నబాబు శిబిరమును నలుముఖముల పరీక్షించి, రహస్యములను కనుగొనివచ్చుటకై వేగుపంపిరి. 'జీన్‌లా' యిట్లు వ్రాయుచున్నాడు :—

"శిబిరముపై పోయి పడినపుడు ఒకరోజుముందుగ యింగ్లీషువారు నబాబు శిబిరములోనికి రాయబారులను పంపిరి. నబాబును మోసములో పడ గొట్టుటకును, శిబిరమునంతను పరిశీలించి వచ్చుటకును, వీరు పంపబడిరి. నబాబుతో సంధికబుర్లు చెప్పవలసినదిగ వీరికి బోధించిపంపిరి. కాని, యీ సంధి షరతులు చాలవిపరీతముగనుండి, యిది కేవలము దొంగయెత్తని నబాబుకు తోపించి యుండును. *

ఇంగ్లీషువారు చెప్పిపంపిన ప్రకారము రాయబారులు నాటకమాడిరి. పిమ్మట తమ గుడారములలోనికివచ్చి, నిద్రపోవుచున్నట్లు నటించి, దీపము లార్పి వేసి, చీకటిలో బయటికి పారిపోయిరి. నబాబుపై వచ్చిపడుటకు యింగ్లీషుదండు బయట సిద్ధముగనుండెను. ఈ యిరువురు వేగులవాండ్రు తమ వద్దకువచ్చి, రహస్యముగ చెప్పగనే, క్లైవుమున్నగు వారితోనున్న యింగ్లీషుదండు తెల్లవారు జామున వచ్చి నబాబు శిబిరముపై బడెను. 'జీన్‌లా' యిట్లు వ్రాయుచున్నాడు :—

"జనవరి, 5-వ తేదీన తెల్లవారు జామును 4, 5 గంటలవేళ పొగ మంచు దట్టముగ పట్టియుండగ, క్లైవుతో యింగ్లీషుదండువచ్చి నబాబు శిబిరముపై పడెను. గతసాయంకాలము నబాబు యే గుడారములో వున్నట్లు గూఢ రాయబారులు చూచిరో, సరిగ ఆ గుడారము మీదనే యీదండు పోయిపడెను. (నబాబు సేనలోవున్న చాలమంది మహమ్మదీయోద్యోగులు నాకీసంగతి చెప్పిరి.) అదృష్టవశాత్తు, నబాబు అప్పుడా గుడారములో లేడు. ఈ రాయబారులమీద అనుమానపడిన ఒకదివాను ఆ రాత్రి దూరముగ వేరొక గుడారములోనికి పోయి పరుండమని నబాబుతో చెప్పెను. మొదటదెబ్బలో యింగ్లీషుదండు మహమ్మదీయులను గొర్రెలను తరిమినట్లు తరిమి, శిపాయిలను, శిబిరము వెంటవచ్చిన అంగడి వాండ్లను, సుమారు 1200, లేక 1500 మందిని చంపిరి. గూటములకు కట్టియున్న 600 గుఱ్ఱములను, కొన్నిబండెడ్లను చంపిరి. నబాబు గాభరాపడి, పరుగెత్తి, కలకత్తాకు ఎగువను 16 మైళ్లదూరములో నిలిచెను. అయినను, మొదటి గుండ్ల బారులు ప్రేలిన తరువాత, కొంతమంది నబాబు ఉద్యోగులు తమ మనుష్యులను కూడగట్టుకొని, ఎదురు తిరిగినిలిచిరి. వీరిలో నొకమంచి పర్షియన్ కాల్బలముండెను. వారు మిక్కిలి ధైర్యముతో నెదిర్చిరి. ఈ యెదుర్కోలు వల్లను, తెల్లవారి

* పై గ్రంథము, వాల్యూం III, పేజీ 182, 'రాజానబాకృష్ణ' యనునతడుకూడ గూఢచారియైయుండి, నబాబుయొక్క రాకపోకలను, రహస్యములను యెప్పటికప్పుడు యింగ్లీషువారికి చేరవేయుచున్నట్లు తోచుచున్నది.

వెలుగు వచ్చుచున్న కారణముచేతను క్లైవు వెనుకకు మరలుటకు తీర్మానించు కొనెను. ఈ పోరాటములో యింగ్లీషువారి పక్షమున చచ్చినవారు, గాయపడిన వారు, నల్లవాండ్లు, తెల్లవాండ్లుకలసి 20 మంది యుండిరి. తిరిగి వెనుకకు మరలు చున్నప్పుడు త్రోవలోబండ్లు విరిగిపోవుటచే రెండు చిన్నఫిరంగులు నష్టమయ్యెను."

ఇంగ్లీషువారి ప్రవర్తన మిక్కిలి గర్హ్యముగనున్నది. వారు నబాబుతో సంధి మాటలు మాట్లాడుచున్నందున, వారు తనపై యిట్టి ద్రోహముచేయుదురని అతడు కలలోకూడ తలంచి యుండడు. కాబట్టి, యింగ్లీషువారు నబాబు శిబిర ముపై పోయిపడుట యెంతమాత్రము న్యాయము కాదు. ఇంగ్లీషువారు నబాబు ఉద్యోగులనుండియే కుట్రదారులను లేవదీసినట్లు యిదివరకు చెప్పియుంటిమి. సురాజ్ఉద్దౌలాచేయి కిందును, యింగ్లీషువారిచేయి పైనను అగుటకు యింత కంటె వేరుకారణము లేదు. నబాబు యుద్ధరంగమునుండి పారిపోయెనని జీన్‌లా చెప్పుచున్నాడుగాని అది యెంతవరకు నిజమో చాల సందేహాస్పదము. ఏలననగ, జీన్‌లాతో సహోద్యోగిగనుండిన 'రినాల్టు' అను నతడు 1757 సం॥ సెప్టెంబరు 4-వ తేదీన చంద్రనగరమునుండి మార్క్విస్ డూప్లేకు వ్రాసిన యుత్తరములో నిట్లున్నది :—

"ఈ లోపుగ, అదివరకు కొన్నిదినములనుండి నబాబు సమక్షమున రాయ బారముల నడుపుచుండిన యింగ్లీషువారు, (ఒకనాటి) తెల్లవారు జామున నబాబు శిబిరమును ముట్టడించిరి. ఇంగ్లీషువారు తమవద్దనున్న సేననంతను శిబిరముపైకి పంపిరి; అది చాలక, ఓడలపై నున్న నావికాబలము నంతను పంపిరి. వీరందరు- పోయి అకస్మికముగ మహమ్మదీయుల మీదపడిరి. అయినప్పటికి, దీనివల్ల వారను కున్నంత లాభము వారికి కలుగలేదు. శత్రువు మీదికి కొంతవరకు పోయినను, సురాజ్ ఉద్దౌలా తనసేనను కొంతకూడగట్టుకొని ఎదురు నిలిచేటప్పడికల్లా యింగ్లీ షువారు అతని కెదురుగ నిలువలేక పోయినారు. చెల్లాచెదరగ వెనుకకు పారి పోయి కోటఫిరంగుల చాటున దాగినారుగాని, లేకున్నచో వీరిపని అయ్యేడిదే. ఈ పోరాటములో యింగ్లీషువారికి రెండువందల జనము నష్టమైనారు. (పై గ్రంథము వాల్యూం III పేజీ 246).

అయితే నబాబు దురదృష్ట మేమనగ, యితను శత్రువులతో పోరాడుటయే గాక, వారు తన శిబిరములో లేవదీసిన కుట్రదారులతోకూడ సంబాళించుకొవలసి వచ్చినది. సురాజ్ ఉద్దౌలానుగురించి, (దొంగ రాయబారిగవెళ్లిన) స్క్రాఫ్టన్ ప్రమాణముమీద, యస్. సి. హిల్లు యిట్లు చెప్పుచున్నాడు :—

"సురాజ్ ఉద్దౌలా దండుతీసికొని బయలుదేరితే కొందరు సైనికులును కొందరు ఉద్యోగులునుకూడ అతని వెంటవచ్చుటకు అయిష్టమును జూపిరి." (పై గ్రంథము వాల్యూం I, పేజీCXLVII)

1757-వ సం॥ ప్రారంభమునుండికూడ యింగ్లీషువారు మీర్జాఫరుతో చేరి నవాబుమీద కుట్రపన్నుచున్నట్లు యీక్రింది వాక్యములనుబట్టి తెలియగలదు. స్క్రాఫ్టన్, "Reflections" అను తన గ్రంథములో 66-వ పేజీలో యిట్లు వ్రాసెను.

అలీనగరపు సంధి

"తన ప్రధానోద్యోగులలో కొంతమందియొక్కయు, ముఖ్యముగ మీర్జాఫరుయొక్కయు ముఖములలో అసంతృప్తియున్నట్లు సురాజ్ ఉద్దౌలా కనిపెట్టెను. ఈ వ్యవహారములో యీతని (మీర్జాఫరు) ప్రవర్తన అగమ్యముగ నుండెను." కాబట్టి, యింగ్లీషువారి కోర్కెలకన్నిటికి నవాబు ఒప్పుకోవలసి వచ్చెను. ఇందును గూర్చి పైనచెప్పిన రెనాల్టు యిదివరకు పేర్కొన్న ఉత్తరములోనే యిట్లు వ్రాసెను:—

"నవాబు మంత్రులు—దాదాపు అందరు, యింగ్లీషువారితో షరీకైనవారే. నవాబు సంధికోరుచున్న తరుణమును కనిపెట్టి వీరందరు అతనిని సంధికిదింపి, తామపరిమితముగ లాభమును పొందిరి. తన మంత్రులు సేనాపతులు యిట్లు తనకెదురుతిరుగు ధోరణిలో నుండుటవల్ల నవాబు విధిలేక తన ఉద్దేశములకు వ్యతిరేకముగ యింగ్లీషువారి కోర్కెలకన్నిటికి ఒప్పుకొని, వారుపెట్టిన విపరీతపు షరతుల కన్నిటికికూడ తలయొగ్గవలసినవాడాయెను." (పై గ్రంథము వాల్యూము III, పేజీలు 246-247)

ఇట్టి పరిస్థితులలో 1757-వ సం॥ ఫిబ్రవరి 9-వ తేదీన నవాబు 'ఆలీనగరపు టొడంబడిక' యనబడు సంధిని యింగ్లీషువారితో చేసికొనవలసివచ్చెను. ఆ సంధి షరతు లివి:—

(1) ఢిల్లీలో పాదుషా యింగ్లీషువారి కిచ్చియున్న హక్కులనన్నిటిని స్థిరపరుపవలెను.

(2) ఇంగ్లీషువారి దస్తక్ (చీటి) చూపితే, యావత్తు సరుకులు ఎక్కడ సుంకములు లేకుండ, బెంగాల్, బీహార్, ఒరిస్సా రాష్ట్రములలో నిరాటంకముగ పోవుచుండవలెను.

(3) నవాబు యిదివరకు తీసికొన్న కంపెనీ తాలూకు గిడ్డంగులను, సరుకులను, వారి నౌకర్లయొక్కయు, రైతులయొక్కయు సామగ్రులను ఎవరివి వారికి తిరిగి యిచ్చివేయవలెను. నవాబు జనముచేత కొల్లగొట్టబడిన దానిక్రింద కొంత నష్టపరిహారము నవాబు యివ్వవలెను.

(4) తమ యిష్టమువచ్చినరీతిని యింగ్లీషువారు కలకత్తాను బలపరచుకొనవచ్చును.

(5) సిక్కానాణెముల ముద్రించుకొనుటకు యింగ్లీషువారికి అధికార ముండవలెను.

(6) ఈ సంధిషరతులను నబాబును, అతని ప్రధానోద్యోగులును, మంత్రులును ధ్రువపరుపవలెను.

(7) నబాబు యీ షరతులను పాలించునంతకాలము యింగ్లీషుజాతి తరఫునను, కంపెనీ తరఫునను, నవాబుతో మంచిగ నుంపుటకు అడ్మిరల్ వాట్సన్ క్లైవులు వాగ్దానములు చేయవలెను.

నబాబు పై జొప్పింపబడిన సంధిషరతు లిట్టివి! ఈ కఠినషరతులు చాలక, యింగ్లీషువారు మరలమరల క్రొత్తషరతులను కోరుచుండిరి. యస్. సి. హిల్లు యిట్లు వ్రాయుచున్నాడు :—

"ఈ సంధిపత్రముపై సంతకములయినవో లేవో, వెంటనే, అరరే, నబాబును తేలికగ పోనిచ్చినామురో యని యింగ్లీషువారు నాలుక కరచుకొనిరి! వెంటనే కౌన్సిలును సమావేశపరచి, యింతకంటె మంచి షరతుల నతనినుండి లాగికొనుటకు మనకు తగినంతబలములేదా! యను సంశయమును ఆలోచించవలసినదని వారు క్లైవును ప్రేరేపించిరి. అంతట కౌన్సిలు సమావేశమై పరిస్థితుల నన్నిటిని పర్యాలోచించి చూడగ, నబాబును యింక ఆట్టే నొక్కడం బాగుండదని సలహా చెప్పిరి. అప్పుడే చేవ్రాల్లుచేసిన సంధిని భగ్నపరచుట మంచిదికాదని కౌన్సిలువారు తీర్మానించిరి. అంతవరకు, బ్రిటిష్‌జాతిపేరుకు కళంకము రాకుండజేసిరి." (పై గ్రంథము వాల్యూం I, పేజీ CXLIX)

కథలోచెప్పినట్లు మేకపిల్లను మ్రింగుటకై యింగ్లీషు తోడేలు మురికినీటి మిషకొరకు అటునిటు చూచుచుండెను. ఈ కథను వారెట్లు నడిపినది తదుపరి చెప్పెదము. ఇట్లయ్యును, ఇంగ్లీషువారు సంధిని భగ్నమొనర్పకుండుటకై దృఢనిశ్చయులై యున్నట్లు ఆంగ్లచరిత్రకారులు సిగ్గులేక వ్రాయుచున్నారు.

ఆలీనగరపు సంధి పత్రముపై సిరా ఆరకపూర్వమే, నబాబును తామింత తేలికగ వేల విడిచిపుచ్చితిమని కంపెనీవారు నాలుక గరచుకొన్న సంగతిని పైన చెప్పియుంటిమి. కాబట్టి, దీని నెట్లయిన భగ్నమొనర్పవలెనని వా రాలోచించుచుండిరి. అయితే తప్పునుమాత్రము నబాబుమీద త్రోయుట యెట్లోయని వీ రాలోచించుచుండిరి. ఇట్టి కపటవర్తనలో క్లైవుముఠాను మించినవారు లేరుగదా! సంధి షరతులలో యేవో రంధ్రముల నన్వేషించి, వానిని తమ కనుకూలముగ మెలిపెట్టి త్రిప్పిరి. ఈ సంధినిగూర్చి యస్. సి. హిల్లు యిట్లు వ్రాయుచున్నాడు :—

సంధిభంగపు టాలోచన

"నబాబు ఒప్పందల నిస్సందిగ్ధముగ లేకుండెను. ఎట్లనగ :—ఇంగ్లీషువారికి గలిగిన నష్టములను తిరిగి యిచ్చువిషయములో,-తన లెక్కలలో నమోదై యున్న

ఆ స్తినే తిరిగి యిచ్చెదనని నబాబు వాగ్దానము చేసెనుగాని, శిపాయిలును, యితర ఉద్యోగులును కాజేసిన వస్తువులసంగతి నతడు చెప్పలేదు. కాని, దీని విషయమై తరువాత ఇంగ్లీషువారు పేచీపెట్టిరి.

"(కంపెనీవారు గాక) యితర ప్రయివేటువ్యక్తులకు గలిగిన నష్టమును గూర్చి సంధి షరతులలో యేమియు చెప్పబడి యుండలేదు. అయితే యిందుక్రింద మూడులక్షల రూపాయల నిప్పించెదనని నబాబు మూజువాణీగ వాగ్దానముచేసెను. మరియు, 'కర్నల్ క్లైవు', మేజర్ 'కీల్‌పాట్రిక్'లకు స్వయముగ గలిగిన నష్టములక్రింద వారికి ప్రత్యేకముగ కొంతసొమ్ము యిప్పించెదననికూడ నబాబు చెప్పె నట!" (పై గ్రంథము వాల్యూం I పేజీ CXLIX)

దీనినిబట్టి, ఇంగ్లీషువారీ సంధితో తృప్తిపడనట్లు తెలియుచున్నది. అయితే తమ ఇంగ్లీషు రాయబారి నొకరిని తన దర్బారులోనికి రానిచ్చుటకు నబాబుచేత ఒప్పించితిమిగదా యను సంతోషముతో ఇంగ్లీషువా రుండిరి. నబాబుకు గలిగిన నష్టములకెల్ల, అతని పాలబడిన దురదృష్టములకెల్ల, యీ రాయబారిని ఉంచుకొనుటకు ఒప్పుకొనుటయే మూలకారణ మయ్యెను. (ఇదియే యాదవవంశమునకు ముసలమయ్యెను. ఇది అతనికి కొరవితో తలగోకి కొన్నట్లయ్యెను.) తన జాతికి చెందిన రాయబారులను గూర్చి *జనరల్ గార్డన్ అను ఆంగ్లేయుడు తన పుస్తకము (జర్నల్)లో యిట్లు వ్రాసికొని యున్నాఁడు :—

"మన రాయబారులను చూస్తే - ఛీ - నాకెంతో రోత. ఎవఁడో ఒకడు తప్ప అంతా దుష్టులే, అంతా శుద్ధదగాకోరులే; (Humbugs - హంబగ్గులు) ఈ సంగతి వారికే తెలుసును. 'కోల్విన్' గుంపుకూడ యిందులో చేరినదే." (గార్డన్ జర్నల్ పేజీ 158.) ఆ జర్నలులోనే యింకొకచోట ఆత డిట్లువ్రాసెను.

"మనది నిజాయితీ జాతియే. కాని, మన రాయబారులు వట్టి గుంటచెవ్వల పిల్లులు. రాచకార్యాలలో వారికి నిజాయతీలేదు." (పేజీ 15.)

ఈ యూరోపియను రాయబారులు కుట్రలు పన్నుటలో అతీతులు. చెద పురుగులవలె వీరు చేరినరాజ్యములో యెవరికి తెలియకుండ నేలను తొలచి సొరంగము త్రవ్వి, తద్రాజ్యములను కూలద్రోయు చుండిరి. పాపము సురాజ్ ఉద్దౌలాకు యీ రహస్యము తెలిసియుండినచో, ఆత డానాడు ఇంగ్లీషు రాయబారిని తన దర్బారులో ఉంచుకొనుటకు యిష్టపడక పోయెడివాడే.

ఇంగ్లీషువారు, 'వాట్సు' అనువాని నేరి నబాబు దర్బారులో తమరాయబారిగ నుండుటకు పంపిరి. ఈ పనికి యితనినేల పంపిరనగ, యితనికి దేశభాష

---

* జనరల్ గార్డన్ నేపాళరాజ్యములో కార్టూమ్ నగరమున మహదీయను వానిచేతను, అతని యనుచరులచేతను, చంపబడెను.

వాట్సు రాయబారం

బాగుగ వచ్చునట; మరియు, దేశప్రజల ఆచారవ్యవహార ములు, రాచకీయ వ్యవహారములు, యితనికి బాగుగ తెలియు నట. * నబాబుమీద కుట్రపన్నవలసినదిగ ఇంగ్లీషువా రీత నికి బోధించి చెప్పిపంపిరి. ఆలీనగరపు సంధియైన తరువాత కంపెనీ కౌన్సిలువారు 1757-వ సం॥ ఫిబ్రవరి 12-వ తేదీన సమావేశమై తమ కోర్కెలను తిరిగి యుద్ధము వల్లగాక, తంత్రాంగముచే సాధించుకొనుటకు తీర్మానించిరి. తదనుసారముగ, వాట్సును నబాబు దర్బారులోనికి రాయబారిగ పంపుట మంచిదని సూచించిరి.

1757 సం॥ ఫిబ్రవరి 12-వ తేదీన కలకత్తా విలియంకోటనుండి క్లైవు పాట్రిక్కులు, సెలెక్టు కమిటీవారికి వ్రాసినజాబులో యిట్లున్నది.

"మా కింకను ఫలానిఫలాని షరతులు కావలసియున్నవని మనము నబాబుకు చెప్పవచ్చును. అయితే, అవి గట్టిగ యిచ్చితీరవలెనని యిప్పుడే నొక్కడము మంచిదికాదని మా యభిప్రాయము. దేశభాషను, వారి ఆచారవ్యవహారములు బాగుగ తెలిసినమనిషి నొకనిని నబాబుదర్బారులో ఉంచితే, ఆతడే మనకు కావలసిన షరతులన్నిటిని నబాబుచేత మంజూరు చేయించుకోడానికి పనికివస్తాడు. అంతేగాక, యింక అనేకమైన ప్రయివేటు వ్యవహారాలు, పబ్లిక్ వ్యవహారాలు సాధించుకోడానికికూడ మనవాడు పనికివస్తాడు. ఆవ్యవహారాలు చాలావున్నవిలెండి. వానినిక్కడ వ్రాతమూలముగ చెప్పడానికి వీలులేదు."

1757 సం॥ ఫిబ్రవరి 16-వ తేదీన సెలెక్టు కమిటీవారు 'వాట్సుకు' (నబాబు దర్బారులోచేరిన రాయబారికి) యిట్లని వ్రాసిరి :—

"మనము నబాబుతోచేసికొన్న ఒడంబడికలో చాల సంగతులు వదలివేయబడియున్నవి. ముందు తగాయిదాలు రాకుండుటకుగాను యింక అనేకసంగతులు-సంధిగ్ధముగ నున్నవానిని, విరళించి చెప్పవలసియున్నవి. కాబట్టి, నీవీక్రింది విషయములగూర్చి నబాబుతో మాట్లాడి శాయశక్తుల ప్రయత్నించవలసినది.

(1) ఫర్మానేడ్, హుస్‌బుల్ హుకుములును యితర యినాములును మొగలాయి పాదుషాలెక్కలలో నమోదు చేయించవలెనని చెప్పవలెను. ఆపట్టాలలోని సంగతులు నిష్కర్షగ అమలుజరుగునట్లు నబాబు బహిరంగముగ ఉత్తరువుల జారీచేయవలెను. పాదుషా హుకుముపల్ల మనకివ్వబడిన గ్రామములను మనకు యిచ్చివేయునట్లుగ నబాబు తన జమీందారులకు హుకుములను (ఫర్మానాలను) పంపించవలెను.

(2) టంకసాలను గురించిన షరతును అంతకంటె, ఎక్కువవిరళముగ విపులీకరించునట్లు కోరవలెను. ఇంగ్లీషువారివల్ల కలకత్తాలోనికి దిగుమతిచేయబడిన

* స్క్రాఫ్టన్ వ్రాసిన Reflections పేజీ 68.

యావత్తు బంగారము, తదితర లోహపుసుద్దలను నాణెములుగ అచ్చుకొట్టుకొను టకు కంపెనీవారిహక్కును విస్తరింపజేయవలెను.

(3) మనదస్తకులు (చీట్లు) చూపితే, సరుకులన్ని చౌకీలవద్ద యెట్టి సుంకములుగాని చెల్లింపకయే నిరాటంకముగ రవానాయై పోవునట్లు నబాబు ఒప్పుకొని యున్నాడు. కాబట్టి, యిందువిషయమై యెవరైనా ఆటంకములు కలిగించేటట్టయితే, అట్టివారిని మనమే శిక్షించుటకు బహుశః నబాబు ఒప్పుకుంటాడనుకుంటాను. ఇందుకొరకు చీటికి మాటికి మనము నబాబుదర్బారుకుపోయి ఫిర్యాదులుచేస్తే చాలవిసుగుగ వుంటుంది......

(4) తీసికొన్న వస్తువులను తిరిగియిచ్చేవిషయములో వ్రాయబడినమాటలు సంధిగ్ధముగనున్నవి. కాబట్టి, నీవు మూర్షిదాబాదు చేరగనే, నవాబులెక్కలలో (సర్కారీలో) నమోదైయున్న డబ్బు, సరుకులు, యితర ఆస్తులనుగూర్చినలెక్క సరిగ అడిగి పుచ్చుకోవలెను. అదిగాక, నబాబులెక్కలలోచేరని అనేక సరుకులు, సొమ్ములు చాలఉంటవనిన్నీ, అవన్నీ నిజముగ కంపెనీవారికిని, యితరులకును నష్టమైపోయినవనిన్నీ నబాబుకు తప్పక తెలిసియుండవలెను. కాబట్టి యిట్టివానికి కూడ నబాబు తగుపరిహారమిచ్చుట న్యాయము......

(5) ఇతరవ్యక్తులకుగల్గిన నష్టములకు తగుపరిహారము యివ్వనని నబాబు అనేటట్టయితే, ఇంగ్లీషువారు దేశీయులకు, తన ప్రజలకు, యివ్వవలసియున్న అప్పులనన్నిటిని నబాబే స్వయముగ యిచ్చుకొనవలసియుండునని నీ వతనితో గట్టిగ చెప్పుము. ఏలననగ, అతని దౌర్జన్యమువల్లను, అతని ప్రజలదౌర్జన్యము వల్ల నేగద మనవారు ఆ యప్పులను తీర్చుకోలేని అసహాయస్థితికి వచ్చినారు?

(6) మన యావరణాలలో నివసించు దేశీయులుచేసిన నేరములను విచారించి శిక్షించుటకు, మన చక్రవర్తి యధికారమువలన నెలకొల్పబడిన మన (ఇంగ్లీషు) కోర్టులకు అధికారముండవలెను.

(7) నబాబు దర్బారులోనికి మన యూరోపియను రాయబారులను పంపించుటకు నిశ్చయింపబడినది గావున, మనమట్టివారి నెవరినైన పంపించినప్పుడు నబాబు వారికి తగుమర్యాదలతో స్వాగతమొసంగునట్లు వాగ్దానము చేయవలెను. మనవారు దర్బారులోనికి వెళ్లినప్పుడు నబాబుకు బహుమతులు, నజరానాలు, గిజరానాలు యికముందు చెల్లింపమని చెప్పవలెను.

(8) కలకత్తా దిగువను, నదికొక మైలులోగా, యెట్టికోటనుగాని కట్టనని మనము నబాబుచేత వాగ్దానము చేయించుకొంటే యెంతో బాగుంటుంది. పోనీలే, యిప్పుడీమాట అడగవద్దు.

(9) పాట్నాలో తిరిగి గిడ్డంగిని స్థాపించుటకు కంపెనీవారి• కెప్పుడైనా బహుశః బుద్ధిపుట్టవచ్చును. అట్టి సమయములో నబాబుకు తిరిగి నజరానాలు గిజ

రానాలు చదివించకుండనే మనమక్కడ గిడ్డంగిని పెట్టుకొనేటట్లుగ నీవు నవాబుతో మాట్లాడి యేర్పాటుచేయవలెను.

(10) తన ఉద్యోగులవద్దనున్న కంపెనీ తాలూకు పుస్తకములు, కాగితములు, దస్తావేజులు, లెక్కలు—యావత్తు తిరిగి మనవి మనకిచ్చివేయునట్లు నవాబు తన యుద్యోగస్తులకు ఖచ్చితముగ ఉత్తరువుల పంపవలెనని చెప్పము."

వాట్సుకు సలహాదారుడుగ, ఏజెంటుగ, ఒమీచంద్ వెళ్లెను.

నవాబుతో చేసికొన్న సంధిని భగ్నమొనర్చుటకు ఇంగ్లీషువారు గట్టిగ సంకల్పించుకొన్నట్లు వారు తమ రాయబారియగు వాట్సుకు చెప్పిపంపిన పై మాటలవల్ల స్పష్టమగుచున్నది. ఇంగ్లీషువారు యిప్పుడు కోరిన షరతులు చాల విపరీతముగనున్నవి. ఇవి వెనుకటి యొడంబడికలో చేర్పబడియుండలేదు. కాబట్టి, యేమాత్రము ఆత్మగౌరవముగల రాజుగాని, వీని కంగీకరింపజాలడు. కాని యెట్లయినను అల్లరిచేయవలెనని ఇంగ్లీషువారు మోళీవేసుకు కూర్చున్నారు. నవాబుకు యెట్లయినను కోపమెత్తునట్లుచేసి, అతనిని కలహములోనికి దిగ్వవలెనని వారు గట్టిగ పూనుకొన్నారు.

యస్. సి. హిల్లు యిట్లు వ్రాయుచున్నారు:—

"వాట్సుకు పెట్టినపని చాలకష్టమైనది. వెనుకచేసికొన్న సంధిషరతుల నములు జరిపించుటయేగాక, అందలి షరతులు ధారాళముగ తమ కనుకూలముగు రీతిని నవాబుచే వానికి అర్థము చెప్పించుకొనవలసి యుండెను. ఇది చాలక యిది వరకు సంధిషరతులలో చేరియుండని అనేక క్రొత్త షరతులనుకూడ నవాబుచేత ఒప్పించునట్లు చేయవలసి యుండెను. ఈ క్రొత్త యంశములగూర్చి సంధికాలమందు ప్రసంగమేమైన వచ్చినదో, లేదో తెలియదు. ఒకవేళ వచ్చియున్నను, అవి సంధి షరతులలో చేర్చబడి యుండలేదు." (పై గ్రంథము వాల్యూము I, పేజీ CIX.)

తాము కోరిన షరతులకు నవాబును ఒప్పింపజేయుట దుస్తరమని వాట్సుకు తెలియును. కాబట్టి, యీ చిక్కంతా యెందుకని ఆతడొక నీచకార్యమునకు గడంగెను. నవాబుపై కుట్రపన్నుటకు, యింక ననేకవిధములైన దుండగములు, అల్లరులు చేయుటకు ఆతడు సంకల్పించుకొనెను. ఇట్టి నీచకార్యములవల్ల తనపై పెట్టిన పనిని సాధించుట కతడు పూనుకొనెను. "Memoirs of the Revloution" అను తన గ్రంథములో యీ వాట్సే యిట్లు వ్రాయుచున్నాడు:—

"లంచగొండులకు లంచములమేపుట, ధనపిశాచోపాసకులగు పాపాత్ములతో స్నేహముచేయుట, ఎదురు వచ్చినవారితో మెత్తనిమాటలాడుట—యీ పనులు తప్ప, నే నక్కడ (నవాబు దర్బారులో) చేసిన దేమియు లేదు."

యస్. సి. హిల్లు పై వాక్యముల తనగ్రంథములో నుదహరించుచు, యిట్లని వ్రాయుచున్నాడు :—

"ప్రాచ్యులధోరణిని వాట్సు నాటకమాడుటకు యెంతమాత్రము జంక లేదు. (పై గ్రంథము. వాల్యూము I, పేజీ CLX)

తన తోడివారివలెనే వాట్సుకును సిగ్గుశరములు, నిజాయితీబుద్ధి లేకుండెను. ఇతడు నాటకమును (హిల్లు పైన చెప్పినట్లు) ప్రాచ్యులధోరణిని గాక, కేవలము అప్రాచ్యుల ధోరణినే ఆడెను. తాను మోసపుచ్చిన ప్రాచ్యులకు పాపమీ అప్రాచ్యుల తంత్రములు తెలియవాయెను. వారు వట్టి అమాయకులైపోయిరి.

ఈ వాట్సు ఎవరు ? వెనుక నబాబుచే కాశింబజారు ముట్టడికాలమందు పట్టుకోబడి, ఖైదు చేయబడినవాడు. ఇతని కా కసి లోపలనున్నది. కసి, లోపల నిద్రపోవుచుండును గాని, చచ్చిపోదని ఒక ఇంగ్లీషుసామెత కలదు. సురాజ్ ఉద్దౌలా తనను అవమానించెను గదా యను కసిని యీతడు మనస్సులో పెట్టుకొని, నవాబును యెట్లయినను నాశనము చేయవలెనని యీతడు చూచుచుండెను.

## ఫ్రెంచివారితో అకారణ కలహప్రేరణ

నవాబు అనుజ్ఞలేకుండ ఫ్రెంచివారిమీద పోయి పడవలెనని కలకత్తాలో నున్న ఇంగ్లీషు కంపెనీ సెలెక్టు కమిటీవారికి బోధించినది యితడే. ఇందు విషయమై కంపెనీ (సెలెక్టుకమిటీ) వారికి యితడిట్లు 1757-వ సం॥ ఫిబ్రవరి 25-వ తేదీన వ్రాసెను:—

"మన మిప్పుడుపోయి చంద్రనగరమును ముట్టడించి, స్వాధీనపరచుకొన్నచో ఒడంబడికలోని షరతులన్నియు సంపూర్తిగ నెరవేరుటయేగాక, మనకు మరికొన్ని క్రొత్త సౌకర్యములుకూడ లభ్యమగును. మనము ఓడిపోతిమా మన కేమియురావు. ఫ్రెంచివారితో మనము సమాధానపడి ఊరుకుంటే, సంధిషరతులను అమలు జరుపకుండ నబాబు తలాయిస్తాడు. ఏవో తంత్రములు, మిషలు, పన్ని యీ షరతులు అమలు జరుగకుండ చేస్తాడు. నబాబు కొద్ది రోజులలో పాట్నాపైకి పోనున్నాడు. అతడు వెళ్లిపోతే యిక మనము అతని దివాన్ మణిలాలుతో చిక్కులు పడవలసి వస్తుంది. ఆతడు బహుక్రూరుడు; దురాశాపరుడు. ఇతనితో వ్యవహారము పెట్టుకుంటే మన కన్నీ చిక్కులు పేచీలుతప్ప యింకేవియు లాభించవు......"మనము ఫ్రెంచివారిమీద పోయి పడడానికి పబ్లిక్ ఆర్డరు మనకు యెన్నడురాదు." (పై గ్రంథము. వాల్యూమ్ II పేజీ 256)

ఫ్రెంచివారిని ముట్టడించి, నాశనము చేసేటట్టుగ నబాబుచేత ఒప్పించవలెనని ఇంగ్లీషువారెన్ని తంటాలో పడిరి. కాని, నబాబు ససేమిరా యనెను. యస్. సి. హిల్లు యిట్లు వ్రాయుచున్నాడు :—

ఇంగ్లీషువారు నబాబుచేత ఒప్పించలేని విషయమొకటి యున్నది. ఫ్రెంచివారికి విరోధముగ నబాబుతో సంధిచేసికొని, తాము వెంటనే ఫ్రెంచివారిమీద పోయి పడుదమని క్లైవు నబాబుదగ్గరనుండివచ్చిన రాయబారితో చెప్పిపంపెను. ఇందుకు నబాబు యెంతమాత్రము ఒప్పుకోలేదు." (పై గ్రంథము వాల్యూమ్ I, పేజీ CXLIX)

ఇంగ్లీషువారివలెనే ఫ్రెంచివారును నబాబురాజ్యములో వర్తకము చేసికొనుచున్నారు. ఇంగ్లీషువారు చేయుచున్నట్లుగ ఫ్రెంచివారేమియు అల్లరిచేయుట లేదు. కాబట్టి, యిట్టివారిపై పోయి పడుదమని ఇంగ్లీషువారు చెప్పినమాట నబాబుకు కర్ణకఠోరమయ్యెను. ఇందు కతడెంతమాత్రము సమ్మతించలేదు.

1757–వ సం॥ ఫిబ్రవరి 9–వ తేదీన నబాబు అడ్మిరల్ వాట్సనుకు వ్రాసిన ప్రయివేటు ఉత్తరములో

"నా శరీరములో ప్రాణమున్నంతవరకు, మీ శత్రువులను నా శత్రువులుగ భావించుకొని, మీ కవసరమైనప్పుడెల్ల నాశక్తి వంచనలేక సహాయము చేసెద" నని నబాబుచెప్పినమాట వాస్తవమే. ఫిబ్రవరి 11–వ తేదీన క్లైవుకుకూడ నబాబు యిట్లే వ్రాసెను. యస్. సి. హిల్లు యిట్లు వ్రాయుచున్నాడు :—

"సంధి షరతులెంత బైండింగో, యీ ప్రయివేటు ఉత్తరములోని మాటలుకూడ అంతే బైండింగ్ అని యింగ్లీషువారనిరి. కాబట్టి, నబాబు వీనిని చెల్లించక పోతే సంధికి భంగము కలిగినట్లేయని యింగ్లీషువారనిరి" (పై గ్రంథము వాల్యూము I, పేజీ CXLIX.)

బుద్ధిహీనుడో, దొంగయో తప్ప యింకొకడు పై వాదనచేయడు. నబాబు యెట్టి సంధినిగాని, ప్రయివేటుగ చేసిన వాగ్దానమునుగాని, యెన్నడు మీరి యుండలేదు. ఫ్రెంచివారిని ముట్టడించు విషయమై ఒడంబడికలో చేర్చవలసినదని యింగ్లీషువారు కోరినప్పుడు, దానికి తానెంతమాత్రము ఒప్పుకొనననని నబాబు అనాడే ఖండితముగ చెప్పియుండెను. అదిగాక, బంగాళములోనున్న ఫ్రెంచివారు యింగ్లీషువారి కెన్నడు శత్రువులుగారని నబాబు తలంచెను. ఏలననగ, వారిక్కడ యింగ్లీషువారి కెట్టి నష్టమునుగాని, యిబ్బందినిగాని గలిగించి యుండలేదు. తన ప్రజలలో యెవరి కెవరు మిత్రులో, ఎవరి కెవరు శత్రువులో నిర్ణయించుకొను అధికారము ప్రభువగు నబాబున కేగలదుగాని, యింకెవరికిని యుండదు.

ఆలీనగరపు సంధిని ధ్రువపరచిన పిమ్మట సూరాజ్‌ఉద్దౌలా కలకత్తాను వదలి తనరాజధానియగు మూర్షిదాబాదుకు పోయెను. ఏ కిరస్తానీ జాతితోగాని తనకిక తగాదాలుండవనియు, తనరాజ్యమిక శాంతముగ నుండుననియు ఆశతో

నబాబుండెను. కాని, ఫ్రెంచివారిమీద పోయిపడుదుమని యింగ్లీషువారెప్పుడైతే సూచించిరో, అప్పుడే అతనికి వీరిమోసము తెలిసివచ్చెను. ఇంగ్లీషువారిట్టి దురాలోచనలోనున్నారన్న సంగతి నబాబుకు (అతడింక సరిగ తనరాజధానిని చేరకమునుపే)—త్రోవలోనే— తెలిసెను. కాబట్టి, తత్క్షణమే యిందు విషయమై తనకుగల యభిప్రాయమును ఇంగ్లీషువారికి వ్రాసి పంపించెను. 1757 సం॥ ఫిబ్రవరి 19-వ తేదీన ఆతడు అడ్మిరల్ వాట్సన్‌కు ఇట్లువ్రాసిపంపెను.

## ఉత్తర ప్రత్యుత్తరములు.

“నారాజ్యములో తగాదాలులేకుండ జేసికొనుటకును, పూర్వమువలె వర్తకము చక్కగాసాగుటకును నేను ఇంగ్లీషువారితో సంధి చేసుకొనుటకు ఒడంబడితిని. ఈ సంధికి మీరును ఒప్పుకొంటిరి. మన యిరువురమధ్య తగాదాలు మాసిపోయి శాంతిసుస్థిరముగా యేర్పడినది. నాదేశశాంతిని భంగపరుపకుందుమని మీరుకూడ ఒక కరారునామా స్వహస్తాక్షరములతో వ్రాసి దస్కతు, మొహరులనువేసి నాకు పంపితిరి. కాని, మీరిప్పుడు హుగ్లీలోనున్న ఫ్రెంచి గిడ్డంగిని ముట్టడించి వారితో పోరాటము సలుపదలంచుచున్నట్లు నాకు తెలియవచ్చినది. మీకూ, మీకూ గల తగాదాలను నాదేశములోనికి తీసికొనివచ్చుట ధర్మమునకు, సాంప్రదాయమునకు కేవలము విరుద్ధము. యూరోపియను లెన్నడుగాని తమలోతాము మొగల్‌రాజ్యములో పోరాడుకొన్నట్లు తైమూరునాటినుండి యెవరు వినలేదు. ఫ్రెంచి గిడ్డంగులను ముట్టడించుటకు మీరు కృతనిశ్చయులైయున్నచో, నేను నాప్రజయెడ చేయవలసిన ధర్మము ప్రకారము వారికి నాసేనలతో సహాయము చేయకతప్పదు. నిన్నగాక మొన్ననే మనము చేసికొన్న ఒడంబడికను మీరు భగ్నపరుప సంకల్పించినట్లు దీనివల్ల తెలియుచున్నది. మహారాష్ట్రులిదివరకు యీరాజ్యముపై దండెత్తివచ్చి, అనేక వత్సరము లిక్కడ దేశమును చీకాకు పరచియుండిరి. కాని, తగాదా పరిష్కారమై, సంధిచేసికొన్న పిమ్మటమాత్రము మహారాష్ట్రులా సంధిని యెన్నడుగాని భగ్నపరచి యెరుగరు. సదరు సంధి షరతులకు విరుద్ధముగ వారెన్నడుగాని ప్రవర్తించి యెరుగరు. ప్రమాణపూర్తిగ చేసికొన్న ఒడంబడికలను పాటించక భంగపరచుటతప్పు; కేవలము దుష్టప్రవర్తన. మీరు ఒప్పుకొన్న షరతులను ఖచ్చితముగ పాలించుటకు మీరు సర్వవిధముల బద్ధులైయున్నారు. నాయేలుబడిలోనున్న దేశములో ఇకముందు మీరెట్టి యల్లరులనుగాని చేయకుండుటకు, మీరుబద్ధులై యున్నారు. నామట్టుకు నేను వాగ్దానముచేసి ఒప్పుకొన్న ప్రకారము నడుచుకొనుటకు సదా సంసిద్ధుడను.

“ఇంగ్లీషువారితో నేను సమాధానపడి చేసుకొన్న సంధిని నేను పాటించి, చెక్కుచెదరకుండ నిలుపుదును. ఇట్టిసంధి అల్లాకటాక్షమువల్ల, శాశ్వతముగ నిలు

చునుగాక. మేము మహారాష్ట్రులతో యేఁడేండ్లు పోరాడితిమన్నసంగతి మీ రెరిఁగి యే యుందురు. కాని, ఒకసారి వారితో సంధిచేసికొన్న పిమ్మట, వారు సదరు సంధి నెన్నడును భగ్నమొనర్పలేదు. సదరు షరతులకు రవంతయైనను భిన్నముగ వారు ప్రవర్తించలేదు. మీరుకూడ అదేప్రకారము యిటీవల నాతో చేసికొన్న సంధిని పాటించుట మీకు పరమధర్మము, విధియునై యున్నది. మీకు, యితర యూరోపి యను జాతులకు గల వైషమ్యముల నిక్కడికి తీసికొనివచ్చి, నారాజ్యములో అల్లరి, అశాంతి గలుగ జేయుట మీకు పాడిగాదు. నా రాజ్యములో యెట్టి పోరాటముల గాని మీరు కల్పింపకుందురుగాక '' (Ives voyages, Pages 119-120)

ఫ్రెంచివారిపై ఇంగ్లీషువారు దండెత్తువిషయమున నవాబుకుగల అభిప్రాయ ముల నీ పై లేఖ ఖండితముగ, నిస్సందిగ్ధముగ, పగులగొట్టి చెప్పుచున్నది. అట్లు చేయుటవల్ల ఇంగ్లీషువారు తనతో నిన్నగాక మొన్న చేసుకొన్న ఒడంబడికను భంగమొనర్చిన వారగుచున్నారనికూడ అతడు వారికి ఖండితముగ తెలియపర చెను. ఒడంబడికను నిర్భీతిగ భంగపరుపవద్దనికూడ చెప్పెను. ఒడంబడిక షరతులకు కట్టుబడి యుండుడనికూడ వారిని హెచ్చరించెను. క్రైస్తవులమని పేరుపెట్టుకొన్న యీ ఇంగ్లీషుజాతివారు విధర్ములని (Heathens అని) తమచే నీచముగ జూడబడు మహారాష్ట్రులయందున్న సుగుణములను చూపలేకపోవుట యెంత ఆశ్చర్యమని నవాబు కటకటపడెను. మరునాడు నవాబు తిరిగి యింకొకజాబు వ్రాసెను:—

" నేను నిన్నవ్రాసిన ఉత్తరము బహుశః మీకు చేరినదే యని తలంచు చున్నాను. నేనా ఉత్తరమును మీకు పంపినపిమ్మట, మీ తాలూకు అయిదారు యుద్ధనావలు నదిలోనికివచ్చి లంగరువేసినట్లును, అట్టివే యింక మరికొన్ని యోడలు రానైయున్నట్లును, ఫ్రెంచివకీలువల్ల నాకు తెలిసినది. అదిగాక, మీరు వాన కాలము వెళ్లగానే, తిరిగి నామీద, నా ప్రజలమీద, దండెత్తి పోరాటములు సాగింప జూచుచున్నట్లును తెలిసినది. నిజమగు యోధుని కిది లక్షణముగాదు; మర్యాద గల మనిషికిది లక్షణముగాదు. నిజమగు యోధుడు—మర్యాదగల మనిషి-ఆడిన మాట నెన్నడును తప్పడు. నాతో చేసికొన్న సంధికి మీరు నిజముగ బద్ధులై యుండగోరినారా, వెంటనే మీ ఓడలను నదిలోనుండి పంపివేయండి; సంధి షర తుల ప్రకారము వీసమైనను తొలగకుండ నడుచుకోనండి. నా మట్టుకు నేను సంధి షరతులకు భిన్నముగ వర్తింపను. నిన్నగాక మొన్న అంతప్రమాణపూర్తిగా చేసు కొన్న సంధికి భిన్నముగ తిరిగి పోరాటము సాగించుట మర్యాదయా? పెద్దమనిషి లక్షణమా? నిజాయితీ బుద్ధిగలవాని లక్షణమా? మహారాష్ట్రులకు 'బైబిలు' గ్రంథము ప్రమాణముకాదు; అయినప్పటికి, వారు సంధిషరతుల నెంతో నిక్క చ్చిగ పాటించుచున్నారు! మీరన్ననో బైబిలు గ్రంథమువలన విజ్ఞానులై యున్నారు. అయినంటె మీరు భగవంతునినమ్ముట, ఏసుక్రీస్తు పేరుచెప్పి, ప్రమాణ

పూర్తిగ చేసుకొన్న ఒడంబడికకు కట్టుబడియుండక పోవడమనేది ఎంత ఆశ్చర్యకర మైన విషయము? ఇది నమ్మ శక్యమా?''

అయితే శుద్ధ అబద్ధీకుడగు యీ కిరస్తానీ సేనానికి యీ మాటలు వినే టప్పటికి కోపము రాగవేసుకొని వచ్చినది? ఎందుకు? తన గుట్టంతా బయట పడిందేయని; తా మతనిపై పన్నుచున్న కుట్రయంతయు నబాబుకు తెలిసిపోయెనే యని! అక్రమముగ నీలాపనిందపాలైన శుద్ధ అమాయికునివలె అంగలార్చుచు యీ కిరస్తానీ బొంకులాడు - యీ పెనుఠాగ - నబాబు కిట్లని 1757-వ సం॥ ఫిబ్ర వరి 25-వ తేదీన జబాబు వ్రాసెను :—

"ఇరవై తేదీన మీరు వ్రాసిన ఉత్తరము నాకు రెండురోజుల క్రిందటనే చేరినది. కాని, యిటీవల యింగ్లండుకు పంపించవలసిన కాగితాల హడావుడిలో మునిగియుండుటచే, నే నింతవరకు జబాబువ్రాసి పంపలేక పోయినాను. సంధిని భగ్నపరుప మేము సంకల్పించుకొన్నట్లుగ మీరు మా యెడ నిందమోపడము చూచి మాకు అత్యాశ్చర్యమైనది. మాకు గలిగిన ఆశ్చర్య మింతింతయని మీకు చెప్పజాలకున్నాను. నీచపువెధవ రెవడో చెప్ప సాహసించిన మాటలను పట్టుకొని, యింతటి విపరీతమైన, యింతటి సిగ్గుమాలిన నింద నిర్భయముగ మాపై మోపుట చాల విడ్డూరముగ నున్నది. నే నొనర్చిన పనులలో కించిత్తయినను ఆధారము చూపక ఊరక నిందమోపుట యెట్లు! ఈ నిందను నమ్మడానికి శక్యమయ్యే లీల మాత్రపు ఆధారము యెచ్చటనుగూడ కానరాదు. "ఆడినమాటను తప్పుట నిజ మైన యోధుని లక్షణముకాదని, నిజాయితీ బుద్ధిగలమనిషి లక్షణముకాదని'' మీరు వ్రాసినారు. నేను ఆడినమాటను తప్పేవాడనని మీకు తోచుటకు ఆధారమేమి? నే నిక్కడికి వచ్చినప్పటినుంచి చేసినపనులలో - ఏదీ వ్రేలుమడచి చూపించండి - అంతకూడని పని నేనేమి చేసినానో? మీరు నాపై అట్లు అనుమాన పడేటంత కానికార్యము నేనేమి చేసినానో, ఒక్కటి చెప్పండి - చూద్దాము! అట్టికార్య మొక్కటికూడ నేను చేసియెరుగనని మీరే చెప్పగలరు. ఇందుకు మీరేసాక్షులు. నేను మీతో నడిపిన వ్యవహారము లన్నిటిలోకూడ దాపరికమేమియు లేక, మన సిచ్చి, నిజాయితీ బుద్ధితోడనే నేను నడపినాను. ఇది మాజాతికి సహజము. దాపరికము ఏమియులేక, మనసిచ్చి, అకృత్రిమ బుద్ధితో ప్రవర్తించుటకు, నిజాయితీబుద్ధికి మా వారు లోకమందంతటను ప్రసిద్ధివడసియున్నారు. మాపై అబద్ధపు నిందమోపి, మిమ్మును మోసపుచ్చుటకు ప్రయత్నించిన ఆ నీచపు వెధవను మీరు తగురీతిగ శిక్షించవలెనని కోరుచున్నాను. ఈలోగా, వారి వకీలు ప్రవర్తనను గూర్చి నేను పరాసువారికి ఫిర్యాదు చేసియున్నాను. ఈ నింద అబద్ధమైనదని తమకు తెలిసి నట్లుగ పరాసువారు మీకు వ్రాయుదుమనికూడ వారు నాకు జబాబిచ్చిరి. ఈ ఒడం బడికను నే నెల్లప్పుడు ప్రమాణపూర్తిగ పాటింతునని మీరు గట్టిగ నమ్మవలసినది.

ఇందుకు భిన్నముగ మీకు వచ్చే రిపోర్టులన్నియు శుద్ధ అబద్ధములనియు, మన స్నేహమునుచూచి కళ్లలో నిప్పులు పోసుకునేవాళ్లు యెట్లయినను మన స్నేహాన్ని చెడగొడదామనే దురుద్దేశ్యముతో, మన ఉభయులకు పరస్పరము అసూయ కలిగించేటందుకు చెప్పేమాటలనియు, మీరు గట్టిగ నమ్మండి.'' (చెప్పకుమాటలు మీరు వినవద్దు).

ఈ ఉత్తరము ఆపాదమస్తకమంతా అబద్ధమే; అంతా విషమే ; అంతా కుచ్చితమే ; అంతా మోసమే; అంతా పెనుమోగతనమే. మహా కౌటిల్యసంచారులగు "మ్యాకవిల్లీ," "తల్లేన్యాండు"ల బడిలో పాశ్చాత్య మంత్రాంగమందు తరిఫీదైన బ్రిటిషుబొంకులాని మాటలిట్లుగాక యింకెట్లుండును? సురాజ్ ఉద్దౌలా సూటిగ వేసిన ప్రశ్నకు జవాబుచెప్పక యీతడు (వాట్సన్) తప్పించుకొనెను. జవాబుచెప్పుట కేమియున్నది? క్రొత్తగ అయిదారు యుద్ధపుఓడలు నదిలోనికి వచ్చినమాట నిజమగునా? కాదా? ఈ ప్రశ్నకు జవాబేది? లేదు. అందుచేత నవాబు మనస్సులోని అనుమానము రహితము కాలేదు. సంధిషరతుల ప్రకారము అవసరమైనప్పుడు యింగ్లీషువారు నవాబుకు తమ సేనను డబ్బును సహాయము పంపవలసి యున్నది. ఢిల్లీ పాదుషా తనపైకి దండును పంపించినట్లు నవాబుకు తెలిసెను. ఈ దండు నెదుర్కొనుటకై నవాబు పాట్నాకు కదలిపోవ సంకల్పించెను. ఈ సందర్భమందు తనకు తమ సేనలను సహాయము పంపవలసినదని నవాబు ఇంగ్లీషువారిని కోరెను. సేనలు వారివద్ద లేకుండ తానిట్లు తీసికొని పోవుటచే ఇంగ్లీషువారు తన రాజ్యములో అల్లరిచేయుటకు వీలుండదనికూడ నవాబు తలచెను. ఇందును గూర్చి నవాబు వాట్సనుకు యిట్లు వ్రాసెను :—

"ఫ్రెంచివారి వ్యవహారమును గూర్చి మీరు వ్రాసిన ఉత్తరము నాకు చేరినది ; చూచినాను. నేను ఫ్రెంచివారికి సహాయముచేయలేను, చేయననికూడ మీరు నమ్మండి. వారేదైనా అల్లరి ప్రారంభించి, నారాజ్యములో పోరాటములు కల్పించేటట్లయితే, నేను నాబలమంతా ఉపయోగించి వారిని యెదిరిస్తాను. గట్టిగ శిక్షిస్తాను. మీరు చంద్రనగరముపైపోయి పడదలంచినట్లు నాకు తెలిసినది. అందుచే, నేనట్టు మీకు తగురీతిగ వ్రాయవలసివచ్చినది. నేను పంపియున్న సేనలు ప్రజలను కాపాడుటకే కాని, ఫ్రెంచివారికి సహాయము చేయడానికిగాదు. మీరు చంద్రనగరపు ముట్టడిని మానుకోవడము నా వుత్తరమువల్లనే అయినట్టయితే, నాకెంతోసంతోషము. ఫ్రెంచివారికికూడ నేనట్లేతగురీతిని వ్రాసియున్నాను. మీరు ఉభయులు సఖ్యపడియుండునట్లు చెప్పి వ్రాసితిని. బహుశః వారుకూడ మీకు వ్రాయుదురనుకుంటాను. మీరు ఉభయులు చేసుకునే ఒడంబడిక నకలును నావద్దకు తీసికొనివచ్చుటకు నేనక్కడికి తగుమనిషిని పంపించెదను. ఆఒడంబడికను నాసర్కారు పుస్తకములలో నమోదు చేయించెదను. ఇంగ్లీషువారితో స్నేహంగా,

మంచితనంగా, ఉండామనే ఉద్దేశ్యము తప్ప నాకింక వేరు ఉద్దేశ్యములేదని మీరు గట్టిగనమ్మండి. అల్లా కృపవల్ల, నేనెప్పుడు అన్యాయకార్యము చేయ తలపెట్టను. ఈమాట నమ్మండి. దీనికి తిరుగులేదు. మీరుకూడ అట్లే మీమాటప్రకారం నిలువబడండి. నీచులుచెప్పే చెప్పుడుమాటలు విననద్దు. దేనినిగురించి అయినా మీరు వ్రాయదలచుకుంటే, నేరుగ నాకేవ్రాయండి—ఇంకెవ్వరిద్వారా వ్రాయవద్దు. నేనెల్లప్పుడు నిష్పక్షపాతమైన జవాబును, దాపరికమేమియులేక పంపెదను.''

''ఢిల్లీనుండి పాదుషా సేన బయలువచ్చుచున్నది. దానినెదుర్కొనుటకు నేను పాట్నాకు కదలిపోదలచుచున్నాను. మీ స్నేహము మీ సమయములో చూపదలచుకుంటే, మీ సేనను నాకు సహాయమివ్వండి. నావద్దనున్నంతకాలము మీ సేనకు నేను నెలకు లక్ష రూపాయలిస్తాను. తక్షణం జవాబు పంపించండి.''

ఆఖరు వాక్యములో నవాబు కోరిన కోరికయే ఆతనికొంప తీసినది. ఏలననగ, యీమిషచెప్పి యింగ్లీషువారు తమసేనను కలకత్తా కోటలోనుండి బయటికి తీసికొని వచ్చి, ముందుగ చంద్రనగరమును ముట్టడించి, వంచుటకును, తరువాత నవాబునే ముట్టడించుటకును వారికి చక్కని వీలుచిక్కెను!

మూర్షిదాబాదులో నవాబు దర్బారులో ఇంగ్లీషువారి తరపున రాయబారిగనున్న ''వాట్సు'' అనునతడు సురాజ్‌ఉద్దౌలాపై తనపూర్వపు కసిని తీర్చుకొనవలెనని పొంచియుండెను. ఫ్రెంచివారితో సంధిచేసుకోవద్దని యీతడు నాటినాటికి కలకత్తాలోనున్న తనవారికి పుల్లింగములు పెట్టుచుండెను. వారిని నవాబుపై ఉసుగొలుపుచుండెను. యస్. సి. హిల్లు యిట్లు వ్రాయుచున్నాడు :—

''నవాబును నమ్ముకోడానికి వీలులేదనియు, ఎంతమాత్రము ఆలస్యము చేయక చంద్రనగరముపై పోయిపడుట మంచిదనియు, ఫిబ్రవరి 25-వ తేదీన వాట్సు కలకత్తాకు ఉత్తరము వ్రాసెను..............'' (Bengal Records 1756-57. Volume I, Page CLXI.)

ఢిల్లీనుండి మొగలుసేన నవాబుపై రానున్న యీ తరుణములో, అతడు మిక్కిలి చికాకుపడియుండును గావున, అతనికిప్పుడే యేదో బెదురుపెట్టి, తమ కుచ్ఛితపు తలంపుల సాగించుకొనుట కిదియే యదనని అడ్మిరల్ వాట్సన్ తలంచెను. ఇందుకై అతడు నవాబున కిట్లు ఉత్తరము వ్రాసెను. ఈ ఉత్తరము ధోరణి మర్యాదగలేదని యీ దిగువవాక్యములవల్ల తెలియనే తెలియుచున్నది :—

''గతనెల 20-వ తేదీన నీవు వ్రాసిన ఉత్తరమునకు నేను యిదివరకే కొన్నిరోజులక్రిందట జవాబు వ్రాసియున్నాను. అది నీకు అందియే యుండును. దానినిబట్టి, నేను సంధిని భంగపుచ్ఛదలచితినని ఫ్రెంచివకీలు నీతో చెప్పినమాట

అబద్ధమని నీకు బోధపడిగా యుండును. నేనట్టి నిర్మలాంతఃకరణతో నీతో సంధి చేసికొన్నది,—దానిని నిలువబెట్టుటకై నేనెట్లు తంటాలుపడుచున్నది,—నీకింక యెక్కువగ ఋజువుకావలసివస్తే, అది నీకు నా ఓర్పులోనే కనిపించగలదు. నీవింత కాలము సంధిషరతులు అమలుజరుపక తలాయించినను, సహించి ఊరుకొన్నది నా ఓర్పే. నీవు ఫ్రెంచివారికి సేనను, డబ్బునుపంపి సహాయము చేయుచున్నప్పటికి ఊరుకొన్నది నా ఓర్పే. "మీ శత్రువులు నా శత్రువులే" యని నీవు నాతో ప్రమాణపూర్తిగ చేసిన వాగ్దానమున కిది యెంతయు విరుద్ధముకాదా?

"నిజమైన యోధుడు,—నిజమైన మర్యాదగల మనుష్యుడు—అడిన మాటను తప్పకుండుట యిట్లే కాదూ? సరే, యింతగాల, కండ పగులగొట్టి చెప్పుట కిదే సమయము వచ్చినది. నీ దేశములో శాంతిని కాపాడుకొని, నీ ప్రజలు నాశనముగాకుండ చూచుకోదలచుకుంటే, ఇదిగో విను, యీ రోజునుండి పది రోజులలోగా, నీవు నెరవేర్చవలసిన నీవంతు సంధిషరతులను అక్షరాలతప్పకుండ నెరవేర్చుము. నాకు వివాదకారణములేకుండ చేసుకో. లేకపోతే, ఇదిగో, జ్ఞాపకముంచుకో, రాబోయే ఫలితములకన్నిటికి నీవు బాధ్యుడవవుతావు. నేనిదివరకు నీతో జరిపియున్న వ్యవహారములనన్నిటిని బహిరంగముగ, దాపరిక మేమియు లేకనే చేయుచుంటిని. ఇప్పుడుకూడ అటులనే చేయుచున్నాను. విను, మాతాలూకు సైన్యములింకను మాకు పైనుండి రావలసియున్నవి. ఈసంగతి మా క్లైవు మీకిదివరకే చెప్పియుండెనట. ఆ సైన్యము లిక కొద్దిరోజులలోనే కలకత్తావచ్చి చేరగలవు. ఇవిగాక మరికొన్ని ఓడలను, సేనను అధికముగ తెప్పించుటకు కొద్దిరోజులలోనే నేను మా వారికి కబురు పంపించుచున్నాను. నీ దేశమంతా మంటపెట్టేస్తాను; ఆ మంటలార్పడానికి మీ గంగానదిలో నీళ్లన్నీ పోసినా చాలవు! సలాము; శలవు; వెళ్లిపోతున్నా; నేనెన్నడు ఎప్పుడు యెవరితో ఆడితప్పి యెరుగను. అట్టి నేను నీకు గట్టిగచెప్పే మాటలివి. చూసుకో." (Ive's voyages. Page 124)

ఈ కిరస్తాని దండునాయకుడు అసలురంగులతో బయటపడ్డాడు. కాబట్టి, యితడు చేవ్రాలుచేసిన సంధి,—యీ సంధికి తప్పనని, దేవుని యెదుట, యేసుక్రీస్తు యెదుట, ప్రమాణముచేసి చెప్పినమాటలు—యిదంతా వట్టిబూటకమన్న మాట! అనుకూలతరుణము వచ్చేవరకు కొంచెము కాలహరణము చేయడానికి చెప్పిన టక్కరుమాట లన్నమాట! ఫలాని తేదీలోగా సంధిషరతులు అమలుపూర్తికావలెనని ఒడంబడికలో యెక్కడనులేదు. ఇప్పుడీ కిరస్తానీ దండునాయకుడు వచ్చి, 'పదిరోజులలోగా షరతులన్నీ అమలుజరగాలి, లేకపోతే అల్లరిచేస్తాను' అని చెప్పడం ఏమి సబబు? ఎట్లయినను పోరాటము కల్పించుట కిదియొక మిష. సురాజ్ఉద్దౌలా జన్మతః పెద్దమనిషి. కాబట్టి, యితడు మర్యాదగ యిట్లని తిరిగి వ్రాసిపంపెను:—

"ఈమధ్య మీరు వ్రాసిపంపినజాబుకు జబాబును నేను పంపియేయున్నాను. ఢిల్లీపాదుషా వ్యవహారమునుగూర్చి నేను వ్రాసినదానికి సమాధానము మీరు వెంటనే పంపండి. మనము చేసికొన్న సంధిప్రకారము నడచుకొనుటకు నేను కృత నిశ్చయుడనై యున్నాను. హోలీపండుగ వచ్చుటచే, సదరు షరతులు అమలు జరు గుట ఆలస్యమైనది. ఈ పండుగరోజులలో మా షాహుకార్లు, మంత్రులు, దర్బారు లోనికి రారు. ఈ పండుగ వెళ్లగానే, సంధిషరతులను నిష్కర్షగ నమలు జరిపించె దను. ఈ ఆలస్యము అనివార్యమని మీకును తెలిసియుండవలెను. దీనిని మీరు పెద్దగ మనస్సులో ఉంచుకొనరని తలచెదను. చేసికొన్న సంధిని భంగపుచ్చుట నా కాచారముకాదు. కాబట్టి, నేను మీతో చేసికొన్నసంధిని తప్పించుకొనజూతునని మీరెన్నడు అనుకొనవద్దు. ఇప్పుడు నాపైకివచ్చుచున్న మొగల్‌సేన నెదుర్చువిష యమై నేను మీ స్నేహమును, శౌర్యపరాక్రమములను నమ్మికొన్నాను. క్రిందటి ఉత్తరములో నేనిందునుగూర్చి మిమ్ముల నడిగినసంగతికి మీరు ఒప్పుకొందురు గాక. ఇంతకంటె యేమి చెప్పేది?

"నా నిష్కాపట్యము మీకు తెలియును. నేను మీతో చేసికొన్నసంధిని యెన్నడును తప్పనని గట్టిగ వాగ్దానము చేయుచున్నాను."

"ఈ మాట మీరు గట్టిగ నమ్మండి. ఎవరైనా మీతో పోరాడి, మీకు శత్రువులైనచో, నేను మీకు సహాయము చేసెదనని అల్లాయెదుట ప్రమాణపూర్తిగ చెప్పుచున్నాను. నేనింతవరకు పరాసువారి కొకచిల్లి గవ్వయైనను యివ్వలేదు. హుగ్లీలోవున్న నా సేనలు అక్కడనున్న నా ఫౌజుదారు నందకుమార్‌కొరకు పంపబడినవి. మీతో పోరాడుటకు ఫ్రెంచివారికి గుండెలులేవు. పూర్వాచార మునకు విరుద్ధముగ, మీరు గంగానది ప్రాంతముల, నా రాజ్యములో, యెట్టి యల్లరులగాని గావింపకుందురని నమ్ముచున్నాను." (Ive's voyages Page 124-125.)

రాజుకు తగినరీతిగ సురాజ్ వ్రాసెను. సంధి షరతులు అమలు జరుపుట కాలస్యము అయిన కారణము మిక్కిలి సబబుగనున్నది. లా కోర్టు డిక్రీలు అమలు జరుగడానికే యెంతో ఆలస్యమవుతుంది. ఇది లోకములో అందరెరిగినదే. నాగ రికుల మనుకొను కిరస్తానీ జాతులమధ్య జరిగిన ఒడింబడికలు అమలు జరుగుటకు తరుచు యెంతో ఆలస్యమగుచుండును. ఒడంబడిక ధ్రువపడి వడసారము నెలరోజు లైనా కాకపూర్వమే, ఎవరుగాని శత్రువుపై కారములు, మిరియములు నూరి, యుద్ధము చేస్తామని బెదరించలేదు. అదిగాక, ఇంగ్లీషువారు నిష్కపటబుద్ధితో లేరని అనుమానించుటకు నబాబుకు అనేక దృష్టాంతములు కనిపించెను. వీనినిగూర్చి దాపరికము ఏమియులేక నబాబు ఇంగ్లీషువారికి అనేకసార్లు వ్రాసియుండెను కూడాను. ఇట్టి పరిస్థితులలో, స్వార్థపరులు తప్ప యింకెవరును నబాబును నిందింపరు.

మొగల్ సేన నెదుర్కొనుటకు కొంతదండును సహాయ మివ్వవలసినదని నబాబు ఇంగ్లీషువారిని కోరెను. కాని దానికి అడ్మిరల్ వాట్సన్ తలాయింపుగ జబాబు చెప్పెను. వాట్సన్ యిట్లు వ్రాసెను:—

"మీరు పాట్నా వెళ్లుచున్నారా? అందుకు మాసహాయం కావాలంటారా? అయితే, ప్రక్కను మాకు శత్రువులు (పరాసువారు) వుండగ, మేమెట్లా మీవెంట వచ్చేది? మీ వెంటవస్తే, వెనకాల మమ్ము రక్షించేవారు ఎవరు? మీరు చాల దూరములో ఉండిపోతారు? అప్పుడు మాకు రక్షణ లేకపోతుంది. ఇట్టిస్థితిలో ఏమి చేస్తే బాగుంటుందో మీరే కొంచెము ఆలోచించండి. నా కొక్కటే మార్గము కనబడుతోంది. ముందుగ మమ్ములను చంద్రనగరము పట్టుకోనివ్వండి. అట్లాగైతే మాకు వెనకభయం ఉండదు. అప్పుడు మీకు కావలసినంత సహాయము చేస్తాము. ఢిల్లీదాకా రమ్మన్నా వస్తాము." (పై గ్రంథము పేజీ 125)

ఈ మాట సురాజ్‌కు నచ్చలేదు. కాని, ఎట్లాగనా చంద్రనగరమును పట్టుకొని, పరాసువారితో కలహము పెట్టుకోవాలని అడ్మిరల్ వాట్సన్ కుతూహలించెను. ఇరుజాతులు సమాధానపడి శాంతితో నుండుటకుగాను పరాసువారొక రాయబారిని కలకత్తాకు పంపియుండిరి. కాని, సంధిచేసికొనుటకు వాట్సన్ తిరస్కరించెను.

"ఈ ఒడంబడిక తనకు యిష్టములేదని చెప్పి, వాట్సన్ సంధిపత్రముపై సంతకము పెట్టనని యెదురు తిరిగెను. ఇది మార్చి 4-వ తేదీన జరిగినది." (Bengal Records Vol I. Page CLXI)

ఇటు సురాజ్ ఉగ్గాలాతోను, అటు పరాసువారితోనుకూడ పోరాడి, నెత్తురు చిందించవలెనని వాట్సన్ చూచుచుండెను. 1757-వ సం॥ మార్చి 3-వ తేదీన కలకత్తా విలియం కోటలోనున్న సెలెక్టు కమిటీవారి కిట్లు వ్రాసెను:—

"ఈ సంధిపత్రమును పుదుచ్చేరీ పంపించి, దాని నక్కడ పరాసు అధికారులచేత ధ్రువపరిపించి తెప్పించి, యిట్టి సంధి కంపెనీకి లాభకారియని మీరు నన్ను ఒప్పించేవరకు యీ సంధి జరుగకూడదు. ఇదంతయు జరిగినతర్వాత, అప్పుడు, నేను నా సమ్మతి నొసంగుటకు అభ్యంతరముండదు" (పై గ్రంథము వాల్యూము II పేజీ 268)

నబాబుమీదికి దండెత్తిపోవుటకు ఆతడెంత కృతనిశ్చయుడై యుండెనో, యీ యుత్తరములోని యీ దిగువ వాక్యములవల్ల స్పష్టము కాగలదు:—

"నబాబుతో మనము సంధిచేసుకొని మూడువారము లైనది. దానిలో అత డనేక సంగతులను వాగ్దానము చేసియుండెను. అవి అత డింతవర కేమైన నెర వేర్చినాడా? అత డవియెప్పుడు నెరవేరుస్తాడని నన్నడగండి. ఏమో, ఎప్పుడు నెర

వేరుస్తాడో చెప్పడానికి వీలులేకుండ వున్నది. అది యిట్లుండగ, యిప్పు డింకొక కరారునామాను తీసుకొనివెళ్లి, దీని మీదకూడా సంతకము పెట్టించుకుంటే మొదటి ఒడంబడికకంటె, ఆతడు దీని నెక్కువగ గౌరవిస్తాడా ? ప్రమాణముచేసి చెప్పినమాటను గౌరవించని యీ నబాబును మన మెట్లా నమ్ముతాము ? ఇట్టి వారిని నమ్మడము మనకు రాజనీతియా?.........మొదటి సంధిలోని షరతుల నతడు పూర్తిగ అమలు జరిపేవరకు మనము యిందువిషయమై అతనికి వ్రాయనే కూడదని నా ఉద్దేశము. ముందుగ మనము తొందరపెట్టి చేయించుకోవలసిన పని అది. ఈ సంధి షరతులను పూర్తిగ అమలు జరుపుటకు మన మతనికి యెంత తక్కువ వ్యవధియిస్తే అంత మంచిది.'' (పై గ్రంథము వాల్యూము II. పేజీ 269-270)

వాట్సన్ ధోరణిజూచి క్లైవుకుకూడ గాభరావేసెను. 1757 సం॥ మార్చి 4-వ తేదీన జరిగిన వారి సెలెక్టుకమిటీమీటింగులో మెంబర్లకు క్లైవు యిందు విషయమై తనకుగల యభిప్రాయములనిట్లని చెప్పెను :—

"ఫ్రెంచివారు కోరిన తాటస్థ్యమునకు మనము అంగీకరింపని పక్షమున మనమిప్పుడు తక్షణమే చంద్రనగరముపై పోయిపడుట అనివార్యమగుచున్నది. కాని, ఈవిషయమై మనప్రవర్తననుగురించి లోకమేమనుకొనునోయను విషయ మునుకూడ మీరందరాలోచింపకతప్పదు. ఫ్రెంచిగవర్నరు తాటస్థ్యమును గోరుచు లేఖలంపినప్పుడు మన మంగీకరింపలేదా ? ఉభయులకు తృప్తికరమగు షర తులనుకూడ పత్రములపై వ్రాసియుంటిమిగద. అందులోని ప్రతిషరతునకు ఉభయ పార్టీలు అంగీకరించి, సంతకముచేసి, ప్రమాణములు చేయుటకు అంగీకరింపలేదా ? ఇట్టిసమయములో మనము మాటతప్పినయెడల, నబాబేమనుకొనును ? మేము ఫ్రెంచివారి విషయమై తటస్థముగనుందుమని నబాబుతోచెప్పి, అతడుకూడ అట్లే తటస్థముగనుండుటకు అతనిచేత వాగ్దానము చేయించుకొని, ఇప్పుడు మనము ఆమాటలనన్నిటిని తప్పినయెడల, ఆతడును లోకమునుకూడ మనము శుద్ధ నీచుల మనియు, మాటనిలకడలేనివారనియు, తలంపకమానరు. కాబట్టి, ఫ్రెంచివారితోటి తాటస్థ్యమును నిరాకరింపవలెనని వాట్సన్ మనస్సులో వున్నసంగతి మాకు తెలియదని మనకమిటీవారమిప్పుడు లోకమునకు ప్రకటించవలసిన అవసరము గలదు. అదిగాక, ఆతడు ఈ తాటస్థ్యసంధికే ఒప్పుకుంటాడనికూడ మనమనుకొన్నట్లు స్పష్టపరచవలసియున్నది. ఇట్టితలంపుతోనే ఈ కమిటీవారు యింతదూరము వ్యవహ రించారుగాని, లేకపోతే, లోకులచేత తిట్లుతినే ఈపనికి వారు ఒప్పుకుంటారా ?

కాని క్లైవుచెప్పిన యీమాటలు చెవిటివానిముందు శంఖూదినట్లయ్యెను. యస్. సి. హిల్లు యిట్లువ్రాయుచున్నాడు :—

"క్లైవు కేమియు తోచలేదు. ఫ్రెంచివారితో సంధిచేసికొనుటకు అడ్మిరల్ వాట్సన్ ఒప్పుకొనుటలేదు. ఎందుకట! సంధిపత్రముపై సంతకము చేయుటకు పరాసురాయబారిగవచ్చిన రినాల్టుకు అధికారములేదట! పోనీ, చంద్రనగరమును ముట్టడించుటకైనను యితడొప్పుకొనునా! ఊహూం అదియులేదు. ఎందుకట! దీనికి నవాబు అనుజ్ఞలేదట! పైపెచ్చు "నన్ను చెన్నపట్నము వెళ్లిపోనివ్వండి" అని వాట్సన్ మార్చి 5-వ తేదీన సెలెక్టువారినడిగెను. ఎందుకట! ఈ సంధి వల్ల శాంతి చేకూరకపోతే, పరాసువారితో అసలు సంధి చేసికొనుటయే సిగ్గుమాలిన పనియని యితనియభిప్రాయమట! సంధిపత్రముపై చేవ్రాలు చేయుటకు వాట్సన్ తిరస్కరించుటచే, యీసమాచారమును పరాసువారు తక్షణమే నవాబుకు తెలియ పరచి, దీనినిగూర్చి ఒక ప్రకటననుగావించి, వారు తమపెండ్లము, బిడ్డలను తక్షణమే చించూరాకు పంపివేసిరి. దండుతీసికొని వెంటనే పోవలసినదని నవాబు తన సేనానాయకులలో నొకడగు రాయ్ దులాబుకు ఆజ్ఞాపించెను.

"అడ్మిరల్ వాట్సన్ ఒకమూల యిట్లు భీష్మించుకొని కూర్చుండగ, చంద్ర నగరమును ముట్టడించడమా, ముట్టడించక పోవడమా యని కౌన్సిలువారు 6-వ తేదీన యింకను చర్చించుకొనుచునే యుండిరి. తిరిగి నవాబుకు వ్రాసి కనుక్కునే వరకు యీ విషయము ఆపుదలచేసియుంచుటకు వారెట్టకేలకు తీర్మానించుకొనిరి. ఢిల్లీ పాదుషాసైన్యము బెంగాల్ పైరాగిక దండెత్తి వచ్చుచున్నదనియు, అందు నిమి త్తము పట్టణములో శాంతిని కాపాడుటకై తాను హుగ్లీకి సైన్యము పంపితినిగాని, ఫ్రెంచివారికి సహాయముచేయుటకు గాదనియు, నవాబు క్లైవుకు వ్రాసియుండెనుగద. కాబట్టి, తిరిగి అతని అభిప్రాయము కనుక్కునేవరకు యీ యాలోచన నిలుపుద మని కౌన్సిలువారు తీర్మానించుకొనిరి."

అయితే, చంద్రనగరమును తాము ముట్టడించే విషయములో నవాబు అంగీకారమును సంపాదించుటెట్లు? ఇందుకు తానెంతమాత్రము ఒప్పుకొనసని నవాబు యిదివరకే ఖండితముగ చెప్పివేసెనుగద. తిరిగి అడిగితే, యిప్పుడు మాత్రము అతడు ఒప్పుకుంటాడా?

దొంగజాబు సృష్టింపు.

న్యాయమార్గమున సాధింపలేని దానిని, యింగ్లీషువారు అప్పుడు తంత్రముచే సాధింపబూనిరి. వారి మనస్సున కప్పుడు నవాబు దర్బారులోనున్న తమవాడు—వాట్సు—జ్ఞాపకము వచ్చెను. 1757 సం॥ ఫిబ్రవరి 25-వ తేదీన క్లైవు యితనికిట్లు వ్రాసెను :—

"ఫ్రెంచివారిని ముట్టడించవద్దని నవాబు కరాఖండిగ తన శీలువేసి వ్రాసి మనకు పంపియుండగ, ఆతడు నోటిమాటలు చెప్పినాడంటే యెట్లు నమ్మనగును? నా ఉత్తరమున కతడు తక్షణమే జవాబువ్రాసి, 'తాను అడ్డమురానని కాస్త

రవ్వంత సూచనచేస్తే చాలును—ఇప్పటికైనను మించినదిలేదు. మనకు వ్యతిరేకముగ, అతని ఉత్తరములు ప్రత్యక్షముగ కనబడుచున్నప్పుడు, అతడు నోటిమాటలతో ఒప్పుకొన్నాడంటే - అదైనా ఎవరిద్వారానో - అన్నాడంటే,—మనమాట ఎవరు నమ్ముతారు? మనను గురించి లోక మేమనుకుంటుంది? పొరబాటు జరిగిందని మనము నటిస్తే యెవరు నమ్ముతారు'' (పై గ్రంథము. వాల్యూం II పేజీ 245, 246)

క్లైవు ఘోర్జరీకోరు. ''ఇటువంటి మోస్తరు పనిచేస్తే బాగుంటుందేమో చూడు'' అని యితడు వాట్సుకు యిషారాయిచ్చెను. ఈయిషారా వృథాపోలేదు. మన వాట్సు అందుకు సంసిద్ధమే. నబాబుయొక్క ఆంతరంగికోద్యోగి యొకడు యీ కిరస్తాఫీ రాయబారిచేత మేపబడుచుండెను. * నబాబు తరఫున యీతడు మార్చి 10-వ తేదీన వాట్సనుకు ఒక ఉత్తరమువ్రాసి, చిట్టచివర యిట్లని హెచ్చరించెను :—

(నేను వేరే చెప్పేదేమున్నది?) ''అన్నిసంగతులు మీకు తెలుసు. మీకు విశాలబుద్ధి యున్నది. శత్రువు నిర్మలహృదయముతో, మీ శరణుజొచ్చితే, మీరు అతనికి తప్పక మీ ప్రాణమైన యిత్తురు. అయితే, అతని హృదయ నైర్మల్యమునుగూర్చి ముందు మీరు సంపూర్ణముగ తృప్తిపడి యుండవలెను. అట్లు గానిచో, మీకు ఏది సబబనితోస్తే అది చెయ్యండి.''

పై వాక్యములు వాట్సుచేసిన తర్జుమాలోనివని ''సర్జన్ ఐవుస్'' అనునతడు Voyages అను తన గ్రంథముయొక్క 126-వ పేజీలో దిగువను 'ఫుట్‌నోటు'లో చెప్పియున్నాడు. ''ఈ మాటలను పట్టుకొనియే, క్లైవు, వాట్సనులు, చంద్రనగరపు ముట్టడిని సాగించిరని యీ గ్రంథకర్త తన పుస్తకము 125-వ పేజీకి దిగువను వ్రాసియుండెను.

ఈ మాటల సత్యమునుగూర్చి రెండు భిన్నజాతులకు చెందిన యూరోపియనులే శంకించి యుండిరి. వీరెవరనగ ఫ్రెంచిజాతికి చెందిన జీన్‌లా! ఇంగ్లీషు జాతికి చెందిన స్క్రాఫ్టన్. నబాబుసేనలోను, దర్బారులోనున్న ఉద్యోగస్తులకు ఇంగ్లీషువారెట్లు లంచములమేపి చెరచినదియు జీన్‌లా ''Memoirs'' అను తన గ్రంథములో నిట్లు వ్రాసియున్నాడు:—

''నబాబు సేనలోని ప్రధానోద్యోగులందరు ఇంగ్లీషువారిచేతిలోనే యుండిరి. మీర్జాఫర్‌ఖాన్, ఖోదత్‌ఖాన్ లాట్టీ యింక అనేకమంది ఇంగ్లీషువారి పక్షముననే యుండిరి. వీరందరికి యింగ్లీషువారు బాగామేపిరి. తమ పలుకుబడిలో

* పై గ్రంథము వాల్యూం I, పేజీ CLXII

నున్న షాహుకారులచేత మేపించిరి. సురాజ్ ఉద్దాలాచే వెనుక భంగపడియున్న పూర్వపు మంత్రులు, దాదాపు ఆతని అంతరంగిక ఉద్యోగులందరు, దర్బారులో గుమాస్తాలందరు, వేయేల ఆఖరుకు జనానాలోవుండే ఖోజాలందరుకూడ ఇంగ్లీషు వారి వశములో నుండిరి. ఇన్ని పరిస్థితులు యేకమై కూడియున్నప్పుడు-వానిని నడిపించుటకు వాట్సువంటి తంత్రజ్ఞుడక్కడ వున్నప్పుడు-యిక చెప్పవలసిన దేమున్నది? ఇంగ్లీషువారింక సాధింపలేని పని యేమున్నది?" (పై గ్రంథము వాల్యూం III పేజీ 191)

పై దానినిగూర్చి జీన్‌లా పేజీకి దిగువ నిట్లు వ్రాసెను:—

"ఇంగ్లీషు అడ్మిరల్ వాట్సునుకు వ్రాయబడిన ఉత్తరం చూడండి. చంద్రనగరపు ముట్టడికి నబాబు తన కనుజ్ఞయిచ్చినట్లుగ యీ యుత్తరము చెప్పుచున్నదట! ఇది నటన! ఇది ఆశ్చర్యకరమైన సంగతియనియు, వాట్సు అభిప్రాయములకు అనుకూలముగ వ్రాయడానికి నబాబుయొక్క ఆంతరంగికోద్యోగికి లంచమివ్వబడి యుండవలెననియు, ఇంగ్లీషువారి వ్రాతలే ఒప్పుకొనుచున్నవి. తాను వ్రాయించిన ఉత్తరములు నబాబు యెన్నడు చదువడు. అదిగాక యీ నబాబులు ఆ వుత్తరములపై స్వయముగ సంతకములు చేయరు. గుమాస్తా ఉత్తరమువ్రాసి, కవరులో పెట్టి, బాగా అతికించి, నబాబు దగ్గరనున్న సీలును అడిగిపుచ్చుకొని, అతని యెదుటనే కవరుపై సీలువేయును. తరుచుగ దొంగసీల్లుకూడ ఉండడం కద్దు."

తమ కనుకూలంగా యీ వుత్తరం వ్రాయించుకోడానికి ఇంగ్లీషువారు చాల డబ్బు ఖర్చుపెట్టి నబాబు తాలూకు గుమాస్తాల కందరికి లంచము లిచ్చినట్లుస్క్రాఫ్టన్ అను ఇంగ్లీషువాడుకూడ ఒప్పుకొనుచున్నాడు. (Reflections) అను గ్రంథము 70-వ పేజీలో ఆత డిట్లు వ్రాసెను :—

"నబాబు దర్బారులో డబ్బుయొక్క ప్రభావమెట్టిదో, ఫ్రెంచివారివల్ల నేర్చుకొన్నవాడై, కొంతవరకు యిటువంటి మాటలవల్లను, కొంతవరకు నబాబుయొక్క ఆంతరంగికోద్యోగులలో ప్రధానుడైనవానికి బాగా బహుమతి యిచ్చుటవల్లను, యీ దిగువ ఉత్తరమును ఆతడు (వాట్సు) వ్రాయించెను."

ఈ వుత్తరము నిజముగ నబాబు అనుమతితోనే గాకుండ, నబాబే స్వదస్తూరితో వ్రాసెనని వాదించినను, ఫ్రెంచివారిని దుంపనాశనము చేయడానికి ఇంగ్లీషువారికి అతడు అనుజ్ఞయిచ్చినట్లు యీ వుత్తరములో యెక్కడవున్నది? ఈ వుత్తరము మంచి మర్యాదగల ధోరణిలో వ్రాయబడియుండెను. అసలు ఉత్తరము పరిషయన్ (పార్షీ) భాషలో వ్రాయబడియుండెను. అది యిప్పుడెక్కడను గన్పించదను సంగతిని పాఠకులు జ్ఞాపకముంచుకొనవలెను. దానిని వాట్సు ఇంగ్లీషులోనికి తర్జుమాచేసెను, బహుశః యితడీ తర్జుమాలో అసలు ఉత్తరములోని

మాటలను విరిచి, తమ కనుకూలముగురీతిని వ్రాసియుండవచ్చును. ఉత్తరమును నిష్పక్షపాత దృష్టితో జాగ్రత్తగ చదివిచూచినట్లయితే, యిందులో ఫ్రెంచివారిని నాశనము చేయడానికి ఇంగ్లీషువారికి నవాబు అనుజ్ఞ యిచ్చినట్లెక్కడను కానరాదు స్క్రాఫ్టన్ అను ఆంగ్లేయుడుకూడ Reflections అను తన గ్రంథములో నిట్లని వ్రాసియున్నాడు :—

"ఈ వుత్తరముయొక్క ఉద్దేశ్యము నిజముగ అది కాకపోయినప్పటికి, ఆ మాటలను మనమట్లు—అనగ, ఫ్రెంచివారిని మనము ముట్టడించుటకు నవాబు అంగీకరించినట్లు—అర్థము చేసికోవచ్చును."

చంద్రనగిర పతనము. ఇంకొక విశేషమున్నది. నవాబు తమ కనుజ్ఞ యిచ్చినాడన్న ఉత్తరము తమ కింకను రాకపూర్వమే ఇంగ్లీషువారు ఫ్రెంచివారిపై పడుటకు సర్వసన్నాహములు చేసుకొనుచుండిరే! దీని కేమి సమాధానము? యస్. సి. హిల్లు యిట్లు వ్రాయుచున్నాడు :—

"తనకు సహాయముగవచ్చి తనను పాట్నాలో కలుసుకొనవలెనని నవాబు క్లైవును కోరుటయనునది క్లైవుకు మంచి వీలిచ్చినది. ఈ మిష పెట్టుకొని క్లైవు తన సేనతో బయలుదేరి మార్చి 3-వ తేదీన నవాబుసేనను కలుసుకొనెను. బహు సంతోషముతో మీకు సహాయము చేయుదునని చెప్పి క్లైవు నవాబుకు 7-వ తేదీన జాబు వ్రాసెను. "అయితే పరాసువారివంటి శత్రువులను వెనుక అట్లేవుంచుకొని మనము ముందుకు పోవడము మంచిదా? మీవద్దనుండి తిరిగి కబురువచ్చేవరకు నేను చంద్రనగరములో యెదురుచూస్తావుంటాను! అని క్లైవు నవాబుకు వ్రాసెను." (పై గ్రంథము వాల్యూం I. పేజీ CLXIII)

నవాబు తమకు అనుజ్ఞ యిచ్చినాడన్న ఉత్తరము వచ్చినదేతడవుగ ఇంగ్లీషువారు ఫ్రెంచివారిపై పోయిపడుటకు సర్వసన్నాహములతో సంసిద్ధముగ నుండిరి. ఈ సమయమందే వారికి బొంబయినుండికూడ కొంతసేనవచ్చికలిసెను.

"ఇంగ్లీషువా రిన్నినాళ్లనుండి ఫ్రెంచివారితో సంధిమాటలు నడపడానికి కారణము వారి దౌర్బల్యమే. ఈ సమయమందు వారికి బొంబయినుండి సేనలు సహాయముగ వచ్చిచేరెను." (పై గ్రంథము. వాల్యూం I, పేజీ CLXIII& CLXIV)

" స్వర్గములోనుండి దిగివచ్చిన " " సేనాపతి " క్లైవు తమ చంద్రనగరము మీదికి వచ్చుటనుచూచి ఫ్రెంచివారు గాభరాపడిరి. "మీ రెందుకు వచ్చుచున్నారో చెప్పండి " అని వా రతనిని సంజాయిషీ కోరిరి. క్లైవు అబద్ధములాడుటలో గట్టివాడు; శుద్ధదొంగ; కపటప్రవర్తనలో అందెవేసిన చెయ్యి. అతడు 9-వ తేదీన ఫ్రెంచివారి కేమని సమాధానము చెప్పెను ?—

"ఎఫ్వై! నేనిప్పుడు మీమీద పడడానికి రావడములేదు. ఆ వుద్దేశము నాకిప్పుడులేదు. ఆ వుద్దేశము నాకు కలిగినప్పుడు, నేను మీతో చెప్పేచేస్తాను."

ఫ్రెంచివారితో కలహము పెట్టుకోడానికి యింగ్లీషువారికేదో మిష దొరకవలెనుగద. కథలోని తోడేలి తెలివితో సరిసమానమైన తెలివితో వారొకమిషను కనిపెట్టిరి. ఇంగ్లీషువారి సేనలోనుండి పారిపోయినవారిని ఫ్రెంచివారు దాచినారట! ఇదేమిష! ఇట్లని క్లైవు ఫ్రెంచివారికి మార్చి 11-వ తేదీన వ్రాసెను. మర్నాడు ఉదయమే చంద్రనగరమునకు పడమరగ రెండుమైళ్ల దూరములో క్లైవు తనసేనతో హాజరయ్యెను. ఈ సమయమునకు అడ్మిరల్ వాట్సన్ కూడవచ్చెను. పట్టణమును తమకు అప్పగించివేయవలసినదని వీరు 13-వ తేదీన చంద్రనగరపు ఫ్రెంచి గవర్నరుకు వ్రాసిరి. పరాసువారొప్పు చేయనందున మరునాడే క్లైవు యుద్ధప్రకటనను తన సేనలకు చదివివినిపించి చంద్రనగరపుముట్టడిని ప్రారంభించెను. 23-వ తేదీకి చంద్రనగరము యింగ్లీషువారి స్వాధీనమయ్యెను.

చంద్రనగర మీరీతిగ పడిపోయినది. ఈదెబ్బతో యిండియాలో పరాసుల ప్రతిభ అంతరించినది. చంద్రనగరమింత సులభముగ పడిపోవుటకు ఒకటే కారణమున్నది. అందరుగాకున్న కనీసమొక్క పరాసుయుద్యోగియొక్కయు, నవాబు కొలువులోవున్న నౌకర్లయొక్కయు ద్రోహమే యిందుకు కారణము. "లెఫ్టినెంట్-డి-టెర్రనో" అను పరాసుద్యోగి నదిమీదుగనున్న దోవను యింగ్లీషువారికి చూపించి ద్రోహముచేసెను. "బ్లాక్మన్" అను నతడిట్లు వ్రాయుచున్నాడు.

"టెర్రనో" యీద్రోహకార్యమువల్ల 'నల్లమొగమువాడను' దుష్కీర్తి గాంచెను. ఈ ద్రోహకార్య మొనర్చినందుకుగాను యింగ్లీషువారతనికి చాలధనమును బహుమతిచేసిరి. దీనిలో కొంతసొమ్ము నితడు ఫ్రాంసులోనున్న ముదుసలియగు తనతండ్రికి పంపెను. కాని, తనకొడుకుచేసిన లజ్జాకరమగు ద్రోహప్రవర్తననుగూర్చి విన్నవాడగుటచే, ఆతడాసొమ్మును పుచ్చుకొనక తిరుగగొట్టెను. ఇందువల్ల 'టెర్రనో'కు చాలదుఃఖము, సిగ్గు, గలిగెను. ఆతడు తలయెత్తుకొని తిరుగలేక పోయినాడు. అందుచే ఆతడొకగదిలో కూర్చుని తాళమువేసుకొనెను. కొన్నిరోజులకు తలుపు తెరచిచూడగ, అతనిశవము మెడకొక తువాలుతో తలుపుదగ్గరగ దూలమునుండి వ్రేలాడుచుండెను. ఈతడు ఆత్మహత్య చేసికొనెననుట నిశ్చయము. (Notes on Siraj-ud-Daula. Journal of the Asiatic Society 1867).

ఇంగ్లీషువారు ఫ్రెంచివారిపైపోయిపడకుండ నివారించుటకుగాను నవాబు నందకుమారుని పంపెను. ఇతని యధీనములో పెద్దదండుకలదు. కాని, యింగ్లీషువారతనిని కొనివేసిరి. ఇటువంటి ఖరాబుపనులన్ని చేయడానికి,—నవాబు ఉద్యోగులకు ఎరలనువేసియు, తియ్యనిమాటలచే లాలించియు, వారిని తమవైపు త్రిప్పుకోడానికి—

యింగ్లీషువారు ఒమీచందును తమ యేజెంటుగ ఉపయోగించుకొనుచుండిరి. నబాబు పలుకుబడిని తిరుగదోడడానికి యింగ్లీషువారు "నందకుమారుకు బాగా దాణావేసిరి" ఇందులో వారు జయమొందిరని స్క్రాఫ్టన్ చెప్పుచున్నాడు.

తన హిందూదేశచరిత్ర I వ వాల్యూము, 221 పేజీలో తారన్టన్ యిట్లు వ్రాయుచున్నాడు :—

"ముట్టడికి పూర్వము నబాబుసేనలోని కొంతదండు చంద్రనగరపు సరిహద్దులలో నిలువయుంచబడెను. ఇది హుగ్లీ దేశములో చేరియుండి అక్కడి గవర్నరయిన నందకుమారుని యధీనములోనుండెను. ఒమీచంద్ యింగ్లీషువారికోసము నందకుమారుని కొనివేసెను. కాబట్టి, యింగ్లీషుసేనలు చంద్రనగరమును సమీపించగనే సురాజ్ ఉద్దౌలాసేన అచ్చటనుండి తీసివేయబడెను. నందకుమారుడే గనుక యీద్రోహము చేయకపోతే యింగ్లీషువారు చంద్రనగరపు ముట్టడిలో జయమొందెడివారుకారని గట్టిగ చెప్పవచ్చును. 1757 సం॥ ఏప్రియల్ 10-వ తేదీన సమావేశమైన కంపెనీవారి సెలెక్టుకమిటీ ప్రొసీడింగ్సులో యిట్లు రికార్డు చేయబడి యున్నది :—

"ఈస్టిండియా కంపెనీ నౌకర్లమైన మనము ఉదారుడును, ధనాఢ్యుడును నగు ఆ కలకత్తా దేశీయవర్తకుడు ఒమీచందుకు సర్వదా కృతజ్ఞులమై యుండవలయును. ఇతనిద్వారానేగద మనము హుగ్లీ ఫౌజుదారైన దివాన్ నందకుమారుని సహాయమును, సహకారమును, సంపాదింప గలిగినాము. మనముట్టడికి పూర్వము చంద్రనగరములో నబాబుతాలూకు దండుకొంత నిల్వయుంచబడెను. ఈ దండు హుగ్లీసేనలో భాగమైయుండి, దివాన్ నందకుమారుని యాధిపత్యమున నుండెను. ఈ దండునే గనుక నందకుమారుడు దూరముగ తీసికొనిపోయి యుండకపోయినచో మనమా జయమునుగొనుట కేవలము అసంభవమయ్యెడిది."

ఒమీచందుని ప్రవర్తన దుర్గ్రాహ్యముగ నున్నది. ఇంగ్లీషువారితనిని లోగడ ననేకసార్లు హింసించి, అవమానపరచియుండిరి. అయినప్పటికి, వారుచెప్పిన ఛండాలపు పనులన్నీ చెయ్యడానికి యితడు సర్వదా సిద్ధముగనున్నాడు! ఏమి ఆశ్చర్యము! ఈతని ప్రవర్తన అర్థముగాకుండవున్నది. అయితే, తానుచేసిన ఉపకారములకన్నిటికి యింగ్లీషువారెంతటి "కృతజ్ఞతను" తినయెడ జూపనున్నారో యితని కింకను తెలియలేదు.

"చంద్రనగరమును వశపరుచుకొనుట ఇంగ్లీషువారికెంతయో లాభకారియయ్యెను. బెంగాలులో ఫ్రెంచివారిబాధఅణగిపోయి, తాము నబాబుతో వ్యవహారములనన్నిటిని నిరాఘాటముగ ఫైసలాచేసికొనుటకు ఇంగ్లీషువారికి మంచి రాజబాటయేర్పడెను. లోగడ తమకు కలకత్తాలోపోయిన మిలిటరీ, నావికాదళ సంబంధ

మైన సామాగ్రి యావత్తు యీనగరము స్వాధీనమగుటవల్ల ఇంగ్లీషువారికి భర్తీ యయ్యెను. అదిగాక, పుదుచ్చేరిలోను, యితరలంకలలోను ఫ్రెంచివారికి అమ్ముకొనుటకు సరుకులుగాని, తినుటకు తినుబండారములుగాని లేకుండపోయెను”

(S. C. Hill's Bengal Records—Vol. I, Pages CLXXIV.)

## నబాబు పై కుట్ర.

ఈ చంద్రనగరపు ముట్టడివల్ల సురాజ్ ఉద్దౌలాకు క్రోధ భయాశ్చర్యములు ముప్పిరిగొనెను. ఒలందాలున్నగు యితర కిరస్తానీ జాతులవారు ఆనాడు తెలివి గలవారై యుండినచో, వారు పరాసువారికి సహాయమొసర్చి, ఇంగ్లీషువారినుండగముల నణచియుండెడివారు. కాని, వారట్లుచేయక ఊరకయుండిరి. అందువల్ల, వారికిని కొన్నాళ్లకు పరాసువారిగతియే పట్టెను.

లోగడ ఫిబ్రవరి 9-వ తేదీన చేసికొన్న ఒడంబడిక షరతులను భంగపుచ్చినవారు ఇంగ్లీషువారుగాని, సురాజ్ ఉద్దౌలాకాదు. తమసేనలను తనకు అద్దెకిమ్మని ఆతడు ఇంగ్లీషువారినడిగెను. నబాబుకు సహాయపడుటకుగాక, ఫ్రెంచివారిపై పడుటకుగాను ఇంగ్లీషుసేనలు కదలినప్పుడు, అవి తనకక్కరలేదని నబాబు కబురంపెను. తాను ఇంగ్లీషువారితో చేసికొన్న ఒడంబడికప్రకారము అతడుకొంచమైనను చలింపక ప్రవర్తించెను. కాని, ఇంగ్లీషువారు చంద్రనగరమునకుపోవుచు, మధ్యత్రోవలో నబాబుప్రజలను అనవసరముగ, కేవలము తుంటరితనముగ హింసించిరి. తనరాజ్యములోనుంచి యీసేనలు నడచుటకు నబాబు అనుజ్ఞ యెన్నడు యివ్వలేదు. కాబట్టి, ఇంగ్లీషువారిసేనయిట్లు నబాబురాజ్యముగుండ పోవుటయే గొప్పతప్పు. రాజ్యములమధ్య పరస్పరము ఉండవలసిన ధర్మములకిది కేవలము విరుద్ధము. 1757 సం॥ మార్చి 22-వ తేదీన యిందును గూర్చి నబాబు అడ్మిరల్ వాట్సనుకు యిట్లువ్రాసెను:—

“ నేను ఏదైతే వాగ్దానముచేసి, సీలుచేసి యిచ్చినానో, అంతయు నిష్కర్షగ చెల్లింతును. అందుండి కొంచమైనను తొలగను. వాట్సు కోరినవన్నీ, ఆతడు నాకు చెప్పినవన్నీ, నేను ఒప్పుకొన్నాను. మిగతావి, యీనెల 15_వ తేదీలోగా యిప్పించివేస్తాను. ఈ సంగతులన్నీ వాట్సు మీకు వ్రాసియేయుండును. నే నింత చేసినప్పటికి, మీరు సంధిని భంగపరచునట్లుగ నా కనేక నిదర్శనములు గన్పించుచున్నవి. హుగ్లీ, ఇంగెలి, బర్ద్వాన్, నడియా ప్రాంతమంతయు మీ సేనలు నాశనము చేసినవి. ఇదంతా యెందుకువచ్చిన అల్లరి? ఇదిగాక, కాళీఘట్టము తన హుకుములోచేరిన కలకత్తాలోనిదని చెప్పి, దానిని తనకు స్వాధీనపరచవలసినదని గోవిందరాము మిత్రా రామదాస్ ఘోష్ కొడుకుద్వారా నందకుమారునికి వ్రాసెనట! ఈ గొడవంతా యేమిటి? ఇదంతా బహుశః మీకు తెలియకుండ జరిగిన దను

కుంటాను. మీయందుండే నమ్మకముచేత నేను సంధిచేసుకొన్నాను. దేశక్షేమము కోరి ఉభయసేనలవల్ల ప్రజలకు గలిగే యిక్కట్టులను వారింపగోరి, నేను మీతో సంధిచేసుకొన్నానుగాని, ప్రజల నిట్లా కాళ్లతో మట్టగించి నాశనం చేయించుకోడానికి, నా కీర్తిమాహాత్మ్యమంత నష్టపెట్టుకోడానికి కాదుగద.

"మనమధ్య అంకురించిన స్నేహము దినదినాభివృద్ధి పొందడానికి మీరు ఎల్లప్పుడు ప్రయత్నించుచుండవలెను. కాబట్టి, మీరు సదరు గోవిందరాము మిత్రాను మందలించి, ఆ తుంటరి యిట్టిపనులిక ముందు చేయకుండ, యిట్టి అసత్యప్రసంగములు చేయకుండ తగు కట్టుదిట్టములు చేయవలెను. అల్లాదయవల్ల, ఒడంబడికకు విరుద్ధముగ నే నెప్పుడు నడుచుకోనను. ఇందునుగూర్చి నేను పూర్తిగ వాట్సుతో మాట్లాడియున్నాను. ఆయన మీకు వ్రాయు ఉత్తరములలో ఆవివరములన్ని యుండగలవు."

"మరా:—మీతో యుద్ధము చేయడానికి మరాసువారు దక్కన్ నుండి పెద్ద సేన నొకదానిని తీసికొని వచ్చుచున్నట్లు నా కిప్పుడే తెలిసినది. ఈ సందర్భములో మీ కేమైన సహాయము కావలసినస్తే వ్రాయండి. ఎప్పుడు అవసరమైతే అప్పుడు మీకు సహాయము చేయడానికి నా సేనలు సర్వదా సిద్ధముగ ఉంటవి."

వెర్రిబాగుల సురాజ్ ఉద్దౌలా హృదయపూర్వకముగ శాంతినిగోరి వ్రాసిన మాటలివి. కాని అయ్యోపాపము! తాను వ్యవహరించు యీ విలాయితీ మనుష్యులెట్టి బొంకులాడులో ఆతని కిప్పటికిని తెలియలేదు. ఇతనితో వ్యవహరించుచున్న ఇంగ్లీషువారు నిష్కపటులుగారు; వీరికి నిజాయితీ బుద్ధిలేదు. తా నెవరినైతే నమ్ముకొన్నానన్నాడో అట్టి వాట్సనే తన కాలిక్రింద గోతులుతీసి, తన నందులో పడగొట్టాలని చూచుచున్నసంగతి పాపము సురాజ్ ఉద్దౌలాకు తెలియదు. తన కొలువులోచేరిన ఆంగ్లరాయబారి వాట్సు—తన అప్రాచ్య రాజ్యతంత్రప్రావీణ్యమునంతను వినియోగించి, తనను హతమార్చజూచుచున్న సంగతి పాపము వెర్రిబాగుల నబా ఎరుగడు.

చంద్రనగరపుముట్టడి ముగిసిన తరువాత, అక్కడనుండి కొందరు ఫ్రెంచివారు పారిపోయివచ్చి సురాజ్ ఉద్దౌలా శరణుజొచ్చిరి. వారి కితడు శరణమిచ్చెను. వారిని తమకు అప్పగించవలసినదని ఇంగ్లీషువారనిరి. శరణుజొచ్చిన వానిని పగతుని చేతి కందిచ్చుట ప్రాచ్యఖండస్థులకు మహా ఘోరపాపముగ గన్పట్టును గద. కాబట్టి యీ పని తాను చేయజాలనని సురాజ్ ఉద్దౌలా యనెను.

చంద్రనగరము పడిపోవుటకు ముందు అక్కడనున్న ఫ్రెంచివారు అడ్మిరల్ వాట్సనుకు కొన్ని సంధి షరతుల సూచించిరి. వానిలో నొకటి యేమనగా:—
"కాశింబజారు, డక్కా, పాట్నా, జూడా, బాలసోర్‌లలోనున్న ఫ్రెంచిగిడ్డం

గులు యిదివరకున్న పెరి యధీనములోనే యుండవలెను.'' ఈ సూచనకు బదులుగ వాట్సన్ యిట్లు ప్రత్యుత్తరమిచ్చెను:—''ఈ వ్యవహారము నబాబుకును, అడ్మిరల్‌కును మధ్య పరిష్కారమగును గాక.''

ఈ మాట పట్టుకొని పైన పేర్కొన్న ఫ్రెంచిగిడ్డంగుల నన్నిటిని తమ కిచ్చి వేయవలెనని ఇంగ్లీషువారు నబాబు నడిగిరి. 1757-వ సం॥ మార్చి 29-వ తేదీన క్లైవు నబాబున కిట్లు వ్రాసెను:—

''ఇంగ్లీషువారి తరఫున వాట్సు నబాబుపై యింకొక షరతును విధించెను.'' అదేదనగా:—ఫ్రెంచివారు మాకు శత్రువులు గాన కాశింబజారు మున్నగు చోట్ల నున్నవారి తాలూకు సరుకులను, మనుష్యులనుకూడ మాకు అప్పగించవలసినది. అట్లయినచో, మాకిక శత్రుశేషముండదు........''

ఇది క్రొత్తకోరిక యనుమాట నిశ్చయము. తన గౌరవమునకు భంగము లేకుండ తాను నెరవేర్పవీలులేని క్రొత్తక్రొత్త షరతుల నిట్టివానినే ఇంగ్లీషువారు చీటికిమాటికి నబాబుపై వేసి రుద్ద జూచుచుండిరి. ఇట్టి కోర్కెలనతడు చెల్లింపజాలడను సంగతి ఇంగ్లీషువారికే గట్టిగ తెలియును. అయితే, అతనితో యెట్లో ఒకట్లు గిల్లి కజ్జా పెట్టుకొనవలెనుగదా. మొదట ఫిబ్రవరి 9-వ తేదీనచేసికొన్న ఒడంబడిక లోని షరతులనెల్ల నబాబు తప్పకుండ నెరవేర్చనన్న సంగతి యిదివరకే చెప్పి యుంటిమి. ఈమాట క్లైవే ఒప్పుకొన్నాడు కూడాను. ఇందు విషయమై యితడు 1757-వ సం॥ మార్చి 30-వ తేదీన మద్రాసులోనున్న సెలెక్టుకమిటీవారికి వ్రాసిన జాబులో యిట్లని చెప్పెను:—

''ఆతడు మనతో చేసికొన్న ఒడంబడికలోని షరతుల నన్నిటిని దాదాపు పూర్తిగ అమలు జరిపెను. ఆత డిస్తానన్న మూడులక్షల రూపాయలు యిచ్చివేసినాడు. ఇతరసరుకులు, సొమ్ము, యెక్కడివక్కడ తిరిగి యిప్పించివేసినాడు. ఆతడు తన షరతులనన్నిటిని పూర్తిగ అమలు జరుపుతాడనే విషయములో నాకెట్టి సందేహము లేదు.'' (**Bangal Records Vol II, Page 308**)

ఈ అబద్ధాలకోరు ఇంగ్లీషువారి ప్రవర్తనవల్ల నబాబుకు విసుగు, అసహ్యము పుట్టిపోయినది. ''బెంగాలు రికార్డు''లను సంపాదించిన యస్. సి. హిల్లుకూడ ఆఖరుకు యిట్లు వ్రాయవలసి వచ్చినది. ఈతడును ఇంగ్లీషువాడే; క్రైస్తవుడు కూడాను. ఈతడేమని వ్రాసినాడు :—

''ఇంగ్లీషువారి తరఫున వాట్సుయిప్పుడు నబాబును ఒక క్రొత్త కోరిక కోరెను. ఏమని, ఫ్రెంచి గిడ్డంగులన్నీ తమ స్వాధీనము చేయమని. ఇందువిషయమై అడ్మిరల్ వాట్సన్ నబాబుకు అనేకఉత్తరములు వ్రాసెను. ఏప్రిల్ 19-వ తేదీన నబాబును బెదరించుచు యితడింకొక ఉత్తరమును వ్రాసెను. దీని తరువాత

నబాబునుండి తృప్తికరమగు సమాధానమేమియు రానందున, 'యిక మరి యుత్తరములు వ్రాయుట నాతడు మానుకొనెను. తన ఇంగ్లీషుజాతికి సహజ శత్రువులైన ఫ్రెంచివారితో వారెదిరించ గలిగినంతవరకు పోరాడి జయముగొనుటకు అడ్మిరల్ వాట్సనుకు సమ్మతమేయైనను, దీనికొక మిషగపెట్టి నిర్లజ్జగాక మొన్న సంధిచేసుకొన్న నబాబునుండితిరిగి కొత్తి హక్కులను లాగికొనజూచుట తన కెంతమాత్రము గౌరవప్రదమైన ప్రవర్తనగాదని, అడ్మిరల్ వాట్సనునకే తోచెను. అయితే, ఆ రోజుల సంగతి వేరు. రాచకీయములలో టక్కరుతనము, దొంగతనము, లేకపోతే సాగదని గొప్పగొప్ప మర్యాదస్థులుకూడ గట్టిగ తలంచుకునే రోజులవి. కాబట్టి తాము, తమ చేతులారా చేయుటకు జంకేపనులు యితరులుచేస్తే హర్షించి ఊరుకోడానికి, ఆ రోజులలో వారు అలవాటు పడియుండిరి.'' (పై గ్రంథము వాల్యూం I, పేజీ CLXXVI)

అడ్మిరల్ వాట్సన్ యిట్టి ముఠాలోచేరినవాడే. సురాజ్ ఉద్దౌలాను ఆ రోజులలోనున్న వాట్సన్, క్లైవు ముఠాతో పోల్చిచూచినప్పుడు అతడు వీరికంటె యెన్నియో మడుంగులు ఉత్తమపురుషుడని చెప్పక తప్పదు. అయితేపాపము, అతను చేసిన తప్పేమనగ, ఆతడు ఆత్మవంచన చేసికొనుట కిష్టపడలేదు. మరియు, యీ ఆంగ్ల కిరస్తానీలనుకూడ వంచించదలచలేదు. కాని, వీరికి మనస్సాక్షియనునది లేదు. సత్యసంధతకు, నిష్కాపట్యమునకు వారు దూరులు.

పరాసు గిడ్డంగులను యింగ్లీషువారి కిచ్చుటకు నబాబు సమ్మతింపలేదని వేరుగ చెప్పనక్కరలేదు. 1757-వ సం॥ ఏప్రిల్ 4-వ తేదీన క్లైవుకు వ్రాసిన ఉత్తరములో నబాబిట్లు చెప్పెను.

''ఢిల్లీ పాదుషా యనుమతితో ఫ్రెంచివారు అనేక గిడ్డంగులను నిర్మించుకొని యీ రాజ్యములో వర్తకము చేసుకొనుచున్నారు. కాబట్టి పరాసువారి వ్రాతమూలకమగు సమ్మతిలేకుండ నేనా గిడ్డంగుల జోలికిపోయి వానిని మీకు అప్పగించజాలను. ఇట్లు చేసినచో నా మర్యాదకు చాల భంగము కలుగును. ఇందువల్ల నాకు చాల చిక్కులుకూడ తటస్థించును. మీరు నాకు స్నేహితులు. కాబట్టి, నామర్యాదకులోపము కలిగే యేపనికిగాని మీరు హర్షింపరని తలచెదను. నేనును అట్లే మీ శ్రేయమును పెంపొందించుటకే ఎల్లప్పుడు కోరుచుందును. పరాసు గవర్నరగు రినాల్టు మీచేతిలోనే వున్నాడుగద. మీరతనిచేత యీ పనికి ఒప్పించి, అతనిస్వదస్తూరీతో ఒక కాగితమును సంపాదించి, నాకు పంపగలిగితే, నేనప్పుడు ఏమైనా చేయుటకు వీలుంటుంది. ''పరాసు గిడ్డంగులపన్నిటిని, అందుండుడబ్బు, సరుకులతో సహా—ఇంగ్లీషు కంపెనీవారి కిచ్చివేయుటకు నేను మనస్ఫూర్తిగ, నా స్వబుద్ధిని-అంగీకరించి వానిని స్వాధీనపరుచుకొనుటకు నే నిందుమూలముగ వారికి అధికార

మిచ్చుచున్నాను. ఇందుకు నవాబు తాలూకు వారెవరుగాని, యెట్టి అభ్యంతరము గాని పెట్టరాదు.'' ఇట్టి ఉత్తరము నొకదానిని మీరు రినాల్టువల్ల సంపాదించి నాకు పంపగలిగితే, యికముందు యిందువిషయమై నాకెట్టి చిక్కులును రావు. పరాసుల వర్తకసందర్భమున పాదుషాకుగల హక్కుల విషయమై మీరు వారితో యేదోవిధముగ పరిష్కారము చేసికొనుట అత్యవసరము. పాదుషాకు ద్రవ్యనష్టము కానిరీతిని మీరు పరిష్కరించుకొనవలెను. నే నప్పుడు పాదుషాకు తగురీతిని జవాబు చెప్పుటకు వీలుండును, "ఫ్రెంచివర్తకమువల్ల వచ్చు మన రివిన్యూ నష్టముకాకుండ భద్రతచేయుటకై నేను వారి గిడ్డంగులను ఇంగ్లీషువారికి అప్పగించితిన''ని నే నప్పుడు పాదుషాతో చెప్పుకొనుటకు వీలుగ నుండును.''

ఫ్రెంచి గవర్నర్ అగు "రినాల్టు" ఇంగ్లీషువారిచేతిలో ఖైదీగనుండెను. అయినను క్లైవు అతనిని యిందువిషయమై నొక్కలేదు. క్లైవు ఏప్రిల్ 8-వ తేదీన సురాజ్ ఉద్దౌలా కిట్లు వ్రాసెను:—

"మేము ఫ్రెంచివారిని అణగ గొట్టివేసినాము. అయినప్పటికి మీరు, మీ క్షేమమునకు విరుద్ధముగ, మీ శత్రువులే నా శత్రువులనిచెప్పి మీరు మాతో చెప్పినమాటకు విరుద్ధముగ, మీరిప్పు డింకను పరాసువారికి మద్దతుచేయుచున్నారు. పరాసు గిడ్డంగులను, సామగ్రులను మీరు మాచేతికి అప్పగించుట మీ మర్యాదకు లోపమని తలంచే యెడల, పోనీ, మీరు కొంచెము, ఊ, అని తల నెగురవేయండి. మేమే వెళ్లి స్వాధీనం చేసికొంటాము.''

ఇట్టి కపటవర్తనకు సురాజ్ ఒప్పుకొనలేదు. మొదట ఫిబ్రవరి 9-వ తేదీన చేసుకొన్న ఒడంబడికలో కొన్ని షరతులను నవాబింకను అమలు జరుపలేదని నేరముమోపుచు క్లైవు నవాబుకు ఏప్రిల్ 10-వ తేదీన వ్రాసెను. అమాయకుడగు సురాజ్ ఉద్దౌలాకు యీ జిత్తులమారి ఇంగ్లీషువారు కాలికివేస్తే మెడకు, మెడకు వేస్తే కాలికి, పెట్టుచున్న చిక్కులేమియు గ్రాహ్యమగుట లేదు. ఇవి అతనికి అగాధముగ నుండెను. వీరి ప్రవర్తనతో విసుగు, అసహ్యముపుట్టి నవాబు ఏప్రిల్ 14-వ తేదీన తెగబడి వారి కిట్లు వ్రాసెను:—

"నేను మీ కనేకసార్లు వ్రాసియున్నాను. తిరిగి మరల వ్రాయుచున్నాను. మన స్నేహమును చెడగొట్టవలెనను తలంపుతో స్వార్థపరులుచెప్పు చెప్పుడు మాటలను విని మీరు చీటికి మాటికి మన ఒడంబడికకు విరుద్ధముగ యిట్లు వ్రాయవద్దు. మీ కంపెనీవా రిక్కడ తమ వర్తకమును నిలుపుకోదలచుకున్నట్టయితే, యిట్టి వ్రాతలనిక మీరెన్నడు వ్రాయవద్దు. మీరు నాతో కలహమునకు దిగదలచుకొనక పోతే, అదుగో, చూసుకోండి, నా దస్కతు మొహరులతో ఉన్న ఒడంబడిక ఉన్నది. దానిని యెదురుగ పెట్టుకొని చూచి, నాకు మరీ వ్రాస్తూవుండండి...''

"నెమ్మదికి భంగముకలుగకుండ మీరు కాపాడుకొనదలచినారా, ఆ ఒడంబడికకు విరుద్ధముగ మీ రేమియు వ్రాయకండి." (Ives voyages. Page 142.)

కాశింబజారులోని పరాసుగిడ్డంగికి అధికారియగు జీన్ లా మూర్షిదాబాదులో నుండెను. ఇంగ్లీషువారితో గలిగిన చిక్కులకన్నిటికి కారణమీ ఫ్రెంచివారేగదా యను విసుగుదలతో—యింగ్లీషువారితో పేచీ యెందుకను ఊహతో—యీ జీన్ లాను, తక్కిన యావన్మంది పరాసులను యింగ్లీషువారికి అప్పగించి వేద్దామా యను బుద్ధి ఒకప్పుడు నబాబుకు కలిగెను. యస్. సి. హిల్లు యిట్లు వ్రాయుచున్నాడు :—

"ఆఖరుకు ఏప్రిల్ 13-వ తేదీన పరాసు ప్రతినిధియగు జీన్ లాను నబాబు తనయెదుటికి పిలిపించెను. అప్పుడక్కడ యింగ్లీషు రాయబారియగు 'వాట్సు' కూడ ఉండెను. 'మీ పరాసుగిడ్డంగులు వగైరాలను మాకు యిచ్చివేసేసెయ్యండి, మీకు మంచిగౌరవ ప్రదమైన యేర్పాటుచేయిస్తాను.' అని యింగ్లీషు రాయబారి పరాసు రాయబారితో యెంతో లాలనగ చెప్పెను. "నాకూ యింగ్లీషువారికి వచ్చిన తగాదాలకన్నిటికి మీ పరాసువారే కారకులు. నేను సహాయము కోరునప్పుడు నాకు సహాయముచేయని మీ (పరాసు) జాతివారికోసము నే నెందుకు నా దేశాన్నంతా యుద్ధములోనికి దింపి క్షోభపెట్టవలెను." అని నబాబనెను. ఈ మాటల సమయములో పరాసు రాయబారిని ఖైదుచేసి, యింగ్లీషువారిచేతికి అప్పగించుటకై నబాబు సంకల్పించినట్లు తోచుచున్నది. కాని, అప్పుడే కొంత పరాసుదళము వచ్చి వాకిటనిలచుటచే, నెత్తురు కళ్ల చూడకుండ పరాసు రాయబారిని ఖైదుచేయుట దుస్తరమని నబాబుకు తోచినట్లున్నది............" (Bengal Records Vol. I. Page CLXXVIII.)

1757 సం॥ ఏప్రిల్ 14-వ తేదీన సురాజ్ ఉద్దౌలా వాట్సన్ కు యీదిగువ రీతిగ వ్రాయుట నిష్కపట బుద్ధితోనే యని స్పష్టమగుచున్నది :—

"మీ తృప్తికొరకును—ఒకరి శత్రువుల నొకరు తమశత్రువులుగనే భావించుకొనుటకై మనము చేసికొన్న ఒడంబడిక ప్రకారమును—నేను జీన్ లాను—అతని యావత్తు పరివారమును నాదేశమునుండి తరిమివేసితిని. వారిని నారాజ్యములో యెక్కడగాని ఉండనివ్వవద్దని నా నాయకులకు, ఫౌజుదారులకు కఠినమైన ఉత్తరువుల జారీచేయించితిని. పరాసువారు గనుక మీతోయుద్ధముచేసే తలంపుతో నారాజ్యములో ఎన్నడైనా యేమాత్రపు దండుతోనైనా అడుగు పెట్టినారంటే, నేను మీకు సహాయము చేయడానికి సదాసంసిద్ధుడను. మీకు సైన్యము కావాలని ఒకచీటిముక్క పంపిస్తే నేను నాయావత్తు సైన్యముతో వచ్చి మీకు సహాయము చేయుదును. ఇందుకు అల్లాయున్న యావన్మంది ప్రవక్తలున్న సాక్షులు. మీతో

చేసుకొన్న ఒడంబడికలోను, మీకు వ్రాసిన ఉత్తరములలోను నేనుచేసియున్న వాగ్దానములన్నిటిని తప్పకుండ చెల్లింతునని మీరు గట్టిగనమ్మండి. ఇక ఫ్రెంచి గిడ్డంగుల విషయమై తమకు మనవి చేసేదేమంటే, ఫ్రెంచి కంపెనీవారు దేశీయులకు చాల బాకీయున్నారట. నాప్రజల తాలూకు లక్షలకొలదిడబ్బు వారివద్ద నున్నదట. కాబట్టి వారిగిడ్డంగుల నన్నిటిని మీకు అప్పగించివేసేస్తే, వారి బాకీదార్లు యేమై పోవలెను ?'' (Ive's voyages, Page 142.)

సురాజ్ తన మనస్సును దరిమిలా మార్చుకొనియుండవచ్చును. కాని, యీ వుత్తరము వ్రాసినప్పుడు మాత్రమతడు నిష్కాపట్య బుద్ధితోనే వ్రాసెను. అయితే క్లైవు వాట్సనులను నిజముగ నవాబుమీదికి పురికొల్పుచున్న అసలుదొంగ దర్బారులో కూర్చున్న రాయబారి వాట్సు. ఇతడు 1757 సం॥ ఏప్రిల్ 19-వ తేదీన అడ్మిరల్ వాట్సనుకు వ్రాసిన ఉత్తరమునుబట్టి, అసలు అల్లరి చేసేదంతా యీ రాయబారి 'వాట్సే' యని నవాబు మనస్సుకు దృఢముగ నిశ్చయమైపోయెను. అప్పుడు నవాబు ఒడలుమండెను. కాబట్టి, ''ఏప్రిల్ 20-వ తేదీన నవాబు యీ బ్రిటిష్ రాయబారిని తన దర్బారులోనుండి వెడలగొట్టించెను. మరునాడు—21-వ తేదీన—గౌరవ పూర్వకముగ వస్త్రముల బహుమతిచేసి పంపించెను'' (పైగ్రంథము వాల్యూం I, పేజీ CLXXX.)

ఏప్రిల్ 16-వ తేదీననే పరాసు ప్రతినిధి జీన్‌లా మూర్షిదాబాదునుండి వెడలగొట్టబడెను. ఇతడు బీహారు రాష్ట్రమువైపునకు పోయెను. 'స్టీవార్టు' అను నతడు తన బెంగాల్ చరిత్రలో యిట్లు వ్రాయుచున్నాడు :—

''మూర్షిదాబాదులో జరుగు రాజ్యాంగ వ్యవహారములన్ని 'జీన్‌లా'కు తెలియున్నట్లున్నది. అతడు వెళ్లిపోవునప్పుడు నవాబున కిట్లని చెప్పిపోయెను. 'నీ ప్రధానోద్యోగులలో చాలమంది నీయందు అసంతృప్తులై యున్నారు. నీకు విరోధముగ వారు యింగ్లీషువారితో యేకమై కుట్రపన్నుచున్నారు. మా పరాసువారము యిట్లు వెళ్లిపోగానే, యిదివరకు లోలోన కుములుచున్న అగ్నిహోత్రము ఒక్కసారి గప్పున జ్వాలలులేచి నిన్ను నాశనము చేయును.' ఈ మాటలయందలి సత్యము నవాబు మనస్సుకు తట్టెను. కాని, జీన్‌లాను ఉంచుకొనుటకు నవాబుకు ధైర్యము చాలకపోయెను. అయినను ''అవసరమునస్తే మీకు కబురు పంపిస్తాను లెండి'' అని నవాబనెను. కాని, జీన్‌లా దైవజ్ఞవాక్కుతో యిట్లనెను—''నాకు తెలుసు, మనమిక కలుసుకోము.''

జీన్‌లాచెప్పిన యీ మాటలుకూడ నవాబు యింగ్లీషురాయబారిని దర్బారులోనుండి వెడలగొట్టుటకు అదనముగ కారణమై యుండనోపును.

ఇంగ్లీషువారు నవాబుపైన కుట్రపన్నుచుండిరి. అతని నెట్లయిన పదభ్రష్టుని గావించి, బంగాళములో విప్లవము తెచ్చిపెట్టవలెనని వారు యోచించుచుండిరి. వాట్సు

మూర్షిదాబాదులో కాలుపెట్టిననాటినుంచి కుట్ర సాగించెను. ఆతడు స్వయముగ నబాబు ఉద్యోగస్తుల వద్దకు వెళ్లి మాట్లాడినట్లెక్కడను రికార్డులలో కనుపించదు. కాని ఒమీచందు అను ఒక పంజాబీ వర్తకునిద్వారా యితడీ నాటకమునంతను జరిపించెను. అప్రాచ్య తంత్రాంగమంతయు నడుపు చండాలపుపనిని యితనికి పెట్టిరి. ఈతడీ పనిని మిక్కిలి నేర్పుతోచేసెను. నబాబుకు కంపెనీకి సంధిజరిగి రెండునెల లయినను పూర్తిగ నిండకమునుపే యీకుట్ర చాలవరకు పూర్తియయ్యెను. కాశిం బజారుగిడ్డంగి వ్యవహారమునుగూర్చి మాట్లాడుటకు మూర్షిదాబాదు వెళ్లిన స్క్రాఫ్టన్ అను ఆంగ్లేయుడు 1757 సం॥ ఏప్రిల్ 20-వ తేదీన వాట్సు అనువాని కిట్లువ్రాసెను :—

"పడుచువాళ్లు కోపమును చాలారోజులు దాచుకోలేరు. ఇవ్వాళ్ల నబాబు కుండ బ్రద్దలుకొట్టినాడు. మన వకీలు నబాబు దర్శనానికి పోయినప్పుడు ఆతడు కండ్లబడగనే, 'వీణ్ణి బయటికిగెంటండి' అని నబాబు కేకవేసెను. "వీణ్ణి, వీళ్ల జాతిని నాశనం చేస్తాను" అని నబాబు అన్నమాటలు వెళ్లిపోవుచున్న మనవకీలు చెవినిబడినవి. "దండు తీసుకుని బయలుదేరు, నేనువెంటనే వస్తున్నా" నని నబాబు తనసేనాపతియగు మీర్జాఫరుకు ఆజ్ఞాపించెను. "ఎందుకు?" అని మీర్జాఫర్ అడుగగా, "ఫ్రెంచివారిని పట్టిమ్మని వీరు మాటిమాటికి నాకు వ్రాసి వేధిస్తున్నారు. ఇటువంటి ఉత్తరాలిక సాగవు! అని నబాబనెను. కాబట్టి, మీపుణ్యమా యని! నబాబుకు యిప్పుడు చాలకోపంగా ఉన్నది. ఆ కోపము కొంచము చల్లార నివ్వండి. వ్యవహారమింకా పక్వానికి రాలేదు.........ఇదంతానాకు వదలివేసే సెయ్యండి. ఇక పదిరోజులలో వ్యవహారమంతా ఫయిసలు చేసివేస్తాను. దండుతో మీరు రెండురోజులు ఉత్తరముగ సాగేటప్పటికల్లా మీకొక పెద్దసైన్యము సహాయంగా వచ్చికలిసేటట్టు చేస్తాను." (పై గ్రంథము వాల్యూం II, పేజీ 349.)

తియ్యని, కల్ల బొల్లి మాటలచేతను, సులభముగ ఊహింపదగిన ఇంక అనేక ఉపాయములచేతను, ఇంగ్లీషువారు నబాబు ఉద్యోగులను త్రిరుగదీసినట్లు స్పష్టమగును. యస్. సి. హిల్లు యిట్లు వ్రాయుచున్నాడు :—

"బ్రిటిష్ ఏజెంట్సంచి యెక్కువబరుగ ఉండుటచేత, అతడు దర్బారులో నుండు ప్రముఖులనేగాక, చాలమంది ఆంతరంగిక కార్యదర్శులనుకూడ తనవైపుకు త్రిప్పుకొకలిగెను. ఇందులో దూరదృష్టిగల ఒమీచందు యొక్క జిత్తులమారితనము అతనికి చాలసహాయము చేసెను.........హుగ్లీ ఫౌజుదారైన నందకుమారుని ఒమీచంద్ బుట్టలోవేసికొనెను." (పై గ్రంథము వాల్యూం I పేజీ CLXXVII.)

ఒమీచంద్ ద్వారా ఇంగ్లీషువారు లేవదీసిన ప్రధాన• కుట్రదారు లెవరనగా :—సేటులనబడు జెయిర్ సాహుకార్లు. మీర్జాఫర్; మనిక్ చంద్,

రాజాబల్లవ్, దుర్లాబ్ రామ్. నబాబుపైకుట్రపన్నుటకు వీరిలో ఒక్కొక్కరికి వేర్వేరుగ యేవేవో స్వార్థములున్నవి. "యార్ లతీఫ్‌ఖాన్" అనువానిని సింహాసనము మీద కూర్చుండబెట్టవలెనని షాహుకారులనిరి. వీడు హీనకులుడు. వీడు నబాబుకొలువులో రెండువేలసేనకు అధిపతియయినప్పటికి, యీషాహుకారుల నుండి డబ్బు తినుచుండెను. వీరినితడు కాపాడుచుండెను. వీనిని సింహాసనముమీద కూర్చుండబెట్టువిషయము ఇంగ్లీషువారికి నచ్చలేదు.

బంగాళాతక్కపై కూర్చుండదమని కులుకుచున్న సన్యాసి యింకొకడు గలడు. ఆతడే మీర్జాఫర్. ఇతడు సురాజ్‌ఉద్దౌలాకు దగ్గరచుట్టము. (మేనత్తమొగుడు) కాబట్టి, యార్ లతీఫ్‌కంటె, వీనికే దర్బారులో యెక్కువపలుకుబడియున్నది. తానున్ను, యింకకొందరున్ను కలిసి నబాబును సింహాసనమునుండి పడద్రోసే విషయములో ఇంగ్లీషువారికి సహాయముచేయడానికి సంసిద్ధముగ ఉన్నామని యీ మీర్జాఫర్ ఒక ఆర్మీనియన్ ఖోజాద్వారా వాట్సుకు కబురు పంపెనట! ఈ సంగతిని వాట్సు 1757 సం॥ ఏప్రిల్ 26-వ తేదీన కలకత్తాకు వ్రాసెను. ఆ వుత్తరములో యిట్లున్నది :—

"నేనిదివరకు వ్రాసినసక్కీముకంటె, యిదియెక్కువ వాటముగవున్నది. దీనికి మీరు ఒప్పుకొనేటట్టయితె, మీకెంత డబ్బు కావాలో, మీకెంత భూమి కావాలో, యింక యేయేసంగతులు కావాలో, తెలియపరచవలసినదిగ, మీర్జాఫర్ కోరుచున్నాడు." ఈ లోపుగ, నబాబుకు అలికిడి తగలకుండ, అతని కండ్లలో దుమ్ముకొట్టుటకుగాను, నబాబుకు తమంతటి మిత్రులు లేరన్నట్లు మంచితియ్యని మాటలలో ఆతనిని లాలింప సాగిరి! మెకాలే యిట్లు వ్రాయుచున్నాడు :—

"ప్రేమ ఒలికిపోతున్నట్లుగ క్లైవు నబాబుకు ఉత్తరము వ్రాసెను. ఇది చూచుకొని పాపమా వెర్రిబాగుల నబాబు కొంతకాలము తనకిక భయములేదు గదా యని మురుసుకొనెను. దుర్బలుడగు నబాబు సిది కొంతకాలముజోకొట్టెను. ఈ ఉత్తరానికి 'జోలపాట ఉత్తరమని' క్లైవే పేరుపెట్టెను. ఈ 'జోలపాట ఉత్తరమును' నబాబు దగ్గరకు తీసికొనివెళ్లినవాడే, యింకొక చేతితో యీదిగువ ఉత్తరమును వాట్సునద్దకు తీసికొనివెళ్లెను. "మరేమి ఫరవాలేదని మీర్జాఫరుకు చెప్పు. రణరంగమునుండి యెన్నడు వెనుదిరుగని అయిదువేల అచ్చాడీలవంటి సేనతో నేనుకలుసుకొందుమనని చెప్పు. రాత్రింబగల్లు నడచివచ్చి, తనయండనిలిచి, తనకు సహాయముగ పోరాడెదనని చెప్పు. తుదకు ఒక్క సైనికుడు ఉండేవరకు కూడ పోరాడెదనని అతనికి గట్టిగచెప్పు."

సురాజ్‌ఉద్దౌలా మేల్కొనకుండ అతనిని నిద్రలో పడవేయడానికి ఇంగ్లీషు వారెన్నెన్ని మాయోపాయముల జేసిరో, వానినన్నిటినిట వివరించుట అనవసరము.

సురాజ్ ఉద్దౌలా ప్రాచ్యభూములలో పుట్టిన వెర్రిబాగుల పసుచురాచబిడ్డ. కాబట్టి యితనికి అప్రాచ్య బచ్చుల కుటిల తంత్రము లెట్లు తెలియును?

ఒమీచంద్ ఇంగ్లీషువారి కెంత సహాయము చేయవలెనో అంత సహాయము చేసెను. ఇట్టి సహాయము లేకున్నచో, వారు చంద్రనగరమును పట్టుకొనలేక పోయెడివారు. ఈ సంగతి క్లైవును సెలెక్టు కమిటీవారునుకూడ అంగీకరించినట్లు యిదివరకే చెప్పియుంటిమి.

తిరిగి, యిప్పుడు, సురాజ్-ఉద్దౌలాను సింహాసనమునుండి కూలద్రోయు కుట్రలోకూడ యింగ్లీషువారు జయమొందుటకు యీ ఒమీచందే కారకుడు. ఇంగ్లీషువారు చిల్లర దుకాణదారులైతే, ఒమీచంద్‌కూడ ఆతరగతికి చెందినవాడే. ఈ అప్రాచ్య తంత్రజ్ఞులు చేయమన్న చండాలపు పనులనన్నిటిని వీడు నిర్లజ్జగ చేసివైచెను. ఈ చండాలపు పనులకన్నిటికి తగినకూలి—ప్రతిఫలము—తనకిత్తురని యీతడు ఆశించెను. ఒమీచంద్ ఆత్మద్రోహి. తనయేలికకు, తనజాతికి, ద్రోహి. కాని, పరాయివారగు కిరస్తానీలకు నమ్మినబంటు. వారిని పూర్తిగనమ్మి, వీడు వారికి సహాయముచేసెను. దొంగలలోకూడ నిజాయతీ ఉన్నదందురు. కాని, యీ విలాయితీ దొంగలకు—యీ క్లైవు, వాట్సను దొంగలముఠాకు—నీతీ, జాతీలేదు. వీరు కృతఘ్న హాతకులు. తమకింత ఉపకారముచేసిన ఒమీచంద్‌నకు ద్రోహమొనర్చుటకు వారు జంకలేదు. ఏరీతిగ మోసగించిరి? ఇదివరకు ప్రపంచచరిత్రలో, యే యుగములోను, యెక్కడ కని విని యెరుగని నీచాతినీచమార్గముగ ద్రోహమొనర్చిరి. సురాజ్-ఉద్దౌలాను సింహాసనమునుండి పడద్రోసిన పిమ్మటనో, లేక చంపిన పిమ్మటనో, వారు నబాబు ఖజానాను కొల్లగొట్టుదురని ఒమీచందునకు తెలియును. కాబట్టి, యిట్లు కొల్లగొట్టిన ఖజానాలో తనకు నూటికి 5 రూపాయల చొప్పున భాగము పెట్టవలసినదని ఒమీచంద్ కోరెను. మరియు, కోటలోను రాజమందిరములోను పడి దోచుకొన్న రత్నములలో కూడ కొంతభాగము పెట్టవలసినదనియు యితడు కోరెను. అయితే యింగ్లీషువారితనిని తమకు ఉపకరణముగ ఉపయోగించుకొనుటకు చూచిరేగాని, యితనికోర్కెలను మన్నింపదలచలేదు. కాబట్టి, వీనినెట్లయినను మోసముచేయవలెనని యింగ్లీషువారు తలచిరి. క్లైవు స్వర్గమునుండి దిగివచ్చిన సేనాపతియనియు, "యిండియాలో ఆంగ్ల రాజ్యమును స్థాపించిన మహానుభావుడ"నియు, యింగ్లీషు వారితనిని పూజించుచుందురు. ఇట్టి కిరస్తానీ క్లైవు విధర్ముడని వెక్కిరింపబడు ఒమీచందుని మోసపుచ్చుటకై ఫోర్జరీచేసెను. ఈవిదేశస్థులందరు అప్పుడు ఒమీచందుచేతిలో ఉన్నారు. ఆసమయములో గనుక తనకీ భాగము పెట్టననేటట్టయితే, వ్యవహారము బెడుస్తుంది. కాబట్టి, క్లైవు. వాట్సునకు యేమని వ్రాసినాడు :—

124A



ఆలివర్దీ ఖాన్ - మొగల్ సామ్రాజ్యము
నుండి విడివడిన మొదటి బెంగాల్ నబాబు
- ఆంగ్లేయుల కుటిల స్వభావమును
గుర్తించినవాడు (44 పేజీ.)



సు రా జ్ ఉ ద్దౌ లా.
"సురాజ్! షా! నీవే ధన్యుడవు"—
(పేజీ 141-143.)



మీర్జాఫర్ యింగ్లీషువారితో కుట్ర—(పేజీ 127.)
ప్లాసీ యుద్ధమునకు నాంది.

124B



వాట్సన్.

క్లైవుకు సహకారియగు ఆంగ్ల నౌకాదళాధిపతి
[ఇతని సంతకమే క్లైవు ఫోర్జరీ చేయించినది]
(125వ పేజీ.)



క్లైవు.

ఒమీచందును మోసగించుటకు వాట్సన్ సంతకము ఫోర్జరీచేయించి ప్లాసీ యుద్ధమున కపట జయముగొని భరతఖండమున ఆంగ్లరాజ్యమును స్థాపించిన మొదటి యింగ్లీషువాడు. తరుపరివచ్చిన యింగ్లీషు వారికెల్ల గురువు. (125వ పేజీ.)

"ఒమీచందును బాగా ఉబ్బవెయ్యి. కంపెనీ వ్యవహారాలు పైకి రావడానికి తాను చేసిన సహాయానికి అడ్మిరల్ వాట్సన్, కమిటీవారు, నేనుకూడ తనకెంతో కృతజ్ఞులముంటిమని చెప్పు. తన పేరు యిదివరకు యిండియాలో మోగిన దానికంటె యింగ్లండులో అధికముగ మోగిపోతుందని ఊరికే పొగడు. వీలైతే, అతనికి అనుమానము తగలకుండవుండడానికి, అతడు కోరిన 30 లక్షలలో 10 లక్షలు తీసివేసి, మొత్తములో నూటికి అయిదువంతున చేర్చి యిస్తామని చెప్పు. ఇదికూడ అతడు కోరిన మొత్తమే యగునని చెప్పు."

ఈ వ్యవహారమునుగూర్చి పార్లమెంటు కమిటీ యెదుట తనపై నేరము మోపబడినప్పుడు క్లైవు యిట్లని బదులుచెప్పెను.

"విప్లవము పుట్టించుటకు వలయు సన్నాహమంతయు పూర్తియై సర్వము సిద్ధముగనున్న క్షణములో, ఆకస్మికముగ ఒక క్రొత్త చిక్కు వచ్చినదని వాట్సన్ నాకు తెలిపెను. నవాబు ఖజానాలో దొరికిన దానిలో నూటికి ఐదు మాత్రమే గాక, మరి అదనముగ తనకు 30 లక్షలు యిచ్చితీరవలెనని ఒమీచందు పట్టుపట్టెనట. దీనికి మనము అంగీకరించనియెడల మనగుట్టంతయు నవాబుకు తెలిపి వాట్సును చంపించెదననికూడ అతడు భయపెట్టెనట. ఇట్టి దురాత్ముని యెత్తుగడను పడగొట్టుటకై, ఆ సమయమునుబట్టి యేదో మారుయెత్తు వేయకపోతే సాగేటట్టు కనిపించలేదు. అట్టి సమయములో టక్కరియెత్తు మాయతంత్రము చేయుట నాకు దోషముగ గన్పట్టలేదు. అప్పుడు ఆ పులక్కి కరారునామాయెత్తును సూచించినది నేనే. ఇందుకు కమిటీవారును ఒప్పుకొనిరి........ నేనిమాటయెన్నడును రహస్యముగ దాచనేలేదు. ఆసమయములో అటువంటి పని చేయుట తప్పు కాదు. అవసరమైతే, యిట్టిపనిని వందసారులయినా చేస్తాను."

క్లైవును విచారించిన పార్లమెంటు కమిటీలోని 'గౌరవనీయ' సభ్యులకు అతని ప్రవర్తన దోషముగ గన్పట్టలేదు. అట్లు గన్పట్టియున్నచో వారతనిని తక్షణమే ఉరిదీయించెడివారే. ఆరోజులలో యింగ్లండులో ఫోర్జరీకి ఉరిశిక్షయుండెను. "విమతుని" ఫోర్జరీచేత మోసగించడము వారికి బలే వేడుకగ కనిపించినది. కాబట్టి వారు క్లైవును ఉరిదీయించుటకు బదులుగ, అతనికి ప్రభు బిరుదమునిచ్చి సత్కరించిరి! ఇట్టి తుచ్ఛకార్యమొనర్చినందుకు వానికి ప్రభు బిరుదము దొరికినది!

రెండు కాగితములమీద రెండు కరారునామాలు వ్రాయించుటకు క్లైవును, అతని కిరస్తానీ ముఠాయు, యేర్పాటుచేసిరి. ఒకదానిలో ఒమీచంద్ కోరిన సొమ్ము యిచ్చుటకు ఒప్పుకొన్నట్లు వ్రాసిరి. రెండవదానిలో యీవాక్యమును వదలివేసిరి. ఒమీచందును యీరీతిగ మోసగించుటకు అడ్మిరల్ వాట్సన్ యిష్టపడలేదు. తానా దొంగ కరారునామా పత్రముపై సంతకము పెట్టననెను. ఈ దొంగ కరారు

నామా యెఱ్ఱ కాగితముమీద వ్రాయబడెను. దీనిపై తాను సంతకము చేయనని యెప్పుడైతే వాట్సన్ నిరాకరించెనో, వెంటనే అతని సంతకమును దానిపై ఫోర్జరీ చేయవలసినదని క్లైవు ఒక మనిషిని—లూషింగ్టన్ అను వానిని పిలిచి చెప్పెను. ఇట్లు వాట్సన్ సంతకము ఫోర్జరీ చేయబడియున్న యీ యెఱ్ఱకాగితమును ఒమీచంద్ చేతికిచ్చిరి.*

ఇంగ్లీషువారికిని, మస్లిమ్ ద్రోహియగు మీర్జాఫరుకును మొట్టమొదటగ జరిగిన ఒడంబడికలో 13 షరతులుండెను. 14 వది యగు యీ దొంగషరతు లేదు. ఈ ఒడంబడికలోని ముఖ్యమైన షరతు లేవనగ:—(1) లోగడ ఇంగ్లీషు వారికి సురాజ్ ఉద్దౌలా యిచ్చియున్న యావత్తు అధికారములను, హక్కులను,

---

* ఈ ఫోర్జరీ వ్యవహారమును గూర్చి పార్లమెంటు మహాసభలో క్లైవు స్వయముగ చెప్పిన మాట లివి:—

"సురాజ్ ఉద్దౌలా చేసిన ద్రోహమునకు, వంచనకు యెన్నడు అంతులేకుండెను. పరాసు సేనవచ్చి దిగేటట్టుగ కనపడ్డది. అది వస్తే మా ప్రాణములు దక్కవికావు. ముప్పదిలక్షల రూపాయ లున్న, నబాబు ఖజానాలో దొరకినదానిలో నూటికి అయిదువంతును తనకు భాగము పెట్టితేనే గాని వీలులేదని ఒమీచంద్ మోళీవేసుకు కూర్చున్నాడు. ఈ మాటకు మనము ఒప్పుకొనకపోతే మన గుట్టంతా తీసుకుపోయి ఒమీచంద్ నబాబుకు చెప్పేసేవాడు. అప్పుడు కాశింబజారులోవున్న మనవాళ్ల ప్రాణాలన్నీ పోయేవి. ఇట్టి సమయములో యేదో యెత్తువేయకపోతే బ్రతుకులేనట్లు కనిపించినది. కాబట్టి దీనికి నే నెంతమాత్రము వెనుదీయలేదు. కరారునామామీద అందరు సంతకములు చేసినారుగాని, అడ్మిరల్ వాట్సన్ తాను చేయనని కూర్చునెను. అతడు నాతో మాట్లాడిన మాటలనుబట్టి, కరారునామా మీద అతని సంతకమును నేను చేయించవచ్చునని నాకు తోచినది. అడ్మిరల్ వాట్సన్ పేరును సదరు కరారునామా కాగితముమీద సంతకముచేసిన మనిషి అతని యెదుట చేసెనో లేదో నాకు తెలియదు. అయితే, తానట్లు చేయుటకు తనకు తగిన అధికారమున్న దని అతడు తలంచెను. ఈ సంగతి నాకు తెలుసును. ఏలననగ, అట్లు చేయనిచో కంపెనీ బ్రతుకునకే మోసమువచ్చునట్లుండెను. మరియు, కాశింబజారులోనున్న మన యావన్మంది యింగ్లీషు ప్రజల ప్రాణాలుకూడ దక్కేటట్లు కనిపించలేదు. అట్టి సమయములో అటువంటి ఘోరపాతకుని మోసము చేయుట తప్పుకాదని నాకు తోచినది. అది రాజనీతిగను, ధర్మముగను నాకు తోచినది." కమిటీ ముందు సాక్ష్యమిచ్చుచు క్లైవు యిట్లనెను:—

"ఈ దొంగ కరారు నామాపై తన సంతకము చేయించుకొనుటకు వాట్సన్ సమ్మతించెనని లూషింగ్టన్ వల్ల నాకు తెలిసినది. అట్లు కానిచో, యిందు కతడంగీకరించెనని నేను ప్రకటించెడివాడను కాను. అయితే యింకొకసంగతి, వాట్సన్ ఒప్పుకొన్నను, ఒప్పుకొనకపోయినను, అతని సంతకమును కరారు నామాక్రింద చేసివేయవలసినదనియే నేను ఆజ్ఞాపించెడివాడను. ఒమీచందుని వంటి దుర్మార్గుని యెత్తు పడగొట్టుటకై అట్టి పనిచేయుట తప్పుగాదని నాతలంపు. ఇందుకు కౌన్సిలువారును సమ్మతించిరి": —

సౌకర్యములను, మీర్జాఫర్ ధ్రువపరుపవలెను. (2) ఇంగ్లీషువారి శత్రువులయెడ శత్రుత్వమును, మిత్రులయెడ మిత్రత్వమును వహించుటకు మీర్జాఫర్ ఒప్పుకొని ఆ ప్రకారము కరారునామా వ్రాసియివ్వవలెను. (3) పరాసుల తాలూకు యావత్తు గిడ్డంగులను, మనుష్యులను సహా, మీర్జాఫర్ ఇంగ్లీషువారికి అప్పగించివేయవలెను. (4) వారిని తిరిగి బెంగాలులో కాలు పెట్టనీయకూడదు. (5) లోగడ సురాజ్ ఉద్దౌలా కలకత్తాను పట్టుకొన్నప్పుడు ఇంగ్లీషువారికి గలిగిన నష్టము క్రిందను ప్రస్తుతము యుద్ధపుఖర్చుల క్రిందను మీర్జాఫర్ ఇంగ్లీషువారికి ఒక కోటిరూపాయ లివ్వవలెను. (6) లోగడ సురాజ్ ఉద్దౌలా కలకత్తాను పట్టుకొన్నప్పుడు అందున్న ఇంగ్లీషు ప్రజలకు గలిగిన నష్టముక్రింద 50 లక్షలున్ను, హిందూప్రజలకు గలిగిన నష్టముక్రింద 20 లక్షలున్ను, ఆర్మీనియన్ ప్రజలకు గలిగిన నష్టముక్రింద 7 లక్షలున్ను మీర్జాఫరే యిప్పించివ్వవలెను. (7) కలకత్తా కోటకు కందకముచుట్టు నున్న భూమియు, అందుకు 600 గజముల కైవారములోనున్న భూమియు ఇంగ్లీషు వారికి సమస్తహక్కులతో స్వాధీనపరచవలెను. (8) కలకత్తాకు దక్షిణముగ,— నదికిని ఉప్పు సరస్సులకు మధ్యగ—'కాల్పి' వరకు నున్న ప్రదేశమునకంతకు కంపెనీవారికి జమీందారీగిరి యివ్వవలెను. (9) తనరక్షణకు కావలసివచ్చినప్పుడెల్లా మీర్జాఫరు ఇంగ్లీషు సేనలకు జీతమిచ్చుకోవలెను. (10) హుగ్లీకి దిగువను, నది మీదను మీర్జాఫరు ఘట్టికోటలనుగాని కట్టకూడదు. (11) ఇతనిని నవాబుగ చేసిన 30 రోజులలోగా మీర్జాఫర్ యీషరతులనన్నిటిని అమలు జరుపవలెను. (12) ఈ ఒడంబడికకు బద్ధుడైయున్నంతకాలము మీర్జాఫరుకు ఇంగ్లీషువారు సహాయము చేయుదురు.

మీర్జాఫర్ ద్రోహము — ప్లాసీ యుద్ధమునకు నాంది.

కలకత్తాలోని కంపెనీ కమిటీవారు తమ తాలూకు యావత్తు వ్యవహారములను, క్లైవు వాట్సనులచేతులలో పెట్టిరి. తమకు తృప్తికరముగ క్లైవు తమ వ్యవహారములనెట్లు ఫోర్జరీవల్ల చక్కబెట్టెనో పైన వివరించియుంటిమి. అయితే, అప్రాచ్యరాజ్య తంత్రమును సమగ్రముగ సాగించుచున్న, అడ్మిరల్ వాట్సన్ వట్టి పిరికి పంద. మీర్జాఫరుతో సంధివ్యవహారము పరిష్కరించుకొనుటకుగాను యీతడా మస్లిమ్ద్రోహి యింటికి బహిరంగముగ వెళ్లుటకు భయపడెను. 1757 సం॥ జూన్ 4–వ తేదీన రాత్రి బాగా ప్రొద్దుపోయినతరువాత కోజాపెట్రూస్ అను ఆర్మేనియన్ దేశస్థుడొకడు స్త్రీలు ఉపయోగించు ఒక డోలీలో యితనిని కూర్చుండబెట్టి, యెవరికి అనుమానము తగలకుండ, రహస్యముగ మీర్జాఫర్ యింటికి మోయించుకొని వెళ్లెను. ఆరాత్రియే మీర్జాఫర్ యీ ఒడంబడికపై సంతకముచేసెను.

ఇంగ్లీషువారు సురాజ్ ఉద్దౌలాను మోసపుచ్చి మైకములో పడద్రోసినట్లు యిదివరకే చెప్పియుంటిమి. తనకిక భయములేదను దిలాసాతో—పాపమా వెర్రి బాగుల నబాబు—తనసేనలో సగము తీసివేసెను. నబాబును మోసగించుటకై ఇంగ్లీషువారు యిన్నాళ్లనుండి వేసికొన్న బురకాను తామిక తీసివేయవచ్చునను నిర్భయసమయము క్రమముగ ఆసన్నమగుచుండెను. అయితే, వాట్సు మున్నగు బ్రిటిష్ మనుష్యులింకను నబాబు రాజధానియగు మూర్షిదాబాదులోనేయున్నారు. వారక్కడ వున్నంతకాలము తమద్రోహచింత నబాబుకు తెలియనివ్వరాదు. జూన్ 12-వ తేదీరాత్రి యీ ఇంగ్లీషువారు వేటకు వెళ్లుచున్నామను చిన్నమిష చెప్పి, నబాబువద్ద శెలవు పుచ్చుకొని, మూర్షిదాబాదునుండి వచ్చివేసిరి. మరునాడు వారు తిరిగిరాలేదు. వాట్సు మున్నగు ఇంగ్లీషు మనుష్యులు పారిపోయినట్లు నబాబుకు తెలిసినది. వారి ద్రోహ తంత్రమంతయు వెంటనే నబాబుకు పూర్తిగ గోచరమై పోయినది. ఆరోజుననే, నబాబు యీక్రింది ఉత్తరమును క్లైవు ఘాట్సనులకు వ్రాసెను :—

"మన ఒడంబడిక ప్రకారము నేనుచేసిన వాగ్దానముల నన్నిటిని—ఏదో కొద్దిగ తప్ప—యావత్తు వాట్సన్ ద్వారా పూర్తిగ పరిష్కరించినాను. అయినప్పటికి, వాట్సును, కాసింబజారులోవున్న మిగతా కౌన్సిలుదారును తోటషికారు వెళ్లెదమనిమిష చెప్పి, అర్ధరాత్రివేళ పారిపోయినారు. ఇది కేవలము మోసముగను, ఒడంబడిక భగ్నమొనర్చు సంకల్పముగను స్పష్టముగ గన్పట్టుచున్నది. మీకు తెలియకుండ, మీసలహాలేకుండ—యీపని జరిగినదని నేననుకొనను. ఇటువంటిదేదో జరుగుతుందని నేను మొదటినుంచి అనుమానపడుచునే యున్నాను. ఇందులో యేదో ద్రోహమున్నట్లు నాకు తట్టుచున్నది. కాబట్టి, నాసేనను ప్లాసీనుండి రప్పింపను."

"ఒడంబడిక భంగమగుట నావల్లకాలేదు గదాయని నేను అల్లాను స్తోత్ర మొనర్చుచున్నాను. మనము చేసుకొన్న ఒడంబడికకు అల్లాయు, ప్రవక్తలును సాక్షులుగనుండిరి. ముందుగ ఎవరైతే యీ యొడంబడికను భంగపుచ్చుదురో అందుకు తగిన శిక్షను వారే పొందుదురు. (Ive's Voyages Page 145).

తనపై పన్నబడిన కుట్ర యెంతవరకుపోయినదో పాపము సురాజ్ ఉద్దౌలాకు తెలియదు. ఎవరినైతే ఇంగ్లీషువారు చీలదీసి తనమీదికి ఉసుకొలుపుచున్నారో—ఎవరుప్రధానకుట్రదారుడో—అట్టి మీర్జాఫరునే సురాజ్ ఉద్దౌలా తెలియక నమ్ముకొని యుండెను. పాపము సురాజ్ ఉద్దౌలా అనుభవములేని కుర్రవాడు, నిజాయితీ బుద్ధిగలవాడు. తన ఉద్యోగులలో యెప్పుడైనా తనమెడ వ్యతిరేకభావము కనబడితే, వారు తనయందు విశ్వాసభావముతోనున్నారో లేదో తెలిసికొనుటకుగాను యితనితాత అలివర్దిఖాను ఖురానును వారినెత్తిపై పెట్టి ప్రమాణము చేయుమని

కోరేవాడట! ఇప్పుడు సురాజ్ఉద్దౌలా కూడ యీ ప్రకారమే చేసెను. ఇతడు స్వయముగ మీర్జాఫరు యింటికిపోయి, మనస్సులో రట్టిద్వేషముగాని ఉంచుకోన వద్దని అతనిని ప్రార్థించి, తనయెడ విశ్వాసముతోనుందునని ఆతడు ఖురాను ముట్టి చేసిన ప్రమాణమును అంగీకరించి, నమ్మి తిరిగివచ్చెను.

కాని, తన ప్రమాణవాక్యమును త్రోసి పుచ్చి, ద్రోహియై, తరుణము కనిపెట్టి, ఇంగ్లీషు సేనలను పలాశ్ యుద్ధరంగమునకు నడిపించినది యీమీర్జాఫరే. ఇంమనుగూర్చి 'ఐవ్స' యిట్లు వ్రాయుచున్నాడు:—

"సర్వము సిద్ధముగనున్నదని మీర్జాఫరునుండియు, ఆతని ముతాదారుల ... జూన్ 12-వ తేదీన కబురు వచ్చినది. పాచిక పారినది. మరునాడు—13-వ తేదీన ... సైన్యము ముందుకు నడచినది..............(Ive's voyages. Page 148.)

ఆ ... —అనగా జూన్ 13-వ తేదీన—క్లైవు సురాజ్-ఉద్దౌలా కొక ఉత్తరము ... సంధి షరతులను సురాజ్-ఉద్దౌలా అమలు జరుపలేదను నేరము అందు ... బడెను. అందిట్లున్నది:—

"కంపెనీ ... గులందరి యనుమతితో నేనొక మార్గమాలోచించినాను. వెంటనే కాశింబజా... వెళ్లి మన తగాదా విషయములన్నిటిని పరిష్కరించి తీర్పు చెప్పుటకు మీర్జాఫర్, ... మ్ దులాబ్, జగత్ సేట్ వగైరా పెద్దమనుష్యులను మధ్యవర్తులుగ యేర్పా... సుకుందాము. ఇందునాదే తప్పని వారు తీర్పుచెప్పే యెడల, యికనేనేమియు ... నని ప్రమాణము చేయుచున్నాను. తప్పు మీదేయని వారు తీర్పు చెప్పేయెడల, ... కంపెనీకి గలిగిన యానత్తు నష్టమును మీరు భర్తీ చేయవలెను. మా సైన్యముల ... కాధళెమునకు అయినా ఖర్చంతా మీరిచ్చుకో వలెను. వర్షాకాలము రాబోవు... ... మీరు ప్రత్యుత్తరమిచ్చుటకు చాల ఆలస్య ము కావచ్చును. కాబట్టి, తక్షణ... ... సమునకు వచ్చుట అవసరమని తోచి నది" (పై గ్రంథము పేజీ 140).

## ప్లాసీ యుద్ధము

క్లైవు యాధిపత్యము క్రింద సేనలు ... యుద్ధరంగమునకు నడచిన వివరముల నిట వర్ణించుట అనవసరము. 'పలాశీ' గ్రామము మూర్షిదాబాదుకు 20 మైళ్ల దూరములో నుండెను. ఆ గ్రామముల ... విశేషముగ పలాశ వృక్షములు అనగ మోదుగచెట్ల తోపులుండుటచే దానికా ... ... చ్చినది. *ఈ విదేశస్థులవల్ల

---

* 1892 సం॥ ఏప్రిల్ నెల తాలూకు కలకత్తా రివ్యూ ... పేజీ 342 లో హెచ్. బెవరిడ్జి యనువతడు 'పలాశీ' గ్రామమును గూర్చి యిట్లు వ్రాసెను ...

యేదో ద్రోహము జరుగనున్నదని నబాబుకు అనుమానముకలిగి, అతడు కొంత సేనను పలాసి గ్రామమునద్ద నిలువయుంచెను. ఈ సంగతిని అతడు 1757 సం॥ జూన్ 12-వ తేదీన వాట్సనుకు వ్రాసిన ఉత్తరములో ఉదహరించియుండెను. జూన్ 23-వ తేదీన యీ పలాసి గ్రామమునద్ద ఒక యుద్ధము జరిగెను. ఈ యుద్ధము యింగ్లీషు వారి పేరున కేమియు మర్యాద తెచ్చునదిగలేదు. 'స్వర్గమునుండి యూడిపడిన సేనాపతి'—పేరుమ్రోగిన ఫోర్జరీఖోరు—మాట యిక చెప్పనే అక్కరలేదు. క్లైవుకు మిత్రుడు, శ్రేయోభిలాషి, చరిత్రకారుడునగు 'ఆర్మ్' యిట్లు వ్రాయు చున్నాడు:—

"ఇతడా సమయమున నిద్రపోవుచుండెనని కొందరనుచున్నారు. బహుశః నిజమై ఉండవచ్చును. ఎందుకంటే, అంతకు పూర్వము యెన్ని గ ... డ యో అతనికి విశ్రాంతిలేదు. అయితే యేమి? అంతమాత్రముచే ... ర్యము లేదనిగాని, అతడు సరిగ ప్రవర్తించలేదనిగాని, అనడానికి వీలు ...

సురాజ్-ఉద్దౌలా సైన్యమునంతను లంచములుమేపి ... వారు చెడ గొట్టినారు. నబాబు శిబిరమంతా ద్రోహులపుట్ట. వారిలో శ్రే ... ష్ఠుడు మీర్జా ఫర్. ఇతడే నబాబు సేనకంతకు అధిపతి. ఈ ప్రధానసేనా ... యింగ్లీషు వారితో పరీక్షైనాడు. ఈ సంగతులన్ని యిట్లుండగ, ... బాకు

"ప్లాసీ (లేక పలాశీ) యను గ్రామమిప్పడు నడియా జిల్లా ... న్నది........పూర్వము మూర్షిదాబాదు జిల్లాలోనుండెను. న్యాయముగ యిప్పడుకూడ ... మూర్షిదాబాదు జిల్లాలో చేరియుండవలసినది. ఏలననగ, యిది కృష్ణనగరుకంటె, బరహం ... కు 10 మైళ్ల దగ్గరగవున్నది. లోగడ 'కాశింబజారు లంక' యనబడు దానిలో నిది భాగ ... శ్యామనగర్ ఫ్యాక్టరీయు దాని కెదురుగ నైరుతిమూలగనున్న గ్రామములును, ... ప్రక్కనున్నప్పటికి నేడింకను మూర్షిదాబాదు జిల్లాలోనే చేర్పబడియున్నవి. ' ... పలు 'పలాశ' వృక్షము (మోదుగ చెట్టు) నుండి వచ్చినదనుట స్పష్టము. కాని యి ... ములో మోదుగ చెట్లులేవు. పూర్వము వున్నట్లును తోచదు. 'పలాసీ' యనుపేరు ... కిగాక ఆచుట్టుపట్టుల 240 చదరపు మైళ్ల వైశాల్యముగల పరగణా కంతకును ... కాబట్టి యీ మోదుగచెట్లు (పలాశ వృక్షములు) బహుశః 240 చదరపు మైళ్ల ... ర్యముగల యీ 'పలాసీ' పరగణాలో యెచ్చోట నైననుండి యుండవచ్చును."

"పలాసీ గ్రామము చాల పె ... ను. ఇచ్చట 250 యిండ్లుకలవు. కొన్నివేల యెకరముల భూమికలదు............18 ... లో 'వాలెంటియా ప్రభువు' యీ గ్రామమువద్ద తన మేనా బోయీలను మార్చుకొనెను ... అక్కడ పెద్దతోపువున్నట్టు ఆయన చెప్పచున్నాడు. కాని, ఆతోపులో ఆఖరు చెట్టు ... లో చచ్చిపోయెను. ఒక యూరోపియనుడు వచ్చి యీ చెట్ల మోళ్లను, వేళ్లను, త్రో ... పంపించెనట. ఈ పనిచేసిన యూరోపియనుడు వెంటనే చచ్చెనని ఆవూళ్లో జనము ... ఒక కథ చెప్పకొనుచుందురు.

పలాసి యుద్ధరంగమందు ఓటమిగాక జయమెట్లు గలుగును? ఈ యుద్ధమునుగూర్చి 'కర్నల్ మాలెసన్' చెప్పినమాట లెంతేని ఒప్పిదముగ, న్యాయముగ, నున్నవి: అతడుచెప్పిన మాటలివి:—

"రాజద్రోహమే సర్వము అమర్చిపెట్టిన తరువాత, రాజద్రోహమే నవా బును యుద్ధరంగిమునుండి తరిమివేసిన తరువాత—రాజద్రోహమే నబాబుసేనను … మగు మంచి వ్యూహస్థానమునుండి తప్పించిన తరువాత—తన ప్రాణమునకిక … ను లేమగదా యను ధైర్యముతోచిన తర్వాత, అప్పుడే, క్లైవు యుద్ధ ర … నికి నడచివాగలిగెను. కాబట్టి, పలాసియుద్ధము పరిష్కార యుద్ధమై … గొప్పయుద్ధముగ నెన్నడు భావింపబడదు." (Decisive Battles of … e 73.)

… ష్టమారి క్లైవుకూడ యిందునుగూర్చి పార్లమెంట్ కమిటీ యెదుట తన సా … గో యిట్లు చెప్పెను.

"… ద్ధములో రక్తపాతము అంతితక్కువగ ఉండటానికి రెండు కారణ ములున్నవి… న పెద్దయెత్తయిన కరకట్టచాటున నుండెను. అందుచే, శత్రు వుల ఫిరంగుల … సేమియు నష్టమును కలిగింపలేకపోయెను. ఇది ఒక కారణము. ఇక రెండవ కా … రణమనగ: సురాజ్-ఉద్దౌలాకు తన సేనయందు నమ్మకము లేకుండెను; అట్లే … తనిసేనకును అతనియందు నమ్మకము లేకుండెను. కాబట్టి సైనికులు తాము … లుపిన విధులను చేయలేదు."

నబాబు సేన, … చుటకు తానే యేపనులు చేసినది క్లైవు పార్లమెంటు కమిటీ మెంబర్లకు చె … 

విధి సురాజ్' … కూలుడయ్యెను. తనకు విశ్వాసపాత్రుడగు సేనాని మీర్ మదన్ చనిపోవగ … రంగమందతిడిక ఆశను వదలుకొనెను. హెచ్. బివరిడ్జి యిట్లు చెప్పుచున్నా…:—

"పళాసి యుద్ధరంగమందు … నిజమైన ముసల్మాన్ వీరుడు మీర్ మదన్. ఇతడు తోపులోనికి జొరబడ … తగ, గుండుదెబ్బతగిలి చనిపోయెను. .........ఇతని పతనము 1694 సం॥లో … 'న్ మెహ్' వీరుని పతనమును బోలి యున్నది. ఇరువురును విశ్వాసఘాతుకము … మారి. ఇరువురు తొడలలో గుండు దెబ్బచే యుద్ధరంగమునబడిరి. "ఈ పలాసీ … సంగతి (అసలు రహస్యము) ఆగ్రామస్థులకు బాగా తెలియునట్లున్నది. ఇది … క్యమే. మీర్జాఫర్ ద్రోహ మును గూర్చియు, మీర్ మదన్ ప్రతాపమును … ర్చియు వారు చెప్పుకొను చుండిరి. వారిలో ఒకడు "మీర్ మదన్ కీర్తి ఆ … తారార్కముండు" నని యెంతో ఉద్రేకముతో పలికెను.

ఆ రోజు సురాజ్‌కు దుర్దినమయ్యెను. ఆ ప్రాణాంతికమైన రోజు—జూన్ 23-వ తేదీ—గురువారము సాయంకాలము సురాజ్ యుద్ధరంగమును వీడి, ఏనుగ నెక్కి, త్వరత్వరగ మరునాడు ఉదయమునకు తనరాజధాని యగు మూర్షిదాబాదు నగరమును చేరెను. పలాసియుద్ధరంగమందు తటస్థించిన విపద్వార్త దేశమందంతట తక్షణమే అగ్ని జ్వాలలవలె వ్యాపించెను. ఈ విపత్తునుండి తెప్పరిల్లి సురాజ్ తిరిగి సేనను ప్రోగుచేయ యత్నించెను. సురాజ్ ఉద్దౌలాయొక్క భానుడు అస్తమించెను. హీనతేజుడగు సూర్యునెవరారాధింతురు? కాబట్టి కూడ యీ ముసల్మాను ప్రభుసహాయార్థము వచ్చిన పాపమున పోలేదు. అతని మామగారుకూడ ఆతనివంక చూడలేదు. స్కాట్ అను ఒక చరిత్రకారు డిట్లు వ్రాయుచున్నాడు:—

సురాజ్ ఏనుగు నెక్కి యుద్ధరంగమును వీడుట.

"అతని భార్య తండ్రి మహమ్మద్ యీరఖ్‌ఖానుకూడ, [illegible] వేడుకొన్నను అతనికి సహాయపడలేదు. 'మీరిక్కడ కొంచెము [illegible], సేనను ప్రోగుచెయ్యండి; ఎందుకైనా మంచిది; నన్ను రక్షించుకోడ[illegible], లేకపోతే, పారిపోయేటప్పుడు నాకుకొంచెము అండగ వుండడానికైనా [illegible]స్తుంది.' అని సురాజ్ ఎంతబ్రతిమాలుకొన్నను ఆ మామ వినలేదు. పైగా [illegible]ములో వేరే చోటవున్న తనయింటికి త్వర త్వరగ లేచిపోయెను." (Scott [illegible] History of Bengal. Page 360.)

సురాజ్ ఉద్దౌలా ఖజానానిండ డబ్బువున్[illegible]గి పొరలుచున్నది. ఈడబ్బును మంచినీళ్ల ప్రాయంగా ఖర్చుపెట్టి సేనను [illegible]సుకొనవలెనని అతడు చూచెను. కాని అదియు సాగలేదు. ఇందుగూర్చి [illegible]టే—యిట్లు వ్రాయుచున్నాడు;—

"ఇక ఆఖరు దెబ్బగ నబాబు [illegible]పు తెరచి, శిపాయిలకు పుష్కలముగ డబ్బు పంచిపెట్టెను. [illegible] చేతిలో వేసుకొని, ఎక్కడి వారక్కడ యిండ్లకు లేచిపోయిరి" [illegible] పేజీ 369).

1772 సం॥ పార్లమెంటు [illegible] [illegible]రణలో క్లైవు యిట్లుచెప్పెను:—

"సురాజ్ ఉద్దౌలా త[illegible]నిని చేరినప్పుడు అతని ఖజానానిండ డబ్బుండెను. ఇంత డబ్బుండియుకూడ [illegible] తన సైనికుల విశ్వాసమును సంపాదించుకోలేక పోయినాడు. తిరిగి య[illegible]మునకు నడిపించడనికి అతడు తన సైనికులకు ఊరక డబ్బు పంచిపెట్టినను [illegible] లాభములేకపోయెను."

'ఇంగ్లీషువారికి [illegible] అప్పగించుకుంటే బాగుంటుందని' అతని దర్బారీలు కొందరతనికి సలహ[illegible]. ఇందు కతడెంతమాత్రము అంగీకరించలేదని వేరుగ

సురాజ్ ఫకీరు వేషమున పారిపోవుట.

చెప్పనక్కరలేదు. ఆమాట వినుటకే అతనికి అసహ్యమయ్యెను. నిజమంతేగద. అయ్యో! పాపము! సురాజ్ మూర్షిదాబాదును విడిచిపెట్టి వెళ్లెను. ఏలననగా, మీర్జాఫర్ పట్టణమును సమీపించుచున్నాడు. సురాజ్ ఉద్దౌలా ఫకీరువేషము వేసుకొని, భగవన్‌గోలాకు పోవుమార్గమున బడిపోయెను. *

క్లైవు, మీర్జాఫరుల పురప్రవేశము.

పలాసీరంగములో వదలిపెట్టినచ్చిన మనక్లైవు, మీర్జాఫరు లేమిచేయుచున్నారో చూతము: "స్వర్గమునుండి యూడిపడిన సేనాపతి" క్లైవు యుద్ధమైన తరువాత పలాసీలో నిలవలేదు. ఏలననగ, తన శిపాయిలందరు చెల్లాచెదరై దోపిళ్లు సాగింతురేమోయని అతనికి భయమువేసెను. అతిడంతట దాద్‌పురమునకు నడచి, అక్కడ రాత్రి 8 గంటలకు చేరెను. ఆరాత్రి అక్కడగడపెను. మరునాడు జూన్ 24 ఉదయము యిచ్చటనే మీర్జాఫర్ వచ్చి క్లైవు దర్శనము చేసుకొనెను.

[illegible] 23-వ తేదీ సాయంకాలమే మీర్జాఫరువద్దకు వాట్సు, స్క్రాఫ్టనులను ప[illegible]తిరిగి మరునాడు ఉదయము 'ఒమర్ బేగ్' అను వానిపంపెను. అప్పుడు మీ[illegible] తన కొడుకు మీరాన్‌ను వెంటబెట్టుకొని ఒమర్ బేగ్‌తోసహా క్లైవు శిబిరమ[illegible]ను. పాపపు మనస్సాక్షియే నరులను పిరికి పందలను చేయును. ద్రోహియగు మ[illegible] ప్రతిచోట ద్రోహమే వాసన గొట్టెను. అతడు క్లైవు యెదుటికివచ్చుటకు [illegible]. 'ఏమో, యీ క్లైవు తననుకూడ బంధించి ఖైదు చేస్తాడేమో, ఎవర[illegible]' అను భీతి మీర్జాఫరుకు పుట్టెను. ఇతడు క్లైవు శిబిరమునకు సమీపించ[illegible], అక్కడనున్న పారావాళ్లు, యితనిని గౌరవించుటకై యితనిపై [illegible] "ఇదిచూచి మీర్జాఫర్ ఉలిక్కిపడి తెల్లబోయి చూచెను." 'నాపని అ[illegible]ందిరా బాబు' అని అతనిగుండెలు దడదడగొట్టుకొనెను. లోపలికివెళ్లగా [illegible]చి యితనిని కౌగలించుకొని, సలాముచేసి, "మున్నెలల నబాబుగారికి [illegible]" అని జయ ధ్వానము చేసే పర్యంతము యితని గుండెగూడుపట్టలేదు. [illegible] కాంతిరాలేదు (Scraftons reflections Page 90.)

మా ఒడంబడిక భాగమును [illegible] ఖరారుగ నెరవేరుస్తామని క్లైవు మీర్జాఫరుకు ధైర్యముచెప్పెను. తి[illegible] మీరు సురాజ్ ఉద్దౌలాను వెంబడిం

* పార్లమెంటు కమిటీ యెదుట తనసా[illegible] క్లైవు యిట్లు చెప్పెను: "రాత్రి సుమారు 12 గంటలప్పుడు మీర్జాఫర్ యింగ్లీషు సే[illegible] బెట్టుకొని పట్టణములోనికవచ్చెనను పిడుగువంటి వార్త సురాజ్ ఉద్దౌలాకు తెలిసెను. ఇ[illegible], "అంతయు అయినది" అతడు నిరాశాహతుడై కేడకిటికీలలో ఒకదానిగుండ దాటి బ[illegible] [illegible]ందరు ముగ్గురు పరివారముతో మాత్రము తప్పించుకొని పారిపోయెను."—

చండి. నేనును ఇంగ్లీషు సేనను దీసికొని వెనుకవస్తాను. అని క్లైవు అతనికి సలహా చెప్పెను" (First Parliamentary Report-1772 Page 155.)

తనవంతు ఒడంబడికను తానుకూడ తప్పక నెరవేర్చెదనని మీర్జాఫరుకూడ క్లైవుతో చెప్పెను.

మీర్జాఫరు అంతట బయలుదేరి, 25-వ తేదీ ఉదయమునకు మూర్షిదాబాదుచేరెను. క్లైవుకూడ వెనుకబయలుదేరి 26-వ తేదీకి అక్కడకు చేరి సైదాబాదులోనున్న పరానుగిడ్డంగిలో మకాముచేసెను. 29-వ తేదీనగాని క్లైవు మూర్షిదాబాదు నగరములో కాలుపెట్టలేదు. మూర్షిదాబాదు నగరమును గూర్చి క్లైవు యిట్లనుచున్నాడు :—

"మన లండన్ నగరమువలెనే మూర్షిదాబాదునగరముకూడ [illegible] వైశాల్యము, అంతజనసంఖ్య, అంతభాగ్యములతో కూడుకొన్నదే. [illegible] మూర్షిదాబాదులో మన లండన్‌లోకంటె యెక్కువడబ్బు, ఆస్థి, వున్న [illegible] చాల ఎక్కువమందియున్నారు. రెంటికి యింతేతేడా."

మహమ్మదీయ పరిపాలన చాల దుష్టమైనదని, నాశ[illegible]ని. మహమ్మదీయ ప్రభువులు క్రూరులని అనేకమంది యూరోపియన్[illegible] వ్రాయుచుందురు. ఈ మాటలే నిజమైయుంటే, మహమ్మదీయ ప్ర[illegible]ములో దేశమింతటి ఐశ్వర్యములతో తులతూగుచుండుటకు కారణమే[illegible]రేమి?

పార్లమెంటు కమిటీ యెదుట తనసాక్ష్యము[illegible]యిట్లు చెప్పెనట:—

"ఇంగ్లీషుసేన మూర్షిదాబాదు నగరము[illegible] మైళ్ల దూరములో విడిసియుండెను. అప్పుడునేను వాట్సు, వాల్షు అను[illegible] మీర్జాఫర్ వద్దకు పంపించితిని. అతడు జయమొందినందుకు నేనతని, న[illegible]నని చెప్పి నేను పట్టణములో యెప్పుడు ప్రవేశించవచ్చునో కనుగొ[illegible]ని వారికి చెప్పిపంపితిని. ఆప్రకారమే, నాపురప్రవేశమునకు [illegible]యించబడెను. నేనారోజున 200 యూరోపియనులను, 500 మంది [illegible]లను వెంటబెట్టుకొని నగరప్రవేశము గావించితిని. అప్పుడు మమ్ములను [illegible]చ్చిన కొందరు పురజనులు కొన్ని లక్షలుందురు. వారే గనుక అప్పుడు [illegible]యూరోపియనులను చంపతలచుకుంటే వారు కర్రలతో, రాళ్లతో, గొట్టినను [illegible]యెడిది."

క్లైవు చెప్పినట్లు మూ[illegible]బాదు వాస్తవ్యులేగనుక ఆనాడట్లుచేసియుండినచో, భరతఖండచరిత్ర[illegible]ట్లుండెడిదో ఊహించుట నిష్ప్రయోజనము.

క్లైవు మీర్జాఫరుని చేయి పట్టుకొని తక్తు మీద కూర్చుండబెట్టుట!

మీర్జాఫరు ఇంగ్లీషువారిచేతిలో పిండిబొమ్మగద, కాబట్టి, వారందరక్కడుండగ, వారియెదుట తాను సింహాసనముపై కూర్చుంటకు మీర్జాఫర్ మొదట కొంచెము సంకోచించెను. కూర్చుండ ననెను. 1757 సం॥ జూన్ 30-వ తేదీన కలకత్తా కోటలోని సెలెక్టు కమిటీవారికి క్లైవు వ్రాసిన ఉత్తరమందిట్లున్నది :-

"జూన్ 29-వ తేదీ మధ్యాహ్నము నేను అతని కుమారుని వెంట మీర్జాఫర్ వద్దకు వెళ్లితిని. సింహాసనముమీద తానుకూర్చొనని మీర్జాఫర్ అనుటచే, నేనతని చేయిపట్టుకుని తక్తుమీద కూర్చుండ బెట్టి 'నవాబుకు జెయ్' అని ...షు చేసితిని. అక్కడనున్న సభికులు యావన్మంది జయజయధ్వానములుచేసి, ...గాలుగ నడపవలసిన మర్యాదలను నడిపిరి."

...ను చేత చిక్కినపిట్ట నిక రెక్కలు ఊడబెరికి కసుపులు నిండించుకొనవలసిన సమయ... వచ్చినది. పార్లమెంటు కమిటి యెదుట క్లైవు యిట్లని చెప్పెను :—

...బడిక... ...మీచందుకు ...బెట్టుట-ఎఱ్ఱకాగితం.

"...నవాబు ఖజానాలో యే మాత్రము సొమ్ము వున్నదో చూడడానికిని ...లను. మీర్జాఫరు తక్షణమే యెంతవరకు అమలు జరుప వీలున్నదో చూడడానికిని, ఒకరోజు నిర్ణయింపబడెను. స్థితిగతులన్నీ ...గ్రాహ్యమైన తరువాత, దీని పరిష్కారమంతయు ఇద్దరుసేఠు...కు అప్పగించబడినది. వీరిరువురు చాలధనము, పలుకుబడి ...వారు. అనుకున్నదానిలో సగము తక్షణమే యిప్పడిచ్చివేసేట్టును, తక్కినసగ... ...వాయిదాలలో చెల్లించునట్లును యేర్పాటుచేయబడినది. ఈ సభలో ఒమీచందుకు... ...ండెను. అసలు కరారునామా కాగితము చదివి వినిపించేటప్పటి కల్లా-అతనికి... ...గుక అతనికి గలిగిన ఆగ్రహము, రోషము, యింతింతని చెప్పతరము కాదు ... ...ి కరారునామా యిదికాదు. నాకు చూపించింది ఎర్రకరారు నామా" అని ...ండనెను.

"అవునోయి, ఒమీచందు, ...నేమంటావు, యిది తెల్లకరారు నామా ఒయీ?" అని నేనంటిని. *

---

* క్లైవు మిత్రుడగు 'ఆర్మ్' అను ఆంగ్ల ... ...రచన హిందూస్థాన చరిత్ర, రెండవ వాల్యూము, 82-వ పేజీలో యిట్లు వ్రాసెను :—

"సభ ముగిసినది. క్లైవు స్క్రాఫ్టనులు, ఒమీ... ...చెపుకు నడచిరి. తనకు లప్పవచ్చి పడుతుంది గదా యని పాప మా ఒమీచందు లొట్టలువే... ...కూర్చునియుండెను. "ఒమీచంద్ ...భ్రమ తొలగిస్తే బాగుంటుందిక మరి" అని క్లైవు అనెను. ... ప్రక్కనున్న స్క్రాఫ్టన్ హిందూస్థానిభాషలో ఒమీచంద్ కిట్లని చెప్పెను. "... ! ఆ యెర్రకాగితము వట్టి ...టక్కు. నీ కేమిలేదు" అనెను. ఈ మాటలు వినేటప్పటికి ... గంధపుపొగ మొగానికి కొట్టినట్లు అతడు మూర్ఛిల్లి వెనుకకు విరిగి పడిపోయెను. ప్రక... ...వని తాలూకు మనిషి

క్లైవుకు, అతని ముతాకు, మనస్సాక్షియను నది ఒకటి యున్నదనుకుంటే, వారొనర్చిన యీ మోసకార్యమువల్ల వారి మనస్సాక్షికి చీమకుట్టినంత నొప్పియైనను తగులలేదు! ఒమీచందు వీరికి మొదటినుండి చివరవరకు యెంత సహాయము

---

ఒకడు అతనిని చేతులతో పట్టి ఆపకపోయినచో, నేలమీద పడిపోయేవాడే. కొంద రతనిని చేతులమీద మోసుకొని పోయి మేనాసవారిలో పరుండబెట్టి యింటికి తీసికొనిపోయిరి. అత డట్లా మూర్ఛలోనే చాల గంటలసేపు వుండి, క్రమ క్రమముగ పిచ్చియెత్తిన వాని లక్షణముల జూపసాగెను. కొన్నాళ్ళయిన తరువాత అతడులేచి నెమ్మదిగ క్లైవును చూడబోయెను. "ఏదైనా పుణ్యక్షేత్రానికి యాత్రవెళ్లు." అని క్లైవు అతనికి సలహాచెప్పెను. ఒమీచంద్ తక్షణమల్లే 'మాల్దా' వద్దనున్న ఒకానొక మహా పుణ్యక్షేత్ర దర్శనార్థమై పోయె[illegible] అక్కడ కొన్నాళ్లుండెను. కాని, పిచ్చి కుదురలేదు. ఆ పిచ్చితోనే తిరిగి యింటికి వచ్చెను. అంతకంతకు హెచ్చయ్యెను. అతనికి పూర్వముండిన బుద్ధి ప్రతిభయంతయు పోయెను. [illegible] దశకు విరుద్ధముగ అతడు మిక్కిలి విలువగల దుస్తులను, అమూల్యమగు నగలను పెట్టుకొ[illegible] దావస్థలో పడియుండెడివాడు. ఆశాభంగముచే గలిగిన అదురు అతని మెదడుకు తగి[illegible]వాత ఆ ప్రకారము ఏణ్ణర్థము అతడు పిచ్చిలోపడి కొట్టుకొని, ఆఖరుకు చచ్చెను." [illegible] వివర[illegible] యిట్లు వ్రాయుచున్నాడు :—

"ఎర్రకాగితము దొంగకాగితమని ఓమీచంద్‌కు చెప్పినది జగత్ [illegible]లో...... ఒమీచందుకు రోజురోజు పిచ్చి యెక్కువగుటను కనిపెట్టి, ఎక్కడికైనా [illegible] పుణ్యక్షేత్రానికి మాల్దాక్షేత్రానికి - పోవలసినదని తా నతనికి సలహా చెప్పినట్లు [illegible] 1757-వ సం॥ ఆ[illegible] నెలలో వ్రాసిన సంగతులవలన తెలియుచున్నది. తమకు బాధ గలి[illegible] మనుష్యులను పూర్వ ఢిల్లీపాదుషా లిట్లే మక్కా-యాత్రకు పంపించేవారట! కాని, యీ[illegible] పనికి 'మాల్దా' క్షేత్రము పనికిరాదు. ఏలననగ యిది మూర్షిదాబాదుకు చాల దగ్గర[illegible]లదిగాక, 'ఆర్మ్' చెప్పినట్లు అక్కడ గొప్ప దేవాలయమును లేదు. అది గొప్ప పుణ్య[illegible]ము కాదు. బహుశః 'మాల్వా' యనుటకు బదులుగ పొరబాటున 'మాల్దా' యని [illegible]లు వ్రాసిరేమో. ఈ మాల్వా సమీపమున పవిత్రమగు నర్మదానది ప్రవహించుచున్న[illegible] యిది మాల్వారాజ్యమునకు రాజధానియగు '<u>మండూ</u>' నగరమేమో. (కలకత్తా [illegible] 792-వ సం। ఏప్రిల్. పేజీ 341.)

ఇంగ్లీషువారు తనమీద చేసిన ట్రిక్కు[illegible] ఒమీచందుకు పిచ్చియెత్తినమాట నిజమైనచో 1757-వ సం॥ ఆగష్టు 6-వ తేదీ[illegible] సీమడైరెక్టర్ల కిట్లేల వ్రాయును?

"మన వాట్సుతో కలిసి పనిచేసి[illegible] ఒమీచందు ప్రవర్తన చక్కగానే యుండెను. కాని, రామరాను వానికి స్వార్థమెక్కు[illegible]కుట్రబుద్ధిని చాలదూరము పోనిచ్చేటట్టుగ నాకు కనిపించింది. అందుచేత నే నతనిని '[illegible]కు తీర్థయాత్రపొమ్మంటిని. వానిని సరిగ అదుపులో వుంచి పనిచేయించుకుంటే, వాడు[illegible]గాలా పనికి వస్తాడు. కాబట్టి వాణ్ణి పూర్తిగ వదులుకోరాదు." (Long's Elections [illegible] 409)

న్యాయమూర్తి శారదా[illegible]గారు చాల చరిత్ర పరిశోధనలు చేసియున్నారు. వారు 1899-వ సం॥లో సాహిత్య[illegible] అను బెంగాలీ మాసికపత్రికలో ఒక మంచి, చక్కని వ్యాసమును వ్రాసిరి. ఈ వ్యాసమ[illegible]బట్టి తెలియుచున్న దనగ :—1758 సం॥ డిశంబరు 5-వ తేదీన ఒమీచందు చనిపోయె[illegible] పూర్వము కొద్దిరోజుల క్రిందట అతడు అమృతసరక్షేత్రమునకు

చేయవలెనో అంత సహాయము చేసెను. ఇతని తోడ్పాటు లేకుండినచో, వారి కుట్ర యెంతమాత్రము సాగేదికాదు! అట్టి ఉపకారిని వీరు మోసగించిరి.

అయితే యేమి, వీరికీ జన్మలో డబ్బు ప్రోగుచేసుకొనుట తప్ప వేరొండు సంకల్పములేదు. డబ్బేవారికి దేముడు. ఇండియాలోవున్న నవరసుల చెట్టును కద లించి, నవరసులు దులుపుకొని, మూటగట్టుకొని పోవుటకే వాచర్సిటికి వచ్చిరి. సురాజ్ ఉద్దౌలాను కూల ద్రోయుటవల్ల గడ్డిపోచచేయని కడ తరగతి యింగ్లీషు వానికికూడ ఒక్కొక్కనికి మూడేసివేల నవరసుల సంభావన దొరికెను.

## క్లైవుకు మెడల్

ఇట్టి చేష్టలొనర్చిన క్లైవు మహా ఘనుడని అతని దేశస్థులతని నెట్లు గౌరవించిరో చూడుము:—

"(సీమలో) ఇండియా కార్యాలయములో క్లైవునకొక శిలా విగ్రహము వేసిరి. ప్లాసీయుద్ధ జ్ఞాపకార్థముగను, క్లైవు గౌరవార్థముగను, ఒక బిరుదుపతక మును (మెడల్) అచ్చొత్తించిరి. ఈ పతికపు బిళ్ల వర్ణన యిట్లున్నది:—ఈ బిళ్లకు ఒక ప్రక్కను క్లైవు ఒక చేతితో బ్రిటిష్ జెండా పుచ్చుకొనియు, రెండవ చేతితో మూర్జాఫరుపై నబాబుగిరీ ప్రసాదించుచును, నిలువబడి యున్నాడు. ఒకపూర్ణ గోళము, వరికంకి, ఒకపాతచుక్కాని, యివన్నికూడ గుంపుగ చేర్చబడినవి. వరి కంకి—సమృద్ధిని తెలియపరచుచున్నది. అనగ, కలకత్తాలో తమకిదివరకు నష్టమై పోయిన భాగ్యమును తిరిగి సంపాదించు కొన్నందుకిది చిహ్నము. చుక్కాని తమ వర్తకమునకును, వర్తకపు హక్కులకును గలిగిన పురోభివృద్ధిని సూచించుచున్నది. పూర్ణగోళము—యుద్ధములో సంపాదించుకొన్న భూభాగమును తెలియ పరచు చున్నది. వీనికన్నిటికి దిగువ భాగమున" "(a Subah given to Bengal) బంగాళా కివ్వబడిన నబాబుగిరి" అను మాటలు చిత్రింపబడియున్నవి."

"బిళ్లకు రెండవవైపున యిట్లున్నది—విజయదేవత ఏనుగుమీద గూర్చుండి, ఒకచేత జయచిహ్నమును, యింకొకచేత [illegible]వృక్ష పత్రమును పట్టుకొన్నది. దిగువను "ప్లాసీ విజయము, క్లైవు సేనాపతి" "(Victory of Plassey—Clive

---

తీర్థయాత్ర పోదలచి, ఒకవిల్లు (మరణశాసనము) వ్రాసి, తన[illegible]వదాస్థికి 'హజారీమాల్' అను వానిని ధర్మకర్తగ యేర్పాటు చేసెను. ఈ విల్లునుబట్టి ఒమీచం[illegible] - నానక్‌పంథీ - (గురునానక్ శిష్యుడు) అని శారదాచరణ మిత్రగారు తలంచుచున్నారు.

క్లైవు మోసము తెలిసిన తరువాత ఒమీచందుకు పిచ్చియెత్తెనని ఆర్మమున్న గు చరిత్రకారులు వ్రాసినమాట నిజముగాదని పై సంగతులనుబట్టి తెలియుచున్నది.

Commander " అను అక్షరములున్నవి. (Page 262. Services of the First European Regiment; London. Smith, Elder & Co., 65. Cornhill, 1843).

**సురాజ్ ఉద్దౌలా వధ - ఖండిత కళేబరమును ఏనుగుమీద వీధులలో ఊరేగించుట.**

పరాసు ప్రతినిధియగు 'జీన్‌లా' యొక్కయు, అతని క్రిందనున్న సేన యొక్కయు సహాయమును సంపాదించుకొందమను ఊహతో సురాజ్ ఉద్దౌలా మూర్షిదాబాదునుండి వెడలినట్లు తెలియుచున్నది. ఈ పరాసు ఉద్యోగి మేనెల మధ్యమందు మూర్షిదాబాదును విడిచిపెట్టి, జూన్ 3-వ తేదీకి పాట్నాచేరెను. ఇతడిక్కడనుండగ, వాట్సును, తక్కిన యింగ్లీషువారును మూర్షిదాబాదునుండి చెప్పకుండ పారిపోయినట్లు యితనికి జూన్ 22-వ తేదీన తెలిసెను. ఇంగ్లీషువారితో నబాబుకు యుద్ధమొట్లును తప్పదను నిశ్చయముతో యితడు తనకొరకై వేచియుండ వలసినదని సురాజ్‌కు వ్రాసెను. సురాజ్‌ను కలుసుకొందమను తలంపుతో యితడు సత్వరముగ బయలుదేరెను. కాని, దోవలో గాలితుపాను కొట్టుటచే మధ్యనే చిక్కుపడిపోయెను. సురాజ్ ఉద్దౌలాకు ప్లాసీరంగమున ఓటమి గలిగెననియు, అతడిప్పుడు పారిపోయి ఎక్కడనో దాగియుండెననియు, అతనికిప్పుడు తోడ్పడుట దుర్ఘటమనియు, తెలిసికొన్నవాడై యీపరాసునేత యిక చేయునదిలేక తిరిగి పాట్నాకు మరలిపోయెను.

సురాజ్ రాజమహాలులోనుండగ అతని నెవరో కనిపెట్టి, పట్టుకొని మూర్షిదాబాదుకు పంపించిరి. 1757 సం॥ జూన్ 30-వ తేదీన క్లైవు కలకత్తా కమిటీవారికిట్లు వ్రాసెను:—

"........సురాజ్ ఉద్దౌలా దొరికెననియు, అతనినిపట్టి తీసికొని వచ్చుటకు తనకొడుకును పంపితిననియు, నాకిప్పుడే నబాబు (మీర్జాఫరు) నుండి చీటి వచ్చినది."

దురదృష్టవంతుడగు సురాజ్ కొమరుడు జూలై 2-వ తేదీన మూర్షిదాబాదుకు కొనిరాబడెను. ఇతనిని జాగ్రత్తగ బంధించి యుంచవలసినదనిచెప్పి మీర్జాఫర్ తనకొడుకగు మీరాన్ చేతికి అప్పగించెను. ఆ రాత్రియే మహమ్మద్ బేగ్ అనువాడు పశువును వధించినట్లు సురాజ్ ఉద్దౌలాను వధజేసెను. పై యధికారుల ఉత్తరువుచే వీడిట్లుచేసెనని వేరుగ చెప్పనక్కరలేదు. ముక్కలుగ నరుకబడిన సురాజ్ శవమును ఏనుగమీద పెట్టి వీధులలో ఊరేగించిరి.

'రియాజ్-ఉస్-సలాతీన్' అను గ్రంథమును వ్రాసిన ఒకానొక మహమ్మదీయ చరిత్రకారుడిట్లు స్పష్టముగ వ్రాయుచున్నాడు:—

ఇంగ్లీషు ప్రముఖులయొక్కయు, జగత్ సేట్ యొక్కయు ప్రోత్సాహముచే సురాజ్ ఉద్దౌలా హత్యగావింపబడెను.''

క్లైవే ప్రోత్సహించి సురాజ్ ఉద్దౌలాను చంపించెననుటకు సందేహమేమియులేను. తన బంగాళాదేశపు చరిత్ర చివరిపుట దిగువభాగమున 'స్టీవార్టు' యిట్లు వ్రాయుచున్నాడు:—

"సురాజ్ ఉద్దౌలా వధలో క్లైవు కేమియు జోక్యమున్నట్లు దేశీయచరిత్రకారులెవరును చెప్పుటలేదు............సురాజ్‌ను పట్టుకొన్న సంగతియే—అతడు వధింపబడువరకు—క్లైవుకు యెవరును తెలియనీయలేదట.''

ఈ పైమాటలలో యెంతమాత్రము సత్యములేదు. మీర్జాఫరుకు "క్లైవుగాని గాడిద'' యని దర్బారులోని విదూషకుడొకడు ఎగతాళి పేరుపెట్టినట్లు యీ యాంగ్లచరిత్రకారుడు స్టీవార్టే చెప్పుచున్నాడు. ఈపేరతనికి చచ్చేవరకు వున్నదట. ఇట్టి 'గాడిద' తన యజమానియగు క్లైవు సలహాలేనిది యేపనిచేయుటకు ధైర్యము చేసేదికాదు. సురాజ్ ఉద్దౌలా పట్టుబడిన సంగతి అతడు క్లైవుకు తక్షణమే తెలిపెను. ఈవార్తను క్లైవు ఆరాత్రికి రాత్రియే—(1757 సం॥ జూన్ 30-వ తేది రాత్రి చాల ప్రొద్దుపోయినతర్వాత)—కలకత్తాకు పరుగెత్తించెను. కాబట్టి "సురాజ్ పట్టుబడిన సంగతి క్లైవుకు యెవరు చెప్పలేద''ను మాట నిజముకాదు. *

---

* 1757 సం: జూలై 2-వ తేదీన క్లైవే కలకత్తా కమిటీవారికని, మరియిద్దరు నౌకాదళాధిపతులకును యిట్లు వ్రాసెను:—

"సురాజ్ ఉద్దౌలాను యీ సాయంకాల మిక్కడికి తెత్తురు. నబాబ్ (మీర్జాఫర్) దయార్ద్రహృదయుడు, ఉదారుడు; నిష్కపటి. కాబట్టి, యితడు సురాజ్‌ను చెరసాలలో మాత్రముంచ దలచుచున్నాడు. చెరసాలలో వీలైనన్ని సౌకర్యములనొసంగ దలచుచున్నాడు.''

కాబట్టి, సురాజ్‌ను ఖైదీగపట్టుకొని మూర్షిదాబాదుకు తీసుకొనివచ్చిన సంగతి తనకేమియు తెలియదని క్లైవు పార్లమెంటు కమిటీ యెదుట చెప్పినమాట శుద్ధ అబద్ధమన్నమాట.

మహాభయంకరమగు యీవధనుగూర్చి క్లైవు యెంతటి నిశ్చింతతో, కలకత్తా కమిటీవారికి తెలిపెనో—ఆమాటలు వింటేచాలు—యితనికా వధయందు తప్పక జోక్యమున్నట్లు ఎవరికైనా తోచితీరును. జూలై 4-వ తేదీన ఆతడు కమిటీవారికి వ్రాసిన మాటలివి:—

"అయ్యా, సురాజ్ ఉద్దౌలా పనితీరిపోయింది. నబాబు (మీర్జాఫర్) యితనిని చంపకుండ వదలిపెట్టేవాడేకాని, యితనిని చంపితేనేగాని వీలులేదు. యితడుంటే దేశశాంతి నిలువదు'' అని మీర్జాఫర్ కొడుకు మిరానును, యితర పెద్దమనుష్యులును తలచిరి. ఏలననగ, యితడు పట్టణమును సమీపించగనే జమేదారులందరును తిరుగుబాటు చేసేటట్టుగ కనుపించినారు.'' క్లైవు యీ "పెద్దమనుష్యులలో వాడుకాడా ?

"రియాసత్-ఉస్-సలాతీన్" గ్రంథమునుండి పైన ఉదహరించిన వాక్యములనుబట్టి చూడగ, సురాజ్ వధలో యూరోపియనులకు జోక్యమున్నట్లు ఆనాటి మూర్షిదాబాదు నగరవాస్తవ్యులు అనుమానపడినట్లు తెలియుచున్నది. ఈ ద్రోహకార్యమును ముప్పాతిక మువ్వీసము క్లైవే చేయించెనని చెప్పవచ్చును.

సురాజ్ ఉద్దౌలా వధయయిన తరువాత క్లైవు మీర్జాఫర్ యెడలను అతని కుమారుడు మీరాన్ యెడలను నడపిన ప్రవర్తననుబట్టి యీ అనుమానము మరింత దృఢపడుచున్నది. పార్లమెంటు కమిటీయెదుట క్లైవిట్లు సాక్ష్యమిచ్చెను:—

సురాజ్ ఉద్దౌలాకు పట్టిన గతినిగూర్చి క్లైవు యిట్లుచెప్పెను:—"సురాజ్ ఉద్దౌలా పారిపోయి యెక్కడనో ఒకానొక ఫకీరు యింట్లో దాగుకొన్నట్లు నాకు కబురువచ్చెను......అతనిని అక్కడ పట్టుకొని, పట్టణమునకు తీసికొనివచ్చి, మీర్జాఫర్ కొడుకు మీరాన్ తక్షణమే చంపివేసెనట. తండ్రికి చెప్పకుండ అతడీపని చేసెనట. మరునాడు నబాబు (మీర్జాఫర్) వచ్చి చెప్పేవరకు నాకీ సంగతి తెలియదు. సురాజ్ ఉద్దౌలా తన సేనలో కల్లోలము పుట్టించెననియు, కాబట్టి (అతనిని చంపినందుకు) క్షమించవలసినదనియు మీర్జాఫర్ నాతో సమాధానము చెప్పుకొనెను. ఇంతకు మిక్కిలి నాకేమియు తెలియదు."

ఇవన్నియు క్లైవు సిగ్గు ఎగ్గు విడిచిచెప్పిన శుద్ధ దొంగమాటలని వేరుగ చెప్పనక్కరలేదుగద. సురాజ్ ఉద్దౌలాను యెప్పుడు పట్టుకొన్నది యితనికి తెలియును. ఇందు కితడు కలకత్తా కమిటీవారికి వ్రాసిన ఉత్తరమే సాక్షి. ఈ వుత్తరములోని వాక్యములను పైన ఉదహరించియే యుంటిమి. తన గాడిదయని ప్రఖ్యాతిగాంచిన మీర్జాఫర్ సురాజ్ ఉద్దౌలాను ఎప్పుడు పట్టుకొని తీసుకవచ్చినాడో తనకు తెలియదంటే ఎవడు నమ్ముతాడు? క్లైవు యిషారాగాని, అనుమతిగాని, లేనిది సురాజ్ ఉద్దౌలాను చంపునంతటి ఘోరకార్యమును మీర్జాఫరుగాని, అతని యనుచరులింకెవరుగాని చేయ సాహసించిరన్నచో, బుద్ధివున్నవాడు యెవడును నమ్మడు. అదిగాక, మీర్జాఫరుయొక్కయు, అతని కుటుంబము వారియొక్కయు గతు

---

1757 సం॥ జూలై 2-వ తేదీన క్లైవు మద్రాసు కమిటీవారికి మూర్షిదాబాదునుండి వ్రాసిన ఉత్తరములో చివర యిట్లున్నది:—

"రెండవతేదీ రాత్రి సురాజ్ ఉద్దౌలా పట్టణములోనికి వచ్చెను. అతడు వెంటనే సాగనంపబడెను. ఏలననగ, వస్తూ దోవలో జమేదారుల కతడుకొన్ని ఉత్తరములవ్రాసి, సేనలో గల్లంతు పుట్టించసాగెను."

సురాజ్ వధనుగూర్చి క్లైవు యేవుత్తరములోగాని కించిత్తు విచారమునుగాని, అనుతాపమునుగాని, కనబరచలేదు. ఈ సంగతులన్నిటిని కలియవేసిచూడగ, సురాజ్ వధలో క్లైవుకు జోక్యమున్నట్లు అనుమానము తప్పక ధ్రువపడితీరును.

లన్నియు క్లైవుచేతిలో గద వున్నది. ఇట్టిస్థితిలో అతనికి తెలియకుండ వీ రింతటిపని చేస్తారా? *

సురాజ్ ఉద్దాలాను క్లైవు చంపించలేదని వాద సౌకర్యమునకు ఒప్పుకొందము. అయితే, యిట్టి ఘోరహత్య నతడు ఎందుకు ఖండించలేదు? ఈ దారుణ కృత్యమొనర్చినవారి నతడెందుకు శిక్షించలేదు? "కలకత్తా చీకటికొట్టు" దురంత మనబడుదానికి సురాజ్ ఉద్దాలాయే కారకుడనియు, దాని కాతడే జబాబుదారీ యనియు యింగ్లీషువారు పాప మతనిని నిరంతరము నిందించుచుందురు గద. అయితే, సురాజ్ ఉద్దాలా నిట్లు ఘోరముగ వధించిన వారి నేల యింగ్లీషువారు నిందించరు? ఇది ఘోరకార్యమని నోరువిప్పి ఒక్కమాట అన్న పాపమున యే యాంగ్లేయుడైనను పోయినాడా?

సురాజ్ ఉద్దాలా మంచి చురుకైన పడుచు కుర్రవాడు. ఇంగ్లీషు చరిత్రకారు లేమైన నందురుగాక, అతడు మిక్కిలి సమర్థుడు. కాబట్టి, యిట్టివానిని బ్రతుకనిస్తే లాభములేదని ఇంగ్లీషువా రనుకొనిరి. ఎప్పటికైనా యితడు తమ్ముని తిరిగి తిప్పలు పెడతాడని వారి భయము. అందుకని, "వీణ్ణి చంపివేస్తేనేకాని తమకు శాంతిలేద"ని ఇంగ్లీషువా రనుకొని, యీపని చేయించిరి.

## సురాజ్ ! హో, నీవే ధన్యుడవు!

వధింపబడిననాటికి సురాజ్ ఉద్దాలాకు వడసారము 25-వ సం॥ల కంటె యెక్కువ వయస్సులేదు. మొత్తమంతా 15 నెలలకంటె యిత డెక్కువ కాలము రాజ్యము చేయలేదు. ఇంగ్లీషు చరిత్రకారులు, స్వార్థచింతలతో, యితనంత దుర్మార్గుడు ప్రపంచములో లేడని యెక్కడలేని దుర్మార్గములను యితనికే తీసికొనివచ్చి అంటగట్టిరి. ఇతనిలో ఒక్కమంచి గుణముకూడ లేదనిరి. సురాజ్ ప్రయివేటునడవడిక చెడ్డదై యుంటే యుండవచ్చును గాక. అయితే ఆ రోజులలో, యెంతమంది యింగ్లీషువారి నడత నిష్కలంకమై యున్నది? వారిలో యెంతమంది పత్తిత్తులున్నారు? ఇతని ప్రతికక్షి 'స్వర్గమునుండి జారిపడిన సేనాపతి' క్లైవుమాట యేమి? ఇతడు నైతికముగ కుళ్లి పురుగులు కారినవాడు కాడా? ఇంగ్లీషువారు సురాజ్ మీద యింతిం తనరాని ద్రోహబుద్ధితో ప్రవర్తించిరి. వారిందుకు చెప్పునదే సాకు యేమి? "అప్పటి అవసరాన్ని బట్టి అల్లా చెయ్యవలసి వచ్చిందట." వారిలో ఒక ఆంగ్లేయు డిట్లు వ్రాయుచున్నాడు:—

---

* ఆ రోజులలో మూర్షిదాబాదులోవుండే పెద్దలందరు క్లైవే సర్వం సహాధికారియనియు సర్వనియంతయనియు, మనుష్యుల ప్రాణముల తీయుటకుగాని, నిలుపుటకుగాని, ఆతడే కర్తయనియు, భావించుచుండిరి. (Wheeler's Early Records of British India Page 261)

"అవసరమనేది - కక్కుర్తి అనేది - రాచకీయ విషయాల్లో మిగతా ప్రమాణాలను, ఒడంబడికలను, అన్నింటినితీసి దూరముగ తుంగలో తొక్కుతుంది. ఈ కక్కుర్తియే కంపెనీవారు నబాబుతో ఒడంబడిక చేసుకొన్న మూడు నెలలకే వచ్చి 'యీ నబాబును తొలగించి, యింకొక నబాబును పెట్టుకోవలసినద'ని చెప్పి యాశ్వరాశీర్వాద పూర్వకముగ ఉపదేశించి పోయినది." (Bolts Considerations Page 40.)

తమ దొంగ ప్రవర్తననంతను యింగ్లీషువారిట్లు యేవో కబుర్లుచెప్పి సమర్థించుకొనగలిగిన యెడల, యిక నబాబుమాత్ర మేల సమర్థించుకొనరాదు? నబాబు ఫ్రెంచివారితో చేరి కుట్ర పన్నుచున్నాడన్న నేరమునకు యింతకంటె మంచి మిషలు సురాజ్ ఉద్దౌలాకు లేకుండెనా?

కలకత్తా చీకటికొట్టు నిజమని ఒప్పుకొన్నను, నిష్పక్షపాతియగు చరిత్రకారు డెవడును యిందుకు సురాజ్ ఉద్దౌలాను నిందింపజాలడు.

నీతీ జాతీలేని వాళ్లతో నబాబు వేగవలసి వచ్చెను. మరియు తన ఉద్యోగులలో యింగ్లీషువారు లేవదీసిన ద్రోహులతో ఆతడు వేగవలసి వచ్చెను. ద్రోహబుద్ధితో వర్తించు నౌకర్లను పెట్టుకొని, సురాజ్ ఉద్దౌలా తన శత్రులనెట్లు యెదిరించి జయించగలడు?

తమ వర్తక లాభమునకై బెంగాలులో విప్లవము పుట్టించవలసినదని చెప్పి క్లైవు మున్నగువారికి మొట్టమొదటనే మద్రాసు కౌన్సిలువారు చెప్పి పంపిరిగద. యస్. సి. హిల్లు యిట్లు వ్రాయుచున్నాడు:—

"కాబట్టి, యిట్టి సందర్భములో బెంగాలులోని సెలెక్టు కమిటీవారి ప్రవర్తన నిజముగ న్యాయముగను స్వార్థరహితముగను నున్నదా యని యింగ్లండులోని ప్రజలు శంకించుటలో అసహజమేమియు లేదు. నబాబును పడద్రోసేయెడల తమ సొంతమునకు చాల లాభంవస్తుందనే ఆశచేతనే కంపెనీనౌకర్లు నబాబుయెడ అట్లు ప్రవర్తించుటకు కొంతవరకు కారణము కాలేదాయని కూడ యింగ్లీషుప్రజ లనుగుటలో వింతయేమియు లేదు." (Bengal Records Vol. I Page CCXI)

సురాజ్ఉద్దౌలా మంచిధనాఢ్యుడగు నబాబని ప్రతీతి. ఇతని భాండారమెప్పుడును కొల్లలుగ నిండియుండుటయేగాక, పొంగిపొరలుచుండెను.......... ఇట్టిధనాగారముపై క్లైవు మున్నగువారికండ్లు పడెను. దీని నెట్లయిన దోచుకొందమను దురాశ క్లైవు మొదలైన వారికి పుట్టెను. వీరు సురాజ్ఉద్దౌలా యెడ యిట్టి కుట్ర పన్నుటకు యిదే కారణము. కాకపోతే, యిందుకు వేరే కారణముగన్పట్టదు. ఆంగ్ల చరిత్రకారు లెల్లరిలోనికి సురాజ్ యెడ న్యాయముగ వ్రాసినవాడు బహుశః కర్నల్ మాలెసన్ ఒక్కడే కనబడుచున్నాడు. ఆతడిట్లు వ్రాసెను:—

"సురాజ్ ఉద్దాలాలో యెన్నితప్పులున్నా, ఆతడుమాత్రము తనదేశమును అమ్ముకొనలేదు. ఇంతకంటె విశేషమింకొకటి యున్నది. ఫిబ్రవరి 9-వ తేదీకిని, జూన్ 23-వ తేదీకిని మధ్య జరిగిన కథనంతను నిష్పక్షపాతబుద్ధితో పరిశీలించి తీర్పుచెప్పు యే ఆంగ్లేయుడు గాని గౌరవ ప్రవర్తనలో క్లైవు పేరుకంటె సురాజ్ ఉద్దాలా పేరే పైచేయిగనున్నదని చెప్పకతప్పదు. విషాదభరితమగు యీ నాటక రంగములో ద్రోహ చింతతో ప్రవర్తింపనిపాత్ర ఒక్కడేగలడు. అతడే సురాజ్ ఉద్దాలా." (**Decisive Battles of India Page 71.**)

సురాజ్ మహారాజ్!—నీవు రాజ్యమును, ప్రాణమును పోగొట్టుకొంటివి—కాని, అమరకీర్తిని సంపాదించుకొంటివి—హో, నీవేధన్యుడవు.



# బ్రిటిష్ మహాయుగము

## మూడవ అధ్యాయము



### మీర్జాఫర్—అతని పరిపాలన

ప్లాసీయుద్ధము ద్రోహకార్యమునకై జరిగినది. ఇందు ఇంగ్లీషువారు తమ సైన్య బలమును దుర్వినియోగ పరచిరి. బంగాళమును జయించుదమను తలంపుతో వారీ యుద్ధములోనికి దిగలేదనుమాట స్పష్టమే. తమ వర్తకమునకు అనుకూలమగు రీతిని, దేశములో విప్లవము పుట్టించు తలంపుతోనే వారీపనికి పూనుకొనిరి. క్లైవు మూర్షిదాబాదును ప్రవేశించినప్పుడు యుద్ధమందు జయలక్ష్మిని గైకొన్న వీరునివలె ఆతడు నగరములో ప్రవేశించలేదు. అతనికి భయముపుట్టెను. నగర వాస్తవ్యులెల్లరు శాంతించువరకు అతడు పురబహిః ప్రదేశమందు వేచియుండవలసివచ్చెను.

మీర్జాఫర్ అవివేక పాలన - విలాయితీల అండ.

కాబట్టి క్లైవును విజేతగ భావించుటకు వీలులేదు. తాను వీరుడనని ఆతడు సయితమెన్నడు తలంచుకొనలేదు. దేశ ప్రజలితనిని మిత్రునిగ భావించి, యెట్టి యాటంకము గల్పింపకుండ వీనిని పట్టణములో ప్రవేశించనిచ్చిరి గాని, శత్రువుగ వారెన్నడితనిని యెంచుకొనలేదు. ఇతని దురుద్దేశ్యములను వారు యేమాత్రమైన గ్రహించియున్నచో - ఇతడును, యితనిముఠా ఇంగ్లీషువారును, దేశ ప్రజలస్వాతంత్ర్యమును, ధనధాన్య సంపదలను, హరింపు తలంపుతోనున్నారని ప్రజ లేమాత్రమైనను గ్రహించి యున్నచో-వారతనికిచ్చు ఆతిథ్యము వేరుగనుండెడిది. భరతఖండ ప్రజలు అమాయికులు. కాబట్టి మహామాయికులగు యీ పాశ్చాత్యుల ముందర వారు పనికిరాకపోయిరి. ఆంగ్లవర్తకులు చెప్పు తియ్యని, కల్లబొల్లిమాటలనువిని ప్రజలు భ్రమపడుటకు కాలము త్వరితగతిని ఆసన్నమగుచుండెను. ఇంగ్లీషువారి నిజస్వభావము వారినెంతయో నమ్ముకొన్న, మీర్జాఫరుకే బాగుగ తెలిసివచ్చెను. తాను వీరి మాయలలో ఏలపడితినిరాయని మీర్జాఫరే కొంతకాలమునకు నోరేనోరే కొట్టుకొని యేడ్చెను. అమాయికపు ఈగ తనచుట్టు అల్లబడిన సాలెగూటిలో కూలినట్లు తానీ టక్కులమారి ఇంగ్లీషువారి మాయలలో ఆనాడేలపడితినిరా యని ఆతడా దుర్దినమును నిందించుకొనుచుండెను.

ద్రోహులెల్లపుడును రోతగొట్టువారే. వారికి నీతిబలముండదనుమాట స్పష్టమే. మేధాసంపత్తియు, తెలివితేటలుకూడ ఆట్టేవుండవు. కాబట్టి, వీరినెప్పుడు

గాని గొప్పరాజకీయవేత్తలని చెప్ప వీలుండదు. వారికి చస్తే మహోన్నతభావము లుండవు. నీచాతినీచమైన ఉదరంభరిత్వముచే ప్రేరితులై, యెటువంటి ఛండాలపు పనులు చేయమంటే, అటువంటి ఛండాలపు పనులు చేయడానికి వారుసిద్ధమౌతారు. ఇటువంటిమనిషి మీర్జాఫర్. కాబట్టి యితడు రాజ్యపాలకుడుగ శుద్ధదండుగయని యనిపించుకొనెను. రాజ్యపాలకునకుండవలసిన తరిఫీతు, సాధన యితనికి మొదటి నుండియు యెంతమాత్రము లేకుండెను.

రాజ్యయంత్రము నెట్లుపట్టుకొని నడిపింపవలెనో యితడెరుగడు. ఈ యంత్ర మునకు యేవైపున యేచక్రములున్నవో, యేకూసములున్నవో, యేకమానులున్న వో, యెటు త్రిప్పితే యీ యంత్రము మెత్తగ, నిరపాయముగ నడుస్తుందో, యితనికి చాలుమూల తెలియదు. యంత్రములోనుండు ఘర్షణను, కిటకిటలను తొలగించి, దానిని మెత్తగ నడిపించుటకు యే చక్రమునకు యే యిరుసుకు చమురు వేయవలెనో, యెక్కడ తారువేయవలెనో యితడెరుగడు.

ఆలివర్దీఖాన్ బంగాళ తక్తుకు అక్రమముగనే వచ్చెను. అయితే అతడు యితరుల సహాయముచేత-నీతిజాతిలేని విలాయితీ బచ్చులతోచేరి కుట్రపన్నుటచేత-ఈ రాజ్యమునకురాలేదు. కాబట్టి, ప్రజల మంచితనముచేతనే, తాను ప్రజలశ్రేయ మును పెంపొందించుటచేతనే, తనరాజ్యము సుస్థిరముగ నిలుచునని ఆతడు గుర్తిం చెను. జాతిమతభేదముల జూడక, సమర్థులగువారిని, నిష్పక్షపాతబుద్ధితోతగు గౌరవస్థానములకు, అధికారస్థానములకు నియమించుటవల్లనే తనరాజ్యము సుస్థిర మగునని ఆతడెరింగెను. కాబట్టి, తనరాజ్యములోనున్న దాదాపు అన్ని ఉన్నత అధికారస్థానములకు ఆతడు హిందువులను నియమించెను. ఏలననగ, తనరాజ్యము లో పన్నులిచ్చువారిలో హిందువులే అధిక సంఖ్యాకులు. అదిగాక, ఆయుద్యోగ ముల నిర్వహించుటకు హిందువులే తగిన సామర్థ్యముగలవారు.

ఆలివర్దీఖాను చేసినట్లే అతని మనమడు సురాజ్ ఉద్దాలాయు చేసెను. అతని రాజ్యకాలము, దురదృష్టవశాత్తు, 15 మాసములకంటె యెక్కువకాలముండ లేదు. ఈ కొలదికాలము సైతము తనచుట్టు అల్లబడుచున్న కుట్రలను ఉరిత్రాళ్లను భేదించుకొనుటతోనే అతనికి సరిపోయినది. తుదకీ యురిత్రాళ్లలోనే ఆతడు చిక్కు కొని, పాపము—అసువుల బాయవలసినవాడాయెను. కాబట్టి, యీతని పరిపాలనా విధానములోని మంచిచెడ్డలను విమర్శించుటకీ స్వల్పకాలము చాలదు.

అయితే, మీర్జాఫర్ యీపద్ధతిని తలక్రిందులుగ మార్ప యత్నించెను. హిందువులను తీసివేసి, వారిస్థానే తన మతస్థుల నెక్కింపసాగెను. ఈ పద్ధతి ప్రజ లను తనయెడకు ఆకర్షించునదిగలేదు. అయితేయేమి ? ప్రజల సానుభూతితో తనకు లెక్కయేమియను అహంభావముతో మీర్జాఫర్ ఉండెను.

"తన్ను రక్షించుటకు యింగ్లీషువారు ఉన్నారుగదా" యని యితడు మురియుచుండెను. అయితే, యీ విలాయతీ బచ్చులకు నీతి జాతిలేదు. వీరితనిని తమకు—తమస్వార్థమును సాధించుకొనుటకు—ఉపకరణముగ ఉపయోగించుకొనిరే గాని, యితని మేలును కించిత్తయినను చూడలేదు. ఏరుదాటిన తరువాత తెప్ప తగులవేసినట్లు వారితనిని తమపని తీరగనే తన్నివేసిరి.

మీర్జాఫరు మొట్టమొదటగ ఉద్యోగము ఊడబెరికినది బీహారు రాష్ట్రమునకు గవర్నరుగనుండిన రామనారాయణయను వానిది. ఇతడు అలీవర్దీఖానుకు మిత్రకోటిలోనివాడు. ఇతడు ఆతనివంశీయులయెడ భక్తివిశ్వాసములతోడనే యుండెను. సురాజ్ ఉద్దౌలాపై కుట్రపన్నిన గూడుపుఠానీలో యితడులేడు. మీర్జాఫర్ బావమరిదికిని, సోదరునకును, యితడనిన పడకుండెను. కుట్రదారులలో ఒకడగు రాయ్‌దుర్లాబ్‌కు యీ సంగతి తెలుసును. అందుచే, అతడితనిని యీకుట్రలోనికి పిలువదలచుకొనలేదు. పరాసు నేత జీన్‌లా మూర్షిదాబాదునుండి వెడలగొట్టబడినప్పుడు, యితడు ముందుకు సురాజ్‌కు పనికి వస్తాడను ఉద్దేశముతో యీ రామనారాయణుడతనికి తన పాట్నానగరములో ఆతిథ్యమిచ్చి తనవద్దనుంచుకొనెను. ఇంగ్లీషువారికిని సురాజ్ ఉద్దౌలాకును యుద్ధము ప్రారంభమైనవార్త తెలియగనే, యీ 'జీన్‌లా' సురాజ్‌కు సహాయముచేయు తలంపుతో బయలుదేరెను గాని మధ్యత్రోవలో గాలివాన వచ్చుటచే సకాలమున కతడు యుద్ధరంగమునకు చేరలేక పోయెను. సురాజ్ యుద్ధరంగములో ఓడిపోయి, శత్రువుచేతచిక్కి, క్లైవు ముతా ప్రేరణచే వధింపబడెను. అందుచే, జీన్‌లా చేయునదిలేక తిరిగి పాట్నాకు పోవలసిన వాడాయెను. (ఈ కథనంతను వెనుకటి అధ్యాయములో చెప్పియుంటిమి).

*బీహారు గవర్నరుతో తగవు.*

ఇట్టిపనిచేసిన పరాసు నేతను (జీన్‌లాను) వదలిపెట్టుట తమకు క్షేమము కాదని యింగ్లీషువారు తలచిరి. ఏలననగ అతడే సమయమునో కనిపెట్టి, యే దేశపు ప్రభువుతోనో యేకమై, యింగ్లీషువారిని హతమార్చి, తన పరాసులపేరును, వర్తకమును, పైకి తెచ్చుకొనునేమో యను భయము యింగ్లీషువారికి గలుగుట సహజముగద. కాబట్టి, యితనిని, యితని ముఠాను పట్టుకొనుటకై క్లైవు ఒక దండయాత్ర బయలుదేరదీసెను. 230 యూరోపియను సైనికులు, నూరేసి శిపాయిలుగల మూడు సైన్యదళములు, 50 లాస్కర్లు, రెండు ఫిరంగులు,—యీ అట్టహాసముతో 'మేజర్‌కూట్' అను వానినిచ్చి జీన్‌లా ముఠాను పట్టుకొనుటకై బీహారు రాష్ట్రములోనికి క్లైవొక దండయాత్రను 1757 సం॥ జూలై 6–వ తేదీన మూర్షిదాబాదు నుంచి బయలుదేర దీయించెను. ఈ సైన్యమునకు కావలసిన తిను బండారపు సామాగ్రి, మందుగుండు సామాను, బండ్లు, మూటలు ముల్లెలు, అంతా 40 పడవలలో బయలుదేరెను.

బీహారు రాష్ట్రములోనికి పోవుచున్న యీ యింగ్లీషుదండు తనకు మంచి వాటముగనున్నదని బుద్ధిహీనుడు మీర్జాఫర్ సంబరపడెను. ఏలననగ, తన విరోధి యగు బీహార్ గవర్నరు రామనారాయణుడు దీనివల్ల నాశనమై పోతాడుగదా యని యితడు లోలోన సంబరపడుచుండెను. ఈ దురుద్దేశమును మనస్సులో పెట్టుకొని, మీర్జాఫరును, అతని ముతావారును యీ హిందూ గవర్నరుపై లేని పోని అపనిందల ప్రచురించి, ప్రచారము చేయసాగిరి. రామనారాయణుడు మీర్జాఫర్ అధికారమును త్రోసివేయుటకై అయోధ్య వజీరుతో చేరి కుట్రపన్నుచున్నాడను వదంతిని పుట్టించిరి. అందుచేతనే అతడు పరాసువారికి తన రాష్ట్రముగుండ త్రోవయిచ్చి. నిర్భయముగ అయోధ్య రాష్ట్రములోనికి పోనిచ్చెనని వారు చెప్ప సాగిరి.

కూటుసేనాని పాట్నా చేరునప్పటికే పరాసువారి ముతా బీహారు రాష్ట్రము దాటిపోయెను. ఇతడు పాట్నాకు ఏడుమైళ్ల దూరమందుండగ, జులై 25-వ తేదీన రామనారాయణుడు డొక ఉత్తరమును వ్రాసెను. "ఫ్రెంచి ముఠా తప్పించుకొని పోయినందుకు క్షమించవలసినది. మీర్జాఫరునుండి సకాలములో నాకు కబురు రాక పోవడమువల్ల యిట్లు జరిగినది" అని రామనారాయణుడు తెలిపెను. (Orme Vol. III 190 Madras Edition)

ఇదిగాక, అతడు తన ప్రధానోద్యోగులలో కొందరిని మేజర్ కూటువద్దకు పంపించి, వారిచే యిట్లు చెప్పించెను.

"పాట్నాకు ఆగ్నేయమూలగ 30 మైళ్ల దూరములోనున్న జిల్లాలకధిపతు లగు, మాయి, సాదర్ అనువారలు తిరుగుబాటుచేయగ వారి నణచుటకై వెళ్లి రామనారాయణుడు రెండు రోజుల క్రిందటనే యింటికి (పాట్నాకు) వచ్చెను. ఇంటికివచ్చిన తక్షణమే మీర్జాఫరును బెంగాల్ బీహార్ రాష్ట్రములకు నబాబుగ ప్రకటించెను. 'జీన్‌లా' మున్నగు పరాసువారిని వెంబడించి పట్టుకొనుటకై 2000 అశ్వబలమును కాల్బలమును పంపించెను. మిగతా వారిసైన్యమునుతీసి పారవేసెను." (Orme Vol. II Page 191.)

రామనారాయణుడు చెప్పిన పైవాక్యములు బూటకములని తలంచుటకు కారణము లేదు. అయినప్పటికి, మీర్జాఫర్ తరఫు స్వార్థపరులు కొందరు రామ నారాయణునిపై కూటుతో యీ దిగువ ప్రకారముగ చాడీలు చెప్పిరి.

"రామనారాయణుడు నిజముగ తలుచుకుంటే, పరాసుముఠా పారిపోయె డిదా? సురాజ్ ఉద్దౌలా చనిపోగానే, తాను బెంగాల్ నబాబు అధికారమును త్రోసివేయవలెనను తలంపుతో ప్రక్కనున్న అయోధ్య వజీరు కితడు సహాయము నిమిత్తము కబురు పంపెంచెను. అయోధ్యలోనికి వచ్చుచున్న పరాసుముఠాను

అక్కడ కాపాడవలసినదనియు, అవసరము వచ్చినప్పుడు తాను వారిని పిలిపించు కొందుననియుకూడ యితఁడు అయోధ్య వజీరునుకోరెను. ఇందుకు అయోధ్య వజీరు సమ్మతించెను. కాని, యింటివద్ద కొన్ని యిబ్బందులచే ఆతడు తక్షణమే తన సేనతో బీహారులోనికి రాలేకపోయెను. అదిగాక, తన రాజ్యములోనికి వచ్చుచున్న మీ యింగ్లీషు దండును నాశనముచేయుట యెట్లాయని కూడ యితడు తన ఆంత రంగికులతో చేరి ఆలోచించుచున్నాడు.",

ఈ మాటలు వినగానే తాను తప్పక అయోధ్యరాష్ట్రములోనికి దండుతో పోవలెనని కూటు నిశ్చయించుకొనెను." (Orme's Vol. II Page 191—192)

ఈ చాడీలన్ని నిరాధారమైనవని వేరుగచెప్ప నక్కరలేదు. ఇవన్నియు రామనారాయణునికిగల బీహారురాష్ట్ర గవర్నరుపదవి నూడగొట్టుటకై అల్లబడిన కథలుగాని వేరొండుకాదు. ఇందు కనుకూలముగ ఆగష్టు 12-వ తేదీన క్లైవునుండి కూటుకొక ఉత్తరము వచ్చెను. "నీవు పాట్నాకు తిరిగివచ్చి, మీర్జాఫర్ తమ్ముడు మహమ్మద్ ఆమీఖాను మద్దతుతో బీహార్ రాష్ట్ర గవర్నర్ పదవిని రామనారా యణునుండి యూడలాగికొనుము. ఇది మీర్జాఫర్ సంకల్పము." (Orme Vol. II Page 193.)

కూటు పాట్నాకు మరలివచ్చెను. కాని, గవర్నర్ పదవిని రామనారాయణు నుండి లాగికొనుటకు తగినంతసైన్య మతనియొద్ద అప్పుడులేకుండెను. తనపై పన్న బడుచున్న కుట్రయంతయు రామనారాయణున కెట్లో తెలిసెను. ఇతడు లోకజ్ఞానము గలవాడు. అందుచే, తిరుగబడి పోరాడుటకంటె, కూటు, మీర్జాఫర్ వగైరాలను శాంతవాక్యములతో సమాధానపరచుట మంచిదని ఆతడు తలంచెను. తదను గుణముగ అందరిని తనమేడలోనికి రావలసినదని చెప్పి, అక్కడ ఒక సభనేర్పాటు చేసెను. తనపైచెప్పబడిన చాడీలన్నియు అబద్ధమని రామనారాయణు డాసభలో నందరికి ప్రమాణపూర్తిగ చెప్పెను.

"తనపైమోపబడిన నేరములు నిరాధారమైనవని ఋజువుపరచుటకు రామ నారాయణుడు తనకు అయోధ్యవజీరునుండి వచ్చిన ఉత్తరము నొకదానిని చూపిం చెను. నేను వెనుకటి నబాబగు సురాజ్ఉద్దాలాయెడ అభిమానముతోనుండిన మాటవాస్తవమే. ఏలననగ, నాకీసంపద యంతయు వారి వంశీకుల అనుగ్రహము చేతనే లభించియుండెను. కాని, యిప్పుడు, సురాజ్ఉద్దాలా ప్రభువులేడు. రాజ్యా ధిపత్యమునకు రాతగినవారు వారి కుటుంబములో యెవరునులేరు. ఇట్టిస్థితిలో నేను మీర్జాఫర్పైగాక యింకెవరిపై ఆధారపడి యుండగలను? నన్ను పైకితెచ్చిన ఆలివర్దీఖాన్ ప్రభువే, యీ మీర్జాఫరునుకూడ పైకితెచ్చి తనతో సమానమైనవానినిగ జేసెను. మేమిరువురముకూడ, ఆయన ప్రాపకము వల్లనే పైకి వచ్చినాము. ఈ మాటలుచెప్పి, పిమ్మట రామనారాయణు డొక బ్రాహ్మణుని పిలిచి,

తాను మీర్జాఫరుకును, మీర్కాసీము, మహమ్మద్ అమీ అనువారికిని విశ్వాసముతోనుందునని విధిపూర్వముగ అందరి సమక్షమున ప్రమాణముచేసి పలికెను. మీర్జాఫర్ మహమ్మద్ అమీలుకూడ తమకును రామనారాయణుని యెడగల అనుమానములన్నియు పోయినవనియు, తమకు ఆతనియం దెట్టిద్వేషముగాని లేదనియు, యికముందు కూడ ద్వేషముంచుకొనమనియు కొరానుమీద ప్రమాణము చేసిచెప్పిరి. అంతట యీ మహమ్మదీయ సోదరులిరువురు రామనారాయణుని కౌగలించుకొనిరి. ఈ సమాధానముకుదిర్చినందుకు యీ ముగ్గురు కలసి మేజర్ కూటును కౌగలించుకొనిరి.'' (Orme's Vol. II) Page 194.

అట్టి ప్రమాణములు చేసికూడ, తుదకు మీర్జాఫర్ రామనారాయణుని యెడ సరిగ ప్రవర్తింపలేదు. ఆకథ తరువాత చెప్పెదము. మేజర్ కూటు సెప్టెంబరు 7–వ తేదీన తనసేనతోసహా పాట్నానుండి పడవలపై బయలుదేరి 7–వ నాటికి మూర్షిదాబాదు చేరెను. సేనయంతయు కాశింబజారు గిడ్డంగిలో నిలువయుంచబడెను.

సెప్టెంబరు 14–వ తేదీన క్లైవు మూర్షిదాబాదునుండి పయనమై కలకత్తాకు వచ్చివేసెను. నబాబుతో కంపెనీ వ్యవహారముల పరిష్కరించుకొనుటకు వాట్సు, మానింగ్‌హాము, స్క్రాఫ్టనులును వెనుకనుంచి వచ్చిరి.

ఒరిస్సా గవర్నరుతో తగవు.

ఒరిస్సారాష్ట్రమునకు గవర్నరు మిడ్నపురములో నుండెను. ఇతడు హిందువే. ఇతనిపేరు రాంరాంసింగ్. క్లైవు మూర్షిదాబాదునుండి బయలుదేరక పూర్వము, మీర్జాఫర్ యీ రాంరాంసింగ్‌ను తనదర్బారుకువచ్చి, లెక్కలు పరిష్కారము చేసికొని పోవలసినదని కబురుపంపించెను. ఈ సింగ్ వేగులవాండ్లకు నాయకుడు, చాలకుశాగ్రబుద్ధి. మీర్జాఫర్ పిలుపుయొక్క అర్థమేమో అతనికి తెలుసును. కాబట్టి తాను స్వయముగ పోకుండ తనతమ్ముని, తమ్ముని కొడుకును పంపించెను. నబాబు వీరిరువురను ఖైదు చేసెను. దీనికి కారణమేమట! రామరామసింగ్ పరాసువారితోచేరి కుట్రపన్నుచున్నాడు గాన తానట్లుచేసితినని మీర్జాఫర్ క్లైవుకు సమాధానము చెప్పెను. క్లైవు యీ సమాధానముతో తృప్తిపడి యీ వ్యవహారము కడవరకు పరిష్కారము చేయకయే కలకత్తాకు వెళ్లిపోయెను. కలకత్తా చేరగనే యితనికి రామరామసింగ్ నుండి ఉత్తరమువచ్చెను. తన తమ్ముని, తమ్మునికొడుకును మీర్జాఫర్ అక్రమముగ ఖైదు చేసెననియు, మీర్జాఫర్ బుద్ధిలేనివాడై తననుకూడ పట్టుకొనుటకు తనమీదికి దండును పంపెయెడల దాని నెదిరించుటకై తాను సిద్ధముగనుంటిననియు, అందునిమిత్తమై తాను 2000 అశ్వబలమును, 5000 కాల్బలమును తయారు చేసికొని యుంటిననియు, కాని, క్లైవు మధ్యవర్తిగనుండి, తనరక్షణకు హామీపడేయెడల, తాను కొత్త నబాబగు మీర్జాఫరుకు లక్షరూపాయీలు నజరానాయిచ్చి, స్వయ

ముగ వచ్చి దర్శనముకూడ చేసికొందుననియు, రామరామసింగ్ ఆ వుత్తరములో వ్రాసెను. క్లైవు యిందుకు సమ్మతించి, రామరామసింగ్‌తో సమాధానపడవలసిన దని చెప్పి మీర్జాఫరుకు గట్టిగ శిఫార్సుచేసెను.

తన జ్ఞాతియగు షౌకత్ జంగ్ చనిపోయిన తరువాత, సురాజ్ ఉద్దౌలా పూర్ణియా(రాష్ట్ర)మునకు ఓగుల్ సింగ్‌ను గవర్నరుగనియమించెను. ఇతనిని తీసివేసి

పూర్ణియా గవర్నరుతో తగవు.

యీపదవిలో తనకిష్టుడగు మహమ్మదీయు నొకనిని పెట్టవలెనని మీర్జాఫర్ తలంచుచుండెను. కాని, ఓగుల్ సింగ్ అంత తేలికగ కొక్కు-పెట్టించుకొన దలచుకోలేదు. ఇతడు మీర్జాఫరుపై కత్తిగట్టి యెదురుతిరిగెను. ఇతనినణచుటకై మీర్జాఫర్ 'కదమ్‌హుస్సేన్' అనువానిచేతికి కొంత సేననిచ్చి పంపెను. ఈ గవర్నర్ పదవిని యీ కదమ్ హుస్సేనుకే కట్టిపెట్టవలెనని మీర్జాఫర్ తలంపు. ఆర్మ్ యిట్లు వ్రాయుచున్నాడు :—

" తిరుగుబాటుదార్లు నబాబు సైన్యమును చూచినదానికంటె ఇంగ్లీషువారి సైన్యము వచ్చుటనుజూచి ఎక్కువగ గాభరాపడి, ఎవరును తమ్మును ముట్టడింపక మునుపే బలిష్టమగు కందకములను విడిచి, నలుదెసలకు పారిపోయిరి. వెంటనే ఓగుల్ సింగ్ ఖైదీగ చిక్కెను. అందుపై మిగత సైనికోద్యోగులలో కొందరు పారిపోయిరి; కొందరు లోబడి చిక్కిరి. ఇది జరిగిన 15 రోజులలోపలనే డిశంబరు 9-వ తేదీకి కదమ్ హుస్సేను హాయిగ గవర్నరు పదవిలో కూర్చుండెను." (Vol. II. Page 275. Madras Edition of 1861.)

ఈ తిరుగుబాటుల కన్నిటికి అసలు మూలము రాయ్ దులాబేయని మీర్జాఫర్ అనజొచ్చెను. ఏలననగ, యితనినికూడ నాశనము చేయవలెనని అతని

రాయ్ దులాబ్‌తో తగవు.

తలంపు. కాని, రాయదులాబ్ మొరాయించి, యెదురుతిరిగి, సైన్యములను ప్రోగుచేసికొని కూర్చునెను. అప్పుడు వాట్సు మధ్యవర్తిత్వము ద్వారా ఉభయులకు అక్టోబరు 17-వ తేదీన సమావేశము జరిగెను. పాత వైరములను మాన్పుకొని, యికముందు స్నేహముగ నుందుమని యిరువురును ప్రమాణములు చేసుకొనిరి.

క్లైవు మధ్యవర్తిత్వము !

క్లైవు రామరామసింగ్‌ను కలకత్తాకు పిలిపించి, మీర్జాఫరుతో శిఫార్సుచేసి అతని తమ్ముని, తమ్ముని కొడుకును చెరనుండి విడిపించెను. రామ్‌రామ్ సింగుకు ఒరిస్సా గవర్నరుపదవి ఖాయముగ వుండునట్లు హామీ యిప్పించెను.

ఆలీవర్దిఖాన్ భార్య అయోధ్య వజీరుకు ఉత్తరములువ్రాసి, అతడు బీహార్ గవర్నర్ రామనారాయణునితోచేరి మీర్జాఫరుపైకి దండెత్తునట్లు ప్రోత్సహించుచుండెనను వదంతులు బీహారునుండి విరివకవచ్చి కలవరపరచుచుండెను.

కాబట్టి, తన సైన్యముల నెట్లయినను బీహారు రాష్ట్రములలోనికి నడిపింపక తప్పదని క్రొత్త నబాబు మీర్జాఫర్ నిశ్చయించుకొనెను. ఈ దండయాత్రలో క్లైవు కూడ చేరెను. రామనారాయణుని నెట్లయినను బీహారు గవర్నర్ పదవినుండి యూడబెరుకవలెనని మీర్జాఫర్ గట్టిగ నిశ్చయించుకొనెను. కాని, ఇంగ్లీషువారిందుకు ఒప్పుకొనుటకు వారికిది అనుకూల తరుణముగ గన్పట్టలేదు. ఆర్మ్ యిట్లు వ్రాయుచున్నాడు :—

"రామ నారాయణుని తీసివేసి, ఆ పదవి తన యిష్టునకెవరికో యిచ్చుకొనుటకై మీర్జాఫర్ సంకల్పించినపని చాల చిక్కులకు, పెద్ద తగాదాలకు కారణమగును. ఏలననగ, మీర్జాఫర్ సైన్యము తనమీదికి వచ్చుటను చూడగనే, రామనారాయణుడు అయోధ్య వజీరుతో చేరును. తన నీ పదవినుండి 'తీసివేయము' అని అతనికి గట్టిగ నమ్మకముతోచునట్లు చెప్పితేనే తప్ప, లేకపోతే అతడు అయోధ్య వజీరుతోచేరి యెట్టి షరతులతోనైనను సరే అతనితో నేస్త మేర్పరచుకొనును" (Vol. II Page 77)

కాబట్టి, క్లైవు మీర్జాఫరుకును, రామనారాయణునకును మధ్యవర్తిగనుండి, రామనారాయణునకు గవర్నర్‌పదవి ఖాయముగ వుంచునట్లు క్రొత్త నబాబుచేత గట్టిగ వాగ్దత్తము చేయించవలసినవాడాయెను.

1758-వ సం॥ ఫిబ్రవరి 23-వ తేదీన పాట్నాలో ఒక దర్బారు చేయబడెను. ఈ దర్బారులో మీర్జాఫర్ తనకొడుకు మీరానును పాట్నాకు నబాబుగ యేర్పాటు చేసెను. ఇది నామకః పదవి. రామనారాయణుడే నబాబుకు ప్రతినిధిగవుండి పని చేయునట్లును నియమించెను. ఈ ఉపకారము చేసినందుకు మీర్జాఫర్ రామనారాయణునుండి యేడులక్షల రూపాయలను లాగెను.

నాలుగునెలల పైచిలుకు సైన్యములు రణరంగమునందు ఉండెను. ఈలోగా ఒక్క ఫిరంగియైన కాల్చలేదు. 'ఆర్మ్' యిట్లు వ్రాయుచున్నాడు :—

"ఈ రాజకీయపు యెత్తుగడ యీరీతిగ ముగిసినది. దీనిలో 50 వేల సైన్యము తమ రాష్ట్రమునుండి కదలి 300 మైళ్ల దూరమువెళ్లి అక్కడ ఒక్కఫిరంగియైన కాల్చకుండ, నాలుగు నెలలుండి తిరిగివచ్చెను. కాని, క్లైవు మనస్సులో సంకల్పించుకొన్న పని యావత్తు జరిగిపోయెను." (Vol. II Page 283)

కంపెనీకి సూరే కారపు మిరాశీ.

తానొక వర్తకసంఘమునకు నౌకరనుమాట క్లైవు మరచిపోలేదు. తన యజమానుల లాభమును పెంపొందింపగోరి బంగాళాదేశములో సూరేకారముచేసికొను హక్కు కంపెనీవారికి మిరాశీగ యిచ్చునట్లు ఆతడు నబాబును బలాత్కారముచేసి ఒప్పించెను. అప్పుడు

దేశములో వాడుకయగుచున్న సూరేకారమంతయు పాట్నాకు పై. భాగమున తయారగు చుండెను. ఈ మిరాశీవల్ల కంపెనీవారికి అపరిమిత లాభము వచ్చెనని వేరుగ చెప్ప నక్కరలేదు.

ఇంగ్లీషువారి భల్లూకపు టాలింగనము.

1768-వ సం॥ మే నెల మధ్యమందు క్లైవు మూర్షిదాబాదు వచ్చెను. కొన్నాళ్లకు నబాబును వచ్చెను. నబాబు అదృష్టవంతుడుకాడు. వాని కెన్నడు సంతోషము లేకుండెను. ఇంగ్లీషు వర్తకుల నితడు బుద్ధిపూర్వకముగ ఆలింగన మొనర్చుకొనెను. ఈ యాలింగనములే నానాటికి ఆతనికి భల్లూకపు టాలింగనముగ గన్పట్టసాగెను.

ఇంగ్లీషువారు మీర్జాఫర్ చేత డబ్బు కక్కించుట.

ఇంగ్లీషువారిచే బహు నేర్పరితనముగ అల్లబడిన యీ పన్నాగములో అతడు చిక్కుకొన్నప్పుడు మూర్షిదాబాదు ఖజానాలో యెంతధన మున్నదో యితనికి తెలియదు. తనను సింహాసన మెక్కించుటలో తోడ్పడ నంగీకరించినందుకు కంపెనీకిని, యితర ఇంగ్లీషు వర్తకులకును వల్లమాలిన ధనమిచ్చెదనని ముందుగ వాగ్దానముచేసి యుండెను. తీరా సింహాసనమెక్కి ఖజానా తెరచి చూచునప్పటి కల్లా అందులో తా ననుకొన్నంత ధనము లేకుండెను. కాబట్టి, తా నింగ్లీషు వారికిచేసిన వాగ్దానముల నన్నిటిని యితడు పూరాగా చెల్లింపజాలక పోయెను. * మీర్జాఫర్ క్లైవుకు చెప్పతరముగాని ధనమును కట్టబెట్టెను. "నబాబు ఔదార్యమువల్ల నాకు సులభముగ లక్ష్మి యెత్తుకొనినది" అని క్లైవే 1772-వ సం॥లో పార్లమెంటు కమిటీ ముందర ఒప్పుకొనెను. తనవల్ల ఇంతడబ్బుతిన్న క్లైవు తన యెడ కొంత సానుభూతిచూపి, తాను కంపెనీ కివ్వ నేర్పరచుకొన్న సొమ్ములో మిగతాది యిక యివ్వనక్కరలేదని బాకీ రద్దుపరచుటకు తన పక్షముగ శిఫార్సు చేసి, తన పలుకుబడిచేత తన కీ బాధ తప్పించునేమో యని మీర్జాఫర్ ఆశపడెను. క్లైవు మున్నగువారికి ముట్టవలసిన దానిలో చాలభాగము ముట్టియే పోయెను. మిగతాది యిచ్చుటకు ఖజానాలో డబ్బులేదు. వచ్చే ఆదాయములో ఖర్చులు పోగా మిగిలేదేమియు గన్పించుట లేదు. ఇట్టి స్థితిలో తమకిక ముట్టవలసిన డబ్బును వారు

---

* బంగాళా ఖజానాలో తా మనుకొన్నంత సొమ్ము లేకపోవడం యింగ్లీషువారి కెంతో ఆశ్చర్యమును, ఆశాభంగమును కలిగించెను. భరతవర్ష సంపదలనుగూర్చి తాము విన్న అతిశయోక్తులన్నియు నిజమనుకొని, వారెంతో నమ్మియుండిరి. ఈ యాశలన్నియు అడియాసలయ్యెను. సహింప శక్యముగాని యీ నిజస్థితిని వారు ఒప్పుకొని, మనస్సును సమాధాన పరచుకొనుట కెంతయో వారికి బాధ, మనస్తాపము నయ్యెను. వా రంతటితో నిరాశచేసుకొని, యింతకంటె యెక్కువ రాదని మనస్సు నెట్లో సమాధానపరచుకొని, విధిలేక, అప్పటికి తక్షణమే సగముమాత్రము పుచ్చుకొనుటకును, మిగతా సగం మూడేండ్లలో మూడు సమాన వాయిదాలమీద పుచ్చుకొనుటకును ఒప్పుకొనిరి. (Mill's History Vol. III Page 135 5th Edition.)

దయదలచి వదలుకొందురని పాపము మీర్జాఫర్ ఆశపడెను. అదిగాక ఖజానాలో డబ్బు తరిగిపోవుటకు యీ స్నేహితులేగద కారకులైరి! ఏలననగ, ఏ వస్తువుల వ్యాపారమువల్లనైతే బంగాళా నవాబులకు విశేషము ఆదాయము వచ్చుచుండెనో, ఆ వస్తువులలో యూరోపియనులు మున్నగు పరదేశస్థులు వ్యాపారము చేయరాదని యిదివరకు నిషేధముండెడిది. ఇట్లు నిషేధింపబడిన వస్తువులతో యీ స్నేహితులు వ్యాపారము సాగించి, నవాబుకు రావలసిన రివిన్యూను చెడగొట్టుచుండిరి. తన డబ్బు తరిగిపోవడానికి కారకులు నేరుగ వీరేకాబట్టి, వీరు దయదలచి తన్నింతటితో వదలిపెట్టుదురని మీర్జాఫర్ ఆశపడెను. ఆర్మ్ యిట్లు వ్రాయుచున్నాడు :—

"......బంగాళములోగలిగిన యీ విప్లవమువల్ల తమకు నిరాఘాటముగ లభించిన లాభము చాలక- చాలమంది (కంపెనీనౌకర్లు) యిదివరకు యూరోపియనులు వ్యాపారము చేయకూడదని నిషేధింపబడిన 'ఉవంటి ఉప్పు, మున్నగు వస్తువులతో వ్యాపారము చేయసాగిరి. ఇట్టి అక్రమములను గూర్చి మీర్జాఫర్ తాను సింహాసనమునకు వచ్చిన నెలరోజులలోపలనే గోలపెట్టెను. అప్పటికి తాత్కాలికముగ కొంత ఆగినను అవితిరిగి తలయెత్తెను. ఇందువల్ల నిస్వార్థ వివేకముతో పారజూడ గలిగిన వారుకూడ ఊహించజాలనట్టి చెడుగు లనేకములు గలిగెను." (Vol. II. Page 189).

కాని, యింగ్లీషువారు యితర యూరోపియను జాతులవలె, యిండియాకు తీర్థయాత్రవచ్చినారా ? ఆరోగ్యమును పెంపొందించుకొనుటకు వచ్చినారా ? లేదు. రూపాయలు, అణాలు, పైసలే వారికి త్రిమూర్తులు. డబ్బే వారికి పావనము. బంగారమే వారిదేవుడు. ధనమే వారికి ఉపాస్యదేవత. ఇట్టిస్థితిలో వారు తన చేత బలాత్కారముగ యెంతసొమ్మైతే వాగ్దానము చేయించుకొన్నారో, అంతసొమ్మును దమ్మిడీలతో సహా కక్కించకమానరు. "ఖజానాలోసొమ్మంతా అయిపోయిందని" అతడెంతో దీనముగ చెప్పుకొనెను. నిషిద్ధ వస్తువులతో వ్యాపారముసాగించి మీరేగదా నా రివిన్యూకు భంగము గలిగించితిర"ని మొత్తుకొనెను. "నా ప్రజలంతా చూడండి—యెంత దీనస్థితిలోవుండి, తినుటకు కూడులేక అఘోరిస్తున్నారో—జీతాలు ముట్టక నాసైనికులంతా యెట్లు అవస్థ పడుచున్నారో చూడండి" అని వారికి దయగలుగునట్లు మీర్జాఫర్ విన్నవించుకొనెను. కాని, వారిగుండెలు కరగలేదు. ఈమాటలేమియు వారిచెవి దూరలేదు. "ఇస్తానన్న డబ్బు యిస్తావా చస్తావా" అని వారతని కంఠముమీద కూర్చునిరి. రామనారాయణుని వంచుటకై మీర్జాఫర్ బీహారుకు దండయాత్ర బయలు దేరుటకు సర్వసన్నాహములు చేసుకొనగ, కంపెనీ కివ్వవలసిన డబ్బు యిప్పుడు యిస్తేనేగాని, నేను నీతోరానని అప్పుడు క్లైవు మోళీవేసుకు కూర్చునెను.

నబాబు అప్పుడు డబ్బు కక్కక తప్పినదికాదు. ఖజానాలో చూడబోతే సొమ్ము లేదు. ఏమిచేస్తాడు? జిల్లాలమీద రావలసిన రివిన్యూ అంతా కంపెనీవారికి దఖలు వ్రాసివేసినాడు. "మాల్కామ్" అను ఆంగ్లచరిత్రకారుడు తన "క్లైవు జీవిత"మను గ్రంథములో నిట్లు వ్రాసెను. (వాల్యూం I, పేజీ 338).

"అసాధారణమగు యీ సైన్యపు ఖర్చులకై డబ్బు యీరీతిగ సప్లయి చేయబడినది. కంపెనీవారి కిచ్చివేసిన భూములకు కావలసిన మతలబుల ప్రకారము ఫర్మానా (పట్టా) తయారుచేయబడెను. నబాబు కంపెనీవారికి మొదటి ఆరు నెలలలో చెల్లించవలసిన దానిలో దిగబడిపోయిన బకాయ యావత్తు తక్షణమే చెల్లించివేయుటకు హుకుములు జారీచేయబడెను. మిగతబాకీ తీర్మానము నిమిత్తము బర్ద్వాన్, నడియా, హుగ్లీ (జిల్లాల) రివిన్యూ కంపెనీవారికి దఖలు వ్రాసి యివ్వబడెను. "ఈ యేర్పాటువల్ల నబాబుతో నిమిత్తము లేకుండగనే, నబాబు బాకీతీరే మార్గమేర్పడి పోయినది. ఈ యేర్పాటిప్పుడు అత్యావసరము. ఏలననగ, అతనికివచ్చే ఆదాయము అతని ఖర్చులకే చాలకుండవున్నది. రాజ్యములో పెద్ద అవాంతరము వస్తేతప్ప, యిక మన బాకీ రావడానికేమియు ఆటంకముండదు," అని క్లైవు 1758 సం॥ ఫిబ్రవరి 8-వ తేదీన సీమ డైరెక్టర్లకు వ్రాసెను."

బాకీక్రింద జిల్లాలు కంపెనీకి తాకట్టు.

భారత భాగ్యలక్ష్మి ఓడలెక్కి మేళతాళములతో సరసీమకు పయనమగుట.

తన పరాయి స్నేహితుల సంతోష పెట్టుటకై మీర్జాఫర్ చేసిన యీ పనివల్ల పన్నులిచ్చుకొను ప్రజల కతనియందు అసహ్యముపుట్టెను. ఇంతకాలము నుండి తాము చెల్లించుచువచ్చిన పన్నులవల్ల యేటేటా కూడబెట్టిన సొమ్మును నేడిట్లు పరాయివారువచ్చి ఒక్కసారిగ మూటలుగట్టి ఓడలకెక్కించి తీసికొని పోవుటను చూచినప్పుడు * ప్రజలకు వేదనగలిగెను. (ఒకమూల ప్రజలు తిండిలేక ఏడ్చుచుండగ పరాయివారిట్లు దోచుకొనిపోవుట వారికి విషాదకారణమయ్యెను).

ఆర్మ్ యిట్లు వ్రాయుచున్నాడు :—

1757 సం॥ జూలై 6-వ తేదీకి కంపెనీ కమిటీవారికి 72 లక్షల, 71 వెయ్యి, 666 రూపాయలు (వెండినాణెములు) ముట్టినవి. ఈ ఖజానా యంతయు 700 పెట్టెలలోపెట్టి, సీళ్లువేసి, నూరు పడవలలో యెక్కించి, శిపాయీల పారాతో నడియాకు బయలుదేరదీసిరి. అక్కడనుండి కంపెనీనౌకాదళములోని పడవలన్నియు వెంటరాగా, జెండాలు యెగురవేయుచు, బ్యాండువగైరా వాయిద్యములతో మహా వైభవముగ

---

* ఆ॥ భరతఖండంబు చక్కని పాడియావు। హైందవులు లేగదూడలై యేడ్చుచుండ।
తెల్లవారను గడుసరి గొల్లవారు। పితుకుచున్నారు మూతులు బిగియగట్టి॥

ఊరేగించుచు తీసికొనిపోయిరి.........ఇంగ్లీషుజాతి యిదివరకు ఎన్నడు యింతటి ధనమును గట్టి కరకు రూపాయలలో ఒక్కసారిగ బహుమతిగ సంపాదించలేదు. ఇది మనఇంగ్లీషు టంకసాల లెక్కప్రకారము ఎనిమిదిలక్షుల(బంగారు)సవరసులయ్యెను.''
(Vol. II. Page 187—188, Madras Reprint of 1861.)

మీర్జాఫర్ యింగ్లీషువారితో చేరుటవల్ల ప్రజలయందతనియెడ యెంతటి అసంతృప్తి, అసహ్యముకలిగెనో యీచరిత్రకారుడే యిట్లు చెప్పుచున్నాడు :—

మీర్జాఫరుకు అనేకమంది బంధువులుండిరి. వీరుగాక, యితడు రాజ్యమునకు వస్తే లాభములు పొందుదమను ఆశతో కూర్చున్న స్నేహితులు, ఆశ్రితులు, యింకెందరోగలరు.........కాని, యెక్కడి డబ్బు యింగ్లీషువారికే చాలకుండెను. ............(వీరికిచ్చిన బహుమానముల మూలముగనే ఖజానాయంతియు వట్టి పోయెను.) నబాబు కొంతడబ్బును తనసైనికులకు పంచిపెట్టెను. కాని, అది వారను కొన్నదానికంటె చాల తక్కువగనుండెను. అందుచే వారికి చాల ఆశాభంగమయ్యెను. ఇది యిట్లుండగ, పరాయిదేశస్థులు వచ్చి తమ వెండిబంగారముల నిట్లు ఆడంబర ముగ గొనిపోవుటను మూర్షిదాబాదు ప్రజలెంతో అసహ్యముతో చూచుచుండిరి. ఇదిజూచి ప్రజలు గగ్గోలు పెట్టసాగిరి.'' (ఆర్మ్సు గ్రంథము పేజీ 195.)

కాని, పాపము, మీర్జాఫరేమిచేయగలడు? అతడు తన కాళ్లుచేతులుకట్టి యింగ్లీషువారి చేతికిచ్చెను. క్లైవు అతనిని తనచేతిలో పెట్టుకొని, కేవలము పిండి బొమ్మవలె ఆడించుచుండెను.

నబాబుకు కంపెనియెడ మొగము మొత్తుట!

''తన యిష్టులైనవారిని సంతృప్తిపరచు తలపుతో సేనలోను, రాజ్యపరిపాలనలోను మీర్జాఫర్ కొన్నిమార్పులను చేయదలచగ, అందుకు క్లైవు వల్లకాదనెను. రాజ్యముయొక్క శాంతి భద్రతలకవి అపాయకరములని క్లైవు అడ్డుపెట్టెను.........తనకుగలిగిన యీ నిర్బంధములను మీర్జాఫర్ యెంతో అసహ్యముతో జూచుచుండెను. 'ఈ యింగ్లీషువారి బాధనుండి తప్పించుకొని బయటపడుట యెట్లు రా' యను ఆలోచనలు అతని ఫుర్రెలో పుట్టసాగెను.'' (ఆర్మ్సు గ్రంథము పేజీ 196).

ఇది యిట్లుండ, సేనకు జీతములు ముట్టుటలేదు. వారెంతో అసంతృప్తితో నుండిరి. వారిని సంతృప్తిపరచుటకు మార్గము కనిపించలేదు. ఇట్టి స్థితిలో మీర్జాఫరుకు తనక్రొత్త కిరస్తానీ మిత్రులయెడ అసహ్యము పుట్టిపోయెను. ఈవిసుగుదలతో ఒకనాడు మీర్జాఫర్ తనమిత్రునొకనితో నిట్లుపలికెనట.

'' ఇప్పుడు పరాసుసేన గస్తేదైనా దేశంలోకివస్తే బాగుండును. నేను వానికి సహాయము చేస్తాను—డబ్బు కావాలని, వర్తక సౌకర్యాలు కావాలని, యీ యింగ్లీషువారు నన్ను వేధించడం మానేస్తేనేతప్ప—.'' (ఆర్మ్సుగ్రంథము పేజీ 356).

వీరా—అందులో యీయింగ్లీషువారా—డబ్బువదలుకొనేది! ఎంతమాట! రూపాయలు, అణాలు పైసలనబడు త్రిమూర్తుల నారాధించు యీయింగ్లీషువారు కలలోకూడ యితనిని డబ్బుకోసం వేధించడముమానరు.

ఇంగ్లీషువారియందు రోతపుట్టుటచేత, మీర్జాఫర్ ఎవరైనా సమర్థుడగు పరాసువాడు అప్పుడు తనరాజ్యములో ఉంటే, వాడితో తప్పకచేరి కుట్రచేసేవాడే. కాని, చంద్రనగరపు ముట్టడితోను, జీన్లా మున్నగువారి పలాయనముతోను, అట్టి ఆశలన్నియు అడుగంటిపోయినది. కాని, ఒలందావారు మాత్రము అప్పటికింకను బంగాళములో మంచి స్థితిలోనుండిరి. కాబట్టి, బహుశః మీర్జాఫరు వీరి సహాయము కోరెననిచెప్పినచో అందు ఆశ్చర్యములేదు. ఒలందాలు బంగాళాపై దండెత్తివచ్చిన చరిత్ర నిప్పుడేచెప్పెదము. కాని, యీలోగా మీర్జాఫర్ తిరిగి యింగ్లీషువారినే యేల ఆశ్రయింపవలసివచ్చెనో కొంతవివరించుట అవసరము.

ఢిల్లీ సింహాసనమునకు రానున్న మొగలాయి యువరాజు బెంగాలు బీహార్ ఒరిస్సా రాష్ట్రములకు నామకః సుబేదారుగ నుండెను. తనకీ రాష్ట్రములందుగల హక్కును స్థిరపరచుకొను సంకల్పముతో అతడొక పెద్దదండుతో బయలుదేరి, బీహారురాష్ట్రపు పొలిమేర కప్పుడేవచ్చి విడిసియుండెను. ఈకబురువిని మీర్జాఫర్ గాభరాపడెను. సిపాయిలకు జీతములు బకాయపడియుండుటచేత, వీరు తనతోవచ్చి యువరాజు నెదిరింతురో లేదో యను అపనమ్మకము మీర్జాఫరుకు గలిగెను. అందుచే, యితడు క్లైవును ఆశ్రయించెను. తక్షణమే క్లైవొక పెద్దదండును తీసికొని, నబాబుకొడుకు మిరానునుకూడ వెంటబెట్టుకొని, పాట్నానైపునకు నడచెను. ఈలోగా యేవో తియ్యని మాటలుచెప్పుచు, యువరాజువచ్చి పాట్నాపై పడకుండ బీహార్ గవర్నర్ అగు రామానారాయణుడు అతనిని లాలించుచు కాలయాపన చేయుచుండెను. కాని, క్లైవు మిరానుల సేనలు రాగానే కొంత పోరాటముజరిగెను. ఈ పోరాటము 1759 సం॥ మార్చి 23-వ తేదీన ప్రారంభమై ఏప్రిల్ 4-వ తేదీ వరకు జరిగెను. శత్రువుకు చాల నష్టముకలిగెను. యువరాజు ఓడి పారిపోవుచున్న సమయమందు పరాసునేత 'జీన్లా' వచ్చి, అతనిని తిరిగి యుద్ధమునకు పురిగొల్ప జూచెనుగాని లాభము లేకపోయెను.

ఢిల్లీ యువరాజు దండయాత్ర - పలాయనము.

క్లైవు అదృష్ట జాతకుడు. అతడు యుద్ధముచేసినను, చేయకున్నను, అదృష్టదేవత అతని నెప్పుడు యిండియాలో విడిచియున్నట్లు గన్పట్టదు. 'మిల్లు' చరిత్రకారు డిట్లు వ్రాయుచున్నాడు:-

క్లైవుకు బిరుదు, జాగీరు.

"ఈ దండయాత్రతో క్లైవుకు అదృష్ట మెత్తుకొనెను. మీర్జాఫరుకు గలిగిన సంబరమునకు మితిలేదు. క్లైవుపై అత డప్పుడు కురిపించిన అపార కృతజ్ఞత యింతిం

తని కాదు. తన రక్షకుడగు క్లైవున కాతడు 'ఉమ్రావు' బిరుదము ఢిల్లీనుండి తెప్పించెను. తా నొక గొప్ప జాగీరునిచ్చెను. కలకత్తా చుట్టునున్న ప్రదేశమునకు జమీందారు హోదాలో కంపెనీ యిచ్చుచున్న యావత్తు రివిన్యూను క్లైవుకు యీజాగీరు పేరుతో కట్టబెట్టెను. దీనివల్ల క్లైవుకు సాలుకు 30 వేల నవరసుల ఆదాయమువచ్చుచుండెను. 'ఈ క్లైవు జాగీరు' హిందూదేశచరిత్రలో తరచు వచ్చుచుండును. ఇది చాల ప్రాముఖ్యత వహించెను." (Mill's History Vol. III Page 203; 5th Edition.)

ఈ జాగీరు మీర్జాఫరు కృతజ్ఞతచేత యివ్వలేదనియు, క్లైవును శాంతింపజేయుటకై యిచ్చెననియు 'టాల్‌బాయ్ వీలర్' అను యింకొక క్రైస్తవ చరిత్రకారుడు వ్రాయుచున్నాడు:—

"క్లైవు యువరాజును ఓడించినాడు గనుక, యిందుకు మెచ్చుకొని మీర్జాఫర్ యితనికి జాగీరిచ్చెనని కొంద రనుకొందు రేమో. అదికాదు. తాను ఒలందావారితోచేరి కుట్ర చేసినందుకు క్లైవు ఉగ్రుడై తనను శిక్షించునేమో యను భయోత్పాతముచే మీర్జాఫర్ యీ దేవతను శాంతింప జేయుటకైయే యీ జాగీరతని కిచ్చెను. ఇది దేవతా తృప్తికై చేసినపని కాని, కృతజ్ఞతకై చేసిన పని కాదు."

ఈ చరిత్రకారుడు అంత నమ్మదగినవాడు కాడని ప్రతీతి. ఇతని యూహలు తరుచు తప్పుగనే యుండును. మీర్జాఫర్ ఒలందావారితో కుట్ర చేసినాడో లేదో తెలియదు. ఇది చాల అనుమానాస్పదమైన సంగతి. అయినప్పటికి "ఇందుకు సందేహము లేద"ని యీతడు వ్రాయుచున్నారు.

మీర్జాఫర్ యీ జాగీరును క్లైవుకు భయముచేత యిచ్చినాడో, సంతోషముచేత యిచ్చినాడో, నిర్ధారణ పరచుటకు ఆనాటి రికార్డులలో యెక్కడను ఆధారము గన్పట్టదు. అందుచే, యీ రహస్యము అభేద్యముగనే యుండక తప్పదు. మీర్జాఫరునుండి యీ జాగీరు క్లైవుచే బలాత్కారముగనే లాగుకొనబడెనని మేమూహించుచున్నాము.

ఇంగ్లీషువారు తనను పెట్టుచున్న తిప్పలు భరించలేక మీర్జాఫర్ ఒకవేళ ఒలందావారితో కుట్రచేసినను చేసియుండవచ్చును. ఇందు అసంభవమేమియు లేదు. 1759 సం॥ ఆగష్టునెలలో బటేవియా లంకనుండి ఒలందావారి నావికాదళ మొకటి హుగ్లీనది ముఖములో ప్రవేశించి చించూరాలోనున్న తమ గిడ్డంగివైపునకు యెక్కి వచ్చుచుండెను. ఈ సంగతి క్లైవుకు తెలిసెను. అప్పుడు ఒలందావారికిని యింగ్లీషువారికిని యెక్క

ఒలందాల దండయాత్ర, ఓటమి.

డను యుద్ధములు లేవు. కాబట్టి, యీ సందిగ్ధస్థితిలో యేమి చేయవలెనో క్లైవుకు తోచలేదు. ఏమైతే అయినదని, అతడు యెట్టకేలకు ధైర్యముచేసి తన సొంత జవాబుదారీమీద ఒలందా వారిపై క్లైవు యుద్ధము ప్రకటించెను. వారి నౌకలను చించూరాకు రాకుండ అటకాయించెను. ఆఖరుకు ఒలందాల నౌకాదళము నాశన మయ్యెను. ఆనాటి యాంగ్లేయులు నిర్మలాంతః కరణులుగాక తామే దోషులగుటచే, యీ దోషమును మీర్జాఫరుకు అంటగట్ట జూచిరి. ఇతడు ఒలందాలతోచేరి కుట్రపన్నెనను నేరము వారతనిపై మోపిరి. ఈ నౌకాదళమును అతడే తెప్పించె ననిరి. కాని, 'మాల్కమ్' వ్రాసిన దానినిబట్టి చూడగ యిందు మీర్జాఫర్ దోష మున్నట్లు గన్పట్టదు. 'మాల్కమ్' వ్రాసినదిది :—

"ఇతరులవలెనే, చించూరాలోనున్న ఒలందాలుకూడ సురాజ్ఉద్దౌలా వల్ల బాధపడిరి. తనకు 50 లక్షలరూపాయలు జరిమానా చెల్లించవలసినదని అతడు వారిని బలవంతపరచెను. దీనిచేతను, యిట్టివే అతడొనర్చిన యితరపీడాకరములగు కృత్యములచేతను, సురాజ్ఉద్దౌలా పడిపోయినప్పుడు వారు చాల సంతోషించిరి. ఈ నబాబును పడగొట్టినందుకు క్లైవును అభినందించుచు వారు క్లైవుకొక ఉత్తర మునుకూడ వ్రాసిరి. అయినను, వారు మీర్జాఫరును బెంగాలు నబాబుగ అంగీ కరించరైరి. అందుపై మీర్జాఫరుకు ఒలందావారిపై పట్టరానికోపముండెను. వీరిద్దరికిమధ్య వ్యవహారము చెడకుండ పట్టుకొనివచ్చుటకు క్లైవు మాటిమాటికి తంటాలు పడవలసి వచ్చెను. ఈ పని క్లైవుకు సులభముగలేకుండెను. ఏలననగ మీర్జాఫరును నబాబుగ అంగీకరించకపోవడము ఒలందావారికి న్యాయమా ? ఇందువల్ల మీర్జాఫరుకు కోపము వచ్చినదంటే తప్పా ?" ఇందునుగూర్చి 1758 సం॥ అక్టోబరు 2-వ తేదీన ఒలందా గవర్నరుకు క్లైవు యిట్లు వ్రాసెను :—

"మీకు ఇంగ్లీషువారియెడగల మైత్రిని గూర్చి నాకుబాగుగ తెలియును. మీరు వారికి సదా తోడ్పడ సిద్ధముగనున్న సంగతియు నాకు తెలియును. అయితే నాదొక్క మనవియున్నది. సద్భావమనునది మన ఉభయజాతులకు పరస్పరము ఉండవలసినదై యున్నది. మనఉభయుల మధ్యనున్న సంబంధము, మైత్రి, యీ నాటిదికాదు. అది చిరకాలమునుండియున్నది. కాబట్టి, మన ఉభయులము పరస్పరము కోరదగినది యింతికంటె వేరేమున్నది ? ఇట్టి సందర్భములో నబాబు మీ వర్తకముపై పెట్టిన ఆటంకములకు నేనే కారకుడనని మీరునాపై యన్యాయముగ నిందమోపుట నాకెంతో కష్టముగనున్నది. మీరు తనయెడ చూపుచున్న దుర్న యముల గూర్చి మీర్జాఫరు తరచు కటకటబడుచుండుటను నేను వినుచుండిన మాటనిజమే. ఇట్టి దుర్నయముల నాతడు యింతకాలమునుండి యెట్లు సహించు చుండెనాయనికూడ నేను ఆశ్చర్యపడుచుండెడివాడను. ఆలీవర్దీఖాను, సురాజ్ ఉద్దౌలాల యెడలనే యైన యెడల మీరిట్టి దుర్నయముల చేయ సాహసించెడి

వారా? ఇతని పూర్వులను మీరు అంగీకరించినట్లే, మీర్జాఫరును కూడ మీరేల నవాబుగ అంగీకరించరో నాకు తెలియదు. ఇతడును వారివలెనే ఢిల్లీ మొగలాయి పాదుషానుండి సన్నదును పొందియుండెనుగద. ఈ సంగతి మీకు తెలియకుండ నుండజాలదు. ఇట్టి వానిని నవాబుగ నంగీకరించక పోవుటకు మీకేమి కారణములు గలవో నేను విచారింపబూనుకోను. ఇదినాపనిగాదు. అయితే, మీ వర్తక మిప్పుడు యిక్కడ నాశనమైపోయినందుకు మీరు పైయధికారులకేమి సమాధాన ము చెప్పుకొందురో నేనూహింపజాలకున్నాను. ఏలననగా మీ వర్తకమిప్పుడిట్లు నాశనమైపోవుటకు మీరేగద కారకులు? నవాబంతటి మహోన్నతపురుషుని మీరు అగౌరవ పరచుటవల్లనేగద మీరు మీయజమానుల వర్తకమును నాశనము చేసి నారు.'' (Vol. II. Pages 70, 72.)

'మాల్కము' గ్రంథమునుండి యింక యెక్కువగ యెత్తి వ్రాయనక్కర లేదు. ఈ ఒలందాదండయాత్రను గూర్చియు, అందు మీర్జాఫరుకు గలజోక్యమును గూర్చియు క్లైవు మున్నగువారు 1772 సం॥ పార్లమెంటు కమిటీయందు విచారింప బడిరి. వీరిచ్చిన సాక్ష్యమునుబట్టి చూడగ, పక్షపాతబుద్ధిగలవాడు తప్ప, మరి యింకెవడును యిందు మీర్జాఫరు దోషముగలదని చెప్పజాలడు - మీర్జాఫరే ఒలందావారిని పిలిపించెనని చెప్పజాలము. బహుశః ఏమిజరిగియుండవచ్చుననగ :— పరాసువారిప్రతిభ బెంగాలులో క్షీణించి పోవుటయు, దక్షిణాపథమందు కూడ ఇంగ్లీషువారి తంత్రములచే పరాసుల ప్రతిభ నష్టమైపోవుచుండుటయు, ఒలందా వారు కనిపెట్టి, తమకు చించూరాలోనున్న గిడ్డంగిని బలపరచుకుంటేగాని, లాభ ములేదను తలంపుతో వారు తగినంతసేనను, ఓడలను, అదనముగ బెంగాలుకు పంపించుకొనియుండవచ్చును. మీర్జాఫరుకును, అతనికొడుకు మిరాణకును కూడ ఇంగ్లీషువారనిన యిప్పుడు బొత్తుగ పడకుండుటలేదను సంగతియు, ఒలందాలకు తెలుసును. ఈ కారణముచే అంతఅవసరము పట్టేయెడల, వారు తమకు సహాయ ము చేతురనికూడ ఒలందాలు ఆశించియుండవచ్చును. వారికొకవేళ యిట్టి యాశ లుంటే అవి యన్నియు అడియాసలయ్యెనని చెప్పవచ్చును. ఏలననగ, నవాబును, నవాబు కొడుకును, తమకు సహాయము చేయుటకు బదులుగ ఇంగ్లీషువారితోచేరి తమపైకే వచ్చిరి. తమ్మునే ఓడించిరి.

ఒలందాలిట్లు ఓడిపోవుటతో యింగ్లీషువారికిక యితర యూరోపియన్ జాతులతో పోటీ పూరాగాపోయెను. వారికిక నిర్భయమయ్యెను. కాబట్టి వారి రాచకీయ ప్రతిష్ట, బలము, నానాటికి హెచ్చసాగెను. మిల్లు యిట్లు వ్రాయు చున్నాడు :—

''ఈ దెబ్బతో ఒలందాలు, తామిక మూలమట్టముగ నాశనమై పోదుమని భయపడి, తమతప్పు నొప్పుకొనినట్లు అపరాధముక్రింద యుద్ధపుఖర్చుల నిచ్చుకొనిరి.

క్లైవంతట సంతుష్టుడై వారిపడవలను, సామగ్రులసహా వారికిచ్చివేసి, అంతటితో యీ వ్యవహారమును ముగించెను. ఒలందాలతో చేసుకొన్న యీ యొడంబడిక 1759 సం॥ డిశంబరు 5-వ తేదీన ధ్రువపరుపబడెను.'' (Vol. III, Page 205, 5th Edition.)

క్లైవు బెంగాలువచ్చి యిప్పటికి మూడేండ్లు దాటినవి. ఈ మూడేండ్ల కాలములో ఊహింపతరముకాని యక్రమ మార్గమున నితడు తనజేబుల నింపుకొనెను, తన యజమానులయొక్కయు, తనతోడివారియొక్కయు జేబులనింపెను. నబాబును, దేశ ప్రజలను పూరాగా నష్టపరచెను.

క్లైవు సీమకు వెళ్లుట.

1756 సం॥ అక్టోబరులో మద్రాసునుండి యే సంకల్పములతో అతడు బయలుదేరెనో, ఆ సంకల్పములన్నియు నేటికి పూర్తిగా నెరవేరినవి. మద్రాసులోని కిరస్తానీ బచ్చులు బెంగాలులో గలిగింపదలచుకున్న విప్లవము క్లైవు ద్వారా జరిగిపోయినది. తనను బెంగాలు తక్తుమీద కూర్చుండ బెట్టుటకుగాను ద్రోహియగు మీర్జాఫర్ యింగ్లీషువారి కెంతటి యపార ధనము వాగ్దానము చేసెనో, ఆ ధనమంతయు యింగ్లీషువారికి ముట్టిపోయెను. ఇదిగాక, కంపెనీవర్తకాభివృద్ధికై వారీనబాబును బెదరించి యెన్నో సౌకర్యములను వడివేసి లాగికొనిరి. కాబట్టి, యిక యింటికి వెళ్లుదామని క్లైవుతలంచెను. తన సంపద నంతను సీమలో ప్రదర్శించి, 'ఇండియన్ నబాబ'ని పేరుపెట్టుకొని, అక్కడనున్న పెద్దపెద్ద భాగ్యవంతులకంటె, తానే భాగ్యవంతుడనని విర్రవీగుదమను తలంపులు క్లైవు పుర్రెలో పుట్టసాగెను. అతడంతట బెంగాలులో కంపెనీ నౌకరీకి రాజీనామాయిచ్చి 1760 సం॥ ఫిబ్రవరి నెలలో కలకత్తానుండి సీమకు పయనమయ్యెను.

క్లైవు,మున్నగువారి కుతంత్రములచే గెలుపొందిన ప్లాసీ యుద్ధమువల్ల బెంగాలు దేశము యింగ్లీషువారిచే జయించబడి నట్లెంచ వీలులేదని లోగడ చెప్పియే యుంటిమి. 'హేస్టింగ్స్ యుద్ధము'లో ఓడిపోవుటవల్ల యింగ్లీషువారి మెడలపై నార్మన్ రాజులకాడి వచ్చిపడినట్లు కాదుయిది. బెంగాలు యెన్నడు యేయూరోపియను జాతివల్లను జయింపబడలేదు. క్లైవు బెంగాలులో రెండు సం॥లపై కాలము కాపురముండి ప్రజలయొక్కయు, ప్రభువులయొక్కయు అమాయికత్వమును జూచి, నీతిజాతిలేని తమ యూరోపియను కుతంత్రములచే వీరిని బాగాటోపి వేయవచ్చునని గుర్తించి, యీ దేశమును సరాసరి యింగ్లండు పరిపాలనక్రిందకు బహు సులభముగ తేవచ్చునని యతడు తనమనస్సులో ప్లానువేసుకొనెను. ఇందునుగూర్చి యితడు 1759 సం॥ జనవరి యేడవ తేదీన అప్పుడు యింగ్లండులో ప్రధానిగనుండిన విలియం పిట్టుకు వ్రాసిన యుత్తరము చాల ప్రాముఖ్యమైనది కావున, దానినిట పూర్తిగ ముద్రించుచున్నాము :—

"ఇంగ్లీషువారి సైన్యబలముచే యిక్కడ జరిగిన రాజ్యవిప్లవమువల్లను, తత్ఫలితముగ జరిగిన సంధిచే కంపెనీకి చేకూరిన అపరిమితి లాభమువల్లను, యిక్కడి ప్రజలలో కొంత సంచలనమేర్పడి, దీనివలన వారి దృష్టి యాకర్షింపబడెను. కంపెనీ వారికిప్పుడున్న పదవులయొక్కయు, ముందురాదగిన అవకాశములయొక్కయు, ప్రాముఖ్యత కనుగుణముగ కంపెనీవారు గనుక కొంచెము శ్రమ జేసినచో, ముందు కూడ యింకెంతో పనిచేయవచ్చును. మరికొంతబలమును యిక్కడికిపంపి, అవసరము వచ్చినప్పుడు వెంటనే అవకాశమును వినియోగించుకొని మనము చప్పున పైకివచ్చుటకుగాను తగుబలముల నిక్కడ సదా నిల్వయుంచుకొనుట చాల మంచిదను సంగతి నేనిదివరకే కంపెనీవారికి గట్టిగ తెలిపియున్నాను. ఇక్కడ దేశీయ ప్రభువుల పరిపాలనా విధానమునుగూర్చియు ప్రజల లక్షణములగూర్చియు నాకు యీ రెండేండ్లలో గలిగిన స్వానుభవమునుబట్టి చూడగ, అట్టి అవకాశములు మనకు అచిరకాలములోనే రాగలవని నేను గట్టిగ చెప్పుచున్నాను. ఇప్పుడున్న నవాబు చాలముసలివాడు. ఇతనికొడుకు క్రూరుడు; పనికిమాలిన కుర్రవెధవ. ఇతనికి యింగ్లీషువారంటే బొత్తుగపడదు. కాబట్టి, వీడు రాజ్యానికి రావడం మనకు క్షేమముగాదు. ఎంతో అక్కరలేదు—ఒక రెండువేల యూరోపియను బలము వుంటేచాలును. ఇక మనకెవరివల్లను, తండ్రివల్లగాని, కొడుకువల్లగాని, బాధ యుండదు. వీరు మననుగనుక తిప్పలుపెట్ట దలచినారా, వీరిరువురను త్రోసివేసి, ఆ రాజ్యమును కాస్తా మనమే కాజేయడానికి కూడ యీసైన్యము పనికివస్తుంది."

"ఈ పని చేయడం ఎంతో కష్టముకాదు. ఏలనంటూరా, ప్రజలకు రాజు ఎవరైనా యిబ్బందిలేదు. రాజు ఎవరైనా ఒకటే యను ఉద్దేశములో ప్రజలున్నారు............."

"అయితే, వర్తకం చేసుకునే కంపెనీకి యింతపెద్దరాజ్య మేమిటని మీరనవచ్చును. ఇది కంపెనీవారికి భారమైన పనిగ కన్పట్టవచ్చును. యావత్తు బ్రిటిష్ జాతి మద్దతులేనిది కంపెనీవారీ రాజ్యభారమును నిర్వహించ లేకపోవచ్చును.... అదిగాక, మన తల్లిదేశము సీమకు విశేషము డబ్బు ఖర్చుగాకుండ యీపని నెరవేరవలయునన్నమాట ఆలోచనీయమే. అమెరికాలో రాజ్యం సంపాదించబోయి నప్పుడు మనదేశమున కెంతో డబ్బు నష్టమైనది. ఇండియా విషయములోకూడ యిట్టి నష్టమువస్తే లాభములేదు. ఈ నష్టము రాకుండ చూచుకోవలెను. మనకెంతో ఖర్చు అక్కరలేదు. ఇంటినుండి మీరు కొంచెము సేనను పంపిస్తే చాలును. నల్లసేన మనకిక్కడ యెంత కావాలంటే అంత దొరుకుతుంది. ఈ ప్లానునుగూర్చి నేను మీకు తప్ప యింకెవరికి వ్రాయలేదు. ప్రజాక్షేమమునకు అనుకూలమగు యెట్టి సూచననుగాని మీరు శ్రద్ధతో ఆలోచించుదరను నమ్మకముతో మీకైనను

యీశ్రమ గలిగించినానుగాని, లేకపోతే గలిగించను.'' (Malcolm's life of Clive Vol. II Page 119.)

బెంగాల్, బీహార్, ఒరిస్సా రాష్ట్రములకు దివాన్‌గిరీపనినికూడ క్లైవుకిచ్చెదనని మొగలాయి చక్రవర్తి చెప్పెను. దివాన్‌గిరీపని యనగ, యీ మూడు రాష్ట్రములపై రివిన్యూను వసూలుపరచి, ఉద్యోగస్థుల జీతములు వగైరాలు పోను, మిగతా సొమ్మునంతను ఢిల్లీ ఖజానాకు పంపు పని. ఈ పనికి క్లైవు అంగీకరించలేదు. ఏలననగ, యిందువల్ల తాను మీర్జాఫర్ యీర్ష్యకు పాత్రుడనగుదునని క్లైవు జంకెను.

క్లైవుచెప్పిన ప్లానుకు పిట్టుమంత్రి సమ్మతింపలేదు. ఏలననగ, యిండియాలో యే ప్రాంతమునుగాని నేరుగ యింగ్లండుపాలన క్రిందికి తెచ్చేయెడల, ప్రజాస్వాతంత్ర్యమునకు భంగము కలుగునని ఆతడు తలచెను. దీనినిబట్టి, పిట్టు చాల దూరదృష్టిగలవాడని చెప్పక తప్పదు. ఈతని సలహాప్రకారమే వ్యవహారము చివరవరకు నడిచియుండినచో, యీ దేశము కంపెనీనుండి రాణీకి బదలాయింపు అయిననాటినుండి దీనికి కలుగుచున్న కష్టములేమియు లేకుండ నుండెడివి.

బెంగాలులోని కంపెనీ తాలూకు యావత్తు శివిల్ మిలిటరీ వ్యవహారములు క్లైవునం దుంచబడెను. క్లైవు యింగ్లండు వెళ్లినపిమ్మట మదరాసులోనున్న హెన్రీ వాన్‌సిటార్టు అనువానిని అతని స్థానమందు నియమించిరి. కాని, 1760 సం॥ జూలై నెలలో యితడు మద్రాసునుండివచ్చి చార్జీ వప్పగించుకొనువరకు యీ పనిని ''హాల్‌వెల్''ను చూచుచుండుమనిరి. ఈరీతిగ ''హాల్‌వెల్'' బెంగాలుకు టెంపరరీగ గవర్నర్ అయ్యెను. ''కర్నల్ కల్లియడ్'' అను నతడు సర్వసేనాపతిగ నుండెను.

క్లైవుస్థానే వాన్‌సిటార్టు.

1759-వ సం॥ ఆఖరు భాగమందు బీహారు రాష్ట్రపు సరిహద్దులలో తుపాను కూడుకొనుచుండెను. గత సంవత్సరము నబాబు కొడుకు మీరాన్ బీహారులో నుండగ, అక్కడనున్న కొంతమంది పెద్ద సైనికోద్యోగులను పలుకుబడిగల వారిని, యితడేమో అగౌరవపరచెనట. అందుచే వారందరు గూడుపుఠానీచేసి మీర్జాఫరును సింహాసనమునుండి పడద్రోయుటకై ఢిల్లీ యువరాజును బెంగాలుమీదికి దండెత్తిరమ్మని పిలిచిరట. కద్దమ్ హుస్సేను అనువానిని నబాబు రెండేండ్ల క్రిందట పూర్ణియా రాష్ట్రమునకు గవర్నరుగ నియమించెనని పైన చెప్పియుంటిమి. కాని, యితడు అదివరకున్న హిందూగవర్నర్ కంటె ఎక్కువగ నబాబును తిప్పలు పెట్టసాగెను. మీర్జాఫరుకు మామూలుగ చెల్లగట్టవలసిన కప్పమును చెల్లించక యెగబెట్టెను. అందుచే వీనిని హతమార్చవలెనని నబాబు పట్టుబట్టెను. ఈ దెబ్బనుండి తప్పుకొను

ఢిల్లీ యువరాజు రెండవ దండయాత్ర.

టకై కద్దమ్ హుస్సేను (పూర్ణియా గవర్నర్) తనకుగల దిట్టమైన ఆరువేల సేనతో ఢిల్లీ యువరాజును చేరునట్లు గన్పించెను.

తన రాజ్యమున కింతటి భయోత్పాతముగనున్న యీ ఢిల్లీ యువరాజ దాడిని అటకాయించుట మీర్జాఫరుకు యెంతో అవసరమయ్యెను. ఇందుకుగాను, కంపెనీ సేనాని యగు "కర్నల్ కల్లియడ్" పెద్ద దండుతో కలకత్తానుండి బయలు దేరి 1759-వ సం॥ డిశంబరు 26-వ తేదీన మూర్షిదాబాదు చేరెను. ఈ క్రొత్త సేనానిని నబాబుకు ఎఱుకపరచుటకై క్లైవుకూడ అక్కడికి 1760-వ సం॥ జనేవరి 6-వ తేదీన వచ్చెను. క్లైవు సుమారు ఒకవారము రోజులు మాత్రము మూర్షిదా బాదులోనుండి, తన సీమ ప్రయాణమునకు వలయు సన్నాహముల జేసికొనుటకై తిరిగి కలకత్తాకు వచ్చివేసెను. కల్లియడ్ అంతట జనేవరి 18-వ తేదీన బయలు దేరి యుద్ధరంగమునకు నడచెను. అతనివెంట నబాబుకొడుకు మిరాన్ కూడ పెద్ద దండుతో వచ్చెను.

"కద్దమ్ హుస్సేన్ తన ఉద్దేశమును బహిరంగముగ వెల్లడించలేదు. తాను నబాబు ఉత్తరువులకు విధేయుడనై యుందుననియు, బకాయ యావత్తు చెల్లించి వేతుననియు, విశ్వాసపాత్రుడగు సేవకుడుగ నుందుననియు కద్దమ్ హుస్సేన్ చెప్పెను. కేవలమిట్టి పైపై మాటలనమ్మి యూరుకొనుటకు వీలులేకుండెను. ఏల ననగ, అతనివద్ద అప్పుడొక పెద్దసేన యుండెను. అతనిని గట్టిగ నమ్మడానికి వీలు వున్నదో లేదో నిశ్చయ పరచుకొనకుండ, అతనిపై పై మాటలనునమ్మి, అతనిని వెనుక ఉండనిచ్చుకొని, ముందుకు సాగిపోవుట అపాయకరముగ కన్పట్టెను. అందుచే అతనికి నబాబుకుగల మధ్యవ్యవహారమును నాచేత నైనంతవరకు చక్కబరచితిని. ఆతడు నామధ్యవర్తిత్వముతప్ప యింకొకరి మధ్యవర్తిత్వమునకు ఒప్పుకొననన నెను. నబాబుకొడుకు యెదుటకు పోయిచూచుటకు ఆత డిష్టపడలేదు. రివిన్యూ బకాయ యావత్తు తాను చెల్లించివేసే పద్ధతిని నబాబు తనను సైన్యాధిపత్యములో ఉంచుకొననిచ్చేటట్లు నేను హామీ యిచ్చితిని. ఈ హామీకతడు అంగీకరించెను. ఈ వ్యవహారమువల్ల మధ్యత్రోవలో వారము రోజులు ఆలస్యమైనది." (**First Report 1772 Page 158.**)

ఢిల్లీ యువరాజు బీహారుపై దండయాత్ర వెడలివచ్చి ఆ రాజ్యమునకు పశ్చిమ సరిహద్దుగనున్న కరమ్నసా నదినికూడ దాటెను. అప్పుడు అతనికి ఢిల్లీలో తన తండ్రియగు అలంగీర్ పాదుషాను ఎవరో చంపివేసినట్లు వర్తమానమువచ్చెను. తక్షణమే యీ యువరాజు తనను తాను హిందూస్థానపు చక్రవర్తిగ ప్రకటించు కొనెను. అయోధ్య నబాబుకు 'వజీర్' అను బిరుదమును ప్రసాదించెను. ఇత డిప్పుడు చక్రవర్తి యగుటచే, ఎక్కువసైన్యమును తక్షణమే ప్రోగుచేసికొన గలి

గెను. ఈ సైన్యముతో ఆతడు పాట్నాపైకి నడచెను. ఈ బీహారురాష్ట్రమున కింకను రామనారాయణుడే గవర్నరుగ నుండెను.

ఈ దండయాత్రనుగూర్చి కల్లియడ్ యిట్లు చెప్పుచున్నాడు. *

" నేను వచ్చువరకు యువరాజుతో కలియబడవద్దని రామనారాయణునకు చెప్ప నంపితిని కాని, అతి జేలనో నామాటను పాటింపక, యువరాజును ముట్టడించి దెబ్బతిని, మన ఇంగ్లీషుసేన సహాయముతో పాట్నాకు పారిపోయి వచ్చెను. యువరాజు వెంబడించివచ్చి పాట్నాను ముట్టడించెను. నే నంతట ఇంగ్లీషుసేనతో యువరాజుపైకి వెడలి పాట్నా ముట్టడినితప్పించి, ఆతనితో తలపడి పోరాటమునకు దిగితిని. కాని, నబాబుకొడుకు మిరాన్ మాత్రము నామాట వినక, తన యిష్ట ప్రకారము వర్తించెను. అయినప్పటికి శత్రువుపూర్తిగ ఓడిపోయి పలాయన మయ్యెను. చిన్న నబాబు (మిరాన్) గాయముల బాధచే తన గుడారములోనికి పోయెను. నాకు కొంత గుర్రపుదండు యిస్తే యువరాజును వెంబడించి తరిమివేతు నంటిని. కాని, చిన్న నబాబందుకు ఒప్పుకోలేదు. నా వద్దనున్న సేన అలసి యుండుటచేతనున్ను ఫిరంగులు చాల విరిగిపోవుటచేతనున్ను నేనేమియు అప్పటికి చేయలేక పోతిని. మార్చి రెండవ తేదీనాటికి యువరాజు తిరిగి బంగాళామీదికి వచ్చుచున్నాడని కబురు వచ్చెను. ఇతనిని తిరిగి యెదిరించి దేశమునుండి తరిమి వేయుటకుగాను కొంతసైన్య సహాయమివ్వవలసినదని నేను చిన్న నబాబును ఎంతో ప్రాధేయపడి అడిగితిని. కాని, అతి డందుకు ఒప్పుకోలేదు. అందుచే, యువరాజు నిరాఘాటముగ బీహారురాష్ట్రములో ప్రవేశించెను. ఇతడు పాట్నాపై పోయి పడునను భయముచే దానిని రక్షించుటకు కెప్టెన్ నాక్సు చేతికి కొంత దండునిచ్చి పంపితిని. ఈ దండువల్లనే పాట్నా రక్షింపబడెను. యువరాజు పాట్నాముట్టడిని ఈసారికూడ వదలుకొనవలసినవా డాయెను.''

" నేనును ముసలి నబాబు (మీర్జాఫరును) అతనికొడుకును శిబిరములో మే 16 తేదీ వరకుంటిమి. అంతట పూర్ణియా గవర్నర్ (కద్దమ్‌హుస్సేన్) తానునాతో చెప్పిన మాటలకు విరుద్ధముగ, మీర్జాఫర్‌కు వ్యతిరేకముగ, యువరాజుతో చేరుటకు సైన్యములతో నడువజొచ్చెను. కావున యితనిని అట కాయించుట అవసరమయ్యెను. అంతట కెప్టన్ నాక్సు క్రిందనున్నదండు కద్దమ్

మీర్జాఫర్ కొడుకు మిరాన్ శిబిరమున అర్ధరాత్రివేళ వధింపబడుట.

---

* మొదట ఢిల్లీనుండి బయలుదేరినప్పుడు యువరాజుగానుండి, తరువాత తండ్రి (చక్రవర్తి) చనిపోవుటచే త్రోవలో తానే చక్రవర్తి అయిన యీతడు బెంగాల్ బీహారురాష్ట్రములపై దండెత్తుటయు, యీ దండయాత్రను కంపినీ సేనాని కర్నల్ కల్లియడ్‌ను, మీర్జాఫర్ కొడుకు మిరాన్‌ను ఎదిరించుటయు జరిగెను.

హుస్సేన్ సేనను ఎదిరించి తరిమివేసెను. కద్దమ్ హుస్సేన్ సేన గుఱ్ఱపుసేన యగుటచే దాని నింకనుపూర్తిగ తరిమి ఓడించుటకు వీలులేకపోయెను. నావద్ద గుఱ్ఱపు సేనలేదు. నబాబు ఒక్క గుఱ్ఱపురౌతునుకూడ యివ్వడు. అయినప్పటికి అక్లే జూలై మూడవ తేదీ వరకు తరిమితిమి. మరునాడుకూడ వెంబడించే వారమే. కాని, ఆరాత్రి ఒంటిగంట రెండుగంటల మధ్య ఒక హర్కారువచ్చి చిన్న నబాబు గారు (మిరాన్) ప్రక్కలో పడుకొనియుండగా పిడుగుపడి చచ్చెనని మాకు కబురు చెప్పెను. ఈ వార్త సేనకు తెలిస్తే యెక్కడి దక్కడ చెల్లాచెదరై పోతుందని నబాబుగారి దివాన్ వచ్చి నాతో చెప్పెను. మేము ఈవార్తయెవరికిచెప్పకుండ సేనను వెనుకకు పాట్నాకు నడిపించుకొనివచ్చితిమి. చిన్న నబాబుగారికి జబ్బుగవున్నదని పుకారు పుట్టించితిమి. అసలుమరణవార్త మాకుతప్ప యింకెవరికి తెలియకుండ చేసితిమి. ఇది యీదండయాత్ర కథ......" (క్లుప్తము.)

ఈ దండయాత్రను వర్ణించుటలో కల్లియడ్ దండెత్తివచ్చిన మొగలాయి ప్రభువును చక్రవర్తి యనియనక కేవలము యువరాజనే చెప్పుచువచ్చెను. మొదటి దండయాత్ర సమయమందితడు యువరాజయి యున్నప్పటికి యీరెండవదండయాత్రి సమయమున కతడు చక్రవర్తియే యయ్యెనుగద. 1759 సం॥లో యితడొనర్చిన మొదటి దండయాత్రనుగూర్చి మిల్లు యిట్లు వ్రాయుచున్నాడు.

"క్లైవుయొక్క సాహసము న్యాయాన్యాయ విచక్షణతో పనిలేకుండ నుండెను. అలంగీర్ పాదుషా బంగాళా దేశమునకు న్యాయముగ ప్రభువుగద. కాబట్టి, ఆదేశమునకు తన పెద్దకొడుకును తన ప్రతినిధిగ నియమించుటకు పాదుషాకు నిరాటంకమగు అధికారముకలదు. ఇట్టి ప్రతినిధిని యెదిరించుట కేవలము బహిరంగపు తిరుగుబాటుతప్ప యింకొకటికాదు."

చక్రవర్తి కొడుకు తనకుగల హక్కులను స్థిరపరచుకొనుటకై బంగాళా మీదకు దండెత్తివచ్చినప్పుడు క్లైవు అతనిని ఎదిరించుట తప్పని యీచరిత్రకారుని అభిప్రాయము. ఇది కేవలము న్యాయమగు అధికారిపై చేయబడిన తిరుగుబాటుగ మిల్లు భావించుచున్నాడు. అయితే, ఇదితప్పుకాదనియు, క్లైవు మీర్జాఫరుతో చేసుకున్న ఒడంబడిక ప్రకారము అతనికి విధిగ సహాయము చేయవలసియుండుటచే క్లైవు అట్లు చేయుట న్యాయమేయనియు హెచ్. హెచ్. విల్సన్ అను చరిత్రకారుడు పైయభిప్రాయమును పూర్వపక్షము చేయుచున్నాడు.

మొదటిదండయాత్ర సమయమందు మొగలాయి రాజకొమరుడు యువరాజయి యున్నప్పటికి రెండవ దండయాత్రనాటికి చక్రవర్తియే యయ్యెను. కావున, యిప్పుడితనిని కంపెనీ సేనాని కల్లియడ్ యెదిరించుట కేవలముతప్పు. ఇతడిప్పుడు చక్రవర్తిగావున ప్రజలును, ప్రతినిధులును సహా అతనికి వినయ విధేయతలు

చూపుట విధియైయున్నది. ఈ విధిని గుర్తించిన వాడగుటచేతనే కాబోలు చిన్న నబాబు మిరాణ్ యీదండయాత్రలో కల్లియడ్ చెప్పినప్రకారము చేయనిరాకరించెను. చక్రవర్తి దండును తరుముటకు ఒక గుఱ్ఱపురౌతునుకూడ యివ్వననెను. ఇందుకొరకే కల్లియడ్ చిన్ననబాబుయెడ యెంతో కటకటబడెను. మీర్జాఫరును, అతని కొడుకును తమకు న్యాయముగ ప్రభువైన ఢిల్లీ పాదుషాయెడ భక్తివిశ్వాసములతోనుంపుట యింగ్లీషువారికి గిట్టుబాటుగాని వ్యాపారము. ఈ కారణమును మనస్సులో పెట్టుకొనియే కాబోలు వారు బంగాళాలో యింకొక విప్లవమును పుట్టించి, మీర్జాఫరును తక్తుపైనుండి క్రిందికి పడద్రోయవలెనని ఆలోచించుచుండిరి.

మీరాన్ మీర్జాఫరుకు పెద్దకొడుకు. కాబట్టి, న్యాయతః తండ్రియనంతరమతడీ రాజ్యమునకు రావలసినవాడైయున్నాడు. బంగాళాలో ఏదైన విప్లవమును తెచ్చిపెట్టి, మీర్జాఫరును సింహాసనమునుండి త్రోసివేసి దానిపై యింకొకని యెక్కించే సందర్భములో యీమీరానుని హక్కు గమనింపకుండుటకు వీలులేదు. ఇట్టి సందిగ్ధస్థితిలో యీమీరాన్ చావు అనుమానములకు కారణముగాక తప్పదు. ఈ అనుమానమును కప్పి పుచ్చుటకై అతడు పిడుగుపడి చచ్చెనను పుకారును యింగ్లీషువారు పుట్టించిరి. కాని, యిది నిజముకాదనియు, మీరాను యెవరిచేతనో బుద్ధిపూర్వకముగ వధింపబడెననియు, ఇందు కర్నల్ కలియడ్‌కూడ జోక్యమున్నదనియు, కొందరు తలంచుచున్నారు. ఈయభిప్రాయముతో మేమేకీభవించుచున్నాము. మీరాన్ యింగ్లీషువారికి పక్కలో బల్లెమువలెనుండెను. ఇతడు చనిపోయిన ఒకనెల తరువాత హాల్‌వెల్ యిందునుగూర్చి గవర్నర్ వాన్‌సిటార్టుకు యిట్లని వ్రాసెను.

"తక్షణమే దర్బారులో ఒక పార్టీ బయలుదేరినది. దీనికి నబాబు కొడుకు మీరానును, రాజారఘువల్లభుడును, నాయకులు. ఇంగ్లీషువారి నాశ్రయించుకొని బ్రతుకు యీ దుస్థితిని విదిలించి పారవేయవలయునని వీరు నిరంతరము ఆలోచించుచుండిరి. ఈ పని జరిగేవరకు నీయధికారము కేవలము నామమాత్రమేయని వీరు మీర్జాఫరుకు నిత్యము పుల్లలుపెట్టుచుండిరి" (First report 1772—Appendix 9 పేజీ 225.)

ఇట్టిసందర్భములలో మిరానుని రహస్యపు చావు అనుమానములకు కారణముకాక తప్పదు. ఎవరైతే యితనియందు శత్రుత్వము వహించిరో, వారికిందు కొంత ప్రమేయమున్నదనియు అనవలసివచ్చును.

### బెంగాలులో రెండవ విప్లవము

సురాజాఉద్దౌలాను చంపించి, దేశములో విప్లవము పుట్టించుటవల్ల తమకేమేమి మేళ్లుచేకూరునని ఇంగ్లీషువారు తలంచిరో, ఆమేళ్లన్నియువారికి తదనంత

రము మూడేండ్లలోపలనే పూర్తిగ సమకూరిపోయెను. ఊహించుటకుకూడ శక్యముగాని విశ్వాసఘాతకపు పనులొనర్చి తాము ఎవరినైతే బంగాళా తక్తు నెక్కించుటకు తోడ్పడిరో, అట్టి స్వామిద్రోహి మీర్జాఫర్ తమకు వ్రాసిన కరారునామాప్రకారము యావత్తు షరతులను అక్షరాలా చెల్లించివేసెను. కాబట్టి, యింక యే మొగముపెట్టుకొని యితనినుండి వారు క్రొత్త సౌకర్యముల నింక నెక్కువగ గుంజుకొనగలరు? నిజముగ, అట్టి అవకాశమేమియులేదు. అయితే యేమి–వారికి నీతినియమములులేవు–అంతరాత్మయనునది అసలేలేదు. కాబట్టి, వారు తాముదాటివచ్చిన తెప్పను తగులబెట్టజూచిరి. మీర్జాఫర్ తమగుట్టును క్రమముగ కనిపెట్టినాడు. కనుక, తమమాటలిక సాగవనియు, తాము చెప్పినట్లు విని అతడు తనప్రజల పీడింప నిక నిచ్చగింపడనియు వారికి గట్టిగతోచెను. కాబట్టి యిట్టివాడిక తమ కెందుకు? వీనినెట్లయినను తన్ని పారవేసి యింకొకనిని తెచ్చుకొనవలెనని ఇంగ్లీషువారు చూచుచుండిరి.

ఈ యుద్దేశ్యములను మనస్సులో పెట్టుకొనియే ఇంగ్లీషువారు బంగాళాలో తిరిగి విప్లవమును (రెండవవిప్లవమును) పుట్టించిరి. హాల్‌వెల్ గవర్నరు పదవిని క్లైవునుండి టెంపరరీగా పుచ్చుకొన్న రోజునుండియే అతడు దేశములో నెట్లయినను విప్లవము పుట్టించవలెనని ఆలోచనలు చేయసాగినట్లు కనుపించుచున్నది. మీర్జాఫర్ యీ హాల్‌వెల్‌కు వల్లమాలినధనమును కట్టపెట్టెను. నిజముగ యిట్టిధనమును పుచ్చుకొనుటకితని కెట్టిన్యాయముగాని, హక్కుగాని, లేదు. ఇట్టివీని కృతజ్ఞత యే మనవచ్చును? తనకింతటి సొమ్మును ఊరికేకట్టిపెట్టి తనకెంతో ఉపకారము చేసిన వానిగొంతునేయితడు కోయదలచెను. ఈవిప్లవమునకై యితడు యెంతమందితోనో చేరి కుట్రపన్నసాగెను. సేనాపతియగు కల్లియడ్ ఆసమయమందు డిల్లీరాకొమరు నెదిరించుటకై బీహారురాష్ట్రమునకు పోయియుండెను. తన మనస్సులోని సంకల్పమును గూర్చి హాల్‌వెల్ సదరుసేనానికి 1760 సం॥ మే నెల 24–వ తేదీన వ్రాసెను. కాని, యీయెత్తున కతడు సమ్మతింపలేదు. ఇందుకు ప్రత్యుత్తరముగ సేనాని కల్లియడ్ 1760 సం॥ మే నెల 29–వ తేదీన యిట్లని వ్రాసెను:—

"మనమిప్పుడు మద్దతు చేయుచున్న యీమనిషి చెడ్డవాడయినప్పటికి, వీణ్ణితోసివేస్తే యింకొక మంచివాడు వస్తాడని నిశ్చయమేమి? ఇప్పుడున్న యీ గోడుకూడ పోవచ్చును.........యీ విప్లవము యెటుబోయి యెటువచ్చునో చెప్పజాలము. దీనిని గాలికి వదలివేసి ఊరుకోడానికి వీలులేదు. మనముకూడ ప్రయత్నించి కొంతపని చేయవలసియుండును. మనమే దీనిని సృష్టించి నడపవలసి యుండును. అట్లయినచో మనమే యెవరో ఒక మనిషిని తక్తుమీదికెక్కింపవచ్చును. అయితే వాడు వీడంత అసమర్థుడు, వీడంత అపనమ్మకస్థుడు, వేయేల, వీడంత దొంగకూడ కావచ్చును. లేక ఆ రాబోయే వాడు వీడంతపిరికివాడు,

వీడంత బుద్ధిహీనుడు కాకపోయినా, మనము చెప్పేటట్లు వినక మనకే ఎదురుతిరగ వచ్చును. ఈ నవాబు క్రూరుడని, పీడకరుడని, రాజ్యంలో వీణ్ణిఅందరు అసహ్యాంచుకొనుచున్నారని, కాబట్టి, యిట్టివానిని మనము మద్దతు చేయడము న్యాయమా అని అంటావు. అయితే, నేనొక్కమాట చెబుతావినను. ఈ దిక్కుమాలిన దేశంలో యిందుకు విరుద్ధమైన మంచి లక్షణములుగల మనిషి ఒక్కడుకూడ నాకు కనిపించడం లేదు. కాబట్టి వీడు ఎవరియెడ ఎట్టి దుర్మార్గాలు చేసినా వానితో మనకు నిమిత్తములేదు. మనపనికి వీడు పనికివస్తేచాలు. ఇట్లు వీడు మనకు పనికి వస్తున్నంతకాలము యితరవిషయాల్లో వాడెట్లా తగలబడితే మనకేమి? మనము ఎరగనట్లుసహించి ఊరుకుందాము....................మనముచూచుకోవలసినదల్లా ఒక్కటేవుంది. వీడు మనపైకిమాత్రము ఎక్కకుండ చూచుకోవాలి. మనము వీడి మెడమీద వేసినకాడిని క్రిందపడద్రోయడానికి వీడు ఏమాత్రము ప్రయత్నించినా, తక్షణమే అట్టి ప్రయత్నం సాగకుండ మనము మొగ్గలోనే అటకాయించాలి. ఎప్పుడే మాత్రము సందుదొరికినా మనకంపెనీ యజమానుల గౌరవ లాభములను, వారివర్తకమును, పలుకుబడిని పెంపొందించుటకు మనమందరము కలిసి ఆలోచించి గట్టిగ పనిచేయవలెను. ఏవో వెర్రిమొర్రి ప్లానులువేసి, వారికి అనవసరముగ ఖర్చు తగిలించకూడదు. మనమిట్లు చేసినట్లయితే, మనమెన్నడు దారి తప్పము, కాలుజారిపడము. మనమీమార్గమున నడచేటట్లయితే, విప్లవము వల్ల వీడిస్థానేరాబోయేవాడి హయాములో యెంతలాభకరముగ వ్యాపారము చేయగలమని ఆశించుచున్నామో, అంతటిలాభకరముగనే యిప్పుడున్న వీడిపాలనలోకూడ మనము వ్యాపారము చేసుకోవచ్చును.'' (**First report 1772, P. 160.**)

కాని, యీపై అభిప్రాయములను కల్లియడ్ సేనాని దరిమిలా మార్చుకొని విప్లవ ప్రయత్నమునకు అంగీకరించెను. తనయభిప్రాయమును యీరీతిగ దరిమిలా మార్చుకొనుటకుగల కారణమేమని పార్లమెంటు కమిటీవారు 1772 సం॥లో తనను అడిగినప్పుడు యీసేనాని యిట్లు సమాధానముచెప్పెను :—

''ఆకాలమందు దేశములో నేనున్న పరిస్థితులనుబట్టి నాకు జ్ఞాపకమున్నంత వరకు చెప్పెదను. క్లైవు నవాబుకు చేసియుండిన ఉపకారమువల్ల రాజ్యములో క్లైవుకు మంచిప్రతిష్ట గౌరవముపుండెను. ప్రతి విషయములోను అతనిచేయి పైగా నుండెను. కాని, యీయాధిక్యము, నేను సేనానిగ వచ్చినతరువాత తగ్గనారంభించెను. మనకంపెనీకి, నవాబుకు, మధ్య అత్యవసరముగ ఉండవలసిన విశ్వాసమునకు కొన్ని అవాంతరకారణములచే భంగమువాటిల్లెను. నేనెంత శ్రమపడి ప్రయత్నించినను అది సాగలేదు. కంపెనీ కొలువులో క్లైవు తరువాత హాల్‌వెల్ పెద్దయుద్యోగియయిన కారణముచేత—కేవలమీ కారణముచేతనే—యితడు క్లైవుకు దరిమిలా టెంపరరీ గవర్నర్ అయ్యెను. ఇతడు తాత్కాలికముగ నుండువాడనియు, అసలు ఖాయపు

గవర్నర్ యింకెవఁడో రానున్నాఁడనియు ప్రపంచమందందరికి తెలిసిపోయెను. అందుచే ఖాయపు గవర్నరుకు చూపవలసిన మర్యాదలను నవాబు యీ టెంపరరీ గవర్నర్ హాల్ వెల్‌కు చూపలేదు. ఇందుపై హాల్ వెల్‌కు కోపమువచ్చెను. నవాబుయొక్క దౌర్బల్యముచేతను, మనోనిబ్బరము లేమిచేతను, అతని పరిపాలనయందెన్నియో లోపములు హాల్ వెల్‌కు గానవచ్చెను. నవాబునందు తప్పులుపట్టుటకును, వానిపై నవాబును నిందించుటకును హాల్ వెల్‌కు ఎన్నియో అవకాశములు లభించెను. ఈ లోపములు నాకును కనిపించినవి. అయితే, యీయుభయులకు మధ్యగల స్పర్ధలను రెచ్చగొట్టుటకంటె వానినెట్లయిన శాంతింప జేయడమే నా విధియని నేను తలంచితిని.''

''హాల్ వెల్ గవర్నర్ పదవిలో నున్నన్నాళ్లు నేను యిట్లేచేయుచు కాలక్షేపము చేసితిని. సాధ్యమైనంతవరకు వ్యవహారములను ఇదిగో అదిగో అని దాటవేయుచు—పాకము ముదరకుండ—కాలమును యీడ్చితిని. నేను మొదటి ఉత్తరము వ్రాయునాటికి (మే నెలకు) నవాబు కొడుకు యింకను బ్రతికియుండెను. ఇతని విపరీతపు చావువల్ల దేశములోని పరిస్థితులు తలక్రిందులుగ మారిపోయెను. తదుపరి వాన్‌సిటార్టు గవర్నర్‌గవచ్చెను. అతని శక్తి సామర్థ్యములందు, వివేకమందు, నాకెంతో నమ్మకముండెను. కాబట్టి, అతను చెప్పిన ప్లానును నేను నిశ్చయముగ అంగీకరించితిని. అతని ఉద్దేశ్యములు నేనెరుగుదును. అవి స్వార్థరహితమైనవి, నిర్మలమైనవి. మా యజమానులకు లాభకరమైనవి, గౌరవ ప్రదమైనవి. అప్పటి కాల పరిస్థితులనుబట్టియు, బంగాళా దేశముయొక్క స్థితిగతులబట్టియు యావత్తు యిండియాలో కంపెనీవారికప్పుడున్న స్థితిగతులబట్టియు చూడగ మొత్తముమీఁద మేము చేసినపని మంచిదేయని ఋజువయ్యెను. (First Report P. 161.)

## మీర్జాఫరును పడద్రోయుటకు ఇంగ్లీషువారి కుట్ర

వాన్‌సిటార్టు బంగాళా దేశమునకు ఖాయపు గవర్నర్‌గవచ్చి చార్జితీసుకొను నాటికి నవాబుపై కుట్ర చాలదూరము వ్యాపించి, పాదుకొనిపోయెను. ఈ కుట్రదారులకందరకు హాల్ వెలే నాయకుడని వేరుగ చెప్పనక్కరలేదుగద. 1760 సం॥ ఆగష్టు 4-న తేదీన కలకత్తాలోని సెలక్టు కమిటీవారికిని, వాన్ సిటార్టుకును, సమక్షమున ఉపన్యసించుచు హాల్ వెల్ యిట్లుచెప్పెను :—

“ నా ఆరోగ్యము బాగుగలేదు ; మరి యితర కారణములచేతకూడ, నేను యిప్పుడే నాపదవినుండి విరమించుటకు తమ బోర్డువారి అనుమతిని గోరుచున్నాను. అయితే యిందుకుముందుగ, నేనొకటి మనవి చేయవలసియున్నది. ఈ దేశములో యిప్పుడు మనకంపెనీవారికిని, బంగాళా ప్రభుత్వమువారికిని, గల వ్యవహారముల

తాలూకు స్థితిగతులనుగూర్చి క్రొత్తగ యిప్పుడు వచ్చిన మన గవర్నర్ గారికి కొంతవిపులముగ మనవిచేసుకొనుట అవసరమైయున్నది.

...ఏది ఎట్లున్నను చిన్న నబాబుయొక్క ఆకస్మిక మరణమును గనుక మనము సరిగ ఉపయోగించుకుంటే, మనకొక మధ్యమార్గము గన్పట్టగలదు. ఈ వంశస్తులను బంగాళా రాజ్యాధిపత్యమునుండి కేవలము తొలగించుటతప్ప యింకొక మార్గము లేనంతదూరము వ్యవహారము ముదరలేదని మీకు తోచేటట్టయితే పోనివ్వండి - యితని ఆకస్మికమరణము మనకొక మధ్యమార్గమును చూపించు చున్నది గద ; దానిని మనము సరిగ ఉపయోగించుకుంటే సరి.''

మీరాను చావు హాల్ వెల్ కు ఎంతటి సంబరమును గలిగించెనో పై వాక్యములవల్ల తెలియగలదు.

నబాబుపై కుట్రపన్ని అతనిని సింహాసనమునుండి కూలద్రోసి, దానిపై తమ కిష్టుడైనవాని నొకని యెక్కించుటకు కంపెనీవారి కిప్పుడు మంచి వాటము దొరికెను. ఈ కుట్రలను పరిపక్వమునకు దెచ్చుటకుగాను, కంపెనీ యుద్యోగులు కలకత్తాలో అనేకసార్లు రహస్యముగ సమావేశమై గూఢమంతనాలు చేసిరి. ఈ సమావేశముల కన్నిటికి వాన్ సిటార్టు అధ్యక్షుడుగ నుండెను. కర్నల్ కల్లియడ్, విలియం బ్రైట్ వెల్, సమ్నర్, హాల్ వెల్, విలియం మాగ్వైర్ లు సభాసదులుగ నుండిరి. ఈ కుట్రదారులందరు 1760-వ సం॥ సెప్టంబరు నెలలో అనేకసార్లు సమావేశమైరి. 1760-వ సం॥ సెప్టంబరు 11-వ తేదినాటి సమావేశములో వీరందరు ''ప్రస్తుత పరిస్థితులను'' గూర్చి తమకుగల యభిప్రాయములనెల్ల వెల్లడించిరి.

''క్లైవు యీ దేశములో విప్లవము గలిగించిన నాటినుండి మన పలుకుబడి హెచ్చినది - ఈ పలుకుబడిని నిలువబెట్టుకొనుటకై మనము మన సేనను హెచ్చు చేసుకొనవలసి వచ్చినది. మన క్రింద యిప్పుడు వెయ్యి పై చిలుకు యూరోపియనులును, అయిదువేల శిపాయిలు వున్నారు. వీరిజీత నాతములుగాక, సైన్యమునకయ్యే యితర సాదరఖర్చులుకూడ కలుపుకుంటే యీసైన్య పోషణకై నబాబు ప్రత్యేకించి మనకిచ్చిన రివిన్యూ చాలదు. ఒడంబడికలలో ఏర్పరుచుకొన్న పెద్ద లాటు మొత్తములు వచ్చుచున్న మొదటిరోజులలో మనకీ చిక్కు కనిపించలేదు. ఇప్పుడీ మొత్తములన్నియు అయిపోయినవి. ఇకమీద, యింగ్లండునుంచి వచ్చే డబ్బు కనుపించదు. కాబట్టి యీ ఖర్చులకన్నిటికి సరిపోవుటకేగాక యితర ప్రాంతములలో మన కంపెనీ కెప్పుడైనా అత్యవసరముగ కావలసివచ్చే అవాంతరములకును, సరకులకొని ఓడల కెక్కించి పంపుటకును, వలయునంత ధనమును సంపాదించే ఉపాయమును మనము తక్షణమే కనిపెట్టితేగాని వీలులేదు......''

"కాబట్టి, "యింక యెక్కువ రివిన్యూను కంపెనీకి ప్రత్యేకించియుంచి దఖలు వ్రాసి యివ్వవలసినదని" మనము నబాబును కోరవలెను. "మేము చిక్కులుపడకుండ తేలికగ వసూలు చేసుకోడానికి అనుకూలముగ ఉండే జిల్లాల తాలూకు రివిన్యూనే మాకు సమస్తహక్కులతో సర్వసంపూర్ణాధికారములతో వ్రాసి యివ్వవలసినదని" మనము నబాబును కోరవలెను. రివిన్యూలో కొన్నికొన్ని బాపతులు మాత్రమే వసూలు చేసికొనవలసినదని నబాబు యిదివరకు మనకిచ్చియున్న ఉత్తర్వుల వల్ల లోగడ మనము అనేక చిక్కుల పడితిమి. ఇకముందట్టి చిక్కులులేకుండ, సదరుజిల్లాలపై వచ్చు అమాంబాపతుల రివిన్యూలను మనమే వసూలుచేసుకొనుటకు సర్వ సంపూర్ణ హక్కులతో వానిని మనకిచ్చివేయునట్లు మనమిప్పుడు నబాబును కోరవలెను."

"నబాబు దుర్బలుడు, బుద్ధి నిలకడలేనివాడు. అతనిచుట్టు కొందరాశ్రితులు చేరి అతని నిప్పుడు ఆడించుచున్నారు. మన పలుకుబడి హెచ్చితే, వాళ్ల పలుకుబడి తగ్గిపోతుందని వాళ్ల భయము. ఇది సహజమే. కాబట్టి, మనముకోరే యీ కోర్కెలకన్నిటికి వారు అడ్డు తగులవచ్చును. అయినప్పటికి, వారిమాటల నన్నిటిని త్రోసివేసి మన కోర్కెలకు నబాబు సమ్మతించునట్లు చేయించుకొనేబలము, పలుకుబడి మనకున్నదనియే మాతలంపు. కాబట్టి, మన కిప్పుడున్న యీ యావత్తు సైన్యమును అట్లే యుంచుకొందము. మన సేనలకు జీత మివ్వడానికి మనవద్ద కొంత డబ్బున్నది. ఈ సేనను తీసికొనిపోయి నబాబు కొలువుకు ఉపయోగిద్దాము..."

"మన కీ రాష్ట్రములలో మంచి పలుకుబడియున్నమాటైతే వాస్తవమే. అయితే యేమి, యీ పలుకుబడిని నిర్భయముగ కాపాడుకొనుటకుగాని, అవసరము వచ్చినప్పుడు అదిపోకుండ ఆదుకొనుటకుగాని, తగినంత గట్టిగ లేదు. ఈ పలుకుబడికి తగినంతలాభముగాని, యెక్కువ ప్రయోజనములుగాని, మనకు రావడములేదు. దేశములో శాంతి గట్టిగ నేర్పడితే, మన పలుకుబడికి మోసము రావచ్చును. ఇట్టి దుష్ఫలితములు రాకుండ నివారించుకొని, మనకు కావలసినవాని నన్నిటిని సంపాదించుకొని, భద్రపరుచుకొనుటకు మంచి అనుకూలమైన తరుణము యిప్పుడు వచ్చినట్లు మనకు గన్పించుచున్నది. ఇటువంటి అవకాశము మనకింక యెప్పుడును రాదు. మనకు అధికారమును, హక్కులను, ప్రసాదించే తరుణము యిదే."

"మన పద్ధతిని మార్చుకొనవలసినదని మనలను ప్రోత్సాహించే సందర్భము ముఖ్యముగ యింకొకటి ఉన్నది. అదేదనగ :—మనదగ్గర యిప్పుడు డబ్బులేదు. ఈ ద్రవ్యలోపము వ్యక్తిగతముగ మనకొక్కరికేకాదు. రేపు మనము కోస్తాలలో చేయబోయేపనులకు, పుదుచ్చేరిని వంచుటకు, మూడు రాజధానులలో సరకులను

కొని ఓడలకెక్కించి, రాబోయే సంవత్సరము యింటికి పంపించుటకు,—వీటికన్నింటికికూడ డబ్బు యిబ్బంది బహు యెక్కువగ వున్నది.'' (First Report 1772. P. 228—229.)

పై వాక్యములనుబట్టి మీర్జాఫరున దేమియు తప్పున్నట్లు గన్పట్టదు. అతడు ఫలాని తప్పుచేసినాడని కంపెనీవారైనను చెప్పలేదు. తానుచేసిన ఒడంబడికను మీర్జాఫరు తప్పకుండ చెల్లించెను. అయితే, యితనిని త్రోసివేసి, యింకొకనిని తెచ్చుకొనవలెనని కంపెనీ నౌకర్లేల యోచించిరి? కేవలము నీచమగు స్వార్థము తప్ప యిందుకు వేరొండుకారణము గన్పట్టదు. కక్కూరితికి నీతి నియమములేమిటి? కాబట్టి, డబ్బుకోసం వారు మీర్జాఫరును పడగొట్టబూనిరి. మిల్లు యిట్లు వ్రాయుచున్నాడు:—

''సురాజ్ ఉద్దౌలాను సింహాసనమునుండి పడద్రోసి, చంపి, తత్స్థానమున తాను కూర్చున్నప్పుడు మీర్జాఫరుకుగాని, యీ విప్లవమువల్ల తమచేతికి లభించిన అపార సంపదలను చూరగొనుచున్నప్పుడు యింగ్లీషువారికిగాని, ముందుఆలోచనలు లేకపోయెను. ఆ మొదటి విజయోత్సాహములో వారికండ్లు మిఱుమిట్లుగొనెను. మానవ స్వభావమునకు సహజమగు దురాశచేతను, తమయాశల కనుగుణముగ నున్నవానిని చప్పున నమ్ముటయందలి తొందరపాటుచేతను, యిండియాయందెంతో ధనరాసులుగలవను పుక్కిటి పురాణములను వీరు నిశ్శంకముగ నమ్మిరి. ఈ దేశము ప్రపంచములో మిక్కిలి బీదదేశమని తమకండ్లార చూచుకొనుచుండియు, ప్రపంచములో యింతటి భాగ్యవంతమైన దేశములేదని వీరు మురియుచుండిరి. మీర్జాఫర్ తమకు కట్టబెట్టిన ధనమంతయు అయిపోయినది. కంపెనీవారికి కలకత్తాలో గలిగిన నష్టములక్రింద తమకులభించిన యీ పెద్దమొత్తములనుజూచి వారికండ్లు మిఱుమిట్లుగొనెను. ఈ ఉత్సాహములో, రేపటిసంగతి ఏమియను ఆలోచనయే వారికి తట్టలేదని ఒక గవర్నర్ చెప్పెను. ఈ గవర్నరే మరియు నిట్లుచెప్పెను—నూతన పరిస్థితులతో తమకు ఖర్చులు యెక్కువయగునను సంగతిని దూరదృష్టితో ఆలోచించిన వాడెవడును కనబడలేదు. తీరా కండ్లుతెరచి చూచుకొనునప్పటికల్లా ఖర్చుకు, ఆదాయమునకు సరిపోకపోయెను. ఇంగ్లండునుండి వచ్చిన డబ్బుగాక, యిండియాలోకూడ చాల లాట్లు వచ్చినప్పటికి యెక్కుడి డబ్బు చాలక రెండేండ్లు పూరాగా నిండక పూర్వమే అప్పుచేయవలసివచ్చినది. (ఇది కంపెనీవారి స్థితి) ఇక మీర్జాఫర్ అవస్థ చెప్పనే అక్కరలేదు. మొదటినుండి వానిగతి అధ్వాన్నముగనే యుండెను. ఖజానా యావత్తు వట్టిపోయినది. దేశము యావత్తువట్టిపోయినది. తీర్చవలసిన అప్పులా, కుప్పలుగనున్నవి. ఈ అవస్థలో యితడు ప్రజలను పీక్కుతినవలసి వచ్చినది......'' (Vol. III. Page 213—214.)

జమా ఖర్చులను ముడిపెట్టుట యెట్లాయని యీ యింగ్లీషు కుట్రదారుల ఆలోచన. 1760 సం॥ సెప్టెంబరు 15-వ తేదీన తిరిగి వీరందరు సమావేశమై, "ఉభయ పక్షములకుగల కష్టముల" గూర్చి ఆలోచించసాగిరి.

"మనమిప్పుడు ఆలోచించవలసిన విషయములు రెండు :—ఒకటి :—ఇప్పుడు యింటినుంచి డబ్బేమివచ్చేటట్లులేదు. కాబట్టి ఈ కలకత్తా రాజధానిలోను మిగత రెండు రాజధానులలోనుకూడ మనకు కావలసిన ఖర్చుకు డబ్బు సంపాదించడం ఎట్లా? ఇక రెండవసంగతి యేమనగ :—యీ ప్రాంతములలో మొగల్ యువ రాజువచ్చి మాటిమాటికి అల్లరులుపుట్టించకుండ ఆపుదలచేయడం ఎట్లా? ఈ రెండు వ్యవహారాలుకూడ నబాబుమీద నేపెట్టి, అతనిని మనకంపెనీక్రింద వుంచుకుంటే బాగుంటుంది. మనమే అతనికిప్పుడు అండగ వున్నాము. ఈ యుపాయముచేత కావలసినంత దేశీయసేన మనసేనతో చేరుతుంది, ఏ యూరోపియను జాతిగాని, దేశీయ ప్రభువుగాని, మనలను యెదిరించలేరు."

"మనమిప్పుడాలోచించవలసిన విషయమేమనగ—యీ పనులన్నీ మొగలాయి యువరాజును యిప్పటివలె మనము యెదిరిస్తూ వుండడంవల్ల బాగా నెరవేరుతవా? లేకపోతే, యీ యెత్తుమార్చి అతనితో స్నేహముకల్పి, మన సేనలోకొంత అతనికి సహాయమిచ్చి ఢిల్లీకిపంపి, అతడు ఢిల్లీ సింహాసనమెక్కు సందర్భమున అతనికి మనము తోడ్పడడంవల్ల ఎక్కువ బాగా నెరవేరుతవా? ఇది మనమిప్పుడు ఆలోచించవలసిన విషయము."

ఈ రెండు యెత్తులలో సాధకబాధములగూర్చి—కంపెని యుద్యోగులిట్లు చర్చించిరి :—

"ఇంతకు, కావలసినసొమ్ము సమకూర్చడం యీ రెండు ఎత్తులలోకూడ చాలకష్టమే—దాటడానికి వీలులేనంతకష్టము. నబాబు కంఠముమీద యేదో బలవంతముగ షరతులుపెట్టి నొక్కితేతప్ప, యీతడు సామాన్యముగ ఒప్పుకోడన్న మాట స్పష్టమేగద. ఇక, ఇప్పటి యెత్తునుమార్చి యువరాజుతో స్నేహముచేస్తే, యుద్ధము ఆగిపోతుంది. అతడు ఢిల్లీకి వెళ్లిపోతాడు. అప్పుడు దేశముమీద భారము తగ్గిపోయి, మనకు కావలసిన డబ్బు సప్లయిచేయడానికి దేశమునకు వీలుగవుంటుంది. ఏలననగ, ఎటువచ్చినను దేశ ప్రజలేగద ఎవరికిగాని డబ్బు సప్లయి చేయవలసినవారు!"

"కాబట్టి, యీయెత్తులో మనతోచేరి, నబాబునుకూడ యిందులోకి దింపడానికి సహాయంచేసేవాళ్లకు పెద్ద ఉద్యోగాలేమైన యిస్తామని ఆశపెడితే వాళ్లు మనకు కావలసినడబ్బు సప్లయి చేస్తారు."

“నబాబును బలవంత పెట్టితేనేతప్ప, యీ రెండు పనులు జరుగవు. కనుక, యీ పని మనంతట మనము చేసినదానికంటె, మొగలాయి యువరాజుద్వారా—అతని హుకుములద్వారా—చేయిస్తే చాలా బాగావుంటుంది—పనికూడ చప్పున నెరవేరుతుంది.”

“కాబట్టి, పూర్వాపర, సందర్భములనన్నిటిని బాగా ఆలోచించినమీదట కమిటీవారికితోచిన మాటయిది (మనము మొగలాయి యువరాజుతో నేస్తము గట్టి) మనసేనలోకొంత అతనికి సహాయమిచ్చి ఢిల్లీకి పంపేయెడల యీప్రాంతముల లోని అల్లకల్లోలమంతయు అణిగిపోవును. ఇక్కడ మనకు మిగిలిన కొద్దిసేనతో మనస్థానములను భద్రముగా కాపాడుకొనవచ్చును. ఇది చాల మంచిపద్ధతి—ఇప్పు డున్నట్లుగ మనసేనను పాట్నాలో పెట్టుకొని యువరాజును ఎదిరిస్తూ కూర్చోవడం కంటె యిది చాలామంచిపద్ధతి. అదిగాక, మనము యువరాజుతో స్నేహముచేసి, మనకిక్కడ అవసరమైనప్పుడు అవసరమైనంత సేనను సమకూర్చుకునేటట్లుగ మనము అతనిచేత ఒప్పించేటట్టయితే, మనపని మరింతబాగుంటుంది. ఇందుకు యువ రాజు తప్పకుండ ఒప్పుకుంటాడనియే మాయభిప్రాయము.”

## మీర్కాసీముతో షరీక్ - కుట్ర ముఠా.

ఈ యాలోచన ప్రకారము కంపెనీవారు మొగలాయి యువరాజుతో స్నేహము చేయుటకును, మీర్కాసీమ్, రాయ్ దుర్లభ్ లతోచేరి కుట్రపన్నుటకును యేకగ్రీవముగ తీర్మానించుకొనిరి.

“మన ఖర్చులనుగూర్చియు, మనము డబ్బుకోసం పడుచున్న యిబ్బందిని గూర్చియు మీర్కాసీముతో గట్టిగ మాట్లాడుటకు ప్రెసిడెంటుకు అధికార మిచ్చితిమి. డబ్బు కక్కుర్తిని తీర్చుటకు అతడు మనకేమైనా సహాయం చేస్తాడేమో కొంచెము వాయించి చూడమంటిమి. అతని మాటల ధోరణినిబట్టి అతనిని యీ యెత్తులోకి లాగి నబాబునుకూడ యిందులోనికి దింపించడానికి యితడు సహాయం చేస్తాడేమో కనిపెట్టమంటిమి. రాయదుర్లభ్ అనే యింకొకమనిషి వున్నాడు. వీడు కంపెనీకి నమ్మకమైనవాడే—సందేహములేదు. వీడిద్వారా మొగలాయి రాకొమరునితో రాయబారము జరిపిస్తే బాగుంటుందనుకొన్నాము. అయితే యీ సమయములో మన ప్రెసిడెంటుకు యితనికి మాటలు జరిగినట్లు తెలిస్తే నబాబుకు అనుమానము తగులవచ్చును. కాబట్టి, యీ పనికి హాల్ వెల్ ను నియమించితిమి. ఇత డతనితో మాట్లాడి యెట్లాచేస్తే బాగుంటుందో కనుగొనమంటిమి.” (First report 1772) Page 229—230.

వాన్ సిటార్టు, హాల్ వెల్ లు, మీర్కాసీమ్, రాయదుర్లభులతో మాట్లాడి కుట్రపన్నిరి. గతరాత్రి తమకు జరిగినమాటలనుగూర్చి వీ రిరువురును 1760-వ సం||

సెప్టంబరు 16-వ తేదీనాటి సెలెక్టకమిటీ మీటింగులో యిట్లని చెప్పిరి :—అందు వాన్‌సిటార్టు యిట్లని చెప్పెను :—

"మన కడుపులోవున్న యెత్తుగడ లేమియు వాడికి చెప్పకుండగనే వాడి చేతనే (మీరాఖాసీమ్‌చేతనే) అన్నిపలుకులు పలికించితిని. నవాబుపై తాను అధికారము చెలాయించవలెననియు, యీ రాష్ట్ర వ్యవహారములు యావత్తు తానే నిర్వహించవలెననియు, వాడి కడుపులోవున్న ఊహలన్నియు, వాడే వెళ్లబెట్టినాడు. ఏ వేషమునకైతే వీడు పనికివస్తాడని మన మనుకున్నామో, ఆ వేషానికి పనికివచ్చే టట్లుగానే వున్నవి వీడిమాటలు."

"మాకు నీవంటే యెంతో గౌరవము. ఈ బంగాళా రాజ్యమును పరిపాలించుటకు నీవే తగినవాడవు - నీకంటె ఘను డింకెవ్వడున్నాడు - అని నేను వానిని ఉబ్బవేసి, పొగడి, కంపెనీ ఖర్చులకు మనము పడుచున్న యిబ్బందులనుగూర్చి మెల్లగ చెప్పసాగితిని........."

"ఇందుకితడు చెప్పినమాట యేమంటే—నా దగ్గర యిప్పుడు కంపెనీకి సప్లయి చేయడానికి తగినంత డబ్బులేదు. దేశవ్యవహారములును గనుక, యిప్పుడు నవాబు యేర్పాటు చేసియున్నవారి చేతులలోనుంచి తప్పించి నా చేతులలో పెట్టడానికి మీరు పూనుకొన్నట్లయితే అప్పుడు మీరు కోరినంత ధనము యివ్వడానికి నాకు అవకాశముంటుంది"......అని అతడనెను.

రాయ్‌దుర్లభ్ యెడ తనకు మంచి నమ్మకము గలదనియు, అతనిని తానొకసారి చూడగోరెదననియు మీరాఖాసీమ్ అనెను. ఈ యిరువురకు సమావేశమును రహస్యముగ చేయుటకు వీలులేకపోయినది. యీ సంగతి నవాబుకు తెలిస్తే అతడు అనుమానపడుననియు తలచితిని. అందుచేత, మన ప్లాను యావత్తు మీరాఖాసీముకు 'కోజా పెట్రూస్' ద్వారా తెలియపర్చడానికి యేర్పాటు చేసినాను."

రాయ్‌దుర్లభ్‌తో మాట్లాడి కుట్రపన్నుటకు నియమింపబడిన హాల్‌వెల్ యిట్లు చెప్పెను :—

"నేను యిచ్చిన యిషారాను అతడు యెంతో ఆప్యాయనముగ గ్రహించినాడు. యావత్తు పతకము బాగుందన్నాడు......మీరాఖాసీమును పైకి తేవడానికి మనము చేసే ప్రయత్నం చాలా బాగుందన్నాడు. ఈ ప్లాను యావత్తు జయప్రదంగా కొనసాగడానికి తాను మనకు పూర్తిగా సహాయం చేస్తానన్నాడు. దేశములో శాంతిని, సంపదలను కాపాడడానికి, కంపెనీవారి వర్తకం పలుకుబడి అభివృద్ధికావడానికి యింతకంటె మంచిమార్గం లేదన్నాడు." (First Report Page 230—231)

## మీర్జాఫరును సింహాసనమునుండి దింపివేయుట

నబాబుపై పన్నిన కుట్రలో కంపెనీవారు పూర్తిగ జయముగాంచి 1760 సం॥ అక్టోబరు నెల మధ్యమందు మీర్జాఫరును సింహాసనమునుండి క్రిందికి దింపివేసినారు. * ఈపనిని వీరెట్లుచేసినది అక్టోబరు 21-వ తేదీగల వాన్‌సిటార్టు,

* Calendar of Persian Correspondence (Calcutta 1919) అను గ్రంథము యొక్క మూడవసంపుటము. ఉపోద్ఘాతము, 8-వ పేజీలో మౌల్వీ బద్రుద్దీన్ అహమ్మద్ గారు యిట్లు వ్రాయుచున్నారు :—

“కంపెనీవారు మాటిమాటికి తనపైవేసి రుద్దుచున్న విపరీతపుకోర్కెల కన్నిటికి తాను నోరెత్తక ఒప్పుకుంటూ వస్తేనే తప్ప తాను వారిని తృప్తిపరచలేని స్థితికివచ్చితినని నబాబు నిర్మొగమోటముగ ఒప్పుకొనెను. కంపెనీకిని దానితాలూకు ప్రధానోద్యోగులకును వేర్వేరుగ తాను యిచ్చెదనని ఒప్పుకొన్న విపరీతపు మొత్తముల నన్నిటిని చెల్లించివేయుటతో అతని ఖజానాయావత్తు యిదివరకే ఖాళీయైపోయినది. బంగాళా దివాళాదీసినది. అరాచకములోనికి త్వరితగతిని పోవుచున్నది. మొగల్ యువరాజు దండయాత్రతో యీ స్థితి మరింత అధ్వాన్నమైనది. నబాబు నిస్సహాయత వెల్లడియైనది. తమ యండలేనిదే నబాబెట్లు తనరాజ్యమును పైదెబ్బలనుండి కాచుకోలేడో కంపెనీవారికి బాగావెల్లడియైపోయినది. ఈ సమయంలో తాముచేసిన సహాయానికి ప్రతిఫలముగ, తాము నబాబునుండి యింకను యెక్కువ లాభములు గుంజుటకు తమకు హక్కుగలదని కంపెనీవారు తలపసాగిరి. సిల్‌హెట్, ఇస్లామాబాదు పరగణాలపై తమకు ఫౌజుదారీ యిమ్మనికోరుట యిట్టి కోర్కెలలో ఒకటి. కాని, యింతదూరము పోవుటకు నబాబు యిష్టపడలేదు. అందుపై యితనికిని కంపెనీవారికిని వ్యవహారము చాలదూరము ముదిరి, అసలు చెడేటట్టుగ కనిపించినది. ఇన్నాళ్ళనుండి యీ స్థితిగతుల నన్నిటిని మిక్కిలి సూక్ష్మబుద్ధితో కనిపెట్టిచూచుచున్న పడుమ కుట్రవా డింకొక డుండెను. ఇతడే మీర్కాసీము. ఇతడు మీర్జాఫరుకు అల్లుడే. కంపెనీవారితో వ్యవహారము ఫైసలు చేసికొని వచ్చుటకుగాను మామగారీతనిని తన ప్రతినిధిగ కలకత్తాకుపంపెను. ఇతడు అప్పుడు గవర్నర్‌గనున్న వాన్‌సిటార్టుతో రహస్యముగ మాట్లాడి, అక్కడికక్కడనే తన స్వలాభము నిమిత్తమొక లజ్జాకరమగు బేరమును కుదుర్చుకొనెను. తన మామను సింహాసనము మీదనుండి తీసివేసి, దానిపై తనను కూర్చోపెట్టేయెడల తాను కంపెనీవారికి బర్ద్వాన్, మిడ్నపూర్, చిట్టగాంగు, అను మూడు జిల్లాలనిచ్చివేసెదననెను. ఇంతటి మంచిబేరమును చెడగొట్టుకొనుటకు కంపెనీవారికి తగమా? పలాసియుద్ధమునాటి పాతస్నేహితుని త్రోసిరాజని, 1760 సం॥ అక్టోబరునెల కల్లా కంపెనీవారు తమకొత్త స్నేహితుని తక్తుమీద కూర్చుండబెట్టిరి. మీర్జాఫర్ తన కూతురగు ఫతిమాబీగము నిచ్చి యీ మీర్కాసీముకు పెండ్లిచేసియుండెను. ఇతడు చాల తెలివిగలవాడు. జ్యోతిశ్శాస్త్రములోను, గణితశాస్త్రములోను, మంచిప్రవీణుడు. చిన్నప్పటినుండి యితడు పైకివచ్చు సూచనలు గాన్పించెను.

“ఇతడు సురాజ్ ఉద్దౌలాను వెంబడింప బంపబడినప్పుడు, సురాజ్ ఉద్దౌలా భార్య లతీఫ్ ఉన్నిసాబీగమ్ తాలూకు నగలపెట్టె నొకదానిని వీడుకాజేసెను. దీనితో వీడు ఆర్థికముగ బాగుపడెను.”

“........మీర్జాఫర్ కొడుకు మిరాన్‌చచ్చిపోయిన తరువాత యీ మీర్కాసీము తరుచు మామగారి దగ్గరకు పోవుచుండెను, అతని కెంతయో సేవచేయుచుండెను. మామకు అల్లునియందు

కల్లియడుల జాబునలన తెలియగలదు. ఈ జాబును వీరు 1760 సం॥ అక్టోబరు 24-వ తేదీన సెక్రెట్రు కమిటీవారికి చదివి వినిపించిరి :—"ఆర్యులారా! ఇక్కడివ్యవహారములు మనకంపెనీకి అనుకూలముగ పరిష్కారమైనట్లు నిన్న గవర్నర్ వ్రాసిన ఉత్తరమునుబట్టి మీకు తెలిసియేయున్నది. ఈ విజయము మనకెట్లు గలిగెనో, ఆతప్సీళ్లన్నిటిని తమకిప్పుడు మనవిచేసెదము."

"ఈ నెల 5-వ తేదీన నవాబు కాశింబజారులోనున్న మనగవర్నరు దర్శనార్థమైవచ్చెను. ఇందుకు ప్రతిగ మనగవర్నరుకూడ మర్నాడు నవాబును దర్శించవెళ్లెను. ఈ రెండు రోజులుకూడ వట్టి కబుర్లతో సరిపోయినది. 18-వ తేదీన తిరిగి నవాబు యిక్కడకి వ్యవహారము మాట్లాడుకొనునిమిత్తమైవచ్చెను. తనమంత్రులెల్లఅవకతవకగ ప్రవర్తించుచున్నదియు, అందువల్ల తనవ్యవహారములు కంపెనీవ్యవహారములుకూడ చెట్టి అపాయస్థితికివచ్చినదియు, ప్రజలెల్లు అన్నములేక అవస్థపడుచున్నదియు-యివన్ని-నవాబుకు బాగానచ్చచెప్పుటకుగాను మేము మూడు ఉత్తరములను తయారుచేసి యుంచితిమి. కొంతసేపు స్నేహముగ మాట్లాడిన పిమ్మట మనగవర్నర్ యీ మూడు ఉత్తరములను మెల్లగ నవాబు చేతికి అందిచ్చెను. "ఈ ఉత్తరములను చదువుకొని అతడు చాల చికాకుపడినట్లు కనిపించెను. అందలి చెడుగులకు సమాధానము చెప్పుటకుబదులుగ అతడు యీ ప్రసంగమును ముగించి తక్షణమే అక్కడనుండి లేచిపోవలెనని చూచెను. కాని, మేమతనిని పోనీయక, భోజనము తోటలోనికే తెప్పించుకొనమనిచెప్పి తనపరిపాలనలో గల యీ లోపములను సర్దుబాటు చేసేమార్గము చెప్పితేగాని వీలులేదని అతని నొకవిధముగ బలవంతపెట్టితిమి. ఈ వయస్సులో, యీదుఃఖములో తానీకష్టముల నీదలేనని తుట్టతుదకు అతడే ఒప్పుకొనెను. అయినప్పటికి, తనస్నేహితులతో ఆలోచించుకొనుటకు తనకు కొంత పురుసత్తుకావలెననెను. అందుమీద మేమిట్లంటిమి—మీకిటీవల సలహాలు చెప్పుచున్నవారు నిజముగ మీకు స్నేహితులుగారు, వారు మీకు పరమశత్రువులు. తిరిగి మీరు వారివద్దకేవెళ్లి సలహా అడిగేయెడల,

---

యెంతనమ్మకంకుదిరిందంటే, కంపెనీవారితో తన వ్యవహారాలు పరిష్కారముచేసుకొని రావడానికి యితనినే మీర్జాఫర్ తన ప్రతినిధిగ కలకత్తాకుపంపించెను. మామకంటే ఉల్లుడే తెలివిగలవాడగుటచే "నేనునూ మీకు స్నేహితుడనే" యను భావమును యితడు కంపెనీవారి మనస్సులోగట్టిగ గలుగునట్లు చేసుకొనెను. రాజ్యపాలనకు మామకంటె అల్లుడే గట్టివాడని కంపెనీవారికితోచెను. మీర్జాఫర్ కుటుంబములో యితనికంటె గట్టివాడెవడు లేక పోవడంవల్ల, యితనినే మామగారు తరుచుగ యింగ్లీషువారితో వ్యవహారాలు పరిష్కరించుకోడానికి కాశింబజారు వగైరాచోట్లకు పంపుచుండెను. తనకు వప్పగించబడిన పనులను యితడు సమర్థతతోను, మంచిచాకచక్యముతోను నెరవేర్చుచు వచ్చుటచేత, శివిల్ మిలిటరీ యుద్యోగులందరు యితనిని చాలగౌరవించుచుండెడివారు.

మీకష్టములు మరింత యెక్కువగునేగాని, తగ్గవు. మీబంధువులలో—మీకెక్కువ నమ్మకము, ఆంతర్యముగల—ఒక మనిషితో మీరు సంప్రతించితే బాగావుంటుంది. అట్టివారి పేర్లను అయిదారింటిని నబాబే పేర్కొనెను. అందులో మనమీర్కాసీము పేరుకూడవున్నది. ఈ అయిదారుగురిలో మీకిప్పుడీ సంకటస్థితిలో బాగా సహాయము చేయగలడని మీకెవరియందు ఎక్కువ నమ్మకమున్నదో చెప్పండి, అనిఅంటిమి. అతడంతట నిశ్శంకముగ మీర్కాసీము పేరేచెప్పెను. 'అట్లయితే అతనికిప్పుడు కబురు పంపండి' అనిచెప్పితిమి. కాని, అతడేలనో యిందుకు ఒక పట్టునగాని ఒప్పుకొనలేదు. మీర్కాసీము వచ్చుట చాలఆలస్యమైనది. ఈలోగా పాపమీముసలివాడు మనోవేదనచేత చాలఅలసి, యిక యిక్కడకూర్చుండలేను యింటికిపోయి పడుకుందుననెను. అతని యవస్థచూచి, అతనినింక బలవంతపెట్టుట బాగుండదని మేమతనిని పోనిచ్చితిమి. ఆతనినింక అక్కడకూర్చుండ బెట్టుకొనియు లాభములేదని మాకు గట్టిగతోచినది. ఏలననగ, మీర్కాసీమునం దతనికి యీర్ష్య హెచ్చుగుచున్నట్లు మాకుతోచెను. కాబట్టి ఏదోవిధముగ యితనికంతము మీదికి తీసుకువస్తేనేగాని, యితడెట్లును మీర్కాసీముకు రాజ్యమప్పగించడను సంగతి మామనస్సులకు నిశ్చయమైపోయినది—కాబట్టి, యిప్పుడిక వీనితో పని యేమనితలచి, వానిని పోనిచ్చితిమి. ఒకటి, రెండుగంటలైనపిమ్మట మీర్కాసీము వచ్చెను. అతడు చాల భయోత్పాతముతోనుండెను. మామ తనకు రాజ్యమిచ్చుటకు బదులుగ, తనను యేదో ఉపాయముచేత చంపించేటట్లున్నాడని అతడు భయపడుచుండెను. కాబట్టి, "నీరక్షణకుతగు బందోబస్తు జరిగేవరకు నీవు మామ యింటికిపోవద్దు" అని చెప్పితిమి. ఈ తలంపే మీర్కాసీము మనస్సులోకూడ నుండెను."

"నబాబుకు మనమిచ్చిన ఉత్తరములలోని సంగతులకు తగుసమాధానమాలోచించి చెప్పుటకు అతనికి ఒకరోజు (మర్నాడు 19-వ తేది మాత్రము) పురుసత్తు యివ్వదలచితిమి. ఈలోగా అతడేదో ఆలోచించి సమాధానమిచ్చుననుకొంటిమి. ఆరోజంతయు మాకేమికబురురాలేదు. పైగా, ఆతడు తిరిగి తనపాత సలహాదార్లతో—కెనరామ్, మూనిటాల్, చెకోన్, మున్నగువారితో—చేరి యేదోగూడుపుఠాణీ చేయుచున్నట్లుగ మాకు వర్తమానము తెలిసినది. వీరిసలహా దేశక్షేమమునకును, ముఖ్యముగ కంపెనీ క్షేమమునకును, విరుద్ధముగనుండునని మాకు నిశ్చయముగ తెలియును. కాబట్టి యికఆలసించుట లాభములేదనుకొంటిమి. తక్షణమే, నబాబు భయోత్పాతస్థితిలోనుండగనే, యేదో అఘాయిత్యము చేస్తేనేగాని వీలులేదని నిశ్చయించుకొంటిమి. ఈ రాత్రికంటె మనకు మంచిసమయము దొరకదనుకొంటిమి. ఏలననగ, ఆరోజు (అక్టోబరు 19-వ తేదీ) హిందువుల*

* బహుశాః దసరా—దుర్గపూజా—పండుగలుకాబోలును.

పండుగదినములలో ఆఖరురోజు. ఆటపాటలతో జనమంతయు అలసి, సొమ్మసిలి నిద్రపోవుచుందురు. కాబట్టి ఆరాత్రియే కర్నల్ కలియడు రెండు మనదళములను, ఆరు శిపాయిదళములను, వెంటబెట్టుకొని బయలుదేరి రాత్రి 3, 4 గంటల మధ్య నదినిదాటి, త్రోవలో మీర్కాసీము ముఠాను కలుపుకొని నడచిపోయి తెల్లవారకమునుపే నబాబు పరున్నరాజమందిరమును ముట్టడించునట్లు యేర్పాటుచేసితిమి. ఎట్టిఅల్లరిగాని, రక్తపాతముగాని, గలిగించుటకు యిష్టములేక, మనగవర్నరు నబాబు పేర ఒక ఉత్తరము వ్రాసి, 'దీనిని నీకత్యవసరమని తోచినప్పుడు నబాబు చేతికియ్యి' అని దానిని మనసేనానికిచ్చెను............

"అనుకున్న ప్రకారము అన్ని యేర్పాటులు జాగ్రత్తగ, అతి రహస్యముగ జరిగిపోయినవి. మన సేనాని సేనలతో నదినిదాటి, మీర్కాసీము ముఠానుకలుపుకొని, యెట్టి అలికిడిగాని లేకుండ, సరిగ అనుకొన్నవేళకు, రాజమందిరమునకు ముందుగల ఆవరణలో ప్రవేశించెను. లోపలి ఆవరణయొక్క ద్వారములు వేసియుండుటచే, మన సేనాని తన సేనలను బయట ఆవరణచుట్టు నిలువబెట్టి, గవర్నరు యిచ్చిన ఉత్తరమును నబాబుకు పంపించెను. ఆ ఉత్తరంచూచిన తక్షణమే నబాబు ఆగ్రహముతో మండిపడెను. ఏమైతేఅయింది, ఎదురుతిరిగి పోరాడుతాను, నాఖర్మం యెట్లాగైతే అట్లా అవుతుంది, అని అతడు చిందులు త్రొక్కెను. పోరాటములోనికి దిగకుండ చూడవలెనని మన సేనాని చాలసేపు ఓపికపట్టెను. హేస్టింగ్సు, లూషింగ్టన్ అనువారలద్వారా నబాబుకు మనసేనానికమధ్య చాలసేపు మాటలు నడచెను."

...రెండుగంటలవరకు యేమియు తేలలేదు. అప్పటికిక యెదిరించి లాభము లేదని నబాబుకు కాళ్లు చల్లబడెను. "రాజ్యం నీకు యిచ్చివేస్తారమ్మ"ని అప్పుడు అతడు మీర్కాసీముకు కబురు పంపించెను. "రాజ్యాధికారముద్రలను (సీళ్లను) యితర అధికార చిహ్నములను అన్నిటిని నీ కిచ్చివేసెదను. నీపేరనే నౌబత్ వేయించెదను. అయితే నీవుమాత్రము రాజ్యభారము యావత్తు వహించి సేనకివ్వవలసిన బకాయిజీతములన్నీ చెల్లించివేసి, ఢిల్లీచక్రవర్తి కివ్వవలసిన కప్పమును సరిగ చెల్లించవలెను. నన్ను చంపకుండ నా ప్రాణములను, గౌరవమును కాపాడి నా జీవనమునకు తగిన మనోవర్తి యిప్పిస్తే చాలును" అని అతడు మీర్కాసీముకు కబురు పంపించెను. ఈ షరతులకన్నిటికి మీర్కాసీము ఒప్పుకొనెను. అంతట మే మతనిని నబాబుగ ప్రకటించితిమి." (First report 1772 Page 231)

బంగాళములో జరిగిన యీ రెండవ విప్లవపుకథ యావత్తు ఇంగ్లీషువారి నోటిమీదుగనే చెప్పించితిమి. ఈ పైమాటలనుబట్టియే కంపెనీవారు తమ నీచ

స్వార్థమునకై యెంతటి ద్రోహకార్య మొనర్చిరో స్పష్టము కాగలదు. * మీర్జాఫరును త్రోసివేయుటలో వాన్‌సిటార్టు మున్నగు ఇంగ్లీషువారు చేసిన ద్రోహము ముందర అమెరికాలో స్పెయిన్ దేశస్థులు చేసిరన్న ఘోర దురంతములు ధూపమునకైనను సరిరావు.

మీర్జాఫరు కలకత్తాకు వెళ్లిపోయెను. అతని కక్కడ భద్రముగ నివాస మేర్పరచిరి.

తన మామకు నెలకు రెండువేల రూపాయల మనోవర్తి యిస్తే చాలునని మీర్కాసీము 1760-వ సం॥ డిశంబరు 14-వ తేదీన ఇంగ్లీషు గవర్నర్‌కు ఉత్తరము వ్రాసెను.

ఈ సంగతి తెలిసియే కాబోలు మీర్జాఫరు ఇంగ్లీషు గవర్నరుచేత 1760-వ సం॥ డిశంబరు 20-వ తేదీన యీ దిగువరీతిగ వ్రాయించెను :—

"మీర్జాఫరు నబాబుగిరి వదలుకొన్నాడు. అతడు మక్కాకు యాత్ర వెళ్లుచున్నాడు. అందుకు తగినడబ్బు కావలెనని కోరుచున్నాడు." (Calendar of Persian Correspondence Vol. I Pages 43, 44.)

మీర్జాఫరును సింహాసనమునుండి తీసివేసినందుకు యేదోకారణము చెప్పవలెను గద. కాబట్టి, కలకత్తాలోని ఇంగ్లీషు అధికారులందరు ఒకనాడు (1760-వ

---

* ఆంగ్ల సేనాని కల్లియడ్‌కును నబాబుకును మధ్య మాటలు నడిపించిన టూపింగ్‌టన్ అను నతడు యీ సందర్భములనుగూర్చి 1760 సం। డిశంబరు 3-వ తేదీన క్లైవుకు వ్రాసిన ఉత్తరములో యిట్లున్నది :—

"నబాబుకును, మన సేనాని కల్లియడ్‌కును, మధ్య సంభాషణ జరిగెను. ఆ సందర్భమందు నబాబు చెప్పిన మాటలివి - నాకు జ్ఞాపకమున్నంతవరకు చెప్పుచున్నాను: —

"ఇంగ్లీషువారు నన్ను తక్తుమీద కూర్చోబెట్టారు. మీయిష్టం - యిప్పుడు దింపేస్తే దింపేసెయ్యండి. అన్నమాట తప్పడం న్యాయమని మీరు తోచింది. నేనుమాత్రం అట్లు తప్పను. నాకా దురుద్దేశమే వుంటే నేనిపాటికి 20 వేలమంది సైన్యాన్ని పోగుచేసి, మిమ్ము హతమార్చేవాణ్ణే. మా అబ్బాయి మిరాన్, యిట్లా జరుగుతుందని నాకు చెబుతునే వచ్చాడు." (Malcolm's life of Clive Vol. II. Page 268.)

మాల్కామ్ మరియు యిట్లు వ్రాయుచున్నాడు :—

"ఈ పనియంతా లూషింగ్‌టన్‌కు యిష్టములేనట్లు అతడు చెప్పిన యీ దిగువ మాటలవల్లనే తెలియుచున్నది." ఈపని చేసినందుకుగాను కంపెనీవారికి బర్ద్వాన్, మిడ్నపూర్, చిటగాంగు, జిల్లాలు రానై యున్నవి. అయితే, వన రాజ్యంలో మూడోవంతు యీ ప్రకారంగా ఇంగ్లీషువారి కిచ్చివేసి, యీకొత్త నబాబుమాత్రము వెనుకటి ముసలినబాబుకంటె యెక్కువగ తనవారి కెట్లు జీతనాతము లివ్వగలడో నాకు బోధపడకున్నది.

సం॥ నవంబరు 10-వ తేదీన) సమావేశమై ' బెంగాల్ నవాబు గిరిలో యిటీవల జరిగినమార్పునకు గల కారణము'లనన్నిటిని ఏకరుబెట్టి, ఒకపెద్ద జాబితా తయారు చేసిరి. ఆ జాబితాలో యిట్లు వ్రాసిరి:—

"నవాబు మీర్జాఫర్ బహుక్రూరుడు; దురాశాపాతకుడు, అతిలోలుడు, ఇతనిచుట్టు చేరువారంతా కేవలమతనికి బానిసలో, స్తోత్రపాఠకులో, తన యింద్రియలోలత్వమునకుపకరించు తార్పుకాండ్రో తప్ప యింకెవరులేరు. కేవలము నిష్కారణముగ యితడు చంపించిన మనుష్యులకు మితములేదు. ఇందులో అన్ని తరగతుల మనుష్యులువున్నారు"......(First report 1772. Page 444.)

మీర్జాఫరును మానవాకారములోనున్న రాక్షసిగవర్ణించి, సమస్త దోషములను, ఘోరకృత్యములను అతని కంట గట్టుటకై యింగ్లీషువారు ప్రయత్నించిరి. ఇతడనేకమందిని చంపించెననిరి. కాని, యివన్ని అబద్ధములని 1765 సం॥ సెప్టంబరు 30-వ తేదీన క్లైవు ముస్నగువారు సీమడైరెక్టరులకు వ్రాసిన ఉత్తరమును బట్టియే స్పష్టముకాగలదు. అందిట్లున్నది :—

"పాపము! గతించిన మీర్జాఫర్ నవాబునుగురించి మనము అన్యాయము ఆడుకోనరాదు. కావున, ఇక్కడి నిజస్థితిని మేమిప్పుడు వెల్లడించవలసిన బాధ్యత మాపైకలదు. కుంపెణీ డైరెక్టర్లకు హాల్వెల్ వ్రాసిన యుత్తరములో నుదహరింపబడిన ఘోరహత్యలలో వేనినిగాని నవాబు గావించియుండలేదు. ఇవన్నియు శుద్ధ అబద్ధములు. నవాబు సౌశీల్యమును మిక్కిలి క్రౌర్యబుద్ధితో మలిన మొనర్చుటకై పలుకబడిన దురాగతపు పలుకులివి. నవాబు చంపించెనని చెప్పిన 78 గురిలో 76 గురు యిప్పటికి బ్రతికియే యున్నారు. ఇద్దరుమాత్రము యెట్లో నవాబుకు తెలియకుండ, అతనియనుమతిలేకుండ, చంపబడినట్లు తెలియుచున్నది. ఈ బ్రతికియున్న 76 గురును జెయిలులోనుండి మొన్న మొన్ననే క్రొత్త నవాబు విడుదలజేసెను."

మీర్జాఫర్పై దోషములెంచు యీ మహానుభావుల సత్యసంధత యిట్లు వెలుగుచున్నది! స్పెయిన్ దేశస్థులు అమెరికాలో తాముపట్టుకొన్నవారిని న్యాయస్థానము ముందుకు తెచ్చి, నేరములకు తగుసమాధానము చెప్పుకొనుటకైనను వారికి అవకాశమిచ్చిరి. కాని, అట్టి అవకాశమును మన యింగ్లీషువారు మీర్జాఫరుకు యిచ్చినపాపమునబోరైరి. మీర్జాఫర్ యెడ న్యాయముగ ప్రవర్తించుట కంపెనీ వారికి గిట్టుబాటుగాని పనిగద; ఏదో పేరుపెట్టి వీన్ని సింహాసనంమీదినుంచి తోసేసెయ్యమన్నారు. అంతే, దున్నపోతు యీనినదంటే దూడను కట్టివెయ్యమన్నారు. ఇతనిని సింహాసనమునుండి త్రోసివేయడంవల్ల కంపెనీవారికి జేబులునిండినవి. ఇరవైలక్షల రూపాయల లాటు ఒక్కసారిగ వారికి తేరగవచ్చి పడినది.

కంపెనీకి కలిగిన లాభములు :—(1) టంకసాల

ఇంగ్లీషువారు చాలకుటిల స్వభావులు. కుట్రబుద్ధిగల వారు. తమ కేదో లాభము చూచుకొనిగాని వారు బెంగాల్‌లో రెండవ విప్లవమునకు దిగలేదు. దీనివల్ల వారికిగలిగిన లాభములు చాలవున్నవి. కలకత్తాలో టంకసాల పెట్టుకోడానికి వీలు లేదనిచెప్పి వెనుక సురాజ్ ఉద్దౌలా కంపెనీవారికి అనుమతి యివ్వలేదు. దరిమిలా కొన్ని నిర్బంధములకులోబడి, టంకసాల పెట్టుకోవచ్చునని కంపెనీవారు అతనిని బలవంతముగ ఒప్పించిరి. కాని, సురాజ్ ఉద్దౌలా చావకముందు కంపెనీ వారీ యవకాశము వినియోగించుకొన్నట్లు కన్పించదు. ప్లాసీ యుద్ధానంతరమే కంపెనీ వారు కలకత్తాలో టంకసాల యేర్పరచుకొని 1757 సం၊ ఆగష్టు 19-వ తేదీన మొట్టమొదటి రూపాయలను ముద్రించినట్లు ఆర్మ్ అను చరిత్రకారుడు వ్రాయుచున్నాడు. (Vol. II. P. 118—Madras Edition).

కాని, దీనివల్ల తామనుకొన్నంత లాభము కంపెనీవారిక రాలేదు. దేశీయ షాహుకారులగు సేటుల మూలముగ తమ టంకసాలకు నష్టము వచ్చుచున్నదని 1759 సం॥ డిశంబరు 29-వ తేదీ ఉత్తరములో కంపెనీ నౌకర్లు తమ సీమ యజమానులకిట్లు వ్రాసుకొనిరి :—

"ఈ మధ్య రెండుమూడు పర్యాయములనుండి యింగ్లండునుండి లోహపు ముద్దలేమియు రాకపోవడంచేత, యిక్కడ మన టంకసాలవల్ల మనకేమియు లాభము రావడంలేదు. అదిగాక, మనమిక్కడ సిక్కా రూపాయలను ముద్రించుట యిక్కడి షాహుకార్లకు గిట్టుబాటుగలేకున్నది.

నాణ్యములోను, తూకములోనుకూడ మన సిక్కా-రూపాయలు, మూర్షిదాబాదు సిక్కా-రూపాయలకు సరిసమానముగనున్నను, యిక్కడి షరాబులు మన రూపాయలను పుచ్చుకొనకుండ త్రోసివేయుచున్నారు. మన రూపాయలకు వట్టము పుచ్చుకొనుచున్నారు. ఈ వట్టమువల్ల మనకు నష్టమువచ్చుచున్నది. మనకు నవాబు దర్బారులో యెంత పలుకుబడియున్నను, ప్రయోజనము లేకుండవున్నది. దీనివల్ల మనము మొదటవస్తుందని ఆశించినలాభమేమియు వచ్చేటట్లు మాకు కనిపించడము లేదు." (Long's Selection from the records of the Government of India. Page 164).

ఈ సేటు లనబడువారు బంగాళా దేశములో చాల ధనాఢ్యులు; వీరే షాహుకార్లు, షరాబులు, టంకసాలాధికారులు; మూర్షిదాబాదు దర్బారులో రాచకీయ సలహాదార్లు. తమరాజ్య క్షేమలాభములు వీరికి తెలిసినట్లు యింకెవరికి తెలియవు. కాబట్టి కంపెనీ రూపాయలువచ్చి నవాబురాజ్యములో చెలామణియగుటకు వీరిష్టపడలేదు. ఇందుకై కంపెనీవారు లోలోనకుళ్లుచుండిరి. ఈ కుళ్లును తొల

గించుకొనుటకు కంపెనీవారికిప్పుడు యీ విప్లవమువల్ల మంచి యవకాశము చిక్కెను. తమ కంపెనీ రూపాయలపై యెవరుగాని యెట్టి వట్టముగాని పుచ్చుకొనకుండునట్లు హుకుము చేయవలసినదని వీరు మీర్కాసీమును కోరిరి. వారి యొడంబడికలో యిది యొక షరతుగపెట్టిరి. 1760 సం॥ అక్టోబరు 21-వ తేదీన వాన్‌సిటార్టు, కలియడ్‌లు, కలకత్తాలోని సెలెక్టు కమిటీవారికి వ్రాసిన ఉత్తరములో యిట్లున్నది.

"కంపెనీ రూపాయలు పుచ్చుకొనమని షరాబులుగాని, వర్తకులుగాని, నిరాకరించరాదు—వానిపై వట్టమును యెవరుగాని అడుగకూడదు. అని కఠినమైన హుకుములు యిదివరకే జారీయైపోయినవి." (First Report 1772. P. 232).

ఇది నబాబునకును, ప్రజలకును, కూడ చాల అన్యాయమను సంగతి వేరుగ చెప్పనక్కరలేదు. ఏలననగ, దీనివల్ల నబాబుకు వచ్చే రాబడి తగ్గిపోయినది. నబాబు ప్రభుత్వము ఆర్థికముగ హీనస్థితికివచ్చెను. రాచకీయ దృష్టిలోచూచినను యిది నబాబు ప్రభుత్వమునకెంతయో న్యూనత తెచ్చెను. నబాబు స్వతంత్రుడు కాడనుమాట సామాన్య ప్రజలకెల్లరికి తెలిసిపోయెను.

పైన పేర్కొన్న ఉత్తరములో వాన్‌సిటార్టు, కల్లియడులు యిట్లు వ్రాసి యున్నారు :—

"కంపెనీకి గలిగినలాభములు చాలవున్నవి. బర్ద్వాన్, మిడ్నపూర్, చిటగాంగ్ జిల్లాలకు మనకిప్పుడే స్వాధీనారాగలదు. సిల్‌హెట్ జిల్లాలో తయారైయున్న సున్నములోకూడ సగభాగమునకు మనకు స్వాధీనారాగలదు. పాట్నాలోనేనకు జీతములిచ్చుటకు కొంతడబ్బు యిప్పుడే మనకర్నల్ ద్వారా పంపబడును. ఇవిగాక, కలకత్తాలోను, మద్రాసులోను, మనకంపెనీ ఖర్చులకుగాను, మూడు, నాలుగు లక్షలరూపాయలు మనకువచ్చునట్లుగ కూడవున్నది."

(2) మూడు జిల్లాల రివిన్యూ కంపెనీకి దఖలు.

"..........ఈ సమయంలో మనకీభాగ్య మెత్తుకొనుట మన అదృష్టమని చెప్పవచ్చును. ఏలననగ, యూరపు ఖండములో యుద్ధముల సద్దుఅణగుచున్నది. ఇందువల్ల యితర యూరోపియను జాతులువచ్చి మనశాంతికిక్కడ భంగముగలిగించుటకు వారికి తీరికయేర్పడవచ్చును. (అట్టి అవాంతరము వచ్చేయెడల) మనకు స్వాయముగ కావలసినంత బలమిక్కడ వున్నది. ఇదిగాక, మనము నమ్మదగినబంటు ఒకడు మనకిక్కడ దొరికినాడు." (First report p. 232.)

కంపెనీకి గలిగిన లాభములు చాల పెద్దవియైతే, కంపెనీ నౌకర్లగు వాన్‌సిటార్టు, కల్లియడ్‌మున్నగువారికి గలిగినలాభములు అంతకంటె చాలపెద్దవిగ

(3) కంపెనీ నౌకర్లకు లక్షలాది లంచాలు.

నున్నవి. వీరందరు మీర్కాసీమును నడిపేసి, లాగి, పెద్దపెద్ద లాటులను కొట్టిరి. ఈలాటులన్నీ, "బహుమతులని" వారు మెత్తనిమాటలతో చెప్పుకొనసాగిరి. ఈ "బహుమతులన" బడువానిని గూర్చి 1762 సం॥ ఏప్రిల్ 5-వ తేదీ రికార్డులో "అమియత్" అను కంపెనీ మెంబరు యిట్లు వ్రాసెను :—* "............ ప్రెసిడెంటు వ్రాసినదానినిబట్టి చూడగ, నబాబునుండి, కంపెనీ ఉపయోగమునిమిత్తమై 20 లక్షల రూపాయలు అడిగి పుచ్చుకోకుండ వదలివేయవచ్చుననుమాట నాకెక్కడను కనుపించలేదు. పైపెచ్చు గట్టిగ పుచ్చుకొనితీరవలసినదనియే వాన్ సిటార్టువ్రాసిన దానినిబట్టి తెలియుచున్నది.

అయితే నబాబు తనఖర్చులన్నీ చేసుకున్న తరువాత, అతని ఔదార్యమును బట్టి, అతడే సొమ్మునిచ్చునట్లుగ యేర్పాటయినట్లు నాకుగన్పట్టుచున్నది. ఇదిఆట్టె గొప్పసంగతికాదు. దీనివల్ల మనకేమియు యిబ్బందివున్నట్లు లెక్కకాదు. ఏలననగ, మనమీదేశములో బలవంతులమైయున్ననాళ్లు అతడీ వాగ్దానమును వ్రాసియిచ్చిన బాండుకంటె యెక్కువ బైండింగుగనే భావించుకొనును. అదిగాక, బాండుఎందుకు? బాండుపుచ్చుకుంటే అది అసహ్యముగ కనపడవచ్చును. అయినప్పటికి, వాన్ సిటార్టు, కల్లియడ్, హాల్వెల్, సమ్నర్, మాగ్వైరులకు 20 లక్షల రూపాయల నిచ్చెదనని వాగ్దానము చేయుచు నబాబు ఉత్తరము పంపినట్లు అందరు ఒప్పుకొన్న సంగతియేగద. కంపెనీ కౌన్సిలులోను, కమిటీలోను వున్న మెంబర్లందరిని వదలివేసి ప్రత్యేకముగ యీ అయిదుగురికిమాత్రమే నబాబేల యింతటిడబ్బును కట్టిపెట్టదననెను? మన మెన్నడెరుగని యింతటిడబ్బును అతడు వీరికి ఊరికేకట్టబెడతానంటాడా? ఇందులో యేదో రహస్యం ఉండాలి? తనకెంతోలాభము వచ్చేమార్గముగ యీ అయిదుగురు మెంబర్లు—యితర మెంబర్లతో చెప్పకుండ—తనకు సంధి కుదిర్చి పెడతారనే ఆశతో నబాబిట్లు వీరికి వాగ్దానము చేసియుండవలెను" (First report p. 361.)

ఈ కిరస్తానీ వంచకపంచకమునకు సిగ్గుశరములు లేవు. లోకులు తమ్మును గూర్చి యేమనుకొనుచున్నారో యను చింతకూడ వీరి మనస్సాక్షికి—(మనస్సాక్షి అనేదొకటి వీరికి అసలు ఉన్నదనుకుంటే)—కించిత్తయినను లేదు. † డబ్బేవారికి

* క్లుప్తీకరింపబడినది.

† మీర్జాఫరును రాజ్యభ్రష్టునిచేసిన సంగతి సీమలో తెలియగనే అక్కడి డైరెక్టర్లు యీ రీతిగ శ్రీరంగనీతులు చెప్పుచు 1761-వ సం॥ అక్టోబరు 7-వ తేదీన కలకత్తాలోని తమ నౌకర్లకు జాబు వ్రాసిరి :—

మన మిన్నాళ్లు అన్నమాటను తప్పక ప్రవర్తించుచుండుటచేతనే, మనము యిండియా ప్రజల మధ్యమం దెంతోకీర్తిని సంపాదించి నిలుపుకొనగలిగినాము. మీర్జాఫరుతో చేసుకొన్న ఒడంబడిక

పావనమగుటచే, తళతళ మెరయు బంగారమునుగూర్చి తప్ప వారికింక దేనినిగూర్చి గాని ఆలోచనలేదు. వీరు మీర్జాఫరుయెడ గావించిన మిత్రద్రోహమునుగూర్చి, 'అమియట్' అను కంపెనీ కౌన్సిలుమెంబరే పై నుదరిహించిన రికార్డులో యిట్లు వ్రాసెను:—

"మనము తన మామయెడకంటె, తనయం దెక్కువ విశ్వాసముతో వుంటామని యీ మీర్కాసీమున కేమి హామీవున్నది? తనతో యిప్పుడు చేసు కొన్న ఒడంబడికలోని షరతులకంటె, యెక్కువ ప్రమాణపూర్వకమైన షరతుల తోనే మనము యితని మామతో పూర్వము సంధిచేసుకొని యుంటిమి. అట్టి ఎక్కువ ప్రమాణపూర్వకమైన మాటలనే మనము పాటింపనప్పుడు యిప్పుడీ మాటలను మనము పాటింతుమను నిశ్చయము మీర్కాసీమున కెట్లు గలుగును? ఇతడుమాత్రము తాను తన మామయెడ గావించిన ద్రోహమును యెట్లు సమర్థించు కొనగలడు? ఈ ద్రోహమును ఆమామ యెన్నడైనా మరచిపోతాడా? అది యెల్ల ప్పుడు అతని కడుపులో కలచివేయుచుండదా?"

కంపెనీకి, తన సేనకు, యివ్వవలసిన బకాయ యావత్తు మీర్కాసీము చెల్లించివేసెను - అయినను, మీర్కాసీమున కిదియొక గొప్పకాదని అమియత్ తలంచుచున్నాడు. ఏలననగ, మొగలాయి యువరాజు ఓడిపోయి, వెడలిపోవుటచే, యీతని కీ డబ్బు మిగిలెననియు, యీ డబ్బును మీర్కాసీము యిట్లు పంచిపెట్టుట అతనికొక ఘనతకాదనియు అమియత్ తలంపు.

మీర్జాఫర్ యెడ యింగ్లీషువారు గావించిన మిత్రద్రోహమునుగూర్చి చాల మంది గ్రంథకర్తలు బహుతీవ్రముగ వ్రాసియుండిరి. వారిలో 'టారెన్సు' అను గ్రంథకర్త తన 'Empire in Asia' అను గ్రంథము 45, 46 పేజీలలో యిట్లని వ్రాసెను:—

---

లోని షరతులనుకూడ మనము తప్పకుండునట్టి పరిస్థితులు దేశములో కలిగియుంటే యెంతో బాగుం డేది కదాయని మే మనుకొనుచున్నాము. అట్లయినచో ఈ వ్యవహారములో మనయం దెట్టి దోష మునుగాని ఆరోపించుటకుపాత్రులగు లోకు లెవరికి యెంతమాత్రమును అవకాశ ముండెడిది కాదు."

ఇవి శ్రీరంగనీతులనుమాట నిశ్చయము. కంపెనీవారు అన్నమాట తప్పకుండనే, మొదటి నుండి ప్రవర్తించి యుండియున్న యెడల, తమ కీపాటికి దేశములో కించిత్తయినను రాజ్యాధికారము లభించి యుండెడిది కాదనుమాటను యీ డైరెక్టర్లు మరచినట్లున్నారు. న్యాయమును, నీతిని, గాలి కెగురకొట్టివేసి, నమ్మిన యెందరికొంతులనో కోయుటనుబట్టియే, యింగ్లీషువారిండియాలో రాజ్యాధి పత్యమును సంపాదించిరనుమాట మువ్మాటికి నిశ్చయము......

"పాశ్చాత్యులు ప్రాగ్దేశములందు గావించిన యిట్టి నీచకృత్యముల అసహ్యత పైకి కాన్పించకుండ పైపూతలుపూయు చరిత్రకారులలోకూడ మీర్జాఫరు నెడ గావించిన ఈ ఘోరకార్యమును సమర్థించువారెవరును గానరారు.......,ఈ లోకములో అన్నియుగములందును దేశములజయించిన విజేతలు అంతర్జాతీయ నీతి, ధర్మములనుపేరిట కొన్ని ధర్మసూత్రముల నిర్వచించుట ఆచారముగ వచ్చుచున్నది. ఈ ధర్మసూత్రములకు ఖచితములగు ప్రమాణములులేవు. అవి విజేతల వీలునుబట్టి వారిచేతులలో నెటుబట్టిన నటుసాగుచుండెను. ఇంత అధ్వాన్నముగనున్న ఈ అంతర్జాతీయ నీతిసూత్రముల ప్రకారముగనైనను కుంపిణీవారు మీర్జాఫరుపై యిట్టి ద్రోహమును చేయుటకు అవకాశము గన్పించదు. మీర్జాఫరు కుంపిణీవారిని నమ్మి భగవంతునియెదుట ప్రమాణపూర్వకముగ తన నెత్తురుతో నేస్తముగట్టెను. మనిషియైనవానికి విశ్వాసమనుమాటయైన నుండవలెనను యింగిత జ్ఞానము ఉండవలెనన్నచో కలకత్తా గవర్నరును కౌన్సిలును మీర్జాఫరుతో చేసిన సంధికి కట్టుబడియుండవలెను. అట్లయ్యును కుంపిణీ యుద్యోగస్థులు మీర్కాసీము యిచ్చిన రెండు లక్షల నవరసులకును, మూడు జిల్లాలకును, లోబడి తమను నమ్ముకొనిన ప్రాణమిత్రుని అమ్మివేసిరి........"

బంగాళములో యీ రెండవ విప్లవమును తెచ్చిపెట్టిన 'హాల్‌వెల్' ప్రవర్తనను గూర్చి సమకాలికు డొకడు (**Reflections on the present state of East India Company's affairs**) అను గ్రంథములో యిట్లు వ్రాసెను :—

"ఎక్కువైన తెలివి తేటలుగలిగి, డబ్బుసంపాదనకోసము సమయానుకూలముగ యెత్తులు వేయడములో వీనియంత వాడింకొకడులేడు. ద్రవ్యార్జనవిషయములో కొందరు లేనిపోని యేవో చిలిపిధర్మలేశాలు గుణించుకుంటూ వచ్చే డబ్బును చెడగొట్టుకుంటారు. ఇట్టి పిచ్చిపనులను యీతడెన్నడు చేసి యెరుగడు, ఇట్టి వెర్రిమొర్రి ధర్మలేశాలు యితనినెప్పుడును బాధించి యెరుగవు. కావున, యీతడనేకసార్లు, అనేక చిల్లర యెత్తులనువేసి, క్రియసాధించియుండెను. కాని, వీనియన్నిటిని మించిన పెద్దయెత్తు—వీనిపరిపూర్ణ ప్రావీణ్యతను ప్రతిఫలించు గొప్పయెత్తు—యితడు గవర్నర్ పదవికి వచ్చినదే తడవుగవేసెను—కాని, దీని నతడు పూర్తిగ సాగించుటకు దిక్కుమాలిన కాలము యితనికి అవకాశమియిచ్చినదికాదు."

బెంగాలులో రెండవ విప్లవమును కల్పించిన కిరస్తానీముఠాయొక్క గుణగణము లింత లక్షణముగనున్నవి! ఇంగ్లీషుజాతికే చెందిన యేచరిత్రకారుడుగాని, దీనిని సమర్థించి యుండలేదు.



# బ్రిటిష్ మహాయుగము

## నాలుగవ అధ్యాయము



### మీర్కాసీమ్—అతని పరిపాలన.

మీర్కాసీము ఒడంబడిక షరతులనెరవేర్చుట.

మీర్కాసీమ్ సింహాసనముమీద కూర్చున్నదే తడవుగ అతడు కంపెనీ నౌకర్లతో చేసుకొన్న ఒడంబడికలోని షరతులను పూర్తిగ చెల్లించుటకు సాగించెను.

కలకత్తాలో టంకసాల పెట్టుకొనుటకు వారికి అనుజ్ఞనిచ్చెను. తమ రూపాయలపై యెట్టి వట్టముగాని పుచ్చుకొనకుండ అవి దేశములో చెలామణియై పోవునట్లు మీర్కాసీము హుకుముల జారీచేసెను. *

---

* టంకసాల పెట్టుకొనుటకై మీర్కాసీము కంపెనీ వారికచ్చిన ఫర్మానా యిట్లున్నది:—

ఘనతవహించిన యింగ్లీషుకంపెనీ వర్తకులకు ప్రభువువారు ప్రసాదించిన ఫర్మానా—

"కలకత్తాలో ఒక టంకసాల యేర్పరచుకొని మూర్షిదాబాదులో ముద్రింపబడు రూపాయలతోను, అష్రఫీలతోను తూకములోను, నాణెములోను, సమానమగునట్టి వెండి బంగారు నాణెములను మీరు కలకత్తా పేరుతో వేసుకొనవలసినది. బంగాళా, బీహారు, ఒరిస్సారాష్ట్రములలో యీ నాణెములు చెలామణి కావలసినది. ఇవి ప్రభుత్వ ఖజానాలోనికి రావచ్చును. వీనిపై యెవరుగాని వట్టమును కోరగూడదు - పుచ్చుకొనకూడదు. తేదీ—4-వ సంవత్సరములో జెల్‌హాదా మాసము—11-వ తేది—" (Long's Selections P. 227)

నబాబు యిట్టి ఫర్మానాజారీచేసి నప్పటికి, వట్టములేకుండ ప్రజలెవరును కంపెనీ సిక్కాలను పుచ్చుకొనరైరి. అందుచే, కంపెనీవ్యాపారము స్తంభించినది. ఈ సంగతిని కంపెనీవారు మీర్కాసీముతో చెప్పుకొని, మా సిక్కాలు కూడ మూర్షిదాబాదు సిక్కాలవలెనే ముద్రించుకొనుటకు మాకు ఫర్మానా యివ్వవలసినదని వేడుకొనిరి. ఒక పట్టణపు సిక్కాలను, యింకొక పట్టణపు సిక్కాల పేరుతో ముద్రించుట ఆచారము కాదని చెప్పి, మీర్కాసీము యింగ్లీషు గవర్నరుకు యిట్లు వ్రాసెను:—

'కలకత్తా సిక్కాలపై వట్టము పుచ్చుకొనవద్దని జమీందారులు మున్నగువారిని భయపెట్టవలసినదని నేను 'రాయి - రాయన్'తో చెప్పెదను. వట్టములేకుండ సిక్కాలుపుచ్చుకొనమన్న వారిపేర్లను వ్రాసి నావద్దకు పంపినట్లైతే వారిని నేను గట్టిగ శిక్షించెదనని చెప్పితిని. వట్టము పుచ్చుకొన్నవారి పేర్లను పంపితే, వారి కిందుకుగాను జుల్మానావిధించి వారు తిరిగి యిట్టి పనులు చేయకుండ వారిని గట్టిగ శిక్షించెదనని చెప్పితిని. ఇకముందు మూర్షిదాబాదు సిక్కాలు చెల్లినట్లే మీ కలకత్తా సిక్కాలును చెల్లగలవు.' (Long's Selections P. 242)

బర్ద్వాన్, మిడ్నపూర్, చిటగాంగు జిల్లాలు మూడింటికి మీర్కాసీము, వెంటనే సన్నదులను వ్రాసి కంపెనీవారికిచ్చివేసెను* కాని ఖజానాలో సొమ్ము ఆట్టేలేదు. కాబట్టి కంపెనీవారికిచ్చెదనని వాగ్దానము చేసినసొమ్ము కరుకురూపాయలలో చెల్లించుట మీర్కాసీముకు బహుకష్టముగ గన్పట్టెను. అయినప్పటికి యేమైనాసరే ఆడినమాటను తప్పరాదని ఆతడు గట్టిగ పూనుకొనెను. ఆతడు నమ్మకద్రోహమొనర్చెనని చెప్పుటకెక్కడను అవకాశములేదు. "నేను నామాటతప్పకుండునట్లు అల్లా నన్నెల్లప్పుడు కాపాడుగాకయని ప్రార్థించుచున్నాను". ఇవి మీర్కాసీము 1760 సం॥ డిశంబరులో బెంగాల్ గవర్నరుకు వ్రాసిన ఉత్తరములోనిమాటలు.

---

* బర్ద్వాన్ జిల్లాను కంపెనీవారికి ధారాదత్తమొనర్చుచు మీర్కాసీము తన దస్కతు మొహర్లతో కంపెనీవారికి వ్రాసి యిచ్చివేసిన సన్నదు యీ దిగువరీతిగ నున్నది:—

"ఈ బంగాళా సుభాలోనిజిల్లాలలో రాజా తిలక్‌చంద్ జమీలోచేరియున్న యావన్మంది జమీందారులకు, కనూంగోలకు, తాలూకాదార్లకు, రైతులకు, బర్ద్వాన్ పరగణాలోని యావన్మంది ప్రధాన గ్రామోద్యోగులకు యిందుమూలముగ తెలియజేయుడ మేమనగ :—

చాలమంది దుర్మార్గులు ప్రజలను దోచుకొనుటకై ద్రోహముతో ప్రయత్నించి, నారాజ్యమును బీడుచేయదలచినారుగాన, యీకారణముచే సదరు రాజ్యరక్షణార్థమై కంపెనీవారు 500 యూరోపియను రౌతులను, 2000 యూరోపియను కాల్బలమును, 8000 సిపాయిలను సమకూర్చియుంచునట్లేర్పాటు చేయబడినది. ఈ సిబ్బందికంతకును నెలసరి భత్యముల క్రిందను, యితర ఖర్చులలో కొంత భాగము చెల్లించు నిమిత్తమును, సదరు పరగణావగైరాలు ఇంగ్లీషు కంపెనీవారికి యిందుమూలముగ దానమియ్యబడినవి. కాబట్టి, పైన పేర్కొనబడిన నాతాలూకు ఉద్యోగస్థులు యావన్మంది ఇంగ్లీషు కంపెనీవారిచే నియమింపబడు మనుష్యులకు నియమితమగు శిస్తుదిస్తులను శాంతముగ చెల్లించుచు, వారిని మర్యాదగ చూచుచుండవలయును. సమస్త విషయములలోను వారియధికారములకును, ఇంగ్లీషు కంపెని కలెక్టర్ల ఆఫీసునుండి వచ్చు ఉత్తర్వులకును సదరు నా వుద్యోగులందరు నిరాక్షేపణగ విధేయులై యుండవలెను.

ఇక కంపెనీ-కలెక్టర్లకు చెప్పేదేమనగా :—వీరు యిదివరకున్న జమీందారులను, రైతులను అట్లేయుంచి భూములపై శిస్తుదిస్తులను క్రమముగ వసూలుపరుచుచు, యేనెలకానెల కంపెనీవారి ఖర్చులక్రిందను యిర్సాలు చేయుచుండవలయును. వారెల్లప్పుడు సంతోషముతో, వుత్సాహముతో, రాజకార్యములశ్రేయస్సును పెంపొందించుటకై సంసిద్ధముగనుందురుగాక. ఈ సనదుల ప్రకారము సర్వము సక్రమముగ నెరవేరునుగాక—రబ్బీవులావుల్ నెల—14-వ తేది మొదటి ఆదివారము—(1176 బంగాళీశకము కార్తీక ప్రథమ తిధికి సమానము) షరా:—మిడ్నపూర్, చిటగాంగుల తాలూకు సన్నదులుకూడ యిట్లేయుండెను. (Long's Selections, Pp. 224—225).

ఈ పర్వానాను కంపెనీవారు బర్ద్వాన్ రాజాకు పంపించినప్పుడు ఆతడు తన జిల్లాలోని ప్రజల దురవస్థలను గూర్చి విపులముగ కంపెనీ గవర్నరుకు వ్రాసెను. తన జమీందారీకి సంబంధించిన లెక్కలనన్నిటినికూడ అప్పగించెను. (Longs Selection—Pp. 226—228.)

ఇంగ్లీషువారితో చేసుకొన్న ఒడంబడికకు ఎక్కడ భంగము వచ్చిపోతుందో అన్న భయముచేత యితడనేక పనులను చేసెను. అవి క్రమమైనవని, న్యాయమైనవని చెప్పుటకు వీలులేదు. అందువల్ల ప్రజలకితనియందు అసహ్యము పుట్టెను. తన విలాయితీ నేస్తగాండ్ర దురాశను సంతృప్తి పరుచుటకై మీర్కాసీము భూస్వాములను, ధనవంతులను, చెప్పరాని బాధలపెట్టెను. పైనపేర్కొనబడిన ఉత్తరములో మీర్కాసీము గవర్నరుకు యిట్లు వ్రాసెను:—

"ఈ జమీందారులను ఊడబెరకడం అదొక పెద్దసంగతికాదు. ఏలనగ, రాజుగారి రివిన్యూ వసూలవటమే అన్నిటికంటె ముఖ్యమైన విషయము. ఈ కారణముచేత, జమీందారుల నిల్లు తొలగించుటలు తరుచు జరుగుచుండును. నా శిపాయిలకు, యితరఖర్చులకు, నాకిప్పుడెంతోడబ్బుకు అవసరంగాఉంది. రామానందుడు చాలడబ్బుగలవాడు. కాబట్టి, మీరు వానిని వెంటనే నాదగ్గరకు పంపెస్తారని తలచెదను."

దేశములోగల 'సేటుల' సహాయముతోను, తన అంతఃపురములోగల నగలు, పళ్లెములువగైరా సామాగ్రులను చితుకగొట్టించి, నాణెములుగ ముద్రించుటవల్లను, మీర్కాసీము ఇంగ్లీషువారికి వాగ్దానము చేసియున్న యావత్తు సొమ్మును చిల్లిగవ్వలత్తోసహా చెల్లించివేసెను. అందుచే, ఇంగ్లీషువారికి పరమ సంతోషమయ్యెను.

కాని, బంగాళారాజ్యపాలన మెత్తని పాన్పుకాదు. అందు ముళ్లున్నవి. పరదండయాత్రలను పారద్రోలి, దేశాంతర్భాగమందుగల కల్లోలముల నత డణచవలసివచ్చెను. కాని, అందరికంటె అతనికి పరమ శత్రువులు ఇంగ్లీషువారైరి. పైకివీరు మిత్రులని పేరుపెట్టుకొన్నను, శత్రువులని పేరుపెట్టుకొన్నను—క్రియ ఒక్కటిగనే యుండెను. వీరితో యితడు వేగవలసివచ్చెను.

బాదుషా దండయాత్ర, ఓటమి.

ఢిల్లీ పాదుషా తిరిగి బీహారురాష్ట్రముమీదికి దండెత్తివచ్చెను. ఇది బయటి బాధ. ఈ పర్యాయ మీదండును యెదిరించినవాడు—మేజర్ కార్నక్ అనువాడు. అనగ, యితడు కర్నల్ కల్లియడ్ తరువాత ఇంగ్లీషుసేనలకు నాయకుడయ్యెనన్న మాట. కాని సేనాధిపత్యము నెట్లు వచ్చెనో యితడే 1772-వ సం॥ పార్లమెంటు కమిటీ ముందర యిట్లు చెప్పుకొనెను.

"1760-వ సం॥ ఫిబ్రవరిలో క్లైవుతోపాటు నేనును బెంగాలు విడిచి ఇంటికి బయలుదేరితిని. కాని 'సెంటుహెలీనా' దగ్గరకు వచ్చేటప్పటికల్లా, డైరక్టర్లు నన్ను తమ బంగాళా రాజధానీ సేనలకు నాయకునిగ నియమించినట్లుగా తెలిసెను."

"ఈ కారణముచేత, నే నప్పు డక్కడనున్న ఒకానొక కంపెనీ ఓడలో నెక్కి తిరిగి బెంగాల్‌కు వెళ్లితిని. ఆ సంవత్సరము అక్టోబరు ప్రారంభమందు కాబోలు నేను నదీముఖమునకు చేరితిని. కాని, గాలి యెదురుగ వీచుచుండుటచే, అక్కడ ఆగవలసివచ్చెను. 12, 13 తేదీలకుగాని నేను కలకత్తా చేరలేదు. నేను నదీముఖమున యెదురుగాలిచే నిలిచియుంటినను వార్త వాన్‌సిటార్టుకు తెలిసి, తా నప్పుడు కర్నల్ కల్లియడ్‌తో కలిసి మూర్షిదాబాదు వెళ్లుచుంటిననియు, నన్ను కూడ సాధ్యమైనంత త్వరలోవచ్చి కలుసుకొన వలసినదనియు, నాపేర ఉత్తరము పంపెను. ఈ కారణముచేత, నేను కలకత్తాలో కొద్దిదినములు మాత్రమేయుండి, వాన్‌సిటార్టును కలుసుకొనుటకు పయనమైతిని. మూర్షిదాబాదులో వాన్‌సిటార్టు మకాము చేసియున్న 'మురాదాబాగ్' మందిరమునకు పోవుచుండగ, నేను మధ్య త్రోవలో నబాబుమందిరముమీదుగ పోవలసివచ్చెను. అప్పు డక్కడ నాకు కల్లియడ్ సేనానియు, అతని సైనికులును కనిపించిరి. అదే విప్లవము జరిగినరోజు. వారప్పుడు నబాబు మందిరమును చుట్టవేసియుండిరి. సరిగ విప్లవము అప్పుడే జరుగుచున్నదన్నమాట. అయినప్పటికి, చుట్టుపట్టుల యెక్కడగాని గల్లంతులేక అంతయు ప్రశాంతముగ నుండెను. నా కిక్కడ యేమాత్రము అలికిడిగాని తగుల పోవుటచే, నేను నాదారిని పోతిని.

నేను వాన్‌సిటార్టు దగ్గరకు వెళ్లగానే, జరిగిన సంగతియంతయు అతడు నాకు చెప్పెను." (First report 1772—P, 164)

ఈ 'కార్నక్'కు ముందు సేనానిగయున్న కలియడ్‌కు యీ విప్లవమువల్ల చాలలాభము గలిగెను. కాని, తరువాత వచ్చిన యీ కార్నక్‌కు యేమియు ముట్టలేదు. అందుకొరకే కాబోలు యితడు మీర్కాసీమునెడ విరోధము వహించి యుండెను. మీర్జాఫరును త్రోసివేసి మీర్కాసీమును సింహాసన మెక్కించుటకై గూడుపుఠానీ చేసిన కుట్రదారుల ముఠాలో యితడు చేరలేదు.

'కార్నక్' 1761-వ సం॥ జనవరిలో పై యధికారుల ఆజ్ఞప్రకారము పాట్నావెళ్లి అక్కడ కంపెనీ సేనల కాధిపత్యము వహించెను. మొగలాయి పాదుషా బీహారులోనే మకాము వేసియుండి, ఆ రాష్ట్రమును తిరిగి జయించి, తన సామ్రాజ్యము క్రిందికి తేవలెనని గట్టిగ ప్రయత్నము చేయుచుండెను. సురాజ్ ఉద్దౌలా చంపబడిన నాటినుండి ఇంగ్లీషువారు యేదో యేదోవిధముగ మొగలాయి పాదుషాతో పోరాడవలసియే వచ్చుచుండెను. మొదట యితడు యువరాజుగ నున్నప్పుడును, దరిమిలా చక్రవర్తి యైనప్పుడునుకూడ వీ రతనితో పోరాడవలసియే వచ్చుచుండెను. బంగాళములో యిటీవల జరిగిన విప్లవములవల్ల యావన్మంది ప్రజలకు అసహ్యముపుట్టెను. అందుచే జమీందారులు, రైతులు కూడ మొగలాయి చక్ర

వర్తి పక్షమున చేరుచుండిరి. కాబట్టి, ఇతని నెట్లయిన యెదిరించి తరిమివేసినగాని తమకు మేలు లేదని కంపెనీవారు గట్టిగ తలంచిరి.

మిల్లు యిట్లు వ్రాయుచున్నాడు :—

“మాటిమాటికి చక్రవర్తి దండెత్తివచ్చుటవల్ల బీహారురాష్ట్రము చాల చెడిపోయెను. ఈ దండయాత్రల నెదుర్కొనుటలో కంపెనీకిని నవాబుకునుకూడ చాల ద్రవ్యనష్టమయ్యెను. కాబట్టి, చక్రవర్తి నికపూర్తిగ, తిరిగి యెన్నటికి యీ వైపునకు రాకుండ - తరిమివేస్తేనేగాని మేలులేదని కంపెనీవారికి గట్టిగతోచెను. వర్షాకాలము పూర్తయైనదే తడవుగ, ఇంగ్లీషుసేనాని రామనారాయణుని సేనలను, మిరాన్ సేనలను, వెంటబెట్టుకొని, గయామాన్‌పురములో మకాముచేసియున్న మొగలాయి పాదుషావైపునకు నడచెను. దురదృష్టవంతుడగు పాదుషా చిక్కియున్న తన సేనాబలమును పూరించుకొనుట కెంతయో తంటాలుపడెను. కాని, యీలోగానే యాంగ్ల సేనాని కార్నక్ త్వరితగతిని మూడురోజులలోనే పాదుషా శిబిరమును డగ్గరి, అతనిని యుద్ధములోనికి లాగి, అతనిపై విజయమును గైకొనెను.” (Vol III P, 218)

పాదుషాతో చేసుకొన్న సంధిషరతుల నిప్పుడే వివరింతుము. ఒకప్రక్కనిట్లు మొగలాయి పాదుషాతో పోరాడుచున్న సమయమందే కంపెనీవారు బంగాళములో గలిగిన కొన్ని అంతఃకల్లోలములనుకూడ అణచవలసి వచ్చెను. బర్ద్వాన్, బీర్‌భూమి, రాజులు క్రొత్త నవాబుపై తిరుగబడిరి. వీరికి మధ్యజరిగిన విప్లవము గిట్టకుండెను. అందుచే వారు మొగలాయి చక్రవర్తి యుషారావల్ల యిట్లు తిరుగబాటుచేసిరని కొందరనిరి. వీరిద్దరిలో ఒకనిని—బర్ద్వాన్ రాజాను—కాళ్లు చేతులుకట్టి ఇంగ్లీషువారికి నప్పగించిరట. అతని ముఖాసాదార్లను, రైతులను, ఒక ప్రక్కను మహారాష్ట్రులును, యింకొకప్రక్కను ఇంగ్లీషు శిపాయిలును దోచుకొని, హింసించిరి. బర్ద్వాన్ రాజా తిలక్‌చంద్ 1760 సం॥ అగష్టు నెలలో కలకత్తా అధికారులకు వ్రాసిన ఉత్తరములో యిట్లున్నది :—

జమీందారుల తిరుగు బాటు.

“ఇక్కడ ప్రజలుపడుచున్న దురవస్థ యేమని చెప్పుదును? ఇక్కడ మూడు నెలలు మహారాష్ట్రులు దేశముమీద పడి దోచుకొనియు, తగులబెట్టియు, బీడుచేసియు, దేశమును నానాక్షోభపెట్టినారు. భగవంతుని దయవల్ల, వారందరు యిప్పుడు వెళ్లిపోయినారు. కాని, పారిపోయిన ప్రజలింకను యిండ్లకు చేరలేదు. వాళ్లకున్న ఆస్తి వగైరాలన్నియు పోయినవి. వారికిప్పుడు ‘మాది’ యని చెప్పుకో దగినదేదియులేదు”.........

“నా దురదృష్టమువల్ల మహారాష్ట్రులు నాదేశముపైపడి సర్వమును తగులబెట్టి, కొల్లగొట్టి, నాశనము చేసిపోయిరి. ఈ కారణముచేతనే నేను కంపెనీవారికి

బకాయి పడుట తటస్థించినది. తిరిగి దేశమును కూడదీసికొనుట చాలకష్టము. ఇదియే నా మనస్సు నిప్పుడు బాధించుచున్నది.'' (Long's Records P, 233)

తెలింగా సిపాయిలు బర్ద్వాన్ రైతులను దోచుకొనుటనుగూర్చి రాజా తిలక్ చంద్ 1760 సం॥ సెప్టంబరులో కాబోలు కలకత్తా కిట్లు వ్రాసెను:—

''కొంతమంది తెలింగా సిపాయిలు ముందల్ ఘట్, మంకోరు, జహనాబాద్, చిట్వార్, బర్సాత్, బాల్ గురి, చోమహన్, మున్నగు పరగణాలలో జొరబడి ప్రజల ఆస్తులను కొల్లగొట్టి, నానాతిప్పలుపెట్టి, కొందరికి ప్రాణహానికూడ కలిగించిరి. అందుచే ప్రజలు ఊళ్లువిడిచి పారిపోయిరి. ఈ ప్రదేశములో మొత్తము సుమారు 2, 3 లక్షల రూపాయలు నష్టమై పోయినది. ఇది మీరు ఉద్దేశ్యపూర్వకముగ చేయించితిరని నేననను. కాని, మీ తెలింగా సిపాయిలు వెళ్లినచోట్లనెల్ల ప్రజలను కొట్టిరి. మార్గములో శిబిరములు పెట్టుకొనుట మీకు అవసరమై యుండవచ్చును. కాని, యీ సిపాయిలు ఊళ్లల్లో జొరబడుట అనవసరము. కాబట్టి, ఊళ్లలోనుండి సిపాయిలను వెనుకకు పిలిపించవలసినదిగ మీరు మీ ఉద్యోగులకు వ్రాయవలసినది. అట్లయినచో ప్రజలకు వీరివల్ల బాధలు తప్పును.'' (Long's Records P, 236)

కాని, తెలింగాలు దోపిడులు సాగించుచునే యుండిరి. అందుచే తిలక్ చంద్ తిరిగి ఇట్లు వ్రాసుకొనెను :—

'' తెలింగాల ప్రవర్తనవల్ల రైతులు చాల బాధపడుచున్నారు. ఇండ్లు వాకిళ్లు విడిచి వారు అడవులపాలు కావలసివచ్చుచున్నది. ఇందువల్ల చాలనష్టము వచ్చును.'' (Long's Records P, 236)

రాజా తిలక్ చంద్ చెప్పిన మాటలన్నియు చెవిటివానిముందు శంఖూదినట్లయ్యెను. తమ తెలింగా సిపాయిలుచేసిన దుర్మార్గములకుగాను వారిని కంపెనీ వారు శిక్షించినట్లెక్కడను గన్పింపదు.

''బీర్ భూమి రాజాకూడ బర్ద్వాన్ జమీందారునకు, రైతులకు, బాధలు కలిగించుచుండెను. 1760 సం॥ సెప్టంబరులో రాజా తిలక్ చంద్ కలకత్తాకు యిట్లు వ్రాసుకొనెను :—

'' బీర్ భూమి రాజా నన్ను పెట్టేబాధ లేమని చెప్పుకొందును. షేరుగుర్, సుంపని, గాలర్, బూర్......వగైరా పరగణాలన్నీ నాశనమైపోయినవి. ఈ బాధ తొలగించడం మీ అనుగ్రహం, నేను యింక ఏమిచెప్పేది.'' (Long's Records P, 238).

కాని, కలకత్తా అధికారులవల్ల యీ బర్ద్వాన్ రాజా కేమియు సహాయము రాలేదు. కాబట్టి, మీర్కాసీము రాజ్యమునకు రాగానే, తన జమీని యావత్తు అతడు కంపెనీకి దానము చేసినప్పుడు యీ రాజాకు సంతోషమెట్లు గలుగును? పెనముమీదినుండి పొయ్యిలో పడ్డట్లయ్యెను అతనిపని. అందుచే అతడు తిరుగుబాటు చేసెను. ఈతడు సేనలను సమకూర్చుకొని, తన శత్రువైన బీర్‌భూమి జమీందారును కూడ కలుపుకొని, 1760 సం॥ నవంబరులో తిరుగుబాటు చేసెను. అంతట మీర్కాసీము కంపెనీవారి కిట్లు వ్రాసెను :—

జమీందారుల తిరుగుబాటునణచుట - ప్రజాహింస, రక్తపాతము.

"బర్ద్వాన్ జమీందారు మాతో యుద్ధమునకు సిద్ధమగుచున్నట్లు నాకు వర్తమానము వచ్చినది. బంట్రోతులను, దొంగలను, మరి కొందరిని 10, 15 వేలవరకు పోగుచేసి, వారికి జీతమిచ్చి, బీర్‌భూమి రాజానుకూడ కలుపుకొని యుద్ధ సన్నాహములో నున్నాడట. ఈ వర్తమానము రాగానే నేను 2, 3 వేల రౌతులను, 5, 6 వేల బంట్రోతులను సిద్ధముచేసి బీర్‌భూమి రాజాను శిక్షించుటకిప్పుడే పంపుచున్నాను."

"కలకత్తాకువచ్చి నీ వ్యవహారములు ఫైసల్ చేసుకుపోవలసినద"ని కంపెనీ వారు బర్ద్వాన్ రాజాకు ఉత్తరమువ్రాసిరి. కాని, తన 'రాజ్యాన్ని వదలుకోమంటా రేమో' యను భయముచేత యీ రాజా కలకత్తాకు రాకుండ సంసారముతో కూడ పారిపోయెను. యింగ్లీషువారి సముద్దేశ్యముల నతనికి బోధించుటకై వారప్పు డతనివద్దకు కొందరిని పంపిరి. 'నీ భూములలో మేము ప్రవేశించినప్పటికి నీకు మంచి తేలిక షరతునే పెట్టెదములే' యని కబురు పంపించిరి. ఒకమూల యిట్లు కబుర్లు పంపుచు కంపెనీవారు కెప్టన్ వైట్ అధికారముక్రింద కొంతసేననుపంపి, కంపెనీకి గాను బర్ద్వాన్, మిడ్నపూర్ జిల్లాలను స్వాధీన పరచుకొనవలసినదిగ యేర్పాటు చేసిరి. పోరాటములేకుండ స్వాధీనమొనర్చుకొన వలెననియు తమ సేనానికి చెప్పి పంపిరి. సేనానికి చెప్పినమాట లివి :—

"హుగ్లీవద్ద కొంతసేపువేచి చూడవలసినది............అప్పటికి రాజా లొంగి రానిచో, అంబోయావద్దకు నడచి, అక్కడనుండి బర్ద్వాన్‌లో ప్రవేశించ వలసినది. రాజా అంతట లొంగివచ్చేయెడల........నీవు అక్కడనుంచి సరాసరి మిడ్నపూర్ పోవలసినది." (**Long's Selections P. 249 No, 534**)

కంపెనీవారిట్లు యితనికి చెప్పిపంపినను, యీ తెల్లసేనాని మధ్యత్రోవలో బీదప్రజల నందరిని హింసించి, చంపి, త్రోవపొడుగునను రక్తమయము చేసి పోయెను. ఈ సంగతి రాజా తిలక్‌చంద్ 1761 సం॥ జనవరిలో కలకత్తా అధికారులకు వ్రాసుకొన్న ఉత్తరమువల్ల స్పష్టము కాగలదు. బర్ద్వాన్, బీర్‌భూమి

రాజాలున్ను, మహారాష్ట్రులున్ను, యేకమై నవాబు మీర్కాసీమును, యింగ్లీషు వారిని యెదిరించుటకు పూనుకొనిరి.

తెల్ల (వైట్) సేనాని 1760 సం॥ డిశంబరు 28-వ తేదీన బర్ద్వాన్ రాజాతో యుద్ధముచేసెను. మేజర్ యార్కు అనువానిసేన బీర్ భూమి జమీకి రాజధానియగు నాగోర్ను ముట్టడించెను. రాజు కొండలకు పారిపోయెను.

బర్ద్వాన్, బీరు భూమిరాజాలును, మహారాష్ట్రులును యిట్లు యేకమై నవా బును, కంపెనీవారిని యెదిరించు యెత్తు నందకుమారునివల్ల వేయబడినదని తలంచు టకు గట్టి ఆధారములుగలవు. అతడు నిజమైన దేశాభిమాని, దూరదృష్టిగల రాజకీయవేత్త. అతని ప్రయివేటు జీవితము నిర్మలము. ఇతని పబ్లిక్ జీవితములో మాత్రము ఒక్కచో కళంకము అంటుకొనినది. వెనుక యితడు సురాజ్ ఉద్దౌలా కాలములో హుగ్లీఫౌజుదారుగ నుండినప్పుడు ఇంగ్లీషువారి నేమియు యెది రించక, వారికి చంద్రనగరముపైకి పోవుటకు దారియిచ్చెను. ఇది ప్రాణాంతకమైన తప్పను మాటనిశ్చయమేకాని, అతనికప్పటికి ఇంగ్లీషువారి స్వభావము పూర్తిగ తెలియలేదు. దరిమిలా వారి సంగతిని నతడు బాగుగ కనిపెట్టినాడు. వెనుకనైనను ఒమీచంద్ ప్రోత్సాహముచేతనే అతడట్లు సురాజ్ ఉద్దౌలాకు ద్రోహము చేసెను.

దేశమంతయు ఇంగ్లీషువారికి అమ్ముడుపోవుచున్నట్లు నందకుమారుని కండ్ల కిప్పుడు స్పష్టముగ తెలియవచ్చినది. నవాబు కంపెనీవారిచేతిలో కేవలము పిండి బొమ్మయైనట్లును అతడు కనిపెట్టెను. ఈ ప్రవాహము నిక అటగాయించితేగాని దేశమునకు గతిలేదని అతనిమనస్సుకు గట్టిగతట్టినది. ఈ ఉద్దేశ్యముతో అప్పుడు దేశములోనున్న రాజులనందరిని ఢిల్లీ పాదుషా బావుటాక్రింద యేకమొనర్చి, ఇంగ్లీషు వారి అధికారమిక వ్యాపింపకుండ అరికట్టవలెనని అతడు సర్వశక్తుల ధారవోసెను. యుద్ధకార్యములందును, వివాహవిషయములందును, యేమిచేసినను తప్పుకాదను సామెత ప్రకారము ఇతడీవిషయములో చేసినపని అంత ప్రశంసార్హము గాకపోయి నను, నిందార్హము మాత్రముకాదు. 1761 సం॥ ఫిబ్రవరి 24-వ తేదీన నవాబు కలకత్తా కిట్లువ్రాసెను :

"నందకుమారుడు వ్రాసిన ఉత్తరములను నేను పట్టుకొంటినని తమకిదివరకు వ్రాసియున్నాను. అందలి విషయములనుకూడ నేను మీకు తెలిపితిని. అతడు మన శత్రువులతో ఉత్తర ప్రత్యుత్తరముల జరుపుచున్నాడు. నేనతని నిప్పుడు ఖైదుచేసి, అతని కాగితములన్నిటిని పరిశీలించుచున్నాను. ఈ కాగితములను బట్టిచూడగ ఇతడు మొగల్ యువరాజువారితోను, కాయిన్ గర్ ఖాన్, శ్రీభూత్ మున్నగువారితోను వ్యవహారము నడుపుచున్నట్లు తెలియుచున్నది. ఈ నందకుమారుడు నా సర్కారు

యొక్కయు, కంపెనీయొక్కయు శ్రేయమునకు భంగము గలిగింప యత్నించు చున్నాడు. కాబట్టి, ఇతడు నేరస్థుడనుట నిర్వివాదము. మా దేశ శాసనముల ప్రకారమే అయ్యేటట్టయితే, ఇతనిని శిక్షించకుండ వదలివేయుటకు వీలుండదు.'' (Long's Records P. 247. No. 553).

చరిత్ర, నందకుమారుని దేశద్రోహిగ నిందించుటలేదు. ఇతడు దేశభక్తుడనియు, నిజమైన రాజకీయ వేత్తయనియు చెప్పుచున్నది.

ఢిల్లీ చక్రవర్తి కార్నక్ సేనానిచే ఓడిపోయినట్లు ఇదివరకు చెప్పియుంటిమి. చక్రవర్తి ఓడిపోవగనే అతని వెంటనున్న అయోధ్య నబాబు—షుజా ఉద్దౌలా—కూడ వెనుకకు వెళ్లిపోయెను. అనుకూలమైన మంచిషరతులతో సంధికుదుర్చుకొని రావలసినదని చెప్పి కార్నక్ సేనాని 'రాజాసితబ్ రాయ్' యనువానిని చక్రవర్తి వద్దకు పంపెను.

ఈ షరతులకు చక్రవర్తి ఒప్పుకోనందున సితబ్ రాయ్ వెనుకకు వచ్చివేసెను. కాని, యెప్పుడైతే తనతోనున్న అయోధ్య నబాబును, యితర ప్రముఖులును, తననువదలిపెట్టి వెళ్లిపోయినారో, అప్పుడు చక్రవర్తిపని చిక్కులోపడెను. యీ అవస్థనుండి తప్పించుకొనుమార్గములేక చక్రవర్తి అప్పుడు యింగ్లీషువారి షరతులకు ఒప్పుకొని, కార్నక్ సేనానియున్న శిబిరమునకు వచ్చెను. ఉభయులు కలిసి పాట్నాకువచ్చిరి. మీర్కాసీముకూడ అప్పుడే అక్కడికివచ్చెను.

1761 సం॥ ప్రారంభమై ఒకవారమైనను కాకమునుపే భరతవర్షమందొక నొక మహాద్భుత సంఘటనము జరిగెను. బ్రిటిష్ అధికారము యిండియాలో స్థాపనయగుటకది యెంతయో తోడ్పడెను. కాని, యీ సంగతిని హిందూదేశ చరిత్ర వ్రాసిన చరిత్రకారులెవరును అంతగట్టిగ నొక్కి చెప్పి యుండలేదు. ఆ సంఘటనమేమనగ "పానిపట్టు యుద్ధము.'' ఇది 1761 సం॥ జనవరి 6-వ తేదీన జరిగెను. ఈ యుద్ధమును తెచ్చిపెట్టిన పూర్వోత్తర సందర్భములను, కారణములను, యిట తప్పిలుగ వివరించవలసిన పనిలేదు. ఈ యుద్ధమందు ఉభయ పార్శ్వముల నిలిచి పోరాడినవారెవరో చెప్పినచాలును. వారు ఉభయులును పర్వత ప్రాంతవాసులే. (పార్వతేయులే). ఇండియాకు సరిహద్దుగ భావింపబడు సింధునదికి అద్దరిని ఉత్తరమున నున్న పార్వతేయులను, ఇద్దరిని దక్షిణమున మొగల్ పాదుషా ఔరంగజేబుచే కొండయెలుకయని అపహాస్యము చేయబడిన మహాయోధవీరుని ప్రతిభచే పైకివచ్చిన పార్వతేయులును—యీ యిరువైగల పార్వతేయులును (ఆఫ్గనులును, మహారాష్ట్రులును) ఈ పానిపట్టు మహారణరంగమందు ఒకరినొకరు యెదురుదన్ని నిలిచిపోరాడిరి. కొండల యందునుండి శత్రువునుకానరాక, మాటి

పానిపట్టు యుద్ధము మహారాష్ట్రులకు దెబ్బ- ఇంగ్లీషువారి అదృష్టరేఖ.

మాటికి ఆకస్మికముగ యెక్కడినుండియో శత్రువుపై అగ్ని, బాణాదుల గురిపెంచి వేధించు యుద్ధ నైపుణ్యమందు యిరుతెగలవారును ఆరితేరినవారే. సమప్రదేశమందు నిలువబడి పోరాడుట యిరువురకు క్రొత్తయే. అయినప్పటికి వీరు పానిపట్టు క్షేత్రమందు హోరాహోరిని పోరాడి యిరుపక్షముల ఘోరనష్టములపొందిరి. 'అహమ్మద్ షా అబ్దాలీ' యను ఆఫ్ఘన్ వీరుడు తనసేనల కగ్రేసరుడై, వానిని రణక్షేత్రమునకు నడిపించుకొని తీసుకొనివచ్చెను. అతడు అసాధారణపురుషుడు. ఒకరిగొంతుల నొకరు ఉత్తరించుకొను స్వభావముగల ఆఫ్ఘన్ మూకలనెల్ల ఒకచోటజేర్చి, వారి నందరిని యేకజాతిగ చేయుటకు ప్రయత్నించినవారిలో యితడే ప్రథముడు. ఇతనికి గురువు నాదర్ షా. రణవిద్యను, రాజ్యపాలనా దక్షతను, యితడీ గురుపాదముల సన్నిధినే యభ్యసించెను. గుర్వనంతర మితడు 1747 సం|లో ఆఫ్ఘన్ స్థానమునకు పరిపాలకుడయ్యెను. ఇతడు రాజైనప్పుడు యిండియాస్థితి యెట్లుండెననగ, ఏసాహస పురుషుడుగాని, తాసిటవచ్చి తనయదృష్టము నొకచేయి చూచుకొన నాకర్షించు సదిగనుండెను.

"ఇండియాలో మొగలాయిలు యెన్నడుగాని యెదురులేని అధికారులుగ నుండలేదు. నాదర్షా ఢిల్లీని కొల్లగొట్టినదెబ్బనుండి వీరు యింకను తేరుకొనలేదు. ఈ దెబ్బయొక్క ప్రతిధ్వని మొగలాయిల దుర్బలమును దేశదేశముల చాటించుచు పోయెను. అంతటితో అయోధ్యవజీరు, నైజామ్ - ఉల్ - ముల్క్ మున్నగు తిరుగుబాటుదార్లు తమస్వతంత్ర యధికారములందు స్థిరపడిపోయిరి. ఇంక అనేకమంది చిల్లర ప్రముఖులు తలయెగబెట్టి, స్వతంత్రులగుటకు అలుసుచిక్కను. మహారాష్ట్ర ప్రతిభ హెచ్చయి, మహమ్మదీయ ప్రభువుల పీడనుండి దేశమును సంరక్షించు మహాజాతీయోద్యమముగ పరిణమించెను. నాదర్ షా వెళ్లిపోయినందున, దక్షిణాపథ రాజ్యాధిపత్యమునకై మహారాష్ట్రులు నైజాముతో పెనుగులాడుటకు మంచి వీలుచిక్కినది. అంతకంటెదక్షిణమున కర్ణాట నవాబు స్వతంత్రుడై పోయెను. అక్కడ పరాసులు, ఆంగ్లేయులు, మహారాష్ట్రులు, డక్కనీలు మున్నగువారందరు అమితమగు రాజ్యకాంక్షచే కుట్రలపైకుట్రలను తెంపులేకపన్నుచు, ఒకరిని మించి ఒకరు విసుగువిరామములేక మహా గందరగోళముగ కొట్లాడుకొనుచుండిరి. ఇటు బంగాళాదేశములో అలివర్దీఖాన్ త్వరత్వరగ అధికారమునకు ఎక్కివచ్చుచుండెను. ఢిల్లీకి సమీపములో ఒకప్రక్కన జాటులు తమ చిన్ని భరతపుర సంస్థానమును బహుళముగ వ్యాపింప జేసికొనుటకై పొంచియుండిరి; యింకొకప్రక్కన రోహిలాలు తమ రామపుర సంస్థానమునకు పునాదులు వేసుకొనుచుండిరి." (Calcutta review. Vol. LI page 6-7).

ఈ యవకాశముల నన్నిటిని చూచుకొని, యిండియాపై పోయిపడుటకు యిదేతరుణమని అహమ్మద్ షా అబ్దాలీ ఆలోచనలు చేయుచుండెను. ఆప్రకారమే

అతడు పెద్దదండుతో ఇండియాపైకి వచ్చెను. ఏలననగ. యుద్ధమేకూడుగగల ఆఫ్గనులను "యింటివద్ద కత్తులనన్నిటిని ఒరలో దాచుకొనుడని చెప్పనప్పుడు, వారికి బయటనైనను యేదోపని చూపించకపోతే యెట్లా? ఈ యవసరమును తమ జాతిధర్మముగ ఆఫగన్ వీరులు గ్రహించిరి" (పై గ్రంథము. పేజీ 13.)

ఇండియాలో మహారాష్ట్రులబలము నానాటికి హెచ్చగుచుండెను. ఢిల్లీ సామ్రాజ్యపు గుండెకాయవరకు వారియధికారము యెగదట్టెను. అహమ్మదుషా అబ్దాలి కుశాగ్రబుద్ధిగలవాడు. మహారాష్ట్రుల దండయాత్రల బలమును అరికట్టక విచ్చలవిడిగ వదలివేసినచో, హిందూదేశ మిక మహమ్మదీయ రాజ్యముగనుండ జాలదనియు, యావత్తు తిరిగి హిందూ సామ్రాజ్యమే యైపోవుననియు అతడు కనిపెట్టెను. పానిపట్టు యుద్ధము ప్రారంభింపకపూర్వము యితడు.

"రోహిలా నాయకులకును, అయోధ్య నవాబుకును, కబురులు పంపెను. తానిప్పుడు చేయబోవుచున్న యుద్ధము సామాన్య యుద్ధముకాదనియు, యిది హిందువులకు, మహమ్మదీయులకు జరుగు పోరాటమనియు, యిండియాలో మహమ్మదీయ రాజ్యస్థాపనచేసిన మహమ్మద్ గజినీ నాటినుండి నేటివరకు యిట్టియుద్ధమెన్నడును జరిగియుండలేదనియు, తనకు గలిగిన యీ యభిప్రాయములను వారికిగూడ గట్టిగ యెక్కించుటకు యితడు ప్రయత్నించెను" (పై గ్రంథము. పేజీ 22.)

నానాటికి పెచ్చుపెరిగి వచ్చుచున్న మహారాష్ట్రులనరికట్టి, ఢిల్లీలోనున్న మొగల్‌పాదుషాయే యావద్భరతఖండమునకు సార్వభౌముడను కీర్తిని నిలువబెట్టు మహాసంకల్పము తోడనే అహమ్మద్‌షాఅబ్దాలీ యీరీతిగ ఇండియాపై దండెత్తివచ్చుటకు కారణమయ్యెనని పై వాక్యములవల్ల స్పష్టముకాగలదు. ఇదియే పానిపట్టు మహాయుద్ధముగ పరిణమించినది.

అయోధ్య నవాబగు నఫ్దర్‌జంగ్ చనిపోగానే గాజీఉద్దీన్ అనునతడు నవాబై, వజీరను బిరుదమును తగిలించుకొనెను. ఇతడు ఢిల్లీవెళ్లి అక్కడనున్న చక్రవర్తిని గ్రుడ్డివానిజేసి పసివానినొకని సింహాసనముమీద కూర్చుండబెట్టి వానికి రెండవ అలంగీర్ అనిపేరుపెట్టెను. అసలు న్యాయముగ రాజ్యమునకు రావలసిన యువరాజు ఆలీగొహర్ అనునతడు బీహారులో ఇంగ్లీషువారితో పోరాడుచుండెను. ఇతనిని త్రోసివేయుతలంపుతో అయోధ్య వజీరట్లుచేసెను. కాని, యితడే తదుపరి "షాఆలం" అనుపేరుతో చక్రవర్తియయ్యెను.

ఢిల్లీలో తన పలుకుబడిని. స్థానమును, నిలువబెట్టుకొనుటకు గాజీ ఉద్దీనుకు తగినంత బలములేదు. కాబట్టి యితడు తనకు సహాయముగ మహారాష్ట్రుల పిలచెను. మహారాష్ట్రులు సంతోషపూర్వకముగ యీ పిలుపు నాలించి. దక్షిణమునుండి పీష్వా సోదరుడగు రఘునాథరావుతో పెద్ద దండుగవచ్చిరి. లాహోరురాష్ట్ర

మునకు అహమ్మద్‌షాఅబ్దాలీ తరఫున అదీనాబేగ్ అనువాడు గవర్నర్‌గ నుండెను, ఈతడును మహారాష్ట్రులను పిలచి, పంజాబును జయించుకొమ్మనెను. రఘునాథ రావీపనిని సులభముగ జేసెను. కాని, తుదకిదియే మహారాష్ట్రులకు విషమించినది. ఏలననగ, దీనివల్ల మహారాష్ట్రులకు యెట్టి ధనముగాని, దోపుడుగాని దొరకకపోగా వారి చేతిసొమ్ము—80 లక్షలు ఖర్చయ్యెను. అదిగాక, అహమ్మద్ అబ్దాలీకి వీరిపై అపరిమితా గ్రహమువచ్చెను. వీరి నణచుటకై 1759 సంlllలో అతడు స్వయముగ యిండియాపైకి దండెత్తివచ్చెను.

రఘునాథరావు యింటికి వచ్చినప్పటికి, అతని నెవరును మహావీరునిగ పొగడ లేదు. పీష్వా ఖజానాకు అనవసరముగ 80 లక్షలు దండుగ తగిలించినందులకు అందరు అతనిని చీవాట్లు వేసిరి. రఘునాథరావు (రగూబా) యెల్లప్పుడు దురదృష్ట వంతుడే. అతనికి దూరదృష్టి లేదు.

ఈ చివాట్ల కతనికి కోపమువచ్చి అహమ్మద్‌షా అబ్దాలీ హిందుస్థానము పైకివచ్చినప్పుడు అతని నెదిరించుటకు “నేను పోన”ని భీష్మించుకొని కూర్చునెను. అందుచే ఈపనికి యింకొక మహారాష్ట్రనాయకుడు పోవలసివచ్చెను. అతడెవరనగ, రాజ్యమేలుచున్న పీష్వాయొక్క జ్ఞాతి ‘సదాశివభౌ’ అనునతడు. ఇతనివెంట పీష్వాకొడుకు విశ్వాసరావును వెళ్లెను.

సదాశివభౌ 30 వేల దిట్టమైన సైన్యముతో దక్షిణమునుండి బయలు దేరెను. దీనిలో 20 వేలు గుఱ్ఱపుబలము. ఫిరంగిబలము, కాల్బలముకలిసి 10 వేలు. ఫిరంగి, కాల్బలములు రెండును యూరోపియను పద్ధతిని తర్ఫీతై యుండెను. పరాసు నేత బుస్సీ శిష్యుడగు—“ఇబ్రహీమ్ ఖాన్ గార్డీ” యనువాడు యీ రెండు బల ములకు నాయకుడుగ నుండెను.

ఉత్తరమునకు వెళ్లుచున్నకొలది యీ మహారాష్ట్రబలము త్రోవలో వృద్ధి కాజొచ్చెను. మహారాష్ట్రకూటమునకు ప్రధానపురుషులైన సింధియా హోల్కా రులు తమతమ బలములతోవచ్చి యిందు చేరిరి. వీరుగాక, రాజపుత్ర ప్రముఖులు తమ గుఱ్ఱపుదళముల బంపిరి. భరతపురాధీశుడగు ‘జాటు’ నాయకుడు తాను స్వయముగ ముప్పయివేల కాల్బలముతో వచ్చిచేరెను. “ఇది హిందువుల కందరకు కావలసినపనిగ గన్పట్టె”నని మహారాష్ట్ర చరిత్రకారుడు వ్రాయుచున్నాడు.

కాని, యీ దండయాత్ర నిష్ఫలమయ్యెను. దీనికి కారణము ప్రధానసేనాని యగు సదాశివభౌయొక్క అసమర్థతయే యని చెప్పవలసియున్నది. యుద్ధసమయ మందు దక్కడవుండి యావత్తు కండ్లారచూచిన కాశీరాజు పండితు డిట్లు చెప్పు చున్నాడు:—

"ఇతని యాజమాన్యమునందున్న సేన అసంఖ్యాకముగ నుండెను. ఎట్టి ఆలస్యముగాని లేక సేన నడచిపోవుచుండెను. కాని, నర్మదానది దాటగనే, 'భౌ' తన యధికారమును వింతగను, యితరులకు నొప్పికలుగురీతిగను, చెలాయింప సాగెను. సేనలకు జీతభత్యము లిచ్చుటలోను, యితర డబ్బు వ్యవహారములోను, తక్కిన వ్యవహారములోను, యితడు అహంకారముతో తన యిచ్చవచ్చినరీతిని చేయసాగెను. హిందూస్థాన వ్యవహారములలో చాలా పూర్వానుభవముండి, అచ్చటనున్న ప్రముఖులతో పలుకుబడి, పరపతి గలిగియున్నటువంటి మలహారరావు మున్నగువారిని తన సంప్రతింపులోనికి యెంతమాత్రము తీసికొనక అందరిని విదిలించి వేసి, సర్వము తన అభిప్రాయము ప్రకారమే కేవలము నిరంకశముగ యీ సదాశివభౌ ప్రవర్తింప సాగెను."

మహారాష్ట్రసేన అనవసరమును, నిరుపయోగమునునగు సామానులను, పిల్లలను, ఆడవాండ్లను, నౌకరు చాకర్లను, వెంట యీడ్చుకొని పోవుచుండెను. ఇదంతయు బరువులచేటు. ఇది చాల తప్పుపని.

ఇతడు ఢిల్లీలో తన ప్రవర్తనవల్ల తన మహమ్మదీయ మిత్రవర్గమువారి స్నేహమును చెడగొట్టుకొనెను. అక్కడ కోటలో ప్రవేశించునప్పు డతడు "అక్కడ దొరికిన రాజమందిరపు సామగ్రిలో చాలభాగము నితడు పట్టుకొనెను. ముఖ్యముగ దర్బారుహాలుకు పైభాగమంతయు వెండితో తాపటము చేయబడియుండెను. ఎంతో సొమ్ము వ్యయపరచి యీ తాపటమును చేయించి యుండిరి. సదాశివభౌ యీ వెండి తాపటమునంతను వలిపించి 17 లక్షల రూపాయలుగ కరుగబోయించెను. ఇట్టివే అనేక చేష్టల నతడు చేసెను."

విశ్వాశరావును ఢిల్లీ సింహాసనముపై కూర్చుండబెట్టవలెనని యట యీ సదాశివభౌ తలంపు. ఈమాటను కాశీరాజు పండితుడు చెప్పుచున్నాడు.

ఈ పిచ్చిపనులన్ని మహమ్మదీయులకు అసహ్యము పుట్టించినవి. తన స్థితిని బలపరుచుకొనుటకై మహారాష్ట్రులు నింతకాలమునుండి నమ్ముకొనియుండిన అయోధ్యనబాబు, యిప్పుడీతని చేష్టలు చూచినతరువాత, యితనితో అంత మనస్ఫూర్తిగ, అంత ఉత్సాహముగ, చేరి పనిచేయుటకు వెనుకాడెను.

కాబట్టి, సదాశివభౌ స్థితియేమియు బాగుండలేదు. ఇతడు తన మహారాష్ట్ర ప్రముఖులకు కోపమును తెప్పించెను. జాట్ రాకొమరునకు, మహమ్మదీయ మిత్రులకుకూడ తనపై అసహ్యము పుట్టించుకొనెను. అనవసరమైన సామాగ్రితో సైన్యమును బరువులచేటుగ చేసుకొనెను. తనవెంటవచ్చిన సైన్యము దక్షిణాపథమందలి శీతోష్ణ పరిస్థితులకు అలవాటుపడిన వారగుటచే, ఉత్తర భూములలోని శీతోష్ణస్థితులు వారికి సరిపడలేదు. కాబట్టి, ఆఫగన్ రాజుతో యితడు చేయబోయే మహాయుద్ధఫలితము ముందుగనే యెల్లరకు తెల్లమైనది.

ఈ మహాయుద్ధము—పానిపట్టునవద్ద—1761 సం॥ జనవరి 6-వ తేదీన జరిగినది. 'జాంక్' రాకోమరుడు మహారాష్ట్రులను విడిచి మెల్లగ వెనుకకు జారెను. హోల్కారు యుద్ధముచేయక ఊరకుండెను. అయోధ్య నవాబు "సదాశివభౌ" యెడ మిత్రద్రోహిగ ప్రవర్తించెను. ఇన్ని కారణము లేకమై, మహారాష్ట్రుల నోడించెను. మహారాష్ట్రసేనలో చాలహతమైపోయెను. మహారాష్ట్ర నాయకుడును పీష్వా కొడుకునునైన విశ్వాసరావు యుద్ధరంగమందు చనిపోయెను.

అహమ్మద్ షా అబ్దాలీకూడ ఎంతో నష్టముమీదగాని యీ జయమును పొందలేకపోయెను. ఇతని సేనయు చాలభాగము హతమైపోయెను. అందుచే, అతడు మహారాష్ట్రులను దూరముగ తరుమగొట్టలేకపోయెను. మరియు, తనప్రతిభను ఢిల్లీకి ఆవలి రాష్ట్రములలో ప్రాకించుకొనలేకపోయెను. అనగ, తన విజయమునవలన రావలసిన పూరా ఫలితములను అతడు పొందలేకపోయెను. అతడు వెంటనే తిరిగి తన స్వదేశమునకు మరలిపోవలసివచ్చెను. ఇండియాపై దండెత్తివచ్చిన ఆఖరు మహమ్మదీయ వీరుడితడే. ఇతనితోసరి. మహమ్మదీయులు యిండియాలో ఆఖరు జయముగొన్న మహాయుద్ధ మిదియే. దీనితోసరి.

"పానిపట్టు యుద్ధముతో భరతఖండ చరిత్రయందు దేశీయుల యుగము అంతరించిపోయినది. ఇకనుండి పడమట (ఆరువేలమైళ్ల) దూరమునుండి వచ్చిన కోమటిరాజుల యుగము ప్రారంభమైనది. ఇకనుండి అంతయు వీరిగొడవతోనే సరిపోయినది."—అని 'సిడ్నీ ఓవెన్' పండితుడు "బ్రిటిష్ విజయారంభమం దిండియా చరిత్రను" వ్రాయుచు చెప్పెను. ఇండియాలో ఇంగ్లీషురాజ్యము పైకిరావడానికి యీపానిపట్టుయుద్ధము కారణమైనట్లు యింకెద్దియు కారణముకాలేదు. ఈ దెబ్బతో మహారాష్ట్రుల నడుమువిరిగినది. వీరిక తమ ప్రతిభను బెంగాలులోనికి ప్రసరింపజేయలేక పోయినారు. బెంగాలులో ఇంగ్లీషువారు మెల్లమెల్లగ తమకు బలమును చేకూర్చుకొనుచున్నారు. అక్కడ ఇంగ్లీషుపిట్ట కూతపట్టుచున్నది. అటు ఆఫ్గనులును తిరిగి యిండియాపైకి రాలేకపోయినారు. కునుకుచున్న మొగల్‌పాదుషా చేతినుండి రాజదండమును లాగికొన సమర్థమైన ఆఫగన్, మహారాష్ట్ర జాతులు రెండును పానిపట్టుయుద్ధముతో యిట్లు చతికిల బడిపోవుటచే, ఇంగ్లీషువారిపని వాటమైనది. తమ్మును యెదిరించు నాథుడెవడు లేకపోవుటచే వీరుబాగా కూతపట్టి పైకి ఎక్కివచ్చిరి.

యువరాజు ఢిల్లీకి పయన మగుట.

ఇకయీ ఉపాఖ్యానము నిటవదలి, మనము మొదట వదలిపెట్టివచ్చిన అసలు కథాభాగము నందుకొందము. మొగల్ పాదుషా (యువరాజు) బీహారులో చిక్కియుండెను. తన రాజధానియగు ఢిల్లీలో గాజీయుద్దీన్ అనునతడు చెలరేగి, తనకు కొక్కుపెట్టుటకై, పసి కుర్రవానినొకని బొమ్మగచేసి సింహాసనముమీద పెట్టి ఆడించుచుండెను. కాని,

అహమ్మద్ షా అబ్దాలీ యీకుర్రవానినే యిండియాకు నిజమైన పాదుషాగా అంగీకరించి, గాజీయుద్దీనును తోసివేసి, అయోధ్య నబాబగు షుజాఉద్దౌలాను సామ్రాజ్యమునకు వజీరుగ నియమించెను. ఇట్టి చిక్కు స్థితిలో తాను ఇంటికి (ఢిల్లీకి) తిరిగి వస్తేనేగాని వ్యవహారములు చక్కబడవని మొగల్ యువరాజు తొందరపడుచుండెను.

ఇంగ్లీషువారు తనయెడ మర్యాదగ ప్రవర్తించినందుకు మొగల్ రాకొమరుడు సంతోషించి వారికి బెంగాల్, బీహార్, ఒరిస్సా, రాష్ట్రములపై దివాన్ గిరీ యిచ్చెదననెను. కాని ఈపదవి నంగీకరించుటకు వారికప్పుడు అనుకూల సమయముగ లేకుండెను. అందుచే, యీ ఉద్యోగమును పుచ్చుకొనవద్దని కంపెనీవారు కార్నక్ సేనానికి కబురుపంపిరి. "నన్నుఢిల్లీ దాకా పంపించివత్తురుగాని రండ"ని, మొగల్ రాకొమరుడు ఇంగ్లీషువారిని అడిగెను. కాని, యీ కిరస్తానీ బచ్చులందుకు సమ్మతింపలేదు. ఇందునుగూర్చి వాన్ సిటార్టు మున్నగు కలకత్తాబోర్డు మెంబర్లు సీమడైరక్టర్ల కిట్లనివ్రాసిరి :—

"దేశీయ రాజులనుగురించి మొట్టమొదట చెప్పవలసినసంగతి యేమనగ :— ఇదివరకు యువరాజుగనుండిన మొగల్ రాకొమరుడిప్పుడు "షాఆలం" అను పేరుతో ఢిల్లీ పాదుషాగా ప్రకటించుకొనినాడు. (1761 సం॥) జూన్ ప్రారంభము వరకు మనసేనను కొంత పంపవలసినదని అతడెంతో పట్టుపట్టెను. కాని, మాకు వీలులేక పోయినది. ఏలననగ, కోస్తానుండి కర్నల్ కూటుసేన వచ్చేది లేనిది రూఢిగ తెలియలేదు. ఇటు బెంగాలుయొక్క క్షేమమును మొదట చూచుకొనవలసియుండెను. కాబట్టి, అంతదూరము, అంతగొప్పపనికితగిన సేనను యిచ్చి పంపుటకు మాకు అవకాశము లేకపోయెను. సాధ్యమైనంత త్వరగ యింటికి రావలసినదని వాళ్లవాళ్లు యీరాకొమరునికి ఢిల్లీనుండి కబుర్లమీద కబుర్లుపంపి తొందరపెట్టుచుండిరి. తనను కలుసుకొని, తీసికొనిపోవుటకై తాను నియమించుకొనిన వజీరు షుజాఉద్దౌలా తనరాష్ట్రపు పొలిమేరలోనికి వచ్చియుండెను. కాబట్టి, యిక మన సహాయములేకుండగనే అతడు ఢిల్లీకి పయనమగుటకు నిశ్చయించుకొనెను. మొగల్ రాకొమరుడు పాట్నాలోనున్నాళ్లు మీర్కాసీము అతనికి కావలసినంత డబ్బు సప్లయిచేసెను. అతడు ఢిల్లీకి పయనమగు సమయమందు అతనిపేర తన రాష్ట్రమునందంతటను సిక్కారూపాయలను ముద్రింపించెను. మనటంకసాలలో కూడ జూలై 15-వ తేదీన షాలంపేరుతో సిక్కారూపాయలు ముద్రించునట్లు మన ప్రెసిడెంటుకు చెప్పెను. ఆప్రకారమే తగుఏర్పాట్లుచేసి, రూపాయల ముద్రించితిమి. అయినప్పటికి, షాలంను అందరు పూర్తిగ చక్రవర్తిగ అంగీకరించుటలేదు. ఇదివరకు ఢిల్లీలో వజీరుగ ప్రకటించుకొన్న యతడు (గాజీయుద్దీన్) కొందరిని తనపక్ష

మున జేర్చుకొని, గొప్ప సైన్యమును చేకూర్చుకొని, ఢిల్లీకి వచ్చుచున్న యీరాకొమరుని, షాషుజానుకూడ దోవలో యెదిరించుటకు చూచుచున్నాడు........"

"ఈ విధముగ తమలోతాము పోరాడుకొనుచున్న వీరెవరుగాని, యిక యిటు మనవైపు తలయెత్తి చూడరనుకొందుము. కాబట్టి, మనకిక బెంగాలులో హాయిగ శాంతముగనుండును" (Wheeler's Early Records of British India—pages 275-276.

మూడు రాష్ట్రముల తాలూకు రివిన్యూలో రాజ్యభాగముక్రింద చక్రవర్తికి సాలుకు 24 లక్షల రూపాయలిచ్చుటకు మీరాక్కాసీము ఒడబడెను. కాబట్టి, చక్రవర్తి యితని నబాబు గిరీకి అంగీకరించుచూ పట్టాయిచ్చెను. ఈ చక్రవర్తి పేరింకను హిందూస్థానమందంతట గౌరవింపబడుచున్నది. రాష్ట్రముల దానమిచ్చుటకు యితని దస్కతు మొహరులున్న పత్రమింకను పనికి వచ్చుచుండెను.

ఈ మూడు రాష్ట్రముల ఆధిపత్యమునకు మీరాక్కాసీము ఢిల్లీ పాదుషానుండి పట్టా తెచ్చుకున్నాడన్న సంగతి కలకత్తాలోని కంపెనీ అధికారులకు తెలిసి, తాముకూడ యిట్లే చేయ సంకల్పించిరి. చక్రవర్తికేమియు నజరానాగాని, కప్పముగాని చెల్లించకుండగనే తాము పట్టా తెచ్చుకొనవలెనని వీరుచూచిరి కాని, యిందుకు చక్రవర్తి ఒప్పుకొనలేదు. ఏటేటా ఢిల్లీ ఖజానాకు కొంతకప్పము కట్టుచుండినగాని, తానీపట్టా నివ్వననెను.

ఇప్పటికి బయట దండయాత్రల హడావుడి అణగినది. దేశములోకూడ తిరుగుబాట్లు అణచివేయబడినవి. కాబట్టి, యిక యింగ్లీషువారి పని పట్టించవలసిన పని మీరాక్కాసీముకు మిగిలిపోయెను. వీరుపైకి మీరాక్కాసీముకు మిత్రులమని చెప్పుకొనుచున్నను, శత్రులమని చెప్పుకొనుచున్నను, అతనికి ఒకటిగనే యుండెను. ఇతడు కలకత్తాలోని కంపెనీ కమిటీలోని యావన్మంది ఏకాభిప్రాయప్రకారము సింహాసనముపై కూర్చుండబెట్టబడలేదు. వానిలో అధికసంఖ్యాకుల యభిప్రాయము ప్రకారమే యితడు తక్తుయెక్కింపబడెను. మిగతావారిని యిందువిషయమై సంప్రదించనైన లేదు. ఇతనివద్దనుండి గుంజుకొన్నడబ్బును అందరికి పంచిపెట్టక, అందులో ముఖ్యులగు అయిదుగురుమాత్రమే కాజేసిరి. కాబట్టి, యీ బేరములో నేమియు డబ్బుముట్టని తక్కిన మెంబర్లకు యీ వ్యవహారమేమియు నచ్చలేదు. ఇట్టివారికి మీరాక్కాసీము పరిపాలనలో మంచియేమి కనిపించును? అందుచే మీరాక్కాసీము యొక్కయు, అతనిని తక్తుపై కూర్చుండబెట్ట కుట్రపన్నిన వారియొక్కయు పరిపాలన యేమియు బాగుండలేదనిచెప్పి బహుతీవ్రముగ ఖండించుచు, వీరందరుచేరి 1762 సం॥ మార్చి 11-వ తేదీన సీమ డైరక్టర్లకు ఒక పెద్ద ఉత్తరము వ్రాసిరి. ఈ ఉత్తరం చాలపెద్దది. అందు కొన్ని భాగములను మాత్రమే యిట యివ్వగలము:—

మీరాక్కాసీముకు, ఇంగ్లీషువారికి కలహారంభము.

"ఇతడు నవాబుగిరికి వచ్చినప్పటినుంచి చేసిన దుర్మార్గాలు యెన్నోవున్నవి. అవన్నియేకరువుపెట్ట దలంచుకుంటే చేటభారత మౌతుంది. అతడు ముఖ్యముగ యింగ్లీషువారికి పరమమిత్రులుగ నున్నవారినే హింసించడము సాగించినాడు. ఒక్క రామనారాయణుని సంగతిమాత్రమే మీ కిక్కడ నిదర్శనముగ చెప్పెదము. ఇతడు మిక్కిలి విశ్వాసపాత్రుడగుటచే, యితనిని మద్దతుచేయుటయే మంచిపద్ధతిగ మనము మొదటినుండియు పెట్టుకొన్నాము. ఇట్టివానిని పాట్నా (బీహారు) నవాబుగిరినుండి మీర్కాసీము తొలగించెను. ఇతనిని ఖైదులో అరదండములు వేసియుంచెను. నిలువెల్లదోచుకొనువరకు మీర్కాసీము యితనిని వదిలిపెట్టడు. పిమ్మట యమలోకానికి కూడ పంపించేటట్టున్నాడు. ఇట్లే యింగ్లీషువారి పక్షముగనున్నవారినందరిని యితడు దోచుకొనుచున్నాడు. ఈ చిత్రవధలకు తాళలేక చాలమంది చచ్చిపోయిరి కూడాను. కొందరిని అతి నీచముగ చంపించినాడు. కొందరు అవమానములు భరింపలేక ఆత్మహత్యలుకూడ చేసుకొనిరి."

రామనారాయణుని తాము మీర్కాసీముకు అప్పగించినరీతిచూడగ అది ఇంగ్లీషుకంపెనీ యుద్యోగుల కెంతయో కళంకముగ నున్నది. ఈ పనిచేయుటకు మేజర్ కార్నక్ తిరస్కరించెను. ఇందువిషయమై కలకత్తానుండి వచ్చిన ఉత్తరువుల నతడు తిరస్కరించెను. రామనారాయణుడు నవాబుకు సొమ్ముబాకీ యున్నాడట. 1772 స॥ పార్లమెంటు కమిటీయెదుట కార్నక్ యిట్లుచెప్పెను:—

"రామనారాయణుడు చాలసమర్థుడు; కాని, దురాశాపరుడు. ఇతడు చాల ధనాఢ్యుడని ప్రతీతి. ఈకారణముచేతనే యితనిని తనచేతిలో వుంచుకొనవలెనని నవాబు తలంచుచుండెను. ఇతడు నవాబుయొక్క యీర్ష్యకెల్లప్పుడు గురియైయుండెను. ఇతని ఖజానాను కాజేయవలెనని మీర్జాఫరుకూడ తలంచుచుండెడివాడు. కాని, అతనికిట్టి అక్రమము జరుగకుండ క్లైవు కాపుదారీగనుండెను. రామనారాయణుని మద్దతుచేయుట మనకు ధర్మమని భావింపబడుచుండెను. మొగల్ యువరాజును జయించినవెంటనే నాకువచ్చిన ఉత్తరువులుకూడ యిందు కనుగుణముగనే యుండెను. నవాబువల్ల అతనికెట్టి దౌర్జన్యముగాని, అన్యాయముగాని, జరుగకుండ క్లైవు నాటినుండి వచ్చుచున్న యేర్పాటులను మన్నింపవలసినదనియే నాకువచ్చిన మొట్టమొదటి యుత్తరువులలోనుండెను. రామనారాయణుడు తమకు బాకీయున్నాడను సాకుచెప్పియే నవాబులు యెల్లప్పుడు యితనిని పీడింప జూచుచుండిరి. కాని, యిందుకు ఆధారము గన్పింపదు. ఏలననగ, యిందువిషయమై నేనితనితో యెన్నియోసార్లు ప్రసంగించుచుంటిని. లెక్కలను న్యాయమగు పద్ధతిని పరిష్కరించుకొనుటకు అతడెల్లప్పుడు సంసిద్ధముగనేయుండెను. కాని, పాపమితనినిగూర్చి కౌన్సిలువారును గవర్నరును నాకు తదుపరి భిన్నమగు ఉత్తరువులు నివ్వసాగిరి. వీరియుత్తరువులలోగల పరస్పర వైరుధ్యమును చూపించుచు నేను కంపెనీ యధికారులకు

వ్రాసినజాబు నేటికిని కంపెనీ రికార్డులలో గన్పింపగలదు. ఇట్టివానిని శత్రువుచేతికి అప్పగించునంతటి మానహీనమైనపనిని నేను చేయజాలనని—నేను సేనాపతిగ నున్నంతకాలము చేయజాలనని—ఆ జాబులో గట్టిగ వ్రాసితిని.''

తమ ఉత్తరువుల నితడు తిరస్కరించినందుకు కలకత్తా కంపెనీ అధికారులు యీ కార్నక్‌ను ఉద్యోగమునుండి తీసివేసిరి. ఇతనిస్థానే అప్పుడే తూర్పుకోస్తానుండి వచ్చిన కర్నల్ కూటును నియమించిరి. ఇతడుకూడ రామనారాయణుని నబాబుకు అప్పగించనని తిరస్కరించెను. పార్లమెంటు కమిటీముందర కర్నల్ కూటు యిట్లు చెప్పెను :—

''రామనారాయణుని పట్టుకొనవలెనను పిచ్చి నబాబుకు బాగాపట్టినది... ......ఇతనిని గనుక తనకు పట్టియిస్తే నాకు 7½ లక్షల రూపాయలిస్తానని నబాబు నాతో బేరముపెట్టెను. ఇదిగాక, మాకుటుంబము వారికికూడ యేమి కావలిస్తే అది యిస్తానన్నాడు. ఈసంగతిని నేను 1761 సం॥ జూలై 17-వ తేదీన గవర్నరుకు కౌన్సిలుకు, తెలియపరచితిని. తనపని నావల్ల సాధించుకొనుటకు సాధ్యము కానందున నబాబు నన్నుగూర్చి అనేక అబద్ధపుమాతలు గవర్నర్ వాన్‌సిటార్టు పేర వ్రాసెను.........''.

గవర్నర్ వాన్‌సిటార్టు అంతట యీ 'కూటు'ను కూడ పాట్నానుండి తొలగించెను. అందుచే రామనారాయణుడు నబాబుచేతులలోపడెను. నబాబునుండి గొప్ప లంచములను మేయబట్టియే వాన్‌సిటార్టు మున్నగువారు రామనారాయణుని యీరీతిగ అతనిచేతికి అప్పగించిరని చెప్పవలసి వచ్చుచున్నది. మిల్లు యిట్లువ్రాయుచున్నాడు :—

''వాన్‌సిటార్టు పరిపాలనలో గలిగిన గొప్ప కళంకము ప్రాణాంతకమైన ప్రమాదము—యిదియే. ఏలననగ, ఇంగ్లీషువారి రక్షణయనునది వట్టిబూటకమను అపనమ్మకము దేశములోని ప్రముఖులందరిలో కలిగిపోయెను. ఇంకొక విశేషమేమనగ ఈతడింతదూరము అతిక్రమించిపోయి యిట్టి ఘోరపాతక కృత్యమునకు తన యంగీకారము నొసంగుటనుబట్టి చూడగ యితడేదో మెత్తపడి, లంచముమేసి యుండవలెనను తలంపు అందరికి పుట్టినది. దరిమిలా, నబాబుకు నిజముగ అన్యాయము జరుగుచున్నప్పుడు యితడు అడ్డమురాగా, యితనిమాటకేమియు పాటిలేకపోయెను.'' (Vol. III. Page 224.)

వాన్‌సిటార్టునుగూర్చి అనియత్ మున్నగు యితర మెంబర్లు 1762 సం॥ మార్చి 11 తేదీగల తమ జాబులో కంపెనీ డైరక్టర్లకిట్లనివ్రాసిరి :—

''తానేదైనా అవకతవకపని చేసినప్పుడు, దానినెట్లైన సమర్థించుకొనుటకు యేదో ఒకతడిక అల్లుట ప్రతివానికి లక్షణమైయున్నది. ఇప్పుడు వాన్‌సిటార్టు

పనికూడ యిట్లేవున్నది. ఈతడిక్కడ విపరీతమగు విప్లవమును తెచ్చిపెట్టెను. దీనిని సమర్థించుకొనుట కాతడెన్నో తిప్పలుపడుచున్నాడు. ఏవో కథలు అల్లుచున్నాడు. దాని స్వభావానికి అనుగుణ్యముగ యేయే అతుకులు పెట్టితే సరిపోతుందో అవన్నీ పెట్టిచూచి కథ అల్లుటకు అతడు తంటాలుపడుచున్నాడు. కాని, అతడేమి చెప్పినను సరే, అతని వాదనలు యింతటి ఘోరకార్యమును సమర్థించుటకు చాలవు. ప్రపంచమును తృప్తిపరచుట కివిచాలవు. లోకులకు మీర్జాఫరుమీద అసహ్యము పుట్టించుటకుగాను అతని ప్రవర్తనకు సలుపురంగు పూయవలెనని వాన్‌సిటార్టు యెన్నో తిప్పలు పడుచున్నాడు. మీర్జాఫర్ పట్టణములో ధాన్యము లేకుండ చేసినాడని చెప్పి వాన్‌సిటార్టు దానినొక పెద్దతప్పుగ అతనిపై వేసి రుద్దజూచుచున్నాడు. నిరుడు వాన్‌సిటార్టు మాత్రమేమి చేసినాడు? ఇతడెంత తంటాలుపడినను పట్టణములో తగినంత ధాన్యమును నిలువయుంచగలిగెనా? ధాన్యములేక నిరుడు కలకత్తాలో జనము అసంఖ్యాకులుగ చచ్చిపోలేదా? ఇందుకు వాన్‌సిటార్టు యేమిసమాధానము చెప్పకోగలడు?''

బెంగాలులో గలిగిన యీరెండవ విప్లవమువల్ల ప్రజలయందెంతటి అసహ్యము గలిగెనో వీరేలతడు ఉత్తరములో యిట్లని వ్రాసిరి :—

"ఈ విప్లవమువల్ల మనయందు ప్రజలకెంతటి చెడ్డ అభిప్రాయము గలిగిందంటే, మీర్జాఫరుకాలములో మనకెంతో అనుకూలముగనున్న బర్ద్వాన్ రాజా యిప్పుడు మనకెదురుతిరిగినాడు. వెనుక యితడు మనకనుకూలుడుగనుండి తన జిల్లాలపై రివిన్యూను మెట్టి ఆటంకములేకుండా పూర్వమువలెనే-టంకాలపద్ధతిని-మనము వసూలు చేసుకొనుచుండవచ్చుననియు, తన జిల్లాలపై మనము నబాబుగిరీనికూడ చక్రవర్తినుండి సంపాదించుకోనచ్చుననియు, యీతడు తరుచు అనుచుండెడివాడు. కాని, మనమెప్పుడైతే ముసలి నబాబును ద్రోహము చేసినామో, అతనికి మనమాటయందు నమ్మకము పూర్తిగపోయెను. మనమాటలు నమ్మితే తనపని మట్టియేయని యితనిమనస్సుకు నిశ్చయమైపోయినది. అందుచే, అతడప్పటి నుండి, తా నిదివరకు చెప్పుచువచ్చిన మాటలన్నిటిని కట్టిపెట్టి, మనయధికారము క్రిందనుండుట కిష్టపడక, బహిరంగముగ మనపై తిరుగుబాటు సాగించినాడు. మన వర్తకమును ఆపివేసినాడు; పెద్దసేనను పోగుచేసుకున్నాడు; మహారాష్ట్రులను తనకు మద్దతుగ పిలిపించుకున్నాడు; కప్పముకట్టుట మానివేసినాడు; బీర్‌భూమి రాజానుకూడ తనతో కలుపుకొని మొగల్ యువరాజు పక్షమునచేరి అతనితో ఉత్తర ప్రత్యుత్తరముల నడపినాడు........."

"ఈ విప్లవము సంగతి తెలియగనే, నబాబు సేనలో పెద్ద అల్లకల్లోలము పుట్టినది........."

వీరింకను యిట్లని ఆ ఉత్తరములో వ్రాసిరి :—

"నబాబు (మీర్కాసీము) తనరాజ్యాధికారమును (నబాబుగిరీని) కొనుక్కున్నాడు. కాబట్టి, యీ బేరము గిట్టుబాటగుటకు యితడు తిరిగి డబ్బు సంపాదించుకోవలెనుగద. అందుచే అతడు తనప్రజలను, రాష్ట్రమును చేతనైనంతవరకు నడివేసి డబ్బు పిండవలయును. మనమాటలు నమ్మకున్న మీర్జాఫరుకు యెట్టిగతి పట్టెనో యితడు కండ్లారచూచినాడు. కాబట్టి, తనకుమాత్రము మనవల్ల వేరుగతి పట్టునని ఆత డెట్లనుకొనగలడు? అందుచేత, మన ప్రేక్ష్యములేకుండగనే, తన సాధనమును తాను బలపరుచుకొనుట కితడు ప్రయత్నించుట సహజము. ఈతడిట్లు చేయ మొదలిడినట్లు నిదర్శనము లప్పుడే కనిపించుచున్నవి. ఎట్లనగ, దేశములో యిప్పుడు నలుదెసల శాంతి ప్రబలియున్నప్పటికి, యితడు తనసేనను, ఊరక పెంచుకొనుచున్నాడు. తాను యితరులకు దుర్భేద్యముగ నుండుటకుగాను యితడిప్పుడు తనసేనలో యావన్మంది శిపాయిలకు యూరోపియన్ పద్ధతిని తరిఫీయతు యిప్పించుచున్నాడు. తనరాజధానీ నగరమును మూర్షిదాబాదునుండి రాజమహల్అను చోటికి మార్చినాడు. మూర్షిదాబాదుపట్టణము మన ఇంగ్లీషువారున్న చోటికి చాలదగ్గరగవున్నది. అదిగాక, తనకు పూర్వమున్న నబాబు సురాజ్ఉద్దౌలా యిక్కడనే వధింపబడెను. (కాబట్టి, యిది అచ్చుబాటుగాని చోటను తలంపుతోను) మన ఇంగ్లీషువారి వాసనతగులకుండ, దూరముగ ఉందామను ఉద్దేశముతోడను, యీ మీర్కాసీము తనరాజధానిని మూర్షిదాబాదునుండి యెత్తివేసి రాజమహల్లో పెట్టినాడు. మనకందకుండ వుండుటకుగాను యిత డిప్పుడిక్కడ ఒక పెద్దకోటను కట్టించుకొని అందులో కాపురముండబోవుచున్నాడు."

"నబాబుచర్య అనుమానాస్పదముగవున్నదండి" అని మనవారెవరైనా మనబోర్డు మీటింగులోఅంటే—"ఆ, దానికేమి?" నబాబు స్వతంత్రుడు ; వాడి దేశానికి వాడు యజమాని ; మన ప్రేక్ష్యములేకుండ తన యిష్టమువచ్చినట్లు చేసుకోడానికి అతనికిస్వతంత్రమువున్నది" అని కొందరు మనవారు సమాధానము చెప్పుచున్నారు. అయితే, వెనుక మీర్జాఫరుకు మాత్రము స్వతంత్రములేదా? అతనికున్న స్వతంత్రముకంటె, యిప్పుడతనికెక్కువ స్వతంత్ర్య మెక్కడినుండి వచ్చును? బంగాళా నబాబు స్వతంత్రుడనియు, అతడు ఇంగ్లీషువారి దయాధర్మముపై ఆధారపడి యుండలేదనియు మనము చెప్పేమాటలు నిజమేఅయితే, వెనుక మీర్జాఫరునేల మనవారు అతని పరిపాలనలోపములకని పేరుచెప్పి, దండించి, సింహాసనమునుండి కూలద్రోయుటకూడ యెట్లుతటస్థించెను? పోనీ, అతడు మనతోచేసికొన్న సంధికి విరుద్ధముగ ప్రవర్తించి, మనజాతికి అక్రమమొనర్చినందువల్ల తామిట్లు చేసితిమని చెప్పుకొనుటకుకూడ మనవారికి అవకాశములేదే."

మొగల్ చక్రవర్తికి మీర్కాసీమునెడ నమ్మకములేదను సంగతిని వీరీ యుత్తరములోనే యిట్లు వ్రాసిరి :—

"తనకు మీర్కాసీమునెడ ద్వేషమున్నట్లు మొగలాయిచక్రవర్తి తాను ఢిల్లీకి పయనమగుటకు పూర్వము నిస్సందేహమగు దృష్టాంతముల గనపరచెను. యింగ్లీషువారియెడ తనకు గొప్పగౌరవమున్నట్లును గనపరచెను. ఎట్లనగ, బంగాళా దేశమునకు దివాన్‌గిరీని మనకంపెనీ కిచ్చెదనని చక్రవర్తి తనంతట తానుగ అనెను. ఈ ఉద్యోగమున కర్థమేమనగ :—నబాబుక్రిందనున్న ప్రాంతములన్నింటిలో శిస్తులు వసూలుపరచి, ఢిల్లీ సంస్థానమునకు లెక్క అప్పగించవలెను. దీనికిని నబాబుగిరీకిని తేడావున్నది. నబాబుగిరీయనగా, సైన్యముల కాధిపత్యమును వహించుట, దేశమునంతను అన్నివిధముల పరిపాలించుట యను పనులు యిందు చేరి యుండును. ఈ ఖర్చులకన్నిటికి కావలసినడబ్బు దివాన్ వసూలుపరచిన సొమ్ములో నుండి వచ్చును......దీనినిబట్టి, చక్రవర్తికి నబాబు (మీర్కాసీము) నందు నమ్మకము లేనట్లును, అందుచే మనము నబాబుపై అదుపుగవుండి కనిపెట్టి చూచుచు శిస్తుదస్తులకు మనమే తనకు జబాబుదారీ వహించవలెననియు, చక్రవర్తికోరికయై నట్లును, స్పష్టముగాగలదు......"

ఐర్‌కూటు, అమియత్, కార్నక్, ఎల్లిస్, వాట్‌సన్, వరల్‌స్ట్, యీ ఆరుగురు సంతకములుచేసి డైరెక్టర్లకు పంపినఉత్తరము ధోరణి యీరీతిగ నున్నది. వీరందరు మీర్కాసీముకు గర్భశత్రువు లనుసంగతి వేరుగ చెప్పనక్కరలేదు. వీంకి యితనివల్ల డబ్బేమియు ముట్టలేదు. కాబట్టి, యితని ప్రవర్తన నలుపుగావించుటకై వారు చేయనిపనిలేదు.

## మీర్కాసీముతో కలహకారణం - సుంకముల నెగవేయుట.

పోనీ, యిక నబాబుకు స్నేహితులమని చెప్పుకొనువారి సంగతి చూద్దునూ, అది అంతకంటె అధ్వాన్నముగ నున్నది. అతనిని యింకను బెదరించి పూర్తిగ నిలువున దోచుకొందమను దురాశచే వీరును మీర్కాసీమును యేడ్పింపసాగిరి.

యింగ్లీషువారు కేవలము చిల్లరదుకాణదార్ల జాతియగుటచేతను, వారిక్కడికి ధనాశచే వచ్చినవా రగుటచేతను, మీర్కాసీమును అలుసుచేసుకొని డబ్బు గుంజుదమని వారు పూనుకొనిరి. వర్తకముపేరు చెప్పి ధనము నక్రమముగ పోగుచేసికొనవలెనని వారుచూచిరి. ఈ దేశములో, దేశీయరాజుల పరిపాలనలో, సరకుల రాకపోకల రవాణాలపై, త్రోవలో అక్కడక్కడ (చౌకీలు) గేట్లుపెట్టి సుంకముల వసూలుపరుచు ఆచారముండెను. ఢిల్లీపాదుషా ఫర్మానాలవల్ల యింగ్లీషు కంపెనీవారిట్టి సుంకములు తమ సరుకులపై లేకుండ జేసికొనిరి. అయితే, యీ సౌకర్యము ఒక్కకంపెనీ తాలూకు సరకులకే కలదుగాని, కంపెనీ గుమాస్తాలు,

నౌకర్లు తాము సొంతముగ ప్రయివేటుగ రవాణా చేసుకొను సరకులకు లేకుండెను. ఆ రోజులలో తమ గుమాస్తాలుకూడ తమ సొంతపెట్టుబడితో ప్రత్యేకముగవర్తకము చేసికొనుటకెట్టి యభ్యంతరమును సీమడైరెక్టర్లు పెట్టియుండలేదు. అయితే, నబాబు యిచ్చిన ఫర్మానా కంపెనీ వర్తకమునకే వర్తించునుగాని,యీ గుమాస్తాల ప్రయివేటు వర్తకమునకు వర్తించదు. తక్కిన దేశీయవర్తకులందరు సుంకములు చెల్లించునట్లే, యీ గుమాస్తాలుకూడ సుంకములు చెల్లించవలసియుండెను. కాని, మీర్కాసీమును తక్తుయెక్కించిన తరువాత, యీ గుమాస్తాలు తమ ప్రయివేటు వర్తకముపై సుంకములు చెల్లించకుండ మెల్లగ యెగవేయవలెనని జూచుచుండిరి. తమ ప్రయివేటు సరుకులకుకూడ కంపెనీ తాలూకు దస్తకులనే (చీట్లనే) వినియోగించుకొని, నబాబుకు చెల్లవలసిన సుంకములను చెల్లించకుండ వీరు రహస్యముగ తప్పించుకొన మొదలిడిరి. మిల్లు యిట్లు వ్రాయుచున్నాడు :—

"కంపెనీ గుమాస్తాల సరుకు లిట్లు సుంకములనుండి తప్పించుకొని పోవుచుండగ, దేశీయవర్తకుల సరకులు భారమగు సుంకముల నింకను చెల్లించుకొనవలసియే వచ్చుచుండెను. ఈ కారణముచేత, దేశములోని వర్తకమంతయు, అతిత్వరితముగ, కంపెనీ గుమాస్తాలచేతులలోనికి పోవుచుండెను. ఇందుమూలముగ నబాబుకు రావలసినరాబడి యెండిపోవసాగెను. సుంకముల వసూలుచేయు అధికారులెవరైనా, యీ దొంగచీట్లను పట్టుకొని, సరకులను అటకాయించినప్పుడు కంపెనీ గుమాస్తాలు వెంటనే కొందరు శిపాయిలను వారిపైకి ఉసుగొలిపి వారిని పట్టుకొని యీడ్చుకొనివచ్చి, దగ్గరగనున్న యేగిడ్డంగిలోనో ఖైదుచేయుచుండిరి." (Vol. III P 229—230)

కంపెనీ గుమాస్తాల యీ ప్రయివేటు వర్తకమువల్ల యెట్టి ఘోరములు జరుగుచుండెనో, కండ్లారచూచిన చాలమంది యింగ్లీషువారే వీనిని ఖండించుచు వ్రాసిరి. వారిలో కొందరి అభిప్రాయములు మాత్ర మిట ఉదహరించెదము.

1762 సం॥ ఏప్రిల్ 25-వ తేదీన భగల్‌పురమునుండి వారన్‌హేస్టింగ్సు కలకత్తాలోని కంపెనీ ప్రెసిడెంటుకు వ్రాసిన ఉత్తరములో యిట్లున్నది :—

"నేను వెళ్లినచోట్లనెల్ల యెన్నో ఇంగ్లీషుజెండాలు ఎగురుతూవుండడం చూస్తే నాకే ఆశ్చర్యంవేసింది......ఇట్లా యివ్వి యెగురుతూ వుండడానికి హక్కు యెట్లా యేర్పడితే యేమీ? ఎట్లాగైనా మొత్తముమీద యిన్ని యింగ్లీషు జెండాలు ఎగరడం యీ దేశానికిగాని, నబాబుకుగాని, మన యింగ్లీషు జాతికిగాని, శుభసూచకంకాదు.

.........సిపాయిలనుగూర్చి అనేక ఫిర్యాదులు దోవలో నాచెవిని బడ్డవి. మేము వస్తున్నామని తెలియగానే, దుకాణాలు మూసివేసి, ఊళ్లల్లో జనం ఎక్కడి

వాళ్లక్కడ పారిపోయినారు. ఇదివరకువచ్చిన సిపాయిలు చేసినట్లుగానే, మేము కూడా దౌర్జన్యాలుచేస్తామని పాపం వాళ్లు బెదిరిపోయారు కాబోలు!'' వరల్‌స్టట్ యిట్లు వ్రాయుచున్నాడు :—

''సుంకములేకుండ తాము ప్రయివేటుగ వర్తకము చేసికొనుటకు తమకు అధికారముగలదని కంపెనీగుమాస్తాలు అనడం సాగించారు. వెనుక మీర్జాఫర్‌తో చేసుకొన్నసంధిలో యీ హక్కుండెనని వాదన మొదలిడిరి. ఈ హక్కును వారిప్పుడు తమ సైన్యబలముచే మద్దతు చేసుకొనుచున్నారు.........ఈ కాలములో చాలమంది నల్లవర్తకులు కంపెనీ కొలువులోనున్న యే గుమాస్తానో పట్టుకొని వానికి లంచములిచ్చి, వానిపేరుతో చీట్లను సంపాదించుకొనుచుండిరి. ఈ విధముగ దేశీయులు పీడింపబడిరి. ఈ మార్గముగ కంపెనీకొలువులోవున్న చాలమంది కుర్ర గుమాస్తాలు సాలుకు 1500, మొదలు 2,000 నవరసులవరకు సొమ్ము సంపాదించి, చక్కని సిల్కులు వగైరా దుస్తుల ధరించి, ప్రతిరోజు దిట్టముగ తిని త్రాగుచుండిరి''......''సుంకముల నెగబెట్టు వర్తకము ధారాళముగ సాగ నారంభించెను. దీనిలో అంతులేనిపీడలు జరుగుచుండెను.......మీరాఖాసీముతో సద్యః యుద్ధము రావడాని కిదియే కారణము.'' (View of Bengal P, 8 and 46)

తమ గుమాస్తాల యీ ప్రయివేటు వర్తకమును సీమదొరకట్లుకూడ ఖండించిరి. 1764 సం॥ ఫిబ్రవరి 8-వ తేదీగల తమ ఉత్తరములోవారు కలకత్తాలోని కౌన్సిలువారి కిట్లు వ్రాసిరి :—

'' దేశీయప్రభుత్వముతో మనకు తగాదాలు, అపోహలు, కష్టములు, కలుగుటకు మన నౌకర్లు, గుమాస్తాలు, యేజెంట్లు మున్నగువారు విచ్చలవిడిగ చెలరేగి నవాబుకు న్యాయముగ జూపవలసిన అధికారమునకు, న్యాయముగ చెల్లవలసిన రివిన్యూకు, భంగకరముగ సాగించిన ప్రయివేటు వర్తకమే మూల కారణమైనట్లు స్పష్టముగ గన్పించుచున్నది. దేశములోని వర్తకముసంతను దేశీయప్రజల చేతుల నుండి మన గుమాస్తాలు లాగికొనిరి. ఇట్లు చేయుటకు మనకుగాని, మన రక్షణ పోషణలలోనున్న యేమనిషికిగాని న్యాయముగ యెట్టి హక్కునులేదు. ఇందువల్ల కంపెనీకివున్న అమూల్యమగు హక్కులకే భంగము కలుగవచ్చును. ఈ అక్రమముల నన్నిటిని సరిజేయుటకై మేమీ దిగువవిధముగ ఆజ్ఞాపించుచున్నాము:—

దేశములో ఉత్పత్తియై, దేశములో ఖర్చగుఉప్పు, పోకలు, పొగాకు, మున్నగు సమస్త వస్తువులలో మనవారు దేశాంతర్భాగములో జరుపుచున్న వర్తకమును యీ ఉత్తరము అందిన తక్షణమే మీరు పూర్తిగ, ఖండితముగ, ఆపించివేయవలెను. ఇట్టి వర్తకములో జోక్యమున్న యూరోపియనులను, యితర యేజెంట్లను, గుమాస్తాలను, తక్షణమే కలకత్తాకు పిలిపించివేయవలెను. వీరిని తిరిగ ఆ

చోట్లకు పోనివ్వవద్దు. ఇతరులనుకూడ యిట్టిపనులకై ఆచోట్లకు, ఆ స్థానములను నింపుటకు, తిరిగి పంపకూడదు.''

ఇందువిషయమై డైరెక్టర్లు బుద్ధివంతముగానే ప్రవర్తించిరి. కాని, కలకత్తా లోనున్న కంపెనీ యుద్యోగులు మాత్రము యీ ఉత్తరువులను బుట్టదాఖలు చేసిరి.

పాట్నాలోనున్న కంపెనీ గిడ్డంగికి ఎల్లిస్ అనునతడు అధికారిగ నుండెను. ఇతడు అతికోపధారి. నబాబుకు, యింగ్లీషు గవర్నర్ వాన్ సిటార్టుకుకూడ గర్భశత్రువు. నబాబును అవమానపరచకుండ, అతని అధికారమును ధిక్కరింపకుండ అతనికి నిద్రపట్టేదికాదు. కంపెనీకి నబాబుకు మధ్య యిన్నిచిక్కులు, అపోహలు, తగాదాలు రావడానికి యితడే కారకుడు. ఇతడు నబాబుయెడ గావించిన కొన్ని దుష్కార్యములగూర్చి గవర్నర్ వాన్ సిటార్టు వివరించియుండెను. (Narrative Vol I P. 300—314 and 323, also 326 to the end and Vol II, 1—11)

నబాబుకు, ఎల్లిస్‌కు జరిగిన తగాదాల న్నాట నటుంచి, కేవల మీ ప్రయివేటు వర్తకం విషయములోవచ్చిన పేచీలనుగూర్చి మాత్రమిటకొంత వివరింతుము. 1762 సం॥ అక్టోబరు 7-వ తేదీన ఎల్లిస్ పాట్నానుండి కలకత్తా కంపెనీ యధికారుల కిట్లు వ్రాసెను :—

''ఈ సంవత్సరం పెట్టుబడి పూర్తికాలేదని మీరు మమ్ములను దరిమిలా నిందించకుండుటకుగాను, నేను మీ కిప్పుడే (దిగువ) సంగతులను మనవిచేయవలసి యున్నది. బట్టల వ్యాపారమునకు ప్రధానస్థానమైన 'జోహన్నబాదు'లో (నబాబు అధికారులు) మన గుమాస్తాలను, దళారులు వగైరాలను బెదరించి, అక్కడవారెవరు వుండకూడదనియు, బట్టలు కొనకూడదనియు, తక్షణమే అక్కడనుండి లేచి పోవలసినదనియు, జబరదస్తీగా ఉత్తరువుల జేయుచున్నారు. ఈ ఉత్తరువులకు విధేయులు కానివారిని వారు భయపెట్టి నానా బండబూతులు తిట్టుచున్నారు. మన బట్టల నానుపుచున్న చాకలవాండ్లను (నబాబు ఉద్యోగస్తులు) చావగొట్టినారు. మనపని చేయనివ్వకుండ, వారిపై బంట్రోతులను కాపలాపెట్టినారు.''

''నేనీసంగతు లన్నిటిని అక్కడనున్న (నబాబు ప్రధానోద్యోగి) రాజా నౌబత్ రాయితో ఫిర్యాదు చేసుకొన్నాను. కాని, ఇందువిషయములో తానేమియు చేయ లేననియు, యీపనులుచేయుచు కంపెనీకి నష్టముకలిగించుచున్న (పెహూరాయి) స్వతంత్రుడనియు, అతనిపై తనకధికారము లేదనియు, అతడు జబాబు చెప్పెను. దీనినిబట్టిచూడగ, నబాబే యీమనిషినిపంపి ఇట్టిపనులు చేయించుచున్నట్లు కనిపించుచున్నది.

"ఇట్టి దౌర్జన్యములను మనముచూసీ చూడనట్లు ఊరుకొన్నచో, యీ సంవత్సరము మనపెట్టుబడి పూర్తికాదు. దేశీయ ప్రభుత్వమిట్లు తమ్ముల్ని హింసిస్తూ వుంటే, యిక మనదగ్గర నౌకరీ యెవడుచేస్తాడు?

"కంపెనీవర్తకం సాగాలంటే మనము దౌర్జన్యానికి దౌర్జన్యంచేస్తేనేగాని సాగేటట్టులేదు. అట్లుచేయవద్దని మీదగ్గరనుండి ఉత్తరువులు వస్తేనేతప్ప లేకపోతే నేనిక్కడ దౌర్జన్యంచేస్తా."

ఎల్లిస్ నీతి నియమములు లేనివాడు. అతికోపధారి. ఈవుత్తరం చూచుకోగానే కలకత్తా అధికారులు తక్షణమే ఇతనికి తిరిగి (1762 సం। అక్టోబరు 16–వ తేదీన) ఇట్లు జబాబు వ్రాసిరి:—

"నీవు 7–వ తేదీన వ్రాసిన ఉత్తరం యీరోజుననే అందినది. నీవు చెప్పిన తగాదానుగూర్చి మనప్రెసిడెంటు నబాబుకు వ్రాసినఉత్తరము (నకలు) ఇందుతో పెట్టిపంపుచున్నాము. ఈ ఉత్తరంవల్ల నీవుచెప్పిన చిక్కులన్నీ తీరునని తలచెదము. మనకువచ్చే నష్టానికి తగిన పరిహారమును నబాబునుండి పుచ్చుకునే శక్తి మన దగ్గరవున్నది. కాబట్టి, తొందరపడి, యెట్టిపరిస్థితులలోగాని, మాదగ్గరనుండి ఖండితమగు ఉత్తరువులులేనిదే, నీవుమాత్రము దౌర్జన్యముచేయవద్దు. నీవుచెప్పిన కష్టాలు తొలగించవలసినదని నీవు నబాబుతో ఫిర్యాదు చేసుకొన్నట్లు నీవుత్తరములో నీవుచెప్పియుండలేదు. నీవీప్రకారము తప్పకుండ చేసియుండవలసినది. అందు ముఖ్యముగ, అక్కడనున్న నబాబు తాలూకు ప్రధానోద్యోగి వీనినాపుటకు నాకధికారములేదని చెప్పినప్పుడైనను నీవు నబాబుతో సరాసరిపోయి ఫిర్యాదు చేసుకొనవలసియుండెను. నేను దౌర్జన్యము చేస్తానని బయలుదేరడమునకు ముందు యీప్రకారము నబాబుతో చెప్పిచూడడం అవసరమను సంగతి నీకు తోచియుండవలసినది."

లుకుపురము, డక్కా గిడ్డంగుల యజమానులనుండి కూడ ఇట్టి ఫిర్యాదులే కలకత్తా అధికారులకువచ్చెను. నబాబు తాలూకు ఉద్యోగస్తులు ఇంగ్లీషుబోట్లను అటకాయించి, వానినుండి సుంకములు వసూలుచేయుచున్నట్లును, ఇందువల్ల కంపెనీ వర్తకము సాపుగ నిలిచిపోవుననియు వారు మొఱపెట్టుకొనుచు కలకత్తాకు వ్రాసుకొనిరి. (Third Report 1773. Pp. 335—336.)

## కంపెనీ వర్తకములో దౌర్జన్యం - ప్రజాపీడ

ఇంగ్లీషువర్తకుల ఉత్తరువులచే నబాబు తాలూకు ఉద్యోగులు, నౌకర్లు, ఇతరజనము అనేకరీతులుగ హింసింపబడిరి. ఇందునుగూర్చి నబాబు తాలూకు ఉద్యోగస్థుడొకడు నబాబుకు మొఱ్ఱపెట్టుకొనుచు బ్యాకర్‌గంజినుండి 1762 స॥

మే నెల 25-వ తేదీన వ్రాసుకొనెను. ఈ ఉత్తరము వాన్‌సిటార్టు ("Narrative") గ్రంథములో రెండవసంపుటము 112 పేజీలో ప్రచురింపబడియున్నది.

"ఎవరైనా యూరోపియనులుగాని, వారినౌకర్లుగాని, యెట్టి అల్లరిచేసినను వారిని పట్టుకొని తక్షణమే కలకత్తాకు పంపివేయవలసినదని కంపెనీ అధికారుల దగ్గరనుండి నేను ఉత్తరువుల పుచ్చుకొని ఇక్కడికి వచ్చితిని...............ఈ ఉత్తరువులు యింత కఠినముగ నున్నప్పటికి, నేను వానిని కఠినముగ అమలుజరుపక శాంతిమార్గముగనే, ఇక్కడివారికి నెమ్మదిగ చెప్పి, వారిచేత యీ అక్రమములు మాన్పింపజూచితిని. కాని, నేనెన్నిసార్లు యెన్ని తంటాలు పడినను ఫలితములేక పోయెను.........ఈ పట్టణము ఇదివరలో గొప్పవర్తకస్థానముగనుండెను. కాని, ఇప్పుడిది ఎందుకు పనికిరాకుండ నాశనమైపోయినది. దీనికి యీదిగువ అక్రమములే కారణములు.

"ఊళ్లల్లో సరుకులు కొనడానికి, అమ్మడానికి ఒక తెల్లదొర తన గుమాస్తాను పంపును. వెంటనే వాడికి (ఆగుమాస్తాకు) ఎక్కడలేని తలకొవ్వు బయలుదేరుతుంది. పల్లెలలో జనంచేత తనయిష్టమైన సరుకులు బలాత్కారంగా కొనిపించడానికిగాని, అమ్మించడానికిగాని తనకు సర్వాధికార మేర్పడ్డట్టుగ వాడు అనుకుంటాడు. తన మాటప్రకారం జనం ఒప్పుకొనకపోతే వాళ్లను కొరడాలతో బాది వెంటనే జైలులో త్రోయడానికికూడా వానికి అధికారం ఉండట! అశక్తతచేతనైనాసరే ఎవరైనా ఒప్పుకోకపోతే, వానికి తప్పక యీగతి పట్టిందన్నమాటే!

"ఇదేకాదు ఇంకొకవిశేషంకూడా ఉంది. యూరోపియనులు వ్యాపారంచేసే యేసరుకులతోగాని ఇతరులింకెవరూ వ్యాపారం చేయరాదని నిర్బంధం యేర్పర చారు!.........ఒకవేళ యూరోపియనులు ఏసరకులైనా ప్రజలనుండి కొనడ మంటూవుంటే వాళ్లకు డబ్బుయిచ్చే మామూలులేదు. దయదలచి ఏమైనాయిస్తే, దాక్షిణ్యంగా బజారుధరకంటె చాలాతక్కువగ వాళ్లమొగాన పారవేస్తారు! "ఇదేమి"? అని నేనులంటే, యూరోపియనులంతా నామీద దండెత్తుతారు!

ఈదేశాంతర్భాగపు వర్తకములో జరిగిన ఘోరములగూర్చి, 'బర్కు' అను పార్లమెంటు మెంబరు వారన్ హేస్టింగ్సు కేసు విచారణ సందర్భమున యీ రీతిగ పార్లమెంటు సభలో వెల్లడించియుండెను.

"వర్తకమువల్ల ప్రపంచములో యేదేశమైనను బాగుపడునుకాని, బెంగాలు మాత్రము నాశనమగుచుండెను. పూర్వము కంపెనీకి రాజ్యాధికారము లేని రోజులలో, వారు సుంకములు లేకుండ వర్తకము చేసుకొను హక్కు ఉండెడిది. వారి సరుకులు యెక్కడగాని, యెట్టిసుంకములుగాని చెల్లింపకుండగనే ధారాళముగ రవానా యగుచుండెను. క్రమముగ కంపెనీ నౌకర్లుకుండ యీదస్తకలను (చీట్లను) తమ

ప్రయివేటు వ్యాపారములకొరకు ఉపయోగింపసాగించిరి. ఇది ఆట్టే పెచ్చుపెరగ నంతకాలము దేశీయ ప్రభుత్వము దీనినిచూసీ చూడనట్లు ఊరకుండెను. కాని, యిది హద్దుమీరి అడ్డమైనవాళ్ల చేతులలోకి పోయేటప్పటికల్లా వర్తకమల్లా దోపిడీ క్రిందికి దిగింది. ఎక్కడచూచినా యీ (దొంగ) వర్తకులే తమ సరకులను తాము చెప్పిన ధరలకు అమ్ముకునేవాళ్లు. ఇతరులనుండి కొనుక్కునేటప్పుడుకూడ తామిచ్చేదమన్న ధరలకే కాజేసెడివారు. ఇదంతా వర్తకం మిషతో ఊళ్లను దోచుకోడానికి బయలు దేరిన బందిబోట్లుగావున్నదిగాని, ఇంకోవిధంగాలేదు. తెమ్మని బాధనుండి తప్పించవల సినదని ప్రజలు పాపము దేశీయప్రభువులకు ఫిర్యాదుచేసుకొనిరి. కాని, ప్రయోజనము లేకపోయెను. ఈ ఇంగ్లీషువర్తకులదండ్లు బయలుదేరి పూర్వకాలము తార్తారుల దండ్లకంటె యెక్కువఘోరముగ ఊళ్లమీదబడి దోచుకొనసాగెను. వీరుచేసిన వర్త కమును, వర్తకమిషతో చేసిన దోపిళ్లను, ముందురానున్న మనప్రభుత్వముయొక్క చవిని ముందుగ కొంచెము చూపించెను. అదిగాక, సమస్తమును ఇప్పుడేదోచుకొని ముందురానున్న క్రూరప్రభువునకేమియు మిగల్చకుండ ఇప్పుడే సర్వనాశనము చేయ బోవుచున్నారో యన్నట్లుండెను. పాపము, దురదృష్టవంతమగు యీదేశమిట్లు రెండుందాలకూడ ఇటువర్తకముపేర, అటురాజ్యముపేర ఘోరబాధలకు గురియ య్యెను. దురాకాంక్షలకు గురియయ్యెను.''

క్రైస్తవులమని పేరుపెట్టుకొన్న యీ కంపెనీ నౌకర్లు దేశములో చెలరేగి చేసిన ప్రయివేటు వర్తకములోని ఘోరదురంతకృత్యము లిట్లున్నవి. పైనపేర్కొన్న అక్టోబరు 7-వ తేదీగల ఎల్లిస్ ఉత్తరము నబాబుకు పంపబడెను. దీనికి నబాబు— నవంబరు 1-వ తేదీన జబాబిచ్చెను. ఆజబాబు కంపెనీ గవర్నరుకు నవంబరు 8-వ తేదీన చేరినది- అందిట్లున్నది :—

''అయ్యా, సందుదొరికినప్పుడల్లా యీ పెద్దమనిషి (ఎల్లిస్) ఏదో ఫిర్యాదు చేయకమానడు. నాఉద్యోగస్తులలో యితనికేమియు తప్పుదొరకనందున, చాకలి వాళ్లుచెప్పిన అధిక ప్రసంగములను పెద్దగచేసి మీకతడు వ్రాసినాడు. చాకలివాళ్లు చెల్లించవలసిన రుసుములేమియు లేవను సంగతి మీకును తెలుసును. కాబట్టి, వీరి జోలికిపోయి, మీరిక్కడ బట్టలు ఉతుకుకోవద్దనిగాని, మీకంపెనీ తాలూకు బట్టలు నానపవద్దనిగాని, ఆటంకపరుచుటకు మాఅమీళ్లకేమియుపనిలేదు. ఇది జరిగినమాట వాస్తవమే అయివుంటే, అతడీసంగతిని మా ప్రధానస్థానికోద్యోగి రాజానౌబత్ రాయికి చెప్పకునియేయుండును. ఆతడును వెంటనే మా అమీళ్లకు వ్రాసెడివాడు. కాని, యిదంతా వట్టి అబద్ధమగుటచే, యిందునుగూర్చి మీకు యేదోవట్టి బూట కపుఫిర్యాదుచేసినాడు. కావాలంటే, దీనినిగురించి మీరే విచారించుకొనవచ్చును. అయినప్పటికి, యిందు విషయమై అమీళ్లకు గట్టిగ వ్రాసి, కంపెనీ వ్యాపారమున కెట్టి ఆటంకముగాని కలుగకుండ తగిన బందోబస్తు చేయవలసినదని నేను నౌబత్

రాయికి హుకుముల బంపియుంటిని. మరియు కంపెనీ గిడ్డంగి తాలూకు గుమాస్తాలు కోరినప్పుడు వారికి తగురీతిగ సహాయము చేయవలసినదని కూడ నేను వ్రాసి నాను ''

ఎల్లిస్‌ను గూర్చి నబాబు వ్రాసిన సంగతి చాలతీవ్రమైనది. ఇట్టివానిని కంపెనీవారు తక్షణమే పాట్నా గిడ్డంగి యధికారమునుండి తీసివేయవలసినది. కాని, వారట్లు చేయలేదు. ఎల్లిస్‌ను అక్కడనేయుంచిరి. బహుశః యితనినక్కడ నేయుంచి, నబాబుతో యేదోగిల్లికజ్జాపుట్టించుకొని, యీమిషతో అతనిని సింహాసనమునుండి త్రోసివేసి, తిరిగి యింకొకని నెక్కించి, అందువల్ల మరలమరల మరింత డబ్బును గుంజుకొందుమను తలంపు కంపెనీ యధికారుల కడుపులలోఉండెను కాబోలును. ఈ ఉద్దేశ్యముతోనే బహుశః ఎల్లిస్‌ను తీసివేయక అక్కడనే ఉంచినట్లు ఊహింపవలసివచ్చుచున్నది.

## మాంఘీర్ ఒడంబడిక

ఇంగ్లీషువారితో స్నేహముగ నుందమనియే మీర్కాసీము యింతవరకు తలంచుచుండెను. కాని, ఇంగ్లీషువారే కయ్యమునకు కాలుద్రవ్వసాగించిరి. అయినప్పటికి, నబాబువల్ల బాగా డబ్బుతిన్న వాన్‌సిటార్టు, హేస్టింగులు, మాత్రము తమచేతికి మిక్కిలి అనువుగనున్న యీ మీర్కాసీముతో పేచీపెట్టుకొనుటకు యిష్టపడరైరి. అప్పుడు కలకత్తా కౌన్సిలులో నలుగురు మెంబర్లేయుండిరి. కాబట్టి, తమ్మునిద్దరిని నబాబు వద్దకు రాయబారము పంపించి, యీవ్యవహారములనన్నిటిని, మాట్లాడుకొనివచ్చునట్లుగ కౌన్సిలువారిచే తీర్మానము చేయించుకొనిరి. ఈ ప్రకారముగ వీరిరువురు నబాబు మకాము చేసియున్న మాంఘీరు పట్టణమునకు పయనమై అక్కడికి 1762 సం॥ నవంబరు 30_వ తేదీన చేరిరి. మీర్కాసీముతో సంధి కుదుర్చుకొనివచ్చుటకు కౌన్సిలువారు తనకు సర్వసంపూర్ణ అధికారముల నిచ్చినట్లు వాన్‌సిటార్టు అభిప్రాయపడెను. ఈ యభిప్రాయముతోనే అతడు నబాబుతో మాట్లాడసాగెను. తగాదాలనన్నిటిని పరిష్కారముచేసుకొని, కంపెనీతోసుముఖముగనుండు ఉద్దేశముతోనే మీర్కాసీము ఉన్నట్లు వాన్‌సిటార్టు తానక్కడికి వచ్చినమరునాడే కలకత్తాలోని యితర మెంబర్లకు ఉత్తరము వ్రాసెను.

పదిహేనురోజుల అనంతరము ఒక ఒడంబడిక వ్రాయబడెను. దీనికే ''మాంఘీరు ఒడంబడిక'' యనిపేరు. దీనిపై నబాబు సంతకము చేసెను. కంపెనీ తరపున వాన్‌సిటార్టు, వారన్ హేస్టింగ్సులు సంతకములు చేసిరి. ఈ ఒడంబడికలో తొమ్మిది, షరతులుండెను. వీనినిబట్టిచూడగ నబాబు ఇంగ్లీషువారియెడ న్యాయముగనే ప్రవర్తింప దలచినట్లు యెవరికిగాని స్పష్టముకాగలదు. ఈ ఒడం

214B



మాంఘీర్ కోట

(ఇంగ్లీషువారి పోరుపడలేక, మీర్కాసీము వారికి దూరముగ కట్టించుకున్న కోట.)



మీర్కాసీము

మేనమామ మీర్జాఫర్‌ను త్రోయించివేసి, ఇంగ్లీషువారి
సహాయంవల్ల మొదట బెంగాల్ నబాబుగిరి
సంపాదించుకొని తరువాత వర్తకం విషయములో
వారితో పేచీపడి యుద్ధంచేసి ఓడి,
పారిపోయి, పోడగానని బెంగాల్ నబాబు.

బడిక నకలును బొందుపరుచుచు వాన్‌సిటార్టు, హేస్టింగ్సులు, డిశంబరు 15-వ తేదీన కలకత్తా కౌన్సిలు వారికొక జాబు వ్రాసిరి :—

“ఇటీవల తగాదాలకు కారణమైన వర్తక విషయమును గూర్చి మేము నవాబుతో అనేకసార్లు సంప్రదించినాము. దేశాంతర్భాగములో జరుగు ప్రయివేటు వర్తకమే యీ తగాదాలకన్నిటికిని కారణమైనది. మనగుమాస్తాలు చేసే దుర్మార్గములనుగూర్చి, విచ్చలవిడి ప్రవర్తననుగూర్చి, నవాబు చాలదూరము చెప్పెను..............ఈ లోతట్టు ప్రాంతములలో జరిగే వ్యాపారమంతయు అక్కడ ఉత్పత్తియై, అక్కడ అమ్మకమగు వస్తువులలోనే అనాదినుండి జరుగు చున్నదనియు, యీవ్యాపారములో యూరోపియను లెవరు ప్రవేశించరాదని పూర్వపు నవాబులు నిషేధించిరనియు, మనకంపెనీ కిచ్చిన ఫర్మానా యీ వ్యాపారమునకు వర్తించదనియు నవాబు వాదించెను.

“ఈ యభిప్రాయముతో మేము యేకీభవించుచున్నాము. కంపెనీకిచ్చిన ఫర్మానాయొక్క నిజమైన అర్థము, నిజమైన ఉద్దేశము యేమనగా:—ఓడలద్వారా దిగుమతి ఎగుమతులు చేసుకొను సరుకులకు సంబంధించి నంతవరకు మాత్రమే కంపెనీయు, దాని నౌకర్లును సుంకములు లేకుండ వర్తకము చేసుకొనవచ్చును. ఇట్టి వ్యాపారమువల్ల మన (సీమ) దేశమునకు, యిండియాకునుకూడ పరస్పరములాభము కలుగుచున్నది. ఇక, దేశముయొక్క అంతర్భాగములో ఉత్పత్తియై అక్కడనే ఒక చోటినుండి ఒకచోటికి రవానాకాబడు ఉప్పు, వక్కలు, పొగాకు వగైరా సరుకుల విషయములో దేశము మొత్తముమీద అదనముగ వచ్చే లాభమేమియు లేదు. అక్కడికి యిక్కడికి రవానాచేసుకొనుచున్న ఆ ప్రత్యేకవ్యక్తులకు లాభమువస్తే రావచ్చును గాక. మన కివ్వబడిన ఫర్మానా చూచినట్లయితే, యిట్టి సరుకుల కది వర్తించదని మా యభిప్రాయము. ఒకవేళ మన మీ సరకులలో వర్తకము చేయ దలచుకుంటే, యితర దేశీయ వర్తకులు చెల్లించినట్లుగనే మనముకూడ సుంకములు చెల్లించుకొని వర్తకము చేసుకొనవచ్చుగాక. అంతేనేగాని, యీ సరకులవిషయ ములో దేశీయవర్తకులకు లేని సౌకర్యమును యీ ఫర్మానా మనకిచ్చుటలేదు. ఈ సరుకుల విషయములలోకూడ మనము సుంకములు చెల్లింపకయే వర్తకము చేసు కొనుట కధికారము కలదని మనము వాదించేయెడల, యిక మనముతప్ప యింకెవరు గాని, యీ వస్తువులలో వ్యాపారము చేయుటకు వీలులేదని అర్థమేర్పడుచున్నది. ఫలితమంతే యగుచున్నది. ఈ సరకులకు మనము సుంకములు చెల్లింప నక్కరలే దనియు, దేశీయవర్తకులుమాత్రము చెల్లింపవలయునని యంటే, ఫలితమేమి తేలును? ఈ సరకులలో వ్యాపారం చేయడానికి మనకే మిరాశీయున్నదన్నమాట? ఇంకెవ రికి హక్కు లేదన్నమాట? మన కిచ్చిన ఫర్మానాయొక్క అర్థమిది యెన్నటికిని కాజాలదు.

"దేశీయవర్తకులకున్న హక్కులకంటె భిన్నమైన హక్కులతో అంతకంటె ఎక్కువైన సౌకర్యములతో దేశాంతర్భాగములలో మనము వ్యాపారము చేసుకొనవలెనని కోరుట చాల బేసబబుమాట. కంపెనీ దస్తకునుచూపి, సుంకములు చెల్లించకుండ, మన మీ వ్యాపారమును సాగింపయత్నించుటవల్ల లోకమంతటి యీర్ష్యకు ద్వేషమునకు గురియగుదుము. ఆఖరుకు కంపెనీ వ్యవహారములు పాడగుటయేకాక, మన సొంతవ్యవహారములకుకూడ మోసమువచ్చును. ఇందు విషయమై మేము నబాబుతో మాట్లాడినప్పుడు అతడు చెప్పిన సంగతులేమనగ:—అన్నిచోట్ల అన్ని వస్తువులలోను, సుంకములు లేకుండ యింగ్లీషు గుమాస్తాలను వారిప్పుడు కోరుచున్నట్లు వర్తకం చేసుకొనిస్తే, దేశములోని యావత్తు వర్తకం వారిచేతులలోనికే వచ్చి చేరుతుంది. అప్పుడునాకు వచ్చేరివిన్యూ యేమివుంటుంది? అట్టి సందర్భములో యావత్తు వర్తకమును పూరాగా, యెట్టి సరకులపైగాని, యెక్కడగాని, యెవరివల్లగాని పుచ్చుకొనకుండ బాహాటముగ వదిలివేస్తేనే బాగుంటుంది. ఇట్లా చేసినట్లయితే, యితర ప్రాంతములనుండి అనేకమంది వర్తకులు నా దేశంలోకి వస్తారు. క్రయవిక్రయముల కనువగు అనేకవస్తువులను రైతులు పండించుటకును, కర్మకారులు చేయుటకును, నాప్రజలకెంతో ప్రోత్సాహం కలుగుతుంది. అందువల్ల నా రివిన్యూ హెచ్చుతుంది. ఇదిగాక, ఇందువల్ల నా కింకొక లాభంకూడ వున్నది. ఏమనగ నాకును మీకంపెనీవారికిని గలిగిన కలహకారణముకూడ దీనివల్లమాసిపోతుంది" ఇవి నబాబుమాటలు. కాని, అందరిమీద సుంకములు తీసివేస్తానని నవాబు చేసిన యీకడపటిసూచనను మేము అంగీకరించలేదు. ఈపని మాత్రము చేయవద్దుసుమా, యని మేమతనికి గట్టిగ చెప్పితిమి. ఏలననగ, అందరిమీద అతడు సుంకములు తీసివేసేటట్టయితే, యిక మనదస్తకుల ప్రయోజనమేమి వుంటుంది? ఇందువల్ల మన కంపెనీయజమానుల వ్యాపారమునకే దెబ్బ తగులుతుంది. కాబట్టి, ముఖ్యముగ, యీకారణముచేతనైనను, మనమిప్పుడు నబాబుచెప్పినమాటకు ఒప్పుకొని, (దేశాంతర్భాగమందు మనవారు చేసుకొను ప్రయివేటు వర్తకమునకు సుంకములిచ్చుట మంచిది) మన గుమాస్తాల ప్రయివేటులాభముల నిమిత్తము అసలుకంపెనీ లాభములకే నష్టము గలిగించుట చాల అపాయకరము."

కాని, యీమంచిమాటలన్నియు తక్కిన కంపెనీ యుద్యోగులకెవరికిని రుచించలేదు. దేశములోని యావత్తు వ్యాపారమును తమచేతులలోనికే గుంజుకొని, దేశీయ వర్తకులనందరిని నాశనముచేయవలెనని యీ కిరస్తానీ కోమట్లు పంతము పట్టియుండిరి. ఉప్పు, పొగాకు, వక్కలు మున్నగు వస్తువులలో ఇంగ్లీషు కోమట్లు వర్తకం చేసుకోదలచుకుంటే, వారు వాటిధరలలో నూటికి 9 చొప్పున తనకు సుంకము చెల్లించితే చాలునని నబాబు ఒప్పుకొనెను. ఈ రేటు దేశీయ వర్తకులు చెల్లించు రేటుకంటె చాలతక్కువయనుమాటను యెవరుగాని మరువరాదు.

" దేశీయవర్తకులు ఇంతకంటె చాలయెక్కువయే చెల్లించుచున్నార "ని క్లైవే 1772 సం॥ మార్చి 30-వ తేదీ ఉపన్యాసములో స్పష్టముగ చెప్పియుండెను.

అయినప్పటికి, ఇంగ్లీషుకోమట్లు తృప్తిపడలేదు. వాన్‌సిటార్టు, హేస్టింగ్సులు నబాబుతో కుదుర్చుకొనివచ్చిన 'మాంఘీర్' ఒడంబడికతో వీరు తృప్తిపడలేదు. అందలి సౌకర్యములు తమకు యింకను చాలవనిరి. ఇందుకు విరుద్ధముగవారు పెద్ద గందరగోళముచేసి, యథాప్రకారముగనే, సుంకముల నెగబెట్టి, జబరదస్తీగా వర్తకము చేసుకొనసాగిరి. అందుచే, దేశములోని వ్యాపారమంతయు మహాగందర గోళములోపడెను. నబాబుకు దమ్మిడీముట్టలేదు. దేశములో యెక్కడచూచినను, రోజురోజు, దౌర్జన్యములు హెచ్చుకాజొచ్చెను. చిట్టచివరకు నబాబుకు విసుగెత్తి, వెనుక వాన్ సిటార్టు, హేస్టింగ్సులతో సూచించిన ప్రకారము, దేశములో సుంకముల నసలే తీసిపారవేసి, వర్తకమునంతను బాహాటముగ వదలివేసెను. ఇట్టిపని చేయుటకు నబాబుకు సర్వసంపూర్ణాధికారము గలదుగద. అయినప్పటికి, దురాశాపాతకులగు ఇంగ్లీషుకోమట్లకు యిది యెంతమాత్రము గిట్టలేదు. ఇది నబాబు తమ యెడగావించిన గొప్పనేరముగ వారుభావించిరి. ఇందు నబాబు దోషమేమియు లేదు. ఏలననగ న్యాయమార్గమున ఇంగ్లీషువారితో సమాధానపడుటకు నబాబు యెంతయో తంటాలుపడెను. కాని, లాభములేకపోయెను. ఇంగ్లీషు వర్తకులే సరియైన దోవకు రాకపోయిరి.

1763 సం॥ ఫిబ్రవరి 22-వ తేదీన నబాబు వాన్‌సిటార్టుకు యిట్లని వ్రాసెను :—

" దేశాంతర్భాగములో జరుగు వ్యాపారములో అనగ, ఉప్పు, పొగాకు, వక్కలు, ఎండుచేపలు, మున్నగు వస్తువులపై మీరు నూటికి 9 చొప్పున సుంకము చెల్లించునట్లు మనమొడబడితిమనియు, కాని, నాయుద్యోగులు దీనిని పాటించక వారి వర్తకమును యావత్తు నిలిపివేయ జూచుచున్నారనియు, అదిగాక, యిదివరకు కంపెనీ చీటీచూపితే ఊరికే పోనిచ్చే బట్టలు వగైరా సరుకులను కూడ నాయుద్యోగులిప్పుడు అటకాయించు చున్నారనియు, మీరు నాకు వ్రాసినారు. ................".

" అసలు తగాదాయిది. నా ఆఫీసులో రిజిష్టరయివున్న వర్తకులు యావన్మంది సుంకములు చెల్లించుచున్నారు. మీరు యీ వర్తకులద్వారా సరుకులు కొనుక్కొనుచున్నారు. కాబట్టి, యీసరుకులు నిజముగ మీవో, మా వర్తకులవో తెలిసికొనుటకు నా అధికారులకు వీలులేకుండవున్నది. ఈ అవస్థఅంతా యెందుకు? అల్లా దయవల్ల మీ గుమాస్తాలు యెక్కడబడితే అక్కడే వున్నారు గద; మీ

గిడ్డంగులు యెక్కడబడితే అక్కడే వున్నవిగద! మీ గుమాస్తాలద్వారానే—మీ గిడ్డంగులుద్వారానే—మీ రేవు సరుకులను నేరుగ కొనుక్కోరాదూ? ఇందులో మావర్తకులకు నిజముగ భాగము లేకపోతే వారివల్ల యెట్టి గోలగాని, అల్లరిగాని, కలుగనే కలుగదుకద?

"ఇదివరకే వర్తకులు తాము అమ్ముకొను సరుకులపైనను, కొనుక్కొను సరకులపైనను సుంకములు చెల్లించుచుండేవారు. అట్టివారిద్వారా మీ రిప్పుడు సరుకులు కొంటున్నారు. అందుచే, యీ మిషపెట్టి వా రిప్పుడే సుంకముల నివ్వకుండ తప్పించుకొన జూచుచున్నారు. అసలుతగాదాకు కారణమిది. కాబట్టి, దయ చేసి, యికమీద మీరిట్టి వర్తకులతో వ్యాపారముచేయడం మానివేసే సెయ్యండి. అట్లయినచో, యిక మీవారికి మావారికి యేమియు తగాదాలురావు."

కాని, యీపద్ధతి ఇంగ్లీషువారికి నచ్చలేదు. వాన్‌సిటార్టు నబాబుతో చేసుకొనినచ్చిన ఒడంబడికను తక్కినవారు ఒప్పుకొనలేదు. ఈ ఒడంబడికను రద్దుపరచి మీర్కాసీమునుండి యింకను యెక్కువ సౌకర్యములు గుంజుకొనుట యెట్లాయను ఆలోచన చేయుటకై చుట్టుపట్టుల గిడ్డంగులలో పనిచేయుచున్న కౌన్సిలు మెంబర్లను (పాట్నా, చిటగాంగు గిడ్డంగులవారిని తప్ప) యావన్మందిని కలకత్తాకు పిలిపించిరి. వీరందరు కలకత్తాలో మకాముచేసి ఫిబ్రవరి మొదలు ఏప్రిల్‌నెల వరకు (1763) ఆలోచనలపై ఆలోచనలు చేసిరి. వారే ఫిర్యాదీలు, వారే తీర్పుకర్తలు. నబాబు నేరస్తుడు. వీరుచేసిన తీర్పేమో 1763 సంll మార్చి 1-వ తేదీన "వాట్సు" అనునతడు ప్రకటించిన అభిప్రాయమువల్ల తేటపడగలదు. ఆ యభిప్రాయమిది:—

మాంఘీర్ ఒడంబడికను భంగము.

(1) "కంపెనీ కివ్వబడిన ఫర్మానావల్లను, "హస్‌బుల్" హుకుములవల్లను విదేశ వ్యాపారములోగాని, దేశాంతర్భాగములో జరుగు వ్యాపారములోగాని, హిందూస్థాన సామ్రాజ్యములో ఉత్పత్తియగు యేసరుకులలోగాని స్వేచ్ఛగ వ్యాపారము చేసికొనుటకు ఇంగ్లీషు యీస్టిండియా కంపెనీవారికి హక్కుగలదు. ఏ వస్తువులకుగాని దస్తకులను (చీట్లను) యివ్వవచ్చును. ఈ సంగతిని మీర్జాఫర్ తాను వెనుక మనతో చేసుకొన్నసంధిలో - తన బంగాళారాష్ట్రమునకు సంబంధించినంత వరకు - ధ్రువపరచెను.

(2) ఉప్పు, వక్కలు, పొగాకులకుగాని మరియే యితరవస్తువులకుగాని, దస్తకు చూపినప్పుడు నబాబు ప్రభుత్వము సుంకము పుచ్చుకోరాదు.

(3) ఇట్టి సరకులకుకూడ యింతటినుండి దస్తకులు యిచ్చుచుండవలెను.

(4) కంపెనీ నౌకర్లకుగాని, యితరులకుగాని సర్టిఫికెట్టులు యివ్వరాదు. ఉప్పుకు - అదిపూర్తిగ కంపెనీ నౌకరుతాలూకుది అయినట్టయితే - దానికి దస్తకు యివ్వవలెను. ఇతర ఇంగ్లీషుమనిషిది అయితే యివ్వకూడదు.

(5) మన ప్రెసిడెంటు నబాబుకువ్రాసిన ఉత్తరములలో యీ హక్కును - ఫర్మానావల్ల మనకు పుట్టబడినహక్కును - వదలుకొన్నాడు. అనగ అతడు 17-వ జనేవరినాడు చెప్పిన అభిప్రాయములోనే యున్నాడన్నమాట.

(6) మన ఇంగ్లీషుగుమాస్తాలను దేశీయప్రభుత్వపు అధికారము క్రిందికి అప్పగించుట మనవ్యాపారమునకు చాలనష్టము.

మన ఇంగ్లీషు గిడ్డంగులున్న ప్రాంతములలో యిట్టి నిర్బంధము కేవలము అనవసరము. మన గిడ్డంగులులేని దూరప్రదేశములలో మన గుమాస్తాలు ప్రజలను పీడించకుండ ఉండుటకును, దేశీయ ప్రభుత్వాధికారులుకూడ యిటీవల జేసినట్లు మనవారిని హింసించకుండ ఉండుటకును యేదో ఒకవిధమైన యేర్పాటు అవసరమే. ఈ విషయము మనమును నబాబును కలిసి ఆలోచించుకుంటేనేగాని తేలదు.''

ఇతరమెంబర్ల అభిప్రాయములుకూడ యిల్లే యుండెను. వారన్ హేస్టింగ్సు తప్ప మిగతా కౌన్సిలుమెంబర్లందరు వాన్‌సిటార్టును చివాట్లు పెట్టిరి. ఎందుకు? నబాబుయెడ న్యాయముగ వున్నందుకు. * నబాబుపక్షముగ వాన్‌సిటార్టు యెంతో దూరము చెప్పెను. కాని, ప్రయోజనము లేకపోయెను. నబాబునల్ల డబ్బుతిని

---

* ఈ వ్యవహారములో వాన్‌సిటార్టుచేసిన పనినిగూర్చి తక్కిన మెంబర్ల యభిప్రాయము లెట్లుండెనో కార్నక్ సేనాని 1763 సం॥ ఫిబ్రవరి 26-వ తేదీన క్లైవుకు వ్రాసిన ఉత్తరములోని యీ దిగువభాగములవల్ల తేటపడగలదు :—

వాన్‌సిటార్టుపోయి నబాబుతో మాట్లాడివచ్చినందువల్ల మనచిక్కులు మరింత హెచ్చినవే గాని, తీరలేదు. అవి చాలదూరము భరింపజాలనంత దూరము పోయినవి కూడాను. ఇతడును, వారన్ హేస్టింగ్సును యేకమై, బోర్డులో యితర మెంబర్లెవరికి చెప్పకుండ, దేశాంతర్భాగములో జరుగు వ్యాపారములో ఒకటికూడ వదలిపెట్టకుండ-అన్నిసరకులపై నూటికి 9 చొ॥ సుంకమిచ్చునట్లు నబాబు దగ్గర ఒప్పుకొని వచ్చినారు! ఇందు కనుగుణముగ కొన్ని రూల్సును తయారుచేసి, వానికి ఒప్పుకొని వచ్చినారు. మన కొలువులోవున్న గుమాస్తాలు మున్నుగువారివల్ల వచ్చు లగాదాలన్నీ నబాబు పరిష్కారము చేసేటట్టుకూడ ఒప్పుకొని వచ్చినారు. ఇవన్నీ మనకెంతో లజ్జాకరముగను, యిబ్బందికరముగను, నున్నవనుమాట స్పష్టమేగద. ఏదో లంచము మేసినవాళ్లుతప్ప, యితరు లెవరుగాని యిట్టి సిగ్గుమాలిన షరతులకు వప్పుకుంటారా? ఈ నేరంలో వాన్‌సిటార్టుకు ఏడులక్షల రూపాయల లాటు వచ్చి పడ్డట్టు అందరు అనుకుంటున్నారు. ఇందుపై కలకత్తాలోనున్న కౌన్సిలుమెంబర్లు సమావేశమై యీ అగౌరవపు షరతులకు ఒప్పుకొనివచ్చిన వాన్‌సిటార్టును గట్టిగ చివాట్లుపెట్టినారు. మరియు దేశములో నాలుగువైపులనుండి వచ్చుచున్న ఫిర్యాదుల విచారించి, యిందుకుతగిన బందోబస్తు యెట్లుచేయుటకు వీలుండునో ఆలోచించుటకుగాను కలకత్తాలోలేని యితర మెంబర్లనుకూడ కౌన్సిలువారు పిలిపించినారు. వారంద రిప్పుడిక్కడ కొంతకాలమునుండి మకాముచేసి తగిన ఆలోచనలు చేయుచున్నారు. వాన్‌సిటార్టు ఒప్పుకొనివచ్చిన షరతులప్రకారము ఎవరుగాని ఆచరించవలసిన

యీతడీమాటలు చెప్పుచున్నాడని వా రభిప్రాయపడిరి. కౌన్సిలులో అధికసంఖ్యాకులు అతనికి వ్యతిరేకముగ నుండిరి. వారన్ హేస్టింగ్సుమాత్రము యితనిపక్షమున నుండెను.

నబాబు బలప్రయోగముచే కార్యము సాధింపబూన తలపలేదు. కాని ఇంగ్లీషువా రతనిని పొడిచి రేపుచుండిరి. కార్నక్, క్లైవుకు వ్రాసిన ఉత్తరమును బట్టి ఇంగ్లీషువారు మీర్కాసీముతో కజ్జా పెట్టుకొనవలెనని కూర్చున్నట్లు స్పష్టమగుచున్నది. ఇంగ్లీషువారితో గలిగిన చిక్కులనన్నిటిని సవ్యముగ పరిష్కరించుకొనుటకు నబాబు శక్తివంచనలేక పాటుబడెను. 1763 సం॥ ఫిబ్రవరి 26-వ తేదీన ఆతడిట్లు గవర్నర్‌కు వ్రాసెను:—

"నేనుకోరినవల్లా మూడు సంగతులు. వీనినిగూర్చి లోగడ మీకు వ్రాసియున్నాను. తిరిగి యిప్పుడు వ్రాయుచున్నాను. ఒకటి:—మొదటినుండి యీ రోజు

---

లేదనియు, మన వర్తకమున కికముందు యెవరుగాని యెట్టి ఆటంకములుగాని గలిగించినసరే, అట్టివానిని బలాత్కారముగ భుజబల ముపయోగించి యెదిరించవలసినదనియు, హుకుము లప్పుడే జారీచేయబడినవి." (Malcolm's Life of Clive Vol. II P. 283)

కౌన్సిలులో ప్రెసిడెంటుకు వ్యతిరేకపు పార్టీ నాయకుడు అమియతు. ఇతడు చెప్పిన మాటలనన్నిటిని కార్నకు రికార్డులలో వ్రాయుచుండెను. మీర్కాసీముతో కలహము పెట్టుకొనవలెనని కూర్చున్న పార్టీకి యితడును, ఎల్లిస్‌ను నాయకులు.

ఎలిఫిన్‌స్టన్ తన "Rise of British Power in India" గ్రంథము 382 పేజీలో యిట్లు వ్రాయుచున్నాడు:—

"కార్నక్ కౌన్సిలులో మెంబరుకాడు. మిలిటరీ వ్యవహారములు వచ్చినప్పుడు తప్ప యితడు కౌన్సిలులో కూర్చుండుటకు హక్కులేదు. కాని గవర్నర్‌కు వ్యతిరేకపు పార్టీలోచేరి యెక్కువ హడావుడిచేయువారిలో యితడొకడు. ఈ సందిగ్ధస్థితిలో యితడువచ్చి కౌన్సిలులో కూర్చుండుటవల్ల చాలపని జరిగెను.

.........గవర్నర్ ఒప్పుకొనివచ్చిన షరతులు యింగ్లీషువారితోకూడిన యీ కౌన్సిలుకు అవమానకరములనియు, తమయొక్కయు కంపెనీయొక్కయు వర్తకమునకవి నష్టదాయకములనియు, చేయబడిన తీర్మానముతో యితడు యేకీభవించెను. గవర్నర్ యిట్టివానిని జారీచేయుట తమ హక్కులను భంగపరుచుట కావున, వానిని తక్షణమే ఆపివేసి, ఆ రూల్సుప్రకారము ప్రవర్తించనక్కరలేదని అన్ని గిడ్డంగులవారికి వెంటనే తెలియపరచవలసినదనియు తీర్మానము చేయబడెను. ఈ తీర్మానముతో సైతమితడేకీభవించెను. ఇదిగాక, ఊళ్లోలేని యితర మెంబర్ల నందరినికూడ మీటింగుకు పిలిపించవలసినదని సలహాచెప్పినవా డితడే. పాట్నా చిటగాంగు గిడ్డంగులవారు మాత్రము - చాలదూరమందుండుటచే ఆహ్వానింపబడలేదు. తక్కినవారందరు వచ్చిరి. ఇందువల్ల, వాన్‌సిటార్టు ఒప్పుకొనివచ్చిన షరతులు యెవరికైతే బాధకరముగ వున్నవో, ఎవరైతే వాన్‌సిటార్టును తమ శత్రువుగ భావించుకొనుచున్నారో అట్టివారందరు యేకమై, అతని ప్రవర్తనను పరిశీలించుటకు కూర్చుండిరి."

వరకుకూడ బంగాళా నబాబులు కలకత్తా గవర్నర్‌తోనే ఉత్తర ప్రత్యుత్తరముల నడిపిరిగాని, బోర్డులోని ఇతర మెంబర్లతో ఒక్కమాటయైనను జరిపియుండలేదు.

రెండవసంగతి యేమనగ :—కంపెనీవర్తకము చిరస్థాయిగ ఉండవలెననియే సిద్ధాంతీకరింపబడినది. ఈ సందుచూచుకొని, మీఇంగ్లీషు ప్రముఖులు గుమాస్తాలు ఉప్పు, పొగాకు ఎండుచేపలు, ఏకు కలపవగైరాసరుకులలో వ్యాపారము సాగించి, యీసరుకులను ప్రజలనుండి బలాత్కారముగ, పీడించి లాగుకొనుచున్నారు. నా యుద్యోగస్తులతో అనవసరముగ, అక్రమముగ పేచీలుపెట్టి పెనగులాడుచున్నారు. ఇందువల్ల, నాబీదప్రజలు, వర్తకులు, పారిశ్రామికులు, యావన్మంది నానావిధముల పీడలకు గురియగుచున్నారు. మీకు, నాకుకూడ అనవసరమగు ఛీదరగలుగుచున్నది. ఓడలవల్ల ఎగుమతులు, దిగుమతులు చేసుకొను సరుకులతోనే మీగుమాస్తాలు వర్తకముచేసుకొనుట మొదటినుండి ఆచారమైయున్నది. అంతేనేగాని,నా రివిన్యూకు నష్టమును కలిగించే సరకులలో వారు వ్యాపారము చేయరాదు. దీనివల్లనే అనేక తగాదాలు కలుగచున్నవి. నాప్రజలంతా నాశనమైపోవుచున్నారు.

మూడవసంగతి యేమనగ :—సేనకయ్యే ఖర్చులు, పరిపాలనకయ్యే ఖర్చులు అన్నీ నేను భరించుకోవడమున్ను, మీగుమాస్తాలుమాత్రము యిదివరకున్న ఆచారమునకు భిన్నముగ వర్తకము చేసుకుంటూ, యీమిషతో నాప్రజలను, దేశమును పీడించడమును, పరిపాలనా వ్యవహారములో నా ఉద్యోగులు యే జోక్యము కలుగ జేసుకోవడానికిగాని, పల్లెత్తుమాట అనడానికిగాని నోచుకోకపోవడమున్ను, ఇదియే నా ఉండవలసిన లక్షణము? ఇదియేనా మీ అభిప్రాయము?''

ఈ ఉత్తరము 1763 సం॥ మార్చి 7-వ తేదీ బోర్డుమీటింగులో చదవబడినది. నబాబుకోరిన కోర్కెలలో ఒక్కదానికికూడ బోర్డువారు ఒప్పుకొనలేదు. "ఇదివరకున్న ఫర్మానాలు, పబ్లిక్ హుకుములు దరిమిలాజరిగిన ఒడంబడికలు, అన్నీ పరిశీలించినమీదట బోర్డువారు ఏమితీర్మానము చేసినారో ఆతీర్మానమున్ను, సదరు తీర్మానప్రకారము బోర్డువారు నడవదలచుకొన్న సంగతినిమాత్రము" నబాబుకు తెలియపరుచుటకు నిశ్చయించిరి.

"ఈ తీర్మానముల కనుకూలముగ అమియత్, "హే," అనువారిరువురును నబాబువద్దకువెళ్లి వ్యవహారము ఫైసలుచేసుకొనివచ్చుటకును, ఇందుకనుగుణముగ దరిమిలా జరుగవలసిన పనినంతను నిర్వహించుటకుగాను నబాబు దర్బారులో రెసిడెంటుగ ఉండుటకు అనుకూలమైన మనిషినికూడ వీరివెంటపంపుటకును" బోర్డువారు తీర్మానించిరి. (**First Report 1773, P. 492—493**).

ఈ తీర్మానములు తనకుచేరగానే, నబాబు 1763 సం॥ మార్చి 22-వ తేదీన యీరీతిగ జబాబువ్రాసెను :—

## సుంకముల పూర్తిరద్దు, యింగ్లీషువారి ఆగ్రహం.

“సుంకముల వ్యవహారమిట్లున్నది—ఇంగ్లీషు గుమాస్తాల పీడవల్ల ఈ సుంకములు ఒకదమ్మిడీకూడ వసూలుకావడంలేదు. ఇంతేగాదు, మీవారు నాఉద్యోగులతో కొంతమందితో షరీకై ప్రజలనుండి జుల్మానాలు కూడ వసూలుచేయుచున్నారు. మీ ఆసరాచూచుకొని, మరికొందరు వర్తకులు సుంకము లివ్వకుండ తమ సరకులను రవానాచేసుకుంటున్నారు. ఈ కారణముచే, అసలు సుంకములనే నేనుతీసి పారవేసినాను. చౌకీలనన్నిటని (గేట్లనన్నిటిని) యెత్తిపారవేసినాను. ఈ(దిక్కుమాలిన) సుంకములమూలముగ, అనవసరముగ నేను నాపేరునేల చెడకొట్టుకోవలెను* ఇకమీద నా ఉద్యోగస్తులెవరైనా యీసుంకములు పుచ్చుకుంటే వారిని గట్టిగ శిక్షిస్తాను. మీరు చెప్పే హక్కులు మీకివ్వబడిన ఫర్మానాలోను, సన్నదులలోను వున్నవని మీరుచెప్పుచున్నారు. నేనీదేశములో 20, 30 ఏండ్లనుంచివున్నాను. ఆఫర్మానాల వగైరాల సంగతి నాకును తెలుసును. మీర్జాఫరు కాలమువరకుకూడ మీగుమాస్తాలు ప్రత్యేకముగ కొన్నివస్తువులలోమాత్రమే వ్యాపారముచేయుచుండిన సంగతిని మీరుమరచిరా ? అంతదూరమెందుకు ? నేనుమీకు స్నేహితుడనై యుండినప్పటికి, వెనుకమీరు నాయిల్లుకట్టుకొనుటకు చిటగాంగునుండి 20, 30 దూలాలు తెప్పించి యిచ్చుటకైనను మీకు కలపవ్యాపారంచేయు హక్కులేనందువల్ల వీలులేకపోయెననుసంగతి మీకు జ్ఞాపకములేదా ? కాని, యిప్పుడు నాపరిపాలనలో మీ గుమాస్తాలువచ్చి యిందువిషయమై ఎంతఅల్లరిచేస్తున్నారు ? ఎంతహానికలిగించుచున్నారు ? అబ్బా, నేచెప్పలేను. వీనినిబట్టి నిజముగ బాధపెట్టువారెవరో, బాధపడువారెవరో, మీరే ఆలోచించుకోండి.”

---

* **Seir** (సీయర్) అనుగ్రంథమును యింగ్లీషులోనికి తర్జుమాచేసిన గ్రంథకారుడిట్లు వ్రాయుచున్నాడు :—

“ప్రయివేటువర్తకంలో యింగ్లీషువారుచేసే దుర్మార్గముల నాపుటకై నబాబు మిక్కిలి ధైర్యముతో గొప్పపనిచేసెను. చౌకీలను, టోలుగేట్లను, సుంకములను, యావత్తు ఒక్కసారిగ యెత్తి పారవేసినట్లు బంగాళాదేశమందంతటను ప్రకటించెను. ఎవరుపడితే వారు ఏవస్తువులతో పడితే ఆ వస్తువులతో స్వేచ్ఛగ వ్యాపారము చేసుకోవచ్చునని బాహాటముగ ప్రకటించెను. ఇంతకంటె న్యాయమైనసంగతి యింకొకటివున్నదా ?............దీనివల్ల తన ప్రజలకే యెక్కువ లాభమని నబాబుతలచెను. ఏలననగ, తనప్రజలు యింగ్లీషువారికంటె తక్కువఖర్చుతో జీవించగలరు. కాబట్టి, వీరు యింగ్లీషువారికంటె యెక్కువచౌకగ ప్రతిచోటను సరకులను అమ్మకొనగలరు. అందువల్ల, యింగ్లీషువారు వీరితో పోటీకి నిలవలేక, వర్తకములోనుంచి వెళ్లిపోదురని నబాబుతలచెను. కాని, యీ రహస్యమును ఆనాటి యింగ్లీషుకోమట్లు వెంటనే గ్రహించిరి.” (**Page 469. Vol. II Calcutta Reprint**).

తన ఇంగ్లీషు మిత్రులయెడ నబాబుకు నిజముగ ఫిర్యాదుకు కారణములేదని యెవరుగాని అనజాలరు. మార్చి 24-వ తేదీ బోర్డు మీటింగులో వాన్‌సిటార్టు హేస్టింగ్సులు తమయభిప్రాయము నిట్లనిచెప్పిరి.

"అన్ని సరకులలోను, అన్నిచోట్ల, మనయిష్టమువచ్చినట్లు స్వేచ్ఛగ యెట్టి సుంకములు చెల్లింపకుండ వ్యాపారము చేసుకొని తీరుదమని మనబోర్డువారు అధిక సంఖ్యాకుల బలముచే తీర్మానించినారు. ఈ తీర్మానము నబాబుకు పంపగానే, ఆతడును దేశములో అసలు సుంకములే తీసిపారవేసి, అందరుస్వేచ్ఛగ వ్యాపారము చేసుకోవచ్చునని బాహాటముగ ప్రకటించినాడు. ఇందుకు మనము అతనిని నిందింప జాలము. మనమేమియు యిందు విషయమై చేయుటకు వీలులేదు........"

నబాబు చేసిన ఈ పనికై వాన్‌సిటార్టు, హేస్టింగ్సులు తప్ప అందరు మండిపడిరి!

"ఇట్టిపని చేయుటకు నబాబుకు అధికారములేదు. కంపెనీ వ్యాపారమును నష్టపరచడానికిని, మొత్తముమీద దేశములో వర్తకక్షేమము నాలోచించి బోర్డు వారు చేయ సంకల్పించిన పనులను భంగపుచ్చడానికని, నబాబీపనిని చేసెను. (Wheeler's early Records of British India p. 309.)

అమియత్, హే, యను వారిరువురను నబాబుదగ్గరకు పంపుటకు తీర్మానింపబడి నట్లు పైన చెప్పియుంటిమి. కాని, నబాబు రెండు సంవత్సరములవరకు అన్ని సుంకములను అందరిమీద అసలే రద్దుపరచినాడను వార్త తెలియగనే, ఈ ఉత్తరువును నబాబు తక్షణమే రద్దుపరచి, యథారీతిగ దేశీయులనుండి సుంకములు వసూలుపరచి తీరవలెనని నబాబుతో గట్టిగ చెప్పునట్లు యీ యిరువురు దూతలకు చెప్పిపంపిరి. ఇందునుగూర్చి బోర్డు తీర్మానముకూడ చేసిరి.

ఈ యిరువురు దూతలువెళ్లి యిదివరకు కంపెనీవారు తెలిపియుండిన కోర్కెల ప్రకారము నబాబుచేత బలాత్కరించి చేయించుటతప్ప వీరింకొకపని చేయరాదని చెప్పిరి. కొత్తరాజీషరతుల మాట్లాడ వీలులేదనిరి. పై పెచ్చు, యిది వరకు కోరిన కోర్కెలుగాక, యెవరుగాని, అంగీకరింప వీలులేని కొన్ని క్రొత్తషరతులనుకూడ నబాబుపై వేసి రుద్దవలసినదని వీరికి చెప్పిపంపిరి. అమియత్, నబాబుకు గర్భశత్రువు. కాబట్టి, యితని రాయబారమును నేనంగీకరింపనని నబాబు తిరస్కరించెను. ఈ సందర్భమున నబాబు వ్రాసిన ఉత్తరములు ఆశలన్నీవదలుకొన్న మనిషివ్రాసిన ఉత్తరములవలె నున్నవి. బహుశః, యింగ్లీషువారితో యుద్ధము చేయుదమనియే ఆతడు మనస్సులో నిశ్చయించుకొన్నాడు కాబోలు. తనను సింహాసనమునుండి పడద్రోయుట కయియే కంపెనీవారిట్లు తనతో గిల్లికజ్జాపెట్టుకొన్నారని బహుశః నబాబుకు యీపాటికి తెలిసియుండును. అట్లయినచో, యిందు అతని

తప్పేమియు లేదు. ఇంగ్లీషువారికిట్టి ఊహలు కడుపులోవున్నమాట నిజమేగద. ఎల్ఫిన్‌స్టన్ యిట్లు వ్రాయుచున్నాడు:—

"ఇతడు సింహాసనమెక్కినప్పటినుంచి మనవారితనికి దురుద్దేశముల నాపాదించుచునేయుండిరి. తనసేన నభివృద్ధిపరుచుకొనుట కితడు పడుతంటాలు,—తనకు రావలసిన శిస్తుదస్తుల వసూలు చేసుకొనుటకితడు చేయుప్రయత్నములు,—వేయేల యితడు తనబల సామర్థ్యముల పెంపొందించుటకు చేయుప్రతిపనియు, ఇంగ్లీషువారి మీద దెబ్బతీయడానికే యితడు చేస్తున్నాడని కంపెనీ యుద్యోగులు తలచుచుండిరి. కాని, యితరవిషయములలో యితని ప్రవర్తన యిట్టియూహకు తావిచ్చునదిగ లేదు. ఇతర యూరోపియను జాతులతోచేరి (ఇంగ్లీషువారిపై) అతడేమియు కుట్రపన్న లేదు. మహారాష్ట్రులనురమ్మని కనుగీటలేదు. షాలం,—షుజాఉద్దౌలాలయెడ ఇంగ్లీషువారు కోరినదానికంటె తక్కువసుముఖముగనేయుండెను. ఇతడు (ఇంగ్లీషు వారితోటి స్నేహమువల్ల) తనజమీందారులకందరికి విరోధియైనాడు. ఇంగ్లీషు వారితో కలహమువచ్చిన సందిగ్ధసమయములోనే యితడతి కష్టసాధ్యమును,అపాయ కరమునునగు నేపాళదండయాత్రపెట్టుకొన్నాడు. సుంకముల ఒడంబడికను గూర్చి యితడు తొందరపడి ప్రవర్తించినప్పుడుతప్ప, తక్కిన సమయములలో యెన్నోసార్లు మనవారితనిని వేధించి, పొడిచిరేపినను, యితడు మనోనిబ్బరమును గోల్పోవక శాంతముతోనే ప్రవర్తించెను. ఇంగ్లీషువారు తమకివ్వబడిన హద్దులను మీరి ప్రవర్తింపగ వారిని తగు అదుపులోనుంచునంతవరకుమాత్రమే ఆతడు గట్టితనమును జూపెను. ఇక ఆఖరుకు తనకు ఇంగ్లండునుండికూడ సహాయము రాదనియు, వాన్‌సిటార్టు తనశత్రువులకు పూర్తిగ లొంగిపోయినాడనియు, తెలుసుకొని, అంత యునిరాశ చేసుకొన్నతరువాతగాని, అతడు ఆఖరుమెట్టుగ—ఆఖరుఆశగ—స్వరక్షణార్థమై కత్తిగట్టలేదు. రాయబారులు వెళ్లిపోయిన కొలదిరోజులుతరువాత యితడుగవర్నరుకు వ్రాసిన రెండుఉత్తరములనుబట్టి యీతనికప్పుడున్న మనోభావములు వెల్లడికాగలవు. అమియత్ రాయబారమునుగూర్చి యితడుకడుపులో అనుమానపడుచున్నట్లు యితడు ఏప్రిల్ 11-వ తేదీన వ్రాసిన మొదటి ఉత్తరమును బట్టి తెలియుచున్నది. ఏలననగ, యీ రాయిబారి వెంటవచ్చువారు ఒకటి రెండు దళములకంటె యెక్కువ వుండకూడదని అతడందులో వ్రాసెను. ఏప్రియల్ 15-వ తేదీన వ్రాసిన రెండవ ఉత్తరములో కంపెనీవారి పరస్పర విరుద్ధకార్యములగూర్చి యితడు గగ్గోలుపెట్టెను. ఎట్లనగ, ఒకమూల స్నేహమును, శాంతిని, గోరుచున్నామని చెప్పుచు, కంపెనీవారు కొండల చాటులనుండియు, అడవులచాటునుండియు, అనేక ప్రాంతములనుండి తమసేనలను నబాబు రాజధానిమీదికి పంపించుచున్నారు. కాని, యీ సమయమందు ఒక్కసైనికుడుకూడ కదలలేదు. ఇదంతయు మీర్కాసీము మనస్సులోపుట్టినభ్రమ. వెనుక, తనను సింహాసనమెక్కింపబోవు సందర్భమున

వాన్ సిటార్టు రాయబారమువచ్చి మీర్జాఫరును పడగొట్టినట్లే యిప్పుడు అమియత్ రాయబారమువచ్చి తనను పడగొట్టునేమోయను ఉలుకు యితనికిపుడు పుట్టెను. వెనుక జరిగిననాటకమే తిరిగి యిప్పుడు జరుగునేమోయని అతనిభయము.''

"గతదినమందు (ఏప్రిల్ 14-వ తేదీయందు) కంపెనీవారు చేసిన తీర్మానము లితనికి తెలిసియున్నయెడల, యీతడిట్లు భయపడుటకు కారణముండియుండవచ్చును. అవసరమువస్తే పనికివచ్చుటకుగాను ఒకసేనను తయారుగా వుంచవలసినదిగ ఆనాడు కంపెనీవారు తనసేనాపతికి హుకుము చేసియుండిరి. "పాట్నాను పట్టుకొనుటకు నీకు రేపో మాపో మేముహుకుములను పంపనచ్చును. కాబట్టి, నీవు తయారులో ఉండుము" అని కంపెనీవారు పాట్నాలోనున్న ఎల్లిస్‌కు హెచ్చరికబంపిరి.'' (Rise of British Power in India. Pp. 390—391).

ఎట్లయిననేమి, ఈరాయబారులతో మాట్లాడుటకు మీర్కాసీము ఆఖరుకు ఒప్పుకున్నాడు. మే 15-వ తేదీన అమియత్, హే, లు నబాబుతో మాంఘీరులో మాట్లాడిరి, ఈ రోజంతయు మామూలు మర్యాదలతో సరిపోయినది. పదిరోజుల అనంతరము వీరిరువురును తిరిగి నబాబువద్దకువెళ్లి, కంపెనీవారికోర్కెల నన్నిటిని, కాగితముమీదవ్రాసి, నబాబుచేతికిచ్చిరి.

"ఇవన్ని పదకొండు షరతులు, సుంకములగూర్చియు, దేశజెంట్లగూర్చియు, కంపెనీ కౌన్సిలువారు యిటీవలచేసిన తీర్మానములను నబాబు లిఖిత పూర్వకముగ ఒప్పుకొనవలెను. దేశీయ ప్రజలపై నబాబు తిరిగి సుంకములను విధింపవలెను. ఇంగ్లీషువారి వర్తకమునకు యిటీవలగలిగిన నిరోధములవలన వారికవచ్చిననష్టమునకు తగు పరిహారమును కంపెనీకి యివ్వవలెను. నబాబు తన ఉద్యోగులను శిక్షించవలెను.........ఇట్టివే వినచవిగాని షరతుల ననేకములను పొగరుబోతుతనమును చూపుమాటలతో వ్రాసి నబాబుచేతికిచ్చిరి." (పైగ్రంథము పేజీ 393).

## రాజీ యత్నములు భగ్నమగుట

ఆత్మ గౌరవముగల యేరాజుగాని యిట్టిషరతులకు ఒప్పుకొనజాలడుగద. కాని, నబాబుచేత, ఒప్పించుటకు ఇంగ్లీషువారు వెనుక దండును తయారు చేయుచుండిరి. పాట్నాను ముట్టడించి పట్టుకొనవలసియుండునని అప్పుడే ఎల్లిస్‌కు కబురు పంపెయుండిరిగద. ఇందుకుగాను కొన్ని తుపాకులను పడవలలోవేసి పాట్నాకు పంపిరట. ఈపడవలు మాంఘీరుదగ్గరకు వచ్చేటప్పటికి, నబాబుకు అనుమానమువేసెను. ఈ పడవలను అటకాయించ వలసినదని అతడు హుకుముచేసెను. ఇది తప్పుకాదు. ఈ పడవల నటకాయించినసంగతి కలకత్తాకు చేరగనే, వారందరు సమావేశమై "నీవుచేసినపూవని, మామీద యుద్ధప్రకటనగ భావించుచున్నాము." అని నబాబుకు వ్రాసిరి. అమియతు, హే, లను తక్షణమే కలకత్తాకు వచ్చివేయవలసినదని

వ్రాసిరి. పాట్నాను ముట్టడించి పట్టుకొన వలసినదని ఎల్లిస్‌కు వెంటనే వ్రాసి వేసిరి.

నవాబు అయోధ్యపాలకుడగు షుజా ఉద్దౌలాతో రాయబారము సాగించెను. తనసేనలను ఆర్మీనియన్ ఆఫీసర్లచే తయారుచేయించెను.

కలకత్తానుండివచ్చిన ఉత్తరువులప్రకారము ఎల్లిస్ జూన్ 24-వ తేదీ రాత్రి ఆకస్మికముగ పాట్నాపై పడెను. నిచ్చెనలద్వారా కోటగోడలెక్కి ముట్టడించెను. నవాబువద్దకు రాయబారమువెళ్లిన 'అమియిత్ 'ను నవాబు కలకత్తాకుపోనిచ్చెను కాని, హే, ను మాత్రము వ్యవహారము పరిష్కార మగువరకు తనవద్ద ఖైదీగ నుంచుకొనెను. ఎల్లిస్ ప్రవర్తననుగూర్చి విన్నప్పుడు నవాబు భగ్గున మండిపడెను. వెంటనే, తనరాజ్యములోవున్న యావన్మంది ఇంగ్లీషువారిని నరికి పారవేయవలసినదని ఆతడు హుకుముచేసెను. దీనికి కొంతన్యాయము లేకపోలేదు.

ఎల్లిస్‌ను యింగ్లీషుసేనను తరిమివేయుటకుగాను 'మర్కర్' అను ఆర్మీనియన్ ఉద్యోగస్తునొకని నవాబు పాట్నాకు కొంతదండుతోపంపెను. ఈ దండయాత్రలో 'మర్కర్' విజయముగాంచెను. పాట్నాను ఇంగ్లీషువారినుండి విడిపించెను. ఎల్లిసును, ఇంక ఇతరయూరోపియనులను ఖైదీలుగ పట్టుకొని మాంఘీరుకు తీసికొనివచ్చెను. (Longs Records P. 327 and also Seir Vol. II. P. 467 et seq Calcutta Reprint of 1903).

అమియతును నవాబు కలకత్తాకు పంపివేసెను. కాని, మధ్యత్రోవలో ఎవరో ఇతనిని పట్టుకొని కాశింబజారువద్ద చంపిరి. ఈ హత్య ప్రమాదమున జరిగినదో లేక వెనుక ఆలోచనమీదనే జరిగినదో రికార్డులనుబట్టి స్పష్టముగ నిర్ణయించుటకు వీలులేకున్నది.*

అమియత్ హత్యసంగతి కలకత్తాకు తెలియగనే కలకత్తా కౌన్సిలువారు నవాబుచర్యను తీవ్రముగ నిందించుచు "నిన్ను బంగాళా తక్తుమీదనుంచి తీసిపారవేసినాము." అని చెప్పుచు అతనికి ఉత్తరము వ్రాసిరి. మీర్కాసీముతో పేచీ వచ్చేయెడల అతనిని తీసి పారవేసి, అతనిస్థానే తిరిగి వెనుకటి మీర్జాఫరును తీసుకొనివచ్చి సింహాసనముమీద కూర్చుండబెట్టుదమని కంపెనీవారు అంతకు పూర్వము 20-వ తేదీననే తీర్మానించుకొనిరి.

---

* నవాబు కొంత పరివారమునిచ్చి అమియతును కలకత్తాకు సాగనంపవలసినదిగ చెప్పినట్లును మధ్యత్రోవలో అమియత్ తాలూకు మనుష్యులు నవాబు పరివారముపై తుంటరితనముగ తుపాకులు కాల్చినట్లును, అందుకు ప్రతిగ నవాబు పరివారము తిరిగి కాల్పగ అమియత్ మున్నగువారు చచ్చినట్లును, Seir, గ్రంథము తెలిగించిన గ్రంథకర్త Vol. II పేజీ 476 కు Foot-note గ వ్రాయుచున్నాడు.

మీర్కాసీముపై యుద్ధము సాగించుచున్నామనియు, మీర్జాఫరును తిరిగి బంగాళాతక్తుపై నెక్కించుచున్నామనియు కంపెనీవారు జూలై 7-వ తేదీన దేశమందంతటను గొప్ప ప్రకటన గావించిరి. ఈ యుద్ధము అక్రమమనిచెప్పి వారన్ హేస్టింగ్సు, వర్‌ల్‌సీటు అను మెంబర్లిరువురు తటస్థముగ నుండిరి.

మీర్కాసీము జూన్ 28-వ తేదీన వ్రాసిన ఉత్తరము కలకత్తాలో జూలై 7-వ తేదీన అందినది. ఇందులో అతడిట్లని వ్రాసెను :—

" ఎల్లిస్ నాకు గర్భశత్రువని నేను మనస్సులో అనుకుంటూ వుండేవాణ్ణి. కాని, ఆతడిప్పుడుచేసిన పనివల్ల ఆతడు నాకు ఆంతరంగికముగ స్నేహితుడనియే నాకు తోచుచున్నది. ఆతడు రాత్రిపూట దొంగవలె పాట్నా ఖిల్లాను ముట్టడించినాడు. బజారంతా దోచుకొని కొల్లగొట్టినాడు. వర్తకులను, ప్రజలను, దోచుకొన్నాడు. ఉదయం మొదలు మధ్యాహ్నం మూడుజాములవరకు నానాచిత్రవధలు, హింసలు చేసినాడు. నాకు 2, 3 వందల తుపాకులు పడవలలో వేసి పంపవలసినదని నేను వెనుక మిమ్ములను కోరియుంటిని. కాని, మీరు పంపలేదు. కాని, యీ నిర్భాగ్యుడిప్పుడు తన మనస్సులో నాయందున్న స్నేహముచేత యీ యల్లరివల్ల, నాకు కావలసినన్ని తుపాకులను, ఫిరంగులను యిచ్చినాడు. తనబాధ, తన బరువు, వదిలించుకొన్నాడు. కంపెనీవ్యవహారములు నష్టపరచడం యెప్పుడు నాఉద్దేశ్యము కాదుకాబట్టి, యీతడే ఫిరంగులనన్నిటిని నాచేతి కిచ్చివేసినాడు. ఈ అల్లరిలో యీ నిర్భాగ్యునివల్ల నాకెంత నష్టముగలిగినను, నేను దానిని లక్ష్యముచేయను. కాని, ఇందువల్ల కంపెనీవ్యవహారములకు కలిగిన నష్టమునకు - అయ్యలారా - మీరంతా జవాబు చెప్పవలసియున్నారు. మీరు అక్రమముగ క్రూరముగ, పట్టణమును కొల్లగొట్టి, ప్రజలను నాశనముచేసి, వారి తాలూకు లక్షలకొలది రూపాయల విలువగల ఆస్థులను దోచుకొన్నారు. దీనికంతా మీరుబాధ్యులు. వెనుక కలకత్తాలో మీ ప్రజకు నష్టము కలిగినప్పుడు మీరు పరిహారము పుచ్చుకొన్నట్లుగనే, యిప్పుడు మా ప్రజకు గలిగిన యీ నష్టమునకంతకును మీరు తగిన పరిహార మివ్వవలసి యుందురు. అయ్యలారా, మీరంతా బలే తమాషా స్నేహితులుగా నున్నారే! మీ దేవుడైన యేసుక్రీస్తు పేరుచెప్పి మీరు నాతో ఒడంబడిక చేసుకొని, సైన్యపు ఖర్చులకనిచెప్పి నా దగ్గర ఒక దేశము తీసికొని, నా రక్షణకోసము ఆ సైన్యమును ఉపయోగిస్తామని చెప్పితిరి. కాని, తీరాచూడగ, ఆ సైన్యాన్ని నన్ను రక్షించడంకోసంగాక, నన్ను భక్షించడంకోసం పెట్టినట్లు తేలినది. ఏలననగ, యీ సైన్యం చేతనేగద యిట్టిదారుణవధలు దోపిళ్లు మీరు చేయించారు! ఇదొకవిధముగ కంపెనీవారు నా కిప్పుడు మేలే చేశారనుకుంటాను. ఏలననగ, గతమూండేండ్లనుండి మీరు వసూలుపరుచుకున్న శిస్తులన్నీ మీరు నాకు తిరిగి యిప్పించేస్తారన్న మాట - మీ ఇంగ్లీషు గుమాస్తాలుచేసిన దౌర్జన్యాలకు, హింసలకు వారు ప్రజలనుండి కాజేసిన

పెద్దపెద్ద మొత్తములకు, వారివల్ల గలిగిన యితర నష్టములకు, - వీటికన్నిటికి తగు పరిహారము మీరు యివ్వడం న్యాయమని మీరే ఒప్పుకుంటారుగద! ఇంతే మీరు పడవలసినకష్టమల్లా! ఇంతే! బర్ద్వాన్ మున్నగు పరగణాలు మీరెట్లా తీసుకొన్నారో, తిరిగి — అయ్యలారా — దయచేసి అట్లాగే వదలుకొని వెళ్లండి.'' (Long's Selections Pp. 325—326)

ఈ పుత్తరమును నబాబు ఎత్తిపొడుపుమాటలతో వ్రాసెననుట స్పష్టమే. అయితే, ఇంగ్లీషువారు తనను మొదటినుండి అనేకవిధముల అవమానించి, హింసించుచుండుటచేత, అతనిమనస్సు విరిగిపోయినది. ఎల్లిస్ పాట్నాపై పడుట కేవలము అక్రమము. దీని కెంతమాత్రము కారణములేదు. కాబట్టి, నబాబు చిరాకుపడి, కుహనాకై) స్తవ్రులగు తన పూర్వమిత్రులకట్టి ధోరణిలో ఉత్తరము వ్రాయుట తప్పుకాదు.

యుద్ధమునకు పూర్వరంగము-కంపెనీకి, మీర్కాసీముకు ఉత్తర ప్రత్యుత్తరములు

మీర్కాసీముకు, గవర్నరుకు, జరిగిన ఉత్తరప్రత్యుత్తరములు కొన్ని యిటీవల Calendar of Persian Correspondance అను గ్రంథములో ప్రచురింపబడినవి. అందుండి కొన్నిటిమాత్రమిట వివరించెదము. ఈ గ్రంథముయొక్క మూడవసంపుటమునకు ఉపోద్ఘాతము 9-వ పేజీలో మౌల్వీ బద్రుద్దీన్ అహమ్మదుగారు యిట్లు వ్రాయుచున్నారు:—

''కంపెనీనౌకర్ల పొగరుబోతు ప్రవర్తనవల్ల మీర్కాసీము కష్టములు మరింత ఎక్కువయ్యెను......కంపెనీనౌకర్లు సుంకములులేకుండ వర్తకమును చేసికొనుటకు తమకు హక్కుగలదని వాదించుటయేగాక, యీ దొంగహక్కులను ఇతర దేశీయ వర్తకులకుకూడ అమ్ముకొనసాగిరి.

లజ్జాహీనమగు యిట్టిమోసమువల్ల నబాబు రివిన్యూఅంతయు నష్టమయ్యెను .........ఇంతటితో పోలేదు. తనరాజ్యముపై దివాన్ గిరీ సంపాదించుకోవలెనని ఇంగ్లీషువారు ఢిల్లీ చక్రవర్తితో రహస్యముగ ఆలోచనలు సాగించినట్లు నబాబుకు అనుమానముతగిలెను. ఈరీతిగ రివిన్యూ పరిపాలన యావత్తు తనచేతిలోనుండి లాగివేయుటకు వారుచూచుచున్నట్లు అతనికి తెలిసెను.

''కంపెనీనౌకర్లు దేశాంతర్భాగములో చేసుకొను వ్యాపారములో సరుకుల ధరలలో నూటికి 9 చొ॥ సుంకము విధింపబడెను. దీనికి వారి ప్రతినిధి యొకడు—గవర్నర్ వాన్సిటార్టు—ఒప్పుకొనెను. ఈసంగతినాతడు కౌన్సిలువారికి చెప్పగనే, వారందరు ఇతనిపై ఒక్కసారిగ కట్టగట్టుకొనిలేచిరి. ఏసరుకుమీదా దమ్మిడీకూడ చెల్లించము అని వారందరు గర్జించిరి. ''కావలిస్తే ఉప్పుమీదమాత్రం నూటికి $2\frac{1}{2}$ చొ॥ చెల్లిస్తాము. అంతే, ఇంతకంటె నబాబు మనదగ్గర ఎక్కువపుచ్చుకోడానికి

హక్కులేదు" అనివారనిరి. స్వార్థ పరత్వముచే కండ్లుకానని వీరిమాటలకు వ్యతిరేకముగ, నబాబుపక్షమున, న్యాయమునకు నిలువబడి మాట్లాడినవాడు వారన్ హేస్టింగ్సు ఒక్కడే. సమాధానపరుచుటకు చేయుప్రతిప్రయత్నము డబాయింపులచే వ్యర్థమయ్యెను. న్యాయమార్గమున పోవుటకుచేయు ప్రతిప్రయత్నమునకు అడ్డంకులే గలిగెను. ఆఖరుకు విసుగెత్తి నబాబు ధైర్యముతో అడుగువేసెను. దేశములో యావత్తు సుంకములను ఒక్కపెట్టున తీసిపారవేసెను. ఇందువల్ల తనదేశ ప్రజలను కంపెనీనౌకర్లతో సమానసౌకర్యములు గలవారినిగజేసెను. దీనికి కంపెనీనౌకర్లు సహించలేక పోయినారు. వారుతక్షణమే నబాబుపై యుద్ధము ప్రకటించినారు. పాట్నాగడ్డంగికి అధికారిగనున్న ఎల్లిస్ తలబిరుసువాడు. తనకేదో అపాయమువచ్చి పడుతోందని యీతడు ఊరక గందరగోళము చేసుకొనెను. ఇతడు వెంటనే పాట్నాను ముట్టడించెను. తరువాత యేమిజరిగినది అందరికి తెలుసు."

తన కుమాస్తాలైన్ స్తవ మిత్రుల విశ్వాసఘాతుక స్వభావము మీర్కాసీముకు తెలిసివచ్చెను. వారు నీతినియమములను వదలి, తనను, తనప్రజలను, ఉద్యోగులను, ఎట్లు వేధించుచున్నారో అతడనేక పర్యాయములు చెప్పుకొని మొత్తుకొనెను. న్యాయము, హక్కు అతనిపక్షమందున్నది. విశ్వాసఘాతుకము ఇంగ్లీషువారి పక్షమునయున్నది. 1763 సం॥ ఫిబ్రవరి 22-వ తేదీన నబాబు గవర్నర్‌కు యిట్లు వ్రాసెను:—

"మన ఉభయులకు శత్రువులైనవారిని శిక్షించుటకే తెలంగీ సిపాయిలు మన సేనలలో చేర్చుకొనబడినారు. కాని మీరువారిని నామీదకే పంపిస్తారని నేను అనుకోలేదు. గుమాస్తాల చెప్పుడుమాటలను మీరునమ్మి, ముందుగ శిపాయిలను పంపించడమున్ను, దరిమిలా ఆచెప్పుడుమాటలేమో నాకువ్రాసిపంపించడమున్ను— యిదేనామర్యాదా—(Calender Page 188. No. 1676.)..........ఇదిఎంత లజ్జాహీనమైనపని? మీ ఇంగ్లీషువారిలో కొందరు పెద్దమనుష్యులు నన్నుతీసివేసి, యింకొక నబాబును పెట్టుకోవాలని ఆలోచిస్తున్నారటగా? ఆ వచ్చేనబాబు ఎవరైనా నాకపనిలేదు. తెలింగా శిపాయిలను మీరుపెట్టుకోడానికోసం నేనుమీకు 50 లక్షల రివిన్యూవచ్చే జిల్లాలనిచ్చాను. మీరిప్పుడు నన్ను నాశనంచేయడానికి సేనలను కూర్చుకుంటున్నారని వినడం నాకెంతో ఆశ్చర్యముగనున్నది. యూరపియనులను నమ్మకూడదని ఇప్పుడందరికి తెలిసిపోయింది." (పై గ్రంథము P. 189. No. 1679.)

ఈ ఉత్తరమునకు గవర్నర్ యిట్లు ప్రత్యుత్తరమిచ్చెను:—

"మిమ్మునుతీసివేసి, ఇంకొక నబాబును పెట్టుకోవాలని ఇంగ్లీషువారు ఆలోచిస్తున్నారని చెప్పేమాట కేవలము అబద్ధము. అది కుచ్చితపు బుద్ధిగల కొందరు కల్పించినమాట. స్వార్థపరులై దేశంలో అల్లరి కలిగించాలని కూర్చున్న మనుష్యులు చెప్పేమాటలివి." (పై గ్రంథము Page 190. No. 1683.)

గవర్నర్ వ్రాసిన సమాధానము శుద్ధ టక్కరుమాటయని యెవరికైనా తెలియును.

ఇందుకుబదులుగ తిరిగి మీర్కాసీము యిట్లువ్రాసెను :—

"మీరు న్యాయస్థులనే నా అభిప్రాయము. కాని, యీ విషయములో మాత్రం మీరు న్యాయంగా ప్రవర్తించడంలేదు.........మీకంపెనీ గుమాస్తా యొకడు నాతాలూకు నాయబ్‌ను, ధిఃకరించి త్రోసివేసినాడు. కాని, మీరువానిని శిక్షించరు........ నన్నుగురించి మీకు చెప్పబడే ప్రతి చిలిపిమాటను మీరు నమ్ముచున్నారు. ఇందుకు నాకుచాలా విచారంగాయుంది. దుండగములు చేసేవాళ్ల నందరిని శిక్షిస్తానని మీరన్నారు. ఎల్లిస్ ఒకదుండగీడు—మీరువానినెందుకు శిక్షించరు ? ఇది వింతగవుందే ? (పైగ్రంథము P. 192. No. 1687.)

కాని, నబాబను కొన్నట్లు గవర్నర్ న్యాయస్థుడుకాడు. ఏలననగ, యీ గవర్నర్ ప్రవర్తనను గూర్చి 1763 సం॥ మార్చి 5-వ తేదీన నబాబు వ్రాసిన ఉత్తరమునుబట్టియే యీ సంగతి తెలియగలదు :—

"నేను బీహారువెళ్లినప్పుడు బెంగాలులో నాథుడెవడు లేనందున మీ ఇంగ్లీషువారు నాప్రజలను హింసించి, ప్రతిగ్రామమును, ప్రతిజిల్లాను, నాశనం చేసినారు. నాప్రజలకు అన్నంలేకుండాచేశారు. రివిన్యూ వసూలు పూర్తిగా ఆగిపోయింది. యిందువల్ల నాకు సుమారు కోటిరూపాయలు నష్టంవచ్చింది......... మీరు మాంఘీరువచ్చినప్పుడు యీతగాదాల నన్నిటిని పరిష్కరిస్తానని నాతోచెప్పినారు. కాని, కలకత్తా వెళ్లగానే, జబరుదస్తీగా వర్తకంసాగించుకోడానికి మీరు సేనలను పంపించినారు. నాఉద్యోగస్థులెవరైనా నోరెత్తితే వారిని చావగొట్టి నానాక్షోభ పెట్టినారు. ఈమూడేండ్లు నాకు మీవల్ల దమ్మిడీ రొఖ్కముగాని, పేరుకైనా ఒకవస్తువుగాని, ముట్టలేదు. పైపెచ్చు, నాఉద్యోగులమీదనే పడి మీరు జుల్మానాలనియు, నష్టపరిహారములనియు పేరుపెట్టి, డబ్బు గుంజుకొన్నారు." (పైగ్రంథము P. 191-No. 1695.

ఈ యూరోపియను మిత్రులు తన్నిట్లు వేపుకుతినడంవల్ల, మీర్కాసీముకు సహనము చచ్చిపోయింది. 1763 సం॥ మార్చి 14-వ తేదీన ఆతడిట్లు గవర్నర్‌కు వ్రాసెను :—

"స్నేహంకోసమే నేనిన్నాళ్లనుండి మీరు చేసేపనులకన్నిటికి సహించి ఊరుకున్నాను. కాని, రాను రాను యిక, నాకర్లు గుణహీనులగు అల్పులు కూడ నన్ను అగౌరవపరచడం సాగించారు. నాకిక సహనంలేదు. ఎవరైనా ఒకరితో స్నేహంగా ఉండవచ్చునుగాని, పదిమంది దయాదాక్షిణ్యంమీద ఆధారపడి బ్రతుక

వలెనంటే, ఎవరికైనా తరమా? నేనేవిధంగాకూడ ఒడంబడికను భగ్నపరుపలేదు.'' (పైగ్రంథము P. 199—No. 1707.)

ఎల్లిస్ చాల అల్లరి చేయుచున్నాడనియు, అతనిని శిక్షించవలసినదనియు నబాబు యెన్నోసార్లు గవర్నర్‌తో చెప్పెను. కాని, 1763 సం॥ మార్చి 17-వ తేదీ ఉత్తరములో గవర్నర్ ఏమని సమాధానము వ్రాసినాడు ?

"ఎల్లిస్‌మీద చెప్పేమాటలు ఒక్కటికూడ నేనునమ్మను. మీరుచెప్పే దానికి ఋజువేమిటో చూపించండి. కంపెనీ వ్యాపారాన్ని రక్షించుకోడానికే యీ పెద్దమనిషి. సేనలను ఊళ్లవెంట త్రిప్పుచు, తిరుగుచున్నాడు.'' (పైగ్రంథము P. 202—No. 1716.)

గవర్నర్ యొక్కయు కౌన్సిల్‌లోని యితరమెంబర్ల యొక్కయు నడవడిని చూచి నబాబుకు విసుగు, రోత పుట్టెను. వారికడుపులోవున్న ఉద్దేశాలికతెలిసి పోయినవి. వారు వ్రాసియిచ్చిన సంధి పత్రాలు చిత్తుకాగితాలకంటె యెక్కువైనవి కావని నబాబుకు బోధపడిపోయినది. 1763 సం॥ మార్చి 20-వ తేదీన నబాబు గవర్నర్‌కు యిట్లని వ్రాసెను :—

"శిస్తుల వసూళ్లవల్ల నాకేమియు దమ్మిడీరావడంలేదు. పైగా, దీనివల్ల నాకూమీకూ తగాదాలు మాత్రము హెచ్చుగవచ్చుచున్నవి. కాబట్టి, యివి వసూలుపంపించడమే మానిపించినాను...........సుంకములవల్లకూడ నాకు దమ్మిడీ రావడంలేదు. అయితే, శిస్తులుమాత్రం రైతులనుండి శిపాయిలు లాగుకుంటున్నారు. నాతరువాత వచ్చే నబాబు యీనష్టమంతా మీకు భర్తీచేస్తాడులెండి!......... మీకు నాకు యీమధ్యజరిగిన ఒడంబడికకాగితం యిదిగోతీసికోండి, యిందుతో పంపిస్తున్నాను. పాత ఖరారునామాయే నన్నురక్షించనప్పుడు యీకొత్తదివచ్చి నన్నిప్పుడురక్షిస్తుందా? కావాలంటే పాతదికూడ పంపించివేస్తాను.'' (పైగ్రంథము పేజీ 203, No. 1718.)

1763 సం॥ మార్చి 22-వ తారీఖున నబాబు తిరిగి యిట్లువ్రాసెను :—ఇంగ్లీషువారు నాప్రజలలో కొందరితో షరీకై, కొందరినుండి డబ్బుకాజేశారు...... కలహం పుట్టించడానికి ఎల్లిస్ ఎప్పుడూచూస్తూవుంటాడు. మూడేండ్లకొకసారి ప్రెసిడెంటును మార్చుకోవడం మీ ఇంగ్లీషువారికి ఆచారం. నేను నబాబు గిరికివచ్చి దాదాపు మూడేండ్లయినది. కాబట్టి, నన్ను తీసివేసి, యింకొకణ్ణి పెట్టుకోవాలని మీరు చూస్తూన్నారు. ఈ ఉద్దేశం కడుపులో పెట్టుకొనియే నన్నెట్లాగైనాపొడిచి లేపి, నాచేత ఏదో తొందరపని చేయించి, ఆమిషమీదనన్ను తోసివెయ్యాలని మీరు చూస్తున్నారు.'' (పైగ్రంథము Pp. 203—204 No. 1719.)

ఇంగ్లీషువారు యుద్ధసన్నాహములు జేసుకొనుచున్నారు. ఇందుకై వారికి కొంత వ్యవధి కావలసివచ్చింది. ఈ సంగతి నవాబుకు తెలియకుండ, అతనిని మైకములో పడగొట్టుటకుగాను, తామేమియు నెరగనట్లు నవాబుతో చెప్పుచుండిరి. ఇట్టి ప్రమాదంరాకుండ "మీతో సమాధానము కుదుర్చుకొనుటకుగాను మేమిదిగో అమియత్, హే, అనువారలను మీవద్దకు పంపుచున్నాము. వారు మీతో మాట్లాడి క్రొత్త ఒడంబడిక నేర్పరుచుకొనగలరు." అని వ్రాసిరి. (పై గ్రంథము P. 200 No. 1720.)

"మీరుకోరే న్యాయమైన కోర్కెలను కౌన్సిలువారు అంగీకరించుటకు సిద్ధముగనున్నారు." అని ఏప్రిల్ 1-వ తేదీన తిరిగి వ్రాసిరి. (పై గ్రంథము P. 204—No. 1721.)

నవాబు యిట్టి కల్లబొల్లి మాయమాటలనమ్మ్రోజులు పోయినవి. కౌన్సిలు మెంబర్లను, "నౌకర్లనియు, గుణహీనులగు అల్పులనియు నవాబు వెనుకటి ఉత్తరములో వ్రాసినందుకు గవర్నర్‌కు కోపమువచ్చినది. ఈ మాటలు సమర్థించుకొనుచు నవాబు తిరిగి 1763 సం॥ ఏప్రిల్ 2-వ తేదీన యిట్లు వ్రాసెను :—"నా ఉద్యోగులను పట్టుకొనుటకు శిపాయిలను పంపించి, దేశములో అల్లరులు పుట్టించే వాళ్లు గులాములు, నీచులు కాకపోతే మరి యింకెవరు ? ఇటువంటివాళ్లు నీచులగునో కాదో మీరేచెప్పండి. (పై గ్రంథము P. 206) ఈ ఉత్తరములోనే నవాబు మరియు యిట్లువ్రాసెను :—"మీరు ఊళ్లల్లోకి మనుష్యులను పంపించి, అల్లరులు చేయించుచున్నారు. మీరు నాకు సహాయం చేయదలచుకొన్నట్లు కన్పట్టుటలేదు. పైగా నన్నుతీసివేసి, యింకొక నవాబును పెట్టుకోవాలని చూస్తున్నారు. వర్తకం విషయంలో నేనిక చెప్పేదేమున్నది. నేనంతా వదలుకున్నాను. అమియత్ నాతో వచ్చి మాట్లాడుట కేమియులేదు. శిస్తుదస్తులవిషయమై రాబోయే నవాబుతోనే మీరు మాట్లాడుకోవచ్చును."

1763 సం॥ ఏప్రిల్ 19-వ తేదీన నవాబీ దిగువరీతిగ వ్రాయుటకు న్యాయమున్నది:—

"మీ కంపెనీసేనకయ్యే ఖర్చంతా నే నిచ్చుకొనుచున్నాను. ఇందువల్ల నాకు గలిగే మెహర్బానీ యేమిటంటే, ఆసేనవచ్చి నా ఉద్యోగస్తులను పట్టుకొని కొట్టడం. యుద్ధానికి నాతో యిప్పుడు కాలుద్రవ్వేది ఇంగ్లీషువారే. అమియత్, హేలు యిప్పుడువచ్చి నాతో మాట్లాడడానికి నా కభ్యంతరములేదు. అయితే.వారి వెంట ఒకటిరెండు దళాలకంటె యెక్కువజనం రాకూడదు. ఇది తమాషాగావుంది - ఒకవైపున మీరు దౌర్జన్యకార్యాలుచేస్తూ-యింకొకవైపున-నాతో రాయబారాలు పంపుతున్నారా ! ఇట్టి దౌర్జన్యకార్యాలతో జోడింపబడిన రాయబారంమాట నే

నెక్కడా ప్రపంచంలో వినలేదు. సుంకములకు సంబంధించినవిగాక, యితర విషయములలో నేను యిటీవల జారీచేయించిన హుకుములు మీ కంపెనీకి కష్టముగనున్నవని మీరనుచున్నారు. దానికి నేనేమిచేసేది? సుంకముల విషయములలోతప్ప యింకే విషయములోగాని, హుకుముల జారీచేయుటకు నాకు హక్కు లేదా? నేనేమి అమీనానా? వాదహ్‌దారునా, జమీందారునా, గుమాస్తానా, ముసద్దీనా, నా కట్టిహక్కు లేకపోవడానికి? (పై గ్రంథము (P. 207 No. 1730)

నవాబుపై యెట్లాగైనా యింకొక క్రొత్త ఒడంబడిక వేసి బలవంతముగ రుద్దవలెనని కంపెనీవారు చూచుచుండిరి. ఇందునుగూర్చి అతడిట్లు గవర్నరుకు వ్రాసెను:- "ఏటేటా క్రొత్త ఒడంబడిక చేసుకోవడం చట్టమునకు విరుద్ధము. ఏలననగ, మనుష్యుల ఒడంబడికలకు ప్రాణములున్నవి."

(ఈ మాటలు నవాబు స్వదస్తూరీతో వ్రాసెనని 'Calendar' గ్రంథము చెప్పుచున్నది. P. 209 No. 1737)

వెనుకనుండిన మీర్జాఫరును తీసివేసి, తన్నేల సింహాసనముమీద కూర్చుండబెట్టినారో ఆకథనంతను మీర్కాసీము యేకరువుపెట్టెను.

ఈ కిరస్తానీ బచ్చులకు తానుచేసిన ఉపకారములనన్నిటిని యేకరువుపెట్టెను. మరియు నిట్లు వ్రాసెను :—

"నేనింత చేసినప్పటికి, ఇంగ్లీషువారు నా ఉద్యోగస్తులను కాళ్లుచేతులుకట్టి, తీసికొని పోవుచున్నారు. నోటికివచ్చినట్లల్లా మాట్లాడుచున్నారు. నా బంగాళామీద కోటలమీద, మనుష్యులను కాపలా పెట్టుచున్నారు." (పై గ్రంథము P. 208-209 No. 1736)

ఇదంతయు అరణ్యరోదనము. ఈ ఇంగ్లీషువారికి కృతజ్ఞత లేదు. మర్యాద లేదు. నీతి నియమములు లేవు. సరళ ప్రవర్తన లేదు. ఇక యెందుకీ కబుర్లన్నీ.

యుద్ధమెల్లాగూ తప్పదు. కాబట్టి, తాను చేసుకొనగల సన్నాహమునంతను నవాబు చేసుకొన్నాడు. వెనుక ఆరేండ్లక్రిందట జగత్ సేటుతోను, అతని కుటుంబమువారితోను కుట్రపన్నియే ఇంగ్లీషువారు సురాజ్ ఉద్దౌలా కొంపగూల్చిరి. ఈ సంగతి మీర్కాసీముకు తెలుసును. కాబట్టి, తిరిగి వీరంతా ఇంగ్లీషువారిలో పోయి దూరకుండ యీ ముతానంతాపట్టి కొట్టులో వేస్తేనేగాని తనకు క్షేమములేదు. ఈ ఉద్దేశ్యముతో జగత్ సేటును, అతని తమ్ముడు సరూప్‌చందునుపట్టుకొని మాంఘీరు కోటలో పెట్టించెను. ఇందుకు ఇంగ్లీషువారికి కోపమేల రావలెను? అయినప్పటికి, ఇంగ్లీషుగవర్నర్ జోక్యము గలిగించుకొని 1763 సం॥ ఏప్రిల్ 24-వ తేదీన నవాబుకిట్లు వ్రాసెను.

"ఈ సేటులు చాల గొప్పవంశములో పుట్టినవారు. ఇటువంటివారిని మీరిట్లుచేయుట తగదు. అదిగాక, యివి మన ఒడంబడికకు విరుద్ధము! ఇందువల్ల, మీకు నాకు కూడ అగౌరవం వస్తుంది."

"సేట్లు వర్తకులు; వారు మీసర్కారులో యెన్నడు జోక్యం కలిగించుకోలేదు. వారు మా ఇంగ్లీషువారితో పరీకైనారన్న మాట శుద్ధఅబద్ధము." (పై గ్రంథము P. 211 No. 1745—1747)

ఇందుకు నబాబీట్లు మే 9-వ తేదీన జబాబువ్రాసెను:—

"నేను వారిని పట్టుకొని మాంఘీరుకు రప్పించడములో తప్పులేదు. నేను సింహాసన మెక్కినప్పుడు వారు నాదగ్గర కాపురముండి, రాజ్యపరిపాలనలో నాకు సహాయంచేస్తామని నాతో మాటయిచ్చినారు. కాని, తరువాత నే నెన్నిసార్లు కబుర్లు పంపించినా వారురాక, మొగము చాటువేసినారు. తమ వ్యాపారాన్ని కట్టిపెట్టినారు. నా రాజ్యపరిపాలననంతా అల్లకల్లోంచేసినారు. నన్ను శత్రువుగ భావించినారు." తరువాత స్వదస్తూరీతోనబాబు దిగువ నిట్లువ్రాసెను......నారాజ్యంలోవున్నవారి విషయంలో జోక్యం కలిగించుకోడానికి, ఇంగ్లీషువారికి పనిలేదు. ఇది ఒడంబడికలో లేదు. అయినప్పటికి వారు జోక్యం కలిగించుకుంటున్నారు." (పై గ్రంథము P. 216 No. 1771)

ఆఖరుకు అమియత్, హే, లను రాయబారులుగ అంగీకరించి మాట్లాడుటకు నబాబు సమ్మతించెను. వారు పదకొండు షరతులనువ్రాసి నబాబు చేతికిచ్చిరి. ఈ జాబితా తన దగ్గరకు రాగానే మా నబాబు అమియత్ కు యిట్లు వ్రాసెను :—

"మీ కోర్కెలకు నేను 2, 3 రోజులలో సమాధానం చెబుతాను. ఈ లోగా మనమధ్యకఠినమైన మాటలేమీ జరుగకుండునుగాక. మీ గౌరవార్థ మొకవిందు ఏర్పాటు చేసినాము. దయచేసి రావలసింది." (పై గ్రంథము P. 219 No. 1779)

నబాబు పెద్దవంశములో పుట్టిపెరిగినవాడు. మంచి మర్యాద, తెరిగినవాడు. కాబట్టి, ఉభయులమధ్య కఠినమైనమాటలు రావద్దనియు, విందుకు రావలసినదనియు ఇంగ్లీషురాయబారిని మర్యాదగ ఆహ్వానించెను. కాని, మోటవానికి మొగలిపువ్వు అందమేమి తెలియును? అతడు రాలేదు. ఇంగ్లీషురాయబారి కొంచెము మర్యాదగ ప్రవర్తించియుండినచో నబాబు కంపెనీ వ్యవహారములను అనుకూలముగ పరిష్కరించేవాడేమో. కాని, నబాబుచేసిన ఆహ్వానమునకు అమర్యాదగ యితడు జబాబు వ్రాసి పంపించెను. దీనినిబట్టి, యితడు మంచిచారగల వంశములో పుట్టలేదని స్పష్టమగుచున్నది. ఇట్టి సందర్భములో నబాబుమాత్రము కంపెనీకోర్కెల నెట్లు మన్నిం

చును? తాము కోరిన కోర్కెల కంగీకరించుటకు వీలులేదని నబాబు మర్నాడు (మే 26-వ తేదీన) వారికి ప్రత్యుత్తరము వ్రాసిపంపెను. "మీరు మా కోర్కెలలో ఒక్కదానికికూడ అంగీకరించనందుకు మేము విచారపడుచున్నాము" అని వారు వ్రాసిరి. ఇందుకు బదులుగ నబాబు తిరిగి యిట్లు వ్రాసెను:—

"దేనికి నేను ఒప్పుకోలేదో మీరు చెప్పండి. నేనెప్పుడుగాని మీ కంపెనీ వ్యాపారానికి ఆటంకము చేయలేదు. ఒడంబడిక ప్రకారం చేయడానికి నేనెప్పుడు సిద్ధముగవున్నాను. అయితే, నెలనెలకు కొత్తకొత్త షరతులుపెట్టి, మీరు యుద్ధము చెయ్యడానికి యేదో మిషకల్పించుకుంటూ కూర్చుంటే, యిక నేనేమిచేసేది? ఎంత నీచుడైనా తనపేరు ప్రతిష్టలను గాలిలో కలిపివేసుకోడానికి యిష్టపడునుగదా? మీరు నేచెప్పే సంగతులను విననైనాలేదు. ఏమీ పరిష్కరించు కోకుండ ఊరికే వెళ్లిపోతున్నారు." (పై గ్రంథము P. 221 No. 1780)

జూన్ 2-వ తేదీన నబాబు గవర్నర్‌కు యిట్లు వ్రాసెను:—మీ రిప్పుడు కోరేషరతులు చాల బేసబబుగ వున్నవి. ఇవి వెనుకటి ఒడంబడికలకు విరుద్ధముగ వున్నవి......పాట్నాలోవున్న మీసేనల కలకత్తాకైనా పిలిపించుకోండి; లేదా మాంఘీరుకైనా పంపించండి. లేకపోతే, నేనీ నబాబుగిరి వదులుకొంటాను." (పై గ్రంథము P. 222 No. 1789)

జూన్ 3-వ తేదీన మరల యిట్లు వ్రాసెను:—

"అమియత్, హేలు, నే చెప్పేమాటలు వినలేదు. పాట్నానుంచి సేనలను తీసివేయడానికి బదులుగ, అక్కడ సేనలను మరింత ఎక్కువచేస్తామంటున్నారు. నీకు యుద్ధము కావాలంటే, మేము సిద్ధంగా వున్నామంటున్నారు......మీతో సమాధానపడవలెననియే నాకోరిక. అయితే, అందుకు నాకు దోవ కనబడడంలేదు. నా సహనమింక చచ్చిపోయింది." (పై గ్రంథము P. 222 No. 1793.)

ఇంగ్లీషువారికి యుద్ధంకావాలి. అందుచే, నబాబు చెప్పినమాటలు వారి చెవిలో దూరలేదు.

## మీర్కాసీముతో యుద్ధము.

మీర్కాసీమును కవ్వించి యుద్ధములోనికి లాగుటకు ఎంతచేయవలెనో అంతపనిని ఇంగ్లీవారుచేసిరి. కాని, ఆతడెంతమాత్రము శాంతినివీడక యుద్ధము రాకుండ చేయవలెనని ప్రయత్నించెను. ఇదెంతయు ప్రశంసాపాత్రము. హింసలు పడ్డవాడు అతను. అయినప్పటికి, ఎంతో సహనముతో అతడా హింసలన్నిటిని భరించెను. కయ్యమునకు దిగినది ముందుగ ఇంగ్లీషువారు. మొట్టమొదటగ ఎల్లిస్ పాట్నాను ముట్టడించెను. ఇందెంతమాత్రము న్యాయములేదు. అయితే, ఇప్పుడు

ఎల్లిస్ ఓడిపోయి, ఇంగ్లీషు ఉద్యోగస్తులు, సైనికులు నబాబుకు ఖైదీలుగచిక్కి, అమియత్ వధింపబడుటచే దీనినొకకారణముగ పురస్కరించుకొని, ఇంగ్లీషువారు పెనుబాగతనముతో మీర్కాసీముపై నెపముపెట్టి, అతనిపై రణదుందుభిని బహిరంగముగ ప్రయోగించిరి.

తామిదివరకు వేసుకొన్న కపటపు బురఖానిక తీసివేసి, బహిరంగముగ యుద్ధముసాగించిరి. కలకత్తా కౌన్సిలు మెంబర్లందరు యుద్ధమునకు యిష్టపడినను, వాన్‌సిటార్టు యిందుకు ఒప్పుకొనలేదు. కౌన్సిలు మీటింగులో వాన్‌సిటార్టు యిట్లు చెప్పెనట :—

"మన ఎల్లిసును, ఇంకా అనేకమంది ఇంగ్లీషు ఉద్యోగులు సైనికులును, ఇప్పుడు మీర్కాసీము చేతులలో చిక్కియున్నారు. కలకత్తానుండి మనసైన్యం తన మీదికి బయలుదేరిందను కబురు నబాబుకు చేరగానే, అతడు దురదృష్టవంతులగు యీమనవారినందరిని తప్పక చంపించివేస్తాడు. ఈమనజనాన్ని అతనిచేతులలోనుంచి —నిర్దాక్షిణ్యుడును, రక్తప్రియుడునునగు యీ నబాబు చేతులలోనుంచి—యేదో విధంగా తప్పించి బయటికి తెచ్చుకొనేవరకైనా మనమీతనితో మంచిమాటల మీద ఉండడము వివేకముకాదా? ఇదైనతరువాత మనమాతనిమీదికి యుద్ధమునకు వెళ్లి, కసితీర్చుకోవచ్చును.

"కాని సహేతుకమైన ఈ మాటలు తక్కినవారి చెవులకెక్కలేదు. తమ గవర్నర్ అయిన యీ వాన్‌సిటార్టుయందు వారికి అనుమానముపుట్టెను. ఇతడు మీర్కాసీము పక్షమువాడనియు, అతనినెట్లయిన కాపాడవలెనని యితడు చూచుచున్నాడనియు వారికి గట్టిగతోచినది. ఈకుట్రబుద్ధిచేతనే యీతడిట్టి శాంతివాక్యములు బలుకుచున్నాడనియు వారుతలచిరి. అందుచే వారందరొక్కసారి అతనిపైకి గప్పునలేచి అతడీమాటలు వ్రాసిన కాగితమును ఆతని చేతిలోనుండి లాగికొని— "ఈమీర్కాసీము తనవద్దనున్న మనవారిని యావన్మందిని—ఒక్క మనిషినికూడ మిగల్చకుండ—నరికిపారవేసినాసరే, మేమిప్పుడతనిమీదికి పోయిపడి, కసితీర్చుకొనక మానము. అతనితో యెట్టిరాజీకిగాని ఒప్పుకోము"—అను మాటలను ఆకాగితముయొక్క దిగువభాగమందువ్రాసి, అందరు దానికింద సంతకములు చేసినారు."
(**Seir Vol. II. Page 478—479. Calcutta Reprint.**)

వాన్‌సిటార్టు హేస్టింగ్సులు యిందుకు తమ భిన్నాభిప్రాయములను వ్రాసి, సంతకములుచేసిరి.

సైన్యాధిపత్యము మేజర్ ఆడమ్సుకిచ్చిరి. జాగ్రత్తగ ముందుకు సాగవలసినదనిచెప్పిరి. ఇంగ్లీషువారి స్థానములకు వెనుకయెట్టియిబ్బందిరాకుండ తగినబందోబస్తు చేసుకొని మరీ ముందుకుపొమ్మనిరి.

నబాబుసేనకు 'టాకీఖాన్' అధిపతిగనుండెను. ఇతడు ధైర్యసాహసములు, రణప్రావీణ్యముగలవాడు. కాని, యితడుచెప్పు ప్రతిమాటకు, చేయుప్రతిపనికి మధ్య మూర్షిదాబాదు డిప్యూటీ గవర్నర్ అగు సయ్యద్ మహమ్మద్‌ఖాన్ పానకములో పుడకవలె అడ్డువచ్చుచుండెను.

ఇంగ్లీషుసేనలు కలకత్తానుండియు, నబాబుసేనలు మాంఘీర్ మున్నగు చోట్ల నుండియు, మూర్షిదాబాదునకు బయలుదేరెను. ఈ రెండుసేనలకు జరిగిన పోరాటములగూర్చిన తప్సీళ్లనిట వివరింపబనిలేదు. ఇవి తెలిసికొనదలచినవారు Seir గ్రంథమునుగాని, బ్రూమ్ అను నతడు వ్రాసిన "బెంగాలుసేన చరిత్ర" నుగాని చూడవచ్చును. ఈ పోరాటముల పర్యవసాన మేమనగ—నబాబుసేనలు ఓడిపోయెను. సేనాపతి టాకీఖాన్ యుద్ధరంగమందు హతుడయ్యెను. ఇదిగాక, నబాబుసేనలో ద్రోహులున్నట్లు 'Seir' గ్రంథమువల్ల తెలియుచున్నది. వారిలో ఒకనిపేరు మీర్జా ఇరాజ్‌ఖాన్. ఈ ద్రోహులవల్లనే మహమ్మదీయసేనలోని రహస్యములు ఇంగ్లీషువారికి తెలిసెను, * ఈ యుద్ధమందు ఇంగ్లీషువారు తమ భుజబలమువల్లగాక, కేవలము తాము నబాబుసేనలో లేవదీసిన స్వామిద్రోహుల దుర్మార్గముచేతనే గెలుపొందిరి.

యూరపియన్ ఫిరంగిగాళ్ల స్వామిద్రోహము.

తనసేనాని యిట్లు చనిపోవుటచేతను, యింక అనేక ప్రతికూల పరిస్థితులచేతను, మీరాక్కాసీము దిగులొందెను. ఇక ఆఖరు యెత్తుగ † "ఊడానల్లా" యను

---

* ఈయుద్ధము నూటీ యనుచోట జరిగినది. దీని జయాపజయములగూర్చి చాలవివాదమున్నది. ఇందునుగూర్చి 'Seir' గ్రంథమును తర్జుమాచేసిన గ్రంథకర్త 489-వ పేజీ చివరభాగమందిట్లు వ్రాయుచున్నాడు. Vol. II. (Calcutta Reprint.)

"ఈయుద్ధమందు ఇంగ్లీషువారు నిజముగ ఓడిపోయిరని తదనంతరము కొన్నిదినములకు— ఈ యుద్ధరంగమందుండిన చాలమంది అఫీసర్లు గట్టిగవాదించిరి. కాని, ఆఖరునిమిషములో అంతయు తలక్రిందులయ్యెనట. మూర్షిదాబాదులోను కలకత్తాలోను అందరు చెప్పుకొనసాగినదేమంటే— నబాబుసేనలోనున్న అన్నిజాతుల యూరోపియనులు షుమారు రెండువందలమంది వుంటారు. వీరు నబాబుసేనలో ఫిరంగుల కాల్చుటకు నియమింపబడిరి. ఈయుద్ధమందు ఇంగ్లీషువారు ఓడిపోయి, నానాఅవస్థలు పడుతూవుంటే ఆయవస్థను యీ యూరోపియనులు చూడలేక పోయినారు. తమ మనస్సులుకరిగి, తక్షణమే వీరు నబాబుసేననువిడిచి, శత్రుపక్షములోనికి పోయిరి. అదిగాక, "మావలె మీరుమాత్రం యూరోపియనులుకారా, రండి, రండి, నబాబు కొలువువిడిచిరండి," అని యింగ్లీషు ఆఫీసర్లు వీరిని యుద్ధరంగములో ఎలుగెత్తి పిలిచిరట" కూడాను.

† ఈచోటును Seir గ్రంథకర్త యిట్లని వర్ణించుచున్నాడు :—

"ఊడానునది చిన్నలోతైననది. దక్షిణమున రాజమహాల్ కొండలలోపుట్టి ఒక సమప్రదేశమంగువచ్చిన గంగానదిలో కలియును. ఇది గంగతో కలియు సమతల ప్రదేశమంతయు ముండ్ల

చోట తనయదృష్టమును చూచుకొనదలచెను. ఈస్థలము తనరక్షణకై యేర్పరుచుకొనుటలో మీర్కాసీము మిక్కిలి రణప్రావీణ్యమును జూపెనని చెప్పవచ్చును. ఏలననగ, యీ స్థలము ప్రకృతిచేతనే బలిష్ఠముగ చేయబడియున్నది. దీనినింకను బలపరచుటకు మానవమాత్రుడు చేయగలిగిన దంతయు మీర్కాసీము చేసెను.

'ఊడానల్లా' రణక్షేత్రము — నబాబు ఓటమి.

అతడు సమర్థుడగు రాజ్యపాలకుడు. ఇంగ్లీషువారితో యుద్ధముకావలెనని కోరుకొనకపోయినను, దానంతట అదివచ్చిపడేయెడల, దానినెదుర్కొనుటకై అతడుచేయదగిన సన్నాహములనన్నిటిని చేసుకొనుచునేయుండెను. తనసేనను బలిష్ఠమొనర్చుకొనుటకు కావలసిన సన్నాహములనన్నిటిని, సంస్కరణములన్నిటిని మీర్కాసీము చేసుకొనుచునేయుండెను. వీనినన్నిటిని 'బ్రూమ్' తన గ్రంథములో వివరించియుండెను. మీర్కాసీము తనసైనికులకు తుపాకులలో తరిబీయతునిచ్చెను. ఆ తుపాకులగూర్చి "బ్రూమ్" యిట్లు చెప్పుచున్నాడు :—

"వీ రుపయోగించుచుండిన తుపాకులు యీ దేశములోనే (యిండియాలోనే) తయారైనవి. వీనిని తరువాత మన ఇంగ్లీషు (Tower proof) తుపా

---

పాదలతోను ముండ్లతీగెలతోను కప్పబడియున్నది. ఈ నదీతటములు బహుఎత్తుగను, నిలువుగనువుండి, యెక్కడగాని యెక్కుటకు సందులేకుండనుండును. అథవా యెక్కడైనను కొంత అవకాశమున్నను, ఏంతో కష్టముమీదగాని యెక్కివచ్చుటకు వీలులేదు. యుద్ధమునకు కొన్నినెలలకు పూర్వమీనదిపైన కొండరాతితోను, యిటుకతోను మీర్కాసీము ఒక వంతెన కట్టించెను. ఈనది గంగాసంగమ మగు కూడలి స్థానమునకుగల సహజమగు బలమును మీర్కాసీము కనిపెట్టెను. ఈనదికి అద్దరిని లోతైన కందకముత్రవ్వి, కందకమునకువెనుక ప్రాకారము నిర్మించెను. ఈప్రాకారపు గోడయు కందకమును నదీతట పర్వతపాదమునుండి గంగానదివరకు వ్యాపించియుండెను. ఇందువల్ల, ఒకప్రక్క ప్రాకారపుగోడ, అగడ్తయు, రెండవవైపున యీ చిన్ననదియువుండి, మధ్యనున్న ఖాళీ స్థలమంతయు సేనలువిడిసియుండుటకు అనువైన సమతల ప్రదేశముగనున్నది. ఈ కందకము చాలలోతుగవున్నది, దీనిపై ఒక కొయ్యవంతెనవున్నది. ఈ వంతెనకుముందు ఒకపెద్ద చెఱువును, బురద పఱ్ఱయుగలవు. ఇవి రెండును నదీతట పర్వతపాదమునుండి ప్రారంభమై ప్రాకారపుగోడచుట్టు చాలాదూరము విశాలముగ వ్యాపించియున్నవి. ఇందువల్ల ముందుభాగముకూడ శత్రువులకు దుర్భేద్యముగనున్నది. మాంఘీరుకు, రాజమహల్‌కు మధ్యత్రోవ యీకందకము, గోడలమీదుగతప్ప, యింకొకటిలేదు. ఈగోడమీద చాలబురుజులుండి, ఇదియొక పెద్దకోటగ కన్పించుచున్నది. కుడిప్రక్కగకూడ గంగానదిమీదుగ పడవలలోవస్తేతప్ప త్రోవలేదు. కాని, ఎదురుగ శత్రుసేనలుండి యెదిరించుచున్నప్పుడిదియు సాధ్యముకాదు. ఎడమప్రక్క అంతకంటె త్రోవలేదు. ఏలననగ—అక్కడ త్రోవలేని బురదపఱ్ఱలో తొడలోతు బురదలో యీడ్చుకొనుచునైన రావలెను; లేదా నిలువుననున్న కొండపార్శ్వము లెక్కియైన రావలెను. ఈ సందర్భముల నన్నిటిని కనిపెట్టియే, శత్రువుల నెదుర్చుటకిది మిక్కిలి యనువైన స్థానమను ఉద్దేశముతో మీర్కాసీము దీనిని కొన్నినెలలకు పూర్వమే బందోబస్తుచేయించి యుంచెను." (Vol. II. Pp. 491—492. Calcutta Reprint.)

కులతో పోల్చి చూచినాము. ఇవి మన తుపాకులకంటె చాల ప్రశస్తముగ నున్నవని చెపితే మీ రాశ్చర్యపడవచ్చును. ముఖ్యముగ ఈ తుపాకులలో మందు కూరు గొట్టములు మనవానికంటె యెంతో బలిష్టముగ నున్నవి. ఇవి చేయబడిన లోహమేమోగాని ఆశ్చర్యముగ నున్నది. నిప్పుకొట్టు చెకిముకిరాళ్లుకూడ దివ్యముగనున్నవి. ఇవి అక్కడనే రాజమహల్ కొండలలో దొరుకును. పరదేశాల నుండి దిగుమతియగు వానికంటె అందరు యివే ప్రశస్తమైన వనుచున్నారు.'' (P. 351)

అయితే, యితనిసైన్యపు యేర్పాటులో ఒక లోపముమాత్ర ముండెను. కానెడు పాలను ఒక్క విషపుచుక్క పాడుచేసినట్లు, యీ ఒక్క విషపుబొట్టే సర్వమును నాశనముచేసెను. అదేదనగ, మీర్కాసీము తన సేనలో కిరస్తానీవాళ్లను చేర్చుకొన్నాడు. తనసేనలో కొన్నిభాగములను ఆతడు కిరస్తానీ ఆఫీసర్లక్రింద వుంచినాడు. ఇదే అతని కొంపతీసినది. పూర్వము ''క్రూసేడరు''ల నాటినుండి క్రైస్తవులు మహమ్మదీయులపై యుద్ధములు చేయుచునేయుండిరి. వీరనేక మహమ్మదీయ రాజ్యముల స్వాతంత్ర్యమును హరించి, వారి మెడలపై తమకాడుల నుంచిరి. ఈ కారణముచే, క్రైస్తవులెన్నడుగాని, తమ మహమ్మదీయ యజమానులయెడ విశ్వాసముతో నౌకరీ చేయుదురని తలంచుట వెర్రి. ఈ రహస్యమును గ్రహింపని కారణముచే, చాలమంది మహమ్మదీయ ప్రభువులు తమ ప్రాణములను, ధనమానములను, రాజ్యమును, గోల్పోవలసినవారైరి. మీర్కాసీముకుకూడ యీ గతియే పట్టెను.

'ఊడానల్లా' రంగమందు మీర్కాసీము బలిష్ఠమగు స్థానము నాక్రమించి యుండెను. కావున, తమ యావత్తుశక్తియు నుపయోగించినను ఇంగ్లీషువా రతని నేమియు చేయజాలకపోయిరి. నెలరోజులు తంటాలుపడినను వారు మీర్కాసీము సేనకు కించిత్తయినను హాని గలిగింపలేకపోయిరి. ఇక, న్యాయమార్గమున అతని నక్కడ సాధించుట దుర్ఘటమని వారికి తోచిపోయెను.

ఇది యిట్లుండగ, ప్రతిరాత్రియు నబాబుసేనలు యెక్కడనుండియో వచ్చి ఇంగ్లీషుసేనలపై ఆకస్మికముగపడి, నష్టము గలిగించి, అందకుండ తిరిగి పారిపోవుచుండెను. ఈ కథ యిప్పుడే చెప్పెదము.

నబాబు ఆఫీసర్ల ప్రమత్తత.

నబాబుకు యింకొక దురదృష్టము పట్టెను. తమ స్థానమక్కడ దుర్భేద్యమను ధైర్యముతో శత్రుసేన తమపై ఆకస్మికముగవచ్చి పడలేదను నమ్మకముతో, నబాబు తాలూకు ఉద్యోగులును, సైనికులును, అజాగ్రత్తతో నుండిరి. యుద్ధసమయమందు సాధారణముగ చేసుకొను కట్టుదిట్టముల నేవినిగాని చేసుకొనరైరి. Seir గ్రంథకర్త యిట్లు వ్రాయుచున్నాడు :—

"ఆ శిబిరమునకు సహజముగగల బలమును చూచుకొని శత్రువులు తమపైకి వచ్చుట వట్టిమాటయను నమ్మకముతో, వారు తమవిడుదలలో అజాగ్రతగనుండిరి. చాలమంది డబ్బున్న ఉద్యోగస్థులు చీకటిపడగనే తప్పత్రాగి పిల్లవార్లు బోగమాటలు చూచుచునో, లేక బోగమువాళ్లను పక్కలలో పరుండబెట్టుకొనియో, కాలక్షేపము చేయుచుండిరి" (Vol. II P. 496—Calcutta Reprint)

సారా, సానులు,—యీ రెండు మీరాక్కాసీము కొంపముంచినవి. అయితే యీ రెండు దోషములకు పాల్పడని ఉద్యోగస్తు డొకడుమాత్రము నబాబుసేనలో నుండెను. అతనిపేరు "నాజీఫ్‌ఖాన్" ఇతడు అప్రమత్తుడై యింగ్లీషుసేనలనురాత్రి పూట వేధించుటకు ఉపాయము కనిపెట్టెను. (Seir గ్రంథకర్త యిట్లు వ్రాయుచున్నాడు) :—

"ఆతడు తరుచు కందకముచుట్టూ పరిశీలించి చూచుచుండెడివాడు. ఇట్లు చూడగ చూడగ, పర్వతపాదముదగ్గరగ ఒక చిన్నసందు వున్నట్లును, ఆ సందు గుండదూరి, అక్కడ రేవుదాటి చెరువుమీదుగ, పర్రమీదుగ, పోతే యింగ్లీషు వారి శిబిరములోనికి భద్రముగ చేరవచ్చుననియు ఆతని కక్కడనున్న కొండవాళ్లు కొందరు చెప్పిరి. ఈజాడలు కనిపెట్టి, నాజీఫ్‌ఖాన్, రాత్రి మూడుగంటలవేళ యీ గూఢ మార్గముగుండపోయి, ఆ ప్రక్కనున్న ఇంగ్లీషుసేనమీద పడెను. ఇక్కడనే మీర్జాఫర్ (వెనుక పదభ్రష్టుడైన ముసలిమామ) యింగ్లీషువారితోచేరి మకాముచేసి యుండెను. ఈ గాభరాచూచి, యీ ముసిలివాడు హడలిపోయి, ప్రక్కనున్న పడవ లోనికి పారిపోయి, దాగుకొని నదిదిగువకు జారజొచ్చెను. కాని యింతలో ఇంగ్లీషు వారు పంపిన దళమొకటి యితని సహాయార్థమువచ్చెను. వీరిని చూడగనే, నాజీఫ్ ఖాన్, యిదివరకే చాల కొల్లగొట్టియున్న హేతువుచే, తిరిగి తన శిబిరములోనికి వచ్చివేసెను." (Vol. II P. 496)

నాజీఫ్‌ఖాన్ యీరీతిగ ప్రతిరాత్రి పోయి, ఇంగ్లీషు దండుపైపడి నానాభీభత్సముచేయుచుండెను. "ఇతడు రోజూ యెక్కడినుంచి వస్తున్నాడురా" యని ఇంగ్లీషువారు యోచింపసాగిరి. వారికేమియు దోవ కనిపించలేదు. కాని, అదృష్ట దేవత సదా వారియందేయుండెనుగద. ఇప్పుడును అదియేవారికి తోడ్పడవచ్చెను. Seir గ్రంథకర్త యిట్లువ్రాయుచున్నాడు :—

నబాబు సేనలోని ఇంగ్లీషు సైనికుడు ఇంగ్లీషువారికి రహస్యపుత్రోవ చూపుట.

"ఒక ఇంగ్లీషు సైనికుడు వెనుక యెప్పుడో ఇంగ్లీషు సేనలోనుండి పారిపోయి, చాలరోజులు క్రిందటనే మీరాక్కాసీము కొలువులో చేరెను. నాజీఫ్‌ఖాన్ రోజూరాత్రిళ్లువెళ్లుచున్న గూఢమార్గమును వీడుకనిపెట్టెను. వీడు ఇంగ్లీషువారిచేతులలో గనుక పడితే, వారిరూల్సు ప్రకారము వీణ్ణి వారు చంపివేస్తారు.

అయినను వీడేమిచేసినాడంటే, రాత్రి చీకట్లో యీ సందుగుండపోయి, రేవుదాటి, దోవలో గుర్తులుపెట్టుకుంటూ నడిచి గట్టినేలమీదికి చేరగానే, ఇంగ్లీషు శిబిరములోని ఫారావాళ్లకు వినబడేటట్టుగ ఇంగ్లీషు భాషలోయిట్లని బిగ్గరగ అరచెను :—

"నేను ఫలానివాణ్ణరోయి, నన్ను గనుక మీరు చంపకుండ రక్షించేటట్టయితే, మనవాళ్లనందరిని యీ అగడ్తమీదుగ నబాబు శిబిరానికి తీసుకుపోతానరోయి" అని అరచెను. వీడి అదృష్టంపండింది. వీడి అదృష్టంచేత, వీడికంఠము గుర్తుపట్టిన ఇంగ్లీషు ఆఫీసర్లు ఫారాయిచ్చుచుండుట తటస్థించినది. వారప్పుడు "నీ ప్రాణం రక్షిస్తాము—నీప్రాణానికేమి భయంలేదు—నీవునిర్భయంగా యిక్కడికి రావచ్చును" అని కేకవేసి, ప్రమాణంచేసిరి. ఈ ప్రమాణంమీద వీడప్పుడు వారి వద్దకువెళ్లి, తాను చూచిన దంతాచెప్పి "మళ్లా, నేనింకొకనాటి రాత్రివచ్చి, మీకారేవుచూపిస్తా" నని మాటయిచ్చి, మరల నబాబు శిబిరములోనికి వచ్చి చేరెను. ఈలోగా ఇంగ్లీషు వారు శత్రు శిబిరపు ముట్టడికై కావలసిననిచ్చెనలు వగైరా సామాగ్రినంతెను సిద్ధము చేసుకొనిరి. అన్నమాటప్రకారము యీ ఇంగ్లీషు సైనికుడు తిరిగి రాత్రి పది గంటలవేళ ఇంగ్లీషు సేనలోనికి వచ్చెను..............."
(పై గ్రంథము P. 497.)

సెప్టంబరు 4-వ తేదీ రాత్రి యీ ఇంగ్లీషు సైనికుడు—మీర్కాసీము కొలువులోవుండి అతనికి స్వామి ద్రోహము చేయబూనిన యీతడు—ఇంగ్లీషువారి వైపుకు తిరిగిపోయి, వారిని యీ గూఢ మార్గమునుండి నబాబు శిబిరముపైకి రప్పించెను. వీరువచ్చునప్పటికి నబాబుసేనయంతయు తప్పత్రాగి ఆటపాటలచేతను, యింద్రియలౌల్యముచేతను అలసిసొలసి సొమ్మసిల్లి, ఒడలు తెలియక, నిద్రాపరవశులై పడియుండిరి. ఇంగ్లీషువారంతట వీరిపై పడి, యెక్కడివారినక్కడనరికిపారవేసిరి. ఈ ఒక్క దెబ్బలో మీర్కాసీము సేన 15,000 మంది హతులైరి. కొందరు పారిపోయిరి.

దీనితో మీర్కాసీము ఆశలు అడుగంటెను. ఇంగ్లీషు కోమట్లు తమమెడలపై వేసిన కాడిని పడద్రోసి, తిరిగి తమ స్వాతంత్ర్యమును సంపాదించుకొందమను ఆశలన్నియు మహమ్మదీయ నబాబుల కీదెబ్బ అడుగంటినవి. ఊడానల్లా క్షేత్రమే వారి కట్టకడపటి ఆశగనుండెను. ఈ ఆశ కాస్తా నిరాశయయ్యెను.

ఒక కిరస్తానీ శిపాయిగాడు చేసిన స్వామిద్రోహముచే యీయాశ పూర్తిగ నిరాశయయ్యెను. అదృష్టదేవత నబాబు పై తిరిగి చూడకుండ పోయెను. సురాజ్ ఉద్దౌలాకు ప్లాసీయెట్లో, మీర్కాసీముకు ఊడానల్లా అట్లయ్యెను. రెండుచోట్లను ఇంగ్లీషువారు • విజయము గాంచిరి-తమసైన్యబలముచేగాదు—ద్రోహముచే—న్యాయపరిశీలనకు నిలువజాలని కుచ్చితములచే—వారుగెలుపొందిరి.

మీర్కాసీము తనసేనల నింతదిట్టముగ తరిఫీయతు చేసినను, యితఁడోడి పోవుటకు చాలమంది యింకొకకారణమును చెప్పుదురు. అదేదనగ, యాతడెప్పుడు గాని, తాను స్వయముగ యుద్ధరంగమునకు రాడట. ఇందుకు అతని పిరికితనమే కారణమని ఇంగ్లీషు చరిత్రకారు లనుచున్నారు. ఇందుకుఅతని పిరికితనమేకారణమో, లేక వేరేకారణమేమైనకలదో నిర్ధారణగ చెప్పుటకు ఆధారములులేవు. అయితే, ఒక్కమాటమాత్రము నిశ్చయముగ చెప్పవచ్చును. ఏమంటే, ఇతడే గనుక యుద్ధరంగములో స్వయముగ ఉండియుంటే, అతనికీ అపజయములు కలిగేవి కావను మాటమాత్రము నిజము. తమకు ధైర్యము తెచ్చుకొనుటకు యీ ప్రాచ్య ఖండములో సైనికులు సాధారణముగ తమప్రభువువంకనే చూతురు. మీర్కాసీమే గనుక శిబిరములో మకాము చేసివుంటే, ఆరాత్రి తన ఉద్యోగస్థులు, సిపాయిలు, అట్లా తప్పత్రాగి, భోగంవాళ్లను పక్కలలో పెట్టుకొని ఒళ్లు తెలియక పడివుంటారా? ఎవడుగాని తనతనపనియందు అజాగ్రత్తగ వుండటానికి గుండెలుండేవా? బోల్ట్సు అనునతడు (**Consideration on Indian affairs 43** పేజీలో) యిట్లు వ్రాయుచున్నాడు :—

"మీర్కాసీము ఉద్యోగస్థులు యింకా యెక్కువధైర్యము చూపివుంటే— లేక మీర్కాసీమే స్వయముగ యుద్ధరంగమందు నిలువబడి తన సేనలను ప్రోత్సహించివుంటే—ఆరోజునుండి ఇంగ్లీషువారి కీరాష్ట్రములలో ఒక్క అడుగునేలనైనను చిక్కేదో లేదో చెప్పడం బహుకష్టసాధ్యముగ వుండేది."

ఆర్మీనియన్ ఆఫీసర్ల స్వామి ద్రోహము.

మీర్కాసీము చేసిన యింకొక తప్పు యేమిటంటే అతడు తన కొలువులో సిపాయిలుగను—దళాధిపతులుగనుకూడ—కిరస్తానీలను చేర్చుకున్నాడు. వీరిలో కొందరితనికి చేసిన ద్రోహములగూర్చి కొంతవరకిదివరకే చెప్పియుంటిమి. (ఇప్పుడింకకొన్ని చెప్పెదము) యూరోపియను, ఆర్మీనియన్, క్రైస్తవులయందు యితడుంచిన విశ్వాసమే యితనికొంప గూల్చినది. మీర్కాసీము సేనాధిపతులలో, అందులో ప్రధాన భాగమునకు "కోజాగ్రిగరి" యను ఆర్మీనియన్ క్రైస్తవు డొకడుండెను. ఇతనినే మహమ్మదీయ చరిత్రకారులు "గుర్గిన్ఖాన్" అని పిలుచుచుందురు. ఇతడు కలకత్తాలో ప్రసిద్ధికెక్కిన "కోజాపెట్రూస్" అను ఆర్మీనియన్ క్రైస్తవ వర్తకుని సోదరుడు. నవాబు కొలువులోవున్న కిరస్తానీ సిపాయిలను, ఉద్యోగులను— అందరిని చెరిపి, వారికి లంచములిచ్చి, తిరగదీసి, ఇంగ్లీషువారికెంతో సహాయము చేయుటలో యీ "కోజాపెట్రూస్" తనశక్తియుక్తుల నన్నిటిని వినియోగించి యుండెను. ఈమాటను యాతడే—తాను కలకత్తా బోర్డు ప్రెసిడెంటుకు వ్రాసిన ఉత్తరములో—ఒప్పుకొనియున్నాడు. 'లాంగు' తనరికార్డులలో 339 పేజీలో యిట్లు వ్రాయుచున్నాడు :—

"పెట్రూస్ ఆరాటూన్ అనబడు 'ఖోజాపెట్రూస్,' నబాబు తరపు గూఢచారియని మేజర్ ఆడమ్సు అనుమానించెను. అందుచే యితనినిపట్టుకొని బాధించిరి. కాని, తానట్టివాడను కానని యితడు దరిమిలా ఋజువు పరచెను. ఇతని సోదరుడు పాట్నాలో నబాబు తాలూకు ఫిరంగి దళమునకు నాయకుడుగ నుండెను. ఇతడు ఇంగ్లీషువారితో అతిస్నేహముగ వున్నట్లు అనుమానపడి, నబాబితనిని చంపించెను. అతడు బ్రతికివుంటే, బహుశః యీవధలు జరిగేవికావు" తాను ఇంగ్లీషువారియెడ భక్తి విశ్వాసములతో నున్నట్లు మనవి చేసుకొనుచు యితడు ఇంగ్లీషువారికి పెట్టుకున్న అర్జీలోని మొదటి వాక్యమువల్లనే యితని స్వభావము తేటతెల్లముకాగలదు :—

"ఘనతవహించిన బోర్డువారికి నేను మనవిచేసుకొనే దేమనగ:—"ఊడానల్లా" దగ్గర శత్రువు గొప్పసేనతో మిక్కిలి బలిష్ఠమైన స్థానమున విడిసియుండినప్పుడు, అక్కడ నబాబు కొలువులో సేనాపతులుగనున్న మార్కాన్, ఆరాటూన్ అను యిద్దరు మా ఆర్మీనియనులకు నేను మేజర్ ఆడమ్సు ఆజ్ఞప్రకారము రెండు ఉత్తరముల వ్రాసిపంపితిని. అందులో నేను వ్రాసిన దేమనగ :—ఇంగ్లీషువారు మన ఆర్మీనియన్ జాతికి యెల్లప్పుడు అనుకూలముగనుండి మనను యెల్లప్పుడు రక్షించుచున్నారు. కాబట్టి, ఆర్మీనియనులమైన మనము ఇంగ్లీషువారి మేలుకొరకై పనిచేయుట న్యాయము" అని వ్రాసితిని.

దీనినిబట్టి, యీ ఆర్మీనియన్ సేనాపతుల స్వామిద్రోహముచేతనే నబాబు సేన—'ఊడానల్లా' యందు నాశనమైనదని స్పష్టపడుచున్నది.

### మీర్కాసీము రణరంగమును వీడుట—ఉత్తర ప్రత్యుత్తరములు.

'ఊడానల్లా' ఇంగ్లీషువారిచే నిట్లు పట్టుబడిన తరువాత, మీర్కాసీము త్వరితగతిని మాంఘీరునకు పారిపోయెను. ఈతడే మాంఘీరుకోటను యిదివరకే దిట్టముగ బలపరిచి యుంచుకొనెను. ఈ కోటలోనుండియే 1763 సం॥ సెప్టెంబరు 7-వ తేదీన మీర్కాసీము కలకత్తావారి కిట్లు వ్రాసెను :—

"మీరీ మూడునెలలనుంచి చక్రవర్తి రాజ్యమునంతను సేనలతో నానా పాడు చేయుచున్నారు. ఇందుకు మీకేమి అధికారము గలదు? నన్నుతీసి పారవేయ డానికి మీదగ్గర యేదైనా చక్రవర్తి యిచ్చిన సన్నదువుంటే దాని అసలునుగాని, నకలునుగాని నాకు పంపించండి. దానిని నేను చూచుకొని, నాసేనలకు చూపించుకొని, యీ దేశమువిడిచి, ఢిల్లీచక్రవర్తి సమక్షమునకు పోయెదను. నేను మీయెడ యెట్టి విశ్వాసద్రోహము గావింప దలంపకపోయినను, మీ ఎల్లిస్ ఒడంబడికలను వాగ్దానములను పాటింపక, రాత్రిళ్లు ముట్టడిసాగించి, ద్రోహియై నామీదికి వచ్చెను. ఇంగ్లీషువారితో చేసుకొన్నసంధి, ఒడంబడిక, యిక తీరిపోయినదను

నమ్మకముతో నాప్రజ లిక కనబడ్డ ఇంగ్లీషువారి నందరిని చంపడం తమ ధర్మమని భావించిరి. ఈ తలంపుతోనే మూర్షిదాబాదు అమీర్లు మీ అమియతును చంపిరి కాని, ఆతడు చంపబడుట నాకెంతమాత్రము యిష్టములేదు.

"ఇక నేను వ్రాసే దేమంటే యింతటినుంచి మీ రీవిషయములో యెవరిని లక్ష్యము చేయకుండ మీ యిష్టమువచ్చినట్లే విచ్చలవిడిగ ప్రవర్తింప దలచుకుంటే, నాదగ్గరనున్న ఎల్లిస్‌ను, యింక యితరులైన మీ ముఖ్యులను నరికి పారవేసి, వారి తలలను మీదగ్గరకు పంపిస్తాను........

"రాత్రిపూట దొంగతనముగ ద్రోహముగ రెండు మూడుచోట్ల కొద్దిమంది నా జమేదార్లమీద సంపాదించుకొన్న యీ విజయమును చూచుకొని మీరు కులకవద్దు. అల్లా దయవుంటే, యిందుకు మేమెట్లు ప్రతీకారముచేసి, కసితీర్చు కుందుమో, మీరే చూతురుగాని." (Vansittarts Narrative. Vol. III Pp. 368—369)

ఇందుకు కలకత్తా ప్రెసిడెంటు యీదిగువ జబాబును పంపించెను :—

"అమియత్, హే లను నీవద్దకు రాయబారులుగ పంపితిమి. ఇది చాల పవిత్రమైన కార్యమని ప్రపంచములో అన్నిజాతులవారు మన్నింతురు. కాని, ఇందుకు విరుద్ధముగ నీవు అమియతుకు తిరిగివచ్చుటకు అనుజ్ఞయిచ్చి, అతనిని దోవలో పట్టి చంపించితివి. 'హే'ను అక్రమముగ నీవద్ద ఖైదీగవుంచుకున్నావు. మాకాశిం బజారు గిడ్డంగి ముట్టడించి అక్కడనుండు మావారినందరిని అతి అగౌరవముగ పట్టుకొని ఖైదుచేసి, మాంఘీరుకు తీసికొనిపోయినావు. వీరికీ యుద్ధములో సంబంధము లేకపోయినను - వీరు మీవారిని యెదిరించకపోయిననుకూడ - నీవు వారి నీరీతిగ చేసినావు. ఇదేమాదిరిగ, యితర ప్రాంతములలోకూడ శాంతముగ వర్తకము చేసుకొనుచున్న ఇంగ్లీషు యేజెంట్లను పట్టుకొని హింసించితివి, కొందరిని చంపించితివి. కొందరిని ఖైదుచేసి తీసికొని పోతివి. ప్రతిచోట వారి ఆస్తులను దోచుకొంటివి. నీ విన్నిపనులుచేసి, పైగా "మేజర్ ఆడమ్సును సైన్యముతో నామీది కెందుకు పంపించారు" అని, యింకా అంటావా? భగవంతు డేర్పరచిన నియమములు, మనుష్యు డేర్పరచిన నియమములు - అన్నీ నీకు తెలుసును. ఇంగ్లీషువారిని దేశములోనుండి తరిమివెయ్యాలని నీ విదివరకే అన్నావు. ఆ ఉద్దేశ్యముతో నీచేతనైనన్నిపనులు చేశావు. కాని, మమ్ములను, మాపేరు ప్రతిష్ఠలను రక్షించుకోడానికి మేము తగుచర్య గావింపవలసి వచ్చినది."

"యుద్ధములో దొరికిన ఖైదీలను చంపించడం క్రైస్తవులకు, మహమ్మదీయులకేగాక, కేవలము అనాగరికులగు యితరజాతులకుకూడ ఘోరకృత్యముగ గనపట్టును. ఇట్టి ఉద్దేశ్యములు, అడవులలోతిరుగు మృగములకు తప్ప, యింకెవరికి

పుట్టవు. ఊడానల్లా యుద్ధమైనతరువాత మీ తాలూకు మనుష్యులు మా మేజర్ ఆడమ్సు చేతులలో ఖైదీలుగ చిక్కినారు. అతడు వారికి కించిత్తయినను హాని చేయక అందరిని వదలివేసినాడు.''

మేజర్ ఆడమ్సు యీరీతిగ నబాబు ఉత్తరమునకు జబాబు వ్రాసెను :—

''నీతో చేసుకొన్న సంధిమాట మనస్సులో వుంచుకొన్నవార మగుటచే, మేము నీతోవచ్చిన పేచీలనన్నిటిని శాంతిమార్గముననే పరిష్కరించుకొందమని యెంతో తంటాలుపడితిమి. కాని, ఆఖరుకు అమియత్‌కు ద్రోహముచేసి నీవు అతనిని చంపించిన కారణముచే మేము, మనస్సులో యిష్టము లేకపోయినను, నీ మీద యుద్ధము ప్రకటింపక తప్పినదికాదు. అమియతును చంపించడం నీకు యిష్టము కాదని యంటివిగద. అయితే, ఆ చంపినవానిని నీవెందుకు కఠినముగ దండించలేదు? ఇప్పటికి మూడునెలలైనది. ఇందువిషయమై నీవేమియు చేయలేదు. భగవంతుని దయవల్ల మేము నిన్నిప్పుడు క్రుంగదీసినాము. ఎల్లిస్ మున్నగు మా పెద్దమనుష్యు లిప్పుడు నీచేతిలోవున్నమాట వాస్తవమే. వారి తలలమీద ఒక వెంట్రుకకైనా ఏమాత్రమైన హాని జరిగిందంటే ఇదుగో—చూసుకో—ఇంగ్లీషువారు నిన్నికరవంత యైనను కనికరించరు. వారియొక్క ఆగ్రహాగ్నికి అంతువుండదు. నీవు దిగంతములకు పారిపోయినను నిన్నందుకొని మ్రింగి వేతుము. ఒకవేళ, మా దురదృష్టవశాత్తు మేము నిన్ను పట్టుకోలేకపోతే—నీచేతిలోవున్న మావారిని చంపునంతటి దురంత కృత్యమునకు నీవును పాల్పడితే—భగవంతుని ఆగ్రహాగ్నికి నీవు ఆహుతికాక తప్పదు.''

మీర్కాసీము వ్రాసిన ఉత్తరములో చాలన్యాయమున్నదనుటకు సందేహములేదు. హింసపొందినవాడు నబాబు. హింసపెట్టినవారు యింగ్లీషువారు. వారతనిని చెప్పరాని విధముల పరాభవించిరి. అతడు యుద్ధముకావలెనని కోరుకోలేదు. ఇంగ్లీషువారే బలవంతముగ యీయుద్ధమును తెచ్చిపెట్టిరి. ఇంగ్లీషువారు నబాబుకు వ్రాసిన ఉత్తరము మర్యాదమాటలతో వ్రాయలేదు. ఆ ఉత్తరము ధోరణి అతనిని సమాధాన పరుచునదిగలేదు. పైపెచ్చు అతని మనస్సును మరింత మండించునదిగ వున్నది. కవ్వించి కాలుత్రవ్వినది మొదట ఇంగ్లీషువారే. నబాబు చేతిలోపడిన ఎల్లిస్ మున్నగు యింగ్లీషువార్లు నిజముగ తిరుగబాటుదార్లు—యుద్ధములో పట్టుబడిన ఖైదీలుకారు. వారు నేరములు చేయుచుండగ పట్టుబడిరి. కాబట్టి, వారు మరణదండనకు తగుదురు. కాని, నబాబు వారిని పట్టుకొన్నవెంటనే చంపక, తన స్థితిని బలహీనమొనర్చుకొన్నాడు. పైగా వారిని కూర్చోపెట్టి మూడునెలలు మేపినాడు. ఇంగ్లీషువారు తనపై లేవకుండ ముందుజాగ్రత్తకోసం దేశములో అక్కడక్కడనున్న యింగ్లీషువారిని పట్టుకొని, ఖైదుచేసినందుకు నబాబును నిందించవలసిన పనిలేదు.

ఇన్నేండ్లనుండి యీ యింగ్లీషుజనం దేశంలో ప్రజలనుపెట్టుచున్న ఏకక్షోభ పడలేక, ఆఖరుకు యీ అవకాశంచూచుకొని, సదరుప్రజలు యింగ్లీషు జనంమీద పడి, వారియెడలను, వారి ఆస్తులయెడలను, హద్దుమీరి ప్రవర్తించిరన్నచో ఆశ్చర్యములేదు. కలకత్తా బోర్డు వారును, మేజర్ ఆడమ్సును నబాబుకు పంపించిన జబాబులు అతనిని మరింత రెచ్చగొట్టునవిగా వున్నవేగాని, అతడు వెనుకటిద్రోహములు మరచిపోవునట్లు చేయునవిగ లేవు. ఇంగ్లీషువారు నబాబుపై కుట్రపన్నుచుండిరి. నబాబు మాంఘీరునుండి పాట్నాకుపారిపోవలసివచ్చినది. ఈపలాయనములో ఆతడు తనవెంట యింగ్లీషు ఖైదీలనందరినికూడ తీసికొనిపోయెను. ఇంతవరకు ఆతడు వీరికెట్టి హానియు చేసియుండలేదు. కాని, ఇంగ్లీషువారు తన నింతటనైనను పరాభవించుట మానలేదని నబాబు గ్రహించెను. ఇదిగాక, తననే చంపుటకు కుట్రపన్నుచున్నారనికూడ అతనికి వాసన తగిలెను. అందుచే, తన ప్రాణరక్షణార్థమై అతడు తనకొలువులోను, ఖైదులోనువున్న యావన్మంది ఇంగ్లీషు వారిని నరికించివేయదలచెను. ఈ విధముగ నరికివేయబడిన కిరస్తానీలలో మొదటి వాడు తన కొలువులోనున్న ఆర్మీనియన్ సేనాపతి "గుర్‌గిర్‌ఖాన్." ఇతని కథనుగూర్చి Seir గ్రంథానువాదకుడు యిట్లు వ్రాయుచున్నాడు. (Vol. II. P. 502, foot-note, Calcutta Reprint.)

మీర్కాసీము పలాయనము—ఇంగ్లీషు ఖైదీలను నరికించి వేయుట.

"ఇతనివధకు కారణములున్నవి. వానినెవడుగాని ధైర్యముగ చెప్పలేదు. ఒకకారణమేమనగ, ఇంగ్లీషువారిచే ప్రేరేపింపబడి యీ గుర్‌గిన్‌ఖాన్ కుట్రపన్నుచున్నాడు. ఇతనికి కలకత్తాలో ఆగా-బెడ్రోస్ లేక "కోజాపెట్రూస్" అనుపేరుగల సోదరుడు వున్నాడు. ఈ సోదరునికి వారన్‌హేస్టింగ్సుతోను, గవర్నర్ వాన్‌సిటార్టుతోను పరిచయమున్నది. వీళ్లిద్దరుకలిసి ఆకోజాపెట్రూస్‌చేత నబాబుసేనలో సేనాపతిగనున్న తనసోదరునికి (అనగ యీ గుర్‌గిన్‌ఖానునికి) ఉత్తరములు వ్రాయించిరి. మతముపేరుచెప్పియు, స్వార్థములను ప్రేరేపించియు, అతనినెట్లయినను చీలదీసి, మీర్కాసీమును చంపించేయెత్తువేయవలసినదని ఆవుత్తరములో వ్రాయించిరి. ఇదిసాధ్యముకాకపోతే ఆఖరుకు తనయధికారములోనున్న సైన్యమును, స్నేహితులను తీసికొని యింగ్లీషువారి వైపుకువచ్చి వేయవలసినదని వ్రాయించిరి. ఈ రహస్యమును నబాబు వేగులవాండ్రలో ప్రధానుడైన వాడొకడు యెట్లోపసిపట్టెను. ఆతడంతట ఏకాయెకినిరాత్రి ఒంటిగంటవేళ నబాబు పరున్నచోటికి వచ్చి, అతనిని నిద్రలేపించి, తనచేతితో నబాబును గట్టిగపట్టుకొని—"నీవు పక్కలో పడుకుని ఏమిచేస్తున్నావు—సేనా నాయకుడు గుర్‌గిన్‌ఖాన్ నిన్ను కేవలము తీసికొనిపోయి ఫరంగీలకు అమ్మిపారవేసేస్తోంటే, నీవిక్కడ నిద్రపోతున్నావా? లే, లే,

అతడు బయటవారితోను, లోపలవారితోను, సీఖైదీలతోసహా, మాటలు నడుపు తున్నాడు.'' అని హెచ్చరించెను.

ఇంతవరకు నిజము ఏమనగ; నబాబు తన సేనాపతిని (గుర్‌గిన్‌ఖాన్‌ను) నరికించి వేయుటకును, అటు తనఖైదీల యావన్మందిని నరికించివేయుటకునుకూడ యీ కుట్రజరుగుచున్నదన్న పుకారే కారణము.......ఇదిగాక, ఖైదులోనున్న ఇంగ్లీషువారు రహస్యముగ కొంతడబ్బును, తుపాకులను, మందుగుండు సామానును కూడ సంపాదించుకొన్నారట. * ఇంగ్లీషువారియందు అసహ్యము గలుగుటకు

---

* కల్యాణసింగ్ మహారాజు వ్రాసిన "ఖులసత్ - ఉత్ - తవారిఖ్" అను గ్రంథమును ఖాన్‌బహద్దర్ సర్ ఫరద్‌హుస్సేన్ ఖాన్‌గారు ఇంగ్లీషులోనికి తర్జుమాచేసిరి. అది "Journal of Bihar and Orissa Research Socety" యను పత్రికలో ప్రచురింప బడెను. అందు ఆరవ సంపుటము 127, 128 పేజీలలో యీ గుర్‌గిన్ ఖాన్, వధనుగూర్చి యిట్లు చెప్పబడి యున్నది:—

"ఊడానల్లానుండి తక్షణమే లేచిపోవుటతప్ప మీర్కాసీముకు వేరేమార్గము కనిపించలేదు. రాత్రి 2 గంటలవేళ అతడొక యేనుగునెక్కి తనకు శనియైన గుర్‌గిన్‌ఖానుని వెంటబెట్టుకొని, మిగిలినసేనతో మాంఘీరుకు బయలుదేరెను. మాంఘీరుకోటలో రెండు మూడు రోజులుండి, దానిని బాగుగ పరిశీలనగావించి, అక్కడనుండి పాట్నాకు (అజింబాదుకు) వెళ్లెను. కోట రక్షణార్థమై ఇజ్జత్‌ఖానును వెనుకనుంచి వచ్చెను. రోహనల్లా నదినిదాటి, అక్కడ మకాముచేసి, దానిమీదుగ పడవలతో ఒక వంతెనకట్టుట కాజ్ఞాపించెను. మర్నాడు యిద్దరు గుజ్జుపురోతులు గుర్‌గిన్‌ఖాను వద్దకువచ్చి, తమ జీతముల నిమ్మని కోరిరట. అత డివ్వననెను. వారు బలవంతపెట్టిరి. అత డంతట కోపము పట్టజాలక, "యీ యిద్దరినిపట్టి ఖైదులో వేసేటందుకు యిక్కడ యెవరూలేరా" యని యరచెను. ఈ అమర్యాదమాటకు వారికి కోపమువచ్చియు, తమ నబాబుయొక్క దురవస్థను తలచుకొనియు, వారంతట అతనిపైబడి, తమ కత్తులతో అతనిని నరికివేసి, గుఱ్ఱాలెక్కి అడవిలోకి పారిపోయిరి."

ఈ గ్రంథకర్తయే జగత్ సేటుయొక్కయు, అతని సోదరుడు సురూప్‌చంద్‌యొక్కయు, వధలనుగూర్చి చెప్పియున్నాడు. మీర్కాసీము మాంఘీరుకోటకు కాపలాపెట్టి వచ్చిన, ఇజ్జత్‌ఖానుడు సదరుకోటను మీర్జాఫరుకును, అతని మిత్రవర్గమగు యింగ్లీషువారికిని స్వాధీనపరిచివేసెను. ఈమాట తెలియగనే మీర్కాసీముకు "ఒడలు మంటలెత్తిపోయి తనవద్ద ఖైదీలుగనున్న ఎల్లిస్, జెస్సీ, యను ఇంగ్లీషువారిని, చంపించివేసెను.........డాక్టర్ ఫుల్లర్‌టన్ అనునతడు మాత్రము చంపబడలేదు."

పాట్నాకోటకూడ యిట్లే అనాయాసముగ ఇంగ్లీషువారి చేతులలోపడెనని యీ గ్రంథకర్త చెప్పుచున్నాడు. ఈ కోటకు అధిపతిగ నుంచబడిన "మీర్ మహమ్మద్" అనువాడు యీ కోటను ఇంగ్లీషువారికి ఊరికే అప్పగించివేసి వారిలో చేరిపోయెను. కంపెనీవా రితనికి తరువాత నెలకు రూ 500 లు పింఛనిచ్చుచుండిరి. కొంతకాలమైన తరువాత యితడు పరిషియాకు వెళ్లిపోయెను."

నబాబుకు చాల న్యాయమైన కారణము లున్నవి. ఇంగ్లీషువారు మాంఘీరు కోటను ద్రోహముచేసి పట్టుకొన్నారు. Seir గ్రంథకర్త యిట్లు వ్రాయుచున్నాడు:-

"మాంఘీరు పట్టుకొనబడిన ఒకవిధమిది. ఇంగ్లీషువారు కోటకు ముట్టడి వేసినారు. ఈకోట కధిపతిగనున్న ఆరబ్ ఆలీఖాన్ వట్టి పిరికివాడు. మీర్కాసీము కొలువువల్ల తన కేమియు గిట్టదనుకున్నాడు. నాకేదయిన డబ్బియిస్తే, యీకోట మీకు అప్పగిస్తానని వీడు ఇంగ్లీషువారికి కబురు పంపాడు. అప్పుడు మీర్కాసీమును వెంబడించి పట్టుకోవాలనే తొందరలో ఇంగ్లీషువా రుండుటచేత, సరే, నీవు అడిగింది యిస్తామన్నారు" వారంతట కొంతసొమ్మును వానిమొగాన తగులవేయగా, వాడు కోటలోనున్న వారిని మంచిమాటచేసుకొని, నెమ్మదిగా కోటను యింగ్లీషు వారి స్వాధీనము చేసివేసెను. ఇంగ్లీషువారంతట కొంతసేన నక్కడ కాపలాపెట్టి పాట్నామీదికి నడిచిరి...... (Vol. II P. 508 Calcutta Reprint.)

నబాబుసేనల విశ్వాసమును చెడగొట్టుటకై ఇంగ్లీషువారు ప్రయత్నించు చుండిరి. 1763 సం॥ సెప్టంబరు 19-వ తేదీన ఆడమ్స్, కార్నకులు నబాబుకొలువులో నున్న "మాన్షియర్ జంటిల్" అనువాని కిట్లు వ్రాసిరి:—

"పాపము కేవలము లేమిడిచేతనే క్రైస్తవులకెంతో అగౌరవమగు యీ ముసల్మాను కొలువులో మీరు చేరియుందురని మాతలంపు. సందు చిక్కినప్పుడల్లా యీ ముసల్మానులు మన మతస్థులను, యూరోపియనులను, చెప్పరాని విధముల హింసించి, బాధపెట్టుచుందురు. ఇంతటి దౌర్భాగ్యపు గులాంగిరినుండి తప్పించుకొని బయటపడుటకు మీకిప్పుడు మంచి అవకాశమున్నది. ఇందువల్ల, మీరు మనజాతి గౌరవమును నిలువబెట్టినవారగుదురు. మీరింతవరకు మనజాతికి అగౌరవముగ ప్రవర్తింపవలసి వచ్చెనను మాటను మీరుసైతము కాదనజాలరు. ఇప్పుడు మీర్కాసీము చేతులో చిక్కియున్న మనవారిని గనుక మీరెట్లాగైనా తప్పించి, మావద్దకు పంపించేయెడల, మేము మీయెడ యెంతో కృతజ్ఞతతో నుందుమని మీరు గట్టిగ నమ్మండి. మీకిప్పుడు తక్షణమే యాభై వేల రూపాయలు చేతులో పెడతాము." (Long's Records Pp. 332-333.)

ఇంగ్లీషు ఖైదీలను గూర్చి Seir గ్రంథకర్త యిట్లు చెప్పుచున్నాడు:—

"ఈ ఖైదీలు అక్కడి నౌకర్లద్వారా తగినంత మందుగుండు సామానులను, తుపాకులను తెప్పించుకొనుటకు యేర్పాట్లు చేసిరి. కాని అవి వారిచేతికింకను రాలేదు. అవేగనుక వారిచేతికి వచ్చివుంటే వాటిసహాయంచేత, కేవలము జబరదస్తీగ తప్పించుకొని పారిపోవాలని వారిఊహ. ఒకవేళ తప్పించుకొని పారి

పోలేకపోయినా, కొంతమందిని చంపియైనా చద్దామనివారి యెత్తు. దీనివల్ల తమకు పేరుప్రతిష్ఠలైనావుంటవని వారి ఉద్దేశ్యము.'' Vol. II, Pp. 505-506, Calcutta Reprint.)

ఇట్టి పరిస్థితులలో, తనకింతటి తొందర కలుగ జేయుచున్న యీ ఇంగ్లీషు ఖైదీలను నవాబు చంపించినాడంటే తప్పేమున్నది? అదిగాక, వీరందరు ఒకవిధముగ తిరుగుబాటుదార్లను సంగతిని కూడ మరువరాదు.

ఈ ఇంగ్లీషువారి నందరిని నరికివేయుపని ఒక యూరోపియనునకు తగిలించిరి. ఇతడదృష్ట జాతకుడగు శిపాయి. వీనికి ''సోబ్రే'' లేక ''సోమ్రే'' యను ఎగతాళి పేరుండెను. ఇతను జర్మనీ దేశస్తుడు. ప్రొటెస్టెంటుశాఖకు చెందిన క్రైస్తవుడు. ఇతడు యిండియాకు వచ్చినతరువాత బీగమ్ సమ్రూఅనుదానిని పెళ్లిచేసుకొనెనట—లేదు—ఉంచుకున్నాడని కొందరందురు. డాక్టర్ ఫుల్లర్టన్ తప్ప, తక్కిన యావన్మంది ఇంగ్లీషువారు యితనిచే నరికి వేయిబడిరి.*

మీర్కాసీము వంగరంగమునుండి నిష్క్రమించుట.

ఇంగ్లీషువారు పాట్నావైపునకు నడుచుచురాగా, మీర్కాసీము కరమ్నాసా నదివైపునకు నడువసాగెను. ఈ నది తన రాజ్యమునకు, అయోధ్య రాజ్యమునకు మధ్య సరిహద్దుగనున్నది. ఇంగ్లీషువారితని వెంటబడిరి. అందుచే, యితడు తన రాజ్యమును విడిచి, డిశంబరు 4-వ తేదీన అయోధ్య నవాబగు షుజాఉద్దౌలా రాజ్యములో ప్రవేశించెను.

ఈ రీతిగ మీర్కాసీము పాత్ర వంగరంగమునుండి నిష్క్రమించినది. ఇతని నవాబుగిరి యింతటితో అంతమొందినది. ఇతని యవస్థకు సద్బుద్ధిగలవారెల్లరు సానుభూతి జూపకమానరు. ఏలననగ, యితడు ఇంగ్లీషువారి క్రౌర్యమునకు, ద్రోహమునకు గురియయ్యెను. ఇంగ్లీషువారితో యెట్లయిన సక్యపడి బ్రతికియుండమని ఆతడెంతో ప్రయత్నించెను. కాని ఆతనిని అంతకంతకు నిలువున దోచుకొనవలెనని వారుచూసిరి. కరుకు రూపాయలు ఇరవై లక్షలు అతడు వారిమొగాన పోసెను. బంగాళా దేశములో మూడు మంచి ఫలవంతమగు జిల్లాలను వారికి కట్టపెట్టెను. తమసిక్కా రూపాయలను తామే అచ్చువేసుకొననిచ్చెను. ఎట్టివట్టముగాని లేకుండ అవి తనరాజ్యంలో చెలామణి యగునట్లు చేయించెను. ఇంతచేసినను ఇంగ్లీషువారి దాహము తీరలేదు. ఇంకా మింగాలని వారు నోరు తెరుచుకొనియుండిరి. వీరి

---

* ఈ వధావిధానమును గూర్చి తెలిసికొనగోరువారు Seir గ్రంథము Vol. II, p. 505 (Calcutta Reprint) చూడదగును. మరియు మూడవ పార్లమెంటరీ రిపోర్టు 1773 సం॥ 360 పేజీలో (బోర్డువారికి డాక్టర్ ఫుల్లర్టన్ వ్రాసిన ఉత్తరం) చూడదగును.

కాంచన తృష్ణను తీర్చుట బ్రహ్మకుకూడ తరముకాలేదు. వర్తకమువల్ల నబాబుకు వచ్చు సుంకములు అతనికి రాకుండ చేయవలెనని వారుచూసిరి. దేశములోని వర్తకమంతయు తామేకాజేసి, దేశప్రజలను నానాక్షోభలుపెట్టి వారిని దుంప నాశనముచేయవలెనని ఇంగ్లీషువారు పట్టుపట్టిరి. వీరిన్ని దుండగములు చేసినను అప్పటికీ—వారితో సమాధాన పడవలెననియే—పాపము—మీర్కాసీము చూసెను. ఇందుకుకూడ కంపెనీవారు తృప్తిపడలేదు. ముందుగ కయ్యము ప్రారంభించి, అతనిని యుద్ధములోనికి లాగినది ఇంగ్లీషువారే. మీర్కాసీము అనేకసార్లు చెప్పుకొని మొత్తుకొన్నట్లు, యీ యుద్ధము అతను కోరుకొన్నదికాదు-ఇంగ్లీషువారే యుద్ధమును అతనిమీదకి బలవంతముగ తెచ్చి పడవేసిరి. ఈ యుద్ధములో వారిది పైచేయి అయిందంటే అది వారిప్రజ్ఞ కాదు. న్యాయమార్గమునగాక స్వామిద్రోహము వల్లను, లంచమువల్లను, వంచనవల్లను, వారీయుద్ధములో గెలుపొందిరి.



# బ్రిటిష్ మహాయుగము

## ఐదవ అధ్యాయము



### మీర్జాఫర్—పునరభిషేకము

1763 సం॥ జూలై 7-వ తేదీన కలకత్తాకౌన్సిలువారు యీక్రింది ప్రకటనను గావించిరి :—

"నబాబు మీర్కాసీమ్ అలీఖాన్ ఇంగ్లీషుజాతికిని, ఇంగ్లీషు యీస్టిండియా కంపెనీకిని భంగకరముగ విరుద్ధకార్యమును ప్రారంభించి, బహిరంగముగ యుద్ధము సాగించుటచేత, మేము సదరు ఇంగ్లీషుజాతి తరపున ఆయనపై యుద్ధము విధిలేక ప్రకటింపవలసివచ్చినది. ఆయన స్థానమున తిరిగి మీర్జాఫర్ ఖాన్ బహదూర్ గారిని ప్రభుత్వమున నిలుపుటకు మేము తీర్మానించు కొన్నాముగాన, మేము వారినిందు మూలముగ బెంగాల్, బీహార్, ఒరిస్సా, రాష్ట్రములకు సుబేదారుగ అంగీకరించి, ప్రకటించుచున్నాము. మరియు సదరు మీర్కాసీము అలీఖాన్ యీ దేశములో ప్రముఖులగు పెక్కుమంది వర్తకులపైనను, ప్రజలపైననుకూడ యిట్లే దౌర్జన్య కృత్యములొనర్చి వారిని హింసించి పూర్తిగ నాశనము చేసియుండెను గావున, మాయధికారములోనున్న యావన్మంది ప్రజలున్ను, యితరత్రా దేశీయులగు ఉద్యోగులును, పౌరులును, మీర్జాఫర్ ఖాన్ బహదూర్ గారి బావుటా క్రిందికివచ్చి, సదరు మీర్కాసీము వేయు యెత్తులను పడగొట్టి, యీకొత్తనవాబుగారు తమ స్థానమున స్థిరముగ పాదుకొనునట్లు తోడ్పడవలసినదని మేము యిందుమూలముగ కోరుచున్నాము."

ఈప్రకటన మొదటివాక్యములోనే సర్వాబద్ధములతో ప్రారంభమయ్యెనని యిట వేరుగ చెప్పబనిలేదు. దుండగకార్యమును ప్రారంభించి, సాగించినది ఎల్లిస్ కాని, మీర్కాసీముకాదు. మీర్జాఫరును తిరిగి ఇంగ్లీషువారిప్పుడు సింహాసనము మీద కూర్చుండబెట్టుటచేత, అతనికిలోగడ వారు చేసిన అన్యాయమును యిప్పుడు వారొకవిధముగ ఒప్పుకొన్నట్లే యర్థమగుచున్నది. కాబట్టి, యీ పునరభిషేక సమయమందు వారతనికి కొంత నష్టపరిహారమును అనగ—తాము వారతనికి లోగడ గలిగించియుండిన నష్టమునకు తగుపరిహారము—న్యాయముగ యివ్వవలసి యుండెను. కాని, యిట్టియౌదార్యమునకు యింగ్లీషువారు దూరస్థులుగద. అదిగాక, యింకొక విశేషమేమనగ—అసలీ ముసలివానినిప్పుడు తీసుకువచ్చి, తిరిగి పెండ్లి

కొడుకును చేసినదెందుకు? ఇతనినుండి తిరిగి డబ్బు దోచుకొందమనియేగద. ఈరీతిగ అతనినుండి డబ్బు కాజేయదలచుకొన్న నీచులు, అతనికి డబ్బుయిత్తురా? ఇతనితో వీరిప్పుడు చేసుకొన్న క్రొత్తయొడంబడిక కంపెనీవారికే యెంతో లాభకారిగనున్నది. ఇందునుగూర్చి 'ఎలిఫిన్‌స్టన్' అను చరిత్రకారుడు (Rise of British Power in India. P. 397) యిట్లు వ్రాయుచున్నాడు :—

ఇతనిని సింహాసనముపై కూర్చుండబెట్టుటయనగ, యితనికి న్యాయముగ గలుగవలసియున్న హక్కును యితనికి తిరిగియిచ్చుటయేయని కౌన్సిలులో అధిక సంఖ్యాకులు అభిప్రాయపడిరి. అయినప్పటికి, వారతనిపై కఠినమగు క్రొత్తషరతులను విధించుటకు సిగ్గుపడరైరి. మీర్కాసీము లోగడ కంపెనీకి యిచ్చియున్న హక్కులన్నియు తిరిగి యితనివల్ల ధ్రువపరుపబడినవి. కంపెనీ నౌకర్లు కోరుచుండిన యావత్తు వర్తక సౌకర్యములు యితడిప్పుడిచ్చి తీరవలెనని గట్టిగపట్టుబట్టిరి. నబాబు 6 వేల అశ్వదళము 12 వేల కాల్బలముకంటె యెక్కువ సేననుంచుకొనరాదనిరి. తనను తీసిపారవేసి, తనస్థానములో తామే చేతులార తీసుకొని వచ్చిపెట్టిన ద్రోహిమీర్కాసీమువల్ల తమ కంపెనీకిని, వ్యక్తులకును గలిగిన నష్టమును యావత్తు యీ మీర్జాఫరు ఇప్పుడు భర్తీచేయవలెననిరి. ఇంగ్లీషు సేనకు 25 లక్షల రూపాయలను, నౌకాదళమునకుకూడ యింతని చెప్పకుండ మరి కొంత ధనమును, సంభావనగ యితడిచ్చునట్లు వేరొక కరారునామా వ్రాయించుకొనిరి."

మీర్జాఫర్‌తో క్రొత్త ఒడంబడిక — ఎక్కువ సొమ్ముగుంజుట.

మీర్కాసీముతో చేసిన యుద్ధములో ఇంగ్లీషువారీ ముసలివానిని తమకు ఉపకరణముగ వాడుకొనిరి. ఈ ముసలివాడును (సిగ్గులేక) వారికి తోడ్పడెను. ఇతడు వారితోకూడ కలిసివచ్చి "ఊడానల్లా" శిబిరమందు మకాముచేసి యుండెనని యిదివరకే చెప్పియుంటిమి. ఈముసలివాని పేరు చెప్పియే, ఇంగ్లీషువారు మీర్కాసీము సేనలోని మనుష్యులను తిరగదీసిరి.

ఇత డింతటి నైచ్యమునకు పాల్పడినను చివరకు బావుకొన్న దేమియులేదు. ఇతనికి సంతోషములేకుండెను. చావు తరువాత లావు దుఃఖమన్నట్లు యితనికీ వృద్ధాప్యములోని రెండవపెళ్లి — (పునరభిషేకము) సౌఖ్యదాయకముగలేదు. మొదట పెళ్లిలో పడ్డదుఃఖమునకంటె యిప్పుడీ ముసలిపెళ్లిలో యితనిపని మరింత అధ్వాన్నముగ నుండెను.

తనకు దివాన్‌గ నందకుమారుడు కావలెనని యీముసలివాడు పెండ్లిపీటల మీద (పునరభిషేకకాలమందు) ముచ్చటపడికోరుకొనెను. ఈ నందకుమారుడప్పుడు కలకత్తాలో ఇంగ్లీషువారివద్ద ఖైదీగనుండెను. వారప్పుడితనిని వదలించి, ముసలి

పెండ్లికొడుకునకు దివాన్‌జీగ ఇచ్చిరి. నందకుమారుడు మీర్జాఫరుని భక్తివిశ్వాసములతో కొలిచెను. తనస్వామియొక్క శ్రేయమును పెంపొందించుటకై అతడు శక్తి వంచనలేక పాటుపడెను.

ఈ రెండోపెళ్లి సౌఖ్యం అనుభవించడానికి ముసలాడు ఎన్నోరోజులు బ్రతకలేదు.

కంపెనీవారు మీర్జాఫరును వేధించిన విధము.

మొదటి నవాబుగిరిలోకంటె, యీ రెండో నవాబుగిరిలో యితనిని ఇంగ్లీషువారు మరింత వేధించసాగిరని పైనచెప్పియే యుంటిమి. తనకు గలుగుచున్న కష్టనష్టముల నన్నిటిని మనవిచేసుకొనుచు ఒకపెద్ద అర్జీని అతడు 1764 సం॥ సెప్టెంబరు14-వ తేదీన కలకత్తా బోర్డువారికి దాఖలుచేసుకొనెను. వానిలో పదమూడు హెడ్డింగుల క్రింద తన గోలయంతయు చెప్పుకొనెను. వానిని క్లుప్తముగ వివరింతుము (**Long's Selections Pp. 356—358**)

(1) ఇంగ్లీషువారు పాట్నాలో క్రొత్తగ కట్టుకొన్న పేటలలోని ఉద్యోగులు, నా సర్కారుపేటలలోని వర్తకులను బలాత్కారముగకట్టి తీసుకొని వెళ్లుచున్నారు. యిందువల్ల నాకు లక్షరూపాయలు నష్టము వచ్చుచున్నది. నాపేటలన్నీ నిర్జనమైపోయినవి.

(2) ఇంగ్లీషుగిడ్డంగుల పేరుచెప్పి వర్తకులెవరు నాకు మామూలుగ చెల్లించవలసిన శిస్తులను చెల్లించుటలేదు. నాశిస్తులు నాకు మామూలుగ చెల్లించుచుండవలసినదనిన్నీ, దేశీయవర్తకుల నెవరిని మీ యింగ్లీషువారు వెనుకవేసుకొని రావద్దనిన్నీ మీరు దయచేసి ఖండితమగు ఉత్తరువులు పంపించండి.

(3) చాలచోట్ల యింగ్లీషుగుమాస్తాలు గిడ్డంగులపేరుతో భూములకు కౌళ్లు తీసికొని, రైతులకు మద్దతుచేయుచు, వారిచేత నాకు చెల్లవలసిన శిస్తుల నెగవేయించుచున్నారు.

(4) కంపెనీ తాలూకు రూపాయలు నెల 1-కి రు. 10,000 చొప్పున నా టంకసాలలో అచ్చువేయునట్లును, అందుక్రింద నాకు నూటికి 2½ చొప్పున మాత్రమే రుసుము యిచ్చునట్లును నిరుడు మనము యేర్పాటు చేసుకొన్నాము. (ఈ రెండుంబావలా రేటు మామూలుగ యితరులవద్ద పుచ్చుకొను రేటుకంటె చాల తక్కువ) కాని, కంపెనీకని యిచ్చిన యీ తక్కువ రేటును అవకాశముగ తీసుకొని కంపెనీ గుమాస్తాలును, నౌకర్లునుకూడ పెద్దపెద్ద మొత్తములను నా టంకసాలలో యీ రేటుకే అచ్చువేయించుకొని పోవుచున్నారు. ఇందువల్ల నాకు చాల నష్టము వచ్చుచున్నది.

(5) కాశింబజారు గిడ్డంగిలోని మీ ఇంగ్లీషు గుమాస్తాలు కొన్ని గ్రామములను బలాత్కారముగ ఆక్రమించుకొని, నాకొక గవ్వయైనను శిస్తు చెల్లించుట లేదు.

(6) పొగాకు మున్నగు సరకులను మీ గుమాస్తాలు మా రైతులపై బలాత్కారముగ వేసికట్టి, డబ్బులాగుచున్నారు. ఇందువల్ల దేశం బీడైపోయినది. నా సర్కారుకు చాలనష్టము వచ్చుచున్నది.

(7) మీ తాలూకుజనం కొందరు మా పాట్నా, మాంఘీరుకోటలలోచేరి చాల అల్లరిచేయుచున్నారు. మీరు వారిని వెనుకకు పిలిపించుకొని మావారిని మామూలుగ అక్కడ నుండనివ్వవలసినది.

(8) ఇంగ్లీషువారు చాలచోట్ల ధాన్యమువగైరా సరకులనుకొనివేసి, నాసేనకు ధాన్యాదులు కొని పంపకుండ మా ఉద్యోగులకు మీవారు చాల కష్టము కలిగించుచున్నారు.

(9) ఎవరైనా పెద్దమనుష్యులువస్తే మకాముచేయుటకుగాను కట్టించిన బంగాళాల నన్నిటి ఇంగ్లీషువారువచ్చి ఆక్రమించుకొని కదలుటలేదు. నేనుగాని, మా కుటుంబీకులుగాని, ఎవరైనా ఎక్కడికైనా పోయినప్పుడు మాకచ్చట ఉండడానికి బంగాళాలు లేవు.

(10) పూర్ణియాజిల్లాలోని అడవివల్ల నాకు సాలుకు 50 వేల రూపాయల ఆదావచ్చెడిది. కాని, ఇంగ్లీషువారిప్పుడు దీనిని ఆక్రమించుకొని, నాకొక గవ్వయైనను యిచ్చుటలేదు.

(11) నా నౌకర్లు తప్పుచేసివచ్చి మీదగ్గిర దాగినప్పుడు, మీరు వారిని వెనుకవేసుకొని రాకూడదు.

(12) మీరు మీ గిడ్డంగులనుండి పంపు శిపాయిలు ఊళ్లమీదపడి రైతులను హింసించి, వారిని తరిమివేసి, ఊళ్లనన్నిటిని పాడుబెట్టిరి. ఇందువల్ల నా రివిన్యూ అంతా చెడిపోయినది.

(13) ఈ దేశములో బీదప్రజలు అనాదినుండి ఉప్పు, వక్కలు, పొగాకు అమ్ముకొని బ్రతుకుచుండిరి. కాని, యిప్పుడు ఇంగ్లీషువారువచ్చి యీ వ్యాపారమును పడగొట్టి, వారినోట మట్టిగొట్టిరి. ఇందువల్ల కంపెనీకివచ్చు లాభమేమియు కనప్పట్టదు. పైగా, నారాబడికి నష్టమగుచున్నది.

ఈ నేరములు చాల తీవ్రమైనవి. అయినప్పటికి కంపెనీవారీ ముసలివాని అర్జీని బుట్టదాఖలు చేసిరి.

మీర్జాఫరు యింత నైచ్యమునకు పాల్పడినను, చివరకు ఇతనికి దక్కిన దేమియు లేదు. నబాబనుపేరు కొంతకాలము తన కుటుంబములో వుండుట తప్ప యితను బావుకొన్న దేమియులేదు.

కంపెనీ గుమాస్తాల ప్రయివేటు వర్తకము.

తమ గుమాస్తాలు దేశాంతర్భాగములో చేసుకొనుచున్న ప్రయివేటు వర్తకమువల్ల కంపెనీకి వచ్చులాభముగాని, నష్టముగాని, లేదు. కాబట్టి, కంపినీడైరెక్టర్లిందు విషయమై తీవ్రముగ ఖండించి, పెద్ద మనుష్యులవలె గన్పట్టిరి. దీనివల్ల చాల అనర్థములు గలుగుచున్నవనియు, ప్రజలు హింసలపాలగు చున్నారనియు, నబాబుతో తగాదాలు వచ్చుచున్నవనియు, తమ నౌకర్ల నైతికప్రవర్తననిది భంగపుచ్చుచున్నదనియు, దీనివల్ల అసలుకంపెనీకే మోసము రావచ్చుననియు, డైరెక్టర్లు యిందలి అనర్థములను యేకరువుపెట్టుచు యీ ప్రయివేటు వర్తకమును తక్షణమే ఆపించి వేయవలెనని కలకత్తాకు కఠినమైన ఉత్తర్వుల పంపిరి. ఈ ప్రయివేటువర్తకములో తాము జోక్యము కలిగించుకొనమని గుమాస్తాలందరిచేత కరారు నామాలు వ్రాయించి పుచ్చుకొనవలసినదనియు హుకుము చేసిరి. ఇందుకు అంగీకరించక యెదురుతిరిగినవారిని, ఎదిరించి ప్రయివేటువర్తకము సాగించుచునే యున్నవారిని తక్షణమే డిస్‌మిస్ చేయవలసినదనియు, మరీ పెంకెవారిని వెంటనే ఓడ ఎక్కించి యింటికి (యింగ్లండుకు) పంపివేయ వలసినదనియు కఠినముగ హుకుముల జారీ చేసిరి.

ఈ హుకుములు ఇక్కడ ఇండియాలో యెంతవరకు అమలు జరుపబడినవో ముందుముందు చెప్పెదము.

మీర్కాసీము అయోధ్య వజీరు శరణుజొచ్చుట.

ఇక కథాభాగమునకువత్తము. మీర్కాసీము యుద్ధరంగమందు ఓడిపోయి దేశమునువిడిచి అయోధ్య రాష్ట్రములో ప్రవేశించెనని చెప్పియుంటిమి. ఇతడు అయోధ్య నబాబగుషుజాఉద్దౌలా వద్దచేరి అతనిని ఇంగ్లీషువారిమీదికి పురిగొలుపసాగెను. బెంగాలుమీదికి దండెత్తి, ఇంగ్లీషువారి నక్కడనుండి తరిమివేయవలసినదిగ మీర్కాసీము అతనిని ప్రోత్సహించుచుండెను.

అయోధ్య నబాబగు షుజాఉద్దౌలా మొగల్ సామ్రాజ్యమునకంతకు వజీరు—అనగ మంత్రి. చక్రవర్తి "షాఅలం" అప్పటి కింకను ఢిల్లీ వెళ్లలేదు. అలహాబాదులో మకాముచేసియుండెను. అనగ, అతడు షుజా ఆధీనములో నుండెనన్నమాట. ఇట్టిస్థితిలో అయోధ్యపాలకుడే హిందూస్థానమున కంతకు చక్రవర్తియన్నమాట. ఈ కారణముచేతనే మీర్కాసీము అయోధ్యనబాబుతో రాయబారములునడిపి, అతడు తనపక్షముననుండి బెంగాల్, బీహార్, ఒరిస్సా,

రాష్ట్రములకు తననుతిరిగి నబాబుచేసెదనని కోరాన్ మీద ప్రమాణము చేసిన తరువాతనే మీర్కాసీముఅతనిరాష్ట్రములో అడుగుపెట్టెను.

షుజాకును, అతని జనానాబంధువులకును మీర్కాసీము అనేక బహుమతుల జేసెను. షుజా తల్లిని "అమ్మా" యని పిలుచుచుండెను. అనగ షుజాను తన సోదరుడుగ ఎంచుకొనెను.

బుందేల్ ఖండ్ రాజా మొగల్ చక్రవర్తికి సరిగ కప్పముకట్టక తిప్పలు పెట్టుచుండెను. చక్రవర్తి చిక్కులలో వున్నాడని కనిపెట్టి, తనస్వతంత్రమును స్థిర పరుచుకొనుట కిదే సమయమని బుందేల్ఖండ్ రాజా తలచెను. ఈతనిపైకి కొంత దండును పంపుటకే చక్రవర్తి అప్పుడు అలహాబాదులో మకాము చేసియుండెను. ఈదండు బంపుటలో కొంతఆలస్యమైనది. బుందేల్ఖండము మీదికి దండుపంపితే యేమౌతుందో యని అయోధ్య వజీరు కొంచెము జంకుచుండెను. అందుచేతనే, యీ ఆలస్యమైనది. ఇంక ఆలస్యముచేసినచో మోసమువచ్చునననియు, ఇంగ్లీషువారు స్థిరముగ పాదుకొనిపోదురనియు మీర్కాసీము తొందరజేసెను. బుందేల్ఖండ్ వ్యవహారము పరిష్కరించుకొని, శాంతినెలకొలుపనిది బెంగాలుకు బయలుదేరుటకు వీలులేదని వజీరు సమాధానముచెప్పెను. ఆలస్యమున కిదియే కారణమయ్యెయెడల, ఆపని నాకు అప్పగించండి, అదెంతపని—బుందేల్ఖండ్ నాయకుని ఒకక్షణములో లొంగదీసుకువస్తానని మీర్కాసీమనెను. (Vol. II. P. 523, క్లుప్తము).

ఇందుకు వజీరు అంగీకరించెను. మీర్కాసీము, తర్ఫీయతైయున్న తనసేనలను వెంటబెట్టుకొనివెళ్లి, బుందేల్ఖండ్ నాయకుని ఒక్కదెబ్బలో ఓడగొట్టెను. ఆత డంతట లొంగిపోయి, యిదివర కెగబెట్టిన బకాయ కప్పమంతయు చెల్లించెదననెను. మీర్కాసీమంతట యీవిజయోత్సాహముతో అలహాబాదురాగా, చక్రవర్తియు వజీరునుకూడి అతనిని చాలమెచ్చుకొనిరి. అతడు కోరినప్రకారము తక్షణమే ఇంగ్లీషువారిమీదికి దండువెడలుటకు సర్వసన్నాహములు చేసుకొనిరి.

వజీర్ షుజా దండయాత్ర, ఓటమి.

మీర్కాసీము అదృష్టముచేత ఇంగ్లీషువారి శిబిరములో అప్పుడు అంతః కలహములుపుట్టెను. చాలమంది యూరోపియను ఆఫీసర్లును, సైనికులును, సిపాయిలునుకూడ కంపెనీ ఛావుటాను విడిచిపెట్టి, అయోధ్యవజీరు ఛావుటా క్రిందికి చేరుచుండిరి. కాని, శత్రుపక్షమందుపుట్టిన యీపుండును—యీ గృహచ్ఛిద్రమును—తమ కనుకూలముగ త్రిప్పుకొని పనిచేసుకొనగల సమర్థుడగు మనిషి యెవడుగాని ముసల్మాన్ పక్షమున అప్పుడు లేకుండెను. ఎవడైనను యిట్లుండిచేసినచో, క్రైస్తవ బలములు సన్నగిల్లిపోయెడివి. అట్లు జరుగకపోగా, ముసల్మాన్ పక్షముననున్న సేనలే తగు కట్టుదిట్టములోలేకుండెను. అవిసరిగ అదుపులోనుండక తలకొక విధముగ, విచ్చల విడిగ,

నడువసాగెను. యుద్ధపురోజులలోనే సేనలో ఒకరినొకరు కొట్టుకొని, తిట్టుకొని, దోచుకొని, చంపుకొనుచుండిరి. ఊళ్లలోకిపోయి దోచుకొనసాగిరి. వీనినిగూర్చి విచారించు నాథుడు లేకుండెను. వారుసరిగ బందిపోటుదొంగల గుంపువలె ప్రవర్తించిరి. అది ఒక సైన్యముగ కనిపించ లేదు, పట్టణము పట్టణమంతా నడచిపోవుచున్నట్లుండెను. (Seir P. 526, క్లుప్తము).

ముసల్మాన్ సేనలో యింకొక గొప్పలోపమేమనగ, వారివెంట అనవసరమగు సామానువుండెను. ఇదివట్టిబరువులచేటు. అవసరమగు సామాగ్రియేకాక, అనవసరమగు భోగపదార్థములను, జనమునుకూడ దేశీయసైన్యములు తమవెంట తరుచు గొనిపోవుచుండెను. ఈ సైన్యములు తరుచు ఓడిపోవుచుండుటకు యిదికూడ ఒక కారణము.

ఈ యుద్ధము మీర్కాసీమును తిరిగి బంగాళాతక్తుపై నెక్కించు సంకల్పముతో ప్రారంభింపబడినది. షుజాఉద్దౌలా కలకత్తా కంపెనీవారికిట్లు వ్రాసెను :—

"పూర్వపు హిందూస్థానపు ప్రభువులు మీ ఇంగ్లీషు కంపెనీకి సుంకములు లేకుండచేసి, అనేక గిడ్డంగులను, కోటలను యేర్పరుచుకొనుటకు అనుజ్ఞనిచ్చి, మీకనేకవిధముల సహాయము చేసియున్నారు. ఇంతటి దయను, మర్యాదను, యే యితర యూరోపియనుల యెడగాని, దేశీయ వర్తకుల యెడగాని, వారు చూపియుండలేదు. అదిగాక యిటీవలనే, మొగలాయిపాదుషావారు క్రమముగ యివ్వతగినవానికంటె, యెక్కువ బిరుదములను, స్థానములను మీకెంతో దాక్షిణ్యముతో యిచ్చియున్నారు. జాగీరులు మున్నగువాని నొసంగియున్నారు. ఎన్నో మెహర్బానీలు మీకు చేసియున్నారు. వారు మీయెడ యింతటి మెహర్బానీలు చూపినప్పటికి, మీరు వారి రాజ్యవ్యవహారములలో అక్రమముగ జోక్యము గలిగించుకొనుచున్నారు. బర్ద్వాన్, చిటగాంగు, వగైరా జిల్లాలు మీరు అక్రమముగ ఆక్రమించుకొన్నారు. పాదుషావారి అనుమతిలేకుండ మీ యిష్టప్రకారముగ నబాబును తరుమగొట్టినారు. పాదుషావారి దర్బారుపై ఆధారపడియున్నవారిని మీరు అక్రమముగ చెరసాలలో బంధించియుంచినారు. రాజాధిరాజగు పాదుషావారి రాజ్యమునకు అమర్యాదను అగౌరవమును తెచ్చినారు. దేశీయ వర్తకుల వర్తకమును మీరు నాశనము చేసినారు. (తప్పులుచేసి పారివచ్చిన) పాదుషావారి నౌకర్లను మీరు దాచియుంచినారు. పాదుషావారికి చెల్లవలసిన శిస్తులు చెల్లకుండ మీరు వారికి నష్టము గలిగించినారు. మీరనేక ర్జన్యములను చేసి ప్రజలను పీడించినారు. కలకత్తానుండి మాటిమాటికి చక్రవర్తిగారి రాజ్యములోనికి దండులను బంపుచున్నారు. అలహాబాదు రాష్ట్రములో అనేక పరగణాలను గ్రామములను మీరు దోచుకున్నారు. ఈ అల్లరి అంతా యేమిటి? కేవలము పాదుషా వారిని ధిఃకరించి, దేశమునంతా మీరే కాజేయు

వలెనను దురుద్దేశముతో చేయుచున్న పనులు కావాయివి? ఇట్లాచెయ్యమని మీ రాజుగారేమైనా చెప్పినారా? లేక మీ కంపెనీ యజమానులేమైనా చెప్పినారా? అటువంటి సందర్భము లేమైనవుంటే, అందునుగురించిన తప్సీళ్లు మాకు తెలుపండి. అప్పుడు మేము తగినరీతిగ చర్యతీసుకుంటాము. అట్లుగాక, యీచేష్టలన్నీ మీ కుచ్ఛితపు తలంపుల వల్లనే జరుగుచున్నయెడల, యికముందిట్టి అక్రమపు పనులు చేయకండి. రాజ్య వ్యవహారాలలో మీరు జోక్యము కలిగించుకోకండి. దేశములో అక్కడక్కడవున్న మీజనమునందరిని పిలిపించుకొని మీ దేశానికి పంపివెయ్యండి. మీవర్తకమును పూర్వమువలె...చేసుకుంటూ ఉండండి. ఇంకొక జోలికిపోకండి. అట్లయినచో, పాదుషావారు పూర్వముకంటె హెచ్చుగ మీవ్యాపారానికి సహాయం చేస్తారు. ఇంక అనేకమెహర్బానీలు చేస్తారు. మీరిక్కడికొక తగు మనుష్యుని—వకీలుగ పంపుకొని, మీవ్యవహారాలన్నీ చెప్పుకోండి. నేనందుకు తగువిధముగ యేర్పాట్లు చేస్తాను. మీరు పొగరుబోతుతనముగ, అవిధేయతగ ప్రవర్తించారంటే మాత్రము, యీ అల్లరి పెట్టేవాళ్ల తలలు న్యాయ ఖడ్గమునకు బలికాగలవు. పాదుషావారి ఆగ్రహమును మీరు చవిచూడగలరు. ఇది కాలరుద్రుని ఆగ్రహము వంటిది. (ఇట్టి అవాంతరము జరుగకుండ అల్లా నివారించుగాక) తరువాత పస్తాయించి లాభములేదు. తరువాత మీరెంత మొత్తుకొన్నను లాభముండదు. మీకంపెనీ మొదటినుండియు పాదుషావారి దయాదాక్షిణ్యములవల్ల పెంపొందినది. కాబట్టి, నేను మీకింతదూరము వ్రాసినాను. మీరిక ఉచితమని తోచినరీతిగ చెయ్యండి. మీ ప్రత్యుత్తరమును వెంటనే పంపండి.''

మొగలాయి సామ్రాజ్యమునకు ప్రధానామాత్యుడుగ యావజీరు వ్రాసిన పైయుత్తరపు ధోరణి యెంతయు ఒప్పియున్నది. న్యాయము, చట్టము సహా, చక్రవర్తిపక్షమందు లేదని యెవరనగలరు? చక్రవర్తి యధికారమును తాము కాజేయవలెనని కంపెనీవారు చూచుచున్నమాట వాస్తవము. కాబట్టి, వారికింత గట్టిగ చెప్పవలసివచ్చినది.

చక్రవర్తియు, వజీరును, మీర్కాసీమును యేకమై బీహారు రాష్ట్రము మీదికి దండెత్తి వచ్చునప్పటికల్లా ఇంగ్లీషువారికి గాభరాపుట్టెను.

మొన్నటి వానకాలములో వారు చేసియుండిన యుద్ధమువల్ల ఇంగ్లీషువారు చాల అలసియుండిరి. వారి సేనలును తరిగిపోయెను. అయోధ్య వజీరుయొక్క బల సామర్థ్యములను గూర్చి వారు లోగడవినియున్న వారగుటచే, తామతనిని యెదిరించ లేమను భయము ఇంగ్లీషువారికి పుట్టెను. వారంతట తమబలమును వెనుకకు నడిపించుకొని, పాట్నా కోటలోవచ్చి దాగిరి. (Seir గ్రంథము, Vol. II-P. 528 క్లుప్తము.)

ముసల్మాన్ సేనలు భంగపడుటకు గల కారణములను యీ Seir గ్రంథ కారుడు వివరించెను. సైనికుల అవినయ ప్రవర్తనయే యిందుకు కారణము.

చక్రవర్తి, మంత్రి, మీర్కాసీము, ముగ్గురును సేనలను నడిపించుకొని అమితోత్సాహముతో బీహారు రాష్ట్రమున ప్రవేశించిరి. ఈ సంగతి తెలియగనే ప్రజల హృదయములు సంతోషానందములతో ఉప్పొంగెను. కాని, సిపాయిలు దోవపొడుగునను 5, 6 కోసులమేర నలుముఖముల సర్వమును తగులబెట్టుచు, దోచుకొనుచు, వచ్చిరి. ఇందుచే ఆప్రాంతములు నిర్జనమైపోయెను. ఇదిచూచి వారి మనస్సులు విరిగి, ఇంగ్లీషు వారి వైపుకు తిరిగెను. యింగ్లీషువారు జయము పొందుదురు గాకయని వారప్పుడు దేవుని ప్రార్థింపసాగిరి.........(Seir Vol. II P. 525-క్లుప్తము.)

మీర్కాసీము దేశమునుండి తరిమివేయబడిన కొద్దిరోజులకే మేజర్ ఆడమ్స్ చనిపోయెను. ఆస్థానమున యిప్పుడు మేజర్ కార్నక్ తిరిగి ఇంగ్లీషు సేనలకు అధిపతియయ్యెను. ఇతడు మీర్కాసీముకు బద్ధవైరియని వెనుకటి యధ్యాయములో చెప్పియేయుంటిమి. మీర్కాసీము నెట్లయిన దుంపనాశనము చేయవలెనని యితడు పట్టుబట్టియుండవచ్చును. ఇందుకుగాను అతడు ముసల్మాను సేనాపతులలో విభేదముల కల్పింప సమకట్టెను. వారితోచేరి కుట్రలపన్నెను. Seir గ్రంథకారుడే యిందుకు తార్పుకాడయ్యెనని చెప్పవచ్చును. ఇతనిద్వారానే ఇంగ్లీషువారు కుట్రలసాగించిరి. ఇందునుగూర్చి యితడే (సిగ్గులేక) యిట్లుచెప్పుకొనుచున్నాడు :—

"నాకుచాలకాలమునుండి ఇంగ్లీషువారియందు మనసుండెను. వారితో చేరవలెనని నేను ఆఖరుకు నిశ్చయించుకొన్నాను. వారితో నాకు కొన్ని సంబంధములు కూడ ఉండెను.........అతనికి నాకు కొన్నిఉత్తరప్రత్యుత్తరములుకూడ జరిగెను చక్రవర్తి నిజానికి తనమనస్సులో ఇంగ్లీషువారి పక్షముననే యుండెననుమాటను ఆతడు నాకీ ఉత్తరములలోనే వెలిబుచ్చెను. "చక్రవర్తిని ఇంగ్లీషువారి పక్షమున చేర్చి, నీపనికూడ బాగుచేసుకో" అని అతడు నాకు సలహాచెప్పెను. ఈసంగతినే నేను మాతండ్రిగారితోచెప్పితిని. ఈ వ్యవహారములో నాయకత్వమువహించి, పని చేసి, మనకుటుంబమునకు లాభముచేసుకొని, ఇంగ్లీషు జాతికృతజ్ఞతను సంపాదించుకొనుట మంచిదని నేను మానాయనగారికి చెప్పితిని. నేను మరియు యిట్లంటిని :— ముసల్మాన్ సేనలు ఆరీతిగ అవినయముగ ఉన్నంతవరకు, వజీరుకు తనతోడివారితో పొత్తుకలియనంతవరకు, మంచిమాటల నతడు పాటింపనంతవరకు, ఆవజీరు ఇంగ్లీషు వారికి వ్యతిరేకముగ యేమియు చేయలేడు. కాబట్టి, చక్రవర్తియందింత అభిమానముతోనున్న ఆ ఇంగ్లీషువారి పక్షమునచేరుటయే మనకు మంచిలాభమగును. ఇదిమనకు మంచివాటముగ నుండును. తమకు చక్రవర్తియందుగల అభిమానమును గూర్చి ఇంగ్లీషువారు నాకెన్నోసార్లు యెంతోఘనముగ వ్రాసినారు. దీనినిబట్టి

చూడగ మనపాదుషావారు, యింగ్లీషురాజుకు వారుకోరిన ప్రకారం ఉత్తరంవ్రాస్తే యెంతోబాగుంటుందనితోస్తుంది.'' (Seir Vol. II. P. 536.)

ఇంగ్లీషువారీరీతిగ కుట్రజేసి పాదుషాను ప్రత్యేకముగ విడదీసి తమవలలో వేసుకొనిరి. మిగతా ముసల్మాను సేనాపతులనుకూడ తిరుగదీసియుందురు. ఇట్టి స్థితిలో వజీరు (షుజాఉద్దౌలా) యేకాకియై ఇంగ్లీషువారి చేతుల్లో * ఓడిపోయె నన్నచో ఆశ్చర్యమేమి ?

తదుపరి యుద్ధకథనము నిట క్లుప్తముగ వివరింపవచ్చును. తనను శరణు జొచ్చినమీర్కాసీముయొక్క అదృష్టరేఖ తొలగిపోవునట్లు కనబడగానే, అయోధ్య వజీరు తాను అతనికిచేసిన వాగ్దానమును మరచిపోయెను.

అంతేగాదు, మీర్కాసీమును ఖైదుకూడ చేయించెనట! ఎంత మిత్ర ద్రోహము? షుజాఉద్దౌలాను చంపివేయుటకు మీర్కాసీమునకెన్నియో అవకాశము లిదివరలో చిక్కియుండెను. కాని ఆతడట్టి దురంతకార్యమును చేయలేదు. (Seir Vol. II P. 538)

Seir గ్రంథమును తర్జుమాచేసిన "రేమండు" అను పరాసుగ్రంథకర్త యిట్లు వ్రాయుచున్నాడు. ఇతడు మహమ్మదీయ మతమును స్వీకరించెను.

"మీర్కాసీము కాశీలో మకాంచేసి యుండెను. షుజాఉద్దౌలా వేటతోఅలసి స్నానముచేయుటకు గంగలో దిగెను. పిమ్మట ఆవలిఒడ్డుననున్న మీర్కాసీమును చూడవలెనని షుజా ఉద్దౌలా పడవయెక్కి 12 మంది పరివారముతో

---

* మీర్కాసీము, వజీరు, చక్రవర్తి—యీముగ్గురి తాలూకుసేన ఓడిపోవుటకు కొంతవరకు మహారాజా కల్యాణసింగ్ అనునతని స్వామిద్రోహమేకారణము. ఈ కల్యాణసింగ్ రాజా సితాబ్ రాయి కొడుకు. ఇతడు వజీరు కొలువులో నౌకరుగనుండి, తనయజమాని తాలూకు రహస్యముల నన్నిటిని—యెంతసేన ఉన్నది, ఎక్కడెక్కడ తిరుగుచున్నది, ఏయే యెత్తులువేయుచున్నది— యీాగుట్టులన్నిటిని—యింగ్లీషువారికి తెలిపెను. ఆతడే సిగ్గులేక యిట్లుచెప్పుచున్నాడు :—

"ఇచ్చోటనుండి (ఫుల్వారినుండి) కలహములు ప్రారంభమయ్యెను. ఉభయ సేనాముఖ ములకు కొన్ని చిల్లర తగాదాలు ముందుగజరిగెను......మహారాజా సితబ్రాయి గుమాస్తా రాయి సాధూరామ్ అనునతడు అప్పుడు పాట్నాలోనుండెను. ఆతడు నన్నుచూచుటకు ఫుల్వారీ వచ్చెను.........నేనిక్కడ నున్నాననియు. తమపక్షముననే పనిచేయుచున్నాననియు, వ్యవహార మంత తమ పక్షమున గిరున త్రిప్పుటకు అదనువేచియున్నాననియు నీవు యింగ్లీషు ఉద్యోగులతోను మీర్జాఫరుతోను చెప్పుము, అని అతనితో కబురుపంపితిని. ఈవర్తమానము సాధురామ్ యింగ్లీషు వారికి చేరవేసి, యిందుకువారు చాలసంతోషించిరనియు, నాసహాయముపైనను, నామాటపైనను, వారునమ్మియున్నారనియు అతడు నాకు మరల కబురుతెచ్చెను.'' (J. R. and O. R. S. VI. Pp. 148—149).

మాత్రము నదినిదాటి మీర్కాసీముపై పుకు వచ్చుచుండెను. "ఇదే మంచి సమయము — యితనిని యిప్పుడు చంపివేస్తే పోతుంది. ఇతనిసేనంతా మనవశమౌతుంది" అని మీర్కాసీముకు తన దగ్గరనున్నవారు సలహాచెప్పిరి. కాని యిందుకు మీర్కాసీము సమ్మతింపలేదు. 'నేను దొంగను కాను, ద్రోహినిగాను, హంతకుడనుగాను, అతని యిష్టమువచ్చినట్లు, ఒంటరిగ రానియ్యండి. అతనికేమి భయములేదు. అతనికేమి ద్రోహము జరగదు' అని మీర్కాసీము జవాబు చెప్పెను" (Seir P. 549 foot-note 291. క్లుప్తము.)

ఇట్టి సందర్భములో వజీరు యిట్టి మిత్రుని విసర్జించుట, బంధించుట కేవలము నీచము, పిరికితనము. మహమ్మదీయ సేనలో అంతఃకలహము లుండుటచేత, వారిని తిరుగదీయుట ఇంగ్లీషువారికి బహు సులభమయ్యెను. *ఈ యుపాయముచేతనే వారు అనాయాసముగ, అచిరకాలములో రోటస్ ఖిల్లాను స్వాధీన పరుచుకొనిరి.

Seir 'గ్రంథకర్తయగు' సయ్యద్ గులామ్ హుస్సేన్‌ఖాన్ ఇంగ్లీషువారిలో దూరి, యీకోటను వారికి ద్రోహబుద్ధితో స్వాధీనపరచెను. ఇందునుగూర్చి ఆతడే సిగ్గులేక యిట్లు చెప్పుకొనుచున్నాడు:—"మేజర్ మన్రో అజీమాబాదు (పాట్నా)

---

* ఇందుకు ఒక ఉదాహరణ:—వజీరుసేనలో నొక సేనాపతిగనున్న జీన్-ఉల్-అబుద్దీన్ అనునతడు ఇంగ్లీషు సేనానియగు మేజర్ మన్రోకు యీ దిగువరీతిగ ఉత్తరము వ్రాసెను. ఇది యింగ్లీషుసేనానికి కలకత్తాలో 1764 సం॥ సెప్టంబరు 22-వ తేదీన అందినది:—

"మీరు ఉస్సద్ ఖాన్ బహద్దూరుద్వారా పంపిన స్నేహపూర్వకమగు ఉత్తరము నాకు చేరినది. సాధ్యమైనంతమంది ధృడకాయులతోడను మంచి అశ్వారూఢులతోను—మొగలులు, తురేనియనులు వగైరాలతోను—నేను వచ్చి మీతో కలియవలసినదిగ మీరదంరు నన్ను కోరియుంటిరి.

అయ్యా, తాము సేవించుచున్న స్వామినివిడిచి శత్రుపక్షమున చేరుట మానవమాత్రులందరికి అందు ముఖ్యముగ నాబోటి సంపన్న గృహస్థులకు - చాల అగౌరవమైన పనియైనను, యీ సందర్భములో మేమిట్లు చేయుట తప్పుకాదని చెప్పుటకు అనేక కారణములున్నవి. ఇందుకొక నిదర్శనము చెప్పెదను. షుజాఉద్దౌలా తాను కొరాన్‌పై చేసిన ప్రమాణమును త్రోసిపుచ్చి నబాబ్ మహమ్మద్ కులీఖానును చంపించెను. ఇది ఒక సంగతి.

"ఇక రెండవసంగతి యేమనగ :—సయ్యద్ కులస్థుడును, మామత ప్రవక్తవంశీకుడును నగు నబాబు కాశీం అలీఖానునెడ యీ వజీరుచేసిన కృత్యములు చాల సిగ్గుమాలినవిగ నున్నవి. ................."

ఇట్టి పీడాకరునికి తోడ్పడుట న్యాయమునకుగాని, కొరానుకుగాని, వేయేల యే మతధర్మములకుగాని, అనుకూలము కాదు. ఇట్టివాని కొలువును వదలుకొన్నందువల్ల నాకు అల్లాయెదుటగాని, లోకము యెదుటగాని, యెట్టి అపకీర్తియు రాదు."—(Long's Selections—Pp. 358—359)

వచ్చి, నాకు డాక్టర్ ఫుల్లర్‌టన్ ద్వారా యిట్లు కబురు పంపించెను. 'రోటస్ కోటను మా ఇంగ్లీషువారికి స్వాధీనపరిచే యెడల, నేనుమీకెల్లప్పుడు కృతజ్ఞుడనై యుందుననియు, మా మైత్రికి మీరెల్లప్పుడు పాత్రులగుదురనియు' ఆతడు నాకు కబురు పంపించెను. అంతట నేను, సదరుకోటకు యజమానిగ నుంచబడిన రాజా 'సాహుమల్' తో యిట్లు మాట్లాడితిని-ఇతడు మా కుటుంబమువల్ల లోగడ చాల ఉపకారములు బొందియుండెను.........ఇక కొద్దిలో ఇంగ్లీషువారెట్లును జయించక మానరు. కొద్దిలో వారు వజీరును, అతని ముఠావారిని, యెట్లో ఓడించి నాశనం చేయక మానరు. కాబట్టి, ఉభయ పక్షములనున్న స్థితిగతుల్లను-అనగ యిటు ఇంగ్లీషువారు-అటు వజీరు-వున్న స్థితిగతులను బాగా ఆలోచించుకొని, వ్యవహారము మించిపోక పూర్వమే నీకేది వాటంగ ఉంటుందో ఆప్రకారం చేసుకొని బాగుపడు" అని నేను అతనికి సలహా చెప్పితిని.........Seir గ్రంథము Pp. 553-554 క్లుప్తము.)

కపటియగు యీముసల్మాన్ స్వామిద్రోహి తంత్రములో పాపమాఖిల్లాదారుడు బోల్తాపడెను. కొన్ని పద్ధతుల ప్రకారమైతే తా నా కోటను ఇంగ్లీషువారి పరము చేసెదననెను. ఆ పద్ధతులకు ఇంగ్లీషువారు సమ్మతింపగ, అతడాకోటను వారికి మొదలకుండ స్వాధీనముచేసి యూరకొనెను. కాని, పనితీరినపిదప, ఇంగ్లీషువారు తాము ఒప్పుకున్న పద్ధతుల ప్రకారము నెరవేర్చలేదు. వారిబుద్ధి ఎక్కడికిపోవును? వారు ఒప్పుకున్న షరతులలో ఒక్కటికూడ నెరవేర్చలేదని పాపమతడు యీ ముసల్మాన్ స్వామిద్రోహి గులామ్‌హుస్సేనుతో మొత్తుకొనెను. కాని ప్రయోజనమేమి?

షుజాఉద్దౌలా అంతట పాట్నా ముట్టడిని మానుకొని బక్సారుకు వచ్చివేసెను. వర్షాకాలమక్కడ గడపదలచెను. ఇంగ్లీషువారితో కొన్ని వ్యవహారములు పరిష్కరించుకొనుటకు మీర్జాఫరుకూడ కలకత్తాకు వచ్చివేసెను. ఇతడు రెండవ పర్యాయము సింహాసనమెక్కినప్పుడు తనకు నందకుమారుడు మంత్రిగ కావలెనని కోరుకొనెను. ఇందుకు ఇంగ్లీషువారు యెంతో అయిష్టముతో ఒప్పుకొనిరి.

ఇప్పుడు తమకిన్ని చిక్కులు గలుగుటకు చక్రవర్తి, వజీరు, మీర్కాసీము, యేకమై తమ మీదికి వచ్చుటకు యీ నందకుమారుని కుటిల తంత్రమే కారణమని ఇంగ్లీషువారనజొచ్చిరి. నబాబు శిబిరములో డబ్బుగాని, ధాన్యాదులుగాని లేకుండెను. ఇందుకుకూడ నందకుమారుడే కారకుడనిరి.

ఇతడు కుటిల స్వభావుడనియు, యెప్పటికైనను యితడు తమకొంప ముంచుననియు, యితనిని నమ్మియుండుటకు వీలులేదనియు, కాబట్టి, యితని నీదివాన్ గిరినుండి యూడబెరుకవలయుననియు కంపెనీవారు 1764 సం॥ ఏప్రిల్ 3-వ తేది మీటింగులో తీర్మానించుకొనిరి.

నందకుమారుడు కుశాగ్ర బుద్ధిగలవాడై, ఇంగ్లీషువారు మీర్జాఫరుయెడ రహస్యముగ గావించుచున్న కుట్రలనన్నిటిని కనిపెట్టి తన యజమానికెట్టి ముప్పు రాకుండ ఆతడు అప్రమత్తతతో ప్రవర్తించుచుండుటవల్ల ఇంగ్లీషువారికి చాల కంటకముగనుండెను. ఇతడనిన వారికి ఒడలు మండుచుండెను. ఇతనిమీద వారికి కంఠమువరకు ద్వేషముండెను.

[తనతరువాత గవర్నర్‌గ వచ్చువారు యీ నందకుమారుని మాయలో పడకుండ, హెచ్చరిక గలిగియుండుటకుగాను, కంపెనీ గవర్నరగు వాన్‌సిటార్టు తాను ఉద్యోగమును చాలించుకొని యింటికి వెళ్లకముందు, యీ నందకుమారుని గురించి ఒక పుస్తకము తయారుచేసి, దానిని చక్కగ బైండుచేసి, కావలసివచ్చినప్పుడల్లా చూచుకొనుచుండుటకు వీలుగా దానిని తయారు చేసిపెట్టిపోయెనని Seir గ్రంథకర్త వ్రాయుచున్నాడు—Vol. II P. 557 క్లుప్తము.]

మీర్జాఫర్ నందకుమారుని పలుకుబడిలో గాక, 'రాయ్‌దులాబ్' అను యింకొకని పలుకుబడికి లోబడి యుండినట్లు యుద్ధరంగమందు మీర్జాఫరు వెంట నున్న ఆంగ్లసేనాని మేజర్ కార్నకే చెప్పుచున్నాడు.* కాబట్టి, నందకుమారునిపై అనుమానపడుట కేవలము నిరాధారము.

మీర్జాఫరు తన నబాబుగిరిని ఢిల్లీ పాదుషా ఫర్మానావల్ల ధ్రువపరుచుకొనవలెనని కోరుటన్యాయమేగద. తమకు యీ పాదుషాయే సరియగు అధికారి యని ముసల్మానుల కెల్లరకు వారి మతము, విద్య కూడ బోధించుచున్నవిగదా యని మేజర్ కార్నక్ 1764 సం॥ జూన్ 5-వ తేదీన కలకత్తావారికి వ్రాసెను. (Third Reprint P. 378.)

కాని, మీర్జాఫరు చేసిన యీ ప్రయత్నము ఇంగ్లీషువారికి కోపకారణమయ్యెను. వారతనిని తమ చేతులలోనే వుంచుకొని, తమ స్వలాభముకోసమే, తమ యిచ్చవచ్చినట్లు ఆడింప జూచుచుండిరి. మీర్జాఫరును నిలువునదోచుకొని, ఆతని రక్తమునంతను ఓడ్చుకొనవలెనని వారిసంకల్పము. అందుచే, వారతనిని తక్షణమే కలకత్తాకు రమ్మనిరి. మీర్జాఫరు విధిలేక వారియాజ్ఞకు బద్ధుడై కలకత్తాకు పయనమయ్యెను.

* 1764 సం॥ మే 16-వ తేదీన మేజర్ కార్నక్ కలకత్తా అధికారుల కిట్లు వ్రాసెను. ఈ ఉత్తరము 24-వ తేదీ మీటింగులో చదువబడెను. "ఇతర విషయములలో ఆతడెట్లున్నను, ఇటీవల ప్రవర్తననుబట్టి చూడగ నందకుమారుడెట్టి ద్రోహకార్యములలో గాని ప్రవేశించలేదని స్పష్టము కాగలదు. శత్రువు కంటబడినప్పటినుంచి యితడు నామాట చొప్పునను, మీర్జాఫరు మాట చొప్పనను, నాకు దగ్గరలోనే యుండెను. అతడు సదా నాకండ్లయెదుటనే యుండుటచేత ఆతడెట్టి కుట్రపనుల గాని ప్రవేశింపలేదని దృఢముగ చెప్పుట కిదియొక్క సాక్ష్యము. పైగా, అట్టి కుట్రలవల్ల యితనికి ప్రత్యేకముగ రాబోయే లాభమున్నలేదు."

మేజర్ కార్నక్ ప్రవర్తనకూడ ఇంగ్లీషువారికి నచ్చలేదు. ఇతనిని వెంటనే తొలగించి, యితనిస్థానమున బొంబాయినుండి మేజర్ మన్రో అనువానిని సేనాపతిగ తీసుకొనివచ్చి నియమించిరి. ఇతడు జూన్ నెలాఖరుకు కలకత్తాకువచ్చి అక్కడనుండి తక్షణమే పాట్నాకువెళ్లి సేనాధి పత్యము వహించెను. ఇతడు వచ్చినదే తడవుగ ఒక రాక్షసకృత్యముచేసెను. తిరుగుబాటు చేసినారన్న నల్ల శిపాయిల నందరిని ఫిరంగి మూతులకు కట్టించి, ఎగురగొట్టించి వేసెను! వారు చెప్పుకొను గోడవలను విననైనలేదు. ఒక విచారణలేదు—గిచారణలేదు-నల్లశిపాయిలు కడుపు కక్కుఱితికి ఇంగ్లీషు సేనలో చేరిరి. వారికి దేశాభిమానము లేనికారణము చేతనే కూడ వారిట్లుచేరి, ఆంగ్ల రాజ్యభారమును మన యిండియా ప్రజల మెడలపై స్థిరముగ పెట్టిరి. వారు అతి అణకువగలిగి యెన్నిటికైనను లొంగియుండు స్వభావము గలవారు. ఇట్టివారికి యేదో నిజమైన కష్టముండినగాని సాధారణముగ తిరుగబడరు. ఊరికే తిరుగుబాటు చేయడం వారి స్వభావంలో లేదు.

ఇండియాలో తెల్ల సైనికులు తిరుగుబాటు చేసినను, లేదా యేమాత్రము తిరుగుబాటు స్వభావము గన్పరచినను వారిని ఫిరంగుల మూతులకు కట్టి ఎగురగొట్టరు. వారి కష్టములేమిటో చక్కగవిని విచారించి వానిని సాధ్యమైనంతవరకు తొలగింతురు. కాని నల్లశిపాయిల విషయములో యిట్లు చేయరు.

షుజా ఉద్దౌలామీదికిపోయి అతనితో యుద్ధము వెంటనే ముగించుకురావలసినదని కంపెనీవారు మేజర్‌కార్నక్‌కు హుకుములబంపిరి. ఆలస్యమైతే, షుజా ఉద్దౌలాకు మద్దతుగ మహారాష్ట్రులును, ఆఫ్గనులును వత్తురేమో యని ఇంగ్లీషువారు భయపడిరి. కాబట్టి, కార్నక్ వెంటనే బయలుదేరి షుజా మీదికి పోయెను. ఇరుసేనలకు బక్సారువద్ద 1764 సం॥ సెప్టంబరు 15-వ తేదీన యుద్ధము జరిగెను. ఈ యుద్ధమందు చాల నష్టములతో షుజా ఓడిపోయెను.

మీర్కాసీము పలాయనము - మరణము.

5, 6 వేలమంది చచ్చిరి. మరి పదివేలమందిపైచిలుకు బురదలో కూరుకొనియో, పారియో, పోయిరి. రెండేండ్ల అనంతరం చూస్తే బక్సారు పట్టణముచుట్టునున్న పొలములు, నదిలోని ఊబులు, గట్లు, మైళ్లపొడుగున ఎక్కడజూచినా ఎముకల మయమే. **(Seir Vol. II P. 569 foot-note).**

ఇక రేపు యుద్ధము ప్రారంభమగుననగ, షుజా మీర్కాసీమును చెరలో నుంచి విడిపించి, వదలిపెట్టివేసెను. అంతట మీర్కాసీము యేనుగునెక్కి యుద్ధరంగమునుండి యెక్కడకో వెడలిపోయి బ్రతికెను. అట్లుగాక, ఆతడు యింగ్లీషువారి చేతులలోనే పడియున్నట్లయితే, వా రతని నెట్టి చిత్రవధల్లు పెట్టేవారో ఊహించలేము.

ఇంగ్లీషువారు పాదుషాను టోపీవేసి ఆతనిని యిదివరకే ప్రత్యేకముగ తమ పక్షమునకు విడదీసికొని యుండిరని పైన చెప్పియుంటిమి. కాబట్టి యుద్ధము కాగానే, చక్రవర్తి షుజావైపునుండి విడిచివచ్చి, ఇంగ్లీషువారున్నవైపున మకాము పెట్టి, వారికి కబురుపంపించెను. ఈ అవకాశమును ఇంగ్లీషువారు లొట్టలువేయుచు గ్రహించి, పరుగుపరుగున అతనివద్దకువచ్చి, అతనికి చేయవలసిన మర్యాదలనన్నిటిని యెంతోఘనముగచేసి, యెన్నో యిచ్చకములాడి, అతనితోకూడ పడవయెక్కి గంగ దాటిపోయి, షుజాకు రాజీమాటలకై కబురు పంపిరి. ఇంగ్లీషువారు రాజీలోకోరిన ఒకషరతు యేమనగ:—మీరాఖాసీమును, సమ్రూను, తమకు అప్పగించమని వారు షుజాను కోరిరి.

కాని, సమ్రూవద్ద బలిష్టమగు సేనయుండుటచే అతనిని పట్టుకొనుట సులభ సాధ్యము కాదనియు, యిక మీరాఖాసీము విషయమై అతడదివరకే పారిపోయినా డనియు పట్టుకొనుటకు ప్రయత్నించెదననియు, షుజామంత్రియగు బేని బహద్దూర్ సమాధానము చెప్పెను.

తనను తమకు పట్టియిచ్చేషరతుతో ఇంగ్లీషువారు షుజాతో రాజీపడిరను వార్తను Seir గ్రంథకారుడు మీరాఖాసీముకు తెలిపెను. అప్పుడు పాపము ఒకప్పుడు బంగాళాకు నబాబుగ మహావైభవ మనుభవించిన మీరాఖాసీము ప్రభువు నేడు తన ప్రాణరక్షణార్థమై వాయువేగముతో యింగ్లీషువారి కంటపడకుండ పారిపోవ సాగెను.

వాయువేగముతో, విద్యుద్వేగముతో మీరాఖాసీము అలహాబాదుకు పారిపోయెను. అతని పెండ్లము బిడ్డలు వజీరుచే దోచుకొనబడి అదివరకే ఖైదులో వేయబడియుండిరి.

ఏదో యుపాయముచేత విడిపించుకొని, మీరాఖాసీము వీరినికూడ అలహా బాదుకు తనవద్దకు రప్పించుకొనగలిగెను. వీరినికూడ వెంటబెట్టుకొని అక్కడనుండి కదలి మధ్యయెక్కడ ఆగకుండ అతడు "బేరియల్లీ"వరకు పోయెను....అక్కడనే మీరాఖాసీము కొంతవిశ్రాంతి దీసుకొనగలిగెను.

* మీరాఖాసీము పాత్ర యింతటినుండియే భారతేతిహాస రంగమునుండి తిరిగి చూడకుండ నిష్క్రమించినది. అతడు 1777 సం॥ వరకు అనామకుడుగ

* మీరాఖాసీము యీరీతిగ ప్రవాసములో దాగియుండియు తిరిగి 1766 సం॥లో తనకు సహా యార్థముగ రమ్మని ఆఫ్ఘనిస్థానమునుండి అహమ్మద్‌షా అబ్దాలీని పిలిపించెనని Calendar of Persian Correspondence కు ఉపోద్ఘాతము వ్రాయుచు మౌల్వీ బదురుద్దీన్ అహమ్మద్‌గారు వ్రాయుచున్నారు. అహమ్మద్‌షా అబ్దాలీ 1767 సం॥ ఫిబ్రవరినెలలో సరిహద్దులుదాటి యిండి యాలో ప్రవేశించి, తన కెదురుదిరిగిన శిక్కులను శిక్షించెను. ఇక ఇంగ్లీషువారిని తరిమివేసి, మీరాఖాసీమును తిరిగి బంగాళాతక్తుపై కూర్చుండబెట్టు విషయములో పరిస్థితులు అతనికి అనుకూల

జీవించియుండి తుదకు ఢిల్లీనగరమున చనిపోయెను. సమ్రూకూడ యింగ్లీషువారు తన నెక్కడ పట్టుకొని చంపుదురో యను భయముచేత అయోధ్య వజీరుకొలువు వదులుకొని, తన శిబ్బందితోకూడ ఆగ్రాలోనున్న జాటులతో చేరెను.

చునార్, అలహాబాదు కోటల ముట్టడి.

తాముకోరిన రెండు షరతులను షుజా చెల్లింపలేక పోయినందున, యింగ్లీషు వారక్కడనుండి షుజా రాజ్యములో (అయోధ్యలో) దండుతో ప్రవేశించి "చునార్" కోటను ముట్టడించిరి.

ఈకోటను తమస్వాధీనము చేయవలసినదిగ యింగ్లీషు సేనాపతి కోటలోని వారికొక చక్రవర్తి హుకుమును చూపించెను. కాని, వారీ హుకుమును లక్ష్యపెట్ట లేదు. అంతట ఇంగ్లీషుసేనాని ఫిరంగులను తీసికొనివచ్చి కోటగోడలను బ్రద్దలు కొట్టసాగెను. కోట యజమానికి—మహమ్మద్ బషీరుఖాన్‌కు కొంచెము జంకు పుట్టెను. అయినను కోటలోని తక్కినవారు ధైర్యముతో నిలువబడి, నీకు భయముంటే, పో, బయటికి పో—అని అతనిని బయటికి పంపివేసి, కోట రక్షణార్థమై అందరు ధైర్యముతో నిలువబడిరి. కోటగోడలు కొంతవరకు ఫిరంగి బారులచే పడి పోయెను. అయినప్పటికి, కోటలోనివారు జంకక పోరాడుచునే యుండిరి. ఇంగ్లీషు వారంతట రాత్రివేళ రహస్యముగ ప్రక్కనున్న కొండమీదుగ నెక్కియు, పడి పోయిన గోడసందులలోనుండియు, కోటలోదూరుటకు ప్రయత్నించిరి. కాని, అప్పు డక్కడ పరున్నవారికి మెళకువరాగా వారు కోటలోనివారి నందరిని మేల్కొలిపిరి. వారందరు తక్షణమే తుపాకులతో సందులవద్ద కాచుకొని అమితముగ అగ్నివర్షము గురవసాగిరి. ఈదెబ్బతో ఇంగ్లీషుసేన చెల్లాచెదరయ్యెను.

ఇంగ్లీషువారు యిక్కడ పెద్దదెబ్బతినిరి. నిజమునకు న్యాయమైనయుద్ధములో ఇంగ్లీషువారెన్నడుగాని నిలువలేదు. ఎల్లప్పుడు యేదో కుత్రిమముచేతనో, లంచము లిచ్చియో, వారు శత్రువును లొంగదీయు చుండిరేగాని, ధైర్యముగ రంగమందు నిలువబడి న్యాయముగ పోరాడి గెలిచిన దెన్నడును లేదు. ఇంగ్లీషువా రంతట యీ "చునార్" కోటముట్టడిని వదలుకొని, వెనుకనుండి షుజా తమపైకి వచ్చుచున్నాడని తెలిసికొని, ముందుకు అలహాబాదువైపుకు సాగిపోయిరి.

---

ముగ గన్పట్టలేదు. వెనుక 1759 సం॥లో మహారాష్ట్రులమీదికి దండెత్తివచ్చినప్పుడు హిందూస్థానము లోని మహమ్మదీయ ప్రముఖులెల్లరు యితనికి మద్దతుచేసిరి. కాని, యిప్పుడన్ననో, మహమ్మదీయ ప్రభువులలో ప్రధానుడగు అయోధ్యవజీరే ఇంగ్లీషువారి పక్షమున నుండెను. ఈ రీతిగ ఇంగ్లీషు వారు, అయోధ్యవజీరు, సిక్కులు, తనకు వ్యతిరేకముగ నిలిచియున్న సమయములో తాను వారి నెదుర్కొనుట దుస్సాధ్యమని అహమ్మద్‌షా అబ్దాలీకి తోచెను. అందుచే యీపని నావల్ల కాదని అతడు మీర్కాసీముకు రెండుముక్కలు జబాబువ్రాసి, యింటికి వెళ్లిపోయెను :—క్లుప్తము.

ఇక్కడ యింగ్లీషువారి అదృష్టరేఖ బయటపడెను. వెనుక 'ఊడానల్లా' యుద్ధములో మీర్కాసీము పక్షమున గట్టిగ పనిచేసిన "నాజీఫ్‌ఖాన్" యిప్పుడు వచ్చి యింగ్లీషువారికి సహాయముచేసెను. ఇతనిసహాయముతో వారు అలహాబాదు కోటను పట్టుకొనగలిగిరి.

ఈకోటలో నాజీఫ్‌ఖాన్ చిరకాలముండుటచేత దాని బలాబలములు అతనికి బాగుగ తెలియును. గోడకు బలములేని ఒకానొక రహస్య స్థలమును యితడు యింగ్లీషువారికిచూపగ, వారుదానిని ఫిరంగులతో బ్రద్దలుకొట్టిరి. కోటయజమాని 'ఆలీబేగ్‌ఖాన్' యికప్రయోజనము లేదనియెంచి, యింగ్లీషువారికి లొంగిపోయెను. తనకును, తనకోటలోని వారికిని, యెట్టిహానిచేయక వదలిపెట్టెదమన్నచో కోటను ఇంగ్లీషువారికి స్వాధీనము చేసివేసెదనని అతడనెను. ఇందుకు ఇంగ్లీషువారు ఒప్పుకొనగ, ఇతడు తనపరివారముతో సహాయముచేసెను. అక్కడనుండి అతడు తన ప్రభువగు షుజావద్దకుపోయెను Vol. II. P. 579.

మీర్కాసీమువలెనే షుజాఖానును "బేరియల్లీ"కి పారిపోయెను. అతనికక్కడ రోహిలానాయకుడు గౌరవముగ ఆతిథ్యమిచ్చెను. షుజాకు ఇంగ్లీషువారిపై దండెత్తు ఆశలింకను ఉడిగిపోలేదు. ఆతడంతట మహారాష్ట్ర నాయకుడగు ములహారిరావు హోల్కారుసేనల సహాయముతో యింగ్లీషువారిని తిరిగి "కోరా" యను చోట ఎదిరించెను. ఈ దండయాత్రలో రోహిలాలు తనకు సహాయము చేతురని (వజీరు) షుజాతలంచెను. కాని, వారటులచేయలేదు. కొన్నిపోరాటములు జరిగిన పిమ్మట షుజా ఓడిపోయెను. కాబట్టి, అతని రాజ్యమంతయు యింగ్లీషువారికి వశము కావలసివచ్చెను. ఇంగ్లీషువారివద్దకువెళ్లి వారితో సంధిచేసుకొనుట మంచిదని కొందరతనికి సలహాచెప్పిరి. ఆప్రకారమే షుజా ఇంగ్లీషువారి వద్దకు ఒంటరిగ పోయెను. అప్పుడు యింగ్లీషు సేనలకు మేజర్ మన్రో అధిపతిగలేడు. అతడు సీమకు వెళ్లిపోవుటచే, మరల మేజరు కార్నకే సేనాపతి యయ్యెను. ఇతడు షుజాను మర్యాదగచూచి గౌరవించెను. సితాబ్‌రాయి మధ్యవర్తిత్వముద్వారా షుజా అప్పుడు యింగ్లీషువారితో ఒకసంధి చేసుకొనెను. దాని షరతులివి :—

వజీర్ షుజా సంధికి దిగుట.

["యుద్ధపు ఖర్చులక్రింద షుజాఉద్దౌలా యింగ్లీషువారికి యీ దిగువరీతిగ 50 లక్షల రూపాయలివ్వవలెను. 25 లక్షలు ఒక్కసారిగ చెల్లించవలెను. 25 లక్షలు ముందు తనకురాబోయే రివిన్యూ విలియా వేయవలెను............అలహాబాదు రాష్ట్రము చక్రవర్తి ఉపయోగనిమిత్తము పూరాగాయిచ్చివేయవలెను. అలహాబాదు నగరమును కోటయు ఆయనకాపురముండుటకు యివ్వవలెను...చక్రవర్తికి అంగరక్షగ అలహాబాదులో కొంత ఇంగ్లీషు సేన యుండవలెను. ఇంగ్లీషువారికి

షుజాఉద్దౌలాకు మధ్యవర్తిగ అతనిదర్బారులో ఒక ఆంగ్లేయుడుండవలెను. అయితే యితడు షుజాఉద్దౌలా వ్యవహారములలో జోక్యము కలిగించుకోరాదు. ఇకయింతటి నుండి ఒకరియొక్క శత్రుమిత్రులు ఇంకొకరి శత్రుమిత్రులుగనే ఉభయులు భావించుకోవలెను........." [Seir Vol. II. P. 584—క్లుప్తము.]

ఈ యుద్ధమీరీతిగ అంతమొందినది. షుజానుండి ఇంగ్లీషువారు చాలధనమునే గాక, భూభాగముకూడ సంపాదించుకొనిరి. ఫలవంతమగు "గాజీపూర్" పరగణా అతనినుండి లాగికొనిరి. ఇందుకు సీమడైరక్టర్లు ఒప్పుకొనలేదు. ఇందునుగూర్చి వారు 1765 సం॥ డిశంబరు 24-వ తేదీన కలకత్తా కమిటీవారికిట్లువ్రాసిరి:—

"యుద్ధము మీర్కాసీముపై ప్రారంభమైనది గనుక బక్సారుయుద్ధమువరకు మీరుచేసినదంతా మేముఒప్పుకొన్నాము. గాజీపూరును తీసుకొనుటనుగూర్చియు షుజాఉద్దౌలా దేశము జయిస్తామని చెప్పుటనుగూర్చియు, అతనితో మీరు చేసుకొన్న సంధినిగూర్చియు, మేము వేరుగ అభిప్రాయమిచ్చెదము...గాజీపూరు పరగణా సదా యుద్ధోపజీవులగు ప్రజలచే చుట్టబడియున్నది. కాబట్టి దీనినిమీరుకోరడము మొదట మీరుబయలుదేరిన ఉద్దేశ్యములకు విరుద్ధము. రాజ్యము విస్తరింపచేయవద్దని మేమెన్నియోసారులు మీకు చెప్పుచువచ్చిన మా ఉత్తరువులకిది వ్యతిరేకము." (Third Report. P. 382. క్లుప్తము.)

మీర్జాఫరుని చరమదశ - దిక్కులేనిచావు.

ద్రోహిబ్రతుకు యెప్పుడు కుళ్లుబ్రతుకే! ఎవరికోసమైతే వాడు ద్రోహము చేసెనో, వారుకూడ ఆఖరుకు యితనిని గౌరవించరు.

మీర్జాఫరు బ్రతుకును యింతే అయినది. ఇతని జీవితమంతయు దుఃఖ భాజనమే. తనస్వామతస్థుడు, బంధువు, కుర్రవాడు, తనకు ప్రభువగు సురాజ్ ఉద్దౌలాకు స్వామిద్రోహముచేసి ఇంగ్లీషువారిలో దూరిననాటినుండి యితనిబ్రతుకు మరింత అధ్వాన్నమయ్యెను. ఇంగ్లీషువారు తమస్వార్థపదవి కెక్కువరకు ఇతనినొక నిచ్చెనగ ఉపయోగించుకొనిరి. తాము పై కెక్కగనేయానిచ్చెనను నిర్దాక్షిణ్యముగ తన్నివేసిరి. ఇతనిచేత చేయించుకున్నన్నాళ్లు నానా వెట్టిచాకిరీ చేయించుకొని, ఆఖరుకుచచ్చే రోజులలో వారితనిమొగము చూడరైరి. వృద్ధాప్యములో వారితని నెట్లు అవమానపరుపదలచిరో పార్లమెంటు రికార్డులు (Third report. P. 306) చూచిన తెలియగలదు.

[ఒడంబడికలో లేని అనేక కొత్తషరతులను కంపెనీవారు యితనిపై తరువాత వేసి రుద్దసాగిరట. ఇతడు కంపెనీకి ప్రతినెల 5 లక్షల రూపాయలిస్తానన్నాడనియు, నష్టపరిహారము క్రింద తమకింక యెక్కువసొమ్ము రావలెననియు, నౌకాదళమునకింక యెక్కువ బహుమతి ముట్టవలెననియు, కంపెనీనౌకర్లు యీముసలివానిని

బహువేధించసాగిరట. తానిందులకు ఒప్పుకొనలేదని ఆముసలివాడు గోలపెట్ట సాగెనట—క్లుప్తము.]

ఈ మనోవ్యథచేతనే, పాపమా ముసలి నబాబు త్వరగ చచ్చిపోయెను. లేకుంటే యింకానాలుగుకాలాలపాటు బ్రతికేవాడేమో ? ఈసంగతిని సర్ విలియం హంటరువంటి ఆంగ్లేయాధికార ధూర్వహుడుసైతము అంగీకరింపక తప్పినదికాదు. అతడిట్లు వ్రాయుచున్నాడు :—

మీర్జాఫరు 1765 సం॥ జనవరిలో చచ్చిపోయెను. కలకత్తాలో నున్న ఇంగ్లీషువారు తమకు ప్రయివేటుగ రావలసిన నష్టపరిహారముగూర్చి అంత అయుక్తముగ అతనిని తొందరపెట్టి పీడించుచుండుటచేతనే మరణమాతనికి అతితొందరగ ఆసన్నమయ్యెనని చెప్పుదురు. (Statistical account of Bengal. Vol. IX. P. 191,)

అవసానకాలమందు యీ ముసల్మాన్ స్వామిద్రోహికి నోట్లో నీళ్లుపోసే దిక్కుకూడ లేకపోయినది. ఇతని మతస్థులు దగ్గరకు రామన్నారు.. కిరస్తానీలు అంతకుమునుపే తొంగిచూడలేదు. ఆఖరుకు యితనికి ఒకహిందువుడే దిక్కయ్యెను. అతడే నందకుమారుడు. Seir గ్రంథకర్త పాపండుడగు మహమ్మదీయుడు. మీర్జాఫరుకు మిత్రుడునుకాడు. ఇతడేమనుచున్నాడు? మీర్జాఫరు హిందువుడుగ చనిపోయెననుచున్నాడు. ఏలననగ, ఇతనికి ప్రాణముపోయే సమయమందు (వాళ్లమతస్థులెవరు దగ్గరకురామని నిరాకరించి నందువల్ల) ఆఖరుకు నందకుమారుడే దగ్గర నున్న హిందూదేవాలయమునుండి యింతతీర్థము తెచ్చి అతనిగొంతుకలో పోసెను. దానితోనే శవమునకు స్నానముకూడ చేయించెను.



# బ్రిటిష్ మహాయుగము

## ఆరవ అధ్యాయము



### మీర్జాఫరుని మరణానంతర కథనము.

1765 సం॥ ఫిబ్రవరి నెలారంభములో మీర్జాఫరు మూర్షిదాబాదులో చనిపోయెను. ఇతని చావుకు పూర్వమే వాన్‌సిటార్టు గవర్నర్ పదవికి రాజీనామా ఇచ్చివేసి యింటికి (సీమకు) వెళ్ళిపోయెను. తనపనిని బొంబాయిలో సివిలియన్ ఉద్యోగిగ నున్న స్పెన్సరును చూడమని చెప్పిపోయెను. బెంగాలులో కంపెనీ వ్యవహారము లేమియు బాగుండలేదు. వీనిని చక్కబరుచుటకై డైరక్టర్లు క్లైవును తిరిగి ఇండియాకు వెళ్లమనికోరిరి. క్లైవువచ్చి తనకు కొఱుక్కుపెట్టడం వాన్‌సిటార్టుకు గిట్టలేదు. కాబట్టి, అతడు రాజీనామాయిచ్చి లేచిపోయెను.

స్పెన్సర్ గవర్నర్‌గిరిలోనే మీర్జాఫరు చనిపోయెను. ఇతని తదనంతర మెవరు రాజ్యమునకు రావలెనను మాట ఇంగ్లీషువారికే యితనికి జరిగిన ఒడంబడికలో లేదు. కాబట్టి, యీమంచి యవకాశమును ఇంగ్లీషువారు పోగొట్టుకొందురా ?

ఇతని రెండవకొడుకు "నాజిమ్ - ఉద్ - దౌలా" యనునతడు సింహాసన మెక్కెను. కాని, యింకొక క్రొత్తసంధికి ఒప్పుకుంటేనేగాని, ఇంగ్లీషువా రితనిని నబాబుగ అంగీకరించమనిరి. ఈ సంధితో వ్యవహారములు తల్లక్రిందులుగ మారినవి. ఇంగ్లీషువారు బంగాళాదేశమునకు నిజముగ ప్రభువులైనారు. పేరుమాత్రము నబాబుది. "నీక్రింద దివాన్‌గనుండి యావత్తు వ్యవహారములు నడుపుచుండుటకుగాను మహమ్మద్ రజాఖాను అను నతనిని నీవు పెట్టుకుంటేనేగాని వీలులేద"ని ఇంగ్లీషువారీ క్రొత్త నబాబుతో గట్టిగ చెప్పిరి. ఈ మహమ్మద్ రజాఖానుడు ఇంగ్లీషువారికి యిష్టుడు. ఇది ఒకమరతు.

అనామకపు క్రొత్తనబాబు.

---

* మీర్జాఫరును త్రోసివేసి, మీర్కాసీమును సింహాసనముమీద కూర్చుండబెట్టిరనువార్త యింగ్లండుకు తెలిసినప్పుడే, డైరక్టర్లు యిక్కడ యిండియాలో యేదో గందరగోళము జరుగుచున్నదనియు, యీరాజకీయ కల్లోలములో దిగినట్టయితే, తమ బేరసారము లుడిగి, తమ అసలు వ్యాపారమునకే నష్టమువచ్చుననియు యీ కిరస్తానీ కోమట్లు గాభరాపడిరి. అందుచే క్లైవును పంపితేగాని వ్యాపారం చక్కబడదని డైరక్టర్లు తలంచిరి. (Seir Vol. III. Page 5. Calcutta Reprint క్లుప్తము).

తన రివిన్యూ డిపార్టుమెంటులో, ఉద్యోగస్థులను ఉంచడంగాని, తీసి వేయడంగాని, నియమించడంగాని నబాబు యింగ్లీషువారి అనుమతి లేకుండ చేయరాదు. కంపెనీసేనల భత్యములక్రింద (నెలకు) 5 లక్షల రూపాయలు నబాబు యిచ్చుచునే యుండవలెను. తన దర్జా చూపించుకోడానికి, రివిన్యూ వసూలుపరుచు కోడానికి కావలసినవారిని తప్ప, అంతె కెక్కువ సేనను నబాబు ఉంచుకోరాదు. ఇంగ్లీషువారిపై యేప్రాంతములోగాని, యెట్టి సుంకములుగాని నబాబు విధించ రాదు.

ఈ షరతులు కొత్తనబాబుకు రుచించలేదు. అయినే, పాపమేమి చేస్తాడు? అతడు లొంగి, తన తండ్రిచేసిన స్వామిద్రోహ పాపఫలితమును అనుభవింపక తప్పినది కాదు.

ఈతడీ ఒడంబడిక కాగితముపై చచ్చినట్లు సంతకము పెట్టవలసివచ్చెను. అంతేకాదు. కంపెనీ నౌకర్లకందరికి 20 లక్షల రూపాయలు సంభావనక్రింద తన పట్టాభిషేక మహోత్సవకాలమందు పంచిపెట్టవలసివచ్చెను. నందకుమారుడే తనకు దివానుగ కావలెనని కొత్తనబాబడిగెను. 'ఇది వల్లకాదని' ఇంగ్లీషువారనిరి. ఇది లేకపోగా, నీవు వట్టి అనామకుడవేసుమా యని యీకుర్రనబాబుకు బుద్ధిచెప్పుటకో యన్నట్లుగ ఇంగ్లీషువారు నందకుమారుని మూర్షిదాబాదునుండి తీసికొనిపోయి, కలకత్తాలో తమవద్ద ఖైదీగ నుంచుకొనిరి.

## క్లైవు పునరాగమనము.

ఈకర్మకాండ అంతా అయినతరువాత కొత్త నబాబు గద్దెపై నెక్కిన తరువాత—క్లైవు 1765 సం॥ మే నెలలో కలకత్తాలో ఓడదిగెను. తన 'గాడిద' (మీర్జాఫరు) చచ్చిపోయినదన్నసంగతి క్లైవుకు మధ్యదోవలో మద్రాసు రేవులోనే తెలిసినది.

"ఈసంగతి వినేటప్పటికల్లా క్లైవుకు పట్టరానిసంతోషము కలిగింది. ఏడేండ్ల క్రిందట తాను పిట్టుమంత్రికి వ్రాసిపంపించిన రాజ్యాంగ విధానమునంతా ఒక్క సారిగ బెంగాలులో ప్రవేశపెడదామని క్లైవు ఉవ్విళ్లూరెను. శుద్ధ అనామకుడుగ వుండే నబాబు నొకని గద్దెపై కూర్చుండబెట్టి, పరిపాలన నడపు చాకిరీ అంతా నల్ల వాళ్లచేతనే చేయించి, రివిన్యూనంతా ఇంగ్లీషువారి చేతులలోపెట్టి, యుద్ధములు గాని, సంధులుగాని, చేసికొను అధికారమంతా ఇంగ్లీషువారే వుంచుకొని, యీ మూడు రాజ్యములపైకి యెవరురాకుండ కాపాడుకొనుచు, ఇంగ్లీషువారే నిజముగ సర్వాంసహాధికారులుగనుండు రాజ్యాంగ విధానము నేర్పరుపవలెనని క్లైవు లోలోన ప్లానులు వేయుచుండెను. కాని, ఇంగ్లీషువారే నిజమగు ప్రభువులుగ నున్నారను మాట లోకులకు తెలియకుండ వారికండ్లు గప్పవలెను. నబాబుపేరుతోనే-

ఢిల్లీ పాదుషా అధికారముక్రిందనే—తాము నడుచుకొనుచున్నామని లోకులతో చెప్పవలెను.

తన స్కీము నడవదను భయము క్లైవుకు లేకుండెను. ఏలననగ, బంగాళా సింహాసనమునకు యిద్దరు వారసులున్నారు. ఒకడు మీర్జాఫరుకు దాసీపుత్రుడు. వీనికి 20 సం॥ల వయస్సు. ఇంకొకడు మీర్జాఫరుకు మనుమడు. వీనికి ఆరేండ్ల వయస్సే. ఈ ఆరేండ్ల పసికాయను మూర్షిదాబాదు గద్దెపైకూర్చుండబెట్టి తాను నాటకమాడవలెనని క్లైవు కోరిక. ఇట్లయినచో తనకెట్టి ఆటంకములేక, తానాడినది యాట, పాడినదిపాట యగునని క్లైవు లోలోన మద్రాస్‌నుండి కలకత్తావరకు దోవపొడుగునను ఉవ్విళ్లూరుచు వచ్చుచుండెను. [Wheeler's Early Records of British India P. 329-330 క్లుప్తము.]

తీరా, కలకత్తాలో ఓడ దిగేటప్పటికల్లా, తనవారప్పుడే 20 ఏండ్ల యీడుగల నబాబు కొడుకుదగ్గర 20 లక్షల రూపాయలు కాజేసి, వానిని సింహాసనమెక్కించిరను వార్త క్లైవు చెవినిబడెను. ఇక అతనికి గలిగిన ఆగ్రహము, ఆశాభంగము, యింతింతని చెప్పతరముగాదు. తన మనస్సులో అల్లుకున్న మేడఅంతయు ఒక్కసారి గుభేలున కూలిపోయినదేయని అతనికి ఒడలుమండెను. ఇక తనవారి నేమియు యింకొక విధముగ అనలేక–తానక్కడికి మహా పత్తిత్తు అయినట్లు – యీ క్లైవు – యీ నైతిక కుష్టరోగి– ఈ కుర్రవాని దగ్గర 20 లక్షల రూపాయలు లంచము పుచ్చుకొని అతనిని సింహాసనమెక్కించుట మహాదోషమని తనవారిని మందలింపజొచ్చెను.

క్లైవుకు, కంపెనీ నౌకర్లకు తగాదా.

ఇందును గూర్చి క్లైవు తనస్నేహితునకొకనికి యిట్లని వ్రాసెను :—

"కట్టా, మన ఇంగ్లీషువారి పేరు యెంత నీచములో పడిపోయింది! ఇంగ్లీషు జాతియొక్క పరువు ప్రతిష్ఠలిట్లు యెన్నటికిగాని తిరిగి చూడకుండ గతించి గాలిలో గలిసిపోవుటచే, నేను నాకన్నీళ్లతో వానికొక తిలాంజలిని విడువకుండ జాలనైతిని. అయినప్పటికి, నాప్రతిజ్ఞ యిది. పరలోకమనేది ఒకటివుంటే, భగవంతునకు మనము ఉత్తరవాదులమనుమాట నిజమైతే, సర్వ ప్రాణి హృదయముల పరిశీలించు ఆ మహాపురుషుని పేరుమీదుగ నే ప్రతిజ్ఞచేయుచున్నాను. ఎట్టిదుర్నీతికిగాని, లోబడని ఉత్తమ నిగ్రహముగల మనస్సుతో నేనిక్కడికి బయలుదేరి వచ్చినాను. నానాటికి యిక్కడ హెచ్చుపెరుగుచున్న యీ మహాదుర్నయముల నన్నిటిని నేను నాశనము చేయుటకుగాని, లేక అట్టి ప్రయత్నమందు నేనేనాశనమగుటకుగాని దృఢసంకల్పుడనై యున్నాను."

'మీరెందుకు యిట్లా చేశారని క్లైవు తనవారిని డబాయించేటప్పటికల్లా వారు "నీవు చెప్పిన విద్యయే నీరజాక్ష" యను పదముపాడిరి! ఇంతటితో క్లైవు

నోరుమూసుకొని ఊరుకుండవలసినది. కాని, ఆతడట్లు చేయలేదు. "నేను చెప్పినట్లు చేయమన్నాను గాని, చేసినట్లు చేయమన్నానా ?" యను గురుశిష్య సాంప్రదాయమును క్లైవు వారికప్పుడు బోధింప జూచినట్లున్నది! తాను వెనుక చేసినదానికి, యిప్పుడు వీరు చేసినదానికి చాలా తేడా వున్నదని యితడు తన పూర్వ ప్రవర్తనను సమర్థించుకొన జూచెను. సురాజ్ ఉద్దౌలాను త్రోసివేసి, మీర్జాఫరును గద్దె యెక్కించిన కథయంతయు బెంగాలు ప్రజలే చేసుకొన్నారనియు, అందులో ఇంగ్లీషువారు కేవలము కూలికి పనిచేసిరనియు, అందుచే తామప్పుడు డబ్బుతినుట తప్పుగాదనియు, ఇప్పుడన్ననో కథ వేరనియు, తామిప్పుడు కూలివారుగారనియు, ప్రభువులమనియు, కాబట్టి నాజిం ఉద్దౌలాను సింహాసనమెక్కించు సమయమున తాము డబ్బు తినుటతప్పనియు క్లైవు వాదింపసాగెను.

తమ నౌకర్లెవరు దేశీయప్రభువులనుండిగాని, ప్రజలనుండిగాని, యెట్టిబహుమతులుగాని తీసికొనరాదని సీమడైరెక్టర్లు పంపిన హుకుములు యిక్కడ కలకత్తాలో 1765 సం॥ జనేవరి 24-వ తేదీన చేరినవి. దరిమిలా 15 రోజులకే మీర్జాఫరు చనిపోయెను. అనగ, యిక బహుమతులు పుచ్చుకోకూడదను తమ డైరెక్టర్ల ఉత్తరువులు వీరి కప్పటికి బాగుగ తెలియును. అయినను, వారు దురాశను, ఎదురుగ వచ్చిన అవకాశమును త్రోసివేయజాలక పోయిరి. అంతటి నిగ్రహము వారికి లేక పోయెను. అందుచే, 'యేమైతే అవనీ' అని వారు మొండికేసి, అందరు యేకమై, తమ డైరెక్టర్ల ఉత్తరువులను దూరముగ కట్టిపెట్టి, గబగబ లగ్నము మించిపోవుచున్నట్లు నాజింఉద్దౌలాను పెండ్లికొడుకునుచేసి, సింహాసనము పీటలమీద కూర్చుండబెట్టి, అతనినుండి కావలసినంత ధనమును ఒక్కసారిగ దులుపుకొని విడిచిపెట్టిరి. క్లైవు వచ్చినతరువాత వీరిట్టిపని చేసినందులకై చివాట్లుపెట్టెను. అంతట వీరందరికి క్లైవుమీద కోపమువచ్చెను. పరస్పరము ద్వేషము లేర్పడెను. ఎంత తంటాలుపడినను క్లైవు వీరినుండి ఆ డబ్బు కక్కించలేకపోయెను. చాలమంది తమ ఉద్యోగాలకు రాజీనామాలిచ్చి యిండ్లకు లేచిపోయి, అక్కడ ఇంగ్లండులో క్లైవుపై పెద్ద గందరగోళమును లేవదీసిరి.

అతని గుట్టులనన్నిటిని వారు లండనువీథులలో తూరుపారబట్టిరి. దీనివల్లనే పార్లమెంటువారు ఆఖరుకు క్లైవును తమ యెదుటికి పిలిపించి, అతనిపై కేసుపెట్టి అతని ప్రాణములుతీసినంతపని చేసిరి. ఈ అవమానమును భరింపలేకనే తుదకు క్లైవు ఆత్మహత్యకూడ చేసుకొని చచ్చిపోవలసివచ్చెను.

తమ నౌకర్లు ప్రయివేటువర్తకము సాగించి తద్వారా దేశములో జరుపుచున్న అక్రమమును ఆపించివేయుటకే డైరక్టర్లు క్లైవును యిండియాకు యిప్పుడు పంపించిరి. ఇందునుగూర్చి డైరక్టర్లు తమ నిశ్చితాభిప్రాయమును 1765 సం॥

ఏప్రిల్ 26-వ తేదీగల తమ ఉత్తరములో స్పష్టపరచియుండిరి. తమ కివ్వబడిన ఫర్మానానుగూర్చి వారిట్లు గొప్ప రాజనీతిజ్ఞతతో వ్యాఖ్యానము జేసిరి:—

''వర్తకపు టొడంబడిక లనునవి వానిని చేసుకొను ఉభయపక్షములవారికి లాభకరముగ నుండునట్లు ఉద్దేశింపబడును. అట్టి సందర్భములో ఢిల్లీపాదుషా మనకు సుంకములులేకుండ వర్తకము చేసుకొనవచ్చునని ఫర్మానాయిచ్చినప్పుడు లోగడ మన మెరుగని, మనము ఊహింపనైనలేని వస్తువులలో సుంకములులేకుండ స్వేచ్ఛగ వ్యాపారము చేసికొనవచ్చునని ఆతడూహించెనని యర్థమగునా? ఈ మూలముగ ఢిల్లీపాదుషా' తన రివిన్యూను నష్టపరుచుకొని, తనవర్తకుల నందరిని నాశనము చేయదలచుకొనెనని యర్థముచెప్పనగునా? మన కిచ్చిన ఫర్మానాకు ఇట్టి అర్థమును యింతవరకు యెవరుగాని చెప్పియుండలేదు. ఇదిగో యిప్పుడు మననొకర్లే యీకొత్త అర్థము నొకదానిని కల్పించి, దానిని దౌర్జన్యముచే నిలువబెట్టసాగించి నప్పటివరకు సదరుఫర్మానాకిట్టి (విపరీతపు) అర్థము నెవరును చెప్పియుండలేదు. అదిగాక, మీర్జాఫరు,మీర్కాసీములతో తదుపరిచేసుకొన్న ఒడంబడికలవల్ల ఈహక్కు మన కేర్పడుచున్నదనియైనను వాదించుటకు వీలులేదు. ఏలననగ, ఢిల్లీపాదుషా ఫర్మానాలోవున్న హక్కులకుమించి ఒక్క కొత్తహక్కునైనను యీ ఒడంబడిక లిచ్చుచున్నవని యెవరుగాని యెన్నడు చెప్పియుండలేదు. తలచియుండలేదు. అంతయేల, యిప్పుడు కొత్తగ యీ హక్కును తెచ్చిపెట్టుకొనగోరువారు చెప్పు కృత్రిమ వాదముచూడగ మాకొక అభిప్రాయము గట్టిగ తోచుచున్నది. ఈవాదము చేయు వారి కీయర్థము తెలియదనికాదు - తెలిసియుండియు, కండ్ల కెదురుగుండ కనపడు చున్న ధనమునంతను ఒక్కసారిగ దోచుకొందమను దురాశను ఆపుకోలేక వారిట్టి వాదమునకు దిగిరని మా నిశ్చితాభిప్రాయము. ఇట్టి అక్రమధనార్జన దేశశాంతికి, తాము కంపెనీయెడ నెరవేర్చవలసిన విధ్యుక్త ధర్మమునకు, వ్యతిరేకముగ నున్నప్పటికి వారిట్టి కువాదముచే తమ అక్రమప్రవర్తనను సమర్థించుకొన జూచు చున్నారు.''

''వీరిసంగతి యిట్లుండగ, యిక యీ ప్రయివేటు వర్తకమునకు తమకు హక్కులేదని ఒప్పుకొనుచుండియు, దీనిని సాగించుటవల్ల వచ్చే అనర్థముల నన్నిటిని బాగుగ యెరిగియుండియు, యీవ్యాపారము నింకను వదలిపెట్టనివారి ప్రవర్తన మరింత గర్హ్యముగనున్నది. దౌర్జన్యముచేసి, నబాబువల్ల ఒడంబడిక నొకదానిని బలాత్కారముగ వ్రాయించిపుచ్చుకొని, కంపెనీపేరు ఉపయోగించుకొని, తమ మట్టుకు తాము డబ్బు మూటగట్టుకొనుటకై యీ ప్రయివేటు వర్తకమను నొక హక్కును సంపాదించుకొంటిమని చెప్పుచు, దానిని సంరక్షించుకొనుటకు కంపెనీ బలముల నుపయోగించుకొనుచు వీరు అసలుకంపెనీయొక్క లాభములనుగాని, సౌకర్యములనుగాని, పాటింపరైరి. ఇట్టి ప్రవర్తన యెంతయు గర్హ్యము.

"ఈపని ప్రారంభించకముందు వారీ చిన్నప్రశ్నను వేసుకుంటే బాగుండేది. ఇది మనయజమానులకేమైన శ్రేయస్కరమైనపనియా" యని వీరిలోవీరు ప్రశ్నించుకొనియుంటే, వీరికి సందేహములన్నీ వీడిపోయేవి. కాని, వీరికీప్రశ్న ఎన్నడుగాని పట్టినట్లే కన్పట్టదు.

కంపెనీ నౌకర్ల కుళ్లునంతా క్లైవు డైరెక్టర్లకు తెలుపుట.

క్లైవువచ్చి చూచునప్పటికల్లా యెక్కడ చూచినను కుళ్లుగనే యుండెను. 1765 సం॥ సెప్టంబరు 30-వ తేదీన యితడు డైరెక్టర్ల కిట్లని వ్రాసెను:—

"నేనుయిక్కడికివచ్చి చూసేటప్పటికల్లా, మావ్యవహారాలు నానా తీరుతీరాగా వున్నవి. ఎవరికైనా భీతావహం కలిగించేటట్టుగవున్నవి. ఏమాత్రము ఆత్మగౌరవముగలవాడుగాని, స్వలాభాపేక్షచే కండ్లుపూడిపోయి స్వామియెడవిశ్వాసము మరువనివాడుగాని, యిట్టిస్థితినిజూచి కంపమునొందకుండ నుండజాలడు. ఆకస్మికముగ, నడమంత్రముగ యెత్తుకొన్న సిరివల్లను, తరుచు అక్రమముగ, తేరగ జూరగొన్న ధనరాసులవల్లను, కంపెనీ నౌకర్లకు ఒళ్లు తెలియని శివమెత్తెను. ప్రతిచోట ప్రతివాడు హద్దుపద్దులులేకుండ, భోగములలో ఓలలాడుచున్నాడు......... పెద్దపాయలో వాళ్లే యిల్లాచేస్తూవుంటే, దానిని చూస్తూవున్న సన్నకారు నౌకర్లు మాత్రం ఊరుకుంటారా? ఈచెడుగు అంటురోగమువలె సర్వత్ర పైనుంచి క్రిందివరకు వ్యాపించినది. సివిల్ మిలిటరీ డిపార్టుమెంటులలో దిగువను గుమాస్తా బంట్రోతులవరకు పాకినది......"

"ఇంతమందికి యింతడబ్బు ఎట్లావచ్చిందో మొదటనాకు అర్థంకాలేదు. చిటికెలో యింతమందికి యింతసిరి ఎల్లా ఎత్తుకుందిరా అని నాలో నాకే ఆశ్చర్యమైనది. ఇక్కడ యిండియాలో ఏమాత్రం కొద్దికాలం ఉన్న ప్రతి తెల్లవాడు, చటుక్కున మూటలకు మూటలువేసుకొని, ఓడయెక్కి యింటికి (ఇంగ్లండుకు) పోయేవాడే!...... నేను ఓడదిగి చూసేటప్పటికి నాకిక్కడసక్రమమైన రాజ్యపరిపాలన ఉన్నట్లుగ ఏకోశంలోనూ కనపడలేదు. అంతా అరాచక మయంగా ఉంది........."

"(లంచాలువగైరాలు పుచ్చుకోరాదని, ప్రయివేటువర్తకం చేసుకోరాదని) మీరు లోగడ పంపించిన ఉత్తరువులు నిక్కచ్చిగానే ఉన్నవి......కాని, వాటిని, యిక్కడ కంపెనీనౌకర్లు తుడిచి పారేశారు!

ఈవిషయంలో ముందుగ పెద్దపాయలోనున్న కౌన్సిలుమెంబర్లే ఈ ఉత్తరువులను పాలించవలసినదనియు, లేనిచోవారిని డిస్‌మిస్ చేస్తామనియు మీరు గట్టిగ మళ్లీనొక్కి ఉండకపోతే, యీ పాటికి మీఆర్డర్లన్నీ కేవలం బుట్టదాఖలై పోయేవే!"

"ఈ అల్లరంతా ఒక్క సివిల్ డిపార్టుమెంటులోనే అని అనుకోకండి. ఈ రోగం మిలిటరీ డిపార్టులోకికూడా ప్రాకింది. రోజురోజు శిపాయిలకు ధనరాసులు వచ్చిపడుతున్నవి. అందువల్ల రోజురోజు వాళ్లపని హద్దుమీరిపోతోంది...ఏదైనా ఒకపట్టణాన్ని పట్టుకున్నప్పుడు, "మీాయిష్టంవచ్చినట్లు దోచుకోండిరా" అనివాళ్లను విచ్చలవిడిగ వదలిపెడితే, యింకవాళ్లను పట్టడానికి పగ్గాలుంటాయా! కాశీలో ఒకసారి యిట్లాగే జరిగింది. ఇంతకంటె, ఆశ్చర్యమైన విషయమింకొకటి వుంది. ఏదైనా పట్టణాన్ని పట్టుకొన్నప్పుడు, కొల్లగొట్టిన ఆధనమంతా కంపెనీకి చేరాలని లోగడమీరు ఉత్తరువులుపంపించారు. కాని, దీనికి విరుద్ధంగా, దాన్నంతా శిపాయిలే తీసికోండనిచెప్పి ఇక్కడ మీాగవర్నర్, కౌన్సిలు మెంబర్లు వాళ్లకే వదిలేశారు!........."

"మీా దిప్పుడు యిండియాలో ఒకరాజ్యంగా ఏర్పడినది. ఏరాజ్యంలోనైనా పెద్దపెద్దవాళ్లకే లంచాలు పుచ్చుకునే రోగంపుడితే, ఆరాజ్యం నాశనమైనదన్న మాటే......శిపాయిలకు విధేయత, క్రమశిక్షణ ముఖ్యం. అట్టిస్థితిలో, అదుపు ఆజ్ఞలులేకుండ వాళ్లను దేశంలోపడి దోచుకోనిస్తే వాళ్లుచెప్పినమాట వింటారా? క్రమశిక్షణ ఉంటుందా? పైగా, యీా దేశంలో, వాళ్లకు హఠాత్తుగ ఒక్కసారి ధనరాసులు వచ్చిపడితే తక్షణమే కలిగే పరతు యేమిటంటే, వాళ్లు మనమాట వినకుండా హద్దుమీరిపోవడమే! సైన్యంలో క్రమశిక్షణ మనమునిలపలేము."

"దేశంలో ప్రజాపీడనానికి, క్రౌర్యాలకు, యూరోపియనులు బాహాటంగా దోవచేశారు. వాళ్లక్రింద తొత్తులుగ అనేకమంది నల్లవాళ్లు ఏజెంట్లుగాను, సబ్ ఏజెంట్లుగానుచేరారు. ఇదంతా ఇండియాలో యింగ్లీషువాళ్లపేరు శాశ్వతంగా అపకీర్తిపాలు కావడానికి వచ్చింది!......దురాశ, భోగలాలసత్వం, విజయోన్మాదం, యివన్నీకలిసి, హిందూదేశంలో యిదివరకెరుగని కొత్తదుష్ప్రథాన్ని ఏర్పాటు చేసినవి. ఇదంతా మన ఇంగ్లీషువాళ్లపేరు ప్రతిష్ఠలు మంటగలపడానికి వచ్చింది. కంపెనీగౌరవం, మర్యాద, చివరకు మామూలు మానవత్వంకూడా నాశనమై పోయినవి."

ఈ ఉత్తరానికి జబాబుగానే కంపెనీడైరెక్టర్లు 1766 మే నెలలో క్లైవుకు యిట్లని వ్రాశారు :—

"మనకంపెనీ నౌకర్లు వర్తకంలో సంపాదించిన సంపాదనమంతా కేవలము ప్రపంచములో యిదివరకు ఎక్కడా, ఏకాలంలోనూ కనివిని యెరుగనటువంటి, ఘోరకృత్యాలద్వారానే లభించిందని మాకునిశ్చయమైపోయింది. ఈయూరోపియన్ ఏజెంట్లుచేసే దౌర్జన్యాలనుగూర్చి లోగడమేము ఎన్నోసార్లు మందలించి యున్నాము. వీళ్లు అక్కడి ప్రెసిడెంసీ అధికారుల కంటపడకుండ తప్పించుకు పోయి నారు. కాబట్టి, ఇకమీాద వీళ్లు యిట్లా తప్పించుకుపోయి దేశంమీాద పడకుండా

276 A



షాలం చక్రవర్తి

[1765 సం॥లో క్లైవుకు దివానీగిరి యిచ్చిన ఢిల్లీ బాదుషా]



ప్రయాగ మకాములో షాలం చక్రవర్తి క్లైవును బెంగాల్, బీహార్, ఒరిస్సా రాష్ట్రములపై
దివానీగిరిని ప్రసాదించుట. అనగ, బాదుషా త్రివేణీ సంగమములో
త్రిరాష్ట్రములకు తిలోదకములు వదలుకొనుట.

ఉండే ఉపాయంచూడాలి. దానికితగిన కట్టుదిట్టాలు చేయవలసిన బాధ్యత ఇక మీదట మీమీద పెట్టుతున్నాము. దీనినిగురించి మీరు ప్రత్యేకంగా శ్రద్ధపట్టి పనిచెయ్యాలి........."

ఈ గందరగోళమునంతను రూపుమాపుటకు క్లైవునకు ఒక్కటేమార్గము కనిపించినది. అనగ, దేశములోని యధికారమునంతను కలకత్తాలో ఇంగ్లీషుఅధికారుల చేతులలోనే యుంచుకొని, మూర్షిదాబాదు నబాబు నొకపిండి బొమ్మ చేసివేయుటయే క్లైవునకు కనిపించినమార్గము. దీనిపేరే "దివానీ" యని ఆరోజులలో చెప్పుకునేవారు. బంగాళా పరిపాలననుగూర్చి క్లైవు 7, 8 యేండ్లకు పూర్వమే తనకుగల యభిప్రాయములను పిట్టుమంత్రికి తెలిపియుండెను. ఆ యభిప్రాయములనే యితడిప్పుడు ఆచరణలోపెట్ట ప్రయత్నించెను. ఇందువిషయములో ఇతడు డూప్లే, పీష్వాలు, నైజాము, అయోధ్యవజీరు మున్నగువారు చేసినట్లే చేయగలంచెను. బెంగాల్, బీహార్, ఒరిస్సా రాష్ట్రములకు అసలుప్రభువు ఢిల్లీలోనున్న మొగలాయి పాదుషా. ఇక్కడనున్న నబాబు సదరు పాదుషాకు కేవలము ప్రతినిధిమాత్రమే. కాబట్టి, అసలు చక్రవర్తి అధికారములేకుండ యీ నబాబు ఎవరికిగాని, యెట్టి హక్కులుగాని, సిద్ధాంతరీత్యా యివ్వజాలడు. ఈ సంగతి క్లైవునకు తెలుసును. కాబట్టి బెంగాలుకు దివానీగిరి సంపాదించుకొనవలెనంటే అది ఢిల్లీపాదుషానుండియే రావలెను. అందుచే క్లైవు యీదివానీగిరి సంపాదించుకొని తెచ్చుకొనుటకై పాదుషావద్దకు పయనమయ్యెను.

కంపెనీకి మూడు రాష్ట్రములపై దివానీగిరి.

అప్పటికిపాదుషా యింకను అయోధ్య వజీరుతోకలిసి అలహాబాదు మకాములోనేయుండెను. * దివానీగిరి సంపాదించు నిమిత్తమై క్లైవు అప్పుడక్కడికి వెళ్లవలసి వచ్చెను. క్లైవు యిండియాకు రాకపూర్వమే, మీర్కాసీముతోను, అయోధ్య

* చక్రవర్తిని తమవలలోవేసుకొని యుంచుకొనవలెనని యింగ్లీషువారెట్లు పొంచియున్నది గవర్నర్ వరల్‌స్‌ట్ వ్రాసిన యీదిగువ యంశమునుబట్టి తెలియగలదు :—(Wheeler's Early Records. Page 380.)

"పాలం చక్రవర్తిని మనపలుకుబడి క్రిందవుంచుకోవడమా, లేక మనమాతనితో సంబంధము పెట్టుకొనక యివతలికి వచ్చివేయడమా యనునది మనకిప్పుడు ఆలోచనీయాంశము. ఈ రెంటిలో మొదటిపద్ధతియే మనకు అనుకూలమయినది. కొబట్టి, పరాయివా రెవరుగానివచ్చి యితని అంతరంగిక వర్గములో దూరి యితనికి ఆలోచనలు చెప్పకుండ మనము జాగ్రత్త వహించవలెను. మనమాతనియెడ యెట్లు నటించవలెనో మనకు స్పష్టమగుచునేయున్నది. మనమాతనికి కొంచెము యెడముగనుండి ఆతనిని ఆడించవలెను. ఒకవేళ అది వీలుపడకపోతే మనమే ఆతనికి రక్షకులుగనున్నట్లు, మనమున్న ప్రాంతములే ఆతనికి భద్రమైన చోట్లయినట్లు, అతని మనస్సుకు తోచునట్లు మనము వేషమువేసి నటించవలెను.

వజీరుతోను చేయబడుచున్న యుద్ధము ముగింపుకు తేబడెను. క్లైవు వస్తున్నాడన్న కబురు తెలిసేటప్పటికే వజీరుకు భయముపుట్టి సంధికి దిగెనని 'క్లైయిగ్' అను ఆంగ్ల చరిత్రకారుడు వ్రాయుచున్నాడు.

"క్లైవు యుద్ధములో అసాధ్యుడనుపేరు దేశప్రజలలో గలిగియుండెను. దక్షిణాదిని యితడొనర్చిన ఘనకార్యములకీర్తి ఉత్తర హిందూస్థానమునకుకూడ ప్రాకెను. ఇటు బంగాళాములోనికి, అటు ఢిల్లీ సామ్రాజ్యపు కొసవరకు కూడ ప్రాకెను............."

ఈ సమయమందు క్లైవైనను యుద్ధముకోరలేదు. శాంతియే కావలెనని అతడు కోరుకొనుచుండెను. 1765 సం॥ మే 20-వ తేదీన అతడు కార్నక్ సేనాని కిట్లు వ్రాసెను:—

"మన మిప్పుడు శాంతికోసమే గట్టిగ పనిచేయవలెను. ఏలననగ, ఖర్చులు చాలా హెచ్చయిపోయినవి. శివిల్ మిలిటరీడిపార్టుమెంటులకు కలిసి నెలకు పది లక్షలకు తక్కువ కావడంలేదు. ఈ సమయంలో గనుక మహారాష్ట్రులుగాని, యింకెవరైనాగాని, మనమీదికివస్తే మనపని వట్టిదే. యుద్ధముచేయడానికి దమ్మిడీ కూడ మనకిప్పుడు పుట్టదు. నేనిప్పుడు పడుచున్న గొప్ప చిక్కయిది. మీకు కూడ యిట్లే తోచుచున్నదనుకుంటాను."

కార్నక్ సేనాని యిప్పుడు కాశీలోనుండెను. ఇతనిని కలుసుకొనుటకై క్లైవు బయలుదేరెను. దోవలో పనియుండి మూర్షిదాబాదులో ఆగెను.

నందకుమారుని స్థానమందువచ్చిన రజాఖానుదే అక్కడ ప్రభయంతయు. ఇతడు నందకుమారునియంత తెలివితేటలు గలవాడుకాడు. ఇతనిని క్లైవు బుట్టలో వేసుకొనెను. వీనిద్వారా క్లైవు రాజ్యాధికారమునంతను తనచేతులలోనికి లాగికొని నబాబును వట్టిబొమ్మ చేసివైచెను.

ఇప్పటికిని క్లైవుకు తృప్తికలుగలేదు. ఇతడు కాశీవెళ్లి, కార్నక్ను కలుసుకొని, అప్పుడక్కడ మకాముచేసియున్న షుజాఉద్దౌలాతో ప్రసంగించెను. ఇతనిని కలుసుకొనుట క్లైవుకు యిదియే మొదటిసారి. (1765-వ సం॥ ఆగష్టునెల 2-వ తేది.)

ఈ సమయమందు క్లైవు అతనిని బలాత్కరించి అతనిచే నొక ఒడంబడికను వ్రాయించుకొనెను. అలహాబాదు, కోరాజిల్లాలు రెండును కంపెనీకిచ్చివేయునట్లును

---

చక్రవర్తి బంగాళాదేశములోనే మకాముపెట్టితే మన కెక్కువ వాటముగ ఉండేటట్లున్నది. స్థితిగతులుకూడ యిందుకనుకూలముగనే నడుచుచున్నట్లున్నది. ఇది జరిగితేమాత్రం-ఓ-మనకింక కావలసినదేమున్నది? అయితే యీమాట మనంచెప్పడంకంటె—బంగాళమునకు రమ్మని మనమే అతనిని పిలుచుటకంటె, అతనంతట అతను వస్తానసేనట్లుచేస్తే ఎంతో బాగుంటుంది."

గతయుద్ధములో కంపెనీవారికి గలిగిన నష్టపరిహారముక్రింద ఆరులక్షల నవరసులు యిచ్చునట్లును వజీరు ఒప్పుకొనెను.

అక్కడనుండి బయలుదేరి చక్రవర్తిని కలుసుకొనుటకై క్లైవు అలహాబాదుకు వెళ్లెను.

1765 సం॥ ఆగస్టు 9-వ తేదీన చక్రవర్తిని సందర్శించెను. ఈ సమయముననే చక్రవర్తి కంపెనీవారికి బెంగాల్, బీహార్, ఒరిస్సారాష్ట్రములపై "దివాన్‌గిరీ" పట్టమును ప్రసాదించెను. *

ఇదియే మొగల్‌సామ్రాజ్య వినాశనమునకు ధూమకేతువయ్యెను. ఘోర్జరీ ఘోరైన క్లైవుయొక్క కుచ్ఛితతంత్రము చక్రవర్తి కనిపెట్టలేకపోయెను. చక్రవర్తిని బలాత్కరించియే క్లైవీ పట్టాపుచ్చుకొనెనని కొందరు తలచుచున్నారు. క్లైవు, చక్రవర్తినుండి యీపట్టాను బలాత్కారముగనే లాగుకొన్నాడని ఆ రోజులలో పెద్దపుకారుండెను. అట్లు కానిచో, యిందునుగూర్చి పార్లమెంటువారు 1773 సం॥లో యేల పెద్దవిచారణ పెట్టుదురు? పార్లమెంటువారు క్లైవు నిట్లు ప్రశ్నించినట్లు మూడవ రిపోర్టు 324 పేజీలోవున్నది :—

"ఈ దివానిగిరీ పట్టా చక్రవర్తి నిజముగ యిచ్చెనదా? ఇట్టి పట్టానిచ్చుటకు అతనికా సమయమందు అధికారమున్నదా? లేక, అదొకందుకుగాను — రాచకీయపు యెత్తుగ మీరు దీనిని అతనిచేత లాంఛనముగ వ్రాయించి పుచ్చుకొన్నారా?"

---

* ప్లాసీయుద్ధముకాగానే, కంపెనీవారేయేల రాజ్యాధికారమును వహింపలేదని కొందరడుగుచున్నారు. ఇందునుగూర్చి కంపెనీ గవర్నర్ వరల్‌స్టే యిట్లు చెప్పచున్నాడు:—"ఈ పని చేయుటకు కంపెనీవారి కప్పడు సాధ్యముకాకపోయెను. ఏలననగ, వర్తకవ్యాపారమునకే తగినంత మంది సివిల్ ఉద్యోగులు అప్పడు లేకపోయిరి. ఉన్నవారికైనను ప్రజల గుణగణములు బొత్తుగ తెలియకుండెను. రాజ్యభారము వహించుటకు వా రెంతమాత్రము సమర్థులై యుండరైరి."

కలకత్తాను సురాజా ఉద్దౌలా ముట్టడించినప్పు డక్కడ గవర్నర్‌గనుండిన హాల్‌వెల్ అనునతడు 1765 సం॥లో యిట్లు వ్రాసెను.

"మనమే యిక నబాబులగుటకు ధైర్యముగ పూనుకొందాము. ఎనిమిదేండ్లనుంచి యీరాష్ట్రాలను మనము కొంచెముకొంచెముగ కొరుక్కుతింటున్నాము. ఇంక యెన్నాళ్లు యీ కాస్తకాస్త మునిపంటితో కొరుక్కోవడం? మనమెంతో సంపాదించుకొన్నాము - ఎంతో రాజ్యాన్ని యెంతో డబ్బును, సంపాదించుకొన్నాము. కాని, యీ జయములవల్ల మన కంపెనీ కేమిలాభము వచ్చింది? ఎన్నాళ్లీ ఎరను కాస్తకాస్త కొరుక్కుతింటూవుంటాము? బోను తలుపువచ్చి మన మెడమీద పడి కత్తిరించేవరకూ యిట్లాగే మునిపంటితో కాస్తకాస్త కొరుక్కుతింటూ కూర్చుందామంటారా" ఈ విధమైన ఒత్తిడితనవారివల్ల రోజురోజూ హెచ్చుచురాగా క్లైవు అందు కనుగుణ్యముగ ప్రవర్తింపవలసివచ్చినది. అందుకొరకే దివాన్‌గిరీని సంపాదించడానికి బయలుదేరినాడు.

క్లైవు గోడమీది పిల్లివాటముగ జవాబుచెప్పెను. "రికార్డులు చూచు కోండి—నా అభిప్రాయం తెలుస్తుంది" అన్నాడు.

బలవంతముమీదనే యీ పట్టా యివ్వబడినదని చెప్పుట కెంతమాత్రము సందేహములేదు. ఎల్ఫిన్స్టన్కూడ తన హిందూదేశ చరిత్రయందు యిట్లని ఒప్పు కొనక తప్పినదికాదు.

"ఈవ్యవహారముకంటె అగాధమైన వ్యవహారమింకొకటి నాకు యిండియా చరిత్రలో కనపడలేదు. క్లైవుచూస్తే కేవలసిద్ధాంతములందు అట్టే పట్టుదల పట్టే వాడుగాడు, ఏవో అపాయాలు వస్తున్నవని — బూచులనుచూచి, భయపడేవాడు కాడు. ఇతడు క్రియప్రధానంగా గల మనిషికాబట్టి, యేదో పెద్ద కారణంలేనిది— వెనుకనుంచి తోసే పెద్ద ప్రేరణలేనిది - చక్రవర్తి యింతటిగొప్ప త్యాగం ఊరికే చేస్తాడా అని అనుకోవలసి వస్తోంది. ఇది ఒక పక్షపుమాట. ఇంకొక పక్షమేమి కనబడుచున్నదంటే - ఆ రోజులలో యిండియాలో పుట్టిన పుకారులనుబట్టియు, అంతకుపూర్వము జరిగిన కథనుబట్టియు, తదుపరి యనుభవమువల్ల గలిగినసారాంశ మును బట్టియు, పూర్వాపర సందర్భములనన్నిటిని బేరీజువేసి చూడగ, ఆ పెద్ద ప్రేరణయేదో వేరే ఊహించుకో నక్కరలేకుండానే తేటతెల్ల మగుచున్నది."

ఎలిఫిన్స్టన్ చెప్పిన సంజాయిషీని పట్టి చూచినట్టయితే, చక్రవర్తిని దబా యించియు, అతనికి తమ బలమును చూపియు, మోసగించియు, యీ పట్టా అతని చేతులలోనుండి* బలాత్కారముగ లాగుకొనబడినట్లు యెవరికిగాని స్పష్టముగాక మానదు.

---

* ఈ పట్టాను తాము దబాయించి తీసుకోలేదనియు, చక్రవర్తి అతని యిచ్చాను సారము, బుద్ధిపూర్వకముగానే, యిచ్చెననియు చెప్పుకొనుట క్లైవునకు ఇంగ్లీషు చరిత్రలకును సహజమేగద. కాని, యిది నిజముకాదని సమకాలికుడగు Seir గ్రంథకర్త స్పష్టముగ చెప్పుచున్నాడు. ఈ వ్యవహారములోని ఆంతర్యమంతయు యితనికి స్వయముగ తెలియును.

"తమకిష్టము లేనప్పటికి చక్రవర్తియు, వజీరును యీ కోరికను (దివానీగిరి పట్టానిచ్చుటను) నెరవేర్పక తప్పినదికాదు." అని యితడు స్పష్టముగ చెప్పుచున్నాడు.

'ఇష్టములేనప్పటికి' అనేమాటకేమియర్థము? అనగ కంపెనీవారు తమబల ప్రదర్శనము చేతను, మోసము చేతను, చక్రవర్తిని దబాయించి పట్టా లాగుకొన్నారని యర్థము కాదా? Seir గ్రంథకారుడే యిట్లుమరియు వ్రాయుచున్నాడు.

[ఇతర సమయములలో యెంతో రాయబారములు, యెంతో కాలము, ఆటుకంపెనీకి ఇంగ్లడు రాజుకు, యిటు పాదుషాకు మంత్రులకు, మధ్య యెన్నో ఆలోచనలు, యెన్నోసంప్రతింపులు యెన్నో కాలహరణములు పట్టేటటువంటి యింతటి గొప్పవ్యవహారము గట్టాచప్పుడు లేకుండ ఒక్క క్షణములో-సంతలో గాడిద బేరం ఫైసలై నంతసేపైన పట్టకుండ-ఫైసలైపోయింది."...క్లుప్తము]

ఈ సమయంలో దివానీగిరి లభించుట కంపెనీవారి కెంతో లాభకారిగ నుండెను.

రివిన్యూ వసూలు పనితోపాటు, సివిల్ పరిపాలనా బాధ్యతనుకూడ కంపెనీ వారప్పుడెందుకు తీసుకొనలేదో క్లైవు 1765 సం॥ సెప్టెంబరు 30-వ తేదీ ఉత్తరములో యిట్లని వ్రాసెను :—

"ఈ రాష్ట్రములను అజమాయిషీచేయు (సివిల్) అధికారము మనయందే యున్నప్పటికి, దానినిప్పుడు మనము చెలాయించరాదు. ఇప్పుడున్న సివిల్ ఉద్యోగుల సంఖ్యకంటె మూడురెట్లమందిని మనము పెట్టినను యీ పనికి చాలరు. ఈ పనిఅంతా యిదివరకున్న నబాబు ఉద్యోగస్తులకే వదలివేస్తే మనకొక దమ్మిడీ ఖర్చుండదు. రివిన్యూవసూలులో మనకు కొంచెము నష్టము గలిగినా, పెద్దతప్పులు చేసినవాళ్లను మనము సులభముగ కనుక్కొని శిక్షించవచ్చును. అదిగాక, యీ దొంగపనులు, మనవాళ్లుగాకుండ, వాళ్లవాళ్లే చేసుకున్నారను తృప్తి మనస్సు కుండును. రాజ్యాధికార భారము నెత్తిన పెట్టుకోవడంవల్ల వచ్చే చిక్కులేమియు మనకు లేకుండ పోవును. నబాబుమాత్రం యింకావుంటాడు. అతనిదగ్గరకు తగిన డబ్బేమో వాని మొగాన పారవేస్తూ వుంటాము. రాష్ట్రముల పరిపాలనాబాధ్యత యంతయు దేశ ప్రముఖుల చేతులలోనే వుంటుంది. వారు మనకు, నబాబుకు, జాయంటుగ జబాబు చెప్పవలసి వుంటారు. డబ్బు సంచీ మాత్రం మన చేతులలో వుంటుంది."

"అదిగాక, కంపినీ ఆఫీసర్లే డబ్బు వసూలుదార్లుగవుంటే యింకొక చిక్కు వుంది. దేశంలో పరాసులు, ఒలందాలు, డేనులు, మున్నగు పరాయి యూరోపియను జాతులవారింకను ఉన్నారు. వారికి మనమీద అసూయ పుట్టుతుంది. వారివల్ల వచ్చేతగాదాలన్నీ మన కోర్టులు తీర్పలేక మచ్చమాస్తుంది. ఈ యూరోపియను జాతులు మన ఇంగ్లీషు కంపినీని బంగాళాదేశముకు నబాబుగ అంగీకరించి, వారు మామూలుగ చెల్లింపవలసిన శిస్తులు, వర్తకముమీది సుంకములు, మనకు చెల్లిస్తారో లేదో అనుమానాస్పదము."

కాబట్టి, రాజ్యకాంక్షలేక కాదు, కంపెనీవారప్పుడు వెంటనే తామే నబాబులమని చెప్పకొనక పోయినది. పరిపాలనాభారము, ఆబాధ్యతలను నెత్తిన పెట్టుకొని, యీదలేని అసమర్థత చేతనే వారప్పుడూరుకొనిరి.

కాని, యిది మంచి పద్ధతికాదనియు, యిందుకు క్లైవు పిరికితనమే కారణమనియు, సర్ ఎడ్వర్డు కోల్‌బ్రుక్ మున్నగు ఆంగ్ల చరిత్రకారులు క్లైవు పద్ధతిని నిందించిరి.

కంపెనీ వారే రాజ్యాధికారము నేల నేరుగ వహింప లేదు.

బీహారులో యుద్ధములందు విజయముల బడసిన పిమ్మట, యేల కంపెనీవారు రాజ్యాధి పత్యమును వహింప నొల్లలేదో క్లైవే 1765 సం॥ సెప్టంబరు 30-వ తేదీన తాను డైరక్టర్లకు వ్రాసిన ఉత్తరములో యిట్లు చెప్పుచున్నాడు :—

"మనమిదివరకు అనేకసార్లు హద్దుమీరి ప్రవర్తించి యుండుటచేత, యిప్పుడు రాజ్యానికివస్తే మనము శాంతముగ వుంటామని హిందూస్థానపు రాజులు సులభముగ తలచుటకు అవకాశములేదు. భయమువల్లతప్ప వారింక ఏఉద్దేశముతోను మనయందనురాగముగలిగి యుండరు. మీర్జాఫరు, మీర్కాసీము, ఆర్కాటునబాబు (నేనెరిగియున్న యుత్తమ మహమ్మదీయ ప్రభువులు) మన ఇంగ్లీషువారి ఆధిక్యమును త్రోసిపుచ్చు సూచనలను గన్పరచి యుండిరి."

కాబట్టి, యిట్టి యుపద్రవస్థితిలో క్లైవు మితత్వముగ ఉండకయేమి చేస్తాడు? అప్పటి పరిస్థితులలో వారికది అవసరమయ్యెను. కంపినీనౌకర్లు, లంచగొండులు, ధనలోలురునగుటచే, ప్రధాన రాజధానిస్థానమునకు దూరముగ వారిచేతులలో రాజ్యాధికారములుపెట్టి యూరకొనుటకు వీలులేకపోయెను. క్లైవు పై జాబులోనే యిట్లు వ్రాసెను :—

"నబాబు మంత్రివర్గమును మన చేతులలో వుంచుకొన్నాము ; దివానీగిరిని సంపాదించినాము ; వజీరుతో గౌరవప్రదమగు షరతులతో సంధిచేసుకొన్నాము. ఇందువల్ల, కొన్ని నెలలకుపూర్వము మనము కలలోకూడ అనుకొననివిధముగ మనకు మంచిపేరు ప్రతిష్ఠలు, లాభములు చేకూరినవి. అయితే, మనకు స్థిరత్వము నిచ్చుటకు యివిచాలవు. మనకు సహజశత్రువులగు దేశీయప్రజలవల్ల మనకెట్టి ముప్పురాకుండ యివి మనను కాపాడవచ్చును. అంతమాత్రముచేత అంతయు భద్రముగ నున్నదని చెప్పుటకు వీలులేదు. అంతః శ్శత్రువర్గమువల్ల మనకెక్కువ అపాయము రాగలదు. ఇంద్రియ లౌల్యము, లంచగొండితనము, దురాశ, కాంచన కాంక్ష, యీ శత్రువులు మీకోటలోని ప్రధానస్థానములను ముట్టడివేసి యున్నవి. ఇవి ఎన్నటికైనను మీకొంప గూల్చును."

ఇట్టి మూకను పెట్టుకొని, క్లైవు విశాలభూభాగము నెట్లు కంపినీ రాజ్యాధికారము క్రిందికి తేగలడు? అదిగాక, యిట్లు చేసియుండినచో, యింగ్లీషువారికి యితర యూరోపియనుజాతులతో తప్పక యుద్ధము వచ్చెడిది. క్లైవు పై ఉత్తరములోనే యిట్లు వ్రాయుచున్నాడు:—

"రాజుపేరు నబాబుమీద వున్నంతకాలము యితర యూరోపియనుజాతులు మననుచూచి అసూయపడరని యిదివరకే నేను సూచించియుంటిని. అయితే, వర్తకం విషయంలో మాత్రము వారికి మనయందు త్వరలోతప్పక అసూయకలుగు

తుంది. మన భయంచేతను, అక్కడక్కడ మనవారుచేయు దుండగములచేతను, అప్పుడే చాలచోట్ల నేతగాండ్రు తమకు మామూలుగ యివ్వనేర్పరచుకొన్న సరకుల నివ్వడంలేదని పరాసు, ఒలందా గిడ్డంగులవారు యిదివరకే బహిరంగముగ ఫిర్యాదులుచేయ సాగినారు. ఈ విషయమై ముందుముందు పెద్దతగాదాలుకూడ వస్తవని నాభయము. వర్తకంలో సగంవంతు మన ఇంగ్లీషువారము వుంచుకొని మిగతా సగం మీరంతా (పరాసు, ఒలందా, డేనులు) మీ యిష్టమువచ్చినచొప్పున పంచుకోండి అని వదిలివేస్తే, యీ తగాదాలన్నీ మాస్తవని నే ననుకుంటాను. ఇక్కడ ఇండియాలో మనము చేసుకొనే వ్యాపారానికి కావలసినడబ్బంతా యిక్కడ (రాజ్యంలోవచ్చే) రివిన్యూలో నుండే తీసుకొని వాడుకుంటాము. ఇందుకొరకిక మీదట మనము యింటిదగ్గరనుంచి దమ్మిడీ తేనక్కరలేదు. అయితే యిక, చీనాలోను, ప్రపంచములో యితర దేశాలలోను మనవ్యాపారానికి పెట్టుబడిడబ్బేది? దీనికి ఉపాయమిది:—ఇండియాలో వ్యాపారంచేయడానికి—యిక్కడ సరుకులు కొనడానికి యితర యూరోపియనుజాతులు వెండిని యిక్కడికి తీసుకొనివస్తవి. వీళ్లవర్తకానికి గనుక మనము యీవిధంగా ప్రోత్సాహమిస్తే, కావలసినంత వెండి దేశంలోకి వస్తుంది. ఈ వెండిని మనము చీనాకు, యితర ప్రాంతాలకు పెట్టుబడి క్రింద పంపుకోవచ్చును. [క్లుప్తము.]''

క్లైవు రాజ్యభారము నెత్తిన పెట్టుకొనక పోవడానికి అసలుకారణమిది. ఈ రాజ్యభారము నెత్తినబెట్టుకొనియుంటే, యితర యూరోపియను జాతులతో కంపెనీవారికి యుద్ధమువచ్చేది; వారివర్తకం కృశించిపోవుటవల్ల ఇంగ్లీషువారికి అప్పుడవసరంగా కావలసిన వెండికూడ దొరకకపోయేది. అందుకొరకే, క్లైవు 'నాకీ రాజ్యభారమువద్దు'సి రాజ్య కాంక్షలేని పెద్దమనిషివలె లోకానికి కనిపించినాడు.

ఈ దివానీగిరి పట్టాను చేతితో పుచ్చుకొని క్లైవు అలహాబాదునుండి కలకత్తాకు వచ్చివేసెను.

## నాజిం ఉద్దౌలా మరణము - క్లైవు చంపించెనా?

మీర్జాఫరు అనంతరము సింహాసనముమీద కూర్చోపెట్టబడిన కుర్రనబాబు నాజిమ్ ఉద్దౌలా "సద్దక్ బాగ్" లో ఆకస్మికముగ ఒకనాడు అనుమానమునకు హేతువైన పరిస్థితులలో చనిపోయెను. ఇందునుగూర్చి సీయర్ గ్రంథకర్త యిట్లు వ్రాయుచున్నాడు :—

"క్లైవు మూర్షిదాబాదులో కొద్దిరోజులుండి, యిక అలహాబాదుకు ప్రయాణమయ్యెను. నాజిమ్ ఉద్దౌలాయు, మహమ్మద్ రజాఖానును (అనగ నబాబును, మంత్రియు) ఇతనిని సిద్దక్ బాగు, అనుచోటువరకును సాగనంపవచ్చిరి. అక్కడున్న తోటలో అందరును కలిసి కొంతసేపు ఉండిరి. అక్కడ నబాబును మంత్రియు క్లైవుకు

చేయవలసిన మర్యాదలనన్నిటిని చేసి సాగనంపిరి. క్లైవటు వెళ్లగానే, నబాబును మంత్రియు, తిరిగి వారి వారి మందిరములకు మరలిరి. ఇంతలో ఆకస్మికముగ నాజిమ్ ఉద్దౌలా నబాబుకు పేగులోనుంచి అపరిమితమైన పోట్లుపుట్టుకువచ్చినవి. అవి అంతకంతకు హెచ్చాయి, అతడు తనమేడముందు బండి దిగేటప్పటికల్లా అతని ప్రాణములను తీసివేసెను.'' (Vol. III. P. 13. Calcutta Reprint.)

ఈ వాక్యములకు దిగువభాగమందు Seir గ్రంథకర్త యట్లు రిమార్కు వ్రాసెను :—

''నేనప్పుడు నబాబుగారి మేడముందు నుంచే వెళ్లుచున్నాను......... దీనికి మహమ్మదు రజాఖానే (మంత్రియే) కారకుడని అప్పుడందరు అనుకొనుచున్నారు.''

ఈ మంత్రి ఇంగ్లీషువారికి యిష్టుడు. ఈ కుర్ర నబాబిట్లు చనిపోవుటను బట్టి చూడగ, క్లైవును, ఈ రజాఖాను, కలిసి యేదో ద్రోహము చేసిరని యూహించవలసివచ్చుచున్నది. ఈ అనుమానము ఆరోజులలో మిక్కిలి హెచ్చుగ నుండెను. అందుచేతనే, దీనినిగూర్చి పార్లమెంటువారుకూడ 1773 సం॥లో పెద్ద విచారణపెట్టవలసివచ్చింది. క్లైవే యేదోద్రోహంచేయించి యీ కుర్ర నబాబును చంపించినాడని అప్పుడు కలకత్తాలో అందరు అనుకొనిరి.

ఈ నబాబంటే క్లైవుకు పడదనుసంగతి అందరికి తెలిసినవిషయమే. ఇతనినిగురించి క్లైవు 1765 సం॥ సెప్టంబరు 30-వ తేదీ ఉత్తరములో డైరక్టర్ల కిట్లని వ్రాసియుండెను.

''ఈ కుర్ర నబాబు మీర్జాఫర్ ఉంచుకున్నదానికి పుట్టినవాడు. వీడు వట్టి చవట. వీనికి శక్తి సామర్థ్యములేమియులేవు. ఇవి సప్లయి చేసుకోడానికి చదువైనా లేదు. వీడు నీచుడు, దుర్బలుడు, జ్ఞానహీనుడు. వీణ్ణిగనుక విచ్చలవిడిగ వదలివేస్తే వీడూ,-వీడి చుట్టుచేరి స్తోత్రపాఠంచేసే దుర్మార్గులు-అంతా యేకమై యథాప్రకారంగా వీడి పూర్వులు చేసినట్లే చేస్తారు. కాబట్టి, వీడి చేతిలో రాజ్యంపెట్టి, వీణ్ణి నమ్మి వుండడానికి వీలులేదు.''

కాబట్టి, యిట్టివాణ్ణి క్లైవు చంపించాడంటే సందేహించవలసిన పనిలేదు. తనపని సాధించుకోడానికి యీ క్లైవు చేయుటకు ఒడిగట్టని దుర్మార్గములేదు. ఈ కుర్రవానిచావువల్ల కంపినీకి బాగాగిట్టుబాటయ్యెను. ఏలననగ, ''యీసందు చూచుకొని, నబాబుకు మామూలుగ మిలిటరీ సిబ్బందికై ప్రతియేటా యివ్వ నేర్పరుచుకొన్న 55 లక్షల రూపాయల భరణమును, 41 లక్షల 81 వేల131 రూపాయలకు తగ్గించిరి.'' (Third Report 1773-P. 325.)

ఈ కుఱ్ఱ నబాబు చావును గూర్చి పార్లమెంటువారు అప్పుడు యిండియాలో పని చేయుచుండిన సైకస్సు, కార్నక్ సేనానులయొక్క సాక్ష్యమును పుచ్చుకొనిరి.

ఇందులో ద్రోహమేమియు జరుగలేదని వీరు సాక్ష్యములో చెప్పిరనుకోండి. అయితే బహిరంగ విచారణలో వారట్లుగాక, యింకెట్లు చెప్పగలరు?

ఈ యిద్దరు సాక్షులు క్లైవుకు చాలకావలసిన స్నేహితులు. రాజ్యపాలనా వ్యవహారములలో వీరందరుకలసి ఒకటిగ పనిచేసియుండిరి. బహుశః, యీ ద్రోహ కార్యములో వీరికికూడ జోక్యమున్నదేమో యెవరు చెప్పగలరు? ఏలననగ, "ఇందు విషయమై ద్రోహము జరిగినదని కలకత్తాలో పెద్ద పుకారులున్నట్లును, యీ ద్రోహమునకు క్లైవును, అతనితో కలిసి రాజ్య వ్యవహారములు నడుపుచున్న పెద్ద మనుష్యులును కారకులైనట్లును, వారి విరోధులు అనుకొనుచున్నట్లు వరల్స్టు ఒక ప్రయివేటు ఉత్తరములో వ్రాసెను":—(Third Report P. 325.)

కాబట్టి, సైకస్సు, కార్నకులు, చెప్పిన సాక్ష్యము నమ్మదగినదికాదు. వారు నిర్దోషులగు సాక్షులుకారు.

ఈ కుఱ్ఱ నబాబు చావులో, యిదివరకు మహమ్మదీయ నబాబులకున్న ఆకాస్తపేరు కూడ బెంగాలు చరిత్రలోనుండి పూర్తిగ మాసిపోయినది. ఇక యింతటినుంచి బెంగాలు చరిత్రయంతయు ఇంగ్లీషు జాతికి చెందిన కిరస్తానీ గవర్నరుల పేర్లతోనే నిండియున్నది.



# బ్రిటిష్ మహాయుగము

## ఏడవ అధ్యాయము



### ఇండియాలో క్లైవుయొక్క ఆఖరురోజులు.

బంగాళా దేశములో కంపెనీ వ్యవహారములను చక్కబరచి, యిదివరకున్న లోపములను తొలగించివేయు గొప్ప సంకల్పముతో క్లైవు మహాడంబరముగ సీమ నుండి బయలుదేరి వచ్చెను. ఆఖరుకు, ఇతడు మాట్లాడినమాట లెక్కవయు, చేసిన పని తక్కువయు అయ్యెను. పరిపాలనలో మంచి కొత్తమార్గముల ప్రవేశపెట్టుట, బహుశః యితనికి గిట్టలేదేమో; లేక, నిజముగ అతని కట్టిశక్తి లేదో తెలియదు. ఉన్న నిజమేమనగ, యితని ప్రవర్తన యెవరికి గిట్టలేదు. ఇతడనిన యెవరికి గౌరవము లేక పోయెను. డైరెక్టర్లు యితనికి చేతినిండ కావలసినంత అధికార మిచ్చినప్పటికి, యితడు తన వారినే తన పలుకుబడిలోనికి తెచ్చుకోలేక పోయినాడు. వీడు నైతికముగ * కుళ్లి పురుగులు కారుచున్నట్లు వారు తలంచిరి. "తన † సొంతలాభము నిమిత్తము

క్లైవు అవగుణములు.

---

* క్లైవు జీవితచరిత్రను వ్రాసిన "కారాసియోలీ" (Caraccioli) అను నతడు తన గ్రంథము మొదటి సంపుటము 447 పేజీలో-క్లైవుయొక్క రంకువ్యవహారము నొకదానిని బయలుపెట్టుచున్నాడు:—

"ఇతడొక కులీనస్త్రీకి తనతోరమ్మని రహస్యముగ ఉత్తరము వ్రాసి దానిని సదరు స్త్రీయొక్క దాసీద్వారా ఆమెపరుండు పరుపుక్రింద పెట్టించినట్లును, ఆ వుత్తరమును ఆమె చూచుకొని, గట్టిగ చివాట్లుపెట్టుచు తిరిగి జబాబు వ్రాసి పంపించినట్లును, అంతటితో. క్లైవు నోరు మూసుకొని ఊరకున్నట్లును ఈ చరిత్రకారుడు చెప్పుచున్నాడు. బెంగాలులో అనేకమంది నల్లస్త్రీలు, తెల్లస్త్రీలు కూడ యిట్లే యితని రంకుపోకడలను తిరస్కరించి, యితనిని నలుగురిలో అల్లరిచేసినట్లు అనేక నిదర్శనములు గలవని, ఈ చరిత్రకారుడు చెప్పుచున్నాడు (క్లుప్తము.)"

† "దేశీయ ప్రభువులవద్ద బహుమతులేమియు పుచ్చుకోరాదని డైరక్టర్లు ఖండితముగ నిషేధించి, అందులకుగాను తమ నౌకర్లచేత కరారునామాలు వ్రాయించి పుచ్చుకొన్నప్పటికి, క్లైవు కుబ్రనబాబు నాజిం ఉద్దౌలాదగ్గిర 5 లక్షల రూపాయల బహుమతిని పుచ్చుకొనెను. ఇది "బహుమతి" కాదనియు, మీర్జాఫర్ చచ్చిపోతూ విల్లులో తన కీసొమ్ము యివ్వవలసినదిగా వ్రాసెననియు, కాబట్టి దానిని తాను పుచ్చుకొంటిననియు క్లైవు సమర్థించుకొనజూచెను. కాని, విల్లుద్వారా సంక్రమించినదని పేరుచెప్పి ప్రతివాడు డబ్బుపుచ్చుకోవడం సాగిస్తే, యిక ఈ 'కరారునామా'లు వ్రాయించి పుచ్చుకొన్నందువల్ల వచ్చిన ప్రయోజనమేమి?—యని జేమ్సు మిల్లు అను చరిత్రకారుడు (Vol. III P. 304—305 Fifth Edition) ప్రశ్నించుచున్నాడు—క్లుప్తము."

వీడెంతటి నీచకార్యమునైనను చేయుటకు జంకడని" వారు తలంచిరి. ఇట్టి స్థితిలో యితడు కంపెనీ వ్యవహారములెట్లు బాగుచేయగలడు? చేయవలెనను సంకల్ప మెంతయున్నను, అది అతనికి సాధ్యము కాకపోయెను.

ఎంతో అల్లరికి, తగాదాలకు, కారణమై, డైరెక్టర్లచే సైతము కఠినముగ నిషేధింపబడిన ప్రయివేటు వర్తకము నితడు ఆపలేకపోయెను. ఆపలేకపోగా, వ్యవహారములను మరింత అధ్వాన్నము చేసినాడు. ఉప్పు వ్యాపారము యావత్తు కంపెనీ నౌకర్లకే మిరాశీ యిచ్చివేసినాడు! 1765 సం॥ సెప్టంబరు 30-వ తేదీ ఉత్తరములో క్లైవు యిట్లు వ్రాసెను:- "ఉప్పు వర్తకంవిషయమై నేనుచేసిన ఏర్పాటు మీకు సంతృప్తిగ నున్నదని తలచెదను. కంపెనీయు, గుమాస్తాలును కలిసి యీ వ్యాపారము చెరిసగముగ చేసుకుంటే వీలుగ వుంటుందేమోయని నేను మొదట అనుకున్నాను. కాని, బాగా ఆలోచించిచూడగ, యీ వ్యాపారంలోకి కంపెనీదిగడం వారిదర్జాకు అంత బాగా వుండదని నాకు తోచినది. కాబట్టి, దీని నంతా కంపెనీ నౌకర్లకే మిరాశీ యిచ్చివేస్తే బాగుంటుందని ఆఖరుకు నేను నిశ్చయించినాను. వచ్చేలాభాలలో సగం కంపెనీకి పన్నుక్రింద యిచ్చే ఏర్పాటుచేసినాను. ఈ లెఖ్ఖప్రకారం యిది అసలుఖరీదులో నూటికి 35 రూపాయల చొప్పున పన్ను అయినట్లు తేలినది. వచ్చే సంవత్సరం యింకా యెక్కువపన్ను వెయ్యడానికి వీలుంటుందని అనుకుంటాను :—క్లుప్తము."

ఉప్పువగైరా వర్తకములలో క్లైవుకు భాగం - ప్రజాహింస.

గాలి, నీరువలె ప్రాణికోటికి యింతటి అవసరమైన ఉప్పుమీద యింతటి దుర్భరమగు పన్నువేసి బీదప్రజలను హింసపెట్టిరి. వారిందువలన అనేక రోగములకు గురియైరి. ఇదంతయు క్లైవుయొక్కయు అతని కిరస్తానీ ముఠాయొక్కయు దురాకాంక్షవలన గలిగినది. * వక్కలు, పొగాకు, మిరాశీనిగూర్చి క్లైవు యిట్లు వ్రాసెను:—

* ఉప్పుమున్నగు వస్తువులపై మిరాశీని తీసివేయవలసినదని డైరక్టర్లు యెన్నోసార్లు కలకత్తాలోని తమనౌకర్లకు వ్రాసిరి. కాని, వారా ఉత్తరములను లక్ష్యముచేయలేదు. క్లైవు యింగ్లండుకు వెళ్లిపోయిన తరువాతకూడ ఈతడీఉప్పు మిరాశీవర్తకమునుగూర్చి యింకను సమర్థించుచునే వ్రాయజొచ్చెను. 1767 సం॥ నవంబరు 11-వ తేదీన 'బాత్' పట్టణమునుండి యితడు కంపెనీ డైరెక్టర్లకు యిట్లని వ్రాసెను:—

"ఇండియాలో మీరు ఉప్పువర్తకమును అందరికి బాహాటముగ వదిలివేయ దలచుకొన్నట్లు విని నాకు చాల ఆశ్చర్యమైనది. ఇకనుండి కోఠారులవద్ద నూరు మణుగులకు పది రూపాయల పన్ను మాత్రమే పుచ్చుకొనవలచిరట." నేనిక్కడ ఒకసంగతి మనవిచేయవలసియున్నది. ఉప్పువర్తకం మొదటినుంచి మిరాశీగానే యున్నది.........ఇప్పుడు మీ రివ్వదల చుకొన్న హక్కు, సౌకర్యము, దేశీయప్రజల కిదివర కెన్నడునులేదు. ఇట్టి సౌకర్యమును వారెన్నడు యెరుగరు. ఒక్కసారిగ మీరు వారికింతటి సౌకర్యములను, చనువును, యిచ్చినారంటే వారికి ఉక్కిరి బిక్కిరియగును."

“వక్కలు, పొగాకు, అంత ముఖ్యమైనవికావు. అందులో అట్టేలాభం కూడ రాదు. కాబట్టి వీటిపై పన్ను తక్కువగ ఉండాలి.”

క్లైవు వ్యవహారమును తల్లక్రిందుచేసెను. ఉప్పు జీవితావసరమైన వస్తువు. పొగాకు, వక్కలు అన్నచో అవి భోగపదార్థములు, కాబట్టి, అవసరమగు వస్తువు కంటె భోగపదార్థములపై యెక్కువ పన్ను విధించుట ధర్మము. కాని, క్లైవు యీ సిద్ధాంతమునకు వ్యతిరేకముగ, భోగపదార్థములపై తక్కువ పన్నును, అవసరపదార్థములపై యెక్కువ పన్నును విధించెను.

ఏ విధముగ చూచినప్పటికి, క్లైవు దేశీయ ప్రజలకు గోరంత ఉపకారము చేసినట్లు గాన్పింపదు. పైగా వారిని దోచుకొని, తనయింటిని, తన ముఠావారి యింటిని నింపుకొన్నాడు. ఇతడు రాజ్యపరిపాలనలో ప్రవేశపెట్టిన మార్పులు అన్నీ తనవారికి మరింతసొమ్ము కట్టబెట్టుటకే ఉపయోగపడునవిగ వున్నవిగాని, వా రిదివరలో ప్రజలను పెట్టిన క్షోభలను నివారించునవిగ లేవు. ఈ యింగ్లీషు వారు రాను రాను మనుష్యులను పీకుకొని తిను ‘రాంబొందులుగ’ తయారగు చుండిరి. ఈతడు ప్రవేశపెట్టిన యీద్వంద్వపరిపాలన—పేరు నబాబుది, నోరు యింగ్లీషువారిదిగ—నుండి, యెన్నో అనర్థములకు కారణమయ్యెనని మిల్లువంటి ఆంగ్లేయచరిత్రకారులే ఖండించి యుండిరి.

**క్లైవు సీమకు వెళ్ళిపోవుట - ఆత్మహత్య.**

1767 సం॥లో క్లైవు ఆఖరుపర్యాయము సీమకు వెళ్ళిపోయెను. ఆతడింగ్లండులో దరిమిలా చేసినపనులనుగూర్చి, మనకంత ప్రమేయము లేదు. ఆతడక్కడ “ఇండియన్ నబాబు” గ ప్రవర్తింప సాగెను. ఇది తక్కినవారికెంతయో అసహ్యముగ నుండెను. చివర కిదియే యితనిని పార్లమెంటుయెదుట తూరుపారపట్టుటకు హేతువయ్యెను. తా నిండియాలో రాజ్యస్థాపనచేయుటకై చేసియుండిన పనులనుగూర్చి సంజాయిషీ చెప్పుకొనుట కితడు పార్లమెంటు కమిటీముందుకు సాక్షిగ గొనిరాబడెను. ఈతడు చివరకు ఆత్మహత్య చేసుకొనెను. తన పాపభారము నాతడు భరించలేక చివరకు క్లైవు తన ప్రాణములను తానే తీసుకొనెనని యింగ్లండులో కొందరనుకొనిరి. ఫోర్జరీ చేసి ఒమీచందును టోపీవేయుట, సురాజ్ ఉద్దౌలా, నాజిం ఉద్దౌలాలను రహస్యముగ చంపించుట, అనేకమంది తన క్రైస్తవ మిత్రుల భార్యలను చెరచి వారి సంసారములను దుఃఖభాజనముచేయుట—యీ పాపములన్నీ తలంపునకు రాగా, వానిని భరించలేక ఆఖరుకు క్లైవు ఆత్మహత్య చేసుకొనెనని యింగ్లండులో అప్పుడు కొందరనుకొన జొచ్చిరి.

మొత్తముమీద, క్లైవు అదృష్టజాతకుడు. అదేమోగాని అతడు పట్టినదెల్ల బంగారమగుచు వచ్చెను. ఇతనికి పాపభీతి లేదు. ఉచ్చనీచములు లేవు. కార్య

సాధనయే యితనికి పరమావధి. కృతజ్ఞతయనునది యితనిలో కంచు కాగడాలతో వెతకినను కానరాదు. ఈతడిట్టివాడగుటచేతనే ప్రపంచమంతయు అతనికి శ్లేగాన్పించెను. ముఖ్యముగ యిండియాలో నున్న మహమ్మదీయుల విషయమై యీతనికి చాల నీచమగు అభిప్రాయముండెను. ఇందుకొక ఉదాహరణ మాత్రము చూపెదము. డైరక్టర్లకు వ్రాసిన ఉత్తరములలో ఒకదానిలో యీతడిట్లు వ్రాసెను:—

"ముసల్మానులకు కృతజ్ఞతయనునది లేనే లేదు. ఎదురున్నంత సేపేతప్ప, వారు ఆడినమాటకు నిలబడే స్వభావము లేదు. ఈ సంగతి నాకురోజురోజు అనుభవమువల్ల తెలుస్తోంది. రవంతసందు దొరికితే తప్పించుకు పోవాలని వారు పొంచివుంటారు. (**Long's Selections P. 151**).

కామెర్లరోగికి ప్రపంచమంతా పచ్చగ గన్పించినట్లు క్లైవుకు తన స్వభావమే, తన యిఙ్లీషు మతాస్వభావమే, యెక్కడజూచినను దర్పణములోవలె గాన్పించెను.

## బెంగాల్ ద్వంద్వపరిపాలన - ప్రజల దుర్గతి

క్లైవు తరువాత "వరల్స్టు" గవర్నర్ అయ్యెను. ఇతని హయాములో రాచకీయ వ్యవహారము లంతగ యేమియు లేవు. ఇతడు కొద్దికాలమే గవర్నరుగ వుండి 1768 సం॥ అగష్టులో రాజీనామా యిచ్చెను. ఇతని తరువాత "కార్టియర్" గవర్నర్గ వచ్చి 1772 సం॥ వరకు వుండెను. పిమ్మట 'వారన్ హేస్టింగ్సు' గవర్నర్ అయ్యెను. క్లైవు, వారన్ హేస్టింగ్సుల మధ్య అంతగ చెప్పకోదగిన రాజకీయాంశము లేమియు లేవు. ఈప్రశాంత స్థితిలో రాజ్యపాలన యనగ యేమిటో నేర్చుకోడానికి వారి కిటీవల లభించిన దివానీగిరి పదవివలన కంపెనీ నౌకర్లకు అవకాశము చిక్కెను. బంగాళాయొక్క సివిల్ పరిపాలన యెట్లుజరగెనో **Seir** గ్రంథకర్త యిట్లు చెప్పుచున్నాడు:—

"సితాబ్ రాయి, మహమ్మద్ రజాఖాన్, జీసరత్ ఖాన్, బహద్దూర్,— ఈ నలుగురు రాజ్యపరిపాలనను, సివిన్యాయ సంబంధించిన వ్యవహారముల నన్నిటిని, జూచుచు కంపెనీకి లాభకరముగ నుండు రీతిని వ్యవహరింపుచుండవలెను. ఏ వారములో యేమేమి చేసినది వారమునకు రెండుసార్లు అమా యింగ్లీషు అధికారులకు తప్సీలుగ రిపోర్టులు పంపించవలెను. ఈ నివేదికపైన యింగ్లీషు అధికారులు సంతకములు చేయుదురు. ప్రతిజిల్లాలోను ప్రతివారము యెంతడబ్బు వసూలైనది, యెంత ఖర్చైనది తెలుపు జమాఖర్చు లెక్కల మీద ఆ సూజిల్లాలలో నుండు యింగ్లీషు అధికారు లీ ప్రకారముగనే సంతకములు చేయుదురు. ఈ లెక్కలనన్నిటిని దిగువ అధికారులు సంవత్సరమున కొకసారి కలకత్తాకు పంపించి కంపినీ రిజష్టరులలో

చేర్పింతురు. ఇక, న్యాయపరిపాలన విషయములో-చిల్లర కేసులనన్నిటిని 'దరోగానే' (అనగ, ఇదివరకున్న న్యాయాధికారినే) చూచుచుండమనిరి. పెద్ద కేసులను జిల్లాయధికారియు, యింగ్లీషు అధికారియు కలిసికూర్చుండి పరిష్కరించు చుండిరి. ఈ పనికి వారములో రెండురోజులను ప్రత్యేకించి యుంచిరి. ఈ ప్రకారముగ వ్యవహారమునడిచినది. ప్రజలయొక్క ఆచారవ్యవహారములను యింగ్లీషువారు క్రమక్రమముగ తెలుసుకొన మొదలిడిరి. వారిందుకొక, నియమ మేర్పరుచుకొనిరి. ప్రతి యింగ్లీషువాడు తెల్లకాగితాలతో ఒక చిన్నబుక్కు మాదిరిగ కుట్టుకొని, యెల్లప్పుడు దగ్గిరవుంచుకొని, వ్యవహారము బాగుగా తెలిసిన యెవరివల్లనైనా యేదైన ప్రాముఖ్యమగు సంగతినివిన్నప్పుడు తక్షణమే దానిని సదరు తెల్ల కాగితాలమీద నోటు చేసుకోవలెను. వీనినన్నిటిని తరువాత చేర్చి చక్కని పుస్తకముగ బైండుచేయించి తరువాత యెప్పుడైనా యెవరికైనా ఉపయోగించుకోడానికి వీలుగ వుండేటట్లు వుంచవలెను.'' (Vol. III. P 25—క్లుప్తము).

ఈద్వందపరిపాలన సర్వానర్థములకు మూలమయ్యెను. దేశమెక్కడ చూచినను అరాచకమే. ఎవరి ప్రాణమునకుగాని, ఆస్తికిగాని, భద్రతలేదు. దీనికి ఇంగ్లీషువారే ప్రధానముగ కారకులు. ప్రజలకత్యవసరముగ కావలసిన ఉప్పు వగైరాల వ్యాపారములను యింగ్లీషువారే తమచేతులలో మిరాశీగా పెట్టుకొనిరి. చేతిపనులనన్నిటిని వారు నాశనముచేసి పారవేసిరి. వెండిబంగారు నగలను, నానా రకముల నాణెములను వారు దేశమును దాటించి సీమకు తీసుకొనిపోవుచుండిరి. అందుచే దేశములో డబ్బుకరవయ్యెను. ఇట్టి స్థితిలో బంగాళాలో ప్రజలందరు చెట్టుకొకడు, పుట్టకొకడుగ, పట్టిపోయిరన్నచో ఆశ్చర్యమేమి? దేశచరిత్ర, సంఘచరిత్ర అంతాగాకపోయినను చాలభాగము ఆర్థిక స్థితిగతులవల్లనే నిర్ధారణయగుచున్నదని చాలమంది 'శాలిగ్నమ్' వంటి పాశ్చాత్యపండితులే వాదించుచున్నారు. దేశమున కిట్టి ఆర్థిక దుస్థితిని తెచ్చిపెట్టి యింగ్లీషువారు భరతఖండ చరిత్రను దౌర్భాగ్య మొనర్చిరి.

పైగా, యీ తప్పును వారు పరులమీద త్రోయజూచిరి. దేశంలో డబ్బు లేకపోవడానికి కారణము 'మీర్కాసీమే' యని వారు నిందించు చున్నారు. ఈ డబ్బునంతను మీర్కాసీమే మూటలుగట్టి యెత్తుకొని పారిపోయినాడట. ఢిల్లీ పాదుషాకు వారిట్లు 1764 సం॥ జనవరి 1 వ-తేదీన వ్రాసిరి:—

''మీకు పంపించుటకుగాను వసూలుపరచి ఖజానాలోనుంచిన సొమ్మంతా మీర్కాసీము యెత్తుకు పారిపోయినాడు. ఇదిగాక, దేశంలో ఉండే ధనమంతా కూడ యెత్తుకు పారిపోయినాడు.''

ఈమాట యెవరైనా నమ్మడానికి వీలున్నా? దేశంలో దమ్మిడీ లేకుండ ఊడ్చిపెట్టుకొని అతడెత్తుకొని పోగలడా? ... మీర్జాఫర్ సీము దొంగతనము కంటె యింగ్లీషువారి దుండగములే యెక్కువ కారణములని చెప్పి తీరవలెను. దేశములోనివర్తకమంతయు వీరిచే యెట్లు నాశనము చేయబడెనో చెప్పియుంటిమి. ఒకప్పుడు మహావైభవముతోనుండిన బంగాళాదేశ పరిశ్రమలకు యీకంపెనీ వారివల్ల యెట్టిగతి పట్టినదో 'బోల్ట్సు' అను ఆంగ్లేయుడు వ్రాసిన "Considerations of the affairs of East India Company" అను గ్రంథమువలన తేటతెల్లము కాగలదు.

ప్లాసీయుద్ధమైన పదేండ్ల తరువాత యీ 'బోల్ట్సు' యిండియాను విడిచిపెట్టి వెళ్లవలసి వచ్చినది. ఈతడు చాల ఉద్రేకి—చెడుగును యెన్నడు సహించెడివాడుకాడు. ఇంగ్లీషువారు ఇండియాలో చేయుచున్న దుర్మార్గముల నన్నిటిని యితడు కండ్లారచూచి, వానిని నిర్మొగమోటముగ ఖండించుచుండెను. ఇందువల్ల కలకత్తాలోనున్న యింగ్లీషువారికి యితనిమీద కోపమువచ్చినది. తక్షణమే యితనిని యిండియాలో వుండడానికి వీలులేదని చెప్పి, ఓడయెక్కించి ఇంగ్లండుకు పంపివేసిరి. (Long's Selections Pp. 481-491)

'బోల్ట్సు' చెప్పిన సంగతులు చాల విలువనైనవి. ఏలననగ, యితడు కండ్లారచూచిన సంగతులను చెప్పెను.

ఇండియాలో వుండే వెండియంతయు కాల్వలుగట్టి పరదేశముల పాలగుచుండెను. ఇందునుగూర్చి కలకత్తా గవర్నరు 'వరల్‌స్టు' డైరక్టర్లకిట్లు వ్రాసెను.

"ఇక్కడనుండి యిదివరకు ఢిల్లీకి (పాదుషా ఖజానాకు) యెంతడబ్బు వెళ్లినను అదితిరిగి వర్తకరూపేణా బెంగాలుకు వచ్చుచుండెడిది. ఈరీతిగ బంగాళాదేశము యిండియాలో నానా ప్రాంతములనుండి ధనము నాకర్షించు కేంద్రస్థానముగ నుండెడిది. బెంగాలులో తయారైన వస్తువులు హిందూస్థానములో నానా ప్రాంతములకు—మూలమూలకు కూడ—పోయెడివి. అక్కడనుండి ధనము అనంతముఖముల యిక్కడికి ప్రవహించెడిది. (కాని, యిప్పుడా కాల్వలన్నియు యెండిపోయినవి.) యూరోపియను కంపెనీలన్నీ తమ దేశములనుండి డబ్బుతెచ్చి యిక్కడ పెట్టుబడి పెట్టుచుండిరి. అరేబియా, పరిషియా, సింధుతీరములనుండి ప్రవాహములువచ్చి యీ దేశములో పడుచుండెడివి. భరతఖండము యీ మూలనుండి ఆ మూలవరకు, పశ్చిమమున గుజరాతువరకు వ్యాపారము నడచుచుండెడిది. ఇది పూర్వచరిత్ర—అహా! ఇప్పుడీ చరిత్ర యెట్లు మారిపోయినది! మీర్జాఫర్ సీము యీ మధ్యనే యెంతోధనము దోచుకొని పోయినాడు. ఈ డబ్బే గనుక నిలవ వుంటే, ముందు రాబోయే దెబ్బలకు తాపుకాశీగ వుండేది. ప్రతి యూరోపియను కంపెనీకూడ యీ దేశంలో తీసుకొన్న డబ్బునుండే, తమ వర్తకానికి పెట్టుబడి

పెట్టి, సరుకులుకొని, తమతమ దేశములకు పంపించుకొను చున్నారు. వారిప్పు డొక్క దమ్మిడీ యైనను తమ దేశములనుండి యిక్కడకు తేవడము మానివేసి నారు. అదిగాక, యూరపు ఖండమునకు యెగుమతు లెక్కువగుట చేత, యిక్కడి ప్రజల పరిశ్రమలకు చాల యిబ్బంది కలుగుచున్నది. దీనివల్ల, పరదేశాలనుండి బెంగాలులోకివచ్చిపడే డబ్బుగాని, సరుకుగాని యేమైనా వుందా అంటే అదీ కన పడదు. జిడ్డా, మక్కా, బస్రాలతో జరుగు వ్యాపారంలో తప్ప, యితర పరదేశా లతో జరుగు వ్యాపారంవల్ల యిండియాకు మిగిలేదేమియు కన్పించుటలేదు. ఈ మూడుచోట్లనుండి యైనను యీ నాలుగేండ్లలో 15 లక్షలైనా రాలేదు.

"బెంగాలు, బీహారు, ఒరిస్సారాష్ట్రములు మన అధికారము క్రిందికి వచ్చేటప్పటికి ధనధాన్యములతోను, అసంఖ్యాకమగు ప్రజలతోను, అనాదినుండి ప్రసిద్ధి కెక్కిన పరిశ్రమలతోను, కలకల లాడుచుండెను. ఆలి వర్దీఖాన్ కాలములో నిరంతరము వచ్చి పడుచుండిన మరాటీ దండులవల్లను,—మందమతియగు సురాజ్ ఉద్దౌలా మంత్రుల దురాకాంక్షవల్లను,—మీర్జాఫరు కక్కురితివల్లను,—దురాశా పాతకుడును, రక్తప్రియుడును నగు మీర్కాసీమునియినుప పిడికిలి పోట్లవల్లను— భాగ్యవంతుల భాగ్యమును, పేదల చేతి వృత్తులును సమూలముగ నాశనమై పోయినవి. భాగ్యవంతులు పేదలైనారు; పేదలు పరదేశముల పాలైనారు. ఈ దురవస్థకు తోడు, యీ దిగువ చెప్పబోవు కష్టములుకూడ కలిగితే యింక చెప్పెడిదేముండును? మీర్కాసీము అనేకయుద్ధములలో ఓడిపోయి, యిక రాజ్యము ఆశ వదలు కొని, దేశమునుండి పారిపోయేటప్పుడు 4, 5 కోట్లరూపాయల విలువగల నగలను ధనమును యెత్తుకొని పోయెను. ఇది ఒకదెబ్బ. ఇక రెండవదెబ్బ యేమనగ— మనము ఢిల్లీపాదుషాకు సాలుకు 26 లక్షలు కప్పము చెల్లించు చున్నాము. ఇది గాక, సైన్యపు ఖర్చులక్రింద అతనికి 20 లక్షలు చెల్లించు చున్నాము. ఈ రెండు మొత్తములు యేటేటా మన చేతులలో నుండే పోవుచుండుటనుబట్టి మనచుట్టు పట్టుల ప్రాంతములలో డబ్బెక్కడను ఆడుటలేదు. ఇక మూడవదెబ్బ—మన ఇంగ్లీషువారమును, యితర యూరోపియను జాతులవారును, యేటా యీ దేశములో నుండి తీసుకొనిపోయే సరుకులకు మితములేదు. ఇందువల్ల ఇండియాకు దమ్మిడీ ప్రతిఫలము తిరిగిరావడములేదు. ఇక నాల్గవదెబ్బ—చీనాకు, యితర రాజధానులకు, మనము గత మూడేండ్లనుంచి యెంతో వెండిని యీ బంగాళాదేశమునుండి పంపించు చున్నాము. అయిదవదెబ్బ యేమనగ—యితరదేశాల హుండీలకై మన యెంతో డబ్బును పరాయి దేశస్థులకిచ్చి వేయుచున్నాము. ఇన్నిదెబ్బలు ఒక్క సారిగ యేకమై పడినప్పుడు ప్రపంచములో యెంతటి భాగ్యవంతమైన దేశమైనను, తక్షణమే దుంపనాశనముకాక మానదు. అట్టిచో, యిదివరకే క్షీణించి, కునికి పోవుచున్న యీ బంగాళాదేశమువంటి దేశమెట్లుబ్రతుక గలదు? అయినప్పటికి,

యిట్టి దేశమునుండియే మీరును, మన యింగ్లీషుప్రజలును, వెండిని యింకను తీసుకొని పోవుచున్నారు. ఈ దేశములో వెండి బంగారములు ఆ ట్టె విశేషముగ దొరకవు. విదేశ వ్యాపారానికి కావలెనంటే యితర దేశాలనుండియే యిక్కడికి యెంతో వెండి రావలసివుంది. అయినప్పటికి, యిక్కడనుండియే వెండి తీసుకొని పోవాలని మీరు చూచుచున్నారు''

గత మూడేండ్లలో బెంగాలునుండి పర దేశములకు పోయిన వెండి 50 లక్షల నవరసుల విలువ గలదనియు, పర దేశములనుండి బెంగాలుకువచ్చిన వెండి సుమారు 50 లక్ష లుండె ననియు వీలర్ వ్రాయుచున్నాడు.

బెంగాలులో ఆ కాలములో ప్రజలు డబ్బుకు పడిన యిబ్బందినిగూర్చి Seir గ్రంథకర్త యిట్లు వ్రాయుచున్నాడు :—

"ఈ సమయములో బెంగాలులో డబ్బు అపరూపము గా జొచ్చెను. ఈ డబ్బుకరువుకు కారణము ప్రభువులుచేసిన పీడయో, ప్రభువుల లోభత్వమో, లేక ఇంగ్లీషువారు యేటేటా లెక్కలేనన్ని నాణెములను యింగ్లండుకు చేరవేయుటయో చెప్పజాలము. ప్రతియేటా 5, 6 గురకు తక్కువలేకుండా ఇంగ్లీషువారు పెద్దపెద్ద ధనపుమూటలతో ఓడయెక్కి యింగ్లండుకు వెళ్లిపోవడం మామూలైపోయింది. ఈ రీతిగ లక్షలకు లక్షలు దేశములోనుండి పోయినవి. ధాన్యం చవకగవుంది కాబట్టి, యిది ఒక సుగుణమే అంటామా, అదీకనపడదు. ఏలననగ, డబ్బుకరవగుటచేతనే, ధాన్యం చవకఅయినది. అంతేకాని, వేరేకారణంచేతకాదు. దేశంలో డబ్బులేదు. మనుష్యులు లేరు, పశువులులేవు. (అంతా బీడైనది) ఇంతేగాదు. పూర్వము నబాబు కొలువులోను, జమీందారులదగ్గిరను, వారి ఆశ్రితులవద్దను యెందరో నౌకర్లు, యెందరో రౌతులు, షుమారు 70, 80 వేలమంది జీతనాతములు తీసుకొని బ్రతుకుతూవుండేవారు. వారిలో యిప్పుడు ఒక్కడుకూడ కనబడడు. గుఱ్ఱమెక్కిన రౌతే యిప్పుడీ ప్రాంతములలో చూద్దామన్నాగాని కనబడడు. ప్రతిజిల్లాలో పంటలుపాడైనవి. కరువుచేత, రోగాలచేత, లెక్కలేనంతమంది ప్రజలు చచ్చిపోయినారు. ఈ ప్రజానాశనం యీరీతిగ యింకా సాగిపోవుచునే యున్నది. ఇందువల్ల, దున్నువాడులేక బీడుపడిపోయిన పొలములు రోజురోజు ఎక్కువగుచున్నవి. దున్ని పండించినపొలములలోని పంటను కొను దిక్కులేదు. ఇంగ్లీషువారు యేటా యీ బెంగాల్ బీహారు ప్రాంతములలో సూరేకారము, నల్లమందు, ముడిపట్టు, తెల్లమల్లులు మున్నగు సరుకులను యేకొలదిగనో కొనుచుంటుటబట్టిగాని, లేకపోతే, ప్రజలకంటికి ఒక్కరూపాయికూడా అసలు కనపడేదేకాదు. పుట్టబోయే పిల్లలకు రూపాయిఅంటే యేమిటో తెలిసేదేకాదు. (Vol. III P. 82 Calcutta Reprint—క్లుప్తము.)''

ఇట్టి దురవస్థలో, గోరుచుట్టుమీద రోకటిపోటన్నట్లు, ఒక సంవత్సరము వర్షములు కురువలేదు. కంపెనీవారు లోగడ యిట్టి దుండగములుచేసి, డబ్బును, సరుకులను, దోచుకొనిపోయి యుండకుండ నుండియున్నచో, యింతమాత్రమునకు దేశములో కరువువచ్చెడిదికాదు. ఈ అనావృష్టితోపాటు మశూచి అమ్మవారు కూడ దేశంలో ప్రత్యక్షమై, పిన్నలను పెద్దలను, యావన్మందిని మ్రింగివేయసాగెను.

## బెంగాల్ కరువు—కంపెనీ పరిపాలనా ఫలితము.

పబ్లిక్ రికార్డులలో యిట్లున్నది:—"కరువు రాగానే తమపని బాగున్న కొందరు యేజెంట్లు ధాన్యమును నిలువచేయ సాగిరి. హిందూప్రజలు చావనైనా చస్తారుగాని మాంసముతిని ప్రాణాలు నిలుపుకోడానికి ఒప్పుకోరని వీరికి బాగా తెలుసును. కాబట్టి, యెంతధరయైనను యిచ్చి, తమవద్ద ధాన్యమైనా కొనుక్కో వాలి, లేకపోతే చావాలి. ఈస్థితిలో ప్రజలు క్రుంగిపోయినారు. రైతులు భూములు దున్ని పంట పండించినారు. కాని, ఆపంటను పరాయివారు యెత్తుకొని పోవు చున్నారు............యిక కరువువచ్చినది............ఉన్న భాగ్యవంతులగు యేజెంట్లు తమ మిరాశీని బాగా సాగించుకున్నారు. కృశించిపోవుచున్న ప్రజలు చచ్చిన తమవారిని దహనమైన చేసుకోలేక పాతిపెట్టనైనలేక శవములనట్లే వదలి వేసినారు."

(Short History of the English Transactions in the East India - P. 145.)

1771 సం॥ డిశంబరు 18–వ తేదీన డైరక్టర్లు తమ కలకత్తాలోని నౌకర్ల నీట్లు చివాట్లుపెట్టుచు వ్రాసిరి:—

" మన కౌన్సిలులో చాలామంది మెంబర్లును, శిస్తువసూలు అజమాయిషీకై మన మాయాజిల్లాలలో నియమించిన నౌకర్లును, మా ఉత్తర్వులను బుద్ధిపూర్వక ముగ తిరస్కరించి, అందరు గూడుపుఠానీచేసి, తమ యధికార స్థానములవల్ల తమకు లభించిన యవకాశములను దుర్వినియోగపరచి, ఉప్పు, పొగాకు, వక్కలు మున్నగు వస్తువుల తాలూకు వ్యాపారమునంతను తామే మిరాశీగ కాజేసిరని మేము నిష్కర్షగ చెప్పుటకు సంకోశించము. ఇదిగాక, నాశనకరమగు యీ మిరా శీలో వస్త్రు వగైరా ధాన్యాదులనుకూడ చేర్చుకొనునంతటి అక్రమమునకు, అసుర కృత్యమునకుకూడ మనవారు పాల్పడి పతితులైరని చెప్పక తప్పదు. ఇందు మూల ముగ, ప్రజలు తమ ప్రాణముల నిలుపుకొనుటకు ఆధారభూతమైన ప్రధాన వస్తు వునకే (ధాన్యమునకే) కరువేర్పడుట తటస్థించినది."

కాబట్టి, రాజులు మారినందువల్ల బంగాళాదేశ ప్రజలకుగలిగిన లాభమేమియు కనబడలేదు. వారి దురదృష్టరేఖ బయటపడినది. అంతే!



# బ్రిటిష్ మహాయుగము

## ఎనిమిదవ అధ్యాయము



### వారన్ హేస్టింగ్సు. (1772-85)

క్లైవు పాత్ర భారతరంగమునుండి నిష్క్రమించిన తరువాత తిరిగి యెన్నికకు వచ్చిన పాత్ర వారన్ హేస్టింగ్సు. ఇతడు భారతరంగమున 1772 మొదలు 1785 వరకు 13 సంవత్సరములు చరించి అనేక దుష్కృతములొనర్చి ఆంగ్ల రాజ్యమునకొక అంగుళము క్రొత్తనేలనుగాని ఒక దమ్మిడీ సొమ్మునుగాని చేర్చక పోయినను, తనవంచన ప్రవర్తనచే తనకు మట్టుకు విశేషధనము నార్జించుకొని తనగురువగు క్లైవు ఫోర్జరీ పర్జరీలచే సంపాదించిన రాజ్యమును దిట్టపరచెను. ఇతని వలన యింగ్లీషువారికేమియు రాజ్యముగాని, ధనముగాని చేకూరని హేతువు చేతనే పార్లమెంటువారితని దుష్కృత్యము లన్నింటిని పైకిలాగి, యితనిపై నేరముల మోపి, ప్రాణములు దీసినంతపనిజేసిరి. ఇతడే మాత్రమైన క్రొత్తరాజ్యముల సంపాదించియున్నచో బహుశః యితని అక్రమ చర్యలేమియు బయటికి వచ్చెడివి కావేమో. ఇతని రాజ్యపాలనమునుగురించి చేసినంత గందరగోళమును మరియే గవర్నరుజనరలు చర్యలనుగురించిగాని ఇంగ్లీషువారు చేసియుండలేదు. దీనికారణమిదే. వారన్ హేస్టింగ్సును, పార్లమెంటు మహాసభలో తూరుపార బట్టిరి. బర్కువంటి మహాపురుషుడుకూడ యేమన్నాడు ?

"పోనీ, యితడు (యీ వారన్ హేస్టింగ్సు) మన రాజ్యపు పొలిమేరల నేమైనా విస్తరింపజేసినాడా ? అదియులేదు ; పైగా రాజ్యవిస్తీర్ణతను తగ్గించినట్లు కూడ బలవత్తరమైన ఋజువుగలదు." (Vol. I P. 131)

కాబట్టి, యితడు రాజ్యమును విస్తరింపజేసియున్నచో వారితనిని యింత అల్లరిపెట్టేవారు కారన్నమాట !

ఇతడు తన హయాములో యింగ్లీషురాజ్యమును విస్తరింపజేయకపోయినను చుట్టుపట్టులనున్న రాజ్యములవారితో యిత డేర్పరచుకొనిన సంబంధములను బట్టియు, వారియెడ యితడొనర్చిన కృత్యముల బట్టియు, యితడు వారి రాజ్యములకు దౌర్బల్యమును, తన యింగ్లీషురాజ్యములకు బలమును చేకూర్చి తదుపరి వచ్చు గవర్నరుజనరలకు త్రోవను సులభముచేసెను. అనగా యింగ్లీషురాజ్యము త్వర త్వరగ విస్తరింపజేయుటకు వారికి మంచి యవకాశముల గల్పించిపోయెను. ఇవి

పొరుగురాజ్యములతోడి సంబంధము. ఇక తనరాజ్యములోకూడ యితడు పరిపాలన యందనేక మార్పులుగావించి రాజ్యమును దిట్టపరచెను. నవాబును వట్టి పిండిబొమ్మనుగావించెను. ఇంగ్లీషు రాజ్యబలమును అంతకంత కెక్కువజేసెను.

రాజ్యమునకు వెలుపలను బయటనుకూడ యితడొనర్చియున్న చర్యలను గూర్చి టారెన్సుయను పార్లమెంటు మెంబరువ్రాసిన "Empire in Asia" అను గ్రంథములో వివరముగ ఆరు అధ్యాయములలో (VII—XIIలో) వర్ణించియున్నాడు. ఆ గ్రంథము నాచే తర్జుమాచేయబడియున్నది. కాబట్టి, అందలి విషయముల నిట తిరిగి చెప్పుట చర్విత చర్వణముగ నుండును గావున సదరు గ్రంథమును దీనిలో భాగముగనే భావించుకొనవ పాఠకులు ప్రార్థితులు. దీనితో వారన్ హేస్టింగ్సు చరిత్ర పూర్తియగును.

పాఠకుల జ్ఞాపకార్థము వారన్ హేస్టింగ్సు కాలములో అతడొనర్చిన చర్యలను బహుక్లుప్తముగ జెప్పి యీ యధ్యాయమును ముగించెదను. వివరములు టారెన్సు గ్రంథములో చూడనగును.

రోహీలాలు. తనకును, కంపెనీకిని అక్రమముగ డబ్బు సంపాదించుటకై వారన్ హేస్టింగ్సు పొరుగుగనున్న అయోధ్య వజీరుతో పరికై తక్కిన కవున్సిలు మెంబర్లతో యెవరికీ చెప్పకుండ, ప్రక్కనున్న వీరవంశజులగు రోహిలా ప్రజలను అకారణముగ దుంపనాశన మొనర్చు నిమిత్తము యింగ్లీషు సేనలను సదరు అయోధ్య వజీరుకు అద్దెకిచ్చెను. ఈ సేనల సహాయముతో అయోధ్యవజీరు రోహిలాఖండముపైబడి వారిని సమూలముగా నాశనమొనర్చెను. అశ్వత్థామ లోకమునంతను 'అపాండవము' గావించ దలచినట్లు వారన్ హేస్టింగ్సు డబ్బు కక్కుర్తికై భరతఖండమును 'అరోహిలము' గావించెను. రోహిలాలు దృఢకాయులు, ఆజాను బాహులు, పౌరుషవంతులు, యుద్ధప్రావీణ్యులు, స్వాతంత్ర్య ప్రియులు. కొండలచే ఆవరింపబడియున్న ఫలవంతమగు చిన్న భూభాగమునందు వారు శాంతముగ వ్యవసాయాదికములను చేసుకొనుచుందురు. వారికి నిలవసేన యనునది లేదు. దేశప్రజలందరును సైనికులే. శాంతి సమయములలో వారు తమ తమ వృత్తులను శాంతముగ జేసికొనుచు యిరుగుపొరుగువారి కెట్టి బాధయు కలుగనీయక వారిత్రోవను వారుందురు. కాని, యెవరైన శత్రువులు తమమీదికి వచ్చినచో వారు సహించరు. అప్పుడు యావన్మంది జనము సైనికులుగ మారి, యుద్ధరంగమున నిలిచి శత్రువులను పారద్రోలుదురు. వీరిని యూరపుఖండములో నున్న స్విట్జర్లండు ప్రజలతో పోల్చవచ్చును. ఇట్టి పౌరుషజాతిపై అక్రమముగ, అకారణముగ వారన్ హేస్టింగ్సు సేనలను పంపి వారి యిండ్లను పంటలను తగులబెట్టించి వారినందరని—రోహిలాయని పేరు గలవాని నెల్ల—చంపియో, పర దేశమునకు తరుమగొట్టియో వేయించెను. ఒకప్పుడు సర్వసంపదలతో పౌరుషవంతు

296 B



వారన్ హేస్టింగ్సు

(మొదటి గవర్నర్ జనరల్-ధనకాంక్ష, క్రౌర్యవృత్తిగలవాడు—295-వ పేజీ.)



సర్ ఫిలిప్ ఫ్రాన్సిస్

(ఇండియా యం దభిమానముగలవాడు-వారన్ హేస్టింగ్సుకు ఇతనికి పడలేదు. ఇద్దరు కత్తులతో బహిరంగముగ కొట్లాడుకొన్నారు. ఇతడు వారన్ హేస్టింగ్సును పార్లమెంటులో తూరుపార బట్టినాడు—300-వ పేజీ.)



సర్ జాన్ షోర్ - ఆక్టింగ్ గవర్నర్ జనరల్

(మెత్తనికత్తి-దేశీయరాజుల కాళ్లక్రింద గోతులు త్రవ్వినవాడు—వారన్ హేస్టింగ్సుకు శిష్యుడు. —పేజీలు 385, 409.)



చైత్ సింగు—కాశీరాజు

(వారన్ హేస్టింగ్సుచే హింసింపబడి, అర్ధరాత్రివేళ మేడ కిటికీ గుండా గంగానదిలోని పడవలోకిదూకి, పారిపోయిన కాశీరాజు-ఆమేడ కిటికీ, యిప్పటికిని కాశీలో గంగ ఒడ్డున కనిపించును—297-వ పేజీ.)

లగు ప్రజలతో కలకలలాడుచుండిన రోహిలా ఖండమునంతను బూడిదప్రోగులు, పీనుగుపెంటలు జేసి యీ పౌరుష జాతిని విత్తనమునకైన లేకుండ జేసి వైచెను. భరతఖండమునగల ఒక్కొక్క పౌరుషజాతి నిట్లు విత్తనమునకుగూడ లేకుండ దుంపనాశనముచేయు దిక్కుమాలిన తంత్రము నింగ్లీషువారు ప్రారంభించుట కిదియే మొదటి నిదర్శనము. ఇట్టి ఘోరపాతకమును—(భరతఖండమునకు, లోకమునకు, యితడుగావించిన యీ అకారణ ద్రోహమును)—పాశ్చాత్యులే తీవ్రముగ ఖండించిరి.

అయోధ్య ముసలి బూబులు.

ఇట్లే డబ్బు కక్కుర్తికై వారన్ హేస్టింగ్సు అయోధ్య వజీరు జనానాలోని వితంతువృలును, వృద్ధులునునగు బీగములవద్దనున్న నగలను, ధనమును, కోటను యాకస్మికముగ ముట్టడించి లోపలికి జొరబడి బందిపోటుదారులు కొల్లగొట్టినట్లు వారిని కొల్లగొట్టి లాగికొనెను. బందిపోటు దొంగల చర్య యెంత సమర్థనీయమో యిదియు నంతే. రెండిటికీ తేడా యేమియు కనుపట్టను. ఆరు నెలలు సాముచేసి మూల నున్న ముసలమ్మను గొట్టినన్నట్లున్నది.

కాశీరాజు చైత్ సింగ్.

కాశీరాజగు చైతుసింగును కూడ వారన్ హేస్టింగ్సు యిట్లే దోచుకొనెను. డబ్బు కావలసివచ్చినపుడెల్ల యితడు తుపాకి కత్తెను భుజముపై పెట్టుకొని కొంతమంది గుంపును వెంటదీసుకొని రోడ్డువెంట బయలుదేరి యెక్కడ వీలుగవుంటే అక్కడ దోచుకొనివచ్చే వాడన్న మాట. అయోధ్య ముసలిబూబులను, కాశీరాజును దోచుకొన్న చర్యలిట్టివే. ఇట్టి దోపిడిగాండ్రే బ్రిటిషురాజ్య సంస్థాపకులని లోకమున పేరొందినారు.

రాజ్యపాలనలో మార్పు.

ఇక రాజ్య పరిపాలనములో యితడొనర్చిన కార్యముల నిట కొలదిగ వివరింతుము. బెంగాలు, బీహారు, ఒరిస్సా రాష్ట్రములకు దివానీగిరి ఇంగ్లీషువారికి వచ్చినపిమ్మట నబాబు వట్టి పిండిబొమ్మయయ్యెను. సర్వాధికారులు ఇంగ్లీషువారైరి. నబాబుకు మహమ్మదు రజాఖాన్, సితాబ్ రాయ్ అను యిరువురు మంత్రులుండిరి. ముఖ్యముగ, సితాబ్ రాయియను నతడు ఇంగ్లీషువారికి చేసిన ఉపకారములు లెక్కింప తరముగాదు. తన ఇంగ్లీషు స్నేహితులకు కావలసివచ్చినపుడెల్ల యీత డేజమీందారు నెత్తియోగొట్టి, వారి పట్టాలనూడ బెరికి, సైనికుల గుంపులను వూళ్లమీదికి బంపించి, అమాయిక ప్రజలపై జబరదస్తీ చేయించి, సొమ్ము వసూలుపరచి, తన ఇంగ్లీషు స్నేహితుల మొగమున బెట్టుచుండెను. ఇతని వల్ల ఇంగ్లీషువారింత డబ్బు తినియు, తుదకితని కొంపనేగూల్చిరి. వారన్ హేస్టింగ్సు

పరిపాలనకు వచ్చినదే తడవుగ యితడీ యిద్దరు మంత్రులను ఉద్యోగమునుండి యూడబెరికి చెరసాలలో త్రోయించెను.

క్లైవుచే యేర్పాటు చేయబడిన ద్వంద్వ ప్రభుత్వము నితడు తీసివేసి యావత్తు పరిపాలనను ఇంగ్లీషువారి చేతులలోనే యుంచెను. నబాబు కివ్వవలసిన మనోవర్తిని తగ్గించి కంపెనీయే నిజమైన ప్రభువను భావము లోకమునకు ఎక్కువగ ప్రస్ఫుట మొనర్చెను. సివిలు క్రిమినలు కోర్టులను నబాబు రాజధానియగు మూర్షిదాబాదు నుండి తీసివేసి కలకత్తాలో పెట్టించెను. ఢిల్లీ చక్రవర్తి కిచ్చుటకు క్లైవు ఒప్పుకొని వచ్చిన కప్పమును వారన్ హేస్టింగ్సు ఎగబెట్టెను. ఒడంబడిక ప్రకారము చక్రవర్తి కుండవలసిన అలహాబాదు, కోరా పరగణాలను అతనినుండి తప్పించి, అయోధ్య వజీరు స్వాధీనము చేసెను.

రెగ్యులేటింగు ఆక్టు.

1773-వ సం॥లో కంపెనీ నిర్మాణమందు పార్లమెంటువారు కొన్ని మార్పుల గావించుచు ఒక చట్టమును జేసిరి. దీనికే "రెగ్యులేటింగుఆక్టు" అనిపేరు. ఇంతవరకు యిండియాలో కంపెనీవారికి మూడుప్రధాన స్థానములుండెను. పడమటి కోస్తాలో బొంబాయియు, తూర్పు కోస్తాలో మదరాసును ఉత్తరమున కలకత్తాయు నుండెను. క్లైవు హయాములో కలకత్తా గిడ్డంగి ప్రాధాన్యము వహించి దానిచుట్టు కొంతరాజ్య మేర్పడెను. దాదాపు బంగాళా దేశమంతయు వీరియధికారము క్రిందికి వచ్చివేసెను. ఈ రీతిగ అప్పటికి కంపెనీవారికి గల మూడు స్థానములలో బెంగాలు, తక్కిన రెండింటికంటె, ప్రాముఖ్యము వహించియుండెను.

1773-వ సం॥ వరకు యీ మూడు స్థానములును ప్రత్యేకపు కవున్సిళ్లచే వారి వారి యిష్టానుసారము సీమడైరెక్టర్ల అధికారమునకు లోబడి వ్యవహరించు చుండెను. ఒక్కొక్క కవున్సిలునకు ఒక్కొక్క గవర్నరు అధికారిగనుండెను. ఎక్కడకవున్సిలు వారక్కడే చుట్టుపట్టులనుండు రాజులతో యుద్ధములుగాని సంధులుగాని చేసుకొనుచుండిరి. ఒక కౌన్సిలుకు యింకొక కౌన్సిలుకు సంబంధములేదు. ఒకరికి ఒకరు లోబడి యుండలేదు. ఈ కారణముచే కంపెనీవారి వ్యవహారములు యావత్తు యిండియాలో ఒకేవిధానముగ నడువక చెల్లాచెదరై, ఒకప్పుడు పరస్పర వైరుధ్య ములకుకూడ కారణమై, చాల యిబ్బందులు రాదొడగెను. ఇట్టి అసందర్భమును తొలగించి అన్నిరాజధానుల వ్యవహారములు, అన్ని కౌన్సిళ్ల చర్యలు, ఏక సూత్రమున నడచుటకై ఒక యేర్పాటు చేయవలసిన ఆవశ్యకత యేర్పడెను. దీని కుపాయమేమి ? ఈ మూడు కౌన్సిళ్లవారు యెవరియిష్టము వచ్చినట్లు వారు విచ్చల విడిగా ప్రవర్తింపకుండ అందరు ఒకరి పెత్తనమునకు లోబడియుండునట్లు చేసిరి. ఈ మూడు కౌన్సిళ్లలో అప్పటికి బెంగాలు కౌన్సిలు రాజ్యమును సంపాదించుకొని యెక్కువ ప్రాముఖ్యమును చెందియుండుటచే దీనికెక్కువ ప్రాధాన్యమిచ్చి, తక్కిన

రెండు కౌన్సిళ్లును దీనికిలోబడి యుండవలెనని చెప్పిరి. ఈ రీతిగ బెంగాలు కౌన్సిలుకు యిండియా యంతటిలో-ఇంగ్లీషువారికిగల యావత్తు స్థానములపై-సర్వం సహాధికారము (పెత్తనము) లభించెను. తక్కిన యావన్మంది యీ కలకత్తా కౌన్సిలువారు చెప్పినట్లు నడుచుకొనవలెననిరి. ఈ విధముగ కలకత్తా కౌన్సిలు "సుప్రీము కౌన్సిల" య్యెను. కలకత్తా కౌన్సిలుకు యిదివరలో గవర్నరుగనుండిన యతడు యిప్పుడు "గవర్నరు జనరల" య్యెను. తక్కిన రెండు కౌన్సిళ్ల గవర్నర్లు-మద్రాసు గవర్నరు, బొంబాయి గవర్నరు-యీ గవర్నరు జనరలుకు లోబడి యుండవలెననిరి. దీని ప్రకారము అప్పుడు కలకత్తా కౌన్సిలుకు గవర్నరుగనుండుట తటస్థించిన యీ వారెన్ హేస్టింగ్సు ఇండియాకంతకు మొట్ట మొదటి గవర్నరు జనరలాయెను. ఇతని కౌన్సిలు సుప్రీము కౌన్సిలయ్యెను. ఈ కౌన్సిలులో వారెన్ హేస్టింగ్సుకు సలహాదారులుగ నుండుటకు క్లావరింగు, మాన్‌సను, ఫ్రాన్‌సిసు, బార్వెలు-అనువారు మెంబర్లుగ పార్లమెంటుచే నియమింపబడిరి. న్యాయపరిపాలనకై సుప్రీముకోర్టుకూడ కలకత్తాలో యేర్పాటు చేయబడెను. వారెన్ హేస్టింగ్సుకు బాల్యమిత్రుడగు "సర్ ఎలిజా ఇంపే" యను నతడు యీ కోర్టుకు ప్రధాన న్యాయమూర్తిగ పార్లమెంటువారిచేతనే నియమింప బడెను. ఇవి 1773-వ సం॥పు రెగ్యులేటింగు ఆక్టువలన పార్లమెంటువారిచే చేయబడిన ఏర్పాటులు.

## వారెన్ హేస్టింగ్సుకు మిగతా మెంబర్లకు తగాదా.

పార్లమెంటుచే తనకు సలహాదార్లుగ పంపబడిన సుప్రీము కౌన్సిలు మెంబర్లకును, గవర్నరు జనరలగు వారెన్ హేస్టింగ్సుకును, పడలేదు. వారితో చెప్పకయే, వారితో సంప్రదించకుండగనే, యితడనేక దుష్కృత్యములు నిరంకుశముగ జేసెను. రోహిలా యుద్ధవ్యవహారమే యిందుకు నిదర్శనము. ఈవ్యవహారము నితడు కౌన్సిలు మెంబర్ల కెవరికిని చెప్పకుండచేసెను. అయోధ్య వజీరువల్ల రహస్యముగ తనజేబులో కొన్నిలక్షల రూపాయలను వేసుకొనెను. తక్కినవారికి యీ లంచములో భాగము పెట్టలేదు. అనేకమందివద్ద లంచములు పుచ్చుకొని ఉద్యోగముల నిచ్చెను. కొందరిని బెదరించి డబ్బులాగెను. కంపెనీకని వసూలుపరచిన శిస్తు వగైరాలను కంపెనీలో జమకట్టకుండ కొన్నిలక్షలు కాజేయజూచెను. చివరకు ప్రాణముమీదికి వచ్చేటట్టు కనబడేటప్పుడే "ఓ! మరచిపోయినాన"ని చెప్పి అప్పుడు ఖజానాలో జమకట్టించెను. ఈ లంచగొండి వ్యవహారములన్నిటిని నందకుమారుడు బయటికిలాగి కౌన్సిలులోని తక్కిన మెంబర్లకందరికి తెలియబరచెను. వారందరు యితనిని కౌన్సిలుమీటింగులో యీ లంచములగూర్చి ప్రశ్నించిరి. వీని కితడేమియు సమాధానము చెప్పలేకపోయెను. మెంబర్లలో అధిక సంఖ్యాకులు యితనికి వ్యతిరేకమైరి.

ఇక నేమియు చేయలేక వారన్ హేస్టింగ్సుకు ఉక్కురోషమువచ్చి "నన్ను విచారించుటకు మీ రెవ్వరుపో, పొండి" అని ధిఃక్కరించి, సభలో వుండకుండ లేచిపోయెను. తనకు వ్యతిరేకపక్షపు నాయకుడుగనున్న "ఫ్రాన్‌సిసు" పైనను, యీ నేరములను బయటికిలాగి అల్లరిచేసిన నందకుమారుని పైనను, వారన్ హేస్టింగ్సుకు కంఠమువరకు కోపముండెను. వీరి నెట్లయిన సాధించవలెనను రోషము అతనిని దహించివేయుచుండెను. ఆఖరుకు తన రోషమును పట్టజాలక ఫ్రాన్సిసుపై ముష్టియుద్ధమునకు మోటతనముగా కలియబడెను. ఒక రోజున యిద్దరును కలియబడి, చెడమడ కత్తులతో బాదుకొనిరి. ఫ్రాన్సిసుకు గాయముతగిలెను. ఈ క్రోధముతో ఆతడు యింగ్లండుకువెళ్లి అక్కడ పార్లమెంటులో పెద్ద చార్జిలు చేయించెను.

వారన్ హేస్టింగ్సుపై చార్జీలు.

ఇతడు తన పరిపాలనలోచేసిన అక్రమములన్నిటిని 10, 11 చార్జీలక్రింద పార్లమెంటు మహాసభవారి యెదుట పెట్టించెను. దీనితో దేశమంతయు గగ్గోలుపుట్టెను. ఈతడు యిండియానుండి ఉద్యోగము వదలుకొని ఇంగ్లండుకు పోయేటప్పటికల్లా యితనిని అరెస్టుచేసి పార్లమెంటుయెదుటికి విచ్చుకత్తుల పారాలతో తీసుకొనివచ్చి హాజరు పెట్టిరి. ఈతడు బోనులోయెక్కి అప్పటి ఆచారప్రకారము మహాసభవారి యెదుట మోకారించి వంగి యుండవలసివచ్చెను. ఈకేసు యేడేండ్లు నడచెను. ఈ కేసే స్థిరపడియుండినచో యితనికి తప్పక ఉరిశిక్షపడేది. అందుచే, తన ప్రాణములెక్కడ పోవునోయను దిగులుతో ఈతడీ యేడేండ్లును ప్రాణముల నరచేతబెట్టుకుని తిరిగెను. ఇండియాలో తాను సంపాదించుకొన్న అన్యాయార్జితవిత్తమంతయు యీ కేసుక్రింద ఖర్చయిపోయెను. ఆఖరుకు పార్లమెంటువారు యితనిని నిర్దోషియని వదలివేసిరి.'' చావు తప్పి కన్ను లొట్టవోయెను. ఇది ఫ్రాన్సిసుపై కలియబడిన దానికి ఫలితమని చెప్పవచ్చును.

నందకుమారుని ఉరి.

ఇక, నందకుమారునిపైకూడ యితడు కసిదీర్చుకొనెను. అంతకుపూర్వమెన్నడో నందకుమారుడు ఫోర్జరీ చేసినాడని చెప్పి, ఒకానొక కాగితమును వారన్ హేస్టింగ్సు యెట్లో తెప్పించెను. ఈ ఫోర్జరీ నేరమునకై యితనిమీద సుప్రీము కోర్టులోచార్జి దాఖలుచేసిరి. జడ్జి సర్ ఎలిజాయింపే మన వారన్ హేస్టింగ్సుకు కావలసినవాడే గదా. ఇక శిక్ష పడుటకు అనుమానమేమున్నది. నందకుమారునిపై ఫోర్జరీనేరము "ఇంపే" స్థిరపరచి అతనికి ఉరిశిక్ష వేసెను! ఇది మనకిప్పుడు ఆశ్చర్యముగా కనబడవచ్చును. ఫోర్జరీనేరమునకు ఉరిశిక్ష యేమియని పాఠకు లడుగవచ్చును. ఆరోజులలో ఇంగ్లండులోని 'లా' ప్రకారము ఫోర్జరీకి ఉరిశిక్ష యుండెను! ఆ 'లా'ను తీసుకొనివచ్చి నందకుమారునిపై

ప్రయోగించిరి. ఇది చాల అక్రమము. ఈ సందర్భమున చాల వాదోపవాదములు దరిమిలా జరిగియుండెను.

ఇందు నాలుగైదు సారాంశములు గమనింపదగి యున్నవి (1) అసలు నందకుమారుడు ఫోర్జరీ చేసినాడా లేదా? యిది అనుమానాస్పదమైన విషయము. తన కసిదీర్చుకొనుటకై వారన్ హేస్టింగ్సు యిట్టి అభూత కల్పనను గావించెనని కొందరిమతము (2) అథవా, నందకుమారుడు ఫోర్జరీ చేసినను అతనిని నిన్నగాక మొన్న పెట్టిన సుప్రీముకోర్టు వారు విచారించుటకు అధికారము కలదా? లేదా? ఈ యధికారము వీరి కెవరిచ్చిరి? దేశప్రజలపై సివిలు, క్రిమినలు అధికారముల చెలాయించుటకు పరాయి దేశపు యీ వర్తకపు కంపెనీకి న్యాయముగ అధికారమెవ్వరిచ్చిరి? ఇది న్యాయమగు చట్టరీత్యాగాక, జబర్దస్తీగా అప్పుడెవడు అదమాయించు నాథుడెవడు లేనికారణముచేత కంపెనీవారిట్టి అధికారమును చెలాయించిరని చెప్పదగును (3) ఒకవేళ, దేశప్రజలను విచారించి శిక్షించుటకు సుప్రీముకోర్టుకు అధికార మున్నదని వాద సౌకర్యమునకు ఒప్పుకొన్నను యీ కోర్టు పుట్టక పూర్వమే జరిగిన నేరమును యీ కోర్టు యెట్లు విచారించగలదు? ఈ కోర్టు పుట్టుటకు 3, 4 సం॥ లకు పూర్వమే యీఫోర్జరీనేరము జరిగినట్లు ఫిర్యాది పక్షము వారే చెప్పిరి. కాబట్టి, యిది అక్రమమనుట నిస్సంశయము. (4) ఈ కేసును విచారించుటకు సుప్రీముకోర్టుకు అధికారముండెనని ఒప్పుకొన్నను, ఇంగ్లండులో ఇంగ్లీషు ప్రజలకై ఆ కాలములో ఉద్దేశింపబడిన శిక్షను తీసుకొనివచ్చి ఇండియాలో హిందూప్రజలపై విధించుట కేవలము చట్టవిరుద్ధము, న్యాయవిరుద్ధము. ఏ ప్రజలనుగాని వారివారి న్యాయధర్మ శాస్త్రముల ప్రకారము శిక్షించుట న్యాయసమ్మతము. ఈ విషయము లోకమెల్లరు అంగీకరించినదే. అప్పటికి "ఇండియన్ పినల్ కోడ్డు" పుట్టియుండలేదు. కాబట్టి యీ పైసూత్రప్రకారము హిందువుడగు నందకుమారుని అప్పుడున్న హిందూ ధర్మశాస్త్ర ప్రకారము శిక్షింపవలసియుండెను. కాని, వారన్ హేస్టింగ్సు నందకుమారునిపై యెట్లయిన కసితీర్చుకొనవలెనని కూర్చున్న కారణముచే అతడీ సూత్రముల నన్నిటిని దూరముగ తుంగలో ద్రొక్కి క్రూరమగు యింగ్లీషు 'లా' ను తీసుకొనివచ్చి దానితో నందకుమారుని ఖూనీ చేయించెను. దీనికి ఇంగ్లీషుప్రజ హర్షించెను.

ఆ రోజులలో ఇండియాలో ఫోర్జరీకి ఉరిశిక్ష యెక్కడను లేదు. ఈ సందర్భమున, ఒక చిన్నసంగతిని గమనింపవలసి యున్నది. పాశ్చాత్య రాజ్యములు నాగరకములనియు మన భరతఖండపు రాజ్యములు క్రూరమైన వనియు తరచు పాశ్చాత్యులు వాకొనుచుందురు. కాని, ఫోర్జరీకి ఉరిదీయించు ఇంగ్లీషురాజ్యము నాగరకమైనదో, కూామూలు సామాన్యశిక్షతో పోనిచ్చు హిందూలేక మహమ్మదీయ రాజ్యము నాగరకమైనదో చదువరులే ఊహించు కొందురుగాక. ఇంగ్లండు

రాజ్యాంగములోనిశిక్షలు ఆరోజులలో యెంత క్రూరముగ నుండెనో 'Hazen' అను చరిత్రకారుడు "Europe Since 1815" అను గ్రంథములో స్పష్టముగ వ్రాసి యుండెను. (5) ఈ ఉరిశిక్షను సీమలో (ప్రీవికౌన్సిలు) అప్పీలు చేసుకొనువరకు ఆపించవలసినదని మిగతా కౌన్సిలు మెంబర్లుయెంత వాదించినను వారన్ హేస్టింగ్సు వినక వెంటనే అమలు జరిపించెను. ఈ కేసు సీమఅప్పీలుకు పోయియుండినచో అక్కడ పైన పేర్కొన్న సారాంశములన్నిటినీ బాగా విచారించి యీ శిక్షనుతప్పక కొట్టివేసేవారే. ఈ భయము వారన్ హేస్టింగ్సు కుండెను. అందుచే, సీమ అప్పీలు వరకు ఆగకుండగనే పాప మా వృద్ధబ్రాహ్మణుని,—నందకుమారుని—కలకత్తా కోట వెలుపల చుట్టూ ఫిరంగీవేటు దూరము జనులుమూగి హాహాకారము సేయు చుండగా, బహిరంగముగ, వారన్ హేస్టింగ్సు ఉరిదీయించెను. ఈ హాహాకారములు పార్లమెంటులో వారన్ హేస్టింగ్సును విచారించునాడు 'బర్కు' మహాశయుడు "నందకుమారుని వారన్ హేస్టింగ్సు 'ఇంపే' చేతులమీదుగ ఖూనీ చేయించెనని" ఘోషించిన ఘోషతో మేళగించి రోదోంతరాళమంతయునిండి, నేటివరకాప్రతిధ్వని యింకను మారుమ్రోగ కున్నది!

ఇట్టి హాహాకారములమధ్య వారన్ హేస్టింగ్సు పాత్రను భారతరంగమునుండి యవనిక మరుగునకు నిష్క్రమింప జేయుదము. అవనిక మరుగున సీమలో యీతనికి జరిగిన మానావమానములన్నియు మనకు నిష్కంభము క్రిందనేలెక్క. వానిని గూర్చి విన్నాము, చాలును.



# బ్రిటిష్ మహాయుగము

## తొమ్మిదవ అధ్యాయము



### మహారాష్ట్రులు, మొదటి మహారాష్ట్ర యుద్ధము

మొగలు సామ్రాజ్యము సుమారు మున్నూరేండ్లు దాదాపు యావద్భారతవర్షమున వ్యాపించియుండెను. 1707 వ సం॥లో ఢిల్లీపాదుషా ఔరంగజేబు చనిపోయెను. ఆతడొనర్చిన కొన్ని యవివేక కార్యములవల్లను తదనంతరము వచ్చిన చక్రవర్తుల దౌర్బల్యమువల్లను మొగలు సామ్రాజ్యము ఔరంగజేబు అనంతరము బలహీనమై క్రమక్రమముగా క్షీణదశకు రా దొడగెను. దూరముననున్న రాష్ట్రములకు పాదుషాచే ప్రతినిధులుగ (వైస్రాయిలుగ) నియమింపబడినవారు అతని యధికారమునుత్రోసివేసి, మెల్లగా స్వతంత్రులు కా జొచ్చిరి. అట్లు స్వతంత్రులైనవారిలో దక్షిణమున నైజామును, ఈశాన్యమున బంగాళా ప్రతినిధి ఆలివర్దీఖానును, పేర్కొనదగియున్నారు. పశ్చిమతీరమున మహారాష్ట్రులును ఉత్తరమున శిక్కులును మొగలాయి అధికారమును త్రోసివేసి తమతమ నాయకుల యాజమాన్యమున స్వతంత్రులైపోయిరి. ఈరీతిగా కేంద్రస్థానమగు ఢిల్లీపాదుషా బలముసడలగనే యెక్కడిరాష్ట్రములక్కడ ప్రత్తివిడిపోయినట్లు పోవనారంభించెను. వీరిలో వీరికిని యితర స్వతంత్రరాజ్యములకును సఖ్యతకుదరక యెవరిమట్టుకు వారు తక్కినవారందరిపై సర్వాంసహాధికారమును సంపాదింప తంటాలుపడుచుండిరి కాని ఒక్కరును యింకను కేంద్రస్థానము వహింపలేకపోయిరి. ఇదివరకు ఇండియాంతను బలిష్ఠమగు శక్తులచే ఏకసామ్రాజ్యముగ పట్టియుంచుకొనిన కేంద్రప్రభుత్వము క్షీణించిపోయెను. తత్‌స్థానమున యింకొక కేంద్ర ప్రభుత్వము వచ్చి చెల్లాచెదరయిపోయిన యీముక్కలనన్నిటిని యింకను ఒకటిగా చేర్చలేదు. ఈ సంధికాలములో—యీప్రయత్నమే జరుగుచున్న సంధికాలములో — మధ్యవచ్చి ఇంగ్లీషువారు దూరిరి. వీరిదివరకే యింట ప్రవేసించి నూరు, నూటయాభైయేండ్లయినది. ఈ నూరు నూటయాభైయేండ్లలో వీరు రాజులను చక్రవర్తులను ఆశ్రయించి అక్కడక్కడ సరుకు లమ్ముకొనుటకు గిడ్డంగుల నేర్పరుచుకొనిరి. ఈ గిడ్డంగులలోని సరుకులు కాపాడుకొనుటకు రాజులు కొంచెము నిద్రమత్తుగనున్నప్పుడు కోటలు గట్టుకొనియు, మందు గుండు సామానుల నేర్పరచుకొనియు "కోమట్లగు మీకీ కోటలెందుకు" అనియేరాజైనా దబాయించినప్పుడు "ఎబ్బే,

మొగల్ సామ్రాజ్య విచ్ఛిన్నము — ఆంగ్ల విజృంభణము.

యేమీ లేదు—బందిపోట్లువచ్చి మామీద పడకుండా" ననియో "ఫ్రెంచివారికీ మాకూ తగాదాలలో రక్షణగా నుండటానికనియో" యేవో సమయోచితముగ కల్లబొల్లి కబుర్లుచెప్పి తప్పించుకొనియు, నెమ్మదిగ కాలక్షేపము చేయుచుండిరి. చేతులో సైన్యము, మందుగుండు సామగ్రి, కోటలు, ఉన్నతరువాత యికవూరుకో బుద్ధి అవుతుందిగనకనా? అప్పుడప్పుడు కనిపెట్టి పక్కరాజ్యములమీద పడుటయు, రాజులలో రాజులకు తగాదావచ్చినప్పుడు ఒకపక్షము వారికి తమసేనల నద్దెకిచ్చుటయు యీ అద్దెక్రింద యే పరగణానో, యేవర్తక సౌకర్యమునో సంపాదించుకొనుటయు, సాగించిరి. రానురాను, యీవ్యాపారము ముదిరి చిన్నచిన్నదోపిడీలు ముట్టడులుగను, ముట్టడులు దండులుగను, దండులు మహాయుద్ధముగను మారి, ఇంగ్లీషువారి ఆకు శుక్లపక్ష చంద్రునిపగిది దినదిన ప్రవర్ధమానముగా పైకెక్కివచ్చెను. అదివరకు మున్నూరేండ్లు యేకాతపముగ వెలిగిన మొగలు సామ్రాజ్యపు ఆకు క్రమక్రమముగ క్రిందికి కునుకసాగెను. వీరిరాజ్యమంతయు ముక్కలుముక్కలై యెక్కడికక్కడ పడియుండెను. ఒక్కొక్క ముక్కనే యేదో కపటోపాయముచే నోటవేసుకొని ఒక నూరు సం॥లలో యావద్భారత వర్షమును గబళించివేయుటకు యింగ్లీషువారికి చక్కని దోవదొరికెను.

ఇంగ్లీషువారిచ్చటికి 1600 సం॥లో వచ్చిరి. 1900 సం॥ నకు 300 యేండ్లయినది. అనగా, యింగ్లీషువారి ఆయుర్దాయము యిప్పటికి మున్నూరేండ్లని సామాన్యముగ చెప్పవచ్చును. ఈ ఆయుర్దాయములో సగము•150 ఏండ్లు-1600 మొదలు 1757 వ సం॥ లో జరిగిన ప్లాసీ యుద్ధమువరకు--అనామకత్వముక్రిందనే తీసి పారవేయవచ్చును. ఆకాలములో సరుకులు తెచ్చుకొనుట, అమ్ముకొనుటతప్ప వారికి వేరే పనిలేదనియే చెప్పవచ్చును. తదుపరి ఒక నూరేండ్లు—1757 ప్లాసీ యుద్ధము మొదలు 1857 సం॥ పు సిపాయి విప్లవమువరకు—నూరేండ్లకాలము—రాజ్యము దిగమ్రింగుటలో పోయినది. 1857 సం॥ నాటికీ దిగమింగుడు యెక్కువై కక్కుకునే టంత పనిజరిగినది. కాని, దైవికముగ అట్టి యాపదరాక అప్పటికా గండము గడచినది. తదుపరి 50 ఏండ్లలో యీ దిగమ్రింగిన దానినంతను జీర్ణము జేసుకొనుటకై ప్రయత్నించిరని చెప్పవచ్చును. తాము సంపాదించుకొన్న రాజ్యములన్నిటిని టెలిగ్రాము తీగలు, రైలుపట్టాలుమున్నగు బంధమునచే గట్టిగబిగించి దిట్టమైన సామ్రాజ్యముగా చెక్కు చెదరని సామ్రాజ్యముగా—చేసుకొనవలెనని వారు తంటాలు పడుచుండిరి. కాని లోలోపల యీ సామ్రాజ్యము సడలిపోవు సారంగములు పుట్టుచునేయున్నవి. ఈ దిగమ్రింగినరాజ్యములు సరిగ యిముడక లోపల కడుపులో త్రిప్పుచునే యుండెను. ఈ పైత్యరోగము 1885-వ సం॥ లోనే కాంగ్రెసు—భారత జాతీయ మహాసభ—రూపమున ప్రవేశించెను. ఈ పైత్యరోగము నానాటికి హెచ్చుచున్నదిగాని తగ్గుటలేదు. ఎప్పుడో •ఒకనాడు యీ దిగమ్రింగిన రాజ్యముల నన్నిటిని వారు ఒక్కమారు పైకి కక్కక వీలులేదు.

ఆంగ్లసామ్రాజ్య పురుషుని ఆయుర్లక్షణముల నిట్లు దిఙ్మాత్రముగ సూచించితిమి. ఇక ఒక్కొక్క రాజ్యమునే యీపురుషుడెట్లు కబళించెనో కొంచెము తప్పీలుగ చూతము. బంగాళా ఖండమునెట్లు అతడు నోటవైచుకొన్నదియు ప్రథమఅధ్యాయములలో తప్పీలుగ చెప్పియుంటిమి, ఇక యీ సంపుటములో మహారాష్ట్ర ఖండము, మైసూరు ఖండము, నైజాముఖండము, అయోధ్యఖండము మున్నగు ఖండముల నితడెట్లు నోటగరచుకొన్నదియు వివరింతుము. ఈ ఖండములకు యింగ్లీషువారితోడి సంబంధ మేర్పడక పూర్వ మెట్టిట్టి చరిత్రగలదో క్లుప్తముగ వివరించుట అవసరము. అందు ముందుగ మహారాష్ట్ర ఖండచరిత్ర నిట చెప్పెదను.

## మహారాష్ట్ర ఖండము.

పశ్చిమతీరము పొడవునను వ్యాపించియున్న పర్వతపంక్తుల మధ్య ప్రదేశము దృఢగాత్రులును పౌరుషవంతులునునగు మహారాష్ట్ర ప్రజలకు నివాసస్థానమై యున్నది. వీరందరు చిరకాలముక్రిందటనే యేకజాతిగనుండి మహారాష్ట్రవైభవము ననుభవించినట్లు "మహారాష్ట్ర" యను వీరిజాతి నామమువల్లనే విదితమగుచున్నది. వీరు మిక్కిలి పౌరుషవంతులనియు అవమానముల భరింపరనియు, తమజాతి గౌరవము కాపాడుకొనుటకై ప్రాణములనైన లెక్కగొనరనియు, శరణుజొచ్చినవారికి తమ ప్రాణములనైన నిత్తురనియు క్రీ. శ. 6–వ శతాబ్దాములోనే "హ్యూయనుత్సాంగు" అను చీనాయాత్రికుడు వ్రాసియున్నాడు.

మహమ్మదీయపరిపాలన భరతఖండములో షుమారు ఆరువందల యేండ్లుండెను. కాని, ఆఖరున ఔరంగజేబు కాలమువరకు వీరి పరిపాలననుగూర్చి హిందువు లెవ్వరును కష్టముగ జెప్పుకొనలేదు. మహమ్మదీయులు హిందూదేశమును జయించినను, వారు హిందూప్రజలను నార్మనులు యింగ్లండు ప్రజలను హింసించినట్లు—హింసించలేదు. మహమ్మదీయ పరిపాలనలో హిందువులు సమస్తవిధముల వికాసమునొందిరి. గొప్ప గొప్ప పదవులన్నియు వారే యాక్రమించిరి. కళలు, పరిశ్రమలు పెంపొందినవి. దేశము సుభిక్షముగనుండి ధనధాన్యరాసులతో నోలలాడుచు, అన్నమునకు మొగము వాచియున్న ఆంగ్ల, పరాసు, బుడతకీచు, వలందా, మున్నగు పాశ్చాత్య జాతులకు నోరూరజేసెను. ఈ సంపదలచే యాకర్షింపబడుటచేతనే కదా వారస లిక్కడికివచ్చుట తటస్థించినది. ఇండియా గూడ వారి దేశములవలెనే అప్పుడు దౌర్భాగ్యస్థితిలో నుండియుండినయడల వారిక్కడికి వచ్చియుందురా? ఇక్కడికి రావలెనని ఒకరిని మించి యొకరు పోటీలుపడి చచ్చియుందురా? మహమ్మదీయపాలనలో యీవిధముగ వికాసముచెందిన జాతులలో మహారాష్ట్రజాతియొకటి. వీరు సమస్తకళలలోను వృత్తులలోను వైద్యశాస్త్రమందును జ్యోతిశ్శాస్త్రమునందును విశేష ప్రతిభగడించిరి. అందులో

బ్రాహ్మణులు "యిదమ్ క్షాత్రమ్, యిదం బ్రాహ్మ్యం" మను ప్రతిభ జూపి, ఢిల్లీ పాదుషా లప్పుడప్పుడు జూపు నిరంకుశత్వమును అరికట్టుచుండిరి. తుదకు ఔరంగ జేబు కాలములో అతని నిరంకుశత్వము, మతపిచ్చ హెచ్చుకాగా దాని నెదిరించుటకై మహారాష్ట్రజాతిలో నిండి నిబిడీకృతమైయున్న చైతన్యలక్షణము ఒక్కసారిగ శివాజీరూపమున ప్రత్యక్షమైనది. మొగలు నిరంకుశత్వమును త్రోసివేసి తత్ స్థానమున బలిష్ఠమగు మహారాష్ట్రరాజ్యము నతడు స్థాపనమొనర్చెను.

## శి వా జీ.

శివాజీ 1627-వ సం॥ న జననమొందెను. ఇతని తండ్రి బీజపూరు నబాబు కొలువులో ఉద్యోగిగనుండెను. శివాజీయు మహమ్మదీయ ప్రభువుల కొలువులో కొంతకాలముండెను. కాని, యది ఆయనకు రుచించలేదు. శివాజీ నిశానీదారు డయ్యె మిక్కిలి పౌరుషముగల యోధుడు, గొప్పరాజ నీతిజ్ఞుడు. పెచ్చుపెరిగి వచ్చుచున్న మొగలు నిరంకుశత్వము నణచి మహారాష్ట్ర సామ్రాజ్యమును స్థాపింప నత డవతరించెను. ఈ పనికై అతడు తన జీవితమును ధారవోసెను. తాను పూనిన కార్యమందతడు విజయముగాంచెను. శివాజీ లౌకికుడేగాక పార లౌకికుడును. ఇది ప్రపంచములో అసాధారణముగ గన్పట్టును. శివాజీ బ్రాహ్మణుడుకాడు. క్షత్రియవంశజుడు. అయినను, తనగురువగు సమర్థరామదాసుగారి యుపదేశా మృతము నితడుగ్రోలి గొప్ప ఆధ్యాత్మిక శక్తిని సంపాదించెను. ఈ గురువుగారి ప్రోత్సాహము చేతనే అతడనేక విజయముల గాంచుచుండెను. స్త్రీలోకము నితడు మాతృభక్తితో చూచుచుండెను. ఇతని ఖడ్గమునకు 'భవానీ' యనిపేరు. శివాజీ 50 సం॥ల వయస్సు దాటిన కొలది కాలములోనే 1680-వ సం॥ లోనే పరమపదించెను. ఈయన తన జీవిత కాలములో గొప్పసామ్రాజ్యమును స్థాపించి, తదుపరి వచ్చిన మొగలు క్రైస్తవ దండయాత్రలకు చెక్కు చెదరక చిరకాలముగ నిల్చునంతటిగట్టి దానినిగ జేసిపోయెను. రణరంగమునం దిత డెంత ప్రావీణ్యమును జూపెనో, రాజ్యపాలనా విధానమునందును అంతదక్షతను జూపెను.

చెదరియున్న వివిధ మహారాష్ట్ర భాగములనెల్ల నేక కూటముగ జేర్చి చక్కని రాజ్యపాలనా పద్ధతిని శివాజీ నెలకొల్పెను. ఈ పద్ధతి గొప్ప దూరదృష్టిని గనపరచుచున్నది. ఈ పద్ధతి చాల అపూర్వమైనదని పాశ్చాత్యులే కొనియాడుచుండిరి. నేటి "ఫెడరేషను" లన్నియు నాడు యేర్పరచిన మహారాష్ట్ర "రాష్ట్ర కూటము"ను పోలియున్నవి.

మహారాష్ట్ర రాజ్య పద్ధతి.

శివాజీ యేర్పరచిన పాలక వర్గములో ఎనమండుగురు సభ్యులుండిరి. వీరికి "అష్టప్రధానులు" అని పేరు.

306A



శి వా జీ.

—(హిందూస్థాన్ టైమ్సు)

(కుడి)　　　(సింహాసనము)　　　(ఎడమ)

రాజు

(4) సచివ
(5) మంత్రి (రాజుగారి ప్రయివేటు వ్యవహారములు).

(3) అమాత్య.

(1) పీష్వా (ప్రధాని) (సివిలు మిలిటరీ, శాఖలకు బాధ్యుడగు సభ్యుడు.)

(2) సేనాపతి (సైనిక వ్యవహారములు)
సుమంత (6) (విదేశాంగ కార్యదర్శి.)
పండితరావు (7) (మతము, దేవాదాయ ధర్మాదాయములు.)
ప్రధాన న్యాయమూర్తి (8).

(1) 'పీష్వా'—ప్రధాన మంత్రి—ఈయన సివిలు మిలిటరీ వ్యవహారముల కన్నిటికిని బాధ్యుడగు సభ్యుడు. రాజు తరవాత యీయనే ముఖ్యాధికారి. ఈయన సింహాసనమునకు దిగువను కుడివైపున మొదటి స్థానములో కూర్చుండును.

(2) సేనాపతి—సైనిక వ్యవహారముల నడిపించు సభ్యుడు. ఈయన రాజుకు ఎడమప్రక్కన మొదటివాడుగ కూర్చుండును.

(3) అమాత్య ... ... } వీరిద్దరు పీష్వాప్రక్కన
(4) సచివ ... ... } కూర్చుందురు.

(5) మంత్రి—ఈయన రాజుగారి ప్రయివేటు (అంతరంగిక) వ్యవహారములు జూచుచుండును.

(6) 'సుమంతు' డు:—పరరాజ్య వ్యవహారముల జూచుకార్యదర్శి. ఈయన యెడమవైపున సేనాధిపతికి దిగువ భాగమున కూర్చుండును.

(7) పండితరావు—ఈయన మతసంబంధమైనట్టియు, ధర్మాదాయ సంబంధమైనట్టియు, వ్యవహారముల జూచుచుండును.

(8) ప్రధాన న్యాయమూర్తి—ఈయన సింహాసనమునకు యెడమ భాగమందు సేనాపతికి దిగువను కూర్చుండును.''—[రెనడేగారి "మహారాష్ట్ర చరిత్ర" పే. 126.]

తన యుద్యోగులకుగాని మరి యెవరికిగాని జాగీరుల నిచ్చుపద్ధతిని శివాజి తీసి పారవేసెను. దీనివలన చాల అనర్థము లున్నవని అతడు గ్రహించెను. పీష్వా మొదలు ఆఖరు సిపాయివరకు—బంట్రోతువరకుకూడ అందరు ఉద్యోగస్థుల జీతములను ధాన్యరూపముననో, నాణెముల రూపముననో, తీసికొనవలసినదేగాని యింకొక విధమున తీసుకొనటానికి వీలులేదని శివాజీ ఖండితమగు శాసన మేర్పరచెను.

చౌత్, సర్దేశముఖి.

ఢిల్లీ చక్రవర్తుల తరఫున అతని దక్షిణహిందూస్థాన రాజ్యభాగములో శాంతిని నెలకొల్పుపనిని మహారాష్ట్రులు శివాజీ యనంతరము—1705 సం॥లో ఔరంగజేబునుండి కంట్రాక్టుకు తీసుకొనిరి. ఈ పనికిగాను ఔరంగజేబు సదరు రాజ్యభాగములో తనకు వచ్చిన రివిన్యూలో నూటికి పదిరూపాయలు చొప్పున మహారాష్ట్రులకిచ్చుటకు అంగీకరించెను. ఇట్టిపద్ధతిని అసలు కనిపెట్టినవాడు శివాజీయే. ఈయన తన జీవితకాలములో యిట్లే కొంత రాజ్యాదాయభాగమును కర్ణాటక ప్రభువులనుండి గైకొనుచుండెను. ఔరంగజేబు మరణానంతరము "సాహూ" మహారాష్ట్రరాజ్యమునకు నాయకుడై యుండగా దక్షిణ హిందూస్థానములోని తన రాజ్యభాగములోవచ్చు యావత్తు రివిన్యూలో నాల్గవవంతు మొగలాయిపాదుషా మహారాష్ట్రులకిచ్చుట కంగీకరించెను. ఇక్కడి రాజ్యపరిపాలనమునంతను మహారాష్ట్రులే పాదుషాతరఫున నిర్వహించుచుండిరి. ఈరీతిగా రాజ్యములపై వచ్చు ఆదాయములోను నాలుగవ వంతు కమిషనుగ పుచ్చుకొను యేర్పాటునకే, "చౌతు" యను పేరువచ్చెను. "చౌతు" అనగా నాలుగవ వంతని యర్థము. "సర్దేశముఖి" యనునదికూడ యిట్టి కమిషన్‌వ్యాపారము వంటిదే. పైన ప్రభువునకును, అడుగున రైతునకును, మధ్య యేజంటుగానుండి రివిన్యూ వసూలు పరచుచు, అందుండి కొంతభాగము తనకు కమీషనుగ తీసుకొనుచు, మిగతాది పైనున్న ప్రభువునకు పంపుయేర్పాటే "సర్దేశముఖి" యనబడుచున్నది. ఈ యేర్పాటువలన మొదట కమిషనుదారులుగ నున్నవారే రానురాను సర్వాధికారులగుటకు అవకాశము లేర్పడెను. ప్రభువుల రాజ్యాధికారములు క్రమక్రమముగ క్షీణింపజేయుట కీపద్ధతి చక్కగ పనికివచ్చును. పరరాజును "మీ రాజ్యముపైకి రాకుండ మేము కాపాడి పెడతా" మని ఒకానొకరు బయలుదేరి ప్రభువునకు చెప్పినట్లగుచున్నది. కాని, క్రమముగ వీరేరాజ్యము నాక్రమించుకొనుటకు దీనివలన మార్గమేర్పడుచున్నది. శివాజీ కనిపెట్టిన యీ 'చౌతు' 'సర్దేశముఖి' యేర్పాటులు నూరు సంవత్సరముల తదనంతరము వెల్లస్లీ దేశీయరాజులతో యేర్పరచుకొనిన 'సైనిక సహాయపు టొడంబడిక'లను (Subsidiary alliances) చాల వరకు పోలియున్నవని రెనడీగారు చెప్పుచున్నారు.

శివాజీ మరణానంతరము అతని కుమారుడు 'శంభాజీ' తన తండ్రి యంత ప్రతిభగలవాడు గామిచే ప్రజలమనములను ఆకర్షింప లేకపోయెను. అతనియందు ప్రజలకు అసహ్యము కలిగెను. ఈతడు దుర్బలుడు, యింద్రియ లోలుడునై ఔరంగజేబు చేతులలోపడి మరణించెను. ఔరంగజేబు యితనిని బహుక్రూరముగ వధించి, యితని ఆరేండ్లబాలుని, భార్యను, చెరసాలలో పెట్టించెను. ఈ బాలునిపేరు 'సాహూ'. ఈ ఆరేండ్లబాలునికి ఔరంగజేబు నేదో మత్తుమందు పెట్టించెనని చాలమందికి అనుమానము. ఔరంగజేబు మరణానంతరము యీ బాలుడును, తల్లియు చెరసాలనుండి వదలి వేయబడిరి. కాని, యీబాలుడు దుర్బలముగను, మందమతిగను, నుండెను. రాజ్య పాలనానుభవ మితని కేమియులేకుండెను. యిట్టిస్థితిలో యితడు రాజ్యాధికారమును వహించుట దేశక్షేమము గాదనియెంచి మంత్రిమండలి వారితనిని (సాహూను) నామకః సతారాపట్టణములో సింహాసనమున కూర్చుండబెట్టినను, సర్వాధికారములను మంత్రులే పునహానుండి చలాయింప నేర్పాటు చేసుకొనిరి.

శివాజీ ఆనంతరం.

ఇప్పటినుండియే రాజు అధికారము నామమాత్రమై ప్రధానమంత్రి అనగా "పీష్వా" అధికారము అమలులోనికి వచ్చెను. సాహూ రాజు చేయబడిన కాలములో 'బాలాజీ విశ్వనాథుడు' "పీష్వా"గా (ప్రధానమంత్రిగా) నుండెను. ఇతని తరువాత పీష్వాపదవి వంశపారంపర్య మయ్యెను. రాజును అనామకునిచేసి, పీష్వాలే సర్వాధికారములను హరించిరని కొందరు పాశ్చాత్యులు అక్రమముగ నిందించుచున్నారు. ఇది సరికాదు. శివాజీ యనంతరము రాజ్యాధికారమంతయు దుర్బలులగు రాజుల చేతలలోనే యుంచి యున్నయెడల అప్పుడప్పుడే మొలకెత్తుచున్న మహారాష్ట్రరాజ్యము మొగ్గలోనే అంతరించి యుండెడిది. కాని, మహారాష్ట్ర రాజ్యమిట్లు అకాల మృత్యుముఖమున బడకుండ పీష్వాలు యీ యుపాయముచే కాపాడిరని చెప్పవలసియున్నది. 1680-వ సం॥లో శివాజీమరణము మొదలు 1761-వ సం॥ పానిపట్టు యుద్ధమువరకు 80 సం॥లు శివాజీనాటిన మహారాష్ట్రరాజ్యపు మొలకను పీష్వాలు చక్కగ దోహదముచేసి, నానాట దానికి బలముచేకూర్చి, దిట్టపరచి, దక్షిణమున కన్యాకుమారి మొదలు ఉత్తరమున హిమాలయమువరకు మహారాష్ట్రరాజ్యమును విస్తరింపజేసిరి. ఈ 'పీష్వా' పదవికూడ వంశపారంపర్యముగ ఉండకుండ ఉండియున్నచో మహారాష్ట్ర రాజ్య మింకను చాలకాలము బలవత్తరమై యుండెడిదని చెప్పవచ్చును.

పీష్వాల అధికారము.

## 'రగూబా' లేక రఘునాథరావు—రాజ్యనాశకుడు.

శివాజీ మహారాష్ట్రరాజ్యమును స్థాపించినచో, 'రఘునాథరావు' లేక 'రగూబా' యనునతడు దాని నాశనమునకు కారకుడయ్యెను.

రఘునాథరావు పీష్వా బాజీరావుకు రెండవకుమారుడు. పీష్వాలలో కెల్ల అగ్రగణ్యుడగు బాలాజీరావుకు తమ్ముడు రఘునాథరావు గొప్ప రణప్రావీణ్యమును జూపి మహారాష్ట్రసేనలను పంజాబు, ఆఫ్ఘనిస్థానమువరకు కూడ గొంపోయి దిగ్విజయము గాంచెను. కాని, యిది అంత వివేకమైన పనిగాదని చెప్పవలసియున్నది. ఏలనగా దీనివలన ఆఫ్ఘను పరిపాలకుడగు 'అహమ్మదుషా అబ్దాలీ' తో మహారాష్ట్రులకు అకారణముగ పోరాట మేర్పడెను. ఈ యవివేకపుపనికి యింటికి రాగానే రఘునాథరావుకు మందలింపులు తగులుటయు, తదుపరి ఆతడు అహమ్మదుషా అబ్దాలీపైకి పంపబడిన సేనకు ఆధిపత్యము వహింప నొల్లకుండుటయు, అందుచే 'సదాశివరావుభవు' కు సేనాపతిత్వమిచ్చి పంపవలసి వచ్చుటయు, ఆతడు తన అవివేక ప్రవర్తనచే పానిపట్టు యుద్ధరంగమున అహమ్మదుషా అబ్దాలీచే 1761-వ సం॥లో ఓడిపోయి మరలివచ్చుటయు, మున్నగు చరిత్రనంతను నాలవ అధ్యాయములో యిదవరకే చెప్పియుంటిమి. పానిపట్టు యుద్ధమందలి అపజయమే మహారాష్ట్ర రాజ్యనాశనమునకు అంకురార్పణయని చెప్పవచ్చును. ఈ దెబ్బతో ఢిల్లీపాదుషాకు మహారాష్ట్రులభయము తీరిపోయినది. ఈ దెబ్బతో 'సింధియా' 'హోల్కారు,' 'గైక్వారు' 'భోన్‌స్లే' మున్నగు మహారాష్ట్ర సామంతులందరు కేంద్రప్రభుత్వమగు పీష్వా అధికారమునుండి విడిపోవసాగిరి. అనగా అదివరకు పునహాలో పీష్వాయొక్క ఏక అధికారముక్రింద దట్టముగ కరచుకొనియున్న యీ భిన్నరాష్ట్రములన్నియు వేటి కవి విడివడి స్వతంత్రము గాజొచ్చెను. మహారాష్ట్ర 'రాష్ట్రకూటము' (**Federation**) విచ్ఛిన్నము కా నారంభించెను.

రఘునాథరావు సమర్థుడగు సేనాపతి యయ్యును యీర్ష్యబుద్ధిగలవాడు. పంజాబులో అనవసరముగ ఆఫ్ఘను పరిపాలకునితో కలహము కల్పించుకొని వచ్చినందుకు యింటివద్ద వారు యితనిని మందలించినప్పు డితనికి యీర్ష్య ప్రబలెను. తదుపరి ఆఫ్ఘను పరిపాలకునిపైకి దండుపంపబూనినప్పు డాత డాదండును తాను నడిపించుకొని పోనని మూతి బిగించుకుని కూర్చుండెను. అందుచే, విధిలేక మహారాష్ట్రులు తమసేనను 'సదాశివరావుభవు' చేతికిచ్చి పానిపట్టు రంగమునకు పంపవలసి వచ్చెను. మరల యిందులకై 'సదాశివరావుభవు' మీద యితనికి చుప్పనాతితనము గలిగినది. ఈతని కెట్లయిన అపజయము కలిగింప వలెనని రఘునాథరావు లోలోన తలచుచున్నట్లు తెలియుచున్నది. ఇందుకై. ఆతడు క్రమ క్రమముగ కుట్రలు చేయదిగినట్టుకూడ తెలియుచున్నది. పానిపట్టు యుద్ధరంగమునందు హోల్కారు సదాశివరావుకు సహాయముచేయక, వెనుక కేల జారివచ్చెను? దీనికి బహుశః రఘునాథరావు ప్రేరేపణయే కారణమని యూహింపదగియున్నది. రఘునాథరావు కుట్రబుద్ధి రానురాను మరింతముదిరి, శత్రువులతోకూడ పరీకగుపారకు వచ్చెను. ఇంగ్లీషువారితో యీతడుచేరిన సందర్భములో యీతని కుట్రబుద్ధి లోకమునకు తేట

తెల్లముగ వెల్లడియయ్యెను. పానిపట్టు యుద్ధమయిన కొలదిరోజులకే పీష్వా బాలాజీ బాజీరావు చనిపోయెను. ఇతనికుమారుడు మైనరు మాధవరావు పీష్వాయయ్యెను. ఇతని మైనారిటికాలములో పినతండ్రియైన యీ 'రఘునాథరావు' గార్డియను గవుండి పని జూచుచుండెను. రఘునాథరావు కుట్రకిప్పుడు మంచి యవకాశము చిక్కినది. ఇతడు యింగ్లీషువారితో కలసి యొక యొడంబడిక చేసుకొనెను. మహారాష్ట్ర నాయకుడగు పీష్వాను తీసుకొనిపోయి కిరస్తానీ గుంపునకు లంకెపెట్టుట కిదియే మొదటిపర్యాయము.

మహారాష్ట్రుల స్వాధీనములోనున్న జింజీరాకోటను 'రగూబా' కంపెనీ వారి కిచ్చెను. పీష్వాకు బొంబయి గిడ్డంగిలోనున్న కంపెనీ ప్రెసిడెంటుకు మైత్రి యుండునట్లు ఒడంబడెను. మహారాష్ట్రులతో యీ సమయమున యెట్లయిన సఖ్య మేర్పరచుకొని వారి ప్రతిభను అణగగొట్టవలెనని కంపెనీ డైరెక్టరులు అప్పుడెంతో ఆతురతతో నున్నట్లు 'గ్రాంటు డఫ్' అను చరిత్రకారుడు వ్రాయుచున్నాడు. సరిగ యీ వలలో పోయి యీ దుర్మార్గుడు రఘునాథరావు పడెను. మహారాష్ట్ర రాజ్యమును చేతులార పడవేసెను. ఇతనికి బుద్ధిలేదు; వివేకములేదు; రాజకీయ వేత్త కుండవలసిన దూరదృష్టిలేదు. ఈ ఒడంబడిక మూలముగ యింగ్లీషు వారితో యేర్పడిన సంబంధమువలన మహారాష్ట్ర రాజ్యము క్రమముగ క్షీణింప నారంభించెను. వారు చెదపురుగువలె అడుగుననుండి ప్రేల్లనుకొరుక నారంభించిరి. జింజీరాకోట కధిపతిగనున్న అబిసీనియన్ దేశపు ఓడదొంగచేత యింగ్లీషువారు మహారాష్ట్ర రాజ్యములో మెల్లమెల్లగ అల్లరులను చేయసాగించిరి. మహారాష్ట్రుల గుట్టుల నన్నిటిని రఘునాథరావు తన యవివేకపు చర్యలవలన యింగ్లీషువారిక తెలియునట్లు చేసుకొనెను. నైజాము తనమీదికి రాకుండ యెదిరించుటకై "మీ యూరోపియను సైనుకులను ఫిరంగులను మాకు సహాయమిస్తారా" యని యితడు యింగ్లీషువారిని యడిగెను. "సాలిసెట్టి లంకను" 'బేసిను' కోటను మాకిస్తే మేము సేనను, తుపాకులను సప్లయి చేస్తా" మని యీ కిరస్తానీ కోమట్లు బేరము పెట్టిరి. దీని కొప్పు కోటానికి కూడ యీ దౌర్భాగ్యుడు రఘునాథరావు సిద్ధపడెను. కాని, దైవవశాత్తు నైజాము మహారాష్ట్రముపైకి దండెత్తి రానందున యీపని జరుగ లేదు. ఇంతటితో రఘునాథరావు వూరుకొనినను పోయెడిదే కాని యీతని దురాశ నానాటికి పెచ్చుపెరిగి శివాజీ స్థాపించిన మహారాష్ట్ర రాజ్యమును దుర్బల మొనర్చెను.

## మొదటి మహారాష్ట్ర యుద్ధమునకు కారణములు.

మాధవరావుకు మెజారిటీ వచ్చిన తరువాత రాజ్యాధికార మతని కివ్వక రఘునాథరా వతని నెన్నియో తిప్పలుపెట్టెను. ఆఖరుకు మాధవరావు తన పిన

మాధవరావు మరణము.

తండ్రిని ఖైదుచేయవలసినంతపని పట్టెను. కాని, మహారాష్ట్రరాజ్యపు దురదృష్టముచేత యీమాధవరావు మెజారిటీవచ్చిన కొద్దికాలముననే 28 యేటనే 1772-వ సం॥ నవంబరు 18-వ తేదీన మరణించెను. ఈతని మరణము మహారాష్ట్ర సామ్రాజ్య వృక్షమునకు మూలచ్ఛేదనమయ్యెను. పానిపట్టు యుద్ధములోని యపజయముకంటె కూడ రవ్వవంటి యీ మాధవరావు పిన్నవయస్సున మరణించుటయే మహారాష్ట్ర రాజ్య నిర్మూలనమునకు కారణ మయ్యెనని 'గ్రాంటుడఫ్' వ్రాయుచున్నాడు.

మాధవరావు నిస్సంతుగ చనిపోయెను. భార్య యీతనితో సహగమన మొనర్చెను. చనిపోవుటకుముందు మాధవరావు పినతండ్రిని చెరసాలలోనుంచి విడిపించెను. తమ్ముని నారాయణరావును పీష్వాపదవికి నియమించి మరణాసన్నుడైయున్న మాధవరావు అతనిని తన పినతండ్రియగు రఘునాథరావుచేతులలో చెయ్యివేసి అప్పగించెను. కాని, రఘునాథరావునకు కృతజ్ఞత యెక్కడిది? తిరిగి యథారీతిగా తన స్వార్థమునకై కుట్రలు నాగించెను. 1773 వ సం। ఆగస్టు 30-వ తేదీన నారాయణరావును ఇతడు బహు క్రూరముగ చంపించెను.

నారాయణరావు వధ.

రగూబా, 'మాస్టిన్' ల కుట్రయే కారణము.

ఇట్టి క్రూర కార్యమును రఘునాథరావు ఇంగ్లీషు రెసిడెంటగు 'మాస్టిన్' యొక్క ప్రేరేపణచేతనే చేసెనని తలంచుటకు ఆధారములు గన్పించుచున్నవి. పీష్వాల కుటుంబములో అంతః కలహముల ప్రేరేపించుటకే యీ 'మాస్టిను' ను బొంబాయి కంపెనీవారు పునహాకు పంపిరని 'గ్రాంటుడఫ్' అను ఆంగ్లచరిత్రకారుడే స్పష్టముగ వ్రాయుచున్నాడు. ఆసమయమున బొంబాయి కంపెనీవారు తమమీదికి నైజామును, హైదరాలీయు వచ్చిపడుదురేమోయను భయోత్పాతములో నుండిరి. వీరితో మహారాష్ట్రులుకూడ చేరినచో తమకొంప తప్పక కూలునని వీరికి హడలు పుట్టెను. కాబట్టి, మహారాష్ట్రులు "హైదరాలీ నైజాములతో చేరకుండుటకుగాను పీష్వాల కుటుంబములో అంతః కలహములు పుట్టించి రమ్మని" చెప్పి బొంబాయి కంపెనీవారీ 'మాస్టిను' ను పునహాకు పంపించిరి. ఈ వలలో ద్రోహిరఘునాథరావు పడి తన అన్నకొడుకగు బాలుని పీష్వా నారాయణరావును * వధగావించెను.

* "నారాయణరావును పట్టుకొనమని నేను హుకుమ్ వ్రాసినానుగాని చంపమని వ్రాయ లేదని రఘునాథరావే రామశాస్త్రితో ఒప్పుకొనెనట! కాని, హుకుములోనున్న "ధురావే" యనుమాటను రఘునాథరావు భార్య ఆనందాబాయి "మరావే" యనుమాటగా మార్చెననియు, యీకారణముచే హంతకులు నారాయణరావును పట్టుకొనివచ్చుటకుబదులుగ, చంపివచ్చిరనియు, గ్రాంటుడఫ్ వ్రాయుచున్నాడు. కాని, యీమోసకార్యమును బ్రాహ్మణస్త్రీయు, నారాయణరావు



శంభాజీ - శివాజీ కొడుకు
(తన అవివేకముచేత, ఔరంగజేబుకు చిక్కి, అతనిచే క్రూరముగ వధింపబడిన మహారాష్ట్రరాజు)
309-వ పేజీ.



రగూబా (లేక) రఘునాథరావు
(రాజ్యకాంక్షచే అన్నకొడుకు పీష్వా నారాయణరావును చంపించి, తాను ఇంగ్లీషువారితో చేరి, మహారాష్ట్ర సామ్రాజ్యమునకు ముప్పుదెచ్చిన వివేక విహీనుడు— 309-వ పేజీ.)



నానా ఫర్నవీస్
(కుటిల ఆంగ్ల కాలమేఘములు మహారాష్ట్ర రాజ్యభానుని క్రమ్ముకొనకుండ తన విశాలబాహువులచే త్రోసివేయ దీక్షగొన్న మహారాష్ట్ర మంత్రిశేఖరుడు -'<u>నానా ఫర్నవీస్</u>' అను ప్రఖ్యాత నామాంతరముగల "బాలాజీ జనార్దన భానుడు.")



(వధింపబడిన) పీష్వా నారాయణరావు
(ఇంగ్లీషు రెసిడెంటు ప్రేరణచే, పినతండ్రి రగూబాయొక్క రాజ్యకాంక్షకు ఆహుతియైన కుర్ర పీష్వా
312-వ పేజీ.)

312B



హోల్కార్ రాణీ అహల్యాబాయి

తన పావన రాజ్యమున ధన్యాత్ములైన అశేష ప్రజలచే లోకమాతగ పూజింపబడిన ప్రాతః స్మరణీయురాలు - యూరపియన్ రాణులకు, ఈమెకుగల తారతమ్యముల గూర్చి చరిత్రకారు డేమంటున్నాడో 330-వ పేజీ చూడండి.



మాధవరావు సింధియా

వారన్ హేస్టింగ్సు టోపీలోపడి, యూరపియను స్వామి ద్రోహులను తనకు సేనాపతులుగ పెట్టుకొని, తన సేనకు యూరపియన్ తరిఫీయతు నిప్పించి నాఅంత బలవంతుడు లేడను గర్వాతిరేకముచే, తోడి మహారాష్ట్ర నాయకులను ధిఃకరించి, వారితో కలహించి మహారాష్ట్ర రాష్ట్ర కూటమును బలహీన మొనర్చిన అవివేకి—329-వ పేజీ.



డీ బోయిన్

(మాధవరావు సింధియాకు సేనాపతి)

మాధవరావు సింధియాకు శల్యసారథ్యము చేయుటకై వారన్ హేస్టింగ్సుచే ప్రయోగింపబడిన యూరపియన్ స్వామిద్రోహి.

ఇంగ్లీషువారు అటుతరువాత ఎల్లప్పుడు రఘునాథరావు పక్షముననేయుండి మద్దతుచేయుచు తుదకు వ్యవహారములను మొదటి మహారాష్ట్ర యుద్ధములోనికి దింపిరి. నారాయణరావును యీరీతిగా 'మాస్టిన్' ప్రేరణచే చంపించి రఘునాథ రావు తానే పీష్వాగా ప్రకటించుకొనెను. ఇతనికి ఆలోచన చెప్పువాడింతటి నుండి మాస్టినే అయ్యెను. కుటిలుడగు ఈ ఆంగ్లేయుడు రగూబాను తనచేతిలో పెట్టుకొని పిండిబొమ్మ నాడించునట్లు ఆడింపసాగెను. ఇతడు రఘునాథరావును నైజాముపైకిని హైదరాలీపైకిని అనవసరముగ వుసుకొలిపి వారితో దీర్ఘకాలము యుద్ధమును చేయించెను. దీనివల్ల రఘునాథరావు ఓడిపోకపోయినను అతనికిగాని మహారాష్ట్ర రాజ్యమునకుగాని రవంతయేని లాభము సమకూడకపోయెను. పైగా, పొరుగు రాజ్యములతో మహమ్మదీయులతో రగూబా అకారణ వైరమును కొనితెచ్చు కున్నవాడయ్యెను. రఘునాథరావు ఇంగ్లీషువారి చేతులలో వట్టి కీలుబొమ్మయై యాడుచున్న సంగతిని మంత్రులు కనిపెట్టిరి. దీర్ఘకాలమితని చేతులలోనే గనుక పీష్వాపదవియున్నచో మహారాష్ట్ర రాజ్యనాశన మింకెంతకాలమో పట్టదని వారు గ్రహించిరి. వారిలో ముఖ్యుడు ప్రఖ్యాతివహించిన 'నానాఫర్నవీసు.'

ఈ ప్రఖ్యాతరాజనీతిజ్ఞుని అసలు పేరు "బాలాజీ జనార్దనభాను". ఇతడు గొప్ప రాజకీయ దురంధరులగు సద్బ్రాహ్మణుల వంశమున జన్మించెను. ఈతడు పానిపట్టు యుద్ధరంగమందుండి సమస్తమును కనిపెట్టెను. శివాజీ స్థాపించిన మహారాష్ట్రరాజ్యము నాశనముగాకుండ నిలువపెట్టుటకై తన జీవితమునంతను ధారవోయు నితడప్పుడు కంకణము కట్టుకొనెను. ఇతడు పానిపట్టునకు బయలుదేరినప్పుడు చాల చిన్నవాడు—ఇరవై సంవత్సరములలోపు వయస్సుండును. ఇతడప్పుడు సైనికుడుగాక సేనాపతి వెంట ఆంతరంగిక కార్యదర్శిగా వెళ్లెను. ఉత్తరదేశమందలి పుణ్యక్షేత్రములు కూడా దర్శింపవచ్చునను తలంపుతో తల్లిని భార్యను కూడా వెంటబెట్టుకొని పోయెను. కాని, వీరిరువురు పానిపట్టు రణక్షేత్రమునకు బలియైరి. అంతట యితడు మారువేషముతో పాదచారియై పానిపట్టునుండి బయలుదేరి పునహా చేరుకొనెను. భార్యయు, తల్లియు, నిట్లుమరణించుటచే యీతడు విరక్తుడై సన్యసింపదలచెను. కాని, మిత్రులితని పూనికను వారించిరి. మాధవరావు కాలములోనూ, అతనితమ్ముడునూ దురదృష్టవంతుడునునగు పీష్వానారాయణరావు కాలములోనూ, ఇతడు అష్ట

నానాఫర్నవీస్.

---

నెడ వాత్సల్యము గలదియునగు ఆనందబాయి చేసెనని తలంచుటకు ఆధారములు గనుపింపవు. బహుశః యీపని "మాస్టినే" చేయించియుండవచ్చునని మాయూహ. ఏలననగా, రఘునాథరావు నారాయణరావును చంపించెను. బ్రిటిషు గవర్నమెంటు వారితనికి మద్దతుచేసిరి. "ఆంగ్లో యిండియను చరిత్రలో యిదిచాలా దుష్టమైనఘట్టము" అని "కలకత్తా రెవ్యూ" లో ఒక లేఖకుడు వ్రాయుచున్నాడు.

ప్రధానులలో నొకడుగానుండెను. తిరిగి, నారాయణరావు అనంతరము అతనికుమారుడు (రెండవ) మాధవరావు కాలములో నానాఫర్నవీస్ ప్రధానామాత్య పదవి వహించి, తన రాజనీతిజ్ఞతనంతను మహాద్భుతముగ ప్రదర్శించి, ఆంగ్ల రాజకీయ వేత్తలను సహితము దిగ్భ్రమనొందించెను.

నానాఫర్నవీసుకు రఘునాథరావుకు సరిపడలేదు. ఏలననగా, రఘునాథరావు ఇంగ్లీషువారి చంకలలో దూరెను. ఇది నానాఫర్నవీసుకు యెంతమాత్రము యిష్టములేదు. పరుల నాశ్రయించుట స్వాతంత్ర్య నాశనమని నానాఫర్నవీసు మతము. ఇంగ్లీషువారెన్నోసార్లు యెంతో సహాయముచేతుమని వచ్చినను నానాఫర్నవీసు వారి సహాయమును అంగీకరించక వారిని యెడముగానే యుంచెను. "ఇంగ్లీషువారి గొప్పతనమును ఆతడెంత మెచ్చుకున్నను, వారి రాచకీయాంగ విధానమునుండి మాత్ర మాతడు దూరదూరముగ తొలగియుండెను.'' అని టారెన్సు అను ఆంగ్ల చరిత్రకారుడు వ్రాయుచున్నాడు. మంత్రులందరు తనకు వ్యతిరేకముగా నున్నారని తెలిసి రఘునాథరావు పునహాలో నుండకుండా గుజరాతుకు పారిపోయి దాగెను. నారాయణరావు వధింపబడు నాటికే అతనిభార్య గర్భవతిగా నుండెను. రఘునాథరావు పునహానుండి యీరీతిగా పారిపోయి గుజరాతులో దాగియున్న సమయమున 1774-వ సం॥ రం ఏప్రియల్ 18-వ తేదీన దురదృష్టవంతుడగు నారాయణరావుభార్య నీళ్లాడెను. చక్కని మొగశిశువు గలిగెను. ఈ కాన్పు అబద్ధమనిచెప్పి యింగ్లీషు రెసిడెంటు మాస్టిన్ కుచ్చితబుద్ధితో బొంబయికంపెనివారికి వ్రాసెను. అన్నకొడుకును రాజ్యకాంక్షచే చంపించిన దురాత్ముడు రఘునాథరావు సయితము యీ మాటనే పట్టుకొని, యీ శిశువుపుట్టినదే అబద్ధమని వాదులాడజొచ్చెను. ఈ వాదమునకు వెనుక బొంబయికంపెనీవారు చేరి తాళము వేయుచుండిరి. ఎట్లయినను కుటుంబకలహములు పుట్టించుటకేగదా వారు కూర్చొని యున్నారు. తిరిగి పీష్వాపదవిని సంపాదించుకొనుటకై రఘునాథరావు సిగ్గువిడిచి ఇంగ్లీషువారి శరణుజొచ్చెను. ఇంగ్లీషువారు నక్కలవలె పొంచియుండిరి. సాలిసెట్టిలంక, బేసిన్ కోటలపై వారు మొదటినుండియు కన్నువేసియుండిరి. మాధవరావు మైనార్టీలో యీ రెండు స్థానములు ఇంగ్లీషువారి కిచ్చుటకై అప్పుడు గార్డి యనుగనున్న రఘునాథరావు అంగీకరించిన సంగతిని మన మిదివరకును చదివి యున్నాము. కాని, అప్పుడు నైజాము, మహారాష్ట్రముమీదికి దండెత్తిరాని కారణముచే ఆ యొడంబడిక అమలు జరుగక తప్పిపోయినది. అప్పటినుంచి యీ రెండుస్థానముల నెట్లయిన నోటగరచుకొనిపోవలెనని యింగ్లీషువారు పొంచుకొనియుండిరి. ప్రత్యేకము ఆ పనికయియే సీమడైరెక్టర్లు మాస్టినును యింగ్లండునుండి పునహాకు పంపించిరి. కుటుంబకలహములు పుట్టించి, దయాళుడును, సజ్జనుడును, యెల్లరిప్రేమను జూరగొన్నవాడును, పసిబాలుడునునగు పీష్వా నారాయణ

రావును కూడా తుదకు యీ మాస్టిన్ చంపించినది యీ రెండుస్థానముల సంపాదన కొఱకేయని యెరుగవలెను. నారాయణరావు వధవిన్నప్పుడు బొంబాయికంపెనీ వారికి కలిగిన సంబరమునకు మితిలేదు. ఇక రఘునాథరావు రాజగుననియు, అతనిని తమ యిష్టమువచ్చినట్లు ఉపయోగించుకొనవచ్చుననియు, వారు చంకలు కొట్టు కొనిరి. "నీ వీ సమయములో పునహాలో అంటపెట్టుకొనియుండి, ప్రతిసంగతిని బహుసూక్ష్మముగా కనిపెట్టి చూచుచు, మనవ్యవహారమును నిమ్మకాయవాటము చేసుకురావాలెనుమా" యని బొంబాయిగవర్నమెంటువారు మాస్టినుకు 1773 సం॥ రం॥ సెప్టెంబరు 17-వ తేదీన ప్రత్తరము వ్రాసిరి.

ఇట్టిసమయములో రఘునాథరావు బుద్ధిహీనుడై తమవలలోనికి వచ్చినప్పుడు ఇంగ్లీషువారు వదలిపెట్టుదురా? తన పీష్వాగిరిని సంపాదించుకొనుటకై తనకు సహాయము చేయవలసినదని ఇంగ్లీషువారి నడుగుటకై రఘునాథరావు గుజరాతు నుండి బయలుదేరి సూరతుకువచ్చెను. ఇక్కడ 1775 సం॥ మార్చి 6-వ తేదీన ఇతనికిని బొంబాయి కంపెనీవారికి నీ ఒడంబడిక జరిగెను. పీష్వాగిరిని సంపాదించుకొనుట కితనికి ఇంగ్లీషువారు సహాయముచేసే టట్లున్నూ, ఇందుకు ప్రతిఫలముగ ఇతడు సాలిసెట్టి, బేసినులను ఇంగ్లీషువారికిచ్చు నట్లును, యిరువురును ఒడంబడిరి. ఈ సూరతుఒడంబడికయే మొదటి మహారాష్ట్ర యుద్ధమునకు కారణమయ్యెను.

సూరత్ ఒడంబడిక.

## మొదటి మహారాష్ట్ర యుద్ధము.

రఘునాథరావు సహాయార్థము ఇంగ్లీషుసేనలు "కీటింగు" సేనాని యాజ మాన్యమున బయలుదేరెను. రఘునాథరావుకూడ తనవద్ద మిగిలియున్నకొలది సేనను తీసుకొనివచ్చెను. ఈరెండు సేనలును గుజరాతులో "కాంబే"కు పదకొండు మైళ్ల దూరములోనున్న "దుర్మజ్" గ్రామమున కలుసుకొని పునహాపైకి నడువ సాగెను. కాని, పునహాను తిరిగిచూచుభాగ్యము రఘునాథరావు కీజన్మమునకు తప్పి పోయెను. పునహానుండి మంత్రులచే పంపబడిన మహారాష్ట్రసేన "హరిపంతుఫుర్కే" యాజమాన్యమున రఘునాథరావు సేనల నెదుర్కొనుటకై అదివరకే బయలుదేరి గుజరాతులో ప్రవేశించెను. ఉభయపక్షముల సేనలకు "అర్రాసు" అనుచోట 1775 సం॥ మే నెల 18-వ తేదీన యుద్ధముజరిగెను. ఈ యుద్ధములో రఘునాథరావు యొక్కయు, అతని నేస్తగాండ్రగు ఇంగ్లీషువారియొక్కయు సేనలు పటాపంచ లయ్యెను. అనేకమంది బ్రిటిష్ ఆఫీసర్లు మరణించిరి. కొందరికి గాఢముగ గాయ ములు తగిలెను. ఇక వర్షకాలము వచ్చుచుండుటచే నదులనుదాటుట కష్టమగునని చెప్పి హరిపంతు తనసేనలను తీసికొని వెనుకకు మరలెను. ఈసేనలు జూన్ 10-వ తేదీన నర్మదానదిని దాటుచుండగ, వెనుకనుండి కొట్టవలెనని ఇంగ్లీషు సేనాని "కీటింగ్" ప్రయత్నించెను. కాని, యీపని సాగలేదు. వర్షములు ప్రారంభ

మగుటచే, యితడును వెనుకకు వెళ్లిపోయెను. హరిపంతు విజయవంతమగు సేనలతో పునహాచేరెను.

ఈలోగా పీష్వాకు సామంతులుగనుండిన "గాయక్వార్" మున్నగువారు మహారాష్ట్ర "రాష్ట్రకూటము"నుండి విడిపోవసాగిరి. ఈ గృహచ్ఛిద్రములవల్ల కూడ "హరిపంతు" అర్రాస్ యుద్ధానంతరము త్వరగ యింటికి మరలవలసి వచ్చెను. కాబట్టి, యీయుద్ధమందు మహారాష్ట్రసేనలు విజయమును పొందియు, దానిని పూర్ణముగ వినియోగించుకొన నవకాశము లేనివయ్యెను.

ఇట్లు రాష్ట్రకూటమునుండి విడిపోవుటకు మొదలుపెట్టినవాడు బరోడా రాష్ట్రమునకు అధిపతిగనుండిన "గైక్వార్." ఈ రాష్ట్రచరిత్రను క్లుప్తముగ వివరించుట అవసరము.

గైక్వార్ వంశస్థాపకుడు "దమ్మాజీగైక్వార్" ఇతడు గొప్ప రణప్రావీణ్యమును జూపి అప్పుడు రాజుగానున్న సాహూను మెప్పించుటచే ఆతడితనికి 1720 వ సం॥ రంలో "షంషేర్ బహద్దర్" అను బిరుదమునిచ్చి మహా

గైక్వార్

రాష్ట్రసేనకు రెండవ సేనాపతిగ నియమించెను. ఇతని తరువాత "పిలాజీ గైక్వార్" యీ పదవికి వచ్చెను. ఈ "పిలాజీ" కాలములోనే మొగల్ సామ్రాజ్యములోని చాలభాగములు మహారాష్ట్ర రాజ్యములో కలిసెను. ఇతడు "బరోడా" తన ప్రధానస్థానముగ నేర్పరచుకొనెను. కాని, 1732 సం॥ లో "పిలాజీ"ని శత్రువు లెవరో రహస్యముగ ఖూనీ చేయించిరి. అప్పు డితని స్థానమునకు అతని పెద్దకొడుకు "దమ్మాజీ" వచ్చెను. అప్పటినుండియు బరోడా గైక్వారు వంశములోనే యుండెను. పానిపట్టు యుద్ధమైన తరువాత తక్కిన సింధియా, హోల్కారులతో పాటు యీగైక్వారును మహారాష్ట్ర రాజుయొక్క అధికారమును ధిఃకరించి స్వతంత్రుడై పోయెను. "దమ్మాజీ" 1768 సం॥లో చనిపోయెను. ఇతనికి మువ్వురుభార్యలుండిరి. వీరివల్ల నలుగురు కొడుకులు గలిగిరి. ఇతని యనంతరము రాజ్యాధికారమునకై యీ నలుగురు కొడుకులును తగవులాడుకొనిరి. మొదటికొడుకు శాయజీరావు రెండవభార్యకు పుట్టినవాడు. రెండవకొడుకు గోవిందరావు మొదటిభార్యకు పుట్టినవాడు. అందుచే వీరిద్దరికి శాయజీ గోవిందరావులకు—నేను జ్యేష్ఠుడనంటే నేను జ్యేష్ఠుడనని తగవులు పుట్టెను. మొదటికొడుకు శాయాజీరావు మందబుద్ధి—వెర్రిబాగులవాడు. మూడవభార్యకు మాణిక్యజీ, "ఫుట్టీసింగ్" అను యిద్దరు కొడుకులుండిరి. వీరిలో ఆఖరు వాడగు ఫుట్టీసింగు మొదటిసవతి యన్నయగు శాయజీరావుయొక్క పక్షమునజేరెను. ఈతగవులు తండ్రి బ్రతికియున్నప్పటి నుండి కూడ యీ యన్నదమ్ములలో రగుల్కొనుచుండెను. ఇట్లుండగ, రఘునాథరావు పునహానుండి గుజరాతుకు పారివచ్చెనని చెప్పియుంటిమి. ఆ సమయమున

రఘునాథరావు యీ గైక్వారు రాజ్యములోనే తలదాచుకొని యుండెను. ఇత డిక్కడ యిట్లు దాగియుండగ యితనికి సహాయము చేయుటకై యింగ్లీషు సేనాని "కీటింగ్" బరోడాకు వచ్చెను. వచ్చినవాడు వచ్చినట్లుగపోక "కీటింగ్" యీ యన్నదమ్ముల కలహములలో తాను దూరవలెనని చూచెను. కడసారి వాడగు "ఫుట్టీసింగ్‌తో (1775 సం॥ ఏప్రిల్ నెలలో) బేరములు పెట్టవలెనని చూచెను. కాని, ఆతడంమలకు లొంగలేదు. కీటింగ్ వలలో "ఫుట్టీసింగ్" పడలేదని బొంబాయి కంపెనీవారికి తెలిసి యీపని నెట్లయిన సాధించుకొని వచ్చుటకు మకీకుచ్చి తుడని పేర్వడసిన మాస్టినును పంపించిరి. ఈతడు ఫుట్టీసింగును తియ్యనిమాటలచే లాలించియు, బెదరించియు, యెట్లో ఒకరీతిగ అతనిని తన వలలో వేసుకొనెను. ఇందు మూలముగ యింగ్లీషువారికి గుజరాతులో కాలూని స్థిరముగ నిల్చుటకు మంచితావు దొరికినది. అత డీతని చెవిలో యేమియూదెనో గాని బరోచి, సూరతు దగ్గరనున్న 'చికాలేవెరివో,'.నర్మదానది దగ్గరనున్న కోరల్—యీ మూడుపర గణాలను 'ఫుట్టీసింగు' కంపెనీవారికి ధారాదత్తము చేసెను! ఇందుకు ప్రతిఫల ముగ వెర్రిబాగుల పెద్దన్నయ్య శాయాజీరావును బరోడా సింహాసనముమీద కూర్చుండబెట్టుటకు యింగ్లీషువారు ఒడంబడిరి. అధికారమువంతను వెర్రియన్న పేరిట ఫుట్టీసింగునే చెలాయించుకొనమనిరి. ఇక యింతటినుంచి గైక్వారుకును మహారాష్ట్ర రాష్ట్రకూటమునకును విడియాకులయ్యెను! క్రమముగ మహారాష్ట్ర ప్రతిభ భరతఖండమున మాసిపోవుటకు మార్గమేర్పడెను.

## మొదటి మహారాష్ట్రయుద్ధ ఫలితములు

రఘునాథరావుతో 1775 సం॥ మార్చి నెలలో సూరత్ ఒడంబడిక చేసి కొనుట, అతనికొరకై మహారాష్ట్రులతో యుద్ధమునకు దిగి ఓడిపోవుట, బరోడా సంస్థానపు అన్నదమ్ములకలహములలోచేరి ఫుట్టీ సింగుతో యేకమై వెర్రిబాగుల శాయాజీరావును సింహాసన మెక్కించుట మొదలగు పనులన్నిటిని బొంబాయి కౌన్సిలువారు కలకత్తా కౌన్సిలువారితో చెప్పకుండగనే స్వతంత్రించిచేసిరి. ఇది. అప్పటికి దాదాపు 7, 8, మాసముల క్రిందటనే 1774 సం॥ ఆగస్టు 1-వ తేదీననే ఇండియాలో అమలులోనికి వచ్చిన రెగ్యులేటింగు ఆక్టునకు ప్రత్యక్షవిరుద్ధముగద. ఈ ఆక్టు ప్రకారము బొంబాయి, మదరాసు, కౌన్సిళ్లవారు కలకత్తా (సుప్రీమ్) కౌన్సిలు వారికి లోబడి ప్రవర్తింపవలసి యుండెనను సంగతిని పైయధ్యాయములో వివరించి యేయుంటిమి. రెగ్యులేటింగు ఆక్టుచే సుప్రీము కౌన్సిలు మెంబర్లుగ నియమింప బడినవారిలో ఫ్రాన్సిస్ అఖండుడు. సత్యప్రియుడు; హిందూదేశ ప్రజలయందు సానుభూతిగలవాడు. కంపెనీవారొనర్చుదుండగములను సహింపక వానిని నిర్భాగ మాటముగ వెల్లడించినవాడు. ఇతడుసుప్రీము కౌన్సిలులో మెజారిటీని సంపాదించు కొని అక్రమ ప్రవర్తకుడగు గవర్నరు జనరలు వారన్ హేస్టింగ్సుకు పక్కలో బల్లె

ముగ నుండెను. ఇతనికిని అతనికిని గలిగిన వైరములసంగతిని కొంత పై యధ్యాయములో చెప్పియేయుంటిమి. కంపెనీ యుద్యోగులు యే యే ప్రాంతములలో యే యే చర్యలు చేయుచున్నదనియు ఫ్రాన్సిసు అప్రమత్తుడై కనిపెట్టుచునే యుండెను. బొంబాయి కౌన్సిలువారు కండ్లుమూసుకొని పాలుత్రాగు పిల్లివలె మహారాష్ట్రులతో ప్రవర్తించుచున్నప్పటికిని యీ సంగతులన్నియు కలకత్తా సుప్రీము కౌన్సిలులో కూర్చున్న మన ఫ్రాన్సిసుకు తెలియవచ్చుచునే యుండెను. ఈ చర్యల నాతఁడు ఆమోదింపజాలడయ్యెను. కాబట్టి, తాము సుప్రీము కౌన్సిలుతో చెప్పకుండ చేసిన పనుల కన్నిటికిని తగు సంజాయిషీ యివ్వవలసినదని కోరుచు ఫ్రాన్సిస్ గవర్నరు జనరల్ చేత బొంబాయి కౌన్సిలువారి కొక ఉత్తరము వ్రాయించెను. ఈ ఉత్తరము బొంబయి కౌన్సిలువారికి 1774 సం॥ డిశంబరు 7 వ తేదీన చేరినప్పటికి వారుదానిని 31-వ తేదీవరకు త్రొక్కిపట్టియుంచి అప్పుడైనను సరియగు సమాధానమివ్వక ఆకును అందకుండ పోకను పొందకుండ యేదో సంజాయిషీ వ్రాసి పంపెంచిరి. ఈ సంజాయిషీ కలకత్తా సుప్రీము కౌన్సిలువారికి తృప్తికరముగ కన్పించ లేదు. కాబట్టి, రఘునాథరావుతో బేరములు తక్షణము మానివేయవలసినదని 1775 సం॥ మార్చి 8-వ తేదీన సుప్రీము కౌన్సిలువారు తిరిగి వ్రాసిరి. దీనిని బొంబయి కౌన్సిలువారు పాటింపనందున సుప్రీము కౌన్సిలువారు మే నెల 31-వ తేదీ జాబులో వారిని కఠినముగ మందలింపవలసి వచ్చెను. బొంబయి కౌన్సిలువారు రఘునాథరావుతో చేసుకున్న ఒడంబడికను వారన్ హేస్టింగ్సు మున్నగు యావన్మంది సుప్రీముకౌన్సిలు మెంబర్లు తీవ్రముగ ఖండించిరి. బొంబయి కౌన్సిలువారీ దుర్మార్గమునకు మద్దతుచేయుట చాల 'బేసబబు' 'అన్యాయము' 'రాజనీతికి విరుద్ధము,' 'అధికార రహితము' నని సుప్రీము కౌన్సిలువారు గట్టిగ చివాట్లు పెట్టిరి. మరియు, సదరు సూరత్ ఒడంబడికను రద్దుపరచుచు తక్షణమే రఘూబా సహాయార్థము పంపిన సేనలను తీసి పారవేయవలసినదని కఠినముగ ఉత్తరువుల జారీచేసిరి. "మేమే పునహాలోనున్న పీష్వాలతో సరాసరి రాయబారముల జరుపు కొందుమని" సదరు ఉత్తరములో సుప్రీము కౌన్సిలువారు బొంబయి కౌన్సిలు వారికి తెలియజెప్పిరి. ఇది, "కోడలుని కాదని అత్త అధికారము చెలాయింప జూచిన" సామెతలాగున్నది! సుప్రీము కౌన్సిలువారు కలకత్తానుండి మే 31-వ తేదీన పంపిన ఉత్తరము బొంబయివారికి ఆగష్టు-12-వ తేదీన చేరినది. ఈ లోగా, పునహా అధికారులతో సరాసరి బేరములాడుకొని వచ్చుటకు సుప్రీము కౌన్సిలు వారు 'కర్నల్ అప్టన్' అనునతనిని 1775 సం॥ జులై 17-వ తేదీన అలంకరించి పంపిరి. అతడారోజుననే కలకత్తాలో బయలుదేరెను.

తమ అధికారములో సుప్రీము కౌన్సిలువారువచ్చి జోక్యము కలిగించుకొనుట పాడిగాదని బొంబయి కౌన్సిలువారు ప్రతిఘటించిరి. "రఘునాథరావుతోడి

అష్టన్ రాయబారము.

బేరములన్నియు రెగ్యులేటింగు ఆక్టుపుట్టుటకు పూర్వమే మేము ప్రారంభించి యుంటిమని'' బొంబయివారు వాదించిరి. కాని, యిది సరికాదు. రెగ్యులేటింగు ఆక్టు పుట్టిన సంగతి బొంబయి కౌన్సిలువారికి అదివరకు చాలకాలము క్రిందటనే తెలియును. ''ఈ బేరములవల్ల మేము కంపెనీకి చాలలాభములు చేసినామని'' కూడ బొంబయి కౌన్సిలువారు వాదించిరి. తమ పక్షమున గట్టిగవాదించి నచ్చచెప్పుకొనుటకై 'విలియమ్ టెయిలర్' అను నతనిని కలకత్తాకు పంపిరికాని కలకత్తావారితని వాదనలను అంగీకరించక త్రోసివేసిరి.

1775 సం॥ మేనెల 31-వ తేదీగల మందలింపు ఉత్తరమును చూచుకొగానే బొంబయి కౌన్సిలువారు తక్షణమే యుద్ధము నాపివేసి సేనలను వెనుకకు మరలించుకొనిరమ్మని కర్నలుకీటింగుకు ఉత్తర్వుల బంపిరి.

'అప్టన్' ను పునహాకు పంపునప్పుడు కలకత్తా సుప్రీము కౌన్సిలువారు అతనిచేతికి రెండు ఉత్తరములిచ్చిరి. ఒకటి పునహా మంత్రివర్గమున కప్పుడు నాయకుడుగనుండిన ''శకారామ్ బాపూ'' కును, రెండవది రఘునాథరావుకును. ఈ యిద్దరిలో నెవరు జయించి వుంటేవారికి వారిపేరనున్న ఉత్తరమిచ్చి బేరము కుదుర్చుకు రావలసిందని అష్టన్‌కు చెప్పిరి. ''ఎవరు జయించినను సరే వారినుండి సాలిసెట్టి, బేసిను, లనుమాత్రము సంపాదించుకొని రావలయును సుమా'' యని అష్టన్‌కు గట్టిగా చెవిలో యూదిపంపిరి. ఇదిలేనిది బేరమే లేదనిరి.

వారన్ హేస్టింగ్సు ''శకారాము''నకు వ్రాసిన యుత్తరములో నేమి వ్రాసినాడు ?

''బొంబయి కౌన్సిలువారి ప్రవర్తన పైకుంఫినీ అధికారుల వుత్తర్వులకు విరుద్ధమైనది. ఎవరితోగాని నెట్టి పేచీలు పెట్టుకోవద్దనియు ఎవరితోగాని యుద్ధములో దిగవద్దనియు, మాకంపెనీ యజమానులు మాకు ఉత్తర్వులుచేసి యున్నారు. ఇండియాలోనున్న యావన్మందికంపెనీ గవర్నరులున్నూ నాయొక్కయు, నా కౌన్సిలు యొక్కయు, అనుమతిలేనిదే యే యుద్ధముగాని, యేసంధిగాని, చేసుకొరాదని మా దేశపు రాజుగా రాజ్ఞాపించియున్నారు. నాయేలిక-మా దేశపు రాజుగారు-నన్నును, నాకౌన్సిలును, తనకును తనకౌన్సిలుకును ప్రతినిధిగా యిక్కడ యేర్పాటు చేసినాడు.''

ఎటువాటముగవుంటే అటు చేరుటకుగాను యీవుత్తర మీరీతిగా వ్రాయబడినది. పునహావారు గెలిస్తే ''ఎబ్బే! మాబొంబయివారు తెలివితక్కువగా మా అనుమతిలేకుండా రఘునాథరావుని వెనుకవేసుకొని మీమీదయుద్ధముచేశారు. అది చాలతప్పు. రఘునాథరావు దుర్మార్గుడు, అతనితో మాకు స్నేహమేమిటి? మీకు

మాకు స్నేహముండాలిగాని 'అని పునహావారితో ఇచ్చకములాడి మెల్లిగా సాలిసెట్టి, బేసినులను తీసుకొందమనియు—అటుగాక రఘునాథరావే గెల్చి పునహా సింహాసనమెక్కితే సరేసిరి. ఇక కష్టమేమున్నది? అతని ఒడంబడిక ప్రకారమే సాలిసెట్టి, బేసినులను లాగుకొందమనియు కలకత్తా కౌన్సిలువారు గొప్పఎత్తువేసిరి. అందుకోరకే ఎటువాటముగావుంటే అటు ఉపయోగపడటానికి రెండు ఉత్తరములు వ్రాసి అప్టన్ చేతికిచ్చిపంపిరి.

అప్టన్ బొంబయిరాష్ట్రము చేరునప్పటికి పునహామంత్రి మండలి పురందరులో మకాముచేసియున్నట్లు తెలియరాగా ఆతడక్కడికి 1775 సం॥ డిశంబరు 28-వ తేదీన చేరెను. సాలిసెట్టి, బేసినులను ఇస్తేగాని సంధి కుదరదని అప్టన్ చెప్పిన మాటకు పునహా మంత్రులు తీవ్రముగ ఎదిరించిరి. ఇందునుగూర్చి అప్టన్ 1776 సం॥ ఫిబ్రవరి 2-వ తేదీన వారన్ హేస్టింగ్సుకు యిట్లనివ్రాసెను. ఈ ఉత్తరము కలకత్తాకు మార్చి 6-వ తేదీన చేరెను.

"నేనెట్లో తమతో సంధిచేసుకోనక తీరదని యీ మంత్రులు తలంచుచున్నారు. సాలిసెట్టి, బేసినులను అడుగుటకు నాకు హక్కులేదని వీరనుచున్నారు. 'మేము చాల మర్యాదస్థులము, మాటతప్పము' అని పదేపదేసార్లంత గట్టిగా మీరేల ఒట్లుపెట్టుకొనుచున్నారని యీ మంత్రులు నన్నడుగుచున్నారు. ఈ యుద్ధమువల్ల వచ్చేలాభాలు కాజేయనలెనని ఒకమూల గట్టిగా పట్టుపట్టుచు, 'ఎబ్బే బొంబయి గవర్నమెంటువారు మీతో యుద్ధంచేయడం మేముఒప్పుకోలేదని మీరెట్లు వాదించగలరు? అని యీమంత్రులు నన్ను అడ్డుసవాళ్లు వేయుచున్నారు!"

ఈ సవాళ్లకు అప్టన్ జవాబు చెప్పలేక తెల్లబోయెను. అందుచే "ఏమి చేయమన్నార"ని చెప్పి తిరిగి ఇతను కలకత్తాకు తమవారికి వ్రాసుకొనెను. సాలిసెట్టి, బేసిను లను వదలివేస్తేనేగాని సంధికుదరదని పునహా మంత్రిమండలి గట్టిగా పట్టుబట్టెను. బేరము చెడిపోయినదని అప్టన్ ఫిబ్రవరి 7-వ తేదీన తిరిగి కలకత్తాకు వ్రాసుకొనెను. అంతట వారన్ హేస్టింగ్సు యుద్ధమునకు గొప్ప సన్నాహము సాగించెను. భాన్స్లే, సింధియా, హోల్కారులను తనపక్షమునకు తిరగదీయుటకై వారన్ హేస్టింగ్సు ప్రయత్నించెను. తనపక్షమునకు రమ్మనియు, లేదా, కనీసము తటస్థముగనైన నుండమనియు, నైజాము హైదరాలీలకు వ్రాసెను. కలకత్తా మద్రాసులనుండి సేనలు బయలుదేరుటకు సిద్ధముచేసెను. అప్టన్ రాయబారి కలకత్తాకు మరలిపోవనుండెను.

కాని, ఇంతలో యేమిదైవమాయ యావరించెనో తెలియదుగాని పునహా మంత్రిమండలివారు తమమనస్సులను మార్చుకొనిరి. సూక్ష్మబుద్ధియగు

పురందర్ ఒడంబడిక.

నానాఫర్నవీసు యేకారణములచే తనమనసును మార్చుకోవలసి వచ్చెనో తెలియదు. కలకత్తా సుప్రీము కౌన్సిలువారు కోరిన షరతులకన్నిటికి పునహా మంత్రిమండలివారంగీకరించిరి. అప్పుడు పునహా మంత్రిమండలి వారికిని కలకత్తాసుప్రీమ్ కౌన్సిలువారికిని సంధిజరిగెను. ఇదియే పురందరు ఒడంబడిక. దీనిపై పురందరు కోటలో 1776 సం॥ జూన్ 3-వ తేదీన సంతకములు జరిగెను. ఇంతకాలమునుండి ఇంగ్లీషువారు కన్నువేసియున్న "సాలిసెట్టిలంక" మాత్రము ఇంగ్లీషువారికీ యొడంబడికవలన ఇచ్చివేయబడెను. బేసిన్ కోట ఇవ్వబడలేదు గాని బ్రోచినగరమును, దానిచుట్టునున్న కొంతప్రదేశమును, ఇంగ్లీషు వారితో స్నేహమునిమిత్తము ఇచ్చివేయబడెను. ఆ దౌర్భాగ్యుడు రఘునాథ రావుకు కొంతమనోవర్తికూడా ఏర్పాటుచేయబడెను. బొంబయి కవున్సిలువారు 1775 సం॥ మార్చి 6-వ తేదీన రఘునాథరావుతో సూరతులో చేసుకొన్న ఒడంబడిక ఇందుమూలముగా రద్దుపడెను. అనగా, రఘునాథరావు యిచ్చిన బేసెనుకోట వదలుకోన్నట్లయ్యెను. మరియు కంపెనీవారికి "సాలిసెట్టి" మొదలగు ప్రదేశములు లభించినను రఘునాథరావును పునహా సింహాసనమున కూర్చుండ బెట్టెదమని బొంబయి కౌన్సిలువా రతని కిచ్చినమాట వమ్మాయిపోయెను.

బొంబయి కౌన్సిలు వారి ఉక్కు రోషము.

ఇందుకు బొంబయి కౌన్సిలువారికి కలకత్తా సుప్రీము కౌన్సిలువారిమీద కోపమువచ్చెను. తమ్మును కలకత్తా కౌన్సిలువారిట్లు అవమాన పరచిరనిచెప్పి బొంబయి కౌన్సిలువారు సరాసరి సీమలోని కంపెనీ డైరెక్టరులకు మొరపెట్టుకొనిరి. చేలోకువైన రఘునాథరావును సింహాసనముమీద కూర్చుండబెట్టితే అతనినుండి ఎక్కువ డబ్బును ఎప్పుడుబడితే అప్పుడు గుంజుకో వచ్చునుగదా యనునాశతో ఆకోమటి డైరెక్టర్లు బొంబయి కౌన్సిలుపక్షము వహించి "రఘునాథరావుతోటి సంబంధము వలన మనకు లభించిన స్థలములనన్నిటిని మనము భద్రముగా కాపాడుకొనుటకు వలయు చర్యలనన్నిటినీ మీరు చేయవలయునని డైరెక్టర్లు కలకత్తా సుప్రీం కౌన్సిలు వారికి వ్రాసిరి. ఈ సందు చూసుకొని బొంబయి కౌన్సిలువారు కలకత్తా సుప్రీం కౌన్సిలువారిని చులకనజేసి, వారేర్పరచిన పురందరు ఒడంబడిక అమలు జరుగకుండ ఎగరగొట్టుటకు పూనుకొనిరి. ఏమాత్రము సందుదొరికినను వారీ యొడంబడికను భగ్నపరుప సిద్ధముగ కూర్చుండిరి. అవసరమైతే తిరిగి యుద్ధమునకుకూడ సంసిద్ధులుగ నుండిరి.

మాస్టిన్ రెసిడెన్సీ.

సుప్రీం కౌన్సిలువారి యాజ్ఞప్రకారము అప్టన్ అనంతరము బొంబాయి కౌన్సిలువారు పునహాలో తమపక్షమున రాయబారిగ నుండుట కొకనిని పంపవలసి వచ్చెను. ఈ పనికి బొంబయి కౌన్సిలు

వారు మహా కుటిలాత్ముడగు 'మాస్టిను'నే మరల యేరి పంపించిరి. పునహామంత్రి మండలివారు "యితను మాకు వద్దని" యెంత మొత్తుకొన్నను వినక బొంబయి కౌన్సిలువారు తిరిగితిరిగి యితనినే పంపిరి. పురందరు ఒడంబడిక అమలు జరుగకుండ చూడవలయుననియే యితనికి రహస్యపుసలహా చెప్పి బొంబయివారు పంపినట్లు ఊహింపదగియున్నది. ఇతడు 1777 మార్చి నెలలో పునహాలో ప్రవేశించెను. ఇతడక్కడ కాలుపెట్టినది మొదలు తిరిగి యథారీతిగా కుట్రలు సాగించెను. ఇతడు తన "వెనుకటిగుణమేల మానును ?". ఇతని ప్రవర్తనవలననే తిరిగి మహారాష్ట్రులకు ఇంగ్లీషువారితో పోరాటము కలిగెను. చీటికిమాటికి యితడేదో గిల్లి కజ్జాలు రేప సాగెను. ఎవడో ఫ్రెంచివాడు పునహాబజారులలో యితని కంటబడినాడట. "అదుగో యింకేముంది! పునహామంత్రులు ఫ్రెంచివారితోచేరి, ఇంగ్లీషువారిమీద కత్తి కట్టవలెనని కుట్రలు పన్నుచున్నారని" యితడు పెద్ద గగ్గోలు పెట్టుచు బొంబయి కౌన్సిలువారికి వ్రాసెను. ఎద్దుకు ఎర్రగుడ్డ చూస్తే ఎంతబెదురో, ఇంగ్లీషువాడికి ఆ రోజులలో ఫ్రెంచివాణ్ణిచూస్తే అంతబెదురు. పునహాలో కొంపలు కూలుచున్నవనియు, యేదో గట్టిగా పనిచేస్తేనేగాని యీ పశ్చిమ భరతఖండములో తమకిక ఆశలుండవనియు, తమ యిష్టమువచ్చినట్లు వర్తించకుండ కలకత్తావారు తమ కాళ్లు చేతులకు అడ్డము వచ్చుచున్నారనియు, బొంబాయిగవర్నరు 1777 అక్టోబరు 10-వ తేదీన అనగా మాస్టిన్ పునహాలో కాలుపెట్టిన ఆరునెలలకే గోలపెట్టుచు పై అధికార్లకు వ్రాసుకొనెను.

ఫ్రెంచిబూచిని లేవదీయుటయే గాక మాస్టిన్ పునహామంత్రిమండలిలోనే అంతఃకలహముల పురిగొల్పెను. శకారామును నానాఫర్నవీసుకు 'మొరాబా'కు పడకుండ జేసెను. అందుచే నానాఫర్నవీసు పునహానుండి లేచిపోయి పురందరులో కాపురముండెను. అంతట మాస్టిన్ పని తేలికయయ్యెను. ఇతడు మొరాబామంత్రికి కన్నుగీటి, రఘునాథరావును తిరిగి పునహా చేర్చుకోవచ్చునని అతనిచేత బొంబాయి కౌన్సిలువారికి వ్రాయించెను. ఇక బొంబయి కౌన్సిలువారి సంబర మే మనవచ్చును. పురందరు ఒడంబడికను చించి పారవేయటానికి వారికి యెక్కడలేని ధైర్యము వచ్చినది. దీనికితోడు, సీమడైరెక్టర్లుగూడ వీరికి మంచి మద్దతునిచ్చిరి. పురందరు ఒడంబడికవల్ల బేసినుకోట పోయినదేయని వీరు లోలోనదిగులుపడుచుండిరి. కాబట్టి యేమాత్రము అవకాశమున్నను పునహామంత్రులతో గిల్లి, కజ్జా తెచ్చుకొని పురందరు ఒడంబడికను త్రోసివేసి, తిరిగి రఘునాథరావుతో నేస్తముకట్టవలసినదని చెప్పి సీమ డైరక్టర్లు సుప్రీము కౌన్సిలుకును స్పష్టముగ వ్రాసిరి. ఈ యుద్దేశమును మనసులో పెట్టుకొనియే బొంబయి కౌన్సిలు వారింకను రగూబాను వదలిపెట్టక, వెనుకనుండి మద్దతుచేయుచునే యుండిరి. ఇందువల్ల పునహా మంత్రిమండలివారు పురందర్

ఒడంబడిక షరతులను నెరవేర్చుట కవకాశము లేకుండా చేయవలెనని బొంబయి కౌన్సిలువారి తలంపు.

అక్కడ వారన్ హేస్టింగ్సును యే యెండ కా గొడుగుపట్టుచుండెను. మొదట తనకు సుప్రీం కౌన్సిలులో మెజారిటీ లేనప్పుడు మెజారిటీవారి కోరికప్రకారము సూరతు ఒడంబడికను ఖండించవలసి వచ్చెను. కాని, యిప్పు డక్కడ వ్యవహారము మారినది. ఆతడు తన కౌన్సిలులో మెజారిటీని సంపాదించుకొనెను. కాబట్టి, డైరెక్టరుల కోరికప్రకారము పురందరుఒడంబడిక నిప్పుడు త్రోసిపుచ్చుట కతనికి అవకాశ మేర్పడెను. పునహా మంత్రిమండలిలోని శకారాముకూడ రఘునాథరావును తిరిగి సింహాసనముపై కూర్చుండపెట్టుటకుగాను బొంబయికౌన్సిలువారి సహాయము కోరుచున్నట్లు మాస్టిన్ సదరు కౌన్సిలువారికి శుద్ధ అబద్ధములను వ్రాసి పంపించెను.

కలకత్తానుండి సైన్య సన్నాహము.

ఈ సంగతులనన్నిటిని అవకాశముగా తీసుకొని రఘునాథరావును సింహాసనముపై కూర్చుండబెట్టుపనికై మొరోబాకు సహాయార్థముగా కలకత్తానుండి కొంతడబ్బును సైన్యమునుకూడ బొంబయికి పంపుటకుగాను వారన్ హేస్టింగ్సు సంకల్పించెను. ఇట్లు చేయుట చాల అక్రమమని కౌన్సిలులోని ఫ్రాన్సిసు మున్నగు సభ్యులును, పురందరు ఒడంబడికను కుదుర్చుకుని వచ్చిన అప్టన్ రాయబారియు, యెంతో దూరము చెప్పిరి. కాని, వారన్ హేస్టింగ్సు కౌన్సిలులో తనకిప్పుడు మెజారిటీ వున్నకారణముచేత యీ సలహాను పెడచెవినిబెట్టి, బెంగాలునుండి ఒకసేనను బయలుదేరదీసి, మధ్యనున్న రాష్ట్రములన్నిటిని త్రొక్కుకొనుచు, సరాసరి బొంబయికి పోవలసినదని ఆజ్ఞాపించెను.

ఆయాజ్ఞప్రకారము సేనబయలుదేరక పూర్వమే పునహా మంత్రిమండలిలో మార్పులు జరిగినట్లు కలత్తాకు వార్తవచ్చెను. కంపెనీవారి సహాయముకోరిన 'మొరాబా' చెరసాలలో వేయబడెను. శకారాముకూడ నానాఫర్నవీసుతో పొట్లాడ సఖ్యపడి ముసలివాడగుటచే మంత్రిత్వము మానుకొనెను. వ్యవహారమంతయు యిప్పుడు అసాధ్యుడగు నానాఫర్నవీసు చేతిలోనికి వచ్చినది. కూలిపోవుచున్న మహారాష్ట్ర సామ్రాజ్యమునకు యీతడు తన సామర్థ్యముచే పోటీపెట్టి నిలుప సంకల్పించెను. ఈతడు నిష్కలంకుడగు దేశాభిమాని.

"ఒక్క నానాఫర్నవీసువంటి వాడుంటేచాలు. మనమెందుకు వానిముందర పనికివాస్తాము ? ఇటువంటి దేశీయులముందర మనమెంతటి రాజకీయవేత్తలమైనను ధూపమునకు •పనికిరాము" అని సల్లివాన్ అను ఆంగ్లేయుడు 1852 సం॥లో వ్రాసెను.

ఇట్టి గట్టిపిండముతో వారన్ హేస్టింగ్సు వ్యవహారము నడుపవలసివచ్చెను.

నానాఫర్నవీసు అధికారమునకు వచ్చిన వార్త తెలియగానే యిప్పటికైనను బొంబయికి దండుపంపు ప్రయత్నము మానుకోవలసినదని ఫ్రాన్సిసుమున్నగు కౌన్సిలు మెంబర్లు వారన్ హేస్టింగ్సుకు యెంతోదూరము తిరిగిచెప్పిరి. కాని అతనిబుద్ధి మరల లేదు.

పునహాలో ఫ్రెంచివారు చేరి కుట్రచేయుచున్నారు కాబట్టి వారిపైకి యీ దండు పంపవలసియున్నదని వారన్ హేస్టింగ్సు సాకుచెప్పెను. ఈ సాకుచెప్పియే తనదండు హోల్కారు సింధియారాజ్యములగుండ బొంబయికి పోవుటకు వారన్ హేస్టింగ్సు వారల యనుమతిని పొందెను. భాన్స్లేతో నేస్తముకట్టి అతని బీరారు రాజ్యములోకూడ తన సేనల నడకకు అడ్డులేకుండా అతడు చేసుకొనెను. ఈ నేస్తమునుగూర్చి కొంత విపులముగా చెప్పవలసి యున్నదిగాన తరువాత తెల్పెదము.

బెంగాలునుండి దండువచ్చుచున్నదిగదా యనుధిమాకుతో యిక్కడ పూనాలో మాస్టిన్,మంత్రిమండలియెడ పొగరుబోతు తనముగ ప్రవర్తింపసాగెను. మంగలంవచ్చి కుండను యెక్కిరించినట్లు "పురందరు ఒడంబడికకు మీరు బద్ధులై యుంటారాయని యితడు మంత్రిమండలినడిగెను." "మీరో? మీరుంటే మేమూ ఉంటాము" అని నానాఫర్నవీసు తిరుగవేసి కొట్టెను!

భాన్స్లేతో కుట్ర.

సతారాలోనున్నరాజు నిస్సంతుగ చనిపోయెను. బీరారులోనున్న భాన్స్లేలు శివాజీసంతతివారట. 'మధోజీ భాన్స్లే' అప్పుడు బీరారు రాష్ట్రములో అధిపతిగ నుండెను. ఇతనిని సతారా రాజ్యమునకు వారసుగ లేవదీయవలెనని వారన్ హేస్టింగ్స్ తలచెను. ఇతనిని సతారారాజుగచేసి తనచేతిలో పెట్టుకొన్నచో మహారాష్ట్రులను తనయిష్టమువచ్చినట్లు ఆడించవచ్చునని వారన్ హేస్టింగ్సు ఊహ. అందుచే వారన్ హేస్టింగ్సు యీ 'మధోజీభాన్స్లే'తో బేరములు సాగించెను. ఇదిమంచి పద్ధతికాదనియు, రఘూబాకు పీష్వాగిరినిప్పించుటకై చేయబూనినయుద్ధమును, మధోజీని సతారారాజుగచేయుటకు దుర్వినియోగపరచుట తప్పనియు, సుప్రీము కౌన్సిలులోని ఫ్రాన్సిస్ పార్టీవారు వారన్ హేస్టింగ్సును మందలించిరి. కాని, అతడు ఏమని బదులుచెప్పినాడు? "ఓస్సి, రఘూబావ్యవహారము వట్టి బూటకము—అసలు నాకన్ను మొదటినుంచి మధోజీని సతారాసింహాసనము నెక్కించడముమీదనే వున్నది" అని బట్టబయలుగ చెప్పివేసెను. పార్లమెంటులో వారన్ హేస్టింగ్సు మీదపెట్టిన చార్జీలలో యీ మహారాష్ట్రవ్యవహారముకూడా చేర్చియుంటే యిందులోని అసలు రహస్యము లింకెన్ని యోబయటపడేవి. కాని, యిది యీ చార్జీలలో చేర్చబడనందున యీ వ్యవహారములో తెరమరుగున నడిచిన నాటకమంతయు లోకమునకు తెలియరాదయ్యెను.

వారన్ హేస్టింగ్సు పంపిన సేన 'కర్నలు లెస్లే' యాజమాన్యమున బయలు దేరెను. బొంబయిలో ఫ్రెంచివారి నణచుటకై యీ సేన పంపబడుచున్నదని వారన్ హేస్టింగ్సు పైకి ప్రకటించెను. ఇది శుద్ధఅబద్ధమన్నసంగతి నానాఫర్నవీసు వెంటనే గ్రహించెను. అందుచే, అతడును యుద్ధసన్నాహము చేసుకొనుచుండెను.

పునహాపైకి బొంబయి దండు.

ఈలోగా, ఘెవరితోగాని తొందరపడి యెట్టి ఒడంబడికలుచేసికోవద్దనియు, తాను మధోజీ భాన్స్లేతో బేరము మాట్లాడుచున్నాననియు, వారన్ హేస్టింగ్సు బొంబాయివారికి ముందుగా కబురుపంపించెను. అయినప్పటికి యీమాటను పాటింపక బొంబయివారు రఘూబాతో తిరిగి వేరేబేరము కుదుర్చుకొని, అతనికి కొంతడబ్బు యిచ్చి పునహామంత్రిమండలి నణచివేయుటకై పెద్దదండును పునహాపైకి పంపించిరి. ఈ దండు 'కర్నల్ ఎగర్టన్' యాజమాన్యమున బయలుదేరెను. ఈ యుద్ధకార్యము నిర్వహించుటకు కార్నక్, ఎగర్టన్, మాస్టిన్—అను ముగ్గురను ఫీల్డుకమిటీగ నిర్ణయించిరి. కాని, మాస్టిన్‌కు జబ్బుచేసినందున బొంబయికి తిరిగివచ్చెను. అతడక్కడ 1779 జనవరి 1-వ తేదీన చనిపోయెను. ఈ దండువెంట పెండ్లికొడుకు రఘునాథరావుకూడ పునహా పైకి వెడలెను. ఇతని పేరనే యీ దండయాత్రయొక్క ఉద్దేశ్యములను ప్రకటించిరి. ఇంగ్లీషు సేన "ఖండాలు" వరకు తోసుకొని వచ్చెను.

నానాఫర్నవీస్ వేగులపద్ధతి

ఈలోగా నానాఫర్నవీసు నిద్రపోవుటలేదు. ఆతని వేగులపద్ధతి అత్యద్భుతమైనది. దేశములో ఏప్రాంతములో యేమి జరుగుచున్నది ముఖ్యమైనవానిని గూర్చి రిపోర్టుల పంపించుటకు ఒక్కొక్క స్థలమున ఆరుగురు ఏడుగురు వేగులవాండ్రుండురు. ఒకానొక విషయమునుగూర్చి యీరీతిగా అతనికి ఆరు, ఏడురకముల రిపోర్టులు వచ్చును. వీనినన్నిటిని నానాఫర్నవీసు తన మందిరములో కూర్చుండి, పరిశీలించి చూచి, నిజస్థితిని సరిగ తెలుసుకొనును. ఇట్టి దివ్యమగు వేగులపద్ధతిచే బొంబయి గవర్నమెంటు యేమి చేయుచున్నదియు ఆతడు కనిపెట్టెను.

తలెగాన్ యుద్ధము-బ్రిటిష్ఆఫీసర్ల పలాయనము.

వెంటనే సేనను సిద్ధముచేసి అప్పుడు పునహాలో మకాముచేసియున్న సింధియా హోల్కారుల చేతికిచ్చి యింగ్లీషువారి నెదిరించుటకై పంపెను. వీరు యుద్ధవ్యూహములందు కడునిపుణులు. శత్రువులను యెప్పుడు, యెక్కడ కొట్టవలెనో వీరికి బాగా తెలియును. బొంబయి నుంచి బయలుదేరిన యింగ్లీషుసేనను పునహాకు 18 మైళ్ల దూరములోనున్న "తల్లిగాన్" వరకు రానిచ్చిరి. దీనితో తాము గెల్చితిమని యింగ్లీషు సేనానులు లోలోన మురియుచుండిరిగాని, తల్లెగాన్ వద్దకు రాగానే మహారాష్ట్రసేనలు 1779 జనవరి 9 తేదీన యింగ్లీషుసేనలకు యెదురు

తన్ని నిలచెను. దృఢకాయులగు మహారాష్ట్ర పార్వతేయ సైనికదళముల చూడ గానే యింగ్లీషు ఆఫీసర్లకు కంగారుపుట్టి యుద్ధముపేరు దేవుడెరుగునని చెప్పి గిర్రున వెన్నిచ్చి పార నారంభించిరి! తమకు కంగారు పుట్టలేదనియు, పూనాను తగుల బెట్టి వేయుడని నానాఫర్నవీసు తనవారి కాజ్ఞాపింపగా యిక అక్కడికిపోయి ప్రయోజనము లేదని చెప్పి తాము వెనుకకు తిరిగితిమనియు, బ్రిటిషు ఆఫీసర్లు బడాయి చెప్పుకొనుచున్నారు!

ఈ పలాయనము జనవరి 11 రాత్రి 11 గంటలకు ప్రారంభమయ్యెను. యింగ్లీషువారు తమ ఫిరంగులన్నిటిని చెరువులో పారవేసి, మందుగుండు వగైరా యుద్ధసామగ్రినంతను తగులబెట్టి కంగారుగా అదేపరుగున పారజొచ్చిరి. వీరిని పారిపో నియ్యక మహారాష్ట్ర సేనలు చుట్టు ముట్టడించి వారివద్ద నున్న సామగ్రులన్నిటిని లాగుకొని, చంపక, దయదలచి అంతటితో వదలిపెట్టిరి. ఇంగ్లీషువారియెడ మహారాష్ట్రు లప్పు డిట్టి దయను చూపించినందుకు ప్రతిఫలమును మహారాష్ట్రులు, తదుపరి అనుభవించవలసి వచ్చెను! ఇట్టి దయచూపుట నిజముగా అప్పుడు తప్పు అయ్యెను.

ఈ దండును మహారాష్ట్రులు ఊరికే వదిలిపెట్టలేదు. రఘునాథరావును తమకు అప్పగించ వలెననియు, పీష్వా మాధరావు చనిపోయిన నాటినుండి తాము తీసుకొన్న స్థలముల నన్నిటిని మహారాష్ట్రులకు తిరిగి యిచ్చివేయ వలెననియు, బ్రోచి, సూరత్తు జిల్లాలనుండి తీసుకొన్న రెవిన్యూ నంతను తిరిగి యిచ్చివేయ వలెననియు, బెంగాలునుండి వచ్చుచున్నసేనను తిరిగి బెంగాలుకు మరలగొట్ట వలెననియు, అట్లయినచో తాము ప్రాణములతో బొంబయికి మరలవచ్చుననియు, పునహా మంత్రిమండలివారు కఠినమగు షరతులను విధించిరి. "సుప్రీం కౌన్సిలువారి అనుమతి లేనిదే యిట్టి షరతులకు ఒప్పుకొనుటకు మాకు అధికారములేదని ఫీల్డు కమిటీ" వా రనిరి "అయితే" మీ 'అప్టన్' మాతో చేసుకున్న ఒడంబడికను భంగపుచ్చుటకు మీ కెవ రధికార మిచ్చినారో చూపండి "అని పూనామంత్రులు అడ్డ సవాళ్లు వేసిరి! దీనికి యింగ్లీషువారు జవాబు చెప్పలేక పోయిరి. అందుచే, 'తప్పించుకొని యెక్కిరిద్దాము' ను కుచ్చితమును మనస్సులో పెట్టుకుని ఫీల్డుకమిటీ వా రప్పు డీ షరతులకు ఒప్పుకుంటామని చెప్పి బ్రతికి బయట బడిరి. తరువాత, ఒప్పుకొన్న షరతులను ఎగుసూకిరి. బెంగాలునుండి వచ్చుచున్న సేనను వెనుకకు మరలిపొమ్మని చెప్పుటకు బదులుగా సాధ్యమైనంత త్వరలోవచ్చిపడవలసినదని యెదురు కబురంపిరి. ఈ దండయాత్రలో ఓడిపోయి వచ్చినందుకు కర్నల్ ఎగర్టన్, కార్నికుల మీద కోపమువచ్చి డైరెక్టర్లు వారిని డిస్మిసు చేసిరి.

ఇక, బెంగాలునుండి 'కర్నల్ లెస్లీ' యాధిపత్యమున బయిలుదేరిన దండు యొక్క వ్యవహారమెట్లుండునో చూతము. ఈ దండు తన రాజ్యముగుండా పోవ

డానికి వీలులేదనిచెప్పి స్వతంత్రులగు 'బుందేలుఖండు' నాయకులు త్రోవలో అడ్డగించిరి. "ఇప్పుడైనను సేనను వెనుకకు మరలించుమని" ఫ్రాన్సిసు వారన్ హేస్టింగ్సుకు సలహాచెప్పెను. కాని, అతడు వినలేదు. త్రోవ పొడుగునను 'కర్నలులెస్లీ' దేశీయ ప్రభువులతో బేరములాడుచు, కుట్రలు సాగించుచు, నడకను బహునెమ్మదిగా సాగించుచుండెను. "ఏమింతాలస్యము చేయుచున్నావని" వారన్ హేస్టింగ్సు అడిగితే వానలు కురవడంవల్ల నడకసాగటంలేదని యితడు వ్రాసెను. ఈసంగతి వారన్ హేస్టింగ్సుకు తెలిసి తక్షణమే యితనిని సేనాధిపత్యమునుండి తీసివేసి ఆ యధికారమును తన క్రిందనున్న 'కర్నల్ గోడార్డు'కు అప్పగించివేయవలసినదని హేస్టింగ్సు హుకుము చేసెను. ఈ అవమానము తనకు కలుగకమునుపే 1778 సం॥ అక్టోబరు 3-వ తేదీన లెస్లీ త్రోవలో చనిపోయెను.

పునహాపైకి కలకత్తా దండు.

'గోడార్డు' యిప్పుడు నాయకత్వము వహించి బుందేలుఖండు సెంట్రలు యిండియాలగుండ చొరవచేసుకొని పోసాగెను. అక్కడి హిందూప్రముఖులు యితని నెదిరించిరిగాని ప్రయోజనము లేకపోయెను. భోపాలు నవాబుమాత్రము ఇంగ్లీషు వారివల్ల డబ్బుతిని వారికి త్రోవయిచ్చెను. బీరారులోనున్న 'మధోజీ భాన్స్లే'యు వారన్ హేస్టింగ్సు కోరినప్రకారము సతారా రాజ్యవారసత్వమునకు నిలువబడుటకు సమ్మతింపకపోయినను యీదండు తన రాజ్యముగుండా పోవుటకుమాత్రము సమ్మతించెను. "ఎక్కడికక్కడికే లాభమ"నుకొని వారన్ హేస్టింగ్సు లోలోన కలికి యుండును! పునహాపైకి పోవుచున్న ఇంగ్లీషుదండుకు యీరీతిగా తన రాష్ట్రము గుండా త్రోవయిచ్చి మధోజీభాన్స్లే మహారాష్ట్ర సామ్రాజ్యమునకుచేసిన ద్రోహ మింతింతయనిచెప్ప తరముగాదు. తమ కితడుచేసిన యీ సహాయమునకు ప్రతి ఫలముగా ఇంగ్లీషువారు భాన్స్లే సంతతికెట్టి యుపకారము జేసిరో మున్ముందు తెలిసికొందుముగాక!

బొంబయిసేనలు మహారాష్ట్రులచేతులలో తల్లేగాం వద్ద ఓడిపోయి ప్రాణములతో బయటపడ్డ సమయమందు బెంగాలుసేనలను 'గోడార్డు' నడిపించుకొని వచ్చుచుండెను. ఈసంగతి తెలియగానే 'గోడార్డు' సూరతువైపునకు అతిత్వరితముగా పరుగుపరుగున సేనలతో వచ్చుచుండెను. ఈ సేనను వెనుకకు మరలిపొమ్మని చెప్పుచు ఫీల్డుకమిటీవారు ఒకహుకుమునువ్రాసి పునహా మంత్రిమండలికిచ్చియుండిరి. ఇది యొకషరతుగా వారు కోరిరని పైన వివరించియుంటిమిగదా. ఈ హుకుమును ఒక వకీలుచేతికిచ్చి పునహా మంత్రిమండలివారు బెంగాలునుండి వచ్చుచున్న సేన కెదురుగా పంపించిరి. "ఈహుకుముప్రకారము మీరు వెనుకకు వెళ్లిపోవలయునని" యీ వకీలు కర్నలు 'గోడార్డు'తో చెప్పెను. "ఎబ్బె, మేము మహారాష్ట్రులతో

నై రానికి రావటంలేదు. మాగవర్నరు జనరలు ఆజ్ఞప్రకారము మేము ఫ్రెంచివారి మీాదికి పోవుచున్నామని గోడార్డు నిర్మొహమాటముగా అబద్ధమాడి, వకీలును నమ్మించి, 1779 ఫిబ్రవరి 26-వ తేదీకి సేనతోసహా సూరతు చేరెను.

బొంబయిదండు మహారాష్ట్రులచేత 'తలేగాఁ' వద్ద దెబ్బతిని, తాము మొదటినుంచీ సంపాదించుకున్న స్థలములనన్నిటిని వదలుకొనుటకు వారితో ఒడంబడి బ్రతికి బయటపడిరన్న సంగతి యీలోగా వారన్ హేస్టింగ్సుకు తెలిసెను. ఇట్టి స్థితిలో వ్యవహారమును యేదోరీతిగా పునహా మంత్రిమండలితో సర్దుబాటు చేసుకొని రావలసినదని చెప్పి వారన్ హేస్టింగ్సు నేరుగా 'కర్నలు గోడార్డుకు' వ్రాసెను. "పోనీ, ఆఖరుకు వెనుకచేసుకొన్న పురందరు ఒడంబడికకైనా ఒప్పుకొని, యింతటినుంచి ఫ్రెంచివారితో రాచకీయ సంబంధమైనట్టిగాని, వర్తకసంబంధ మైనట్టిగాని, జోక్యము కలిగించుకోమని, పునహా మంత్రిమండలివారిచేత ఒప్పిస్తేచాలని" వారన్ హేస్టింగ్సు గోడార్డుకు వ్రాసెను. దీనికిసైతము పునహావారు ఒప్పుకోకపోతే యుద్ధమునకు దిగవలసినదనియు వ్రాసెను.

ఈలోగా వారన్ హేస్టింగ్సున్నూ ఊరుకొనలేదు. మహారాష్ట్ర రాష్ట్రకూటమును చీలదీయుటకై చేయవలసినపనుల నన్నిటిని చేయుచునేయుండెను. గైక్వారు (ఫుట్టీసింగు) 'కర్నలుకీటింగు'వలలో యెట్లుపడెనో యిదివరకే చెప్పితిమి. బీరారు అధిపతి మధోజీభాఁస్లే సైతము వారన్ హేస్టింగ్సుచెప్పిన తియ్యని మాటలలోపడి యెట్లు యింగ్లీషుదండుకు తన రాష్ట్రముగుండ దోవ యిచ్చెనోగూడ చెప్పియుంటిమి. ఇక, యీరాష్ట్రకూటములో మిగిలినవారు సింధియా, హోల్కారులు యిద్దరు మిగిలియున్నారు. వీరిద్దరిలో

వారన్ హేస్టింగ్సు కుట్ర.

సింధియాబలవంతుడు. నానాఫర్నవీసుకు కుడిభుజము. ఇంగ్లీషువారు తల్లెగాఁవద్ద ఓడిపోయినప్పుడు రఘునాథరావును మహారాష్ట్రులకు స్వాధీనపరచిరి. మరియు, తాము ఒప్పుకొన్న షరతులను సరిగ నెరవేర్చేవరకు, ఇద్దరు ఇంగ్లీషువాళ్లనుకూడా వారు మహారాష్ట్రులకు అదనపు హామీాగాయిచ్చిరి. ఈముగ్గురిని నానాఫర్నవీస్ సింధియా అవాప్తిలోవుంచెను. సింధియాయం దట్టినమ్మకము నానాకుండెను. కాబట్టి, యీ సింధియాను చీలదీసినచో, నానాఫర్నవీసుకు కుడిభుజము పడిపోవుటయు, రఘునాథరావును ఆ యిద్దరు ఇంగ్లీషువారునుకూడ తమవశమగుటయు, జరుగునని వారన్ హేస్టింగ్సు ఒక్కదెబ్బతో రెండుపిట్టలను కొట్టవలెనని చూచెను. ఈ ప్రయత్నమందు వారన్ హేస్టింగ్సు నెగ్గెను. సింధియా ద్రోహియై ఇంగ్లీషువారి వలలోపడెను. ఈ సింధియాచరిత్ర యెట్టిదో క్లుప్తముగానైన వివరించుట అవసరము.

సింధియా చరిత్ర.

సింధియాలు పూర్వము పెద్దవంశములోని వారేనట. వీరు మొగలాయి సామ్రాజ్యములో సేనాపతులుగానుండిరట. కాని, కాలకర్మ వశము చేత వీరిప్రతిభ తగ్గిపోయి, రానురాను ఈకుటుంబము మిక్కిలి హీన స్థితికివచ్చి, తుదకు పీష్వాల ఇంటిలో నౌకరికి కుదిరిరి. కొంతకాలమునకు 'దానోజీసింధియా' యనునతని స్వామిభక్తి పరాయణతచే యీ వంశము మరల నున్నత స్థానమునకెక్కెను. దానోజీ తండ్రి గ్రామపటేలుగా మాత్రముండెను. పీష్వా బాలాజీ విశ్వనాథుని అంగరక్షకులలో నొకడుగా దానోజీకి నౌకరీ దొరకెను. పీష్వా రాజుగారితో లోపలమాట్లాడు చున్నప్పుడు బయట గుమ్మమువద్ద అతని చెప్పులు కనిపెట్టియుండుటయే యీ దానోజీకిపని. ఒకసారి పీష్వా లోపల నుండి ఎంతసేపటికిని రాక ఆలస్యముచేసినందున ఈలోగా దానోజీకి నిద్రవచ్చెను. ఈనిద్రలో నయితమాతడు పీష్వాచెప్పులను వదలిపెట్టక వానిని గట్టిగా రొమ్మునకు కరచుకొని నిద్రపోవుచుండెనట. ఈ భక్తి విశ్వాసములనుచూచి పీష్వా చాల మెచ్చుకొని అతనిని మాల్వా రాష్ట్రములోని ఉత్తరభాగమునకు (గ్వాలియరుకు) రాష్ట్రాధిపతిగా చేసెను. మాల్వా రాష్ట్రమును మహారాష్ట్రులు 1721 సం॥న మొగలాయిలనుండి జయించుకొనిరి. అప్పుడు పీష్వాగానున్న బాలాజి విశ్వనాథుడు యీ క్రొత్తగ సంపాదించుకున్న మాల్వా రాజ్యమును రెండుభాగములుగ చీల్చి ఉత్తరభాగమును తన చెప్పులుమోసిన భక్తుడు దానోజీ సింధియాకును దక్షిణ భాగమును మలహరిరావు హోల్కారుకును, పట్టముగట్టెను. ఆకాలములోని ఆచారప్రకారము దానోజీకి పెండ్లిచేసుకున్న భార్యలుగాక ఉంచుకున్నవాండ్లు చాల మందియుండిరట. ఉంచుకున్నవారిలో ఒకదానికి మాధవరావు సింధియా అనునతడు పుట్టెను. భార్యలవలన పుట్టిన సంతానము బ్రతుకనందున ఈ వుంచుకున్నదానికి పుట్టిన మాధవరావు సింధియా యే తండ్రియనంతరము రాజ్యమునకు వచ్చెను. ఇదియే మహారాష్ట్ర రాజ్యనాశనమునకు ధూమకేతువయ్యెను. ఇతడు ఇంగ్లీషువారితో చేరి మహారాష్ట్ర రాజ్యమును నాశనమొనర్చెను. ఇతడు దాసీపుత్రుడైనకారణమున మహారాష్ట్రములోని ఉత్తమకులీను లెవ్వరును ఇతనియందంత గౌరవము కన్పరచక పోయినను, నానాఫర్నవీసు మాత్రము ఇతనియందు మిత్రభావముచేతనే యుండెను కాని, ఇతడు ఇంగ్లీషువారితో బుజములు రాచుకొనుచూ తిరుగుచున్న సంగతిని కనిపెట్టి నానాఫర్నవీసు ఇతనిని అనేకసార్లు మందలించెను. కాని, నానాగారి మాటల నతడువినలేదు. అంతకంతకు ఈమాధవరావు సింధియా తనదేశ ప్రజలయెడ చుప్పనాతితనమును చూపుచు, పరాయివారగు ఇంగ్లీషువారి చంకలోదూరసాగెను. వీనిరాజనీతిజ్ఞత, తెలివి తేటలు యిట్లు తగులబడినవి! ఈరండాపుత్రుడు మాధవ రావుసింధియా పానిపట్టు యుద్ధమున చావక నానాఫర్నవీసుతోపాటు బ్రతికెను. కాని, తుదకు వీరిద్దరిలో ఒకడు మహారాష్ట్ర రాజ్యభక్షకుడుగను, ఇంకొకడు మహా రాష్ట్రరాజ్య రక్షకుడుగను పరిణమించిరి,

హోల్కారు రాజ్యము-అహల్యాబాయి.

మనమిప్పుడు చెప్పకొనుచున్న యీచరిత్రకాలమున హోల్కారు రాజ్యమును పవిత్రాత్మయు, బుద్ధివిశారదయు, సమర్థురాలును నగు అహల్యాబాయి పరిపాలించుచుండెను. ఈమె పవిత్రనామ ధేయము నేటికిని సమస్త హిందూ ప్రజలకు ప్రాతస్స్మరణీయముగ నున్నది. ఈమెనుగూర్చి 'టారెన్సు' అను చరిత్రకారుడు ఈ దిగువరీతిగ వ్రాసెను:—

ప్రజలగతి యేమైననేమి, యను బేజబాబుదారితో, ప్రజలకు నానాదుర్భాధల నేర్పి, వారిని సర్వవిధముల భ్రష్టుల నొనర్చిన నికృష్టులను భూపతులు వేయిమందియైన పరమపావన మూర్తి, మహోదారభావ సమన్విత, మాయనుంగుమాత, అహల్యాబాయితో సాటివత్తురా? సకల సంపత్సమృద్ధిగలిగి బహుజన సంకీర్ణమై యొప్పు మాళవరాజ్యము నీమె ముప్పది సంవత్సరము లవిచ్ఛన్నముగ, శాంతి ప్రదముగ బహు సమర్థతతో నేలి సాటిరాజులచే నెన్నరాని మన్ననల వడసి, తన పావన రాజ్యమున ధన్యాత్ములైన యశేష ప్రజలచే లోకమాతగ పూజింపబడెను. 1765 సం॥ లో హోల్కారు వంశమునకు పురుషసంతతి లేకపోయెను. తన భర్తయు, తరుపరి రాజ్యమునకు వచ్చిన కుమారుడును గతించుటచే రాజ్యభార మీమెపై పడెను. అప్పటినుండి తద్భారము నీమె కడుసమర్థతతో వహింప దొడగెను. ఈమె పరరాజులతో నెరపిన రాజనీతి యతి సమర్థనీయమై, శ్లాఘాపాత్రమై రష్యాదేశము నేలిన "క్యాథరన్" రాణీ రాజనీతితో తులదూగుచుండెను. కాని, "క్యాథరన్" వలె యీమె తన ప్రక్కలో పరున్న మగనినిచంపి, భర్తృతల్పమును రక్తసిక్త మొనర్పలేదు. ధైర్యసాహసములందును, పరాక్రమమందును, యీమె సీమదేశము నేలిన "ఎలిజబెత్తు" రాణికి యెంతమాత్రము తీసిపోదు. కాని, "ఎలిజబెత్తు" చేసినట్లుగ యీమె తన ప్రతిపక్షియైన మరియొకస్త్రీని (మేరీని) పట్టి బంధించి, చెరసాలలో పడవేసి, చంపించ లేదు. డెన్మార్కు దేశము నేలిన "మార్గరెట్టు" రాణి యెట్టి పరిస్థితులలో సింహాసనమునకు వచ్చెనో అట్టి పరిస్థితుల లోనే అహల్యాబాయియు మాళవరాజ్య సింహాసనమునకు వచ్చెను. కాని యీమె మార్గరెట్టు చేసి నట్లుగ ధనవంతులను తన కాలికింప పడవేసె మట్టగింపలేదు; పేదల నేడిపింపలేదు; తన పాతివ్రత్య మును గూర్చి లోకులచే వ్రేలుపెట్టి చూపించుకొనైనలేదు. అహల్యాబాయి తన రాజ్యములో నిర్వర్తింప నుద్యమించిన పరమోద్దేశ మొక్కటే గలదు. న్యాయపథమున, ప్రశాంతవృత్తితో, దేశమును చక్కగ దిద్దుకొని, తన ప్రజల సౌఖ్యమును పెంపొందించుటయే యీమె పరమసంకల్పముగ నుండెను. ఈమె కొలది సైన్యమును మాత్రముంచుకొనెను. రాణి అహల్యాబాయి తన సమస్త ప్రజలను సమ తతో పాలింపుచుండుట వలన, దేశమందు ఉపద్రవములు గలుగకుండ శాంతిని గాపాడుటకు ఆమెకీ చిన్న సైన్యమే చాలుచుండెను. అహల్యారాణి ఎలిజబెత్తు మున్నగు రాణీలవలె క్రైస్తవస్త్రీ కాక పోవచ్చును. కాని "నా రాజ్యములో నే నొనర్చు ప్రతిపనికి పరలోకమందు ఆ పరమేశ్వరునికి నేను ఉత్తరవాదిని కావలసియుండు" నని ఆమె తరుచు చెప్పచుండెడిది. నేరస్తులను కఠినముగ దండించ వలసినదని ఉద్యోగస్తు లామెతో చెప్పినప్పుడు "నిగ్రహానుగ్రహ సమర్థుడగు ఆ పరమేశ్వరుని లీలలను మానవమాత్రులగు మనమేల చెరుపవలె" నని యీమె సమాధానము చెప్పను. పరమత ద్వేషమను లోపము మాత్రము హిందూధర్మమునందు కలికమునకైన కానరాదు. • తాను పసితనము నుండియు పుట్టిపెరిగిన హిందూధర్మము లందామె కత్యంత ప్రీతియున్నను, తన రాజ్యములోగల ప

మతస్థులయెడ ఆమె ప్రత్యేకముగ యెక్కువ ప్రేమను, కరుణను జూపుచుండెను. (సుగుణములన్నియు క్రైస్తవులయందే గలవనియు, తక్కిన మతస్థులలో లేవనియు యింగ్లీషువారి యూహ). కాని, అహల్యారాణి క్రైస్తవమతావలంబురాలుకాదు. అయినను ఆమె దయాదాక్షిణ్యములు గలది, పరుల మేలునకై తన స్వార్థమును త్యజించునది; తన ధర్మముల నిర్వహించుటయందు అప్రమత్తత గలది; యెల్లర సమదృష్టితో న్యాయముగ పాలించునది. ఈ రీతిగ అహల్యాబాయి కల్మషరహితయై అనిందిత చరితయై బహుకాలము రాజ్యమేలి కాలధర్మము నొందెను. తనకు ప్రేమాస్పదుడగు భర్తయు, యేకపుత్రుడును, తన కండ్లయెదుటనే గతించుటయే విషాదచ్ఛాయలు ఆమె హృదయముపై క్రమ్ముకొని యుండెను. సమస్తరాజ్య సంపదలతో తులదూగుచుండియు ఆమె గర్వమన్న నెరుగదు; మహాసామ్రాజ్య సింహాసనాసీనయయ్యు రాజ్యకాంక్ష నెరుగదు. ఈ రీతిగ అహల్యాబాయి తాను వహించిన రాజధర్మముల నేమరక, న్యాయపథమును వీడక, భర్తృహీనయయు, పుత్రహీనయునై, యెంత పవిత్రముగ బ్రతికెనో అంత పవిత్రముగనే కాలగర్భమందు లీనమయ్యెను. ఇట్టి పరమపావన రాజ్ఞిచే పునీతమైన మాళవదేశమును అహల్యాబాయి గతించిన యిరువది సంవత్సరముల యనంతరము ఆంగ్లసేనలు ప్రవేశించి, సర్వమును నాశనమొనర్చి, బూడిదపాల్జేసి, ప్రజలను వధించి, దేశమంతటను రక్తము కాల్వలు గట్టునట్టుచేసి, యెచ్చటను కని విని యెరుంగని రీతిని ప్రజల నవమాన పరంపరల పాల్జేసి, యీ రమ్య భూభాగమును బ్రిటిష్‌వారి కాలికింద నణగి పడియుండునట్లు చేసెను. నందన వనమననొప్పు మాళవదేశముపై యింతటి ఘాతుకకృత్య మొనర్చవచ్చిన యీ యాంగ్లసేనానియే తుదకు "మాళవదేశరాజులు తమ ప్రజలను చూచినంత హీనముగ యేదేశపురాజులు తమ ప్రజలను చూచుచుండుట లేదని" పైగా వారిపై తనకు దుఃఖముపొంగి వచ్చినట్లుగ శ్రీరంగనీతులు పల్కెనట! అతని కెట్లు నోరువచ్చెనో! నిజముగ యిట్టిపల్కులు పల్కుటకు మనకు (ఆంగ్లేయులకు) యోగ్యత కలదేమో ఒక్కసారి ప్రతియాంగ్లేయుడు తన హృదయముపై చేయివేసి చూచుకొని మరి జవాబు చెప్పకొనవలెను. నిజముగ యేమొగము పెట్టుకొని మనమట్టి శ్రీరంగనీతులు పల్కగలమో ప్రతి ఆంగ్లేయుడు తన యంతరాత్మకు తానే జవాబు చెప్పకొనవలెను.

పరదేశస్థులువచ్చి తన రాజ్యములో జోక్యము కలిగించుకొనుట కీమె యిష్టపడలేదు. అందుచేతనే కాబోలు వారన్ హేస్టింగ్సు తనమాట లీమెవద్ద సాగవని యెంచి, ముందుగ సింధియాను బుట్టలో వేసుకొనబూనెను. తరువాత వీలైతే, హోల్కారు పని పట్టెద్దామనుకున్నాడు కాబోలు!

మాధవరావు సింధియా ద్రోహము.

ఇంగ్లీషువారిచే తల్లెగాం దెబ్బలో మహారాష్ట్రులకు స్వాధీనపరుపబడిన రఘునాథరావును, యిరువురు ఇంగ్లీషువారిని, నానాఫర్నవీసు యీ మాధరావు సింధియావశములో నుంచెనని గదా చెప్పియుంటిమి. నానాఫర్నవీసు సింధియాను నమ్మెను. కాని, యీతడు ద్రోహియగునని ఆతడు కలగన్నాడా? సింధియా యింగ్లీషువారి వలలో పడి, వారాశపెట్టిన 41, వేల రూప్యా. లకు, బ్రోచిజిల్లాకు, లోబడి రఘునాథరావును ఆ యిద్దరు యింగ్లీషువారిని మెదలకుండా యింగ్లీషువారి కిచ్చివేసెను. రఘునాథరావంతట బ్రోచికి పారిపోయి, యింగ్లీషువారి రెక్కలచాటున దాగెను.

1779 ఫిబ్రవరి 26 తేదీన గోడార్డుసేనాని సూరతు చేరి, పునహామంత్రి మండలితో రాయబారములు సాగించెను. ఇంకొకమూల, గైక్వారు, సింధియాలతో కుట్రచేయుచు, యుద్ధమునకు తయారగుచుండెను. ఈ సంధిరాయబారములు యెంతటికిని తెగవు. ఆఖరుకు నానాఫర్నవీసుకు విసుగెత్తి సాలిసెట్టిలంకను, రఘునాథరావును, తన స్వాధీనముచేస్తేనేగాని అసలు యింగ్లీషువారితో సంధి కుదరనే కుదరదని ఖండితముగా 1779 అక్టోబరు నెలలో యింగ్లీషు రాయబారితో చెప్పివేసెను.

దీనికి బదులు చెప్పుటకు గోడార్డు కేమియుతోచక బొంబాయి వెళ్లి, అక్కడ వారితో సంప్రదించి, యీ షరతులకు ఒప్పుకోటానికి వీలులేదని చెప్పి, ఆఖరుకు కబురుపంపించి, యుద్ధమునకు తయారయ్యెను. ఇదివరకు యింగ్లీషువారికి సహాయము చేసెదనన్న ఫుట్టేసింగు గైక్వారు యింగ్లీషువారు పునహావద్ద ఓడిపోయిననాటినుండి కొంచెము వెనుకకు లాగనారంభించెను. ఈ సంగతి తెలిసి, 1780 జనవరి 1-న తేదీన గోడార్డు తపతీనదినిదాటి, గైక్వారుమీదికి పోయెను. ఈతనిరాకచూచి, ఫుట్టేసింగు భయపడి, లొంగిపోయెను. గోడార్డు అంతట ఊరుకొనక గుజరాతులో పీష్వాకు చెందియున్నభాగములను కొల్లగొట్ట నారంభించెను. గైక్వారు, సింధియాలు యీ దుండగముల నడ్డగించక ఊరుకొనిరి. హోల్కారుమాత్రము పెనగులాడెనుగాని యెక్కువ ప్రయోజనములేకపోయెను. మాధవరావు సింధియా యింగ్లీషువారి నెదిరించి పోరాడుటకు బదులు వారి ప్రాపకమును సంపాదించుకొన దేవులాడెను. తన కేదో మున్ముందు కట్టబెట్టుదురను నాశచే ముందుగా రఘునాథరావును, యిద్దరు యింగ్లీషువారిని, వారికి స్వాధీనము చేసివేసెను. ఈ ఉపకారమునకు తనకేదైన మెహర్బానీ చేయవలసినదని అటుపిమ్మట గోడార్డును దేవురించెను! "నీకేమి కావాలో చెప్పు" అని గోడార్డు అడిగెను. అందుమీదట, 1780 మార్చి 16 తేదీన తన వకీలుద్వారా సింధియా యీరీతిగా గోడార్డుకు తన గోడు చెప్పుకొనెను.

"రఘునాథరావు నా స్వాధీనములో వున్నప్పుడు నేనును, అతనును ఒక ఒడంబడిక చేసుకున్నాము. ఆ ఒడంబడిక ప్రకారము మీరిప్పుడు చేస్తేచాలును. ఆ ఒడంబడిక యేమనగా, రఘునాథరావు పీష్వాపదవి వదులుకొని, సాలుకు 12 లక్షలరూపాయిల మనోవర్తి పుచ్చుకొని, ఝాన్సీ వెళ్లిపోయి, అక్కడ కాలక్షేపము చేయునట్లును, పునహాలో (వధింపబడిన) పీష్వా నారాయణరావు చిన్నకొడుకు ఆరేండ్లవయస్సుగల మాధవరావు పీష్వాగను, రఘునాథరావుకొడుకు నాలుగేండ్లవయస్సుగల బాజీరావు దివానుగను వుండునట్లును, వీరిరువురు పసికూనలగుటచేత కార్యనిర్వహణమంతయు వారిపేరట నేను చేయుచుండునట్లును, యేర్పాటుచేసుకొంటిమి. కాబట్టి, ఆ ప్రకారము రఘునాథరావుకు మనోవర్తినిచ్చి

జాన్సీకి పంపివేసి, నన్నును, నావెంట అతనికోడుకు నాలుగేండ్ల బాజీరావును, పునహాకు పంపవలసినది. ''

సింధియాకడుపులోనున్న కుళ్లంతయు ఇందులో బయటపడినది. పునహాలో మహారాష్ట్రరాజ్యచక్రమును నిర్వక్రముగా త్రిప్పుచున్న నానాఫర్నవీసును తోసివేసి, తా నాస్థానము నాక్రమింపవలెనను దుర్బుద్ధి యీ ద్రోహికి, యీ రండా పుత్రునకు, పుట్టెను. నక్క యెక్కడ దేవలోకమెక్కడ! తుచ్ఛమగు స్వార్థమునకు గడ్డితిని, మహారాష్ట్రరాజ్య లక్ష్మియెడద్రోహియై, విశ్వాసఘాతుక మొనర్చి, రఘునాథరావును యింగ్లీషువారి కిచ్చివేసి తానును వారి చంకలోదూరి, ఈ మాధవరావు సింధియా తనకు పట్టాభిషేకము చేసుకోన నెంచెను. రఘునాథరావును గనుక యిత డింగ్లీషువారి కిచ్చివేసియుండకపోయినచో వారు చచ్చినట్లు మహారాష్ట్రవిజేతలు చెప్పిన షరతులకు వంగి రావలసివచ్చెడిది. కాని, యెప్పుడైతే రఘునాథరావు తమ చేతిలో చిక్కెనో వారు సింధియాకును మహారాష్ట్ర మంత్రి మండలికికూడ ఎగనామము పెట్టిరి! ఈరీతిగా, సింధియా తనకును, తన మహారాష్ట్ర రాజ్యమునకునుకూడ, ద్రోహము చేసుకున్నవాడయ్యెను. ఇంగ్లీషువారి చేతిలో రఘునాథరావను తురుపుముక్క చిక్కినది. వారు దాని నూరక పారవేయుదురా? ఈ తురుపుముక్కను తమచేతిలో పెట్టుకుని దానిని ఆశలచే నిత్యము నోరూరజేయుచుండిరి. తమపని నెరవేరువరకును దానిని చేతిలో పెట్టుకుని, ఆడి, తరువాత బురదలో వూరద్రొక్క జూచుచుండిరి!

తనకోరిక ప్రకారము చేయడానికి వీలులేదని గోడార్డు సింధియాకు తెలియజేయగానే సింధియా తెల్లమొగము వేసెను! ''అరెరే! వృధాగా చేతిలో వున్న మనిషిని పోగొట్టుకొని, గడ్డితింటి'' నని ఆతడు నాలుక కరచుకొనెను! ఇంతటితో పోయినదా? గోడార్డు సింధియాకు పునహాలో పట్టముగట్టుట లేకపోగా ఆతనిని అతనిమనుష్యులను, కనుచూపుమేరవరకు తరిమివేసి, ప్రాణములతో వదలిపెట్టెను. ఇతడు ఇంగ్లీషువారికి చేసిన ఉపకారమునకు వారితనికి చేసిన ప్రత్యుపకార మిట్లున్నది. ఒక సంవత్సరమైన పిమ్మట గోడార్డు మరల రెండవసారి సింధియా దేశముపై బడి దేశమునంతను అగ్నిజ్వాలలకును, ఖడ్గధారలకును, యెరజేసెను. ఈ తప్సీళ్లు తరువాత చెప్పెదము.

నానా యత్నము.

ఇకకథా భాగమునకు వత్తము. ఇంగ్లీషువారి అల్పబుద్ధితో నానాఫర్నవీసు విసికిపోయెననిగదా పైనచెప్పితిమి. వారి కుచ్ఛిత తలంపులను ఆతడు కనిపెట్టెను. ఇక వీరిని గట్టిగా దెబ్బగొట్టినగాని వీలులేదని అతనికి తోచెను. ఈ ఉద్దేశ్యముతో నానాఫర్నవీసు అప్పు డిండియాలో ప్రముఖులుగనున్న నైజాము, హైదరాలీ, ఆర్కాటు నబాబులను

కూడగట్టి, ఇంగ్లీషువారి నెదిరింప యత్నించెను. ఇందువిషయమై ఢిల్లీ చక్రవర్తికి కూడ తన వకీలుద్వారా యీ దిగువ వృత్తరమును పంపించెను.

"టోపీకారులు (అంటే యూరోపియనులు) చేయుపనులు చాల అక్రమముగను, తుంటరితనముగను నున్నవి. మొదట మెల్లిగా దేశీయరాజుల నాశ్రయించి, వారితో స్నేహముగనున్నట్లుండి, తమతోడి మైత్రివలన వారికెట్టి లాభములు కలుగునో పొగడి, చూపి, క్రమముగా ఆ రాజునే పట్టుకుని, చెరసాలలోవేసి, ఆతనిరాజ్యం కాజేయడం వీరి మామూలు పద్ధతిగనున్నది. ఇందుకు నిదర్శనములు మన సురాజ్ఉద్దౌలా, మహమ్మదాలీఖాన్, ఆర్కాటు నబాబు, చందావర్ రాజా, మున్నగువారే. కాబట్టి, మీరు టోపీకారులను అణచివేయవలెను. అట్లా అయితేనే మనరాజుల గౌరవము నిలుస్తుంది. అట్లుకానిచో, యీ విలాయతీటోపీకారులు మనరాజ్యముల నన్నిటిని కాజేసి, దేశమును యావత్తు ఆక్రమించుకొందురు. ఇది మంచిదికాదు. మున్ముందు మన యావన్మంది రాజులకు చాల ముప్పు వచ్చును. పాదుషావారు యీ ప్రపంచమున కంతకు అధినాథులు కాబట్టి తామీ విషయమై శ్రద్ధబూనుట తమకు విధ్యుక్త ధర్మమై యున్నది. దక్షిణముననున్న ప్రముఖులందరు యేకమైనారు. నబాబు, నైజాం ఆలీఖాన్, హైదర్నాయక్, పీష్వా, యీ నలుగురు యేకమై ఇంగ్లీషువారిని అన్నివైపుల అణచివేయటానికి యేర్పాటుచేసుకొన్నారు. సేనలను ఫిరంగులను యితర యుద్ధ పరికరములను సిద్ధముచేసుకొని తమ తమ రాష్ట్రములలో ఇంగ్లీషువారి నెదిరించుటకై తయారుగ నున్నారు."

"ఇట్లే ఉత్తర హిందూస్థానమునకూడ తమరును నాజబ్ఖాన్గారును కలసి అక్కడనున్న యావన్మంది ప్రముఖులను కూడగట్టి ఇంగ్లీషువారిని అణచివేయవలెను. ఇట్లు చేసినచో, మీ సామ్రాజ్యము యొక్క కీర్తియు ప్రతిష్ఠయు, యినుమడించును."

ఇంగ్లీషువారి రెండవ ఓటమి. నానా వేసిన యీ యెత్తు పూర్తిగా సాగకపోయినను యిది ఇంగ్లీషువారిని సంధికి దింపుటకు సరిపోయినది.

గోడార్డు గుజరాతులో సింధియాను తరిమివేసి, దక్షిణమున కొంకణమునకు వచ్చి, కల్యాణమును పట్టుకొని, బేసినుకోటనువంచి, పునహామీదికి ధ్వజమెత్తెను. ఇక్కడితనికి మహారాష్ట్ర సేనలవల్ల పెద్ద దెబ్బతగిలినది. త్వర త్వరగా యితడు పూనావంక మైనను చూడక తోకముడత పెట్టెను. హరిపంతు హోల్కారు, పరశురాము, మున్నగు సేనాపతులు వెంటబడి తరిమిరి. ఇంగ్లీషు సేనకు చాల నష్టమయ్యెను. 1781 ఏప్రిల్ ఆఖరుకు గలిగిన యీ రెండవ యోటమితో ఇంగ్లీషువారి గుండెజారిపోయెను. అప్పుడు వారు కాళ్ల బేరమునకుదిగిరి.

అక్కడ సింధియా పని యెట్లున్నదో చూతము. ఇతని నింకను వేధించుటకై వారన్ హేస్టింగ్సు యితనికి సామంతుడుగనున్న గోహడ్ రాణాయను "జాట్" రాణాను లేవగొట్టెను. (ఈ పిల్ల రాజ్యపు నిశాని యిప్పటికిని "ఢోల్పుర" రాణాపేరిట నిల్చి యున్నది.) ఈ సందులో సింధియాయొక్క స్వంత కోటను (గ్వాలియరు కోటను) 'కెప్టెన్ పోపుహామ్' అనునతడు 1780 ఆగష్టు 4–వ తేదీన ముట్టడించి పట్టుకొనెను. బ్రిటిషువారి కితనిరాజ్యములో పీఠము వేసుకొని కూర్చుండుటకు యీ గోహడ్ రాణా చక్కని తావిచ్చెను. ఇందుకు ప్రతి ఫలముగా తాము పట్టుకున్న సింధియా తాలూకు గ్వాలియరు కోటను గోహడ్ రాణాకు బహుమతిచేసిరి. సింధియా రాజ్యమంతయు కర్నల్ కార్నిక్‌చే 1781 ఫిబ్రవరి, మార్చి నెలలలో నానా భీభత్సము చేయబడెను. ఒకనాడు మార్చి 24–వ తేదీన అర్ధరాత్రివేళ ఇంగ్లీషుసేన సింధియా గుడారములమీదపడి, సేనను చెదరగొట్టి, మనుష్యులను నరికి, 13 ఫిరంగులను, 3 ఏనుగులను, ధ్వజమును, 21 ఒంటెలను, చాల గుఱ్ఱములను పట్టుకొని పోయిరి.

సింధియాకు శిక్ష.

ద్రోహి మాధవరావు సింధియాకు ఎంత పరాభవము జరుగవలెనో అంత పరాభవము జరిగినది. మహాయోధుడని ఇదివరకున్న పేరు కాస్త మంటకలిసి పోయినది. పునహామంత్రి మండలియు వారికి సహాయముచేసిన హోల్కారును, జయప్రదముగా యుద్ధమొనర్చి ఖ్యాతినిపొందిరి. రాజ పుత్రస్థానములోని రాజ పుత్రులనుకూడ సింధియామీదికి ఉసుకొల్పవలెనని వారన్ హేస్టింగ్సు ఎంతో చూచెను. కాని, ఆ మంత్రము పారలేదు. ఈ మంత్రము పారివుంటే మాధవరావు సింధియాగతి ఇంకను యేమయ్యెడిదో.

పునహా మంత్రిమండలి చేతుల్లో ఇంగ్లీషువారిక్కడ ఓడిపోయి కాళ్లబేర మునకు దిగిరని చెప్పితిమి. ఈ బేరము కుదుర్చుటెట్లు? "నీవేమైనా బేరంకుదిర్చి పెడతావా" యని వారన్ హేస్టింగ్సు మహోజీభాన్‌స్లేను వాయించి చూచెను. "నావల్లకాదు బాబూ" అనియతడనెను. ఆఖరుకు "సీకు సిగ్గులేదు, నాకు ఎగ్గులేదు," అన్నట్లు ద్రోహి మాధవరావు సింధియా తాను బేరము మాట్లాడిపెడతానని ముందుకునచ్చెను! ఇట్లాగైనా గాని తనమీద ఇంగ్లీషువారికి దయగలుగుతుందేమోనని వీనియాశ! "సరే, నీపని నిమ్మకాయవాటం చేస్తాములే" అని ఇతనిచెవులో వారన్ హేస్టింగ్సు యేదో రహస్యముగనూది పునహా మంత్రిమండలితో "బేరం కుదుర్చుకురా, మరి చూద్దాము," అనిచెప్పి, సింధియాను పంపించెను. "ఎట్లాగైనా సంధిచేసుకుంటే బాగుంటుంది, మేమికమీదట మాటతప్పము. మాతోడుసరి, మాకంపెనీతోడుసరి, మా ఇంగ్లీషురాజుతోడుసరి, మా ఇంగ్లీషుజాతితోడుసరి," అని ఊరక ఒట్లుమీద

ఇంగ్లీషు వారి సంధి యత్నము.

ఒట్లు వేసికొనుచు, మద్రాసునుండికూడ కంపెనీ ఉద్యోగస్తులు ఎంతో ప్రాధేయ పడుచు, పునహా మంత్రిమండలివారికి 1781 సం॥ సెప్టెంబరు 11-వ తేదీన ఉత్తరము వ్రాసిరి.

బేరములమీద బేరములుసాగెను. ఆఖరుకు కొన్ని నెలలకు సాల్బేవద్ద 1782 మే 17-వ తేదీన సిగ్గుమాలిన సింధియా మధ్యవర్తిత్వముతో ఇంగ్లీషువారికీ మహారాష్ట్ర మంత్రిమండలికి రాజీకుదిరెను. దీనిలో 17 షరతులుండెను. పురందరు ఒడంబడిక నాటినుండి ఇంగ్లీషువారు మోసముచేతను దౌర్జన్యముచేతను తీసుకున్న స్థానములన్నిటినితిరిగి మహారాష్ట్రుల కిచ్చివేసిరి. గైక్వారురాజ్యము యావత్తు గుజరాతుసహా, 1775 సం। యుద్ధమునకు పూర్వ మందెట్టి స్థితిలోయుండెనో తిరిగి అట్టిస్థితిలోనే యుండునట్లంగీకరించిరి. రఘునాథరావుకు నెలకు 25 వేల రూపాయలు మనోవర్తియిచ్చి, అతని ఇష్టము వచ్చినచోట కాపురముండమనిరి. గోహద్ రాణాతో వారన్ హేస్టింగ్సు చేసుకొన్న ఒడంబడికను రద్దుపరిచి, గ్వాలియరును యథారీతిగా మాధవరావు సింధియాకు యిచ్చివేసిరి. సదరు రాణాను తిరిగి మాధవరావు సింధియాకు పూర్వమువలెనే లోబడియుండుమనిరి. (అనగా తనకింత సహాయముచేసిన రాణాను పాపము వారన్ హేస్టింగ్సు తిరిగి సింధియా దయాధర్మమునకే వదలివేసెను. ఇది బలే కృతజ్ఞత!)

సాల్బే ఒడంబడిక.

ఈ సాల్బే ఒడంబడికతో మొదటి మహారాష్ట్రయుద్ధము ముగిసినది. దీనివల్ల ఇంగ్లీషువారికేమియు క్రొత్తగా రాజ్యముచేరలేదు. అయితే, తమ దౌర్బల్యమెక్కడనున్నదో ఇంగ్లీషువారికి తెలియవచ్చెను. మహారాష్ట్రులు అంతసులభముగా లొంగువారుగారుసుమా యను సంగతి ఇంగ్లీషువారికి తెలిసెను. నానాఫర్నవీసు ముందర వారన్ హేస్టింగ్సు ఎత్తుపారలేదు. నానాఫర్నవీసు రాజనీతిజ్ఞత వారన్ హేస్టింగ్సు కుటిల తంత్రములను కమ్మివేసెను. మహారాష్ట్రుల ప్రతిభ దిగ్విజయముగాంచెను. తదుపరివారు సైతము నానాఫర్నవీసు మార్గమునే అనుసరించి యుండియున్నచో మహారాష్ట్ర రాజ్యమింతటిలో అస్తమించెడిది కాదుగదా! కాని దైవ మన్యత్ర తలంచెను. దైవసంకల్ప మనుల్లంఘనీయముగదా!

మొదటి మహారాష్ట్ర యుద్ధ సమాప్తము.



# బ్రిటిష్ మహాయుగము

## పదవ అధ్యాయము



### అయోధ్య ఖండము — అయోధ్య రాజ్యోదయము.

మొగలు సామ్రాజ్యమునుండి విడివడి స్వతంత్రము వహించిన ఖండములలో అయోధ్యఖండము ఒకటి. రాజ్యములకు, ప్రజాశాహుళ్యమునకు, అరిష్టదాయకముగ భావింపబడు తోకచుక్కవలె యీ యయోధ్యఖండము మొగలు సామ్రాజ్యమునుండి విడిపోయి, యీవల యూడిపడి, కొలదికాలము భారతాకాశమున వెలసి, అస్తమించిపోయెను. ఈ అయోధ్య రాజ్యోదయాస్తమయములు తోకచుక్క యుదయాస్తమయములవలెనే మొగలుచక్రవర్తికిని, భారత ప్రజలకును, అరిష్టదాయకమయ్యెను. ఇది వెలిగినన్నాళ్లు చక్రవర్తికిగాని, ప్రజలకుగాని ఏవిధమైన మేలును చేయలేదు. పైగా, అపకారముచేసెను. ఇంగ్లీషురాజ్యమును ఇండియాపై తెచ్చిపెట్టుటకు పూరాగా తోడ్పడెను. ఇంగ్లీషువారి కిది కావలసినంత ధనమును, మనుష్యులను, సప్లయి చేయు కామధేను వయ్యెను. ఇంగ్లీషువారు కత్రలు పన్నుకొనుటకిని వారిపాలిటి చక్కని తేనెపెరయయ్యెను.

కంపెనీకి కామధేనువు.

"ఈస్టిండియా కంపెనీయను శిశువు ధనమను పాలులేక యెండిపోవుచున్నపుడెల్ల యీ యయోధ్యరాజ్య మను దాది వచ్చి తన చంటిపాలిచ్చి యీశిసువును, బ్రతికించుచుండెనని" సర్ హెన్రీ లారెన్సు 1845 సం॥ జనవరినెల "కలకత్తా రివ్యూ"లో వ్రాసెను. కంపెనీవారు దీనిని తమకు చంటిపాలిచ్చి పెంచు దాదిగా చూచుకొను చుండిరట!

కంపెనీకి చంటి పాలిచ్చి పెంచిన దాది.

డబ్బేకాక సైన్యములనుకూడ, యీ రాజ్యము ఇంగ్లీషువారికి కావలసినపుడెల్ల సప్లయి చేయుచుండెను. ఈ సైన్యములతోనే వారీ భరత వర్షములో రాజ్యమును స్థాపించుకొనగలిగినారు. సర్ హెన్రీ లారెన్సు యిట్లు వ్రాయుచున్నాడు :—

"అయోధ్యఖండములో 30 లక్షల జనముందురు. వీరిలో ముప్పాతికమంది హిందువులుందురు. వీరే యిండియాలోనికెల్ల మంచితరిఫియతైన కాల్బలమని చెప్పనచ్చును. బెంగాలు నేటివు కాల్బలములో ముప్పాతికమంది యీ అయోధ్యనుండి వచ్చినవారే. బొంబయినుండికూడ యిక్కడికివచ్చి సైన్యమునకు మనుష్యులను ప్రోగుచేసుకొని పోవుచుందురు."

**సాదత్ ఖాన్.**

అసలీ ఖండపు పుట్టుకయే ద్రోహమూలముగ నున్నది. ఈ యయోధ్య రాజ్యవంశమును స్థాపించినవాడు సాదత్ ఖాన్. ఇతడు డబ్బు సంపాదించుకొనుటకై పరిష్యా దేశమునుండి దేశద్రిమ్మరిగా బయలుదేరి మొగలు సామ్రాజ్య భానుడు పడమటకి తిరిగిన రోజులలో ఇండియాకు చేరుకున్న బాపతు మనిషి. ఇతనికిముందు యితని తండ్రియు, అన్నయు, ఇండియాకువచ్చి పాట్నాలో యేదోవృత్తిచేసికొనుచు బ్రతుకుచుండిరి. ఇతడు 1705 లో యిండియాకు వచ్చునప్పటికి యితనికి 20 యేండ్లలోపు వయస్సుండును. ఇతడును పాట్నాకు చేరుకొనునప్పటికి తండ్రిచనిపోయి యుండెను. అందుచే అన్నయు తానును బయలు దేరి (యీ సాదతుఖానుడు) ఢిల్లీలో మకాముపెట్టెను. అప్పుడున్న ఢిల్లీపాదుషా దుర్బలుడగుటచే సయ్యదు లనబడు యిరువురు సోదరులు మంత్రిత్వము వహించి ఢిల్లీసామ్రాజ్యము నాశనముకాకుండా తమ శక్తి సామర్థ్యములచేతను, ప్రభుభక్తి పరాయణతచేతను, పట్టుకొని వచ్చుచుండిరి. ఇట్టి సమయములో యీసాదత్ ఖాన్ మెల్లిగా కొంతకాలమునకు ఢిల్లీదర్బారులోనికి ప్రవేశము సంపాదించెను.

ఆ సమయమున సామ్రాజ్యమునకు తమ శక్తిసామర్థ్యములచే సహాయ మొనర్చుచున్న సయ్యదు సోదరులను త్రోసివేసి సామంతులందరు స్వతంత్రుల మగుదుమను దురాశతో వారందరుచేరి గొప్పకుట్ర పన్నుచుండిరి. ఈ కుట్రలో యెట్లు దూరెనోగాని మనవాడు సాదత్ ఖాన్ గూడ దూరెను. మొగలు పాదుషా దుర్బలుడై తెలివిహీనుడై తనకు శత్రులెవరో మిత్రులెవరో గ్రహించలేక తన సామ్రాజ్యమును కాపాడిపెట్టుచున్న సయ్యదు సోదరులను త్రోసివేయ జూచు చుండెను. వీరిచేతులలోనుండి యెప్పుడు బయటపడుదునాయని పాదుషా చూచు చుండెను. ఇట్టి స్థితిలో కుట్రదారుల పని తేలికయేగదా.. వారందరేకమై యెట్లో సయ్యదు సోదరులను త్రోసివేసిరి. ఆ కథనంతను వేరొక యధ్యాయములో చెప్పెదము.

సయ్యదుసోదరులను త్రోసివేయుటలో తోడ్పడినవారిలో యీసాదత్ ఖాన్ ఒకప్రముఖుడు. ఈ ఉపకారమునకు చక్రవర్తి సంతోషించి సాదత్ ఖానును అయోధ్యరాజ్యమునకు ప్రతినిధిని జేసెను. ఈతడీ పనిని కడుసమర్థతతో నిర్వహించు చుండెను. సాదత్ ఖాన్ గొప్పయోధుడేగాక రాజ్యపాలనా దక్షతయు గలవాడు. అదివరకు అరాచకముగనుండిన అయోధ్యరాష్ట్రములో శాంతిభద్రతల నెలకొల్పి మంచిపరిపాలనా విధానము నేర్పరచెను. ఇంతవరకు మెచ్చుకొనదగినదే. అయితే, ఇతని దుర్మార్గ మెక్కడ కనబడుచున్నదనగా, ఇతడు ఢిల్లీచక్రవర్తి అధికారమును త్రోసిపుచ్చి స్వార్థమును పెంపొందించుటకై అవలంబించిన తుచ్ఛమార్గములలో కనిపించుచున్నది. మొగలు చక్రవర్తిపై ముందుగా తిరుగుబాటు ప్రారంభించి అందరినికూడా క్రమముగా తిరుగుబాటులోనికి దింపినవాడు డక్కన్ ప్రతినిధియగు



సాదత్ ఖాన్

మొగల్ సామ్రాజ్యమునుండి అయోధ్య ఖండమును ఊడగొట్టుకొని స్వతంత్రుడైన మొదటి నబాబు—నైజామ్ ఉల్ ముల్క్ టోపీలోపడి ముందుగ తన గిన్నెలోని విషము త్రాగి చచ్చినవాడు

—ఈకథకోసం 337-వ పేజీ చూడండి.



వజీగ్ గాజీయుద్దీన్

ఢిల్లీ చక్రవర్తిపై తిరుగబడి అతని కన్నులు పెరికి మొగల్ సామ్రాజ్యమును బ్రద్దలుకొట్టుటకై మహారాష్ట్రుల నాహ్వానించినవాడు

(197-వ పేజీ.)



అసఫుద్దౌలా

అర్ధసేనలరుద్దుడు భరించలేక మనోవ్యాధిచే మంచమెక్కి మరణించిన నబాబు

.........(405-వ పేజీ.)



సాదత్ అలీ ఖాన్

“నేనుయీ మాటలను నమ్మను......మక్కాకో, మదీనాకో నన్ను పోనివ్వండి......నా ప్రజల మొగం నేనిక చూడలేను.” అని రోదించుచు కంపెనీకి అర్ధరాజ్యమును ధారాదత్తముచేసిన నబాబు (460-వ పేజీ.)

"నైజాం ఉల్ ముల్క్." ఈతడెట్లు మహారాష్ట్రులు మున్నగువారితో పరీక్షై మొగలు సామ్రాజ్యమును ఖండఖండములుగా బ్రద్దలు గొట్టివేసెనో తరువాత అధ్యాయములో చెప్పెదము.

నైజాముల్ ముల్క్ యీరీతిగా తనస్వామియగు మొగలు చక్రవర్తిపై తిరుగుబాటు చేయుచున్నప్పుడు యీసాదత్ఖానుడు చక్రవర్తికి నిజముగా సహాయము చేయవలసియుండెను. అత డట్లుచేయక మెదలకుండ ఊరకుండెను. ఇతనికి కృతజ్ఞత లేదు. తనవంశము, తన అధికారము పచ్చగావుంటే చాలు ఇతనికి. తననింత పెద్ద వానినిజేసిన మొగలు చక్రవర్తి నాశనమైపోయినాసరే. పైగా అతడు దుర్బలుడైన కొలది తనబలము హెచ్చునని లోలోన ఇతడు మురియుచుండెను. ఇతడును నైజాముల్ ముల్క్‌తోచేరి కుట్రపన్నుచున్నాడేమో తెలియదు. నాదర్షాను పరిషి యానుండి ఢిల్లీపైకి దండెత్తి రమ్మని కన్నుగీటుచుండెనేమోకూడ తెలియదు. దీని విషయమై నిర్ధారణగా చెప్పుటకు బలవత్తరమైన సాక్ష్యములైతే గాన్పింపవు. ఉన్నసాక్ష్యములు పరస్పర విరుద్ధములుగ నున్నవి. మొత్తముమీద కనుపడుచున్న దేమనగ నాదర్షా ఢిల్లీపైకివచ్చి చక్రవర్తి సేనలను ఓడించగానే సాదత్ ఖాన్, నైజాం ఉల్ ముల్కులు నాదర్షా ప్రాపకము సంపాదించు కొనుటకై ఒకరిని మించి ఒకరు ఎగబడిరి. ఈ అలుసు చూచుకొని నాదర్షా విజృంభించి దేశమునంతను కొల్లగొట్టి దారుణవధల గావించెను. సర్ హెన్రీ యిట్లు వ్రాయుచున్నాడు.

"ఈ ద్రోహులిద్దరుగూడా (నైజాం ఉల్ ముల్కు, సాదత్ ఖానులుగూడా, నాదర్షా దారుణచర్యలనుండి తప్పించుకొన లేకపోయిరి. నాదర్షా వీరిని కొల్ల గొట్టుటయేగాక, వీరిద్వారా దూరప్రదేశములందున్న వారినిగూడా కొల్లగొట్టించెను. సాదత్ ఖాన్ ప్రతిభను, బలమునుచూచి నైజాం ఉల్ ముల్కుకు అసూయపుట్టి ఇతని నెట్లయిన చంపివేయవలెనని నైజాం ఉల్ ముల్కు తలంచెను. దీని కితడు ఒక టక్కరు యెత్తువేసెను. "ఈ నాదర్షా బాధపడలేకుండా వున్నాను. విషముపుచ్చు కొని చస్తా" నని ఇతడొకనాడు సాదత్ ఖానుతో ఎంతోవిరక్తి ఉట్టిపడినట్లుగా నటించిచెప్పెను. "నాకును అట్లేయున్నది, నేనును విషముపుచ్చుకుంటా" నన్నాడట. ఈరీతిగ ఇరువురు విషపు గిన్నెలదగ్గర పెట్టుకొని విషముతాగి చచ్చుట కేర్పాటు చేసుకొనిరి. మొట్టమొదటగా సాదత్ ఖాన్ విషముతాగి చచ్చెను. తరువాత నైజాముల్ముల్కు విషము త్రాగకుండా (తనగిన్నెలోని విషము అవల పారబోసి) చంకలు కొట్టుకొనెను."

ఇది సాదత్ ఖానుని చరిత్ర "సాదత్ ఖాను తన పాపఫలమును తానునుభ వించెను. తనశక్తి సామర్థ్యములవలన రాజ్యమును సంపాదించుకొనెను. తన ద్రోహ బుద్ధివలన నీచమగు అకాలమృత్యువును తెచ్చుకొనెను. 'చెరపుకురా చెడేవు' అనే సామెత ఇతనియందు సార్థకమైనది." అని సర్ హెన్రీ లారెన్సు వ్రాయుచున్నాడు.

సాదత్ ఖాన్ విషముత్రాగి చనిపోవునాటికి 50 యేండ్ల వయస్సుకూడ లేదు. ఇతనికి మగసంతతిలేదు. ఒక్కకూతురు మాత్రము వుండెను. ఇతని అన్న కొడుకులు షేర్ జంగ్, సఫ్దరుజంగులు యిరువురు వారసత్వమునకై పోరాడుకొనిరి. చిన్నవాడు సఫ్దరుజంగు యెక్కువ సమర్థుడు యెక్కువ జిత్తులమారివాడు. పైగా యితడు పినతండ్రి (సాదత్ ఖాన్) కూతురును పెండ్లిచేసుకొనెను. ఇతడు అప్పటి కంకను ఢిల్లీలో మహాప్రతిభతో పీఠము వేసుకొని కూర్చున్న నాదిర్ షాను ఆశ్రయించి అతనికి గొప్పకట్నమును చదివించి ఆతని ప్రాపకమువల్ల వారసత్వమును స్థిరపరచుకొని, అయోధ్యరాజ్యమునకు పట్టము గట్టుకొనెను. కొంతకాలమునకు ఢిల్లీ చక్రవర్తియే యిదివరలో నైజాము ఉల్-ముల్కుకు యిచ్చిన "వజీరు" పదవిని (అనగా సామ్రాజ్యమునకంతకు మహామాత్య పదవిని) అతనినుండి తీసివేసి, యీ సఫ్దరుఖానుకిచ్చెను. అప్పటినుండి యీ వజీరుపదవి అయోధ్య నబాబులకు వంశపారంపర్యమయ్యెను. వీరి కితనినాటినుండియే "నబాబు-వజీరు", అను ద్వంద్వ బిరుదు లభించెను. ఈ సఫ్దరుజంగు తనపొరుగున నున్న రోహిలాల నణచవలెనని చాలాప్రయత్నించి వారిపైకి అనేకసారులు దండెత్తివెళ్లెను. కాని, ప్రయోజనము లేకపోయెను. ఈ అపజయమే భవిష్యత్తులో ననేకదారుణములు జరుగుటకు హేతువయ్యెను.

సఫ్దరుజంగ్—"నబాబ్-వజీర్."

సఫ్దరుజంగు 1754 సం॥లో చనిపోగా అతనికొడుకు "షుజా ఉద్దౌలా" అయోధ్యకు "నబాబు-వజీ" రయ్యెను. ఇతని కాలములోనే అయోధ్య "నబాబు-వజీరు" లకును యింగ్లీషువారికిని మొట్టమొదటగా సంబంధమేర్పడెను. దీనినిగూర్చి కొంత లోగడ వివరించియేయుంటిమి. తక్కిన సంగతులు తరువాత చెప్పెదము. భరతఖండమున ఆంగ్లరాజ్య స్థాపనకు యీ అయోధ్య రాష్ట్రము చాలా తోడ్పడియుండుటచే దీని పూర్వచరిత్ర నిట యీమాత్రము క్లుప్తముగా వివరింపవలసి వచ్చినది.

షుజా - ఉద్దౌలా — ఇంగ్లీషు వారి సంపర్కము.

# బ్రిటిష్ మహాయుగము

## పదునొకండవ అధ్యాయము



### మైసూరు ఖండము.

హైదరాలీ - ఇంగ్లీషు వారికి అజేయుడు.

ఇండియానుండి ఇంగ్లీషువారిని తరిమివేయవలెనని పట్టుపట్టినది మహారాష్ట్రులొక్కరేకారు. బ్రిటిషువారు తమరాజ్య స్థాపనకై ఇండియాలో మహమ్మదీయులతో పోరాడవలసిన అవసరము పట్టలేదనియు, వారిపోరాటములన్నియు మహారాష్ట్రులు, జాటులు, ఘూర్ఖాలు, సిక్కులు, వగైరా దుర్జయులగు హిందువులతోనే జరుపవలసి వచ్చెననియు, కొందరు చరిత్రకారు లనుచున్నారు. ఈమాటచాలవరకు నిజమేయైనను దీని కొకటే మినహాయింపు వున్నది. ఆమినహాయింపే హైదరాలీ. హైదరాలీతో పోరాడిన యుద్ధములలో ఇంగ్లీషువారు జయము గాంచిన దొక్కటియులేదు. ఇతడు వారికి అజేయుడై వారిని ముప్పతిప్పలుపెట్టి మూడు చెరువుల నీళ్లు త్రాగించెను. ఇంగ్లీషువారు ఇండియాలో తామెదుర్కొనవలసిన అసాధ్యులలో హైదరాలీ యెంతేని యెన్నదగియున్నాడు.




హైదరాలీ వంశ వృక్షము.

హైదరాలీ మైసూరు హిందూరాజుల కొలువులో సామాన్య సిపాయిగనుండెను. మహమ్మదీయులు యిండియాలో 700 యేండ్లు రాజ్యము చేసినను యీ మైసూరు హిందూరాజ్యమును వారెన్నడు వంచలేకపోయిరి. ఈ పని హైదరాలీ చేసెను. హైదరాలీ ప్రపితామహుని పేరు భాయీలాల్. ఇతడు ఆఫ్ఘన్, జాతికి చెందిన

వాడు. ఈతని వంశీకులే ఉత్తరహిందూస్థానములో "లోడీ" రాజ్యమును స్థాపించిరి. ఈ లోడీ రాజ్యము 1526 సం॥ లో మొదటి మొగలు వీరుడగు బాబరుచే నిర్మూలము గావింపబడెను. భాయీలాల్ ఫకీరయి దక్షిణమునకు వచ్చి గుల్బర్గాలో కాపురముండెను. ఇతని రెండవకొడుకు ఆలీమహమ్మదు అనునతడు మైసూరు రాజ్యములో తూర్పుభాగమున నున్న 'కోలారు' కు వలసవచ్చెను. ఇతడు 1678 లో చనిపోవునాటికి యితనికి నలుగురు కొడుకులుండిరి. ఆఖరువాడు ఫతేమహమ్మదు మైసూరురాజుల కొలువులో ఫౌజుదారై బుడీకోటను జాగీరుగ సంపాదించుకొనెను. ఇతని రెండవ కొడుకే హైదరాలీ. ఇతడు సరిగ్గా యేసంవత్సరములో పుట్టినాడో నిదర్శనములు లేవు. కొందరు 1717 అనియు, మరికొందరు 1722 అనియు చెప్పుచున్నారు.

హైదర్ ప్రజ్ఞ.

మైసూరురాజులు సతారాలోని మహారాష్ట్ర రాజులవలెనే అసమర్థులగుట వల్లనే అధికారమంతయు మంత్రుల చేతులలోనే యుండెను. కర్ణాటకములో ఆంగ్ల పరాసు జాతులవారు కొట్లాడుకొనుచున్న కాలమున మైసూరు రాజ్యములో దేవరాజు నంజరాజులను యిరువురు మంత్రులు అధికారము వహించియుండిరి. నైజాము వారసత్వ విషయములో ఇంగ్లీషువారికి ఫ్రెంచివారికి అప్పుడు కలహమువచ్చెను. 1748 లో చనిపోయిన నైజాముల్‌ముల్కు తన తరువాత క్రమమైన వారసుడుగ ముజఫర్‌జంగ్ అను వానిని నియమించియుండగా నాజరుజంగు అను యింకొకనిని ఇంగ్లీషువారు అక్రమముగ వెనుకవేసుకొనివచ్చిరి. ఫ్రెంచివారంతట క్రమమైన వారసుడగు ముజఫరుజంగు పట్టుచేరిరి. ఈ తగాదాలో మైసూరువారును క్రమమైన వారసుడగు ముజఫరుజంగుకే మద్దతుచేసి తామును ఫ్రెంచివారును కలసి అతనిని నైజాము సింహాసనముపై కూర్చుండబెట్టిరి. ఈ యుద్ధములో హైదరాలీ మైసూరుసేనలో తనయన్న 'షహబాజు' యాజమాన్యమున నున్న దళములో ఒకానొక సిపాయిగ నుండి పోరాడెను.

హైదర్ విజృంభణ

ఈ పోరాటములో యితడుచూపిన చాకచక్యమును ధైర్యమును చూచి, నంజరాజ ప్రధాని చాలా మెచ్చుకొని హైదరాలీని దిండిగలుకు ఫౌజుదారుగ చేసెను. ఇప్పటినుండియే తాను యావత్తు దక్షిణభారతమునకు ప్రభువు కావలెనను ఆశ హైదరాలీకి జనించెను. ఈ దిండిగల్లులో ఫిరంగుల ఫ్యాక్టరీని పెట్టి ఫ్రెంచివారిచే దిట్టమైన ఫిరంగులను తయారు చేయించెను. హైదరాలీకి వ్రాయను, చదువను, రాదు. అందుచే, తనకు గుమాస్తాగా ఖండేరావు అను మహారాష్ట్ర బ్రాహ్మణుని పెట్టుకొనెను. మైసూరురాజా తల్లి తనకొడుకు మంత్రుల చేతిలో కీలుబొమ్మయయ్యెనని తలచి వీరినుండి యెట్లయిన తప్పించమని తెలివితక్కువగా యీ ఖండేరావుద్వారా హైదరాలీకి కబురు పం

పెను. ఇందుకు హైదరాలీ సంతసించి యెట్లో మంత్రులను తప్పించివేసి రాజును తనవలలో వేసికొనెను. ఇది మంగలములోనుంచి పొయ్యిలోకి దూకినట్లయ్యెను. వెనుకటి మంత్రులకంటె హైదరాలీయే రాజును అనామకునిచేసి మరింత ఆడించ జొచ్చెను. బుద్ధిహీనతచే కొరవితో తలగోకి కొంటిమని ఖండేరావు పశ్చాత్తాప పడి, మరల వ్యవహారమును తిరుగతోడవలెనని చూచెను. ఇందులకై హైదరాలీమీదికి మహారాష్ట్రులను యీ ఖండేరావు రప్పించెను. ఈ దండయాత్రలో హైదరాలీకి చాలనష్టము కలిగినను, పానిపట్టులో మహారాష్ట్రులకు దెబ్బతగులుటచే వారు హైదరాలీని వదలి యింటికి వెళ్లిపోవలసి వచ్చెను. ఇందువల్ల హైదరాలీకి కొంచెము ఊపిరితీసుకొనుటకు అవకాశము చిక్కెను. ముందుగా తనకు యెదురు తిరిగిన గుమాస్తా ఖండేరావును శిక్షించెను. ఖండేరావు సయితము పెద్దదండును గూర్చుకొని చాలకోటలను ముట్టడించి స్వాధీన పరచుకొని యుండెను. హైదరాలీ యీ కోటలన్నిటిని తిరిగి పట్టుకొని ఖండేరావును జీవితాంతము వరకు యినుప పంజరములో పెట్టి యుంచెను. రాజుకు మనోవర్తి యిచ్చి ఆవల కూర్చుండబెట్టి రాజ్యాధికారము నంతను హైదరాలీయే యింతటినుండి చలాయింప సాగెను. హైదరాలీ పాషండుడు గాడు. సూక్ష్మదృష్టి గలవాడు. తాను రాజ్యాధికారము వహించినను వెనుకనున్న హిందూ ఉద్యోగస్థులను తీసివేయలేదు. వారితో రాజ్యము నడపుట క్షేమమని ఆతడెంచెను.

ఇంగ్లీషువారు బెంగాలులో చేయుచున్న పనిని యితడు చూచి తానును ఆ మార్గమునే అనుసరింప దలచెను. 1763 లో బేదనూరు రాజ్యమునకు వారసత్వపు తగాదా రాగా తానొక పక్షముచేరి యెదుటివానిని ముందుగా ఓడించి, తరువాత తనపక్షమువానిని గూడ హతమార్చి ఆ రాజ్యమును తాను కాజేసెను. దానికి బేదనూరను వెనుకటి పేరు తీసివేసి హైదరునగర్ అని పేరుపెట్టెను.

1767 లో యింగ్లీషువారు యితని రాజ్యములోనున్న బారామహాల్ పరగణాపైకి కవ్వించివచ్చిరి. వీరు దేశమునంతను ధ్వంసముచేసిరి. హైదరాలీ వీరిని

ఇంగ్లీషువారిమీద దెబ్బ

నైజాము, కర్ణాట నబాబు మహమ్మదాలీల సహాయముతో యెదిరించెను. అనేక పోరాటములు జరిగెను. కొన్నిసార్లొకరు మరికొన్నిసార్లు మరొకరు గెలుచుచు, ఓడుచు ఉండిరి. కొంతకాలమునకు యింగ్లీషువారు యేదో తంత్రముచే నైజామును, మహమ్మదాలీని హైదరాలీనుండి చీలదీసిరి. అప్పుడు హైదరాలీ ఒక్కడు పోరాడుట బహుకష్టమయ్యెను. అందుచే హైదరాలీ సంధిజేసికొన దలచెను. కాని, యింగ్లీషువారు తా మితనిని ఓడించ గలమను ధిమాకుచే సంధి కొప్పుకోలేదు. అంతటితో హైదరాలీకి రోషమెక్కి యుద్ధమును తీవ్రముగ సాగించెను. 1768 సం॥ శత్రుస్థానముల పెక్కింటిని పట్టుకొనుటయేగాక, యిదివరకు వారు తననుండి తీసికొన్న స్థానములనుకూడ వారినుండి

లాగుకొనెను. మదరాసు కౌన్సిలువారు కంగారుపడి సంధికేదిరిగిరి. కెప్టెన్ బ్రుక్కు అను నతనిని రాజీమాటలకై హైదరాలీవద్దకు పంపిరి. ఇప్పుడు హైదరాలీవంతు వచ్చినది. ఇతడు తిరగవేసి కొట్టెను. "నేనే మద్రాసుకోట గుమ్మమువద్దకు వచ్చుచున్నాను. మీ గవర్నరు, కౌన్సిలువారు, చెప్పుకొనుమాటలు అక్కడ వింటానులేపో" అని రాయబారిని పంపివేసెను. రాయబారి యీ రీతిగా శృంగభంగ మొంది మదరాసుకు వచ్చెను. హైదరాలీయు యితనివెంటనే బయలుదేరి తన సేనను మూడున్నర రోజులలో 130 మైళ్లదూరము అతి త్వరితగతిని నడిపించుకునివచ్చి హఠాత్తుగా మద్రాసుకోటకు 5 మైళ్లలో సెంటుథామస్ మౌంట్ వద్ద నిలిచెను. కౌన్సిలువారు చాల గాభరాపడి తమకిక ప్రాణములు దక్కవనుకొనిరి.

కంపెనీ కాళ్ల బేరము.

కాని, హైదరాలీ యేలనో వారిమీద పడక "మీరుచెప్పుకొనే దేమిటో వచ్చి చెప్పుకోండి" అని గవర్నరుకు కబురుపంపించెను. గవర్నరు అంతట డూప్రే అను ఒక రాయబారిని పంపించెను. హైదరాలీ చెప్పినషరతులకు మద్రాసువారు ఒప్పుకొని తీరవలసి వచ్చెను. ఈ సంధి 1769 ఏప్రిలు 4-వ తేదీన జరిగెను. దీనిప్రకారము యెవరు గెల్చుకున్నవి వారు వదలివేసిరి. ఇరువురును స్నేహముగనుండి ఒకరకొకరు శత్రువు మీదికొచ్చినప్పుడు సహాయముచేసుకొనుట కంగీకరించిరి. అదివరకు ఆర్కాటు నబాబు మహమ్మదాలీ చేతిలోనున్న కరూరుజిల్లాను హైదరాలీ కిచ్చివేసిరి. ఇది దురుద్దేశముతో—హైదారాలీకిని మహమ్మదాలీకిని వైరము శాశ్వతముగానుండునట్లు చేయుటకు—చేయబడినది. యుద్ధనష్టముక్రింద పరిహారమును పూర్తిగా యింగ్లీషువారు హైదరాలీకి యిచ్చుకొనిరి. తమ అపజయచిహ్నముగా ఒకపటమును వ్రాయించి మదరాసు కోటగుమ్మమునకు కట్టుకొనునట్లు హైదరాలీ యింగ్లీషువారికి ఆజ్ఞాపించి చేయించెను. ఆపటమిట్లున్నది:—ఇంగ్లీషుగవర్నరును కౌన్సిలువారును హైదరాలీముందు మోకారించి వేడుకొనుచున్నట్లును, యేనుగుతొండము రూపముగా వ్రాయబడిన యింగ్లీషురాయబారి డూప్రే ముక్కును హైదరాలీ పట్టుకొని పిండుచుండగా అందుండి నవరసులు, మొహరీలు రాలుచున్నట్లును, యుద్ధములో ఓడిపోయిన కర్నలు స్మిత్తు ఒకచేతిలో సంధిపత్రమును పుచ్చుకొని, రెండవ చేతితో తనకత్తిని రెండుముక్కలుగా విరుగగొట్టుకొనుచున్నట్లును యీ బొమ్మ వ్రాయబడినది. దీనితో ఇంగ్లీషువారికి పూర్తిగా శృంగభంగమయ్యెను.

కంపెనీకి చివాట్లు.

ఇంగ్లీషువారీ సంధిని చేసుకొన్నా రన్నమాటయేగాని లోలోన దానినెట్లయిన త్రోసివేయవలెననియే చూచుచుండిరి. హైదరాలీ చేతులలో యీ రీతిగా ఓడిపోయి పరాభవం పొందినందులకు సీమడైరెక్టర్లకు మద్రాసుకౌన్సిలువారిమీద చాలకోపమువచ్చెను. ఏలననగా, యీ అపజయమువలన కంపెనీ షేర్ల విలువ నూటికి 60 వంతున పడిపోయెను. ఈకోపమటి

డైరెక్టర్లకు యింతకంటె ఆగ్రహకారణ మేముండగలదు? కాబట్టి వారు మద్రాసు కౌన్సిలు వారిని గట్టిగా చివాట్లుపెట్టిరి. "ఇండియాలో మన పేరంతా పాడుచేశారు ఇక రేపటినుండి నేటివులందరు మనల నెంత చులకనగా చూస్తారు? వారిక మనమీదికి వంటికాలిమీద వస్తారు." అని డైరక్టరులనిరి. "మేమేమి చేసేది? యుద్ధముచేయటానికి డబ్బులేక మేము సంధిచేసికోవలసి వచ్చింది" అని మద్రాసుకౌన్సిలు వారు సంజాయిషీ చెప్పుకొనిరి.

కంపెనీవారి కుటిలము.

ఈ సంధివలన హైదరలీ యింగ్లీషువారలు పరస్పర సహాయము చేసుకొనవలసిగదా యుండెను. అట్టి అవసరము హైదరాలీకి త్వరలోనే కలిగెను. మహారాష్ట్రులు హైదరాలీపైకి దండువచ్చిరి. "మన ఒడంబడికప్రకారము మీరు నాకిప్పుడు సహాయము చేయవలె" నని హైదరాలీ యింగ్లీషువారిని కోరెను. వారు సహాయమును పంపక ఎగబెట్టిరి. హైదరాలీ ఫ్రెంచివారి సహాయమును కోరెను. కాని, వారప్పుడతనికి సహాయము చేయగల తాహతులో లేకుండిరి. ఇక, విధిలేక మహారాష్ట్రులకు చాలధనము నిచ్చియు, మిక్కిలి ఫలవంతములగు కొన్ని జిల్లాలను వారికి తాకట్టుపెట్టియు, హైదరాలీ వారితో రాజీపడవలసి వచ్చెను. ఇది 1772-లో జరిగెను.

హైదర్—మహారాష్ట్రులు.

ఈ రాజీమాటల సమయములలోనే నానాఫడ్నవీసు హైదరాలీని తనతో కలుపుకుని, యిరువురుచేరి, ఇంగ్లీషువారిని అణచివేయవలెనని చూచెను. కాని, యిందుకు హైదరాలీ ఒప్పుకొనలేదు. ఒప్పుకొనకపోతే పోయిరి గాక, పైగా యీమాటను తీసుకొనివెళ్లి హైదరాలీ ఇంగ్లీషువారికి చెప్పెను. ఇతడేమి తెలివికలవాడనుకొనవలెను? ఇది రాజనీతిజ్ఞతయా? వివేకమా? తనతో ఆడినమాటను తప్పి, ఆపద సమయములో తనకు సహాయముచేయక, తనను యిరుకునపెట్టిన ద్రోహులతో హైదరాలీ యేల యీ రహస్యమును వెల్లడించవలెను? ఇది శుద్ధ తెలివితక్కువ పనియని పసిపిల్లవానికికూడ తెలియును. హైదరాలీ రణరంగమందు గొప్పయోధుడైనను రాజ్యతంత్రమందంత తెలివికలవాడుకాడు. అతడు నిజమైన రాజ్యతంత్రజ్ఞుడే అయియుంటే-ఇంగ్లీషువారు తనను విడనాడి ద్రోహముచేసినప్పుడును, ఫ్రెంచివారు తనకు తోడ్పడలేనప్పుడును, యీతడు మహారాష్ట్రులు చాపిన స్నేహహస్తమును స్వీకరించక విడనాడునా? పైగా, యీ రహస్యమును తీసుకొనిపోయి యెల్లరకు ఉమ్మడిశత్రువగు యింగ్లీషు వారికి వెల్లడించునా! ఈసమయమునం దీతడు వివేకముతో ప్రవర్తింపక కేవలము అవివేకముంగోపడి, తన రాజ్యమునకును, యావద్భారత ఖండమునకును, ముప్పు తెచ్చెను. ఈతడు మహారాష్ట్రులతో స్నేహము చేసుకొనియుండినచో వారితనికి తప్పక సహాయము చేసెడివారు. మహారాష్ట్రు లితరవిషయములలో యెట్టివా

రైనను అన్నమాటను తప్పువారు కారని లోకమెల్ల రెరిగినదేగదా. హైదరాలీ గనుక మహారాష్ట్రులతో అప్పుడు చేరియుంటే వీరు ఉభయులు తమ తమ రాజ్యములను దిట్టపరచుకొనుటయేగాక, ఉమ్మిడిశత్రువగు ఇంగ్లీషువారిని యిండియా నుండి తరిమివేసెడివారు. కాని, దైవయోగము వేరువిధముగనుండెను. హైదరాలీ అవివేకముగ యీ రహస్యమును ఇంగ్లీషువారికి వెల్లడించుటచే మహారాష్ట్రుల కెన్నియో యిక్కట్లువచ్చెను. ఇంగ్లీషువారు మాస్టినును పునహాకు పంపించి, మహారాష్ట్రులకు, హైదరాలీకి కలియకుండా కుట్రలుపెంచి, కుటుంబకలహములనురేపెట్టి నారాయణరావు మున్నగువారిని చంపించి, మహారాష్ట్రము నెంత భీభత్సము చేయవలెనో అంత భీభత్సము చేసిరి. నారాయణరావు అన్న పీష్వా మాధవరావు యొక్క ఆకస్మిక అకాల మరణమునకుకూడ మాస్టినే కారణమేమో యెవరు చెప్ప గలరు ? ఆతనికి మాస్టిన్ రహస్యముగా విషముపెట్టించి చంపించియుండవచ్చును. హైదరాలీ రహస్యము నిట్లు వెల్లడించుటవల్ల మహారాష్ట్రమున కిన్ని ముప్పులు వచ్చెను. అందుచే హైదరాలీ స్థాపించినరాజ్యమును పడగొట్టుటకై నానాఫర్నవీసు తదనంతరము తోడ్పడెనన్నచో ఆశ్చర్యపడవలసిన పనిలేదు. ఇది తదనంతర చరిత్ర.

1772 జూన్ నెలలో మహారాష్ట్రులకు భూమిని, ముడుపులను చెల్లించుకొని అటుపంపివేసి, హైదరాలీ "కొడగు" రాజ్యముపైబడి దానిని స్వాధీనము చేసుకొనెను.

ఈలోగా పునహాలో జరుగుచున్న నాటకమంతను హైదరాలీ కనిపెట్టియే చూచుచుండెను. పీష్వాలు మాధవరావు, నారాయణరావు, లిరువురును కడతేరిరి. భ్రాతృపుత్రహంతకుడు రఘునాథరావు నారాయణరావు మరణానంతరము పుట్టిన పసికూన సింహాసనమునకు రాకుండ తానే తక్తు నెక్కవలెనని చూచుచుండెను. ఇంగ్లీషువా రీ హంతకుని వెనుకవేసికొని వచ్చుచుండిరి. ఇట్టి చిక్కుసమయమును గనిపెట్టి హైదరాలీ తిరిగి మహారాష్ట్రులపైకి 1785లో తనకొడుకు టిప్పుసుల్తానును పంపించి, లోగడ తాను వారికి తాకట్టువుంచిన భాగములు స్వాధీనపరచుకొనెను. ఇందుకు నానాఫర్నవీసు అంగీకరించి, మరల హైదరాలీని ఎట్లయిన తనతో కలుపుకుని ఇంగ్లీషువారి నణచవలెనని చూచెను. ఇంతవరకు మైసూరురాష్ట్రము పీష్వాకు "చౌతు" చెల్లించుచుండెను. తనతోకలిసి యింగ్లీషువారిమీదికి వచ్చేయెడల యీ చౌతును తగ్గింతునని నానాఫర్నవీసు హైదరాలీతో చెప్పెను. ఇంగ్లీవారు తనకు ద్రోహముచేసిరేయన్న రోషము హైదరాలీ మనస్సులో వేధించుచునేయుండెను.

అందుచే, నానాఫర్నవీసు మాట కితడంగీకరించి వెంటనే యింగ్లీషువారి పనిపట్టించుటకై బయలుదేరెను. అటు మహారాష్ట్రులును, యుద్ధమునకు దిగిరి

* ఇంగ్లీషువారంతట రెండువైపుల యేక కాలమందు కాచుకొనవలసివచ్చెను. కాని ముందు మహారాష్ట్రుల మీదికి పోదలచి యీపని తీరువరకు హైదరాలీ నెట్లయిన తీయనిమాటలచే లాలించుచు, తమ మీదికిరాకుండ కాలహరణము చేయించవలెనని యింగ్లీషువారొక యెత్తువేసిరి. ఈ తియ్యనిమాటలు చెప్పుచు ఊరించుచుండుటకై మద్రాసుకౌన్సిలు వారొక క్రైస్తవఫాదిరీని హైదరాలీ వద్దకు పంపించిరి. కాని, యీ పర్యాయము హైదరాలీ వారిటోపీలో పడలేదు. ఇంగ్లీషువారు తనతో ఆడిన మాటను తప్పినందుకై హైదరాలీ యీ రాయబారిని గట్టిగా తలవాయునట్లు చివాట్లుపెట్టి పంపించివేసి, 1780 జులయిలోయుద్ధమునకు బహుతీవ్రముతో బయలు దేరెను. కర్ణాటకమంతను స్వాధీనపరచుకొనెను. మద్రాసుకౌన్సిలువారు డబ్బు వగైరాలులేక యుద్ధమునకు సిద్ధముగ లేకుండిరి. అందుచే కర్ణాటకములో హైదరాలీ వీరవిహారమొనరించుచున్నప్పుడు వారు అతనిని అడ్డగించలేకపోయిరి. ఇంగ్లీషువారి యాజమాన్యమున కర్ణాటకనబాబు యీ ప్రాంతపు ప్రజలను ఘోర బాధలుపెట్టుచుండెను. ఎప్పుడైతే హైదరాలీవచ్చి పడెనో అప్పుడే యింగ్లీషు వారి బాధనుండి బయటపడుచున్నాముగదా యని అక్కడిప్రజలు సంతోషించి హైదరాలీ కెంతయో సహాయముచేసిరి. ఎక్కడెక్కడివార్తలు హైదరాలీకి సులభముగా తెలియుచుండగా, ఇంగ్లీషుసేనాని కర్నల్ కాస్బీ కేమియు దిక్కు తెలియక క్కొట్టుకొనుచుండెను. హైదరు రణవ్యూహములముందర కర్నల్ కాస్బీ దిక్కు తెలియక తెల్లపోవలసివచ్చెను.

హైదర్ ఇంగ్లీషు వారిని వేధించుట.

1780 ఆగష్టు 10 తేదీకి మద్రాసుకూడ పట్టుబడునేమోయను భయము పుట్టెను. ఆరోజున హైదరుతాలూకు ఒక అశ్వికదళము సెంటుథామసుమౌంటు వద్దకు వచ్చి నానా భీభత్సముచేయసాగెను. మద్రాసుకౌన్సిలు వారంతట గాభరాపడి నాల్గువైపులనున్న సేనలకు "రండి రండి" అని కబుర్లుపంపించిరి. గుంటూరులో

---

* మహారాష్ట్రులు నైజాము, హైదరాలీ ఈ ముగ్గురిని యేకకాలమందే యింగ్లీషువారిపైకి తమ తమ రాష్ట్రములలోనుండి పురికొల్పవలెనని నానాఫర్నవీసు యెత్తువేసెనని పైయధ్యాయములో చెప్పియుంటిని. ఇందుకు హైదరాలీచే నానాఫర్నవీసు యీరీతిగా ఒప్పించెను.

నానాఫర్నవీసు నైజామునుకూడ అదేసమయమున పురికొల్పజూచెను. కాని, యింగ్లీషువారతనికి గుంటూరు సర్కారును యిచ్చి తమపట్టున గుంజుకొనిరి. మరియు, ఢిల్లీచక్రవర్తి దక్షిణ యిండియాలోని ప్రతినిధిపదవిని (వైస్రాయ్‌పదవిని) తననుండి తీసివేసి హైదరాలీకి యివ్వజూచుచున్నాడను టక్కరుమాటను నైజాము చెవులో ఊదిరి. ఈమాటపట్టుకొని వెర్రిబాగుల నైజాము యీయాటములో చేరక, హైదరాలీయెడ యీర్ష్యవహించి, దూరముగనుండెను. నానాఫర్నవీసు వేసిన యెత్తు పూర్తిగ నెరవేరక పోయినను ఇంగ్లీషువారికీ సమయమున ఉక్కిరి బిక్కిరి అయ్యెను.

నున్న సేనాపతిని, పుదుచ్చేరినుండి కర్నల్ బ్రెయితువెయిటును, తక్షణమే తమ తమ సేనలతో మద్రాసుకు రమ్మనిరి. హైదరు రాకకు అడ్డుపడవలసినదని చెప్పి తిరుచునాపల్లిలోనున్న సేనకు కబురుపంపించిరి. తమ మిత్రుడు కర్ణాటక నబాబు తాలూకు వడిమూర్, సామో, జింజీ, కర్ణాటకఘుర్, వందవాసి మున్నగు కోటలకు తగుకాపుదలలు పెట్టిరి.

ఈ యుద్ధములో హైదరొకపొరపాటు చేసెను. పుదుచ్చేరికిని, మద్రాసుకును, మధ్య 'కారంగోలి' యను చిన్నకోటగలదు. ఈ కోటను స్వాధీనపరచుకొనుట హైదరాలీకి బహుసులభముగనుండెను. కాని, అతడట్లుచేయక పొరపాటున వదలివేసెను. అతడే గనుక యీ కోటను ముందుగా స్వాధీనపరచుకొని యుండియుంటే పుదుచ్చేరిలోనున్న యింగ్లీషుసేనాని బ్రెయితువెయిటు తనసేనతో మద్రాసు రాలేకపోయెడివాడు. గుంటూరునుండి కర్నల్ బెయిలీ యాజమాన్యమున వచ్చుచున్న సేననుమాత్రము హైదరాలీ యెదిరించి పూర్తిగా ధ్వంసము చేసెను. 700 మంది యింగ్లీషువారు చచ్చిపోయిరి. 200 మందిని హైదరు ఖైదీలుగా పట్టితెచ్చెను. ఈ విజయసూచకముగా హైదరాలీ శ్రీరంగపట్టణములో "దరియా దౌలతుబాగు" గోడలపై చిత్తర్వులో వ్రాయించెను. ఈ యోటమి సంగతి కలకత్తాకు తెలియగనే వారన్ హేస్టింగ్సు అప్పుడు మహారాష్ట్రులతో చేయుచున్న యుద్ధముకట్టిపెట్టి వారితో సంధిచేసుకుని మద్రాసువారి సహాయార్థము సర్ అయ్యర్ కూటు యాజమాన్యమున కొంతసేనను ఓడలమీద నవంబరు 5-వ తేదీకి మద్రాసుచేరునట్లు పంపించెను. ఈ "కూటు" కూడ హైదరాలీ విజృంభణమును అణచలేకపోయెను. మద్రాసుకౌన్సిలువారి స్థితిగతులేమియు యితనికి నచ్చలేదు. వారు వ్యవహారములన్నిటిని పాడుచేసిరని యీ కూటు వారిని చివాట్లు పెట్టి యేమియుచేయలేక 1782 సెప్టెంబరు 28 తేదీన బెంగాలుకు తోకముడత పెట్టెను.

ఇట్టిస్థితిలో యుద్ధము మహావిజయవంతముగా రేగుచున్న తరుణమున హైదరాలీ దైవవశమున 1782 డిశంబరు 7-వ తేదీన చనిపోయెను. ఇంగ్లీషువారి అదృష్టము పండెను. హైదరాలీ అకాలమరణము యింగ్లీషువారికి ఒక విధముగ గాక అనేకవిధములుగ మేలయ్యెను. అతడప్పుడు తమపై మహా ఉమ్మరముగా చేయుచున్న యుద్ధబాధ తప్పెను. ఇది ఒక లాభము. అటు మహారాష్ట్రులును యింగ్లీషువారితో సఖ్యపడక తప్పదాయెను. ఇది రెండవలాభము. నైజాము తనను విసర్జించినను సింధియా, భాన్స్లేలు శత్రుపక్షము చేరినను, హైదరాలీ బ్రతికియున్నంతవరకు నానా ఫర్నవీసు యింగ్లీషువారి నింకను పూర్తిగా లొంగదీయ గలననియే ఆశించుచుండెను. కాని హైదరాలీ చావుతో నానాఫర్నవీసు ఆశలు అడుగంటెను. హైదరాలీ కొడుకు "టిప్పు"

హైదర్ మరణము ఇంగ్లీషువారికంబరము



శ్రీరంగపట్టణము—మైసూరు రాజధాని.



హైదరాలీ

ఆంగ్లేయులకు అజేయుడు-ఇంగ్లీషువారిని
ముప్పతిప్పలుపెట్టి మూడుచెరువులనీళ్లు
తాగించినవాడు (340-వ పేజీ.)



టిప్పూసుల్తాను—
(హైదరాలీకొడుకు)
దైవభక్తిగల మైసూరుప్రభువు—వీర
స్వర్గమును జూరగొన్నయోద్ధ.
(448-వ పేజీ.)



మైసూరుమంత్రి పూర్ణయ్యపంతులు
హిందూ, మహమ్మదీయ ప్రభువులను సమానభక్తితో గొల్చిన
ప్రగ్గడ (పేజీలు 349, 450, 451.)

యెట్టివాడగునో నానాఫర్నవీసుకు అప్పుడు తెలియదు. వారుభయులకు అప్పుడేమియు ఒడంబడికలేదు. అందుచే నానాఫర్నవీసు అప్పటికేమి చేయుటకును వీలులేక 1782 మే నెలలో యింగ్లీషువారితో చేసుకొన్న సాల్బే ఒడంబడికను ధృవపరుప వలసివచ్చెను. ఈసమయములో హైదరాలీ చనిపోకుండ యుండియున్నచో నానాఫర్నవీసు తిరిగి యింగ్లీషువారితో యుద్ధమునకు దిగెడివాడే యని చెప్పవచ్చును. ఇతని మరణము మైసూరువారికేగాక మహారాష్ట్రులకును గొప్పనష్టదాయక మయ్యెను.

హైదరాలీకి మతమందు దురభిమానములేదు. ఇతఁడు పాషండుఁడుకాఁడు. ఇతఁడు మైసూరురాజ్యమును హరించినను ప్రజలయెడ గాని, తాను జయించినవారి యెడలగాని, యెట్టి క్రౌర్యములుగావించి యుండలేదు. వ్రాయను, చదువను, నేరనివాడయ్యును రాజ్యపరిపాలనయందు గొప్ప సామర్థ్యములను తెలివితేటలను జూపెను. మతదురభిమానముచే హిందువులయెడ క్రౌర్యము వహించలేదు. వీరిని ఉద్యోగమునుండి తీసి పారవేయలేదు. గొప్ప గొప్ప ఉద్యోగములకు వారినే నియమించుకొనెను. వారును యితనియెడ ద్రోహముచేయక భక్తివిశ్వాసములతోడనే యుండిరి. సేనలు యుద్ధరంగమందు పోరాడుచున్న సమయమున హైదరాలీ చనిపోవగ, యీ సంగతి శత్రువులకుగాని, తమసైన్యములకుగాని అప్పుడు తెలిసినచో అపాయము వచ్చునను తలంపుతో దగ్గర నున్న పూర్ణయ్య, కృష్ణరావు అను హిందూమంత్రులిద్దరు యీ రహస్యమును పైకి పోనీయక దూరమందెక్కడనోవున్న కొడుకు టిప్పూ వచ్చువరకు దాచి యుంచిరి. ఈ సమాచారమును తక్షణమే బేగీరావు (ఒంటె) టపామీద కొడుకుకు పంపించి అతడు వచ్చువరకు హైదరాలీశవమును తైలద్రోణిలో భద్రపరచి, ఏదో విలువగల సామగ్రిని బంగీకట్టి పంపించుచున్నట్లు రహస్యముగ కోలారుకు పంపించి వేసిరి. ఈ మరణవార్త మంత్రులెంత రహస్యముగ యుంచినారంటే చాలరోజుల వరకు యీ సంగతి యింగ్లీషువారికిగాని, హైదరాలీసేనలకుగాని, తెలియనే తెలియ లేదు. సేనలన్నియు మామూలుగ పడమటినైఋతువు నడచుచునేయుండెను. హైదరాలీ జబ్బుగనుండి చుట్టుకప్పబడిన ఒక మేనాలో యీ సైన్యముల వెంటవచ్చు చున్నట్లే యామంత్రులు నాటక మాడించిరి.

హైదరాలీ గుణగణములు

హైదరాలీ రణరంగమందు మహాయోధుడయ్యు, గొప్ప అశ్వికుఁడయ్యు, ఖడ్గ విహారమందును, ఫిరంగులు కాల్చుటయందును, అనన్యసామాన్య ప్రజ్ఞగలవాడయ్యును, ప్రజలను వశపరచుకొని నడిపింపగల నాయకుడయ్యు, రాజ్యపాలనము దీక్షతో సాగింపగల నేర్పరియయ్యు, ఉత్తమరాజనీతిజ్ఞున కుండవలసిన దూరదృష్టి యందితడు కొరతవడియుండెను. నానాఫర్నవీసు చాపిన స్నేహహస్తము నితఁడు సకాలమున గట్టిగ స్వీకరించకపోవుటయందును, పరాయి దేశస్థులగు పరాసువారి సైనికసహాయము నాశ్రయించి, వారినినమ్మి, తనసేనలో వారికి గొప్పపదవులనిచ్చుట

యందును, యీ దూరదృష్టి లేని లోపము హైదరాలీయందు స్పష్టముగ గాన్పించు చున్నది. తాను నమ్ముకొన్న ఫ్రెంచివారు యితని కెన్నడును అదనుకు సహాయము చేసి యెరుగరు. రానురాను, వీ రెట్లు ద్రోహులై తనరాజ్యమును కూలద్రోసిరో తన కొడుకు టిప్పుసుల్తాను కాలములో స్పష్టము గాగలదు. యోధుడుగ ఆకాలమున హైదరుకు సాటియెవ్వరును లేరని చెప్పవచ్చును. ఈతడు యుద్ధరంగమున నిలువబడి నప్పుడు అనన్యసామాన్యమగు ధైర్యస్థైర్యముల జూపెను. వ్యూహరచనయందు యెప్పటికప్పుడు అతనికి అపూర్వమగు ఊహలు పుట్టుకొని వచ్చుచుండెను. ఓడిపోయి నప్పుడు నిరుత్సాహమాతని కెన్నడును లేదు. యుద్ధకార్యములందు హైదరాలీ యూరోపియన్ పద్ధతుల ననుకరింపబూనెను. ఆకాలములో ఇండియాసేనలలోగల లోపముల నతడు కనిపెట్టెను. ఈ లోపమును తీసివేయుటకై అతడు తన సేనల నన్నిటిని యూరోపియను సేనలపక్కిని తరిఫియతు చేయించెను. ఇందుకై యితడు ఫ్రెంచివారి సహాయమును అంత ఆప్యాయనముతో గోరుకొనుచుండెను. తన రాజ్యపు కోస్తానుగూడ సంరక్షించుకొనుట కితడు పూనుకొనెను. ఇందుకై యిత డొక నౌకాదళమునుకూడ తయారుచేసెను. ఆరోజులలో యిండియాలో నౌకా దళము పెట్టుకొనిన దేశీయరాజులలో యీతడొక్కడే యుండెను. యీ కాస్త నౌకాదళమును తదుపరి, ఇంగ్లీషువారు నాశనముచేసిరి.

హైదరు శివాజీలకుతారతమ్యము.

శివాజీ, హైదరు లిరువురు నిశానీదారులనియు, యిరువురును గొప్పయోధు లనియు, చెప్పుటలోదప్ప యితరవిషయములలో వీరిరువురిని పోల్చు టకు వీలులేదు. హైదరు రాజ్యాపహారి. శివాజీకాడు. హైదరు రాజ్యాపహారియగుటచే ఆతడుదానిని నిలువబెట్టుకొనుటకై పరాయి దేశస్థుల నాశ్రయించవలసి వచ్చెను. ఫ్రెంచివారి సైనికసహాయమే లేకపోతే హైదరు అంతపైకి వచ్చెడివాడుకాడు. శివాజీ రాజ్యాపహారికాక తన స్వప్రజల శక్తి సామర్థ్యములచే ఒకమహారాజ్యమును స్థాపించి దానికితాను మకుట ప్రాయుడయ్యెను. హైదరాలీకి ఉత్తమరాజనీతిజ్ఞత కొరవడియుండెనని నిదర్శన పూర్వకముగా ఇదివరకే చెప్పియుంటిమి. ఈ విషయములో శివాజీకిని హైదరుకును పోలికయేలేదు. ఆఖరుకు నానాఫడ్నవీసుతో పోల్చుటకుగూడ వీలులేదు. హైదరు స్వతంత్ర రాజ్యస్థాపకుడుగాక కేవలము రాజ్యాపహారియగుటయే బహుశః ఇట్టి లోపమునకు మూలకారణమని చెప్పనొప్పును. ఇతడు మోటబలముచేతనే పైకివచ్చెను గాని, న్యాయము, ధర్మము ఇతనియందు లేదు. న్యాయబలమునకు భుజబలమును అనుసంధించుటయే ఉత్తమరాజనీతిజ్ఞత యనబడుచున్నది. ఇట్టి అనుసంధానము హైదరునందు లేదు. ఇతడు మైసూరురాజుల తాలూకు హక్కులను న్యాయముగగాక బలాత్కారముగ తనకాళ్లక్రింద వేసి మట్టగించి, పైకివచ్చినాడు. కాబట్టి సహజముగ యితనికా ఉత్తమరాజనీతిజ్ఞత యుండుట కవకాశము లేకపోయెను. హైదరాలీది

నడుమంత్రపుసిరి. ఇతడు రాజ్యాపహారి. దోపిడిగాడు. కాని, శివాజీ అట్టివాడుకాడు. ఇందునుగూర్చి రనడేగా రిట్లువ్రాసిరి.

"మైసూరులో హైదరు, టిప్పూలయొక్కయు, హైదరాబాదులో నైజాముల్ ముల్కుయొక్కయు, అయోధ్యలో సుజాఉద్దౌలా యొక్కయు, బెంగాలులో ఆలివర్దిఖానుయొక్కయు, పంజాబులో రణజిత్‌సింగుయొక్కయు, భరతపురములో సురాజ్‌మాల్‌యొక్కయు జీవితచర్యలకును మహారాష్ట్ర రాష్ట్రకూటమును నిర్మించుటయందు తోడ్పడిన ప్రఖ్యాతనాయకుల జీవితచర్యలకును, గల భేదమును చూడలేనివారు మహారాష్ట్ర చరిత్రను సరియైన దృక్పథమునుండి పఠింపలేనివారగుచున్నారు. దాని నిజతత్వమును గ్రహింపజాలని వారగుచున్నారు......ఔరంగజేబు మరణానంతరము స్వతంత్రులమని తలయెగగట్టిన నానారాష్ట్రములలోని సుబేదార్లవలెగాక మహారాష్ట్ర రాజ్యస్థాపకుడగు శివాజీయు, అతనితరువాత వారునుకూడ మొగలురాజ్యభానుడు మధ్యందిన మార్తాండుడై వెలుగుచున్న తీవ్ర నిదాఘకాలమందే రెండు పురుషాంతరములకాలము యేకరీతిగా మొగలు సామ్రాట్టుల తాకిడులకు చెక్కుచెదరక ఎదురుతన్ని నిలచిరి. పైన పేర్కొన్న సుబేదారులు సాహసిక యోధులు. వెనుకనుండి ఎట్టిజాతీయ భావబలముచేగాని ప్రేరితులైనవారు కారు. అందుచే తాము లేవదీసుకొన్న రాజ్యములు తమతోనే అంతరించినవి" (కాని, శివాజీ రాజ్యమట్లుపోలేదు.)

శివాజీకిని, హైదరాలీకిని, గల నిజమైన తేడాను రెనడేగారు పై వాక్యములలో చక్కగ స్పష్టపరచిరి. శివాజీని మహారాష్ట్ర ప్రజలు తామెంతకాలము నుండియో ఎదురుచూచుచున్న అవతారపురుషునిగ ఎంచుకొని పూజించిరి. కాని, హైదరు తన తెగువచే పైకివచ్చి పరాయిదేశస్థుల మద్దతుచే తనయధికారమును యిష్టములేని ప్రజలపై బలాత్కారముగ వేసి రుద్దవలెనని జూచెను. ఇది యిరువురకుగల గొప్ప తేడా.

ఇంగ్లీషువారితో తానప్పుడు సాగించుచున్న యుద్ధపర్యవసానమును చూడకుండగనే హైదరు మరణించెను. తరువాత ఇతనికొడుకు టిప్పు యుద్ధమును జయప్రదముగ ముగించెను. హైదరీ సమయమున చనిపోకుండా జీవించియేయుంటే, నానాఫర్నవీసు మాధవరావుసింధియాను లొంగతీసుకొనివచ్చి, మహారాష్ట్ర రాష్ట్రకూటమునంతను తిరిగి దిట్టముగ బలపరచి, ఇంగ్లీషువారిమీదికి ధ్వజమెత్తి తప్పక వారి హతమార్చియుండుననుటకు సందేహములేదు. కాని, దైవవిధి అన్యత్ర యున్నప్పుడు, యావన్మంది భారతప్రజలు ఆంగ్లదాస్యాగ్నియందు బహుకాలము తప్తము కావలసియున్నదని దైవము మూడుపంక్తుల లిఖించియుండగ ఎంతటి ఘనుడైనను మానవమాత్రుడగు నానాఫర్నవీస్ ఏమిచేయగలడు? నానాఫర్నవీసు సమస్తమును చేయగలిగెనుగాని దైవవిధికి మెదురీద లేకపోయెను. అంతే! అతని లోపము.

# బ్రిటిష్ మహాయుగము

## పంద్రెండవ అధ్యాయము



### నైజాము ఖండము, నైజాము రాజ్యోదయము.

ఔరంగజేబు మరణానంతరము కేంద్రప్రభుత్వముపై తిరుగుబాటుచేసిన రాజప్రతినిధులలో నైజాము-ఉల్-ముల్కు మొదటివాడు. ఇతనినిచూచి తక్కినవారును తిరుగుబాటు సాగించి, కాలక్రమమున మొగల్ సామ్రాజ్యమును ధ్వంసముచేసిరి. నైజాము-ఉల్-ముల్కు ధైర్య సాహసములచేగాక, కేవలము ద్రోహకార్యములచే, స్వతంత్రుడయ్యెను. నైజామురాజ్యము ఒక్క ఉదారకార్యమునుగాని, రణప్రావీణ్యమును జూపుకార్యమును గాని, చేయకపోయినను, తన ద్రోహకార్యములవల్ల బ్రిటిష్‌యిండియా చరిత్రలో చాల ప్రాముఖ్యమునకు వచ్చుటచే దాని పూర్వచరిత్ర నిట క్లుప్తముగ వివరించుట అవసరము.

మొగల్ సామ్రాజ్య చరమదశ.

ఔరంగజేబు మరణానంతరము వచ్చిన పాదుషాలు దుర్బలులగుటచే ఆఖరు రోజులలో రాజ్యాధికారమంతయు అబ్దుల్లాఖాన్, హుస్సేన్ ఆలీఖాన్ అను యిరువురు సయ్యదుసోదరుల వశముననుండెను. వీరు పాదుషాకు మంత్రులైయుండి మొగల్ సామ్రాజ్యము విచ్ఛిన్నముగాకుండ పట్టుకొని రావలెనని యెంతో తంటాలుపడు చుండిరి. ఈవిషయములో వీరు నిష్కలంక చరిత్రులనియే చెప్పవలెను. అయితే, ఢిల్లీపాదుషా అధికారమును త్రోసివేసి తాము స్వతంత్రులు కాదలచిన నైజాము మున్నగువారికి వీరనిన కంటకముగ నుండెను. కాబట్టి, యిరువురు సోదరమంత్రులను ముందుగ త్రోసివేయుటకు వారొక గొప్పకుట్రపన్నిరి. ఈకుట్రకు నైజాము నాయకుడు. ఎట్టకేలకు యీ యిరువురుమంత్రులలో ఒకనిని చంపించియు, ఒకనిని చెరసాలలో త్రోయించియు, కుట్రదారులు తమపనిని నెరవేర్చుకొనిరి. మొగలాయి దర్బారులోనున్న ప్రముఖులలో పరస్పర కలహములగూడ కల్పించిరి. ఇదంతయు నైజాము-ఉల్-ముల్కు చేసినపనియే. మహారాష్ట్రులకు కన్నుగీటి మొగలాయిల మీదికి ఉసుగొలిపినదియు, పరిష్యానుండి నాదర్‌షాను ఢిల్లీపైకి రప్పించినదియుగూడ యీ నైజాము-ఉల్-ముల్కే. దక్షిణహిందూస్థానపు కాట్లాటలలో చీటికిమాటికి పరాయిదేశస్థులగు ఇంగ్లీషువారినో, ఫరాసువారినో, తనకు సహాయముగ రమ్మని పిలుచుచు, క్రమక్రమముగ వారు దేశములో వ్రేళ్లు పాతుకొనిపోవుటకు తోడ్పడి

నదియు యీ నైజాము—ఉల్—ముల్క్. ఇట్టి పురుషుని పూర్వోత్తరము లెట్టివో కొంచెము తెలిసికొనుట అవసరము.

నైజామ్ - ఉల్ - ముల్క్ - మొగల్ రాజ్య నాశకుడు.

నైజాము-ఉల్-ముల్క్ తురానీవంశస్థుడు. ఇతడొకప్పుడు రోహిల్ ఖండము లోనున్న మొరాదాబాదుకు గవర్నరుగ నియమింపబడెను. ఔరంగజేబు మునిమనుమడు 'ఫెరోకుసియార్' అనునతడు పాదుషాగానున్న కాలములో పైన పేర్కొనబడిన యిరువురు సయ్యదుసోదరులును దర్బారులో చాలపలుకుబడిని సంపాదించుకొనిరి. అన్న అబ్దుల్లాఖాన్ ప్రధానమంత్రి (వజీర్) అయ్యెను. తమ్ముడు హుస్సేన్ ఆలీఖాన్ దక్కనుకు రాజప్రతినిధియయ్యెను. ఇతడక్కడ రాజప్రతినిధిగనున్నన్నాళ్లు మహారాష్ట్రులఆటలక్కడ నేమియుసాగలేదు. ఔరంగజేబు మరణించిన 10, 12 సం॥లలోనే మహారాష్ట్రులు దక్కనులోనున్న కాండెష్, మాల్వారాష్ట్రములలో "చౌతు" వసూలుచేసుకొను హక్కును సంపాదించుకొని యుండిరి. ఈ వసూలు విషయములలో మహారాష్ట్రులకునూ, యీ రాజప్రతినిధి హుస్సేన్ ఆలీకిని చాలా సార్లు తగాదాలు వచ్చుచుండెను. కాని, ఢిల్లీలో సయ్యదుసోదరులను త్రోసివేయ వలెనను కుట్రలు ప్రబలముగ నుండుటచేతను, నైజాము - ఉల్ - ముల్క్ కూడ మొరాదాబాదునుండి బయలుదేరి పెద్దపరివారముతో ఢిల్లీలో మకాముపెట్టి యీ కుట్ర నడిపించుచుండుటచేతను, తన అన్నతక్షణమే రమ్మని కబురుపంపుటచేతను, హుస్సేన్ ఆలీఖానుడు ఢిల్లీ వెళ్లవలసివచ్చెను. కొంతమంది స్వార్థపరులు దుర్బలుడగు చక్రవర్తిని లోబరుచుకొని వజీరుపార్టీపై ధ్వజమెత్తిరి. అంతట వజీరుపక్షమువారికిని చక్రవర్తిపక్షమువారికిని, ఢిల్లీవీధులలో హోరాహోరిని పోరాటములు జరిగెను. వజీరుసేనలు జయమందెను. చక్రవర్తి పారిపోయి జనానాలో దూరెను. వజీరు తాలూకుసిపాయి లంత జనానాలో జొరబడి చక్రవర్తిని బయటికి లాగి చీకటి కొట్టులో పడవేసి బిగించిరి !

అసమర్థుడును, యింద్రియలోలుడునునగు చక్రవర్తి నిట్లు లాగివేసినను మంత్రి అబ్దుల్లాఖాన్ సింహాసన మాక్రమింపదలంచలేదు. ఆతడప్పుడట్లు చేస్తేనే బాగుండెడిదేమో. తా నప్పుడు సింహాసనమెక్కి తన సామర్థ్యముచే దేశమందు శాంతి భద్రతల గాపాడియున్నచో మొగల్ రాజ్యమింకను కొంతకాలము నిలిచి యుండెడిదేమో. ఇంగ్లండులో 'చార్లెస్' రాజును శిరచ్ఛేదన మొనర్చినపిదప 'క్రామ్‌వెల్' రాజ్యాధికారమును వహించి దేశమును కాపాడినట్లు యీ సమయమున అబ్దుల్లాఖాన్ కూడా అటుల చేసియుండిన బాగుండెడిదేమో. కాని, అతడట్లు చేయక, తైమూరు వంశీకుడగు "మహమ్మద్‌షా" యను ఒకానొకనిని నామకః సింహాసనముమీద కూర్చుండపెట్టి, రాజ్యాధికారమును మాత్రము తనచేతిలో

నుంచుకొని నడిపింపసాగెను. హిందూప్రజలా కాలమున ఔరంగజేబుచే విధింప బడిన తలపన్నువల్ల మహమ్మదీయరాజ్యమునెడ విముఖులగుచున్నారను సంగతిని యితడుకనిపెట్టి కొత్తచక్రవర్తిచేత ఆపన్నును తీసివేయించెను. ఇదిచాల దూర దృష్టితో చేసినపనియని చెప్పకతప్పదు. ఈతడేగనుక చిరకాల మీామంత్రిత్వములో నుండియుండినచో యిండియాలో మహమ్మదీయరాజ్యమింక కొన్నాళ్లపాటుండెడిది. కాని, నైజాము - ఉల్ - ముల్క్ ధూమకేతువై పుట్టగ ఆ రాజ్యమెట్లునిలచును?

1720 సం॥లో మంత్రి అబ్దుల్లాఖాన్ నైజాము—ఉల్—ముల్క్‌కు అపకార మేమియుచేయక మాల్వాకు రాజప్రతినిధిగ పంపెను. ఈతడక్కడచేరి సేనలను కూర్చుకొని, చుట్టుపట్టుల రాజ్యములమీాదపడుచూ, తుదకు ఢిల్లీచక్రవర్తిమీాదికే ధ్వజమెత్తి, నర్మదానదినిదాటి వచ్చుచుండెను. అప్పు డీసేనల నెదిరించుటతప్ప వేరొకమార్గము మంత్రి అబ్దుల్లాకు కనిపించలేదు. అప్పుడు ఉభయసేనలకు చాల నెలలు పోరాటములు జరిగెను. ఆఖరుకు సయ్యదుసోదరులిరువురిలో తమ్ముడు హుస్సేనాలీ యుద్ధరంగమందు చనిపోయెను. అన్న మంత్రిఅబ్దుల్లా నైజాం - ఉల్ - ముల్క్‌కు ఖైదీగచిక్కెను. ఇది మొగల్‌సామ్రాజ్యమున కెంతయు అరిష్టదాయక మయ్యెను. నైజాము—ఉల్—ముల్క్ నక్షత్రము పైకెక్కివచ్చెను. హుస్సేన్ ఆలీ చనిపోవుటచే, నైజామ్—ఉల్-ముల్క్ తానే దక్కనుకు నైస్రాయిగ ప్రకటించు కొనెను. పిమ్మట 1722 సం॥ జనవరి 18-వ తేదీన ఢిల్లీకివచ్చి, పాదుషానుదర్శించి, చేయవలసినమర్యాదలను చేసెను. పాదుషాయు ప్రీతుడై యితనిని వజీరుగ (ప్రధా నామాత్యునిగ) నంగీకరించి తగుమన్ననల జేసెను. ఇది 1722 సం॥ ఫిబ్రవరి 13-వ తేదీన జరిగెను. ఎనిమిదిమాసములైనపిమ్మట గుజరాతురాష్ట్రమునకు సైతమితడు 1722 సం॥ అక్టోబరు 15-వ తేదీన రాజప్రతినిధిగ నియమింపబడెను.

ఈరీతిగ నైజాము ఉల్ ముల్క్ ప్రభ అఖండముగ వెలిగిపోవు చుండెను. ఇతడిప్పుడు మొగల్‌సామ్రాజ్యమున కంతకు ప్రధానామాత్యుడేకాక గుజరాతు, మాల్వా, దక్కనులకు రాజప్రతినిధికూడ యయ్యెను. ఇట్టియున్నతస్థితికి వచ్చియు యితడు సామ్రాజ్యమునకు చేసినమేలు కించిత్తయిననులేదు. గొప్పపదవు నైతే ద్రోహముచేసి సంపాదించుకొనెనుగాని, వానిని సక్రమముగ నిర్వహించు బుద్ధినైశద్యము, రాజనీతిజ్ఞత యితనికేది? ఈపదవుల నిర్వహించుటకువలయు శక్తి సామర్థ్యములలో ఒక్కటికూడ యితనియందు లేకుండెను. దర్బారులోని స్తోత్ర పాఠకులెల్లరు యితనిని మొగముమెదుటపొగడుచు, మొగమటుత్రిప్పగనే కడుపులు పిసుగుకొని నవ్వుచుండిరి! ఎగతాళి చేయుచుండిరి. మెటికలు విరుచుచుండిరి. ఇట్టి స్థితిలో,యీతడేమియు చేయజాలక వజీరుపనికి రాజీనామాయిచ్చి దక్కనుకు అక్కడ వచ్చి అల్లరులుచేయసాగెను. ఇతనికి చేతనైనది ఇదియొక్కటే. రాజ్యాధికారము చేతికిస్తే దానినినిర్వహించుటకు చేతగాక, దక్కనువచ్చి అక్కడ సామ్రాజ్యముపై

అల్లరులు సాగించినాడు. ఇతడు ప్రధానామాత్యపదవికి రాజీనామానిచ్చివచ్చినను, ఢిల్లీ పాదుషా యితనికెన్నోబిరుదములను, బహుమానములను ఒసంగి సన్మానించెను. అయినప్పటికి, యితనిబుద్ధి యెట్లుమారును? ఇతడు 1724 సంllలో దక్కనుకువచ్చి అల్లరులు సాగించెను. గుజరాతులో తన మేనమామకు ఉత్తరమువ్రాసి, అతనిచే అక్కడ తిరుగుబాటుచేయించి, ఢిల్లీదర్బారులోని ప్రముఖులతాలూకు జాగీరులన్నిటిని కొల్లగొట్టించెను. ఈవార్త ఢిల్లీకి తెలియగనే పాదుషా గుజరాతుపైకి కొంతదండును పంపి తిరిగి కొంతశాంతిని నెలకొల్పెను. నైజాము-ఉల్-ముల్కుకు లోగడయిచ్చి యున్న మాల్వా రాజప్రతినిధిత్వమునుతీసివేసి దానిని "రాజాగిరిధర్" అను హిందువునకిచ్చెను.

మాల్వా, గుజరాతులు మహారాష్ట్రుల వశమగుట.

దీనికి నైజాము-ఉల్-ముల్కుకు కోపమువచ్చి మహారాష్ట్రులను పిలిచి, వారిచేత మాల్వాపై దండెత్తించెను. మహారాష్ట్రులు బాలాజీ విశ్వనాథుని పీష్వాగిరిలో యీ మాల్వాపై దండెత్తి, దానినాక్రమించుకొనిరి. బాలాజీ విశ్వనాథుడంతట కొత్తగ సంపాదించుకొన్న యీ మాల్వా రాజ్యమును రెండు భాగములుగ చీల్చి ఉత్తరభాగమును తనచెప్పులుమోసిన దానోజీ సింధియాకును, దక్షిణభాగమును మలహరిరావు హోల్కారునకును యిచ్చెనను సంగతిని వెనుక మనము తెలిసికొనియే యుంటిమి. మొగల్ సామ్రాజ్యమునుండి ఒక ఖండము యీరీతిగ ఊడిపోవుట కిదియే ప్రారంభము. ఇదేసమయమున మహారాష్ట్రులు గుజరాతుపైకూడ దండువెడలి దానిని స్వాధీనపరచుకొనిరి.

మాల్వా, గుజరాతు రాష్ట్రములకు ఢిల్లీ పాదుషా తరఫున ప్రతినిధులుగ నున్న రాజాగిరిధర్ మున్నగు హిందూప్రముఖులు యీ మరాటీ దండయాత్రలను తీవ్రముగ యెదిరించిరి. వీరు ఢిల్లీ పాదుషా కెంతమాత్రమును ద్రోహము చేయలేదు.* మహమ్మదీయ ప్రభువునకు ద్రోహము చేసినవాడు మహమ్మదీయుడగు నైజాము-ఉల్-ముల్కేగాని హిందువులగు రాజాగిరిధర్ మున్నగువారుకారు. ఇది విచిత్రమైన సంగతి! "పూర్వము రోమకచక్రవర్తి ఫ్రాంసు దేశముపై దండెత్తివచ్చినప్పుడు ఆతనినెదిరించిన ఫరాసు ప్రజల మనుమలే తదుపరికొన్నాళ్లకు రోమకమహాసామ్రాజ్యములో సేనాపతులై, రాష్ట్రపాలకులై రోమక మంత్రివర్గములోనికి

* మాల్వా వైస్రాయియగు గిరిధరుడు మహారాష్ట్రులను తీవ్రముగ యెదిరించుటలో తన ప్రాణములగూడ గోల్పోయెను. తక్షణమే యితని బంధువుడు "రాజా దయాబహదూర్" అనునతడు సైన్యాధిపతియై మరల మహారాష్ట్రులకు ఊపిరి ఆడనీయలేదు. తుద కితడును హోరాహోరి పోరాడి రణరంగమందు మరణించెను. "నాప్రాణమున్నంతవరకు మహారాష్ట్రుల నిక్కడ అడుగు పెట్టనీయను. కాని, నాతరువాతవారు హిందూస్థానమును ముంచివేయునట్లున్నారని" యితడెంతో భక్తివిశ్వాసములతో పాదుషాకే వ్రాసెను.

గూడ గైకొనబడిరి. వారి యధికారవాంఛ రోమకసామ్రాజ్యపు శాంతిని భంగ పుచ్చుటకు మారుగ, తత్ సామ్రాజ్యమును యెక్కువ బందోబస్తుగ కాపాడి, దానిని గొప్పదానినిగ జేయుటకే తోడ్పడె'' నని రోమక సామ్రాజ్య చరిత్ర కారుడగు గిబ్బన్ మహాశయుడు వ్రాయుచున్నాడు. ఇట్లే హిందువులు మొదట మొగల్ దాడుల నెదిరించినను పిదప మొగల్ సామ్రాజ్యములో సేనాపతులై, రాష్ట్రపాలకులై మహామంత్రిశేఖరులై, తద్రాజ్యమును దిట్టపరచి, ఉన్నతస్థితికి తెచ్చుట కెంతయేని తోడ్పడిరి.

నాదర్ షా దండయాత్ర- సింధు, కాబూల్, పంజాబులు నాదర్ షా వశమగుట.

మొగల్ సామ్రాజ్యముపైకి మహారాష్ట్రుల నిట్లు పురిగొల్పి దానినుండి రెండు పెద్ద ఖండముల నూడబెరికించుటయేగాక, నైజాము-ఉల్-ముల్క్ పరిషియా రాజగు నాదర్ షాను గూడ ఢిల్లీపైకి దండెత్తించెను. నాదర్ షా సేనలు కాబూలు రాష్ట్రముమీదికి వచ్చి పడెనను వార్త తెలియగనే ఢిల్లీ పాదుషా ఆసేనల నెదిరించుటకై నైజాము-ఉల్-ముల్క్‌ను పొమ్మనెను. కాని, యితడట్లుచేయక ఢిల్లీలోనే అటుయిటు తిరుగుచూ కాలక్షేపము చేయజొచ్చెను. నాదర్ షా సేనలువచ్చి పాదుషా సేనలమీద పడినప్పుడుగూడ యితడు కదలలేదు! నాదర్ షా ఢిల్లీలో చేసిన భీభత్సమునంతను యితడు లోలోన కులుకుచు చూచుచుండెను! ఢిల్లీ పాదుషాకు గలిగిన పరాభవమునకు యితను లోలోన హర్షించుచుండెను. నాదర్ షా 1738 సం॥ మేనెల 15-వ తేదీని ఢిల్లీని వదలి వెళ్లెను. ఈదండయాత్రవల్ల నాదర్ షా మొగల్ సామ్రాజ్యములో చేరియున్న సింధు, కాబూలు రాష్ట్రములను, పంజాబులో కొంత భాగమును మొగల్ సామ్రాజ్యము నుండి ఊడబెరుకుకొని తనరాజ్యములో కలుపుకొనెను.

నైజాం, బెంగాల్ ఖండములు మొగల్ సామ్రాజ్యమునుండి ఊడిపోవుట.

అంతట నైజాము-ఉల్-ముల్క్ దక్షిణమునకు వచ్చివేసి, రాజధానిని ఔరంగబాదునుండి హైదరాబాదుకు మార్చుకొని, తాను స్వతంత్రుడనని ప్రకటించుకొనెను. ఈతనిని చూచి బెంగాలులోనున్న ఆలివర్దీఖాను యిట్లే స్వతంత్రుడనని చెప్పుకొనెను. ఈ రీతిగ నైజాము-ఉల్-ముల్క్ చేసిన స్వామిద్రోహమువల్ల మొగల్ సామ్రాజ్యము బ్రద్దలైపోయి, మాల్వా, గుజరాతు, కాబూలు, సింధు, పంజాబు, దక్కను, బెంగాలు రాష్ట్రములు వేర్వేరు ఖండములుగ ఊడి, యీావలబడెను. నైజామ్-ఉల్-ముల్క్ సామ్రాజ్యవిచ్ఛేదమునకు ధూమకేతువయ్యెనని చెప్పుట కేమి సందేహము?

1747 సం॥లో ''మహమ్మద్ షా'' యనుపేరుగల ఢిల్లీ పాదుషా చని యెను. అతని తరువాత అతని పెద్దకొడుకు 'అహమ్మద్ షా' పాదుషా యయ్యెను.

1748. నైజామ్-ఉల్-ముల్క్ మరణం-ఇంగ్లీషు వారి పంట.

మహమ్మదుషా సింహాసనమెక్కు నాటికి ఢిల్లీ సామ్రాజ్యపు పొలిమేరలు చెక్కుచెదరక ఔరంగజేబు నిర్ణయించినట్లే నిలిచియుండెను. కాని, మహమ్మద్‌షా కాలములో నైజాము-ఉల్-ముల్క్ చేసిన స్వామిద్రోహపరంపరలవల్ల యితని మరణకాలమునకు మొగల్ సామ్రాజ్యము చాలవరకు ఖండఖండములుగ బ్రద్దలైపోయెను. పొలిమేరలు తారుమారాయెను. మహమ్మదుషా పాదుషా చనిపోయిన మరుసంవత్సరమే 1748 సం॥లో నైజాము-ఉల్-ముల్క్‌కూడ 'పాపీచిరాయు' వన్నట్లు 104 ఏండ్లు బ్రతికి చచ్చెను. ఇతని మరణానంతరము నైజాము పదవికి వారసత్వపు తగాదాలు వచ్చెను. ఈ తగాదాలలోనే ఆంగ్ల పరాసులు ప్రవేశించుట తటస్థించినది. ఆ సంగతి నిదివరకే కొంత వివరించియుంటిమి.

నైజాము-ఉల్-ముల్క్—హైదరాలీలకు తేడా.

నైజాము వంశస్థాపకుడగు నైజాము-ఉల్-ముల్క్ చరిత్ర యిట్టిది! ఈ చరిత్ర సజ్జనుల మనస్సున కెక్కునదిగలేదు. మైసూరు ప్రభువైన హైదరాలీ చరిత్రకునూ, యీ నైజాము చరిత్రకునూ, చాలతేడా కలదు. హైదరాలీ ధైర్యసాహసములు గల యోధుడు. తనస్వసామర్థ్యముచే యితడు పైకివచ్చెను. కాని, నైజాము-ఉల్-ముల్క్ కేవలము స్వామిద్రోహమువల్లనూ, నీచమగు కుచ్ఛిత ప్రవర్తనవల్లను పైకివచ్చెను. హైదరాలీకి గల బుద్ధి వైశద్యముగాని, భుజబల సామర్థ్యములుగాని, నైజాము-ఉల్-ముల్క్‌కు లేవు.



# బ్రిటిష్ మహాయుగము

## పదమూడవ అధ్యాయము.



### మాక్ఫర్సన్ హయాము.—(1785-86)

ఇంగ్లీషువారికి కాలము, కర్మము కలిసి వచ్చుట.

ఆంగ్లేయులు భరతవర్షములో రాజ్యస్థాపనకు బూనుకొను నాటికి కాలము, కర్మము వారికెట్లు అనుకూలముగ కలసివచ్చెనో యీ వెనుకటి మూడధ్యాయములలో చెప్పిన మొగల్ సామ్రాజ్యవిచ్ఛిన్నకథనమువలన బోధపడగలదు. అదివరకు బలిష్ఠముగను, ఏకముగనుండి, మున్నూరేండ్లు దాదాపు భరతవర్షమునంతను ఏకచ్ఛత్రాధిపత్యముగ నేలిన మొగల్ సామ్రాజ్యము కాలపురుషుని కరాఘాతముచే నెట్లు ఖండఖండములుగ—మహారాష్ట్ర, అయోధ్య, వంగ, నిజామ్, కాబూల్, పాంచాల, మాళవ, ఘూర్జర, సింధు—యిత్యాదిభిన్నభిన్న ఖండములుగ—బ్రద్దలై పోయెనో చెప్పియుంటిమి. ఒకదానికొకటి సంబంధములేక, తెగిన హారములోని ముత్యములట్లు, చెల్లాచెదరుగపడిన యీ ఖండముల నన్నిటిని క్రమముగ ఒక్కొక్కదానినే నోటవేసికొనుటకు పరాయిదేశస్థులగు ఆంగ్లేయులకు బహుసులభమయ్యెను. వంగఖండమును ఒకదశలో—అనగ పదేండ్లకాలములో—వారెట్లు నోటవేసుకొన్నదియు యీ గ్రంథము మొదటి ఆరుఅధ్యాయములలో వివరించియుంటిమి. తదుపరి, వారన్ హేస్టింగ్సు కాలములో—10, 12 యేండ్లలో మహారాష్ట్ర, మైసూరు, అయోధ్య, కాశీఖండములెట్లు ఊగింపబడెనో వివరించితిమి. రోహిలాఖండమెట్లు దగ్ధపటల మొనర్పబడెనో వింటిమి. ఆదికాలమునాడే ఆర్కాటు నబాబు ఆంగ్లేయుల చేతులలో పిట్టవలె యెట్లుచిక్కెనోకొద్దిగ తెలిసికొంటిమి. ఇక, క్రమక్రమముగ యివియన్నియు తదుపరివచ్చిన ఆయాగవర్నర్ జనరలుల హయాములలో నెట్లు యింగ్లీషువారి నోటపడుచూ వచ్చెనో రాబోవు అధ్యాయములలో వివరించెదము.

వారన్ హేస్టింగ్సు అనంతరము యెన్నికకువచ్చిన ఇంగ్లీషు గవర్నర్ జనరల్ "కారన్ వాలీసు." వారన్ హేస్టింగ్సు 1785 సం॥ లో ఇండియానుండి వెళ్లిపోయెను. 1786 సం॥ లో కారన్వాలీసు వచ్చెను. ఈ యిరువురికిమధ్య—కారన్వాలీస్ వచ్చి చార్జీ పుచ్చుకొనువరకు—కొన్నిమాసములు "సర్ జాన్ మాక్ఫర్సన్" అను నతడు ఆక్టింగు గవర్నర్ జనరలుగ పనిచూచెను. ఇతని కాలములో



మహమ్మదాలీ-కర్ణాటక నబాబు.

యూరపియన్ స్తోత్రపాఠకులచే అప్పులలో ముంచబడి, రాజ్యమును వారికి తాకట్టుపెట్టి, వారికి దాసుడైన నబాబు—359-వ పేజీ.



ఆర్కాటులోని కర్ణాటక నబాబుల రాజమందిరము.

358B

అంతగా చెప్పుకోతగిన విశేషములేమియు లేవుగాన యీ యధ్యాయమును బహు
కుప్తములో ముగించెదము.

మాక్ఫర్సన్ స్కాట్లండు దేశస్థుడు. ఇతనికి ఆంగ్ల సాహిత్యమందు వచన రచనయందు పాండిత్యముగలదు. ఇతడు మొట్టమొదట 1767 సం॥ లో కంపెనీలో గుమాస్తాగా మద్రాసుకువచ్చెను. ఇతడు మెల్లిగా ఆర్కాటు నబాబు దర్బారులో చేరెను. ఇతనికీ నబాబుకూ సంబంధ మెట్లు కలిగెనో చూడుడు. ఆ రోజులలో ఆర్కాటు నబాబు మహమ్మదాలీ అవస్థ పాపము యింగ్లీషువారి చేతులలో దుర్భరముగ నుండెను. ఈ నబాబు ప్రాపకమువల్లనే యింగ్లీషువారికి అసలు దక్షిణ హిందూస్థానమున కాలూని నిల్చుటకు ఆస్కారము దొరికినది. ఈ నబాబుకు వీరు తోడ్పడి సింహాసనమెక్కించిరి. అందుకు ప్రతిఫలముగా 4½ లక్షల మొహరీలు రాబడిగల పరగణాల నితడు కంపెనీ కిచ్చెను. కాని, యింగ్లీషువా రప్పటినుండియు యితనిని నిలువున దోచుకొన సాగిరి. చివరకితడు అప్పులపాలయ్యెను. తనదగ్గర నుండి డబ్బుగుంజుకున్న యింగ్లీషుదొరలే యితనికితిరిగి అప్పుపెట్టసాగిరి. రానురాను యీ అప్పులు లావై యితడు మునిగిపోవ సిద్ధముగ నుండెను. ఇందు చాలవరకు దొంగ అప్పులే. ప్రతి యింగ్లీషువాడువచ్చి యితనిని ముఖస్తుతి చేసియో మోసగించియో డబ్బు లాగుచుండెను. చివరకు 1771 సం॥ మార్చి 19 తేదీన అప్పుడు యింగ్లండులో రాజుగనున్న "మూడవజార్జి" కూడ యితనికి స్వహస్తముతో ఉత్తరముల్రాసి స్తోత్రము చేయసాగెను. ఈ రీతిగా యిండియాలోని రాజులకు తమ స్వదస్తూరితో ఉత్తరము వ్రాసిపంపిన యింగ్లాండురాజు లెవ్వరునులేరు. ఆ వుత్తరములోని కొన్నిభాగములనిట వివరింతుము.

కర్నాటక నబాబు అప్పులు—మాక్ఫర్సన్ సంబంధము.

"మీరు గత జులయిలో పంపిన ఉత్తరమును అందుతో మీరు పంపిన పలు విధములగు కానుకలును ఈస్టిండియాకంపెనీవారిద్వారా మాకు చేరినవి. మీ రందులో పంపిన మీయొక్కయు, మీ పిల్లలయొక్కయు, పటమును మే మెంతయో ఆనందముతో చూచుకొను చుందుము. మేము దానిని చూచుకొను చుండుటవల్ల, మీరు మా యెడ సదా చూపించుచూవచ్చిన ప్రేమను మా మనస్సుల కది యెల్లప్పుడు స్ఫురింపజేయు చుండును. ఇట్టిప్రేమను మీ సంతతివారుకూడ మాయెడ వంశపారంపర్యముగా చూపుచూవచ్చెదరను విషయములో మా కెట్టి సందియమును లేదు. అట్లే మా స్నేహమును మా రక్షణయు మీకు మీ వంశమువారికి, మావల్ల మా వంశము వారివల్ల పుత్రపౌత్ర పారంపర్యముగ సంక్రమించుచు రాగలదను విషయమును మేము గట్టిగ చెప్పగలము............

"మా స్నాకాదళమునకు సర్ రాబర్టు హార్లండు అను వారిని అధిపతిగా నియమించినాము. వారిద్వారా మీ కీ ఉత్తరమును పంపుచున్నాము. ఈ ఉత్తరమును

దానితోపాటు మాస్వంత ఆయుధాగారమునుండి యీ రెండు పిస్తోళ్లను మా దేశములో తయారైన యీ కొన్ని వస్త్రములను వారు మీకు బహుమతిగా యివ్వగలరు. మేముమీయెడపూర్వమువలెనే యెల్లప్పుడు చూపుచు నుండబోవు మర్యాదకు చిహ్నముగా మీరు వీనినిఅంగీకరింప గోరెదము. మాకు మీ యెడ యెట్టి గౌరవభావముకలదో యీ హార్లండుగారేమీకు చెప్పగలరు. వారు మాపేరిట చెప్పుదాని యందంతటను మీరు సంపూర్ణ విశ్వాసముంచ గోరెదను.......... సదా మీ శ్రేయోభిలాషి........... ఇక సెలవు''

ఈ విధముగా రాజుమొదలు రంగప్పవరకు యిగ్లీషు దొరలీ వెర్రిబాగుల నబాబును ఉబ్బవేసి డబ్బుగుంజి తుదకితని కొంపగూల్చి, అప్పులలోముంచిరి. కొత్తగావచ్చిన ప్రతి గవర్నరుకు ప్రతిఉద్యోగికి యితడు కానుకలు ముడుపులు చెల్లింపలేక చచ్చిపోయెను. అట్లు ఎవనికైన చెల్లించకపోతే వాడు వీడి కొంపతీసే వాడే! ఇట్టి భయోత్పాతముచే యీశ్వేతదేవతల నతడు హిరణ్య శ్రాద్ధములతో నిత్యము తృప్తిపరుపవలసి వచ్చుచుండెను. ఒకసారి 'మెకార్టనీ' యను నతడు గవర్నరుగ వచ్చినప్పుడు నబాబతనిని మామూలుప్రకారము తనమహలు కాహ్వానించెను. అతనిని తగుమర్యాదచేసి నబాబు మామూలు ప్రకారము 30 వేల నవర్నలను పళ్లెములోపోసి గవర్నరు ముందుపెట్టెను. అతని వెంటవచ్చిన పరివారమునకును చేతినిండ పంచిపెట్టబోయెను. పాప మీ మామూళ్ల గొడవ యేమియు కొత్తగవచ్చిన గవర్నరుకు తెలియదు. అత డీ నవర్నల కుప్పచూడగనే నిర్ఘాంత పోయెను. "ఇదేమిటి?" అని తెల్లబోయి అడిగెను. "ఏమీ లేదు, కొత్తగావచ్చిన గవర్నరు ప్రభువుల నందరిని యీరీతిగా సత్కరించడం మాకు మర్యాద, ఇది మామూలు. ఇంతవర కెవ్వరు దీనినికాదని త్రోసివేయలేదు. కాబట్టి, తాముకూడ ఆప్రకారమే అనుగ్రహించవలసిన"దని చేతులు నలుపుకొనుచు విన్నవించుకొనెను. కాని, మెకార్టినీ గవర్నరు యీసొమ్మును పుచ్చుకోననెను. అంతట ప్రక్కనున్న వారికందరికీ గవర్నరుమీద బలేకోపమువచ్చెను. మామూలు నితడిట్లు పాడుచేయుచున్నాడు అని వారందరు లోలోన యితనిమీద పండ్లు పటపట కొరికిరి.

కాబట్టి, యీయుదంతమువల్ల యేమి తెలియుచున్నది? ఏ గవర్నరుకుగాని, ఏ ఉద్యోగికిగాని, యీరీతిగా బహుమతులను కట్నములను లంచములను చదివించక పోతే నబాబుకు బ్రతుకులేదన్నమాట! పాపమా యింగ్లీషువారి స్నేహితుడు— "చిరకాలమునాటి స్నేహితుడు"—యీగతికివచ్చి అప్పులలో మునిగిపోయెను. పైనవివరించినట్లు యివి చాలవరకు అక్రమపు అప్పులైయున్నవి. ఈ అప్పులనుండి తప్పించుకొనుటకై యివి అక్రమపు అప్పులని వాదించి పార్లమెంటువారిచే రద్దు పరుపించు కొనుటకుగాను నబాబు మహమ్మదాలీ యీ మాక్ఫర్సన్ను ఆశ్రయించి తనతరపు వకీలుగా సీమకుపంపించెను. ఇది యిరువురకును సంబంధము.

మాక్ఫర్సన్ యీరీతిగా ఆర్కాటు నబాబుకు వకీలుగా 1768 లో యింగ్లండులో ఓడదిగి అప్పుడు ప్రధానామాత్యుడుగనున్న డ్యూక్-ఆఫ్-గ్రాఫ్టన్ వద్దకువెళ్లి నబాబుయెడ కంపెనీ నౌకర్లుచేసిన అన్యాయము లన్నిటినీ వివరించి అతనిపై వార్లొ అక్రమముగ అప్పులగట్టిరో గట్టిగచెప్పెను. ఈ వాదనతోపాటు కొన్నిలక్షల హిరణ్యదానమునుకూడ మంత్రికినీ అతనిపరివారమునకును చేయవలెనని మాక్ఫర్సన్ చూచెను. కాని, మంత్రి యీదానమును పట్టలేదు. "పోనీ, దానము కాకపోతే తక్కువవడ్డీకి అప్పుగనైనా తీసుకోండి" అని మాక్ఫర్సన్ అనెను. దీనికిని మంత్రి అంగీకరించలేదు. ఆఖరుకు నబాబుకేమియు మేలుకలుగలేదు. కాని, యీవకీలు మాక్ఫర్సన్‌కు మాత్రము మద్రాసుకంపెనీలో సుమాస్తాగిరి దొరికెను. ఇతనంతట 1770 లో యింగ్లండునుండి బయలుదేరి మద్రాసుకువచ్చి కంపెనీ కొలువులో ఆరేండ్లుండెను.

1776 లో కంపెనీ వారితని నేలనో డిస్మిసుచేసిరి. ఇతనంతట నెత్తిమీద గుడ్డవేసుకొని ఇంగ్లండువెళ్లి తనను డిస్మిసుచేసినందులకు అక్కడ పెద్దగందరగోళము చేసెను. ఈపీడ వదిలించుకోటానికో లేక యితని గొప్ప శక్తి సామర్థ్యములను చూచియో, తెలియదుగాని అక్కడివారే కుట్రదారునికి వెనుకటికంటే పెద్ద ఉద్యోగమిచ్చి, యిండియాకు పంపిరి. క్రమముగా యీతడు కలకత్తాలోని సుప్రీం కౌన్సిలులో మొదటిమెంబరు అయ్యెను. అప్పటినుండి యితడు ఆర్కాటు నబాబుమాటయే మరచిపోయెను. వారన్ హేస్టింగ్సు 1785 లో ఇంగ్లండు వెళ్లిపోయినప్పుడు యీతడు కౌన్సిలులో మొదటిమెంబరగుటచే ఆక్టింగు గవర్నరు జనరలయ్యెను.

మాక్ఫర్సన్‌ను డిస్మిస్ చేయుట, మరల గొప్ప ఉద్యోగ మిచ్చుట!

ఇతడు గవర్నరు జనరల్ పదవికివచ్చి చూచునప్పటికి సైన్యములకు 50 లక్షలుపైచిలుకు జీతములు బకాయిపడి యుండెను. ఇతడంతట ఖర్చులను తగ్గించి, డబ్బుమిగిల్చి, బకాయల నన్నిటిని తీర్చివేసెను. అయోధ్య నజీరునుండి డబ్బుగుంజెను. ఢిల్లీ పాదుషాకు వారన్ హేస్టింగ్సు ఎగబెట్టిన కప్పమును తిరిగి యిప్పించవలసినదని మాధవరావు సింధియాద్వారా సదరుపాదుషా కబురుచేయగా;—"వల్లకాదని" యితడుగట్టిగా తిరస్కరించెను. ఇతని పరిపాలనకు కంపెనీవారు చాల సంతోషించి, యితనికి "సర్" బిరుదము నిప్పించిరి. కాని, వట్టిబిరుదముతో తృప్తిచెందక గవర్నర్ జనరల్ పదవిని ఖాయముగా తనకు యిప్పించమని అడిగెను. కాని, కంపెనీవారందుకు ఒప్పుకొనరైరి. ఇతని స్థానమున "కారన్‌వాలీస్"ను ఖాయముగా నియమించిరి. ఇందుకు యితనికి కోపమువచ్చి చాలా రగడచేసెను. కాని ప్రయోజనము లేకపోయెను.

ఆక్టింగ్ గవర్నర్ జనరల్ పదవి.

తిరిగి, కారన్ వాలీస్ అనంతరముకూడా గవర్నరు జనరల్ ఉద్యోగమునకు రావలెనని ఇతడు యింగ్లండులో యెన్నో పాట్లు పడెను. ఎన్నో దొంగ కబుర్లు చెప్పియు, మోసగించియు, లంచము లిచ్చియు, యెంతమంది పార్లమెంటు మెంబర్లనో, అన్ని పార్టీలలోనివారిని కూడగట్టుకొనజూచెను. "నేను కొన్నాళ్లు గవర్నరు జనరల్ పనిచేసినాను కాబట్టి నాకు మామూలు మెంబరుకంటె యెక్కువపింఛను రావలె" నని పోట్లాడెను. చాలమంది వోటర్లకు లంచములిచ్చి తానే పార్లమెంటులో మెంబరయ్యెను. కాని, లంచములు యిచ్చినసంగతి ఋజువుకాగా యితనిమెంబరు పదవి ఊడిపోయెను. పైగా, 50, 60 మంది వోటర్లమీదను, ఏజంట్లమీదను, క్రిమినల్ కేసులు పెట్టబడి, వారు శిక్షింపబడిరి. దీనిలోనే ఒక కేసులో మాక్ ఫర్ సన్ కు కూడా 3వేలపౌనులు జరిమానావేసిరి! ఈ యెన్నిక సందర్భములో యితనిమీద వచ్చిన కేసులకు మితములేదు. అవి 82 కేసులుండెను. ఈ కేసులనుండి తప్పించుకొనుటకై యితడు ఇంగ్లండునువిడిచి, యెక్కడికో పారిపోయెను. ఇట్టివానిని ఇండియాకు గవర్నరు జనరలుగా పంపిస్తే, మనపేరు కాస్తాపోతుందని కారన్ వాలీస్ 1789 సం॥ ఆగస్టు 8వ తేదీన కలకత్తానుండి ఒక యింగ్లీషుమంత్రికి—డండాసుకు—రహస్యముగా ఉత్తరమువ్రాసెను. పాపము, మాక్ ఫర్ సన్ పడిన పాట్లన్నియు వృథయయ్యెను. అతనికి ఈ జన్మలో యిక గవర్నరుజనరల్ పదవి లభించలేదు.

లంచాలు, క్రిమినల్ కేసులు, జరిమానాలు.



# బ్రిటిష్ మహాయుగము

## పదునాల్గవ అధ్యాయము



### కారన్ వాలీస్ పరిపాలన. (1786-1793)

1773 సం॥లో చేయబడిన రెగ్యులేటింగు ఆక్టులో గవర్నరుజనరులుకు తన సుప్రీము కౌన్సిల్‌లోని యితర మెంబర్లకంటె అధికమగు అధికారములు యేమియు యివ్వబడియుండలేదు. తనకు యిట్టి అధికారము లిచ్చినగాని తాను ఇండియాకు పోనని కారన్‌వాలీసు పట్టుబట్టెను. ఆప్రకారమే 1784 సం॥ ఆగస్టు 13-వ తేదీన పిట్టుప్రధానమంత్రి కాలములో పార్లమెంటువారొక చట్టమునుచేసిరి. దీనివల్ల గవర్నరుజనరులును తక్కినరాష్ట్రములలోని గవర్నరులునుకూడ తమకు అత్యవసరమని తోచినప్పుడు తక్కిన కౌన్సిలుమెంబర్ల సమ్మతిలేకుండగానే వారి అభిప్రాయములకు వ్యతిరేకముగాకూడా ప్రవర్తించుటకు అధికార మివ్వబడినది. భిన్నాభిప్రాయులగు మెంబర్లు తమ భిన్నాభిప్రాయములను రికార్డుచేసి యుంచవచ్చుననిరి. ఇట్టి నిరంకుశాధికారమును చేతపుచ్చుకొని కారన్‌వాలీస్ 1786 సం॥ మే నెలలో ఓడయెక్కి బయలుదేరెను.

కారన్ వాలీస్‌కు అసాధారణ అధికారములు.

ఇండియాకువచ్చిన గవర్నరుజనరలులలోనికెల్ల యితడు శాంతిప్రియుడను అపోహ ఒకటి ఇండియాలో వ్యాపించియున్నది. కాని, కేవలమిదితప్పు. అందరిలో ఇతడే కజ్జాకోరని చెప్పవలసియున్నది. దీనికొక కారణమున్నది. ఏమనగా ఇతడు యిండియాకు గవర్నరు జనరల్‌గ నియమింపబడకపూర్వము అమెరికాలో దెబ్బతినివచ్చెను. అమెరికావారి చేతులలో యితడు ఓడిపోయి, ఆ వలసలను శత్రువులకువప్పగించి ఇతడు నెత్తిన గుడ్డవేసుకొని యింటికివచ్చెను. ఈ అపజయమునకై ఇంగ్లండు వారతనిని తిట్టి దుమ్మెత్తిపోసిరి. ఇతడు ఇంగ్లండులో *తలయెత్తుకొని తిరుగలేకపోయెను. ఈ అవమానమును పోగ్రోలుటకై యితనిని ఇండియాకు పంపించిచూస్తే, తిరిగి

కారన్ వాలీసు శాంతి ప్రియుడా?

* కారన్‌వాలీసు త్రాగుబోతు. ఆంగ్ల చరిత్రకారుడు "లేకీ" History of England, Cabinet Edition Vol. VII P. 197, లో యిట్లువ్రాసెను. నాటకశాలలో పెద్దదొమ్మలాట జరిగినట్లు హారిస్‌వాల్ పోల్ వర్ణించెను. కారన్‌వాలీసుప్రభువును, ఆలన్‌ప్రభువును, తప్పత్రాగివచ్చి గోతులో 'రిగ్బి'గారిని తూలనాడుటవల్ల యీకొట్లాట జరిగినది.

అక్కడ యేమైనా పాపమితడు తనపేరు సంపాదించుకొనగలడేమో చూద్దామని చెప్పి ఇంగ్లీషు మంత్రివర్గమువా రితనికొక "ఛాన్సు" (అవకాశము) నిచ్చిరి. పరీక్షలో ఒకసారి తప్పినవానికి యింకొకసారి "ఛాన్సు" యిచ్చినట్లు. ఈ తడ నైనను ప్యాసైతే మొదటి అపజయావమానము పోతుందేమొ అనేఆశచేత ఇతడు ఇండియాలో యెంతోతంటాలుపడెను. ఏదో యుద్ధము కల్పించి, దానిలోగెల్చి తన ప్రతిభ తన దేశమువారికి చూపుకోవాలని యీతడు నిత్యము నలుముఖముల పార జూచుచుండెను.

ఆరోజులలో దక్షిణమున మైసూరులో హైదరాలీకొడుకు టిప్పుసుల్తాన్ పేరు చెప్పితే ఇంగ్లీషువారికి హడలుగఉండెను. పెద్దపెద్దవారే యితని పేరువిని "నీరు విడుచుచుండిరి." ఇంగ్లీషుదొరల పిల్లలకు టిప్పూపేరు 'బూచి'గ నుండెను. ఇంగ్లీషు దొరసానులు తమ అల్లరిపిల్లలకు యీ 'టిప్పూ' బూచివాని పేరుచెప్పియే నిద్రబుచ్చుచుండిరని ఇంగ్లండులో ఒక ఇంగ్లీషుమంత్రి చెప్పెను. కాబట్టి, యిట్టి భయంకరుడగు యీ బూచివానిని దెబ్బగొట్టితే, పోయినపేరు తనకు తిరిగివస్తుందని కారన్‌వాలీసు పార జూచెను. టిప్పుతండ్రి హైదరాలీ తాను బ్రతికివున్నన్నాళ్లు ఇంగ్లీషువారిని ముప్పతిప్పలుపెట్టి మూడుచెరువులనీళ్ల త్రాగించెనని చెప్పియుంటిమి. ఈక్రోధము ఇంగ్లీషువారికి లోలోన రగుల్కొనుచుండెను. తమ కసితీర్చుకొనుటకై యింగ్లీషువారు పొంచియుండిరి. కాబట్టి, కారన్‌వాలీసుకు యిది మంచి యదనుగనుండెను. టిప్పూపై యెట్లయినను పోయి పడుదమను సంకల్పమును కారన్‌వాలీస్ గట్టిగ చేసుకొనెను.

టిప్పూ బూచి.

అయితే, ఈ సందర్భమున రెండు ప్రతిబంధకము లేర్పడనున్నట్లు కన్పించినవి.

ఒకటియేమనగా కారన్‌వాలీసును ఇండియాకు పంపించు సందర్భమున ప్యాసుచేసిన ఆక్టులో పార్లమెంటువారొక నిబంధన నేర్పరిచిరి. ఇండియాలో కంపెనీవారు యేదేశీయప్రభువు తాలూకు వ్యవహారములలోగాని ఇంతటినుండి జోక్యము కలిగించుకోరాదనియు, యుద్ధమువగైరాలలో దిగక తటస్థముగా నుండవలెననియు ఈ నిబంధన విధించుచున్నది. ఇది ఒక ప్రతిబంధకము.

ఇక, రెండవ ప్రతిబంధకమేమనగా :—టిప్పూపైపోయి పడుటకు యేదో కారణమును లోకమునకు చూపించవలెనుగదా! తాము బలవంతులమనిచెప్పి ఇంగ్లీషువారు పొరుగువారిమీదికి అన్యాయముగా పోయిపడతారా? ఇది తప్పు కాదూ? కాబట్టి, తాముచేసేది సరిఅయినపనియేయని లోకమునకు చెప్పుకొనుటకు వీరికేదైనా కాస్త కారణ ముండవలయును. ఆఖరుకు కాస్త. చీమతలకాయ అంతైనా వుంచాలును. లోకము కళ్లల్లో కారముకొట్టవచ్చును.

ఈ రెండు ప్రతిబంధకములను కారన్‌వాలీసు యెట్లు తప్పించుకొనెనో చూతము.

మొదటి ప్రతిబంధకమును త్రోసివేయుటకు ఆంగ్ల మంత్రివర్గమువారే కారన్ వాలీసుకు యిషారా యిచ్చిరి. వారన్ హేస్టింగ్సును తీవ్రముగా విమర్శించిన రోజులగుటచే అప్పుడు కలిగిన తాత్కాలికపు టుద్రేకములో పార్లమెంటువారు శ్రీరంగనీతులు చెప్పుచూ ఇండియాలో పరరాజ్యములపై పడుటమహాదోషమనియు,అంతటినుండి కంపెనీవారు దేశీయ రాజుల వ్యవహారములలో తటస్థులుగా నుండవలెననియు,చట్టములలో వ్రాసిరి. కాని, యిదంతయు దరిమిలా "తాటాకులపైన వ్రాసిన" వ్రాతవలె వదలివేయబడెను. ఈ వ్రాసినవ్రాత తాటాకు సిరా యింకా యెండకమునుపే ఆంగ్లమంత్రివర్గము వారు "పోయిన అమెరికారాజ్యమునకు ప్రతిగా ఇండియాలో ఇంకొక రాజ్యమును సంపాదించుకొని రమ్మని" చెప్పి కారన్ వాలీసును ఇండియాకు పంపించిరి. అట్టి తటస్థముగనుండు చట్టమునుచేసి, ఇటుకవ్వించి రాజ్యముసంపాదింప కారన్ వాలీసును బంపుట మహాకౌటిల్య సంచారులగు ఆంగ్ల మంత్రిమండలికే తగును! టిప్పూపై యుద్ధముసాగించుటకు ఈ మంత్రిమండలివారు కారన్‌వాలీసుకు యెంతోమద్దతు చేసిరి. సేనలను సహాయముబంపిరి. 5 లక్షల సవరసులను అప్పుగాయిచ్చిరి. ఈరీతిగా వారు పార్లమెంటు చట్టమును బుద్ధిపూర్వకముగా నుల్లంఘించిరి! ఫ్రాన్సిస్, ఫాక్సు, హెప్పెస్లీ మున్నగు పార్లమెంటు మెంబర్లు మంత్రిమండలివారి యీచర్యను ప్రతిఘటించిరి. 'ఈయుద్ధము కేవలము అక్రమమనియు, ఇది పార్లమెంటు చట్టమునకు విరుద్ధమనియు, న్యాయమైన హక్కుతో తనరాజ్యము తానుచేసుకొనుచున్న టిప్పుపై పోయిపడుట కేవలము నీచమగు దోపిడియనియు, పలువురు యేకమై ఒకనిపైపడుట చాల అధర్మమని యూరపులోని క్రైస్తవజాతు లనుచున్న ఈ సమయములో (మన) ఇంగ్లీషువారు నైజామును, మహారాష్ట్రులను కలుపుకొని అక్రమముగా టిప్పుపై పడుట చాలా లజ్జాకరమనియు' ఫాక్సు మున్నగువారెంతయో వాదించిరి. కాని, ప్రయోజనము లేకపోయెను. "పడమట అమెరికా పోయింది కాబట్టి అందుకు ప్రతిగా తూర్పున ఇండియా సంపాదించుకోవాలని" ఆంగ్ల మంత్రి మండలియు, కారన్‌వాలీసును, పట్టుపట్టుకొని కూర్చుండిరి. ఈ కారణములచే కారన్‌వాలీసుకు పార్లమెంటు చట్టమును త్రోసివేయుటకు ధైర్యమువచ్చెను. తదుపరి రాజ్యాపహరణమునకు గడంగిన వెలస్లీ, హేస్టింగ్సు మున్నగు వారందరు కూడా ఇట్లే వర్తించిరి. ఇది మొదటి ప్రతిబంధకమును త్రోసివేసినకథ.

ఇక, రెండవ ప్రతిబంధమును కారన్‌వాలీస్ యెట్లు త్రోసివేసెనోచూతము. 1782 సంవత్సరములో యుద్ధము తీవ్రముగ రేగుచుండిన సమయములో హైదరాలీ

(ఆంగ్ల మంత్రి మండలి ఇషారా.)

కారన్‌వాలీస్ కుంటి వాదన.

కాలవశమున చనిపోయెను. తరువాత అతనికొడుకు టిప్పూ సుల్తాన్ ఆ యుద్ధమును జయప్రదముగ సాగించెను. అతని తాకిడీల కోర్వలేక ఇంగ్లీషువారు 1784 సం॥ లో టిప్పూతో సంధి చేసుకోవలసి వచ్చెను. ఇదియే 1784 సం॥ మార్చి 11-వ తేదీన జరిగిన మంగళూరు ఒడంబడిక. ఎవరు జయించుకొన్నది వారు తిరిగి యిచ్చివేసి, ఇక యింతటనుండి ఉభయ పక్షములు మైత్రితో నుండునట్లు యీ ఒడంబడికలో టిప్పూను, ఇంగ్లీషువారును యేర్పాటుచేసికొనిరి. అయితే, ఇప్పుడీ మైత్రిని పోద్రోలుటెట్లు? ఇందుకు కారన్‌వాలీసు బహునీచమగు ఉపాయమును కనిపెట్టెను. ఈ సంధి పత్రములోనే ఇంకొక సందర్భములో ఇంకొక వాక్యములో కంపెనీవారి "మిత్రుల" జాబితా వ్రాయబడిన సందర్భమున అందులో టిప్పూపేరు ఉదహరించబడి యుండలేదట! కాబట్టి ఇతడు ఇంగ్లీషువారికి శత్రువట! కాబట్టి, యితనిమీదికి దండెత్తిపోవుట తప్పుకాదట! ఇదీ కారన్‌వాలీసు వాదన! ఈ వాదనలోని అసంగతములు లోకము హర్షించగలదా? లోకము కండ్లలో నితడీ రీతిగ దుమ్ముకొట్టదలచుట యెంత సాహసము? లోకమంత బుద్ధిహీనమైనదని తలచుట కితడెట్టి గుండెలుదీసిన బంటుకావలెను? ఇది లోకులబుద్ధిని అవమానపరుచుటకాదా? ఈవాదమును ప్రఖ్యాత ఆంగ్లచరిత్ర కారుడగు సర్‌జాన్ మాల్కమ్ సైతము తీవ్రముగ ఖండించెను.

ఇంకొక సాకు.

కారన్‌వాలీసు టిప్పూపై పోయిపడుటకు యింకొకసాకు దొరికెను. టిప్పూ తిరువాన్‌కూరు రాజుపైకి దండెత్తెనట. తిరువాన్‌కూరు రాజు ఇంగ్లీషువారికి మిత్రుడట! అందుచే, యీ మిత్రుని సహాయార్థము ఇంగ్లీషువారు టిప్పూపైకి పోవలసివచ్చెనట! ఇది కారన్‌వాలీస్‌వాదన! తిరువాన్‌కూర్ రాజుకు టిప్పుసుల్తానుకుగల కలహ కారణములు మనమిచట వివరించుట అనవసరము. ఇరువురిలో దోషమెవరిదో, ముందుగ యెవ్వరు కవ్వించినారో, అదియు మనకిట అప్రస్తుతమే. అయితే, ఇంగ్లీషువారీ సమయమున తిరువాన్‌కూరు రాజు తమమిత్రుడని సాకుచెప్పి యీ అవకాశమును ఆధారముగాగొని తాము టిప్పూపై పడుటమాత్రము అక్రమము. లోగడ టిప్పూ ఇంగ్లీషువారికి మిత్రులగు మహారాష్ట్రులపైనను నైజాముపైనను అనేకసారులు అక్రమముగా పోయి పడెనుగదా. అప్పుడేల ఇంగ్లీషువారు మహారాష్ట్రులకును, నైజామునకును, సహాయముచేయక వూరకుండిరి? అప్పుడేల వారు టిప్పూ సుల్తాన్ పైకి దండెత్తిపోక పోయిరి? ఇప్పుడు మాత్రమేల తిరువాన్‌కూరు మీద పడ్డాడను సాకుచెప్పి ఇంగ్లీషువారు టిప్పూ పైకి వెడలిరి? ఈ తిరువాన్‌కూరు కారణము కేవలము మిష. అసలు వుద్దేశ్యము టిప్పును అణగ గొట్టుటకు ఇంగ్లీషువ్వారికి ఇప్పుడు అనుకూల తరుణముగానుండెను. (దీని తఫ్సీలు తరువాత చెప్పెదము) అందుచే,

యీా అదను కనిపెట్టి తిరువాన్కూర్ రాజుపేరు వూరక చెప్పి ఇంగ్లీషువారు టిప్పూపై ధ్వజమెత్తిరి. ఈ సంగ్రామ ప్రారంభ కాలమందు తిరువాన్కూరు రాజుపేరు మిషగ ఉచ్చరింపబడినను, తదుపరి అతనిపేరు యెక్కడను వినబడనే లేదు. యుద్ధానంతరము టిప్పునుండి లాగుకున్న దేశమును ముక్కలుగ బ్రద్దలుగొట్టి తామును, తమ మిత్రులును పంచుకొనుచున్నప్పుడైనను, ఇంగ్లీషువారికి పాప మీా తిరువాన్కూరు మిత్రుడు జ్ఞాపకమురాడైరి! తాముపంచుకొన్న ముక్కలలో కాస్త అయినను తిరువాన్కూరు మిత్రున కివ్వరైరి! ఆఖరుకు పేరు తిరువాన్కూరుదిన్నీ, నోరు ఇంగ్లీషువారిదిన్నీ అయ్యెను!

ఇంగ్లీషువారికి అనుకూల పరిస్థితులు.

టిప్పూపైకి పోవుటకు పరిస్థితులు యిప్పుడు అనుకూలముగ నుండెనని పై పేరాలో చెప్పియుంటిమి. అదియెట్లనగా:—మహారాష్ట్రులును, నైజామును టిప్పూ సుల్తానుయెడ అసంతృప్తులై యుండిరి. ఇతడు వెనుకటి ఒడంబడికలకు విరుద్ధముగా రాజ్యకాంక్షచే మహారాష్ట్రులపైకిని, నైజాముపైకిని, అనేకసార్లు దండెత్తెను. ఈ కారణముచే యితనికిని, వారికిని బద్ధవైరమేర్పడి యితని నెట్లయినను హత మార్చవలయునని చూచుచుండిరి. ఈ యవకాశము ఇంగ్లీషువారు ఉపయోగించుకొని తమతోపాటు మహారాష్ట్రులను, నైజామును, టిప్పూమీాదికి తీసుకొనివచ్చిరి. ఈ రీతిగా ఇంగ్లీషువారు, మహారాష్ట్రులు, నైజాము, ముగ్గురు యేకమై టిప్పూ మీాదికి దండెత్తిరి. ఈ సందర్భమున నైజాము, మహారాష్ట్రుల ప్రవర్తననుగూర్చి కొంత విమర్శింపవలసియున్నది. ఎట్లనగ:—లోగడ టిప్పు సుల్తాన్ అక్రమముగా తమమీాదికి వచ్చిపడి తమ్మును అనేకసార్లు వేధించుచున్న సమయములో మిత్రులమని పేరు పెట్టుకున్న ఇంగ్లీషువారు తమకు కించిత్తయినను సహాయముచేయక తమాషా చూచుచు నూరకుండగ, యిప్పుడీ మహారాష్ట్రులును, నైజామును ఏమొగము పెట్టుకొని ఇంగ్లీషువారికి, మద్దతుచేయబోయిరి? లోగడ తమఅవసరములకు తోడ్పడని ఇంగ్లీషువారికి యిప్పుడీ మహారాష్ట్ర, నైజాములు యెట్లు సిగ్గులేక సహాయము చేయబోయిరి?

ఇంగ్లీషువారి సనిమిత్త సఖ్యము.

ఇందుకు కేవలము వారికి టిప్పూపైగల క్రోధముతప్ప వేరొండు కారణము ఊహింపజాలము. ఇట ఇంగ్లీషువారి ప్రవర్తనయు కడు విచిత్రము. తమ కేమియు బేరముగిట్టుబాటుగాని సమయములో తమకనుకూలముకాని తరుణములో ఇంగ్లీషువారు తమ మిత్రులకు సహాయముచేయక, తమమిత్రుడు చచ్చుచున్ననుసరే, తమాషా చూచుచు లోలోన ముసిముసి నవ్వులు నవ్వుకొనుచు వూరకుందురు. కథతమకు అనుకూలముగా తిరిగిన సమయములో బేరముగిట్టుబాటనితోచిన తరుణములో వారు యెట్టి శత్రువును సైతము యెంతో ప్రేమవుట్టి

పడునట్లు కౌగలించుకొని యెట్టిమిత్రునినైనను క్రిందికి పడదన్ని, తమ కార్యమును సాధించుకొందురు. వారికి శత్రుమిత్ర సమాఖ్యలు కేవలము నిమిత్తములు. టిప్పు వచ్చి తన్నుచున్నప్పుడు మహారాష్ట్ర నైజాములకు సహాయముపోని ఇంగ్లీషువారిప్పుడే మొగముపెట్టుకొని వారిని "మేమిప్పుడు టిప్పూమీదికి పోవుచున్నాము రండి, రండి. మాకు సహాయముచేయండి" అని అడిగిరి? వారును యేమొగము పెట్టుకొని ఇంగ్లీషువారికి సహాయము వచ్చిరి! వీరికి యెగ్గునులేదు, వారికిసిగ్గునులేదు.

ఇంగ్లీషువారి అసత్య ప్రచారములు.

కారన్‌వాలీసు యిండియాకు వచ్చినప్పటినుండి టిప్పూపై యుద్ధము సాగించుటకు సైనిక సన్నాహముల నెక్కువగా అన్నిప్రాంతములందును చేయుచుండెను. టిప్పూపై కారన్‌వాలీసు ఇంగ్లీషు వారును అనేకమగు అబద్ధములను ప్రచారము చేయసాగిరి. టిప్పూసుల్తాన్ క్రూరుడనియు అతడనేక దుర్మార్గముల జేసెననియు అక్రమముగా అపవాదములు ప్రచురింపసాగిరి. యుద్ధకార్యములందు టిప్పూసుల్తాన్ తదితర విజేతలవలెనే దయాదాక్షిణ్యముల పాటింపనివాడయ్యు, తనరాజ్యములోని ప్రజలను హింసింపలేదు. ఆరోజులలో యితని పరిపాలనలో వున్న దేశము ఇంగ్లీషువారి పరిపాలనలోవున్న ప్రక్కదేశములకంటె సుభిక్షముగ నుండెననియు, ఇతని పరిపాలనలోని ప్రజలే యెక్కువ సౌఖ్యవంతులుగ నుండిరనియు ఆంగ్లేయులే ఒప్పుకొనుచున్నారు. ఇట్టిపరిస్థితులలో టిప్పూసుల్తాన్‌పై ఇంగ్లీషువారు అక్రమముగ అబద్ధ ప్రచారములు చేయుట వారతని నెట్లయిన పొడిచిరేపవలయునను దురుద్దేశము తప్ప వేరొండుకారణము కన్పట్టదు.

నైజాము, మహారాష్ట్రులతో సఖ్యము.

ఇదంతయుజూచి టిప్పూ లోలోన అనుమానపడుచునే యుండెను. కాని, మహారాష్ట్రులతోడను, నైజాముతోడను బేరము కుదుర్చుకొనువరకు కారన్‌వాలీసు టిప్పూతో యుద్ధముచేయుటకు జంకుచున్నట్లు యితడు గవర్నర్ జనరల్ పదవివహించిన మొదటిరోజులలో వ్రాసిన ప్రయివేటు ఉత్తరములను బట్టి తెలియుచున్నది. 1787 సం॥ అక్టోబరు ప్రాంతమున మహారాష్ట్రులతో బేరము కుదుర్చుకొనుటకు కారన్‌వాలీసు నాగపురమునకును బీరారునకును ఇంగ్లీషు రాయబారుల పంపించెను. మధోజీభాన్‌స్లే వద్దకు పంపిన రాయబారికి వేగులపనికూడ పెట్టెను.

నాగపురమునకు వేగుబంపుట.

"భాన్‌స్లే బలమెంతయున్నదో, అతనిని టిప్పూమీదికి పురికొల్పడానికి వీలున్నదో లేదో చూచి ప్రయత్నించి రమ్మని" చెప్పిపంపెను. ఆసమయమునకు మహారాష్ట్రులు టిప్పూతో పోరాటములు లేక సఖ్యముగనే యుండిరి. కాబట్టి "మహారాష్ట్రులు టిప్పూతో సఖ్యముగనే యుండవలయునని గట్టిగ సంకల్పించుకొని యున్నచో, బహుశః మన మాటలవల్ల వారు తమసంకల్పమును తక్షణమే మార్చుకొనరేమో. అందుకనియే

"నీవు నీశక్తియుక్తులనన్నిటిని ప్రయోగించి, టిప్పు మనకందరికి ఉమ్మడి శత్రువని చెప్పి, వారికి మనకు సఖ్య మేర్పడునట్లు నీవుయెట్లాగైన సరే చేసుకురావలెను సుమా"యని కారన్ వాలీసు. తన రాయబారియగు ఫారెస్టరుకు గట్టిగ చెప్పి పంపించెను. "టిప్పుతో మనకిప్పుడు యుద్ధము పొసగేయెడల, ఫ్రెంచివారితో గూడ తక్షణమే పోరాటము రాగలదని నాతలంపు. అందుకనియే మనకీసందర్భములో మహారాష్ట్రులతోడి స్నేహము అత్యంతము అవసరము". ఈ వ్రాతలన్నిటిని బట్టి చూడగ, కారన్ వాలీసు టిప్పూపైకి దండెత్తుటకు పూర్తిగ పూనుకొన్నట్లును, అందుకు ఏదైనా కేవలమొకమిషకై వెదకులాడుచున్నట్లును తిరువాన్కూరు తగాదాయే అట్టిమిషగ అతనికి దొరికినట్లును స్పష్టము కాగలదు.

యుద్ధ ప్రకటన.

మహారాష్ట్రులు, నైజాము, యింగ్లీషువారు యీరీతిగ నేస్తముగట్టుకొనిరి. టిప్పూనుండి లాగికొన్న రాజ్యములో మీకిద్దరికి భాగముపెట్టెదనని కారన్ వాలీసు వారితో చెప్పెను. ఈరీతిగ, తాము ముగ్గురు టిప్పూపైకి దండెత్తి అతనిరాజ్యమును పగులగొట్టి పంచుకొనునట్లు ముగ్గురును ఒడంబడిక చేసుకొనిరి. టిప్పూతోడి యుద్ధమునకు మూలమిది. తిరువాన్కూరు పేరు కేవల మొకమిష.

ఎప్పుడైతే యీముగ్గురును యిట్లు సఖ్యమేర్పరుచుకొనిరో అప్పుడు ఇంగ్లీషు వారు టిప్పూసుల్తాన్పై తిరువాన్కూరురాజు మిషమీద యుద్ధము ప్రకటించిరి.

అయితే, యిక్కడ యింకొకసంగతి చెప్పవలసియున్నది. టిప్పూతోడి యీ యుద్ధమునకు మద్రాసు కౌన్సిలువారు యిష్టపడకుండిరి. వీరితో సంప్రదించకుండగనే కారన్ వాలీసు నిరంకుశముగ యీపనిని తలపెట్టెను. టిప్పూయొక్క ఉద్దేశములు మద్రాసు కౌన్సిలువారికి బాగుగ తెలియును. అప్పుడు గవర్నర్గనుండిన హాలండు అనునతడు యిందునుగూర్చి కారన్ వాలీసుకు యీరీతిగ వ్రాసెను :—

"కంపెనీవారితో తగాదా పెట్టుకోవలెనని టిప్పూసుల్తాన్కు యెంత మాత్రములేదు. ఏదైనా తగాయిదా వ్యవహారములువుంటే వానిని సవ్యముగ సర్దుబాటుచేసుకోటానికి అతడెప్పుడును సిద్ధముగానే యున్నాడు." అని వ్రాసెను. కాని యీమాట కయ్యమునకు కవ్వించుచున్న కారన్ వాలీసుకు రుచింపలేదు. తన మాటకు అడ్డమువచ్చుచున్న యీ గవర్నర్ హాలెండును తక్షణమే తీసివేసి, తత్స్థానమున టిప్పూసుల్తాన్కు గర్భశత్రువగు "జనరల్ మెడోసును" మద్రాసుకు గవర్నరుగ నియమించెను. టిప్పూసుల్తాన్ ఇంగ్లీషువారితోగాని, తిరువాన్కూరు రాజులతోగాని, యుద్ధముచేయుదమని అనుకొననేలేదు. అప్పుడు టిప్పూ యుద్ధమునకు సిద్ధముగ లేడని ఒక ఆంగ్లసేనాని, కర్నల్ విల్కస్ వ్రాయుచున్నాడు. తాను యుద్ధముచేయక శాంతముగనే యుండదలచితిననియు, తిరువాన్కూరుపై దండె

త్రుటకు తాను తలచలేదనియు, తగాదా వ్యవహారములు యేమైనావుంటే సవ్యముగ సర్దుబాటుచేసుకోడానికి మీావద్దకు రాయబారిని పంపించెదననియు, టిప్పూసుల్తాన్ మద్రాస్‌గవర్నర్‌కు వ్రాసెను. కాని, యీా మాటలనువారు పెడచెవినిపెట్టిరి. 'టిప్పూయుద్ధమునకు తయారుగలేడు. కాబట్టి, అతనిపై పోయిపడుట కిదియేసమయ' మని పైపెచ్చువారు మరింతధైర్యముతో టిప్పూయెడ పొగరుబోతుతనము చూప సాగిరి. ఇందునుగూర్చి కారన్ వాలీసు మద్రాస్‌గవర్నర్ మెడోసుకువ్రాసిన ఉత్తర మిట్లున్నది:—

"ఈదేశములో మనపేరు నిలువబెట్టుకోడానికి యిదే మంచిసమయము. ఇదే మంచియదను. మనమిప్పుడు టిప్పూనుండి కఠినమగు ప్రతిఫలమును లాగి కొనుటయేగాక, మనజాతియందు సదా అంతటి ఘోరద్వేషమునుజూపు యీా టిప్పూను అణగగొట్టివేయుటకు మనకిప్పుడు దొరికిన యీామంచి అవకాశమును పూర్తిగ వినియోగించుకొనవలసియున్నది. మనకిప్పుడు దేశీయరాజులలోనుండి కావలసినంత సహాయము వస్తూవున్నది. అతనికన్నో ఫ్రెంచివారిసహాయ మిప్పుడు వచ్చుటలేదు.

ఫ్రెంచివారు తిరిగి యితనికి సహాయముచేసే రోజువరకు మన మీాతనిని యిట్టి ఉన్నత స్థానమందే ఉండనిచ్చినామంటే, తరువాత మన పని చాల కష్టమవుతుంది. భవిష్యత్తున మనమతనితో ప్రాణాపాయకరమగు యుద్ధమునకు యిప్పుడు చేతులార బీజముల నాటుకొన్నవారమగుదుము." (Mill V. P. 243)

కాబట్టి, టిప్పూతోడి యుద్ధమునకు అసలు కారణమేమో కారన్‌వాలీసు పైవాక్యములలో కుండబ్రద్దలుగొట్టి చెప్పివేసినాడు. అందుచే టిప్పూ యెన్నిశాంతి వాక్యముల పలికిన నేమిప్రయోజనము? ఇతని శాంతివాక్యములకు జవాబుగ మద్రాస్ గవర్నర్ మెడోసు పొగరుబోతుమాటల వ్రాసి పంపించెను. భూలోక ములో శాంతి, సత్యము లుండవలయునని నిత్యము యెహోవాను ప్రార్థించు యీా కుహనా క్రైస్తవుడు దేశములో ఘోరయుద్ధమును, రక్తపాతమును, గల్పింపసమ కట్టెను! అతడువ్రాసిన ప్రత్యుత్తరమిది!

"నీ వుత్తరం అందినది. సంగతులు తెలిసినవి. నీవు గొప్పరాజువు. నీ ఖైదీల యెడల నీవు క్రౌర్యముగ ప్రవర్తించినావు. అట్లు కానిచో, నీవు విజ్ఞానవంతుడవగు రాజువనికూడ నేను చెప్పియుందును. ఇంగ్లీషువారు, తాము అవమానముల నెట్లు భరింపజాలరో, అట్లే పరులపైకూడ తాము అవమానముల వైవజాలరు. కాబట్టి నీవు మామిత్రుడగు తిరువాన్‌కూరు రాజుపై యెప్పుడైతే పడినావో, అప్పుడే మేము నీపైయుద్ధప్రకటనగావించినట్లు తలచుకొనుచున్నాము. భగవంతుడెల్లప్పుడు బలవంతులకే యుద్ధమందు జయమివ్వడు; బాగా పరుగెత్తువారికే పందెములో గెలు

పివ్వను. ఎవరిపక్షమందు న్యాయముండునో వారికే భగవంతుడు జయమిచ్చును. మేమీమాటనే నమ్ముకొన్నాము.'' (Mill P. 245)

ఈ ఉత్తరములో శాంతివాక్య మొక్కటియు లేదు. అన్నిమాటలు టిప్పూను క్రోధపరచునవిగనే యున్నవి. ఇంగ్లీషువారి ప్రవర్తన 'అందితే జుట్టు, అందకపోతే కాళ్లు' అన్నట్లున్నది. వెనుక హైదరు ప్రారంభించిన యుద్ధములో ఓడిపోయి, టిప్పూచేత వీపు పగుల గొట్టించుకొని, 1784 సం।।లో దేముడా, యని యితనితో సంధికి దిగి, ''తమపై యెట్లయిన కనికరము చూపవలసినదని'' యితనికాళ్లమీదపడి ప్రాధేయపడినప్పటి ప్రవర్తనకును, యిప్పటి యీపొగరుబోతు ప్రవర్తనకును యెంతటి తేడాయున్నదో చూడుడు!

ఏమైతేయేమి యుద్ధము సిద్ధమైనది. టిప్పూసుల్తాన్ ఒక్కయింగ్లీషువారినేగాక తనపైకి కారుమేఘములవలె మూగివచ్చిన మహారాష్ట్ర, నైజాములనుకూడ యేక కాలమందే యెదుర్కొనవలసి వచ్చెను. ఆతడు యుద్ధమున కేమియు పాపము సన్నాహములు చేసికొనియుండలేదు. ఇతనిపైకి సేనలను తానే స్వయముగ నడిపించుకొని రావలెనని కారన్‌వాలీసు మొదట అనుకొనెను. కాని, దగ్గరలో మద్రాసు గవర్నర్ మెడోస్ ఉన్నాడు కాబట్టి, ఆపనిని ఆతనికి అప్పగించెను. అయితే, యీవదరుబోతు మెడోస్ మాటలలో టిప్పూను యెదిరించగలిగెను గాని, యుద్ధరంగమందు అతని నెదిరింపలేకపోయెను. టిప్పూ యితనిని ఓడించివేసెను.

మద్రాస్ గవర్నర్ మెడోస్ పరాజయము.

ఈ దుర్వార్త అప్పటికి మద్రాసు వచ్చిచేరిన కారన్‌వాలీసు చెవిని బడగనే తక్షణమే అతడు 1790 సం।। డిశంబరు 12-వ తేదీన స్వయముగ సైన్యాధిపత్యము వహించి, మెడోసును మద్రాసుకు వెళ్లిపొమ్మనెను.

కారన్‌వాలీస్ స్వయముగ సేనాధిపత్యము వహించుట-బెంగుళూరు వధలు.

కారన్‌వాలీసు అంతట మహారాష్ట్రులయొక్కయు, నైజామునొక్కయు తోడ్పాటుతో టిప్పూను ఓడించగలిగెనన్నచో ఆశ్చర్యములేదు. కారన్‌వాలీసు స్వయముగ నడిపించుకొనివెళ్లిన సేనలు బెంగుళూరును ముట్టడించి, అందున్న అమాయికపు ప్రజలపై చెప్పరాని కార్యములుచేసెను. కారన్‌వాలీసు యాజమాన్యమున యీ సేనలుచేసిన భీభత్సము విషాదభరితమనియు వీరి క్రోధోద్రేకమువల్ల శోచనీయమగు వధలు గావింప బడెననియు, 'మిల్లు' చరిత్రకారుడు వ్రాయుచున్నాడు.

బెంగుళూరును పట్టుకొన్నతరువాత కారన్‌వాలీసు తన సేనలను టిప్పూ రాజధానియగు శ్రీరంగపట్టణపు ముట్టడికై నడిపించెను. పాపము టిప్పూ మొదటి

శ్రీరంగపట్టణపు ముట్టడి.

నుండి యింకను సంధికొరకయినేమో కబుర్లు పంపుచుండెను. కాని, యీమాటలు ఇంగ్లీషువారి చెవి కెక్కకుండెను. ఈతడు వ్రాసినజాబులను కారన్ వాలీసు చూడనైనచూడక దూరముగ పారవేయుచుండెను. టిప్పూ పంపించిన రాయబారికి దర్శనమైన యీయలేదు. కారన్ వాలీసుసేన శ్రీరంగపట్టణ సమీపమున గాన్పించినప్పుడు టిప్పూ ఒక ఒంటె మీద పండ్లగెలలనువేసి కారన్ వాలీసుకు బహుమానము పంపెను. కాని, యీ పండ్లను ముట్టుకొననైన ముట్టుకొనకుండ, వచ్చినఒంటెను అట్లే కారన్ వాలీసు తిరుగగొట్టించెను. వచ్చినఒంటె వచ్చినట్లు వెళ్లిపోవుచుండగ, ఇంగ్లీషుసేన యెంతో ఆనందముతో ఉప్పొంగి చూచుచుండెనట!

ఇందునుగూర్చి మిల్లు యిట్లు వ్రాయుచున్నాడు:—

"ఇండియాలోనున్న ఇంగ్లీషువారికి ఆరోజులలో టిప్పూసుల్తాన్‌పై క్రోధము, కసి, కుత్తుక బంటిగనుండెను. అతనిపైవారు తమవారికి అంతపురి యెక్కించిరి. ఇది కేవలము నరాశనులగు క్రూరరాక్షసులు తమ శత్రువుపై జూపు క్రోధాట్టహాసమును పోలియున్నదిగాని, ఒక నాగరకజాతి తనగర్భశత్రువుపై సైతము జూపు రోషమును బోలియుండలేదు.''

టిప్పూ ఇంగ్లీషువారిచే యిన్నిరీతులుగ అవమానపడియు, వారితో సంధి చేసుకొననలెననియే యింకను తంటాలు పడుచుండెను. ఈతడిట్టి దుర్గతికి వచ్చుటకు ప్రధానకారణ మొకటిగలెను.

అదేదనగ, యితని సైన్యములోనుండిన యూరోపియను నౌకర్లుచేసినస్వామి ద్రోహమే. టిప్పూను, అతనితండ్రియుకూడ బ్రతుకు తెరువుకైవచ్చిన అడ్డమైన యూరోపియను జాతివాళ్లనునమ్మి, వారికి పెద్దపెద్దజీతములిచ్చి, వారిని నమ్మక

యూరపియన్ నౌకర్ల స్వామిద్రోహము.

మగు గొప్పస్థానములందు సైన్యములో ఉద్యోగులుగ చేర్చుకొనిరి. తమకిట్లు అన్నవస్త్రాదికములిచ్చి పోషించుచున్న యీ ప్రభువుల కొంపలగూల్చుటయే తమకు ఘనముగ వీరు భావించుకొనుచుండిరి. వీరిని కారన్ వాలీసు తనపక్షమునకు కొనివేసి త్రిప్పుకొన్నట్లును, ఊహింపదగియున్నది. ఈడబ్బుతిని వారు తమస్వామికి ద్రోహము చేసిరి. తీరా కష్టసమయమునకు ఆతనిని విడిచివెళ్లి, వీరు శత్రుపక్షమున చేరిరి. వెల్లస్లీకాలములోకూడ యిట్లేజరిగెను. వెల్లస్లీ మహారాష్ట్రులతో యుద్ధముచేసినప్పుడు, మహారాష్ట్రసేనలోనున్న యూరోపియను ఉద్యోగస్థులను—ముఖ్యముగ సింధియా కొలువులోనున్నవారిని—అతడు లంచములచే చీలదీసి తనపక్షమున చేర్చుకొనెను. ఈ లంచములకై వెల్లస్లీడబ్బును నీటివలె ఖర్చుపెట్టెను. కారన్ వాలీసు కూడ టిప్పూవిషయమై యిట్లే చేసియుండవలెను. కాని, యీసంగతిని అతడు



కారన్ వాలీస్

(ఇండియాకు రెండుసార్లు గవర్నర్ జనరలుగ వచ్చినవాడు-శాంతిప్రియుడా? రణప్రియుడా? —363-వ పేజీ.)



సర్ డేవిడ్ బెయిర్డు

(టిప్పూసుల్తాన్ చేతిలో ఖైదీగ చిక్కి, అతనిచేత ఆట కోతిగ ఆడింపబడిన ఆంగ్ల సేనాని —416-వ పేజీ.)



(శ్రీరంగపట్టణపు ముట్టడి 372-వ పేజీ.)

372B



టిప్పూ కొడుకుల తాకట్టు దృశ్యము.

ఒప్పుకొనుటకు ధైర్యము జూపలేకున్నాడు. అట్లుగానిచో, టిప్పూ కొలువులోనున్న యూరోపియనులేల అతనినంత ఆకస్మికముగ విసర్జించి వెళ్లిపోదురు? ఇందుగూర్చి తారన్‌టన్ యిట్లు వ్రాయుచున్నాడు :—

"చాలమంది యూరోపియనులు, ముఖ్యముగ ఫ్రెంచివారు, తనతండ్రినాటి నుంచి కొలువున్నవారు యీసమయము కనిపెట్టి, తమకు విసుగుగనున్న యీతని కొలువును వదలిపెట్టి వెళ్లిపోయిరి. వీరిలో 'బ్లెవెట్' యనునతడు చాల గట్టివాడు. తనుపోగానే టిప్పూసుల్తానుకు కుడిభుజము పడినట్లయ్యెను. ఇదివరకు అతని రక్షింపుటయందు తమ శక్తిసామర్థ్యముల నుపయోగించిన యూరోపియనులు యిప్పు డాశక్తి సామర్థ్యములనే టిప్పూ నాశనముకొరకై వినియోగింప సర్వసంసిద్ధముగ నుండిరి."

ఇట్టి నిస్సహాయస్థితిలో పాపము టిప్పూ యేమిచేయగలడు? తిరిగి సంధికై రాయబారిని పంపించెను. ఈతడనకూడ కారన్‌వాలీసు టిప్పూపంపించిన రాయబారిని నిరాకరించెను. దీనికి ఇంగ్లీషువారెంతయో ఆనందించిరి. యుద్ధము చాల నెలలవరకు సాగెను. తుదకు శ్రీరంగపట్టణము ముట్టడింపబడెను.

తిరిగి టిప్పూ రాయబారముల బంపెను. ఈ పర్యాయము కారన్‌వాలీసు మహారాష్ట్రుల ప్రోత్సాహముచే రాయబారమున కంగీకరింపవలసివచ్చెను. టిప్పూ యొక్క ఉద్ధతిననచుటయే మహారాష్ట్ర మంత్రియగు నానాఫర్నవీసుకు ఉద్దేశముగాని, ఆతనిని సమూలముగ నాశన మొనరింపవలయునని అతని ఆశయముకాదు. మరియు, నానాఫర్నవీసుకు ఇంగ్లీషువారిదురాశ రాను రాను మరింత స్పష్టమయ్యెను. కాబట్టి, యిక యింతటితో ఆగుట మంచిదని నానాఫర్నవీసు కారన్‌వాలీసుకు గట్టిగచెప్పెను. తమకూటములో ప్రధానుడగు నానాఫర్నవీసుమాటను యెదిరించుటకు అవకాశములేక కారన్‌వాలీసు టిప్పూతో యీపర్యాయము సంధికి ఒడంబడవలసివచ్చెను. నానాఫర్నవీసు యీసమయమున యీరీతిగ అడ్డుపడుటవలన, టిప్పూ యింకకొన్నాళ్లు రాజ్యమేలుటకును, తదుపరి మైసూరురాజ్యము తిరిగి హిందూరాజులచేతికి చిక్కుటకును అవకాశమేర్పడెను. అట్లు గాకున్నచో యీదెబ్బలో మైసూరురాజ్యము పూర్తిగ ఇంగ్లీషువారి రాజ్యములో కలిసిపోయెడిదే.

టిప్పూ అర్థరాజ్యము మూడుకోట్లనిచ్చి, కొడుకుల తాకట్టుపెట్టుట.

ఈసంధివలన టిప్పూసుల్తాన్ తనరాజ్యములో సగభాగము శత్రుమండలి కిచ్చివేయ వలసివచ్చెను. నష్టపరిహారము క్రింద శత్రువులకు టిప్పూ మూడుకోట్ల ముప్పదివేల రూపాయలిచ్చుకోవలసివచ్చెను. ఈషరతులు అమలు జరుగువరకు తనకొడుకుల నిద్దరిని టిప్పూ యింగ్లీషువారివద్ద తాకట్టు పెట్టవలసి వచ్చెను.

ఈ షరతులతో సంధిపత్రముపై 1792 సం॥ ఫిబ్రవరి 23-వ తేదీన సంతకము లయ్యెను. ఈరీతిగ టిప్పూ నుండి లాగికొన్న అర్ధరాజ్యమును ఇంగ్లీషువారు, మహారాష్ట్రులును, నైజామును కలిసి పంచుకొనిరి. ఇంతవరకు ఇంగ్లీషువారు యుద్ధములో జయించు కొన్నామని చెప్పుకోదగిన రాజ్యమిదియే. ఇదివరకు క్లైవుమున్నగు వారు సంపాదించిన రాజ్యములు యుద్ధముచేగాక, కేవలము కుటిలతంత్రముల చేతనో, ద్రోహముచేతనో సంపాదించుకొన్నవే. ఇండియాలో యుద్ధములో రాజ్యము సంపాదించిన మొదటి ఇంగ్లీషువాడు కారన్‌వాలీసే. ఈరీతిగ యితడు అమెరికాలో పోగొట్టుకొన్న కీర్తిని తిరిగి ఇండియాలో సంపాదించుకొన్నాడు. ఆంగ్ల మంత్రి మండలి వారితని నే యుద్దేశములో ఇండియాకుపంపిరో, ఆయుద్దేశము నితడు నెరవేర్చి వారిమెప్పును బడసెను. ఇందుకు ప్రతిఫలముగ ఆంగ్లమంత్రివర్గము వారితనికి గొప్పబిరుదము నిచ్చిరి. ఇంగ్లండులో యితడు బయలుదేరి నప్పుడు యితనికి 'ఎరల్' అను బిరుదు మాత్రముండెను. ఇప్పుడు అంతకంటె గొప్ప బిరుదును— "మార్క్విస్" అను బిరుదమును యిచ్చిరి!

టిప్పూను వంచుటతో తృప్తిపడక కారన్‌వాలీసు ఇండియాలో నున్న పరాసువారిపై కూడ దండెత్తి వారితాలూకు స్థానములనన్నిటిని తాను ఇండియా నుండి 1793లో వెడలి పోవులోపుగ ఇంగ్లీషువారి అధికారము క్రిందికి తెచ్చెను.

తాను రణరంగమునందు ప్రఖ్యాతుడనను కీర్తిని తిరిగి సంపాదించు కొనవలెనను మహాతృష్ణతో కారన్‌వాలీసు ఇండియాకు బయలుదేరి వచ్చెను. ఈ రీతిగ టిప్పూసుల్తాను తోడను, ఫ్రెంచివారి తోడను గావించిన యుద్ధములందితడా కీర్తిని సంపాదించుకొని సంతుష్టుడయ్యెను.

కారన్ వాలీసు రణతృష్ణ.

ఇట్టివాడు శాంతిప్రియుడనియు తటస్థుడనియు, యెట్లు పాఠశాలలలోని హిందూదేశ చరిత్రలలో వ్రాసిరో ఊహించశక్యముకాకున్నది.

కారన్‌వాలీసు మిగతా దేశీయరాజులతో యెట్లు ప్రవర్తించెనో, యిట క్లుప్తముగ వివరింతుము. బెంగాల్, బీహారు, ఒరిస్సారాష్ట్రములకు మొగలాయి పాదుషా కంపెనీవారికి దివానీగిరి యిచ్చినప్పుడు, అతనికి కంపెనీవారు సాలుకు కొంత కప్పము కట్టునట్లు క్లైవు ఒడంబడి వచ్చెను. తరువాత హేస్టింగ్సు హయాములో యీకప్పము నాతడు సరిగ చెల్లింపక తిప్పలు పెట్టసాగెను. దీని కొరకై పాదుషా అనేకసార్లు తనరాయబారిద్వారా కంపెనీవారికి కబుర్లు పంపుచునేయుండెను. ఇంతకాలము నుండియు కంపెనీవారు పాము చావకుండ బడితవిరుగకుండ యేవో సమాధానములు చెప్పుచు వచ్చిరి. వీనిని బట్టి యింకనువారు తనకు కప్పమిత్తురనియే పాపము పాదుషా అనుకొనుచుండెను. కాని, కారన్‌వాలీసు వచ్చినతరువాత, యీకప్పము

మొగల్ చక్రవర్తికి కప్పము ఎగబెట్టుట.

తాను చెల్లించనని ఖండితముగ చెప్పివేసెను. పాదుషా దుర్బలుడగుటచేతను, అతని పక్షమువారు యింగ్లీషువారిలో పరికగుటచేతను ఆతడేమియు చేయలేక పోయెను.

అయోధ్యనబాబుయెడ కారన్‌వాలీసు చేసినకృత్యము చాల అక్రమముగ నున్నది. అతని రాజ్య రక్షణార్థమని చెప్పి, యూరోపియను ఆఫీసర్లచే నడుపబడు పెద్దసేన నొకదానిని తీసికొనివెళ్లి ఆతని కంఠము మీాద పెట్టెను. ఈ సేనకు జీతబత్తెములు యిచ్చు కొనలేక అయోధ్య నబాబు గోలపెట్టసాగెను. "ఈసైన్యం నాకక్కర లేదు. మీాసేనను మీారు తీసుకుపొండి, బాబు" అని అయోధ్య నబాబు యెంత మొత్తుకున్నను కారన్‌వాలీసు వినలేదు. ఇది బలాత్కార రక్షణ ప్రహసనమని చెప్పవచ్చును.

అయోధ్య నబాబుపై అక్రమముగ సైన్యభారమును వేయుట.

"వారన్‌ హేస్టింగ్సుతో వెనుక చేసుకొన్న ఒడంబడిక ప్రకారము మీా సేనను మీారు తీసుకుపొండి" అని నబాబు యెంత మొత్తుకొన్నను ప్రయోజనము లేక పోయెను. ఇందునుగూర్చి మిల్లు చరిత్రకారుడు యిట్లు వ్రాయుచున్నాడు :—

"......... ఆ సమయమున అయోధ్యకు బయటినుండి శత్రు భయ మేమియు లేకున్నను, యీా సైన్యమున కయ్యే ఖర్చు నబాబు కంపెనీ కివ్వవలసిన మొత్తమునకంటె చాల హెచ్చుగనున్నను, యీా సైన్యమును అక్కడనుండి (ఫటేఘర్ నుండి) తీసివేయుటకు వీలులేదని కారన్‌వాలీసు పట్టుబట్టెను."

కారన్‌వాలీసును యిండియాకు పంపునప్పుడే గుంటూరు సర్కారును నైజామునుండి లాగికొనవలయునని డైరెక్టర్లు అతనికి చెప్పి పంపిరి. కాని, రాగానే యీా పనికి పూనుకొన్నయెడల, నైజాముపోయి టిప్పూతో కలుస్తాడేమోనన్న భయముచేత, కారన్‌వాలీసు యీా పనికి నేరుగ పూనుకొనక గుంటదగ్గఱ నక్కవలె సమయముకొరకు నక్కియుండెను. కాని, యెప్పుడైతే నైజాము నిస్సహాయుడను ధైర్యము తనకు తోచినదో అప్పుడు కారన్‌వాలీసు ఒక రాయబారిని మెల్లగ నైజాము వద్దకు పంపించెను. ఈ మాటలు ఫైసలగులోగా యితరు లెవరుగాని రాకుండుటకును, ఒకవేళ నైజాము తిరస్కరించినచో బలాత్కారముగ సదరు సర్కారును ఆక్రమించుకొనుటకును, కారన్‌వాలీసు యీా రాయబారివెంట రహస్యముగ కొన్ని సేనలనుపంపి చాటు చాటున గుంటూరుసర్కారుచుట్టు నిలువ బెట్టించెను. కాని, యిట్టి బలాత్కారముతో అవసరము లేకుండగనే, ఆద్రోహి నైజాము, గుంటూరు సర్కారును యింగ్లీషువారి కర్పించి యూరకొనెను. ఇతడు ద్రోహముచే రాజ్యము సంపాదించుకొనెను. కాబట్టి, యితనికి ధైర్య సాహసములు లేవు. దేశాభిమానములేదు. స్వజాతి గౌరవములేదు. ఎట్లయినను, ఇంగ్లీషువారి

నైజామునుండి గుంటూరు సర్కారును లాగుకొనుట.

ప్రాపకము దొరికినదే మహాప్రసాదమని యెంచి, యీతడు ఇంగ్లీషువారు అడిగినదే తడవుగ, వారికి గుంటూరు సర్కారును కట్టబెట్టెను.

## పరిపాలన ఆంగ్లమయము చేయుట, తెల్లదొరలకు జీతములు హెచ్చించుట.

కారన్ వాలీసు సివిల్ పరిపాలన.

ఇంతవరకు కారన్‌వాలీసు చేసిన యుద్ధకార్యముల గురించియు, పొరుగు రాజ్యములయెడ గావించిన చర్యలగూర్చియు చెప్పితిమి. ఇతడిక సివిల్ పరిపాలన నెట్లుగావించెనో చూతము.

ఇతడు పరిపాలన నంతను ఆంగ్లమయము చేసివేసెను. క్లైవు, వారన్ హేస్టింగ్సులు రాజ్యపరిపాలన లోని సివిల్ శాఖలలోనున్న హిందూ, మహమ్మదీయ ఉద్యోగుల నెవరిని తీసివేయలేదు. ఈ పని కారన్‌వాలీసు చేసెను. దేశీయోద్యోగులున్న దేశీయరాజుల పరిపాలనలోని దేశములే ఇంగ్లీషు పరిపాలనలోనున్న దేశములకంటె చాల సుభిక్షములుగనున్నట్లు ఆకాలపు ఇంగ్లీషువారే స్పష్టముగ వ్రాసియుండిరి. ఈ సంగతి కారన్‌వాలీసుకును తెలియును. ఆతడు ఇండియాలో అడుగుపెట్టగానే ఆతనికి కనబడినది యిదియే. అదిగాక, కంపెనీ ఖజానా ఖాళీగనుండెను. కంపెనీ పాలనలోనున్న ప్రజలందరు క్షామబాధితులైయుండిరి. ఇదివరకు పాడి పంటలతో కలకల లాడుచుండిన గ్రామములు, పట్టణములు, అన్నీ బీడుపడియుండెను. వ్యవసాయము మూలబడి, చేలు బీళ్లువేసి పోయెను. కంపెనీపాలనలోని దేశస్థితి యిట్లుండగ, యిక టిప్పూ సుల్తాన్ మున్నగు దేశీయరాజుల యేలుబడిలోని దేశము చాల సుభిక్షముగ నుండెను. రెంటిని పోల్చి చూచినప్పుడు, మొత్తము మీద కంపెనీ పరిపాలనయే దేశమునకు చాలనష్టదాయకముగ నుండెను. పెద్ద యుద్యోగములలోనుండిన ఇంగ్లీషుదొరలు మిక్కిలి అసమర్థులును, లంచగొండులును అయినట్లు కారన్‌వాలీసుకు స్పష్టముగ తెలిసెను. ఇట్టియుద్యోగులు యేరాజ్యమునకుగాని అవమానము తెత్తురని ఆతనికి తోచెను. అట్టివారిని తీసివేయుటకు బదులుగ, కారన్ వాలీసు వారినే యుంచి వారిని బాగుచేయ దలచెను. ఎట్లు? వారి జీతనాతములు హెచ్చించుటవల్ల. ఎక్కువ జీతమిస్తే లంచాలు పుచ్చుకోరట? ఇది అతని వాదన. ఆరోజులలో వారికి ముట్టుచున్న జీతనాతములు చాలనట్లు? హెచ్చు జీతములమీద ఆధారపడియుండు నీతి యెట్టిదియో ఊహింప జాలకున్నాము. తన ఇంగ్లీషు దొరలను బాగుచేయుట కిది యొకమార్గము! ఇంకొక మార్గమేమనగ :—పెద్దపెద్ద యుద్యోగములలో దేశీయుల నెవరిని చేర్చుకొనకుండ, అవి ఇంగ్లీషు దొరలకే మిరాశీక్రింద అట్టేబెట్టుట! దీనివలన, ఇంగ్లీషు దొరలకు కండ్లు నెత్తికెక్కి, దేశీయులను చాలనీచముగ చూడసాగించిరి. దేశీయులందరు తమ అడుగులకు మడుగులొత్తువారుగను, తమకు వెట్టిచాకిరీ చేయువారుగను, ఇంగ్లీషువారు నాటినుండియే తలంప సాగిరి. దేశీయులు తాము పుట్టిన దేశములో

పరులకు ఊడిగము చేయు గులాములైరి! ఆనాడు కారన్ వాలీసు దేశీయులకు చేసిన అపకారమువల్ల వారు నేటికిని, బాధ పడుచున్నారు. ఈ అక్రమమును యీరోజు వరకు తొలగించుటకు సాహసించిన మహానుభావుడెవ్వడును ఆంగ్లరాచకీయ వేత్తలలో కానరాడు.

భారతీయులు తమ దేశ పరిపాలనమందు కొంతవరకే-ఒకమెట్టువరకే-తప్ప, అంతకుపైన రాకూడదని ఆంక్ష పెట్టియున్నందున, వారి బుద్ధిబలమంతయు నానాట క్షీణించిపోయెననియు, దేశీయులబుద్ధికుశలత శక్తియుక్తులు యిట్లు దిగనాసిల్లుచురాగా, ఎక్కువగౌరవము, ఎక్కువజీతములు, ఎక్కువ ప్రోత్సాహము వుండుటవల్ల ఇంగ్లీషు ఉద్యోగుల బుద్ధికుశలత, సామర్థ్యము నానాటికి హెచ్చుచువచ్చెననియు, ఇది చాల అక్రమమనియు "కే" యను ఆంగ్లచరిత్రకారుడే వ్రాయుచున్నాడు:—చిరకాలము వాడుకచేయక కత్తిని ఒకమూలపారవేసినచో అదియెట్లు తుప్పువట్టి పదును తప్పిపోవునో, అట్లే చిరకాలము గొప్పగొప్ప రాజ్యాంగవ్యవహారములందు బుద్ధినిజొనిపి పనిచేయక కేవలము గుమాస్తాపనియే చేయుచు, కాగితపుకట్టల మోయుచునే యుండినయెడల, బుద్ధికూడ తుప్పువట్టి, పదునుతప్పిపోవును. ఆంగ్లపరిపాలనలో దేశీయులకుగలిగిన మహాఅనర్థకమిదియే. ఈ అనర్థకమును కల్పించినవాడు కారన్ వాలీసు.

దేశీయులకు పెద్దఉద్యోగము లివ్వరాదనుట.

అదివరకున్న న్యాయపరిపాలనా శాఖయందును కారన్ వాలీసు కొన్ని మార్పులు గావించెను. ఇవి దేశమునకు అపకారులయ్యెనేగాని, ఉపకారులు కాలేదు. యుగములనాటినుండి చక్కగ పనిచేయుచున్న గ్రామ పంచాయితీలనుతీసివేసి, యింగ్లండులోనుండు కోర్టులు ప్రొసీజర్లు మున్నగు దిక్కుమాలిన పద్ధతుల నితడు యిక్కడకు తీసికొనివచ్చిపెట్టెను. ప్రజలు వ్యాజ్యాల కోరులు, దగాకోరులు అబద్ధీకులు నగుటకీ కోర్టులు, అగాధమగు ప్రొసీజర్లు యెంతయేనికారణములయ్యెను. ఈమార్పునకు ఆంగ్లేయులే చాలమంది అంగీకరించరైరి. అయిననేమి, హిందూస్థానమును యావత్తు "ఇంగ్లీస్థానము" చేసివేయవలెనని కారన్ వాలీసు సంకల్పించెను. అట్లయినచో ఇంగ్లండులో దమ్మిడీకిచెల్లని శుంఠలకు, పరీక్షలలో తప్పిపోయిన బండ అబ్బాయిలకు యిక్కడ తేరగ ఉద్యోగములుయిప్పించి, వారికి బ్రతుకుతెరువు గల్పింపవచ్చునను ఉద్దేశముతో కారన్ వాలీసు యీపనికి పూనుకొనెను. ఈ మార్పునుగూర్చి మిల్లు చరిత్రకారుడు వ్రాసినమాటలు గమనింపదగియున్నవి:

న్యాయపరిపాలనా శాఖలో మార్పులు - గ్రామపంచాయితీల రద్దు.

"నిరాడంబరమును, హేతుపూర్వకమునునగు పద్ధతులచే అనాదినుండి న్యాయపరిపాలనసాగుచున్న న్యాయస్థానములను తీసివేసి, వానిస్థానే బహుభారమును తప్పీళ్లతోగూడిన కార్యక్రమమును

(ప్రొసీజర్లను) మన ఇంగ్లీషువారు యేర్పాటుచేసిరి. ఈ ప్రొసీజరు యెవరికిని సులభముగ అర్థము గాదు. అనేకసాంకేతిక తంత్రములచే యీపద్ధతి బహు విసుగుదలగను, బహు వ్యయకారణముగను గావింపబడినది. ఈపద్ధతిని కావలెనని బుద్ధిపూర్వకముగ బహు అగాధముగను, మహాగజిబిజిగను చేసివైచిరి. ఇందువలన తక్షణమే గనిపించిన ఒకపెద్ద ఫలితమేమనగ:—పార్టీలు తమకేసులనుతాము వాదించుకొనుట కవకాశములేకపోయెను. (ఇందుకొరకై వారు డబ్బుయిచ్చి ప్లీడరును పెట్టుకొనవలసివచ్చెను) ఈప్రొసీజరుల నన్నిటినిచదివి, నేర్చుకొని, జ్ఞాపకముపెట్టుకొనుటయే జీవనముగ యేర్పరచుకొన్న యీ ప్లీడరులుతప్ప మరి యింకెవరుగాని యిందలి అగాధమగు తప్పీళ్ళను, నియమితమగు నమూనాలతో, నియమితమగు పద్ధతులతో జడ్జీ బుర్రకెక్కునట్లు చెప్పకొన వీలుపడకున్నది. ఈరీతిగ కూలికి వాదించు ప్లీడర్ల కులమొకటి పుట్టవలసిన అవసరమేర్పడినది. దీనివలన యేర్పడిన ఒకగొప్ప యిబ్బందియేమనగ:—అన్నిటికంటె ఉత్తమమగు న్యాయపక్షమునకు ఉండవలసినంత ప్రాముఖ్యము ఉండకుండపోయి, మొత్తముమీద న్యాయమునకు భంగము కలుగుచున్నది.” (Vol. V. P. 355.)

హిందూదేశప్రజలు నేడు వ్యాజ్యముల ఖోరులు, ఫోర్జరీకోరులు, అప్రమాణముల జేయువారు నైరన్నచో యిందుకుకారణము వారియందుగల సహజలోపము గాక, ఆనాడు కారన్‌వాలీసు తనతోడి ఇంగ్లీషుదొరల స్వలాభమునిమిత్త మేర్పరచిన ఈ దిక్కుమాలిన ఇంగ్లీషుకోర్టులవల్లను, ఈ ఇంగ్లీషుప్రొసీజరులవల్లను, యేర్పడినదేయని ఘంటాపథముగ చెప్పవలసియున్నది. ఈపద్ధతి ప్రజల నైతికవృత్తినిచెరచివేసినది.

అపారమేధా సంపన్నుడును, మహాన్యాయమూర్తియునగు ద్వారకనాథ మిత్తర్‌గారు యిట్లు వ్రాయుచున్నారు:—

“అప్రమాణములు, ఫోర్జరీలు, ఘోరముగ పెరిగిపోవుచున్నవి......దీనికి మామూలుగ చెప్పుసమాధానమేమనగ—హిందూదేశస్థులు అసలే అబద్ధీకులట! ఓహో! యీ లోపములు యీదేశమునకే సహజములైనట్లు! విషాదభరితమగు యీదుస్థితికిగల నిజకారణముల నారయుటకు యెంతోదూరము పోనక్కరలేదు. ప్రజల అవసరములకు యెంతమాత్రము సరిపడని (యింగ్లీషు) కోర్టులపద్ధతి నిక్కడ నెలకొల్పుటయు, జడ్జీలుగ వచ్చువారియందు సర్వసాధారణముగగల అసమర్థతయు, వీరికెవరికి ప్రజల ఆచారవ్యవహారములు యెంతమాత్రము తెలియకుండుటయు, తగువిచారణలేక త్వరత్వరగ కేసులను ఫైసలా చేసివేయవలెనను తొందరయు, అను నీకారణములు యీదుస్థితికి చాలవా? ఈదోషమును ప్రజలకేయేల తీసికొనిపోయి అంటకట్టవలెను?.........తమకు లాభము కనిపించుచున్నంతవరకు తమకు వీలుచిక్కుచున్నంతవరకు, ప్రజలు యెవరుగాని, అప్రమాణములు ఫోర్జరీలుచేయుటకు చూచుచునేయుందురు.” (ఈలోపము వక్క ఇండియా ప్రజలమొగముననే పొడువలేము.) “లాబ్” అను ఇంకొక అంగ్లేయుడిట్లు వ్రాయుచున్నాడు:—

“దిక్కుమాలిన మన యీ కోర్టులపద్ధతిచూడండి. ఈదేశములో ప్రవేశబెట్టాలని మనమెంతో క్రిందమీద పడుచున్న యీ పాశ్చాత్య న్యాయవాదపద్ధతికంటె అవినీతికరమగు పద్ధతి యింకెక్కడైనా గలదని మనము ఊహింపనైన గలమా?............మనకోర్టులు

అవినీతికి పుట్టినిండ్లుకావా? వ్యాజ్యాలఘోరుతనము నానాటికి ప్రజలమనస్సుల నావరించి వారిని నానాభ్రష్టుల జేయుటలేదా? సాధ్యమైనంతవరకు వారికేసులువారే ఫైసలాచేసుకొను నట్లు మనమేల వారికే వదలివేయరాదు? దేశములో గల్లంతులులేకుండ శాంతిభద్రతలు గాపాడుచు, దేశసంపదను పెంపొందించు పని మనము చేసుకొనుచుంటే మనకంతేచాలు.''

కారన్‌వాలీసు యేర్పరచిన యీన్యాయపరిపాలనాపద్ధతి చాలపక్షపాతముగ నున్నది. ప్రజలకొకపద్ధతియు, గవర్నమెంటుకొక పద్ధతియు యేలవుండవలెను! ప్రజలు మాత్రముకోర్టుఫీజులు, స్టాంపుఫీజులు, చెల్లించుకొని అగాధమగు ప్రొసీజరుగుండ పోవలెనట! అదేగవర్నమెంటుకేసైతే వారికి యివేమియు అక్కర లేదట! వారి కేసులు''సమ్మరీగ'' ఫైసలు కావలెనట. వారికి రావలసిన సిస్తు దస్తుల వసూళ్లకై యీప్రొసీజరులేమియు అక్కరలేదట! జబర్దస్తీగ ''సమ్మరీగ'' వసూలు చేసుకొన వచ్చునట. ఈపద్ధతి చాల అక్రమమని మిల్లు చరిత్రకారుడువ్రాయుచున్నాడు. ఇట్టివే యెన్నోలోపములను యీచరిత్రకారుడు వర్ణించుచున్నాడు. వానినన్నిటినిటవివరించుట అనవసరము, అవియన్నియుమనప్రజలకు అనుభవైకవేద్యమేగాన, యీవిషయము నిట విరమింతము.

ప్రజలస్థితి-కంపెనీకి పూర్వము; తరువాత.

ఇంగ్లీషువారు రాకపూర్వము ఇండియాలో అరాచకముండె నని తరుచు ఆంగ్లేయులు వాకొను చుందురు. ఇందుకు నిదర్శనములు గానరావు. దండయాత్రలసమయములలో యుద్ధసమయములలో దేశము గల్లంతుగ నుండుట సహజముకాని, సుస్థిరరాజ్య మేర్పడిన తరువాత యిట్టిగల్లంతు లేమియు వున్నట్లు కానరావు. వ్యవసాయము, చేతివృత్తులు స్వేచ్ఛగ పెంపొంది దేశీయుల యేలుబడిలోనున్న ప్రజలు సుభిక్షముగనున్నట్లు కారన్‌వాలీసు ఇండియాలో అడుగుపెట్టగానే, అతని కండ్లకే కనుపించెనుగద. కాని, అంతకుపూర్వము 30, 40, యేండ్లకిందటనే, యింగ్లీషువారి పాలనలోనికి వచ్చిన బంగాళాదేశపుగతి యెట్లుండెను.? తురకల యేలుబడిలో ''భూలోక స్వర్గము''గ నున్న యీ బంగాళాదేశము, ఇంగ్లీషువారి చేతిలోనికి వచ్చిన కొలది కాలమునకే క్షామదేవతకు నిలయమైనట్లు కంపెనీ రికార్డులే ఘోషించుచున్నవిగద. ఇంగ్లీషువారు ప్రజల ధన, మాన, ప్రాణములకు తగు రక్షణయొసంగలేక పోయిరిగద. అరాచకమన యిదిగాక మరి యింకేమి? 1712 సంllలో ప్రచురమైన పార్లమెంటువారి అయిదవ రిపోర్టులో యిట్లున్నది:—

''రాజషాహి పరగణాలో దోపిడీలు విచ్చలవిడిగ చెలరేగుచున్నవి.............. ఎంత వరకు యివి ప్రాకినవో చెప్పజాలము. అక్కడ నిరంతరము యెడతెగక జరుగుచున్న ఘోర ములు, ఖూనీలు, గృహాదికదహనములు, మితిమీరిన క్రూరకృత్యములు, వీనినన్నిటిని గవర్న మెంటుకు సరిగ తెలియబరచినచో యీదుస్థితిని చక్కబరచుటకు వారు తగుచర్యగైకొందు రని నాకు నమ్మికముగలదు. ప్రజలను దోపిడీలనుండియు, హత్యలనుండియు, తప్పింపవలెనని యెంతో ఆతురతతోనుండని గవర్నమెంటుమనిషి ఒక్కడుకూడ లేడు. అయినప్పటికి ప్రజల

గతిజూచుటకు తగు దిక్కులేకున్నది. ప్రజల ప్రాణమునకుగాని వారి ఆస్తికిగాని రక్షణ లేదనుట నిశ్చయము-ముమ్మాటికి నిశ్చయము. ఇదికాదనుట కెవరికిని వీలులేదు. బెంగాలులో చాలజిల్లాలలో నేడున్నస్థితి యిట్టిది.''

బంగాళాదేశము ఇంగ్లీషువారి యేలుబడిలో అర్ధశతాబ్దకాలము—50 ఏండ్లు వున్నతరువాత దానిస్థితి యిట్లుండెను. ఉన్నసితి యిట్లుండగ, ''మేమురాక పూర్వము మీదేశమంతా అరాచకంగా వున్నదని'' ఇంగ్లీషువారు యేమొగము పెట్టుకొని చెప్పగలరు? వీరు వచ్చినతరువాత వెలిగించినదేమి? అంతకుముందు అరాచకముండెనో లేదో దైవమునకే యెరుకగాని, వీరు వచ్చిన తరువాతమాత్రము దేశము అరాచకమై, క్షామదేవతకు నిలయమైనట్లు లోకమునకు, కండ్లకు గట్టినట్లు గన్పించుచున్నది. చూడుడు! గవర్నమెంటు సెక్రటరీ డౌడెస్‌వెల్ అనునతడు 1809 సంIIలో యేమని వ్రాయుచున్నాడో.—

''దేశములో దోపిడిగాండ్రు చేయుచున్న దురంతములలోను వానివల్ల ప్రజలు పొందుచున్న బాధలలోను వెయ్యోవంతు నేను వర్ణింపగలిగినను, భాషకు వీలైనంతరీతిగ నేను యీ దారుణములను తగ్గించిచెప్పినను, అక్కడి నిజస్థితిని నేను సరిగవర్ణింప నసమర్థుడనే యగుదునని సాధయము.

దొంగతనములు, దోపిడీలు, మానభంగములు, ఖూనీలుసహా, యీ దారుణదృశ్యములలో స్వల్పాంశములనియే చెప్పవలసియున్నది........................ఈ దుండగులు చేయు దురంతములగూర్చి బీరువాలకొద్దీ గ్రంథముల వ్రాయవచ్చును. అందులో ఒక్కొక్కపంక్తి చదివితే లోనిరక్తము భీభత్సముచే గడ్డకట్టుకొనిపోవును.''

ఇట్టి దుస్థితికి కారణమేమి? యాభైయేండ్ల బ్రిటీష్ పరిపాలన కాదా?

## పర్మనెంటు సెటిల్‌మెంటు

కారన్‌వాలీసు బెంగాలులో పర్మనెంటు సెటిల్‌మెంటు (భూమికి శాశ్వతపు శిస్తు పైసలా) యేర్పరచెనని చాలమంది అతనిని అనవసరముగ పొగడుచున్నారు. దీనికి మూలకారకుడు పూర్వము సుప్రీము కౌన్సిలులో మెంబరుగ నుండిన ఫ్రాన్సిసుగాని, కారన్‌వాలీసు కాదు. కంపెనీవారు బెంగాలు, బీహారు, ఒరిస్సా రాష్ట్రములకు దివానీగిరి సంపాదించుకొన్న పిమ్మట, పొదుగు కోసుకొని పాలు త్రాగవలెనని జూచిరి. ఇదివరకున్న భూమి శిస్తు పద్ధతిని తీసివేసి, జమీందారులను, రైతులను భూములనుండి వెడలగొట్టి, వానిని ఏకసాలా, దోసాలా కవుళ్లకు బహిరంగముగ వేలము వేయుచు వచ్చిరి. ఎవరెక్కువ కౌలు యిస్తానంటే వాడికి యిచ్చివేయుచుండిరి. దీనివలన, అడ్డమైనవాళ్లు పాటలమీద పాటలు పెంచి, తరతరముల నుండియున్నవాళ్లను త్రోసివేసి, తామైతే భూములను ఆక్రమించుకొనిరి గాని, శిస్తు దస్తులను క్రమముగ చెల్లించలేక పోయిరి. త్రాడు బొంగరములేని బేవారసు

కుంతలందరు వ్యవసాయమును క్రమముగ చేసుకోనలేక, శిస్తు దస్తులను క్రమముగ సర్కారుకు చెల్లించలేక, యిటు వెనుకటి రైతులను, అటు సర్కారునుకూడ నష్ట పరచి, భూములను పాడుబెట్టి, దేశమును నానాసంక్షోభమును చేసిరి. దేశము అడవి అయ్యెనని బర్కు చెప్పెను. బంగాళములో 1770-వ సం॥ లో గొప్ప కరవు వచ్చుటకు యీ స్వల్పకాలపు కౌల్లే కారణము. ఈ పద్ధతి చాల అరిష్ట దాయకముగ నున్నదని తోచి, అనేక పద్ధతులను కిందమీద పడిచూచి, ఆఖరుకు యీ స్వల్పకాలపు కౌల్ల పద్ధతి పనికిరాదని, నిశ్చయించుకొని, దీర్ఘ, శాశ్వత శిస్తు ఫైసలా పద్ధతి నెలకొల్పుటకై ఫ్రాన్సిస్ మున్నగువారు అదివరకే శిఫార్సుచేసి యుండిరి. ఈ శిఫార్సులను సీమ డైరెక్టర్లు అంగీకరించుచు, కారన్‌వాలీసును ఇండియాకు పంపించునప్పుడు "నీవు దీనిని అమలులో పెట్టవలసినదని" వారతనికి చెప్పిపంపిరి. కాబట్టి యిందు కారన్‌వాలీసుయొక్క గొప్పతన మేమియు లేదు. దీనిని కని పెట్టినవాడు, దీనికై హోరాహోరి పోరాడి సీమ డైరెక్టర్లచే ఒప్పించినవాడు ఫ్రాన్సిస్.

అయితే, అతడానాడు చెప్పినమాటలు అప్పటివారి బుర్రల కెక్కలేదు. కాని, కారన్‌వాలీసు ఇండియాలో కాలుబెట్టునప్పటికి ఖజానాలో ఖాళీసంచులు కనిపించెను. దేశములో చాలభూమి బంజరుగ నుండెను. ఇదివరకు సాగులో నున్న భూమి బీడుపడియుండెను. ఈ దుస్థితిని తొలగించుటకే—అనగ తన ఖజానాను నింపుకొనుటకే—కారన్‌వాలీసు విధిలేక యీ శాశ్వత తరముల నెలకొల్ప వలసి వచ్చెనుగాని, ప్రజలమీద తనకు పొంగిపొరలి వచ్చుచున్న ప్రేమాతిశయము చేతకాదు. ప్రజలయందు ప్రేమయే యుంటే యితడు హిందూ దేశస్తులను ఉద్యోగములనుండి యేల యూడబెరికి వేయును? పూర్వము మహమ్మదీయ ప్రభువులు తమ రివిన్యూ యిలాకాలో హిందువులనే యెక్కువగ ఉద్యోగములలో చేర్చుకొనిరి. కాని, కారన్‌వాలీసు వచ్చినతరువాత వారినందరిని తీసివేసి, రివిన్యూ డిపార్టుమెంటు మాత్రమేగాక, యావత్తు సివిల్ మిలిటరీ డిపార్టుమెంటులలోను ఇంగ్లీషు దొరలనే కారన్‌వాలీసు దూర్చెను. హిందూదేశ ప్రజలయందు యితని కెంతమాత్రము ప్రేమగాని, గౌరవముగాని లేదు. ఇందుకితడు పలికిన యీ క్రింది నిందావాక్యములే నిదర్శనములు. "నేటివు చేతులలో పెడితే పరిపాలన అంతా నాశన మౌతుంది. ఇండియాలో ప్రతివాడు లంచగొండియే యని నా నమ్మకము."

కారన్‌వాలీసు భూములకు శాశ్వతతరముల నేర్పరచినాడన్న మాటయే గాని, ఆతడు నిర్ణయించిన రేటు బహు భారముగనుండెను. ఈ రేటు నిచ్చుకోన లేక అనేకమంది భూస్వాములు దివాళాలెత్తిరి. శిస్తు బకాయి పడినదే తడవుగ భూములు వేలము వేయుచుండిరి. ఈ రీతిగ పదేండ్లలో భూములు చాల తారు

మారమ్యెను. ప్రతియేట వేలకొలది యెకరములు వేలము పడుచుండెను. ఇక కారన్‌వాలీసు ప్రజలయెడ చూపిన దాక్షిణ్యమెక్కడ?

కారన్‌వాలీసుయొక్క యేడేండ్ల పరిపాలననుగూర్చి వివరించితిమి. ఈ యేడేండ్లలో, యితడు తనకులోగడ అమెరికాలోపోయిన కీర్తిని సంపాదించుకొనెను. తన కోమటి యజమానులకు నూతన రాజ్యమును, ధనమును, సంపాదించి పెట్టెను. ఇందుకు వారుమెచ్చుకొని, అతనికి ఉన్నతమైన బిరుదములిచ్చిరి.

మరియు రెండవసారికూడ "నీవే యిండియాకువెళ్లు" అని చెప్పి, మరల యితనిని యిండియాకు 1805 సం॥ లో గవర్నర్‌జనరల్‌గ పంపించిరి. (ఆ చరిత్ర పిమ్మట వివరించెదము). ఇతని రెండవ పరిపాలన కొద్దినెలలు మాత్రమే యుండెను. ఏలననగ, యిక్కడికి తిరిగివచ్చిన కొద్దినెలలకే కారన్‌వాలీసు యిండియాలోనే మరణించెను. ఈ కొలది కాలములో యితడంతగ చేసిన పనులేమియులేవు.



# బ్రిటిష్ మహాయుగము

## పదిహేనవ అధ్యాయము



### సర్ జాన్ షోర్ పరిపాలన. (1793-1798.)

1793. కంపెనీ కౌలు రిన్యూ చేయుట.

1793 సం॥ లో యీస్టిండియా కంపెనీ తాలూకు కౌలు పార్లమెంటువారిచే రిన్యూ చేయబడినది. మరియొక యిరవై సంవత్సరములవరకు యీ కౌలు అమలులో నుండునట్లేర్పాటు గావింపబడినది ఈ పట్టాను మంజూరు చేయునప్పుడు దానిలో ఈ క్రిందిక్లాజు చేర్చిరి :—

పరరాజ్యాక్రమణ దూష్యమని పార్లమెంటువారి శ్రీరంగనీతి.

“దేశములను జయించి, రాజ్యములను కలుపుకొనుటయను మాటయే ఇంగ్లీషు జాతియొక్క కోర్కెకు, గౌరవమునకు రాజ్యాంగ పద్ధతికి కేవలము విరుద్ధము.” ఈక్లాజు నిందు శ్రమపడి చేర్పించినవాడు ఫ్రాన్సిస్ అను సంగతిని మరువరాదు.

అప్పుడు యింగ్లండుకు ప్రధానిగనున్న పిట్టుమంత్రి రాజ్యవిస్తీర్ణతకు విముఖుడుగాడు. అయినను, అప్పుడు ప్రక్కనున్న ఫరాసు దేశములో విప్లవము బహుతీవ్రముగ చెలరేగుచుండెను. ఈ విప్లవ తుఫాను తమ దేశముమీదికికూడ వచ్చిపడునేమో యనుగాభరా ఇంగ్లీషువారి కుండెను. ఈ విప్లవము నెట్లయిన వారించుకొనవలెనని యెంచి, దానికి విరుద్ధముగ ఇంగ్లీషువారు ప్రచారము గావింప సాగిరి. ఇందుకొరకై బర్కుకు సాలుకు 1500 పౌనులు లంచమిచ్చి అతనిచేత ఫ్రెంచి విప్లవముపై పెద్ద దూషణ గ్రంథమును వ్రాయించిరి. ఇట్టి తరుణములో తమకు పరరాజ్యాక్రమణ కాంక్ష లేదనియు, తాము మడిగట్టుకు కూర్చున్న శాంతి ప్రియులనియు, లోకమునకు వెల్లడించి, లోకముకండ్లలో దుమ్ము కొట్టుటకు గాను పార్లమెంటు వారీ పట్టాలో పైవాక్యమును చేర్చిరి.

ఆసమయమున యిండియాలో క్రొత్త రాజ్యమును సంపాదించుకొనుట ఇంగ్లీషువారికి యిష్టముగ గన్పట్టక పోయినను, హిందూదేశ ప్రజలవృత్తులను నాశనముచేసి, వారినోటికడ అన్నమును బుద్ధిపూర్వకముగ పడగొట్టుట మాత్రము వారికి విరుద్ధకార్యముగ గన్పట్టలేదు! హిందూదేశములో తయారైన యేవస్తువులు గాని యింగ్లండులోనికి రాకుండ నిషేధించుచు యీ ఆక్టులో ఒక క్లాజును చేర్చ

వలసినదని ఇంగ్లీషు ప్రజలు కొందరప్పుడు చాల పట్టుబట్టిరి. ఇండియానుండి సరుకులు వచ్చినచో యింగ్లండు ప్రజల వృత్తులు పోవునని వారు గోలపెట్టిరి. మాంచెస్టరు, గ్లాస్గోపట్టణములలో ప్రత్తిపరిశ్రమయందు పనిచేయువారందరు యేకమై యిండియా నుండి వస్త్రములు యింగ్లండులో దిగుమతికాకుండ నిషేధించవలెనని 1788 సం॥లో పార్లమెంటువారికి గట్టిగ విన్నవించుకొనిరి. ఇట్టి విన్నపములే యీసారి తిరిగి 1793 సం॥లో సైతము గావింపబడెను.........ఇండియాకు నేత, వడుకు, యంత్రములు యెగుమతి చేయరాదనియు, యీ యంత్రములను యిండియాలో ఉపయోగింప రాదనియు, ఈస్టిండియా కంపెనీవారికిచ్చిన యీ పట్టాలో ఒక క్లాజు చేర్పించ వలసినదని వారు ప్రధాన మంత్రికి విన్నవించుకొనిరి.

కాని, ధర్మ పన్నాగముల బర్కు పిట్టు మంత్రి యింతటి అన్యాయమగు పర తును బహిరంగముగ ఆక్టులో లిఖించుటకు జంకెను. అయినను దీని భావమును కారన్‌వాలీసు గ్రహించి, క్రియలోమాత్రము గ్లాస్గో, మాంచెస్టరు వర్తకుల మనోభీష్టమును పూర్తిగా నెరవేర్చెను. హిందూదేశస్థులను గొప్ప పదవులలో నుండి తొలగించుట కితడు చేసిన పనియంతయు యీ సంకల్పముతోనే చేసెనని చెప్పతగి యున్నది.

ఇండియాకు కృతాప రాధుడగు షోర్ గవర్నర్ జనరలగుట.

తమ శాంతి ప్రియత్వమును లోకమునకు వెల్లడించుటకు ఆంగ్ల మంత్రి వర్గమువారు పైకిమైనను శాంతి ప్రియుడుగ నటించు పెద్ద మనిషిని యేరి ఇండియాకు గవర్నర్ జనరలుగ పంప వలసివచ్చెను. వెదకి వెదకి వారు ఆఖరుకు "జాన్ షోర్" అను నొకనినివరించిరి. ఇతడు ఇదివరకు యిండియాలోచాల కాలము కంపెనీ కొలువులోనుండి వారన్‌హేస్టింగ్సు చేసిన అత్యాచార కార్య ములన్నిటియందును అతనికితడు కుడిభుజముగనుండి పనిచేసియుండెను. వారన్ హేస్టింగ్సుతో పాటు యితడుకూడ ఆ సమయమున పార్లమెంటు యెదుట దాదాపు ముద్దాయిగనుండెను. హేస్టింగ్సుపై మోపబడిన నేరముల పెక్కింటిలో — ముఖ్యముగ రివిన్యూబోర్డు పరిపాలనలో యితడొనర్చిన అనేక అక్రమములలోను మరి యితర క్రిమినల్ స్వభావముగల నేరములలోను, యీ షోర్ అనునతడు వారన్‌హేస్టింగ్సుతో పాటు సమానముగ బాధ్యుడై యుండెనని ఫిర్యాదీలప్పుడు యితనిపై సైతము సాక్ష్యము తెచ్చుచుండిరి. ఈ రీతిగ యితనిపై క్రిమినల్ చర్య పార్లమెంటు యెదుట జరుగుచుండగ — యీ ముద్దాయిని తీసికొనిపోయి, యెక్కడైతే యితడీనేరముల చేసినాడో అటువంటి ఇండియాకే గవర్నర్ జన రల్‌గ—సర్వం సహాధికారిగ—చేయుట చాల ఘోరమనియు, అవినీతికరమనియు, నీతికి, ధర్మమునకు, విరుద్ధమనియు బర్కు మహాశయుడు తీవ్రముగ ప్రతిఘటించుచు కంపెనీ అధికారులకును, ఆంగ్ల మంత్రివర్గమునకును పెద్ద లేఖను 1792-వ సం॥

అక్టోబరు 14-వ తేదీన వ్రాసెను. (Life of Lord Teignmouth Vol. I, P. p. 226—230.)

అయినను, ఆంగ్ల మంత్రిమండలివా రితని మాటలను పాటింపక కృతాపరాధుడగు యీ షోరుకే 'సర్' బిరుదమిచ్చి—యిండియాకు గవర్నర్ జనరలుగ పంపించిరి.

ముబారక్ - ఉల్ దౌలా, పుష్కల సంతానము.

1793-వ సం॥ అక్టోబరు 28-వ తేదిన సర్ జాన్ షోర్ కలకత్తాలో ఓడదిగి వెంటనే గవర్నర్ జనరల్ పనిని స్వీకరించెను. ఇతడు కలకత్తాకు వచ్చుటకు ఒకనెలకు పూర్వమే స్వామి ద్రోహి మీర్జాఫర్ సంతతివాడగు నబాబు ముబారక్ ఉల్ దౌలా ఇరవైమూడేండ్లు నామకః నబాబు గిరియందుండి తన 37-వ యేట చనిపోయెను. ఈ 23 యేండ్ల పరిపాలనలో యితడు పాతికమంది పిల్లలనుకనుట తప్ప వేరొండు ఘనకార్యమేమియు చేయలేదు! వీరిలో 12 గురు కొడుకులు, 13 గురు కూతుళ్లు. పెద్దకొడుకు ఉజీర్ ఉల్ దౌలాను కంపెనీ వారు మూర్షిదాబాదు గద్దెపై కూర్చుండబెట్టి, సర్ జాన్ షోర్ యింకొకనెలకు వస్తాడనగ, (1793-వ సం॥ సెప్టెంబరు 28-వ తేదీన) అతనిని బెంగాలు నబాబుగ కలకత్తాలో ప్రకటించిరి.

కలకత్తా అభివృద్ధి.

సర్ జాన్ షోర్ పరిపాలన అయిదేండ్లలోను యెట్టియుద్ధములుగాని లేకయే శాంతముగ వెళ్లిపోయెను. అందుచే యితడు కలకత్తా పట్టణాభివృద్ధికై కొంతపనిచేయ వీలుగలిగెను. కలకత్తాలోని పోలీసు సిబ్బందిని అభివృద్ధిపరచి నేరస్థుల కనుగొని శిక్షించుటకును, వీథులనూడ్చి శుభ్రపరచుటకును, కల్లు, సారాయున్నగు మద్యపదార్థముల క్రయ విక్రయముల సరిగ జరిపించుటకును, ప్రజల సౌఖ్యమున కింక పనికివచ్చు యితరపనుల చేయించుటకును, యితడొక కమిటీని యేర్పాటుచేసెను.

దేశీయరాజుల కాలిక్రింద గోతులు.

సర్ జాన్ షోర్ కాలములో యుద్ధపు హడావుడు లేమియు లేకపోయినను, లోలోన యితడనేక తంత్రములచేతను, అక్రమములచేతను, హిందూదేశమందున్న నానారాజ్యములవారి బలోత్సాహములను క్రుంగదీసెను. వారిలో మహారాష్ట్రులు, నైజాము, ఆర్కాటు నబాబు, రోహిలాలు, అయోధ్య నబాబు, ముఖ్యముగ యెన్నదగి యున్నారు. వీరియెడ సర్ జాన్ షోర్ యెట్లెట్లు ప్రవర్తించెనో వేర్వేరుగ వివరించెదము.

## మహారాష్ట్ర ఖండము.

ముందుగ మహారాష్ట్రుల గూర్చి చెప్పెదము. 1782 సం॥ మేనెల 17-వ తేదీనాడు "సాల్బే" ఒడంబడికతో ఇంగ్లీషువారికిని, మహారాష్ట్రులకును జరిగిన మొదటి మహారాష్ట్రసంగ్రామ మంతరించెనని లోగడ 9-వ అధ్యాయములో చెప్పియుంటిమి. తదుపరి సుమారు, 12 యేండ్లకు సర్ జాన్ షోర్ ఇండియాకు గవర్నర్ జనరల్‌గ వచ్చెను. ఇతడువచ్చిన తరువాత వారికిని, వీరికిని జరిగిన చరిత్రను చెప్పుటకు పూర్వము, వెనుకటి 12 యేండ్లలో యేమిజరిగినదో ముందుగ వివరించుట అవసరము. మహారాష్ట్రులను బహిరంగయుద్ధములో ఓడించుట దుస్సాధ్యమనియెంచి, వారిలో యెట్లయినను గృహకల్లోలముల గల్పించి, వారి రాష్ట్రకూటమును బ్రద్దలు కొట్టి, పిమ్మట వారిని వంచవలెనని ఇంగ్లీషువారు యీ పన్నెండేండ్లలో సైతము మహారాష్ట్రులపై ప్రత్యేక మొక కన్ను వేసియుంచి, అడపదడప వారి వ్యవహారములలో నెమ్మదిగ జోక్యము కలిగించుకొనుచునే వచ్చుచుండిరి.

మాధవరావు సింధియా కంపెనీ వలలోపడుట.

రండాపుత్రుడగు **మాధవరావు** సింధియా మధ్యవర్తిత్వము ద్వారా సాల్బే సంధి సమకూడెనని లోగడ చెప్పియుంటిమి. వారన్ హేస్టింగ్సు యీ సింధియా చెవిలో యేదియో యూది యీ సంధి కుదిర్చి పెట్టమని ఆతనిని బ్రతిమాలినట్లును వెనుకనే చెప్పియుంటిమి. ఈ చెవిలో యూదిన రహస్యమేమియో క్రమముగ బయట పడజొచ్చెను. సింధియా వారన్ హేస్టింగ్సు మాయలలో బడెను. అట్లు ఢిల్లీచక్రవర్తిని అనామకునిచేసి వైచుటకును, యిటు మహారాష్ట్ర రాష్ట్రకూటమును విచ్ఛిన్న మొనర్చుటకును, వారన్ హేస్టింగ్సు రండాపుత్రుడగు యీమాధవరావు సింధియాను బాగుగ వుపయోగించుకొనెను.

వారన్ హేస్టింగ్సు సింధియాకు యూరోపియను ఉద్యోగులను అద్దెకిచ్చి, ఆతనిసేనల నన్నిటిని **యూరోపియనుపద్ధతిని** తరిఫీయతు చేయించెను. వారికి యూరోపియను డ్రిల్లు, కవాతు నేర్పించెను. యూరోపియను పద్ధతిని ఫిరంగులు, తుపాకులు వగైరాలు కాల్పించుట నేర్పించెను. ఇదంతయు తనమేలుకొరకేయని వెఱ్ఱి మొగమగు సింధియా లోలోన కులుకుచుండెను. తాను తక్కిన మహారాష్ట్ర ప్రముఖులందరికంటె బలవంతుడ నగుచున్నానని యీతడు లోలోన సంబరపడుచుండెను. యూరోపియనులను యెక్కువగ తనసేనలో చేర్చుకొనవలసినదని వారన్ హేస్టింగ్సు కపటబుద్ధితో సింధియాకు ఊరక బోధించుచుండెను. తన అంతరంగికులలో ఒకనిని "డీబోయిన్"-అనునతనిని, సింధియాకు అద్దెకిచ్చి అతనిచేత సింధియాసేనలనన్నిటిని తయారుచేయించుచుండెను. "సింధియా తనసేనలనన్నిటిని

సింధియా సేనలకు యూరపియన్ ఆఫీసర్ల డ్రిల్లు.

యూరోపియనుపద్ధతిని తయారుచేయించుచున్నాడు. ఇది మనకు చాల అపాయకరముకాదా'' యని కౌన్సిలులోనిమెంబరు వారన్‌హేస్టింగ్సును హెచ్చరించినప్పుడు ''మీరేమీ భయపడకండి; అదంతా అతని నాశనానికే జరుగుతోందిలెండి''-అని వారన్‌హేస్టింగ్సు సమాధానము చెప్పినట్లు రికార్డులలో స్పష్టముగగలదు. ఈ జోస్యము అక్షరాలా నిజమైనది. తక్కిన మహారాష్ట్ర ప్రముఖులకంటె తానే బలవంతుడనని యిందుమూలముగ సింధియాగర్వించి, తక్కినవారినందరిని తృణీకారభావముతో చూడసాగెను. అందువల్ల తక్కినవారికిని యితనిపై యీర్ష్యగలుగుటయు సహజమేగద. ఇదియే వారన్‌హేస్టింగ్సుకు కావలసినది! వారిలో వారికి పరస్పరము యీర్ష్యగలుగుటకంటె వారన్‌హేస్టింగ్సుకు యింకయెక్కువగ కావలసినదేమున్నది? ఈరీతిగ యితడు వేసినమంత్రము పారినది. సింధియాసేనలకు యూరోపియను డ్రిల్లు, కవాతు వగైరాలు నేర్పించుట, యూరోపియను ఆఫీసర్ల నద్దెకిచ్చుట, మున్నగుపనులన్నియు మహారాష్ట్రుల బలమును హెచ్చించుటకుగాక, వారిని క్రుంగదీయుటకేయని ఆరోజులలో గ్రహించని వారు యిద్దరేయుండిరి. వారెవరనగ, వారన్‌హేస్టింగ్సు, నానాఫర్నవీసు. వెఱ్ఱిముగము సింధియామాత్రము గ్రహించలేకపోయినాడు. గ్రహించలేక, ఆంగ్లభల్లూకపు తియ్యనిమాటలకులోబడి దానిని గట్టిగ కౌగిలించుకొన్నాడు, అది అతనిని గట్టిగరొమ్ముకునొక్కి, ఎముకలు పెటపెట విరిచివేసెను. తనను విరిచివేయుటతోపాటు, మహారాష్ట్ర సామ్రాజ్యమునుకూడ పొడిపొడిగ చూర్ణముచేసెను.

*సింధియా బాదుషాను చెరబెట్టుట; ఇంగ్లీషువారి సంబరము.*

యూరపియనుపద్ధతితో తయారై, యూరోపియను ఆఫీసర్లచే నడిపింపబడుచున్న తనసేనను చూచుకొని, సింధియామురియుచు, తనకంటె బలవంతుడెవడనుగర్వాతిరేకముచే విజయయాత్రల సాగింపసాగెను. మొట్టమొదటగ యితడు ఢిల్లీ పాదుషాపైకియే ధ్వజమెత్తివెళ్లి, అతని నోడించి ఖైదుచేసెను. ఇదంతయు వారన్‌హేస్టింగ్సు ప్రేరేపణయే. అనవసరముగ తమపూర్వమిత్రుడగు ఢిల్లీ పాదుషాపైకి మాధవరావు సింధియాను ఉసిగొలిపి అతని నవమానించుట ఆంగ్లజాతికి చాల కళంకమనిచెప్పి పార్లమెంటులో యితనిపై పెట్టబడిన కేసులో నిదియొక చార్జిగ మొదట పేర్కొనబడెను. కాని, యేకారణముచేతనోగాని, యీ చార్జిని పార్లమెంటువారు పూర్తిగ విచారించరైరి. ఇతరచార్జీలతోపాటు దీని విచారణకూడ పూర్తిగ జరిగియుండినచో, చరిత్రప్రసిద్ధమగు విశేషాంశము లింకనెన్నియో బయటపడియుండెడివి. మాధవరావు సింధియా యెప్పుడైతే ఢిల్లీ పాదుషాను పట్టిబంధించి, చెరసాలలోవేసెనో. అప్పుడు వారన్‌హేస్టింగ్సుకు గలిగిన సంబరమునకు మితిలేదు. తమ కంపెనీకి బెంగాలు, బీహారు, ఒరిస్సారాష్ట్రములపై 'దివానీగిరి' పదవినిచ్చి, తమ వర్తకమునకు లోగడ అనేక సౌకర్యముల నేర్పరచి

తమ కిక్కడ అసలునిలువ నీడనిచ్చిన ఢిల్లీపాదుషాయెడ కృతజ్ఞుడై యుండుటకు బదులుగ వారన్ హేస్టింగ్సు మాధవరావు సింధియాను అతనిమీదికి ఉసుగొలిపి, అతనిని ఖైదుచేయించుట యెంతటిద్రోహము!

ఇదిచాలక, వారన్ హేస్టింగ్సు యిప్పటినుండి ఢిల్లీ చక్రవర్తికి మామూలుగ యివ్వవలసిన కప్పమునుకూడ ఎగబెట్టసాగెను. ఢిల్లీపాదుషా తరఫున యీకప్పము గూర్చి మాధవరావు సింధియా యెన్నిమారులు అడిగినను కంపెనీవారు జవాబుచెప్పక మెదలకుండ ఊరుకొనిరి. వారన్ హేస్టింగ్సు వెళ్లిపోయినతరువాత వచ్చిన ప్రతి గవర్నర్ జనరలునుకూడ యిందునుగూర్చి మాధవరావు సింధియా అడుగుచునే వచ్చెను. కాని, వారెవరును మాట్లాడరైరి. ఆఖరుకు కారన్‌వాలీసు కాలములో "యీకప్పమును యికయిచ్చేదిలేదు, పొమ్మ"ని అతడు ఖండితముగ చెప్పివేసెను. అప్పుడైనను సింధియాకు రోషమురాక బుర్ర గోకుకొనుచు, ఊరకుండెనేగాని ధైర్యముగ ఇంగ్లీషువారిపై దండెత్తి, యీకప్పమును తిరిగి సంపాదించుకోలేక పోయెను. ఈరీతిగ కంపెనీవా రితనిని ఉపకరణముగ ఉపయోగించుకొనిరేగాని, యితనికిగాని, మహారాష్ట్రులకుగాని రవంతయైనను ఉపకారము చేయరైరి.

*కంపెనీవారు బాదుషాకు కప్పము నెగబెట్టుట.*

ఇక యింగ్లీషువారు మహారాష్ట్ర ప్రముఖులలో యెట్లు పరస్పరము యీర్ష్యలను, గృహకల్లోలములను కల్పించి, పరస్పరము ఖూనీలును, యుద్ధములును, చేసుకొని చచ్చునట్లు చేసిరో చూతము. మహామాంత్రికుడగు మాస్టిన్ మారణమైన తరువాత, తిరిగి ఆక్టింగు గవర్నర్ జనరల్ అగు మాక్ ఫర్సన్ కాలములో "మాలెట్" (చార్లెస్ మాలెట్) అను యింకొక మాంత్రికుని యింగ్లీషువారు పునహాకు రాయబారిగ పంపిరి. మహారాష్ట్రులయందు పరస్పరము కల్లోలముల గల్పించుటలో యితడు మాస్టిన్‌కంటె యేడాకు లెక్కువ చదివినవాడే యయ్యెను. సింధియాకును, వారన్ హేస్టింగ్సుకును రహస్యముగ జరిగిన ఒడంబడిక సంగతి తరువాతవచ్చిన గవర్నరు జనరలుకు గాని, తక్కిన కంపెనీ యుద్యోగులకుగాని పూర్తిగా తెలియదు. అందుచే, సింధియా నానాటికి బలవంతుడగుచున్నాడను భయము కంపెనీవారికి గలిగి, యితని నెట్లయినను అణగగొట్టవలెనని వారు చూచిరి. అదిగాక, ఒకదెబ్బతో రెండు పిట్టలను కొట్టవలెననికూడ వారు చూచిరి. ఇటు సింధియా పొగరణచుటకును, అటు మహారాష్ట్ర రాష్ట్రకూటమును బ్రద్దలు కొట్టుటకును పనికివచ్చు యెత్తును వారు వేసిరి. ఇందుకుగాను మొట్టమొదటగ వారు హోల్కారు ముద్దిగిల్లి సింధియా మీదికి ఉసుగొలిపిరి. ఇరువురకును పరస్పరము యుద్ధము జరిగెను. మహారాష్ట్ర ప్రముఖులు తమలోతాము కలహించుకొనుట కిదియే అంకురార్పణ. ఇదివరలో

*మాలెట్ మాంత్రికము -- హోల్కారును సింధియాపైకి ఉసుగొలుపుట.*

వారెన్నడుగాని తమలోతాము ఒకరిపైనొకరుపడి యుద్ధము చేసుకొనలేదు. ఈ అంకురార్పణకు కారణుడు యింగ్లీషు రాయబారి 'మాలెట్' అనుసంగతిని మాత్రము పాఠకులు మరువరాదు.—మొదట యీ యిగువురితో ప్రారంభమైన యీ గృహకల్లోలము, క్రమక్రమముగ మిగతావారికికూడ ప్రాకి, మహారాష్ట్ర రాజ్యమంతయు కుక్కలు పీకివేసిన విస్తరి చందమయ్యెను.

"మహారాష్ట్ర చరిత్రయంతయు వారి రాష్ట్రకూటము మీదనే ఆధారపడి యున్నది. ఎప్పుడైతే మనమందరము ఏకకూటములోని వార మను భావమును మహారాష్ట్రులు మరచిరో, అప్పుడే వారికది బలమునిచ్చుటకుమారుగ దౌర్బల్యమును తెచ్చిపెట్టెను" [రెనడే.]

హోల్కారు రాజ్యము పరమపావని అహల్యాబాయి పాలించుచున్నంత కాలము సుభిక్షముగను, సురక్షితముగను నుండెను. కాని, ఆమె మరణానంతరము కథ అడ్డముగ తిరిగెను. ఆమెపిమ్మట రాజ్యమునకువచ్చిన "తుకాజీ హోల్కార్" అంత సమర్థుడుకాడు. అంత తెలివితేటలు గలవాడునుకాడు. నానాటికి పెచ్చు పెరుగుచున్న మాధవరావుసింధియా బలమును చూచియు, ఆతడు ఢిల్లీ బాదుషాను వశపరుచుకొన్నాడే యనియు, తుకాజీ అసూయపడ సాగెను. ఈ అసూయతో నితడు సింధియామీదికి దండెత్తెను. తనసేనలనుకూడ, సింధియా చేసినట్లు యూరోపియన్ పద్ధతిని తరిఫీయతు చేయించెను. కాని, ఈ దండయాత్రలో సింధియా సేనలు హోల్కారు సేనలను సులభముగ నోడించగలిగెను. ఆ సమయమున మాధవరావు సింధియా పునహాలోనుండుటచేత హోల్కారు సేనలు ఓడిపోయియు సింధియా రాజధానియగు ఉజ్జయినీనగరము పైబడి, దానిని ధ్వంసము చేసెను. ఈ రీతిగనైనను తుకాజీ హోల్కారు తనకు సింధియాపై గల అసూయను తీర్చుకొననెంచెను. ఇక యింతటినుంచి హోల్కారు, సింధియా వంశీయులకు పరస్పర కలహములు వంశపారంపర్యముగ ప్రాకుచువచ్చెను. ఈ రెండు మహారాష్ట్ర కుటుంబములకు కలహబీజమును నాటినది — "కలసి నీర క్షీరముల భాతి దనరారు యీ బిడ్డలకు పగలుదార్చినది"—బ్రిటిష్ రెసిడెంటగు మాలెట్ యని చెప్పుటకుగల సందర్భములను స్థలాంతరమున వివరించెదము.

మహారాష్ట్ర విఖండిత శాఖలు.

నాగపురములోనున్న భాన్స్లేవంశమును ఇంగ్లీషువారెట్లు లోకువచేసికొని, మహారాష్ట్ర రాష్ట్రకూటమునుండి చీలదీసినదియు యిదివరకే వివరించియుంటిమి. అట్లే బరోడాలోని గైక్వారును యీ రాష్ట్రకూటమునం దంతగ భక్తిశ్రద్ధల జూపమానుకొనెను గదా.

మహారాష్ట్ర మహా సామ్రాజ్య వృక్షమునకుగల నాలుగుశాఖలును మూలమునుండి యిట్లు విడివడసాగెను. కొన్నిశాఖలు పూర్తిగ ఖండితమై క్రింద

పడి పోయెను. మరికొన్ని యింకను వదలు వదలుగ వ్రేలాడుచుండెను. కేంద్ర మూలమగు పీష్వా అధికార మీారీతిగ కొమ్మలు నరికివేయబడిన మోడువలె బల హీనమై, నిస్సారమై, పోయెను. పీష్వా అధికారము నామమాత్రావశిష్టమయ్యెను. "సాల్బే" యొడంబడికవలన ద్రోహియగు రఘునాథరావుకు పీష్వా పదవి చిక్క లేదు. అతనికి మనోవర్తిమాత్ర మివ్వబడెను. హతభాగ్యుడగు నారాయణరావు కుమారుడు మాధవరావు పీష్వాగనుండెను. నానాఫర్నవీసు అతనికి ప్రధానమంత్రిగ నుండెను. రఘునాథరావు గోదావరీతీరముననున్న "కోపర్‌గాం"లో కొంతకాల ముండి 1784 సంవత్సర ప్రారంభమున చనిపోయెను.

పీష్వా బాజీరావు—కుక్క మూతి పిందె.

ఇతను చనిపోవుకాలమునకు యితనికొడుకు బాజీరావు తొమ్మిదేండ్లప్రాయము వాడు. ఇతనిచుట్టు స్తోత్రపాఠకులు, కుక్షింభరులుచేరి మాధవ రావు నారాయణుని సింహాసనమునుండి త్రోసివేసి, బాజీరావును గద్దెపై యెక్కించవలెనని కుట్రలపన్నుచుండిరి. ఈకుట్రల నన్నింటిని తెరచాటుననుండి ప్రేరేపించుచున్నవాడు మాధవ రావు సింధియాయని యనుమానింపదగియున్నది. ఇతడు ఢిల్లీ పాదుషాను, ఇంగ్లీషు వారి మద్దతుచే చెరబెట్టితినిగదాయను గర్వాతిరేకముచే, మహారాష్ట్ర సామ్రాజ్యమునకుకూడ తానే సర్వనియంత కావలయునను దుర్బుద్ధి యితనికిపుట్టి యుండును. ఈ పనికై తనకు చేలోకువైన కుర్రవాడు బాజీరావును గద్దెపై యెక్కించిన వీలుగనుండునని యితడు ఊహించియుండవచ్చును. కాని, నానాఫర్న వీసు సదా అప్రమత్తుడైయుండుటచేత యితనియాటలు చాలకాలమువరకు సాగి రాలేదు. అయితే, నానాఫర్నవీసు యింతటితో ఊరుకొనక, యీా కుట్రలకన్నిటికి కేంద్రస్థానముగనున్న బాజీరావును శాశ్వతముగ చెరసాలలోనుంచియో, లేక దేశాంతరములకు బంపివేసియో, యుండినచో మహారాష్ట్ర రాజ్యమున కింతటి ముప్పు వాటిల్లెడిదికాదేమో! హంతకులకుగాని, వారిసంతతివారికిగాని, యెన్నడు పీష్వా పదవికి అర్హతలేకుండ మహారాష్ట్రులు లౌక నియమమును చేసికొనియుండిన చో, వారిసామ్రాజ్యమున కెంతయో క్షేమకరముగా నుండెడిది. కాని, అట్లు జరుగలేదు.

మాధవరావు సింధియా బలమును క్రుంగదీయు యత్నము.

మాధవరావు సింధియాకును వారన్‌హేస్టింగ్సుకునుగల రహస్యపు టొడం బడిక సంగతి ఇంగ్లీషు ఉద్యోగులకు పూర్తిగ తెలియదని లోగడచెప్పియుంటిమి. అందుచే, అతడు రోజురోజు బలవంతు డగుచుండుటను జూచి కంపెనీ యధికారులు గాభరాపడ జొచ్చిరి. ఇతని బలమును యెట్లయినను క్రుంగదీయవలెనని వారన్‌హేస్టింగ్సుతరువాత ఆక్టింగు గవర్నర్‌జనరల్‌గవచ్చిన మాక్‌ఫర్సన్ పట్టుబట్టెను. ఇందుకొరకై యితనికిని యితర మహారాష్ట్ర నాయకులకును యిది

వరకే అంకురించిన విద్వేషాగ్నిని మరింత మహాజ్వాలగ రగుల్కొలుపవలెనని మాక్ఫర్సన్ తలంచెను. ఇతనికి పోటీగ యింకొక మహారాష్ట్ర నాయకుని లేవదీయవలెనని మాక్ఫర్సన్ సంకల్పించినట్లు గ్రాంటు డఫ్ వ్రాయుచున్నాడు.

"ఆసమయమున పునహాలోనున్న మహాదాజీఫాన్స్లేతో యెక్కువగ స్నేహము నెరపవలసినదని మాక్ఫర్సన్ బొంబయి కౌన్సిలువారిని కోరెను. ఇందువల్ల ఫాన్స్లేకు సంబరమును, సింధియాకు కంగారును పుట్టెను." (గ్రాంటు డఫ్ వ్రాసిన మహారాష్ట్రచరిత్ర. 3-వ. ముద్రణము, 463 పేజీ).

ఈ సమయముననే మహారాష్ట్రములో అంతఃకల్లోలముల కల్పించుటకై మాక్ఫర్సన్ మహాకుటిలాత్మకుడగు మాలెట్టును, పునహాకు రాయబారిగపంపెను. మాధవరావు సింధియాకు పోటీగ యింకొక మహారాష్ట్రనాయకుని లేవగొట్టవలెనని గవర్నర్ జనరల్ తలంచెనుగద. ఈ విధముగ పుల్లలుబెట్టి లేవగొట్టబడినవాడు తుకాజీహోల్కార్ అని ఊహించుటకు కారణము గలదు. ఏలననగ, అంతకు పూర్వము సింధియా, హోల్కారులకు యెన్నడుగాని ద్వేషమున్నట్లు యెక్కడను కానరాదు. కాని; 1790 సం॥ నుండి యిరువురకు ద్వేషమంకురించినట్లు గన్పట్టు చున్నది. అప్పటివరకు సింధియా, హోల్కారుతో సఖ్యముగనేయుండ ప్రయత్నించు చున్నట్లు గ్రాంటు డఫ్ తన చరిత్రలో 480 పేజీలో చెప్పియున్నాడు.

హోల్కారుతో స్నేహముచేసి, అతనిని తనతో కలుపుకొని, సిక్కులను రాజపుత్రులను లొంగదీయవలెనని సింధియా 1790 సం॥లో యెంతో ప్రయత్నించి నట్లు గ్రాంటుడఫ్ చెప్పుచున్నాడు. కాని, యిందుకు హోల్కారు సమ్మతింపలేదట. ఇదియే కలహప్రారంభము. సింధియా తననెంత బ్రతిమాలినను హోల్కారువినక, పైపెచ్చు అతనిపై దండెత్తి అతని రాజధానియగు ఉజ్జయినీనగరమును నిష్కారణముగ హోల్కారు యేల నాశనముచేయవలెను? ఈ అకారణకలహమునకు ఇంగ్లీషు వారి ప్రేరణతప్ప వేరొండుకారణ మెక్కడను రికార్డులలో కనిపించదు.

మాక్ఫర్సన్ తరువాతవచ్చిన కార్న్‌వాలీసుకూడ సింధియా బలమునుజూచి యీర్ష్యనొంది, అతనినెట్లయిన వంచవలెనని జూచుచుండెను. ఇతనితో యెట్టి జోక్యముగాని పెట్టుకొనుటకు కార్న్‌వాలీసు జంకుచుండెను. టిప్పూసుల్తానుపైకి దండెత్తినప్పుడుకూడ కార్న్‌వాలీసు మిగతావారి నెందరినో తనలో చేర్చుకొనెను గాని, సింధియాను మాత్ర మీ కుట్రలోనికి చేర్చుకొనలేదు. అతడు సహాయము వచ్చెదనని తనంతట తానుగచెప్పినను, ఆతనిసహాయమును కార్న్‌వాలీసు అగౌరవ సూచకముగ తిరస్కరించెను. ఈ కుట్రలోనికి అతడువస్తే, అతడేమి కొంపదీస్తాడో అని కార్న్‌వాలీసుకు భయము, అసూయగలిగెను.

ఈ రహస్యమును మాధవరావు సింధియా అచిరకాలములోనే గ్రహించెను. వారన్ హేస్టింగ్సు వెళ్లిపోయినతరువాత ఇంగ్లీషు గవర్నర్ జనరలులు తనను యీ రీతిగ అగౌరవపరచుచు వచ్చుచున్నందులకు మాధవరావు సింధియాకు వారిపై క్రమక్రమముగ రోషమెక్కుచు వచ్చెను. తాను చెరబెట్టిన ఢిల్లీ పాదుషా తరఫున కప్పమిమ్మని కోరినప్పుడు కంపెనీవారు సొమ్మివ్వక, జవాబుచెప్పక మాధవరావు సింధియాను అవమానపరచిరి; హోల్కారును తనపైకి అకారణముగ ఉసు కొలిపి, తన ఉజ్జయినీ నగరమును నాశనము చేయించిరి; టిప్పూపైకిపోవు సందర్భములో తానిచ్చెదనన్న సహాయమును పుచ్చుకొనక అగౌరవముగ తిరస్కరించిరి. ఇవన్నియు మాధవరావు సింధియా కడుపులో చెయ్యి పెట్టి కలచినట్లు కలచుచునేయుండెను. ఇదిగాక, ఇతనిసేనలో చేరిన యూరోపియనులు స్వామి ద్రోహముచేయ సాగిరి. తన సర్వ సేనాపతియగు "డీ బోయిన్" అనునతడే వారన్ హేస్టింగ్సుచే పంపబడిన వేగులవాడను సంగతిని వెనుక చెప్పియుంటిమి. ఇట్టి వేగులవాడు సింధియా ఆజ్ఞలకు విధేయుడైయుండి, తన స్వజాతివారగు యింగ్లీషువారికి వ్యతిరేకముగ పోరాడుననుకొనుట శుద్ధ తెలివి తక్కువ. ఇతడు సింధియా కొలువుమానుకొని సీమకువెళ్లి పోయేటప్పుడు, సింధియా తరువాత వచ్చిన వారసుతో యిట్లనిచెప్పి పోయెనట :—

*మాధవరావు సింధియాకు కంపెనీవారి యెడ మొగము మొత్తుట.*

"మీరు యింగ్లీషువారితో యెన్నడు పోట్లాడవద్దు. మీరు యింగ్లీషు వారితో పోట్లాడుటకు బదులుగ, కొత్త పద్ధతిని తయారైన యీ సేనలనన్నిటిని తీసి పారవేసుకుంటే మంచిది."

కాబట్టి, వారన్ హేస్టింగ్సు యెట్టి ఉద్దేశముతో యూరోపియను ఉద్యోగులను మాధవరావు సింధియాకు అద్దెకిచ్చెనో యీ ఒక్క పై వాక్యమువల్ల తేట తెల్లము కాగలదు.

ఈ సంగతుల నన్నిటిని పారజూచుకొనునప్పటికి మాధవరావు సింధియా గుండెలో రాయిబడినది. ఇంగ్లీషువారి నాశ్రయించుటవలన తానెట్టి ముప్పు దెచ్చుకొనెనో అతని కిప్పుడు బాగుగ తెలిసివచ్చెను. ఇంగ్లీషువారితోడిస్నేహము మహారాష్ట్ర సామ్రాజ్యమునకు విధ్వంసకారణమని నానాఫర్నవీసు ఆనాడే దైవజ్ఞ సూచకముగ పల్కినపల్కులు సింధియా చెవులలో అప్పుడు మార్మోగి అతనిని చివాట్లు పెట్టుచున్నట్లు స్ఫురించెను. కావున, తానుచేసిన తప్పును దిద్దుకొనుటకై మాధవరావు సింధియా అప్పుడు సంకల్పించినట్లు గన్పించుచున్నది.

ఇంగ్లీషువారి కుచ్ఛితపు తలంపులను బాగుగ కనిపెట్టినవాడు ఆ రోజులలో హిందూదేశములో యెవడైనవుంటే, ఆతడు నానాఫర్నవీసే. అందుచేతనే,

నానాకు, మాధవరావు సింధియాకు కలియలేదు.

మాధవరావు సింధియా అప్పుడు నానాఫర్నవీసును ఆశ్రయించుటకై పునహాకు బయలుదేరెను. ఇంగ్లీషువారి పైకి పోవుటకు గొప్పకూటము నొకదానిని కట్టవలెనని మాధవరావు సింధియా ఆఖరురోజులలో సంకల్పించెను. ఇదియే అతని ఆఖరు రోజులలోగలిగిన మనోవాంఛ. మాధవరావు సింధియా యిప్పుడు పునహాకు పోవుటకు మూలకారణము యీ మనోవాంఛను నెరవేర్చుకొనుటకే యని కర్నల్ మాలెసన్ వ్రాయుచున్నాడు. కాని, కాలమప్పటికే ముదిరిపోయినది. వ్యవహారము పాకము దప్పినది. పునహా దర్బారులోచేరిన యింగ్లీషు రెసిడెంటు మాలెట్ యెన్నోరోజులనుండి చెవినిల్లుకట్టుకొని నానాఫర్నవీస్ మున్నగు పునహామంత్రి మండలికి మాధవరావు సింధియాపై ద్వేషమను విషమును నూరిపోయుచుండెను. చెప్పగచెప్పగ "బ్రహ్మకైన పుట్టు రిమ్మతెగులు" అన్నట్లు యీ విషయము పునహామంత్రిమండలికి బాగా తలకెక్కెను. మాధవరావు సింధియా ఆనాడు వేసిన ఒక్క తప్పటడుగుమూలముగ మహారాష్ట్ర రాజ్యము కూలిపోయినది. నానాకును, మాధవరావు సింధియాకును యికకలియ లేదు.

నానాఫర్నవీసు యెడ యింగ్లీషువారికి రోష మపరిమితముగ నుండెను. "పునహాలో నానాఫర్నవీసు సర్వనియంతగ నున్నన్నాళ్లు మనకు మహారాష్ట్రములో కాలూని నిలుచుటకు తావు దొరకగలదని మనము కలలోకూడ ఆశపడరాదు" అని అక్కడనున్న యింగ్లీషు రెసిడెంటు మాలెట్ వ్రాసెను.

మాధవరావు సింధియా దుర్మరణము- కారణమెవరు?

కాబట్టి, ఒకప్రక్కను నానాఫర్నవీసు, యింకొకప్రక్కను మాధవరావు సింధియా, యీ రెండు పెద్ద స్తంభములు మహారాష్ట్రములో నున్నవి. ఈ రెంటిని పడగొట్టినగాని, తమయాటలు సాగవని ఇంగ్లీషువారికి తెలియును. ఈయిరువురను తాముగ జయించలేమని ఇంగ్లీవారికి తెలియును. అందుచే వీరిలోవీరు పోరాడుకొని సుందోపసుందులవలె, వారిచేతులలోవారే చచ్చునట్లు చేయవలెనని ఇంగ్లీషువారు గొప్పయెత్తువేసిరి. ఇందుకొరకై యీ యిరువురకు పడకుండ, వీరిమధ్య ద్వేషానలమును పూర్తిగ దరికొలిపిరి. మాధవరావు సింధియా పశ్చాత్తప్తుడై నానాఫర్నవీసు సలహానడుగుటకు పునహాకువచ్చిన సమయముననే, వెనుకనుండి అతడు లేకుండజూచి తుకాజీ హోల్కారుచేత అతని రాజధానియగు ఉజ్జయినీనగరమును ధ్వంసము చేయించిరి. ఇక్కడ పునహాలో నానాఫర్నవీసుతోడి సఖ్యము కుదురకుండ చెడగొట్టుటకు అదివరకే విషబీజములనాటి, మహా విషవృక్షమును నానాఫర్నవీసు అంతటి మానవుని మనస్సులో మొలపించిరి! ఈద్వేష మహావృక్షమువల్ల మాధవరావు సింధియాకు నానాఫర్నవీసుతో సఖ్యము కుదురకపోగా, పాపము సింధియా తనప్రాణములనే గోల్పోవును!

మాధవరావు సింధియా 1794 సం॥ ఫిబ్రవరి 12-వ తేదీన పునహాపరిసరముల * వానోవాడి యను గ్రామమున ఆకస్మికముగ మృతినొందెను. మాధవరావు సింధియాకు "ఆకస్మికముగ పెద్దజ్వరము" వచ్చుటచే చనిపోయెనని గ్రాంటు డఫ్ చెప్పుచున్నాడు. కాని "కీన్" అను యింకొక చరిత్రకారుడు "తారిక్ ఇ-ముజాఫరీ" యను గ్రంథప్రమాణము ననుసరించి యిట్లు చెప్పుచున్నాడు:—

"నానాఫర్నవీసుచే యీపనికై నియోగింపబడిన సాయుధులగు ఒకగుంపు గతసాయంకాలము మాధవరావు సింధియాను దారికాచి కొట్టిరి. సింధియాపోతే బాగుండుననని కోరుకొనుటకు నానాకు చాలకారణములున్నవి."

ఇంగ్లీషువారికికూడ "మాధవరావు సింధియాపోతే బాగుండునురా" యని కోరుకొనుటకు కారణములున్నవి. మాధవరావు సింధియా దుర్మరణము పాలయ్యె ననుమాటయే నిజమైనయెడల ఇంగ్లీషువారు ముఖ్యముగ వారిపునహా రాయబారి మాలెట్-నానాఫర్నవీసుతో షరీకై, మాధవరావు సింధియాను దారికాపించి కొట్టించి, చంపించెనని యూహించుటకేమి † యభ్యంతరము?

---

* ఈగ్రామము పునహాకు రెండుమైళ్ళలోనున్నది. మాధవరావు సింధియా చనిపోయినచోట గొప్పమందిరము నొకదానిని కట్టవలెనని యితనివంశీకుడగు దౌలత్ రావు సింధియా యెంతో ప్రయత్నించెను. కాని, అప్పటికల్లోలములలో యీపని సాగలేదు.

† మాధవరావు సింధియామీద ఇంగ్లీషువారికి యీర్ష్యయున్నట్లును, సింధియా ఇంగ్లీషువారి యెడ ఖండితముగ శత్రుత్వము వహింపకపోయినను, అతనిబలమును, రాజ్యకాంక్షను, అతడుపునహాకు సలహానిమిత్తము వెళ్లుటయు, యివన్నీచూచి ఇంగ్లీషువారి కితనిమీద అనుమానముగలిగి వారతనిపై ఒక కన్ను వేసియే యున్నట్లును, రికార్డులలో అనేక నిదర్శనములు గలవని గ్రాంటు డఫ్ తనచరిత్ర 504-వ పేజీలో వ్రాసెను. మాధవరావు సింధియా పునహాకు రాగానే, తనకు కంపెనీవారివ్వవలసిన కప్పమును మీ రెట్లాగైనాసరే ప్రయత్నించి ఇంగ్లీషువారిచేత యిప్పించవలసినదని కోరుచు ఢిల్లీ పాదుషా పీష్వాకును, మాధవరావు సింధియాకును వ్రాసెనట. దీనినిబట్టి సింధియాకును, ఇంగ్లీషువారికిని చెడెననుటకు సందేహమేమి? మాధవరావు సింధియాతో కారన్‌వాలీసే యుద్ధముచేయ దలచినట్లు అతడు తన రెసిడెంటును సింధియాదర్బారునుండి వచ్చివేయవలసినదని 1789 సం॥ ఆగష్టు 26-వ తేదీన వ్రాసినఉత్తరమునుబట్టియే స్పష్టమగుచున్నది. రాయబారిని వచ్చివేయవలసినదని వ్రాయుటయనగ, యుద్ధమునకు సిద్ధమన్నమాట.

"హిందూస్థానములో మహారాష్ట్ర వ్యవహారములను సింధియా నడపకుండ అడ్డగించవలసినదని తుకాజీ హోల్కారుకును అలీబహద్దరుకును పీష్వాప్రభుత్వమువారు అధికారమిచ్చినట్లు కనబడుచున్నది. దీనినిబట్టి, సింధియా యీపనిని వదలుకొని తన యింటికైనను వచ్చివేయవచ్చును. లేదా పునహాకువెళ్లి, తన కిదివరకక్కడపోయిన ప్రతిష్ఠను తిరిగి సంపాదించుకొనుటకు ప్రయత్నించనైనా ప్రయత్నించవచ్చును.

ఎట్లయిననేమి, ఇంగ్లీషువారికి అడ్డుగనున్న ఒక స్తంభము కూలిపోయినది. ఇక, యింకొక స్తంభము—నానాఫర్నవీసు—ఉన్నది. ఇతడంత సులభముగ వదలేటట్లు లేడు. పైగా, సింధియా చావువల్ల నానాఫర్నవీసు మరింత బలిష్ఠుడయ్యెను. నానాఫర్నవీసు ఇంగ్లీషువారికి ప్రక్కలో బల్లెమువలెనుండెను. ఈ పీడను తొలగించుకొనుటకు ఇంగ్లీషువారికి రెండేమార్గములున్నవి. నానా చచ్చియైనాపోవలెను, ఖైదైనచేయబడవలెను, పరాభవింపబడి తొలగియైనపోవలెను. ఇవేవియు సాగనిచో ఆఖరుకు యిప్పుడున్న పీష్వా—"మాధవరావు నారాయణుడు"—మారిపోయి, యింకొక కొత్త పీష్వాయైనను రావలెను. నానాఫర్నవీసును హత్యగావింపవలెనని ఇంగ్లీషువారు ఎంత కాలమునుండియో ప్రయత్నించుచున్నను, యిప్పటివరకు అదేమియు సాగలేదు. పైగా, సింధియా చావుతో నానా మరింత బలవంతుడైనాడు. "ఇక, మనకు దిక్కెవరా బాబూ" అని ఇంగ్లీషువారు బయ లాలకించు చుండిరి.

నానాను తొలగించు టెట్లు?

అదృష్టదేవత వారికెల్లప్పుడును అనుకూలముగనే యుండెనుగద. కలియుగమున శ్వేతముఖులు రాజ్య మేలవలయునని రాముల వారానాడిచ్చినన్న వరము ఊరకపోవునా? ఇట్టిసందిగ్ధతరుణమున వారియదృష్ట ఫలముపండి వారినోట పడినదో యన్నట్లు 1795 సం॥ అక్టోబరు 25-వ తేదీన-21-వ యేట, పీష్వా మాధవరావు నారాయణుడు (రెండవ మాధవరావు) ఆకస్మికముగ రాలిపోయెను. దీనితో మహారాష్ట్రరాజ్యమందు పీష్వా పదవికై గందరగోళములు పుట్టుననియు, యీ గల్లంతులో తమపనిని తాము చక్కబెట్టుకొన వచ్చుననియు ఇంగ్లీషువారు చంకలు గొట్టుకొని సంబరపడిరి.

రెండవ మాధవరావు పీష్వా దుర్మరణము.

ఈ రెంటిలో యేది జరిగిననుసరే నీవక్కడఉండకుండ-ఏ యేర్పాటుకు వప్పుకొనకుండ తక్షణమే డబ్బా డవాలు మూటగట్టుకొని కాశీకి వచ్చివేయవలసినదని కారన్‌వాలీసు సింధియా దర్బారులోని రెసిడెంటగు మేజర్ పామరుకు వ్రాసెను. పైలేఖనుబట్టి, ఇంగ్లీషువారు హోల్కారును సింధియాపైకి ఉసుకొల్పినట్లు తెలియగలదు. మరియు, ఇంగ్లీషువారు సింధియాపై కుట్రపన్నుచున్నట్లును అడుగున గీతగీచిన వాక్యములవల్ల తెలియగలదు. అట్లుకానిచో, సింధియా పునహాకు పోవచ్చునని కారన్‌వాలీసుకు ముందుగ యెట్లు తెలిసినది? సింధియా పునహాకు వెళ్ళగానే, కారన్‌వాలీసు వ్రాసిన ఉత్తరప్రకారము రెసిడెంటు కాశీకి వెళ్ళిపోయెను.

సింధియా చచ్చిపోయినప్పుడు కారన్‌వాలీసు ఇంగ్లండులోనుండెను. ఈ వార్త వినగానే కారన్‌వాలీసుకు గలిగిన సంబరమునకు మితములేదు. అతడప్పుడు ఇండియాలో గవర్నర్ జనరలుగనున్న సర్ జాన్ షోరుకు యిట్లని 1794 సం॥ సెప్టెంబరు 7-వ తేదీన వ్రాసెను "సింధియాచావువల్ల మీ గవర్నమెంటు కష్టాలన్నీ గట్టెక్కగలవు. మీరు జాగ్రత్తగ వుంటే, దేశాంతర్భాగములోని వ్యవహారములన్నిటిలో మీ కిక జయము నిశ్చయముగ గలిగితీరును."

దీనికి కారకు లెవరు ?

పీష్వా 'మాధవరావు-నారాయణు'ని మరణము బహు విచిత్రము-అనుమానాస్పదము. ఇందును గూర్చి ఆంగ్ల చరిత్రకారుడు గ్రాంటు డఫ్ తన గ్రంథము 521 పుటలో యిట్లు వ్రాయుచున్నాడు :—

"అక్టోబరు 25-వ తేదీన పీష్వా తనమందిరములో ఒక డాబామీది నుంచి క్రిందకు, తానంతట తానుగ పడెను. రెండు అవయవములు విరిగిపోయెను. పడ్డచోట నిలువుగనున్న ఒక నీటి గొట్టము గుచ్చుకొని పెద్దగాయమయ్యెను. తరువాత అతడు రెండురోజులు మాత్రము బ్రతికెను."

పీష్వా యీరీతిగ ఆత్మహత్య చేసుకొనెనని యీగ్రంథకారుడు చెప్పుమాట నంగీకరించుటకు రెండు అభ్యంతరములు గలవు. ఒక అభ్యంతరమేమనగ :—పీష్వా యీరీతిగ ఆత్మహత్య చేసుకోవలసినంత కారణమేమియు గన్పట్టదు. గ్రాంటు డఫ్ఫే 521 పేజీలో యిట్లు వ్రాయుచున్నాడు :—

"అక్టోబరు 22-వ తేదీన దసరాపండుగ. పండుగ మహావైభవముగ జరిగినది. పీష్వా మామూలుగ తన సేననంతను పరికించెను. సాయంకాలము మామూలుగ దర్బారుచేసి తన ప్రముఖులకును, రాయబారులకును, దర్శనమిచ్చెను. కాని, ఏదో మనోవ్యథ అతని మనస్సును బట్టి బాధించుచుండెను........"

ఇది ఆత్మహత్యకుతగిన కారణముగ గన్పట్టదు. అంతటి మనోవ్యథయే యున్నచో ఆనాడంతవైభవముగ తనసేనల నతడేలదర్శించును? తన పినతాతకొడుకు బాజీరావును నానాఫర్నవీసు ఖైదులోవేసి కఠినముగ చూచుచుండుటచేత దానిని భరించలేక పీష్వా యీరీతిగ ఆత్మహత్యచేసుకొనెనని మరికొందరింకొక కారణమును జెప్పుచున్నారు.

ఇందుకు ఆవంతయు ఆధారము గన్పించదు. పీష్వా బుద్ధిపూర్వకముగ తన యావత్తు వ్యవహారములను తనకు శ్రేయోభిలాషియగు నానాచేతులలో పెట్టెను. అట్టి విచారమే తనకున్నచో, దానినిగూర్చి యేమాత్రమైనను నానాకెరిగించి యున్నచో ఆతడు ఆతని కోర్కెప్రకారము చేయకపోయెడివాడా ? రాజ్యాధికారమును చెలాయించవలెనను కాంక్ష నానాకేమియులేదు.—"నాకీ రాచకార్యము లెందుకు? నేనువెళ్లిపోయి యెక్కడనో తపస్సు చేసుకొందునని" నానా యెన్నో మార్లు చెప్పుచువచ్చెను. కాని, పీష్వా "మాధవరావు నారాయణు"డే యితనిని వారించి మంత్రిగ ఉంచుకొనెను. ఇట్టిస్థితిలో నానా ప్రవర్తనవల్ల పీష్వా క్రుద్ధుడయ్యెననుట కేవల మసంగతము.

అథవా, యేకారణముచేతగాని పీష్వా ఆత్మహత్య చేసుకొనదల్చెనని యంగీకరించినను, ఆత్మహత్య చేసుకొనుట కిదియేనా మార్గము? ఆత్మహత్య చేసుకొన

గోరువారు సర్వసాధారణముగ నిర్బాధకమగు ఉపాయమునే చూచుకొందురు. విషముత్రాగియో, రహస్యముగ గదిలోకూర్చుని పిస్తోలుతోకాల్చియో, గొంతు కోసుకొనియో, చచ్చిపోదురుగాని, మేడమీాదనుండి పడుదురా? మేడమీాదనుండి పడితే చావవచ్చును, లేక చావకపోవచ్చును గద.

కాబట్టి, పూర్వాపర సందర్భములనన్నిటిని పరిశీలించిచూడగ, పీష్వా ఆత్మ హత్య చేసుకొన్నాడన్నమాట కేవలము అబద్ధమనియు, ప్రజలమనస్సును నానా ఫర్నవీసుపై ద్వేషపూరితమొనరించుటకే స్వార్థపరులీ బూటకకథనమును కల్పించి రనియు చెప్పవలసియున్నది. పీష్వా మేడమీాదనుండి పడుట ప్రమాదమున జరిగి నదియుకూడ కాదు. బహుశః, యితని శత్రువులెవరో వెనుకనుండి యితనినిక్రిందికి త్రోసియుందురు. మహారాష్ట్రములో అల్లరులు పుట్టించుటకై కూర్చున్న ఇంగ్లీషు రెసిడెంటే యెవరికోడబ్బిచ్చి, వానిచేత యీపని చేయించెనని చెప్పినచో ఎవరుగాని ఆశ్చర్యపడవలసిన పనిలేదు. రగూబాకు రాజ్యమిప్పించుటకు వెనుక మాస్టిక్ నారాయణరావును చంపించియుండగ, రగూబాకొడుకుకు రాజ్యమిప్పించుటకు యిప్పుడు మాలెట్టు నారాయణరావు కొడుకును చంపించుటలో ఆశ్చర్యమేమున్నది. పాపమీా పసికందువు మాధవుడు పుట్టినప్పటినుండి ఇంగ్లీషు వా రితనినిచూస్తే కంట్లో కారము వేసుకొనుచుండిరి. రగూబాకు రాజ్యమిప్పించకుండ యితడు తమకాలికి, చేతికి, అడ్డము వస్తున్నాడని యీపసివానిపై ఇంగ్లీషువారు లోలోన పండ్లు కొరుకు కొనుచుండిరి. రాజ్యకాంక్షకై అన్నకొడుకును చంపిస్తే, "తిరిగి వీడెక్కడపుట్టుకు వచ్చినాడురా"యను యీర్ష్యచేత రగూబా అసలు యితడు పుట్టినదే అబద్ధమని మొదటినుండి వాదించుచుండెను. ఈవాదనకువెనుక బొంబయి కౌన్సిలువారుచేరి తాళమువేయుచుండిరి. ఈరీతిగ, పాపమీా పసిబిడ్డడు పుట్టిననాటనుండి గోరాముల తోనే బ్రతుకుచుండెను. ఇతడు తల్లికడుపులోపడిన కొలదికాలముననే తండ్రి దుర్మరణము పాలయ్యెను. దీనికంతకు కారణము రగూబాయొక్క యీర్ష్య, రాజ్య కాంక్ష. ఈ యీర్ష్యకు మూడుతరములవారు పెత్తండ్రి, తండ్రి, తాను బలియైరి.

ఇప్పుడు రగూబా చచ్చినను ఇంగ్లీషువారు మాత్రము తమ అల్లరిని మాన లేదు. అతనికొడుకు బాజీరావు అనుకుర్రవాని నిప్పుడు వెంటవేసుకొని రాజొచ్చిరి. ఈపీడ రగూబాతో వదలక, తరతరములవరకు ప్రాకి, మహారాష్ట్రరాజ్యమును విధ్వంసన మొనర్చెను! ఆహా! ఈర్ష్యా! నీవు చేయలేనిపని యేమి!

పీష్వా "మాధవరావు నారాయణుడు" చనిపోగానే, వారసత్వమునకై తగాదాలు బయలుదేరెను. సింహాసనము రగూబా కొడుకు బాజీరావుకు రావలెనని యింగ్లీషు వా రతనిని వెనుకవేసుకొని వచ్చిరి. బాజీరావును పీష్వాచేసినచో మహారాష్ట్రమునకు

వారసత్వపు తగాదాలు.

ముప్పువచ్చునని నానాఫర్నవీసు దైవజ్ఞ సూచకముగ ఘోషించెను. ఇందును గూర్చి నానాఫర్నవీసు తుకాజీ హోల్కారు కిట్లని వ్రాసెను :—

"ప్రస్తుతము రాజ్యవ్యవహారముల జూచుచున్నవారిపై ద్వేషమును అతనికి బుద్ధి తెలిసినప్పటి నుండియు బాజీరావుకు తల్లి నూరిపోయుచుండెను. అతని కుటుంబమునకును, యింగ్లీషువారికిని గల సంబంధమువల్ల మనరాజ్యమున కెంతయో ముప్పురాగలదు. ప్రస్తుతము మహారాష్ట్ర రాజ్యములో ఐకమత్యము సౌభాగ్యము యెంతో ముచ్చటగనున్నవి. ఈ పద్ధతినే సాగించినచో మనరాజ్యమున కెన్నియో మేళ్లు చేకూరగలవు!" (గ్రాంటు డఫ్—పేజీ 521)

ఈ యభిప్రాయముతో హోల్కారుమున్నగు ప్రముఖులు యేకీభవించిరి. వారందరి యభిమతము తెలిసికొన్నపిమ్మట అప్పటికింకను ఋియాడేరని యశోదాబాయి (హతభాగ్యుడగు "మాధవరావు - నారాయణుని" భార్య) ఒక కుమారుని దత్తత చేసుకొనునట్లును, అతనిని పీష్వాజేసి, మామూలుగ తాను వ్యవహారమునంతను నడుపునట్లును నానాఫర్నవీసు సూచించెను.

ఈ సూచనప్రకారము వ్యవహారము నడచియుంటే యెంతో బాగుండెడిదే. ఇందు విపరీతమేమియులేదు. హిందూ వితంతువులు దత్తతచేసికొనుట విధివిహితమేగద. కాని దైవవిధి వేరువిధముగనుంటే నానాఫర్నవీసు మాట యెట్లు సాగును ? ముందుగ యీ సంగతి యింగ్లీషు రెసిడెంటగు మాలెట్టుకు నానాచెప్పుటచే వ్యవహారము చెడెను.

ఇక మహారాష్ట్ర ప్రభుత్వము నేరీతిగనడుప దలచుకొన్నారో తెలుపవలసినదని మాలెట్టు 1795-వ సం॥ నవంబరు నెలలో నానాఫర్నవీసును కోరెను. మహారాష్ట్ర ప్రముఖులందరు ఆలోచించి యేదోపద్ధతి నిర్ధారణచేసేవరకు కీర్తిశేషుడగు పీష్వా భార్యయే సర్వాధికారిగ మీరు భావించుకొనవలెనని నానా జవాబు చెప్పెను. తిరిగి యశోదాబాయి ఒకకుర్రవానిని పెంచుకొనునట్లును, అతడు పీష్వాగానుండునట్లును యేర్పాటు చేసుకొంటిమనియు, యిందుకు యింగ్లీషు వారికేమియు అభ్యంతర ముండరాదనియు, యిక కుర్రవాడెవరో నిశ్చయించి దత్తహోమము చేసుకొనుటయే తరువాయి యనియు, నానాఫర్నవీసు 1796-వ సం॥ జనవరి నెలలో మాలెట్టుకు తెలియబరచెను. ఈ సంగతిని మాలెట్టు తీసికొనిపోయి, అప్పుడు చెరసాలలోనున్న బాజీరావు చెవిలో యెట్లో ఊదెను. ఇది కేవలము విశ్వాసద్రోహము. ఈ రహస్యము నితడిట్లు వెల్లడించునని నానా తలంచియుండలేదు. ఈ రహస్య ప్రకటనవలన నానా వేసినయెత్తు చెడెను. బాజీరావును, యింగ్లీషువారును, పరీకై కుట్రలపై కుట్రల పన్నిరి. చుట్టును తరంగములుగ ముంచుకొని వచ్చుచున్న యీ మహాకుట్ర వెల్లువలను నానాఫర్నవీసు తన విశాల బాహువులచే నైతము యీదలేక పోయెను.

బాజీరావు పీష్వా యగుట, యింగ్లీషువారికి వాటం.

ఎట్టకేలకు జ్ఞాతిహంతకుడగు రఘూబా కొడుకు బాజీరావే పీష్వాయయ్యెను. నానా చెప్పిన జోస్యము నిజమయ్యెను. బాజీరావును తండ్రియడుగు జాడలనే నడచి, యింగ్లీషువారితో జేరి, మహారాష్ట్ర రాజ్యమును కూల ద్రోసుకొనెను. ఏ దుర్ముహూర్తమందైతే బాజీరావు పునహా గద్దెపైయెక్కెనో, ఆనాడే మహారాష్ట్ర రాజ్యభాను డస్తమించెను. నానాఫర్నవీసు నక్షత్రము మహారాష్ట్రాకాశమునుండి మాసిపోయెను.

నానాను చంపు యత్నము.

పూర్వపు ఎన్నిక పద్ధతినైనచో బాజీరావు సింహాసనమునకు వచ్చెడివాడు కాదు. ఇతడు సింహాసనమునకు వచ్చినదే తడవుగ నానాపై కుట్ర సాగించెను. నానాపై తండ్రికిగల క్రోధమును కొడుకు యిప్పుడు తీర్చుకొన దలచెను. నానాను చంపించవలెనని యీ దుర్మార్గుడు పన్నాగము పన్నెను. ఈ సంగతి తెలిసి నానా తన ప్రాణరక్షణార్థమై పారిపోయి, కొన్నియేండ్లు యెచ్చటనో తలదాచుకొన వలసి వచ్చెను. మహారాష్ట్ర సామ్రాజ్యమున కింతటి సేవజేసిన అమాత్యశేఖరుడు నానాకా యిట్టిగతి?! హా! హతవిధీ!

బాజీరావు మహారాష్ట్రమును నిరంకుశముగ బాలింప సాగెను. ఇతని యందు దూరదృష్టిగాని, మితత్వముగాని లేదు. ఈ లోపములే యింగ్లీషువారికి బలేవాటమయ్యెను. ఈకథ తదుపరి జెప్పెదము.

నైజాముపై "కుర్డా" యుద్ధ జయము 1795.

మాధవరావు సింధియా 1794-వ సం॥ ఫిబ్రవరి 12-వ తేదీన పునహా పరిసర గ్రామమున చనిపోయెనని చెప్పియుంటిమి. అతని తరువాత అతని జ్ఞాతి దౌలత్ రావు సింధియా అతని స్థానము నాక్రమించెను. దౌలత్ రావు సింధియా అధికారమునకు వచ్చునాటికి 15 యేండ్లవాడే. ఇతడు మాధవరావుకంటె చురుకుదనము గలవాడు. తీవ్రమైన రాజ్యకాంక్షగలవాడు. ఈ సమయమున మహారాష్ట్రులకును, నైజామునకును లెక్కల జూచుకొనుటలో తగాదా వచ్చినది. పీష్వా "మాధవరావు-నారాయణుడు" పంపించిన రాయబారి గోవిందరావునకును, నైజామునకును దర్బారులో మాటమాట వచ్చెను. మహారాష్ట్రులే తనకు సుమారు 2 కోట్ల 6 లక్షల రూపాయలు బాకీవున్నారనియు, ఆ పద్దులనన్నిటిని చూచుకొనుటకు నానాఫర్నవీసు స్వయముగ వస్తేగాని తేలవనియు, నైజాము బహిరంగముగ తన దర్బారులో నిరసనముగ మాట్లాడెను. అందుకు గోవిందరావు యిట్లనెను:—
"నానాఫర్నవీసు చాలా పనిమీదవున్నాడు: ఆయన యిక్కడికి యెట్లావస్తాడు!

"ఎట్లావస్తాడా! చూస్తాను. ఆతనిని మాయెదుటకు యెట్లా తీసుకు వస్తామో మేము త్వరలోనే చూపిస్తాము" అని నైజాము "ముషరల్—ఉల్—ముల్కు" గర్జించెను. ఈ మాటలతో యిరుపక్షములవారికి యుద్ధము పొసగెనని గ్రాంటు డఫ్ వ్రాయుచున్నాడు. యువకుడగు దౌలత్ రావు సింధియా ప్రోద్బలము చేతనే యావన్మంది మహారాష్ట్రులు యేకమై నైజామువిూదికి దండెత్తిరి. యుద్ధము సిద్ధమయ్యెను. నైజాము తనదర్బారులో వాక్చాతుర్యత జూపగలిగెనేగాని, యుద్ధములో మహారాష్ట్రుల నెదిరించలేకపోయెను. అతడంతట ఇంగ్లీషువారి సహాయము నాశించెను. "మేము మధ్యస్థులము; నీకు సహాయముచెయ్యము పొమ్మని" అప్పుడు గవర్నర్ జనరలుగనున్న సర్జాన్ షోర్ యేదోవంకచెప్పి తప్పించుకొనెను. నైజాము సేనలు మహారాష్ట్రుల చేతులలో ఓడిపోయెను. 1795 సం॥ మార్చి నెలలో నైజాము పారిపోయి "కుర్డ్లా" యను కోటలో దాగుకొనెను. మహారాష్ట్రులీ కోటను ముట్టడించగ, నైజాము మార్చి 15-వ తేదీన వారికి లొంగిపోయి, వారు చెప్పిన షరతులకు అన్నిటికి "దేముడా"యని యంగీకరించవలసి వచ్చెను.

"కుర్డ్లా" విజయమైన కొలదికాలమునకే పీష్వా "మాధవరావు నారాయణుడు" అకాలమృత్యుముఖమున బడుటయు, మహారాష్ట్ర రాజ్యభానుడు క్రమముగ అస్తాద్రికి జారిపోవుటయు జరిగెను.

## నైజాము ఖండనము

కుర్డ్లాయుద్ధములో ఇంగ్లీషువారు తనకు సహాయము రానందుకు నైజామును ఇంగ్లీషువారిమీద చాల కోపమువచ్చి, అదివరకువారు తనకిచ్చిన రెండు సైనికదళములను "నాకక్కరలేదు తీసికొనిపొండని" పంపివేసి, యితడు ఫ్రెంచివారి నాశ్రయింపసాగెను. "రేమండు" అను ఫ్రెంచిసేనానిని తన కొలువులో చేర్చుకొని అతనిచే తనసైన్యములను తరిఫీయతు చేయించుకొనసాగెను. రేమండు తయారుచేసిన రెండు దిట్టమైన సేనలను సరిహద్దులనున్న కడప, కంభముపరగణాల నాక్రమించుకొనుటకై నైజాము దండుపంపెను. ఇందుపై గవర్నర్ జనరల్ "షోర్"కు గాభరాపుట్టి 1795 సం॥ జూన్ 15-వ తేదీన హైదరాబాదులోనున్న ఇంగ్లీషు రెసిడెంటుకు యిట్లని వ్రాసెను. "నైజామునకు మనమీద దురుద్దేశము లేక పోయినను యిదిగో ఫ్రెంచివాడు "రేమండు" అతనిదగ్గర చేరినాడు. ఇతడును, యితని యుద్యోగులును పరాసుప్రభుత్వమువారికి మద్దతుచేసి, ఉత్తరసర్కారులలో మనకు హానిచేయవచ్చును. బహుశః యీ ప్రయత్నము జరుగకపోవచ్చును. అయినను (కీడెంచి మేలెంచమన్నట్లు) ఈ ప్రయత్నమే గనుక జరిగినట్లైతే, ఇండియాలో మన

నైజాము ఇంగ్లీషు వారిపై తిరుగబడ దలచుట—నిష్ఫలము.

పని చాలచిక్కులలో పడుతుంది. కాబట్టి, ఈ రేమండుదళములను వెంటనే వెనుకకు మరలించవలసినదని మనము నైజాముతో, గట్టిగ చెప్పవలెను.''

ఇట్టి యుత్తరమునే ''షోర్'' నైజాముకుకూడ వ్రాసెను. ''పరాసుసేనలను గనుక పొలిమేరలనుండి మరలింపనిచో, ఇంగ్లీషుసేనలుకూడ దానిపైకి పంపవలసి వచ్చునని నీవు నైజామునకు గట్టిగ చెప్పుము''అని రెసిడెంటుకు వ్రాసినవుత్తరములో ''షోర్'' వ్రాసెను. పుదుచ్చేరిలో ఖైదీలుగనున్న కొందరు ఫ్రెంచివారు అక్కడ నుండి తప్పించుకొని, రేమండుతో చేరుటకు ప్రయత్నించుచున్నట్లు తెలిసి, బొంబయి గవర్నర్ వారి ఖైదును మరింత బందోబస్తుగ చేయించెను. గవర్నర్ జనరలును, రెసిడెంటును చెప్పిన యీమాటలన్నియు నైజాము లక్ష్యముచేయలేదు. ''ఏమైనాసరే ఇంగ్లీషువారితో ఒకచెయ్యి చూద్దామని'' నైజాముగుండె దిట్టపరచుకొనెను. ఫ్రెంచి వారి ఆసరా చూచుకొనియో, అటు మహారాష్ట్రులయొక్కయు, టిప్పూసుల్తాను యొక్కయు సహాయమును జూచుకొనియో, నైజామిట్లు తమపై తిరుగుబాటుచేయ సాహసించెనని ఇంగ్లీషువారు ఉలికిపడసాగిరి. లేకపోతే, లేవలేని నైజామునకు యింతటి ధైర్యమెట్లు గలిగెనని వారు గాభరాపడజొచ్చిరి. కాని, ఇంగ్లీషువారు అదృష్టవంతులుగద. అదృష్టవంతునెవరు చెరుపగలరు? సరిగ ఈ సమయమున నైజాముకొడుకు—'ఆలీజా' యనువాడు —తండ్రిపై తిరుగుబాటుచేసి, హైదరా బాదునుండి పారిపోయెను. ఈ తిరుగుబాటు హైదరాబాదులోనున్న ఇంగ్లీషు రెసిడెంటు ప్రేరణవల్లనే జరిగినదనుటకు యెట్టిసందేహమునులేదు. ఈ గృహ చ్ఛిద్రముచే, నైజాము రేమండు దళములను పొలిమేరనుండి మరలించి, ముందుగ తనకొడుకును పట్టుకొనుటకై పంపవలసివచ్చెను. ఆప్రకారమే రేమండు దళములు నైజాము కొడుకును వెంబడించి, పట్టుకొనెను. తరువాత కొలదికాలమునకే ఆతడు చనిపోయెను.

పిరికిపందయగు నైజాము తనకొడుకుచేసిన తిరుగుబాటుచే కంగారుపడి, తా నిదివరకు తీసికొనిపొమ్మన్న ఆరెండు ఇంగ్లీషుసైనికదళములను తిరిగి తనకు దయ చేయించవలసినదని యెంతో నీచముగ ఇంగ్లీషువారిని వేడుకొనెను. ఇంగ్లీషువా రప్పుడు కరుకుబారి, తమషరతులకన్నిటికి అంగీకరిస్తే గాని, తా మీదళములను తిరిగియివ్వమని బిగించిరి. ఈ షరతుల కన్నిటికి నైజాము చచ్చినట్లు ఒప్పుకొని, యికజన్మలో యెప్పుడు ఇంగ్లీషువారిమీద తిరుగబడకుండ పిల్లివలె వారియండనుండ నక్కియుండెను. వీని బ్రతుకిట్లు బండలైనది!

ఇంగ్లీషువారి బిగింపు.

నైజాము దర్బారులో ఫ్రెంచివారి పలుకుబడి రవంతయైనను లేకుండునట్లు గవర్నర్ జనరల్ చేసెను. వెనుకనుండిన యావన్మంది ఫ్రెంచియుద్యోగులను తీయించి పారవేసి, వారిస్థానే ఇంగ్లీషువారి నెక్కించెను. కాని, వీరు తయారుచేసిన

సేనలు, ఫ్రెంచివారు తయారుచేసిన సేనలముందర ధూపమునకుకూడ పనికిరావని మాక్ ఫర్ లేన్ అను నాంగ్లేయుడే వ్రాసిన "Our Indian Empire" అను గ్రంథము 27-వ పేజీ చెప్పుచున్నది.

నైజామిట్లు తాను ఇంగ్లీషువారి నాశ్రయించుకొని నీచపుబ్రతుకు బ్రతుకుచుండుటయేగాక, మిగతా రాజ్యములను కూడ వారు లొంగదీసుకొని, తమ సామ్రాజ్యము నిక్కడ స్థాపించుకొనుటకు సైతము యీ దౌర్భాగ్యుడగు నైజాము ఇంగ్లీషువారి కెంతయో అనుకూలమగు ఉపకరణముగ ఉపయోగపడుచూవచ్చెను.

## కర్ణాటకము.

కర్ణాటక నబాబు (అనగ ఆర్కాటు నబాబు) మహమ్మదాలీ ఇంగ్లీషువారి కెట్లు యీ దేశములో మొదట నిలువనీడ యిచ్చెనో, తదుపరి వారు యితనిని లోకువజేసుకొని, యితనిని ముఖస్తుతిచేసి, యితనివల్ల రాజు మొదలు రంగప్పవరకు యెట్లు డబ్బుగుంజికొనిరో లోగడ చెప్పియుంటిమి. మెకార్ట్నీ గవర్నరుకు యితడు ముప్పదివేల నవరసులు పళ్లెములోపోసి "మామూలుగ" అతనిముందు పెట్టగ సదరు గవర్నర్ యీ మామూలును పుచ్చుకొనక నిరాకరించినట్లును చెప్పియుంటిమి. వెనుకటి గవర్నరులు-ముఖ్యముగ "రంబోల్డు" అను గవర్నర్ యితనినుండి చాల డబ్బు తిన్నట్లు సర్ చార్లెస్ లాసన్ చెప్పుచున్నాడు.

కర్నాటక నబాబు అప్పులు.

మహమ్మదాలీ 1795 సం॥ అక్టోబరు 13-వ తేదీన 79-వ యేట చనిపోయెను. ఇతను చనిపోవునప్పటికి యితనికున్న అప్పు యింతంతని చెప్పతరముగాకున్నది. ఈ అప్పుసంగతి అనేకసార్లు పార్లమెంటులో చర్చకు వచ్చెను. ఈ సంగతిని చాలమంది పార్లమెంటులో వాదించిరి. పార్లమెంటు సమావేశమైన ప్రతిపర్యాయము, ఇండియా విషయమై చర్చవచ్చిన ప్రతిపర్యాయము—"ఆర్కాటు నబాబు అప్పులు, ఆర్కాటు నబాబు అప్పులు" అనుమాటలు పార్లమెంటు భవనము నలుముఖముల మార్మోగుచునే యుండెను. ఈ మాటలు పార్లమెంటు గోడలకుకూడ పట్టిపోయెనట!

"మన ఇంగ్లండు ప్రభుత్వపు అప్పుకంటె, యీ ఆర్కాటు నబాబు అప్పు యెక్కువయ్యేటట్లుగవున్నది. ఇది నానాటికి వడ్డీలతో, మడతవడ్డీలతో, కమిషనులతో, దళారీఫీజులతో-ఓ-పెరిగిపోతోంది! ఇది యిట్లా పెరిగిపోకుండా యేమైన చేస్తేనేగాని వీలులేదని" పార్లమెంటు మెంబర్లు అనేకసార్లు ఘోషించిరి. కాని, ఆంగ్లమంత్రివర్గమువా రిందుగూర్చి యేమియు చేయరైరి. దీనికి కారణమేమనగ, నబాబు తమకు బాకీయున్నాడని చెప్పుచు వచ్చిన ఋణదాతలందరు ఇంగ్లీషు

దొరలు. వీరికి మంత్రులపై చాలపలుకుబడిగలదు. కాబట్టి, తమపక్షమువారికి వ్యతిరేకముగ చేయుటకు మంత్రులకు ధైర్యముచాలకపోయెను. మంత్రులవాదము దుర్బలమైనదైనను వారికి పార్లమెంటులో మెజారిటీ యుండుటచేత, నబాబుకు న్యాయముకలుగలేదు.

తనతండ్రి తన మెడకు కట్టిపోయిన భారమగు యీ అప్పులమూటతో మహమ్మదాలీ కొడుకు ఓమ్ దత్-ఉల్-ఉమ్రా యనునతడు 1795 సం॥ అక్టోబరు 16-వ తేదీన కర్ణాటకరాజ్య సింహాసనము నధిష్టించెను. కర్ణాటక రాజ్యపు మిలిటరీ వ్యవహారమంతయు కంపెనీవారికే గుత్తకిచ్చివేయునట్లు లోగడ కారన్‌వాలీసు కాలములోనే మహమ్మదాలీ ఒప్పుకొని తన అర్థమును, ప్రాణమును ఇంగ్లీషువారి చేతులలో అప్పగించివేసెను. ఇప్పుడు కొత్తనబాబు రాగానే "కర్నాటక రాజ్యమును యావత్తు ఇంగ్లీషువారికి ధారాదత్తము చేసివేయునట్లు నీవుయత్నించ వలసినదని" చెప్పి సర్ జాన్ షోర్ మద్రాస్ గవర్నర్‌అగు "హోబర్టు"కు వ్రాసెను. ఆప్రకారమే హోబర్టు ప్రయత్నించెను.

"నీవు కంపెనీ కివ్వవలసిన బాకీకింద తాకట్టుపెట్టిన జిల్లాలను, కర్నాటకము లోని మరికొన్ని కోటలను, పాలెగాండ్లపై అధికారమును మాకు యిచ్చివేయ వలసినదని హోబర్టు కొత్తనబాబు నడిగెను.

ఈ సూచనలకు వేనికిని కొత్తనబాబు ఒప్పుకొనలేదు. ఎప్పుడైతే నబాబు యిందుకు ఒప్పుకొనలేదో, "నీవీపనియెందుకు చేసినావని" సర్ జాన్ షోరే మద్రాస్ గవర్నరును మందలించెను! ఇది ఆశ్చర్యము! మొదట ప్రయత్నించ మని చెప్పినవాడు తానే; తిరిగి యెందుకు ప్రయత్నించినావని మందలించినదితానే! సర్ జాన్ షోర్ తాలూకు యీచర్య వింతగనున్నది. ఏమైననేమి, అప్పటికి కర్ణాటకరాజ్యము యింగ్లీషువారి నోటబడక దక్కినది.

## రోహిలా ఖండము.

రోహిలా నాయకుడగు ఫైజుల్లాఖాన్ రామ్‌పుర క్షేత్రమందు ఓడిపోయి, కొండలలో దాగెనని వెనుక చెప్పియుంటిమి. ఇతడు 1794-వ సం॥ లో చనిపో యెను. ఇతనికి ఆలీఖాన్, గులామ్ మహమ్మద్ అను యిద్దరు కొడుకులుండిరి. వీరిలో రెండవవాడు పెద్దవానిని చంపి, తాను రోహిలా ఖండములో రాజ్యమేల వలెనని చూచెను. ఈ రాజ్యము యీ యిద్దరికిలేకుండ — అసలు ఫైజుల్లాఖాన్ వంశములోనే లేకుండ—చేయవలెనని సర్ జాన్ షోర్ ప్రయత్నించెను. లోగడ ఇంగ్లీషువారు గులామ్ మొహద్దీన్ కొడుకుకుయిచ్చిన వాగ్దానములకు వ్యతిరేకము గను, రోహిలాల స్వపరిపాలనాధికారమును భంగపుచ్చియు, సర్ జాన్ షోర్

అయోధ్యవజీరుతో షరీకై రోహిలాలమీదికి దండునుబంపి, వారి నోడించి, వారి అర్థప్రాణములను వారికి గర్భశత్రువగు అయోధ్య వజీరు చేతిలో అప్పగించెను. పూర్వపు ప్రభువగు ఫైజుల్లాఖాన్ తాలూకు ధనమును, ఆస్థిని యావత్తు యింగ్లీషు వారు అయోధ్య వజీరు కిప్పించివేసిరి. మహమ్మదాలీఖాన్ కొడుకు అహమ్మదాలీకి పదిలక్షల రాబడిగల జాగీరును మనోవర్తిక్రింద యింగ్లీషువారు హామీపడి యిప్పించిరి.

## అయోధ్య రాజ్యము.

అయోధ్య రాజ్యమునెడ సర్ జాన్ షోర్ గావించిన దురంతము వెనుక వారన్ హేస్టింగ్సు చేసినదురంతమును మరపించుచున్నది. వారన్ హేస్టింగ్సు ఇండియానుండి వెడలునాటికి అయోధ్యరాజ్యము ఇంగ్లీషువారి ఆశ్రిత రాజ్యములలో నొకటిగనుండెను. కారన్‌వాలీసు కాలములో—1788-వ సం॥ లో—అయోధ్య వజీరుకును కంపెనీవారికిని ఒక ఒడంబడిక జరిగెను. తామిచ్చు రక్షణకు ప్రతిఫలముగ అయోధ్యవజీరు కంపెనీవారికి సాలుకు యాభై లక్షల రూపాయ లిచ్చుకొనునట్లు కారన్ వాలీసు ఖాయముగ యేర్పాటుచేసెను. ఎప్పుడు పడితే అప్పుడు, యింత నిమిత్తములేకుండ డబ్బుగుంజుకొను చుండుటకంటె, యింత మొత్తమని యేదోఒకసారి ఖాయముగ తేల్చుకొనుట అయోధ్యవజీరుకు మంచిదయ్యెను. ఇతడు కొంచెము కొంచెముగ కోలుకొన సాగెను. తాను ఒప్పుకొన్న కప్పమును అయోధ్యవజీరు తప్పక చెల్లింపుచునేయుండెను. కాని యీ భోగము, యీశాంతి అయోధ్య నబాబు యెన్నాళ్లో అనుభవించలేదు.

అద్దె సేనల వేసి రుద్దుట.

కారన్‌వాలీసు అటుముఖము త్రిప్పగానే, తరువాతవచ్చిన గవర్నర్ జనరల్ సర్ జాన్ షోర్ అయోధ్యనబాబును తిరిగి పీడించసాగెను. "ఇంకొక యూరోపియనుదళమును, మరియొక దేశీయ కాల్బల పుదళమును పుచ్చుకో. దీనికి నీకు యెంతోఖర్చుకాదు. సాలుకు 5½ లక్షలకంటె యెక్కువ ఖర్చుకాదు." అని సర్‌జాన్‌షోర్ అయోధ్యవజీరును బలవంత పెట్టసాగెను. "ఇది లజ్జాహీనమగుపని— యిది కారన్‌వాలీసు చేసికొన్న ఒడంబడికను భంగపుచ్చుటకాదా" యని లక్నోలో అసిస్టంటు రెసిడెంటుగ నుండిన మేజర్‌బర్డు అడుగుచున్నాడు. ఇదిచాలక, వజీరు యీఅద్దె సేనలకిచ్చుకోవలసిన జీతబత్తెములు మున్నగువాని రేట్లుకూడ సర్‌జాన్‌షోర్ నానాట హెచ్చింపసాగెను. ఇవి ఖాయముగ, మారకుండవుంటవని పాపము వజీరు అనుకొనుచుండెను. కాని, యెప్పుడైతే యీ రేట్లను గవర్నర్‌జనరల్ హెచ్చింపసాగెనో, అప్పుడు వజీరుకు 'యిది చాలఅన్యాయ'మనితోచి, ధైర్యముతెచ్చుకొని, తెగువజేసి, నేనువీని నంగీకరించననెను. ఒక చిల్లిగవ్వకూడ యెక్కువయివ్వననెను. కాని, యేమిలా

భము! ఇది నిరర్థకమైన తెగువ! ఇది "నిర్వివాదమగు వాగ్దానమనియు," "బహిరంగముగ ప్రకటించిన హామీయనియు" పాపము వజీరు నమ్మికొనెను. ఏమి, యీ వెఱ్ఱిబాగుల నిరర్థకపునమ్మకము! తన 'నిస్స్వార్థమిత్రు'లగు యింగ్లీషువారు "నిష్కలంకమైత్రిని" "దృఢమగు ఐకమత్యము"ను చేయూతగొని యెంతవరకు పోగలరో పాపమీ వెఱ్ఱిబాగుల వజీరు కింకను తెలియదు. వజీరు తమమాట కిట్లు యెదురాడుటకు అతనిమంత్రి "మహారాజా జాలాల్" అనునతడే కారకుడను అనుమానముచేత యింగ్లీషువారతనిని పాపము అన్యాయముగ పట్టుకొని చెరసాలలో వేసిరి! "అయ్యో! అతనితప్పేమీ లేదని" వజీరు యెంతమొత్తుకొన్నను కంపెనీవారు వినరైరి. మంత్రినిట్లు చెరలోవేసి, "యీ అదనపు కప్పమునకు యిప్పుడు ఒప్పుకుంటావా లేదా" యనిచెప్పి సర్ జాన్ షోర్ వజీరు కంఠముపై కూర్చుండెను. ఈపనికై యితడు 1797సం॥ మార్చినెలలో లక్నోకువచ్చి, బెదరింపులతోను, మాయమాటలతోను, టక్కరు ఎత్తులతోను, బలాత్కరించి యీఅదనపు కప్పమును వజీరుచేత ఒప్పించెను. ఈరీతిగ వజీరుకు సాలుకు అయిదులక్షల యాభైవేల రూపాయలు అదనముగ ఖర్చులగునట్లు రెండు గుఱ్ఱపుదళములను అయోధ్య వజీరు నెత్తిపై బలాత్కారముగ తెచ్చిపెట్టిరి!

"మనోవ్యాధికి మందు లేదు."

ఈ బలాత్కారక్రియచేత, అనుకోనని దుష్ఫలితమింకొకటి గలిగెను. వజీరు (అసఫ్ఉద్దౌలా) తనకిట్టి బలాత్కారము గలిగినందుకు చాల మనోవ్యధనుపొంది మంచమెక్కెను. వ్యాధి నానాటికి హెచ్చెను. ఎంతమందిచెప్పినను మందుపుచ్చుకొనడు. మందు పుచ్చుకోమంటే "మనోవ్యాధికి మందులేదుగద" యని యున్నరనును. ఈరీతిగ కొద్దినెలలు జీవించి వజీరు చనిపోయెను! ఎవరైనాచావగానే, కొత్తవారసును తీసికొనివచ్చే సందర్భములో కంపెనీవారు తమపనిని మరింత వాటమువారీగ చక్కబెట్టుకొనుట మామూలేగద. "ఈతడవకూడ యిట్లేచేసుకోండి, షోండి" అను మాటలు పల్కుచు వజీరు పాపము ప్రాణములవిడిచెను! (మేజర్ బర్డు—లక్నోలో అసిస్టంటు రెసిడెంటుగనుండిన యతడు వ్రాసిన **Dacoitee in Excelcis** "దోపిడీకి పైమెట్టు" అను గ్రంథము 32,34, పేజీలు.)

వజీరు మరణం-కంపెనీవారి పంట.

సర్ జాన్ షోర్ పాపభీతిగల క్రైస్తవుడని చెప్పుకొందురు. అందుకనియే కాబోలు క్రైస్తవేతరుడగు వజీరు అసఫ్ ఉద్దౌలా, క్రైస్తవుడగు తానొనర్చిన దుష్కార్యకారణముగ మరణించినందుకు ఈ "పుణ్యాత్ముడు" సర్ జాన్ షోర్ యెంతో సంబరపడెను. ఈ క్రైస్తవేతరుని చావువల్ల, తన క్రైస్తవకోమటి యజమానులకు మంచిలాటు

వస్తుందిగదా యని యితడు సంతోషించెను. ఈవిషయములో యితడు తనగురువగు వారన్ హేస్టింగ్సుకంటె యేడకులెక్కువయే చదివెను. అందుకొరకే ఈ కృతాపరాధుని తిరిగి ఇండియాకు పంపించవద్దోయని బర్కు మొట్టమొదటనే మొత్తుకున్నాడు. వజీరు చావుతో యేమి జరిగినదో యికచూతము.

అసఫ్ఉద్దౌలా చావగానే, అతని ఔరసపుత్రుడు వజీరాలీ అయోధ్యతక్తు నెక్కెను. ఇందుకు సర్ జాన్ షోర్ అంగీకరించెను. కాని, కొంతకాలమైనతరువాత ఆకస్మికముగ ఒకానొక రోజున యితడు సరియైన వారసుడు కాడని షోర్‌కు ఆకాశవాణిచెప్పినదట! వెనుకటి నబాబు తమ్ముడు సాదత్ ఆలీ యనువాడు కాశీలో మనోవర్తి తింటూవున్నవాడు సరియైనవారసుడని షోర్‌కు తెలియవచ్చినదట! అసఫ్ ఉద్దౌలా చనిపోగానే, యెవరిని తక్తుమీద కూర్చుండబెట్టుదామని సర్ జాన్ షోర్ ఆలోచించెను. ఈసాదత్ ఆలీమాట మొదటనే వచ్చెను. "కాని, తనను తక్తుమీద కూర్చుండబెట్టితే, కంపెనీవారి కితడేమి కట్నమిస్తాడో అప్పటికింకను తేలలేదు. అందుచేత సర్ జాన్ షోర్ అప్పుడేమియు ఖండితముగ నిశ్చయించుకోలేదు. ఆకారణముచేతనే ఈ సాదత్ ఆలీ అప్పుడు కంపెనీవారికి పనికిరాకపోయెను. అయితే అప్పుడు వారతనికి వ్యతిరేకముగ చెప్పినకారణ మేమనగ కాశీలో చయత్ సింగు తిరుగుబాటుకాలములో జరిగిన అల్లరుల సందర్భములో అయోధ్యబేగముల యొక్కయు చయతుసింగుయొక్కయు, సాదత్ ఆలీయొక్కయు ప్రేరణచే ఈ తిరుగుబాటు చేయుచున్నామని, ఆ తిరుగుబాటుదార్లు చెప్పిరట! కాబట్టి సాదత్ ఆలీ అయోధ్యతక్తు నెక్కుటకు పనికిరాడని కంపెనీవారప్పుడు యేదో మిషచెప్పి త్రోసివేసిరి."

అయోధ్యతక్తు వేలము! కంపెనీవారి దోపిడి.

"ఎక్కువడబ్బు యెవరిస్తే వారిని తక్తుమీద నెక్కిస్తా" నని వారన్ హేస్టింగ్సు లక్నోలో వేలమువేయించినట్లు అతనిపై నేరము మోపిరి. కాని, సర్ జాన్ షోర్ తానే స్వయముగ లక్నోవీధులలో నిలువబడి, అయోధ్యతక్తును యెక్కువడబ్బు యిస్తానన్నవారికి యిస్తానో! హో! " యని తానే స్వయముగ వేలముపాట పాడినాడు. (Loc leit P. 31)

మేజర్ బర్డు యిట్లువ్రాయుచున్నాడు :—

" చనిపోయిన వజీరు తాలూకు తమ్ముడొకడు కాశీలోనున్నాడనియు వానితో యింతకంటె మంచిబేరము కుదుర వచ్చుననియు తెలుసుకొని, సర్ జాన్ షోర్ తక్షణమే కాశీకి బంట్రౌతులు దేరెను. సర్ జాన్ షోర్ యీ తమ్మునివద్దకు — సాదత్ ఆలీవద్దకు—వెళ్లి అతనితో యిట్లని చెప్పెను :— " వజీరాలిని త్రోసివేసి

నిన్ను అయోధ్య తక్తుమీద కూర్చుండబెట్టుతాము. ఇందుకు ప్రతిఫలముగ నీవు వెనుకటివారిచ్చిన కప్పముకంటె యెక్కువ కప్పమును కంపెనీవారికి యివ్వవలెను. మరియు యిందులో నీకు తోడ్పడినందుకు అయ్యేఖర్చు వేరుగ ధనరూపముగను, యింక యితరవిధముగను, మాకు యివ్వవలెను.'' లజ్జాహీనమును, పాపభీతి రహితమును నగు యీ మాటకు తక్తునెక్కకులుకుచున్న సాదత్ ఖాన్ బహు సంతోషముతో అంగీకరించెను. అంతట లక్నోలో కావలసిన ప్రారంభ కర్మకాండ కొంత జరిగినది. ఇదంతయు వజీరాలీ నిజముగ వెనుకటి నబాబుకు పుట్టినాడా లేదాయను విచారణయని పార్లమెంటు రికార్డులలో బూటకముగ వ్రాయబడినది. ఈ విచారణలో వజీరాలీ వెనుకటి వజీరుకు నిజమైన వారసుడు కాడని తేలినదట! అందుచే, సర్ జాన్ షోర్ ఆతనిని వెంటనే సింహాసనమునుండి త్రోసివేసి, 1798-వ సం॥ జనవరి 21-వ తేదీన సాదత్ ఆలీని అయోధ్య తక్తు నెక్కించితిమని లక్నోలో ప్రకటించెను.''

ఆరోజుననే వెనుక లోపాయికారీగ సర్ జాన్‌షోర్‌కును, సాదత్ ఆలీకిని జరిగిన మాటల ప్రకారము 17 షరతులతో ఒక ఒడంబడిక వ్రాయబడినది. ఈ ఒడంబడిక పత్రములో ప్రతి పంక్తిలోను "రూపాయలు, రూపాయలు" అను మాటలే ఖంగు ఖంగున మ్రోగుచున్నవి. అందిట్లున్నది :—

"..........వజీరు బకాయ యావత్తు తీర్చివేయవలెను. అలహాబాదు కోటను ఇంగ్లీషువారికి వదలివేయవలెను. దీనిని బాగుచేయించుకొనుటకు వజీరు ఇంగ్లీషువారికి 8 లక్షల రూపాయలివ్వవలెను. ఫుట్టేఘుర్‌కోట మరమ్మతుకై వజీరు ఇంగ్లీషువారికి మూడు లక్షల రూపాయలివ్వవలెను. సైన్యముల కదలించినందుకు వజీరు ఇంగ్లీషువారికి ఖర్చులివ్వవలెను. ఈ ఖర్చు లెన్నిలక్షలో యింకను నిర్ణయము కాలేదు. అతనిని సింహాసనముపై కూర్చుండబెట్టు సందర్భమున కంపెనీకైన ఖర్చు 12 లక్షలరూపాయలను వజీరు కంపెనీకిచ్చుకొనవలెను. సింహాసనమునుండి తొలగింపబడిన తన ప్రతిపక్షికి వజీరు సాలుకు లక్షన్నర రూపాయలు మనోవర్తి యివ్వవలెను. వజీర్లు యిదివరకు కంపెనీ కిచ్చుచున్నకప్పము సుమారు 56 లక్షలను యిప్పుడు 76 లక్షలకు హెచ్చించుకొనవలెను :—.........''

"ఈ రీతిగ ఒక్క సంవత్సరములో పదిలక్షల నవరసుల ధనమును, అలహాబాదు కోటయు, కంపెనీవారికి ఒక్క దెబ్బలో వచ్చివేసెను. దీనిలో సగము పూర్వము కారన్‌వాలీసు చేసుకొన్న ఒడంబడికను భగ్నపరచుటవలనను, మరియు తమకును, తమవలలో వేసుకొన్న వజీరాలీకిని నానాటి కేర్పడిన నేస్తమువల్లను లభించియుండెను.........కంపెనీ నౌకర్లుతప్ప, యితర యూరోపియను లెవరిని గాని అయోధ్య రాష్ట్రములో నుండకుండ వజీరాలీ వారిని వెడలగొట్టవలయునని

యీ యొడంబడికలో ఒకానొక షరతు యేర్పాటు చేయబడెను. దీనికి కారణ మొక్కటే స్పష్టముగ గన్పించుచున్నది. కంపెనీ నౌకర్లు యీ రాష్ట్రములో చేయుచున్న దుర్మార్గములు, ధనాపహరణములు ఇంగ్లండులో ప్రాకి, పార్లమెంటువారి నోటీసు లోనికికూడపోయి, వారన్ హేస్టింగ్సుకు ముప్పు తెచ్చినట్లే తమకును ముప్పు తేకుండ కట్టుదిట్టము చేసుకొనుటకే సర్ జాన్ షోర్ముతా వారిట్టి షరతు లేర్పరచి యనుటలో సందేహమేమియు లేదు '' (Dacoitee in Excelsis Pp. 35-38.)

ఈ ఒడంబడికనుగూర్చి సర్ హెన్రీలారెన్సు కలకత్తా రెవ్యూలో 1845 సం॥ లో యిట్లని వ్రాసెను :—

ప్రజల రసము పిండుట.

"సర్ జాన్ షోర్ చేసుకొన్న యీ ఒడంబడికలో మహాశ్చర్యకరముగ గన్పట్టున దొకటికలదు. అదేదనగ :—అయోధ్య రాష్ట్రపు సత్పరిపాలనకు తగు యేర్పాటేమియు యిందు కలికమునకైన కానము. ఎవరెక్కువడబ్బు యిస్తానంటే వారికి అయోధ్య ప్రజల నందరను తీసికొనిపోయి కట్టినట్లున్నది! వజీరాలీ పడుచువాడు, దుబారా ఖర్చు దారుడు ; ఎల్లప్పుడు డబ్బు కక్కురితిగలవాడు. సాదత్ ఆలీ నడివయస్సువాడు, ఖర్చులో జాగ్రతగలవాడు. భాగ్యవంతుడగుటచే, అతనికి వచ్చుచున్న మనోవర్తి లోనే యింకను డబ్బుమిగుల్చుకొని, చాలసొమ్ము లక్షలకొలది వెనుక వేసుకొన్నాడు. కాబట్టి, అన్నకొడుకుకంటె యితడే ప్రజలనుండి బాగాడబ్బుగుంజి, కూడబెట్టి, తమ కిచ్చేటట్లు కంపెనీవారికి కనిపించినాడు.''—

(ఇతనిని స్పంజిగ జేసి ప్రజల రసమును తాము పిండుకొనుటకు తమకు మిక్కిలి పనికివచ్చునట్లు కంపెనీవారికి తోచెను.)...... ''ఈరీతిగ సర్ జాన్ షోర్ మిక్కిలి దుష్టమగు వరవడిని పెట్టిపోయెను. ఇంగ్లీషు గవర్నరుల చేతులలో అయోధ్య సింహాసనము తమయిచ్చవచ్చినరీతిని బదలాయింపబడు ఆస్థిగ ఆతడు చేసి పోయెను. ప్రజలగతి శృంఖలాబద్ధుడును, ఆంగ్లాశ్రితుడును, నగు అయోధ్యపాల కుని దయాధర్మబిచ్చముపై నిలువవలసి వచ్చెను......ఇట్టి అయోధ్య ఒడంబడి కను యావత్తు మేము నిర్మొగమోటముగ నిరసింపక తప్పదు......''

## ఒలందా, పరాసుల స్థానములు యింగ్లీషువారికి దక్కుట

సర్ జాన్ షోర్ కాలములోనే 1785 సం॥లో, ఒలందావారికి ఇండియా లోగల స్థానములన్నియు యింగ్లీషువారి పరమయ్యెను. వారితాలూకు కొచ్చిన్, సిలన్, మలక్కా, బండా, అంబాయినా మున్నగు స్థానములన్నియు ఇంగ్లీషు వారు లాగికొనిరి. ఇండియాఖర్చుతోనే పరాసువారికి చెందిన, మారిషస్ లంకయు, స్పెయిన్ వారికి చెందిన మనిల్లాయు, ఇంగ్లీషువారు లాగికొనిరి.

షోర్‌కు ప్రభుబిరుదు-నిష్క్రమణము.

సర్ జాన్ షోర్ యే దేశీయప్రభువుతోగాని బహిరంగముగ యుద్ధమైతే చేయనిమాట నిజమే. దీనికి కారణము కంపెనీవారి కప్పుడు డబ్బులేకపోవడమే గాని వేరుకాదు.

1797సం॥ అక్టోబరు 24-వ తేదీన సర్ జాన్ షోర్‌కు ఆంగ్లమంత్రివర్గము వారు ప్రభుబిరుదము నిచ్చిరి. అప్పటినుండియు యితడు, "టీన్‌మౌతుప్రభువ"ని పిలువబడుచుండెను. ఇతడు 1798సం॥ మార్చినెలలో గవర్నర్ జనరల్ పదవికి రాజీనామా యిచ్చి యింగ్లండుకు వెళ్లిపోయెను.

క్రైస్తవ ధర్మములందు భక్తిగలవాడను పేరు యితనికున్నను, వానిలో ఒక్కటినిగాని యితడు ఇండియావిషయంలో పాటింపలేదు. ఇతడును వారన్ హేస్టింగ్సు బడిలోనే చదువుకొని గురువుకంటె శిష్యుడే యోడాకులెక్కువ చదివె నన్నసూక్తిని నిజమొనర్చెను.



# బ్రిటిష్ మహాయుగము

## పదునారవ అధ్యాయము



### వెల్లస్లీ పరిపాలన (1798—1805)

"ఎరల్ మార్నింగ్టన్" అను నామాంతరముగల మార్క్వెస్ వెల్లస్లీ అనునతడు ఇండియాకు గవర్నర్ జనరల్ అగుటతోనే ఇండియా చరిత్రయందు నూతనాధ్యాయము ప్రారంభమయ్యెను. ఇతడు ఇండియా పటమునంతను రక్తవర్ణ మొనర్చెను. ఇందుకై యితడవలంబించిన విధానము న్యాయమైనదా అన్యాయమైనదా యని యితడు కించిత్తైనను ఆలోచనచేసి యుండలేదు.

వెల్లస్లీ పూర్వచరిత్ర.

ఇతడిండియాలో చేసిన ఘనకార్యముల వర్ణించుటకుముందు, యితని పుట్టుపూర్వోత్తరములగూర్చి కొలదిగ వివరించుట అవసరము. ఇతడు 1760సం॥ జూన్ 20-వ తేదీన ఐర్లండులో జన్మించెను. ఆరోజులలో నుండిన ఐర్లండు పార్లమెంటులో యితడొకసభ్యుడుగ నుండెను. 1784 సంవత్సరములో ఇంగ్లీషు పార్లమెంటులో ప్రవేశించెను. అప్పటికితనికి విశాలాభిప్రాయములే యుండెనట. కాని, ఫ్రెంచివిప్లవముతో యితని యభిప్రాయములు మారిపోయెనట.

ఫ్రెంచి ముండ కథ.

ఇతని ప్రయివేటు జీవితము శుద్ధమైనదికాదు. చిన్నతనమందే యితడొక ఫ్రెంచిదాని నుంచుకొనెను. దానికి పిల్లలు పుట్టిరి. పిల్లలు పుట్టిన తరువాత దానినే పెండ్లిచేసుకొనెను. కాని, మగడు పెండ్లములకు పడకుండెను. ఇతడు ఇండియాకు వచ్చునప్పుడు అది ఇతనితో రానుపొమ్మనెను. ఇంతటితో యిద్దరికి విడాకులయిపోయెను. ఫ్రెంచిదియగు తన ముండమీది కోపమునే యితడు ఇండియాలో ఫ్రెంచివారిమీద ఆఖరువరకు జూపుచువచ్చెను. ఫ్రెంచివారిపేరుచెబితే యితడు మండిపడుచుండెను. దేశీయ రాజులు ఫ్రెంచివారితో స్నేహముగనున్నారను కారణముచేతనే యితడనేకమంది దేశీయరాజులను కూలద్రోసెను. "ఫ్రెంచి బూచి" యితనికళ్లలో సదా మెలగుచుండెను. ఇతనికి ఫ్రెంచివారిపై యింతటిద్వేషము, గాభరా, కలుగుటకు కారణము యితడుంచుకొన్న పరాసుముండ యితనితోరాక యితనిని నానాయేడుపులు యేడిపించుటయేతప్ప వేరొండు కారణ మూహింప వీలుగాకున్నది. ఇతడు ఐర్లండు దేశస్థుడు. ఐర్లండు దేశస్థులకు కష్టకాలములలో మెన్నోసార్లు సహాయ

పడినవారు ఫ్రెంచివారు. వెల్లస్లీ నిజముగ స్వదేశభక్తిగల ఐరిషువాడేయైనచో, యితడు నిజముగ ఫ్రెంచివారికెంతయో కృతజ్ఞత జూపవలసియుండెను. కాని, యీముండవ్యాపారమువల్ల యితనికి ఫ్రెంచివారిపై యిట్టి ఘోరద్వేషము గలుగుటకు కారణమైనది. ఫ్రెంచివారిపై యితని కెట్టిద్వేషము, భయము గలదో యితడు 1799సం॥ మే 4-వ తేదీన తనసేనాపతికి ప్రయివేటుగ వ్రాసిన యీక్రింది ఉత్తరమువలన తెలియగలదు.

ఫ్రెంచివారిపై కటిక ద్వేషము.

"కలకత్తాలోను, యితర ప్రాంతములలోను వున్న ఫ్రెంచివారి సంఖ్య మనకు చాల అపాయకరముగ నున్నది. వీరు ఎక్కడెక్కడ ఎంతమంది వున్నారో, వీరిప్రవర్తన యెట్టిదో, మీరు వెంటనే దర్యాప్తు చేయవలెను. తన స్థితిగతులనుగూర్చి మీకు తృప్తికరమైన సంజాయిషీ యివ్వలేని ప్రతిపరాసువానిని పట్టుకొని, మీరు తక్షణమే యెంతమాత్రము సంకోచించకుండ యూరపుకు పంపించివేయవలెను. ఒక్క కలకత్తాలో నూటయాభై మందికి తక్కువగాకుండ ఫ్రెంచివాళ్లున్నారు. వీళ్లందరు చాల అపాయకరులని నాయభిప్రాయము. చిటగాంగునిండా ఫ్రెంచివాళ్లే. ఇక్కడ ఇక ఒక ఫ్రెంచివాణ్ణికూడా యేమైనాసరే ఉండనీయరాదు. చంద్రనగరంలో వుండే వాళ్లనుకూడ సాధ్యమైనంత యెక్కువమందిని యూరపుకు పంపించివేస్తేనే బాగుంటుంది. ఫ్రెంచివాళ్లంటే, వాళ్లతో యేమాత్రము సంబంధమున్న యితర యూరోపియను జాతివాళ్లనికూడ నాయభిప్రాయము. చించూరాలోకూడ చాలమంది పరాసు దుర్మార్గులున్నారు. వీళ్లనుకూడ పట్టుకొని యింటికిపంపించి వేయవలెను. ఇతర ప్రాంతములలో కంటికి కనపడ్డ ప్రతిపరాసువానిని — వాడు వీడని లెక్కచేయకుండ — పట్టుకొని ముందుగ కలకత్తాకు తీసుకురావలెను. అక్కడనుంచి — అనుమానముతోచిన ప్రతివాణ్ణి యేరి — సరాసరి యూరపుకు పంపించివేయవలెను...... దీనినిగూర్చి మీరెంత శ్రద్ధవహించినను అది యెక్కువ కాదని నాయభిప్రాయము...... (**Memoirs and Correspondence of Marquis of Wellesly. By R. R. Pearce Vol. I. Pp 272-273.**)

ఈస్టిండియా కంపెనీవ్యవహారముల నజమాయిషీ చేయుటకై యింగ్లీషు పార్లమెంటు వారేర్పరచిన "కంట్రోలుబోర్డు" లో వెల్లస్లీ 1793 సం॥లో మెంబరుగ నియమింపబడుటవలన అతనికి ఇండియా వ్యవహారములు

ఇండియానుగూర్చిన పరిచయము.

కొంచెముగ తెలియును. ఇతడు ఇండియా దేశచరిత్రనుగూర్చియు, తూర్పుసముద్రపులంకలలో యూరోపియను వలసలనుగూర్చియు, అనేకగ్రంథములనుకూడ చదివియుండెను. 1793 నుండి ఇండియాకు గవర్నర్ జనరలుగ బయలుదేరువరకు యితడు ఇండియా వ్యవహారము

లనుగూర్చి తప్పీలుగ చదివియుండెను. అదిగాక, ఇండియాలో గవర్నర్ జనరల్ పని చేసి వచ్చిన కారన్వాలీసుకును, యితనికిని చాల దోస్తీయుండెను. ఇండియాలో దేశీయరాజుల స్వాతంత్ర్యములహరించి, వానిని దిగమ్రింగుటకై తానొనర్చియున్న ఘనకార్యములన్నిటిని కారన్వాలీసు తనమిత్రుడగు యీ వెల్లస్లీకిచెప్పి "ఈమార్గమునసే నీవుకూడ పోవలసినదని" బహుశః ఆగుట్టుమట్టులనెల్ల బోధించియుండ నోపును. వెల్లస్లీయు తనమిత్రుడు బోధించిన ఉపదేశములప్రకారమే యిండియాలో వ్యవహరించెను.

పిట్టుమంత్రి వెలస్లీని వరించిన కథ.

మద్రాసుకు గవర్నరుగనున్న హోబర్టుకు యీ గవర్నర్ జనరల్ పనిని యిచ్చెదమని కంపెనీవారు అతనికి ముందు వాగ్దానము చేసియుండిరి.

కాని, కర్నాటకరాజ్యమును దిగమ్రింగువిషయమై యితడు సర్ జాన్ షోర్ కు మద్దతు చేసియుండని కారణముచే కాబోలు వారా వాగ్దానమును తప్పించిరి. ఇతడు సూచించిన కొన్ని రాజ్యపరిపాలనా వ్యవహారములును కంపెనీవారికి రుచించలేదు. అందుచే, గవర్నర్ జనరల్ పనిని యీతనికివ్వక, యింకొక పెండ్లికొడుకు నిమిత్తమై కంపెనీవారు వెదుక నారంభించిరి. అప్పుడు ఇంగ్లండులో "పిట్టు" ప్రధానమంత్రిగ నుండెను. ఇతడు బ్రిటిష్ సామ్రాజ్యమును యెట్లయిన విస్తరింపజేయవలెనని తహతహలాడుచుండెను. సర్ జాన్ షోర్ అనంతరము తిరిగి కారన్వాలీసునే ఇండియాకు పంపితే బాగుండునని పిట్టు తలంచెను. ఇతడు లోగడ టిప్పూసుల్తాన్ తో యుద్ధము చేసి, కొంతరాజ్యమును సంపాదించియుండెను. కాబట్టి, యీతడవకూడ యితనినే పంపితే, కొత్తరాజ్యమును మరింతసంపాదించవలెనని తనమనస్సులోవున్న కోర్కెను యితడు యీడేర్చగలడని పిట్టుమంత్రి తలంచెను.

ఇందుకు కారన్వాలీసును "సై" యనెను. ఇండియాకు కారన్వాలీసు పయనమయ్యెను. ఓడలో అడుగుపెట్టెను. కాని, పిట్టుమంత్రిచేసిన దురాగతముల వల్ల ఐర్లండులో అప్పుడే గొప్పకల్లోలములు ప్రారంభమగుటచే, దాని నణచ గలిగినవాడు కారన్వాలీసుతప్ప యింకెవరును కనుపించలేదు. అందువల్ల పిట్టుమంత్రి అతనిని యిండియాప్రయాణము మాన్పించి ఐర్లండుకు వైస్రాయిగ పంపించెను.

మార్నింగ్టన్ ప్రభువుకు (అనగ వెల్లస్లీకి) లోగడ మద్రాసుగవర్నర్పదవి వాగ్దానము చేయబడియుండెను. కాని, కారన్వాలీసు అటు ఐర్లండు వెళ్లవలసి వచ్చుటచే, ఇండియాకు గవర్నర్ జనరల్ గ పోతగినవాడు ఈ మార్నింగ్టన్ తప్ప యింకెవరును కనుపించలేదు. వారమురోజులు యెవరిని పంపుదమాయని మధనపడిన తరువాత ఆఖరుకు, ఈ మార్నింగ్టనునే ఇండియాకు పంపుటకు పిట్టుమంత్రి తీర్మా

నించుకొనెను. పిట్టుకును ఈవెల్లస్లీకినిగలస్నేహము అపారమని తెలియుచున్నది. ఈ వారమురోజులలో పిట్టుమంత్రి తన ఆప్తమిత్రుడగు వెల్లస్లీకి తన మనస్సులోని తలంపులనన్నిటిని నూరిపోసి, "ఎట్లైననుసరే, అమెరికాలోమనకు పోయినరాజ్యానికి ప్రతిగ, ఇండియాలో నీవు మరియింకొక పెద్దసామ్రాజ్యమును సంపాదించుకొని రావలెను సుమా" యనిచెప్పి అతని భుజముపై చేయివేసితట్టి, హెచ్చరించినట్లు తోచుచున్నది. ఈ కారణముచేతనే, తదుపరి వెల్లస్లీ ఇండియాలోచేసిన ప్రతిపనిని పిట్టుమంత్రి "భళాభళీ" యని ఆమోదించుచువచ్చెను.

పిట్టుమంత్రి బోధ.

పరరాజ్యముల నాక్రమించుట తమభావములకు విరుద్ధమని 1784 సం॥ లో పిట్టుమంత్రి చేసిన పార్లమెంటు చట్టములోని మాటలు కేవలము బూటకములు. పిట్టుమంత్రి తాను ఇండియాలో తలపెట్టిన నూతనరాజ్య స్థాపనాసంకల్పము లోకులకు తెలియకుండ వారి కండ్లలో దుమ్ముకొట్టుటకే ఆతడీవాక్యములను బుద్ధిపూర్వకముగ పార్లమెంటు చట్టములో ఆనాడు యిరికించెను. పిట్టుమంత్రి కాలములోనేగద కారన్‌వాలీసు అకారణముగ టిప్పూపై పోయిపడెను. తనసంకల్పమును నెరవేర్చుటకితడు బాగా పనికి వస్తాడనే తలంపుచేతనే పిట్టుమంత్రి రెండవసారికూడ కారన్‌వాలీసును ఇండియాకు పంపదలంచెను. కాని, అంతకంటె అవసరమైనపని ఐర్లండులో అప్పుడు తగిలినందున కారన్‌వాలీసును పంపుటకు వీలులేక, మార్నింగ్‌టనును (వెల్లస్లీని) పిట్టుమంత్రి ఇండియాకు పంపించవలసి వచ్చెను. అయితే, అతనికి ముందుగా ఒకవారము రోజులపాటు బడిపెట్టి అతనిని తనదగ్గర వుంచుకొని తనమనస్సులోని రాజ్యస్థాపనాదిక సంకల్పముల నన్నిటిని బాగా నూరిపోసిన తరువాతగాని వెల్లస్లీని పిట్టుమంత్రి ఇండియాకు ప్రయాణము కట్టనీయలేదు.

ఇండియాకు ప్రయాణము.

మార్నింగ్‌టన్ యీరీతిగ పిట్టుమంత్రి బడిలో వారమురోజులు బాగా పాఠములు నేర్చుకొని, 1797 సం॥ నవంబరు 7-వ తేదీన సీమలో ఓడ యెక్కెను. అతని తమ్ముడు "ఆర్థర్" (డ్యూక్ ఆఫ్ వెల్లింగ్‌టన్) అంతకుపూర్వమే ఇండియాకు వెళ్లియుండెను. హెన్రీయను తన కడసారి తమ్మునికూడ యీ మార్నింగ్‌టన్ తనవెంట ప్రయివేటు కార్యదర్శిగ తెచ్చుకొనెను. ఈ రీతిగ యీ ముగ్గురు అన్నదమ్ములును యేకమై, ఒక కుట్రసంఘముగచేరి, పిట్టుమంత్రి కోర్కె ప్రకారము ఇండియాలో ఆంగ్లరాజ్య స్థాపనచేయుటకై పూనుకొనిరి. మార్నింగ్‌టన్‌తోపాటు అతనిపరాసు యుంపుడుకత్తెయగు భార్య రాలేదనియు, దానికిపుట్టిన వాళ్లందరు అధర్మ సంతానమనియు, మగడు పెండ్లములకు సరిపడలేదనియు, యీ క్రోధముచేతనే వెల్లస్లీ ఇండియాలో పరాసువారిపై అమితకోపము వహించెననియు, యిదివరకే చెప్పియుంటిమి. ఆ

పరాసుముండ యితనితో ఇండియాకు వచ్చియుంటే, ఇండియాలో బహుశఃయిన్ని యుద్ధములు జరిగేవికావేమో.!

వెల్లస్లీ రణదాహము – రెండునెలల ప్రేయసికి జాబు.

మార్నింగ్‌టన్ సీమలో ప్రయాణమగునాటికి ఇండియాలో యెక్కడను అశాంతిలేదు. అంతయు శాంతముగనుండెను. ఈ శాంతిని తాను భంగపుచ్చ దలచలేదని మార్నింగ్‌టన్ టక్కరుమాటలు చెప్పసాగెను. ఇవన్నియు లోకులకండ్లలో దుమ్ముకొట్టి వారెవరును తనకడ్డమురాకుండ చేసుకొనుటకే ఉద్దేశించి చెప్పబడిన మాటలుగాని వేరొండుకావు.

మార్నింగ్‌టన్ తలంపులు యెంతమాత్రము శాంతియుతములు గావని యీ దిగువ ముద్రింపబోవు అతని యుత్తరములలోని భాగములే వేనోళ్లచాటుచున్నవి. మార్నింగ్‌టన్ అసలు శాంతిప్రియుడేయనియు, కాని, కారణాంతరములచేత అతడు విధిలేక, తనయిష్టమునకు వ్యతిరేకముగ, దేశీయరాజులతో యుద్ధములు చేయవలసి వచ్చెననియు, చెప్పువారు అతని నిజోద్దేశముల నెరుగనివారైన మైయుండవలెను; లేదా బుద్ధిపూర్వకముగ అసత్యములాడువారైనవై యుండవలయును. ఈతడొనర్చిన అన్ని యుద్ధములలోను తప్పు యితనిదే. ఇతడే ముందుగ కవ్వించి యితరులపైబడెను. ఇతడు సీమనుండి వచ్చుచు దారిలో దక్షిణాఫ్రికాగ్రమున రెండునెలలు మజిలీచేసెను. ఈ మజిలీలో యితడు అక్కడనున్న యింగ్లీషు గవర్నర్ యింట అతిథిగనుండెను. ఈ రెండు నెలలును యితడు యీ గవర్నర్‌భార్య "లేడీ–అన్నా బర్నార్డు"తో "బహు ఆనందముగ, హాయిగ" కాలము బుచ్చెనట! మార్నింగ్‌టన్ ఇండియాకు వచ్చినపిమ్మట, తనమనస్సులోని ఉద్దేశములన్నిటిని తన రెండునెలల ప్రియురాలికి తెలియబరచుచు 1800 సం॥ అక్టోబరు 2–వ తేదీన కలకత్తానుండి ఒక ఉత్తరమును వ్రాసెను. ఆంగ్లమంత్రి వర్గమువారు తనకిచ్చిన "మార్క్వస్" బిరుదమునుగూర్చి ఆతడా ఉత్తరములో యిట్లని చెప్పెను.

"(ఆంగ్ల మంత్రివర్గమువారు) నాకిచ్చిన యీ ఐరిష్ ప్రభు బిరుదము నాకు చాల ఘనమైనదని నీవు తలంచుచున్నావా"?.........

......"ఇంతకంటె యితరగౌరవము లేమియునాకురాలేదు. వస్తవని నేననుకొనను. ఒకవేళ వచ్చినను నేను వానిని పుచ్చుకొనను. నీవీమాటకు ఆశ్చర్యపడబోకుము. నేనిట్లు చెప్పిన యీ ఒక్కమాటను బట్టియే నా చిన్నిముద్దుల మనస్సులో–నా యీ దీనహృదయములో–నన్నెట్టి మర్మవేదన పట్టి వేధించుచున్నదో నీవే గ్రహించుకోగలవు. దీనిని బట్టియే నావంట్లో జబ్బుగనుండుటకుగల కారణమును గూడ నీవు ఊహించుకోగలవు."

"కాని, నేనింతమాత్రముచేత తొందరపడి నా ఉద్యోగానికి రాజీనామా యిచ్చివేసి, కోపముతోగాని, మరి యితర చికాకుతోగాని, యూరపుకు లేచి పోతానని నీవనుకోవద్దు. నేనటువంటి పని యేమియు చేయను. నేను వారికి యింకను యెక్కువ ఉపకారములు చేసి, కృతఘ్నతా భారమును వారిమీదనే మరింత యెక్కువగ పడవేసెదను. వారు నాకిచ్చియున్న గౌరవము (బిరుదు) నేనువారికి చేసిన ఉపకారము ముందు "యెన్నో వంతురా"యని వారికే సిగ్గుగలుగునట్లు నేను చేసెదను. నేను రాజ్యముల మీద రాజ్యములను తీసికొనివచ్చి వారిమీద పడవేసెదను; జయములమీద జయములను, రివిన్యూమీద రివిన్యూను, తీసికొనివచ్చి కుప్పలు కుప్పలుగ వారిమీద పడవేసెదను. కీర్తిని, ధనమును, అధికారమును కొండలుగ వారిపై పేర్చి నా యజమానుల ధనతృష్ణ, దురాకాంక్ష సైతము. 'యిక చాలు బాబో' 'యికచాలు బాబో' యని గోలపెట్టి అరచేటట్లు చేస్తాను. నా ప్రతిభను వారెంత హీనముగజూచి, నన్నెంత అలక్ష్యముగ జూచి, నాకెంతటి అపకారము చేసినారో వారికి జూపి, నేను వారికి జేసిన ఉపకారముముందు వారు నాయెడ పిసినిగొట్టుతనముగ జూపిన యీ కొలదిపాటి ప్రత్యుపకారము యెంత అణుమాత్రమైనదో,—ధూళిరవ్వంతకూడ చేయదో—వారికప్పుడు కళ్లకు కట్టినట్లు జూపించెదను."

మార్నింగ్టన్ వ్రాసిన పైమాటలు విన్నతరువాత అతడు శాంతిప్రియుడని యింక యెవ్వడైన అనగలడా? ఏదోవిధముగ-మంచిగనో, చెడుగనో-యుద్ధముల కల్పించి, రేపి, దేశమును, ధనమును, సంపాదించి తనయజమానులకు కట్టిపెట్టవలయునను తీవ్రదాహమితనికున్నట్లు పైమాటలే స్పష్టముగ బల్లగుద్దిచెప్పుట లేదా?

*దక్షిణాఫ్రికాగ్రపుమజిలీ-వ్యూహరచన.*

మార్నింగ్టన్ ఇంగ్లండులో బయలుదేరినవాడు సరాసరి ఇండియాకు రాక, మధ్య త్రోవలో దక్షిణాఫ్రికాగ్రమున రెండు నెలలు మకాము చేసెను. ఈ మజిలీలో కూర్చుండియే, గవర్నర్ భార్యతో విలాసముగ కాలక్షేపముచేయుచు భారతప్రజల స్వాతంత్ర్యము నపహరించు యెత్తులనన్నిటిని యితడు విశ్రాంతిగ ఆలోచించుకొనెను. ఇతని అదృష్టవశాత్తు యిక్కడ యితనికి యిరువురు మిత్రులు దొరికిరి. వీరిరువురు యిదివరలో ఇండియాలోనుండి వచ్చినవారే. వీరికి ఇండియా సంగతులు బాగుగ తెలియును. అక్కడిస్థితిగతులనన్నిటిని వారు మార్నింగ్టన్కు నూరిపోసి, అతనికి కొత్తయెత్తులనుకూడ నేర్పిరి. వీరిద్దరును ముఖ్యముగ టిప్పూసుల్తానుపై ప్రత్యేక ద్వేషమున్నవారు.

వీరిలో ఒకనిపేరు "డేవిడ్ బెయిర్డు". రెండవవానిపేరు "మేజర్ పాట్రిక్కు." మొదటివాడు "డేవిడ్ బెయిర్డు" లోగడ ట్రిప్పుసుల్తానుకు ఖైదీగ చిక్కి అతనిచేత యవస్థపడియుండెనట. టిప్పూ యితనికి కోతివేషమువేసి, తన యెదుట కోతిఆడినట్లు ఆడమనేవాడట! గోడపాతి దానిమీదికి క్రిందికి కోతివలెయెక్కి దిగమనేవాడట! ఈ వినోదమునంతను టిప్పూ చూచుచు ఆనందించుచుండేవాడట. తననిట్లు అవమానపరచి వేధించిన టిప్పూపై కసితీర్చుకొనవలెనని యీ బెయిర్డు చూచుచుండెను.

డేవిడ్ బెయిర్డు - టిప్పూ కోతి.

టిప్పూ తనఖైదీలను క్రూరముగ హింసించినట్లు చెప్పుసాక్షులు ఇంగ్లీషుఖైదీలుతప్ప యింకెవరును కనుపించరు. అయితే, ఈ ఇంగ్లీషు ఖైదీలమాటలు నమ్మదగినవి కావని మాత్రము యెల్లరు గుర్తువుంచుకొనవలెను. అతని నెట్లయిన, చెడ్డవాడని చెప్పి లోకములో అల్లరిచేసి, లోకమందరిచేత అతనిని తిట్టించవలెనని యీ ఇంగ్లీషువారి సంకల్పము. టిప్పూను, అతని తండ్రియుకూడ, ఇంగ్లీషువారిని అనేకసార్లు ఓడించి యుండిరి. ఈ రోషముచేత వారతనిపై కసితీర్చుకొనవలెనని చూచుచుండిరి. తమకు సమయము తప్పివచ్చినప్పుడు వీ రతని కాళ్లు గడ్డములు పట్టుకొని బ్రతిమాలుకొన్నను, లోలోన అతనిపై రోషము మాత్రము వీరికి చావలేదు. "ఈర్ష్యయను నది లోలోన చిరకాలము నిద్రించుచుండునుగాని, అది చావనుమాత్రము చావదు" అని పెద్దలు చెప్పుదురు. ఒకవేళ టిప్పూ క్రూరుడని వాదమునకు ఒప్పుకొన్నను అంతకంటె యెక్కువ క్రౌర్యములగావించిన కుహనాక్రైస్తవులు యూరోపియనులు-ఆతని నే మొగము పెట్టుకొని నిందించగలరు ? ఎంతో పుణ్యాత్ముడనియు, పాపభీతిగలవాడనియు, చెప్పుకొను ఒకానొక యూరోపియను రాజు మొన్న మొన్ననే గద-మహానాగరకాగ్రగణ్యమని చెప్పుకొను పందొమ్మిదవ శతాబ్దపు ఆఖరు సంవత్సరములో-1900 సం॥ లో-చేతచిక్కిన చీనాఖైదీల నెవరిని ప్రాణములతో నుండనీయవద్దని తన సైనికులకు హుకుము జేసెను! ఈ మహాదారుణ రక్తపాత కార్యమందు తనసైనికులకు జయముగలుగుగాక యని యీ క్రైస్తవ రాజేగద-మొన్ననేగద-సిగ్గులేక చర్చీలలో ప్రార్థనలకూడ జేయించెను! సుడాను లో గాయపడి చావును సిద్ధముగనున్న "దర్వీషు" ల యెడ యెంతమాత్రము కనికరము జూపక మహాదారుణమగు అసుర కృత్యముల నొనర్చి, కోట్లకొలది ప్రజాళిచే దేవదూతగ పూజించుకొనబడు పుణ్యాత్మునొకని సమాధిని అపవిత్రమొనర్చుటకు కూడ జంకనిది తమశాఖీయుడగు ఒకానొక యూరోపియను సేనానాయకుడే సుమాయను సంగతిని యూరోపియనులేల మరచిరి? ఇటీవల బాల్కను యుద్ధములో యూరోపియను లొనర్చిన ఘోరదురంత కృత్యములను లోకమింకను మరువలేదు. ఈ క్రౌర్యములముందు టిప్పూ చేసెనన్న క్రౌర్యములేమిలెక్క? ఎప్పుడైన యూరోపియనులు యితరులనుగూర్చి నిందావాక్యములేమైన పలుకుచున్నప్పుడు, వారు జర్మను

వేదాంతి "షోపెన్ హవార్" చెప్పిన యీ దిగువ సామెతను జ్ఞాపకము చేసుకోవలెను. "కుక్క అద్దములో తననీడను చూచుకొని, తాను మొరిగినట్లే! అద్దములో కనుపడునది తానేగాని వేరొక కుక్క కాదు." ఈ సంగతి తెలుసుకోలేక, అది వేరేకుక్క అనుకొని యిది ఊరక మొఱగుచుండును. యూరోపియనులును యింతే! ఇక, కథాభాగమునకు వత్తము.

కర్కు-ప్యాట్రిక్- వృద్ధజంబుకము.

దక్షిణాఫ్రికాగ్రపు మజిలీలో వెల్లస్లీకి తగిలిన రెండవస్నేహితుని పేరు మేజర్ "కర్కు ప్యాట్రిక్" అని చెప్పియుంటిమి. ఇతడు హైదరాబాదు దర్బారులో లోగడ రెసిడెంటుగనుండెను. ఆరోగ్యము నిమిత్తమై యితడిప్పుడు దక్షిణాఫ్రికాగ్రమునకువచ్చి యుండెను. ఇతడు వృద్ధజంబుకము. వారన్ హేస్టింగ్సు, కారన్ వాలీసు బడులలో చదువుకున్నవాడు. ఒకప్పుడితడు మాధవరావు సింధియా దర్బారులో రెసిడెంటుగనుండెను. నానాకును, సింధియాకును పడకుండ చేసి మహారాష్ట్రరాజ్య నాశనమునకు బీజములనాటినది యితడేయని యూహింపతగియున్నది. కొంతకాలమునకు యితనికిని సింధియాకును యేలనో పడలేదు. ఇతనికిని అప్పుడు గవర్నర్ జనరలుగనుండిన కారన్ వాలీసుకును జరిగిన ప్రయివేటు ఉత్తర ప్రత్యుత్తరములు యెక్కడను ప్రచురముకాలేదు. అందుచే, యితనికిని సింధియాకును గల వైమనస్యమునకు కారణము తెలియరాకున్నది. ఏమైననేమి, కారన్ వాలీసు యితనిని సింధియా దర్బారులోనుంచి దీసివేసి, నేపాళరాజ్యమునకు వేగులరాయబారిగా పంపించెను. "ఆ దేశములోగల సైనికబలమును, రాజకీయ వ్యవహారములను కనిపెట్టి చూచిరమ్ము; ముందు యుద్ధములలో మనకవి పనికివస్తవి" అని కారన్ వాలీసు యితనికి చెప్పిపంపించెను. నేపాళమునుండి వచ్చినపిమ్మట యితడు హైదరాబాదుకు రాయబారిగ పంపబడెను. ఇతడక్కడ తన రాయబారపు పనులు చేయుటయేగాక, ఆరాజ్యపు ఆంతరంగిక వ్యవహారములలోకూడ జోక్యము కలిగించుకొనసాగెను. అమెరికను, బ్రిటిష్ ద్రిమ్మరీండ్రను హైదరాబాదులోకి దిగుమతిచేసి, అక్కడ పలుకుబడిగనున్న ఫ్రెంచివారికిని, వీరికిని గిల్లి కజ్జాలుపెట్టి, దేశములో నానా అల్లరులను యితడు చేయించెను. ఈ రీతిగ పరాసువారిపై నైజాముకును అతనిమంత్రులకును తానెట్లు బద్ధవైరమును కల్పించెనో యితడు దాచక వెల్లస్లీకి పూసగ్రుచ్చినట్లు యీరీతిగ చెప్పివేసెను.

[పరాసువారి (విప్లవ) సిద్ధాంతములగూర్చియు, వానిని తామవలంబించుటవల్ల తమకు వచ్చు ముప్పులగూర్చియు దేశీయరాజులకందరకు విప్పిచెప్పితే, వారిక పరాసువారిని తమ జన్మలో దరికిరానీయరు. ఇందువిషయమై మేము అశ్రద్ధగనుండలేదు. చేయవలసిన పనిని చేసియేయున్నాము. అయినప్పటికి యిది యెంతవరకు పనిచేస్తుందో యిప్పుడిప్పుడే గట్టిగ చెప్పడానికి వీలులేదు. మనము యింకను జాగరూకతతోనే వుండవలెను. (క్లుప్తము)

[Wellesley's Despatches — Vol. I - p. 646.]

పైమాటలనుబట్టి యేమికనుపించుచున్నది? ఫ్రెంచివారిపై యేవేవో చాడీలుచెప్పియు, వారిసిద్ధాంతముల నిందించియు, వారిపై దేశీయరాజులకు అసహ్యము పుట్టునట్లు ఇంగ్లీషు రాయబారులు దుర్మార్గ ప్రచారము చేసినట్లు స్పష్టమగుటలేదా? ఫ్రెంచి విప్లవ సిద్ధాంతములు మంచివా చెడ్డవాయని మన మిప్పుడు చర్చించబూనుట అనవసరము. పరాసు విప్లవము సర్వమానవ సౌభ్రాతృత్వమును, సర్వమానవ సమత్వమును లోకమునకు చాటి చెప్పియుండెను. ఈ యుదారభావములచే ప్రేరితులై, రెండున్నరకోట్ల పరాసుప్రజలు ఒక్కుమ్మడిలేచి, తమనిరంకుశ ప్రభువును త్రోసివేసి, ప్రజారాజ్యమును స్థాపించుకొనిరి. ఈ మహాసంక్షోభములో అనేక దుర్మార్గములు జరిగియుండవచ్చును. కాని, సంక్షోభము చల్లారినను అది లోకమునకు చాటిన అమూల్య సిద్ధాంతములు చావక చిరంజీవియై నేటికిని యావన్మానవ కోటిని ఉర్రూత లూగించుచున్నవి. పరాసుప్రజ లోకమూల యిట్లు సర్వమానవ సమత్వమును, స్వాతంత్ర్యమును ప్రకటించుచుండగ, ప్రక్కనున్న లంకలోని ఇంగ్లీషువారు లోకుల స్వాతంత్ర్యమును హరింపజూచుచుండిరి. ఈ మహోదారభావములు లోకములో వ్యాప్తిగాకుండ అరికట్టవలెనని వారీ రీతిగ దుష్ప్రచారము చేయసాగిరి.

అద్దెసేనల స్కీము.

దక్షిణాఫ్రికాగ్రపు మజిలీలో కర్కు ప్యాట్రిక్కుతో గలిగిన పరిచయము వల్ల, ఇండియాలో ఆంగ్ల రాజ్యస్థాపనచేయుటకు వలయు పరికరములన్నియు వెల్లస్లీకి సమకూరెను. అతనికీ సమావేశమెంతయో మహోపకారియయ్యెను. దేశీయరాజ్యములనన్నిటిని "అద్దెసేనల స్కీము" (Subsidiary Alliances Scheme) క్రిందికి తేవలెనను ఉపాయము అసలు యీ కర్కుప్యాట్రిక్కు బుర్రలో పుట్టినదే. ఇండియాలో ఆంగ్లరాజ్యస్థాపన కేమైన అవకాశమున్నదేమో చూచి ప్రయత్నించవలసినదని వెల్లస్లీని ప్రోత్సాహపరచి, ప్రేరేపించినది, ఆంగ్ల మంత్రివర్గమువారే యని—అందు ముఖ్యముగ ప్రధానామాత్యుడు "పిట్టు" యని - వెల్లస్లీ సీమ మంత్రి వర్గమువారికి వ్రాసిన లేఖలను బట్టి స్పష్టముగ తెలియగలదు. 1798 సం॥ ఫిబ్రవరి 23-వ తేదీన దక్షిణాఫ్రికాగ్రమునుండి యితడు "డండాస్" మంత్రికి యీ విధముగ వ్రాసెను :—

> [నేను ఇండియాచేరగానే, శ్రద్ధవహించవలసినవిషయములలో ముఖ్యముగ దేశీయరాజులు తమ కొలువులో యూరోపియనులను, అమెరికనులను చేర్చుకొని తమసేనలను మన ఇంగ్లీషు సేనల పద్ధతిని యెట్లు తరిబీయతు చేయించుకొనుచున్నారో బాగా కనిపెట్టవలసినదని మీరు నన్ను కోరియుంటిరి............క్లుప్తము.]

రాజ్యాలను జయించవలెననే ఆశ తమకు సుతరామూ లేదని ఒట్టుపెట్టుకొనుచు పిట్టుమంత్రి 1784 సం॥ పార్లమెంటు చట్టములో యిరికించినమాట వట్టిబూటకమని పైవాక్యమువల్ల ఋజువగుటలేదా? పిట్టుమంత్రియొక్క కపట స్వభావము "దేశీయ

రాజుల బలములను మెళుకువతో కనిపెట్టవలసినదని'' వెల్లస్లీకి చెప్పిపంపినమాటలో స్పష్టమగుటలేదా? ''ఇతనికి నిజముగ ఇండియాలో రాజ్యస్థాపన చేయుద''మను తలంపే లేకపోతే దేశీయరాజుల బలాబలముల కనిపెట్టుటతో యితనికేమిపని? వెల్లస్లీ దక్షిణాఫ్రికాగ్రమునుండి డండాస్ మంత్రికి వ్రాసిన ఉత్తరములనన్నిటిని పరిశీలించి చూచినట్టయితే, యితడు దేశీయ రాజులపైకి కల్పించి పోదలచినట్లును, మేజర్ కర్కు-ప్యాట్రిక్ సలహాప్రకారము దేశీయ రాజులనందరిని ''అద్దెసేనల స్కీము'' అను వలలోకి తెచ్చిపడవేయ సంకల్పించినట్లును, యిదివరకే సగము చచ్చిన టిప్పూను సమూలముగ నాశనముచేయ బూనుకొన్నట్లును, కరతలామలకము గా గలదు. టిప్పూను యెంత సులభముగ ఓడించి, దుంపనాశనముచేయ వచ్చునో యితనికి కారన్‌వాలీసు చెప్పియుండును. ఇతడు టిప్పూపైకి దండెత్తి పోవుటకు దక్షిణాఫ్రికాగ్రపు మజిలీలోనే నిశ్చయపరచుకొన్నట్లు స్థలాంతరమున వివరించెదము.

రాజ్యాంగములో క్రైస్తవమత చిహ్నములు.

క్రైస్తవ రాజ్యచిహ్నములు ఇండియాలో స్పష్టముగ యెల్లరికి గాన్పించుటకుగాను, వెల్లస్లీ తన హయాములో కొన్ని యేర్పాటులు చేసెను. ఆదివారమునాడు వార్తాపత్రికలేమియు ప్రచురింపరాదని యితడు ఒకశాసనమును జేసెను. ''తాము క్రైస్తవ మతస్థులమని అధికారరీత్యా హిందూదేశ ప్రజలకు తెలియబరుచుట తమ విధియని వెల్లస్లీ తలచెను.'' గవర్నమెంటువారికి కావలసిన సివిల్, మిలిటరీ ఆఫీసర్లను తయారుచేయుటకని చెప్పి కలకత్తాలో ఒక కాలేజీని వెల్లస్లీ స్థాపించెను. కాని, దీని ఆంతరంగికోద్దేశమేమనగ దేశీయులనందరిని కిరస్తానిమతములో చేర్చుకొనుటయేయని పియర్సు అను చరిత్రకారుడు వ్రాయుచున్నాడు. ''క్లాడిస్ బుచ్చినన్'' అను క్రైస్తవపాదిరీ 1805సం॥లో యిట్లు వ్రాసెను. ''ఈ కాలేజీ యాజమాన్యమున హిందూదేశములోగల యావత్తు భాషలలోనికి బైబిలు తర్జుమా చేయబడుచున్నది. ఈకాలేజీచే ప్రేరితులై ఇండియాలో నలుముఖములనుండియు, పరిషియా, అరేబియాల కావలనున్న దేశములనుండియు, నేటివుపండితులు జ్ఞానమూలమగు యీకాలేజీకి వచ్చుచున్నారు.................ఈ కాలేజీయందు సమావేశమైన ఆశియాఖండపు పండితప్రకాండుల మహాసభయందు ప్రాక్ భాషలలోనికి బైబిలును తర్జుమా చేయించుటకు వారికి బైబిలుగ్రంథములు ప్రసాదింపబడినవి. భగవంతుని కృపవలన యిప్పుడు ఇండియాలో రాజ్యాధికారమునకు వచ్చిన మార్క్విస్ వెల్లస్లీ ప్రభువు యాజమాన్యమున బైబిలు గ్రంథము ఒక్క-భాషలోమాత్రమేగాక యేడు ప్రాగ్భాషలలోనికి అచిరకాలములోనే తర్జుమాగావింపబడగలదు......విమతప్రపంచమునకు కేంద్రస్థానమై, విగ్రహారాధనకు, మూఢవిశ్వాసములకు మూలమైన యీభూభాగమందు యీపని నేడు జరుగుచున్నది.

ఇంకను మతముపుచ్చుకొనని దేశీయులే యీపనిలో మనకు సహాయముచేయు చున్నారు.'' (పియర్సు గ్రంథము 294-296) వెల్లస్లీ చేయుచున్న యీపనికి చాల మెచ్చుకొనుచు 1801 సం॥ సెప్టెంబరు 14-వ తేదీన కంపెనీ డైరెక్టరగు చార్లెస్ గ్రాంటు అనునతడుకూడ వెల్లస్లీ కొక అభినందన లేఖను పంపించెను.

కత్తి, బైబిల్.

కత్తిచేతనేగాక, బైబిలుచేతను, మోసముచేతనుకూడ ఇండియాలో క్రైస్తవరాజ్యమును స్థాపించుటకు వెల్లస్లీ పాటుబడినట్లు పై చరిత్రవలన తెలియుచున్నది.

మహారాష్ట్రులను, ముసల్మానులను దౌర్జన్యముచేతను, మోసముచేతను రూపుమాపుటకు వెల్లస్లీ సంకల్పించెను. ఇతడిండియాలో అవలంబించిన మహా కుటిలతంత్రమున కీ సంకల్పమేమూలము. నైజామును, పీష్వాను, చెరబెట్టి కర్నాటకనవాబును, తంజావూరురాజును, అయోధ్య వజీరును, సూరత్తు ఫరూకాబాదు నవాబులను, రాజ్యభ్రష్టులగావించి, వారిరాజ్యములను వెల్లస్లీ దిగ మింగినదికూడ యీమోసపు తంత్రముచేతనే. టిప్పూసుల్తాన్, సింధియా, హోల్కారు, నాగపురరాజా, మున్నగువారిని దౌర్జన్యముచేత వెల్లస్లీ నాశనము చేసెను.



# బ్రిటిష్ మహాయుగము

## పదునేడవ అధ్యాయము



### వెల్లస్లీ - నైజాము.

దక్షిణాఫ్రికాగ్రపు మజిలీలో మకాముచేసిన రెండునెలల కాలములోను ఇండియాలోని దేశీయరాజుల స్థితిగతులనన్నిటిని వెల్లస్లీ బాగుగ తెలిసికొన్నాడు. 1798-వ సం॥ ఫిబ్రవరి 23, 28 తేదీలలో యితడీ మజిలీనుండి డండాసుమంత్రికి వ్రాసిన రెండు ఉత్తరములనుబట్టి చూడగ, యితడు తనపాఠమును చక్కగ నేర్చుకొన్నట్లు స్పష్టముకాగలదు. ఒకదానిలో యితడిట్లని వ్రాసెను:—"ఇప్పుడు ఇండియాలో దేశీయరాజుల వ్యవహారములెట్లున్నవో మీరు మనస్సులో పెట్టుకోండి. మన కిప్పుడున్న గొప్ప అనుకూలపరిస్థితి యేమనగ—వారి వ్యవహారములన్నియు చాల చిక్కులలోపడి మహాగందరగోళముగ నున్నవి. ఇదే మనకిప్పుడున్న మంచి వాటము." దేశీయరాజుల వ్యవహారములిట్లు మహాగందరగోళముగ పడియున్న యీ సమయమే మనరాజ్యస్థాపనకు అనుకూలమైన సుముహూర్తమనియు యీ సుముహూర్తమును మించిపోనీయ రాదనియు యితడు యెంతో సంబరముతో ఇంగ్లీషుమంత్రికి వ్రాసెను.

దేశీయరాజుల చిక్కులు—కంపెనీకి వాటము.

ఇండియాలో యింతవరకు యింగ్లీషువారిపై కత్తిగట్టి యుద్ధము చేయసాహసించిన రాజ్యములు రెండేగలవు. హైదరాలీ, టిప్పూలచే పాలింపబడు మైసూరును, నానాఫర్నవీసుచే పాలింపబడు మహారాష్ట్రమును. నైజాము యెన్నడు యింగ్లీషువారితో పోరాడగలిగినంత ధైర్యమును చూపలేకపోయెను. ఇతడు వారి కెప్పుడు వంగివంగి సలాములే చేయుచుండెను.

"ఇండియాలోని దేశీయరాజుల వ్యవహారములెట్లున్నవో మీరు మనస్సులో పెట్టుకోండి" అని వెల్లస్లీ డండాసుమంత్రికి వ్రాసినప్పుడు అతనిమనస్సులో వున్నవారు ముఖ్యముగ ముగ్గురు—వారెవరనగ, టిప్పూ, మహారాష్ట్రులు, నైజాము. టిప్పూ లోగడ కారన్‌వాలీసు మున్నగువారిచే ఓడిపోయి అర్ధరాజ్యమును గోల్పోయినను, అతడు యివ్వవలసిన యుద్ధనష్ట పరిహారధనమును క్రమము తప్పక యిచ్చివేయుచునే వచ్చెను. దీనినిబట్టియే అతనిరాజ్యము సుభిక్షముగనున్నట్లు తెలియగలదు. ఇంతపెద్ద నష్టపరిహారమును అతనిమీద వేసినప్పుడు అతడీ

సొమ్మును చెల్లింపలేదనియు, యీ వంకజెప్పి తరువాత యితని మిగతారాజ్యమును కూడ కాజేయవచ్చుననియు కారన్‌వాలీసు తన మనస్సులో తలచియుండెను. కాని, యిట్లు జరుగలేదు. ఈ మిషసాగనందున, టిప్పూపైకి పోవుటకు యింగ్లీషువారింకొక మిష దేనినో వెదకికొనవలసివచ్చెను. దీనినిగూర్చి స్థలాంతరమున జెప్పెదము.

మహారాష్ట్రులుకూడ వెనుక వారన్‌హేస్టింగ్సు కాలములోనున్నంత భయానకముగ యిప్పుడులేరు. పునహాలో మాస్టినును, సింధియాదర్బారులో విలియం కర్కు ప్యాట్రిక్కును దివ్యముగపనిజేసి, మహారాష్ట్రములో అంతఃకల్లోలములను బాగుగ పెంచివేసిరి. 1798 సం॥ ఫిబ్రవరి 28-వ తేదీన వెల్లస్లీ దక్షిణాఫ్రికాగ్రపు మజిలీనుండి, దండాసుకు వ్రాసిన ఉత్తరములో యిట్లున్నది :—

> [ఇటీవల మహారాష్ట్రులలో గలిగిన అంతఃకల్లోలములు మనకు చాల తృప్తికరముగ నున్నవని మనలో చాలమంది పెద్దలు తలంచుచున్నారు............వారి రాష్ట్రకూటములో చేరిన వివిధరాష్ట్ర పాలకులుగాని, రాజ్యాధిపతియగు పీష్వాగాని, వీరినందరిని తిరిగి యేకకూటముగ చేర్చి తమ రాజ్యమును దిట్టపరచుకొనగల తాహతులోలేరు. ఇది మనకు చాల వాటమైన సంగతి. వారిలో కొందరుప్రముఖులు తమరాష్ట్రములను పెంచుకొని, తమ సైనిక బలములను హెచ్చుచేసికొన్నప్పటికి, కేంద్రాధికారియగు పీష్వా పలుకుబడియు, అధికారమును చాల క్షీణించిపోయినవి. ఇతని మాటవిని, యీ రాష్ట్రపాలకు లెవరుగాని యేకోన్ముఖమునకు వచ్చి పోరాడుటకు సిద్ధముగలేరు. ఇట్టిపని జరుగనేరదు ''—క్లుప్తము]

అయినప్పటికి, మహారాష్ట్రులమీద ఇంగ్లీషువారొక కన్నువేసియేయుండిరి. వీరితో యిప్పుడే పోరాటము పెట్టుకొనుట మంచిదికాదని ఇంగ్లీషువారు కొంచెము ఆగిరి. మహారాష్ట్రులు యిటీవలనేగద కుర్ద్లావద్ద నైజామును ఓడించిరి. కాబట్టి, మహారాష్ట్రపుట్టలో యెట్టిపాములున్నవో యను భయము ఇంగ్లీషువారి కింకను పూర్తిగపోలేదు. వారు దూరదూరముగనుండియే చూచుచుండిరి. ఇక నైజామన్ననో తమకు చేలోకువైనవాడే గదాయని ఇంగ్లీషువారికి ధైర్యముకలదు. పాపమీ నైజాముగతి దైన్యముగనుండెను. యుద్ధరంగమందుగాని, రాజనీతిజ్ఞతయందుగాని, నైజామురాజ్యమెన్నడును దానిజన్మలో పేరుప్రఖ్యాతులు పొందియుండలేదు. పైపెచ్చు, ఆంగ్లరాజ్యము ఇండియాలో క్రమక్రమముగ పైకెక్కివచ్చుటకు యీ నైజాముప్రభువులు ఆంగ్లేయులకు నిచ్చెనమెట్లుగ పనికివచ్చిరి. ఈ రాజ్యస్థాపకుడగు నైజాము-ఉల్-ముల్క్ చనిపోయిన తరువాత గలిగిన వారసత్వపు తగాదాలే ఇంగ్లీషువారు ఇండియాలో తలయెత్తుటకు మంచి అవకాశమిచ్చెను. మరియు, కారన్‌వాలీసు కోరినంతమాత్రముననే నైజాము యెదురుమాట చెప్పకుండ ఉత్తర సర్కారులనన్నిటిని ఇంగ్లీషువారిచేతికి వప్పగించి, తూరుపుగ తిరిగి దండముపెట్టెను. టిప్పూ తోడి యుద్ధములో నైజాము ఇంగ్లీషువారికి పూరాగా సహాయము చేసియుండెను.

నైజాముకుగల దార్బల్యము వెల్లస్లీకి బాగుగ తెలియును. నైజాము మహారాష్ట్రులచేత దెబ్బతినియున్న సంగతియు వెల్లస్లీకి తెలియును. నైజాముతాలూకు గుట్టుమట్టులనన్నిటిని మేజర్ కర్కుప్యాట్రిక్కు దక్షిణాఫ్రికాగ్రపు మజిలీలో వెల్లస్లీకి బాగా నూరిపోసియే యుండెను. నైజాముతాలూకు లోతుపాతులిట్లు తెలిసికొన్నవాడగుటచేతనే వెల్లస్లీ దండాసుమంత్రి కిట్లనివ్రాసెను :—

"ఎంత నష్టమునకైనా సరే ఒప్పుకొని మనతోస్నేహము చేసుకోడానికి నైజామిప్పుడు సిద్ధముగనున్నట్లు కనిపించుచున్నది. దీనికి మనకు వేరేయభ్యంతరములేకపోతే, అంతకంటె వాటమగుపద్ధతులతో యీ స్నేహమును యేర్పాటుచేసుకోవచ్చును. నైజాము తాలూకు మిలిటరీ సిబ్బందిని తీసివేయవలసినదని మనముగ అతనినడుగుటకంటె, అతని కోరికమీదనే, మనమతని కేదో మెహర్బానీచేసినట్లు యేర్పాటుచేస్తే బలేబాగుంటుంది."...............

[క్లుప్తము.]

నైజాము దార్బల్యమును తెలిసికొన్నవాడై అతని రాజ్యమును యెట్లైన కంపెనీ కాలిక్రిందికి తేవలెనని వెల్లస్లీ సంకల్పించెను. అయితే, అతనిరాజ్యమును పూర్తిగ హరించుటకు టిప్పూ భయముచేత వెల్లస్లీకప్పుడు వీలు చిక్కకపోయినది.

దేశీయరాజుల సైన్యపరిస్థితులు—పరాసు తరిఫీయతు.

నైజాము నీరీతిగ తమకు గులాముగచేసుకొనుటకు కంపెనీవారెట్టి పన్నాగములబన్నిరో వివరించుటకుముందు, ఆకాలములో దేశీయ రాజుల సైన్యము లెట్టి పరిస్థితులలో నుండెనో క్లుప్తముగ వివరించుట అవసరము.

భారతీయులు తమ భుజబలమునకును, సత్యసంధతకును అనాదినుండి లోకములో పేరుప్రఖ్యాతుల గాంచియున్నారు. వారు పిరికివారుగారు. అయితే, వారు ప్రతివిదేశీయ దండయాత్రలముందు యేల ఓడిపోవుచువచ్చిరని యెవరైన అడుగవచ్చును. వీనికి కారణము వారిలో యెప్పటికప్పుడు తగు నవీనరణశిక్షణావిధానము లేకుండుటయు, వారిలో ఐకమత్యము లేకుండుటయు, వారివద్ద మారణయంత్రాదిక పరికరములు లేకుండుటయు, వీనియన్నిటికంటె యెక్కువైన కారణము వారి యందుగల అమాయికత్వమును పేర్కొనదగియున్నవి. పసిపిల్లల కున్నటువంటి అమాయికత్వమే వీరియందుగలదు. ఈ అమాయికత్వమే వీరికి ముప్పును దెచ్చి పెట్టినది. వీరు శత్రువులయెడజూపు మహౌదార్యభావమే వీరి కొంపగూల్చినది. సత్యసంధత, అమాయికత్వము, శత్రువులయెడ ఔదార్యము, యిట్టి సుగుణములు వీరియం దుండుటనుబట్టియే వీరిలో సాధారణముగ "స్వదేశాభిమానమని" పిలువబడుగుణము లేకుండపోవుటకు కారణమైనది. "స్వదేశాభిమానులు" అని అనగానే యెంతచెప్పినను సామాన్యముగ యితరులయందు "యీర్ష్య" తమయందు స్వార్థపరత్వము ఐహికలంపటత్వము అనుగుణము లుండకతప్పవు గద. ఈ దుర్గుణ

ములు ఇండియాప్రజలకు లేవు. కాబట్టి వారియందు "స్వదేశాభిమానము" లేదనవలసి వచ్చినది.

ఇండియాకువచ్చిన యూరోపియనుజాతు లన్నిటిలో ఇండియాలో రాజ్య స్థాపన జేసికొందామను ఊహ మొట్టమొదటగ పుట్టినది ఫ్రెంచివారికి. ఫ్రెంచివారు దేశప్రజలతో యితర యూరోపియనులకంటె యెక్కువగ కలసిమెలసి తిరుగుచు వచ్చినందున దేశప్రజల గుట్టుమట్టులు వారికి బాగా తెలిసివచ్చెను. కాబట్టి, ఇండియాను జయించుటకు గల రెండు ఉపాయములను వారు మొట్ట మొదటనే కనిపెట్టిరి. మిల్లు యిట్లు వ్రాయుచున్నాడు :—

> ఇండియాను జయించుటకు రెండు రహస్యములు కనిపెట్టబడెను. ఒకటి, తరిబీయతైన యూరోపియన్ సేనలయెదుట దేశీయసైన్యములు దుర్బలమైపోవుట. ఇక రెండవది, దేశీయ సేనలకు సులభముగ యూరోపియన్ తరిబీయతునిచ్చుటకు వీలుండుట. ఈ రెండు రహస్యములను కనిపెట్టినవారు ఫ్రెంచివారు.

ఈ యూరోపియను శిక్షణావిధానమును తమసేనలకునేర్పించుటకై దేశీయ రాజులెల్లరు తమతమకొలువులలో ఫ్రెంచివారిని యెక్కువగ చేర్చుకొనసాగిరి. ఈపనికి మొట్టమొదట వరవడిపెట్టినవాడు హైదరాలీ. ఇతనినిచూచి సింధియా, హోల్కారు, నైజాము మున్నగువారుకూడ యీపనినే సాగించిరి. ఈపనియే తుదకు దేశీయరాజుల కొంపల కూల్చినది.

రాజ్యస్థాపనకు వలయు ఉపాయములను పరాసువారు కనిపెట్టినను, వారు వానిని క్రియలో ఉపయోగించలేము. సల్లివాన్ యిట్లు వ్రాయుచున్నాడు :—

> "శాంతికావలెనని ఫ్రెంచివారు కోరిరి. డూప్లేను తీసివేస్తేనే మేమిందుకు ఒప్పుకుంటామని యింగ్లండు అన్నది. ఈరీతిగ యింగ్లండు యేకొలదిపాటి ఊరుపేరులేని పట్టణములనో వదలుకొగా, ఫ్రెంచివారు సామ్రాజ్యమునే వదలుకొనిరి. శాంతియందు ప్రీతిచే యింతటి మహాత్యాగమును జేసినజాతి ప్రపంచములో మరియెక్కడను కానము."

ఫ్రెంచివారిట్లు తొలగిపోవగనే, ఒలందావారిని వంచి, వారి స్థానముల నన్నిటిని ఆక్రమించుకొనుట యింగ్లీషువారికి అతిసులభమయ్యెను. ఇక యింగ్లీషు వారికి తాము ఆడినదే యాటయు పాడినదే పాటయుగ సాగించుకొనుటకు మంచి యవకాశము చిక్కెను. ఇతర యూరోపియనుజాతులువచ్చి తమ్మును యిబ్బంది పెట్టుననుభయము వారికి లేకుండెను. అందుచే ఇండియాలో తమరాజ్యమును విస్తరింపజేయుటకై వారు పూనుకొనిరి. ఇందుకు కారన్‌వాలీసు టిప్పూపై అక్రమముగ దండెత్తుటయే ప్రారంభము.

ఇండియాలోని దేశీయరాజులు యూరోపియనులను తమసేనలోచేర్చు కొనుచుండు పద్ధతినిజూచి ఇంగ్లీషు మంత్రివర్గమువారు భయపడసాగిరి. ఇందువల్ల

ఇండియాలో తమరాజ్య స్థాపనకు యిబ్బందివచ్చునేమోయని ముఖ్యముగ పిట్టు మంత్రి భయపడసాగెను. అందుచే, దేశీయరాజుల సేనలను ఒకకంటితో కనిపెట్టి చూడవలసినదని పిట్టుమంత్రి వెల్లస్లీని ఇండియాకు పంపునప్పుడు ప్రత్యేకముగ చెప్పి పంపించెను.

ఫ్రెంచి సేనకు బదులు ఇంగ్లీషు అద్దెసేనల జొప్పించుట.

టిప్పూ, సింధియా నైజాములకొలువులలో అనేకమంది యూరోపియను ద్రిమ్మరీండ్రుండిరి. టిప్పూతో యుద్ధమునకు బోవుటకుముందు యూరోపియనులచే నడిపింపబడుచున్న నైజాముసేనలను తీసి వేయించుట అవసరమని వెల్లస్లీ తలచెను. ముఖ్యముగా ఫ్రెంచి యుద్యోగులచే తరిఫీతైన సేనను తీయించి పారవేసినగాని వీలులేదని యతడు తలచెను. నైజామును దబాయించినంత సులభముగ సింధియాను దబాయించుటకు వీలులేదని వెల్లస్లీ గ్రహించెను. అందుచే, తాను పన్నిన "అద్దెసేనలస్కీము" అను వలలో 'ముందుగ నైజామును పడవేసుకొందాము—తక్కినవారిమాట తరువాత చూసుకొందాము' అని వెల్లస్లీ నిశ్చయపరచుకొనెను. దేశీయరాజుల కొలువులలో చేరియున్న యూరోపియను ద్రిమ్మరీండ్రు డబ్బుకోసము యేపనిచేయమన్నను చేయుటకు సిద్ధముగనుండిరి. కాబట్టి, వీరికి లంచములిచ్చి చీలదీయవలసినదని కర్కు ప్యాట్రిక్కు వెల్లస్లీకి దక్షిణాఫ్రికా మజిలీలోనే సలహాచెప్పెను. కాని, యింతసొమ్మును లంచములక్రింద ఖర్చుపెట్టుటకు వెల్లస్లీ యిష్టపడలేదు.

ఈ సమయమునందు హైదరాబాదు దర్బారులో రెసిడెంటుగనున్న యతడు వెల్లస్లీకి దక్షిణాఫ్రికా మజిలీలో సలహాలజెప్పిన విలియం కర్కు ప్యాట్రిక్కు తమ్ముడే. అతనిపేరు "జేమ్సు అచిలిస్ కర్కు ప్యాట్రిక్కు". ఇతడా దర్బారులోని ప్రముఖులలో కుట్రలు పన్నుటయందు అపారమగు తెలివితేటలను కనబరచెను. ఇతడు మహమ్మదీయాచారములకు బాగా అలవాటుపడి, దర్బారులోని ఒక మహమ్మదీయ ప్రముఖుని కూతురును 'నిక్కా' పద్ధతిని పెండ్లి చేసుకొనెను.

జె. ఎ. కర్కు ప్యాట్రిక్కు యితరకంపెనీ నౌకర్లతోపాటు అన్ని దుర్గుణములను గలిగియుండెను. ఇతడు లంచములు పుచ్చుకొనెననియు, ఖూనీలు చేయించెననియు, హైదరాబాదు దర్బారులోని ప్రముఖులు యితనిమీద వెల్లస్లీవద్ద చాల ఫిర్యాదులుచేసిరి. ఒకసారి తనకు లంచమివ్వబోయినట్లు 'మీరా్ ఆలమ్' అను ప్రముఖుడు యీ కర్కు ప్యాట్రిక్కుపై బహిరంగముగ ఫిర్యాదుచేసెను. 'మీరా్ ఆలమ్'. ఇంగ్లీషువారి మద్దతువల్లనే పైకివచ్చెను. అసలితనిని తనకొలువులలో చేర్చుకొనుటకు మొదట నైజాముకు యిష్టము లేక పోయినను, ఇంగ్లీషువారి బల

వంతముచేత ఒప్పుకోనక తప్పదయ్యెను. ఇంగ్లీషువారు తమకు యిష్టులైనవారినే, తమచెప్పు చేతులలో నుండువారినే—దేశీయరాజులు మంత్రులుగను, ఉద్యోగులుగను చేర్చుకొనునట్లు బలవంతపరచుచుండిరి. బ్రిటిష్ రెసిడెంటుకు యిష్టుడుగాని వాడు యెంతటి ఘనుడైనను దేశీయరాజు కొలువులో వుండజాలడు. దేశీయ రాజుకు అతనియందెంతటి మక్కువయున్నను, రెసిడెంటుకు గనుక యిష్టములేక పోతే, ఆరాజతనిని కొలువులో వుంచుకోలేడు.

ఈ రీతిగ ఇంగ్లీషువారి ప్రాపకమువల్లనే పైకివచ్చిన 'మీర్ ఆలమ్' సాహసించి ఇంగ్లీషు రెసిడెంటుపై ఫిర్యాదుచేసి నాడంటే, దానిలోయేదో నిజముండక తప్పదు. అయినను, దీనినిగూర్చి వెల్లస్లీ పూర్తిగ విచారించక, పూసిపెట్టెను. పై పెచ్చు, యితనినే హైదరాబాదులో రణతంత్రము సాగించుకొనుటకు ఉపకరణముగ వినియోగించుకొనెను.

నైజాముదర్బారును చాల చెడుగనుండెను. రాజనీతిజ్ఞుడని చెప్పదగిన వాడా రోజులలో ఒక్కడును లేకుండెను.

ఈ సంగతుల నన్నిటిని బాగుగ యెరిగియున్నవాడగుటచేతనే వెల్లస్లీ నైజామువద్దనున్న పరాసుఆఫీసర్లసేనను తీసివేసి, తత్ స్థానమున ఇంగ్లీషుఆఫీసర్లుగల కంపెనీసేనను చేర్చవలసినదని తనరాయబారికి—జె. ఏ. కర్కు ప్యాట్రిక్కుకు—వ్రాసెను. ఈ ఉత్తరము 1798 సం॥ జూలై 8-వ తేదీన కలకత్తానుండి వ్రాయబడెను. దీనిపై "రహస్యము" అని మార్కుచేయబడెను. ఇట్టి యుత్తరమునే మరియొకదానిని ఆరోజుననే వెల్లస్లీ పునహాదర్బారులోనున్న రెసిడెంటుకునువ్రాసెను. కాని, పునహాలో రెసిడెంటువేసినయెత్తు పారలేదు. హైదరాబాదులో పారినది. ఆసమయమున నానాఫర్నవీసు బందిఖానాలోనున్నను, పీష్వాదర్బారు నైజాము దర్బారంత చెడుగలేదు. నానాఫర్నవీసను సూర్యుడు అస్తాద్రి మరుగున కేగినను, తత్కిరణములకాంతి యింకను పీష్వాదర్బారుపై 'యీరెండల' జిమ్ముచునే యుండెను. ఆనాడు నైజాము ఉల్-ముల్క్ చేసిన స్వామిద్రోహము మొగల్ సామ్రాజ్యమును కూలద్రోసినచో, యీనాడు (1798లో) నైజాముగనున్న యతని యసమర్థత ఇండియాలో ఆంగ్లసామ్రాజ్యమును సుస్థిరమొనర్చెను.

వెల్లస్లీ తన రెసిడెంటుకువ్రాసిన ఉత్తర మెంతయు గమనింపదగియున్నది. టిప్పూతో యుద్ధమునకు పోవలెనని వెల్లస్లీ ప్రయాణముపెట్టుకొనెను. టిప్పూ సుల్తాను ఇంగ్లీషువారిపై ద్వేషమువహించి యుండెనట—అందుచేత, నైజాము కొలువులోనున్న ఫ్రెంచిఆఫీసర్లను డిస్‌మిస్ చేయవలెనట! ఎందువల్లననగ, టిప్పూతో యుద్ధము వచ్చేటట్లయితే, నైజాముకొలువులోని ఫ్రెంచివారుపోయి టిప్పూతో చేరుదురట! ఇది కేవలము మిథ్యావాదము. ఏలననగ, 1792 సం॥లో

జరిగిన ఒడంబడికనుబట్టి నైజాము, పీష్వా, కంపెనీవారు—యీ ముగ్గురు పరస్పరము ఒకరికొకరు సహాయము చేసికొనవలసినవారై యున్నారు. టిప్పూ యీముగ్గురిలో యెవరిపైకి వచ్చినను తక్కినయిద్దరు వారికిసహాయము చేయవలసియున్నారు. ఇట్టి స్థితిలో—టిప్పూ ఓడిపోయి ఒకమూల కూర్చున్నస్థితిలో—యిట్టిపని జరుగునని వాదించుట కేవలము బూటకము.

ఏదేశముయొక్కగాని స్వాతంత్ర్యమును హరించుట అంతర్జాతీయధర్మమునకు విరుద్ధము. న్యాయమగు కారణములేకుండ పరరాజ్యముమీదికి దండెత్తిపోవుట అక్రమమైనను వెల్లస్లీ యవలంబించిన కుటిలతంత్రముకంటె, యీ బహిరంగపు దండయాత్రయే ఉత్తమపద్ధతిగ గన్పించుచున్నది. ఈ వెల్లస్లీ "పరమపవిత్రుడగు క్రైస్తవుడుగా నిలువబడిన మొదటిఇండియా పరిపాలకుడని" రెవరెండుహట్టన్ యితని నెంతయోపొగడుచున్నాడు. వెల్లస్లీయు "పరరాజ్యముల జయించుటకుగాని, యితరులపై కవ్వించిపోవుటకుగాని నేనెన్నడు యేమియు చేయలేద"ని పబ్లిక్ రికార్డులలో వ్రాసిపోయెను. అయితే, తానవలంబించిన యీ "అద్దెసేనల స్కీము" మాటయేమి? ఇదిపరరాజ్యములను మ్రింగుటకు వేసిన యెత్తుకాదా?

అద్దెసేనల ఆంతర్యము.

అసలీ స్కీము వెనుక హైదరాబాదు రెసిడెంటుగనుండిన మేజర్ కర్కుప్యాట్రిక్కు బుర్రలోపుట్టినదనియు, అతడీస్కీమును దక్షిణాఫ్రికా మజలీలో వెల్లస్లీకి ఉపదేశించెననియు లోగడ చెప్పియుంటిమి. దేశీయరాజుల స్వాతంత్ర్యమును క్రుంగదీసి, వారిని, వారి రాజ్యములను క్రమముగ ఇంగ్లీషువారి కాలిక్రిందికి పడలాగికొనుటయే యీ స్కీముయొక్క ముఖ్యోద్దేశము. ఈస్కీము పయోముఖవిషకుంభము. పైతీపికి చిక్కి అమాయికులగు దేశీయరాజులందరు యీస్కీము నెంతో ఆప్యాయనముగ ఆలింగనమొనర్చుకొనిరి. కాని, దాని దుష్ఫలితములు క్రమక్రమముగ వారికే తెలిసివచ్చెను. అయినను, కాలము మించిపోయినతరువాత యెంత యేడ్చిననేమి ప్రయోజనము? ఇందువల్ల, దేశీయరాజ్యములకు గలిగిన ముప్పులు యెంతచెప్పినను తీరదు. ఈస్కీమును అంగీకరించవలసినదని వెల్లస్లీ దేశీయరాజుల నెంతో సాదరముగ కోరినప్పుడు ఆతనిమనస్సులో కేవలము కుచ్ఛితము, ద్రోహము తప్ప, వేరొండుభావములులేవు. ఈస్కీమునుగూర్చి ఒక యూరోపియనుడు 1887 సం॥లో **Asiatic Quarterly Review** అను పత్రికలో యిట్లని వ్రాసెను.

"ఈఅద్దెసేనలస్కీము యెంతబాగా పనిచేసినప్పటికి, అదికేవలము మోసముతప్ప వేరొండు కాదు. ఇంగ్లండుప్రజల కళ్లలో దుమ్ముకొట్టడానికే యీతంత్రము పన్నబడినది. పరరాజ్యముల మీదికి కవ్వించిపోవద్దని ఇంగ్లండునుండి మాటిమాటికి వచ్చుచున్న హుకుముల ఫలితముగ ఇది పుట్టినది.........

పరరాజ్యములపైకి దండెత్తిపోవద్దని పార్లమెంటువారు చెప్పినమాటను త్రోసివేయుటకు వీలువచ్చినదికాదు. కాబట్టి, అంతకంటె మెత్తనైన యీస్కీము అవలంబింపబడినది. పైకి పరరాజ్యములపై దండయాత్రలేమియు కనిపించవు. రాజు రాజుపాళముగనే సింహాసనము మీద వుంటాడు; రాజలాంఛనములన్నియు మామూలుగనే నడుచుచుంటవి; కాని, అసలు నిజమైన అధికారమంతయు రాజుచేతిలోనుండిపోయి, ప్రక్కనకూర్చున్న ఇంగ్లీషు రెసిడెంటు చేతిలో చేరును............మెత్తని ఈపద్ధతివల్ల ఇంగ్లీషుప్రజలమనస్సుకు ఉపశాంతికలిగినది. 'దండయాత్ర' యను కఠినమైనపేరును మార్చి, "కలుపుకోవడము" అను మెత్తనిమాటను వాడినారు. ఈపద్ధతినిగూర్చి ఆట్టేలోతుగ దిగి విచారించకుండ, వచ్చినంతవరకు లాభములను కంపెనీవారు తమజేబులో వేసికొన్నారు."

## నైజాముపై అద్దెసేనల రుద్దినరీతి - లజ్జాకరము.

ఈ స్కీమే అసలు చెడ్డది. అయితే, దీనిని నైజాముపై జొప్పించినరీతి మరింత లజ్జాకరముగ నున్నది. వెల్లస్లీకి, రెసిడెంటుకు జరిగిన ఉత్తర ప్రత్యుత్తరములు చూచినట్టయితే యీసంగతి తేటతెల్లముకాగలదు. దొంగలలోకూడ నీతి యున్నదందురు. కాని, యీదొంగకు నీతిలేదు. "ఈస్కీముసంగతి నైజాముకేమియు తెలియనీయవద్దు; మంత్రి 'అజీమ్—ఉల్—ఉమ్రా'తో లోపాయికారీగా మాట్లాడి యేర్పాటుచేయుము"అని వెల్లస్లీ తనరెసిడెంటుకు వ్రాసెను.

"నైజాము, పీష్వాల రాజ్యములలో యిక అల్లరులుపుట్టకుండ, వారిరాజ్యములు సుస్థిరముగనుండి, వారు పరస్పరము శ్రేయోభిలాషులైయుంటే—యీపని నీవల్లజరిగితే— నీకెంత కీర్తిప్రతిష్టలు వుంటవో, చూసుకో అని నీవు నైజాము మంత్రితో గట్టిగ చెప్పవలసినది"—అని వెల్లస్లీ తనరెసిడెంటుకు వ్రాసెను.

నైజాముకు చెప్పకుండ, మంత్రితో ఆలోచనచేయవలసినదని వెల్లస్లీ తన రెసిడెంటుకు సలహాచెప్పుటలోగల మర్మమేమి? ఈ మంత్రికి లంచమిచ్చి, వెల్లస్లీ యితనిని లోబరచుకొనెనని యూహింప దగియున్నది. దేశీయరాజుల మంత్రులకు లంచములిచ్చి వారిని తమబుట్టలోవేసికొనుట ఆరోజులలో ప్రతిగవర్నర్ జనరలుకు ఆచారమైనట్లు అనేక నిదర్శనములు గన్పించుచున్నవి. వెల్లస్లీ తమ్ముడు డ్యూక్ ఆఫ్ వెల్లింగ్టన్ 1803సం॥ ఆగస్టు 24-వ తేదీన మేజర్‌షాకు వ్రాసిన ఉత్తరములో నిట్లున్నది. "అక్కడ (పీష్వా దర్బారులో) యేమి జరుగుచున్నది మనకు సరిగ చెప్పుచుండుటకుగాను, మంత్రికి డబ్బు యివ్వవలసినదని నేను కర్నల్‌క్లోజుకు వ్రాసిన ఉత్తరములనుబట్టి నీవు గ్రహించియే యుందువు." ఈ యాచారము ఆ రోజులలో విరివిగ నున్నదనుటకు యీ నిదర్శనమొక్కటి చాలును. నైజాము మంత్రికూడ యిట్లే యింగ్లీషువాళ్ల[illegible] డబ్బుతిని యుండవచ్చును. అట్లుగానిచో, యీ యద్దెసేనల స్కీమును నైజాముకు తెలియనీయకుండ కంపెనీవారెట్లు యితని ద్వారా నెరవేర్చుకొనియుందురు? అదిగాక, రెసిడెంటు అందరికి లంచములిచ్చు

చున్నాడని ఉమా్రీవులందరు అప్పుడే బహిరంగముగ గోలపెట్టియుండిరిగద. కాబట్టి, నైజాము మంత్రియు లంచముమేసెనని తప్పకచెప్పవచ్చును. స్వామిద్రోహమువల్ల పుట్టినరాజ్యం స్వామిద్రోహమువల్లనే కూలిపోయినది.

ఇక వెల్లస్లీ తన రెసిడెంటుకు వ్రాసిన ఉత్తర మెట్లున్నదో కొంచెము చూద్దాము:—

"ఫ్రెంచి ముఠాను తీసి పారవేస్తున్నామనే సంగతి బయటపడకుండమాత్రము బహు జాగ్రత్తగ నుండవలెనుసుమా యని నీవు మంత్రి అజీమ్-ఉల్-ఉమ్రాతో గట్టిగ చెప్ప వలెను. ఫ్రెంచి ముఠానుఅంతా ఒక్కసారిగ గాకుండ, కొద్దికొద్దిగ తగ్గించుకుంటూవస్తే బాగుంటుందని నీవతనితో చెప్పు. ఇట్లయినచో వీరందరు తిరిగి యే టిప్పూకొలువులోనో, సింధియాకొలువులోనో చేరకుండ ఉండడానికి వీలుగవుంటుంది. నైజాముతరఫున యీ పద్ధతికి మంత్రి ఒప్పుకొన్నట్టయితే, మద్రాసునుండి మనసేనలను నీవు పిలిపించుకో."

1798 సం॥ జులై 15-వ తేదీన మద్రాసులో గవర్నరుగను, సేనాపతిగను కూడనున్న జనరల్ హ్యారిసుకు వెల్లస్లీ కలకత్తానుండి యిట్లువ్రాసెను. ఈ స్కీము లోని గుట్టుమట్టులను మద్రాసు గవర్నరుకు సైతము వెల్లస్లీ పూర్తిగ తెలుప దలచుకొనలేదని యీ యుత్తరమునుబట్టి తెలియుచున్నది.

"నైజాముకు మనసేనల నద్దెకిచ్చుటలో నా ఉద్దేశ మేమనగ, అతని రాజ్యమును బలిష్టమైనదానినిగను, సౌష్టవమైనదానినిగను చేయవలెననియే * నా యుద్దేశము.

ఈ రీతిగ అనేకమందితో మనము చేసికోదలచిన స్నేహపతకములలో యిది యొక భాగము. టిప్పూ మనపైకి రాకమునుపే మనమీ నేస్తములను కట్టుకొన వలసియున్నది. నేను తలపెట్టిన యావత్తు యేర్పాటులు మీకు త్వరలోనే తెలుప బడును. ప్రస్తుతము యిందుతో జతపరచిన కాగితములో చెప్పబడిన ప్రకారము మీరు అత్యంత త్వరితముగ ఆచరింపవలయునని నాకోరిక. మీకు మన దేశమందు గల యభిమానము, అందుకుతగిన కార్యదీక్ష, నాకు బాగుగ తెలియును. కాబట్టి, నాపెద్దస్కీములో యిప్పుడు మీకు అప్పచెప్పబడిన యీ భాగమును మీరు తప్పక నెరవేర్తురనియే నే నెంతో విశ్వాసముతోనున్నాను. హైదరాబాదుకు పంపదలచిన సేనల నన్నిటిని ఒకచోటికి చేర్చియుంచుటకు మనకు గుంటూరు సర్కారు మంచి అనుకూలమైనచోటని యనుకొనెదను.........ఈ వ్యవహారము యావత్తు చాల రహస్యముగ వుంచవలసినదని నేను మిమ్ములను గట్టిగ కోరుచున్నాను. ఈ గుట్టు యేమాత్రము బయటపడినను హైదరాబాదులోని ఫ్రెంచిముఠా గప్పున లేచును. నేను పన్నిన పతకమంతయు చెడిపోవును. మన సేనలను ఫలానిచోట చేర్చి యుంచి

*ఇవి కేవలము రాజకీయ తంత్రజ్ఞు లుపయోగించు కృత్రిమ పరిభాష.

నామని మన హైదరాబాదు రెసిడెంటుకు తెలుపుట అవసరము. అవసరమును బట్టి అతడా సేనాపతితో ఉత్తరప్రత్యుత్తరముల నడపుకొనును. ఈ పనిని మీరు త్వరగ, తప్పక, చేయుదురనియే నా విశ్వాసము. మీరిట్లు చేసినచో ఉద్యోగ రీత్యామాత్రమేగాక, మీరు నా సొంతమునకు కూడగొప్ప మెహర్బానీ చేసినవారని యెంచుకొందును.........ఈ వ్యవహారమును యావత్తు మీరు పునహా, హైదరాబాదులలోనున్న మన రెసిడెంటులకు తెలిపి, దీనిని తాము మాత్రమే తెలుసుకొనవలసినదనియు, ఆయారాజుల కెంతమాత్రము తెలుపవద్దనియు గట్టిగ వ్రాయవలెను.''

ఈ స్కీములోని ధర్మాధర్మములగూర్చి వెల్లస్లీ ఆలోచించ నేదలచుకోలేదు. ఈ పద్ధతి ప్రకారము చేయవలసినదని యితనికి పార్లమెంటువారుగాని, కంపెనీ యధికారులుగాని, అధికారమిచ్చియుండలేదు. అంతయు తన యిచ్ఛానుసారమే చేసివేయవలెనని వెల్లస్లీ సంకల్పించెను. అందుకనియే మదరాసు గవర్నరుకు వ్రాసిన ఉత్తరములో అంత ప్రాధేయ పూర్వకముగ వ్రాసెను. ఈ స్కీము ఆయా రాజులకు తెలుపవద్దనియు మద్రాసు గవర్నరును బ్రతిమాలుకొనెను. పునహాలో కంటె హైదరాబాదులోనే తన మంత్రము సులభముగ పారుతుందని వెల్లస్లీకి గట్టిగ తెలియును. అందుచేతనే అతడు తన రెసిడెంటుకు 1798 సం॥ జులై 18-వ తేదీన యిట్లని ప్రయివేటుగ వ్రాసెను :—

'' పునహాలో యావత్తు వ్యవహారము చెడిపోయినప్పటికి, నైజాము అధికారమును నిలువబెట్టు వ్యవహారములో నేను వెనుదీయను.''

నైజామురాజ్యమును ఈవలలో పడవేయుటలో రెసిడెంటు కర్కు ప్యాట్రిక్కు వెల్లస్లీకి కుడిభుజముగనుండి పనిచేసెను. ఈ స్కీమును మంత్రి అజీము—ఉల్—ఉమ్రా యెంతవరకు ఒప్పుకొన్నాడో రెసిడెంటుకు, వెల్లసీకి జరిగిన ఉత్తర ప్రత్యుత్తరములు తప్ప మనకు వేరే ఆధారములేమియువులేవు. కావున, వానినుండి కొన్ని భాగములనిట నుదహరింతుము.

1798 సం॥ ఆగస్టు 14-వ తేదీన వెల్లస్లీ రెసిడెంటుకు యిట్లని వ్రాసెను :—

''నాసూచనలను మంత్రి అంగీకరించినాడనవినుటకు నామనస్సుకు చాలసంతృప్తికలిగినది. ఇందులో అనేక చిక్కులున్నవి. ఇది చాల పెద్ద స్కీము. కాబట్టి, ప్రస్తుతము అతడంత కంటె యెక్కువగ యేమి చెప్పగలడు ? ................మద్రాసునుండి మనసేనవస్తే నేతప్ప, ఫ్రెంచిసేనను తీసివేయుడానికి వీలులేదని అతడు యెంతో ఆతురతో చెప్పినాడు. దీనినిబట్టి నేననుకొన్నట్లే పరాసువారి కక్కడ యెంతోబలము ఉండియుండవలెనని స్పష్టమగుచున్నది. కానిచో, అతడట్లేల చెప్పును ? అక్కడ పరాసువారి పొగరణచుటకు మనము జోక్యము పుచ్చుకుంటేనేగాని వీలులేదనియు స్పష్టమగుచున్నది..................

........మంత్రికి తగినంత అండవారికి ప్రేమించియుతాను తీసివేయగల ధైర్యము చిక్కువరకు యీ వ్యవహారమును యీరత్తు బహురహస్యముగ నుంచవలసిన అవసరమెంతేని గలదు."

........ఈ వ్యవహారమంతయు అతిత్వరితముగ జరిగిపోవలెను. మామూలుగ నవాబు దర్బారు వ్యవహారము సాగినట్లు కాలయాపన జరిగిందంటే, అసలు చెడుతుంది."

ఈ స్కీములోని గుట్టు మట్టులు తనకు పూర్తిగ తెలియక పోయినప్పటికి, మద్రాస్ గవర్నర్ హారిస్, వెల్లస్లీ చెప్పిన మాటకు యెదురాడకుండ, చప్పన అతడు చేయమన్న పనులనన్నిటిని చేసివేసెను. ఇదియేమని ప్రశ్నించలేదు. ఇతడు సేనలో తయారైనవాడగుటచే, కండ్లుమూసుకొని యజమాని చెప్పినప్రకారము చేయుటయే తప్ప రెండోవిధముగ ఆలోచించుటకు యితనికి శక్తిలేదు. అయితే, మద్రాస్ కౌన్సిలులోని యితరమెంబర్లు యిందుకు అడ్డుపెట్టిరి. వీరి అడ్డుమాటలను హారిస్ (గవర్నర్ కాబట్టి) త్రోసివేసెను.

[మామూలు వ్యవహారమైనట్లయితే దీనినంతా చర్చించి, దీనిరహస్యమేమో తిరిగి కలకత్తాకువ్రాసి జబాబు తెప్పించుకొనేవరకు నేను వేచియుండెడివాడనే. కాని, యిది అసాధారణ వ్యవహారముగ గన్పట్టుచున్నది. వెల్లస్లీ ప్రయివేటుగ అంతప్రాధేయపూర్వకముగ వ్రాసిన ధోరణినిబట్టియు, సేనలను అతిత్వరితముగ హైదరాబాదుకు పంపవలసియున్నదనియు, ఎంతమాత్రము ఆలస్యమునకు తావులేదనియు, యిందులో బ్రిటిష్‌జాతి శ్రేయమెంతయో యిమిడియున్నదనియు, అతడువ్రాసిన వ్రాతలనుబట్టిచూడగ, మనమిక్కడ మీనమేషములు లెక్కపెట్టుచు, ఆలోచిస్తూ కూర్చుండుట కవకాశములేదని నాతలంపు. అది వివేకముకాదు. మనపైయధికారి యేదోగొప్ప ప్లానువేసి, అందులో భాగముగ మన నీ పనిని చేయమంటే, దానికి ఒక్కనిమిషమైనను అడ్డుపెట్టుట నాకు ధర్మముకాదు. నేనట్లు అడ్డుపెట్టినచో నేను నాధర్మమును తప్పినవాడనగుదును] అని హారిస్ 1798 సం॥ జూలై 31-వ తేదీన రహస్యపు డిపార్టుమెంటు రికార్డులలో వ్రాసెను.

ఈతడింత గట్టిగ కౌన్సిలు మెంబర్ల మాటలను త్రోసివేసి, తానుచెప్పిన ప్రకారము తు, చ, తప్పకుండ చేసినందుకు వెల్లస్లీ యీ హారిసును మెచ్చుకొనుచు ఆగస్టు 19-వ తేదీన అతనికిట్లు కలకత్తానుండి ఉత్తరము వ్రాసెను:—

"మీరింతటి ఉత్సాహముతో నా సూచనల ప్రకారము పని జరిగించినందుకు నేను మీ కనేక కృతజ్ఞతా పూర్వక వందనముల నర్పించుచున్నాను. నా యాజ్ఞలకడ్డము వచ్చిన మీ కౌన్సిలు మెంబర్లవాదములను త్రోసివేసి మీరుధైర్యముతో పనిచేసి యుండకపోయినచో ఇండియాలో మన బ్రిటిష్‌వారికెంతయో ముప్పవచ్చెడిది. బ్రిటిష్ సామ్రాజ్య శ్రేయమునకై నేనువేసిన పతకమంతయు చెడిపోయెడిది. మీ కెదురు తిరిగిన కౌన్సిలు మెంబర్లను కాలదెట్టి రాచుటకు నేను సంకల్పించినాను. ఈ పనిచేయుటకు నాకు తగినబలమున్నది. నాకున్న బలమునంతను వినియోగించి యీ ప్రతి ఘటనమును అణచివేయుదును. ఇట్టి నీచులువచ్చి మన దేశశ్రేయమునకై నేను చేయుచున్నపనిలో రవ్వంతకూడ పాడుచేయుటకు వీరికి నేను అవకాశమివ్వను. కాబట్టి, మీకు యెదురుతిరిగిన మెంబర్లెవరో వారిపేర్లు నాకుపంపించండి.

నాకప్పగింపబడిన యీ మహా సామ్రాజ్యమును తామే పాలింతుమని పొగరుబోతుతనము జూపుటకు వీరెవరు ?..........మనసేన వెళ్లగానే, అక్కడ హైదరాబాదులోని పరాసు సేన డిస్‌మిస్ చేయబడును.................

నేను మీకు తిరిగి వ్రాసేవరకు యీ రహస్యమును మీరెవరికి తెలియపరచకూడదు సుమా !''

మద్రాసునుండి సేనలు బయలుదేరి హైదరాబాదుకు పోవుచున్నవి. కాబట్టి, నైజాముచేత ఒడంబడికమీద సంతకము పెట్టించవలసియున్నది. ఈ ఒడంబడిక 1798 సం॥ సెప్టెంబరు 1-వ తేదీన జరిగినది. దీనిపై నైజాము సంతకము చేసినాడు-అనగ తన ఉరిశిక్షకు తానే హుకుము చేసుకొన్నాడన్నమాట. ఈ ఒడంబడిక ఉపోద్ఘాతములోని మొట్టమొదటిమాటలోనే అన్నీ అబద్ధాలు! మొదటి వాక్యములోనే యేమని వ్రాసిరి ?

'' ఘనతవహించిన నైజామ్-ఉల్-ముల్క్ అసఫ్ ఝా బహద్దూరువారు తమకును, ఘనత వహించిన యీస్టిండియా కంపెనీవారికిని, గల స్నేహాధిక్యముచే యిప్పుడు తమకొలువులోనున్న కంపెనీవారి సేనలకు అదనముగ మరికొన్ని సేనలు కావలయునని తమకోర్కెను తెలియపరచినారు గావున...........''

ఇది శుద్ధ అబద్ధము. కంపెనీ సేనలు యింకా కావలయునని నైజాము యెన్నడు యేడువలేదు. వెల్లస్లీయే బలాత్కారముగ యీ సేనలను తీసుకొనివచ్చి, '' నాకు వద్దుమొర్రో '' యని నైజాము మొత్తుకొనుచున్నను వినక అతని కంఠము మీాద పెట్టినాడు. ఈ పని మోసము చేతను, దౌర్జన్యము చేతను జరిగినది. ఒడంబడికలోని ఉపోద్ఘాత వాక్యము శుద్ధఅబద్ధము.

కంపెనీసేనలు హైదరాబాదు చేరకపూర్వము 'కెప్టెన్‌మాల్కమ్' అనునతడు హైదరాబాదులో కర్క్‌ప్యాట్రిక్కుకు సహాయరాయబారిగ నియమింపబడెను. ఈమాల్కమ్ ఇండియాలో సైనికుడుగను, తాంత్రికుడుగను, పరిపాలకుడుగను, తనకును, తన దేశమునకును చాలలాభములను గణించియుండెను. కావున, అతనిచరిత్ర యిట క్లుప్తముగ చెప్పుట అవసరము. ఇతడు స్కాట్లండుదేశస్తుడు. ఇతని తలిదండ్రులు పేదవారగుటచే యితనికి యెక్కువ చదువు చెప్పించలేకపోయిరి. 12-వ యేట యితడు యింగ్లీషు సైన్యములోచేరి ఇండియాకువచ్చెను. ఈ ఉద్యోగమిచ్చు సమయములో యితనిని యితని బావమరది కంపెనీ డైరెక్టర్లయెదుటికి తీసికొనివచ్చెను.

మాల్కమ్ చరిత్ర.

''ఇండియాలో హైదరాలీ కనబడితే నీవేమిచేస్తావో చెప్పు, అబ్బాయి,'' అని ఒకడైరెక్టరు యీకురవాని నడిగెను. ''కత్తితీసుకొని, వెంటనే వాడితలనరికి

వేస్తాను'' అని యీకురవాడు తక్షణమే జవాబుచెప్పెను. "భేష్, యీకుర్రవాడు పనికివస్తాడు, వీణ్ణి ఇండియాకు పంపించండి''అని ఆడైరెక్టరనెను. 1783సం॥ ఏప్రెల్‌లో యితడు మద్రాస్‌చేరెను. అప్పటికితనికి 14 యేండ్లు. 1790సం॥ వరకు సైన్యములో ఆపని యీపని చేస్తూ, కారన్‌వాలీసు ఆసంవత్సరములో టిప్పూసుల్తాన్‌పైకి దండెత్తివెళ్లినప్పుడు, ఆసేనలో ఒకసైనికుడుగ యితడును వెళ్లి పనిచేసెను. ఈ దండయాత్రలోనే యితనికిని, హైదరాబాదులో యింగ్లీషువారి తరపున మంత్రాంగపుముఠాగా (Diplomatic Corps గా) పనిచేయుచున్న "సర్ జాన్ కెన్నెవే, గ్రామీ మర్సర్'' మున్నగువారికిని పరిచయముగలిగెను. ఇదియే అతని జీవితములో గొప్పమార్పును గలిగించెను. సైన్యములోనుండి తప్పించుకొని మంత్రాంగపుముఠాలోచేరి తనప్రజ్ఞచూపవలెనని యితనికప్పుడు అభిలాషగలిగెను. పార్సీభాషను యితడప్పుడు నేర్చుకొనెను. కంపెనీకిని, దేశీయరాజులకును వెనుక జరిగిన రికార్డుల నన్నిటిని పఠించెను.

1798సం॥లో వెల్లస్లీ ఇండియాకు గవర్నర్ జనరలుగ వచ్చుచు, మధ్యత్రోవలో మద్రాసులో మకాముచేసినప్పుడు యీపుసుగుడు—మాల్కమ్—వెల్లస్లీని దర్శించి, ఇండియావిషయమై తాను వ్రాసిన వ్యాసముల కొన్నిటిని ఇతనికి చదివి వినిపించి "అవకాశము వచ్చినప్పుడు మంత్రాంగపు డిపార్టుమెంటులో నాకెక్కడైనా ఉద్యోగమిప్పించవలసినదని'' అతనిని వేడుకొనెను. ఇతని తెలివితేటలు చూచి వెల్లస్లీ చాల మెచ్చుకొనెను. ఇతడు తనకు బాగా పనికివస్తాడని తోచినది. ఇతని తెలివితేటలను పొగడుచు, యితడు మనకు చాలా పనికివస్తాడని చెప్పుచు, వెల్లస్లీ 1798సం॥ జూలై 29-వ తేదీన గట్టిగ శిఫార్సుచేయుచు, మద్రాసు గవర్నరున కొకఉత్తరమును వ్రాసెను. పిమ్మట, కొలదికాలమునకే "హైదరాబాదులో నీకు అసిస్టెంటు రెసిడెంటుపని యిచ్చినా''నని చెప్పి వెల్లస్లీ యీతనికి 1798సం॥ సెప్టెంబరు 20-వ తేదీన స్వయముగ వుత్తరము వ్రాసెను.

---

దగా, దబ్బర, దౌర్జన్యము.

ఈరీతిగ కెప్టెన్ మాల్కామును, కర్కుప్యాట్రిక్కును హైదరాబాదులో చేరి, మహామంత్రాంగమొనర్చి, అక్కడ అల్లరుల గల్పించిరి. సేనలకు తమ పరాసువుద్యోగులపై ద్వేషమును గల్పించి, వారిపై తిరుగుబాటుచేయించి, సదరు ఆఫీసర్లను సైనికులచెతనే ఖైదు చేయించిరి.

కంపెనీసేనలు హైదరాబాదువచ్చి దిగేవరకును మంత్రికికూడ తెలియదు. ఇది అతనికే ఆశ్చర్యము గలిగించెను. ఫ్రెంచిసేనలను తీసివేయమని రెసిడెంటు కోరెను. ఈపని నేనుచేయనని మంత్రి యెదురుతిరిగెను. ఫ్రెంచిదళములను తీసివేయించుటలో యేదో ద్రోహకార్యము గలిగినట్లు ఊహించవలసి వచ్చుచున్నది.

ఏలననగ, అంతకుపూర్వము యిందుకు అంగీకరించిన నైజాము (అలీఖాన్) ఆఖరు నిమిషమందేల వెనుకముందాడును? నైజాము మాటతప్పినాడనియు, హిందూదేశపు రాజులను నమ్మకూడదనియు, యీ సందర్భమున కొందరు ఆంగ్ల చరిత్రకారులు నైజామును నిందించుచున్నారు. అయితే అప్పు డక్కడనున్న ఇంగ్లీషు రెసిడెంట్లు ఫ్రెంచిదళముల తీసివేయించుటకై యెట్టిపద్ధతుల నవలంబించిరో, వానినిగూర్చి యీ యాంగ్లచరిత్రకారులు పల్లెత్తుమాటకూడ చెప్పరేమి? ఆంగ్లేయు లారోజులలో నీతినియమముల వేనినిగాని పాటించి యుండలేదనుమాట సర్వసాధారణముగ ఆంగ్ల చరిత్రకారులు ఒప్పుకొన్నమాటయే గద. నైజామునకును, ఇంగ్లీషువారికిని యీ సందర్భమున జరిగిన ఒడంబడికనుగూర్చి వాల్టేర్ (అను పరాసుచరిత్రకారుడు) యిట్లు వ్రాసెను:—

"బైబిలుమీద ప్రమాణముచేసి యింగ్లీషు ఆఫీసర్లు యీ ఒడంబడిక చేసుకొన్నట్లు కనిపించదు. వారికి బహుశః బైబిలే లేదేమో."

1860 సం॥ సెప్టెంబరు కలకత్తా రెవ్యూలో రెవరెండు—జే—లాంగు యిట్లు వ్రాసెను :—

"ఒక నూరేండ్లకు పూర్వము కలకత్తాలో గొప్ప నైతికప్రవర్తన యుండెనని మనము చెప్ప వీలులేదు. గవర్నర్ డ్రేకు, క్లైవు మున్నగువారు తనదేశమును అమ్ముటకై సిద్ధపడిన ఒకానొక స్వామిద్రోహితోచేరి కుట్ర పన్నిరి...... వీరు ఒక్కొక్కరు యిరవయ్యేసి లక్షల రూపాయలను జేబులలో వేసికొనిరి. దగా, దౌర్జన్యము" (Force, fraud) యీ రెండే అరోజులలో ధర్మముగ నుండెను. ఫోర్జరీచేసి, ఒమీ చందుకు $2\frac{1}{2}$ లక్షల నవర్నులు టోపీపెట్టిన క్లైవుచర్య దేశీయుల కెట్టి వరవడినిబెట్టినది. ఒమీ చందు పిచ్చివాడైపోయెను. ఏనేరమునకైతే యింగ్లీషు 'లా' ప్రకారము నందకుమారుని ఉరిదీయించినారో, ఆనేరమునకే క్లైవుకు ప్రభుబిరుదమిచ్చినారు!

వెల్లస్లీయు, హైదరాబాదు దర్బారులో చేరిన యింగ్లీషు ముఠాయు, క్లైవు బడిలో చదివినవారే. "దగా, దౌర్జన్యము" యీరెండు వారిచేతిలోనున్న అస్త్రములు. ఈరెండు అస్త్రముల ప్రయోగించియే వారు నైజాముచేత 1798 సం॥ సెప్టెంబరు 1-వ తేదీన అయొడంబడికపై సంతకము పెట్టించిరి. ఫ్రెంచిసేనలను తీసివేసి, హైదరాబాదులో ఇంగ్లీషుసేనల నెక్కించినదియు యీరెండు అస్త్ర ప్రయోగములచేతనే. కాని, యీమాటను ఇంగ్లీషు చరిత్రకారులెవరు యెత్తరు—వారు మెదలకుండ ఊరకున్నారు. కాని, నైజాము ఆఖరునిమిషములో మాట తప్పినాడనిమాత్రము పాప మాతనిని నిందించుచున్నారు. వారికతడు లోకువగ కనపడ్డాడు. ఫ్రెంచివారు చిరకాలము నైజామును భక్తివిశ్వాసములతో కొలిచి యుండిరి. ఈసంగతిని అసిష్టంటురాయబారి మాల్కమ్ కూడ ఒప్పుకొనియున్నాడు. అట్టిస్థితిలో, తనకు విశ్వాసపాత్రముగ సేవజేసిన పరాసుదళమును నైజా మెట్లు

చేతులారా తీసివేయగలడు? దీనికి యింగ్లీషువారి బలవంతము, మోసముగాక, వేరొండు కారణములేమున్నవి?

1808 సం॥లో పీష్వానుగురించి వ్రాయుచు 'గ్రాహం'అను ఆంగ్లేయస్త్రీ యిట్లని వ్రాసెను.—

ఇప్పుడున్న పీష్వా రఘూబాకొడుకు. ఇంగ్లీషువారి విజయములవల్లను, కుట్రలవల్లను, వారితనిని యీ సింహాసనముమీద కూర్చుండబెట్టినారు. ఇతని పనియు, సతారాలో ఖైదీరాజుగనున్న శివాజీమనుమని పనియు, ఒక్కటిగనే యున్నవి. రాజునుండి అధికారముద్ర తెచ్చుకొను లాంఛనమును పీష్వా యిప్పటికిని నడుపుచున్నాడు. ఇది వట్టి ఫార్సు—హాస్యనాటకము. పీష్వా మట్టుకు పీష్వా మన (ఇంగ్లీషువారి) కింద పూర్తిగ లొంగిపోయియున్నాడు. మన తాలూకు మూడువేల సైన్యమునకు జీతబత్తెములిచ్చి తాను పెట్టుకొన్నాడు. అనగ, ఈసేనలు రాజధానిచుట్టు విడిసియుండి, యితనిని ఖైదీగ. చేసినవన్నమాట

(Journal of a Residence in India by Maria Graham 1813 Pp. 84-85.)

ఈ పైవాక్యములే నైజామునకుకూడ మరింత హెచ్చుగ వర్తించును. సేనలకు తానే జీతబత్తెములిచ్చుకొని, వానిచేత తననే ఖైదీగ చేయించుకొను యీవింతపద్ధతిని వెల్లస్లీ మొట్టమొదటగ ప్రయోగించినది నైజామువిూదనే.

ఈ పద్ధతిని బొందుపరుచుచు 1798 సం॥ సెప్టెంబరు 1 వ తేదీన నైజాము చేత సంతకము చేయించుకొబడిన ఒడంబడికలోని షరతులేమనగ.— ఆరువేల శిపాయిలుగల సైనికదళమును, అందుకుతగిన ఫిరంగిదళమును, ఇంగ్లీషు ఆఫీసర్లను సహా నైజాము తన సొంతఖర్చువిూద తనవద్ద వుంచుకొవలెను. అదివరకున్న యావత్తు ఫ్రెంచిసైన్యమును, ఆఫీసర్లను సహా, తీసిపారవేయవలెను. ఇకముందు ఇంగ్లీషు కంపెనీవారి అనుమతిలేనిదే నైజాము ఫ్రెంచివారినిగాని, యితర యూరోపియను జాతివారినిగాని తనకొలువులో చేర్చుకోరాదు. ఈ ఒడంబడిక చదువుకొన్నప్పుడు సీమలో ప్రధానమంత్రి పిట్టు మహానందభరితుడయ్యెను. ఈ పని నింతనేర్పుతో చేసినందుకు ఆంగ్ల మంత్రివర్గము వెల్లస్లీపై అభినందన పరంపరల గురిపించిరి. కలకత్తా కౌన్సిలుహాలులో యిప్పటికి ఒకబొమ్మ వ్రేలాడుచున్నది. "Subsidiary Treaty, Hyderabad 1798— (1798 సం॥ తాలూకు హైదరాబాదు అద్దె సేనల ఒడంబడిక)— అను అక్షరములు వ్రాయబడిన పెద్ద తోలుకాగితపు చుట్టపై తనచేతినిపెట్టి గవర్నర్ జనరల్ వెల్లస్లీ నిలుచున్నట్లుగ ఆపటములో గలదు. ఇతడీ ఘనకార్యము చేసినందుకు మెచ్చుకొని కంపెనీ డైరెక్టర్లుకూడ యితనికి సాలుకు అయిదువేల పౌనులచొప్పున యిరవై యేండ్లవరకు వార్షికము లిచ్చునట్లు తీర్మానించిరి. ఏరోజునైతే నైజాముతో యీ యొడంబడిక జరిగినదో

యేరోజునైతే తనస్వాతంత్ర్యమును, తనరాజ్యములో చాలభాగమును నైజాము ఇంగ్లీషువారికి తిలాంజలు లిచ్చుకొనెనో—ఆరోజగు 1798 సం॥ సెప్టెంబరు 1-వ తేదీనుండియే వెల్లస్లీకి యీ వార్షికపారితోషికము ముట్టునట్లుగకూడ సీమలోని కంపెనీ డైరెక్టర్లు తీర్మానించుకొనిరి. ఇంగ్లీషుజాతి యీరీతిగ వెల్లస్లీకి తప్పక కృతజ్ఞత జూపవలసినదే. ఏలననగ యీ యొడంబడికయే తదుపరి యితర దేశీయ రాజుల తాలూకు యెందరియొక్క యో స్వాతంత్ర్యముల హరించుటకు ప్రాతిపదిక మయ్యెను. ఇందులో పనిచేసిన రెసిడెంటు కెప్టెన్ కర్కుప్యాట్రిక్కుకుకూడ తగురీతిగ బహుమానము జరిగెను. ఇతడు గవర్నర్ జనరలుకు గౌరవ అంగ రక్షకుడుగ నియమింపబడెను. ఇట్టి గొప్ప గౌరవము లభించుటకు యితడే మొదటి వాడట. తరువాత, యితనిమీద యెన్నో లంచపంచపు కేసులురాగా, వెల్లస్లీ వానినన్నిటిని కొట్టిపారవేసెను. అసిస్టంటు రెసిడెంటు కెప్టెన్ మాల్కాము మాటకూడ వెల్లస్లీ మరచిపోలేదు. తీసిపారవేయబడిన ఫ్రెంచి దళముల తాలూకు జెండాలు వగైరాలను పుచ్చుకొని యితడు మహావైభవముగ హైదరాబాదునుండి బయలుదేరి కలకత్తావచ్చెను. వెల్లస్లీ యితనికి కలకత్తాలో ఘనమగు మర్యాద చేసెను. ఆనాటినుండి యితనికిని వెల్లస్లీకిని మనస్సులు ఒక్కటియయ్యెను. ఒకరిలో ఒకరు తమ ప్రతిబింబములను చూచుకొనిరి. రాజుకు తగిన బంటు, బంటుకు తగిన రాజు దొరికిరి! మాల్కాము చెప్పిన ప్రతిమాటను వెల్లస్లీ యెంతో ఆప్యాయనముగ- చెవులు దోరబెట్టుకొని వినుచుండును. తన మనస్సులో నున్న భావములే మాల్కాము నోటినుండి మాటలరూపముగ వెలువడుచున్నపుడు వెల్లస్లీ కెంత కర్ణరసాయనముగ నుండెనో!

ఈ రీతిగ, నైజాముఖర్చుమీద అందరికి సంభావనలు పుష్కలముగ దొరికినవి.



# బ్రిటిష్ మహాయుగము

## పదునెనిమిదవ అధ్యాయము.



### టిప్పూసుల్తానుతో రెండవ యుద్ధము.

కారన్‌వాలీసు టిప్పూతో మొదటచేసిన యుద్ధము అక్రమమని చెప్పినచో వెల్లస్లీచేసిన రెండవ యుద్ధము ఘోరపాతకమని చెప్పవలసియున్నది. ఈరెండవ యుద్ధమునకు కారణములే లేవు. వెల్లస్లీ ఇండియాలో అడుగుపెట్టకమునుపే టిప్పూతో యుద్ధముచేయ సంకల్పించుకొన్నట్లు అతడు దక్షిణాఫ్రికాగ్రపు మజిలీ నుండి వ్రాసిన ఉత్తరములను బట్టియే తెలియుచున్నది. వెల్లస్లీకిని కారన్‌వాలీసునకు గల గాఢస్నేహమును బట్టి యిట్టిపనికి కారన్‌వాలీసే యితనిని ప్రోత్సాహపరచి యుండెనని యూహింపదగి యున్నది. టిప్పూను సమూలముగ నాశనము చేయవలెనని కారన్‌వాలీసు గాఢముగ వాంఛించియుండెను.

కలహమునకు కారణముల వెదకుట.

కాని, మహారాష్ట్రులు అడ్డువచ్చుటచే యీపని అప్పుడు సాగలేదు. అందుచే మొదటియుద్ధములో కారన్‌వాలీసు టిప్పూతో తాత్కాలికముగ సంధిచేసుకొనవలసి వచ్చెను. కాని, అవకాశము వచ్చినప్పుడు టిప్పూనెట్లైన కాలబెట్టి రాచివేయవలెనని కారన్‌వాలీసు చూచుచునే యుండెను. ఈ యభిప్రాయములనే యితడు తన తరువాత గవర్నర్ జనరలుగ వచ్చిన తనప్రాణ స్నేహితుడు వెల్లస్లీకి నూరిపోసెను. "ఇండియా విషయములో నాకును, వెల్లస్లీకిని గల అభిప్రాయములు సరిగ ఒక్కటే" యని కారన్‌వాలీసు స్పష్టముగ వ్రాసియుండెను. 1798 సం॥ ఫిబ్రవరి 23–వ తేదీన వెల్లస్లీ దక్షిణాఫ్రికా మకామునుండి డండాస్‌మంత్రికి వ్రాసిన దానినిబట్టి, యితనికి టిప్పూపై గల శత్రుభావము స్పష్టమగుచునే యున్నది. వెల్లస్లీ మనస్సునెప్పుడును "ఫ్రెంచి" బూచి పట్టుకొని వేధించుచునే యుండెను. ఈ బూచినొక కారణముగ పురస్కరించుకొని, టిప్పూపైకి పోవుట కితడు సదా యోచించుచుండెను. ఆ సమయమున యూరపుఖండములో ఇంగ్లీషువారికిని ఫ్రెంచివారికిని యుద్ధము జరుగుచుండెను. ఈ యుద్ధము ఇండియాకు కూడ ప్రాకునేమోయని వెల్లస్లీ భయపడుచుండెను.

"ఈ యుద్ధము ఇండియాకు ప్రాకేయెడలను,—టిప్పూతో వచ్చే యే యుద్ధములోనైనా మనకు సహాయము చేయుటకు మనమిత్రుల బలములను పిలుచుకోవలసిన అవసరమేర్పడే యెడలను--

మనకు నైజామునుండి యెట్టి సహాయము రాగలదు ? ఈ నైజాము సేన చాలభాగము ఫ్రెంచి ఆఫీసర్లచేతను—పరాసు ప్రభుత్వపు యేజెంట్లచేతను—టిప్పూసుల్తాన్ మనుష్యులచేతను, నడిపింపబడుచుండగ నైజామువల్ల మనకెట్టి సహాయము రాగలదు ? ”

పై వాక్యములనుబట్టి, టిప్పూపైకి యుద్ధమునకు పోవలెనను సంకల్పము వెల్లస్లీకి దక్షిణాఫ్రికా మకాములోనే గలిగెననుట కెట్టి సందేహమునులేదు. అప్పటికి టిప్పూ ఇంగ్లీషువారిపై యెట్టి శత్రుభావమును గనపరచి యుండలేదు. అయినను అతనిపైకి అకారణముగ పోవలెనని వెల్లస్లీ తలంచుట కేవలము దుండగము.

వెల్లస్లీ ఇండియాలో కాలుపెట్టినది మొదలు టిప్పూను నాశనము చేయుటకై యేవేవో పన్నాగముల బన్నుచునే యుండెను. జేమ్సు మిల్లు తప్ప యావన్మంది ఇంగ్లీషు చరిత్రకారులు స్వార్థబుద్ధితో టిప్పూను క్రూరుడని వర్ణించిరి. ఈ వర్ణనలన్నియు కేవలము నిరాధారములు. ఎల్లప్పుడు యుద్ధము యుద్ధమని కాలు ద్రవ్వుచుండు కెప్టెన్ (తరువాత సర్ జాన్) మాల్కామ్‌వంటివాడుకూడ టిప్పూసుల్తాన్ మంచివివేకము గల రాజ్యపాలకుడని చెప్పక తప్పినదికాదు.

“ ఇతడు క్రూరుడుకాడనుటకు యెన్ని వాదములజేయుటకు వీలున్నప్పటికి యితడు తన ఇంగ్లీషు ఖైదీలయెడ చేసిన క్రౌర్యములను బట్టి వా రతని కెట్టి క్రౌర్యము నంటగట్టుట సహజమే.”

“ఇక రెండపవిషయములో-అనగ, యితడు వివేకహీనుడనుటలో మాత్రము నేను అంగీకరించను. ఇతడు గతయుద్ధములో ఓడిపోయినప్పటినుండి తనబలమును కీర్తిని తిరిగి సంపాదించుకొనవలెననియు, తనను ఓడించినవారిపై కసితీర్చుకొనవలెననియు ఈ రెండుభావముల చేతను యితడు ప్రేరితుడైయున్నాడు. ఓడిపోయినవారి కెవరికైనను యిట్టి భావములుండుట సహజమేగాక, గౌరవప్రదమునుకూడ గద. ఇందు తప్పేమున్నది ? ఈతని కట్టిభావములున్నప్పటికి యితడు సాహసమునువీడక, అనవసరమైన క్రోధోద్రేకములకు చిక్కక, యెంతోనిగ్రహముతోడను, వివేకముతోడను పట్టువీడక దీక్షతోడను తన శక్తిలోనున్న సహేతుకమగు అన్నిమార్గములచేతను యితడు తాను గోల్పోయినదానిని తిరిగి సంపాదించుకొనుటకై పాటుబడుచున్నాడు.”

“ ఇందు కీతనిప్రవర్తనలో 1792-వ సంవత్సరమునుండి కొన్ని నిదర్శనములు జూపెదను.”

“అన్నమాటప్రకార మితడు తనశత్రువుల కివ్వవలసిన నష్టపరిహారమును యిచ్చివేసినాడు. ఈ ఓటమిచే క్రుంగిపోవుటకుబదులు యితడు తన శక్తినంతను వినియోగించి యుద్ధనష్టముల నన్నిటిని కూడ దీసికొనుటకు పూనుకొన్నాడు. తనకోటలను బలిష్టమొనర్చుకొనుచున్నాడు. అశ్వదళముల చేకూర్చుకున్నాడు. కొల్బలముల చేర్చుకొన్నాడు. ఎదురుతిరిగిన సామంతుల శిక్షించినాడు. దేశములో వ్యవసాయమును ప్రోత్సహించినాడు. తిరిగి తనదేశమును పూర్వపు సౌభాగ్యస్థితికి తెచ్చుకొన్నాడు.” (క్లుప్తము)

ఇట్టివానికీర్తి నా ఇంగ్లీషువారు నలుపుగావింప సమకట్టినారు ? టిప్పూదోషమేమి ? ఆతడు యుద్ధరంగమందు మహాయోధుడు— రాజ్యపరిపాలనయందు

దక్షుడు— అందుచే యితడు ఇంగ్లీషువారికి ప్రక్కలో బల్లెముగ నుండెను. "ఇంగ్లీషువారంతటి విశ్వాసవిహీనులు, ద్రోహులు యింకెవరులేరని" టిప్పూ చెప్పినాడు.

తాము టిప్పూపైకి పోవుటకు యింగ్లీషువారు వెదకి అతనియందు కనిపెట్టిన దోషమేమనగ— అతడు ఫ్రెంచివారితో స్నేహముగట్టి తమమీదికి రానున్నాడట!! ఇట్టి యూహ నిరాధారమైనదని, యిది కేవలము కల్పితమని ముందుముందు తెలియగలదు. టిప్పూ స్వతంత్రరాజు. ఇతర రాజ్యములతో స్నేహము కట్టుకొనుటకు యితనికి సంపూర్ణస్వాతంత్రముగలదు. నేడు ప్రపంచములో క్రైస్తవులమని పేరుపెట్టుకొన్న యెన్ని యూరోపియను రాజ్యములు ఒకరితోఒకరు యేనిమిషమందు పడితే ఆనిమిషమందు పోయిపడుటకుగాను కంఠమువరకు ఆయుధముల ధరించి కూర్చుండుటలేదు ? ఇంత మాత్రముచేత ఒకరాజ్యము యింకొకరాజ్యముపై అకారణముగ పోయిపడుటకు నేటి ప్రపంచజాతులేవియయినను అంగీకరించునా? ఒకవేళ టిప్పూ సుల్తానుకు ఇంగ్లీషువారిపై క్రోధమున్నను తామతనిపై పోయిపడుట కిది కారణముగ చెప్ప వచ్చునా? నేటి ప్రపంచరాజ్యములలో యేరాజ్యము యేరాజ్యముపై క్రోధము వహింపకుండనున్నది ? అందుచే యేరాజ్యమైనను మెదలకుండ పోయి యింకొక రాజ్యముమీద పడుటకు యెవరైనా ఒప్పుకొందురా? ఇట్టిచర్యను ప్రపంచము హర్షించునా? ఒకరిపై ఒకరికి గల అసూయయే, కేవల ద్వేషభావమే యుద్ధమొనర్చు టకు చాలినంతకారణమని చెప్పేయెడల ప్రపంచమంతయు నిరంతరము యుద్ధ భూమిగనే మారిపోవలసివచ్చును. యుద్ధమునకు దిగుటకు వారివారి మనస్సులలో గల ద్వేషభావమొక్కటే చాలదు. దానికి మద్దతుగ యేదైన క్రియ జరుగవలెను. అట్టి క్రియ జరుగనంతవరకు యెవరుగాని కత్తిదూయుటకు వీలుండదు.

ఫ్రెంచిబూచి ఒక మిష.

టిప్పూపై కనిపెట్టబడిన దోషమెట్టిదో చూతము. "తూర్పుభాగములలో గల ఫ్రెంచివారలందరు పోయి టిప్పూసుల్తాన్ కొలువులో చేరవలసినదని మారిషన్ లంకలోనున్న ఫ్రెంచి గవర్నర్ ఒకప్రకటన గావించెనట! ఇదే కలహకారణము. దీనినిబట్టి టిప్పూ ఫ్రెంచివారితో షరీకై తమమీదికి దండెత్తబోవుచున్నాడని ఇంగ్లీషువారు నిశ్చయించిరి. అసలీప్రకటన నిజముగ జరిగినదో లేదో అనుమానా స్పదము. ఇది కల్పితమేమో తెలియదు. ఈ ప్రకటన నకలు నొకదానిని వెల్లస్లీ 1798 సం॥ జూన్ 9-వ తేదీన మద్రాస్ గవర్నరుగనున్న జనరల్ హ్యారిసుకు పంపుచు యిట్లు వ్రాసెను:—

[......ఈప్రకటననుగూర్చి మనకును టిప్పూసుల్తానుకును తీవ్రచర్చ జరుగవలసివచ్చును. ఈచర్చఫలితమేమగునో చెప్పజాలను. ఇందు టిప్పూ దోషియనియైన తేలవచ్చును. లేదా నిర్దోషియనియైన తేలవచ్చును. ఈ ప్రకటనలోనున్న ప్రకారము టిప్పూ దోషియేయని తేలే

యెడల, మనకు చాల చిక్కులుకలుగవచ్చును. తుదకు యుద్ధమను ఆపదకూడ రావచ్చును. ఇందువిషయమైన యభిప్రాయములను మీరు తెలిసికొనియుండుట మంచిది. బహుశఃయుద్ధము రావచ్చుననియే మీరు మీ మనస్సును తయారుచేసుకొనియుంటే మంచిది. దురదృష్టవశాత్తు అట్టి అవసరమే వచ్చెయెడల తగుబలముల చేకూర్చుకొనుట యెట్లో మీరు అప్రమత్తతతో ఆలోచించుచు వుండండి. కాని, తిరిగి నావద్దనుంచి కబురువచ్చేవరకు సేనలను సమకూర్చుటకు మీరెట్టి బహిరంగ చర్యగాని చేయవలెనని నా యుద్దేశముకాదు.''.........[క్లుప్తము.]

ఈ ప్రకటనయొక్క సత్యాసత్యములగూర్చి టిప్పూతో ముఖాముఖిని చర్చించవలసి యున్నదని వెల్లస్లీ పైయుత్తరములో చెప్పినప్పటికి అతడాపని నెన్నడును చేయలేదు. దీనినిగూర్చి టిప్పూతో యెట్టివిచారణయు చేయకయే టిప్పూ చెప్పు సమాధానములను వినకయే— తగు సంజాయిషీ యిచ్చుకొనుట కతనికి యెంతమాత్రము అవకాశ మివ్వకయే వెల్లస్లీ చాటుగ సేనలను సమావేశపరచి, ఆకస్మికముగ అతని రాజ్యముపై బడెను. టిప్పూతో సద్భావముతో నుందమను యోచనయే వెల్లస్లీ పెట్టుకొనలేదు- పెట్టుకొన దలచుకొనలేదు. 1798 సం॥ జూన్ 20-వ తేదీన మద్రాస్ గవర్నర్ హారిస్‌కు అతడిట్లు వ్రాసెను.

టిప్పూపై ఆకస్మికముగ దూకు దురాలోచన.

[నామనస్సులో ఫైసలాగా చేసుకొన్న నిశ్చయము నేనిదే మీకిప్పుడు తెలుపుచున్నాను. ఇక యెంతమాత్రము ఆలస్యముచేయక, మన మిత్రులనందరిని పిలిచి, సాధ్యమైనంతత్వరలో సేనలనన్నిటినీ కోస్తాలో సమావేశపరుప నిశ్చయించినాను.—సేనను కోస్తాలో సమావేశ పరచుటయే నానిశ్చితాభిప్రాయము..........

''అతనికి బైటనుండి యెట్టిసహాయముగాని రాకమునుపే, మనము ఆకస్మికముగ టిప్పూపైబడి దెబ్బకొట్టవలసియున్నది. ఇందుకుగాను, సైనికవ్యవహారములు, యీదేశపరిస్థితులు, బాగా తెలిసిన అఫీసరు నొకనిని, మంచి తెలివిగలవానిని-నాకు పంపించేటట్లయితే, మీరు నాకీ వ్యూహములో చాలాసహాయముచేసినవా రవుతారు.

''......ఈ వుత్తరములోని సంగతులు అతిరహస్యముగ ఉంచవలసిన అవుసరము మీకే తెలుసును.''

'' మిత్రులనందరిని పిలిచెద ''నని పైయుత్తరములో చెప్పినప్రకారము వెలస్లీ చేయలేదు. బహుశః దీనికొక కారణముండియుండవచ్చును. తాను టిప్పూపై యుద్ధమునకుపోవుట చాలఅక్రమమని వెల్లస్లీ మనస్సునకు తప్పక తెలియును. అందుచే, దీనిని గూర్చి తనమిత్రులగు నైజాము, మహారాష్ట్రులతో సంప్రతించుట కితనికి మొగముచెల్లలేదు. వారికీ సంగతి తెలిపినచో వారిందు విషయమై తనకు తోడ్పడరనియు అతనికి తెలియును. ఒకవేళ తనకు యెదురుతిరిగినను తిరగవచ్చును. కాబట్టి, ముందుజాగ్రత్తకై యితడుముందుగ తన మిత్రుల యిరువురి స్వాతంత్ర్యమును హరించి, వారిని నిర్వీర్యులనుచేసి కూర్చుండబెట్టవలెనని వెల్లస్లీ యోచన

చేసెను. "అర్ద్దె సేనల స్కీము"తో వెల్లస్లీ నైజాము నెట్లు దాదాపు ఖైదీగ చేసినై చెనో మనము వెనుకటి యధ్యాయములో చదివియేయున్నాము. ఇక పీష్వా మాత్రము యేకారణముచేతనోగాని యిప్పటి కింకను యీ "అర్ద్దె సేనల స్కీము" అనబడు వలలో పడలేదు. అయితే, మహారాష్ట్రములో ఇంగ్లీషువారు కల్పించి యున్న అంతఃకల్లోలములవలన పీష్వా బలము క్షీణించియుండెను. అందుచే మహారాష్ట్రులు టిప్పూ సుల్తానుకు తోడ్పడలేని స్థితికివచ్చిరి. ఈ రీతిగ నైజాము, పీష్వా లిరువురు నిర్వీర్యులై చతికిలబడిపోగా, తాను టిప్పూ పైకి ఆకస్మికముగదూకి అతనిని తన పంజాతో దెబ్బకొట్టుటకు వెల్లస్లీకి నిరాఘాటమగు అవకాశము దొరికెను. 'ఫ్రెంచిబూచి'చే బాధపడు వెల్లస్లీకి 'ఫ్రెంచిబూచి' యే మిషగ దొరికెను. టిప్పూ ఫ్రెంచివారితోచేరి ఇంగ్లీషువారిపై కుట్రపన్నుచున్నాడను అప వాదమును పురస్కరించుకొని వెల్లస్లీ టిప్పూపై దండు వెడలదలచెను. ఈ అప వాదము నిరాధారమైనదని లోగడచెప్పియుంటిమి. అప్పుడు మద్రాస్ గవర్నరుగ నున్న జనరల్ హారిసుకూడ యీ యపవాదమును నమ్మలేదు. ఇందు విషయమై యేదైన సందేహముంటే టిప్పూ తగుసమాధానము చెప్పుకొనగలడనియు, ఆతని పైకి యుద్ధమునకు పోవుట తగదనియు, యీ గవర్నరు 1798 సం॥ జూన్ 23-వ తేదీని వెల్లస్లీకి వ్రాసెను. మద్రాస్ గవర్నమెంటు శెక్రటరీగనున్న "జోషియా వెబ్" కూడ జులై 6-వ తేదీన వ్రాసిన మెమోలో యీ యపవాదమును ఖండించెను. ఆతనిమాటలివి :—

> "టిప్పూ (పరాసుస్థానము) మారిషస్ లంకకుపంపించిన రాయబారపు ఉద్దేశమేమైనను, దానిఫలితము యూరపులో యెట్లున్నను, సదరు లంకనుండి యిటీవలవచ్చిన సమాచారములనుబట్టి యేమి తెలియుచున్నదనగ:—ఫ్రెంచి సేనయావత్తూ ఫ్రాంన్సుకు పంపివేయబడినది. ఫ్రెంచి నౌకాదళమున్ను తీసివేయబడినది. ఇందువిషయమై సందేహమేమియులేదు. కాబట్టి, యిప్పటిలో టిప్పూసుల్తానుకును, పరాసువారికిని యెట్టి సహకారముగాని జరుగనేరదని నాకు మనస్ఫూర్తిగ తోచుచున్నది. అందుచేత, మనము కవ్వించి మీదికివెళ్లితేతప్ప, కలహము సంభవింపనేరదు."

కాని, యీ మాటలేమియు వెల్లస్లీ మనస్సుకు పట్టలేదు. ఇవన్నియు చెవిటివానిముందు శంఖూదినట్లయ్యెను.

ఇక, టిప్పూ తలంపులెట్లుండెనో చూతము. 1792 లో తనకును ఇంగ్లీషు వారికిని జరిగిన ఒడంబడిక షరతులకు భిన్నముగ ప్రవర్తింపవలెనని టిప్పూ యెన్నడును తలంచలేదు. సర్ జాన్ షోర్ గవర్నర్ జనరలు పదవినివదలి ఇంగ్లండు పోవుచున్నట్లును, ఆస్థానమున వెల్లస్లీ రానున్నట్లును తనకు తెలియగానే టిప్పూ 1798 సం॥ యేప్రిల్ 26-వ తేదీన, షోరు కొక ఉత్తరము వ్రాసెను. ఇందు తనకు ఇంగ్లీషువారియెడ గల

టిప్పూ సుహృద్భావము.

సుహృద్భావమును నిర్మలాంతఃకరణముతో వెల్లడించుచు, షోర్ యొక్క యోగ క్షేమములగూర్చి తరుచు వ్రాయుచుండగలందులకును కోరెను. వెల్లస్లీవచ్చి గవర్నర్ జనరల్ పదవిస్వీకరించిన పిమ్మట అతనికికూడ టిప్పూ 1798 సం॥ జులై 10-వ తేదీన యిట్టి సదయహృదయముతోనే మరియొక ఉత్తరము వ్రాసెను. ఈ గొప్ప యుద్యోగమునకు వచ్చినందుకు వెల్లస్లీని అభినందించుచు, తాను ఇంగ్లీషువారితో చేసికొన్న ఒడంబడికను గౌరవప్రదముగ మన్నించెదనని టిప్పూసుల్తాన్ అల్లా పేరట వాగ్దానముచేసెను. ఈ రెండు ఉత్తరములు చదివినవారికి టిప్పూసుల్తాను యొక్క ఉన్నతాదర్శములు బోధపడగలవు.

ఈ ఉత్తరములలోని మాటలు తియ్యగనున్నను, టిప్పూ లోలోన ఫ్రెంచి వారితోచేరి కుట్రపన్నుచుండెనని ఆంగ్లచరిత్రకారులు వ్రాయుచున్నారు. ఇందెంత మాత్రము సత్యములేదు.

వెల్లస్లీకి రెండు నాల్కలు.

సాంప్రదాయకుడగు టిప్పూసుల్తానుకు రెండునాల్కలు లేవు. 'గండాగొండి శిఖండిబండలగు' ఇంగ్లీషువారికే లెక్కలేని నాల్కలున్నవి. వీరికి రెండు ముఖములు, రెండు నాల్కలున్నవి. లోలోపల టిప్పూపై కుట్రపన్నుచు, పైకితియ్యని మాటలచే అతనిని ఊరించుచుండిరి. తమయందు గల దోషమును టిప్పూ సుల్తానుకు అంటగట్టిరి— కుక్క అద్దములో తననీడను చూచి మొరిగినట్లు!.

'వైనాడు' పరగణావిషయమై ఇంగ్లీషువారికిని టిప్పూసుల్తానుకును తగాదావచ్చెను. ఈ తగాదాను పరిష్కరించుటకై వెల్లస్లీ మహాన్యాయస్థుడువలె ఒక కమిషనును యేర్పరచుచు మిక్కిలి తియ్యని మాటలతో 1798 సం॥ జూన్ 14-వ తేదీన టిప్పూసుల్తానుకొక ఉత్తరమును వ్రాసెను. ఈ కమిషన్‌వారు విచారణ

టిప్పూకు వైనాడు ఎర.

చేసి, సదరు పరగణా సుల్తానుకే చెందవలెనని శిఫార్సు చేసిరి. ఈ శిఫార్సుప్రకారము సదరుపరగణాను వెల్లస్లీ టిప్పూసుల్తానున కిప్పించివేసెను. ఈ పని వెల్లస్లీ సద్భావముతో చేసినదికాదు. ఇది టిప్పూను బోల్తాకొట్టించుటకై వేసినయెర. ఇందువల్ల వెల్లస్లీ మంచివాడే యనియు ఇంగ్లీవారు తనయందు స్నేహభావముతోనే యున్నారనియు టిప్పూను భ్రమింపజేసి, అతడెట్టి యుద్ధప్రయత్నములుగాని చేసుకొనకుండ అతనిని నిద్రలోనికి జోకొట్టుటకే వెల్లస్లీ యీ గొప్ప కుటిలతంత్రమును పన్నెను. ఇందుకు ఒక్కటే నిదర్శనము చూడుడు:— ఈ వైనాడు విషయమై జూన్ 14-వ తేదీన వ్రాసిన "తియ్యని ఉత్తరము" నకు అయిదురోజులు పూర్వమేగద జూన్ 9-వ తేదీన టిప్పూపై పోవుటకు సేనలను తయారుగా వుంచవలసినదని చెప్పి వెల్లస్లీ మద్రాస్ గవర్నరుకు ఉత్తరము వ్రాసెను! కాబట్టి, రెండు నాల్కలున్నదెవరికి? టిప్పూ

సుల్తానుకా? వెల్లస్లీకా? టిప్పూ యెన్నడును యీరీతిగ రెండు నాల్కలతో మాట్లాడలేదు. అతని ప్రవర్తన మొదటినుండి తుదవరకు ఒకటే ఋజుమార్గమున నడచెను. కొందరు స్వార్థపరులు తనకును, కంపెనీవారికిని వైరము కల్పించుటకై వట్టిపుకారుల పుట్టించుచున్నారనియు, అయినను తమమధ్యగల స్నేహము నిర్మలమును దృఢతరమును నైనదగుటచే యిట్టి కుచ్చితములవలన నది మలినముగాజాలదనియు పాపము యెంతో అమాయికముతో టిప్పూ 1798 సం॥ సెప్టెంబరు 28-వ తేదీన వెల్లస్లీకి వ్రాసెను. వెల్లస్లీ తనను కూలద్రోయుటకై తనకాలిక్రింద త్రవ్వుచున్న గోతిని పాపము టిప్పూ యింకను చూడలేదు. ఈ ఉత్తరమునకు రెండు నెలలవరకు వెల్లస్లీ జబాబువ్రాయలేదు — ఈలోగా ఆతడు తన పత్రికమునంతను అల్లుకొనుచుండెను. నైజామును, మహారాష్ట్రులును, టిప్పూసుల్తానుకు సహాయము వచ్చేస్థితిలో లేరు. ఫ్రెంచివారును ఇండియాపైకి దండెత్తుస్థితిలో లేరు.

ఫ్రెంచివారు ఆంగ్ల నౌకాదళాధిపతియగు నెల్సన్‌చే యూరపు ఖండమందు ఓడింపబడిరి. వారింకియూకు వత్తురను భయముపోయినది. ఫ్రెంచివారు ఇంగ్లీషువారిచేత యెట్లు ఓడింపబడిరో మహాఘనముగ పొగడుకొనుచు వెల్లస్లీ 1798 సం॥ నవంబరు 4-వ తేదీన టిప్పూసుల్తానుకొక ఉత్తరముకూడ వ్రాసెను. అయినప్పటికి, చురుకుగ, సాధ్యమైనంత త్వరలో యుద్ధమునకు తయారుకావలసిన అవసరమున్నదని వెల్లస్లీ 1798 సం॥ అక్టోబరులో సీమడైరెక్టర్లకు వ్రాసెను. ఇంతత్వరగ యుద్ధమునకు సిద్ధపడవలసిన అగత్యమేమున్నది? దేశమునలుగడల శాంతిప్రబలియుండగ, వెల్లస్లీకేల యీ యుద్ధజ్వరము తగులవలెను? తన రహస్యపు టెత్తులన్నియు పరిపక్వదశకు వచ్చువరకు వెల్లస్లీ పైకి తియ్యనిమాటలనే చెప్పుచు టిప్పూను లాలించుచువచ్చెను. ఎప్పుడైతే తనయెత్తులన్నియు పరిపూర్ణదశకు వచ్చెనో, ఎప్పుడైతే ప్రపంచము నలువైపుల శాంతిచే సర్దుమణగియుండెనో, ఎప్పుడైతే టిప్పూసుల్తానునకిక సహాయము వచ్చువారెవరూలేరని నిశ్చయమై పోయినదో, అప్పుడు వెల్లస్లీ తనబురఖాను తీసివేసి, అసహ్యమగు తనకోరలజూపెను. ఫ్రెంచివారి పరాజయమునుగూర్చి చంకలు కొట్టుకొనుచు టిప్పూసుల్తానుకు ఉత్తరము వ్రాసిన నాలుగురోజులకే — అనగ 1798 సం॥ నవంబరు 8-వ తేదీన వెల్లస్లీ యీ దిగువ పొగరుబోతు ఉత్తరమును టిప్పూ సుల్తానుకు వ్రాసిపంపెను. పూర్వపు ఒడింబడికను టిప్పూ భంగపుచ్చకుండ హామీగా నుండుటకుగాను తాము కోరుకొన్న కొన్నిజిల్లాలను, టిప్పూ తన రాజ్యములోనుండి విడగొట్టి కంపెనీవారికిని వారిమిత్రులకును యిచ్చివేయవలెనని కూడ వెల్లస్లీ యీ యుత్తరములో గద్దరితనముగ కోరెను. ఎంత దొంగతనము! ఇందువిషయమై మాట్లాడుటకు మేజర్ 'డౌటన్' అను రాయబారినొకనిని తన వద్దకు పంపుచున్నట్లు వెల్లస్లీ ఆ యుత్తరములో వ్రాసెను. ఇదియు దొంగయెత్తే.—

వెల్లస్లీ తన బురఖాను తీసివేయుట.

ఇంకను టిప్పూను యుద్ధప్రయత్నములు చేసుకొనకుండ వ్యర్థప్రసంగములతో కాల యాపనచేయుటకే యీదొంగరాయబారపు నాటకము కల్పింపబడినది. ఈ యుత్తరమునకు టిప్పూనుండి జబాబువచ్చుటకు అవకాశమివ్వకయే వెల్లస్లీ సేనలను నడిపించుటకేర్పాటు చేసెను; ఒక్క క్షణములో టిప్పూ రాజ్యముమీద పడుటకు కంపెనీ యుద్ధనావలనన్నిటిని తయారులో వుంచవలసినదని యాజ్ఞాపించెను. 1798 సం॥ డిశెంబరు 13-వ తేదీన వెల్లస్లీ తన నౌకాదళాధిపతి కిట్లని వ్రాసెను :—

"నీకూ, ఫ్రెంచివారికీ మధ్య జరుగుచున్న వ్యవహారము—నీవు వారితో చేయుచున్న సాంగత్యము—అంతా నాకు తెలియదనుకున్నావా యేమిటి? ఆ రహస్యమంతా నాకు తెలియదని నీవెప్పటికీ అనుకోవద్దు. నాదేశమునకు గర్భశత్రువులైనవారితో నీవు జరుపుచున్న వ్యవహారముల నన్నిటిని నేను ఊరక దేబవలె చూచుచు ఊరకుండుననుకొంటివా? అట్లెన్నడూ అనుకోవద్దు. నీవు వాళ్లతో సాంగత్యము చేసినట్లయితే అన్నివిధాలా నాశనమైపోతావు. నీకు కుంపిణీవారికి ఉండే స్నేహం సమూలంగా చెడిపోతుంది. అంతేకాకుండ నీరాజ్యములో అరాచకము, అల్లకల్లోలము పుట్టించే సిద్ధాంతాలు బయలుదేరి నీరాజ్యమధ్యమందు పాదుకుంటవి............"

"ఉక్కునులో ఫ్రెంచివారు నాశనమైపోయినారు. కొరమాండల్, మలబారు కోస్తాలలో మనము యుద్ధమునకు కావలసినయావత్తు యేర్పాటులను చేసుకొనియున్నాము. దక్షిణాఫ్రికాగ్రమునుండియు, యూరపునుండియు, మనసేనలింకను యెక్కువగ రానున్నవి. వీటి అన్నిటి వల్ల ఇండియాలో మనము మంచి అనుకూలస్థానమందున్నాము. టిప్పూ మనయెడ విరోధభావముతో నున్నాడని నాకు నిశ్చయమైపోయినది. కాబట్టి, మనకిప్పుడుగల యీ యనుకూలస్థానము నాధారపరచుకొని, అతనిబలమును క్రుంగదీయవలెనని నేను గట్టిగ సంకల్పించుకొన్నాను. మన బలమును చూపి అతనికి గాథరాగలిగించిగాని, లేక మనబలమును ప్రయోగించిగాని, అతని సెత్తైన లొంగదీయవలెనని నా నిశ్చితాభిప్రాయము."

ఈ యుత్తరంలో తనగుట్టునంతను వెల్లస్లీ వెల్లడించినాడు. అసలు రహస్యమిది. పైకిచెప్పిన 'ఫ్రెంచిబూచి' వ్యవహారమంతయు లోకము కండ్లలో దుమ్ముకొట్టుటకు చెప్పిన బూటకపుమాటలు!

వెల్లస్లీ కదనరంగమునకు కదలుట.

యుద్ధరంగమునకు దగ్గరలోనుంచుటకుగాను వెల్లస్లీ కలకత్తానుండి కదలి 1798 సం॥ డిశంబరు 31-వ తేదీన మద్రాసు చేరెను. తాను నవంబరు 8-వ తేదీన వ్రాసిన పొగరుబోతు వుత్తరమునకు టిప్పూ వ్రాసిన జబాబు వెల్లస్లీకి మద్రాసు మకాములో చేరెను. టిప్పూ యీ యుత్తరమును మంచి మర్యాదమాటలతోను, గంభీర భావములతోడను, వ్రాసి పంపించెను. తాను ఫ్రెంచిస్థానమగు మారిషస్ లంకకు రాయబారిని పంపినసంగతి గూర్చియు, అక్కడి ఫ్రెంచి గవర్నర్ తనకు అనుకూలముగ చేసెనన్న ప్రకటననుగూర్చియు పుట్టిన వట్టిపుకారులను గూర్చి టిప్పూ యీ రీతిగ సమాధానము వ్రాసెను:—

"నా సర్కారులో కొందరువర్తకులున్నారు. వారు భూమిమీదను, సముద్రముమీదను కూడ వర్తకము చేసుకొందురు. వారిమధ్య రెండు తెరచాపల నావ నొకదానిని కొనుక్కొని దానిలో ధాన్యపుబస్తాలువేసుకొని వ్యాపారంకోసం లంగరెత్తి వెళ్లినారు. ఈవ్యాపారంలో యీనావ మారిషస్ లంకకుకూడ వెళ్లినదట. అక్కడకొందరు ఫ్రెంచి వారును, మరికొందరు నల్లవారును, అంతానలభైమంది కెక్కువలేరు. వీరు కేవుయిచ్చి యీ నావలో యెక్కి, యెక్కడైనా నౌకరీ దొరుకునేమోయని బయలుదేరి ఇండియాకువచ్చినారు. వచ్చినవారిలో కొందరికక్కడ నౌకరీదొరికినది. మిగతావారు నాసర్కారువిడిచి యెక్కడికో వెళ్లిపోయినారు. అసలు జరిగినకథయిది. దీనినిచూచి కొందరు దుర్మార్గులు, మన యిరువురకు కలహము పెట్టుటకై నాపై యీపుకారులు పుట్టించియుందురు. మన యుభయులమధ్య స్నేహము శాశ్వతముగ, దృఢముగనుండునట్లు చేయుటయే నాసంకల్పము........మీరు మీ యుత్తరములో యుద్ధముమాట యెత్తినారు. ఏల? ఆత్మరక్షణార్థమై మీరును మీ మిత్రులును తగు జాగ్రత్తలో నుండవలసి వచ్చినదనియు మీరు వ్రాసినారు. ఇది నాకు చాల ఆశ్చర్యముగ నున్నది." (క్లుప్తము.)

టిప్పూ గొప్ప జాబు.

పూర్వపు ఒడంబడికకు కట్టుబడియుండుటకుగాను హామీగా తనరాజ్యములోనుండి కొన్నిజిల్లాలను విడగొట్టి కంపెనీవారి కివ్వవలెనను విషయము టిప్పూ సుల్తానుకు మరింత ఆశ్చర్యము గలిగించెను. ఈ యొడంబడిక ఉభయపక్షముల వారును తమతమ భగవంతునిపేర్లు చెప్పుకొని చేసుకొన్నదనియు, కావున భగవంతుని పేరుమీదుగ చేసుకొన్న ఒడంబడికను ఉల్లంఘించుట యెట్టివారికిగాని సాధ్యముకాదనియు, భగవంతునిమీద ప్రమాణముచేసి చేసుకొన్న ఒడంబడికయే నిలువనిచో, యిక దానిని నిలువబెట్టుట కెట్టి యితర హామీలుగాని ప్రయోజనకారులు కాజాలవనియు, టిప్పూ మహోదార భావభరితముగ వ్రాసెను!

టిప్పూ నిక్కచ్చియగు మహమ్మదీయుడు. అల్లాయందు భయ భక్తులు గలవాడు. పాప భీతి గలవాడు. అల్లాపేరును మిథ్యగ నుచ్చరించువాడుగాడు. క్రైస్తవులు ఏసుపేరును అప్రమాణముల జేయుటకు ఉపయోగించుకొందురుగాక-కాని, టిప్పూ అల్లాపేరును అట్లు ఉపయోగించుకొనువాడు కాడు.

"నాకు ఇంగ్లీషువారిమీద విరోధభావము లేదని" టిప్పూ అల్లాపేరుచెప్పి ప్రమాణము చేసినాడంటే యిక అది శిలాక్షరమే. దానికి తిరుగులేదు. ఈమాట పడిపోకుండ దానికి వేరుగ యింకొక వస్తువును జామీనుగ అదనపుహామీగా పెట్టవలసిన పనిలేదు. అట్టిదీ పక్కామహమ్మదీయుని నిశ్చల యీశ్వరభక్తి! * కాని, దీనితో కిరస్తానీ గవర్నర్ జనరల్‌కు తృప్తికలుగలేదు. ఈ ఉత్తరమును గూర్చి తొమ్మిది రోజులు ఆలోచించి 1799 సం॥ జనేవరి 9-వ తేదీన వెల్లస్లీ టిప్పూపై యేమేమో నిందల మోపుచు, 24 గంటలలోగా వీనికి సమాధానము పంపవలసినదని వ్రాసెను.

---

* జేమ్సుమిల్లు యిట్లు వ్రాయుచున్నాడు :—

టిప్పూలోగల యింకొక గొప్పగుణమేమనగ, అతడు గాఢమగు మతాభిమాని. ఈమత విశ్వాసము అతని మనస్సునందు చాల గాఢముగ నాటుకొనియున్నది. రోజులో చాలభాగము యితనికి ప్రార్థనలక్రిందనే పోయెడిది.

తనరాజ్యమున కితడు మతసంబంధమైన బిరుదు పెట్టుకొన్నాడు. "ఖుదాదత్ — ఈశ్వర దత్తము"—అని యితడు తనరాజ్యమునకు పేరు పెట్టుకొన్నాడు. ఈ రాజ్యము తనదికాదనియు, భగవంతునిదనియు, ఆయన అధికారమునకు లోబడియే తానీధర్మకర్తృత్వము చేయుచున్నాననియు ఆతడు నిరంతరము తలపోయుచుండెను. క్రియలోకూడ అట్లే చేయుచుండెను. భగవంతుడే తనను రక్షిస్తాడని ఆతడు గాఢముగ విశ్వసించుచుండెను. తుదకీ విపరీతవిశ్వాసమే అతని యపజయమునకు కారణమైనది. ఈ విపరీతపు విశ్వాసముచే అత డితరరక్షణోపాయముల చేసుకొనక అశ్రద్ధవహించెను." ఇట్టి యీశ్వరభక్తుని రెండునాల్కలవాడని నిందించుట యెంతటి అన్యాయము!

ఇరవైనాలుగు గంటలలో జవాబివ్వనిచో తీవ్రచర్య గైకొనబడునని చెప్పెను. ఇదే వెల్లస్లీయొక్క యంత్యసందేశము. తనపై మోపబడిన అపనిందలకు సమాధానమిచ్చుటకు వెల్లస్లీ టిప్పూసుల్తానుకు తగువ్యవధి నివ్వలేదు. జనేవరి 16-వ తేదీన మరియొక తీవ్రమగు లేఖను వ్రాసెను. ఈ జాబులను చూచి టిప్పూ మనస్సు చాల సంక్షోభించియుండెను. తనతండ్రి హైదరాలీ యింగ్లీషువారి నెన్ని పర్యాయములో దయదలచి వదలివేసెను. తాను సైతము వారిపై యెన్నిసార్లో జాలిపడి వారిని బాధించక వదలివేసెను. ఈ దాక్షిణ్యమే తనకిప్పుడు ప్రాణాంతకమైనది. ప్రాచ్యఖండపు రాజులు శరణన్న తమ శత్రువులపై జూపుచువచ్చిన దాక్షిణ్యభావమే వారికొంపల గూల్చినది.

వెల్లస్లీ దబాయింపులకు టిప్పూ లొంగదలచుకొనలేదు. తన కంఠములో ప్రాణమున్నంతవరకు పోరాడి తీరెదగాకయని యతడు నిశ్చయించుకొనెను. తనకు

టిప్పూ నిశ్చయము.

నలువైపుల శత్రువులగు ఆంగ్లేయులు ఆవరించియున్నారు. మధ్య తానొక్కడుచిక్కినాడు. అయినను, టిప్పూ జంకక, తన కంఠములో ప్రాణమున్నంతవరకు పోరాడదలచెను. గవర్నర్ జనరల్ కోరిన ప్రకారము టిప్పూ 24 గంటలలోగా జబాబివ్వలేదు. అందుచే టిప్పూపైకి దండు నడుపుటకు వెల్లస్లీ 1799 సం॥ ఫిబ్రవరి 3-వ తేదీన హుకుముల జారీచేసెను. టిప్పూ యుద్ధప్రయత్నములేమియు చేసికొనుటకు వ్యవధిలేకపోయెను. కవ్వించి తనపైకి మూగుచున్న ఆంగ్లసేనల నెదుర్కొని నిలుచుట టిప్పూ సుల్తానుకు దుస్సాధ్యమయ్యెను. సంధిచేసుకొనవలెనని టిప్పూచూచెను. కాని, వెల్లస్లీ అంగీకరించక ఫిబ్రవరి 22-వ తేదీన బహిరంగముగ యుద్ధ ప్రకటన గావించెను. జనరల్ హారిస్ ఆంగ్లసైన్యముల కధ్యక్షుడుగ నియమింపబడెను.

ఆంగ్ల మంత్రాంగపు ముఠా.

టిప్పూ పరివారమును లంచములచే చీలదీయవలసినదని వెల్లస్లీ హారిసుకు చెప్పిపంపెను. వెల్లస్లీ వ్రాసినమాటలివి:-

"టిప్పూసుల్తానుతాలూకు చాలమంది సామంతులు ప్రధానోద్యోగులు, యితరప్రజలు, టిప్పూ యధికారమును త్రోసివేసి, మనకంపెనీ రక్షణక్రింద వచ్చిచేరుటకు సిద్ధముగనున్నట్లు నాకు తెలియుచున్నది. సుల్తానుయొక్క ద్రోహమువల్లను దౌర్జన్యమువల్లను మనకిప్పు డతనితో తిరిగి యుద్ధము వచ్చినది. కాబట్టి, యీసమయమున అతనిప్రజలలో అతనిపైగల ద్వేషమును, అసంతృప్తిని, మన మిప్పుడు వీలైనంత యెక్కువగ ఉపయోగించుకొనుట న్యాయమును అవసరమును అయి వున్నది."

వెల్లస్లీ పక్కాక్రైస్తవుడట! ఇతడు నిత్యము "నన్ను పాపములోపడవేయవద్దు" అని భగవంతుని ప్రార్థించుచున్నాడు. అయినను, తాను యితరులను పాపములోపడవేయుటకు జంకకున్నాడు! ఈ పాపకార్యమును సాధించుట ఒక్కమనిషికి సాధ్యముకాదని తలచి, యిందుకై ఆతడు ప్రత్యేకమొక కమిటీని యేర్పాటు చేసెను. ఈ కమిటీలో కర్నల్ వెల్లస్లీ, కర్నల్ క్లోజు, కర్నల్ ఆగ్న్యూ, హైదరాబాదులో ప్రసిద్ధికెక్కినపుసుగుడు కెప్టెన్ మాల్కమ్, కెప్టెన్ మెకాలే-యనువారు మెంబర్లుగ నియమింపబడిరి. కేవలము కత్తిచేతనేగాక, కుట్రచేతకూడ టిప్పూను కూలద్రోయుటకు వెల్లస్లీ పతకముపన్నెను. టిప్పూ అంత సులభముగ ఓడిపోవుటకు కారణమిదియే.

టిప్పూపై జరిగిన మొదటియుద్ధములోకూడ ఇంగ్లీషువారు టిప్పూకొలువులో ద్రోహులను లేవదీసినట్లు అప్పుడు మద్రాస్ గవర్నరుగనుండిన క్లైవు ప్రభువు (ఫ్లోర్జరరు క్లైవు కొడుకు) 1798 సం॥ నవంబరు 29-వ తేదీన వెల్లస్లీకి వ్రాసిన యీ యుత్తరమును బట్టి తెలియుచున్నది.

"నేనిందుతో మీకొక కాగితమును పంపుచున్నాను. ఇది నమ్మకమైన కాగితమేయని మీరు గట్టిగ విశ్వసించవచ్చును. వెనుకటి మైసూరు రాజకుటుంబమునకు మిత్రుడైన ఒకానొక పెద్దమనిషి ద్వారా ఈకాగితము మనకు వచ్చినది. ఈ పెద్దమనిషికి వెనుక మద్రాస్ గవర్నరులుగనున్న లార్డు పిగట్, లార్డు మెకార్ట్నీ, సర్ విలియం మెడోసులతో కొంత సంబంధముండెను. అతనికిని వారికిని ఉత్తర ప్రత్యుత్తరములుకూడ జరుగుచుండెను. అతడు చేరవేయుచుండు సమాచారములు మనగవర్నరుల కెంతో ఉపయోగకరములుగ నుండుచుండెను. ఈ సమాచారములు అబద్ధములుగాక, నిజమై, చాల నమ్మదగినవిగకూడ నుండుచుండెను. ఈ మనిషిపేరు తిరుమలరావు."

పూర్వపు హిందూరాజమాత టిప్పూచే చెరసాలయందుంచబడెను. కాని, యీ తిరుమలరావు ఆమెతో యెట్లో ఉత్తరప్రత్యుత్తరముల జరుపుచుండెను. ఏదైనయుద్ధమువస్తేనే, తిరిగి తనహిందూ రాజ వంశమున క్షేమైన అవకాశముండునని ఆమె ఆశించుచున్నది. పాప మా తిరుమలరావు. దురదృష్టవంతురాలగు రాణీకోర్కెలనుగూర్చియు, అభిప్రాయములనుగూర్చియు నేను మీకు త్వరలోనే ఒక కాగితమును పంపించెదను. దానిని మీరు ఆలోచించవచ్చును. టిప్పూసుల్తాను కొలువులోనున్న కొందరితోకూడ మన తిరుమలరావుకు సంబంధము లున్నవి........."

ఈ రీతిగ పూర్వపు హిందూరాజవంశమునకు చెందిన రాణీతోడను, మైసూరులోనున్న యితర ప్రముఖులతోడను ఇంగ్లీషువారు షరీకై టిప్పూమీద

కుట్రపన్నిరి. టిప్పూ ప్రభుత్వము క్రూరముగగాని, ప్రజాపీడాకరముగగాని యున్న దనుట కెక్కడను నిదర్శనములు గన్పట్టవు. టిప్పూ ప్రజలను, నేను ఇంగ్లీషువారు చేసినట్లు, నిరాయుధులను చేయలేదు. అందుచేత టిప్పూ దుర్మార్గుడైవుంటే ప్రజలతనిపై తిరుగబడేవారే. కాని వారెన్నడట్లు చేయలేదు. అయితే యిప్పుడు ఇంగ్లీషువారిచే కమిటీగ నియమింపబడిన కొందరు కిరాటకీచకులువచ్చి లంచపంచములిచ్చియు, మరి అనేకరీతుల ప్రజలను మోసగించియు తమవలలో వేసికొని టిప్పూపైకి తిరగదీసిరి.

ఆంగ్లసేనలు టిప్పూ రాజధానియగు శ్రీరంగపట్టణముపైకి మహోద్ధతితో నడచిపోవుచున్నవి. టిప్పూ రాయబారపు కబుర్లు పంపేయెడల, తానెట్లు ప్రవర్తింపవలెనో తెలుపుచు వెల్లస్లీ రహస్యముగ ఒక ఉత్తరమును సేనాపతియగు జనరల్ హారిసుకు 1799 సం॥ ఫిబ్రవరి 22-వ తేదీన వ్రాసిపంపెను. ఈ కబుర్లు వినకుండ యెకాయెకిని శ్రీరంగపట్టణముపైకి పోవలసినదని చెప్పెను. ముందుగ యీ పట్టణమును పట్టుకుంటే, ఇండియాలో వ్యవహారము తమకుచాల అనుకూలముగ మారునని వెల్లస్లీ చెప్పెను.

*శ్రీరంగపట్టణపు ముట్టడి—టిప్పూ వీరశయనము.*

హారిసు సైనికుడగుటచే, తనపైయధికారి చెప్పినమాటను తు, చ, తప్పకుండ జరిపించెను. టిప్పూ యెన్నిసార్లు రాయబారపు కబుర్లు పంపినను హారిసు వినక, సైన్యములను శ్రీరంగపట్టణముమీదికి ఊరకతరుముకొనుచునే వచ్చుచుండెను. శ్రీరంగపట్టణములో ధనము కావలసినంత యున్నదను ప్రతీతి హారిసు విన్నవాడగుటచే, దానిని దోచుకొందమను ఆశ అతనిని వేగిరించుచుండెను. 1799 సం॥ మే 4-వ తేదీన ఆంగ్లసేనలు శ్రీరంగపట్టణమును ముట్టడించి టిప్పూ మహలులో జొరబడెను. టిప్పూ కృపాణ పాణియై శత్రుసేనలమధ్య వీరవిహారమొనర్చి, యోధాగ్రేసరులకు పరమ ప్రాప్యమగు వీరస్వర్గమును జూరగొనెను. రణక్షేత్రమున నొరగినవీరులకు హిందూమహమ్మదీయ మతములుగద వీరస్వర్గమునిచ్చుచున్నవి*.

టిప్పూ మరణించినతరువాత ఆంగ్లసేనను శ్రీరంగపట్టణమును దోచుకొని, దిక్కులేని అమాయకప్రజలపై యెట్టిదారుణకృత్యములు జేసిరో వర్ణింప తరముకాదు. ఈ దారుణవధాదికములగూర్చి విన్నచో, టిప్పూచేసె నన్న కౌర్యములు వీనిముందు అతిస్వల్పములుగ గన్పట్టును. ఈ కార్యములు చేసినవారు పెక్కుమంది బ్రిటిష్ సైనికులే. శ్రీరంగపట్టణపు ముట్టడియైన మరు

---

* టిప్పూ మరణమెట్లు తటస్థించెనో వివరములు తెలిసికొనగోరువారు కర్నల్ వైల్సు, వ్రాసిన "టిప్పూసుల్తాన్" అనుగ్రంథమును చూడనగును.



టిప్పూ వీరశయనము

నాడు కర్నల్ వెల్లస్లీ జనరల్ హారిసుకు యిట్లని వ్రాసెను :—"మీరిక్కడి కెవరి నైనా ఒక పెద్ద అధికారిని పంపిస్తేనేగాని వ్యవహారములు చక్కబడేటట్లు లేదు................దోపిడిగాండ్రలో కొందరిని ఉరిదీస్తేనేగాని, యీ దోపిడీలు ఆపడానికి వీలుకన బడదు." ..............."ముగ్గురు నలుగురను ఉరిదీస్తేనేగాని, యిక్కడ అదుపు ఆజ్ఞలు యేర్పడేటట్లులేదు. భద్రత కలిగేటట్లులేదు. ఈ శిబిరమునకును, జనరల్ స్టూవర్టు శిబిరమునకును చెందిన సిపాయిలు, సైనికులు, యిప్పుడు పట్టణమునిండా వున్నారు.............దీనివల్ల గల్లంతు, ప్రజలలో భీతావహము యెక్కువగుచున్నదేగాని వేరొండులేదు. ఈ రెండు తగ్గితేనేగాని, ప్రజలెవరు తిరిగి తమ తమ యిండ్లకు చేరుకొనేటట్లు లేరు."

శ్రీరంగపట్టణపు దోపిడి.

పట్టణము ముట్టడికిముందు "ప్రజల ప్రాణములను, ఆస్తులను మాసైనికులు కాపాడెదర"ని వెల్లస్లీ గొప్పగ అభయహస్తమిచ్చుచు ప్రకటించెను! ఇదే క్రియకు ఆంగ్లసేనలిచ్చిన సంరక్షణ!

టిప్పూ బలపరాక్రమములను రాజ్యపాలనా దక్షతనుజూచి ఇంగ్లీషువారు మొదటనుండియు కండ్లలోనిప్పులు పోసుకొనుచుండిరి. అందుచే ఆతని నెట్లయిన అణచివేసినగాని తమయాటలు సాగవని ప్రతిఇంగ్లీషువాడు ఆరోజులలో తలపోయుచుండెను. ఆరోజులలోని ఇంగ్లీషువారి వ్రాతలను చూచినట్లైతే, వారు టిప్పూ సుల్తానుపై యెట్లు కారములు మిరియములు నూరుచుండిరో బోధపడగలదు. నిష్పక్షపాత బుద్ధితోను, శాంతసమభావములతోను వుండవలసిన న్యాయమూర్తులు (జడ్జీలు) సహితము యితనిపై అసూయాగ్రస్తముగ వ్రాయజొచ్చిరి. అతని సైన్యమును కొంత నాశనముచేసి, అతనికీర్తిని కొంతనలుపు గావించినగాని, టిప్పూ సామాన్యముగ లొంగడని సర్ జాన్ ఆఁ స్ట్రూథర్, అను బెంగాల్ ఛీఫ్ జడ్జీ 1799 సం॥ మార్చి ...వ తేదీన వెల్లస్లీకి వ్రాసెను. టిప్పూ పడెననువార్త విన్నప్పుడు యితనికికలిగిన సంతోషమునకు మితిలేకుండెను. తనకుగలిగిన పట్టరాని ఆనందమును వెలిబుచ్చుచు వెల్లస్లీని అభినందించుచు యీతడు మరల మేనెల 17-వ తేదీన వెల్లస్లీకి ఉత్తరము వ్రాసెను.

టిప్పూ పతనము—ఇంగ్లీషువారికి పండుగ.

టిప్పూ మరణించెనను సంతోషవార్తను ఇంగ్లీషువారు కర్ణరసాయనముగ విని, ఆరోజున పెద్దపండుగ చేసుకొనిరి. రెవరెండు హట్టన్ అను క్రైస్తవ పాదిరీ తానువ్రాసిన వెల్లస్లీ జీవిత చరిత్రలో యిట్లనివ్రాసెను.

"మైసూరు విజయోత్సవమునకై వెల్లస్లీ ప్రత్యేక మొకరోజు దైవప్రార్థన దినముగ యేర్పాటుచేసెను. 1800 సం॥ ఫిబ్రవరి 6-వ తేదీన గవర్నర్ జనరల్, ఛీఫుజడ్జి, కమాండర్-యిన్-ఛీఫు (ప్రధాన సేనాపతి, సర్ ఆల్ రెడ్ క్లార్కు) కౌంసిలు మెంబర్లు, జడ్జీలు, శివిల్, మిలిటరీ యుద్యోగస్తులు, అందరు ఉత్సవముగ నడచి కలకత్తాలో క్రొత్తగ కట్టిన చర్చికివెళ్లిరి. వీథులపొడుగునను సైనికులు బారులుదీర్చి నిలుచుండిరి. ఉత్సవము నడచిపోవుచుండగ విజయోత్సాహ సూచకముగ ఫిరంగులు కాల్చబడెను. చర్చిలో ప్రవేశించగనే మరల ఫిరంగులు పిక్కటిల్లెను. అధికారరీత్యా కైస్తవమతము రాజాదరణ పొందినది యిదే మొదటిపర్యాయము. దీనికి వెల్లస్లీ తానివ్వగలిగినంత ఘనతను, ప్రతిష్టను యిచ్చెను."

ఇంగ్లీషువారి సంబరాలు, సంభావనలు.

ఈ దండయాత్రలో పాల్గొన్న ప్రతి కైస్తవునకు వానివానికి తగినట్లు సంభావనలు ముట్టెను. వెల్లస్లీకి పూర్వమున్నదానికంటె మరింత గొప్పబిరుదు లభించెను. ఇదివరకు మార్నింగ్‌టన్ ప్రభువుగ నున్నవాడు యిప్పుడు "మార్క్వస్ వెల్లస్లీ" అయినాడు. మరియు, పాశ్చ్యఖండములలోని సైన్యములకన్నిటికి సర్వ సేనాపతిగ యితడు అభిషిక్తుడైనాడు. జనరల్ హారిసు యిప్పుడు ప్రభువైనాడు. ఇతడు అసలు ఒక పేదపూజారికొడుకు. తనకిట్టి గొప్పపదవి లభించినందుకు యితడు తనను తానే యభినందించుకొన్నాడు.

వెలస్లీ తమ్ముడు ఆర్థర్ వెలస్లీకికూడ బాగా సంభావన ముట్టెను. శ్రీరంగ పట్టణపు ముట్టడితో యితనిరేఖ బయటపడినది. లంచములిచ్చి శత్రుపక్షము వారిని చీలదీయుట మున్నగు కౌటిల్యపాఠముల నితడిక్కడనే నేర్చుకొన్నాడు. వీనినే యితడు దరిమిలా యూరపుఖండమందు పరాసువారిపై ప్రయోగించి, నెపోలియనును జయింపగలిగెను.

టిప్పూ రాజ్యమును ఇంగ్లీషువారు బ్రద్దలుకొట్టి పంచుకొనిరి. కొంత చెక్కను తమ కీ యుద్ధములో తోడ్పడిన నైజాము కండ్లనీళ్ళు తుడుచుటకు అతని మొగమున వేసిరి. పెద్దచెక్కను తాము కాజేసిరి. మిగతా చెక్కను యీ యుద్ధములో తమకు తోడ్పడిన పూర్వపు హిందూరాజకుటుంబమున కిచ్చిరి. పూర్వపు హిందూరాజవంశమునకు చెందిన కుర్రవానినొకనిని తీసుకొనివచ్చి సింహాసనము మీద కూర్చుండబెట్టిరి. ఈ చెక్కయే నేటి స్వదేశీ సంస్థానమగు మైసూరు రాజ్యముగ నిలిచియున్నది. ప్రఖ్యాత మంత్రిశేఖరుడగు పూర్ణయ్య పంతులును దివానుగ నిలిపిరి. పూర్ణయ్య వెనుక హైదరాలీని, తరువాత అతని

టిప్పూరాజ్యమును బ్రద్దలుకొట్టి పంచుకొనుట.

కొడుకు టిప్పూసుల్తానును భక్తివిశ్వాసములతో కొలిచియుండెను. టిప్పూ అనంతరము హిందూ రాజవంశమునుకూడ - మధ్య యేమియుజరుగనట్లై - అంతటి భక్తి విశ్వాసములతోడనే కొలిచెను. ఈ రీతిగ టిప్పూతోడి ఆఖరుయుద్ధము ముగిసెను. ఈ యుద్ధచరిత్ర మొదటినుండి చివరవరకు చాల దురంతములతోడను దుస్తంత్రములతోడను కూడి, ఆంగ్ల రాజ్యస్థాపనా చరిత్రయందు తీరని మచ్చగ నున్నది.

ఇంతకూ ఫ్రెంచి బూచి నిజమా?

టిప్పూ ఫ్రెంచివారితో కుట్రచేయుచుండెనను వదంతినిగూర్చి చర్చించుట అనవసరమని చెప్పియుంటిమి. ఈవదంతి కేవలము నిరాధారమైనదని జేమ్సు మిల్లు అను ఆంగ్లేయ చరిత్రకారుడే నిస్సందేహముగ ఋజువుపరచి యున్నాడు. కావున, మన మీవిషయము నిట చర్చించుట అనవసరమే. అయితే టిప్పూ చనిపోయిన తరువాత, ఫ్రెంచిభాషలో వ్రాయబడిన కాగితములు కొన్ని అతని మహలులో దొరికెననియు, వానినిబట్టి టిప్పూ ఫ్రెంచివారితో చేరి కుట్ర పన్నుచుండెననుమాట నిజమయ్యె ననియు కొందరు చెప్పుచున్నారు. కాని ఇందునుగూర్చి మిల్లు యిట్లు వ్రాయుచున్నాడు:—

“ఈ కాగితములు చూడగానే వెల్లస్లీకి యెంతో సంబరమయ్యెనట. ఈ కాగితములే దొరకకపోతే, యిటీవల విజయవంతముగ ముగిసిన యీ యుద్ధమునకు తాను చెప్పినకారణములు తన పైయధికారులకు నచ్చవేమోయని యితడుభయపడినాడు కాబోలు.”

ఈ ఫ్రెంచి కాగితములు టిప్పూపై దోషనిరూపణచేయజాలవని మిల్లు చాల దూరము వాదించియుండెను. అంతయేల, బహుశః యీ కాగితములు ఇంగ్లీషు వారే ఫోర్జరీచేసి, అక్కడ దొరికెనని చెప్పినవేల కాకూడదు? ఇట్లని యూహించుటకు కొన్ని కారణములు గలవు. ఒమీచందును మోసగించిన ప్రఖ్యాత ఫోర్జరు క్లైవు కొడుకే అప్పుడు మద్రాసు గవర్నరుగ నుండెను. గవర్నర్ జనరల్ అగు వెల్లస్లీ సుప్రసిద్ధ ఫ్రెంచి వాఙ్మయవేత్త. ఇతడు ఫ్రెంచిముండ నుంచుకొన్నాడు. వీనినన్నిటిని కలిపిచూడగ, టిప్పూ మహలులో దొరికెనన్న ఫ్రెంచికాగితములు నిజమైనవని ఊహించుటకు వీలుకాకుండునున్నది.

శ్రీరంగపట్టణమును పట్టుకొన్నప్పుడు అక్కడ 120 మందికంటె యెక్కువ మంది ఫ్రెంచివారులేరు. వెనుకటి యుద్ధములో తనను మోసగించిపోయిన నాటి నుండి టిప్పూ ఫరాసువారిని తనకొలువులో చేర్చుకొనుట మానివేసినాడు. వారు విశ్వాసపాత్రులుకారని టిప్పూ అనేకసార్లు అనుచుండెడివాడు. అట్టివాడు ఫరాసు వారితోచేరి కుట్రపన్నెననుట యెంతమాత్రము నమ్మదగిన మాటకాదు. తమ కేదో మిష కావలసివచ్చి ఇంగ్లీషువారీ మాట పలికిరేగాని నిజమునకు కాదు.

టిప్పూ మరణముతో అంతయుతీరలేదు. మైసూరురాజ్యమును ఇంగ్లీషు వారికి పాదాక్రాంత మొనర్చుటకు యిష్టపడనివారు ఆ రాజ్యములో చాలమంది యుండిరి. వారిలో ముఖ్యుడు "ధూండియా వాగ్." ఇతడు బందిపోటుదారుడని ఇంగ్లీషు చరిత్రకారులు అక్రమముగ వ్రాయుచున్నారు. ఇతడు నిర్మలమగు దేశభక్తిగలవాడని తోచుచున్నది. కాని యితడును కాలప్రవాహమున కెదురీద లేక పోయినాడు. ఇతని ప్రయత్నములు ఫలించలేదు.

"ధూండియా వాగ్"-దేశాభిమాని.

టిప్పూ మరణానంతరము అతనిభార్యలు, పిల్లలు రాయవేలూరుకు పంపబడిరి. వారికి తగు మనోవర్తి యేర్పాటు చేయబడెను. ఈ రీతిగ, హైదరాలీ నాయకునిచే స్థాపింపబడిన మైసూరు మహమ్మదీయ రాజ్యము కాలగర్భములో కరిగిపోయినది.

టిప్పూ కుటుంబమునకు మనోవర్తి.

మ॥ అది మైసూరపురంబు పూజ్యచరితుం డారాజు రాణ్మండలం
బది × × × × నావిదగ్ధసభవా రజ్ఞాస్య లత్యుద్ధతం।
బది రాజన్యకమద్ది వందినికరం బా గాథలా సర్వమున్
కదలన్ జేసిన కాలమూర్తికి నమస్కారంబు సత్కీర్తికిన్॥

—భర్తృహరి.



# బ్రిటిష్ మహాయుగము

## పంథొమ్మిదవ అధ్యాయము.



### వెల్లస్లీ - అయోధ్య వజీరు.

టిప్పూ రాజ్యమును చూరగొన్న పిమ్మట వెల్లస్లీ నందనవనమనఁదొప్పు అయోధ్య రాజ్యముపై తనకన్ను వేసెను. అయోధ్య రాజ్యము ఇంగ్లీషువారికి మొదటినుండియు కల్పవృక్షమువలెనున్నట్లు యిదివరకే చెప్పి యుంటిమి. సర్ జాన్ షోరు తనహయాములో వజీరాలీ సింహాసన భ్రష్టునిగావించి సాదత్ ఆలీ యను నతనిని సింహాసన మెక్కించి యున్న సంగతిని లోగడ చెప్పియుంటిమి. సింహాసన భ్రష్టుడైన వజీరాలీ కంపెనీవారిచేత కాశీలో ఖైదీగనుంచబడెను. ఇతడు ఖైదులోనుండియే బహుశః బయటనున్న కొందరితో కుట్రచేయుచున్నట్లు తోచుచున్నది.

వజీరాలీ తిరుగుబాటు-వెల్లస్లీ అవకాశము.

ఈ సంగతి తెలిసి కంపెనీ వారతనిని కాశీనుండి కలకత్తాకు మార్చ్వదలచిరి. అప్పుడు వజీరాలీయు అతని ముఠాలో మరికొందరును తిరుగుబాటుచేసి జైలుఅధికారి 'చెర్రీ' యను నతనిని, మరియిరువురు ఇంగ్లీషువారిని చంపి, జైలునుండి పారిపోయి, మరికొంత ముఠానుకూర్చుకొని, అయోధ్య రాజ్యములో కొన్నిచోట్ల కొల్లగొట్ట సాగించిరి. ఈ గందరగోళము నణచుటకు నవాబు సాదత్ ఆలీ ఇంగ్లీషువారి సేనలను అద్దెకడిగెను. ఆసమయమున వెల్లస్లీ గవర్నర్ జనరలుగనుండెను. ఇదే బలే అవకాశమని చెప్పి వెల్లస్లీ కంపెనీసేనల నతనికంటగట్టుటకు పూనుకొనెను.

అయోధ్య రాజ్యపరిపాలనను బాగుచేయు చున్నాననను మిషతో వెల్లస్లీ యీ రాజ్యపు ఆంతరంగిక వ్యవహారములందు జోక్యము కలిగించుకొన జొచ్చెను.

వెల్లస్లీ గవర్నర్ జనరల్‌గ వచ్చినప్పుడు అయోధ్యరాజ్య రాజధానియగు లక్నోలో "లమ్‌స్‌డెన్" అను నతడు రెసిడెంటుగ నుండెను. కాని, యితడు వెల్లస్లీ చెప్పు దుష్కార్యముల జేయుటకు యిచ్చగింపని కారణముచేత వెల్లస్లీ అతనిని తీసిపారవేసి, ఆస్థానమునకు తనకు చేలోకువైన "కర్నల్‌స్కాటు" అను వానిని నియమించెను. అయోధ్య రాజ్యమును బాగుచేయుచున్నాననను మిషతో వెల్లస్లీ యెట్టిదుండగముల జేసెనో కర్నల్ బెయిర్డు - ఒకానొక బ్రిటిష్ ఆఫీసరే-

"బంధిపోటుకు పైమెట్టు" అను తన గ్రంథములో వ్రాసగ్రుచ్చినట్లు వివరించి యున్నాడు. అందుండి కొన్ని ముఖ్యాంశములమాత్ర మిట క్లుప్తముగ వివరింతుము:-

వెల్లస్లీ 1798 సం॥ మే నెలలో కలకత్తా చేరెను. అక్టోబరు నెలలో అయోధ్యరాజ్యమునుగూర్చి ఆలోచించ సాగెను. నబాబునుండి రావలసిన కప్పము సరిగ చెల్లుటకును, నబాబుయొక్క సైన్యమును "బాగుపరుచుటకును" అతడు కొన్ని మంచియేర్పాటులను బాగా ఆలోచించి పెట్టుకొనెను. ఈ యేర్పాటులేమి? నబాబు తాలూకు సైన్యమునంతా తీసి పారవేయడము—అతని నబాబుగిరి దర్జాకును, రివిన్యూ వసూలుకును మాత్రము కొద్దిగ అట్టేవుంచడము—మిగతా సైన్యము యావత్తు తీసిపారవేసి, దాని స్థానమున క్రమముగ యిదివరకున్నవిగాక యింకా అదనముగ కంపెనీ తాలూకు పౌల్బలములను, గుఱ్ఱపుపళములను చేర్చటము—ఈ ఖర్చంతా నబాబే భరించడము—ఇది వెల్లస్లీ తనమనస్సులో చేసుకొన్న యేర్పాటు. ఈ యేర్పాటునుగూర్చి వినగానే, నబాబు గాభరాపడి "యింతకంటె నేను రాజ్యము వదలుకు పోవడం మేలని" విసుగుదలతో మాట్లాడెను. నబాబు నోటివెంటవచ్చిన యీమాటను పట్టుకొని యావత్తు రాజ్యమును ఒక్కసారియే ఆపోశనపట్టవచ్చునని వెల్లస్లీ ఉవ్విళ్ళూరెను.

అద్దెసేనల వేసి రుద్దుట.

"అయోధ్యరాజ్యముపై యావత్తు సివిల్, మిలిటరీ అధికారములను కంపెనీ వారొక్కరే గుత్తగొనవలయును. ఇదియే కంపెనీవారి పరమోత్కృష్ట సంకల్పమని నా నిశ్చితాభిప్రాయము" ఇవి వెల్లస్లీ మాటలు. ఈ యభిప్రాయమున కనుగుణముగ వెల్లస్లీ ఒక ఖరారునామాను తయారుచేసెను. దానిలో మొదటిషరతే యేమనివున్నదంటే—నబాబు రాజ్యము వదలుకొని పోవలెననివున్నది! ఈ కరారునామాపై సంతకము పెట్టవలసినదని కోరినప్పుడు నబాబు నిర్ఘాంతపోయి, సంతకము పెట్టుటకు నిరాకరించెను. అంతట నెలలతరబడి రాయబారములు నలిగెను. ఈ రాయబారములలో వెల్లస్లీ తనమనస్సులోవున్న సంకల్పమునంతయు వెల్లడించెను. ఈ ప్రయత్నమంతా కేవలము కప్పపుసొమ్ము రాబట్టుకొనుటకే కాదనియు, అసలు నబాబుయొక్క సైనికాధికారమునంతయు సమూలముగ త్రుంచివేయుటకేయనియు, వెల్లస్లీ నిస్సందిగ్ధముగ వెల్లడించివేసెను. ఒకమూల యిట్లు రాయబారపు మాటలు నలుగుచునేయున్నవి,- ఒకమూల నబాబుచెప్పకొను గోడవయంతయు వినీవిననట్లు కంపెనీ యుద్యోగులు వూకొట్టుచునే యున్నారు.—కాని, మరియొక ప్రక్కనుండి, కంపెనీ సేనలుమాత్రము క్రమక్రమముగ అయోధ్యరాజ్యములోనికి వచ్చి చేరుచున్నవి. ఏమిజబరదస్తీ! ఈ చర్యను కంపెనీవారు సమర్థించుకొన్న రీతియు మరింతవింతగ, గడసరితనముగ నున్నది. వెనుక సర్ జాన్ షోరుకును నబాబునకును జరిగిన ఒడంబడికను బట్టి, అయోధ్యరాజ్యమును సంరక్షించవలసిన బాధ్యత, భారము, కంపెనీవారి నెత్తిమీద వున్నదట! కాబట్టి, నబాబుకు యిష్టములేక పోయినాసరే, తమయిచ్ఛానుసారము యీ భారమును నిర్వహించుటకుగాను యెప్పుడుపడితే అప్పుడు, యెన్ని బ్రిటిష్ సేనలనుపడితే అన్ని బ్రిటిష్ సేనలను తీసికొనివచ్చి అయోధ్యరాజ్యములోనికి దింపుటకు కంపెనీవారికి అధికారమున్నట్లు సదరు ఒడంబడికలో భావార్థమున్నదట! ఈ ప్రకారముగ తమకవసరమని తోచినప్పుడు తీసికొనివచ్చి దింపినసేనలకు జీతబత్తెములిచ్చుకోవలసిన బాధ్యత నబాబుదనికూడ ఒడంబడిక చెప్పచున్నదట! (అవసరానవసరములను నిర్ణయించునది కంపెనీవారట! ఖరు)

మాత్రం నబాబుదట !.— ఏమిన్యాయము !) ఈ ప్రకారము జబరదస్తీగ ఒక బ్రిటిష్ సైనిక దళము అయోధ్యరాజ్యములో ప్రవేశించెను. ఇంకొకదళముకూడ బయలుదేరి వచ్చుటకు సిద్ధముగనుండెను. ఈ సంగతి తెలిసి, నబాబుసాదత్ ఆలీ ఒక పెద్ద మహజరును (1800-వ సం॥ జనవరి 11-వ తేదిన) లక్నో రెసిడెంటుద్వారా వెల్లస్లీకి పంపుకొనెను. అందు తనగోడు నంతను నబాబు వెళ్ళబోసుకొనెను. అందుండి కొన్ని ముఖ్యభాగముల మాత్రము యిట బహుక్లుప్తముగ పొందుపరచెదము.

**నబాబు గోడు.**

"గత 80, 90 సంవత్సరములనుండి యీపరగణాలు నాపూర్వుల సర్వంసహాధికారముక్రింద నుండి యున్నవి. నాతండ్రిగారి కాలమునాటినుండి మాకును మీ కంపెనీవారికిని స్నేహమేర్పడినది. దీనివల్ల మా రాజ్యము బలిష్టమైనది. నాఅన్నగారి హయాములోకూడ వ్యవహారములు సరళముగనే వెళ్లిపోయినవి. ఆయన అనేకమంది శత్రువులతో పోరాడవలసివచ్చెను. ఆయన సేనలలోనే అనేకసార్లు తిరుగుబాట్లు జరిగెను.........

"అయినప్పటికి యిప్పుడు మీరు చేయదలచినమాదిరి మార్పులను చేయుటకు కంపెనీవారిదివరకెన్నడును కలలోనైన తలంచియుండలేదు; కంపెనీవారి దయవల్ల, వారి భుజబలసహాయమువల్ల, నేను నాపితృపైతామహమగు సింహాసనము నెక్కితిని. తమ రెక్కలక్రిందికి తీసికొనినవారిని సంరక్షించుట బలవంతులును మహోదారభావులును నగు సార్వభౌములకు సర్వకాలములందు, సర్వదేశములందు, సాంప్రదాయసిద్ధముగనే యున్నదిగద. నేను ఘనత వహించిన మీ కంపెనీవారికి సంపూర్ణముగ శరణాగతుడను. అందుచే మీ గొప్పతనమును, ఔదార్యమును నమ్ముకొని, నాపూర్వుల కాలములోకంటె నాహయాములోనే యీరాజ్యము మరింత ప్రతిభతో వెలుంగగలదని నేనెంతయో ఆశతోనుంటిని.

"మీ కంపెనీవారికీర్తి ఆ చంద్రతారార్కము వర్ధిల్లుగాక !"

"నాహయాములో నారాజ్యములో అవమానకరములగు యెట్టిమార్పులుగాని అకారణముగ రాకుండుగాక యని అల్లాను వేడుకొనుచున్నాను. ఎవరోకొందరు దుర్మార్గులుచేసిన దుష్కార్యములకుగాను, తరతరములనుండి యింట కనిపెట్టుకొనియున్న నౌకర్లు జీవనముల గోల్పోయి, వారు అన్నమో రామచంద్రాయని యడలుచు, చెట్టుపుట్టలంబట్టి పోయి, నా యపకీర్తిని లోకమంతట వ్యాపింపజేయు దౌర్భాగ్యస్థితికి రాకుందురుగాక!

"దేశములో మిగిలినవారైనను సుఖముగనుండక "యీరోజున వాళ్లు దేశాంతరాలపాలైనారు. యిక మనవంతు రేపువస్తుందిరా, దేవుడా" యని యడలుచుందురుగాక!

"అన్నిటికంటె గొప్పఅనర్థమేమనగ:—కంపెనీవారీప్రకారముగ చేయుటవల్ల వారి కీర్తికి కళంకముకలుగును. ఇకనన్నో నాప్రజలు గడ్డిపోచకంటె హీనముగజూతురు. కంపెనీవారికి నాయందు నమ్మకములేక నన్నీరీతిగ పదభ్రష్టునిచేసి తమసైన్యము తీసికొనివచ్చి దేశములో పెట్టినారని ప్రజలనుకొందురు."

"ఈప్రకారము జరిగినట్లైతే, యికదేశంలో నా అధికారమే అంతరించి పోతుంది. నాయాజ్ఞలను కడజాతివాడుకూడ లెక్కచేయడు. మీకు కప్పముచెల్లించడానికి నేనెంత తంటాలుపడినా వృథయవుతుంది."

“నన్నిట్లు అగౌరవపరచుట నిజముగ మీయుద్దేశ్యము కాదను నమ్మకముతో నామనస్సులో మాటను మీకు దాపరికములేక చెప్పుకుంటాను. కంపెనీవారి తోడ్పాటుతో, వారి సలహాతో, నారాజ్యమును బాగుపరచుకొనుటకు కావలసిన యావత్తుపనులను చేసికొనుటకు నాకు సంపూర్ణముగ సామర్థ్యమున్నది. వారిని తృప్తిపరచి, వారికి విధేయుడనై యుండుట కంటె నాకింక కావలసినదేమున్నది? పట్టాభిషేకకాలమందు నేను వారితో చేసుకొన్న ఒడంబడికను ఒక వెంట్రుకవాసికూడ తప్పి నడచుకొనను. కంపెనీవారుకూడ అన్నమాటను తప్పువారుకారు. చేసుకొన్న ఒడంబడిక ప్రకారము తు, చ, తప్పకుండజరిపిస్తారని నాకు తెలుసును. కాబట్టి, వెనుక చేసుకొన్న ఒడంబడికను మీరు నిజముగ భంగపుచ్చదలచిరని నేననుకొనను.”

“ఇక అసలు వెనుకటి ఒడంబడిక షరతులనుగూర్చి కొంతమనవి చేసుకొంటాను. ఆఒడంబడికలోని రెండవషరతు యేమిచెప్పుచున్నది. నబాబుతాలూకు రాజ్యమును సమస్తశత్రుబాధనుండి సంరక్షించుట కంపెనీవారికి విధాయకము. ఈ పనికిగాను కంపెనీవారు అదనముగ కొంతకాల్బలమును అశ్వబలమును నబాబురాజ్యములో పెట్టినారు. ఇందుకు ప్రతిఫలముగ నబాబు యిదివరకిచ్చుచున్న రు. 56,77,638లుగాక యిప్పుడు అదనముగ మరి రు.19,22,362 లు చెల్లించవలెను. అనగ, సాలుకు 76 లక్షల రూపాయల కప్పమును కంపెనీవారికి నబాబు చెల్లించవలెను.”

“అదివరకుండిన సేనకంటె నా పట్టాభిషేకకాలమందు కంపెనీసేన హెచ్చుచేయబడినది. ఈ హెచ్చుసేనకగు ఖర్చును నేను భరించుటకు ఒప్పుకొన్నమాట వాస్తవమే. అయితే, తిరిగి కొంతకాలమునకు యీ సేనను మరల హెచ్చించవలయునని మన ఒడంబడికలో యెక్కడను సూచింపబడనైనలేదు. ఇందుకు విరుద్ధముగ యిప్పుడిట్లు తిరిగి సేనను హెచ్చుచేయదలచుట అనవసరము, అన్యాయము.”

“ఒడంబడికలోని యేడవషరతు చూడుడు. దానిలో యేమివున్నది? అయోధ్యరాజ్య సంరక్షణకై కంపెనీసేనలు అమాంబాపతులు, కలిసి, పదివేలకు మించరాదు. అవసరమువచ్చినప్పుడు మాత్రము, తదవసరకాలమునకు మాత్రము సదరుసేనను 13 వేలవరకు హెచ్చించవచ్చును. ఈ హెచ్చుఖర్చును నబాబు భరించవలయును.

“మరియు యేకారణముచేతగాని, కంపెనీసేన యెప్పుడైనా 8 వేలకు తగ్గేయెడల' దామాషాప్రకారము నబాబు యిచ్చుకోవలసిన కప్పముకూడ తగ్గించవలయును. ఈషరతులను బట్టి యేమితేలుచున్నది? అవసరమును గుర్తించకుండ కంపెనీసేనలను, యిచ్చవచ్చినరీతిని హెచ్చించరాదనియు, అవసరకాలమునకు మించి హెచ్చుకాల మీ సేనల నుంచరాదనియు, సేనసంఖ్య యెంత హెచ్చించవలయునను సంశయముకూడ అప్పటప్పటి అవసరమునకు సరిపోయినంతవరకే హెచ్చించవలయునుగాని, అంతకుమించి హెచ్చించరాదనియు, స్పష్టమగుచున్నది. కాబట్టి, మీరిప్పుడు చేసినట్లుగ ఎట్టిఅవసరము లేకపోయినను, మీరు మీ సేనలను హెచ్చుచేసి, ఆఖర్చును నన్ను పెట్టుకొనుమనుట చాల అన్యాయము, ఇది మన ఒడంబడికకు విరుద్ధము. అదిగాక అవసరము లేకపోతే మీ సేనను దానిననుసరించి నాకప్పమునుకూడ తగ్గించవలయునని యీ యేడవషరతు చెప్పుచున్నది.

"ఇక 17-వ షరతు చివరభాగమం దేమియున్నది? మన ఉభయపక్షములకు జరుగు వ్యవహారములు మిక్కిలి అన్యోన్య స్నేహభావముతో జరుగుచుండవలెననియు, నాగృహకృత్యముల పైనను, వంశ పారంపర్యముగవచ్చుచున్న నారాజ్యముపైనను, నా సేనపైనను, నాప్రజలపైనను నాకు సంపూర్ణాధికారము లుండవలయుననియు, ఈషరతు చెప్పుచున్నదిగద. మీరిప్పుడు తల పెట్టినట్లు వీని యన్నిటిపైనను మీరు నాయధికారమును తీసివేసినచో యిక నాకున్న స్వాతంత్రమేమి? అధికారమేమి?"

"కాబట్టి, తామీ సంగతులనన్నిటిని దయచేసి పూర్తిగవిచారించి, నారాజ్యముపైనను, నా సేనలపైనను, నాప్రజలపైనను, నాకు సంపూర్ణాధికారము పూర్వమువలెనే, నిలిచియుండునట్లు చేయగోరెదను. మీరు దయచేసి, మీరెసిడెంటు స్కాటుగారితో నన్ను సంప్రదించి నాకు సలహా చెప్పుచుండవలసినదని మీరు ఆజ్ఞాపించినయెడల నేను సదరు స్కాటుగారి సహాయముతో దేశభద్రతకు అవసరమైన యేర్పాటులనన్నిటిని చేసికొందును. నా సేనలు వినయ విధేయతలతో ప్రవర్తించుచుండునట్లును చేసెదను. నేనును అన్నివిషయములలో మీతో సంప్రతించుచునే, మీయాజ్ఞలకు యెల్లప్పుడు బద్ధుడనగుచునే, నడుచుకొనుచుందును."

"ఇందువల్ల మనఉభయులకీర్తియు ప్రపంచమున వ్యాపించును. కంపెనీయొక్క అభ్యుదయమునకై నేనెల్లప్పుడు అల్లాను ప్రార్థించుచుందును."

"చనవుచేత నేను నామనస్సును విప్పి మీయెదుట బెట్టినాను. నామనస్సులోని భావములనన్నిటిని మీకు తెలుపుకొందమను ఆశచేత నేను మీజాబునకిట్లు జవాబిచ్చుట ఆలస్యమైనది. మీరు నా కోర్కెలను మన్నింతురనియే మీ మిత్రభావమునుబట్టి అనుకొనుచున్నాను."

వెల్లస్లీ తలబిరుసు.

ఇంతటి వినయ పూర్వకముగ వ్రాసుకొన్న జాబునకు తలబిరుసు వెల్లస్లీ యెంతటి పొగరుబోతు జవాబిచ్చెనో చూడుడు. జవాబును, సరాసరి నవాబునకు పంపక, ఇంగ్లీషు రెసిడెంటగు స్కాటుకు యిట్లని తన శెక్రెటరీచేత వ్రాయించెను:—

నవాబు మీద్వారాపంపించిన ఉత్తరము సరియైన మతలబులోలేదు. దానిని తాముంచుకొనుట తగదని ఘనతవహించిన వెల్లస్లీ ప్రభువుగారు తలంచుచున్నారు. కాబట్టి, సదరు ఉత్తరమును మీరు తిరిగి నవాబునకు పంపించివేయండి. ఈ ఉత్తరమును వాపసుచేయునప్పుడు యీదిగువ అంశములుకూడ నవాబునకు తెలియజేయండి.

ఘనతవహించిన గవర్నర్ జనరల్ ప్రభువుగారి దస్కతు మొహరులతోనుండి, ఉభయపక్షములకు యింతటి ప్రాముఖ్యమైన విషయములతో కూడుకొన్నట్టి మన నవంబరు 5-వ తేదీ ఉత్తరమునకు నవాబు యీమతలబుగ జవాబిచ్చుట ప్రస్తుత వ్యవహారమునకు యెంతమాత్రము తగదు. అది అతని లేకితనమును తెలియ బరచుటయేగాక, ఇండియాలో బ్రిటిష్ అధికారులలో అగ్రేసరుడగు గవర్నరు జనరలుయెడ నవాబు విధిగ చూపవలసిన మర్యాదకు చాల లోపము.

ఈ కారణములచేత, మీరుపంపించిన కాగితమునకు యెట్టిజవాబుగాని పంపుటకు గవర్నల్ జనరల్ ప్రభువుగారు నిరాకరించుచున్నారు. మన నవంబరు 5-వ తేదీ ఉత్తరము

నకు యింతులో పంపిన మతలబు ప్రకారము జబాబివ్వవలసినదని మీరు నబాబునుపిలిచి చెప్పండి. ఈ మతలబు ప్రకారము జబాబిచ్చుట పూర్వాచారమేగాక న్యాయముకూడనై యున్నది. ఇప్పుడు వాపసుచేయుచున్న యీ ఉత్తరములో ప్రకారమే నబాబు తిరిగి జబాబివ్వదలచినయెడల — అనగ బ్రిటిష్ గవర్నమెంటువారి గౌరవమును, న్యాయబుద్ధిని అతడు నిందింప దలచినయెడల—నిరాధారమగు యీనిందకు యెట్లు జబాబుచెప్పవలెనో ఘనతవహించిన గవర్నర్ జనరల్ ప్రభువుగారికి తెలియునని మీరు నబాబుకు గట్టిగ చెప్పండి. [క్లుప్తము.]

చరిత్రకారుని మందలింపు.

ఈ ఉత్తరప్రత్యుత్తరములగూర్చి సుప్రసిద్ధ ఆంగ్ల చరిత్రకారుడగు 'మిల్లు' తన బ్రిటిష్ ఇండియా చరిత్ర ఆరవ సంపుటము. 191 పేజీలో యిట్లని వ్రాయుచున్నాడు :—

"ఒడంబడిక చేసుకొన్న ఉభయపార్టీలలో ఒకపార్టీ తాను నెరవేర్చవలసిన షరతుల అన్నిటిని తు, చ, తప్పకుండ, సకాలమున నెరవేర్చినాడు. ఇట్టి సమయపాలన లోకములో ననన్యసామాన్యము. ఇక రెండవ పార్టీవారన్ననో, ఒడంబడికను యీావత్తు ఒక్కసారిగ, అతి లజ్జాకరముగ, భంగపుచ్చపోవుచున్నారు. కనీసము అట్లుచేయబోవుచున్నట్లు మొదటి పార్టీకి కనిపించినది. అప్పుడతడేమి చేసినాడు? "అయ్యా! మన ఒడంబడికకును, మీప్రవర్తనకును నాకు తేడాకనబడుతోంది" అనిచెప్పి యెంతోవినయ విధేయతలతో రెండవపార్టీకి స్పష్టముగ తెలుపుకొన్నాడు. అతడు మనవిచేసుకొన్న ధోరణి అతని బానిసబుద్ధిని తెలియజేయునదిగానున్నదేగాని, యెదుటివారియెడ అమర్యాద జూపునదిగ యెంతమాత్రములేదు. అయినప్పటికి యెదటి పార్టీవారేమనుచున్నారు? ఈతని ధోరణి మనగౌరవమును, న్యాయబుద్ధిని నిందపాలేయునదిగ నున్నదని మొదటిపార్టీవారు (యెంతో టాగతనముగ) అనుచున్నారు. తమ నిరంకుశాధికార ప్రకారము లొంగినడచుకొనని తనయెదుటివానిని శిక్షించుటకు లోగడ అతనియందెట్టి తప్పుగాని దొరకకపోయినను, యిదిగో, యిప్పుడీయవినయ ధోరణియే ఒకానొక తప్పుగ—ప్రాయశ్చిత్తములేని మహాపాపముగ—అతనియందు కల్పించి, అతనిని శిక్షించుటకు నిరంకుశాధికారులగు రెండవపార్టీవారు పూనుకొన్నారు. ఈపరిస్థితి నంగీకరించినచో, యిక (బలవంతుడుచేయు) యేప్రతిజ్ఞాభంగముగాని, సమర్థనా రహితముగ నుండజాలదు. "(అనగ, బలవంతుడు చేసినతప్పులు తప్పులుగ యెంచబడవన్నమాట)"

"ఈ తప్పువల్లనష్టపడిన యెదుటిపార్టీ యిదేమని గద్దించకుండ నోరుమూసుకొని ఊరకుంటే, "ఇదిగో, దీనికి యెదుటిపార్టీ ఒప్పుకొనే ఒప్పుకున్నాడు. ఇందులో ఒడంబడికకు భంగమేమున్నది." అని అందురు. ఇక, అతడు ఒప్పుకొనక "మీరు ఒడంబడికను భంగపుచ్చినారు." అని నోరెత్తి పల్లెత్తుమాట అంటే, "ఇదిగో, నీవు మాగౌరవమును, న్యాయబుద్ధిని, నిందించి, మమ్మును లోకములో అల్లరిపెట్టుచున్నావు. యిది మహాదోషము, దీనికి ప్రాయశ్చిత్తములేదు. నీబోటి అధముడితో మాబోటి గొప్పవారు సంబంధము పెట్టుకోవడమే తప్పు, ఛో, ఛో," అని పెనుటాగతనముతో త్రోసివేయుదురు." [క్లుప్తము.]

1801 సం॥ జనవరి 22-వ తేదీన వెల్లస్లీ నబాబు సాదత్ ఆలీకి మరియొక ఉత్తరము వ్రాసెను. అందులో "మనోవర్తి పుచ్చుకొని, నీ రాజ్యమంతా వదలు

కొని లేచిపైనాపో ; లేదా యిప్పుడు నీరాజ్యంలోకి తెచ్చిన యీ రెండు సైన్య దళములఖర్చుక్రింద నీ రాజ్యంలో సగంభాగం కంపెనీకి ధారాదత్తమైనా చేసివెయ్యి " అని యెంతో గద్దరింపుతో వెల్లస్లీ వ్రాసెను. ఇందు కనుగుణముగ ఒక చిత్తు ఒడంబడిక కూడ వ్రాసిపంపుచు, యిందు విషయమై యేయే పనులు చేయవలెనో వెల్లస్లీ తన రెసిడెంటుకు ఉత్తరము వ్రాసిపంపించెను. 1798 సం॥ ఒడంబడికవల్ల తనకు వచ్చుచున్న 76 లక్షల కప్పముతో కంపెనీవారి దాహము తీరలేదు. ఏటేట 76 లక్షల రూపాయలు చెల్లించుచుండుటకంటె, యిందుక్రింద ఒక్కసారిగనే నవాబు ఇంగ్లీషువారికి తన రాజ్యములో కొంతభాగము-ఒక జిల్లాను-శాశ్వతముగ, సర్వసంపూర్ణాధికారములతో ధారాదత్తముచేసివేయవలసినదని వెల్లస్లీ నవాబును బలవంతపరచెను. ఇంగ్లీషువారు కోరుకొన్న యీ జిల్లాపైవచ్చు సాలియానా రాబడి ఒకకోటి, 35 లక్షల రూపాయలు. అనగ, తమ కిదివరకు ముట్టుచున్న 76 లక్షలకంటె యిప్పుడు మరి 59 లక్షలను అదనముగ కంపెనీవారు నవాబునుండి గుంజుకొన జూచిరన్నమాట. వెనుకటి యొడంబడికకు కేవలము విరుద్ధముగ, వెల్లస్లీ తననిల్లు బలాత్కరించుచు చెప్పినమాటలకు నవాబు మొదట ఒప్పుకొనలేదు. అయినను వెల్లస్లీ 1801 సం॥ యేప్రిల్ 28-వ తేదీన " సదరు పరగణాలను మనకిచ్చుటకు నవాబు అంగీకరించక పోయినయెడల, నీవు సదరు పరగణాలను బలాత్కారముగ ఆక్రమించుకొనవలసినది " అని తన రెసిడెంటుకు జాబు వ్రాసెను.

వెల్లస్లీ గద్దరింపు, బందిపోటు.

" నావద్దనుండి వేరే ఉత్తరువులకై నీవిక వేచియుండవద్దు. ఇదే నా ఫైసలా ఉత్తరువుగ భావించి, నీవు క్రియజరుపవలెను " అని రెసిడెంటుకు ఆ వుత్తరములోనే వ్రాసెను. అనగ, సదరు పరగణాలపై బందిపోటు చేయవలసినదని చెప్పి వెల్లస్లీ తన రెసిడెంటును ప్రేరేపించెనన్నమాట !

అయోధ్య రాజ్యమును గబళింపవలయునను దురాశచే సదరు రాజ్యముపై సివిల్, మిలిటరీ, రివిన్యూ, వగైరా యావత్తు సర్వం సహాధికారములను కంపెనీవారే వహించినగాని సదరు రాజ్యము " బాగుపడదని " వెల్లస్లీ యెన్నో శ్రీరంగనీతులు, సాకులు చెప్పెనుగద. ఈ ప్రకారము యావత్తు రాజ్యమును ఒక్కసారిగ గబళించుటకు అతనికెవరును అడ్డు లేరుగద. అయితే, ఆతడట్లేల చేయలేదు ? సగముముక్కను మాత్రమే కోరుకుక్కతిని, మిగతా సగమును యాభై యేండ్లవరకు యేల కొన యూపిరితోనుండనిచ్చెను ? ముందువచ్చు గవర్నర్ జనరలుల ఫలహారము కొరకై అట్టెయుంచెనా ? లేక, ఇంగ్లండులో ఇంగ్లీషు ప్రజలేమను కొందురోయని వెల్లస్లీ భయపడెనా ? తరువాత, వారన్ హేస్టింగ్సుకు పట్టినగతియే

వెల్లస్లీ అయోధ్యలో సగము ముక్కను నోట గరచుట.

తనకును పట్టునని వెల్లస్లీకి గుండెలలో దడదడ బుట్టెనా? తన బుద్ధికే యింతటి అన్యాయముగ గన్పట్టుచున్న ఘోరకార్యము నెట్లుచేయుదునా యని నోరాడక, కండ్లుమూసుకొని, దొక్కెట్లో సగముముక్కను మాత్రమే. వెల్లస్లీ తాను మ్రింగ గలిగెనా?

"అంతా అక్కరలేదులే, సగంరాజ్యమే పుచ్చుకుంటాములే" అని వెల్లస్లీ తన యభిప్రాయమును నబాబుకు తెలియపరచినప్పుడు-అట్లాగైతే, మిగతా సగం మాత్రం నాకికయెన్నాళ్లు దక్కుతుంది?" అని పాపము నబాబు ఉస్సురనెను. కాని, నబాబు అనుకొన్నదానికంటె యెక్కువకాలమే మిగతా సగము నిలిచి యుండెను. అయితే, యీలోగా, సదరు మిగతాసగము పైవచ్చు రివిన్యూనుకూడ కంపెనీ వారెక్కెట్లో తామే దిగమ్రింగుచుండిరి. "ఈ మిగతా సగముపై నీకే సర్వసంపూర్ణాధికారము వుంటుంది," అని ఇంగ్లీషు రెసిడెంటును, గవర్నర్ జనరల్ శెక్రటరీమున్నగు ఇంగ్లీషువారును మొట్టమొదట నబాబుకు యెంతోదూరము నమ్మకముగలుగునట్లు తియ్యనిమాటలు చెప్పిరి. కాని నబాబుకు నమ్మకము కుదుర లేదు. "మా మాట నమ్మండి-మీ కెందుకు? మాదీపూచీ" అని ఇంగ్లీషు దొరలు ఎన్నో ఒట్లు పెట్టుకొనిరి.

తమ వాగ్దానములయందు నబాబుకు యేమాత్రమైన నమ్మకము పుట్టు నేమోయని వారుయెంతో తంటాలుపడిరి. కాని, నబాబుకు నమ్మకమెట్లుకుదురును? "నేను మీమాటలను నమ్మను, నేను లేచిపోతాను, ఈ గొడవంతా నాకెందుకు?

నబాబు రోదనము, సంతకము.

"మక్కాకో మదీనాకో నన్నుపోనియ్యండి-మీ యిష్టంవచ్చి నట్లు మీరు తగలేసుకోండి-నాప్రజల మొగం నేనిక చూడ లేను-నన్ను లేచిపోనియ్యండి" అని పాపము నబాబు యెంతో యేడ్చెనట! కాని, యేమి యేడ్చిన నేమిలాభము? నబాబెంత పడి పొరలినను వృథయైనది. ఆఖరుకు 1801 సం॥ నవంబరు 4-వ తేదీన కాగితముపై నబాబు యేడుస్తూ సంతకము పెట్టెను.

కంపెనీవారు తమ స్నేహితుని యేడ్పించిన యేడుపు యీరీతిగ నున్నది! నబాబు బుద్ధిపూర్వకముగ తమ కర్ధరాజ్య మిచ్చెననుమాట వట్టి బూటకము.

మిత్రుని మెడకు ఉరి.

కంపెనీవారు మొట్టమొదట నబాబు వద్దన్నకొద్దీ సేనలకు సేనలను తీసికొనివచ్చి అతని నెత్తిమీద పెట్టిరి. ఖర్చుపై ఖర్చులను అతని నెత్తినవేసి రుద్దిరి. ఆఖరుకు "యీసొమ్ము యిచ్చుకోలేను మొర్రో" అని గోలపెట్టితే, యీగోల నొకసాకుగ తీసికొని, "సొమ్ము లేకపోతే, రాజ్యము యిచ్చివేసెయ్యి" అని బలాత్కరించిరి. ఉన్నంత వరకు డబ్బుగుంజినారు. డబ్బు అయిపోతే, రాజ్యం లాక్కున్నారు. నబాబుమెడ

తమకు గల "స్నేహము" నకు చిహ్నముగ కంపెనీవారీ ప్రకార మతని మెడకు ఉరిత్రాడు తగిలించి తమ కాలికి కట్టిపడవేసుకొన్నారు! ఇది ఇంగ్లీషువారి స్నేహ ఫలితము.

దురంతమగు యీ యయోధ్య రాజ్యాపహరణోదంతము సీమలో ప్రజల చెవిని పడెను. ఇండియాయం దభిమానముండి, వెనుక వారన్ హేస్టింగ్సును పార్లమెంటు యెదుట తూరుపారబట్టిన ఫ్రాన్సిస్ యింకను బ్రతికియుండెను. వెల్లస్లీయు, అతని తమ్ములిద్దరును ఇండియానుండి ఇంగ్లండుకు రాగానే, వీరిముగ్గురి పనిపట్టించుటకు ఫ్రాన్సిస్ పూనుకొనెను. ఇతడును, పాల్ అను యింకొక మెంబరును చేరి యిందు విషయమై పార్లమెంటులో చాల గందరగోళముచేసిరి. అయితే వీరికి మద్దతు చేయుటకు బర్కువంటి మహావక్త వీరి కానాడు దొరకలేదు. వెనుక వారన్ హేస్టింగ్సు కేసులో పనిచేసిన బర్కు యిప్పుడు చనిపోయెను. అదిగాక, పరాసు వీరుడగు నెపోలియను తన మహా విజయయాత్రలచే యూరపు ఖండమునంతను కంపింపజేయుచుండెను. అందుచే ఆరోజులలో ఇంగ్లీషు ప్రజల మనస్సులు మహా ఆందోళన పూరితములై యుండి, "నెపోలియన్ బాధ యెట్లుతప్పునురా దేవుడా" యని కళవళపడుచుండెను. ఈ హడావుడిలో తమ కేదో రాజ్యమును – దొంగతనముగనో, దొరతనముగనో – సంపాదించిపెట్టిన వెల్లస్లీపై యీ యిద్దరు అనామకపు మెంబర్లు చేయు గందరగోళము పార్లమెంటులో యెవరిచెవికెక్కును? ఇదంతయు తుదకు చెవిటివానిముందు ఊదిన శంఖమయ్యెను.

పార్లమెంటులో వెల్లస్లీపై చార్జి.

ఫ్రాన్సిసు తనకు హేస్టింగ్సుపై గల యీర్ష్యచే ఆతనిపై చార్జీలు పెట్టించెనని వెనుక కొందరనిరి. కాని, అట్టియీర్ష్య యితనికి వెల్లస్లీపై లేదుగద. అయితే, యిప్పుడు పాల్‌కు వెల్లస్లీపై యీర్ష్య యుండెనని కొంద రనజొచ్చిరి– ఏలననగ, వెల్లస్లీ అయోధ్యలో యీ దుండగములు చేయుచున్నకాలమందు యీ 'పాల్' అనునతడు అయోధ్యలోనే యుండెను. ఈ దారుణకృత్యముల నన్నిటిని పాల్ కళ్ళార చూచెను. వెల్లస్లీ చర్యలు ఆంగ్లదేశ కీర్తికి భంగకరములుగ గన్పట్టిన కారణముచేతనే ఆతడిప్పు డతనిపై చార్జీలు దాఖలుచేసెను గాని, ఆతనిపై గల ద్వేషముచే గాదని పాల్ 1806 సం॥ జనవరి 27–వ తేదీన పార్లమెంటు మహాసభలో యీరీతిగ చెప్పెను:—

[......నాకు స్వయముగ వెల్లస్లీపై యెట్టి యీర్ష్యయు లేదు..........భారతప్రజల సౌఖ్యమునకు శ్రేయస్సునకు మాత్రమేగాక, మనజన్మభూమియగు ఇంగ్లండుయొక్క కీర్తికి కూడ యీ వెల్లస్లీ శత్రువని ఋజువుపరచుటకు నేను న్యాయబుద్ధితో పూనుకొనుచున్నాను. వారన్ హేస్టింగ్సువలెనే యీ వెల్లస్లీయు మహాఅపరాధి, రాజ్యద్రోహి. అయితే వారన్ హేస్టింగ్సుకును యితనికిని ఒక్క తేడావున్నది. ఏదోషమైతే వారన్ హేస్టింగ్సునందు అస్పష్ట

ముగనుండెనో, అట్టిదోషము వెల్లస్లీయందు స్పష్టముగ గన్పించుచున్నది. వారన్ హేస్టింగ్సుపై వెనుకచార్జీలు పెట్టబడినప్పుడు యీ వెల్లస్లీ పార్లమెంటులో మెంబరుగనుండెను. ఆ చార్జీల యందలి లోతుపాతులు, యితనికి బాగుగ తెలియును. ఇట్టివాడు యీదేశములోని శాసనములు తనకు తెలియవనిగాని, తాను పొరవడితిననిగాని, యేదో సాకుచెప్పకొనుటకుకూడ వీలులేదు. (క్లుప్తము)]

వెల్లస్లీతో పరీక్షైయున్న కొందరు మెంబర్లు యీకేసు పార్లమెంటుముందుకు రాకుండ యేవో సాంకేతికపు టభ్యంతరముల జెప్పి తప్పింపవలెనని అడ్డదిడ్డముగ వాదింపజొచ్చిరి. ఎట్టకేలకు, చాల కాలహరణమైన పిమ్మట 1806 సం॥ మే 28-వ తేదీన వెల్లస్లీపై పార్లమెంటుయెదుట చార్జీ దాఖలయ్యెను. అయోధ్య వజీరు వ్యవహారములో వెల్లస్లీ చేసిన చర్య చాల అక్రమమగు క్రిమినల్ నేరమను చార్జీ మహాసభవారి యెదుట బెంచిగుమాస్తా చదివి వినిపించెను. ఇందుకు మద్దతుగ పాల్ తన వ్రాతమూలకమగు స్టేటుమెంటును దాఖలుచేసెను. ఈ స్టేటుమెంటు చాల గాఢముగను, తిరుగు లేనిదిగను నుండెను:

[“లోగడ ప్రమాణపూర్తిగ చేసుకొనబడిన ఒడంబడికలకు తాను బద్ధుడైవుండవలసియుండగ, అట్లుచేయక అందుకు విరుద్ధముగ, సదరు ఒడంబడికలోని నిబంధనలను కేవలము తృణీకారభావముతో త్రోసిపుచ్చి, ముద్దాయి వెల్లస్లీ తాను ఇండియాలో అడుగిడిననాటినుండి సదరు నబాబు తాలూకు అధికారములను, హక్కులను భంగపుచ్చ సంకల్పించి, తుదకా సంకల్పమును క్రియాపూర్వకముగ, సైతము జరిపించెను. 1798 సంవత్సరపు టొడంబడికవలన కంపెనీవారు నబాబుకు ప్రమాణపూర్తిగ వాగ్దానము చేసినదానికి భంగకరముగ వెల్లస్లీ నబాబుతాలూకు ఆంతరంగిక రాజ్యవ్యవహారములలో జోక్యముకలిగించుకొనియు, అతని గృహకృత్యములలో సైతము అతని కెట్టిపలుకుబడిగాని, అధికారము గాని లేకుండజేసియు, అతని సేనలపైనను, ప్రజలపైనను అతనికి గల అధికారమును, సమూలముగ నాశనముచేసియు, కేవలమబద్ధమగు మిషలజెప్పి అతనిపితృపైతామహమగురాజ్యమును అతనినుండి యూడబెరికియు, అతిఘోరముగ ప్రవర్తించెను. తన పుర్రెలోబుట్టిన యీసంకల్పములనుగాని, తానొనర్చిన యీక్రియలనుగాని సదరు వెల్లస్లీ కలకత్తాలోనున్న తన కౌన్సిల్ మెంబర్లకుగాని, సీమలోనున్న తన యజమానులగు యీస్టిండియా కంపెనీవారికిగాని ముందుగ తెలుపనైన తెలుపలేదు. వారితో యిందువిషయమై అతడుసంప్రదించలేదు.” క్లుప్తము.]

పాల్ దాఖలుచేసిన స్టేటుమెంటు చాలపెద్దది. తనసంకల్పమును సాధించుకొనుటకై వెల్లస్లీ యెట్టి మార్గముల నవలంబించెనో విన్నచో అతడు పరమ కిరాతకుడగు మహా పాపిగ గన్పట్టితీరును. పార్లమెంటులో యితనిని సమర్థించుటకై యితని మితామెంబర్లు చేసిన ప్రతివాదనము వారి కపటస్వభావమును, అక్రమమగు పక్షపాతబుద్ధిని లోకమునకు చాటుచున్నది.

ఈ కేసులో సాక్షులను విచారించుటకు 1806 సం॥ జూన్ 18-వ తేదీన పాల్ కోరికపైని పార్లమెంటువారు తమలో కొందరు మెంబర్లను ఒకచిన్న కమిటీగ యేర్పాటుచేసిరి. ఈ కమిటీకి "ఫోక్సుటర్ ప్రభువు" అధ్యక్షుడుగ నియమింపబడెను. ఈ కమిటీముందు విచారింపబడిన సాక్షులలో మొదటిసాక్షి సర్ జార్జిషోర్ అనగ వెల్లస్లీకి ముందు ఇండియాలో గవర్నర్ జనరల్‌గ పనిచేసివచ్చినవాడు. ఇతడును అయోధ్యనవాబును తన హయాములో హింసపెట్టియే యుండెనుగద. ఇట్టివాడు అసలు రహస్యమును బయటపెట్టునా? ఇతనినుండి యెట్లైన రహస్యమును గుంజుదమని "పాల్" యితని నెన్నియో అడ్డుసవాళ్ళు వేసెను. కాని, వెల్లస్లీ పక్షపాతులగు మెంబర్లు యీ ప్రశ్నలను వేయనీయక అడుగడుగునకు గందరగోళము చేయసాగిరి. రెండవ సాక్షి సర్ అల్యూర్డు క్లార్కు. ఇతడు ఇండియాలో సర్వసేనాపతిగ నుండెను. పాల్ యితనినొక ప్రశ్న వేసెను- యీ ప్రశ్న వేయడానికి వీలులేదని వెల్లస్లీ పార్టీవారు తీవ్రముగ యెదిరించిరి. అట్లయినచో కమిటీ ప్రొసీడింగ్సు నిలుపుదల చేయవలసినదని పాల్ కోరెను. ఆప్రకారమే ప్రెసిడెంటు కమిటీ ప్రొసీడింగ్సును ఆపుదలచేయవలసి వచ్చెను "పాల్ త్రోవకు యెదటి పార్టీవారు అడ్డములు వేసిరని" ప్రెసిడెంటు చెప్పెను. అంతటితో యీ కేసు విచారణ తాత్కాలికముగ నిలిచిపోయెను. ఈ కేసు పూర్తికాక మునుపే పార్లమెంటు సభ ముగిసెను. ఈలోగా క్రొత్తయెన్నికలు వచ్చెను. ఈ యెన్నికలలో పాల్, ఫ్రాన్సిసు లిరువురు ఓడిపోయిరి. కాబట్టి, యీ కేసునందు అంత పట్టుదలగలవారెవరు పార్లమెంటులో లేకపోయిరి. తిరిగి దాదాపు రెండేండ్లకుగాని యీ కేసు అసలు పార్లమెంటుసభ యెదుటికి రానేలేదు. 1808 సం॥ ఫిబ్రవరి 9-వ తేదీన యీ కేసును విచారణకు తీసుకోవలసినదని 'ఫోక్సుటర్ ప్రభువు' పార్లమెంటుసభలో ఉపపాదించెను. ఈ కేసుకు సంబంధించిన కాగితములన్నియు చాల గందరగోళముగ పడియున్నవనియు వీనినన్నిటిని చదివి రికార్డునంతను వరుసగ పెట్టుటకు ఒకచిన్న కమిటీని వేస్తే బాగుంటుందనియు కొందరు మెంబర్లు వాదించిరి.

".........ఇదిచాల ప్రాముఖ్యమైన విషయము. దీనిని తొందరగ త్రోసివేయుట న్యాయముకాదు.

...ఈకేసులో కోట్లకొలది ప్రజల శ్రేయస్సు యిమిడియున్నది. ఈ ప్రజలకు మనము తప్ప యింకెవరును దిక్కులేరు. మనముతప్ప వారికి మిత్రులనదగిన వారింక యీలోకములో యెవరును లేరు. తమకు న్యాయము కలుగజేయవలసినదని వారిప్పుడు మనకు మొఱపెట్టుకొనుచున్నారు. ఈ మొఱనుగనుక మనమువినక తేలికగ తృణీకరించివేసినచో, మనము మన గౌరవమును, ధర్మమును భంగపుచ్చుకొన్నవారమేగాక, మనయావత్తు దేశగౌరవమును, ధర్మమును కూడ భంగపుచ్చుకొన్నవా రగుదుము."] (క్లుప్తము.)

అని "సర్ తామస్ టర్టన్" అను మెంబరు యెంతోదూరము చెప్పెను. అయినను ప్రయోజనములేకపోయెను. బ్రిటిష్‌ప్రజలు యేనాడు క్రైస్తవేతరులగు

భారతప్రజలకు గాని, రాజులకుగాని, న్యాయముగలుగజేసిరి ? కమిటీనికోరుచు కొందరు మెంబర్లు పెట్టిన తీర్మానము ఓడిపోయెను.

1808 సం॥ మార్చి 9-వ తేదీన యీ అయోధ్య కేసు విచారణ పార్లమెంటు మహాసభలో ప్రారంభమయ్యెను. వెల్లస్లీ పార్టీవారు ప్రజాభిప్రాయమును తమపక్షమునకు త్రిప్పుకొనుటకుగాను యెట్లు తంటాలు పడుచున్నదియు ఫోక్సుటర్ ప్రభువు మహాసభయెదుట వెల్లడించెను. వారు కరపత్రములను అచ్చొత్తించి పార్లమెంటు మెంబర్లకేగాక, ప్రతికాఫీహోటలులోను, బజారులలోను, విరివిగ పంచిపెట్టసాగిరట ! ఇట్టి అసత్య ప్రచారముచే ప్రజల మనస్సులను విషపూరిత మొనర్చుట ఇంగ్లీషు నాయకులకు మొదటి నుండియు పరిపాటిగనేయున్నది. ఈ కేసునుగూర్చి ఫోక్సుటర్ ప్రభువు చెప్పిన మాటలు యెంతేని గమనింప దగియున్నవి :—

అయోధ్య చార్జీ విచారణ.

"వెల్లస్లీ ప్రభువునకును, నబాబుకును, మధ్యన్యాయము తీర్చవలసినపని యిప్పుడీ మహాసభవారికి కలిగినది. అయితే మహాసభవారిప్పుడొక గొప్పసంగతిని బాగాజ్ఞాపక ముంచుకొనవలెను. అదేదనగ, మీ యెదుట యిప్పుడు ఒక్కపార్టీయే యున్నాడు. రెండవపార్టీ లేదు. మీయెదుటనున్న యీ పార్టీ వెల్లస్లీ ప్రభువు. ఇతనికి యిప్పుడు అన్నివిధముల పరిస్థితులు వాటము వారీగనున్నవి. తన వాదములమీదనే యిప్పుడు కేసువిచారణ యగుచున్నది. దాఖలైన దస్తావేజులన్నీ అతని సొంతదస్తావేజులే. అక్కడయేమి జరిగినదియు అతనిప్పుడు స్వయముగజెప్పిన మాటలుతప్ప వేరే ఆధారములేమియు మహాసభవారియెదుటలేవు. ఇతడిప్పుడు మహాసభవారి యెదుటికి స్వయముగవచ్చి నిలువబడక పోయినను, యితనిపక్షమున వాదించుటకు యిక్కడ యెందరో అతనికి స్నేహితులు, బంధువులు వున్నారు. అతనికి మొగమాటస్థులు, అతనివల్ల అనేక ఉపకారములను లోగడ పొందియున్నవారు, స్నేహపాశములచేతను, రక్తసంబంధముచేతను, అతనికి బద్ధులైవున్నవారు యెందరో అతనికిప్పు డిక్కడనుండి అతనిపక్షముగ వాదించుచున్నారు. ఇకరెండవపార్టీయగు నబాబెట్లున్నాడో చూడుడు. అతనిపక్షమునగల కేవల న్యాయముచేతను, అతడుపడిన క్రూరబాధలచేతను, ప్రేరితులైన మెంబర్లుతప్ప, అతనికిక్కడదిక్కు ఇంకెవ్వరునులేరు. అతనికిక్కడరక్తసంబంధీకులగు చుట్ట పక్కములులేరు-మొగమాటస్థులులేరు. తనగోడు తాను స్వయముగ అతడిక్కడికి వచ్చి చెప్పుకొనుటకు అతనికి వీలులేదు. తనబుజువులను చూపుకొనుటకు అతనికి అవకాశములేదు. కాబట్టి, మహాసభవారు అతనియందు కొంచెము చనవుతో, ఉదారభావముతో చూచుట సమంజసము. అయితే, నబాబు తరఫు వకీలుగ వాదించు నేను నా పార్టీకి న్యాయముతప్ప యింకేమియు కోరుటలేదని మాత్రము మహాసభవారు గ్రహింపవలెను. న్యాయము—కేవలము అనాచ్ఛాదితమగు న్యాయము — కటికన్యాయము — యెదటి పార్టీయగు వెల్లస్లీ చెప్పిన మాటల యాధారముపైననే యేర్పడిన న్యాయము — నాకుచాలును. ఇంతకంటె నేనెక్కువ కోరుటలేదు. మహాసభవారు యేమాత్రము న్యాయబుద్ధితో వీక్షించినను నాకుచాలును. వెల్లస్లీ చెప్పినమాటలను బట్టియే అతనిప్రవర్తన

అత్యంత గర్హ్యమైనదని చెప్పి అప్పుడు మహాసభవారికి తప్పక తోచితీరును. పాపము; గురదృష్టవంతుడగు ఆనబాబుకును కొంతన్యాయము, నష్టపరిహారము, బాధానివారణ జరుగగల దనియు ఆశించుచున్నాను.''

ఎక్కడనో భూగోళమున కావలి ప్రక్కను ఆరువేల మైళ్లదూరములోతమకు సంబంధీకుడు కానట్టి - తమ శాఖవాడు కానట్టి - ఎవడో ఒకానొక కచ్ఛన్నకు యేదో అన్యాయము జరిగినదనిచెప్పి చప్పిడిమాటలు మహేంద్రవైభవముతో కొలువు తీర్చియున్న క్రైస్తవ మహా ప్రభువుల చెవులలో దూరునా? ఎంత వెర్రి మాట! నబాబు తన ఒండబడికను తు, చ, తప్పకుండ నెరవేర్చినాడనియు, వెల్లస్లీయే మోసముచేతను, దబాయింపులచేతను, దౌర్జన్యముచేతను, నబాబు మెడలు విరిచి అతని అర్ధ రాజ్యమును అక్రమముగ హరించినాడనియు న్యాయ బుద్ధిగల 'విభీషణాయలు' కొందరెంత మొత్తుకొన్న నేమిప్రయోజనము? ఈ లంకారాజ్య సభాసదుల కీ మాటలు రుచించునా?

అయోధ్య విషయమై వెల్లస్లీ చేసిన చర్యలనన్నిటిని ఖండించుచు, దురదృష్ట వంతుడగు నబాబుకు కొంత న్యాయమును, నష్టపరిహారమును యిప్పించవలసినదని కోరుచు, ఫౌక్సుటన్ ప్రభువు వరుసగ 12 తీర్మానములను పెట్టెను. ప్రతి తీర్మాన మును వెల్లస్లీ పార్టీవారు యెదిరించి, యేవో అప్రస్తుతమగు అడ్డదిడ్డపు సంగతులగొని వచ్చి, మిగతా మెంబర్ల నందరినికూడ మహా గందరగోళములో పడవేసిరి. ఈ సమయమున వెల్లస్లీ తమ్ములిరువురుకూడ పార్లమెంటులో మెంబర్లయిరి. వీరు మహా సభలో కూర్చుండి తమ యన్నగారి పక్షమున నెంతయో తంటాలుపడిరి. ఇట్టి వారు నిష్పాక్షికమగు న్యాయబుద్ధితో యెట్లు ప్రవర్తింపగలరు? వెల్లస్లీ పక్షముగ చేయబడిన మూడువాదములకును సర్ తామస్ టర్టన్ యిట్లు జబాబు చెప్పెను:—

[ఒకవాదనయేమి—హక్కు. రెండవవాదన అగత్యము: మూడవ వాదన—సీమగవర్న మెంటువారిచ్చన ఆజ్ఞ. మొదటివాదననుగూర్చి విచారించుదాము:—

ఇండియా గవర్నమెంటువారు యీదారుణకృత్యములు చేయవచ్చునను హక్కు— అయ్యో! వీరికెక్కడనుండి వచ్చినది? ఈహక్కు మనకు "కత్తిచేతవచ్చినదట. కత్తిచేతసంపా గించుకొన్నదానిని కత్తిచేతనే నిలువబెట్టుకొనవలెనట—యివి మనమెంబరుగారి మాటలు! జయించినవారిమాటయే శిలాక్షరమైనచో, యిక ఒడంబడికలతో నేమిపని? అనినే నడుగు చున్నాను. "నబాబు స్వతంత్రరాజుకాడు, ఆతనిని స్వతంత్రరాజుగా మనము యెంచుకుంటా మని అతడనుకొనుట పొరబాటు అని యింకొక మెంబరు చెప్పుచున్నాడు............

"కంపెనీవారు సర్వంసహా సార్వభౌములు; నబాబు వారికి గులాము; అతనిరాజ్యమును యావత్తు లాగికొనకుండ, సగముమాత్రము లాగికొన్నాము కాబట్టి, మనమతనియెడ యెంతో దాక్షిణ్యమునే చూపినామని యింకొక మెంబరనుచున్నాడు. ఇట్టివారలకు నేను లేచి జబాబు చెప్పుటకు నాకే-ఛీ-ఎంతో సిగ్గుగనున్నది. అసలివి వాదనలను పేరునకే తగవు...అయితే,

అయ్యా, నేనొకమాట అడుగుతాను. ఈనబాబు స్వతంత్రుడే కాడంటే,—యితనికి రాజ్యమే లేదు. పురమేలేదు, అంతఃపురమే లేదు, సైన్యమేలేదు, ప్రజలేలేరు అంటే, అసలు 1798-వ సంవత్సరపు ఒడంబడిక యెట్లు పుట్టినదండీ! అతనికి వీనియన్నిటిపైగల హక్కును నిర్వచించుచు—దానికి భంగము కలుగనీయమని చెప్పుచు-ఆ ఒడంబడికలో వ్రాయుటయెట్లు సంభవించినదండీ?—క్లుప్తము.]

నబాబు రాజ్యమును హరించుటకు కంపెనీవారికి యెట్టి హక్కుగాని లేధని చెప్పి యీ మెంబరు వెల్లస్లి పార్టీవారి మొదటి వాదన తుత్తునియలుగ ఖండించివేసెను. ఇక, "అగత్యమను" రెండవ వాదనను గూర్చి యీ మెంబ రిట్లు చెప్పెను:—

[ఇండియాలో మనరాజ్యమును విస్తరింపజేసికొనుట అవసరమని చెప్పేవాదన నాకెంత మాత్రమును నచ్చలేదు. అయినప్పటికి మనరాజ్యభద్రతకు అయోధ్యరాజ్యమును మన రాజ్యములో కలుపుకొనుట అగత్యమయ్యేయెడల ఆమాటేయేల బహిరంగముగ, మొగసిరిగ, చెప్పరాదు? లోలోన యీకృత్రిమపు తంత్రము లెందుకు? ఈటక్కరుమాట లెందుకు? చేసే కార్యము క్రూరకార్యమైనా మేము మా అవసరంకొద్దీ చేస్తున్నాము అనిఅంటే బాగుంటుంది గాని, దానిని మంచికార్యమనిచెప్పి యేల అసత్యవాదములచేసి, లోకమును మోసగించవలెను? చేసేపని క్రూరమగుటయేగాక, దానిని చేసినవిధానముకూడ బ్రిటిష్‌జాతిపేరునకు శీలమునకు మరింతకళంకము నాపాదించునదిగనున్నది"—క్లుప్తము.]

ఇక మూడవ వాదన యేమనగ:—

ఇది సీమ గవర్నమెంటువా రిచ్చిన ఆజ్ఞయట! ఈపని వెల్లస్లి తాను స్వతంత్రించి చేయలేదనియు, పై యధికారుల ఉత్తరువుల ప్రకారమే చేసెననియు, కాబట్టి, యిందు వెల్లస్లీ తప్పేమీా లేదనియు కలకత్తాలో యితని హయాములో ఛీపు జడ్జీగ నున్న సర్ జాన్ ఆన్స్ట్రూథర్ అను మెంబరు వాదింపజొచ్చెను. దీనికి మనమెంబరు (టర్టన్) చెప్పిన సమాధాన మేమనగ:

[ఈ వాదనను చేయుచున్నప్పుడు సదరుమెంబరుగారు తనచేతిలో పెద్దకాగితములకట్టను పట్టుకొనియుండిరి. తమవాదన కనుకూలముగ ఆకట్టనుండి యేదైనా ఒక చిన్నికాగితపు పీలికనైనను సదరు మెంబరుగారు మహాసభవారియెదుట పడవేయుదురేమో యని నేనెంతో ఆతురతతో కనిపెట్టుకొనియుంటిని, ఇట్టికాగితమేదైనావుంటే బహుశః నాకది పొరబాటున కంటబడలేదేమో. అట్టి పొరబాటును సవరించి, సదరు మెంబరుగారు నాకా కాగితపుముక్కను చూపిస్తే యెంతో సంతోషించి యుందును. రహస్యపు సంఘపువారుగాని, కంపెనీబోర్డువారుగాని, యీవిషయమై వెల్లస్లీకి చీమ తలకాయంత ఇషారాయైనను యిచ్చియుండిరని నాకు కించిత్తు దాఖలాచూపినట్టయితే నేను తృప్తిపడెడివాడను. ఇట్టి సందర్భములోకూడ ఒడంబడికను భంగపుచ్చుట న్యాయమేయని నే నొప్పుకొనకపోయినను, యిందులో వెల్లస్లీదిమాత్రము ఆట్టే తప్పులేదని నేననియుందును. అప్పుడు వెల్లస్లీ తన యజమానులు చేయమన్న దుర్మార్గకార్యములు చేయనని, ధైర్యముతో యెదిరించలేక లొంగిపోయినాడనియే యనియుందునుగాని

అతనియందు వేరేదోషారోపణ చేసెడివాడనుకాను. ఈవాదనచేసిన మెంబరుగారు తనచేతిలో అన్ని కాగితములు పెట్టుకొనికూడ వానిలో ఒక్క చిన్నముక్కనుకూడ మహాసభవారికి చూప లేదు—కనీసము, నబాబు యిచ్చుచున్న కప్పమును అతినియమములతో రాజ్యముగ మార్చ్పు చేయవలసినదనియైన అర్థమిచ్చు ఒక్కముక్కనుకూడ సదరుమెంబరుగారు కంపెనీ యజమా నుల హుకుములనుండి చదివి వినిపించలేదు. దాఖలుచేయలేదు. ఇక నబాబు అనుమతికి వ్యతి రేకముగనైనసరే చేయవలసినదనుమాట కలికమునకైన కానరాదని నేను వేరుగ చెప్పపనిలేదు. ఎంత పెడార్థముగవిరిచినను సరే యీ భావమును సూచించు ఒక్క చిన్నమాట మాత్రమును వారు తమచేతిలోనున్న పెద్ద కాగితపుకట్టనుండి చూపిస్తే యెంతో బాగుండెడిది.......... కప్పమును రాజ్యముగ దౌర్జన్యప్రయోగముచే మార్పుదల చేయవలసినదనిచెప్పి కంపెనీ యధ కారులు యెన్నడును, యేగవర్నర్ జనరల్ కుగాని, హుకుముల చేసియుండలేదని నేనుగట్టిగ వాదించుచున్నాను..............

అట్టి నిదర్శనమేదైనావుంటే, ఒక్కటి—ఒక్కటంటే ఒక్కటిచాలును—చూపిం చండి—అని నేను ఎదుటిపార్టీ మెంబరుగారిని యిదే సవాలు చేయుచున్నాను."— [క్లుప్తము.)]

కాబట్టి, బెంగాలులో ప్రధాన న్యాయమూర్తిగ కొన్నాళ్ళు వెలిగించిన యీ మెంబరుగారు— (సర్ జాన్ ఆన్స్ట్రూథర్ గారు) చెప్పినమాట శుద్ధ అబద్ధ మని బుజువైనది. అయిననేమి? వెల్లస్లీ పక్షమందు న్యాయము లేకున్నను, అతనిపక్షమున తలకాయలసంఖ్య హెచ్చుగ నుండెను. దురదృష్టవంతుడగు అయోధ్య నబాబుపక్షమువారు పెట్టిన తీర్మానము లన్నియు పార్లమెంటు మహాసభలో అధికసంఖ్యాకుల వోట్లచే ఓడిపోయెను. పైపెచ్చు యింకొక అక్రమముకూడ జరిగినది- "టర్టన్" చేసిన సవాలుకు జబాబుచెప్పుటకు ధైర్యములేని పిరికిపంద— బెంగాలు ప్రధాన న్యాయమూర్తి— తగుదునమ్మా యని అప్పుడు ముందుకువచ్చి "వెల్లస్లీ ఇండియాలో చేసిన మహా ఘనకార్యములకు అతనియెడ యీ పార్లమెంటు మహాసభవారు కృతజ్ఞతాపూర్వక వందనము లర్పించుచున్నారు" అనికూడ తీర్మానమును ఉపపాదించెను. ఈ తీర్మా నము నెగ్గెను!!! ఇందుపై వ్యాఖ్యాన మనవసరము.

చార్జీ కొట్టివేత.

దీర్ఘకాలము యీడిక్రింద పడిన అయోధ్య చార్జీ యీరీతిగ 1808 సం॥ మార్చి 15-వ తేదిన కొట్టివేయబడినది. వెల్లస్లి చేసిన దారుణచర్యలచే నష్టపడిన నబాబుకు కొంత నష్టపరిహారమైనా యిప్పింపవలయునని కొందరు మెంబర్లు మార్చి 31-వ తేదీన ప్రయత్నించిరి. కాని, అదియు విఫలమయ్యెను. తారన్టన్ అను మెంబ రిట్లు చెప్పెను:—

"మనజాతి గౌరవమున కింతటి ప్రాముఖ్యమైన యీ విషయము చర్చజరుగుచున్నప్పుడు చాలమంది మెంబర్లు తమకేమియు పట్టనట్టు సభకు రాకపోవుట నాకు చాల సంతాపకరముగ

నున్నది. వెల్లస్లీమీద వచ్చిన చార్జీని యెట్లో త్రోసివేయుటలో. మొన్నరాత్రి యీ పార్లమెంటు సభవారు అతనికంటె యెక్కువఘోరముగ ప్రవర్తించి యుండిరని నాయభిప్రాయము .........వెల్లస్లీ వ్యవహారము భల్లూకపుటాలింగనమును పోలియున్నది. వెల్లస్లీ భల్లూకము నబాబును కౌగలించుకొని ఎముకలు పెటపెట విరుగునట్లు నొక్కి చంపివేసెను. ఇట్లయినచో త్రోవనేపోవు బాటసారిపైబడి దోచుకొన్న బందిపోటుదొంగ చర్యకూడ "ఒడంబడిక" యను పేరిటనే చెల్లుబడికావలసి వచ్చును."

## ఫరూకాబాదు చార్జీ.

నబాబుచే దత్తమైన మండలములకు వెల్లస్లి తన తమ్ముడగు హెన్రీని లెఫ్టినెంటు గవర్నరుగ నియమించెను. కాని, యిందుకు కంపెనీ యజమానులు అంగీకరించనందున, అతని నక్కడనుండి తీసివేసి "ఫరూకాబాదు పరగణాకు" అధికారిగ నియమించెను. ఈ పరగణా చరిత్ర నిట కొంచెము క్లుప్తముగ చెప్ప వలసి యున్నది. ఈ పరగణా అయోధ్యరాజ్యములో నున్నది. దీనిని ఆఫగన్ వంశస్థులగు మహమ్మదీయ ప్రభువులు పాలించుచు, అయోధ్య నబాబుకు సామంతులుగ నుండిరి. ఈ పరగణాయొక్క రక్షణభారము అయోధ్యనబాబు వహించునట్లును, అందుకు ప్రతిఫలముగ ఫరూకాబాదు ప్రముఖులు యితనికి సాలుకు నాలుగు లక్షల రూపాయలు కప్పము కట్టునట్లును, కంపెనీవారు మధ్యవర్తిత్వము వహించి, పూచీపడి, యేర్పాటుచేసిరి. కాని, కంపెనీ యుద్యోగులు స్వలాభపరాయణులై యీ పరగణా తాలూకు ఆంతరంగిక వ్యవహారములలో అనవసరముగ జోక్యము కలిగించుకొన సాగిరి. అందుచే కారన్‌వాలీసు గవర్నర్ జనరల్‌గ నున్నప్పుడు, "ఫరూకాబాదునుండి ఇంగ్లీషు రెసిడెంటును తీసివేయునట్లును, యిక ముందెవరిని పంపకుండునట్లును" అతడు 1787 సం॥లో అయోధ్యనబాబుతో ఒడంబడిక చేసుకొనెను. కాని, యీ ఒడంబడికకు విరుద్ధముగ వెల్లస్లి 1801 సం॥ నవంబరు నెలలో యీ ఫరూకాబాదు పరగణాను దిగమ్రింగివేయవలెనని సంకల్పించుకొనెను. ఈ దురుద్దేశమును తన కౌన్సిలుమెంబర్లకుగాని, సీమలో యధికారులకుగాని తెలియపరచకుండ, తన తమ్ముడగు హెన్రీద్వారా మిక్కిలి క్రూరమును, అక్రమమును నగు మార్గములచే వెల్లస్లి నెరవేర్చుకొనెను. తాను చేసిన దుర్మార్గములు లోకమున కెరుకబడకుండ కప్పిపుచ్చుటకుగాను, వెల్లస్లి ఫరూకాబాదు నబాబుచేత బలాత్కరించి 1802 సం॥ జూన్ 4-వ తేదీన ఒక ఒడంబడిక కాగితముపై సంతకము పెట్టించుకొనెను. తన రాజ్యమును కంపెనీవారికి ధారాదత్తము చేసినట్లు యీ కాగితములో వ్రాయబడియున్నది. ఈ నబాబుకు అప్పుడే మైనారిటీ వదలి మెజారిటీవచ్చెను. ఈ కుర్రవాడు తనబంధువులయొక్కయు, మిత్రులయొక్కయు, మాటలనువిని యీ కాగితముపై సంతకము పెట్టడేమో అనే భయముచేత, "ఈ కుర్రవానిచేత యీ ఒడంబడికకు ఒప్పించినచో మీకు కావలసి

నన్ని బహుమతుల నిచ్చెదమనియు, ఒప్పించనిచో మిమ్ములను దేశమునుండి వెడల గొట్టించెదమనియు, యితని బంధుమిత్రుల నందరిని దబాయించవలసినదని" చెప్పి వెల్లస్లి తన తమ్ముడగు హెన్రీకి సలహా వ్రాసిపంపించెను. ఆత డాప్రకారమే చేసెను. ఈ రీతిగ కుర్రనబాబును అతని బంధుమిత్రులను దబాయించి, బలాత్కరించి, అక్రమముగ లాగుకొన్న యీ ఫరూకాబాదు పరగణాను వెల్లస్లి తన తమ్మునికి— హెన్రీకి— పట్టముగట్టెను.

నబాబు సీలును దొంగిలించి, ఫోర్జరీ చేయుట.

ఈ కుట్రనంతను పాల్ అను మెంబరు 1806 సం॥ ఏప్రిల్ 18-వ తేదీన పార్లమెంటు మహాసభలో కడిగి వదలిపెట్టెను. అతడు చెప్పినమాటలివి :—

"వెల్లస్లీ యాజ్ఞప్రకారము కరారునామాపై సంతకము చేయించుకొనుటకుగాను నబాబును లక్నోకు పిలిపించిరి. నబాబురాగానే, అక్కడ అతనియింట్లో అతనిసీలుకనుపించ లేదు. ఈ సీలు తరువాత లక్నోలో గవర్నమెంటుభవనములో కనిపించినట్లు నేనురుజువు చేసెదను.

ఈ పై వాక్యములనుబట్టి, కుర్రనబాబు యీ కరారునామాకు యెంత మాత్రము ఒప్పుకొనలేదనియు, అతడీ కరారునామాపై స్వంతముగ సంతకము చేయలేదనియు, కంపెనీ యధికారులే అతని దస్కతు మొహరుగల సీలును దొంగలించి, యీ కరారునామా పత్రముపై అతని దస్కతును ఫోర్జరీ చేసిరనియు తెలియుచున్నది.

వెల్లస్లీపై తేబడిన యీ ఫరూకాబాదు చార్జిని పార్లమెంటువారు పూర్తిగ విచారింపకపోవుట మన దురదృష్టము.

ఈ కేసు విచారణ పూర్తిగ జరిగియున్నచో, యిందింకెంత కుట్లుబయట పడెడిదో !



# బ్రిటిష్ మహాయుగము

## ఇరువదియవ అధ్యాయము.



### వెల్లస్లీ - ఆర్కాటు నవాబు.

### మహమ్మదాలీ ఓమ్ దుత్ ఉల్ ఉమ్రా ఎదురుతిరుగుట.

ఆర్కాటు నవాబుకును కంపెనీవారికినిగల సంబంధమును గూర్చియు, అతనికిగల అప్పుల భారమునుగూర్చియు లోగడ చెప్పియుంటిమి. కర్నాటక నవాబు అప్పులలో మునిగియున్నందున యిక అతని నుంచి నందువల్ల తమకేమియు గిట్టుబాటుకాదనితోచి, అతని రాజ్యమును కాస్తాదిగమింగివేస్తే పోతుందని వెల్లస్లీ తలంచెను.

వెల్లస్లీ దబాయింపు జాబు.

ఈ తలంపును మనస్సులో పెట్టుకొనియే టిప్పూపైకి దండయాత్ర వెడలిన కాలమందు వెల్లస్లి 1799 సం॥ ఏప్రిల్ 24-వ తేదీన మద్రాసునుండి సదరు నవాబుకొక పెద్ద ఉత్తరమును-14 అచ్చు పేజీల ఉత్తరమును-వ్రాసెను. అందలి సారాంశమిది :—

[1792 సం॥ లో మీపూర్వులు మాతో చేసుకొన్న ఒడంబడికలోని మూడవషరతు ప్రకారము, కర్నాటకములోగాని, తత్ప్రాంతములోగాని మాకేదైనా యుద్ధమువస్తే, ఆ యుద్ధము సక్రమముగ నడిపించుటకుగాను మేము మీకర్నాటకరాజ్యమును తాత్కాలికముగ ఆక్రమించుకొనునట్లును, ఆకాలములో సదరురాజ్యములో రివిన్యూ వగైరాలను మేమే వసూలుపరచి అందులో మీకు అయిదవవంతు భాగముపెట్టునట్లును యేర్పాటు జరిగియున్నది. ఇప్పుడట్టి యుద్ధము మాకు టిప్పూసుల్తానుతో వచ్చియున్నదిగాన, మేమిప్పుడు మీరాజ్యమును ఆక్రమించుకొనుట అవసరమని నేనిందుమూలముగ మీకు తెలియపరచుచున్నాను.

అదిగాక, మీరు మాకు మామూలుగ చెల్లించవలసిన కప్పమును చెల్లించుచున్నప్పటికి మీరు చాల అప్పులలో మునిగియున్నారు. మీరాజ్యములో చాలభాగము మీబాకీదార్లకు తాకట్టు పెట్టియున్నారు. వారాభాగములను మిక్కిలి చెడుగ పరిపాలించుచున్నారు. అందుచే అక్కడి ప్రజలు అవస్థపడుచున్నారు. ఇదేమియు బాగుండలేదు. ఇట్లేకొన్నాళ్లు జరిగినచో, మీరు మాకు కప్పము కట్టలేని స్థితికూడవస్తుంది. ఇందుకుగాను మీరు మాకు తాకట్టువుంచిన భూముల విలువయు—దానితోపాటు సదరుహామీయు—తగ్గిపోతుంది—కాబట్టి మీ రాజ్యమును యావత్తు గనుక మాకు యిచ్చివేసినచో మీయాస్తి యప్పులను యావత్తు మేమే చూచుకొందుము. మీకు యెట్టి ఋణబాధయునుండదు. రాజ్యపరిపాలనా

భారముగాని, తత్సంబంధమైన యితర చిక్కులుగాని, ఆందోళనగాని, మీకేమియునుండదు. మీరుహాయిగ మనోవర్తి పుచ్చుకొని, చీకుచింతలేకుండ, దర్జాగా కాలుమీద కాలువేసుకొని కాలక్షేపము చేయవచ్చును. రాజ్యపాలనా భారమంతయు మానెత్తినే వేసుకుంటాము—మీరు మహారాజులాగ వుండవచ్చును. ఈ చిక్కులన్నీ వదలించుకొనుటకు దైవము మీకిప్పుడు మంచి అవకాశ మిచ్చినాడు. ఈ అవకాశమును గనుక మీరు జారవిడుచుకొన్నారంటే, మీరు మహా అగాధములో పడిపోతారు. అందుండి మీరిక యీజన్మకు లేవలేరు.........(క్లుప్తము)]

నబాబు గంభీరలేఖ.

ఈ విధముగ వెల్లస్లీ ఆర్కాటు నబాబును బుజ్జగించియు, దబాయించియు, అతనినుండి రాజ్యమును ఊడబెరుకుకొన జూచెను. కాని, నబాబు (ఓమ్దుత్-ఉల్-ఉమ్రా) యీ దబాయింపులకు లొంగక, 1799 సం॥ మే 13-వ తేదీన వెల్లస్లికి గంభీరముగ జబాబు వ్రాసెను. అందలి సారాంశమిది.

"మీరు చెప్పినప్రకారము 1792 సం॥ ఒడంబడికను బట్టి, కొన్ని పరిస్థితులలో మీరు మారాజ్యమును తాత్కాలికముగ ఆక్రమించుకొన వచ్చునను మాట వాస్తవమే. అట్టి పరిస్థితులు దురదృష్టవశాత్తు ఏర్పడేయెడల, నాకుగలుగు యీ అవమానభారమును,—విధి నాకు ప్రతికూలుడై వచ్చినప్పుడు—నేను భరించక యేమి చేయగలను? దైవాజ్ఞను శిరసా వహించుటకు యీశ్వరుడు నాకు తగు మనోనిబ్బరము నివ్వగలడు. భయములేదు. కానివ్వండి!"—

"నేను అప్పులలో మునిగియుంటిననియు, మీకప్పమునకుగాను మేముమీకు హామీగా వుంచిన భూములను తిరిగి యితరులకు నేను తాకట్టు పెట్టితిననియు, నేను మీకప్పమును చెల్లించలేని దివాళాస్థితికి వచ్చితిననియు, మీరు తలంచుటకేమి హేతువులుగలవో నేనెరుగను. మీరట్లేల తలంచితిరో నేనూహింపజాల కున్నాను. నాపై లోకములో యిట్టి అక్రమప్రచారము జరుగుట కేవలము అన్యాయము. ఈ అక్రమప్రచారము నాపినగాని, నాకు గలుగు అపకారమునకు మితియుండదు. మీ కప్పమునకుగాను తాకట్టుపెట్టిన భూములలో ఒక్క అంగుళమునుకూడ నేను యెవరికిగాని నాబుద్ధికి తెలిసినంతవరకు తిరిగి తాకట్టు పెట్టలేదని నేనిదే ప్రమాణపూర్తిగ చెప్పుచున్నాను."

"ఇక పాతయొడంబడికను మార్చి నారాజ్యమును యావత్తు మీకుకట్టపెట్టు విషయము చాల క్లిష్టమైనది. మీరూ నేను ఎంతో ఘోరకార్యమునకు ఒడిగట్టినగాని, 1792 సం॥ నాటి ఒడంబడికను మార్పవీలుండదు. ఈ ఒడంబడికకు తానెంతో దుఃఖముతో ఒప్పుకొంటిననియు, యేమైనాసరే దీనినిక మార్చవద్దనియు, నాతండ్రి చచ్చిపోవునప్పుడు నాచేత తన చేతిలో చేయివేయించుకొని మరీ చచ్చిపోయెను. కాబట్టి, దీనినిప్పుడు మార్చవలసినదని మీరునన్ను కోరకుందురుగాక. ఈ మార్పు నీతికి, మతధర్మములకు, ప్రమాణవాక్యములకు విరుద్ధముగాన, ఆమాట నాచెవినిపడ నీయకండి."

"మీరు మైసూరురాజ్యమును జయించుకొన్నారని" విని నేనెంతో పరమానంద భరితుడనైతిని. మిత్రునకు అంతకంటె కావలసినదేమున్నది. అయితే యీ సందర్భమందు నాదొక మనవియున్నది. మీకీ జయము ఎట్లుకలిగినది? నేను సాలుకు 9 లక్షల వర

పాలిచ్చి పోషించుచున్న సేనవల్లగద గలిగినది. కాబట్టి, యీ విజయములో నాకుకూడ కొంత భాగము పెట్టుట న్యాయమేగద! కరూరు, సేలము, తుంగభద్రా మున్నగు ప్రాంతములు పూర్వముమావే. వానిని టిప్పూతండ్రి హైదరాలీ వెనుక మాదగ్గరనుండి అక్రమముగ లాగికొన్నాడు. కాబట్టి, వానినిప్పుడు మాకు తిరిగి యిప్పిస్తే నేనెంతో సంతోషిస్తాను. నేను మీ అనాది మిత్రుడనుగద! ఏదీచూద్దాము! నా సేనలవల్ల పొందినలాభములో నాకీ మాత్రము ప్రతిఫలము ముట్టజెప్పండి! ఇదేమహా ఉపకారంగా యెంచుకొంటాను.—క్లుప్తము.]

వెల్లస్లీ కి మెడ తిరుగని జబాబు.

వెల్లస్లి యెత్తిన అన్ని యంశములకు నబాబు చక్కని జబాబుల నిచ్చెను. మరియు, తుదకాతడు కోరినకోర్కెయు యెంతో సబబుగనున్నది. వెల్లస్లి యెట్లు కాదనగలడు? ఏమి జబాబిచ్చుటకును వెల్లస్లికి మెడతిరుగలేదు. కాబట్టి, అసలు జబాబివ్వకుండగనే ఝెగబెట్టినాడు!

సీమమంత్రి ఇషారా.

కర్నాటక రాజ్యమును మ్రింగవలయునని సీమ మంత్రివర్గము వారికి కూడ దుర్బుద్ధి పుట్టెను.

[కర్నాటకరాజ్యములో నబాబు అధికారము, కంపెనీ యధికారము—రెండు—వుండడము బాగుండలేదు. దీనివల్లప్రజలకు చాలానష్టకష్టములు వచ్చుచున్నవి. మన ఇంగ్లీషుప్రజల పేరున్ను మాసిపోవుచున్నది. ఇతరరాజధానులలో కంటె యీ రాజధానిలోనే మనవారికి యెక్కువ అపకీర్తివచ్చుచున్నది. కాబట్టి, యీద్వంద్వప్రభుత్వాన్ని తీసివేసి, సర్వాధికారములను మనము ఒక్కరమేవహిస్తే బాగుంటుంది............అయితే, యీపని చేయడానికి యిప్పుడున్న ఒడంబడికలనుబట్టి వీలులేదు. అయినను, మీరొక కన్నువేసి చూస్తూవుండండి. ఏమాత్రము అవకాశము దొరకినా, యీ పని నెరవేర్చడంకోసం పొంచివుండండి.—[క్లుప్తము.]

అని డండాస్ మంత్రి 1799 సం॥ మార్చి 21-వ తేదీన వెల్లస్లీకి వ్రాసెను.

ఇందుకు వెల్లస్లీవ్రాసిన జబాబు గమనింపదగియున్నది. అందలి సారాంశమునుమాత్రమిట క్లుప్తముగ వివరించెదను.

వెల్లస్లీ ఎత్తుగడ— "ఈనబాబు చస్తేగాని ........."

"కర్నాటకములోని ద్వంద్వప్రభుత్వము మీరు చెప్పినట్లు చాలచిక్కులతో కూడుకొన్నదే. దీనిని చక్కవరుపవలెనని నేనెంతో శాంతమార్గముల చేసిన ప్రయత్నములన్నియు వృథయైనవి. ఇప్పటి యీ నబాబు బ్రతికియుండగ వ్యవహారములేమియు చక్కబడవు. ఇతని చుట్టూ మనఇంగ్లీషుసౌరలేచేరి అతనిని చెడగొట్టుచున్నారు. అతని దుష్పరిపాలనవలన వారు బాగుపడుచున్నారు. అదిగాక, వర్తకసంఘమగు యీస్టిండియా కంపెనీకిని, మనచక్రవర్తిగారికిని చాలా తేడాయున్నదనియు, చక్రవర్తియే నిజమైనప్రభువుగాని, యీవర్తకపు గుంపుకాదనియు, మన దొరలీనబాబుకు బోధించి, కంపెనీయందును, వారియుద్యోగులయందును నిరసనభావమును పుట్టించుచున్నారు. ఇందుకుతోడు

మన చక్రవర్తిగారును యువరాజుగారునుకూడ నబాబుకు స్వయముగ ఉత్తరములబంపుచు, కంపెనీయధికారుల ప్రమేయములేకుండ చేసినందువల్ల నబాబుకు గర్వమెక్కువయ్యె, మాబోటి కంపెనీయధికారుల నతడు తృణీకారభావముతో చూచుచున్నాడు. తమ యుత్తరములవల్ల యిట్టియనర్థము వాటిల్లునని మన చక్రవర్తిగారుగాని, యువరాజుగారుగాని, బహుశః తలంచి యుండరు. కాబట్టి, యీసంగతిని మీరు శ్రీవారికి మనవిచేసి, వారు కర్నాటకనబాబుతో స్వయముగ ఉత్తరప్రత్యుత్తరములు జరుపుపద్ధతి రాచకీయదృష్ట్యా చాల అనర్థకములకు కారణ మయ్యెనని తెలియజెప్పకోరెదను.—[క్లుప్తము.]

ఈ రీతిగ ఇంగ్లీషుచక్రవర్తితోడి సరాసరి సంబంధమును త్రెంచివేసి, నబాబును తమ కాలిక్రిందికి తెచ్చుకొనవలెనని ఇండియాలోని కంపెనీ నౌకర్లు తలంచుచుండిరి. కాని, నబాబు అంత తేలికగ వీరి టక్కరు యెత్తులలో పడువాడుగ గాన్పించలేదు. అందుచేత, యితడు చచ్చువరకు ఓపించియుండి, తరువాత జబర్దస్తీ చేయుదమని వీరు లోలోన స్కీముల వేయుచుండిరి. యీ స్కీమును గూర్చి వెల్లస్లీ పై యుత్తరములలోనే వ్రాసెను. దాని సారాంశమిది:—

[కర్నాటకరాజ్యముపై సర్వం సహాధికారమును మనము వ్రాయించి పుచ్చుకుంటేనే గాని, వ్యవహారము చక్కబడదు. ఈ నబాబు చచ్చిపోయినతరువాతగాని యీపని సాగదు. ఇతనితరువాత నబాబుగ వచ్చేవానివల్ల మన మీట్టీకాగితమును సులభముగ వ్రాయించి పుచ్చుకో వచ్చును. అయైనా నబాబనేవాని నొకనిని మనము పేరునకైనా వుంచాలని అనుకుంటేను— లేకపోతే,—అసలు నబాబే అక్కరలేదు!-అంతా మనమే కాజేద్దామనుకుంటే మరీమంచిది. అది వేరేవిషయము. ఈ నబాబుకొడుకు పడుచుకుర్రవాడు. మద్రాసులో "చీపాకు"లో కాపురమున్నాడు...... ..ఇతడుగాక, నబాబుకు "మేము వారసులమని" బయలుదేరబోవు వారు చాలమంది వున్నారు.

ఈ నబాబు చావగానే, వారసత్వపు తగాదాలు తప్పకవస్తవి. అప్పుడు మనపని వాట ముగ వుంటుంది. నాఅభిప్రాయమేమంటే, చీపాకులోవున్న యీకుర్రవానిని సింహాసనముపై కూర్చుండబెట్టి, మన మతనివల్ల మనకు కావలసిన కాగితము వ్రాయించి పుచ్చుకుంటే బాగుం టుంది. అయితే, యింతకంటె వాటమైనపద్ధతి యింకొకటివున్నది. అదేమనగ, యీనామ మాత్రపు నబాబుగిరికూడ ఇతని కెందుకుండవలెను. దానిని మన మేవహించి, నబాబువంశమువారి కందరికి యింత మనోవర్తి పారవేస్తే చాలదా? ఈయెత్తు యెట్లావుంటుందో మీరు కొంచెము ఆలోచించి చూడండి.—క్లుప్తము.]

కంపెనీ నౌకర్ల దురుద్దేశము వెల్లడియైనది. అయితే, యీ యుద్దేశమును నెరవేర్చుకొనుటకు— లోకముకండ్లలో దుమ్ముకొట్టుటకు— యేదో మిష దొరకవలెనుగద. తలుచుకుంటే మిషలకు లోపమా? ఈ నబాబును, యితని తండ్రి మహమ్మదాలీయు టిప్పూతోచేరి యింగ్లీషు వారికి వ్యతిరేకముగ కుట్రపన్నుచుండిరను మిష నొకదానిని వెల్లస్లీ సృష్టించెను.

మిషల వెదకుట.

ఈ కుట్రవ్యవహారము కేవలము అసత్యమని పెక్కుమంది ఆంగ్లేయ ప్రముఖులే స్పష్టముగ ఋజువుపరచి యుండిరి. అందు "మేజర్ ఇవాన్సుబెల్" అను నతని గ్రంథము 107-108 పేజీలోని సారాంశము నిట క్లుప్తముగ చెప్పెదము.

[ఇంగ్లీషువారికి ప్రాణమిత్రుడగు మహమ్మదాలీ యాభైయేండ్లు యెడతెగకుండ ఇంగ్లీషు వారితో కలిసి మెలిసియుండి-ముప్పది సంవత్సరములు యెడతెగకుండ హైదరాలీ టిప్పూలతో బద్ధవైరము వహించియుండి--సదరు మైసూరు ప్రభువులచేత అనేక అవమానములు బాధలు పడియుండి—అతడు ఒకానొకనాడు ఆకస్మికముగ పోయి వారిలో చేరెనని లోకమును నమ్మమంటే అదియెట్లునమ్మును ? అదిగాక, తన యాభైయేండ్ల మిత్రులగు ఇంగ్లీషువారిరేఖ పైకెక్కివచ్చి తన శత్రువులగు మైసూరువారిరేఖ కిందపడిపోయి—టిప్పూ తాను యుద్ధములో ఓడిపోయి అర్ధరాజ్యమును, 3 కోట్లధనమును ఇంగ్లీషువారికి సమర్పించుకొని, తనముద్దు కొడుకు కుర్రల నిద్దరిని వారికితాకట్టుపెట్టి దేవుడాయని అఘోరించుచున్న సమయములోనా-1792 సం॥లోనా-యీమహమ్మదాలీ సదరు టిప్పూతోచేరినది ? ఈమాట యేమాత్రమైన నమ్మశక్యముగనున్నదా ? తాకట్టుపెట్టబడిన కుర్రవాళ్లకు తోడగుడ్డగ పంపబడిన యిద్దరు టిప్పూ నౌకర్లతోనట యీ మహమ్మదాలీ కుట్రపన్నినది ! ఈ కథయంతయు కేవలము కట్టు కథగనున్నది. దీనికేమైన విశ్వాసార్హమగు నిదర్శనములు చూపియుంటే దీనిని మేమునమ్మి యుందుము. కాని, అట్టివేవియు గాన్పింపవు. వారు నిదర్శనములని చూపినకాగితములు సత్యమైనవని ఒప్పుకొన్నను, అందేమియు యీ కథకు ఆధారములులేవు. మరియు, వీనినొక కారణముగచెప్పి, రాజ్యమును ఊడలాగుకొన దగినంత గాఢమైనవిగ అవి అంతకుమునుపే లేవు. ఈ కాగితముల నన్నిటిని వెల్లస్లీ చెత్తకాగితముల బుట్టలో యేల పడవేయలేదాయని మాకాశ్చర్యము గలుగుచున్నది" క్లుప్తము.]

కర్నాటక నబాబులు టిప్పూతో చేరి ఇంగ్లీషువారిపై కుట్రపన్నుచుండిరను అపవాదమును తుత్తునియలుగ ఖండించినవాడు మిల్లు చరిత్రకారుడు. ఇతడు వ్రాసినట్లు యింకెవరును వ్రాయలేదు. దీనినిగూర్చి వివరములు తెలిసికొన గోరు వారు అతని చరిత్ర 6-వ సంపుటములో 217 పేజీనుండి 244 పేజీవరకు పఠింప నగును.

నబాబు 'ఓమ్ దుత్ ఉల్ ఉమ్రా' బ్రతికివున్నంతకాలము ఇంగ్లీషువారి మంత్రము పారలేదు. అతడు చనిపోగానే, కంపెనీ యుద్యోగస్తులు చంకలు కొట్టుకొని, సంతోషించిరి. అతని తరువాత ఎవనినో ఒక కుర్రవానిని తీసికొనివచ్చి వానిని దబాయించి, వానిచేత తమకు కావలసిన కాగితముల నన్నిటిని వ్రాయించుకొనిరి. కర్నాటక రాజ్యముపై సమస్త సివిల్ మిలిటరీ యధికారములను అతడు కంపెనీవారికి ధారాదత్తము చేసివైచెను. నబాబుకు మనోవర్తియే గతియయ్యెను.

నబాబు చచ్చిన తరువాత.

అయితే, యీపని నబాబుచుట్టుచేరి యింతకాలమునుండి అతని రక్తము త్రాగుచున్న తెల్ల జలగలకు గిట్టకుండెను. వారొక పెద్దమంద యుండిరి. వీరందరికి యిప్పుడు జీవనోపాధిపోయినది. అందుచే వీరందరుచేరి, యీ కర్నాటక రాజ్యాపహరణనుగూర్చి పార్లమెంటులో మహా గందరగోళము చేసిరి. 1808 సం॥ మే 17-వ తేదీన సర్ తామస్ టర్టన్ అను మెంబరు పార్లమెంటులో చేసిన మహోపన్యాసములో యీ కర్నాటక రాజ్యాపహరణలో జరిగిన దారుణమంతయు బయట పడెను. అందలి సారాంశము నిట క్లుప్తముగ వివరించెదము.

చీపాక్ మందిరం ముట్టడి.

[1801 సం॥ జూలై 5-వ తేదీన, నబాబు ఉమ్దత్ ఉల్ ఉమ్రా చనిపోవనున్న సమయమున, అల్లరి జరుగకుండ చూచుటకను మిషతో కర్నల్ నీల్ కొంత సైన్యమును వెంటబెట్టుకొని నబాబు కాపురమున్న చీపాకుమందిరముపై పుకు పోయెను. నబాబుకు అంతకు పూర్వము ఎనిమిది రోజులనుండి జబ్బుగనుండెను. సేనను మందిరములోపల ప్రవేశపెట్టి మమ్ములను ప్రజలయెదుట చులకనచేయవద్దని అతడుకోరగా, నీల్ ఆప్రకారమేచేసెను. కాని, శిపాయిఘాటును మాత్రము మందిరము చుట్టు నిలువబెట్టియే యుంచెను. ఈప్రకారము 5 మొదలు 15-వ తేదీవరకు ఇంగ్లీషు సేనలు చీపాకుమందిరమును చుట్టుముట్టియుండెను. 15-వ తేదీన నబాబు చనిపోయెను. అప్పటికి అతనికి కంపెనీవారికి తగాదాలేమియు లేవు.........కాని, అతడు చనిపోగానే, ఆరోజుననే, ఆమందిరములో వేరొకగదియందున్న అతనికొడుకును-అలీహుస్సేనును-కంపెనీనౌకర్లు బయటికీడ్చుకొనివచ్చి— "ఇదిగో, చూడు; నీతండ్రి, తాత, మాకు వ్యతిరేకముగ టిప్పూసుల్తానుతోచేరి కుట్రపన్నినారు. ఈ సంగతి నీకేమీ తెలియకపోయినా దానిఫలితమును నీవనుభవించక తప్పదు. నీవిప్పుడు మామాటప్రకారము నడుచుకొన్నావా నీకీరాజ్యం దక్కుతుంది; లేకపోతే నిన్ను తీసిపారవేసి యింకొకణ్ణి తక్తుమీద కూర్చుండబెట్టుతాము. నీకర్మము, నీవు నెత్తినగుడ్డవేసుకుని వీథులలో తిరుగవలసినదే! నిన్ను మాశత్రువుగ భావించుతాము; ఏమంటావు?" అని దబాయించిరి..........ఈ కుర్రవానిని బెదరించుటకుగాను చుట్టూ విచ్చుకత్తుల పారాతో సిపాయిలు అటునిటు పచార్లుచేయుచుండిరి......... పై యధికారులు తన కింకను న్యాయము కలుగచేయుదురనియే పాప మీకుర్రవాడు ఆశపడుచుండెను. కాని, ఆఖరుకు అతనిని తీసిపారవేసి రాజ్యమును యింకొకనికిచ్చినట్లు గవర్నర్ జనరలునుండి వచ్చిన హుకుమునే అతనికి చూపించిరి................ఇతనిని తీసివేసినను, యితని తరువాత వారసునకు రాజ్యమివ్వలేదు. ఎవరు తమకనుకూలమైన కాగితముప్రాసి యిస్తారాయని వెదకివెదకి చిట్టచివరకు రెండు మూడు తరముల దూరమందున్న "అజిమ్-ఉల్-దౌలా" యనువానితో కంపెనీవారు బేరము కుదుర్చుకొనిరి. ఇతడాసమయమున యెక్కడనో చెరసాలలో ఖైదీగనుండెను.

ఇతనిని బయటికి తీసికొనివచ్చినప్పుడు—"ఎందుకు చెప్పమా, వీరు నన్ను బయటికి పిలుచుచున్నారు- కొంపదీసి నన్ను చంపడానికి కాదుగదా"యని యితడు హడలిపోయెను." క్లుప్తము)]

కంపెనీవారు కోరిన షరతులకన్నిటికి యితడు ఒప్పుకొనెను. అందుచే వార తనిని 1801 సం॥ జులై 28-వ తేదీన తక్తుపై నెక్కించిరి. పూర్వపు నబాబు కొడుకు ఆలీహుస్సేనును, అతని తల్లిని, కూడ తమ పూర్వాశ్రితమగు చీపాకు మందిరములోనే ఖైదుచేసియుంచిరి. ఈ మందిరములోనే కొత్త నబాబుగారును కాపురముండెరి. "ఇది చాల ప్రమాదకరము, మమ్ము నెక్కడికైనా యింకొక చోటికి పంపించండి, యీ కొత్త నబాబు మమ్ములను చంపించివేస్తాడేమో" యని పాపము తల్లి, కొడుకులు, యెంత మొత్తుకొన్నను కంపెనీ యధికారులు వినరైరి. తుదకు అనుకున్నట్లే జరిగినది. పాత నబాబు కొడుకు ఆలీ హుస్సేను కొలది రోజులకే జిగట విరేచనములచే చచ్చెను. విషప్రయోగమువల్ల యీ రోగము, యీ చావు గలిగెనని అనుమానింపదగియున్నది.

కొత్త నబాబు-పాత నబాబుకొడుకు మారణం.

ఇందు ఇంగ్లీషు ఉద్యోగస్తుల పరీకుకుండ వున్నట్లు 'సర్ తామస్ టర్టన్' అను మెంబరు తన యనుమానమును పార్లమెంటు మహాసభలో వెల్లడించెను. కాని, ఏమిప్రయోజనము? పార్లమెంటు మహాసభయం దాసీనులైయున్న బ్రిటిష్ ప్రజాప్రతినిధులు తమజాతి గౌరవమున కిట్లు కళంకము తెచ్చుచున్న యీ దుష్క్రియల నాపుటకు కించిత్తయినను ప్రయత్నింపరైరి. తమకు రాజ్యము వచ్చుచున్నదనే సంబరపడ జొచ్చిరి కాని, తమపేరు బూడిదలో బ్రుంగి పోవుచున్నదని వారు గుర్తింపరైరి. తమ జయస్తంభములపైని వ్రాతలను భవిష్యత్సంతతివారు 'తమ యపకీర్తి కజ్జలము వెట్టి పఠింతుర'ని వారుతలపరైరి. కొడుకు దొంగతనముగ పరులసొత్తు హరించుకొని వస్తే సంబరముతో దానిని యింటవేసుకొన్న తెలివి తక్కువ తల్లివలె పార్లమెంటువారు ప్రవర్తించిరి. సర్ శామ్యూల్ రోమిల్లీ మున్నగు మెంబర్లెంత మొత్తుకొన్నను ప్రయోజనములేకపోయెను. తమ ఆంగ్లజాతికి కళంకము రాకుండ చూచుకొనవలసిన బాధ్యతగల మంత్రులే యిట్టి చర్యలయందలి గుణదోషముల విమర్శించుటకు పూనుకొనక, ఊరక గ్రుడ్డిెద్దు చేల బడినట్లు మెజారిటీ మెంబర్లు యెటు చేతులెత్తితే, తాము అటే చేతులెత్తసాగిరి. అంతేగాని, యింపు విషయమై తమ యభిప్రాయములేమియో, తాముటు వోటిచ్చుటకుగల కారణములేమియో వారు నోరెత్తి ఒక్కమాటనైనను పలుకరైరి. రాజ్యంవచ్చినదే చాలునుగదా యని వారు మెదలకుండ యింట్లో వేసుకొని యూరకొనిరి. సర్ శామ్యూల్ రోమిల్లీ మున్నగు మెంబర్లు చెప్పిన నీతులన్నియు పెద్దపులిముందు చెప్పిన నీతు

"తిలాపాపం తలా పిడికెడు."

లయ్యెను. ఇండియాలో ఎవరి యిష్టమువచ్చినట్లు వారు దోచుకోవచ్చునని పార్లమెంటువారు అందరికి సర్వముక్త్యార్ నామా పట్టా యిచ్చినట్లయ్యెను.

"ఇండియా ప్రజలకేమియు హక్కులులేవు; మనకు విధులూలేవు; అంతా మన మెజారిటీ తీర్మానంప్రకారమే జరుగవలెను. అని యన్నట్లున్నది పార్లమెంటు ప్రవర్తన." ఇవి విండ్‌హామ్ అను మెంబరు చెప్పినమాటలు. పార్లమెంటు మెజారిటీవారు వెల్లస్లీ కర్నాటకములో గావించిన దురంతక్రియలను ఖండించుటకు బదులు పైపెచ్చు వానికి తమ యామోదమును దెలిపిరి!

అనగ, "తిలాపాపము, తలాపిడికెడు" అన్నట్లు తమ యేజెంటు ఒడిగట్టి సంపాదించుకువచ్చిన పాపఫలమునంతను ఆంగ్లదేశీయులందరు పార్లమెంటు ముఖద్వారమున పంచుకొని తినిరన్నమాట!



# బ్రిటిష్ మహాయుగము

## ఇరువదిఒకటవ అధ్యాయము.



### తంజావూరు రాజ్యాపహరణము.

తంజావూరు దక్షిణ భారతమందుండిన ఒకానొక మహారాష్ట్ర రాజ్యము. ఇది 17-వ శతాబ్దిమధ్యకాలమునుండియు నుండెను. శివాజీ తండ్రి సాజీయును, అతని సాపత్నీసోదరుడు వెంకోజీయు కలిసి యీరాజ్యమును స్థాపించిరి. ఈ రాజ్యము తదుపరి ప్రబలిన మహారాష్ట్ర రాష్ట్రకూటమునందు చేరక కేటాయింపుగ నుండుటచే యిది దుర్బలమై తుదకు అదృశ్యమయ్యెను. వెంకోజీ 1675 సం॥ లో యీ రాజ్యమునకు తంజావూరు నగరమును రాజధానిగ చేసుకొని, 1687 వరకు-అనగ 12 సంవత్సరములు రాజ్య మేలెను. 1676 సం॥ లో శివాజీ యీ రాజ్యముపై దండెత్తి దానిని స్వాధీనపరుచుకొనగోరెను, కాని వెంకోజీ ప్రాథేయపడినందున అతని రాజ్యమును అతనికి తిరిగి యిచ్చివేసెను. వెంకోజీ యీ రాజ్యమును తన జీవితాంతమువరకు పాలించుకొని 1687 సం॥ లో చనిపోయెను. ఈ రాజ్యమును తన రాష్ట్రకూటములో చేర్చుకొనక శివాజీ దానినిట్లు విడిగ వదలివేయుట పొరబాటనియు, అందుచేతనే యీ తంజావూరు రాజ్యము అనేక కష్టముల పాల్గావలసి వచ్చెననియు రెనడేగారు చెప్పుచున్నారు.

పూర్వ చరిత్ర.

1687 మొదలు 1742 వఱకు-అనగ 55 సం॥ ములు ఈ రాజ్యము నిష్కంటకముగ పరిపాలింపబడెను. 1742 సం॥ లో యీ రాజ్యములో గృహకల్లోలము బయలుదేరెను. ప్రతాపసింగు అనునతడు అప్పుడు రాజుగనున్న సాహూజీని రాజ్యమునుండి వెడలగొట్టి తాను సింహాసనమెక్కెను. ఈ రీతిగ రాజ్యభ్రష్టుడైన సాహూజీ యేడేండ్ల యనంతరము తిరిగి సింహాసనము నాక్రమింపవలయునను కోరికతో ఇంగ్లీషువారి సహాయ మపేక్షించెను. ఇదే తంజావూరు రాజ్య వినాశమునకు మూలకారణమయ్యెను. ఈ సందర్భమును గూర్చి టారెన్సు, అను పార్లమెంటు మెంబరు తన "Empire in Asia" అను గ్రంథములో యిట్లని వ్రాసెను.

గృహకల్లోలం-ఇంగ్లీషు వారి జోక్యం.

మొట్టమొదట తూర్పుతీరమున ఇంగ్లీషువారితో నేస్తముగట్టినది. తంజావూరు మహారాజు, 1742 సం॥లో తంజావూరు రాజవంశమునందు కలహము గలిగెను. అదివరకున్న 'సాహూ'ను తొలగించి ప్రతాపసింహుడు సింహాసనము నాక్రమించుకొనెను. ఈ వ్యవహారములో మదరా

సులోనున్న కుంపిణీవారికి సంబంధమేమియు లేనందున వారీ క్రొత్తరాజునే సంతోషముతో నంగీకరించిరి. ఈప్రకారము యేడేండ్లు మైత్రితో ఉభయులకును

**దేవకోట ప్రథమ కబళం.**

వ్యవహారములు నడిచెను. అప్పుడు, రాజ్యభ్రష్టుడైన 'సాహుజీ' ఇంగ్లీషువారి నాశ్రయించి తంజావూరునందు విప్లవము గలిగించుటకై సహాయముగోరెను. దీనికి ప్రతిఫలముగ దేవకోట జాగీరును, అందలికోటను ఆంగ్లేయులకిచ్చి, యుద్ధపు ఖర్చులన్నియు తానే భరించుకొనెదనని సాహుజీ చెప్పెను. ఇందులకు కుంపిణీవా రంగీకరించిరి. ప్రతాపు డింతవరకు మిత్రుడే! ఫ్రెంచివారితో కలహించినప్పుడు మొన్న మొన్ననే ఆతని సహాయమును కంపెనీవారు పొందియుండిరి కూడాను. అట్టి మిత్రునిపై దండెత్తుటకు ఇంగ్లీషువారి కెట్టి కారణమునుగనబడదు. అయినను, అట్టి "మిత్రుని" సింహాసనమునుండి కూలద్రోయుటకు కుంపిణీవారు దండునడిపిరి! ఈదండు ఓడిపోయెను. అంతటితో సాహుజీను సింహాసనమెక్కించుపని ఇంగ్లీషువారి దృష్టినుండిపోయి, వారికన్ను దేవకోట జాగీరుపైపడెను. అందుచే, ఈపనికై రెండవ దండయాత్రబయల్వెడలెను. కుంపిణీ వారు దేవకోటను ముట్టడించి స్వాధీనపరచుకొనిరి. ఇదికాగానే, ఇంగ్లీషువారు తిరిగి ప్రతాప సింగుతో రాజీచేసుకొనిరి! ఏమని? ఇకముందు కలహములన్నియు మానివేయునట్లును, ఇదివరకు తాము సహాయపడుచున్నట్లు నటించిన సాహుజీను వదలివేయునట్లును, సాహుజీను చంపకుండ ఆతనికి కొంత మనోవర్తి యిచ్చునట్లును, యిందుకు ప్రతిఫలముగ ప్రతాపసింహుడు కుంపిణీవారికి దేవకోటరాజ్యమును, కోటనుపూర్తిగ యిచ్చివేయునట్లును ఒడంబడిక చేసుకొనిరి. భారతరాజ్యమును దిగమ్రింగుట కిదియే ప్రథమ కబళము."

తంజావూరు రాజులు చాల సరళప్రవర్తన గలవారనియు, ఇంగ్లీషువారీ దేశమునకువచ్చి యిక్కడ వర్తకము వగైరాలు చేసుకొన గోరినప్పుడు వారిని యెంతో ఆదరించి వారికి నిలువ నీడనిచ్చిరనియు, ఇంగ్లీషువారు మంచినమ్మకస్తులను భావముతో వీరు తమ రాజ్య వ్యవహారములనన్నిటిని ఇంగ్లీషువారికి అప్పగించిరనియు, విలియం హాకీమను ఆంగ్లచరిత్రకారుడు వ్రాయుచున్నాడు. రెనడీగారు యిట్లు వ్రాయుచున్నారు:—

[కర్నాటక యుద్ధములన్నిటిలోను తంజావూరుసేనలు, "మంకోజీ" నాయకుని యాధిపత్యమున పరాసువారికి వ్యతిరేకముగ యెల్లప్పుడు ఇంగ్లీషువారిపక్షముననే నిలిచి పోరాడుచుండెను.

**కర్నాటక నబాబు దాడి-కంపెనీ మద్దతు.**

తంజావూరు రాజులు మొదటినుండియు ఇంగ్లీషువారికి యింత సహాయము చేయుచుండినప్పటికి ఇంగ్లీషువారి మిత్రుడగు కర్నాటక నబాబు (మహమ్మదాలీ) భాగ్యవంతమని ప్రసిద్ధికెక్కిన యీ తంజావూరు రాజ్యమును కాజేయవలెనని దానిపై ఒకకన్ను వేసియే యుండెను.

ఆఖరుకు 1762 సం॥ లో ఇంగ్లీషువారిమధ్యవర్తిత్వమువల్ల యిరువురకు ఒడంబడిక జరిగెను. తంజావూరురాజు కర్నాటక నబాబుకు సామంతుడుగనుండి అతనికి సాలుకు నాలుగు లక్షలరూపాయిలు కప్పము చెల్లించునట్లును, నబాబు తంజావూరు రాజ్యం పై కెక రాకుండ

ఇంగ్లీషువారు హామీపడునట్లును యీ ఒడంబడికవల్ల యేర్పాటు జరిగినది. కాని దరిమిలా 1771 సం॥లో కర్ణాటకనబాబు యింగ్లీషువారి మద్దతుచేతనే ప్రతాపసింగు కొడుకగు 'తుల్సాజీ' పై దండెత్తెను. తుల్సాజీవిధిలేక యెక్కువ సొమ్మియిచ్చి మరల సమాధాన పడవలసివచ్చెను. ఇందువల్ల తంజావూరు రాజ్యము చాల క్షీణదశకువచ్చెను. ద్రవ్యమంతయు నష్టమైపోయెను. ఈసంధిలో యింగ్లీషువారు తంజావూరు రాజ్యమును తమ మిత్రుడగు మహమ్మదాలీయొక్కయు, మహమ్మదాలీకి అప్పులుపెట్టిన ఇంగ్లీషుదొరలయొక్కయు దురాశకు బలియిచ్చిరి. మహమ్మదాలీ ఋణదాతలే ఆనాడు మద్రాసుప్రభుత్వమును నడిపించుచుండిరని చెప్పవగును.

"నబాబు నీ రాజ్యంమీదికి రాకుండ మేము కాపాడుతామని" చెప్పి 1762 సం॥ పు టొడంబడికలో ఇంగ్లీషువారు తంజావూరురాజులకిచ్చిన వాగ్దానమును వారిప్పుడు యెగరగొట్టి వేసిరి. మరల 1773 సం॥లో కర్నాటకనబాబు ఇంగ్లీషువారి సహాయముపుచ్చుకొని తంజావూరు రాజ్యముపైపడి అనేకసార్లు కొల్లగొట్టెను. రాజును చెరబెట్టి, తంజావూరునగరమును స్వాధీన పరచుకొని, యావత్తురాజ్యమును తనరాజ్యములో కలుపుకొనెను. ఈ దుండగములు, యీ విశ్వాస ఘాతుక కార్యములు—అన్నిటినికూడ—ఇంగ్లీషువారు తమసొంత జబాబుదారీమీదనే, నబాబు ఋణదాతలగు ఇంగ్లీషుదొరల లాభమునిమిత్తమే—చేయించిరి.—(క్లుప్తము)]

కాని, తిరిగి 1787 సం॥లో తుల్సాజీ మరణానంతరము, అతని సవతి తమ్ముడగు రాజా అమరసింగును మద్రాస్ గవర్నర్ అగు సర్ ఆర్చిబాల్డు క్యాంపుబెల్ తంజావూరు సింహాసనముపై కూర్చుండబెట్టెను. ఈ రాజ్య సంరక్షణకుగాను అమర సింగు ఇంగ్లీషువారికి యేటేటా చాలసొమ్ము యిచ్చునట్లును అప్పుడు ఒడంబడిక జరిగెను. మరల 1793 సం॥ లో ఇంగ్లీషువారే కప్పమును మరింత హెచ్చించిరి.

సర్ఫోజీ, అమర సింగులకు పోటీ.

తుల్సాజీ తాను చనిపోవుటకు కొలది కాలముముందు సర్ఫోజీ యను కుర్ర వానిని దత్తతచేసుకొనెను. కాని, యీ దత్తత హిందూలా ప్రకారము సరిగజరుగ నందున చెల్లనేరదనిచెప్పి ఇంగ్లీషువారు యీ కుర్రవానిని త్రోసివేసి, అమరసింగునే సింహాసన మెక్కించియుండిరి. అయితే, యీ కుర్రవానికి (సర్ఫోజీకి) విద్యాబుద్ధులు గరుపుటకుగాను ఇంగ్లీషువారితనిని "స్వార్ట్సు" అను ఒకానొక క్రైస్తవ పాదిరీ వశమునునుంచిరి. ఈ పాదిరీ క్రమముగ అనేక కుట్రలనుపన్ని యీ కుర్రవాని నెత్తైన సింహాసన మెక్కించవలెనని ప్రయత్నించుచుండెను. అమరసింగు యీ కుర్రవానిని అతని తల్లిని చాలహింసించు చుండెనని యీ పాదరీ వట్టిపుకారులు పుట్టించి, మద్రాసు గవర్నమెంటువారికి రిపోర్టుచేసెను. అంతట, మద్రాస్ గవర్నమెంటువారే కుర్రవానిని తంజావూరునుండి తీసుకొనివచ్చి మద్రాసులో మకాము పెట్టించిరి. తంజావూరు రాజులనుండి యింకా యెక్కువ డబ్బు గుంజుకుందామను దురాశచేత మద్రాస్ కంపెనీవారు అమర సింగును త్రోసివేసి యీ కుర్రవానిని సింహాసన మెక్కించవలయునని యింకను

కుట్ర సాగించిరి. కాశీనుండియు, నవద్వీపమునుండియు, పండితులను పిలిపించి, వారికి బాగా లంచములిచ్చి, యీ కుర్రవానిదత్తత సరియైనదని వారిచేత చెప్పించిరి. ఈ పండితుల యభిప్రాయమును పురస్కరించుకొని మద్రాస్ గవర్నమెంటువారు 1798 సంllలో అమరసింగును త్రోసిరాజని యీ కుర్రవానిని-సర్బోజీని-తంజావూరు సింహాసనముపై కూర్చుండబెట్టిరి! వీరీపనిని పరమార్థచింతతో చేసిరా? కాదు. స్వలాభము లేనిది ఇంగ్లీషువారేపనియు చేయరు. తంజావూరు కోటతప్ప తక్కిన యావత్తు రాజ్యమును తమకు సర్వసంపూర్ణ హక్కులతో యీ కుర్రవానిచేత వ్రాయించి పుచ్చుకొనిరి! ఈ కుర్రవాని జీవనమునకు కొంత మనోవర్తి నిచ్చిరి!

ఈ రాజ్యాపహరణనుగూర్చి విచారించుటకై ఒక కమిటీ నేర్పరుపవలసినదిగ సీమ యధికారులు వెల్లస్లీని కోరిరి. కాని, యీ కమిటీ అనవసరమనియు, యీ విచారణపెట్టితే దీనివల్ల యెవరికిగాని ప్రయోజనము లేకపోగా సర్బోజీకిని, తంజావూరు రాజ్య ప్రజలకునుకూడ చాల అనర్థములు కలుగుననియు యేవో మిషలు చెప్పి, వెల్లస్లీ యీ వ్యవహారమును దాటవేసెను. ఈ రీతిగ, పాపము, నిజమైన వారసుడగు అమరసింగ్ తన రాజ్యమును కోల్పోవలసినవాడయ్యెను. అతనిపై మోపబడిన నేరములకు సమాధానము చెప్పుకొనుటకుకూడ అతనికి కంపెనీవారు అవకాశమివ్వలేదు.

ఈ రాజ్యాపహరణకై కంపెనీ వారెట్టి కుతంత్రములు పన్నిరో తంజావూరులో రెసిడెంటుగను, పాదిరీగను నుండిన మాక్లియడ్, స్వార్ట్సు అను యిద్దరు ఇంగ్లీషువారు అమరసింగును యెట్లు హింసించిరో అప్పుడక్కడ సేనాపతిగనుండిన "సర్ డేవిడ్ బెయిర్డు" అను నతడు నిర్మొగమోటముగ వెల్లడించెను. ఇటీవల 1832 సంll లో లండనులో ప్రచురమైన యీ సేనాపతి జీవిత చరిత్రనుండి యీ దిగువ యంశముల నుదహరించుచున్నాము.

అపహరణ జరిగిన కథ.

[తంజావూరు రాజగు అమరసింగు చాల మంచివాడు. సత్ప్రవర్తనగలవాడు. ఉన్నతాదర్శములుగలవాడు. బ్రిటిష్‌గవర్నమెంటునందు సద్భావముగలవాడు. అన్నగారి మరణానంతర మితనిని మద్రాస్‌గవర్నర్ సర్ ఆర్చిబల్డు కాంబెల్ తంజావూరు సింహాసన మెక్కించెను............ రెసిడెంటుగనున్న 'మాక్లియడ్' యీ రాజాను చాల అగౌరవముగను, అతి కాఠిన్యముగను చూడసాగెను. ఈసంగతిని రాజాఅనేకసార్లు సేనాపతియగు "బెయిర్డు" కు చెప్పుకొనెను. రానురాను వ్యవహారములు ముదురజొచ్చెను. రాజాను యెట్లైన వేధించి,

బలవంతపరచి, అతనిచేత రాజ్యమును వ్రాయించి పుచ్చుకొనుటకే కంపెనీవారి రెసిడెంటును (మాక్లియడును) తంజావూరుకు పంపినట్లు సదరు రాజాకే గాక, ఆంగ్ల సేనాధిపతియగు బెయిర్డుకుకూడ నానాటికి పొడగట్టసాగెను. ఈపని సాధించుటకై కంపెనీవారు యెట్టిపని చేయుటకైనను వెనుదీయరైరి. రాజాకు భయోత్పాతముగలిగించి, అతనిచేత కాగితము వ్రాయించి పుచ్చుకోవలెనని వారు ప్రయత్నించుచుండిరి. రాజాను వూరికే బెదరించుటకై రెసిడెంటు మాక్లియడ్ యింగ్లీషు సేనను తీసికొనివచ్చి రాజామేడచుట్టు అనేకసార్లు విచ్చుకత్తులతో నిలువబెట్టించెను. రాజాతమ్ములుగాని, యితరబంధువులుగాని, ఉద్యోగులుగాని, యింగ్లీషు మిలిటరీ యధికారుల యనుమతిలేకయే కోటబయటికి పోకూడదని యాజ్ఞాపించెను. ఈచర్యలన్నియు ఆంగ్ల సేనాపతియగు 'బెయిర్డు'కు అసహ్యమువేసి, యీసంగతిని మద్రాస్ గవర్నర్ అగు "హోబార్టు" ప్రభువుకు రిపోర్టు చేసెను, కాని, "మాయుత్తరువుల ప్రకారమే రెసిడెంటు యీపనులు చేయుచున్నాడుకాబట్టి, నీవేమీ యెదురుమాట్లాడవద్దు. ఆయనచెప్పిన ప్రకారమే చెయ్యి"—అని మద్రాస్ గవర్నర్ అతనికి జబాబిచ్చెను. ఈ అలుసుచూచుకొని రెసిడెంటు మాక్లియడ్ నాటినుండి మరింత తలబిరుసుతనముగ ప్రవర్తింపసాగెను. రాజాను మరింత వేధింపసాగెను. రెసిడెంటు మాక్లియడ్ అమరసింగును యెంతమోసగించెనో, యెంతటి భయములో పెట్టెనోగాని, తుదకాతడీరాజుచేత 1796 సం॥ జనవరి 24-వ తేదీన తానీ రాజ్యమునంతను కంపెనీకి ధారాదత్తముచేసినట్లు కాగితము వ్రాయించి పుచ్చుకొనెను.

తనను భయపెట్టియు, మోసగించియు రెసిడెంటు తనచేత యీకాగితమువిూద సంతకము చేయించుకున్నాడనియు, కాబట్టి యిది చెల్లనేరదనియు, తనరాజ్యమును తనకు తిరిగియిప్పించవలసినదనియు అమరసింగు అప్పుడు గవర్నర్ జనరల్ గనున్న సర్ జాన్ షోరుకు వ్రాసుకొనెను. ఈ అర్జీపై సేనాపతి "బెయిర్డు"కూడ గట్టిగ శిఫార్సుచేసి రాజాకెంతయో యితరవిధములుగకూడ మాటసహాయము చేసెను. ఈ శిఫార్సును అంగీకరించి, అతనిరాజ్యమును అతనికి తిరిగి యిప్పించివేయవలసినదని సర్ జాన్ షోర్ మద్రాస్ గవర్నమెంటుకు హుకుములు బంపెను. గవర్నర్ జనరల్ తంజావూరు విషయమై యేల యింతటి న్యాయబుద్ధితో ప్రవర్తించెనని కొందరికి ఆశ్చర్యము కలుగవచ్చును. కాని, దీనిలో రహస్యమొకటియున్నది. తంజావూరు రాజ్యము మిక్కిలి చిన్నరాజ్యము. ఈస్వల్పరాజ్యముకొరకై యింతటి ఘోరకార్యముచేయుట తగనిదిగ అతనికి కన్పట్టెను. వ్రతముచెడినను, ఫలము తగు మాత్రముగ దక్కవలయునని సర్ జాన్ షోర్ ఊహించెను. అట్టిఫలము లేనప్పుడు, వ్రతమేల చెరుపుకొనవలెనని యతడూహించెను. అక్కడనుండి శ్రీరంగనీతుల చెప్పసాగెను. రాజాచేత యీకాగితము వ్రాయించిపుచ్చుకొన్న సందర్భముల నతడు తీవ్రముగ ఖండించెను.

అమరసింగ్ అర్జీ-గవర్నర్ జనరల్ హుకుం.

అతనిమాటల సారాంశమిది. "ఈ కాగితము రాజా తన బుద్ధిపూర్వకముగ వ్రాసి యిచ్చినది కాదు. అనేకసార్లు మన యింగ్లీషుసేనను తీసికొనివచ్చి, అతని మేడచుట్టు నిలువబెట్టి, భయపెట్టినందువల్లనే అతడు బెదరిపోయి యీ కాగితముపై సంతకము పెట్టినాడు. కాన, యిది చెల్లనేరదు............మరియు, రాజాకు ప్రతికక్షియగు కుర్రవానికి చదువు చెప్పు మిషమీద, స్వార్ట్సుఅను మిషనరీని తీసుకొనివచ్చి తంజావూరులో పెట్టుటకూడ అవివేక

మైనపని. అదిగాక, రాజా తాను మన కివ్వవలసిన కప్పమునుకూడ బకాయిపెట్టక సరిగ యెప్పటి దప్పడు చెల్లించు చునేయున్నాడు—కాబట్టి, అతనిరాజ్యము నెట్లు లాగికొన వీలగును? మనకు తాకట్టుపెట్టిన జిల్లాల నతడు సరిగ పాలించుటలేదను కారణముచేత మన మతనిరాజ్యమును లాగికొనవలెనని వాదించుట సరికాదు. ఏలననగ, అట్లయినచో, యీ రాజ్యమునేగాక, అయోధ్య తిరువాన్కూరు మున్నగు రాజ్యములనుకూడ మనము లాగికొనవలసి వచ్చును. న్యాయమును, రాజనీతినిబట్టిజూడగ యీ కాగితమును రద్దుపరచి, తంజావూరు రాజ్యమునుతిరిగి అమరసింగుకు యిచ్చివేయవలసియుండును. కాబట్టి దానివల్ల యెన్ని చిక్కులు వచ్చిననుసరే వెనుదీయక, అతనిరాజ్యమును అతనికి యిచ్చివేయవలసినది''—అని గవర్నర్ జనరల్ సర్ జాన్‌షోర్ మద్రాస్ గవర్నమెంటువారి నాజ్ఞాపించెను.

పైనుండి యీ హుకుములు వచ్చిన తరువాతకూడ రెసిడెంటు యెన్నో తిప్పలుపెట్టిగాని, అమరసింగుకు యీరాజ్య మివ్వలేదు. ఎట్టకేలకు బెయిర్డు సేనాపతి తన ప్రయత్నమువల్ల తంజావూరు రాజ్యమును తన మిత్రుడగు అమరసింగుకు తిరిగి యిప్పించి, సంతుష్టుడయ్యెను.

కాని, యీతనిచర్య మద్రాస్ గవర్నరు హోబర్టుకును, యితర యుద్యోగస్థులకును యెంతో కంటకముగ నుండెను. ఏలననగ, యితని రిపోర్టువల్లనే గవర్నర్ జనరల్ సర్ జాన్‌షోర్ మద్రాస్ గవర్నమెంటు చేసిన అక్రమముల నన్నిటిని తెలిసికొని, రికార్డునంతను తెప్పించుకొని, తాను స్వయముగ చూచి, వారిచర్యలను ఖండించి, తంజావూరు రాజ్యమును తిరిగి అమరసింగునకు యిప్పించెను. తమకిట్లు శృంగభంగమగుటకు,— తమకిన్ని చివాట్లు పై యధికారివల్ల తగులుటకు,— యీ ''బెయిర్డే'' కారకుడని మద్రాస్ గవర్నర్‌ను, అతని ముఠాలోవారును, లోలోన యితనిపై మండిపడుచుండిరి. కాబట్టి, యితని నెట్లైన శిక్షించవలయునను తలంపుతో మద్రాస్ గవర్నర్ యితనిని తంజావూరునుండి తీసివేసి దక్షిణాఫ్రికాగ్రమునకు 1797 సం॥ అక్టోబరు 17-వ తేదీన పంపివేసెను. ఇదే అతనికి వారు వేసిన శిక్ష.

మద్రాస్ ముఠా ఉక్రోషము.

ఇక, రాజా అమరసింగును శిక్షించుట యెట్లా యని మద్రాస్ గవర్నమెంటువారు లోలోన ఆలోచింపసాగిరి. ఇండియాలో తమకు పైయధికారియగు గవర్నర్ జనరల్ తమకు యీవిషయములో ప్రతికూలుడగుటచే, వారు సీమ యధికారుల కీ వృత్తాంతమునంతను నివేదించుకొనిరి. వారు మద్రాస్ గవర్నమెంటువారి పక్షముగ తీర్మానించి, రాజాచే బలాత్కారముగ వ్రాయించి పుచ్చుకొన్న కాగితము ప్రకారము అమలు జరుపవలసినదని చెప్పి, అప్పుడు ఇండియాకు

సీమకు ఫిర్యాదు, అమరసింగుకు పదభ్రష్టం.

గవర్నర్ జనరలుగ వచ్చుచున్న వెల్లస్లీకి రహస్యముగ బోధించి పంపిరి. ఈతడు ఇండియాకు వచ్చుచు, దక్షిణాఫ్రికాగ్రమందు రెండునెలలు మకాముచేసి యుండెనని గద చెప్పియుంటిమి. తంజావూరు రాజాకు మిత్రుడగు బెయిర్డు దక్షిణాఫ్రికాగ్రమునకు బదలాయించబడినప్పుడు అక్కడ యితనికిని వెల్లస్లీకిని పరిచయము గలిగెను. సీమ డైరెక్టర్ల రహస్యపు టుత్తరువుల ప్రకారము తంజావూరు రాజ్యమును హరించవలసిన బాధ్యత తన భుజములపై యున్న వెల్లస్లీకి యితని పరిచయము చాల ప్రయోజనకారి యయ్యెను. తంజావూరు రాజ్యములోని లోతుపాతుల నన్నిటిని యితని నడిగి తెలిసికొనవలయునను కుతూహలము వెల్లస్లీకి బాగా కలిగెను. అందుచే యీరాజ్య వ్యవహారములనుగూర్చి వెల్లస్లీ యీ బెయిర్డును అనేక ప్రశ్నలు గ్రుచ్చిగ్రుచ్చి యడిగెను. ఈ ప్రశ్నల ధోరణిని బట్టియే బెయిర్డు వెల్లస్లీ మనస్సులోనున్న సంకల్పమును గ్రహించగలిగెను. తెరచాటున జరిగిన వ్యవహారమంతయు బెయిర్డుకు కరతలామలక మయ్యెను.

అంతట పాప మా రాజాపని యేమగునో యని యతడు లోలోన ఆదుర్దా పడసాగెను. "అతని రాజ్యము ఉంచుతారో, ఊడగొడతారో" యను ఆదుర్దా బెయిర్డుకు పుట్టెను. ఈ ఆదుర్దాను ఆపుకొనలేక, నిజస్థితి యేదో తెలిసికొందామను ఉద్దేశ్యముతో— "ఈ రాజ్యం విషయమై కంపెనీ యజమానులు నిజముగ యేమిచేయ దలచుకొన్నారేమి—?" అని బెయిర్డు ఒకనాడు యీ వెల్లస్లీని అడిగెను. "ఈ సమయములో ఆమాట చెప్పడానికి వీలులేదు. కంపెనీ డైరెక్టర్లతీర్పు నాకును, రహస్య సంఘమువారికిని తప్ప యింకెవరికి తెలియదు" అని వెల్లస్లీ జబాబు చెప్పెను. ఈ జబాబును బట్టియే నిజస్థితిని బెయిర్డు గ్రహించెను. డైరెక్టర్ల తీర్పు రాజాకు వ్యతిరేకముగ నుంకుటను బట్టియే వెల్లస్లీ దానినిట్లు దాచుచున్నాడని బెయిర్డు గ్రహించెను. కాని, పాప మత డిప్పు డేమిచేయగలడు.?

వెల్లస్లీ ఇండియాకు రాగానే, యేమి జరిగినదో పైన వివరించియే యుంటిమి. మొదట దత్తత చెల్లదని త్రోసివేసిన సర్ఫోజీని తీసికొనివచ్చి ఆతని దత్తత చెల్లుతుందని కాశీపండితులచేత అభిప్రాయ మిప్పించి, వెల్లస్లీ అతనిని తంజావూరు సింహాసన మెక్కించి, అమరసింగును త్రోసివేసెను.

న్యాయము, ధర్మము, యెట్లున్ననేమి? కంపెనీవారికి తమ స్వలాభమే పరమావధి. కంపెనీ డైరెక్టర్ల రహస్యపు తీర్మానమును యేధర్మము, యేహిందూ

లా అడ్డగించగలదు? "అమరసింగు స్వతంత్రబుద్ధి గలవాడు. తుపాకి మడమలతో పొడిచేవరకు అతడు తనకుగల న్యాయమగు హక్కును వదలుకొనువాడుగాడు. ఇతని కింత పెంకెతనమా? ఇట్టివాడు మనకు గిట్టడు. కాబట్టి వీణ్ణి ఊడబెరికి, మనము చెప్పినట్లువిని, దాసోహమని పడియుండువానిని తక్తుమీద కూర్చుండబెట్ట వలెను. మనోవర్తి పుచ్చుకొని, రాజ్యం మనకు ధారాదత్తము చేసేవాణ్ణి తీసుకు రావలెను" అని సీమ డైరెక్టర్లు రహస్యముగ తీర్మానించినప్పుడు యిక దానికి తిరుగేమి?

మిషనరీలు-రాజకీయ కుట్రలు-వేగులు.

రాజ్యముల హరించుటకై కుట్రలు బన్నుటలో ఇంగ్లీషువారికి చేదోడు వాదోడుగ మెలంగినవారిలో క్రైస్తవ మిషనరీలు (పాదిరీలు) ప్రధానులుగ గన్పట్టుచున్నారు. ఒక్క ఇండియాలోనే గాక, ఆఫ్రికా మున్నగు యితర ఖండములలోకూడ వీరీ పనులనే జేయుచున్నట్లు తెలియుచున్నది. ఇందునుగూర్చి "History of Education in India under the Rule of the East India Company" అను పుస్తకములో బాసూ గారిట్లు వ్రాసియున్నారు.

"నల్లతోలుగల ప్రజలఆత్మల శ్రేయమును జూచుటకంటె వారిలో అంతః కల్లోలముల బుట్టించి, వారిని క్రైస్తవరాజ్యముల కాలిక్రిందికి తెచ్చుటకే యీ క్రైస్తవ మిషనరీలు యెక్కువగ పాటుబడుచున్నట్లు తెలియుచున్నది. ఇందుకు నిదర్శనమొకటి చూడుడు. 1880 సంll జులై 10-వ తేదీగల 'సాటర్ డే రివ్యూ' పత్రికలో యిట్లున్నది———, ఇటీవల జరిగిన చిన్నచిన్న యుద్ధములన్నియు యీ క్రైస్తవ మిషనరీల చర్యలవల్లనే పుట్టినవి. అబ్బిసీనియన్ కల్లోలము మిషనరీలు పుట్టించినదే. అడవి జాతులగు "జూలూలు" ఆదివారమును నిరసించినారని— మిషనరీలను హింసపెట్టినారని—మిషనరీలు పుకారులు పుట్టించినారు. ఇందువల్లనే జూలూలతో యుద్ధమువచ్చినది. మిషనరీలే గత ప్రభుత్వమును చాల చిక్కులలో నికిదెచ్చిరి. బర్మారాజుల గృహకల్లోలములలో మిషనరీలు అనవసరముగ జొరబడి నానా అల్లరిచేయుచున్నారు. ఈ అల్లరి యింకను చల్లారకపోవుటకు వీరే కారకులు."

ఇండియాలో కొందరు క్రైస్తవ మిషనరీలు గూఢచారులుగను, వేగుల వాండ్రుగను, కుట్రదారులుగనువుండి, గవర్నమెంటుకు సహాయముచేయుచున్నారు. ఇందుకు బొంబాయి రాజధానిలో పనిచేసిన రెవరెండు డాక్టర్ విల్సన్ అను మిషనరీయే నిదర్శనము. ఇతని సంగతి సతారా రాజ్య చరిత్రలో చెప్పెదము.

తంజావూరు చరిత్రలోకూడ 'స్వార్ట్సు' అను మిషనరీ చాలకుచ్ఛితపుపనులు చేసెను. రాజా అమరసింగు తన అన్నగారి దత్తపుత్రుడగు సర్ఫోజీని హింసలు పెట్టుచున్నట్లు యీ పాదిరీ వేసినపుకారులు యెంతమాత్రము నమ్మదగినవికావు. అమరసింగును యెట్లైనను అల్లరిపరచి, తనచేతిలోనున్న యీ కుర్రవానిని—సర్ఫోజీని—సింహాసన మెక్కించవలయునని యీతడు మద్రాస్ గవర్నమెంటుకు సహాయముగ కుట్రపన్నుచుండెను. రెసిడెంటు మాక్లియడును, యీ మిషనరీయుకలసి రహస్యాలోచనలు చేయుచుండిరి. మాక్లియడు తరుచు యీ మిషనరీ యింటికి వెళ్లి అతనితో గుసగుసలాడుచుండినట్లు సేనాపతి బెయిర్డు 1796 సం॥ జనేవరి 24-వ తేదీన మద్రాస్ గవర్నరుకు వ్రాసిన ఉత్తరంలోనున్నది.

ఈ రీతిగ సర్వసస్య సంపద్భరితమగు తంజావూరు రాజ్యమును ఇంగ్లీషువారు మిక్కిలి దురాగతముగ నోటవేసికొనిరి.



# బ్రిటిష్ మహాయుగము

## ఇరువదిరెండవ అధ్యాయము.



### సూరత్ రాజ్యాపహరణము.

ఇంగ్లీషువారు మొట్టమొదలుగ తమ మొదటిగిడ్డింగిని స్థాపించుకొన్నది సూరతు పట్టణములోనే. ప్రారంభదశలో వీరు వర్తకరీత్యా చేసిన చర్యలనన్నిటినిగూర్చి వివరించుట అనవసరము. వీరు తమ దుష్ప్రవర్తనచే ప్రజల అసహ్యమునకు పాత్రమైరి. ఈ సంగతులనన్నిటిని రెవరెండు ఆండర్సన్ అనునతడు తన గ్రంథములో వివరించియున్నాడు.

సూరత్ రాజ మందిరపు ముట్టడి.

సూరత్తు రాజ్యము చిరకాలమునుండి మహమ్మదీయుల చేతులలోనుండెను. వారే ఇంగ్లీషువారి కిక్కడ నిలువనీడనిచ్చిరి. అయితే ఇంగ్లీషువారు ప్రతిచోట చేసినట్లే యిక్కడకూడ తిన్నయింటివాసములు లెక్కపెట్టుచుండిరి. 1759 సం॥ లో ఇంగ్లీషువారు మోసముచే సూరత్తు నబాబుల మందిరమును ముట్టడించి పట్టుకొనిరి. ఈ ముట్టడి సమయములో నెవరు తమ్మును యెదిరించకుండ నుండునట్లు, ఇంగ్లీషువారు నబాబు తాలూకు సిద్దీ ఆఫీసర్లకు బాగా లంచములిచ్చిరి. అక్కడనున్న ఒలందా కంపెనీ వారుకూడ నబాబుకు తోడ్పడకుండునట్లు యిట్లేలంచములిచ్చిరట. ఈ సంగతులన్నియు బొంబయి గెజిటీర్ లో 127-పేజీలో చెప్పబడియున్నవి.

---

నబాబు పిండిబొమ్మ.

ఇంగ్లీషువా రీవిధముగ నబాబుకోట ముట్టడించిన నాటినుండి, నబాబు ఇంగ్లీషువారికి లొంగిపోయి వారితో ఒడంబడిక చేసుకొని వారిచేతిలో పిండిబొమ్మగ నుండెను. ఈ కారణముచే సూరత్తులో రెండురాజ్యము లేర్పడెను. అసలు అధికారులు ఇంగ్లీషువారును,—నామకః అధికారి నబాబుగను నుండిరి. ఈ ద్వంద్వప్రభుత్వనాటకము 1759 మొదలు 1799 వరకు—అనగ 40 యేండ్లు నడిచెను. ఈలోగా నలుగురు నబాబులు వెళ్లిరి. ఈ నలువదియేండ్ల ద్వంద్వ పరిపాలనలో ప్రజలు నానా అవస్థలుపడిరి. ప్రజలక్షేమమునకై జబాబుదారీ వహించిన వాడొక్కడును లేడు. ప్రజలు నబాబుదగ్గరకు పోయి మొత్తుకుంటే, "ఇంగ్లీషువారివద్దకు పొండనియు," ఇంగ్లీషువారి వద్దకు వెడితే "నబాబుదగ్గరకు పొండ"నియు —ఈ రీతిగ వారి వీరి మధ్య ప్రజలు కాలిబంతివలె అటునిటు తన్నబడుచునుండిరేగాని, వీరిరువురిలో ఒక్కరును ప్రజలక్షేమ

మును చూడరైరని 'పార్సన్సు' అనునతడు 1777 సం॥ లో వ్రాసెను. నిజమునకు ఇంగ్లీషువారే సర్వాధికారులై సూరతులో రాజ్యము చేయుచుండిరి. నబాబు సైతము, పైకియెంత దర్పముగ గన్పించినను వారియాజ్ఞలను శిరసావహించ వలసినదే. నామమాత్రముగనున్న నబాబు అధికారమును తీసివేసి యీ రాజ్యమును యావత్తు పూర్తిగ తమలో కలుపుకొనవలెనను దుర్బుద్ధి 1799 సం॥ లో వెల్లస్లీకి పుట్టెను. నబాబునుదబాయించి, అతనిచేత తిరిగి యింకొక క్రొత్త కరారునామా వ్రాయించి పుచ్చుకోవలెనని కంపెనీవారు ప్రయత్నించిరి. "నీ సేననంతా తీసి పారవేసి, మాడుకంపెనీ సైనికదళములను పెట్టుకో. దానికగు ఖర్చు అంతయు నీవే పెట్టుకో ................" అని ఇంగ్లీషు రెసిడెంటు నబాబుకు సలహాచెప్పెను. కాని, నబాబు మొదట వినలేదు. "ఈ సేనల ఖర్చుకు నాదగ్గర డబ్బులేదు. అదిగాక, నా రాజ్యముయొక్క ఆంతరంగిక పరిపాలనలో మీరు జోక్యము కలిగించుకొనరాదు. ఇది 1759 సం॥ లో జరిగిన ఒడంబడికకు విరుద్ధము" అని నబాబు వాదించెను. కాని, ఇంగ్లీషువా రీతనిని నిద్రపోనీయక వేధింపసాగిరి. చిట్టచివరకు సాలుకు లక్షరూపాయలు కప్పమిచ్చునట్లును, మరి 30 వేల రూపాయలు యితరవిధములుగ కంపెనీకి ముట్టచెప్పునట్లును నబాబు ఒడంబడెను. ఈ ఒడంబడిక పత్రముపై సంతకములు కాకమునుపే నబాబు 1799 సం॥ జనవరి 8-వ తేదీన చనిపోయెను. ఇంగ్లీషువారి పంట పండెను. నబాబుకు పసికుర్రవాడొకడుండెను. ఇతడును తండ్రి చనిపోయిననెలకే చనిపోయెను. అంతట నబాబు తమ్ముడు "నాసీర్-ఉద్-దీన్" అనునతడు తానుసింహాసనమునకు రావలెనని యత్నించెను. తన అన్నగారు ఒప్పుకొన్న ప్రకారము యితడును కంపెనీకి లక్షరూపాయల కప్పమిచ్చుటకు ఒప్పుకొనెను. కాని, పైన ఒకపైసాకూడ యివ్వలేననెను. "ఇతడింతకంటె యెక్కువ యిచ్చుకోలేడు, ఇతనిని నేను పిండవలసినన్నివిధముల పిండిచూచితిని. కాని, యింక ఒక చుక్కయైనను యితనిలో లేని మాట ముమ్మాటికి సత్యము. అతడబద్ధ మాడుటలేదు. ఇతడింకా యెక్కువ యిచ్చుకోగలడని కొందరు మీకు చెప్పిన అభిప్రాయము సరికాదు. రాజ్యమునంతను మనమే స్వాధీనపరుచుకొని మేనేజిమెంటుచేసినను మనకీ లక్షకంటె యెక్కువ సొమ్మునిగలదు. ఈ మేనేజిమెంటు బాధలేకుండ మనకు హాయిగ లక్షరూపాయలు వస్తూవుంటే, మన మీ నబాబుపై దౌర్జన్యముచేసి, అతనిరాజ్యమును లాగికొన్నామను అపకీర్తి మనకెందుకు ? మనమిట్లు చేసినందువల్ల మనము విశ్వాసద్రోహమొనర్చిన వారమగుదుము. మన మీ లక్షకంటె యెక్కువ అడిగితే, నబాబిక ప్రజలను హింసించవలసివస్తుంది." అను భావమును సూరత్తులో రెసిడెంటుగానున్న "సేటర్" అను ఆంగ్లేయుడు బొంబయి గవర్నమెంటుకు వ్రాసెను.

కాని, యీమాటలు వెల్లస్లీకి రుచించలేదు. "సూరతు రాజ్యముతాలూకు సివిల్, మిలిటరీ, రివిన్యూ వగైరా పరిపాలనాధికారముల నన్నిటిని మనమేకాజేసి, నబాబుకు యింత పిండాకుడు (మనోవర్తి) పారవేస్తేతప్ప నాకు తృప్తిలేద"ని వెల్లస్లీ 1800 సం॥ ఫిబ్రవరి 18-వ తేదీన బొంబయి గవర్నర్ అగు డంకన్‌కు వ్రాసెను. కాని, కొంత జబర్దస్తీచేయనిది నబాబీపద్ధతికి ఒప్పుకొనడని వెల్లస్లీకి తెలియును. అందుచే యితడు గవర్నరుకు వ్రాసిన ఉత్తరములో యిట్లని సలహాచెప్పెను :—

జబర్దస్తీ రాజ్యాకబళనము.

[మీరు స్వయముగ సూరత్తువెళ్లి తేనేగాని యీవ్యవహారము చక్కబడదు. నేనీసంగతిని మీకౌన్సిలు మెంబర్లందరికొరకుకాక, మీకొక్కరికే వ్రాయుచున్నాను. సూరత్తులో మన సేనను యింకను హెచ్చుచేయవలసినది. ఇదివరకున్నవిగాక యింకొక యూరోపియను ఫిరంగిదండును, రెండుయూరోపియను కొల్బలములను, ఒక నేటివు దళమును అవసరముగ సూరత్తులో పెట్టవలసినది. మీరక్కడికి చేరకమునుపే యీసేనయంతయు అక్కడ తయారుగ నుండవలెను. మీవెంటకూడ మీకు అంగరక్షగ మరియొకదళమును తీసుకొనిపొండి"—క్లుప్తము.]

ఈ జబర్దస్తీచేత "నబాబుకును, ఘనతవహించిన కంపెనీవారికిని గల స్నేహబంధము మరింత గాఢతరమైనదట!" ఆహా యేమి బంధము! ఎన్నటికిని తెగని దాస్యబంధము గద యిది!

నబాబునుండి వ్రాయించి పుచ్చుకొనవలసిన కరారునామాపత్రపు ముసాయిదాను వెల్లస్లీయే కలకత్తాలో వ్రాయించి, బొంబయి గవర్నరుకు 1800 సం॥ మార్చి 10-వ తేదీన పంపించెను. ఈ పత్రములో ఒక అక్షరముకూడ మార్పులేకుండ నబాబుచేత సంతకము చేయించిరి. దిక్కులేని నబాబు పాపము యేమి చేయగలడు? ఈ రీతిగ సూరత్తు నబాబు పదభ్రష్టుడయ్యెను. సూరత్తు రాజ్యము ఇంగ్లీషు రాజ్యములో లీనమైపోయెను.

నబాబు పక్షమున న్యాయమును, ఇంగ్లీషువారి పక్షమున కౌర్జన్యము, మోసము నుండెనని 1848 సం॥ జూన్ నెలలో కలకత్తా రివ్యూపత్రిక వ్రాసినది. ఈ సూరతు రాజ్యాపహరణమును గూర్చి సుప్రసిద్ధ ఆంగ్ల చరిత్రకారుడగు మిల్లు యిట్లు వ్రాసెను :—

చరిత్రకారు డేమంటున్నాడు?

[యింగ్లీషువారు చేసినవానిలో యింతకంటె అక్రమమగు రాజ్యాపహరణ మింకొకటి కానము. రాజ్యపరిపాలనను బాగుచేయుచున్నామను మిషతో యింగ్లీషువారీ దారుణపు పని చేసిరి. ఈ చర్యను సమర్థించుటకు వెల్లస్లీ రెండువాదముల చేయుచున్నాడు. అవేమనగ:—(1) మొట్టమొదట 1759 సం॥లో జరిగిన ఒడంబడిక అప్పుడు నబాబుగనున్న మొయీన్ ఉద్దీనుకును కంపెనీవారికిని మాత్రమే జరిగినది. అది నబాబు జీవితాంతమువరకే యుండునట్లేర్పాటు జరిగెను. అనగ 1793 సం॥లో మొయిన్ ఉద్దీను చావుతో సదరు ఒడంబడిక రద్దు

అయినది. కాబట్టి, ఆ ఒడంబడిక యిప్పుడు కంపెనీవారిమీద బైండింగుకాదు. (2) ఇక రెండవవాదన యేమనగ:—ఈనబాబు మొగిలాయి సామ్రాజ్యమునకు సామంతుడుగ నుండెను. సదరుసామ్రాజ్య మిప్పుడు అంతరించి, దానిస్థానే మనమువచ్చినాము కాబట్టి, యితడును మనకు సామంతుడైనాడు. అనగ, యితని రాజ్యమునుగూర్చి మన మేమిచేసినను చేయవచ్చును. మన కట్టిస్వేచ్ఛగలదు. నబాబుగిరిని మనయిష్టప్రకారము ఫైసలాచేయుటకు మనకు సర్వసంపూర్ణాధికారములు గలవు—మన కెట్టి ఆటంకములును లేవు. వెల్లస్లీచేసిన వాదములివి. ఇవి యెంత మాత్రము సమంజసముగలేవు. ఇవిచాల పేలవముగ నుండుటచే వీనిపై ప్రత్యేకముగ నేను వ్యాఖ్యానము చేయుటయు అనవసరమే."

"ఇంకొక వింతసంగతిని మనమిక్కడ గ్రహించవలసియున్నది. నాజరుద్దీనుకు న్యాయతః నబాబుగిరి చెందవలసియున్నదనియు, యిందువిషయమై యితనికి సహాయముచేయుటకు కంపెనీవారు పూర్వపు టొడంబడికలనుబట్టి బద్ధులైయున్నారనియు మొదటినుండి నబాబుపక్షమున వాదించుచున్న బొంబయిగవర్నరును రెసిడెంటు సేటనునుకూడ, వెల్లస్లీనుండి హుకుము రాగానే దానికి కించిత్తయినను వ్యతిరేకభావమును తెలుపక, మెదలకుండ సదరు హుకుము ప్రకారము తమ పూర్వవాదనలకు వ్యతిరేకముగ—నబాబును పదభ్రష్టుని చేయుటకు పూనుకొనిరి!"

వెల్లస్లీచెప్పిన యింకొకవాదన చూడండి. సూరత్తురాజ్యమును నబాబు చాల భ్రష్టముగ పాలించుచున్నాడట! అందుచేత అతనిని పదభ్రష్టునిచేయుట తనకు విధిమాత్రమేగాక హక్కుకూడానట! ఇది బలేవాదన! అట్లైతే, చెడుపరిపాలనవుంటే యెవరైన యెవరినైన రాజ్యభ్రష్టుని చేయవచ్చునన్నమాట! ఈహక్కు యీస్టిండియా కంపెనీవారి కొక్కరికే మిరాసియా లేక, మానవకోటిలో యెవరికైన గలదా?

నబాబుకు మనోవర్తి. నాసరుద్దీను రాజ్యమును కంపెనీ వారిప్రకారము లాగికొని, అతనికింత మనోవర్తి పారవేయుచున్నను, అతనిని పూర్వపు ఆడంబరములతోనే సింహాసనమెక్కించిరి! ఏమిఘార్సు! నాటకము!]

—(క్లుప్తము)



# బ్రిటిష్ మహాయుగము

## యిరువదిమూడవ అధ్యాయము.

### వెల్లస్లీ, పీష్వాను ఎరలో పడవేసిన విధము.

పూర్వకథ-క్లుప్తము.

ఇంగ్లీషువారు మొదటినుండియు మహారాష్ట్రుల యెడ గావించిన చర్య లన్నియు ఆంగ్ల రాజ్యస్థాపనా చరిత్రలో గొప్ప కళంకములుగ నున్నవి. "ఈ కథ నెంత నిష్పక్షపాతముగ చెప్పినను, దానిలో యింగ్లీషువారు సిగ్గుపడవలసినది చాలయున్నదని" బొంబయి సివిల్ సర్వీసులో నున్న ఆంగ్లేయుడే యొకడు చెప్పియున్నాడు.

అయినను, యీ వ్యవహారము లన్నిటిలో మహారాష్ట్రులదే తప్పయినట్లు ఆంగ్లేయ చరిత్రకారులు పెక్కుమంది స్వార్థచింతతో అపవాదముల ప్రచురింప సాగిరి. ఈ యపవాదముల సిగ్గులేక వ్యాపింపజేయుటలో దుష్కీర్తి గాంచిన వారు వెల్లస్లీయు, అతని తమ్ములును ప్రధానులు. బ్రిటిష్‌వారు మహారాష్ట్రుల నెట్లు మోసగించినదియు యింతవరకు యే చరిత్రకారుడును విప్పి చెప్పియుండలేదు. కాని, గవర్నర్ జనరల్ వెల్లస్లీయు, అతని తమ్ములును వ్రాసిన ఉత్తరములను తదితర కాగితములను పరిశీలించి చూచినయెడల వారొనర్చిన ఘోర దురంత కృత్యములు లోకమునకు వెల్లడి గాగలవు.

మొదటి మహారాష్ట్ర యుద్ధము వారన్ హేస్టింగ్సు హయాములో జరిగినది. ఇందులో ఇంగ్లీషువారు పూర్తిగ ఓడిపోయి మహారాష్ట్రులతో సంధిచేసుకొనవలసి వచ్చెను. అయినను, తానొనర్చిన ఘనకార్యములగూర్చి వారన్ హేస్టింగ్సు తన కేసు సందర్భములో పార్లమెంటు యెదుట యిట్లని ప్రగల్భములు గొట్టుకొనెను:—

"ఈ యుద్ధములన్నీ నేను కల్పించినవికావు.—మీరు, చేయమన్న వే! ఇతరులు (కంపెనీ వారు) చేయమన్న వే! సమయోచితమగు నానోపాయముచే మహారాష్ట్ర రాష్ట్రకూటమునుండి చీలదీసి ఒకపార్టీని అనగ నైజామును, నేను మనవైపునకు లాగివేసినాను. ఇంకొకనితో అనగ (మధోజీ భాన్‌స్లేతో) రహస్యముగ వ్యవహారము నడిపి, అతనిని మనవానినిగ చేసివేసినాను. ఇకమూడవవాడగు మాధవరావు సింధియాను మరపించి మాయచేసి యేదో బేరములో పడద్రోసి అతనిని మనచేతిలో ఉపకరణముగ చేసివైచినాను. (ఈలోగా) మీరు శాంతి, శాంతి, యని యరచినారు. ఈ యరపులు మనశత్రువులకు వినబడ్డవి. అయినప్పటికి, యీ యరపులను, యింకయెన్నో యితర నిరోధములను పాటించక, నేను నాశత్రువులపై పరతు

లను మరింతకఠినముగ విధించి, యీ నిరోధములకన్నిటికి యెదురీదితిని. ఈవిధముగ నేను శాంతిని నెలకొల్పితిని. గొప్పదియగు ఒక మహారాజ్యముతో అనగ మహారాష్ట్రముతో శాశ్వత శాంతిని నెలకొల్పితిని. ఇది స్థిరముగ నిలుచునని నాయాశ."

కాని, యితని యాశ నెరవేరలేదు. ఇతడు బ్రతికి యుండగనే మూడు మహారాష్ట్ర యుద్ధములు జరిగినవి. ఇతని జీవిత మంతరించిన సంవత్సరమే పీష్వాల పరిపాలనయు నంతరించినది. మొదటి మహారాష్ట్ర యుద్ధములో మహారాష్ట్రులు జయముగాంచియు సింధియా, ఫార్నవీసు మున్నగువారి మధ్యవర్తిత్వమువల్ల వారు ఇంగ్లీషువారిపై దాక్షిణ్యమూని వారి నీదేశమునుండి తరిమివేయక వదలివేసిరి. కాని, యీ దాక్షిణ్యమే తుదకు మహారాష్ట్ర రాజ్యమునకు వినాశన కారణ మయ్యెను. ఇంగ్లీషువారు కృతఘ్నులై తమ పక్షమున మధ్యవర్తిత్వము వహించి, తమకింత నిలువనీడ నిప్పించిన సింధియా మున్నగు వారిపైనను, తమకింత నిలువ నీడనిచ్చిన పీష్వాలపైనను, నానాఫర్నవీసు మున్నగు మంత్రులపైనను ద్రోహమొన రించియు, ఘాతుక కృత్యముల గావించియు, క్రమక్రమముగ మహారాష్ట్ర రాజ్య మును గబళించివైచిరి.

వెల్లస్లీ ఇండియాలో అడుగిడునాటికి రఘూబాకొడుకగు బాజీరావు పునహాలో పీష్వాపదవి నధిష్టించి యుండెను. ఇతడే ఆఖరు పీష్వా యని బ్రహ్మ మూడుపంక్తుల వ్రాసియుండెను! నానాఫర్నవీసు తనకాలమును ప్రవాసమున గడపుచుండెను. యూరోపియనులు చెదపురుగులవలె మహారాష్ట్రములో చేరి అల్లరులను, సంక్షోభములను గల్పించుచుండిరి. మాధవరావు సింధియా తదనంత రము దౌలత్‌రావు సింధియా యధికారము వహించి యుండెను. తుకాజీ హోల్కారు చనిపోయియుండెను. లోగడ మాధవరావు సింధియా దర్బారులో రెసిడెంటుగ నుండిన "పామర్" యిప్పుడు పునహాలో (మాలెట్) స్థానమున రెసిడెంటుగ వచ్చెను. బాజీరావు తమకేదో త్రవ్వి తలకెత్తునని యూరోపియనులు మొట్టమొదట ఆశపడిరి. ఏలననగ, యితని తండ్రి రఘూబా వారి కెన్నియో యాశల బెట్టి యుండెను. ఈ యాశలనన్నిటిని కొడుకు తీర్చునని యూరోపియనులు తలచుచుండిరి. కాని, యింతవరకు బాజీరావు వారికేమియు చేపలేదు. వెల్లస్లీ ఇండియాలో అడుగిడు నాటికి వున్నస్థితి యిది.

టిప్పూతో యుద్ధము చేయవలెనను సంకల్పమును వెల్లస్లీ ఇండియాకు రాక పూర్వమేచేసుకొని యుండెననిగడ ఇదివరకు చెప్పియుంటిమి. అయితే, యిత రుల సహాయములేకుండ యితడొక్కడే టిప్పూపైకి దండెత్తిపోగలడా? టిప్పూ మొదటి యుద్ధములో ఓడిపోయి, తన యర్ధ రాజ్యమును, మూడుకోట్ల రూపాయ లను నష్టపడి, తన కొడుకుల నిరువురను శత్రువువద్ద తాకట్టు పెట్టవలసిన పరిభవ మును పొందియున్నప్పటికి, అతని పేరనిన ఇంగ్లీషువారికింకను జంకుపోలేదు. దక్క

నుల్లోగల మిగతా దేశీయరాజుల సహాయములేనిదే-కనీసము వారు తటస్థులుగ నైననుండక పోయినచో-తాము టిప్పూను జయించ లేమని ఇంగ్లీషువారు తలంచు చుండిరి. ఇందును గూర్చి మద్రాస్ గవర్నమెంటు శెక్రటరీ "వెబ్బ" యిట్లని వ్రాసెను :—

[నేనేమియు అతిశయోక్తి చెప్పుటలేదు. యూరపులో యిప్పుడు జరుగుచున్న యుద్ధమువల్లనే మన శక్తులన్నియు చాలవరకు క్రుంగియున్నవి. శాంతిగలిగినగాని మనకిక ఆశయేమియులేదు. ఇట్టిస్థితిలో మనమిప్పుడుగనుక టిప్పూతో యుద్ధము పెట్టుకున్నామా అంటే, మనకు చెప్పరానిచేటు మూడుటతప్ప వేరొండు ఫలితము కలుగదు. మనజాతియొక్క హక్కులను నిలువబెట్టుకొనుటకే మన మీయుద్ధము చేయవలసివుంటే, మనము తొందరపడ రాదు. ఇట్టియుద్ధమును ఆరునెలల యీలోపుగ తలపెట్టరాదు. ఈలోగా మనము తగినంత బలమును చేకూర్చుకొనుటకు మంచి వ్యవధియేర్పడును. కాని, యుద్ధము అనివార్యమై, దాని నిప్పుడే ప్రారంభించుట మంచిదని మీ అభిప్రాయ మయ్యేయెడల, మనస్థితిమాత్రము యిప్పు డేమియు బాగుండలేదని నాభయము. ఈ దుస్థితికి నాకెక్కడ మందుకనిపించడములేదు.— క్లుప్తము.]

ఈ యభిప్రాయముతో మద్రాస్ గవర్నర్ హారిసు మాత్రమేగాక, వెల్లస్లీ కూడ పూర్తిగ యేకీభవించెను. "వెబ్బ" సలహా ప్రకారము వారు తొందర పడక, తమకు బలముచేకూరువరకు, వేచియుండిరి. కారన్‌వాలీసు చేసిన మొదటి యుద్ధములో ఇంగ్లీషువారు జయమొందుటకు వారికి నైజామును మహారాష్ట్రులును చేసిన సహాయమేగద కారణము. మహారాష్ట్ర సైన్యము వచ్చి చేరువరకు కారన్‌వాలీసు సేనలు యేమియు చేయలేక పోయెనని 1798 సం॥ జులై 6-వ తేదీన 'జోసియన్ వెబ్బ' అను మద్రాస్ గవర్నమెంటు సెక్రటరీ తన మిమోరాండము లో వ్రాసియుండెను. అయితే, యీ పర్యాయము మహారాష్ట్రులుగాని, నైజాము గాని, సహాయము చేస్తారో చేయరోయని ఇంగ్లీషువారికి అనుమానముగా నుండెను. ఈ సంగతిని మద్రాస్ గవర్నమెంటు శెక్రటరీ తన మిమోలో స్పష్టముగ వ్రాసి యుండెను. వెనుకటి యొడంబడికల ప్రకారము వారిరువురు ఇంగ్లీషువారికి సహా యము చేయవలసి యున్నమాట వాస్తవమేయైనను, ఇంగ్లీషువారిప్పుడు టిప్పూతో చేయతలబెట్టిన యుద్ధము కేవలము అకారణమును, అక్రమమునునై యున్న హేతువు చేత వారైనను యిప్పుడీ యక్రమ యుద్ధములో సహాయము చేతురో చేయరో యని వెల్లస్లీ తన మనస్సులో సందేహింపసాగెను. పాపపుమనస్సాక్షికి జంకువుండును గద. అందుచేత అసలీ సంగతినే వారితో సంప్రతించకుండ, తానొక్కడే టిప్పూ పైకి పోవునట్లును, యీలోగా నైజాము, మహారాష్ట్రు లిరువురు తనకు వ్యతి రేకముగవచ్చి టిప్పూసుల్తానుకు మద్దతు చేయకుండ వారిని తనవలలో వేసుకొని వారిని నిర్వీర్యులుగనో, తటస్థులుగనో, చేసివేయవలెననియు వెల్లస్లీ గొప్పపతక మును పన్నెను-ఇందుకితడిట్లు కువాదమును చేయసాగెను :—

"మన స్నేహితులగు నైజామును, మహారాష్ట్రులును, బలహీనులుగ నున్నారు. టిప్పూతో యుద్ధమువచ్చేటట్టయితే వారుమనకు బలముగ సహాయము చేయలేరు. కాబట్టి, ముందుగ మన స్నేహితులను బలపరచవలెను. అనగా వారికి మన సేనలను అద్దెకివ్వవలెను. వారిని మన "అద్దె సేనల స్కీము"లోనికి తేవలెను."

ఇది వెల్లస్లీచేసిన కువాదము. ఇందులో అన్నియు అసందర్భములు, కుచ్చితపుబుద్ధులు తప్ప యింకేమియు లేవు. ఎట్లనగ, టిప్పూతో చేయదలచుకొన్న యుద్ధము న్యాయమో అన్యాయమో యనుమాట నటుండనిచ్చి చూతము. తమ మిత్రులగు నైజామును, మహారాష్ట్రులును, దుర్బలులుగ నున్నారనియు, వారికి తగు బలమునిచ్చినగాని వారు వెనుకటి యొడంబడిక ప్రకారము తనకు సహాయము చేయ జాలరనియు వెల్లస్లీ తన మనస్సులో కల్పించుకున్నవాదము కేవలము మిథ్యావాదము. ఈ మిత్రులు ఇంగ్లీషువారికి సహాయము చేయగల స్థితిలోనున్నారో లేదో తెలిసికొనుట కింతవరకెన్నడును అవకాశమే రాలేదు. అట్టి నిదర్శన మేమియు లేకయే, వెల్లస్లీ యిట్లూహించుకొనుట కేవలము టక్కరు తనము. తన అద్దెసేనల స్కీము అనబడు ఉరిని తనమిత్రుల మెడకు తగిలించి, వారని నిర్వీర్యులను చేసి కూర్చుండబెట్టి, తాను నిరాటంకముగ టిప్పూపైకి దూకవచ్చునను కుచ్చితపు తలంపుతో వెల్లస్లీ యీ కువాదనకు దిగినాడు. తాను టిప్పూతో తలబెట్టిన యుద్ధము అక్రమమైనది. ఈ సంగతి వెల్లస్లీకి బాగా తెలియును. కావుననే అతనికీభయము, అనుమానము. ఈ ప్రశంస గనుక తనమిత్రులతో యెత్తినట్లైన వారు తనకు సహాయము చేయకపోగా ఎదురుతిరిగి టిప్పూపక్షమున చేరుదురేమో యని కూడ వెల్లస్లీకి భయముకద్దు. కాబట్టి తనకు సహాయము చేయకపోయినా, వారుశత్రుపక్షమున చేరకుండుటకుగాను ముందుగ వారినికట్టి పడవేయవలెనని వెల్లస్లీ యీ దొంగయెత్తువేసెను. ఈ కువాదనలోని రహస్యమిది! ఈ యద్దెసేనలవలలో వెల్లస్లీ నైజాము నెట్లుపడగొట్టినదియు లోగడ చెప్పియుంటిమి. కాని, మహారాష్ట్ర నాయకుడగు పీష్వా యింకను యీవలలో పడలేదు. పునహాలో రెసిడెంటుగనున్న పామరువేసిన మంత్రము పారలేదు. దీనికికారణమును దరిమిలా చెప్పెదము. ఎప్పుడైతే పీష్వా తనవలలోపడక తప్పించుకొనెనో అప్పుడు వెల్లస్లీ యింకొక యెత్తువేసెను. టిప్పూతోడి యుద్ధములో మహారాష్ట్రుల సహాయమును అడుగకుండ, వారిని తటస్థులుగ చేసినైచిన చాలునని వెల్లస్లీ తలంచెను. మహారాష్ట్రులు టిప్పూసుల్తానుకు సహాయము చేయకుండగను, తమ ఇంగ్లీషురాజ్యము మీదికి దండెత్తి రాకుండగను ఊరికేవుంటే చాలురాయని వెల్లస్లీ తలంచెను.

వెల్లస్లీ మహారాష్ట్రుల సహాయముకోరక పోవుటకు ఒక కారణమున్నది. మహారాష్ట్రులనిన ఇంగ్లీషువారికి మొదటినుండియు భయము, యీర్ష్యయునుండెను. దీనికొక నిదర్శనము చూడుడు. వెనుక కారన్‌వాలీసు టిప్పూపైకి పోయినప్పుడు,

యీ పని చాల అక్రమమని కొందరు పార్లమెంటులో నిందించగా, దానికి మరికొం దరిట్లని సమాధానము చెప్పిరి. "మన ఇంగ్లీషువారి శ్రేయమునకు ఇండియాలో గొప్ప ఆటంకము వచ్చునది మహారాష్ట్రులవల్లనే కాబట్టి, మైసూరు రాజ్యమును మనము జయించి చేతపుచ్చుకొన్నగాని, మనము వీరితో నెగ్గలేము అనిరి." "ఇట్టి మహారాష్ట్రులను టిప్పూపైకి మనతోకూడ రమ్మని వారిసహాయమును అడిగేయెడల జయించుకొన్న రాజ్యములో వారికికూడ భాగము పెట్టవలసి వస్తుంది. అప్పుడు వారిబలము మరింత హెచ్చయి తుదకు మనప్రాణం తీస్తుంది" అని వెల్లస్లీ భయపడసాగెను. అందుచే, తనకు సహాయము రండని వెల్లస్లీ మహా రాష్ట్రులనంతగ నొక్కి యడుగలేదు. పైగా వారుసహాయము చేస్తామన్నాకూడా నాకక్కరలేదని నిరాకరించెను. దీనితో అతడు మొదట కల్పించినవాదన టక్కరు వాదనయని బట్టబయలైనది. మహారాష్ట్రులు వెనుకటి యొడంబడిక ప్రకా రము తనకు సహాయము చేయలేని దుర్బలస్థితిలో నున్నారనియు, అందుచేవారికి అద్దెసేనల నంటగట్ట వలయుననియు, వెల్లస్లీ మొట్టమొదట చేసినవాదము దొంగ వాదమని యిప్పుడు బట్టబయలైనది. ఈ అద్దెసేనల స్కీములోని దొంగతనమిప్పుడు తేటతెల్లమైనది. ఇంగ్లీషువారు దేశీయరాజులకు తమ ఇంగ్లీషుసేనలను అద్దె కిచ్చుట దుర్బలులగువారిని బలయుతులను చేయుటకుకాదు. బలయుతులను దుర్బ లుల జేయుటకేయని యెరుంగునది.

అయితే వెల్లస్లీ, మహారాష్ట్రులిచ్చెదమన్న సహాయమును పుచ్చుకొనకుండ టిప్పూతో యుద్ధము చేయుచున్న సమయమందు తాను వారినెట్లు తటస్థులుగ నుంచెనో చూతము. భేదోపాయమే దీనికి మూలము. ఈ భేదోపాయమెట్లు పని చేసెనో చూతము. పునహాలో సింహాసనముపై పీష్వా బాజీరావు కూర్చుండియుండెను. ఇతడు సింహాసనమునకు వచ్చుటకు దౌలత్ రావు సింధియా చాల సహాయముచేసెను. ఇతని సహాయమే లేనిచో బాజీరావు సింహాసనమెక్కనే లేకపోయెడివాడు.

దౌలత్ రావు, బాజీరావుల మధ్య భేదకల్పన.

సింహాసనమెక్కిన తరువాతకూడ బాజీరావు సింధియా సలహాసంప్రతింపుల తోడనే రాజ్యమేలుచుండెను. దౌలత్ రావు సింధియా యీ రీతిగ బాజీరావుకు చేదోడు వాదోడుగనుండెను. ఈ మిత్రులిరువురకు భేదము పుట్టించినగాని, పీష్వా తమవలలో పడడని వెల్లస్లీ తలంచెను. ఈ పనికి వెల్లస్లీ పునహా రెసిడెంటగు పామరును తగిలిం చెను. ఇతడు బాజీరావు చెవిని యిల్లు గట్టుకొని దౌలత్ రావు సింధియాపై యేవేవో కొండెములు చెప్పసాగెను. "నీవు దౌలత్ రావు వలలో పడిపోయినావు. అతడు నిన్ను పిండిబొమ్మనుచేసి తన చేతులలో పెట్టుకొని ఆడించుచున్నాడు. నీ వతనికి ఖైదీవై పోయినావు. నీవతనికి బానిసవైనావు. నీకిదేమిఖర్మము"అను ఘోర ణిని బాజీరావు చెవిలో నిత్యము నూరిపోసి, బాజీరావుకు దౌలత్ రావుపై

అసహ్యము పుట్టునట్లు ఇంగ్లీషు రెసిడెంటు పెద్దప్రయత్నములు చాటుచాటున చేయసాగెను. చెప్పుడుమాటలు చేటుదెచ్చునుగద! చెప్పగ చెప్పగ యెంతటివాని కైనను పుట్టునుగద రిమ్మ తెగులు. అసత్య ప్రచారములచే లోకుల మనస్సులు విరచి మోసగించు దుర్బుద్ధి ఇంగ్లీషువారికి ఉగ్గుపాలతో పుట్టినది. ఈ తంత్రమునే వెల్లస్లీ పామర్ ద్వారా పీష్వాను దౌలత్ రావునుండి విడదీయుటకై ప్రయోగించెను. ఇది మిత్రభేదతంత్రము—బిడ్డను తల్లి చంకనుండి దిగలాగు దుస్తంత్రము.

నైజాము పరాసువారిని తనసేనలలో చేర్చుకొన్నాడు. కాబట్టి, వారిని తీసివేసి ఇంగ్లీషు సేనల నక్కడ చేర్పించుట అవసరమను సాకును వెల్లస్లీ నైజామును వలలో వేసుకొను సందర్భమున చెప్పియుండెను. అయితే, పీష్వా విషయములో అట్టి సాకు యేమియు లేదు. పీష్వా సేనలో ఫ్రెంచివారు లేరు. అయితే, దౌలత్ రావు సింధియా సేనలో ఫ్రెంచివారు న్నారు ఇక నేమి? వెల్లస్లీకి సాకుదొరికినది. ఫ్రెంచి సేనలను పెట్టుకొన్న సింధియా పలుకుబడిలో పీష్వా వున్నాడు కాబట్టి, అతడు ఫ్రెంచివారి పలుకుబడిలో వున్నట్లే! కాబట్టి, అతనిని సింధియానుండి విడగొట్టి అతనికి మన ఇంగ్లీషు సేనల నంటగట్టి, అతనిని మన వలలో వేసుకోవలెనని వెల్లస్లీ తన చర్యలను సమర్థించుకొనజూచెను. అంతేగాని, సింధియా సహాయముతో సింహాసనము నకువచ్చిన పీష్వా బాజీరావు సదరు సింధియాయందు కృతజ్ఞుడై, అతనియందు మిత్రభావముతోనుండుట సబబేగదాయని వెల్లస్లీ తలంపడయ్యెను. పైపెచ్చు, సింధియా పీష్వాను తనవలలో వేసుకొని హింసించుచున్నాడను అపవాదమును వెల్లస్లీ లోకములో వ్యాపింపజేయ సాగెను. ఈ విధముగ సింధియా చేతులలో చిక్కి బాధపడుచున్న తన మిత్రుడగు పీష్వాపై వెల్లస్లీ యెక్కడలేని దుఃఖబాష్పములను రాల్చెను. ఆహా! యేమి, యీ దొంగయేడుపు. మొసలి మనిషిని నీళ్లలోనికి యీడ్చుకొనివెళ్లి, చంపితినుటకుముందు వానిని ముందుపెట్టుకొని, అయ్యో నీవు చచ్చిపోతున్నావా! అనిచెప్పి యేడ్చి, దుఃఖబాష్పములరాల్చి, పిమ్మట చంపితిని వేయునట! పీష్వా బాజీరావుపై వెల్లస్లీ రాల్చిన యీ దుఃఖబాష్పములును మొసలి దుఃఖబాష్పములవంటివే! పీష్వాపై తనకంతటి ప్రేమయే యుండియుంటే, వెల్లస్లీ యేల తాను సింధియాపై బహిరంగముగ దండెత్తిపోయి, తన మిత్రుడగు పీష్వాను అతని చెరనుండి విడిపించలేదు? తమ మిత్రుడగు తిరువాన్కూరు రాజును కాపాడుటకై తాము టిప్పూపై దండెత్తుచున్నామని వెనుక సాకుచెప్పిన ఇంగ్లీషువారు, యిప్పు డేల తమ మిత్రుడగు పీష్వాను సింధియా చెరనుండి విడిపించుటకై బయలుదేర రైరి? ఇవన్నియు వట్టి దొంగమాటలు!

తమ మిత్రుడగు పీష్వా "అయ్యో సింధియా చెరలోనున్నాడని" వెల్లస్లీ యేడ్చిన దొంగయేడ్పులన్నియు అతనిని సింధియానుండి చీలదీసి, మహారాష్ట్ర రాజ్యమును తుత్తునియలుగ పగులకొట్టుటకై యేడ్చిన వగలమారి యేడ్పులే!

పీష్వాకు ఇంగ్లీషువారి అద్దె సేనలు అక్కరలేదను సంగతి వెల్లస్లీకి తెలియును. బాజీరావు దుర్బలుడనియు, అతనిని సింధియా నుండియు, యితర మహారాష్ట్ర నాయకుల నుండియు చీలదీసి తన వలలో వేసుకొన్నచో, మిగతా వారినందరిని ఒక్కొక్కరినే సులభముగ తననోట వేసికొనవచ్చుననియు వెల్లస్లీ సంకల్పము. ఈ సంకల్పమును నెరవేర్చుకొనుటకే వెల్లస్లీ యిన్ని పాట్లుపడినాడు. ఇన్ని అసత్య ప్రచారముల సాగించినాడు—ఇన్ని దొంగ యేడుపుల యేడ్చినాడు. పీష్వాకు సింధియా విరోధియనియు, ఇంగ్లీషు వారొక్కరే అతనికి స్నేహితులనియు దుర్బలుడగు బాజీరావు చెవిలో వెల్లస్లీ రోజురోజు విషమును నూరిపోయించినాడు.

వెల్లస్లీ ఇండియాలో అడుగు పెట్టినతరువాత పునహా రెసిడెంటు పామరుకు వ్రాసిన మొదటి యుత్తరములోనే వెల్లస్లీ యిట్లని వ్రాసెను. ఈ ఉత్తరము 1798 సం॥ జులై 8-వ తేదీన వ్రాయబడినది. ఇది రహస్యమైన వుత్తరము :—

[ఈసందిగ్ధ తరుణములో మన పునహావ్యవహారములు మీవంటి ప్రజ్ఞావంతుల చేతులలో వున్నవని వినుటకు నాకు పరమానందమైనది. ఇప్పుడు దేశీయరాజులతో మన మవలంబించబోవు రాజనీతి స్వభావమెట్టిదో నేను పబ్లిక్గ పంపించిన కాగితములవల్ల మీరు తెలిసికొనగలరు. ఈస్కీమును మీరు మిక్కిలి జయప్రదముగ కొనసాగింపగలరని నావిశ్వాసము. అయితే పబ్లిక్ ఉత్తరములో వ్రాయ వీలులేనిరహస్యపు సంగతియొకటిగలదు. దానినిట మీకు తెలుపుచున్నాను. అదేమనగ:—నానాఫర్నవీసు యిప్పుడు ప్రవాసములోనున్నాడు. మనకనుకూలమగు షరతులతో ఆతనిని మనము మన ప్రజ్ఞవల్ల విడిపింపగలిగితే, అదిచాలా మంచి యెత్తు. ఈయెత్తు పారుటకు అవకాశమేమైనా దొరుకుతుందేమో మీరు చూడండి— (క్లుప్తము).]

కాని, యీవుత్తరము పామరకు చేరక పూర్వమే దౌలత్ రావు సింధియా నానాఫర్నవీసును చెరనుండి విడిపించి, అతనితో సఖ్యపడెను. ఇదియింగ్లీషువారి కెంతయో ఆశాభంగమయ్యెను. ఏలననగ, నానావిడుదల తమ కనుకూలమగుషరతులపై జరుగలేదు. నానాకు యూరోపియనుల యెడ గల విముఖత్వము ఇంగ్లీషువారికి బాగా తెలియును. అట్టివాడిప్పుడు పునహా దర్బారులో అధికారము వహించియుండెను. అందుచే, తమయాటలక్కడ సాగవని ఇంగ్లీషువారు భయపడ సాగిరి.

దౌలత్ రావు, నానాల సఖ్యము.

నానాఫర్నవీసు ప్రవాసమునుండి విడుదలయై, తిరిగి రాజ్యాధికారము వహించి చూచునప్పటికి, మహారాష్ట్రమంతయు చాలా అల్లకల్లోలముగ నుండెను. ప్రతిచోట అరాచకములు, విప్లవములు, కుట్రలు, చెలరేగుచుండెను. ఈగల్లంతులకన్నిటికి చాలవరకు ఇంగ్లీషువారే కారకులని చెప్పవలసియున్నది. ఏలననగ, దేశీయరాజుల రాజ్యములలోగల అసంతృప్తిని, యీర్ష్యా ద్వేషములను అవకాశముగ తీసికొనవలసినదని వెల్లస్లీ తరుచు తన రెసిడెంటులకు వ్రాయుచుండెను. అనగ, దేశీయరాజ్య

ములలో అంతః కల్లోలముల పుట్టించమనియే యీమాటల కర్థము. అట్లుగానిచో, యిదివరకులేని అంతఃకల్లోలములు, గృహకల్లోలములు, యీ ఇంగ్లీషువారు వచ్చినతరువాత—ఒకరాజ్యములోగాదు—అన్నిరాజ్యములలోను పుట్టుటకు కారణ మేమి? తనమహారాష్ట్ర రాజ్యములో యీరీతిగ ఇంగ్లీషువారు అంతః కలహముల గల్పించుటయేగాక, ప్రక్కనున్న నైజామును మోసగించి, అతనిని అదె సేనల వలలో పడవేసుకొన్న సంగతికూడ నానాఫడ్నవీసు గమనించెను. ప్రక్కదొడ్డిలో జొరబడిన జంతువు తన దొడ్డిలోకూడ జొరబడునేమోయని నానాఫడ్నవీసు ఆదుర్దాపడుటలో ఆశ్చర్యమేమి? నైజాము తన చిరమిత్రులును, పొరుగింటి వారును నగు మహారాష్ట్రులతో సంప్రదింపనైన సంప్రదించకుండ, మెదలకుండ ఇంగ్లీషువారు పన్నిన అద్దెసేనల మెరను ఆలింగనమొనర్చుకొనెను. నైజాము కుర్డ్లాయుద్ధములో మహారాష్ట్రుల చేతులలో ఓడిపోయినప్పుడు, వారు అతనిపై కఠినమైన షరతులు విధింపక, చాలదాక్షిణ్యము జూపియుండిరి. కావున నైజాము తమయెడ కృతజ్ఞుడై యుండునని మహారాష్ట్రులు తలంచుట సహజమేగద. కనీసము ఇంగ్లీషువారు వేసిన మెరను ఆలింగన మొనర్చుకొనుటకుముందు దానిస్వభావ మెట్టిదో, దీనిలో తాను ప్రవేశించుట మంచిదగునోలేదో, యని మాటమాత్ర మునకైనను నైజాము మహారాష్ట్రులతో కొంచెము సంప్రదించిన బాగుండెడిది. నైజాము యీమాత్రమైనను చేయలేదు. ఇక ఇంగ్లీషువారన్నారో ఒకరిసంగతి ఒకరికి తెలియకుండచేసి నైజాము, మహారాష్ట్రులను వేర్వేరుగ తమ వలలో పడ గొట్టుకొనుటకు యేర్పాట్లు చేసికొనిరి. "వ్యవహారమంతయు పరిష్కారమగువరకు హైదరాబాదులో జరుగుచున్న సంగతిని పీష్వాకు తెలియనీయకసుమా" యని వెల్లస్లీ పునహాలోనున్న తన రెసిడెంటును హెచ్చరించుచు వ్రాసెను. నైజాము, మహారాష్ట్రులు ముందుగ కలిసి సంప్రదించుకొనియుంటే బహుశః వెల్లస్లీమెత్తు సాగెడెదికాదేమో! నైజాము వెల్లస్లీమాయలో పడెడివాడు కాదేమో! తీరా నానాఫడ్నవీసు ప్రవాసమునుండివచ్చి చూచునప్పటికి నైజాము అప్పటికప్పుడే వలలో పడిపోయెను. మించిపోయినదాని కతడేమి చేయగలడు? కాబట్టి, కనీసము యిక పీష్వానైనను వెల్లస్లీ వలలో పడకుండ చేయవలెనని నానాఫడ్నవీసు బ్రతికి యున్ననాళ్లు పాటుపడెను. మహారాష్ట్రమును తిరిగి దిట్టపరుపనెంచెను. మహారాష్ట్రులలో బలవంతుడగు దౌలత్ రావు సింధియాతో నానాఫడ్నవీసు సఖ్యపడెను.

కాశీరావు హోల్కారును దౌలత్ రావు సింహాసన మెక్కించుట.

సింధియాకు విరోధిగ నుండిన తుకాజీ హోల్కారు 1797 సం॥ ఆగష్టు 15-వ తేదీన చనిపోయెను. కాశీరావు, మల్హర్ రావు అను అతని ఔరసపుత్రులలో తగాదావచ్చెను. యశ్వంతరావు, విఠోజీయను యిరువురు దాసీపుత్రులు మల్హర్ రావు పక్షమువహించిరి. కాశీరావు దౌలత్

రావు సింధియా సహాయమపేక్షించెను. దౌలత్ రావు ఆ ప్రకారమే కాశీరావుకు సహాయముచేసి మల్ హార్ రావును యుద్ధములో ఓడించెను. ఈ యుద్ధములో మల్ హార్ రావు చనిపోయెను. దాసీపుత్రు లిరువురిలో యశ్వంతరావు నాగపుర మునకును, విఠోజీ కొల్లాపురమునకును పారిపోయిరి. ఈ రీతిగ దౌలత్ రావు సింధియా కాశీరావు హోల్కారును సింహాసనమెక్కించి, అతనిని తనమిత్రునిగ జేసికొనెను. మహారాష్ట్రమునంతను తిరిగి దిట్టపరుపవలెనని దౌలత్ రావు సంక ల్పించెను. ఇతనికి నానాఫర్నవీసునూ తోడ్పడెను. ఇప్పుడీ యిరువురు మహారాష్ట్ర మునకు పెట్టని కోటలుగ నుండిరి.

నైజాము వెనుక మహారాష్ట్రుల చేతులలో కుర్డ్లా యుద్ధములో ఓడిపోయి, వారితో సంధిచేసుకొనెను. కాని, ఆసంధి షరతుల నతడింకను పూర్తిగ చెల్లింప లేదు. ఈలోగా ఇంగ్లీషువారువచ్చి అతనిని తమవలలోనికి లాగికొనిరి. వీరీ సంధి షరతులను నైజాముచేత నెరవేర్పించుటకు తోడ్పడునట్లు కనపడరైరి. ఈకారణముచే మహారాష్ట్రులు నైజాము మీదికి దండెత్తుదురేమో యని ఇంగ్లీషువారు అనుమాన పడజొచ్చిరి. నైజాముపై పడి అతని నోడించుటయేగాక, వారు టిప్పూసుల్తానుతో చేరుదురేమో యనికూడ ఇంగ్లీషువారు భయపడజొచ్చిరి. అంతయేల, మహా రాష్ట్రులు నైజాముపై దండెత్తుటకును, టిప్పూతో చేరి ఇంగ్లీషువారికి ప్రతికక్షిగ నిలుచుటకును యేర్పాట్లు జరిగినట్లే 1799 సం॥ ఏప్రిల్ 8-వ తేదీన రెసిడెంటు వెల్లస్లీకి వ్రాసెను. ఇందెంతవరకు సత్యమున్నదో చెప్పజాలము. ఒకవేళ మహా రాష్ట్రు లిట్లు చేయ సంకల్పించుకొన్నను అందు దోషమేమి? అది దౌలత్ రావు సింధియాయొక్క రాజనీతిజ్ఞతనే తెలుపునుగాని వేరొండుకాదు.

దౌలత్ రావు నెడ ఇంగ్లీషువారి భయము.

దౌలత్ రావు సింధియా యారీతిగ పీష్వా బాజీరావుకు పెట్టనికోటగనుండి, అతనిని ఇంగ్లీషువారి వలలో పడనీయక పోవుటయేగాక, వారు వడిలోవేసుకొన్న నైజాముపై దండెత్తుటకును, వారి శత్రువగు టిప్పూసుల్తానుకు సహాయముచేయు టకును కూడ సంసిద్ధముగ నున్నట్లు వెల్లస్లీకి తోచెను. కాబట్టి, యితనిని పునహాలో లేకుండజేసి, ఉత్తర హిందూస్థానములో యితని రాజధానియగు గ్వాలియరుకు పంపించివేసినగాని యితని పలుకుబడి పునహాలో తగ్గదని వెల్లస్లీ ఆలోచనచేసెను. ఈపనిని సాధించుటకై — అనగ దౌలత్ రావు సింధియాను పున హానుండి లేవగొట్టుటకై —వెల్లస్లీ యెన్నో యెత్తులువేసెను. ఒక యెత్తు తప్పి పోతే యింకొకయెత్తు వేసెను. ఈ యెత్తులలో ఆతని వక్రబుద్ధి గోచరమగు చున్నది. ఆ యెత్తుల కొన్నిటి నిట క్లుప్తముగ వివరించెదము.

దౌలత్ రావును పునహానుండి లేవగొట్టు యత్నములు.

(1) ఆఫ్ఘను దండయాత్ర పుకారు.

వానిలో మొదటియెత్తు యిది. ఆఫ్ఘను నాయకుడగు 'అహమ్మద్ షా అబ్దాలీ' వెనుక మహారాష్ట్రులను పానిపట్టు యుద్ధములో ఓడించెనుగద. అందుచే అతనిపేరనిన మహారాష్ట్రులు హడలుదురని వెల్లస్లీ తలంచి, అతని మనుమడగు ''జమాన్‌షా'' 1798 సం॥ అక్టోబరు 10-వ తేదీన ఇండియాపైకి దండెత్తి రానున్నాడను పుకారును వెల్లస్లీ తన యేజెంట్లచేత పుట్టించెను. ఇది వట్టి పుకారనుమాట వెల్లస్లీకి బాగుగ తెలియును—గ్రాండుడఫ్, మిల్లు మున్నగు చరిత్రకారులు కూడ యిది వట్టి పుకారనియే చెప్పిరి. అయినను, యీ పుకారు పుట్టించినచో దౌలత్‌రావు తన రాజధానియగు గ్వాలియరును రక్షించుకొనుటకై పునహా పట్టణము వదలిపెట్టి ఉత్తరమునకు పరుగెత్తునని వెల్లస్లీ ఆశపడెను. ఈరీతిగ అతనిని పునహానుండి లేవగొట్టవచ్చునని వెల్లస్లీ తలంచెను. కాని, జమాన్‌షా యిప్పుడు ఇండియాపై దండెత్తివచ్చుట అసంభవమని దౌలత్‌రావుకు బాగుగా తెలియుటచే, అతడీ పుకారులకు జంకక, పునహాలోనే పీఠమువేసుకొని కూర్చుండెను. ఇట్టి పుకారులను వెల్లస్లీ మాత్రమేగాక, యితనికి పూర్వము చాలమంది గవర్నర్ జనరలులు కూడ పుట్టించి, అయోధ్య వజీరును తమవలలో వేసుకొనుటకై ప్రయత్నించినట్లు మిల్లుచరిత్రకారుడు వ్రాయుచున్నాడు.

(2) సింధియారాజ్యములో ఇంగ్లీషువారు అల్లరులు రేపుట

ఈ పుకారులేమియు యిప్పుడు దౌలత్‌రావు మీద పనిచేయనందున, అతనిని పునహానుండి లేవగొట్టుటకు వెల్లస్లీ యింకొక యెత్తువేసెను. అదేదనగ:—అతని గ్వాలియర్ రాజ్యములో అంతః కల్లోలముల గల్పించుటయే. ఇది రెండవయెత్తు. ఈపనికై వెల్లస్లీ సింధియా దర్బారుకు 'కాలిన్సు' అనురెసిడెంటును పంపించెను. ఇట్లు పంపించుటలో అతడు చెప్పిన ముఖ్యోద్దేశమేమనగ:—'జమాన్‌షా' ఇండియాపైకి దండెత్తిరానున్నాడు కాబట్టి, అతని నెదిరించుటకై సింధియాతో కలిసి, సంప్రదించి, సింధియాతో స్నేహ మేర్పరచుకొనుటకట! కాని, యిది వట్టిటక్కరుమాట! ఏలననగ, యిదియే వెల్లస్లీయొక్క నిజోద్దేశమైనచో, కాలిన్సు పునహాలోనున్న దౌలత్‌రావు సింధియావద్దకు నేరుగపోక, అతని రాజధానియగు గ్వాలియరుకేల సరాసరి పోవును? సింధియాలేని సమయము చూచి ఇంగ్లీషు రెసిడెంటు యేల అతని రాజధానిలో జొరబడవలెను? ఈ రెసిడెంటు నిట్లు గ్వాలియరుకు పంపునప్పుడు వెల్లస్లీ అతనిని చాలసేపు తనదగ్గర కూర్చుండబెట్టుకొని, అతడక్కడ చేయవలసిన పనులనన్నిటిని-వ్రాతమూలముగగాక-నోటిమాటలతో చెప్పి పంపెనట! ఆమాటలేమిటో మన మూహించుట కష్టమా? ఇది ఇంగ్లీషువారు ఉగ్గుపాలతో త్రాగిన విభేదతంత్రము. సింధియా కొలువులోను రాజ్యములోను వున్నవారికి లంచ పంచము లిచ్చియు, సింధియాపై కొండెములు చెప్పియు, వారి మనస్సులు విరిచి, వారికతని

పై ద్వేషము గల్పించి, సింధియా బలమును క్రుంగదీయుటయే. వెల్లస్లీ తనరెసిడెం టగు కాలిన్సుకు చెప్పిపంపినతంత్రము. ఈతంత్రమును 'కాలిన్సు' గ్వాలియరులో చేరి సింధియారాజ్యములో బాగుగ సాగించినట్లు కనిపించుచున్నది. అయినను, సింధియా పునహానువదలిరాక, యింకను అక్కడనే కనిపెట్టుకొని యుండెను. వెల్లస్లీ వేసిన యీ రెండవ మంత్రము కూడ పారలేదు. కాబట్టి, వెల్లస్లీ యిప్పుడే మన్నాడు?-సింధియా రాజ్యమంతా నానా అల్లకల్లోలముగనున్నది. ఎక్కడ చూచి నను అంతఃకలహములే. దీనితో సింధియా యధికారము ఉత్తర హిందూస్థానములో క్షీణించిపోవు చున్నది కాబట్టి, యితనితో మనము స్నేహము చేసికొనుట యేమియు ప్రయోజనములేదని, వెల్లస్లీ తన సీమ యజమానులకు వ్రాసెను. అయితే, యీ అంతఃకల్లోలములు గల్పించుటకు తానే కారకు డనని వెల్లస్లీ యేల వ్రాయలే దు? తనయెత్తు సాగలేదు కాబట్టి, దౌలత్ రావు రాజ్యముపై యేదో రాయివిసరిన గాని వెల్లస్లీకి తృప్తి లేదు కాబోలు!

రెండుయెత్తులు చెడిపోయినవికాబట్టి వెల్లస్లీ యికమూడవ యెత్తు వేసి నాడు. దౌలత్ రావు సింధియా అయోధ్యలో పదభ్రష్టుడైన వజీరాలీతోచేరి కుట్ర పన్ని అతనిని అయోధ్య సింహాసనముపై కూర్చుండబెట్ట యత్నించుచున్నట్లు వెల్లస్లీ ఒక పుకారును కల్పించెను. ఈ పుకారును పునహాలోనున్న రెసిడెంటుకు తెలిపి, "దౌలత్ రావు యిట్లుచేయుట మనకు చాల ద్రోహము. ఆతడిట్టి ద్రోహకార్యము చేయదలచుటకు గల హేతువే మియో నీవు కనిపెట్టుటకు బహుజాగరూకతతో నుండ వలెను. అతడుచేయు ప్రతిపనిని నీవు అప్రమత్తతతో కని పెట్టి చూచుచుండి యెప్పటిసంగతి అప్పుడు నాకు తెలియపరచుచుండుము — నీవు దౌలత్ రావుపై ఒకకన్ను వేసి యుంచుము" అని వెల్లస్లీ 1799 సం॥ మార్చి 3-వ తేదీన పునహా రెసిడెంటుకు రహస్యపు టుత్తరము వ్రాసెను. దౌలత్ రావు వజీరా లీతో కుట్రపన్నుచున్నాడన్న సంగతి యీ రహస్యపు టుత్తరములో తప్ప యిం కెక్కడను గన్పింపదు. కావున, యిది కేవలము అభూతకల్పనయని చెప్పవలసి యున్నది. దౌలత్ రావుపై కన్ను వేసియుంచి, అతడిట్టి కుట్రజేయుటకు కార మేమియో కనిపెట్టవలసినదని వెల్లస్లీ రెసిడెంటుకు వ్రాసినదాని ఆంతరంగికోద్దేశ మేమి ? ఏవో కారణములను కల్పించి, నీవు సింధియాపై కుట్రపన్నవలసినదను ప్రేరేపణ—యిషారా.—యీ వాక్యములలో గలదు. హైదరాబాదులోనున్న రెసి డెంటుకుకూడ వెల్లస్లీ ఆగోజుననే యిట్టి యుత్తరమునే వ్రాసెను. "మనము శ్రీరం గపట్టణమును (టిప్పూను) ముట్టడింపబోవు సమయముచూచి దౌలత్ రావు సింధియా నైజాము రాజ్యముపై బడవలెనని చూచుచున్నాడను సంగతిని నీవునైజాము మంత్రియగు అజమ్-ఉల్-ఉమ్రా చెవిలో కొంచెము ఊదియుంచుట మంచిదని నా

(3) అభూతకల్పనలు. "ఇదిగో తోక—అదిగో పులి."

యభిప్రాయ'' మని వెల్లస్లీ ఆ వుత్తరములో వ్రాసెను. అనగ, యీ పుకారును పుట్టించి నైజాముకు మహారాష్ట్రులకు పడకుండ చేయవలసినదని వెల్లస్లీ తన రెసిడెంటుకు కనుసంజ్ఞ చేసెనన్నమాట! ఈ కనుసంజ్ఞను కనిపెట్టియే మహారాష్ట్రులు (అనగ పీష్వా, సింధియాలు) నైజాముపై దండెత్తుటకును, టిప్పూతోచేరి ఇంగ్లీషు వారికి ప్రతికక్షిగ నిలుచుటకును యేర్పాట్లు కేవలము జరిగియుండినట్లే సదరు రెసిడెంటు 1799 సం॥ ఏప్రిల్ 8-వ తేదీన వెల్లస్లీకి వ్రాసెను. ఈ సంగతి నిదివరకు పైనచెప్పియుంటిమి. ఇట్టి పుకారులకు, అసత్యప్రచారములకు, వెల్లస్లీ ''ఇదిగో తోక''యని చూపుటయు, అంతట ''అదిగో పులి'' యని రెసిడెంట్లు అరచుటయు మామూలైనది. గవర్నర్ జనరలుగారి యిచ్చకము సంపాదించుకొనుటకై ఆతని సూచన కనుకూలముగ వీరు వార్తలను సృష్టించి వ్రాయుచుండిరి. ఇట్లు ఒకరి కొకరు తోడిదొంగలై (వెల్లస్లీ, రెసిడెంట్లు), 'థగ్గు' దొంగలవలె కన్నుగీటులచే రాజ్యముల దోచుకొనిరి.

(4) బీరారు రాజాను వాయించి చూచుట— సంస్కృత పండితుని రాయబారం-వేగులపని.

వెల్లస్లీ వేసిన నాల్గవ యెత్తుయేమియో చూతము. నైజాముద్వారా బీరారు రాజాతో స్నేహమేర్పరుచుకొని, సింధియాపైకిని టిప్పూపైకిని పోవుటకు వీలేర్పడునేమోయని వెల్లస్లీ తలంచెను. ఇందు నిమిత్తమై వెల్లస్లీ ''కోల్‌బ్రుక్'' అనురాయబారి నొకనిని బీరారురాజావద్దకు పంపించెను. ఈ ''కోల్‌బ్రుక్కే'' తదుపరి గొప్ప సంస్కృత పండితుడని ప్రఖ్యాతిగాంచెను. ఈ రాయబారికి వెల్లస్లీ 1799 సం॥ మార్చి 3-వ తేదీన యిట్లనివ్రాసెను:—

''బీరారురాజాయొక్క స్వభావమెట్టిదో, అతనిధోరణి యెట్లున్నదో, అతనికిగల సాధక బాధకములేమియో అతనికి సైన్యబల మెంతయున్నదో, ధనాదికములను యితర బలములేమి యున్నవో, టిప్పూసుల్తానుతోగాని, జుమాన్‌షాతోగాని మనకు యుద్ధము వచ్చేటట్లైతే, సదరు రాజాస్నేహమును మనము యెట్లు సంపాదించుకొన వీల్లున్నవో—యీసంగతుల మాత్రమే కనిపెట్టిరావలసినదని నీవిక్కడనుండి బయలుదేరినప్పుడు నేను నీకు నోటిమాటలతో చెప్పి పంపితిని.''

''అయితే, యీ బీరారురాజ్యమున్న స్థానమునుబట్టి చూడగ, దౌలత్‌రావు సింధియాను యెదిరించుటకు యీ రాజామనకు బాగా పనికివచ్చేటట్టు కనబడుచున్నాడు. ......కాబట్టి, నీవిప్పుడు తక్షణమే చేయవలసినపనియేమంటే, సింధియాపైకి పోవుటకుగాను మనము నైజామునుకలసి యీ బీరారురాజాతో స్నేహముకట్టుట కేమైనా వీలుచిక్కుతుందేమో నీవు ప్రయత్నించి చూడవలసినది. మరియు, యీ స్నేహకూటములో పీష్వాకూడ తన యిష్టమువచ్చి నప్పుడు వచ్చిచేరుటకు సందువుంచవలసినది.

......అయితే, యీస్నేహము కట్టుప్రయత్నమంతయు మనము సింధియాపైకిపోవుటకే యను సంగతిమాత్రము నీవు బీరారురాజాకుగాని, పీష్వాకుగాని, అంతయేల తుదకు నైజామునకు గాని చెప్పవద్దు. బీరారు రాజాయొక్క ధోరణిని కనిపెట్టుటకుచేయు ప్రథమప్రయత్నములో కూడ నీవు యీవిషయమై బహుమెలకువతో ప్రవర్తింపవలెను సుమా! మన భయమంతా టిప్పూసుల్తాన్‌పైననే వున్నట్లు పైకి కనబరచవలెను. అంతేగాని సింధియామాట పేరునకైనను నీవు బీరారురాజావద్ద యెత్తవద్దు. వీలైతే "టిప్పూవగైరా శత్రువులు" అను సామాన్యపదమును ప్రయోగించవచ్చును. (రహస్యమంతా "వగైరా" అనేమాటలో చేర్చియుంచవలెను.) అవసరమైతే, ఈపదములోని అర్థమును—అనగ "వగైరా" యను పదములో సింధియా పేరుకూడ యిమిడియున్నదని—అప్పుడు వాదించుదాము. పర్యాయితీసి మనకు అనుకూలముగ ఈమాటను ఉపయోగించుకుందాము. ఈప్రకారముగ నీవు బీరారురాజాతో స్నేహము కుదుర్చుటకు యేర్పాటు చేయవలసినది."—[క్లుప్తము.]

ఈ నాలుగు గాక, యింకొక అయిదవ యెత్తుకూడ వెల్లస్లీ వేసెను. అదేదనగ :—ఉత్తర హిందూస్థానములో సింధియా రాజ్యపు పొలిమేరల దగ్గిరగ పెద్ద ఇంగ్లీషు సైన్యమును వెల్లస్లీ పెట్టియుంచెను. ఇట్లీ సైన్యమును పెట్టి యుంచుటలోగల అంతరంగికోద్దేశమేమియో వెల్లస్లీ 1799 సం॥ మార్చి 3-వ తేదీన రెసిడెంటు పామరుకు వ్రాసిన రహస్యపుటుత్తరములో చెప్పియుండెను :—

(5) సింధియా పొలిమేరలో ఇంగ్లీషు సేన విడిది.

["సర్ జార్జి క్రెయిగ్ ఆధిపత్యమున అయోధ్య పొలిమేరలలోనున్న మనపెద్దసేన అక్కడనే నిలువయుండవలెను. ఏలననగ, యిక్కడ మనసేన నిలువయున్నదనే సంగతి సింధియాకుగాని, అతని సేనాధిపతియగు అంబాజీకిగాని తెలిసివుంటే, వారు మన కంపెనీకి వ్యతిరేకమైన పనులేమియు చేయరు. మనసేన అక్కడవుంటే చాలు, వారు మనకు వ్యతిరేకముగ రావడానికి జంకుతారు."—క్లుప్తము]

ఈ చర్యల నన్నిటిని జూచి ఇంగ్లీషువారు తన రాజ్యముమీదికి దండెత్తి రానున్నారని దౌలత్‌రావు సింధియా అనుమానపడెను. అందుచే, అప్పుడతడు పునహానుండి కదలి ఉత్తర హిందూస్థానములో తనరాజధానియగు గ్వాలియరుకు వచ్చివేసెను. ఈ రీతిగా దౌలత్‌రావును పునహానుండి లేవగొట్టు ప్రయత్నములో వెల్లస్లీ యెట్టకేలకు నెగ్గెను.

దౌలత్‌రావు పునహా వదలి గ్వాలియర్ వచ్చుట.

## వెల్లస్లీ పీష్వా సేనల తీసికోవలెనా? పీష్వా వెల్లస్లీ సేనల తీసికోవలెనా?

మరియు, టిప్పూతోడి యుద్ధములో మహారాష్ట్రులను అంతఃకల్లోల కల్పనలచే తటస్థులుగ నుంచివైచుటలోకూడ వెల్లస్లీ నెగ్గెను. అదిగాక, వారికి భాగము పెట్టవలసి వస్తుందనే భయముచేత, పీష్వా సహాయమును బంపెదనన్నను దానిని వెల్లస్లీ తీసికొనలేదు. మహారాష్ట్రులిచ్చెదనన్న సేనను తీసికొనక, పైపెచ్చు

వారికే తన ఇంగ్లీషు సేనలను అంటగట్టవలెనని వెల్లస్లీ యెత్తు. ఇంగ్లీషు సేనలను తీసికొనకుండ, తమ సేనలనే ఇంగ్లీషువారికి సహాయమివ్వవలయునని మహారాష్ట్రుల యెత్తు. ఈరీతిగ వెల్లస్లీయు, నానాఫర్నవీసు-యిసుకతక్కెడ పేడతక్కెడగాండ్లవలె-యెత్తులకుపైయెత్తులను వేయసాగిరి. దౌలత్ రావు సింధియా పునహానుండి వెడలి పోయిన తరువాత, పీష్వా బాజీరావును యీ అద్దె సేనల స్కీములో పడగొట్టవలెనని ఇంగ్లీషు రెసిడెంటు (పామరు) యెంతో ప్రయత్నించెను. కాని, యీ యెత్తును అప్పుడక్కడ ప్రధానిగనున్న నానాఫర్నవీసు పడనీయలేదు. "చూశారా? నైజాము ఇంగ్లీషు సేనలను అద్దెకు తీసికొన్నాడు-మీరుకూడ యేలతీసుకోరాదు-ఎంత బాగుంటుంది" అని పామరు బాజీరావుకు తియ్యనిమాటలను చెప్పెను. "ఎబ్బే, మాకెందుకు? మాదగ్గర కావలసినన్ని సేనలున్నవి. టిప్పూతో మీకు యుద్ధమువస్తే వెనుకటి ఒడంబడిక ప్రకారము మేము మీకు తప్పక సహాయము చేస్తాము. అందు విషయమై మీరేమియు అనుమాన పడవద్దు" అని బాజీరావుచేత నానాఫర్నవీసు బదులు చెప్పించెను. ఇందుకొరకై "పరశురామభా" యను సేనానాయకుని యాధిపత్యమున కొంతదండునుకూడ తయారుచేసి, ఇంగ్లీషువారికి సహాయముగ బంపుటకుకూడ నానాఫర్నవీసు సంసిద్ధము చేయించెను. కాని, వెల్లస్లీ యీ సేన నాకక్కర లేదనిచెప్పి నిరాకరించెను. ఈ నిరాకరణకు గ్రాంటు ఢఫ్ చరిత్రకారుడు కొన్ని కారణములను చెప్పినాడు:—ఇంగ్లీషువారు టిప్పూతో యుద్ధము ప్రారంభించిన పిమ్మట, పీష్వా తన దర్బారులోనికి టిప్పూ తాలూకు రాయబారులను రానిచ్చెననియు, వారినుండి నానాఫర్నవీసుకు తెలియకుండ పీష్వా బాజీరావు 13 లక్షల రూపాయలు సొమ్ము పుచ్చుకొని, టిప్పూసుల్తానుకు సహాయము చేయునట్లు రహస్యపు టొడంబడిక చేసుకొనెననియు,-యీ సంగతులు రెసిడెంటు పామరు ద్వారా వెల్లస్లీ తెలిసికొన్నవాడగుటచే, ఆతడీసైన్యమును నాకక్కర లేదని తిరుగ గొట్టెననియు 'గ్రాంటుఢఫ్' చెప్పుచున్నాడు. కాని, యీ కారణములు యెంత మాత్రము సరిగావనుటకు ఋజువులుగలవు. వానినిట క్లుప్తముగ వివరించెదము. పరరాజ్యపు రాయబారులను తమ దర్బారులలోనికి రానిచ్చుట దేశీయరాజులందరికి ఆ రోజులలో ఆచారమే. ఇందు వింతగాని, ప్రత్యేకపు కుట్రగాని యేమియు లేదు. అయినప్పటికి యీ రాయబారులను రానీయవద్దని వెల్లస్లీ కోరినమీదట పునహా వారు వారిని తమ మర్యాదకు వ్యతిరేకమనియైన తలంపక, వెల్లస్లీని తృప్తిపరచుటకు గాను—టిప్పూ రాయబారులను తమ దర్బారునుండి వెడల గొట్టిరి. అయినప్పటికి రెసిడెంటు యీ సంగతిని వెల్లస్లీకి తెలుపక, "టిప్పూ రాయబారులింకను పునహాకు దక్షిణముగ 25 మైళ్ల దూరములోనున్న కిర్వీగ్రామములోనే యున్నారనియు, వారితో పునహావారింకను రాయబారములు జరుపుచునే యున్నారనియు," వెల్లస్లీకి వ్రాసెను.

ఇక బాజీరావు నానాఫర్నవీసుకు తెలియకుండ టిప్పూ రాయబారుల నుండి 13 లక్షలు పుచ్చుకొన్నాడని చెప్పినమాట యెంతమాత్రము నమ్మశక్యము కాదు. ఏలననగ, నానాకు తెలియకుండ పునహా దర్బారులో నేమి జరుగుటకును వీలుకాదు. అతడు చారచతురుడు. అతని చారశాఖ లోకములో చాల ప్రసిద్ధికెక్కినది. దీనినిగూర్చి లోగడ కొంత చెప్పివేయుంటిమి. కాబట్టి, నానాకు తెలియకుండ యీపని జరిగినదంటే, ఆమాట కేవలము అసంభవమనియే చెప్పవలసియున్నది. రెసిడెంటు పామరు, బాజీరావును తనవలలో వేసుకొనలేక పోయినాడు. కాబట్టి, యికనేమి చేయుటకు చేతగాక, యీతడు వెల్లస్లీ యిచ్ఛకమును సంపాదించుకొనుటకు, అతనికి మహారాష్ట్రులపై మరింత ద్వేషము పురిగొల్పుటకును, పామరే యీ యపవాదమును కల్పించి, వెల్లస్లీకి రిపోర్టు చేసియుండును.

వెల్లస్లీ పీష్వాపంపిన సేనను నిరాకరించుటకు గ్రాంటుఢఫ్ చెప్పినకారణములు సరికావనుటకు వెల్లస్లీ వ్రాసిన వుత్తరమే సాక్ష్యము — తానీసేనను యేల నిరాకరించెనో వెల్లస్లీయే 1799 సం॥ ఏప్రిల్ 3-వ తేదీన మద్రాసు మకాములో నుండి పామరుకు వ్రాసిన పెద్ద యుత్తరములో స్పష్టముగ చెప్పి వ్రాసియుండెను—అందు యీ 13 లక్షల గొడవయే లేదు. అప్పటికీ సంగతి వెల్లస్లీకి తెలియనే తెలియదు. ఏలననగ, యీ లంచముసంగతి పామరు పునహానుండి 1799 సం॥ ఏప్రిల్ 8-వ తేదీన వ్రాసిన ఉత్తరములోగాని గన్పించదు. అనగ, యీ వుత్తరము పునహాలో పామరుచే వ్రాయబడుటకు అయిదురోజులకు పూర్వమే, వెల్లస్లీ మద్రాస్‌నుండి తన కారణములను దెల్పు వుత్తరమును వ్రాసివేసెను. అనగ, ఈ 13 లక్షల గొడవగల రెసిడెంటు ఉత్తరము చూచుకొనకపూర్వమే వెల్లస్లీ తన కారణములనుదెల్పు యీ వుత్తరము వ్రాసియుండెను. కాబట్టి, వెల్లస్లీ యీ మహారాష్ట్రసేనను నిరాకరించుటకు కారణమీ మిథ్యావాదముకాదు—అతడిక స్వయముగ చెప్పిన కారణములేమియో చూతము. అవియైనను యెంతవరకు సమంజసముగ నుండెనో చూతము. అతడుచెప్పినవి ముఖ్యముగ రెండు కారణములుగలవు. (1) మహారాష్ట్రులీసేనను పంపుటలో చాల ఆలస్యము చేసిరట. ఈ సేనకు కావలసిన డబ్బును వారు సకాలములో సప్లయిచేయలేదట. ఈవాదము సత్యముగ గన్పట్టదు. ఏలననగ, యిది సత్యమే యైయుండినచో వెల్లస్లీ 'యీసేన మాకక్కరలేదని' తిరుగగొట్టినప్పుడు నానాఫర్నవీసుకు యేల ఆశ్చర్యము గలుగును? (2) టిప్పూ రాయబారులను పీష్వా తన దర్బారులోనికి రానిచ్చెనట! వారిని వెళ్లగొట్టవలసినదని తానెంతచెప్పినను పీష్వా వారిని వెళ్లగొట్టలేదట. ఇది వెల్లస్లీ చెప్పిన రెండవ కారణము. ఇది సత్యముగాదని పైనవివరించి యుంటిమి. తమ పూర్వాచారములకు విరుద్ధమైనను, వెల్లస్లీకి అనుమానము తగులకుండ, అతనిని తృప్తిపరచుటకే గద, పీష్వా సదరు రాయబారులను తన దర్బారునుండి వెడల

గొట్టినది. అయినను, యీపని వెల్లస్లీకి తృప్తిగలిగించక పోవుట ఆశ్చర్యము. ఈ రాయబారులింకను పునహాకుదగ్గర గ్రామములోనే మకాముచేసి యున్నారని రెసిడెంటుచేసిన రిపోర్టువల్లనే బహుశః వెల్లస్లీ యిట్లు వ్రాసెనేమో! ఇది రెసిడెంటు తప్పుగాని, పీష్వా తప్పుకాదు. వెల్లస్లీకి మహారాష్ట్రులపై మరింత యీర్ష్య పుట్టునట్లు చేయుటకును, తానతని యిచ్ఛకమును సంపాదించుకొనుటకును సదరు రెసిడెంటు యీ ప్రకారముగ వ్రాసి, వెల్లస్లీ మనస్సు అనుమానరహితము గాకుండ అట్టిపెట్టియుండ నోపును.

ఈరీతిగ వెల్లస్లీ తాను స్వయముగ చెప్పిన రెండు కారణములు సహితము సత్యములుగావని స్పష్టమగుచున్నది. అసలు నిజమైన కారణములేమియో యిది వరకే కొంతచెప్పి యుంటిమి. మహారాష్ట్రుల సైన్యమునుగనుక తాము అద్దెకు దీసుకుంటే, వారికి జయించుకొన్న దానిలో భాగం పెట్టవలసి వస్తుందనే భయము ముఖ్యముగ వెల్లస్లీని ప్రేరేపించినది. మహారాష్ట్రులు అసలే బలవంతులుగ వున్నారు.—వీరికి టిప్పూరాజ్య భాగంకూడ పెడితే మరింత బలవంతులవుతారేమోయని వెల్లస్లీకి హడలుపుట్టి — మీసేన మాకక్కరలేదని — అతడు నిరాకరించెను — అసలు రహస్యమిది — తక్కిన కారణములన్నియు వట్టి బూటకపు మాటలు.

ఎప్పుడైతే తన అద్దెసేనల వలలో నైజాము పడెనో, ఎప్పుడైతే పీష్వా పడకుండ తప్పించుకొనెనో, ఎప్పుడైతే దౌలత్ రావు సింధియా పునహానుండి వెడలిపోయెనో, టిప్పుతోడి యుద్ధములో సహాయము చేయువిషయమై అప్పుడు వెల్లస్లీ మహారాష్ట్రులను ఆట్టే నొక్కి యడుగదలచుకొనలేదు. వారు వూరికేవుంటే చాలునని యాతడు తలచెను. టిప్పూ యుద్ధములో మహారాష్ట్రులు ఇంగ్లీషువారికి సహాయముచేయు విషయమును వెల్లస్లీ యడుగకపోయినను, పీష్వా తనంతట తానే సహాయము చేస్తాననెనట! ఈ సంగతిని వెల్లస్లీయే తాను 1799 సం॥ ఏప్రిల్ 3వ తేదీన హామరుకు వ్రాసిన ఉత్తరములో స్పష్టముగ చెప్పియుండెను. దీనినిబట్టి చూడగ, మహారాష్ట్రులు టిప్పూతో పక్షీకైరని చెప్పినమాట సరికాదని ఋజువగుచున్నది. అయితే, వెల్లస్లీ టిప్పూపైకి అక్రమముగ కవ్వించి పోవు పద్ధతిని మొట్ట మొదట మహారాష్ట్రులు అంతగ ఆమోదించియుండకపోవచ్చును. మరియు నైజాము (కుర్డ్లా) సంధి షరతులను నెరవేర్పక ఎగబెట్టుటచే, ఆతనిని దండించుటకుగాను ఆతనిపైకి దండెత్తవలయుననియు, ఆత్మ సంరక్షణార్థమై టిప్పూతో చేరవలయుననియు మొట్ట మొదట దౌలత్ రావు సింధియా ఒకవేళ సలహాచెప్పిన చెప్పియుండవచ్చునేమో! కాని, యిది నిశ్చయమని చెప్పుటకు ఆధారములేమియు లేవు. కాని, దౌలత్ రావు సింధియా పునహానుండి వెడలిపోయిన తరువాత,

వెల్లస్లీ దొంగ వాగ్దానము- తద్భంగము.

నానాఫర్న వీసు సలహాపై పీష్వా ఇంగ్లీషువారికి సహాయముచేయ సమకట్టెను. దీనికి మొదట వెల్లస్లీ సమ్మతించెను. కాని, ఆఖరు నిమిషమందు వెల్లస్లీ తన మనస్సును మార్చుకొని "మీసేనలు మాకక్కరలేదనెను." దీనికి కారణమును పైననే వివరించియుంటిమి. అయితే యీ యుద్ధసమయములో మహారాష్ట్రులు తటస్థులుగ నుండక, టిప్పూ సుల్తానుకు సహాయము చేయుదురేమోయను భయము వెల్లస్లీకి యింకను వీడలేదు. కాబట్టి, వారిని టోపీవేసి యెట్లయినను తటస్థులుగ నుంచుటకై వెల్లస్లీ బలే దొంగయెత్తువేసెను. ఏమనగ:—

వెల్లస్లీ కర్నల్ పామరున కిట్లని వ్రాసెను:—

[టిప్పూ సుల్తానునుండి లాగికొన్నదానిలో, యితరమిత్రులతో పాటు పీష్వాకుకూడ తప్పకుండ సమానభాగము పెట్టెదనని నీవు పీష్వాతోడను, నానాతోడను, నాపేరుమీదుగ గట్టిగ—సంశయరహితమగు వాక్యములతో—ప్రకటించి చెప్పవలసినదని నేనిందుమూలముగ నీకు అధికారమిచ్చుచున్నాను.]

పీష్వా సహాయమును పుచ్చుకొనక పోయినను, అతనికి తప్పక జయించుకున్నదానిలో భాగము పెట్టెదమని యీరీతిగ వెల్లస్లీ రెసిడెంటుద్వారా పీష్వాకును, నానాఫర్నవీసుకును వాగ్దానము చేయించెను. ఇది దొంగవాగ్దానము. ఇది చెల్లింపు తలంపుతో చేసినదిగాదనియు, కేవలము మహారాష్ట్రులను టోపీవేసి వారిని తటస్థులుగ నుంచుటకు చేసినదనియు, తదుపరి వెల్లస్లీ చేసిన చర్యలనుబట్టి స్పష్టము కాగలదు. పనితీరినతరువాత, వెల్లస్లీ యీవాగ్దానమును చెల్లింపలేదను సంగతిని యిక్కడ వేరుగ చెప్పపనిలేదు. ఇంగ్లీషువారు తాముచేసిన వాగ్దానములను వేనిని తమజన్మలో చెల్లించిరి ?

టిప్పూతో యుద్ధము ప్రారంభమైన పిమ్మటకూడ తిరిగి తనసేనలను సహాయము బంపెదనని పీష్వా రెండవసారి 1799 సం॥ మే నెల 10-వ తేదీన వెల్లస్లీకి వ్రాసెను. కాని, అప్పటికి ఆరురోజుల క్రితమే— అనగ మే 4-వ తేదీననే— శ్రీరంగపట్టణము పడిపోవుటయు, టిప్పూ మరణించుటయు, కూడ జరిగిపోయెను. ఈ సంగతులు తెలిసికొనియే, టిప్పూ రాజ్యములో కొంత కాజేద్దామను దురుద్దేశముతో పీష్వా యీయెత్తు వేసెనని వెల్లస్లీ యతనిపై నింద మోపసాగెను. పైన వెల్లస్లీ తాను రెసిడెంటుద్వారా చేయించిన వాగ్దానమును ఎగబెట్టుట కిదియే సందు. టిప్పూ చనిపోయిన సంగతి తెలిసికొనియే పీష్వా యీయెత్తు వేసెననుట కేవలము అసత్యము. ఏలననగ, ఆరోజులలో టెల్లిగ్రాములుగాని, రైళ్ళుగాని లేవు. 4-వ తేదీన శ్రీరంగపట్టణములో జరిగిన సంగతి 10-వ తేదీకి ముందు పునహాకు చేరుట అసంభవము. కాబట్టి టిప్పూ చనిపోయిన సంగతి పీష్వాకుగాని, సింధియాకుగాని 10-వ తేదీన తెలిసెననుట సరికాదు. ఈ యపవాదము కేవలము తన వాగ్దాన

మును ఎగబెట్టుటకుగాను వెల్లస్లీ యొకమిషగ కల్పించినది కాని వేరొండుకాదు. ఇదిగాక, 'పీష్వా టిప్పూతో షరీకై కుట్రపన్నుచుండెను. కాబట్టి అతని కిందులో భాగము పెట్టరాద'ని వెల్లస్లీ అసత్యవాదము చేయసాగెను. పీష్వా యెవరితోడను కుట్ర పన్నలేదు. కుట్రలు, ద్రోహములు, అప్రమాణములు చేసినది వెల్లస్లీయే. తన నీడను అద్దములో చూచుకొని మొరుగసాగిన కుక్కవలె వెల్లస్లీ పీష్వాపై ద్రోహము మున్నగు నిందల నారోపింపసాగెను. ఇంగ్లీషువారి ద్రోహబుద్ధియు, కుచ్చిత స్వభావమును, నానాకు యిరవై యేండ్లనుండి తెలియును. అయినను, యింతగట్టిగ చేసిన వాగ్దానమును కించిత్తయినను సిగ్గులేకుండ వెల్లస్లీ భంగపుచ్చునని నానాఫడ్నవీసు సైతము తలంపలేదు. అతనికి కూడ వెల్లస్లీ చర్య ఆశ్చర్యమును గలిగించెను.

ఇట్టి వాగ్దానభంగ మొనర్చినందుకుగాను ఇంగ్లీషువారిపైనను, వారి మిత్రుడగు నైజామపైనను దండెత్తవలెనని నానాఫడ్నవీసు తలంచెను. భారతదేశములో గల యావన్మంది రాజులను యేకమొనర్చి యూరోపియనులను ఇండియానుండి తరిమివేయవలయునని నానాఫడ్నవీసు యిరవై సంవత్సరముల క్రిందట ప్రయత్నించెను. ఆసంగతి నిదివరకు చెప్పియుంటిమి. ఈ యత్నము కొంతవరకు నెరవేరుట చేతనే ఆనాడు వారన్ హేస్టింగ్సు మహారాష్ట్రులకు లొంగిపోయి వారితో సమాధానపడవలసి వచ్చెను. కాని, యీ యిరవై యేండ్లలో వ్యవహారములు చాల మారిపోయినవి. నైజామిప్పుడు ఇంగ్లీషువారి చేతులలో దాదాపు ఖైదీగ నుండెను. మైసూరురాజ్యము ఇంగ్లీషువారినోట బడెను. వీరు మహారాష్ట్ర రాజ్యపు సరిహద్దుల నిప్పుడు అనుకొనియుండిరి. అయినప్పటికి నానాఫడ్నవీసు నిస్పృహ జెందలేదు. మహారాష్ట్రుల నందరిని తిరిగి యేకకూటముగ చేర్చినచో యిప్పటికైనను తామొక్కరే ఇంగ్లీషువారిని వోడించగలరను ధైర్యము నానాఫడ్నవీసున కుండెను. అందుచే ఆతడు తిరిగి మహారాష్ట్రమును దిట్టపరచుటకై ప్రయత్నముల చేయసాగెను. కాని, విధి ప్రతికూలుడగుటచే యీతని యత్నము లెట్లుసాగును? మహారాష్ట్రములో యింగ్లీషువారి ప్రేరణచే యిదివరకే అంతః కల్లోలములు పుట్టియుండెను.

*మహారాష్ట్రమును దిట్టపరచుటకు నానా యత్నము.*

ఇది యిట్లుండగా, దక్షిణమున మైసూరు రాజ్యమును ఆనుకొనియున్న ప్రాంతములలోని జాగీరుదారులు కొందరు తమయేలికయగు పీష్వాపై యీసమయమునసే తిరుగుబాటులు చేయసాగిరి. టిప్పూ రాజ్యములోనికి ఇంగ్లీషువారు అడుగిడినదే తడవుగ, దానిని ఆనుకొనియున్న జాగీరుదారు లిట్లు పీష్వాపై తిరుగుబాటులు సాగించుట గమనింపదగియున్నది. ఈ తిరుగు బాటులు

*దక్షిణ జాగీరుదార్లలో ఇంగ్లీషువారు అల్లరుల లేపుట.*

ఇంగ్లీషువారి ప్రేరేపణచేతనే జరిగిన వనుటకేమి యభ్యంతరము? టిప్పూతో యుద్ధమునకు బోవుటకుముందు అతని రాజ్యములో అంతః కల్లోలముల బుట్టించు పనికై వెల్లస్లీ తన తమ్ముడగు ఆర్థరును, మరినలుగురు మెంబర్లనుచేర్చి ప్రత్యేక మొక కమిటీని యేర్పరచి యుండెనని లోగడ చెప్పియే యుంటిమి. ఆ కమిటీలో ముగ్గురింకను అనగ ఆర్థర్, కర్నల్ క్లోజు, కెప్టెన్ మాల్కమ్‌లు మైసూరులోనే మకామువేసి యుండిరి. టిప్పూ రాజ్యమును పంపిణీ చేయుపని వీరికి అప్పగించబడినది. వెల్లస్లీ *తనతమ్ముని - ఆర్థరును - మైసూరుకు గవర్నరుగ నియమించుకొనెను.

టిప్పూ రాజ్యములోని ప్రముఖులకు లంచపంచములిచ్చి వారినిచీలదీసి, కుట్రల పన్నుటకును, తదుపరి మైసూరు రాజ్యమును పగలగొట్టి పంపిణీ చేయుటకును, నియమింపబడిన కమిటీ మెంబర్లు మైసూరులో మకాము వేసియున్న కాలములోనే ప్రక్కనున్న దక్షిణ మహారాష్ట్రములోని జాగీరుదార్లు పీష్వాపై తిరుగుబాటుసాగించిరి. కాబట్టి, యీ కమిటీ మెంబర్ల కిందు జోక్యము కలదని యూహించుట తప్పులేదు.

ముందు యీ యల్లరులనణచి, తనయింటిని తాను చక్కబెట్టుకొనవలసిన పని నానాఫర్నవీసుకు గలిగెను. ఆతడంతట పరశురామభా యాధిపత్యమున కొంతసేనను దక్షిణమున యీ జాగీరుదార్ల యల్లరుల నణచుటకై పంపించెను. ఈ యల్లరులనణచి సేనతిరిగి యింకను యింటికిరాక పూర్వమే 1800 సం॥ ఫిబ్రవరి

నానాఫర్నవీసు నిర్యాణము - కంపెనీవారిపంట.

13-వ తేదీన నానాఫర్నవీసు చనిపోయెను. అంతటితో మహారాష్ట్రుల ఆశలన్నియు అడుగంటెను. మహారాష్ట్ర రాజ్యభాను డస్తమించెను. భారతవర్షాకాశముపైకి మూగి వచ్చుచున్న యూరోపియను లనబడు కుటిలకాల మేఘములను చీల్చగలిగిన ప్రచండ భానుడు "బాలాజీ జనార్దనభాను" డను నామాంతరము గలిగిన యీ నానాఫర్నవీసు డొక్కడే ఆనాడుండెను. ఆతడిట్లు అస్తంగతుడుకాగా, కుటిల ఆంగ్ల

---

*ఇంతకంటె పక్షపాతకార్య మింకొకటిలేదు. ఏలననగ, తనతమ్మునికంటె కంపెనీకొలువునం దెక్కువ అనుభవమును, ప్రజ్ఞనుగలిగిన "సర్ డేవిడ్ బెయిర్డును" ఈ యుద్యోగమిచ్చుట న్యాయమైయుండగ, అతనిని త్రోసివేసి ఆర్థరు తన తమ్ముడు గదాయని చెప్పి వెల్లస్లీ యీ యుద్యోగమును తనతమ్మునికిచ్చుకొనెను. ఇదిచాల అక్రమమని ఆనాడేచాలమంది నిష్పక్షపాతులగు ఆంగ్లేయులు వెల్లస్లీని నిందించియుండిరి. అదిగాక, యీ యుద్యోగము తనతమ్మునకిచ్చుకొనుటకు యింకొక కారణమున్నది. "బెయిర్డు" న్యాయబుద్ధిగలవాడు. తానుచేయుచున్న దుర్మార్గకార్యములన్నిటిని యితడు చేయడేమోయను యనుమానముచేతకూడ వెల్లస్లీ ఆతనికీ యుద్యోగ మివ్వలేదు.

వెల్లస్లీకి తమ్ముని యెడ పక్షపాతం.

కాలమేఘములు ఒక్కుమ్మడి క్రమ్ముకొని, భరతఖండమునంతను దాస్యాంబునిధియందు ముంచివైచెను. నానాఫర్నవీసు మరణము ఇంగ్లీషువారికి పండుగయయ్యెను. మహారాష్ట్రమునకు పెట్టని కోటలుగనున్న రెంటిలో ఒకకోట పడిపోయినది.

రెండవకోట-దౌలత్‌రావు సింధియా-యింకను బ్రతికియున్నాడు. కావున, ఇంగ్లీషువారి కింకను వూపిరి పూర్తిగ ఆడుటలేదు. ఇండియాలో కాలుబెట్టిన నాటి నుండి టిప్పూతో పాటు దౌలత్‌రావు సింధియానుకూడ హతమార్పవలయునని

దౌలత్‌రావుపై కన్ను.

వెల్లస్లీ అతనిపై ఒక కన్నువేసియేయుండెను. అతనిని పునహానుండి లేవగొట్టుటకై వెల్లస్లీ యెన్నెన్ని యెత్తులవేసెనో యిదివరకే చెప్పియుంటిమి. ఇతనిపై కత్తికట్టుటకేగద వెల్లస్లీ బీరారు రాజావద్దకొక రాయబారిని పంపించి, అతనితో నేస్త మేర్పరుచుకొన జూచెను. టిప్పూపై యుద్ధము ప్రకటించుటకు చాలకాలము క్రితమే, సింధియాపైకి దండెత్తి పోవలెనను తలంపు వెల్లస్లీకి పుట్టినట్లు ఆతడు వ్రాసిన రికార్డులన్నిటిని పరిశీలించి చూచిన యెడల బోధపడగలదు. టిప్పూపై యుద్ధము ప్రకటించినప్పుడు సైతము వెల్లస్లీ మైసూరుకు తన సేనాపతియగు సర్ ఆల్‌రూడ్ క్లార్కును పంపక, అతనిని కలకత్తాలోనే యుంచి, తాను స్వయముగ బయలుదేజి దక్షిణమునకు వచ్చెను. సేనాపతిని దక్షిణమునకు పంపక, ఆతనినిట్లు ఉత్తర హిందూస్థానములోనే నిలువయుంచుటకు కారణమేమి? దీనిలో గొప్ప రహస్యమున్నది. "ఆఫ్గన్‌స్థానమునుండి దండెత్తిరానున్న జమాన్‌షాను యెదిరించుటకై నా సేనాపతిని అక్కడ వుంచినానని" వెల్లస్లీ పైకిచెప్పెను. కాని, అంతరంగికోద్దేశము వేరు. సింధియాపైకి దండు బంపుటకే ఆతడీపని చేసినాడు. ఈ రహస్యము లోకులకు తెలిసిపోతుందనే ఉద్దేశముతో, దానిని కప్పిపుచ్చుటకే వెల్లస్లీ యీ టక్కరు మాటను చెప్పెను. సేనాపతిని యీరీతిగ కలకత్తాలో వుంచి వచ్చుటకుగల నిజమైన కారణము సింధియాను ముట్టడించుటకే యనుసంగతి వెల్లస్లీ తాను మద్రాసునుండి వ్రాసిన ఉత్తరములవల్లను, యితరకాగితములవల్లను, స్పష్టముగ బట్టబయలగుచున్నది. "టిప్పూతోడను, సింధియాతోడను సహా కలహమొనర్చుటకే నేను బీరారు రాజావద్దకు రాయబారినిపంపి, అతనితో స్నేహము గట్ట జూచుచున్నానని వెల్లస్లీ 1799 సం॥ మార్చి 3-వ తేదీన ఉత్తరములో హైదరాబాదు రెసిడెంటుకు తెలిపెను. 1799 సం॥ మార్చి 8-వ తేదీన వెల్లస్లీ మద్రాసునుండి కలకత్తాలో వుంచివచ్చిన తన సేనాపతికి యిట్లని ఒక రహస్యపు ఉత్తరము వ్రాసెను.

"అవసరమైతే దౌలత్‌రావు సింధియానెదిరించుటకుగాను తగుమాత్రము సేనను నీ వెల్లప్పుడు ఆసరిహద్దులో నిలువచేసి యుంచవలసినదని నేను నీకు వ్రాయు ప్రతి ప్రయివేటు ఉత్తరములోను వదలిపెట్టకుండ వ్రాయుచునేయున్నాను..... నాకోరిక ఏమిటంటే సింధియా

ఉత్తరహిందూస్థానమునకు వస్తే, ఆతనియావత్తు సేనను యెదిరించుటకుగాను తగినంత మనదండును నీవెంతమాత్రము ఆలస్యముచేయక అయోధ్యలో చేర్చియుంచవలసినది. మరియు, త్వరలో మన మతనిరాజ్యముపైకి కవ్వించిపోవలసి యున్నామను సంగతినికూడ నీవెల్లప్పుడు మనస్సులో వుంచుకొని మరీ పనిచేయుము."

పెద్ద అబద్ధం.

సేనల నిట్లు చేర్చియుంచు విషయమై సింధియాకొక పెద్దఅబద్ధము చెప్పవలసినదనికూడ వెల్లస్లీ తన సేనాపతికి ఆ యుత్తరములోనే వ్రాసెను. ఆతనిమాటలు వినుడు :—

"మన మీసేనల నిట్లు చేర్చుకొనుట జూచి దౌలత్ రావు సింధియాయు, ఆతని సేనాపతి అంబాజీయు అనుమానపడవచ్చును. మన మిట్లెందుకు చేయుచున్నామని వారడుగుతారేమో! అంటే, నీవీ జబాబు చెప్పు :—'వజీరాలి కాశీనుండి పారిపోయినాడు. అతడు జుమాన్‌షాతో చేరుతాడేమో యని మాకు భయంగావుంది. అత డట్లుచేరితే మాకు చాల అపాయం వస్తుంది కాబట్టి, మేమీ సేనల నిట్లా చేర్చుకొంటున్నాము'—అని నీవు జబాబుచెప్పు." ఇందుపై వ్యాఖ్యాన మనవసరము—.

శత్రువులను, సామంతులను, దౌలత్ రావు పైకి ఉసుగొల్పించుట.

సింధియా రాజ్యములో పూర్వము మాధవరావు సింధియా హయాములో గలిగిన కల్లోలములకును, సింధియా హోల్కారుల మధ్య పెరిగిన ద్వేషములకును ఇంగ్లీషువారు ప్రేరేపించిన కుట్రలే కారణములని తలంచుట కనేక కారణములున్నవి. సర్ జాన్ మాక్ఫర్సన్ కాలమునుండి వచ్చుచున్న ప్రతి గవర్నర్ జనరలును యిట్టి కుట్రలు ప్రేరేపించుచున్నను వారీసంగతులను వ్రాతమూలకముగ కాగితము మీద పెట్టి యెరుగరు. కాని, వెల్లస్లీ గుండెలుతీసిన బంటగుటచే, తానుచేయదలచుకొన్న కుచ్ఛితకార్యముల నన్నిటిని శుభ్రముగ, నిర్భయముగ, ఆతని పుణ్యమాయని మనకోసం కాగితముమీద పెట్టిపోయినాడు. తన సేనాపతికి ఆతడు మద్రాసునుండి యెట్లు వ్రాసెనో చూడుడు:—

"(సింధియాతో) యుద్ధమేగనుక వచ్చేటట్టయితే రాజపుత్రులను, ఆతనికి సామంతులైయున్న యితరరాజులను, సింధియాపైకి ఉసుగొలుపుటకు నీశాయశక్తుల ప్రయత్నించవలసినది. జునగడ్, జాడ్‌పూర్ రాజులనుకూడ యీ యుద్ధములోనికి లాగవలసినది. బైస్, లక్వాజీ, దాదా మున్నగు పార్టీకేగాక, సింధియాకు వ్యతిరేకులుగనున్న అతని కుటుంబములోనివారికిని కొలువులోనివారికిని, అందరికి నీవు బాగా మద్దతుచేయుటకు, ప్రోత్సాహపరచుటకు, నీచేతనైనన్ని ప్రయత్నములను (ఒక్కటికూడ విడచిపెట్టకుండ) చేయుము."

అసలు రహస్య మీమాటలలో యిప్పుడు బయటపడినది. సింధియా రాజ్యములో గలిగిన అల్లరుల కన్నిటికి ఇంగ్లీషువారి కుట్రలే కారణములని యిప్పుడు

అద్దములోవలె స్పష్టమగుట లేదా ?!! పై యుత్తరమునుండియే మరికొన్ని వాక్యముల నుదహరింతము:—

"మనకు అనుకూలతరుణము యెప్పుడువస్తేఅప్పుడు, దానిని వినియోగించుకొని సింధియా బలమును క్రుంగదీయవలెననుమాట నాకుచాల నచ్చినది. కాని, సింధియా దక్షిణమున నున్నన్నాళ్లు, మనము టిప్పూతో యుద్ధము సాగించుచున్నన్నాళ్లు, మనమతని నేమియు చేయుటకు వీలులేదు. అతడక్కడ చాలాబలవంతుడైయుంటాడు. కాబట్టి, అతనిని దక్షిణమునుండి లేవగొట్టువరకు, లేదా, టిప్పూవ్యవహారము ముగియువరకు, అతడు మనకుచేసిన ద్రోహమునకు గాను మన మతనిని తగురీతిగ శిక్షించలేము."

### నానా మరణానంతర పునహా వ్యవహారములు.

సింధియా బలమును క్రుంగదీయుటకుగాను వెల్లస్లీ యేమేమిపనుల జేసెనో వానిని వివరించుటకు పూర్వము నానా మరణానంతరము పునహాలో వ్యవహారము లెట్లుండెనో కొంచెము చూతము.

బాజీరావు దేబె.

బాజీరావుకు రాజ్యపాలనా దక్షతగాని, రణప్రావీణ్యత గాని, రాజనీతిజ్ఞత గాని లేవు. అందుచే, నానా మరణానంతర మితడు కొండెగాండ్ర చేతులలోబడి, వారు చెప్పు మాటలకన్నిటికి చెవి యొగ్గుచుండెను. ఇతడు యెవరినీ నమ్మజాలని దుర్బలుడగుటచే యింగ్లీషువారి కితడు మిక్కిలి వాటమైన ఉపకరణముగ దొరికెను.

ఇంగ్లీషువారు చౌతు నెగబెట్టుట.

నైజాము, టిప్పూలు మహారాష్ట్రులకు, "చౌతు" (పన్ను) చెల్లించుచుండు ఆచారము చిరకాలమునుండి యుండెను. వీరిరువు రిప్పుడు ఇంగ్లీషువారి చేతులలో బడిపోవుటచే, సదరు చౌతు యిప్పుడు ఇంగ్లీషు వారివల్ల మహారాష్ట్రులకు రావలసియున్నది. నానా బ్రతికి యున్నన్నాళ్లు యీచౌతును యిత్తుము, యిత్తుమని ఇంగ్లీషువారు కాలహరణము చేయుచుండిరి. కాని, అతడు చావగానే, వారీచౌతును "యివ్వము" అని ఎగబెట్టిరి.

బాజీరావు ఇంగ్లీషువారి వలపులలో చిక్కుట.

దీనికి బాజీరావు క్రుద్ధుడగుటకు బదులుగ, దేబెవలె ఇంగ్లీషువారితో యిచ్చకములకుదిగి వారేమో తనకు మిత్రులైనట్లు భావించుకొని వారిని ఆలింగన మొనర్చుకొన సాగెను. వారిని శత్రువులుగ భావించి, వారిపై తీవ్రరోషము చూపుటకుబదులు బాజీరావు వారిమాయలలోపడి వారితో సరసములకును, వలపులకును, దిగెను. ఇతనికీబుద్ధి మొదటినుండియునుండెను. కాని నానాఫర్నవీసు, సింధియాల, యభ్యంతరముచే యీతడింగ్లీషువారి నింతకాలమునుండియు కౌగలించు

కొనుటకు అవకాశము చిక్కినదికాదు. ఈ యుద్ధంకు లిప్పుడు తీరిపోవుటచే, బాజీరావు తన యిచ్ఛానుసారము ఇంగ్లీషువారి వలపులలోబడి విహరింప సాగెను. దీని ఫలితమెట్లయ్యెనో యిప్పుడే చూతము.

ఇంగ్లీషువారు బాజీరావుకు రిమ్మ తెగులు పుట్టించుట.

దౌలత్ రావు ప్రాపకమువల్లనే బాజీరావు గద్దెయెక్క గలిగెను. అందుచేత ప్రతిముఖ్య విషయములోను యితడు తనతో సంప్రతించునని దౌలత్ రావు సింధియా తలంచుట సహజమేగద. అయినను, బాజీరావు ఇంగ్లీషువారి చెప్పుడు మాటలను విని దౌలత్ రావునందు విముఖుడై యుండెనని యిదివరకే చెప్పియుంటిమి. ఇంగ్లీషు రెసిడెంటు బాజీరావు చెవిని యిల్లు కట్టుకొని దౌలత్ రావుపై నిరంతరము కొండెములు చెప్పుచు అతనికి రిమ్మ తెగులు పుట్టునట్లు చేయుచుండెనని యిదివరకే చెప్పియుంటిమి. ఈ మాటలువిని తాను నిజముగ సింధియా చెరలోనున్నట్లును అతడు తనపై అక్రమముగ అధికారమును చలాయించి, తనను పిండిబొమ్మను చేసివైచినట్లును, బాజీరావు తలంచుకొని యీచెరనుండి యెప్పుడు తప్పించుకొని పారిపోయి, హాయిగ ఇంగ్లీషువారి చేతులలో బడుదునాయని, యీ దౌర్భాగ్యుడు నిరంతరము తనలో చింతించుకొనుచుండెను.

మహారాష్ట్ర దేశమంతా కలియ తిరుగుటకు బాజీరావు ఇంగ్లీషువారికి అనుజ్ఞనిచ్చుట!

ఈతని చేష్టలను మొట్టమొదట దౌలత్ రావు సింధియా యంతగ పాటింపక యుపేక్షించి యూరకొనెను. కాని, ఎప్పుడైతే శ్రుతిమించి రాగమున బడినదో అప్పుడు సింధియాకు బాజీరావుపై నిజముగ కోపమువచ్చెను. దీనికి కారణమిది. బాజీరావు ఇంగ్లీషువారి మాయలలోబడి, సింధియాకు చెప్పకుండ, అతని యెరుకలేకుండ, ఇంగ్లీషుసేనలు మహారాష్ట్ర రాజ్యములో ప్రవేశించి, "ధూండియా వాగ్" అనునతని వెంబడించి పట్టుకొనుటకుగాను బాజీరావు ఇంగ్లీషువారికి అనుమతినిచ్చెను. ఈ ధూండియా వాగ్ అనునతడెవడో యిదివరకు టిప్పూ యుద్ధచరిత్రలో చెప్పియుంటిమి. టిప్పూ మరణానంతరము మైసూరు రాజ్యము ఇరిగ్లీషువారి పాలబడకుండ కాపాడుటకై వారిని యెదిరించిన దేశభక్తుడితడు. ఇతడు తనచుట్టు కొంతమంది పరివారమును చేర్చుకొని, ఇంగ్లీషు సేనలకు చిక్కకుండ చాటుమాటలనుండి వారిని వేధించుచు యుద్ధముచేయ సాగెను. అందుచే యితడు బందిపోటు దొంగయని ఇంగ్లీషు చరిత్రకారులు నిందించుచున్నారు. కాని, యితని యుద్దేశములను గమనించి చూచినచో యితడు బందిపోటుదారుడు కాడనియు, నిజమైన దేశభక్తి గలవాడనియు బోధపడగలదు. తమ్మెట్లు వేధించుచున్న యీ "ధూండియా వాగను" తరిమి పట్టుకొనుటకై ఇంగ్లీషువారు ప్రక్కనున్న మహాష్ట్ర రాజ్యములో ప్రవేశించవలసివచ్చెను. కాని, మహారాష్ట్రుల యనుమతిలేనిది ఇంగ్లీషు సేనలెట్లు సదరురాజ్యములో ప్రవేశించ

గలవు? అందుచే, ఇంగ్లీషువారు దౌలత్ రావు సింధియాకు తెలియకుండ బాజీరావును మాయజేసి అతనివల్ల యీ యనుజ్ఞను సంపాదించుకొనిరి. బాజీరావు యీ పనిచేయుట చాల తెలివి తక్కువ. ఇది మహారాష్ట్ర రాజ్యమునకు ఆత్మవినాశన కారణమయ్యెను. బాజీరావీ యవివేకపు పనిచేసినాడని తెలిసినప్పుడు దౌలత్ రావుకు అతనిపై ఒడలుమండెను. ఈ యవివేక కార్యమువలన గలిగిన దుష్ఫలిత మేమియో చూడుడు. బాజీరావిచ్చిన యనుజ్ఞను పుచ్చుకొని, ఇంగ్లీషు సేనలు వెల్లస్లీ తమ్ముడగు "ఆర్థర్" ఆధిపత్యమున మహారాష్ట్ర రాజ్యములో ప్రవేశించి ధూండియావాగ్‌ను తరిమి పట్టుకొని, చంపివేసెను. ఇంగ్లీషుసేన లీరీతిగ మహారాష్ట్ర రాజ్యమునంతను కలియ తిరుగుటలో, ఆ దేశమందుగల గుట్టుమట్టులనన్నిటిని (దుర్గములు, గుహలు, నదులు, మున్నగు వ్యూహస్థానముల నన్నిటిని), ఆర్థర్ ఒక కంటితో కనిపెట్టిచూచెను. ఈ రహస్యము లతనికిట్లు తెలియుటచే, తదుపరి యుద్ధములలో యిది యితనికెంతయో యుపకారియయ్యెను. దేశములోని రహస్యములన్నియు శత్రువులకిట్లు తెలిసిపోవు ననుజ్ఞానము బాజీరావుకు లేక పోయెను!

మహారాష్ట్రరాజ్య వ్యూహస్థానముల నన్నిటిని ఆర్థర్ సేనాని కలియద్రొక్కి జూచుట.

మహారాష్ట్ర దేశమందు తాను కనిపెట్టిన రహస్యములగూర్చి 'ఆర్థర్' తదుపరి యిట్లువ్రాసి యుంచెను :—

"మనకు మహారాష్ట్రులతో త్వరలోనే యుద్ధమురానున్నది. కాబట్టి, దానిని సాగించుట కేమేమియుపాయములు కావలెనో వానిని ముందుగ మనము తెలిసికొనుట అవసరము. ఆదేశమందుగల శీతోష్ణపరిస్థితులు, వర్షాధికములగు ఋతుభేదములు, దేశములోగల కొండలు, నదులు, దుర్గములు, వగైరా భౌతిక పరిస్థితులు, దోవలు, డొంకలు, రోడ్లు, అక్కడ పండే పంటలు, యుద్ధవ్యూహస్థానములు, శత్రువులు దాగియుండదగిన రహస్యపుచోట్లు, యితరరక్షణ మార్గములు, వీనినన్నిటినిగూర్చి మొన్న "ధూండియావాగ్"ను వెంబడించు సందర్భములో నేను కనిపెట్టిన గుట్టుమట్టులన్నియు మనకీ రాబోవుయుద్ధములో చాల సహాయకారులుగనుండ గలవు. కాబట్టి, యీ రాబోవు యుద్ధములో పనిచేయువారికి సహాయకారిగ నుండునట్లు నేనీ సంగతులన్నిటిని, ఒక్కొక్క విషయమును ప్రత్యేకముగ యెత్తుకొని తఫ్సీలుగ యిట వివరింతును."—(ఈతఫ్సీళ్లు యిక్కడ అప్రస్తుతముగాన వదలివేయుచున్నాము.)

ఈరీతిగ, ఇంగ్లీషువారు బాజీరావును టోపీవేసి, యింటిలో ప్రవేశించి, యింటివాసముల నన్నిటిని లెక్కపెట్టిరి.

బాజీరావు ఇంగ్లీషు వారిని ఆశ్రయింప జూచుట.

బాజీరావు యీ యవివేక కార్యము చేయుటయేగాక, సింధియానుండి తప్పించుకొని, పాఱిపోయి ఇంగ్లీషువారిలో చేరుదమనికూడ కుట్రపన్నుచున్నట్లు సింధియాకు తెలియవచ్చెను. వెనుక 25 యేండ్ల క్రిందట యితని తండ్రి రఘోబా యిట్లే పారిపోవుటచే మహారాష్ట్రులకు ఇంగ్లీషువారితో ఘోర సంగ్రామము

ప్రాప్తించెను. ఇట్టి దురవస్థయే తిరిగివచ్చునేమో యను భీతిచే దౌలత్ రావు బాజీ రావు పారిపోకుండ అతని మందిరము చుట్టు కాపలా యుంచెను. కాని, దౌలత్ రావు చేసినపని చాలలేదు. దుర్బలుడును, బుద్ధిహీనుడునైన మహారాష్ట్రము నంతను నష్టేట ముంచ నుంకించుచున్న యీ దౌర్భాగ్యుని, బాజీరావును అసలు సింహాసనమునుండి లాగివేసి, చెరసాలలో పారవేసియో, అవసరమైతే, నరికి పారవేసియో, యుంటే యెంతో బాగుండెడిది! మహారాష్ట్ర రాజ్యము హరింపు గాకుండ నిలువనైన నిలిచెడిది. కాని, యింతటి సాహసకార్యము చేయుటకు సింధియా పూనుకొనక పోవుట దేశముయొక్క గౌర్భాగ్యమని యిప్పుడు చింతింప వలసి యున్నది.

పునహానుండి పారిపోయి ఇంగ్లీషువారిలో చేరుటకు ఇంగ్లీషు సేనలు మహా రాష్ట్రములో ప్రవేశించుటకు తాను అనుమతి యిచ్చిననాటికే బాజీరావు పూర్తిగ పూనుకొని యున్నట్లు గ్రాంటుడఫ్ తన చరిత్రలో (552 పేజీలో) చెప్పి యున్నాడు. ఈ సంకల్పమునకు ఇంగ్లీషు రెసిడెంటు పామరు ప్రేరణయే కారణమని వేరుగ చెప్పనక్కరలేదు. గ్రాంటుడఫ్ యిట్లు వ్రాసెను:—

["బాజీరావు తాను రగూబాకొడుకగుటచే, ప్రజలు తనను అసహ్యించుకొనుచున్నా రనుసంగతి అతనికి తెలియును. ఇంగ్లీషువారితోనైనా మంచిగవుందామను ఆగుర్దా అతనికి గలిగెను. ఇంగ్లీషువారంటే యితనికి నిజముగ పక్షపాతము గలదు."]

దూండియామీదికి పంపబడిన సేన వీలైతే పూనామీదికికూడ పోయి పను

పీష్వా పేరుమీదుగ ఇంగ్లీషువారుకోటలను, దేశమును ఆక్రమింప నుంకించుట

టకే ఉద్దేశింప బడినట్లు తెలియుచున్నది. ఈ సంగతి గవర్నర్ జనరల్ వెల్లస్లీ 1800 సం॥ ఆగష్టు నెల 23-వ తేదీన మద్రాస్ గవర్నర్ క్లైవుకు వ్రాసిన ఉత్తరమునుబట్టి తెలియగలదు. ఆ ఉత్తరములో యిట్లున్నది. :—

"పునహాలో త్వరలోనే గొప్పగందరగోళము జరుగబోవుచున్నట్లును, పీష్వా అధికార మును నిలువబెట్టుటకుగాను మనము అప్పుడందులో చురుకుగ జోరబడవలసిన అవసరమువచ్చే టట్లును, రెసిడెంటు పామరు అక్కడనుండి మొన్న వ్రాసిన ఉత్తరములవల్ల తెలియుచున్నది. ఇందునుగూర్చి పీష్వాయే స్వయముగ నాకొకఅర్జీని త్వరలోబహుశః పంపవచ్చుననియు తెలియు చున్నది. ఇది జరిగేయెడల, మన ఆర్థర్ యాజమాన్యముననున్న సేన (నైజాముసుండియు బొంబయినుండియు వచ్చుసేనలనుకూడకలుపుకొని) తక్షణమే పునహామీదికి పోవలసిన అవసర మేర్పడవచ్చును. ఈ యవసరమును మనస్సులో పెట్టుకొనియే మనఆర్థర్ తననడకలను యేర్పాటు చేసుకొనవలసియుండును."

"దూండియా ముఠావారియల్లరులు తిరిగి చెలరేగకుండ కట్టుదిట్టములు చేయుటకుగాను, మన ఆర్థర్ క్రిందనున్న సేనలు యింకను మహారాష్ట్రదేశములోనే నిలువయుండవలయును. ఈ యల్లరులభయము పూర్తిగ అణగిపోవువరకు, యిదివరకు మన మాక్రమించుకొన్న స్థాన

ములను వదలిపెట్టక, మనసేన లక్కడనే నిలువయుండవలయును. ఇప్పుడు రెండు సందర్భము లేర్పడవచ్చును. ఏమనగ-బాజీరావు పునహానుండి పారిపోవచ్చును. లేదా, అతనిని దౌలత్‌రావు సింధియాపట్టుకొని చెరసాలలో వేయవచ్చును. ఈరెంటిలో యేపనిజరిగిననుసరే, మన సేనలు పునహామీదికి పోవలసియుండును. కాబట్టి, మన ఆర్థర్ సేన మహారాష్ట్రములోనే అక్కడక్కడ నిలువయుంటే, యీపనికి బహుసులువుగ వుంటుంది.........."

"కాబట్టి బాజీరావు పారిపోయినట్లుగాని, ఖైదుచేయుబడినట్లుగాని, నిశ్చయమైనవార్త రాగానే, తక్షణమేమన ఆర్థర్ సేనలను తీసికొనివెళ్లి పీష్వాపేరుతో యావత్తుదేశమును— కృష్ణానదీతీరమువరకు ఆక్రమించికొనవలసినదిగ నేనిందుమూలముగ ఆజ్ఞాపించినట్లు మీరు మన ఆర్థర్‌తో చెప్పవలసినది. మన బ్రిటిష్‌సేనలు ఆక్రమించుకొనుట అవసరమనితోచిన కోటల నన్నిటినికూడ పీష్వాపేరుచెప్పి మనఆర్థర్ ఆక్రమించుకొనగలడు.

"దేశమును,కోటలను యీరీతిగ ఆక్రమించుకొనుటలో దేశప్రజలమనస్సులను శాంతింప జేయుటకుగాను మనఆర్థర్ సదరుప్రజల కొకమాట చెప్పవలసియున్నది. "మేమీపనియంతా పీష్వాయొక్క న్యాయమైన అధికారమును నిలువబెట్టుటకే చేయుచున్నాముగాని, వేరొండు తలంపుతోగాదని మన ఆర్థర్ ప్రజలకు నచ్చచెప్పవలయును"]

పునహామీదికి పోవుటకు ఇంగ్లీషువారు పైనచెప్పిన అవకాశములలో ఒకటియు తక్షణమే రాలేదు. రెసిడెంటు పామరుయొక్క యసమర్థతయు, సింధియాయొక్క పలుకుబడియు, దీనికి కారణమని ఇంగ్లీషువారు తలంచిరి. ఇందునుగూర్చి 1800 సం॥ ఆగస్టు 20వ తేదీని ఆర్థర్ యిట్లని మన్రోకు వ్రాసెను:—

రెసిడెంట్ల మార్పు

"పునహాలో సింధియా పలుకుబడి మనకుమించినదిగ నున్నది. కర్నల్ పామరు అక్కడ వున్నన్నాళ్లు మనము యుద్ధము చేయకుండ సింధియా పొగరు అణచలేము. ఇట్టి అవకాశము యీనిమిషమందుకంటె యింకెప్పుడునురాదు. "భా" కుటుంబమువారిని మనక్రిందికి లాగికొని వారిని సింధియాకు పోటీగ నిలువబెట్టితే బాగుంటుందని తోస్తుంది."

పామరు అసమర్థుడని తలచుటచే, వెల్లస్లీ తనతమ్ముడగు ఆర్థర్ సిఫార్సుమీద మైసూరు కమిటీలో పనిచేసిన కర్నల్ క్లోజును పునహాలో రెసిడెంటుగ నియమించెను. కాని, పామరు వారనుకొన్నంత అసమర్థుడుకాడు. అతడు, చాలవరకు పనిచేసెను. ఇంకొక నెలరోజు లతడక్కడ వుండియున్న యెడల, పీష్వాచే పూర్తిగ అద్దె సేనల స్కీముకు ఒప్పించెడివాడే. ఏలననగ, కొత్త రెసిడెంటు వచ్చుటకు కొద్దిరోజులకు పూర్వమే పీష్వా "కొన్ని షరతులతో ఇంగ్లీషువారి అద్దె సేనను పుచ్చుకొనుటకు నేనంగీకరింతు"నని పామరుకు తెలియపరచెను. ఆరు ఇంగ్లీషు దళములను, అందుకు సరిపడిన ఫిరంగులను పుచ్చుకొని, అందుక్రింద

అద్దె సేనల పుచ్చుకొనుటకు పీష్వా మెత్తపడుట.

సాలుకు, 25 లక్షల రివిన్యూ వచ్చు కొంత రాజ్యభాగమును ఇంగ్లీషువారికి వ్రాసి యిచ్చుటకు పీష్వా బాజీరావు సమ్మతించెను! కాని, యీ సేనను మహారాష్ట్రములో నిలువయుంచకుండ బయట ఇంగ్లీషువారి రాజ్యములోనేయుంచునట్లును, తనకు అవసరమైనప్పుడు దానిని పిలిపించుకొనునట్లును, యేర్పాటు వుండవలెనని పీష్వా ఒక షరతును యేర్పరచెను. వెల్లస్లీ పెట్టిన షరతులకును దీనికిని చాలా తేడా వున్నది. దీనిని గూర్చి పామరు వెల్లస్లీ కిట్లని వ్రాసెను :—

[“అయినప్పటికి నేనీసాయంత్రము పీష్వాతో మాట్లాడి వెల్లస్లీ పెట్టిన షరతుల ప్రకారము ఇంగ్లీషు సేనలను మీరు పుచ్చుకుంటే మీ కెంతలాభము వుంటుందో చూడండి యని నేను పీష్వాకు యింకొకసారి గట్టిగనచ్చజెప్పిచూస్తానుకాని, తక్షణమే తనకంతముత్రుంచుకు పోయే భయమేదైనా అతనిమీదికి తెచ్చిపెడితేతప్ప పీష్వా మన షరతులకు పూర్తిగ ఒప్పుకుంటాడని నే ననుకొనను.”—క్లుప్తము—గ్రాంటు డఫ్.]

పీష్వా బాజీరావు వ్యవహార మీస్థితిలోవున్నది. అతను చాలవరకు మెత్తబడినను, వెల్లస్లీ పెట్టిన షరతుల కన్నిటికి పూర్తిగ ఒప్పుకునేటట్లు యింకను కనిపించలేదు. కాబట్టి, ఈలోగా సింధియా వ్యవహారమెట్లున్నదో చూతము. ఇతనిని

‘వలలో ఒక్కడు పడినా చాలు’

కూడ యీ యద్దేసేనలవలలో వేసుకొనవలెనని వెల్లస్లీ మొదటినుండియు యత్నించుచునే యుండెను. మహారాష్ట్ర కూటములోని నాయకులలో నే ఒక్కరు తనవలలోపడినను చాలునని వెల్లస్లీ ప్రతివారివద్దకు రాయబారుల బంపి నిరంతరము యత్నించుచునే యుండెను. ఒక్కడు పడినచో తక్కినవారందరు మెల్ల మెల్లగా వారంతటవారే జారిపడుదురని వెల్లస్లీ యాశ. కాబట్టి, వెల్లస్లీ ప్రయత్నమంతయు మొట్టమొదటగ ఒక్కణ్ణి యెట్లాగైనా సరే తంటాలుపడి జారలాగితే చాలునని యుండెను. మిల్లు చరిత్రకారుడిట్లు వ్రాయుచున్నాడు :—

“ఈ యద్దే సేనల స్కీమువల్ల యీ దిగువ చెప్పబోవు రెంటిలో నేదో ఒక పని జరిగితీరును. ఈ స్కీములో పడ్డమనిషిని చూచి తక్కినవారందరుకూడ అదేప్రకారముగ తమ సొంత సైనిక బలమును వదలుకొని తీరునట్లైన యిది నిర్బంధించును. లేదా, వారిని పరాధీనస్థితిలోపెట్టి, క్రిందియంతస్థునకు గుంజనైన గుంజును. ఈస్థితిలో వారిపొగరంతయు అణగును. అప్పుడు వారు మనము చెప్పినట్లు విందురు.” ఇవి వెల్లస్లీ మాటలు. ఆతడింకను యిట్లుచెప్పుచున్నాడు :—“ముందుగ దౌలత్ రావు సింధియానుగనుక యీ బేరములో పడగొట్టగలిగినామంటే, నాప్లానంతయు నెగ్గిందన్నమాటే. తక్కిన మహారాష్ట్ర నాయకులందరిని బహు తేలికగ యిందు లోనికి లాగికొనిరావచ్చును. ఏలననగ, వారీ స్కీములోనికిరాక దూరముగవుంటే, వారిపని మరింత అధ్వాన్నముగవుంటుంది. ఎట్లనగ, యీ స్కీమువల్ల మనమిచ్చుటకు పూచీపడిన సర్వసామాన్యలాభములేమియు వారికిలేకుండ పోవుటచేత, వారిపని

మరీ పరాధీనముగను హీనముగను వుంటుంది. అప్పుడీ స్నేహకూటము తనకు వెలిగ నున్నవారి యాశలను, పొగరులను అణచుటకు పనిచేయుట తటస్థించుతుంది.'' ఈ రీతిగ, ప్రతి మహారాష్ట్ర నాయకుని, ఆఖరుకు ఇంగ్లీషువారి దయమీద ఆధార పడి బ్రతుకునట్లు చేయవలయునని వెల్లస్లీ వేసినప్లానుయొక్క పరమావధి. ఈ స్కీముకు ఒప్పుకున్నవారు ఇంగ్లీషువారిమీద ఆధారపడి బ్రతుకుదురు. ఒప్పుకోనని వారికి యీారక్షణలేక బాధపడుదురు. ఎట్లయినను పరాధీనదశతప్పదు. ''ఏకక్రియా ద్వ్యర్థకరీ'' యన్నట్లు ఒక వుపాయముచే రెండు వ్యతిరేక పరిస్థితులలో సైతము ఫలితము అనుకూలముగ చేకూరునట్లు యీ ప్లాను వేయబడినది.''

దౌలత్‌రావు సింధియా వలలో పడలేదు.

కాని, యీస్కీములో దౌలత్‌రావు సింధియా పసువాడుకాడు. వెల్లస్లీ అతనివద్దకు పంపించిన రాయబారి కాలిన్సుకు ఆశాభంగమయ్యెను. మిల్లు యిట్లు వ్రాయుచున్నాడు:—

[నాకు ఇంగ్లీషువారి సహాయముకావాలని దౌలత్‌రావు నోటిమీదుగ అనిపించి, తరువాత యీ యుద్ధసేనలస్కీమును అతనియెదుట పెడుదామని యింగ్లీషురాయబారి కాలిన్సుయొక్క యెత్తు. కాని, ''యిదివరకున్న స్నేహము గట్టిగవుంటేచాలు. ఇకవేరే నాకేమీఅక్కరలేద''ని దౌలత్‌రావు నిక్కచ్చిగ చెప్పివేసెను. అదిగాక, పీష్వాకు, యింగ్లీషువారికి లోగడజరిగిన ఒడంబడిక నావల్లనే జరిగినది. దానికినేను హామీగావున్నానుకాబట్టి, ఇంగ్లీషువారితో అవసరమైనమాటలు అప్పుడప్పుడు నడుపుకోడానికి ఉభయులమధ్య నీబోటివాడొకడుంటే చాలులే యనియు సింధియాచెప్పెను. ఈ రెండవమాటలో ఒక గూఢార్థమున్నది. వెనుక తనద్వారా జరిగిన ఒడంబడికను తోసిపుచ్చి, పీష్వాను టోపీలోవేసుకొనుటకై యిప్పుడు పునహాలో ఇంగ్లీషువారు చేయుచున్న కుటిలప్రయత్నమంతయు తాను ఆమోదింపనుసుమాయను సూచన కూడ ఈమాటలో గర్భితమైయున్నది.—క్లుప్తము.]

సింధియా తనవలలో యెంతమాత్రము పడేటట్లు లేడని కాలిన్సు రాయబారి వెల్లస్లీకి వ్రాసుకొనెను. అయితే, అతడు దీనికొక ఉపాయమును సూచించెను. పీష్వా మెత్తనివాడు కాబట్టి ''ముందుగ అతనిని మనమీవలలో పడగొట్ట గలిగితే, సింధియా అప్పుడు చచ్చినట్లు తనంతట తానేవచ్చి, మనలను బ్రతిమాలుకొని మరీ మనవలలో పడతాడు. ఏలననగ, యావన్మహారాష్ట్ర సామ్రాజ్యమునకు సర్వాధిపతియగు పీష్వాయే మనలో చేరితే, తనకిక బ్రతుకేది యని సింధియాకు హడలుపుట్టును.

'పీష్వాను ముందుగ పడగొట్టితే'

పీష్వా అప్పుడు తనబలమును యావత్తు తనపై ప్రయోగించునేమో యని సింధియాకు భయము పుట్టుతుంది. కాబట్టి, సింధియా అప్పుడు తనంతటతానేవచ్చి, ''నన్ను మీలో యెట్లాగైనా చేర్చుకోండిబాబూ. అని బ్రతిమాలుకొని మరీ మన కాళ్ళదగ్గరకు వస్తాడు!'' అని కాలిన్సు వెల్లస్లీకి వ్రాసెను.

ఈ రీతిగ వెల్లస్లీ ముందుగ పీష్వాను వలలో పడగొట్టవలెనని నిశ్చయించుకొనెను. తన ప్రయత్నమంతయు ముందుగ అతనిపైకి త్రిప్పవలెనని అతడు తీర్మానించుకొనెను. పీష్వా చాలవరకు యిదివరకే మెత్తబడియుండెను. ఇంగ్లీషు సేనల నతడు అద్దెకు పుచ్చుకొనుటకు యిష్టపడినను, వానిని తనరాజ్యములో వుంచుకొనక, బయట వుంచవలెనని కోరెను. పొట్టకూటికై యేరువేల మైళ్ళ దూరమునుండి వచ్చిన ఇంగ్లీషు మున్నగు యూరోపియనులు కుచ్చిత స్వభావులనియు, తిన్నయింటి వాసములు లెక్కపెట్టువారనియు, వీరివల్లనే అనేకమంది రాజులు నాశనమైపోయినారనియు పీష్వా బాజీరావుకును తెలియును. అందుచేతనే, వారిని అవసరము వచ్చినప్పుడు వినియోగించుకొన దలచినను, యితర సమయములలో వారు తన రాజ్యములోగాక బయట వుండవలెనని బాజీరావు కోరెను. మహారాష్ట్ర నాయకులలో యెవరుగాని యీమాత్రమునకైన ఒప్పుకొన్నవారు కనపడక పోవుటచేత, "పోనీ, యెక్కడికక్కడికే చూద్దాము, ముందు యేదోవిధంగా యీ పీష్వాచేత కొంచెం బోణీచేయిస్తే, తర్వాత సంగతి నెమ్మదిగ చూచుకొందాము" అని తలంచి యీ షరతుకు వెల్లస్లీ మొదట అంగీకరించెను. ఇందునుగూర్చి వెల్లస్లీ సెక్రటరీ ఎడ్మన్‌స్టన్ 1802 సం॥ జూన్ 23-వ తేదీన పునహా రెసిడెంటగు కర్నల్ క్లోజుకు వ్రాసిన ఉత్తరములో యీమాట లున్నవి:—

'బాజీరావుచే ముందుగ కొంచంబోణీచేయిస్తే..'

"అతడు పెట్టిన షరతులతోనైననుసరే పేష్వా మన సేనలను అద్దెకు తీసికొనుటకు సమ్మతించినాడంటే, మనకదే చాలును. ఏలననగ, దీనివల్ల అతడు తక్షణమే కొంతవరకైనను మన ఇంగ్లీషువారిమీద ఆధారపడి బ్రతుకవలసినవాడైనాడన్నమాటే................ఏరాజ్యము గాని పరాయిరాజ్యంమీద యేకించిత్తు ఆధారపడుటకు ప్రారంభించినాసరే, ఆపరాధీనత దానంతట అదే క్రమక్రమముగ పెరిగిపోతుంది. 'మనను రక్షించడానికి పరాయివారున్నారు గదా మన కేమిభయము'—అను ఉపేక్షఒకటి వారిలో ప్రవేశించి, తమంతటతాము జాగ్రత్తగను, అప్రమత్తతతోను ఉండడముపోతుంది. వారిలో ఒకవిధమైన అజాగ్రతయేర్పడుతుంది. పేష్వా మనమీద కొంచెము ఆనుకోవడం ప్రారంభించినాడంటే, దానివల్ల యేమిజరుగుతుందో తెలియునా? ఇతనికిని యితరమహారాష్ట్ర నాయకులకును క్రమక్రమముగ చీలిక యేర్పడుతుంది. ఇతనికి వారికి యెడబాపులవుతవి. ఇందువల్ల మొదట మనమీదకొద్దిగ ఆనుకున్నవాడు రానురాను, యీ ఆనుకోవడం యెక్కువై, యిక అతనికి మనములేనిదే నిలువలేనిస్థితివస్తుంది. ఈ పరాధీనతను త్వరత్వరగ హెచ్చించడానికి యిదేమార్గము."..................."

"పేష్వావచ్చి మనతో యీఒడంబడిక చేసుకున్నాడంటే, యిక మహారాష్ట్రులందరు యేకకూటముగ చేరుతారనే భయము మనకుపోతుంది. అట్టిది యిక యెన్నడు జరుగనేరదు....... మహారాష్ట్రసామ్రాజ్యములో ప్రధానమైన యీశాఖను చీలదీసి, దీనితో మనమిప్పుడిట్లు ప్రత్యేకముగ సంబంధ మేర్పరుచుకున్నామంటే, అది మనకెంతో క్షేమకరమేగాక, తక్కన

శాఖలవారందరుకూడ రేపు మనకాళ్లదగ్గరకువచ్చి మనతో సంబంధమేర్పరచుకుంటేనే తప్ప లేకపోతే బ్రతుకులేదను గొప్ప సంకటస్థితి వారికి వస్తుంది.'']

అద్దెసేనలను పీష్వాకు తగిలించుటలో వెల్లస్లీకిగల ఆంతరంగికోద్దేశమేమియో యీపైమాటలలో స్పష్టమైపోయినది. 1802 సం॥ వెల్లస్లీ తనయుద్యోగమునకు రాజీనామా యిచ్చి సీమకు వెళ్లిపోవుట కేర్పాటు చేసుకొనెను. కాని, ఎప్పుడైతే మహారాష్ట్రములో తాను వేసిన పతకములన్నియు పరిపక్వదశకు రానున్నవని తోచినదో, అప్పుడు వెల్లస్లీ తన యుద్దేశ్యమును మార్చుకొని, మహారాష్ట్ర వ్యవహారముల నొకదరికి తెచ్చిన పిమ్మటగాని యింటికిరానని వెల్లస్లీ తన రాజీనామాను ఉపసంహరించుకొనుచు 1802 సం॥ డిశంబరు 24 వ తేదీన సీమ డైరక్టర్లకు వ్రాసుకొనెను.

పీష్వా బాజీరావు చాలవరకు మెత్తబడినను, అతడు వెల్లస్లీ షరతులన్నిటిని పూర్తిగ ఒప్పుకొనలేదు. ఇంగ్లీషువారిమీద ఆధారపడడమంటే అతనికి కొంచెము జంకుగనే యున్నది. నానాఫడ్నవీసు చెప్పిన పాఠములు పూర్తిగ కాకపోయినను, కొంతవరకైనను అతని కెక్కెను. అదిగాక, ఇంగ్లీషువారితో స్నేహము చేసినందువల్ల పొరుగింటి నైజాము గతి యేమయ్యెనో అతడు కండ్లార చూచుచునే యుండెను. అందుచే, బాజీరావు ఇంగ్లీషువారిని సంపూర్ణ హృదయముతోగాక, సగము సగము మనస్సుతో, దూరదూరముననుండి, బెదరుతూ, బెదరుతూ, ఆలింగనమొనర్చుకొనజూచుచుండెను. ఇది వెల్లస్లీకి యిష్టములేదు. వీనికంఠముమీదికి యేదో కత్తిపెట్టితేనేగాని వీడు మనదగ్గరకు పూర్తిగ రాడని వెల్లస్లీ తలంచెను. తదనుగుణముగానే వెల్లస్లీబాజీరావును అడకత్తెరవంటి స్థితిలోనికి తెచ్చెను. అది యెట్లు జరిగెనో చూతము.

బాజీరావుకు మనసు, బెరుకు.

తుకాజీ హోల్కారుయొక్క దాసీపుత్రులగు యశ్వంతరావు, విఠోజీలను దౌలత్ రావు సింధియా ఓడించి, అతని ఔరస పుత్రుడగు కాశీరావును గద్దె యెక్కించిన సంగతి లోగడ చెప్పియుంటిమి. ఈరీతిగ సింధియా చేతులలో ఓడిపోయిన యీ యిరువురు అన్నదమ్ములలో పెద్దవాడు యశ్వంతరావు నాగపురమునకును, రెండవవాడు కొల్హాపురమునకును, పారిపోయినట్లు కూడ లోగడ చెప్పియుంటిమి. నాగపురమనగ బీరారురాజాకు రాజధాని. నాగపురమునకు పారిపోయిన యశ్వంత రావుకును, సింధియాపై కుట్రపన్నుటకక్కడికి వెల్లస్లీచే పంపబడిన క్రోల్ బ్రుక్కుకును, అక్కడ సమావేశము జరిగెను. యశ్వంతరావుకు సింధియాపై కోపమున్నది. కోల్ బ్రుక్కు సింధియాను నాశనము

పీష్వా మెడమీదికి కత్తి - హోల్కారుచేత పునహామీదికి దండెత్తించుట.

చేయుటకై కుట్రపన్ని వచ్చినాడు. కాబట్టి, యిరువురును యేకఫలార్థులే. యశ్వంతరావు యీరీతిగ నాగపురమునకు పారిపోయివచ్చి సింధియా పునహాలోనున్న సమయముచూచి, అతనిరాజ్యములో జొరబడి అల్లరులు చేయసాగెను. ఈ యల్లరులన్నియు ఇంగ్లీషువారి ప్రేరణచేతనే జరిగినవని నిస్సంశయముగ చెపవచ్చును. ఏలననగ, సింధియారాజ్యములో యిట్టియల్లరులను, కుటుంబ కలహములను, పుట్టించవలయుననియేగద వెల్లస్లీ తన రెసిడెంటుకు స్పష్టముగ వ్రాసియుండెను. యశ్వంతరావుతో సమాధాన పడవలయునని దౌలత్ రావు సింధియా యిప్పుడు యత్నించెను. ఇందుకు యశ్వంతరావు ఒప్పుకొన్నట్లే ఒప్పుకొని కొంతదూరమువచ్చి తిరిగి అతనిని మోసగించి, యెదురుతిరిగెను. గతించిన మాధవరావు సింధియా భార్యలు (బైస్, లక్ష్మీదాదు లనువారు) దౌలత్ రావు సింధియాపై విరోధము వహించియుండిరి. ఈ విరోధమును మరింతపెద్దది చేయవలసినదని వెల్లస్లీ తన రెసిడెంటును ప్రోత్సాహపరచుచు వ్రాసిన ఉత్తరమును యిదివరకు పైన ఉదహరించియే యుంటిమి. యశ్వంతరావు హోల్కారు మాధవరావు భార్యల పక్షముచేరి దౌలతరావును మోసగించెను. ఇతడు ఇంగ్లీషువారి చేతులలో ఉపకరణముగ చిక్కి-వారు జేయమన్న ఛండాలపు పనుల నన్నిటిని చేయుచున్నాడని పాపము దౌలత్ రావుకు మొదట తెలియలేదు. తదుపరి సింధియా హోల్కారులకు మాల్వాలో జరిగిన పోరాటముల తాలూకు తప్సీళ్లనన్నిటిని యిటవివరింప బనిలేదు. ఒకప్పుడొకరును, యింకొకప్పుడింకొకరును క్రింద మీద నగుచూ నుండిరి. ఇక్కడ గల్లంతులిట్లుండగ కొల్లాపురముకు పారిపోయిన విఠోజీహోల్కారు పీష్వాపై దండెత్తి పునహాలో గొప్ప కల్లోలము పుట్టించెను. కాని, పీష్వా యితనిని ఓడించి, పట్టుకొని, చంపించెను. ఈ వార్త అన్నగారగు యశ్వంతరావు హోల్కారుకు తెలియగానే, అతడు మండిపడుచు, పీష్వాను నాశనము చేసెదనని మహా ఆర్భాటముతో పునహామీదికి దండెత్తి రాసాగెను. దీనికి ఇంగ్లీషువారి ప్రోద్బలమే కారణమైనట్లు, వెల్లస్లీ వ్రాసిన ఉత్తరముల వల్లనే నిస్సంశయముగ తెలియుచున్నది. 1802 సం॥ డిశంబరు 24 వ తేదీ ఉత్తరములో వెల్లస్లీ యిట్లని తనసీమడైరెక్టర్లకు వ్రాసెను.

"మహారాష్ట్రలలో నానాటికి రేగుచున్నకల్లోలము—పీష్వా, సింధియాల సంయుక్త బలములపై యశ్వంతరావు హోల్కారుచేయుచున్న తిరుగుబాటు—మనము పూనాలో చేయుచున్న బేరమునకు చాల అనుకూలపరిస్థితులను గలుగచేయుచున్నది."

"మహారాష్ట్రలకుగలిగిన యీ సంకటస్థితి, మనమేపోట్లాడకుండ—మన బ్రిటిష్ రాజ్యమును అక్కడపూర్తిగ స్థాపించుకొనుటకు మంచి వాటమైన వీలునిచ్చుచున్నది. మహారాష్ట్ర నాయకులలో—వారిలోవారికి-గలిగిన యీ కల్లోలము కొన్నాళ్ళపాటు యిట్లే బాగాసాగిన యెడల వారిబలము క్రుంగిపోతుంది. వారిలో ఉభయపక్షముల బలము క్రమక్రమముగ క్షీణించిపోతుంది. అప్పుడు మనము మధ్యచేరి, పీష్వాపక్షము వహించి మన పలుకుబడిచేత, మనము

కోరుకొన్న షరతుల ప్రకారము, పేష్వా అధికారమును నిలువబెట్టుటకు మనకు చక్కని అవకాశము దొరుకుతుంది........."

"మన ఇంగ్లీషు సేనలకు, హోల్కారు సేనలకు యెట్టి సంఘర్షణగాని రాకుండ నీవు గట్టి యేర్పాటులను చేయవలెనుసుమా. మనపనిని మాత్రము మంచి మాటలతో చక్కబెట్టుకోడానికి నీవెప్పుడూ ప్రయత్నిస్తూ వుండుము." అని వెల్లస్లీ రెసిడెంటుకు వ్రాసెను.

వెల్లస్లీవ్రాసిన పైవ్రాతల కర్థమేమి? ఈమాటలను విన్నతరువాత ఇంగ్లీషు వారు హోల్కారును ప్రోత్సహించుచున్నారని చెప్పుటకు ఇంకయేమైన సందేహము గలదా ? పీష్వా ఇంగ్లీషువారికి మిత్రుడుగద. వెనుకటి యొడంబడికల ప్రకారము వారతనికి సహాయము చేయవలసియున్నారుగద. తమ మిత్రుడగు తిరువాన్కూరు రాజాపై టిప్పూ దండెత్తనున్నాడను మిషతో టిప్పూపైకి దుమికిన ఇంగ్లీషువారిప్పుడేల యశ్వంతరావుహోల్కారు తమ మిత్రుడగు పీష్వాపై దండెత్తి అతని రాజధానియగు పునహా నగరమును ఆక్రమించుకొన్నప్పటికి వారు పీష్వా సహాయార్థమైవచ్చి, హోల్కారుమీదికి దూకరైరి ? అట్లు దూకకపోగా, యశ్వంతరావు హోల్కారు సేనలజోలికి పోవద్దని వెల్లస్లీ యేల తన రెసిడెంటుకు కట్టుదిట్టముగ వ్రాసెను ? అనగ, ఇంగ్లీషువారు ప్రత్యక్షముగను, పరోక్షముగను కూడ తమ మిత్రుడగు పీష్వాకు వ్యతిరేకముగ యశ్వంతరావు హోల్కారుకు సహాయము చేయుచున్నా రన్నమాట !

సుశిక్షితములును, బహుళ సంఖ్యాకములును నగు సింధియా పీష్వాల సంయుక్త బలములు ఒకప్రక్కను, వట్టిముక్కిడిమూక హోల్కారు బలములు మరి యొక ప్రక్కను నిలిచి 1802 సం॥ అక్టోబరు 25-వ తేదీన పునహాలో ఘోరముగ పోరాడెను. సింధియా పీష్వాల బలములు సుశిక్షితములయ్యు, అది యేమిమాయయోగాని, హోల్కారు తాలూకు ముక్కిడి మూకలముందు నిలువలేక పూర్తిగ ఓడిపోయెను. ఇది లోకమునకంతకు ఆశ్చర్యమయ్యెను. ఇట్టి దుష్ఫలితమునకు ఇంగ్లీషు రెసిడెంటుయొక్క కుట్రయే కారణమని చెప్పుటకు అనేక నిదర్శనములు గాన్పించుచున్నవి. సింధియా కొలువులోనున్న కెప్టెన్ "ఫిడెలేఫిలోజ్" అను యూరోపియను సేనానాయకుని ద్రోహమువల్లనే యీాదురవస్త ప్రాప్తించినట్లు 1889 సం॥ ఏప్రెల్ నెలలో ఏషియాటిక్ రివ్యూ పత్రికలో సర్ మైకేల్ ఫిలోజ్ అనునతడు వ్రాసిన యీా దిగువసంగతులనుబట్టి స్పష్టముకాగలదు.

దౌలత్ రావు యొక్క యూరోపియన్ సేనానాయకుని స్వామి ద్రోహము — పీష్వా సింధియా సేనల ఓటమి.

" దౌలత్ రావు సింధియా మామగారగు" సురాజ్ రావు ఘట్ గే" గారు చాల పలుకుబడిగలవారు..............దౌలత్ రావు సేనానాయకుడగు "ఫిడెలే

ఫిలోజ్ " యశ్వంతరావు హోల్కారుతో రహస్యముగ ఉత్తర ప్రత్యుత్తరములు జరుపుచున్నట్లును, తనయేలికయగు దౌలత్ రావుకు ద్రోహముచేయుటకై యదను వేచియున్నట్లును యీమామా గారా సేనాపతిపై నిందమోప సాగెను. ఈ అపనిందను భరింపలేకను, సురాజ్ రావు తనయందు నిరంతరము విరోధము వహించుచుండుట చేతను, యీ ఫిడెలే ఫిలోజ్ కు మనోవ్యధగలిగి దానిని భరించలేక ఆత్మహత్య చేసుకొనెను."

దౌలత్ రావు సింధియా మామగారు యీ యూరోపియను ఆఫీసరును గూర్చి చెప్పినమాట అపనిందకాదనియు, ఆతని ఆత్మహత్యకిది నిజమైన కారణము కాదనియు చెప్పవలసియున్నది. ఏలననగ, యిదియే అపనిందయైనచో, యీ ఆఫీసరు దీనినిగూర్చి బహిరంగముగ విచారించవలసినదని గట్టిగ కోరియుండును గాని, ఆత్మహత్య చేసికొనడు. ఎవరును అనుకొనని రీతిగ సింధియా, పీష్వాల బలములిట్లు హోల్కారు తాలూకు ముక్కడిమూకల చేతులలో ఓడిపోవుటచూడగ, సింధియా కొలువులో ద్రోహిఎవడో ఒకడుండవలెనని నిశ్చయమగుచున్నది. అట్టిద్రోహి పొట్టకూటికై చేరిన యీ యూరోపియనుడు గాక యింకెవడుండును?

బాజీరావు సంకట స్థితి.

పీష్వాను యెట్లయిన అడకత్తెరలోపెట్టి నొక్కి సంకటస్థితిలోనికి తెస్తేనే తప్ప అతడు తమమాట వినడనిగద వెల్లస్లీ మున్నగు ఇంగ్లీషువారు తలచుచుండిరి. ఇట్టి సంకటస్థితిని కల్పించుట యెట్లా యని గద వారు పొంచియుండి ఆలోచించు చుండిరి. ఇట్టి సంకట స్థితి హోల్కారు దండయాత్రవల్ల వచ్చుచున్నప్పుడు వారు హోల్కారు కేల సహాయము చేయకుండ నుందురు? వెల్లస్లీ అంత తెలివితక్కువవాడా?

తమ సేన లిట్లు ఓడిపోయినవను వార్త వినగనే పీష్వాబాజీరావు పునహా నుండి పారిపోయెను. పారిపోయినవాడు సరాసరి దౌలత్ రావు సింధియావద్దకైనను చేరినవాడుకాడు. పునహానుండి సింహగడమునకును, అక్కడనుండి రాయగడము నకును, మరల అక్కడనుండి "మహిర్"కును బాజీరావు పారిపోయెను. ఈరీతిగ మహారాష్ట్ర సామ్రాజ్య మహావృక్షమునకు మూలకందము—పీష్వా—కుటిలాంగ్ల తంత్ర కుద్దాల ఘాతములచే పెల్లగిలి, తత్ప్రచండ ఝుంఝామారుతాహతిని ఆకాశపథమునకెగిరి, దిక్కుగానక బరచుచున్న తరుణమున, అది క్రిందపడుచోటును కనిపెట్టి, దానిని తమ యొడిలో వేసికొనుటకై ఇంగ్లీషువారక్కడ దిగువను తమ చెంగుపరచుకొని కూర్చుండిరి. అర్జునుడు సైంధవుని తలనువలె ఇంగ్లీషువారు పీష్వా నిట్లు అంతరిక్షమున అటునిటు ఆడించి యాడించి తుద కొక్క దెబ్బతో ఆతడు తమయొడిలో వచ్చి పడు నట్లు యశ్వంతరాయబాణమును ప్రయోగముచేసిరి. పీష్వా బాజీరావు యీరీతిగ

బాజీరావు పలాయనం, చెట్టుపుట్టలంబడి పరుగిడి తుదకు ఇంగ్లీషువారి ఒడిలో పడుట.



పునహానుండి సింహగడము, రాయగడము, మిాదుగు, మహిక్ చేరి "నన్ను నాపరివారమును బొంబయి చేర్చుటకుగాను ఇంగ్లీషు ఓడల నిక్కడికి పంపండి" యని కోరుచు మహిక్‌నుండి బొంబయి గవర్నమెంటుకు ఉత్తరముల మిాద ఉత్తరములను బంపెను. కాని, తనను వెంబడించుటకై పంపబడిన హోల్కారు సేనలు దగ్గరకు వచ్చుచున్నవని వినగానే, బాజీరావు అక్కడనుండి కదలి సవనదుర్గమునకు పారిపోయెను. అక్కడ కొన్నాళ్లుండెను....పిమ్మట 'రేవాదండ' నదిని దాటి, అక్కడకు తనకోసం వచ్చిన యింగ్లీషు ఓడలో యెక్కి 1802 సం॥ డిశంబరు 6-వ తేదీన బేసిన్ లంకలో దిగెను—(గ్రాంటు డఫ్ చరిత్ర 558 పేజీ.)

ఇంగ్లీషువారికి హోల్కారుతో పని తీరినది.

ఈ పోరాటములో హోల్కారు యింగ్లీషువారి సహాయమును పొంది యుండెనని చెప్పుటకు యిదియొక నిదర్శనము. ఇంకొక నిదర్శనము చూడుడు. పీష్వాతోకూడ ఇంగ్లీషు రెసిడెంటు పారిపోక పునహాలోనే నిలువ యుండెనను సంగతి పాఠకులు గ్రహించవలసి యున్నది. గ్రాంటు డఫ్ (558 పేజీలో) యిట్లు వ్రాయుచున్నాడు:—

"యుద్ధమైన మరునాడే, తనను వచ్చిచూడవలసినదని హోల్కారు యింగ్లీషు రెసిడెంటుకు కబురుపంపించెను. ఈకబురును నిరాకరించుట మంచిదికాదని రెసిడెంటు తలంచి హోల్కారువద్దకు వెళ్ళెను.........

రెసిడెంటుతో మాట్లాడుటలో హోల్కారుచాల మర్యాదజూపెను. రెసిడెంటునందును యింగ్లీషువారియందునుకూడ అతడెంతయో మైత్రిని కనబరచెను. సింధియా పీష్వాలతో తాను వ్యవహారము పరిష్కారము చేసుకొనుటలో రెసిడెంటు మధ్యవర్తిత్వము చేయవలెనని హోల్కారు యెంతయో ఆతురతనుగనబరచెను. తనకీవ్యవహారములు పరిష్కారములు చేసిపెట్టవలసినదని యతడు రెసిడెంటును బ్రతిమాలుకొని, అతనినొక నెలవరకును పూనాలోనే వుంచుకొనెను."

కాని, ఇంగ్లీషువారి పని తీరిపోయినది. అవసరమైనంతసేపు వారు హోల్కారును ఉపయోగించుకొనిరి. పిమ్మట అతని గొడవను వారు విననైన వినరైరి. అతడెట్లుపోయిన యిక వారికేమి? ఏరుదాటిన తరువాత తెప్ప తగులవేయువారుగద ఇంగ్లీషువారు.

బాజీరావు మంగలములోనుండి, నిప్పులోకి దూకినాడు.

ఇక పీష్వా గతిమాత్రము యింతకంటె మెరుగుగ యెట్లుండగలదు? మంగలములోనుండి నిప్పులోకి దూకినట్లయినది. అతనిపని. ఆంగ్లభల్లూకము నాలింగన మొనర్చుకొన్నందువల్ల గలుగవలసిన దుష్ఫలితము లన్నియు యితడు ఒక్కటొక్కటే యనుభవింప సాగెను. పామరు చెప్పిన జ్యోతిషము ఫలించురోజు వచ్చినది. పీష్వా మెడమీాదికి కత్తివచ్చినది. అందుచే, ఇంగ్లీషువారు చంకలు గొట్టుకొని, బలేగా ఆనందింపసాగిరి. పీష్వా నీ వలలో పడగొట్టవలయు

నని వెల్లస్లీ నాలుగేండ్లనుండి తంటాలు పడుచుండెను. ఈ నాలుగేండ్లలో అతడు పడనిపాటులేదు. తన ప్రయత్నములన్నియు బూడిదలో పోసిన పన్నీరగుచున్నట్లు అప్పుడప్పు డతనికి గోచరమగుచుండెను. కాని, అదృష్టదేవత ఇంగ్లీషువారిపక్షము నందుండగ, వెల్లస్లీ ప్రయత్నము లెట్లు విఫలములు కాగలవు? ఎట్టకేలకు అతని ప్రయత్నములు ఫలించురోజు వచ్చినది.

బాజీరావు ఇంగ్లీషు అద్దె సేనల నంగీకరించుట- బేసిన్ ఒడంబడిక.

దౌలత్ రావు, నానాఫర్నవీసుల ప్రేరేపణచే యింతకాలమునుండి యే షరతులనైతే బాజీరావు మాటిమాటికి తిరస్కరింపుచువచ్చెనో ఆ షరతులనన్నిటిని యిప్పుడితడు బేసిన్ లంకలో అంగీకరించినాడు. నానాఫర్నవీసుకుగల దూరదృష్టిగాని, దౌలత్ రావుకుగల రణకౌశలముగాని లేక, కేవలము దుర్బలుడైయున్న బాజీరావు కంపెనీ యుద్యోగులు తన కండ్లయెదుట ఆడించుచున్న యెరలను మ్రింగబోయి, వారిచేతులలోపడెను. "అద్దె సేనల స్కీము" అనబడు కాడిని వారు తీసుకొనివచ్చి యితని మెడమీదవేసిరి. ఈ స్కీముకు ఒప్పుకొనుచు 1802 సంవత్సరము డిశంబరు 31-వ తేదీన చరిత్రలో "బేసిన్ ఒడంబడిక" యని ప్రఖ్యాతిగాంచిన సంధి పత్రముపై బాజీరావు సంతకము పెట్టెను.

బేసిన్ ఒడంబడిక- భారత స్వాతంత్ర్య హరణ కారణము.

ఈ ఒడంబడికయే మహారాష్ట్రకులమునకు ముసలమయ్యెను. ఏ ప్రజలనైతే ప్రపంచ చరిత్రలో ప్రఖ్యాతిగాంచిన మహాజాతిగ శివాజీ దిట్టపరచెనో, అట్టి మహారాష్ట్ర ప్రజల స్వాతంత్ర్యమును హరించి, వారిని చిరదాస్యాగ్నియందు తప్త మొనరించుటకై యీ బేసిన్ యొడంబడిక అశని సదృశమయ్యెను. ఒక్క మహా రాష్ట్ర ప్రజలదే గాక, యావద్భారత ప్రజాకోటియొక్క స్వాతంత్ర్యమును హరించుటకుకూడ కారణ భూతమయ్యెను.

ఇది భారత చైతన్యమును హరించు యమమహిష ఘంటికా నాదమయ్యెను. తమ యపహృత స్వాతంత్ర్యమును తిరిగి సంపాదించుకొను ఆశలన్నియు నేటితో భారత ప్రజలకు అంతరించిపోయెను. నానాఫర్నవీసు ఆనాడు చెప్పిన జోతిష్యము సరిగజరిగితీరు రోజువచ్చినది. దుర్బల హృదయుడగు రఘూబా కొడుకునుతక్తు యెక్కిస్తే కొంపమునుగుతుందని నానాఫర్నవీసు ఆనాడే మొత్తుకొన్నాడు. ఏలననగ, యితని కుటుంబమునకు ఇంగ్లీషువారితోగల సంబంధము యెప్పటికైనా మనకు ముప్పు తెచ్చునని ఆతడానాడే యనలేదా? ఏమాత్రము గట్టిమనస్సుగల యే యితర పీష్వాయైనను, దుర్బలుడగు యీ బాజీరావు పడినంత తేలికగ ఇంగ్లీషువారి వలలో పడెడివాడు కాడనుట ముమ్మాటికి నిశ్చయము.

# బ్రిటిష్ మహాయుగము

## ఇరువదినాల్గవ అధ్యాయము



### బేసిన్ సంధి : పీష్వా తిరిగి పునహాకు చేరుట.

బేసిన్ ఒడంబడికనుగూర్చి గతశతాబ్దారంభమందు పలువురు పలువిధములుగ తలంచిరి. ఆంగ్లరాజ్యస్థాపనయందది ప్రధాన ఘట్టమని చెప్పుట కెంతమాత్రమును సంశయములేదు. అది మహారాష్ట్రుల రాష్ట్ర కూటమును బ్రద్దలుకొట్టి, తత్సామ్రాజ్యమును నాశన మొనరించుటకై దానిలో కొట్టబడిన సన్నని అంచుగల మేకు అయ్యెనని చెప్పవచ్చును. మహారాష్ట్రుల రాష్ట్రకూటము మిక్కిలి బలిష్ఠమై యుండెను. ఇంతటి పెద్ద రాష్ట్రకూట మీదేశములో నెన్నడుగాని, తదితరు లెవరుగాని, నిర్మించియుండలేదు. ఇట్టి బలిష్ఠమైన కూటములో, మేకుకొట్టి చీలదీయవలయునని ఇంగ్లీషువారు గతయాభై యేండ్లనుండి నిరంతరము అనేక యుపాయములచే ప్రయత్నించు చుండిరి. తుట్టతుదకీ బేసిన్ ఒడంబడికవలన ఇంగ్లీషు వారికోర్కెలు వారనుకొన్నదానికంటె హెచ్చుగనే నెరవేరెను. వెల్లస్లీ కల్పించిన అద్దె సేనల వలలో నైజాము పడినప్పుడే మహారాష్ట్ర నాయకులకు చాలకోపము వచ్చెను. ఇక యిప్పుడు తమ కందరికి శిరోభూషణమగు పీష్వాయే యీ వలలో పడినప్పుడు యికవారికి గలిగినకోపము, మనస్తాపము, చెప్పతరముకాదు. ఈ యొడంబడిక వల్ల పీష్వా తనకట్ట త్రాళ్లు తాను తెచ్చుకొనుటయేగాక, తక్కిన రాష్ట్రపతులకుకూడ స్వాతంత్ర్య వినాశన మొనర్చిన వాడయ్యెను. సదరు యొడంబడికలోని షరతులను పరిశీలించి చూచినవారికి యీ యంశము గోచరింపక మానదు. దీనిని వెల్లస్లీ దాచక చెప్పియే వేసెనుగద. అతడన్న మాటలివి :—

బేసిన్ ఒడంబడిక-మహారాష్ట్ర కూటమును చీలదీయు మేకు.

> "వీరిలో ఒక్కరు మనలో చేరినారంటేచాలు; తక్కిన వారందరుకూడ యిక మన నాశ్రయించుకొని బ్రతుకవలసియేవస్తుంది. మనతో నేస్తముకట్ట నంగీకరించినవారికి సదరు నేస్తమేవారిని మన యాశ్రయములోనికి తెస్తుంది. అట్టి నేస్తముకట్ట నంగీకరింపనివారికి సైతము దాని యభావమే వారిని మన యాశ్రయమునకు వెలిజేసి వేస్తుంది."

ఈ రీతిగ ఇంగ్లీషువారితో స్నేహమైనను విరోధమైనను తుదకు ఫలిత మొక్కటియగు రీతిగ యీ అద్దెసేనల స్కీము వెల్లస్లీచే పన్నబడినది.

బేసిన్ ఒడంబడిక షరతులనుగూర్చి విపులముగ చర్చించుటకు ముందు, జస్వంతరావు హోల్కారు పునహాలో యేమి చేయుచుండెనో చూతము, సింధియా

పీష్వాల సంయుక్త బలముల నోడించిన పిమ్మట హోల్కారు పీష్వా బాజీరావును తరుముకొని పోక యూరకుండెను. అతడట్లు పీష్వాను తరుముకొని పోయి పట్టు కొని యున్నచో మహారాష్ట్ర రాజ్యమింకా కొన్నాళ్లపాటు నిలిచేదేమో. హోల్కారు యీ రీతిగ యూరకుండుటకు కారణమెక్కడను రికార్డులలో కనిపించదు. అయితే, యిక్కడ ఒక అంశమును జ్ఞాపకముంచు కొనవలెను.

బాజీరావును జస్వంతరావు చేతిలోగాక, తమ చేతిలో వేసికొనుటకు యింగ్లీషు వారి యెత్తు

ఇంగ్లీషు రెసిడెంటు కర్నల్ బారీ "క్లోజు" బాజీరావుతోకూడ పారిపోవక పునహాలోనే హోల్కారు శిబిరములో మకాముచేసి యుండెను. బాజీరావు హోల్కారు చేతులలోగాని, మరిదేని యితర మహారాష్ట్ర నాయకుని చేతులలోగాని పడితే ఇంగ్లీషువారి యెత్తులన్నియు చెడిపోవును. కాబట్టి ఇంగ్లీషు రెసిడెంటు హోల్కారు వద్దచేరి "యిప్పుడప్పుడే పీష్వాను తరిమిపట్టుకో వద్దు"ని అతనికి మాయమాటలచే బోధించి యుండవచ్చును. పీష్వాను తాము తమయొడిలో వేసుకోవలెను గాని యితరుల యొడిలో వేస్తే ఇంగ్లీషువారి కేమి ప్రయోజనము? ఈ పని కేగద— అనగ పీష్వాను తమ యొడిలో వేసికొని అతనిచేత తమయిష్టము వచ్చిన కాగితము వ్రాయించి పుచ్చుకొనుటకే గద—యీ రెసిడెంటును ఇంగ్లీషువారు పునహాలో పెట్టినది—ఈ పనిని సదరు రెసిడెంటు నెరవేర్చుటకై మొదటినుండియు యెన్నియో పాట్లుపడుచుండెను. మొదటి రోజులలో పీష్వా యితనిమాటలను చెవినిబెట్ట లేదు. చాలకాలము వరకు యితని మంత్రము పారలేదు. తన ప్రయత్నము లన్నియు వృథయగుచున్నవేయను నిరాశకూడ రెసిడెంటుకు కొంతకాలమునకు గలిగెను. తన మంత్రమేమియు యీ పీష్వావద్ద పారుటలేదని మొత్తుకొనుచు యితడు ఒక సారి గవర్నర్ జనరల్ వెల్లస్లీకి వ్రాసుకొనెను కూడాను. మనముచెప్పే తియ్యని మాటలు పీష్వా తలపుల కెక్కుటలేదనియు, అతని సహజ స్వభావమున కవి అసహ్యముగనున్నవనియు పీష్వా యెంతటి కష్టదశలో నున్నను మనస్నేహమంటే ఒప్పుకొనుట లేదనియు యీ రెసిడెంటు వెల్లస్లీకి ఒకప్పుడు వ్రాసెను. (Mills History Vol. VI P. 274) పీష్వా చూపిన స్వాతంత్ర్య ప్రియత్వము ఇంగ్లీషు రెసిడెంటుకు యెంత కంటకముగ నుండెనో పైవాక్యములనుబట్టి తెలియగలదు.

కాని చెప్పగ, చెప్పగ "బ్రహ్మకైన బుట్టు రిమ్మ తెగులు" అన్నట్లు రెసిడెంటు నిరంతరము పీష్వా చెవిలో నూరిపోయుచున్న విషము పీష్వా తల కెక్కక యెట్లుండగలదు? తుట్ట తుదకు ఒకషరతుమీదనైతే - ఇంగ్లీషు సేనల నద్దెకు తీసుకొనుటకు నేను ఒప్పుకుంటానని పీష్వా తలయూపెను. ఆషరతు యేమియో యిదివరకు చెప్పియేయుంటిమి. ఈయద్దెసేనలు తనకు అవసరమువచ్చినప్పుడుతప్ప యితర సమయములలో తనరాజ్యమునకు వెలుపలనుండు షరతుతోనైతే, వానినద్దెకు తీసికొనుటకు తన కభ్యంతరము లేదని పీష్వా కొంచెము తల యెగురవేసెను. ఎక్కడి



కక్కడే చూద్దామను ఊహతో యీపద్ధతికి వెల్లస్లీకూడ ఒప్పుకొనుటకు సిద్ధపడెను. కాని, ఎప్పుడైతే హోల్కారుసేనలు వచ్చి పునహాను ముట్టడించెనో అప్పుడు పీష్వాకు తొందరపుట్టి యీ యభ్యంతరము కూడ తొలంగించి, వెల్లస్లీ చెప్పిన ప్రకారమే అన్ని షరతులను ఒప్పుకొని, ఇంగ్లీషు సేనను యెల్లప్పుడు తనరాజ్యములోనే పెట్టుకొనుటకుకూడ అంగీకరించుచు 1802 సం॥ అక్టోబరు 11 వ తేదీన పీష్వా తనమంత్రిచేత ఇంగ్లీషు రెసిడెంటుకు కబురు పంపించెను. పిమ్మట 1802 సం॥ అక్టోబరు 25 వ తేదీన హోల్కారుచేత తనసేనలు ఓడిపోయినవన్న కబురు వినగానే పీష్వా బాజీరావుకు గాబరాపుట్టి పారిపోవుచు ఒక కాగితమును వ్రాసి తన మంత్రిచేతికిచ్చి దానిని ఇంగ్లీషు రెసిడెంటుకిమ్మని చెప్పిపోయెను. ఆకాగితములో యేమియున్నది? ఆరు ఇంగ్లీషు సైనికదళములను, అందుకు సరిపోవు ఫిరంగి దళమును తాను ఇంగ్లీషువారినుండి అద్దెకు తీసుకొనునట్లును, వారినెల్లప్పుడు తన రాజ్యములోనే వుంచుకొనునట్లును సదరు అద్దెక్రింద సాలుకు 25 లక్షల రూపాయలు రాబడిగల దేశమును కర్ణాటకములోగాని, గుజరాతులోగాని వారు కోరుకొన్న చోట ఇంగ్లీషువారికి తానిచ్చుకొనుటకును అంగీకరించుచు సదరు కాగితములో వ్రాసి యిచ్చి పీష్వా బాజీరావు పలాయనుడయ్యెను. దీనితో వెల్లస్లీ కోర్కెలన్నియు పూర్తిగ సఫలమయ్యెను. అందుచే యీ కాగితము తనచేతికివచ్చిన రోజుననే అతడు సదరు షరతులకు అంగీకరించుచు వానిని ధ్రువపరచెను.

ఈరీతిగ పీష్వా బాజీరావు తనంతట తాను వచ్చి తనవలలో పడుచున్న సమయమందు అతనిని హోల్కారు అను గ్రద్దవచ్చి మధ్యగ తన్నుకుపోవుటకు ఇంగ్లీషు రెసిడెంటు ఒప్పుకొనునా? అందుకనియే పీష్వాను నీవిప్పుడు వెంబడించి పట్టుకోవద్దని రెసిడెంటు హోల్కారుకు యేమో మాయమాటలు చెప్పి మాన్పించె ననుట స్పష్టము.

బాజీరావు యీరీతిని తనచేయి జారిపోగా, జస్వంతరావు హోల్కారు తనకు చేలోకువైన కుర్రవానినొకనిని తీసికొనివచ్చి పూనా తక్తుపై కూర్చుండబెట్టెను. ఈ కుర్రవాని పేరు అమృతరావు. ఇతడు ద్రోహి రఘూబాకు పెంపుడు కొడుకు. మొదట రఘూబాకు సంతతిలేకుండెను. ఇక పిల్లలు పుట్టరను నిరాశచేత అతడీ అమృతరావును పెంచుకొనెను. కాని, యీదత్తతయైన తరువాత రఘూబాకు ముసలి తనములో—మహారాష్ట్ర రాజ్యపు దురదృష్టము చేతనో యన్నట్లు—యిద్దరు కొడుకులుపుట్టిరి. వారిలో పెద్దవాడే మన భాగ్యుడు బాజీరావు. ఇతడీరీతిగ పూనానుండి పారిపోగానే, జస్వంతరావు హోల్కారు యీ దత్తకుమారుని అమృతరావును తీసికొనివచ్చి పునహాసింహాసనముమీద కూర్చుండబెట్టెను. ఇది కొంతవరకు బాగానేవున్నది. ఈ పనికి యేమియు అభ్యంతరము చెప్పక

జస్వంతరావు అమృతరావును పూనా గద్దె నెక్కించుట.

ఇంగ్లీషు రెసిడెంటు మెల్లగ ఒకనాడు పునహానుండి జారిపోయి యెచ్చటనో దాగి యున్న బాజీరావుతో వచ్చి కలుసుకొనెను.

ఏరుదాటిన తరువాత తెప్ప తగులవేసినట్లు, ఇంగ్లీషువారు హోల్కారును వదలివేసిరి. ఇప్పుడు బాజీరావును తిరిగి తమ చేతులమీదుగా పునహా సింహాసనముమీద కూర్చుండబెట్టుట వారికవసరమయ్యెను. బాజీరావును పిండిబొమ్మను చేసి పునహా సింహాసనముమీద కూర్చుండబెట్టినచో నిజమగు నధికారము నంతను తామేవహించి మిగతా మహారాష్ట్ర నాయకులందరిపై తమ యిచ్చవచ్చినట్లు అధికారము చెలాయించ వచ్చునని ఇంగ్లీషువారి ఉద్దేశ్యము. ఇదిగాక, ఈ అవకాశమును ఆధారము చేసికొని బలిష్ఠులగు ఇతర మహారాష్ట్ర నాయకులపై గూడ యీ యద్దెసేనల యొడంబడికను రుద్దవచ్చునని వారు తలంచిరి. ఒకవేళ అది తత్క్షణమే సాగకపోయినను, వెంటనే మహారాష్ట్ర నాయకులందరు తమమీదికి కవియించి దుముకకుండ కొన్నాళ్లపాటు వారించవచ్చుననియు వారియభిప్రాయము. ఇప్పుడే యుద్ధము వచ్చేయెడల ఇంగ్లీషువారి బొక్కసములో డబ్బు లేదు. ఇందువల్ల వారికి చాల యిక్కట్టులు వచ్చుటయేగాక, దేశములో పేరు ప్రతిష్ఠలును బోవును.

ఇంగ్లీషువారు జస్వంతరావును జారవిడుచుట.

కాని, యెప్పటికైనను మహారాష్ట్ర నాయకులతో యుద్ధము తప్పదని ఇంగ్లీషువారికి తెలియును. తమకందరకు నాయకుడగు పీష్వా ఇంగ్లీషువారి వలలో బడిపోయినప్పుడు మిగత మహారాష్ట్ర నాయకులందరు తమకేమియు బట్టనట్లూరకుందురా? కాబట్టి, ఇంగ్లీషువారు తగు యుద్ధసన్నాహములు జేసికొనువరకు యెల్లో కాలహరణము జరుగునట్లు జేయవలయునని వెల్లస్లీ తలంచెను. ఆదిగాక పీష్వా బాజీరావు పారిపోవుచు వ్రాసిపంపిన కాగితములోని షరతులుగాక యింక ననేక క్రొత్త షరతులను అతనినుండి గుంజవలెనని వెల్లస్లీకి బుద్ధిపుట్టెను. కాబట్టి, బాజీరావును ఇప్పుడప్పుడే సింహాసనముమీద కూర్చుండబెట్టు టేలయని వెల్లస్లీ కొంత కాలహరణము చేయదలంచెను. తదనుగుణముగ పీష్వాను సింహాసనముపై కూర్చుండబెట్టు విషయమై నీవిప్పుడప్పుడే ఏమియుతొందరపడవద్దని వెల్లస్లీ రెసిడెంటుకు వ్రాసెను.

ఈలోగా హోల్కారు పునహా పట్టణములో సర్వాధికారియై యుండెను. యస్వంతరావు హోల్కారు గొప్ప రాజనీతిజ్ఞుడుగాడు. అతడు రాజనీతిజ్ఞుడే యైయుండినచో ఈ యవకాశమును వినియోగించుకొని పునహాలో పటిష్ఠమగు రాజ్యాంగమును నేర్పరచెడివాడు. కాని, అతనికి యీ తెలివితేటలు లేకపోయినవి. తన సేనకు జీతబత్తెములిచ్చుటకు దగ్గర డబ్బులేకపోగా అతడు పునహా నగరమును కొల్లగొట్టెను. ఈ దుష్కృత్యము నితడిట్లు చేయుటకు ఇంగ్లీషు రెసిడెంటు

ప్రోత్సాహ మెంతవరకు గలదో చెప్పజాలము. కాని, దీనికి ఇంగ్లీషు రెసిడెంటు ప్రతిఘటించినట్లు రికార్డులలో నెచ్చటను గన్పింపదు. హోల్కారు చేయుచున్న దారుణ కృత్యముల నన్నింటిని ఇంగ్లీషు రెసిడెంటు చూచిచూడన ట్లూర కుండెను. బహుశః ఇందుకితని ప్రోత్సాహముకూడ యుండి యుండవచ్చును.

బాజీరావును తిరిగి సింహాసనముపై కూర్చుండబెట్టుటకు ముందు చేసికొనవలసిన సన్నాహము లన్నిటిని వెల్లస్లీ యిపుడు చేయ సమకట్టెను. ఇందుకు అవసరమగు పథకమునంతను అతడు మూడేండ్లక్రిందట దూండియావాగ్‌ను తరుము నెపముతో తన తమ్ముని ఆర్థర్ వెల్లస్లీని మహారాష్ట్ర దేశములోనికి పంపించినపుడే అతనికి రహస్యముగా బోధించి పంపి యుండెను. ఇప్పుడు ఆ పథకము నమలుజరుపుటకు సమయము వచ్చినది. మహారాష్ట్ర నాయకులందరు తమమీదికి దండెత్తిరాక మానరని వెల్లస్లీ సరిగా యూహించి అందుకు తగిన సన్నాహముల జేయుచుండెను. టిప్పూతోడి యుద్ధములోవలె ఇప్పు డీ సందర్భమునందును తానే స్వయముగా కలకత్తానుండి కదలివచ్చి, పునహాకు దగ్గరగా మకాము పెట్టవలెనని వెల్లస్లీ తలంచెను. ఈ యుద్ధ సన్నాహములందు వెల్లస్లీకి చేదోడు వాదోడుగా నుండినవాడు ఆంగ్ల సేనాపతి జనరల్ లేక్. ఈ రెండవ మహారాష్ట్ర యుద్ధములో ప్రధానపాత్ర ఇతడే. కావున, ఇతని పూర్వచరిత్ర తెలిసికొనుట కొంత అవసరము.

బాజీరావును పూనా గద్దె నెక్కించుటకు ఇంగ్లీషువారి సన్నాహము.

ఇంగ్లండులో ప్రధానమంత్రిగానున్న పిట్టు మంత్రికి యితడు అంతరంగికుడు. ఇతడు పిట్టు మంత్రికి కుడిభుజమై ఐర్లండులో చెప్పరాని ఘోరముల చేసెను. పిట్టు మంత్రి యితనిచేత ఐర్లండులో అల్లరులను, దౌర్జన్యమును, రక్తపాతమును గల్పించి, పెక్కుమందికి లంచ పంచములిప్పించి, అనేకమందిని యితరవిధములుగ మోసగించి లాలించి ఐర్లండును ఇంగ్లండు కాలికి కట్టి పడవైచి యుంచుటకు ప్రయత్నించెను. ఐర్లండులో ఈ జనరల్ లేక్ చేసిన దుష్కృత్యముల నన్నింటిని ''స్టెడ్'' అను ఆంగ్ల ప్రముఖుడు ''Review of Reviews'' అను పత్రికలో 1898 సం॥ జులై నెలలో వ్రాసి యుండెను.

'లేక్' సేనాని చరిత్ర-క్రూరుడు.

[జనరల్ లేక్ గొంతుకోతకై, పచ్చినెత్తురు త్రాగు క్రూరమృగము. అతడు వ్రాసిన ఉత్తరము లన్నిటినుండి గంధకపు మంటలు లేచుచుండును. ఇతడు 'అల్‌స్టర్' లో తన యిచ్చవచ్చిన క్రూరకార్యము లొనర్చి ప్రజలను దద్దరిల్ల జేయుటకై అచ్చట సేనానాయకుడుగా నుండెను. ఈత డొకసారి అల్‌స్టర్‌లో తనకు వ్యతిరేక పక్షమువారిని గురించి పిట్టు మంత్రి కిట్లు వ్రాసెను. ''ఈ దుర్మార్గులు మనలను మనయిష్టము వచ్చినట్లు చేయనిచ్చుటలేదు. మన మొకసారి వారిపని పట్టించుట మొదలుపెట్టినచో ఇక వారియందు దయయనేది నాకుం

డను. వారి పత్రికను (Northern Star) ఆపివేయవలయును. ఆ పత్రికాలయమును ముట్టడించి యావత్తు తగులబెట్టివేయుటకు నాకనుజ్ఞ నివ్వండి. బెల్ ఫాస్టు నగరమును బహుకఠినముగా శిక్షించవలెను. అచ్చటనున్న పొగరుబోతుల నందరను బట్టుకొని గైలెక్కించి పంపించి దేశమునంతటిని కాళీచేయుదును.'' ఐర్లండులో సైనికశాసనమును పూర్తిగ నమలు జరుపలేదని యాతడు విచారపడెను. వారంపరు కత్తులు తీసికొనివచ్చి దాఖలుచేయక పోయిన యెడల వారి యిండ్ల నన్నింటిని తగులబెట్టి వారిని మన లాప్రకారము శిక్షించిన బాగుండును] (క్లుప్తము.)

ఇట్టి దుర్మార్గుని ఇండియాకు సర్వసేనాపతిగ పంపిరి. ఈ జనరల్ లేక్ గొప్ప రణనీతిజ్ఞుడుకాడు. ఇతడు గైకొన్న విజయము లెవ్వియు ఇతని వ్యూహరచనా పటిమను ప్రకటించవు. అయినప్పటికిని, ఐర్లండులో నితడు ఘోరకార్యములు చేసి ఐరిషు ప్రజలను లొంగదీసినాడు, కాబట్టి ఇండియాలోగూడ యీ పనికీతడు పనికివచ్చునని తలంచి, ఇంగ్లండులోని అధికారు లితని నిచటికి పంపిరి.

కుట్రదారుడగు వెల్లస్లీకి క్రూరుడగు 'లేక్' సేనాని సహాయము.

కుట్రదారుడగు వెల్లస్లీకి క్రూరుడగు జనరల్ లేక్ సహాయుడయ్యెను. వెలస్లీ ఐర్లండు దేశస్థుడు. తన దేశస్థులగు స్త్రీ పురుషులను ఇంతఘోరముగా హింసించి అవమానపరచిన జనరల్ లేక్‌తో స్నేహమొనరించుటకు వెలస్లీ కెట్లు మొగముచెల్లెనో?

వెల్లస్లీ మహారాష్ట్ర కూటము నిపుడు ఇరుకులో పెట్టినాడు. వారికి గలిగిన ఈ సంకటస్థితినుండి తాను అత్యంతలాభము నెట్లు పొందదలచినదియు తెలుపుచు వెలస్లీ తన సేనానియగు లేకుకు 1803 సం॥ జనవరి 7-వ తేదీన యిట్లని ఒక రహస్యపు టుత్తరమును వ్రాసెను:—

[ఇప్పుడు ఎవరివల్లనైన కొంచెము అపాయము వచ్చునేని సింధియాయొక్కని వల్లనే రావలయును. మనము యిపుడొక కన్ను వేసియుంచవలసినది యితని పైననే? ఇతరు లెవరుగాని మనమీది కంతగరాలేరు. తుదకు సింధియాకూడ బహుశః తటస్థముగా నూరకొననేవచ్చును. సింధియాను అదుపులో నుంచుటకు ఒకటే మంచిమార్గమున్నది. మన అయోధ్యవైపునుంచి అతని రాజ్యములోనికి మనసేనలు జొరబడవలయును. ఇందుకుగాను నీ విపుడున్న చోటున తగు బందోబస్తును చేయవలయును. అట్లైనయెడల సింధియాతో మనకు తగాదావచ్చినపుడు ఉత్తర హిందూస్థానములో అతనికిగల రాజ్యమును ధ్వంసముచేసి అతని బలము నచట నాశనము చేయవచ్చును. పిమ్మట దక్కనులో నతడు మనల నేమియు జేయజాలడు. మొత్తముమీద నాప్లాను ఏమనగా, ఏదో యొకచోట పోరాటమును నల్పుటయేగాక, మహారాష్ట్రకూటములోగల ప్రతినాయకునకు సంకటము కలుగు

నట్లు అదరి పొలిమేరలోను అడుగడుగునకు మనబలమును సిద్ధముచేసి పెట్టవలెనని నాసంకల్పము— (క్లుప్తము) [Wellesley's Despatches Vol. 4 Pages 28, 29]

వెల్లస్లీ పైకి శాంతివాక్యములనే చెప్పుచు, నీరీతిగ మహారాష్ట్ర నాయకుల పొలిమేరలలో నడుగడుగునకు సైన్యములను పెట్టియుంచుట కేవలము అతని మోస బుద్ధిని తెలియపరచుచున్నది.

బాజీరావును తిరిగి సింహాసనముపై కూర్చుండబెట్టు విషయమునకూడ వెల్లస్లీ రెండు నాల్కలతో మాట్లాడుచుండెను. మహారాష్ట్ర జాగీరుదారులును, ప్రజలునుగూడ బాజీరావును సింహాసనముపై గూర్చుండబెట్టు విషయమున అనుకూలురుగా నుండినట్లు చెప్పుచు తిరిగి యుద్ధ సన్నాహములను చేయుచుండెను. ప్రజలకు, జాగీరుదారులకు, తదితర నాయకులకు బాజీరావుపై అంతప్రేమయే

వెల్లస్లీ అసత్యప్రచారము-జాగీరుదార్లను బెదిరించుట.

యున్నచో వెల్లస్లీ యింతటి యుద్ధ సన్నాహములను నేలచేయవలెను? నిజమేమనగా మహారాష్ట్రులు బాజీరావుకు వ్యతిరేకులుగా నున్నట్లు వెల్లస్లీకి బాగుగ తెలియును. అందుచేత బలవంతముగా నతనిని వారిపై వేసి కట్టుటకే వెల్లస్లీ ఇంత దౌర్జన్యముగా నలుముఖముల యుద్ధ సన్నాహములు చేయవలసి వచ్చెను. మహారాష్ట్ర జాగీరుదారులు బాజీరావుపై వెనుకనే తిరుగబడినట్లును, వారి నణచుటకై నానాఫర్నవీసు హయాములో కొంతసేన పంపవలసివచ్చినట్లును వెనుక చెప్పియుంటిమి. ఇప్పటికిని సదరు జాగీరుదారులు పీష్వాపై విరోధమును మానుకొనిరని చెప్పుటకు నిదర్శనము లేమియు గానుపింపవు. పైగా వారు ఇంగ్లీషువారి ప్రేరణచేతనే ఈ తిరుగు బాటుచేసిరని యూహింపదగియున్నది. ఇందుకు పట్వర్థన్ కుటుంబము వారి చరిత్రయే నిదర్శనము. పునహాలో సింధియా పలుకుబడిని తగ్గించుటకు పరశు రామ భౌ, పట్వర్థన్ కుటుంబములవారిని పోటీగా లేవదీయవలయునని మూడేండ్ల క్రిందటనే ఆర్థర్ వెల్లస్లీ 1800 సం॥ ఆగస్టు 20 వ తేదీన మేజర్ మన్రోకు వ్రాసియుండిన సంగతిని లోగడనే చెప్పియుంటిమి. పట్వర్థన్ కుటుంబమునకును పీష్వాకును చిరకాల వైరమున్నట్లు అందరకును తెలిసియేయున్నది. ఈకారణముచేతనే పునహాలో ఈకుటుంబమువారిని పోటీగా లేవదీయవలయునని ఆర్థర్ వెల్లస్లీ తలంచెను. ఈ వంచనలో పట్వర్థన్ కుటుంబమువారుపడి ఇంగ్లీషువారు తమ్మును ఆడించినట్లెల్ల నాడుచుండిరి. తమకెప్పుడు ఏమాట అనుకూలముగనుండెనో ఆమాటను పట్వర్థన్ వంశీయులచేతను, తదితర జాగీరుదారులచేతను, నయముననో భయముననో ఇంగ్లీషువారు కూయించుచుండిరి. బాజీరావు తిరిగి సింహాసనమునకు వచ్చుటకు తమకు యిష్టములేకపోయినను యీ జాగీరుదారులు ఇంగ్లీషువారి బలవంతముచేత వారందులకు తలయూపినట్లు జనరల్ స్టూఆర్టు మదరాసు గవర్నరునకు 1803 ఫిబ్రవరి 3-వ తేదీని వ్రాసిన ఉత్తరమునుబట్టి తెలియుచున్నది.

[హోల్కారు సేనలు ఇటీవల దక్షిణముగా నడచిపోవుచున్నవి. దానివల్ల మన మిత్రుడగు నైజాము రాజ్యమునకు కొంత భంగము కలుగవచ్చును. కాబట్టి, మననైజామునకు సహాయముచేయుటకును, పీష్వాను తిరిగి పునహా సింహాసనముపై గూర్చుండబెట్టు విషయమున మహారాష్ట్ర జాగీరుదారులు మనకు సహాయము చేయునట్లు వారిని పురికొల్పుటకును మీరు కొంత సేన పంపిన బాగుండును...](క్లుప్తం)

పై పేరాలో అడుగున గీతగీచిన మాటలలోని భావము స్పష్టమగుటలేదా? బాజీరావును పీష్వాగా అంగీకరించి తీరునట్లు జాగీరుదారులను బలాత్కరించుటకు కాదా ఈసేన పంపబడినది? కాబట్టి, పీష్వా అధికారమును తిరిగి నిలువబెట్టు విషయమున జాగీరుదారులు చాలమంది అనుకూలురుగ నున్నారని వెల్లస్లీ 1803 వ సం। ఫిబ్రవరి 2 వ తేదీన మదరాసు గవర్నరుకు వ్రాసిన రహస్యప్రత్యుత్తరములోని వాక్యములు శుద్ధ అబద్ధములు.

ఇక పీష్వారాజ్యములోని ప్రజలు బాజీరావుకోసము పరితపించుచున్నారను మాట అసత్యమే. ఇందుకు నిదర్శనము చూడుము. 1802-వ సం॥ ప్రారంభమున

బాజీరావు ప్రజలకు యిష్టుడుకాడు.

ఇంగ్లీషు రెసిడెంటు 'క్లోజ్' యిట్లని వ్రాసియుండెను. "పీష్వాప్రభుత్వము నానాటికి పరువు ప్రతిష్టలను గోల్పోవుచున్నది. ఇతనిరాజ్యములోని విరోధులగు పెద్ద కుటుంబములవారందరు ప్రతితడవ తమపంతమును నెరవేర్చుకొనగలుగుచున్నారు"-[క్లుప్తము.] (Mills Vol. 6 Page 226)

"మన అద్దెసేనల సహాయములేనియెడల పీష్వాఅధికారమును త్రోసివేయుటకై అనేకప్రయత్నములు జరుగును. కాని, మన సేనలబలము అతనికండగా నున్నదంటేనే చాలును. దాని నుపయోగింప నవసరములేకుండగనే మనసేనలున్నవను భయముచేతనే, అతనిరాజ్యములోని ప్రజలు అతనిపై తిరుగబడకుండ ఆగి ఉంటారు." (Page 226)—[క్లుప్తము]

దీనినిబట్టి ఏమి తెలియును? ప్రజలు బాజీరావుపై ప్రేమగలిగియున్నారనియా? ఎంతమాత్రము కాదు.

అదిగాక, బాజీరావు అసమర్థుడను సంగతికూడ గవర్నరు జనరల్ వెల్లస్లీకి తెలియును. బాజీరావు స్థిరచిత్తములేనివాడనియు కుట్రబుద్ధిగలవాడనియు అతని రాజ్యము అంతఃకలహములచేతను, అతని బుద్ధిమాంద్యముచేతను చాలదుర్బలస్థితిలో నుండెననియు 1798 సం॥లోనే వెల్లస్లీ చెప్పియుండెను.

ఇట్టివాడు మహారాష్ట్రులను పాలించుటకు అర్హుడుకాడనుసంగతి వెల్లస్లీకిని పూర్తిగ తెలియును. అట్లయ్యును ప్రజలకు ఇష్టుడుగాని వానిని మహారాష్ట్రులపై

బలవంతముగా చొప్పించుట న్యాయము, వివేకము కాదని ఒకమూల చెప్పుచునే లోలోన ఆదౌర్భాగ్యునే తిరిగి పునహాసింహాసనముపై గూర్చుండబెట్టుటకు వెల్లస్లీ ప్రయత్నించుట అతని కచ్చిత స్వభావమును, సత్యహీనతను చాటుచున్నది. ఈసంగతి సుప్రసిద్ధ ఆంగ్లచరిత్రకారుడగు జేమ్సుమిల్లు తనగ్రంథము 6-వ సంపుటములో 286, 287 పేజీలలో తత్వరీత్యాచర్చించి నిర్ధారణపరచి యుండెను. అసలు సత్యమేమనగా, క్లైవు రోజులనాటినుండి ఇంగ్లీషువారు ఒక్కటే దుష్టమగుపద్ధతిని అవలంబించుచుండిరి. ప్రజలకిష్టుడుగాని దౌర్భాగ్యునొకని తీసికొనివచ్చి, బలవంతముగా సింహాసనముపై గూర్చుండబెట్టి, ప్రజలనువిసిగించి, వారు తిరుగబడునటులు పురిగొల్పుట ఇంగ్లీషువారికి మొదటినుండి ఆచారముగానుండెను. తమకు చేలోకువైన దౌర్భాగ్యునొకని ప్రజల నెత్తినబెట్టి ఇదంతయు వారిక్షేమమునకే చేయుచున్నామనిచెప్పుట కేవలము దొంగమాటలు. మొదటి ఆఫగన్‌యుద్ధమునకు కారణమేమి? ఇండియాలో పశ్చిమోత్తర సరిహద్దులలో తఱచు అల్లరులు జరుగుచుండుటకు కారణమేమి? దీనికంతకు యీ ప్రాతకథయే కారణము.

బాజీరావును వెంటనే పునహా సింహాసనముపై గూర్చుండబెట్టక వెలస్లీ బుద్ధిపూర్వకముగా కాలహరణము చేయుచుండెనని పైనచెప్పియుంటిమి. కాని, బాజీరావుకు తొందరగా నుండెను. తనక్రొత్త కిరస్తానీ మిత్రులు తనకింకా సహాయము చేయ రేమియని అతడు లోలోన ఆతురతపడుచుండెను. వారు చేయమన్న పనులన్నియు చేయుటకు ఇతడు సంసిద్ధముగా నుండెను. కాని, వారుచేసిన వాగ్దానములను చెల్లించుటకేల ఆలస్యము చేయుచున్నారు? బొంబాయి గవర్నమెంటుతో తానునడుపుచున్న బేరములతో తృప్తిపడక, వ్యవహారమును త్వరత్వరగా ముడివేసికొనుటకు గవర్నరు జనరలు తమ్ముడు ఆర్థర్ వెల్లస్లీతో భాజీరావు మాటలు సాగించెను. ఆర్థర్ వెల్లస్లీ అప్పుడు మైసూరు రాష్ట్రమునకు గవర్నరుగా శ్రీరంగపట్టణములో నుండెను. భాజీరావు ఈతనితో మాట్లాడుటకై బాపూగణేశఘోక్లేను రాయబారిగా శ్రీరంగపట్టణమునకు పంపించెను. ఈ గోక్లే బాజీరావుకు ఆంతరంగికుడు. జస్వంతరావు హోల్కారుకు విరోధి. ఇతడే జస్వంతరావు తమ్ముడగు విఠోజీని పట్టుకొని బాజీరావు ఆజ్ఞప్రకారము చంపించి యుండెను. కాబట్టి యితనికి జస్వంతరావునందు ఏమియు నాసలేకుండెను. కావున ఎట్లైనా బాజీరావునే పునహా తక్తుపై నెక్కించవలయునను బుద్ధి గోక్లేకు కూడ నుండెను. ఇతడు శ్రీరంగపట్టణమువచ్చి ఆర్థర్‌తో రహస్యముగా మాట్లాడిపోయెను. జాగీరుదారులగు పట్వర్థన్ వంశమువారు ఇంగ్లీషువారు యేపని చేయమంటే ఆపని చేయుటకు సిద్ధముగానున్నట్లు ఇతడు ఆర్థర్‌తో ఈ ప్రసంగమున చెప్పెనట. ప్రస్తుతస్థితిలో మహారాష్ట్ర ప్రముఖులందరు నెవరేయే యభిప్రాయ

పూనాతక్తు నెక్కుటకు బాజీరావుని ఆతురత.

ములో నుండినదికూడ ఆర్థర్ వెల్లస్లీ ఈ గోక్లేనుండి తెలిసికొనునట్లు అతడు 1802-వ సం॥ డిసెంబరు 4-వ తేదీన జనరల్ స్టూఅర్టుకు వ్రాసిన ఉత్తరములో చెప్పెను. దీనినిబట్టి గవర్నరు జనరల్ తమ్ముడు ఆర్థర్ గోక్లేతో పరికయి జాగీరుదారుల నందరిని బాజీరావుపక్షముగ బలాత్కరించుటకు కుట్రపన్నినట్లు స్పష్టము కాగలదు. తదనుగుణముగా మైసూరు సరిహద్దులోను నైజాము సరిహద్దులోను ఆంగ్లసేనలు సమకూర్చబడెను. దీని ఉద్దేశ్యమేమి? మహారాష్ట్ర రాజ్యముతో కలుగబోవు పోరాటము నెదుర్కొనుటకును, పీష్వా బాజీరావుతో జేరి, అతనికి ఇంగ్లీషుసేనల నంటగట్టి, వానిని మహారాష్ట్ర రాజ్యమునకు గుండెకాయ యగు పునహా పట్టణములోనే సుస్థిరముగా స్థాపించుటకును దీనియుద్దేశ్యమైనట్లు గవర్నర్ జనరల్ 1803-వ సం॥ ఫిబ్రవరి 2-వ తేదీన మదరాసు గవర్నరుకు వ్రాసిన ఉత్తరములో కలదు.

బ్రిటిష్ పరివారముతో బాజీరావు సింహాసన మెక్కుట.

ఈ రీతిగ యుద్ధసన్నాహములన్నియు పూర్తికాగానే బాజిరావును "నీవిక పునహాకు నడువు" మని ఆజ్ఞాపించిరి! అతనికి అంగరక్షకుగా 2300 కాల్బలము నిచ్చిరి. వారిలో 1200 మంది బ్రిటిష్ వారుండిరి. బాజీరావు వీరివెంట పునహాకువచ్చి 1803 సం॥ మే 13-వ తేదీన పునహా సింహాసనముపై కూర్చుండెను.

బాజిరావును పునహాలో పునఃప్రతిష్టించుటకు ఆంగ్లసేనలు సిద్ధపరుపబడెనని చెప్పితిమి. మైసూరు పొలిమేరలోనున్న సేనలు గవర్నర్ జనరల్ తమ్ముడు ఆర్థర్ వెలస్లీ యాజమాన్యమునను, నైజాం పొలిమేరలోనున్న సేనలు "కర్నల్ స్టీవెన్‌సన్" యాజమాన్యమునను బయలుదేరి పునహావైపుకు నడచివచ్చెను. ఈ సేనలకు ఆర్థరును అధిపతిగా నియమించుటకు గల కారణమును పాఠకులకు జ్ఞాపకముచేయ నవసరములేదు. అవి 1803 సం॥ ఫిబ్రవరి 27-వ తేదీన మదరాసు గవర్నరు వ్రాసిన ఉత్తరములో తిరిగి పేర్కొనబడినవి. వెనుక మూడేండ్ల క్రిందట ధూండియా వాగ్‌ను వెంటనంటినపుడు ఆర్థర్ మహారాష్ట్ర దేశమునంతను కలచి చూచి, అందలి రహస్యములను తెలిసికొని వచ్చెను. మరియు, ఆ ప్రాంతములగల పెక్కుమంది ప్రముఖులతో నితడు పరిచయమేర్పరుచుకొని యుండెను. కావున, నితని నిపుడు ఈసేన కధిపతిగా చేయుట యుక్తమని మదరాసు గవర్నరు స్పష్టముగా వ్రాసియున్నాడు. ఇతనికి మహారాష్ట్ర దేశములోగల కొండలు, నదులు, దోవలు, డొంకలు తెలియుటయే గాక, అతడు లోగడ వారికి లంచపంచము లిచ్చియుండుటచే అక్కడ గల పెక్కుమంది మహారాష్ట్ర ప్రముఖులతో అతనికి పరిచయముకూడ గలిదని మదరాసు గవర్నరు వ్రాసిన పై ఉత్తరములోని వాక్యముల బట్టి స్పష్టముకాగలదు.

ఆర్థర్ యాజమాన్యముననున్న సేన సుమారు పదునొకండు వేలును, స్టీవెన్‌సన్ క్రిందనున్న సేన సుమారు ఏడు వేలును ఉండును. ఈ సేనలు మార్చి నెల 6వ తేదీన హరిహర్ అనుచోట సమావేశ మయ్యెను. 8 వ తేదిన ఆర్థర్ క్రింద నున్న సేన మహారాష్ట్ర రాజ్యములోనికి నడువసాగెను. ఈసేన చేయవలసిన ముఖ్య మగు పనులనుగురించి జనరల్ స్టూఆర్టు మార్చి 9వ తేదిన ఆర్థర్‌కు యిట్లని వ్రాసి పంపించెను. ఆపను లేమనగా :—

(1) దక్షిణముననున్న మహారాష్ట్ర జాగీరు దారు లందరు పీష్వాపక్షమున పలుకునట్లు వారిని పురికొల్పవలెను. (2) వారిలో వారికిగల పరస్పర వైరుధ్యములను మాన్పుటకు ఏవిధము చేసైనాసరే ప్రయత్నించి వారి బలముల నన్నింటిని సమకూర్చి బాజీరావును పునహా సింహాసనముపై గూర్చుండబెట్ట పోవుచున్న మన సేనకు వచ్చి సహాయము చేయుటకును పురికొల్ప వలెను. దీనినిబట్టి జాగీరుదారులు తమయిష్టమునకు వ్యతిరేకముగా బాజీరావుపక్షము పలుకునట్లు ఇంగ్లీషు వారిచే బలవంతపెట్ట బడినట్లు స్పష్టపడుటలేదా? (3) మెరిటిచ్ గ్రామము నద్దకు వెళ్లి అచటనున్న పీష్వాతో కలిసికొనవలెను. అదిమంచిదికాదని పీష్వా తలంచేయెడల అచటనున్న అతనితాలూకు సేనలోను, ఇతర ప్రముఖులతోను కలిసికోవలెను. (4) నైజామునుండి వచ్చుచున్న స్టీవెన్‌సన్ సేనతో కలుసుకొని ఉభయులు ఏకముగా పనిచేయ వలయును. (5)ఆఖరుకు పునహాచేరి, పీష్వా తిరిగి అచటికి వచ్చుటకును, ఇటీవల అతనితో మనము చేసికొన్న సంధిషరతుల నెరవేర్చుటకును అనువగువాతావరణము నచట సిద్ధముచేసి యుండవలెను.—[క్లుప్తము]

బాజీరావుకు వ్యతిరేకముగా యేజాగీరుదారైన నుండేయెడల .అతనిని లొంగదీయుటకు తక్కిన వారందరితో కూడ కలిసి ప్రయత్నించలసినదని జనరల్ స్టూఆర్టు పైలేఖలోనే ఆర్థర్‌కు స్పష్టముగా వ్రాసియుండెను. కాబట్టి, ఆర్థర్ క్రింద ముందుగా పంపబడినసేన ప్రత్యేకముగ జాగీరుదారుల నణచి పెట్టుటకే యుద్దేశింపబడినట్లు ఈ ఉత్తరమువలన స్పష్టమగుచున్నది.

కాగితముమీద పెట్టుటకు వీలులేని సలహాలను వెల్లస్లీ తన తాబేదారుల కిచ్చుట.

మహారాష్ట్రములో ఇంగ్లీషువారు చేయవలసిన పనినిగూర్చి గవర్నర్ జనరల్ వెల్లస్లీ, జనరల్ స్టూఆర్టుకు ఎట్టి సలహాల నొసంగెనో తెలియదు. కాని, అతడు అతనికి వ్రాసిన యీ దిగువ రహస్యపు ఉత్తరమును చూచినచో వెల్లస్లీ యొక్క అగాధమగు కుటిలస్వభావము తేటపడగలదు. ఈ ఉత్తరమును వెల్లస్లీ కలకత్తానుండి 1803 సం॥ ఫిబ్రవరి 8-వ తేదీన జనరల్ స్టూఆర్టుకు వ్రాసి పంపించెను. అందిట్లున్నది :—

“ పునహాలో వ్యవహారములు మనకిపుడు అనుకూలముగా తిరిగినవి. ఇపుడిక్కడ కలకత్తాలో నాకు పని తొందరలు హెచ్చుగానున్నవి. కాబట్టి, నేను మొదట అనుకొన్న ప్రకారము మదరాసు వచ్చుటకు వీలులేక మానుకొన్నాను. మైసూరు పనిచూచుటకై నేను మేజర్ మాల్కామ్‌ను పంపించినాను. మహారాష్ట్ర విషయములో యే యేపనులు చేయవలయునో

నామనస్సులోనున్న తలపులన్నియు సదరు మాల్ కొంపు బాగుగా తెలియును. నేను వ్రాసి పంపిన దానిలో ఏవైన సందేహములు తగిలినయెడల కాని, కొరతలున్నయెడలగాని యితనిని కనుగొనవలసినదని నేను మద్రాసు గవర్నరుకు వ్రాసినాను. మన సేనలు యెప్పుడెక్కడ యేయే పనులు చేయవలయునో అను విషయములను గూడ నా యుద్దేశములనన్నింటిని మాల్ కొంతో చెప్పి పంపించినాను. కాబట్టి మీరతనిని మీ అంతర్యములోనికి తీసికొని నామనస్సులో నున్న సలహాల నన్నిటిని అతనిద్వారా మీరు తీసుకొనవలయును. నామనస్సులోనున్న సదరు సలహాల నన్నింటిని కాగితముమీద పెట్టుటకు వీలులేదు.'' [క్లుప్తం].

కాగితముమీద పెట్టుటకు వీలులేని ఆ సలహాలేవియో ఊహించుకొనుట పాఠకులకు కష్టమా?

అమృతరావు పునహాను వదలిపోవుట.

స్టీవెన్సన్ క్రిందనున్న సేన ఆర్థర్ ఆజ్ఞ ప్రకారము నడచుకొనునట్లు ఉత్తరువులివ్వబడెను. ఈ రీతిగా సర్వసన్నాహములతో ఆర్థర్ మార్చి 9-వ తేదీన హరిహరనుండి బయలుదేరి 12-వ తేదీన తుంగభద్రానదిని దాటెను. మధ్య త్రోవలో అతని కెట్టి యడ్డంకులు తగులలేదు. ఆర్థర్ పునహాను సమీపించుచుండగా అమృతరావు పునహా పట్టణమును తగుల బెట్ట దలచినాడని చెప్పి వట్టి పుకారు నొకదానిని రెసిడెంటు పుట్టించెను. ఇందు సత్యము కన్పింపదు. అమృతరావు జస్వంత రావు హోల్కారు చెప్పు చేతలలోనున్నవాడు. అయినను వారిరువురకు యేలనో కలతలు ప్రారంభమాయెను. ఈ కలతలను కల్పించుటలో ఇంగ్లీషు రెసిడెంటుకు కూడ కొంత ప్రమేయముండి యుండవచ్చునని 1803 సం॥ ఫిబ్రవరి 14-వ తేదీన వెల్లస్లీ సీమ డైరెక్టరులకు వ్రాసిన రహస్యపు టుత్తరమునుబట్టి తెలియగలదు. జస్వంతరావు హోల్కారు, రెసిడెంటు మాయమాటలలోబడి బాజీరావుతోను, దౌలత్ రావుతోను సఖ్యపడుటకు రెసిడెంటు మధ్యవర్తిత్వమును కోరెనట్లు పై యుత్తరమునుబట్టి తెలియుచున్నది. జస్వంతరావు క్రమక్రమముగ ఇంగ్లీషువారి పక్షమున మ్రొగ్గుచుండుటనుచూచి-పాపము-అమృతరావునకు కష్టము తోచి యుండవచ్చును. అదిగాక, తనను సింహాసనమున గూర్చుండబెట్టిన జస్వంత రావే తనను విడిచిపోవుట అతనికి మరింత కష్టమయ్యెను. కాని, అంతమాత్రము చేత అమృతరావు పునహా నగరమును తగులబెట్ట దలచినాడని తెల్పుట కేవలము అసంభవము. హోల్కారు తననిట్లు విడిచిపోగా అమృతరావు-పాపము-ఏకాకి యయ్యెను. ఇతనిని కాపాడుట కప్పుడు అతనిచుట్టు 1500 మంది మాత్రముండిరట. ఇట్టి నిస్సహాయస్థితిలో పునహానగరము శత్రువులచేతిలో బడినను వారికేమియు దక్కకుండుటకై అమృతరావు పట్టణమును తగులబెట్ట దలచెనని రెసిడెంటు పుకారు పుట్టించెను. కాని, యీ పుకారుకు నిజమైన కారణము వేరేయున్నది.

తాము వదలి పోవుచున్న పట్టణము, తదితర సామగ్రులు శత్రువులకు దక్క కుండ చేయుటకై వానిని తగులబెట్టివేయుట యూరోపియనులకు ఆచారముకాని, హిందువులకు కాదు. ఈ విషయమున హిందువులే పాశ్చాత్యులకంటె హెచ్చు నాగరికత కలవారని చెప్పవలసియున్నది. శత్రువులయెడ ఉదారభావమును జూపు హిందువుల ఘనతర సభ్యతనుగూర్చి అనేకమంది విదేశస్థులే పూర్వము శ్లాఘించి యుండిరి. భూమిదున్నుకొనురైతు యుద్ధములోనికి రావలసిన బలవంతము లేదనియు, భూమిదున్నుకొనుచుండు రైతుపై శత్రువులెవరుగాని యెట్టి హానియు చేయరాదనియు, పూర్వము నియమముండినట్లును, ఆ కారణముచేతనే ప్రక్కను యుద్ధము జరుగు చున్నను దగ్గరలోనున్న పొలములోనిరైతు నిర్భయముగా తనపొలమును దున్ను కొనుచుండెననియు మెగస్థనీస్ వ్రాసియుండెను. పంటలు తగులబెట్టుట, చెట్లను నరికివేయుట మున్నగు ఆతతాయిపనులు పూర్వమెన్నడులేనట్లు ఆతడు వ్రాయు చున్నాడు. ఇట్టి దారుణ కృత్యములొనర్చు యూరోపియను జాతులకును హిందూ జాతులకును యెట్టి తారతమ్యమున్నదో గమనింపుడు. అమృతరావు ఉత్తమ కులమునబుట్టిన హిందువు. ఆతనియందెట్టి లోపములున్నను ఇట్టి క్రూరకార్యము లొనర్చుటకు అతడు యూరోపియనులంతటి హీనస్థితికి దిగలేదు. అమృతరావు ఇంగ్లీషు సేనలురాగానే నిస్సహాయుడగుటచే పునహానగరమును భద్రముగా విడిచి పోయెను.

వెల్లస్లీ వేసిన పతకము ప్రకారము అన్నిపనులు యింతటిలో సక్రమముగా నెరవేరెను. తాను పునహాకు క్షేమముగా వచ్చితిననియు, త్రోవలో తామనుకొన్న అడ్డంకు లేమియు తగులలేదనియు, తాను పునహాలో తనబలములతో సుస్థిరముగ నిలిచి యున్నాననియు, తననిప్పుడు శత్రువు లెవరుగాని యెదిరించగల స్థితిలో లేరనియు, ఆర్థర్ తన అన్నకు ఏప్రిల్ 21వ తేదిన వ్రాసెను. ప్రస్తుత క్షణమందు పునహాలో సర్వము శాంతముగ గన్పట్టుచున్నను ముమ్ముందు తదితర మహారాష్ట్ర

బాజీరావుకు పరాయివారి అండ.

నాయకులతో పోరాటము తప్పదనియు, అయినప్పటికి యిదివరకు తాముచేసికొని యున్నసన్నాహమువల్ల యీపోరాటములో తమకెట్టి యుపద్రవము కలుగ బోదని కూడ ఆర్థర్ తనఅన్నకు సదరు ఉత్తరములో వ్రాసెను. ఒకవేళ పీష్వాతో బేసిన్‌సంధి కుదరక పోయినను తాము మహారాష్ట్రులతో నెప్పటికైనను యుద్ధము చేయదలచియే యున్నట్లుకూడ యీయుత్తరమును బట్టి తెలియుచున్నది. అయితే, బాజీరావును తిరిగి పునహాసింహాసనముపై గూర్చుండబెట్టుసందర్భము ఇంగ్లీషువారికి సదరు యుద్ధసన్నాహముల నొనర్చుకొనుటకు మంచి అవకాశ మొసగెను. ఈ విష యమును ముందధ్యాయములో విపులముగా చర్చించెదము.

బాజీరావును సింహాసనముపై పునః ప్రతిష్టించుటకు ఇంగ్లీషువారు యే యేర్పాటులను చేసిరో రికార్డులను బట్టి తెలియుచున్నది. ఒకసైనిక దళము బెంగాలునుండి వచ్చెను. మరి అయిదు దళములను కొన్నిఫిరంగులను 2205 సైనికులను పీష్వాకు అంగరక్షగా నిచ్చిరి. పీష్వా అంతట ఏప్రిల్ 7వ తేదీన పునహా పరిసరమున "ఏనోవాలా" వద్ద మకాముచేసియున్న ఆర్థర్ వెలస్లీ శిబిరము ప్రక్కగా వచ్చెను. 13వ తేదీన బాజీరావు తనతమ్ముడు "చిమ్నాజీ అప్పారావు" తోడను, పెక్కుమంది మహారాష్ట్ర ప్రముఖుల పరివారము తోడను, పునహానగరమునకు నడచి, రాజమందిరము ప్రవేశించి, సింహాసనముపై కూర్చుండి, తన పరివారమిచ్చు కానుకలను గైకొనెను.

బాజీరావును పీఠముపై కూర్చుండ బెట్టిన విధమిది! ఈ పునః ప్రతిష్ఠాపనము బాజీరావుకు గౌరవ ప్రదముకాదు. ఇందు మహారాష్ట్రులు సంతోషింపదగిన కళకాంతులేమియు లేవు. బాజీరావు స్వతంత్రుడై ప్రజారంజకుడై యుండుటకు మారుగా దేశస్వాతంత్ర్యము నపహరించ వచ్చిన పరాయిదేశస్థుల చేతులలో బుద్ధిపూర్వకముగ ఖైదీయై, పిండిబొమ్మయై, ప్రజలందరి తిట్టులమధ్య పరదేశస్థుల బలములు తన్ను చుట్టుముట్టియుండ, పరభట బలసహాయముతో తాను సిగ్గులేక కులుకుచు తగుదునమ్మాయని తక్తుపై కూర్చున్నాడు.

స్వాతంత్ర్య ప్రియుల తిట్టుల మధ్య బాజీరావు గద్దెనెక్కుట

# బ్రిటిష్ మహాయుగము

## ఇరువదిమైదవ అధ్యాయము.



### రెండవ మహారాష్ట్ర సంగ్రామమునకు నాంది.

మహారాష్ట్రజాతి గౌరవమునకు భంగకరమగు విధమున పీష్వాను సింహాసనముపై గూర్చుండబెట్టి ఇంగ్లీషువారతనికి యుద్ధసేనల నంటగట్టుటతో తృప్తిపడి యుండలేదు. అంతకంటె అగాధమగు కుటిలతంత్రములు వారిమనస్సులోనుండెను. మహారాష్ట్రసామ్రాజ్యమును విచ్ఛిన్నమొనర్పవలయునని వారి సంకల్పము. ఇందు కొరకై పీష్వాను తక్తుపై కూర్చుండబెట్టునెపమున విరివిగా యుద్ధసన్నాహముల గావించియుండిరి. ఈ సన్నాహములన్నియు మహారాష్ట్రనాయకులను కయ్యమునకు కవ్వించుటకే యుద్దేశింపబడినవి. తుదకెంత కవ్వించినను మహారాష్ట్రనాయకులు యుద్ధమునకు రాకపోయినపుడు ఇంగ్లీషువారే ముందుగా వారిపైకి కవ్వించిపోయిరి. ఇదియే రెండవమహారాష్ట్ర సంగ్రామమునకు అంకురార్పణ.

### మహారాష్ట్రనాయకుల స్థితిగతులు; – సింహావలోకనము.

గాయక్వార్.

ఈ సమయమున మహారాష్ట్రనాయకులు నలువురు ఎట్టిస్థితిలో నుండిరో చూతము. బరోడా సంస్థానాధిపతి గాయక్వార్ యిదివరకే కంపెనీ వారి పక్షముగా నుండెనుగావున అతనినిగురించి ప్రస్తుతమిచ్చట వివరింప బనిలేదు.

హోల్కారు.

ఇక, జస్వంతరావు హోల్కారునుగురించి విచారింతము. ఇతడు ఇంగ్లీషువారి ప్రేరణచే సింధియా, పీష్వాలను ఎదిరించి, వారిని పునహావద్ద నోడించియుండెనని లోగడ చెప్పియుంటిమి. పీష్వా తమకు మిత్రుడని పైకిచెప్పుచు అతనిపైకి జస్వంతరావు హోల్కారును రహస్యముగా బురికొల్పుట ఇంగ్లీషువారి దుర్నీతిని ప్రకటించుచున్నది. హోల్కారుసహాయమున ఇంగ్లీషు వారు పీష్వాను తమబుట్టలో వేసికొని అతనిని సింహాసనముపై తిరిగి కూర్చుండ బెట్టిరిగదా! లోగడ వీరు హోల్కారుతో రహస్యముగా షరీకై యుండనిచో తమ మిత్రుడగు పీష్వాపై దండెత్తివచ్చి, అతనిని పాఱద్రోలిన జస్వంతరావు హోల్కారును ఇంగ్లీషువారిప్పుడు శిక్షించియుండవలసినదేగదా? బాజీరావును సింహాసనముపై గూర్చుండబెట్టిన యనంతరమైనను, ఇంగ్లీషువారు హోల్కారును వెంబడించి, పట్టుకొనిశిక్షించి యుండవలసినదిగదా! కాని, వారట్లు చేసియుండలేదు. మీదు మిక్కిలి

జస్వంతరావు హోల్కారు పీష్వాయధికారములోనున్న దేశమునంతను కొల్లగొట్టు చుండగాకూడ ఇంగ్లీషువారు చూచీచూడనట్లూరకుండిరి. ఈ అలుసుచూచుకొని జస్వంతరావు కంపెనీవారి మిత్రుడగు నైజాము రాజ్యములోని ఔరంగబాదు మున్నగు ప్రాంతములనుగూడ కొల్లగొట్టసాగెను. అప్పటికిని ఇంగ్లీషువారు ఊరుకొనిరి. హోల్కారు ప్రవర్తనగురించి మనమేమియు చర్యతీసుకొననక్కరలేదని ఆర్థర్ వెల్లస్లీ తనయన్నకు 1803-వ సం॥ మే 27-వ తేదీన వ్రాసెను. ఇంగ్లీషువారు లోలోన హోల్కారుతో స్నేహము చేయుచుండిరి. 'మన ఉభయులకు చిరకాలమునుండి యున్న మైత్రిని పెంపొందించుకొనుటకు నేనాతురపడుచున్నాను'అని ఆర్థర్ జస్వంతి రావుకు 1803 సం॥ జూలై 16-వ తేదీన వ్రాసెను. ఈరీతిగా పీష్వాతో పైకిస్నేహ మును, హోల్కారుతో లోపలస్నేహమునుచేసి, హోల్కారును పీష్వాపైకి ఉసి కొలిపి, పీష్వాను తమఉరులలో వేసికొనుటయందు ఇంగ్లీషువారు అఖండవిజయము గాంచిరి. ఈరీతిగా జస్వంతరావు హోల్కారు ఇంగ్లీషువారిచేతికి చక్కని ఉపకరణ ముగా ఉపయోగపడెను. హోల్కారుతోడి ఈ రహస్యస్నేహమును ఇంకను కొంతకాలము అనగా తమకోరదలాపనులన్నియు తీరువఱకు ఇంకను కొన్నాళ్లపాటు ఉంచుకొనవలయునని ఇంగ్లీషువారి సంకల్పము. అందుచేతనే ఆతడుచేయు ఈ దుర్నయములన్నిటిని వారుసహించి యూరకొనిరి. రానున్న రెండవ మహారాష్ట్ర సంగ్రామములో తక్కిన నాయకులతోపాటు ఈతడు చేరకుండుటకై ఇది అతనికి లంచమన్నమాట! హోల్కారును అట్లే ఈ సంగ్రామమునందు సింధియా, భాన్ స్లేలపక్షమున చేరలేదు. ఇది హోల్కారుస్థితి.

ఇక, దౌలత్ రావు సింధియా, రఘూజీ భాన్స్లేలస్థితి ఎట్లులుండెనో చూతము. పూనాలో తనసేనలు జస్వంతరావు హోల్కారుచేత ఓడింపబడిననాటినుండి ఆదెబ్బ నుండి కోలుకొనుటకై సింధియా ప్రయత్నించుచుండెను. కాని, తన స్థితి చిక్కులలోబడెను. ఇతని కుటుంబములోను, రాజ్యములోనుగూడ ఇంగ్లీషువారు ఇతనిపై అనేకకుట్రలను, కలతలను లేవదీసి నానా

సింధియా భాన్స్లేలు.

భీభత్సవము చేసియుండిరి. అయినప్పటికి దౌలత్ రావు ధైర్యమును గోల్పోవక దేశకాల పరిస్థితులన్నిటిని మిక్కిలి దూరదృష్టితో గ్రహించి, మహారాష్ట్ర రాజ్య మును తిరిగి చక్కబఱచుటకై శక్తివంచనలేక పాటుబడసాగెను. బీరార్ రాజగు రఘూజీ భాన్స్లేతో స్నేహముచేసి, ఇద్దరునుగలసి హోల్కారును శిక్షించి, దుర్బలు డగు పీష్వాను ఇంగ్లీషువారి యురులనుండి తప్పించవలయునని దౌలత్ రావు సంక ల్పించెను.

ఇంగ్లీషువారిపై సింధియాకు కోపకారణము లనేకములుండెను. అందులో ప్రధానమైనది బేసిన్ సంధిని గుఱించి. తనతో చెప్పకుండ ఇంగ్లీషువారు పీష్వా బాజీరావును మోసగించి, అతనితో ఈ బేసిన్ సంధిని చేసికొనిరి. ఇది, తక్కిన

మహారాష్ట్ర నాయకుల చులకనచేసి అవమానించుటయేగాక, అందు ముఖ్యముగా సింధియాకు మిక్కిలి కోపకారణమయ్యెను. ఏలననగా, వెనుక వారన్ హేస్టింగ్సు కాలములో మొదటి మహారాష్ట్ర యుద్ధములో ఇంగ్లీషువారు ఓడిపోయి, కాళ్ల బేరమునకు వచ్చినపుడు వారికిని, మహారాష్ట్రుల ప్రధాననాయకుడగు పీష్వాకును ఇంగ్లీషువారి ప్రార్థనపై యొడంబడిక కుదర్చిపెట్టినది దౌలత్ రావు పూర్వీకుడగు మాధవరావు సింధియాయే యను సంగతి పాఠకులకు జ్ఞాపకముండి యుండవచ్చును. అదియే, 'సాల్బే' యొడంబడిక. ఆనాడు మాధవరావు సింధియా సైంధవునివలె అడ్డుబడి ఇంగ్లీషువారి పక్షమున మాట్లాడి యుండనిచో ఇంగ్లీషువారి రాజ్యము అప్పుడే తుడిచిపెట్టుకొని పోయెడిది. సదరు సంధియే బేసిన్ ఒడంబడిక జరుగు నాటివరకును నిలచియున్నది. మహారాష్ట్రులకును ఇంగ్లీషువారికిని గల సంబంధమును నిర్ణయించువది సదరు సాల్బే యొడంబడికయే! ఆ యొడంబడికను మార్చ దలచినచో అందునుగుఱించి ఇంగ్లీషువారు న్యాయముగ సంప్రతించ వలసినది మాధవరావు సింధియాకు వారసుడుగవచ్చిన దౌలత్ రావు సింధియాతోనైయుండెను. ఇంగ్లీషువారి కేమాత్రము న్యాయబుద్ధిగాని, కృతజ్ఞతగాని యుండియున్నచో, వారు సాల్బేసంధిని మార్చి మహారాష్ట్ర నాయకుడగు పీష్వాతో క్రొత్త (బేసిన్) యొడంబడికను చేసికొనుటకు పూర్వము దౌలత్ రావుతో సంప్రదించవలసి యుండెను. మహారాష్ట్రులతోడి వ్యవహారమును పరిష్కరించుకొనుటకు పీష్వా తరువాత దౌలత్ రావే నిజమగు అధికారి. కాని, ఇంగ్లీషువారికి కృతజ్ఞతగాని, గౌరవముగాని, నిజాయితీ బుద్ధిగాని, లేనందువలన వారు దౌలత్ రావుతో సంప్రదించకుండగనే పీష్వాను లోబఱచుకొని అతనితో ప్రాతసంధికి విరుద్ధముగా మహారాష్ట్ర జాతికంతకు అవమానకరమగు క్రొత్త యొడంబడికను చేసుకొనిరి. సదరు సంధిలోని షరతులు ఎట్టివోకూడ పీష్వాను పునహా తక్తుపై కూర్చుండబెట్టిన చాలా కాలమువరకు కూడ వారు దౌలత్ రావు సింధియాకు తెలుపరైరి.

దౌలత్ రావు ఈకారణములన్నిటిచే ఇంగ్లీషువారియెడ లోలోన కోపముతో రగులుచుండెను. గోరుచుట్టుమీద రోకంటి పోటన్నట్లు ఇవిచాలక ఇంగ్లీషువారు తనపొలిమేరలో అడుగడుగునకు సేనలను తీసికొనివచ్చి పెట్టిరి. తన రాజ్యము చుట్టునేగాక, మహారాష్ట్ర నాయకులందరి పొలిమేరలలోను ఇట్లే ఇంగ్లీషువారు సేనలను సిద్ధముగా బెట్టి, ఏనిమిషమునందు పైబడుదురోయను నంతటి భయోత్పాతమును గల్గించుచుండిరి. ఇట్లయ్యును సింధియా ధైర్యము కోల్పోవలేదు. ఇట్టి యిరుకు సమయములో ఇంగ్లీషువారిపై కత్తిగట్టి పోరుటయు యుక్తముకాదని అతడు తలంచియుండెను. ప్రస్తుతస్థితిలో సింధియా ఇంగ్లీషువారిపైకి రాదలచలేదనియు, పైపెచ్చు వారితో కలహమురాకుండ తప్పించుకొనవలయుననియు, అతడు బహు జాగ్రత్తగా నున్నట్లు వెల్లస్లీ సీమడైరక్టర్లకు వ్రాసిన 1803-వ సం॥ ఏప్రిల్

19-వ తేదీగల ఉత్తరమునుబట్టి స్పష్టమగుచున్నది. బీరారురాజగు రఘోజీ భాన్స్లేయు అట్టిస్థితియందే యున్నట్లును సదరు ఉత్తరములో కలదు. ఆర్థర్ వెల్లస్లీ మే నెల 3-వ తేదీన వ్రాసిన ఉత్తరములోకూడ ఈ సంగతియే స్పష్టముగ నున్నది. ఇంగ్లీషువారి పక్షమున ప్రధాన నాయకులుగనున్న వెల్లస్లీయు, అతని తమ్ముడు సేనాపతి ఆర్థరున్నూ వ్రాసిన వ్రాతలనుబట్టియే మహారాష్ట్ర నాయకు డెవ్వడూ ఆ సమయమున ఇంగ్లీషువారితో యుద్ధముచేయ సంకల్పించుట లేదని స్పష్టమగుచున్నది.

దౌలత్ రావు దక్షిణమునకు కదలుట- ఇంగ్లీషువారి అనుమానము.

దౌలత్ రావు సింధియా తనరాజధానియగు గ్వాలియర్ నుండి కదలి, దక్షిణమునకు వచ్చుచుండెను. ఈచర్య కొంత అపార్థమునకు కారణమయ్యెను. కాని, ఇంగ్లీషువారితో యుద్ధముచేయుటకే సింధియా ఇట్లు దక్షిణమునకు కదలివచ్చెనని చెప్పుట కెక్కడను ఆధారములులేవు. సింధియా యిట్లు నర్మదానదిని దాటి దక్షిణమున కేలవచ్చెనో ఇంగ్లీషువారి వ్రాతలే రెండు సమాధానములను చెప్పుచున్నవి. వానిలో నొకసమాధాన మేమనగా:— ఇంగ్లీషువారు ప్రతి మహారాష్ట్ర రాజ్యపు పొలిమేరలోను తమసేనలను నిలువబెట్టి కయ్యమునకు కాలుద్రవ్వు స్థితిలో నుండుటవల్ల, ఆత్మరక్షణార్థమై మహారాష్ట్ర నాయకుల నందరిని హెచ్చరించి, వారి నొకకూటముగ చేర్చవలయునను సంకల్పముతోనే సింధియా ఇట్లు బయలువెడలెను. అంతకు మిక్కిలి సింధియాకు ఇంగ్లీషువారిపై ఎట్టి కలహపు తలంపుగాని లేదని గవర్నర్ జనరల్ వెల్లస్లీ 1803-వ సం॥ ఏప్రిల్ 19-వ తేదీన సీమ డైరక్టర్లకు స్పష్టముగా వ్రాసెను. 1803-వ సం॥ మే 18-వ తేదీన పునహా రెసిడెంటు "క్లోజ్" సీమ డైరక్టర్ల రహస్య సంఘమునకు వ్రాసిన ఉత్తరములో నిట్లున్నది.

["ఇంగ్లీషువారికి పీష్వాకు ఇటీవల జరిగిన సంధిజోలికి తానురానని దౌలత్ రావు సింధియా మన రెసిడెంటుతో చెప్పినప్పటికి ఇటీవల అతనిప్రవర్తన కొంత అనుమానముగా కన్పట్టుచున్నవి. మొన్న 4-వ తేదీన 'బడోలీ' మీదుగ నేను పూనాకు పోవుచున్నానని చెప్పి సింధియా బరహంపురమునుండి బయలుదేరివెళ్లెను. ఈ బడోలీవద్ద మహారాష్ట్ర నాయకులు ముగ్గురు (సింధియా, హోల్కారు, భాన్స్లేలు) కలుసుకొని మాట్లాడుకొందురట. ఈసమావేశము అసలు నిజముగ జరుగునో లేదో చెప్పజాలము. జరిగితే దానిఫలితమేమగునోకూడ చెప్పుట అంతకన్న కష్టము. మనము పీష్వాను సింహాసనముమీద కూర్చుండబెట్టి, మన బ్రిటిషు సేనలతో అతనికి మద్దతుచేయుచున్నాము. కాబట్టి, బహుశః ఈముగ్గురు ఏకమైనను అది మనమీదికి వచ్చుటకుకాక, కేవలము తమ ఆత్మరక్షణార్థమే యైయుండును. ఏదిఎటులున్నను రాబోవు రోజులు వర్షకాలమగుటచే మహారాష్ట్రులకు యుద్ధముచేయుటకు వీలుండదు. నదులన్నియు పొంగును. వీనినిదాటుటకు మనకు సులభమైనను మహారాష్ట్రులకుకష్టము. కాబట్టి, వారు

ముగ్గురు కలిసినను మనలనేమియు జేయజాలరు. మనమీదికి కవ్వించివచ్చె ఉద్దేశ్యముతో సింధియా ఈ జట్టులో జేరుతాడనేమాట కేవలము అసంభవము. హోల్కారంటే సింధియాకు అసలులోపలగిట్టదు. ఉత్తరహిందూస్థానమున తనరాజ్యమును సంకటస్థితిలో బెట్టుకొని, మహా బలిష్టులగు ఇంగ్లీషువారి నెదిర్చుటకు దౌలత్ రావు దక్షిణమునకు వస్తాడంటే అదియెంతమాత్రము నమ్మదగిన మాటకాదు. ఇట్టికలహముఠాకుండ ఎట్లైనను తప్పించుకొనుటకే అతడు చూచును గాని వేఱొకటికాదు.—క్లుప్తము.]

కాబట్టి, సింధియాయొక్క డక్కన్ పయనము యుద్ధసంకల్పముతో గాదనియు, కేవలము ఆత్మరక్షణార్థమే యనియు, ఇగ్లీషువారి వ్రాతలవలననే తెలియుచున్నది. ఈ చర్య గర్హ్యమనిగాని, ఇందు తమకు అపాయమున్నదనిగాని ఇంగ్లీషువారెవరును తలంపనట్లు పై నుదహరించిన వారివ్రాతలే చెప్పుచున్నవి. సింధియా రాకకు ఇదియొక సమాధానము.

ఇక రెండవ సమాధాన మేమనగా:—బాజీరావు దౌలత్ రావును పునహా కొకమారు వచ్చి మాట్లాడిపొమ్మని తాను తక్తుపై కూర్చుండక పూర్వమే వేఱొక మకాముసుండి కబురు పంపించియుండెను. ఈ కబురు తాను బేసిన్ ఒడంబడికపై సంతకము చేసినపిమ్మటనే బాజీరావు సింధియాకు పంపించెను. బేసిన్ సంధిపై సంతకముపెట్టిన పిమ్మట బాజీరావుకు కొద్దిగా జ్ఞానోదయమైనట్లు కన్పట్టుచున్నది. తాను దుంగనుతీసి దూలమెత్తికొనినట్లు- పెనమునుండి పొయ్యిలోనికి దూకినట్లు- బాజీరావుకు తోచెనుకాబోలు! ఇంగ్లీషువారి యాలింగనము తనకు భల్లూకపు టాలింగనమువలె కంటకముగా గన్పట్టెను. దుర్బలక్షణికమందు తాను మోసపోయి ఈ బంధనముల తెచ్చుకొంటినని ఆతడు లోలోన పశ్చాత్తాపపడియుండుటలో అసహజమేమియులేదు. కాబట్టి, ఈ యురులనుండి మెల్లగా నెట్లయినను తప్పించుకొనవలయునని బాజీరావు ప్రయత్నించుటయు సహజము. ఇందుకొఱకై తన పూర్వమిత్రుడగు దౌలత్ రావు సింధియా సలహా తీసికొనవలయునని తలచి అతని నొకసారి పూనాకు రమ్మని కబురు పంపించియుండెను. ఇట్లే రఘోజీ భాన్స్లేకు కూడ కబురుపంపెను. బాజీరావుకు ఇట్టికోర్కె కలదనియు, ఇందు కొఱకై అతడు సింధియా, భాన్స్లేలకు కబురుచేసెననియు, ఇంగ్లీషువారికి పూర్తిగా తెలియును. బాజీరావుకు ఇట్టికోర్కెయుండి బేసిన్ యొడంబడికను రద్దుపరుచు కొన దలచినచో దానికి తానెట్టి అభ్యంతరమును చెప్పననికూడ గవర్నరు జనరల్ వెల్లస్లీ 1803-వ సం॥ ఫిబ్రవరి 3-వ తేదీన సీమ డైరక్టర్ల రహస్య సంఘమునకు స్పష్టముగా వ్రాసెను. అందిట్లున్నది.

[మనము పీష్వాతో సంధి చేసికొనినామనుసంగతి తెలియగానే దౌలత్ రావు సింధియా జస్వంతరావు హోల్కారులు తమకలతలను మాన్పుకొని బాజీరావును సింహాసనముపై తిరిగి కూర్చుండబెట్టుటకు అనుకూలముగా ఆతనిముందు కొన్నిషరతులను వీరు పెట్టవచ్చును. సదరు

షరతులకు బాజీరావు అంగీకరింపవచ్చును. మనతో నతడు ఇందునుగురించియే బేసిన్ యొడంబడిక చేసికొనినప్పటికి వానిని పాటించకుండ బాజీరావు సింధియా హోల్కారులతో చేరవచ్చును. అటుల జరిగేయెడల, మనతో చేసికొనిన బేసిన్ ఒడంబడిక షరతులకు బద్ధుడైయుండి తీరవలయునని పీష్వా బాజీరావును బలవంతపెట్టుట నా ఉద్దేశ్యము కాదు. ఏలననగా అట్లు బలవంతపెట్టినచో మనకు మహారాష్ట్ర నాయకులందరి సంయుక్తబలములతో పెద్దయుద్ధము వచ్చును. కంపినీ నిట్టి యుపద్రవములోనికి తెచ్చుట నా అభిమతము కాదు.—(క్లుప్తము)]

వెల్లస్లీ చెప్పినమాటలివి. కాని క్రియలు మాత్రము ఇందుకు విరుద్ధముగ నుండెను. బాజీరావు, సింధియా హోల్కారులతో సఖ్యపడేయెడల తన కెట్టి యభ్యంతరము లేదని వెల్లస్లీపైకి చెప్పినను లోలోన అందుకు భిన్నముగా ప్రవర్తించెను. బాజీరావు పంపిన కబురుమీద ఆతనిని చూచుటకై వచ్చుచున్న దౌలత్ రావు సింధియాను ఆతనితో కలసిమాట్లాడుకొన నీయకుండా చేయుటకు ఇంగ్లీషువారెన్నియో దొంగపనులను చేసిరి. 1803 వ సం। మే 10 వ తేదీన ఆర్థర్ వెల్లస్లీ జనరల్ స్టూఆర్టుకు వ్రాసిన ఉత్తరములో నిట్లున్నది.

'నీవు పునహా రావద్దు'—అని పీష్వాచేతనే సింధియాకు కబురు పంపించేటట్లు పీష్వాను ఒత్తిడిచేయవలయునని కర్నల్ కాలిన్సు తలంచుచున్నాడు. 'నీవు పునహాకు రాకుండా ఉండుటే పీష్వాకోరిక. కాబట్టి ఆప్రకారము నీవు పునహాకు రాకుండా ఉంటే బాగుంటుంది'-అని నేనే సింధియాకు వ్రాద్దామని అనుకుంటున్నాను. అయినా, పీష్వా ఏమివ్రాస్తాడో చూచి తరువాత ఏమిచేయవలయునో నిశ్చయించుకుంటాను.—[క్లుప్తము.]

ఎంత దురంతమైన దొంగపనికి ఆర్థరు వెల్లస్లీ పూనుకొనెనో చూడుడు! పీష్వాయొక్క కోర్కెకు తల్లక్రిందులుగ అసత్యముకల్పించి తనను పునహా రావద్దన్నాడను అబద్ధపు కబురును ఇతడు సింధియాకు పంప సమకట్టెను. ఈతంత్రముచేత సింధియావచ్చి బాజీరావుతో మాట్లాడకుండా చేయవలయునని వెల్లస్లీ సంకల్పము. ఈరీతిగా పైకొకమాటయు, క్రియ నింకొకవిధముగను చేయుచు, తుదకు తమ యజమానులగు సీమడైరక్టర్ల కండ్లకుకూడ గంతలుగట్టి ఇండియాలోని కంపెనీ అధికారులు మహారాష్ట్రులతో ఘోర సంగ్రామమునకు దిగి, మహారాష్ట్ర ప్రజల స్వాతంత్ర్యమును అపహరింప జూచుటయేగాక, కంపెనీకి అపారమగు ద్రవ్యనష్టమును గలిగించి, తమ కోమటి యజమానులగు కంపెనీ భాగస్వాములకు ఏటావచ్చు లాభము లేకుండాచేసి, తత్కారణమున వారియొక్క కించిదాగ్రహమునకుకూడ గురికావలసినవారైరి.

కాలిన్సు తొందరపాటు-, మందలింపు.

మహారాష్ట్రులతోడి ఈ యుద్ధమును తెచ్చిపెట్టుటలో కర్నల్ కాలిన్సు ప్రవర్తించిన నడవడి గమనింపదగియున్నది. ఈతడు సింధియా దర్బారులో రెసిడెంటుగా నుండెను. కుట్రలుపన్నుటలో నితడు వెల్లస్లీకి కుడిభుజముగా నుండెను. కాని ఈతడింత

వరకు సింధియాను ఇంగ్లీషువారివలలో పడవేయలేకపోయెను. తనతోడివాడగు పునహా రెసిడెంటు కర్నల్ క్లోజ్ పీష్వా బాజీరావును ఇంగ్లీషువారి వలలో పడవేయ గలిగియుండగా తాను సింధియాను పడవేయలేకపోవుట కాలిన్సుకు చాలా చిన్నతనముగా నుండెను. అందుచేత ఎట్లులైనను సింధియాపైకి యుద్ధము పురిగొల్పవలెనని కాలిన్సు ఎంతయో ఆతురపడుచుండెను. ఈతొందరపాటుతో వెల్లస్లీయనుకొన్న యుద్ధసన్నాహములన్నియు పూర్తికాకమునుపే కాలిన్సు సింధియా దర్బారునుండి వచ్చివేసెను. రెసిడెంటు ఇట్లువచ్చివేయుట మామూలుగా యుద్ధప్రకటనమును సూచించును. ఈతడిట్లు తొందరపడి యుద్ధప్రకటన చిహ్నమును గనపఱచుట వెల్లస్లీకిన్ని, ఆతని తమ్ముడు సేనాపతికిన్ని, ఎంతమాత్రము నచ్చలేదు. కాలిన్సు తొందరపడి వ్యవహారమును చెడగొట్టుచున్నాడని వారికితోచెను. అందుచే వారు కాలిన్సును మందలించి తిరిగి సింధియాదర్బారునకు పంపించిరి. ఇందును గురించి ఆర్థర్ వెల్లస్లీ 1803 వ సం॥ మే 10 వ తేదీన జనరల్ స్టూఆర్టుకు వ్రాసిన ఉత్తరములో నిట్లున్నది.

[మీరీపాటికి కాలిన్సును మందలించి, సింధియా దర్బారునకు తిరిగి పంపియుందురని తలంచెదను. ఆత డచటినుండి వచ్చివేయుటలో చాలా తొందరపడినాడు. అది యెంత మాత్రము మంచిదికాదు. అయినప్పటికిని ఇప్పటికి మించినదిలేదు. సింధియామంత్రులు కాలిన్సుచేత నియమింపబడిన నేటివు ఏజంట్లద్వారా ఇంకను వ్యవహారములు నడుపుచుందురు గాన కాలిన్సు అచ్చటినుండి వెళ్లిపోవుటలో విశేషమేమిలేదనియు అది యుద్ధచిహ్నముకాదనియు మంత్రులచేత సింధియాకు చెప్పించవలయును. కాలిన్సు అక్కడ ఉండనియెడల మంత్రులపై ఆతనికిగల పలుకుబడివలన మనకువచ్చు లాభమంతయు పోవును. సింధియాపై గల పలుకుబడియు పోవును. కాలిన్సు సింధియాదర్బారును వీడివచ్చునప్పుడు మనమతనిమీద యుద్ధము చేయబోవుచున్నామను అనుమానమును సింధియాకు తగలకుండు విధముగనే మన కాలిన్సు ప్రవర్తించియుండునని తలంచెదను.]

ఇంగ్లీషువారి రహస్యపు యుద్ధసన్నాహములు.

ఈరీతిగ కాలిన్సును మందలించి తిరిగి సింధియా దర్బారుకు పంపించి యుద్ధపు అనుమానము సింధియాకు తగులకుండ, ఆతడు యుద్ధసన్నాహమును చేసికొనకుండ, లాలించి, ఆతని కండ్లనుకప్పి ఆర్థర్ వెల్లస్లీ తనమట్టుకు తాను యుద్ధసన్నాహము చేసికొనుచుండెను. మహారాష్ట్రులతో యుద్ధముచేయుటకు వర్షాకాలమే మిక్కిలి యనుకూలమైన కాలమని ఆర్థర్‌కు తెలియును. ఇతడువెనుక మహారాష్ట్ర దేశములో చొరబడిచూచిన సందర్భమున అచ్చట స్థితిగతులను గుఱించి ఇట్లు రికార్డు చేసియుండెను.

[మహారాష్ట్రులతో యుద్ధము చేయుటకు మిక్కిలి అనుకూలమైన తరుణము వర్షాకాలము. అప్పుడు పడమటికనుమలలో పుట్టిన నదులన్నియు పూర్తిగా వరదలచే నిండును. ఇది సాధారణముగ జూను నెలలో జరుగును. అది మనకు అనుకూలమైన తరుణమని చెప్పుటకు కారణములివి.

వరదల కాలములో నదులనుదాటుట మహారాష్ట్ర సైన్యములకు కష్టము. ఈనదులకు వంతెనలు లేవు. బుట్టలబోటులతో తప్ప వారింకొకవిధముగా ఈనదులను దాటలేరు. ఈబోటులువారికి దొరకుట చాలకష్టము. వరదలకాలములో ఇది వారికి మరింతకష్టముగ నుండును. ఎక్కువ మంది ఒక్కసారే దాటుటకు వీలుండదు. కొద్దిమందినిదాటించినచో వారు ఆవలప్రక్కనున్న శత్రువులకు సులభముగా చిక్కుదురు. ఈనదులను దాటువిషయములో మన బ్రిటిషు సేనకంత యిబ్బందిలేదు. మనకు కావలసినన్ని పంట్లు (ఇనుపరేకులతోచేయబడిన చిన్న పడవులు) ఉన్నవి. వానితో ఈనదులమీద సులభముగా వంతెనల నిర్మించుకొని మనసేనలను నిరాఘాటముగ నడిపించి తీసికొనిపోవచ్చును. కాబట్టి ఇతరసమయములలోకంటె వఱదలకాలములోనే మన సేనలకు మహారాష్ట్ర సేనలకంటె ఎక్కువ వీళ్లున్నవి. మనసేనలు త్వరత్వరగా అధికసంఖ్యాక ములుగా నదులనుదాటిపోవుచుండగా మహారాష్ట్రుల సేనలు వెనుక చిక్కుపడియుండును. ఇది మనకు గొప్పలాభము. ఇక రెండవసౌకర్యమేమనగా-మహారాష్ట్ర దేశములో ఇతరకాలములో త్రాగుటకు నీరైన దొరకదు. వర్షకాలములో నీరు ఎచ్చటపట్టిన అచట సమృద్ధిగ లభించును. మన సేనల కప్పుడు కావలసినంత నీరు లభించును. ఇది రెండవ లాభము.]

కాబట్టి వర్షకాలము వచ్చువఱకు యుద్ధపు సవ్వడి కించిత్తైనను సింధియాకు తెగులకుండునట్లు ఆర్థర్ వెల్లస్లీ కాలిన్సును మందలించి సింధియా దర్బారుకు మరల పంపించెను. వర్షకాలము వచ్చులోపల ఆర్థర్ బొంబాయి గవర్నరుకును, కర్నల్ మన్రోకును తదితరులకును వ్రాసి కావలసినన్ని 'పంట్ల'ను సంసిద్ధము చేసికొని యుంచుకొనెను. ఈ రీతిగా మహారాష్ట్ర నాయకులనందరిని "మేము మీామీాదికి యుద్ధమునకు రాము" అను మైకములో పడగొట్టి, ఇంగ్లీషువారు తమ మట్టుకు తాము యుద్ధమునకు కావలసిన సర్వసన్నాహములను చేసికొనుచుండిరి.

సర్వసన్నాహములును పూర్తియైన పిమ్మట ఇక యుద్ధప్రకటనకు వారేదో మిషలను వెదుకసాగిరి. మగనికొట్టి మొగసాల కెక్కినటులు మహారాష్ట్ర నాయకులే తమమీాదికి కాలు త్రవ్విరని ఇంగ్లీషువారు గయ్యాళి తనముగా బొంకసాగిరి. వారినాటినుండి తమమాటల ధోరణిని మార్చివేసిరి. సింధియా భాన్స్లేల కజ్జాకోరు ప్రవర్తనవలననే తామిా యుద్ధమునకు దిగవలసివచ్చినదని వారు పెను ఆగతనముతో పల్కసాగిరి. 1803 సం॥ మే 30-వ తేదీన గవర్నర్ జనరల్ సెక్రటరీ పునహాలో రెసిడెంటుగ నున్న కర్నల్ క్లోజు కిట్లని వ్రాసెను:—

యుద్ధ ప్రకటనకు మిషల వెదుకుట.

[సింధియా, భాన్స్లే, హోల్కారులు ముగ్గురు గూడు పుఠాణీచేసి, ఇంగ్లీషువారిమీాదికి దండెత్తనున్నట్లుయెవరో పుకార్లుపుట్టించుచున్నారు. మనశత్రువులకు ఉత్సాహమును, మనకు నిరుత్సాహమును కల్పింపవలయునను తలంపుతో వారీపుకార్లను పుట్టించుచున్నారు. ఇవి గనుక బాగుగ ప్రాకినవంటే నిజముగ మనశత్రువులకు ఉత్సాహమెక్కువై, మనమీాదికి కవ్వించి వస్తారు. అప్పుడు మనమెంతో కష్టపడితేనేగాని నెగ్గలేకపోతాము. కాబట్టి యిట్టి పుకారులను అణచివేయుటకు మన తాబేదారులందరు శాయశక్తుల ప్రయత్నించవలసినదని

మన గవర్నర్ జనరల్ గారు గట్టిహుకుము నిచ్చుచున్నారు. మహారాష్ట్ర నాయకులందరు ఇట్లు ఒకటిగచేరి మనమీదకుట్ర పన్నకుండచేయుటకై గవర్నరు జనరలుగారు తగిన యేర్పాటులు చేయుచున్నారు. ఈకుట్రలో చేరవద్దని భాన్స్లేను చివాట్లుపెట్టుచు గవర్నర్ జనరలుగారు అతనికి ఉత్తరము వ్రాసినారు. సింధియాకుకూడ యిట్లే వ్రాయించినారు. మరియు, మిడ్నపూరులోనున్న మన సేనలను మరింతబలపరచి, భాన్స్లేను హడలగొట్టుచున్నారు. సింధియా కూడ దక్షిణమునువిడిచి తనయింటికి (ఉత్తరహిందూస్థానమునకు) పోవచ్చును. అయినప్పటికి మన సేనలనుమాత్రము రంగమునుండితీసివేయరాదు. ఒకవేళ హోల్కారు పునహామీదికిదండెత్తి వస్తాడేమో! అదిగాక, పీష్వా బాజీరావు అధికారమును దేశమంతా అంగీకరించునట్లు చేయ డానికికూడ యీ మన సేనలు అవసరము. కాబట్టి, వానినిప్పుడు యుద్ధరంగమునుండి తీసివేయ రాదు............క్లుప్తము.]

మహారాష్ట్ర నాయకులు కలియకుండ చెదర గొట్టబడుట.

ఈ రీతిగ మహారాష్ట్ర నాయకు లెవ్వరుగాని కలుసుకొని మాట్లాడుకొనుటకుగాని, వారి సేనలను వారి వారి రాజ్యములలోనైనను సమకూర్చుకొనుటకుగాని అవకాశమివ్వకుండ, వారినందరిని చెదరగొట్టివేసి ఇంగ్లీషువారు తమ సేనలను మాత్రము సదా యుద్ధరంగమందే సర్వసన్నాహములతో నుంచుకొనునట్లు యేర్పాటు చేసుకొనిరి. ఎంతగడుసు దనము!

ఇక్కడ యింకొక విషయముకూడా గమనింపవలసియున్నది. జస్వంతరావు హోల్కారుకూడ పునహా పైకో, నైజాము పైకో దండెత్తివచ్చునేమోయను భయము వెల్లస్లీకున్నప్పటికి ఆతడు నిజముగ హోల్కారు మీద యుద్ధము చేయు ధోరణిని కనుపఱచలేదు. ఇంగ్లీషువారు అసలు ఎవరిమీదనైనా యుద్ధము చేయ వలసియుంటే అది హోల్కార్ పైననే చేయవలసియుండెను. ఇట్లు చేయవలసిదని బాజీరావు సహితము కోరియుండెను. ఇందుకు నైజాముకూడ సంతోషించెడివాడు. బహుశః ఇతర మహారాష్ట్ర నాయకులుకూడ ఇందువిషయమై ఇంగ్లీషువారికే సహాయము చేసేవారేమో? కాని, ఇంగ్లీషువారిపుడు జస్వంతరావుతో యుద్ధము చేయ తలపెట్టలేదు. ఇందుకు కారణము లోగడనే చెప్పియుంటిమి. పైపెచ్చు, "హోల్కారుతో సఖ్యతగానుండుట నాతలంపు" అని గవర్నర్ జనరల్ వెల్లస్లీ 1803 సం॥ జూన్ 3-వ తేదీన సింధియాకు వ్రాసిన ఉత్తరములో చెప్పెను. ఈ ఉత్తరములోనే వెల్లస్లీ తాను, సింధియాపైకి యుద్ధమునకు వచ్చుచున్నట్లు బెదరించి ఆతనిని హోల్కారుతో సంధి చేసికొనవలసినదనియు, అందుకుతాను మధ్యవర్తిత్వము వహింతుననియు చెప్పెను. కాని, ఇందుకు సింధియా ఒప్పుకొనలేదు.

కాలిన్సు సింధియా దర్బారులోనుండెను. ఇంగ్లీషువారికిని సింధియాకును ఎట్లయినను యుద్ధము రేపవలయునని ఈతడు చూచుచుండెను. సింధియా సేనలో గల లోపములు కాలిన్సుకు బాగుగ తెలియును. అందువల్ల ఈ యుద్ధములో జయము ఇంగ్లీషువారికే కలుగునని ఆతనికి దిలాసాకలదు. ఈరీతిగ తాను తాంత్రి

కమువల్ల చేయలేని పనిని యుద్ధమువల్ల సాధించి పేరుపొందవచ్చునని కాలిన్సు చూచుచుండెను. ఇట్టివానిచేతులలో వెల్లస్లీ రాయబారపు పనులనుపెట్టెను. కాబట్టి ఇతడు (కాలిన్సు) ఎట్లైనను కయ్యమే పొసగించునని వేఱుగజెప్ప పనిలేదు. ఇతనికి 1803 సం॥ జూన్ 3-వ తేదీన గవర్నర్ జనరల్ ఒక పెద్ద ఉత్తరము వ్రాయించెను. సింధియా పునహాకు పోవు ప్రయత్నములనన్నింటిని అతనిచేత మాన్పించ వలయునని ఈ ఉత్తరముయొక్క సారాంశము. తననిట్లు పునహాకు పోకుండ ఇంగ్లీషువారు నిరోధింపజూచుట దౌలత్ రావు సింధియాకు కంటకముగా దోచెను. ఏలననగా, బాజీరావును వెనుక సింహాసనముమీద కూర్చుండబెట్టినది తానేకదా. అట్టివానియొక్క యోగక్షేమములను యోజించుటకు తనకు అధికారములేదా? హోల్కారుచే నోడిపోయి, బాజీరావు పునహానుండి పాఱిపోయినపుడు, అతనిని తిరిగి సింహాసనముపై కూర్చుండబెట్టు విషయమున సహాయము చేయవలసినదనికూడ సింధియా ఇంగ్లీషువారిని పొరపాటున కోరియుండెను. అట్లు పొఱపాటనగా ఇంగ్లీషువారి రహస్యపు ఇషారాచేతనే హోల్కారు బాజీరావును ఓడించి పునహానుండి తరుమగొట్టెనను సంగతి పాపము సింధియాకు తెలియదు. ఆ సంగతి తెలిసియున్నచో, సింధియా బాజీరావుకు సహాయము చేయవలసినదని ఇంగ్లీషువారి నేలకోరియుండును? ఇంగ్లీషువారు హోల్కారుకు కన్నుగీటుటచేతనే ఇంతపని జరిగినదను సంగతి సింధియాకు తెలియక, ఇంగ్లీషువారు బాజీరావుపై సదుద్దేశముతోనే యున్నారను అమాయికపు తలంపుతో సింధియా ఒకానొక దుర్ముహూర్తమునందు పొరపాటున ఇంగ్లీషువారి సహాయము కోరెను. ఈ పొఱపాటును అవకాశముగా చేసికొని బాజీరావును 'మేము సింహాసనము మీద కూర్చుండబెట్టినాము కాని, నీకేమిపని'యని ఇంగ్లీషువారు సింధియాను తృణీకరింప జొచ్చిరి. ఈ మాటలను చెప్పుచు వారు సింధియాను బాజీరావువద్దకు చేరనివ్వరైరి. "బాజీరావు సింధియా భాన్స్లేమున్నగు వారలతో సఖ్యపడితే మాకభ్యంతరములేదు. బేసిన్ వడంబడిక షరతులను గట్టిగ అమలుజరిపి తీరవలసినదని మేము బాజీరావును కోరము." అని పైకి చెప్పుచు క్రియలోమాత్రము వారెవరుగాని వచ్చి బాజీరావుతో మాట్లాడుకొనుటకైనను అవకాశమీయక ఇంగ్లీషువారు అందరిని చెదరకొట్టివేసిరి. పైగా, "ఇంగ్లీషువారి అనుమతిలేనిదే నీవు ఏమిషమీదగాని పునహాకు రావద్దు. అట్లావస్తే నీకు మాతో యుద్ధము తప్పదు." అని వెల్లస్లీ జూన్ 3-వ తేదీన రెసిడెంటు కాలిన్సుకు వ్రాసిన ఉత్తరము ద్వారా సింధియాకు కబురు పంపించెను.

బాజీరావు దౌలత్ రావును వ్రాసినట్లే రఘోజీభాన్స్లేకుకూడ ఉత్తరము వ్రాసి పునహాకు రమ్మని కోరెను. ఆతడును, పునహాకు వచ్చుటకు సంసిద్ధుడై యుండగా, "నీవు పునహాకు రావద్దు; వస్తే నీదేశముమీదికే దండెత్తివచ్చి,

నీతో యుద్ధము చేస్తాము'' ని వెల్లస్లీ సింధియాను బెదిరించినట్లే రఘోజీనికూడ బెదిరించుచు ఉత్తరమొకటి వ్రాసెను.

సింధియాపై కొండెములు.

ఈరీతిగా మహారాష్ట్ర నాయకులు ఒండొరులతో సంప్రదించుకొనకుండ చేయుటయేగాక, సింధియా దర్బారులోనున్న కాలిన్సు వెల్లస్లీకి సింధియాపై కొండెములుచెప్పి, అతనిచేత యుద్ధమును ప్రకటించునట్లు చేసెను. కాలిన్సు వెల్లస్లీ యుద్ధమునకెట్టి టక్కరు మాటలచే పురికొల్పెనో ఆతడు 1803 సం॥ మే 29-వ తేదీన వెల్లస్లీకి వ్రాసిన ఉత్తరములోని ఈ దిగువభాగముల వలన తెలియుచున్నది.

[దౌలత్ రావు సింధియా నాతో వెంటనే మాట్లాడలేదు. ఆతనిమంత్రి భాస్కరుడునాకు ఇట్లని జవాబుచెప్పసాగెను. "పీష్వా రాజ్యముపైగాని, నైజామురాజ్యము పైగాని, దండెత్త వలయునని మాసింధియా మహారాజుగారికి తలంపులేదు. అదిగాక, జస్వంతరావు హోల్కారు నైజామురాజ్యములో ఔరంగబాదు పట్టణమును కొల్లగొట్టుచున్నప్పుడు ఆపని మానవలసిన దని మా మహారాజావారు హోల్కారుగారిని కోరియుండిరి.'' ఈమాటలకు నేను చాలసంతో షించితినని చెప్పి, "సింధియా మహారాజావారును, భాన్స్లే, హోల్కార్లును జరుపుకొనుచున్న సంప్రదింపుమాటలు బేసిన్ సంధిని భంగపుచ్చుతలంపుతో మాట్లాడుకొనుచున్నవి కావుగదా'' యనువిషయమై నాకు అభయహస్త మివ్వవలసినదని నేను కోరితిని. అందుపై భాన్స్లే రాజాగారితో మాట్లాడినపిమ్మటగాని, ఇంకువిషయమై మాసింధియా మహారాజావారు మీ కేమియు సంతృప్తికరమగు జవాబుచెప్పజాలరని మంత్రి భాస్కరుడు స్పష్టముగా జబాబు చెప్పెను. అంతటనే నిట్లంటిని—"సింధియా, భాన్స్లే మహారాజులిరువురు ఇట్లు సంప్రదించు కొనుటయే మాఇంగ్లీషు గవర్నమెంటువారికి అనుమానకారణముగనున్నది. ఇట్టి సంప్రదింపులు యుద్ధకార్యములకొరకుగాక, సాధారణముగా ఇతరసమయములయందు జరుగవు. ఇపుడుదక్షిణ హిందూస్థానములో శాంతి ప్రబలియుండగా ఇట్టి సంప్రదింపులేల జరుగవలయును.'' ఇందుకు భాస్కరమంత్రి ఇట్లనిచెప్పెను.

"బాజీరావు పీష్వాగారు పునహాకువచ్చినప్పటినుండి, సింధియా, భాన్స్లే మహారాజా వార్లను ఒక్కసారి పునహాకువచ్చి మాట్లాడిపోవలసినదని అనేకసారులు ఉత్తరములమీద ఉత్తరములు పంపించిరి.'' ఈమాటలునాకు చాల ఆశ్చర్యముగలిగించెను. అంతటనే నిట్లంటిని. "ఈమాట నాకు చాల ఆశ్చర్యముగనున్నదే! సింధియా మహారాజావారిని పునహాకు రావద్దని బాజీరావు మహారాజావారు కోరినట్లుమీకు మాపునహా రెసిడెంటు కర్నల్ క్లోజు వ్రాసియుండ లేదా ?'' అంతట దౌలత్ రావు సింధియామహారాజు ఇట్లనెను. "నన్నును, భాన్స్లేవారిని తప్పక రావలసినదని బాజీరావు మహారాజావారు ఉత్తరములు వ్రాసినమాట నిశ్చయము. నన్ను పునహా రావద్దని బాజీరావు మహారాజావారు మాకెప్పుడును వ్రాయలేదు.'' అంతట నేనిట్లం టిని.

"అటులనా! దానికేమి? అట్టియుత్తరము పీష్వా మహారాజావారివద్దనుండి మీకు త్వర లోనే రాగలదు. అయితే, సద్యః, బేసిన్ సంధివిషయమై మీయభిప్రాయమేమో ఖండితముగా తేల్చిచెప్పి మాకుగల అనుమానములను తీసివేయవలసినది.'' అని నేను సింధియాను ఎంతో

ఆత్రముతో సమాధానవాక్యములతో అడిగితిని. ఇందుకు, దౌలత్ రావు ఇట్లని జవాబు చెప్పెను. "భాక్ స్లేరాజావారితో ఇచ్చినమాటకు భంగముగా, వారితో సంప్రదించకుండా నేనిపు డేమియు చెప్పజాలను. భాన్స్లేవారు దగ్గరలో నలువదిక్రోసుల దూరములోనే యున్నారు. వారు కొలదిరోజులలోనే బహుశః ఇక్కడికిరాగలరు. వారు రాగానే వారితో మాట్లాడి, నెయ్యమో కయ్యమో మీకు చెపుతాను." ఈమాటలను దౌలత్ రావు గంభీరముగా పలికెను. "ఈమాటను నేను ఫయిసలాగా తీసికొనవచ్చునా" యని యడిగితిని. "అవు"నని మంత్రులు జవాబు చెప్పిరి. ఇంతటితో మా ప్రసంగము పూర్తియయ్యెను. నేనంతట సింధియా మహారాజా వారివద్ద సెలవుతీసికొని వచ్చివేసితిని. సింధియావారుగాని వారిమంత్రులుగాని బేసిన్ సంధిని గూర్చి మాటమాత్రమైనను మాట్లాడలేదు. సదరు సంధిపత్రపునకలునైనను తమకివ్వమని వారు నన్నడుగలేదు. దౌలత్ రావు సింధియా చెప్పినట్లు ఆయనను పునహాకురమ్మని పేష్వా బాజీరావు కోరినమాటయే నిశ్చయమైనయెడల సింధియా పునహాకు తప్పక బయలుదేరును. తమ ప్రధాన నాయకుడగు పేష్వా యాజ్ఞ ప్రకారము తాము పునహాకు పోవుచుంటిమని సింధియా అప్పుడు మిష చెప్పవచ్చును. కాబట్టి నేనిప్పుడు ముఖ్యముగా మిమ్ములను కోరేదేమంటే "నీవు పునహాకురావద్దని చెప్పే ఉత్తరమును బాజీరావుచేత ఇప్పటికైనను ఆలస్యములేకుండా వెంటనే దౌలత్ రావు సింధియాకు పంపించే యేర్పాటుచేస్తే చాలా బాగుంటుంది................"
[క్లుప్తము.]

ఈ ఉత్తరమే కొంపతీసినది. ఈ ఉత్తరమే వెల్లస్లీ మహారాష్ట్రులతో యుద్ధమును ప్రకటించునట్లు చేసినది. సింధియాయు, ఆతని మంత్రులును చెప్పిన మాటలు కాలిన్సుకు ఎంతవఱకు అర్థమైనవో, వానిని కాలిన్సు వెల్లస్లీకి ఎంతవఱకు సరిగా రిపోర్టుచేసెనో తెలియదు. కాలిన్సుకు మహారాష్ట్రభాష తెలియదు. సింధియాకును, మంత్రులకును ఇంగ్లీషుభాష తెలియదు. ఉభయుల మధ్య దుబాషి ద్వారా మాటలు జరిగినవి. ఒకరి భావములను ఒకరు ఎంతవఱకు సరిగా అర్థము చేసికొన్నారో తెలియదు. సింధియా మాటలు అగౌరవముగను, విరోధభావము సూచించునవిగను, ఉన్నవని వెలస్లీ 1803–వ సం॥ జూన్ 28–వ తేదీన లేక్ సేనానికి వ్రాసిన రహస్యపు టుత్తరములో చెప్పెను. "ఇరుగు పొరుగు స్వతంత్ర దేశములకు పరస్పర ముండవలసిన సిద్ధాన్తములకు సింధియా మాటలు విరుద్ధముగానుండి, అతడు కేవలము మనపై కాలుద్రవ్వినట్లే స్పష్టమగుచున్నది" అని కూడ వెల్లస్లీ సదరు ఉత్తరములో వ్రాసెను.

కాని, కాలిన్సు ఉత్తరమును నిష్పక్షపాతబుద్ధితో చూచినచో, అగౌరవముగను, పొగరుబోతు తనముగను మాట్లాడినది కాలిన్సేగాని, సింధియాగాదని యెవరికైనను స్పష్టపడును. ఇరుగు పొరుగు దేశములకు పరస్పర ముండవలసిన ధర్మ సిద్ధాంతములకు భంగముగ ప్రవర్తించి, కయ్యమునకు కాలుద్రవ్వుచున్నది వెల్లస్లీ గాని, సింధియా యెంతమాత్రమునుకాదు. అక్రమముగ పరుల పొలిమేరలో అడు

గడుగునకు తనసేనను నిలిపినది సింధియాయా లేక వెల్లస్లీయా? ఇదంతయు మగని గొట్టె మొఱుగసాగిన గయ్యాళిగంప లక్షణముగనున్నది!

బేసిన్ ఒడంబడికలోని షరతులు, వానిలోని అంతరార్థములు అప్పటికి సింధియాకు తెలియనే తెలియనట్లు కాలిన్సు ఉత్తరమువల్లనే తెలియుచున్నదిగద.

సింధియా జాబు— వెల్లస్లీ నిరుత్తరము.

సదరు సంధి షరతులగూర్చి చర్చించి, సంప్రదించుకొనుటకే గద సింధియా, భాన్‌స్లేలు సమావేశము కాదలచినది? స్వతంత్రరాజు లిరువురు యీరీతిగ సమావేశమై యాలోచించుట యేధర్మసూత్రములకు విరుద్ధమో వెల్లస్లీ చెప్పగలడా? ఇట్టి సమావేశము జరుగకుండ ఆటంకపరుచుటకు యేధర్మసూత్రప్రకారము తనకు అధికారముగలదో వెల్లస్లీ చెప్పగలడా? బేసీన్ సంధినిగూర్చి తన యభిప్రాయములను తెలియబరుచుచు సింధియా వెల్లస్లీకి ఉత్తరము వ్రాసెను. అది వెలస్లీకి 1803-వ సం॥ జులై 31-వ తేదీన చేరినది. అందిట్లున్నది :—

[పీష్వాకును మీకంపెనీవారికిని క్రొత్తగ యొడంబడిక జరిగినదని మీరు నాకు తెలియపరుచుచు వ్రాసినఉత్తరము నాకుచేరినది. మీరుపంపించిన సదరు ఒడంబడిక నకలున్ను చేరినది. అందలి సంగతులను గ్రహించినాను. వానిని కాలిన్సుకూడ నాకు తెలియజెప్పినాడు. లోగడ నాకును పీష్వాకును ఉన్న ఒడంబడికలనుబట్టి అతని రాజ్యవ్యవహారములన్నియు నా సలహా సంప్రదింపులతో జరుగవలసియుండెను. ఈయేర్పాటునకు యింతవరకు మా యుభయులలో యెవరుగాని భంగముగ ప్రవర్తించియుండలేదు. అట్లయ్యును, మీకును, పీష్వాకును యిటీవల జరిగిన క్రొత్తఒడంబడికసంగతి నాకింతవరకు యెవరుగాని చెప్పియుండలేదు. సదరు ఒడంబడిక సంగతి మీరు నాకిప్పుడు తెలియబరచినారు. పీష్వా యింతవరకు నాకేమియు తెలుపలేదు. కాబట్టి, నేను రాజారఘోజీ భాన్‌స్లేగారిని మీకాలిన్సు సమక్షమందే సంప్రదించి, యీ యొడంబడికలోని పూర్వాపర సందర్భములనన్నిటిని విపులముగ తెలిసికొనుటకై నమ్మకమైన పెద్దమనుష్యులను కొందరిని నాతరఫునను భాన్‌స్లేగారి తరఫునను పీష్వాగారివద్దకు పంపుటకు నిశ్చయించుకొంటిమి. ఇంకొకసంగతి యేమనగ:—మీకును పీష్వాకును బేసీన్‌వద్ద క్రొత్తగ జరిగిన యీయొడంబడికను తిరుగతోడవలయునను తలంపు నాకెంతమాత్రములేదు. అయితే, దీనికొక షరతుమాత్రమున్నది. ఏమనగ, నేను మీయొడంబడికను భంగపరుపనట్లే, మీరుసు మాయొడంబడికను-అనగ-చిరకాలమునుండి నాకు, పీష్వాకును, రఘోజీ భాన్‌స్లేకు, తదితర మహారాష్ట్రులకును మధ్యగల యొడంబడికను—భంగపుచ్చరాదు. ఇది మన యుభయులకు ఉండవలసిన షరతు. ఈ షరతు మీదనైతే, నేను మీ క్రొత్త యొడంబడిక జోలికిరాను. (క్లుప్తము)]

సింధియా మిక్కిలి సబబుగ వ్రాసిన యీ యుత్తరమునకు గవర్నర్‌జనరల్ యేమియు సమాధానము చెప్పక కన్నములో తేలుకుట్టిన దొంగవలె- మెదలకుండ- ఊరకుండెను.

సింధియా వ్రాసిన జబాబులోని యీ చివరి మాటలకును, కాలిన్సు తన మే 29 తేదీ ఉత్తరములో వెల్లస్లీకి వ్రాసిన మాటలకును యెంత తేడా ఉన్నదో చూడుడు. అనగ సింధియాకు తనకు జరిగిన సంభాషణను కాలిన్సు వెల్లస్లీకి సరిగ చెప్పక, దానిని మార్చి, సింధియామీద వెల్లస్లీకి కొండెములు చెప్పెనని స్పష్టమగుచున్నది. ఎట్లయినను, యుద్ధము తెప్పింపవలయునని కాలిన్సు చూచుచుండెను. ఇందుకు వెల్లస్లీయు అనుకూలుడుగానే యుండెను. కాబట్టి, సింధియాపై కొండెములుచెప్పి వెల్లస్లీని యుద్ధములోనికి దింపవలయునని కాలిన్సు చూచుచుండెను.

వెల్లస్లీ సీమడైరెక్టర్ల కండ్లుగప్పుట.

అట్లే వెల్లస్లీయు సీమడైరక్టర్ల కండ్లుగప్పి, మాయమాటలచే వారిని లాలించి, పైకి యుద్ధముచేయననియే వారికి చెప్పుచు, లోలోన యుద్ధసన్నాహములనన్నిటిని చేయుచుండెను. సీమడైరక్టర్లు కేవలము రూపాయలు అణాలు పైసలు లెక్కపెట్టుకొను బచ్చులగుటచే వారికి యుద్ధములు గిట్టవని వెల్లస్లీకి బాగుగ తెలియును. కాని తనమట్టుకు తాను యుద్ధములుచేసి పరరాజ్యముల మ్రింగి ప్రఖ్యాతి గణించవలెనను దురాశ వెల్లస్లీకి వుండెను. కాబట్టి, పైకి యుద్ధముచేయనని తన యజమానులగు కంపెనీ డైరక్టర్లకు చెప్పుచు, వారికండ్లకు గంతలుకట్టుట వెల్లస్లీకి అవసరమయ్యెను. అందుచేతనే, బాజీరావు పీష్వాతో బేసిన్ ఒడంబడిక చేసుకొన్నప్పటికి అతడందులోనుండి తప్పించుకో గోరినయెడల దానికి తాను అభ్యంతరము పెట్టననియు, యిందుకొరకై మహారాష్ట్రులతో యుద్ధమునకు దిగననియు వెల్లస్లీ 1803 సం॥ ఫిబ్రవరి 10-వ తేదీననే డైరక్టర్లకు వ్రాసియుండెను. ఇది కేవలము వారి కండ్లు గప్పుటకై వ్రాసిన ఉత్తరము కాని వేరొండుకాదు. ఇందుకు సుప్రసిద్ధ చరిత్రకారుడగు మిల్లే సాక్ష్యము. మిల్లు యిట్లు వ్రాయుచున్నాడు :—

టిప్పూతోడి యుద్ధముతప్ప యిండియాలోజరిగిన తక్కినయుద్ధములన్నియు ఇంగ్లండులోని ప్రజలకు చాల అయిష్టముగనుండెను. ఈసంగతి వెల్లస్లీకి తెలియును. తనహయాములో కంపెనీవారి నెత్తిపై యిదివరకే పెద్దఋణభారము పడెననియు అతనికి తెలియును. ఇకవిరివిగ క్రొత్తయుద్ధములు సాగించేయెడల యీఋణభారము మరింతహెచ్చయి, తనకోమటి యజమానులగు కంపెనీ భాగస్వాములవల్ల చివాట్లువచ్చుననియు వెల్లస్లీకి లోపల భయమున్నది. అందుచేతనే యితడు డైరెక్టర్లకువ్రాసే ప్రతిఉత్తరములోకూడ విధిలేక యుద్ధము నానెత్తిన పడినది, నేనేమిచేసేది అని యేమేమో టక్కరిసాకులు చెప్పచుండెను.—క్షుప్లము—Vol. VI. P. 306.]

"మా యొడంబడిక జోలికిరాకపోతే మీ యొడంబడిక జోలికిరాము" అని సింధియా వ్రాసిన ఉత్తరము సంగతి వెల్లస్లీ డైరెక్టర్లకు తెలియపరచనేలేదు. *

---

* ఈ సంగతిచెప్పితే బేసిన్ సంధిని రద్దుపరచవలసినదని డైరెక్టర్లు అంటారేమోయని వెల్లస్లీ భయము.

ఏలననగ, యీ యొడంబడిక మొదటినుండియు డైరక్టర్లకు యిష్టము లేకుండనే యుండెను. ఇందువల్ల మహారాష్ట్రులతో అనవసరముగ పోరాటమువచ్చి తమ డబ్బంతా ఖర్చయి పోతుందని వారు భయపడుచుండిరి. 1804 సం॥ మార్చి 6-వ తేదీన డైరెక్టర్ల రహస్యపు సంఘమువారు యిట్లని వ్రాసిరి :—

[మహారాష్ట్ర నాయకులలో యెవరితోగాని యుద్ధమునకుదిగి, డబ్బంతా పాడుచేసుకోవడం మా మతముకాదు. అట్టి పోరాటమురాకుండ తప్పించుకోవలెననియే సదా మాకోరిక. అయినప్పటికి, నీవు పీష్వాతో బేసిన్ వద్ద చేసుకొన్న సంధివల్ల మా యీ కోర్కెకు కేవలము వ్యతిరేకమైన ఫలితము గలిగినది. కాబట్టి, యిప్పటికైనను మీరీదిగువ పనులు చేస్తే బాగుంటుంది.

బేసిన్ సంధిలో ముఖ్యముగ 3, 17 క్లాజులు మహారాష్ట్ర నాయకులకు కోపకారణముగనున్నవి. మన ఇంగ్లీషు అద్దె సేనలు పీష్వా రాజ్యములో సుస్థిరముగనుండునట్లు-3 వక్లాజు చెప్పుచున్నది. ఇంగ్లీషువారితో చెప్పకుండ పీష్వా యెవరితోగాని యుద్ధమునకు దిగరాదని 17 వక్లాజు చెప్పుచున్నది. (అయితే ఇంగ్లీషువారు మాత్రము పీష్వాతో చెప్పకుండ యెవరితోనైనా కయ్యమునకు దిగవచ్చునట !) ఈ రెండు క్లాజులు మహారాష్ట్ర నాయకుల కందరికి కంటకముగ నున్నవి.

కాబట్టి మాకోరిక యేమనగ :—సదరు సంధి ప్రకారము మనము పీష్వా కివ్వవలసిన రక్షణను యిచ్చుచుండవలసినదే. అయితే, అతనికొరకు కాక, కేవలము మనమేలుకొరకే చేర్చబడిన కొన్ని షరతులను మనము కొంచెము వదలుకుంటే బాగుంటుంది. మనయద్దెసేనను తన రాజ్య మధ్యమందు పెట్టుకొనుటకు పీష్వా మొదట యిష్టపడలేదను సంగతి మీకు తెలియునుగద. దీనికి తోడు అసలీ యొండబడికకే తక్కిన మహారాష్ట్ర నాయకులందరు మనపై కోపము వహించియున్నారను సంగతికూడ మీకు తెలియునుగద. కాబట్టి యీ ఒక్క షరతునైనా (3-వ షరతునైనా) మనము వదలుకుంటే బాగుంటుంది. ఇందువల్ల పీష్వాకు కొంత తృప్తి కలిగించిన వార మవుతాము. మరియు, తదితర నాయకుల మనస్సులలోనున్న ముఖ్యమగు అభ్యంతరమునుకూడ తొలగించిన వారమైతిమని మనము సంతోషించవచ్చును. (క్లుప్తము.)]

యుద్ధము ప్రారంభమై కొంతదూరము జరిగిన తరువాతకూడ, జయించుకున్న దేశములను వదలివేస్తే బాగుంటుందని సీమడైరక్టర్లు వెల్లస్లీకి వ్రాసిరి. మహారాష్ట్రులతో వెల్లస్లీ తెచ్చిపెట్టిన యీ చిక్కులన్ని డైరక్టర్ల కెంతవరకు యిష్టము లేకుండెనో దీనినిబట్టి స్పష్టమగుచున్నది.

తనకు జులై 31-వ తేదీన అందిన సింధియా జాబులోని సంగతులు వెల్లస్లీ సీమడైరక్టర్లకు తెలియపరచలేదని చెప్పితిమి. మిక్కిలి సబబుగనున్న అందలి సంగతులను డైరక్టర్లు చూచియుంటే వారు వెల్లస్లీనే చివాట్లుపెట్టి, అతడు కుదిర్చిన బేసిన్ సంధిని పూర్తిగ రద్దుపరచవలసినదనియే యాజ్ఞాపించెడివారు. కాని, ఈ ఉత్తరమును వెల్లస్లీ త్రొక్కిపట్టి యుంచుటచేత, సింధియా భాన్స్లేల సంగతి

తెలియక, వారు యీ మహారాష్ట్ర నాయకులపై అపోహపడ సాగిరి. ఎంతసేపును ఒకపక్షమునుండి వెల్లస్లీ చెప్పుమాటలే వారు వినుచున్నారుగాని, రెండవ పక్షము నుండి మహారాష్ట్ర నాయకులు చెప్పుమాటలను వారు వినుటలేదుగద. అందుచేత యుద్ధజ్వరముచే పీడింపబడుచున్న వెల్లస్లీ యెల్లప్పుడు మహారాష్ట్ర నాయకులపైననే తప్పువేసి, తానుమట్టుకు యెదుటివారి దుష్ప్రవర్తనచే విధిలేక యుద్ధమునకు దిగవలసివచ్చిన అమాయికపు పెద్దమనిషివలె డైరక్టర్లకు కనబడు చుండెడివాడు. అట్లుగానిచో, డైరక్టర్లు సింధియా భాన్స్లేలగూర్చి యీ దిగువ చెప్పబోవురీతిగ వ్యతిరేకాభిప్రాయములను వెల్లడించి యుండరు:—

[తమకు ప్రధాన నాయకుడగు ప్రభువును పరరాజ్యాధికారము కింద పెట్టునట్టి సంధి షరతులగూర్చి విన్నప్పుడు స్వాతంత్ర్య ప్రియులగు యే దేశజులకుగాని కష్టము తోచుట సహజమే. ఈ సంగతి మాకు తెలియును. అయినప్పటికి యీ యుద్ధ ప్రారంభమునకు ముందు, సింధియా, భాన్స్లేలు చూపిన మోసపు ప్రవర్తన గర్హ్యముగనున్నది. బేసిన్ సంధిలో తమకు కష్టముగ తోచిన షరతులనుగూర్చి మనకు బహిరంగముగ చెప్పి, సామోపాయములచే వానిని తొలగించుకొనుటకు యత్నించుటకు మారుగ, వారు తమకేమియు అభ్యంతరములులేవని పైకి చెప్పుచు, లోలోన మోసముగ ప్రవర్తించిరి..................క్లుప్తము.]

జులై 31-వ తేదీన వెల్లస్లీకి చేరిన సింధియా యుత్తరమును, అందు ముఖ్యముగ దాని చివర భాగమును యీ డైరక్టర్లు చూచియున్నచో, వారీ పైవాక్యములను వ్రాసెడివారుకారు. ఆయుత్తరమును చదివిచూచినట్లయితే బేసిన్ సంధియెడ సింధియాకు గల అసంతృప్తియు, దానిని తొలగించుకొనుటకు తాను సామోపాయములతో చేయుచున్న ప్రయత్నమును, నిష్పాక్షికుడగు యెవనికైనను వెల్లడి కాగలదు. అందు మోసమేమియులేదు. మోసప్రవర్తనకు గడంగినది వెల్లస్లీయేగాని, సింధియాకాదు. శాంతిమార్గమున సదరు సంధినిగూర్చి సంప్రదించుకొనుటకైనను, సింధియా భాన్స్లేలకు అవకాశమివ్వక, వారిని చెదరగొట్టినది ఇంగ్లీషువారుగాక మరి యెవ్వరు? ఈ బేసిన్ యొడంబడిక "మీ స్వాతంత్ర్యమునుగాని, హక్కులనుగాని భంగపరుపదు; పైగా అది మీ మహారాష్ట్ర శాఖలకన్నిటికి యెక్కువ బలమును భద్రతను చేకూర్చును. కాబట్టి, మీరుకూడ మా అద్దెసేనలను తీసుకోండి" అని మోసపు మాటలను చెప్పినదెవరు? వెల్లస్లీకాదా! "ఈ యద్దెసేనల స్కీములో ఒక్కడుపడితే, అంతా సులభముగ పడతారు-ఇకవారంతా మనకు దాసులౌతారు" అనిగదా లోగడ వెల్లస్లీ పలుసార్లు చెప్పియుండెను. పరుల స్వాతంత్ర్యమును హరింపు తలంపుతో పన్నిన అద్దెసేనల స్కీము "మీకు చాలా మంచిది; మీ శరీరానికి బలముచేస్తుంది, దీనిని పుచ్చుకోండి" అని చెప్పడము వెల్లస్లీయొక్క కుచ్ఛితప్రవర్తనను తెలియపరచుటలేదా?

ఈతని మోసబుద్ధిని భాన్స్లే, సింధియాలు గ్రహింపలేక పోలేదు. బేసిన్ సంధి మహారాష్ట్ర సామ్రాజ్య నాశనమునకు వచ్చినదని వారు గుర్తించిరి. కాబట్టి,

యిరుగు పొరుగు రాజ్యముల కుండవలసిన నీతిధర్మములకు విరుద్ధముగ పీష్వాను మోసగించి, కయ్యమునకు కాలు ద్రవ్వినది వెల్లస్లీయే యనుట స్పష్టము.

మహారాష్ట్ర స్వాతంత్ర్య హరణకారణమగు బేసిన్ ఒడంబడికనుండి యెట్లయిన తప్పించుకొని బయటపడుదమని పీష్వా బాజీరావు తంటాలుపడుచున్న సంగతి వెల్లస్లీకి తెలియును.

[సంధి షరతుల ప్రకారము పీష్వా యెంతమాత్రము జరుపలేదు. అతడు మనకిచ్చెదనన్న సంపదలో కొంచముకూడ యివ్వలేదు. మనకింతవరకు అతనివల్ల కొంచమైనను గుటకదిగలేదు. ఇతడిందులోనుంచి తప్పించుకోవాలని చూస్తున్నట్లున్నాడు. సింధియా, భాన్స్లేలకు కూడ కబురు పంపించినాడట. ఈ సంధి వ్యవహారమేమియు సవ్యంగా నడిచేటట్టులేదు. ఇక మన యిష్టము వచ్చినట్లు చేసుకుంటేనేగాని వీలులేనట్లున్నది—క్లుప్తము.]

అని ఆర్థర్ వెల్లస్లీ 1803 సం॥ జూన్ 4, 19 తేదీలలో స్టూఆర్టుకు వ్రాసిన ఉత్తరములు చెప్పుచున్నవి. కాబట్టి తప్పు యేదైనావుంటే పీష్వా బాజీరావులో నున్నదిగాని, తదితర నాయకులలో లేదు. బాజీరావు యెప్పుడైతే యీ సంధి నుండి తప్పించుకోవాలని చూస్తున్నట్లు తనకు తెలిసిందో, అప్పుడు వెల్లస్లీ న్యాయ బుద్ధిగలవాడైతే యీ దిగువ చెప్పబోవు మార్గములలో యేదో ఒకదానిని అవలంబించ వలసియుండెను.

(1) తన సీమయజమానులకు వ్రాసియున్న ప్రకారము పీష్వాను యీ యురిలోనుండి వదలివేయనైన వదలివేయవలెను. లేదా, (2) పీష్వాను శిక్షించనైన శిక్షించవలెను. కాని, యీ రెండు పనులను చేయక, వెల్లస్లీ తక్కిన మహారాష్ట్రనాయకులపై దండయాత్ర సాగించెను.

మహారాష్ట్ర వ్యవహారముల నన్నిటిని వెల్లస్లీ తన తమ్ముడగు ఆర్థర్ చేతిలో అప్పగించి, వారితో సంధి చేసుకొనుటకుగాని, యుద్ధము చేయుటకుగాని, సర్వాధికారములను అతనిచేతిలో పెట్టెను. తన యధికారముల నిట్లు యింకొకనికి అప్పగించుట పార్లమెంటు చట్టరీత్యా అశాస్త్రీయమని రైడర్, ఆడమ్, అను యిరువురు సుప్రసిద్ధ న్యాయశాస్త్రవేత్తలు వెల్లస్లీ యొక్క యీ చర్యను ఖండించియున్నారు.........ఇది విషయాంతరము.

వెల్లస్లీ తనతమ్ముని యుద్ధమునకు పురికొల్పుట -రహస్యపు జాబు

ఈ యుద్ధమునకు గడంగుటలో వెల్లస్లీకి గల ముఖ్యోద్దేశము "పరరాజ్య గ్రసనము" (Earth Hunger) అయినట్లు యితడు తన తమ్మునికి 1803 సం॥ జూన్ 27-వ తేదీన వ్రాసిన "బహురహస్యపు" టుత్తరమువలన తెలియగలదు. ఫలవంతమగు భాన్స్లే, సింధియాల రాజ్యములను గబళింపవలయునను బుద్ధి యితనికి పుట్టెను. ఈ యుత్తరమును చూడుడు :—

[ఈ ఉత్తరము అందగానే "మీ అభిప్రాయములేమిటో బహిరంగముగ చెప్పివేయండి ఇదిగో మీకన్నిరోజులు వాయిదాయిస్తున్నాము" అని నీవు కాలిన్సుచేత సింధియా, భాన్స్లేలను అడిగించవలెను. యుద్ధమునకు అనుకూలముగ మనసేనలను తిప్పుకోడానికి అక్కడ అప్పుడున్న వర్షాధికపరిస్థితులనుబట్టి యెంతవ్యవధి మనకు కావలసివుంటుందో చూచుకొని, అంతవ్యవధినే నీవు సింధియా భాన్స్లేల కివ్వవలెను. వారిచ్చు సమాధానము తృప్తిగ లేదని నీకుతోస్తే, కాలిన్సును వెంటనే తగు బందోబస్తుతో నీ శిబిరానికి పిలిపించుకో. యుద్ధము వచ్చేటట్టయితే, సింధియా భాన్స్లేల సైనికబలమునంతను నీవు యెట్లాగైనా సరే నాశనంచేసి వేసెయ్యాలి. ఇద్దరిది కాకపోయినా, ఆఖరుకు ఒకర్రిదైనా నీవు నాశనంచేసివెయ్యాలి. సింధియా తాలూకు ఫిరంగిదళమును, యూరోపియనుదళమును, అతనివద్దనున్న సైనిక సామగ్రిని యావత్తు నాశనంచేసి వెయ్యడం అన్నిటికంటె ముఖ్యమైనసంగతియని జ్ఞాపకంపెట్టుకో. సింధియాను భాన్స్లేను, (ఆమనుష్యులనే) పట్టుకుంటే, బలే, మరీమంచిది. ఇంక చెప్పావు? యుద్ధము వచ్చేటట్టయితే, సింధియా హోల్కారులవద్దను, నీకు యెదురునిలిచిన ప్రతినాయకుని వద్దనువున్న యూరోపియను ఆఫీసర్లనందరిని నీవు తప్పక తిరుగదీయవలెను. ఇందువిషయమై నీవెంతడబ్బు ఖర్చుపెట్టినాసరే—మనకుబాగా పనికివచ్చేవాళ్ళను యెవళ్ళను ప్రయోగించినా సరే. యుద్ధమువచ్చేటట్టయితే గోహడ్ రాణావద్దకు, రాజపుత్ర ప్రముఖులవద్దకు తగినవాళ్ళను నేనేపంపిస్తాను. సదరు రాజపుత్రులనందరిని సింధియామీదికి ఉసుగొలుపడానికి నీవు యేపని చేసినాసరే నాకిష్టమే. కాశీరావు హోల్కారును జస్వంతరావు హోల్కారుమీదికి ఉసుగొలుపడానికి యేపనిచేస్తే బాగుంటుందో నీవు ఆలోచించు............మనము మహారాష్ట్రములో బాగుగా పాతుకున్నామంటే, ఫ్రెంచివారు మననేమియు చేయలేరు. సింధియా త్వరలోనే క్రుంగిపోవడం నిశ్చయం. అంతటితో ఫ్రెంచివారికికూడ చావుదెబ్బతగులుతుంది.—క్లుప్తము. (Duke of Wellington's—Despatches, Vol. I Pp. 203—206)

సింధియా దర్బారులో ఫ్రెంచివారి పలుకుబడి హెచ్చుగనున్నదనియు, ఆకారణముచేతనే ఫ్రెంచివారి పలుకుబడిని ఇండియాలో అణచివేయుటకే తాసీ యుద్ధమునకు దిగుటకు కారణమైనదనియు, వెల్లస్లీ యీయుత్తరములో సూచించెను. ఇదియు అతడు సీమ డైరక్టర్లను మోసపుచ్చుటకు వేసిన యెత్తే. ఏలననగ, ఆరోజులలో యూరపు ఖండములో ఇంగ్లీషువారికిని ఫ్రెంచివారికిని పచ్చగడ్డవేస్తే మండుచున్నది - యూరపుఖండములోగల యావన్మందిరాజ్యములవారిని ఫ్రెంచివారి మీదికి ఉసుగొలుపడానికి ఆరోజులలో ఇంగ్లీషుప్రధాని పిట్టుమంత్రి సదరు రాజ్యములవారందరికి మంచినీళ్ళప్రాయముగ లంచముల గురిపించుచుండెను. కాబట్టి: ఇండియాలోకూడ ఫ్రెంచివారి పొగరు అణచడానికే నేనీయుద్ధము చేస్తున్నానంటే ఇంగ్లండు ప్రజలు, కంపెనీ భాగస్వాములు, చంకలు గొట్టుకొని సంతోషిస్తారుగదా యను టక్కరు తలంపుతో వెల్లస్లీ యీయెత్తువేసెను. ఇంతకు మిక్కిలి యిందు విశేషమేమియు లేదు.

మహారాష్ట్రులతో యుద్ధమునుగాని, శాంతినిగాని, చేసికొనుటకు వెల్లస్లీ తన తమ్మునికి సర్వాధికారము నిచ్చుటయేగాక, అయోధ్యలో యుద్ధసన్నాహములు

లేక్ సేనానికి హుషార్.

చేయుచున్న లేక్ సేనానికికూడ కొన్ని సలహాలను పంపెను. నీవు నావద్దనుండి ఉత్తరము రాగానే అన్ని ముఖములయందు తయారుచేసి యుంచిన సేనలన్నింటిని శత్రువులకు యుద్ధ సవ్వడి ఎంత మాత్రము తగుల నీయకుండ సింధియా రాజ్యముమీదికి నడిపించవలెను! అని గవర్నర్ జనరల్ వెల్లస్లీ లేక్ సేనానికి వ్రాసెను. అదిగాక, సింధియా తాలూకు తాబేదారులను, ప్రజలను లంచములిచ్చి తిరుగదీయుటకై ఏయేపనులను లేక్ సేనాని చేయవలయునో విపులముగా వివరించుచు వెల్లస్లీ ఆతనికొక పెద్ద జాబును పంపించెను. ఆజాబులో మొదటినుండి చివరవరకు కౌటిల్యముతప్ప ఇంకేమియు కనుపింపదు. ఇది చాలాముఖ్యమును పెద్దదియునగుటచే దీనిని వెల్లస్లీ రికార్డులలో పాఠకులు చూడదగును. Marquis Wellesly's Despatches vol. 3 Pages 167 to 170)

రాయబారుల రణదాహము

ఈరీతిగ మహారాష్ట్రులతో వ్యవహారము నడుపుటకు గవర్నరు జనరలుచే నియమింపబడిన ముగ్గురును - అనగా ఆర్థర్, లేక్, కాలిన్సులు ముగ్గురును రణదాహముచే తప్పించు చున్నవారే! కావున, యిక మహారాష్ట్రులతో యుద్ధముపొసగక ఎట్లుండును? సింధియా దర్బారులో రెసిడెంటుగానున్న కాలిన్సు సింధియాయెడ అగౌరవముగా ప్రవర్తించి తప్పక యుద్ధము పొసగునట్లుచేసి, అక్కడనుండి వచ్చివేసెను. కాలిన్సు ఇట్లు సింధియా దర్బారునుండి ఆఖరు పర్యాయము వచ్చివేయు సందర్భములనుగూర్చి ఇటగొంత వివరింతుము.

కాలిన్సు మరల సింధియా దర్బారుకు వెళ్లిననాటినుండి ఆతడు సింధియాను స్వయముగా దర్శించలేదు. తనకు మారుగా తనయేజంటు గణపతిరాయిని సింధియా వద్దకు పంపుచుండెను. ఇది సింధియాయెడ కాలిన్సు అగౌరము చూపినట్లు భావింప

కాలిన్సు సింధియా దర్బారునుండి వచ్చివేయుట.

వలసియున్నది. అయినప్పటికి దౌలత్‌రావు గణపతిరాయికి కొలువిచ్చి జూన్ 11 వ తేదీన ఆతనితో మాట్లాడెను. ఇరువురకు జరిగిన సంభాషణ గణపతిరాయుడు ఎంతవరకు సరిగా కాలిన్సుకు తెలిపెనో తెలియదు. కాని, అందుపై కాలిన్సు గవర్నరు జనరలు కిట్లువ్రాసెను.

["సింధియా దర్బారువారు తమకు అదను చిక్కువరకు కేవలము కాలహరణము చేయవలయునను తలంపుతో ఇంతవఱకు మనకేమియు ఖండితమగు జబాబుచెప్పక తప్పించుకొనుచున్నట్లు నాకు తోచుచున్నది. అదిగాక, జస్వంతరావు హోల్కారుకూడ బయలుదేరి సింధియాతో చేరుటకు వచ్చుచున్నట్లు నాకు తెలిసినది. కాబట్టి, నెయ్యమో, కయ్యమో నాకేదోయొకమాట తేల్చి తత్‌క్షణమే ఖండితముగా చెప్పండి, అని నేను దౌలత్‌రావుకొక అర్జీనిపంపితిని. సదరుఅర్జీ నకలును మీ కిందుతో పంపుచున్నాను."]

ఈ అర్జీని చూచినట్లయితే కాలిన్సుయొక్క పొగరుబోతుతనము అగౌరవ ప్రవర్తన తెలియగలదు. ఈ అర్జీధోరణి మరియాదగా లేదని ఈ క్రింది మాటల వలన తెలియగలదు.

["కర్నలు కాలిన్సు గట్టిగాకోరుచున్న సమాధానము మహారాజా యివ్వనిచో కర్నలు గారికి కొన్ని గుఱ్ఱములను మహారాజా సప్లయిచేసి అవురంగాబాదువఱకు పంపించవలయును. మరియు, ఔరంగాబాదు చేరువఱకు కర్నలుగారి సిపాయిలకును, సిబ్బందీలకును కావలసిన ధాన్యము మొదలగు ఆహారపదార్థములను మహారాజా సప్లయిచేసి పంపవలయును."]

ఈ అర్జీని కాలిన్సు ఏజంటు సింధియా మహారాజు చేతికిచ్చి దానికి తత్‌క్షణమే జవాబు వ్రాసి యివ్వమని అడిగెను. ఆలోచించుకొనుటకు కూడా సింధియాకు యేజెంటు వ్యవధి నివ్వలేదు. ఏజెంటు తొందరపెట్టిన కారణముచేత సింధియా కాలిన్సుతో ఫలానవిధముగా చెప్పవలసినదని సదరు యేజెంటుకు చెప్పెను. ఆ మాటలన్ని కాగితముమీద వ్రాసి యివ్వవలసినదని యేజంటు కోరెను. కాని, సింధియా వ్రాసియిచ్చులోపలనే యేజంటు అచట నిలువక వెడలిపోయెను. అంతట కాలిన్సు క్షణమైనను నిలువక గవర్నరు జనరల్‌కు సింధియాపై దురభిప్రాయము కలుగునట్లు 1803 జూన్ 12-వ తేదీన ఇట్లు వ్రాసెను.''

["మన ఏజంట్లు ఇపుడే సింధియానుండివచ్చినారు. తానింకను బీరారురాజగు రఘోజీ భాన్‌స్లేతో సంప్రతించలేదనియు, రెండుమూడు రోజులలో తన సమాధానము పంపెదననియు సింధియా చెప్పినాడట. ఈ మాటలే వ్రాసి యివ్వవలసినదని మన ఏజంటుకోరగా సింధియా అందుకు ఒప్పకోలేదట. అంతట మన ఏజంట్లిద్దరు వచ్చివేసినారు. వారీకబురు చెప్పగానే నేను దౌలత్‌రావు సింధియాకు ఉత్తరము వ్రాసివేసినాను. " మీధోరణి నాకు చాలావిచార కరముగనున్నది. మీజవాబు ఆఖరు జవాబుగా ఎంచుకుంటున్నాను. నేనిక ఇక్కడ ఉండను. అవురంగబాదు వెళ్ళిపోవుచున్నాను. నాప్రయాణానికి కావలసిన సామాగ్రియావత్తు తత్‌క్షణమే సప్లయి చేయించవలసినది' అని నేను సింధియాకు వ్రాసివేసినాను."]

మహారాష్ట్రులతో ఎట్లైన కజ్జాపెట్టుకొనవలెనని గూర్చున్నవాడగుటచే కాలిన్సు ఈ రీతిగా సింధియాదర్బారునుండి సింధియాను చూడకుండగనే ఆత్రముతో వచ్చివేసెను. * కాలిన్సు గవర్నరు జనరలుకు ఈరీతిగ ఉత్తరమువ్రాసిన 24 గంటల లోపలనే సింధియానుండి ఆతనికి ఈక్రింది జాబువచ్చెను.

[" మీరు పంపిన ఉత్తరమందినది. మన ఉభయుల రాజ్యముల యోగక్షేమములు ఒక్కటే. మన ఉభయులకు మైత్రిని సుస్థిరమొనర్చుటకై కంపెనీవారు మిమ్ములనిక్కడికి పంపియున్నారు. ఈమధ్యవర్షములవల్ల నేనుతిరిగి రాజా రఘోజీ భాన్‌స్లేగారిని చూడబోవుటకు అవకాశము లేకపోయినది. వర్షములు ఆగగానే నేను భాన్‌స్లేగారినిచూచి, వారితో సంప్రదించి మీకు సమాధానము పంపెదను. ఇకమీరు వెళ్ళిపోవు విషయమై మీరంతతొందర

*ఇందునుగూర్చిన వివరములు స్థలాంతరమందు వివరింతుము.

పడుట మంచిదిగాదు. ఈ సంగతి నేను మీరాయచారి గణపతిరాయిగారితో చెప్పిపంపి సాను.—క్లుప్తము.]

సింధియా పంపిన ఈజాబు ఎంత సుహృద్భావమును సూచించుచున్నదో చూడుడు. ఆతడు నెయ్యమును గోరుచున్నను, ఇంగ్లీషువారు కయ్యమును గోరు చుండిరి. కాలిన్సు సింధియాపై దురభిప్రాయము కలుగునట్లుగా వెల్లస్లీకి వ్రాసిన ఉత్తరము గవర్నరు జనరలుకు జులై 5-వ తేదీన చేరినది. ఈ ఉత్తరము చూచు కొన్నప్పుడు గవర్నర్ జనరలుకు గలిగిన సంబరమునకు మితిలేదు. గవర్నరు జనరలున్ను యుద్ధదాహముచే పరితపించుచుండెను. ఈ దాహము తీర్చగల యుద్ధ మును కాలిన్సు ప్రసగించినపుడు ఇక గవర్నర్ జనరలుకు పట్టరాని సంతోషము కలిగెను. యుద్ధము నిట్లు ప్రసగించినందులకు కాలిన్సు ప్రజ్ఞను, భక్తిని మెచ్చు కొనుచు ఆతనిని ఆకాశమంత ఎత్తు పొగడుచు గవర్నర్ జనరల్ తన సెక్రటరీచేత కాలిన్సుకు మరునాడే ఉత్తరము వ్రాయించెను.

వెల్లస్లీ యుద్ధమునకు దిప్పింప నుంకించుట.

ఇక యుద్ధము ప్రారంభమగుటయే తడవుగానుండెను. కాలిన్సునుండి ఈ వుత్తరము రాగానే గవర్నరు జనరల్ వెల్లస్లీ లేక్ సేనానికి బహురహస్యపు టుత్తరము నిట్లని వ్రాసెను.

[“కాలిన్సు నుండి ఇపుడే ఉత్తరమువచ్చినది. అది చూడగానే యుద్ధమును ప్రారంభించుటకు నేను నిశ్చయించుకొన్నాను. సింధియాపై చేయవలసిన యుద్ధవ్యూహముల నన్నింటిని నేనిదివఱకేనీకు జూన్ 28-వ తేదీ ఉత్తరములో తెలిపియుంటిని. ఆప్రకారమిప్పుడు యుద్ధమును నడుపుటకు సమయమువచ్చినది. నేనికనుండి రోజు రోజు నీకు వ్రాస్తూవుంటాను. ప్రస్తుత మీఉత్తరము మాత్రము క్షణమాలస్యము లేకుండా పంపుచున్నాను. కాలహరణము చేయవలయునని సింధియా చూచుచున్నాడు. కాని తత్క్షణమే యుద్ధరంగములోనికి దుమకవలెనని నేను చూచుచున్నాను. అక్టోబరు నెలలోపుగా మనమెట్లయినను యుద్ధము ప్రారంభించి తీరవలెను. ఆగ్రాకోటను మనము పట్టుకుంటే బలేబాగుంటుంది. నిజమైనదెబ్బ అంటే అది! వీలైతే ఒక చెయ్యిచూడు.........క్లుప్తము.]

భరత ఖండములో ఇంగ్లీషువారు కాలూని నిలిచి, తమరాజ్యము నిచ్చట నెలకొల్పుకొనుటకు మొదట తోడ్పడిన సింధియా భోంస్లేల రాజ్యమును రక్త

సీమ యజమానుల వ్యతిరేకపు హుకుము – వెల్లస్లీ డోలాయమానము–“కింకర్తవ్యతా” మాఢ్యము.

సిక్తమొనర్చుటకై గవర్నరు జనరల్ వెల్లస్లీ ఈ రీతిగా దుముకనున్న క్షణమందే ఆకస్మికముగా ఇంగ్లండునుండి ఇండియా మంత్రి కాసర్‌లే ప్రభువు నుండి రెండు ఉత్తరములు వచ్చెను. ఈ ఉత్తర ములు వెల్లస్లీ మనసును చికాకుపరచి ఆతనిని యుద్ధముచేయుదునా వద్దాయను ఆందోళనలో పడవైచెను. ఫిబ్రవరి నెలలో వ్రాసిన ఈ ఉత్తరములు ఇంగ్లాండు నుండి ఇండియాకు అయిదు నెలలకు జూన్ 6-వ తేదీన చేరెను.

వాని సారాంశమేమనగా:—[ఇండియాలో మనరాజ్యము బాగుగ పాతుకొని, బలిష్ఠమైయున్నది. ఫ్రెంచివారివల్ల యూరపులో మనకెట్టి భయమున్నను, ఇండియాలో మాత్రము లేదు. కాబట్టి, మీరిదివరకు సూచించిన శాంతిమార్గములను ఇండియాలో అవలంబించి, కంపెనీ ఋణము తగ్గే యేర్పాటులు చేయవలసినది. ఖర్చులుపోగా మిగిలిన రివిన్యూను ఋణము తగ్గించడానికి వినియోగించవలెను.—క్లుప్తము.]

ఈ ఉత్తరములు చూచుకోగానే, యేమి చేయుటకును వెల్లస్లీకి తోచలేదు. తాను మహారాష్ట్రులతో పెద్ద యుద్ధము తలపెట్టుకొని, డబ్బును మంచినీళ్ళ ప్రవాహముగా ఖర్చుపెట్టడానికి సంచీమూతులు విప్పదీసుకొని కూర్చుండగ, యిదేమి ఖర్మము- డబ్బు ఖర్చుపెట్టవద్దని తన కోమటి యజమానులు హుకుముపంపినారే! ఈ సంకటస్థితిలో యేమిచేయవలెనో వెల్లస్లీకి తోచలేదు. లగ్నము పెట్టుకొని కూర్చున్న యుద్ధకార్యము మానుకొనవలెనా? లేక సాగించవలెనా?

అంతట అతడు తనకు ఆలోచన చెప్పుటకు తనవారి నందరిని జులై 11-వ తేదీన ప్రోగుచేసెను. వీరిలో ప్రధానుడు సర్ జార్జి బార్లో. ఇతడు సుప్రీము కౌన్సిలులో ప్రధాన సభ్యుడుగ నుండెను. వెల్లస్లీ తరువాత గవర్నర్ జనరల్ తక్తుకు యితనినే వారసుడుగ కంపెనీ డైరక్టర్లులోగడనే నామకరణము చేసియుండిరి. ఇతడు వెల్లస్లీకంటె యేడాకు లెక్కువ చదివినవాడే. ఈ సంగతిని తోడిదొంగయగు సర్ జాన్ మాల్కమే బయటపెట్టెను. అది యటుండనిండు. ఈ సర్ జార్జి బార్లో అప్పుడు ఇండియాలోనున్న బ్రిటిష్‌వారిలో ఉద్యోగరీత్యా ప్రధానుడగుటచే, ఆనాడతని సలహాయే ప్రధానముగ నుండెను. మహారాష్ట్రులతో తక్షణమే యుద్ధము ప్రకటించవలసినదని యితడు వెల్లస్లీకి గట్టిగ సలహాచెప్పెను. ఇందుకుగల కారణములనుగూడ ఆతడు జులై 12-వ తేదీన రికార్డు చేసియుండెను. అందుండి కొన్ని భాగముల నిట క్లుప్తముగ వివరింతుము:—

బార్లో సలహా-ఉపదేశము.

[మనమిప్పుడు యుద్ధము మానుకుంటే అందరు-మనశత్రువులు, మిత్రులుకూడ-యేమనుకుంటారు? యుద్ధములో గెలవలేమేమోయని భయముచేత మనము మానుకొన్నట్లు అందరు అనుకుంటారు. దానికి మనమెంత సబబుగ, యెన్ని కారణములు చెప్పినప్పటికి వారు నమ్మరు. వ్యవహార మింతదూరము సాగినతరువాత—మన రాయబారులందరు మహారాష్ట్రనాయకుల దర్బారులలో అంత లంతలేసి ప్రగల్భములుకొట్టివచ్చిన తరువాత—ఇన్నేళ్ళనుండి యెడతెగకుండ మనము సాధిస్తూవున్న పంథాను, మనకింత లాభదాయకముగనున్న పంథాను, ఆకస్మికముగ ఒక్కసారి యిప్పుడువదులుకొంటున్నామంటే, లోకులేమనుకుంటారు? మనముపీష్వాతో చేసుకొన్న సఖ్యమును పడగొట్టడానికి తక్కిన మహారాష్ట్రనాయకులందరు యేకమై వచ్చేటప్పటికల్లా మనకు హడలుపుట్టి, పారిపోయినామని లోకులనుకొనరా? ఈ హడలుచేత కాక

పోతే, ఇంగ్లీషువా రెందుకిట్లా పారిపోతారని వారనుకొనరా? మనము యితరసబబు లెన్ని చెప్పినా యెవరు నమ్ముతారు? మనమిప్పుడిట్లా వెనుకంజవేస్తే మనశత్రువు లేమనుకుంటారో, మనమిత్రు లేమనుకుంటారో, ఒక్కసారి ఆలోచించిచూడండి. మనబలమందు, మన సంరక్షణ సామర్థ్యమందు, మనమిత్రులకిప్పుడున్న నమ్మకము కొస్తాపోతుంది. మనలనుచూచి, "ఇంగ్లీషు వారు యుద్ధరంగమునుండి తోకముడతపెట్టారరో"యని ఇండియా నలుముఖముల మార్మోగు నట్లు గోలచేసి, మనశత్రువులు మనలనిక గేలిచేసి వెయ్యరా? ఇట్టిప్రచారములవల్ల ఇండియాలో మన ఇంగ్లీషురాజ్యమున కెంతదెబ్బతగులుతుందో తెలుసునా ?

ఒకవేళ మనము యుద్ధముమానుకొని, మన సేనలను వ్యూహస్థానములనుండి మరలించినను మనకిదివరకు పీష్వాయిచ్చిన రాజ్యభాగములు మనకిందనే వారు ఉండనిస్తారను నిశ్చయ మెక్కడ? వారు దానినిలాగికొనరా? మనము మానుకొన్నతరువాత పునహాలో అధికారస్థాన మును అధిష్టించబోవు మనశత్రువులు సదరు రాజ్యభాగములను మనలనుండి యూడబెరుకు కొనక వదలిపెట్టుతారా? "ఇంగ్లీషువారిసేనలు యుద్ధరంగములో చక్కగపన్నబడి, అనుకూల మగు వ్యూహస్థానముల నన్నిటిని ఆక్రమించుకొన్నప్పుడే, వారు మనకుభయపడి, యుద్ధమును మానుకొని పారిపోయిరిగదా; యికయిప్పుడు తిరిగి వారు తమసేనలను అట్టి మంచిస్థితిలోనికి సమకూర్చుకొని రాగలరా" యనుధిమాకుతో మనశత్రువులు మనరాజ్యముమీదికి కవ్వించివచ్చి మనచేతనున్న దేశమునుకొస్తా ఊడలాగికొనరా? ఇట్టిస్థితిలో మహారాష్ట్రులు మనల నేమి చేసినను చేసినవారే! కాబట్టి, అప్పుడైనను మనము వారితో యుద్ధమునకు పోకతప్పదు. అయితే అప్పుడు యిప్పుడున్నన్ని వీల్లు మనకుండవు. మనమప్పుడు పేరుప్రతిష్ఠలు పోగొట్టు కొని, అనుకూలవ్యూహస్థానములను పోగొట్టుకొని, డబ్బువగైరా సన్నాహసహాయములులేక, బహుశః యీలోగా యేఫ్రెంచివారోవచ్చి, యేమహారాష్ట్రనాయకునితోనో చేరుటకవకాశ మిచ్చినవారమై, యిన్ని చిక్కులతో—యిట్టి సంకటస్థితిలో-మనమప్పుడు యుద్ధరంగమునకు శత్రువులచేతనే ముక్కుపట్టుకొని యీడ్వబడి పోవలసిన వారమగుదుము. అప్పుడు మనము యుద్ధమును తప్పించుకొందమన్నను తప్పించుకొనలేము. కాబట్టి, యుద్ధమెట్లును తప్పనప్పుడు అననుకూలపరిస్థితులలో అప్పుడు మనము యుద్ధములోనికి యీడ్వబడుటకంటె, అనుకూలపరిస్థితు లలో యిప్పుడే మనము దుమికితే బాగుంటుంది.

అట్లుగాక, అననుకూల పరిస్థితులలో మనము పరులచేత యుద్ధములోనికి యీడ్వబడినా మంటే అప్పుడు మన కింగ్లండునుండి యిప్పటికంటె యెక్కువ చివాట్లేవస్తవి. అసలు పీష్వా బాజీరావుతో సంబంధముపెట్టుకొని, యీ బేసిన్ ఒడంబడిక చేసుకున్నందుకే ముందు మన వారు మనలను చివాట్లుపెట్టుదురు. తరువాత సదరు సంధినండి మానుకొన్నందుకు రెండవ సారి చివాట్లుపెట్టుదురు. పిమ్మట, యింత వ్యవహారములరేపెట్టి, అననుకూల పరిస్థితులలో శత్రువులచేత యుద్ధరంగమున కీడ్వబడి, ఓడింపబడి, రాజ్యమును, పేరు ప్రతిష్టలను పోగొట్టు కొన్నందుకు అన్నిటికంటె పెద్ద ప్రహారణములు మనకప్పుడు తగులును.

ఇక ఫ్రెంచివారి సంగతి చూతము. వారివల్ల మనకిప్పుడు ఇండియాలో తత్క్షణమేమియు ఉపద్రవము లేకపోయినప్పటికి, ఎప్పటికైనను వారు ఇండియాలోని మనరాజ్యమును బోర్ల ద్రోయవలెనని చూచుచున్నమాట నిశ్చయమేగద. నేడుగాకున్న రేపైనను వారు మనమీదికి

వచ్చుటముమ్మాటికి నిశ్చయముగద. కాబట్టి, యెప్పటికైనను యీ ఫ్రెంచి యుపద్రవమునుండి తప్పించుకోవాలంటే మనకొక్కటే మార్గమున్నది. బ్రిటిష్ వారి మద్దతులేనట్టిగాని, బ్రిటిష్ వారి సర్వసంపూర్ణాధికారములకు లోబడియుండనట్టిగాని యే దేశీయ సంస్థానమును మనము ఇండియాలో ఉండనివ్వకూడదు.

మనము మనమద్దతుచేత పీష్వాను యెప్పుడైతే పునహా సింహాసనముమీద కూర్చుండబెట్టినామో, అప్పుడే, ఆక్షణమందే—ఇండియాలోగల మిగతా దేశీయ రాజ్యములన్నికూడ మన కాలిక్రిందికి వచ్చివేసిన వన్నమాటే! పీష్వాతో గనుక మనమీసంబంధమును నిలుపుకున్నామంటే, యిక కొద్దిరోజులలో సింధియా, భాన్స్లేలు యిద్దరుకూడ పీష్వాక్రిందికి రాక తప్పదు—వారు ఉభయులు బేసిన్ సంధికి ఒప్పుకొన్నను, ఒప్పుకొనక పోయినను సరే—వారి కీగతి పట్టక తప్పదు. వారు బేసిన్ సంధికి ఒప్పుకుంటే సరేసరి. ఒకవేళ ఒప్పుకోకపోతే మరీమంచిది. వారిని ఒక్కదెబ్బలో తుడిచిపెట్టివేసి వెయ్యడానికి మనకు మంచిసాకు దొరుకుతుంది. అంతటితో వారిపీడ మనకు వదలిపోయి, పీష్వా మెడకు మనము వేసినబంధము మరింతబిగిసి, అతనివల్ల మనము రాబట్టుకోదలచిన లాభముల నన్నింటిని నిరాఘాటముగ రాబట్టుకొనుటకు మనకు మంచి అవకాశందొరుకుతుంది. ఇటువంటి వాటమైన అవకాశము మనకింకెప్పుడు దొరుకుతుంది? యావద్భారత దేశమును మనగుప్పెటలో పెట్టుకొని అడించుటకు మనకింకెప్పుడు అవకాశం చిక్కుతుంది? మనసైన్యాలు బాగుగ పోతరించి, సర్వసన్నాహములతో శత్రువులగుండెకాయలమీద కూర్చుండియున్నవి. శత్రువుల శిబిరములు మనకిప్పుడు నాలుగైదు అడుగుల దూరములోనున్నవి. వారికి డబ్బులేదు. తినుబండారములు లేవు. ఇతర సౌకర్యములేమియులేవు. వారు బహు చిక్కులలోనున్నారు. ఇప్పుడువారినందరిని మన ఒక్కదెబ్బలో చెదరగొట్టి పారవెయ్యవచ్చును. వారిని సమూలముగ హతమార్చివెయ్యడానికి మనకింతకంటె వాటమైన సమయమెప్పుడు దొరుకుతుంది? (**Marquis Wellesley's Despatches Vol. III, Pp. 185, etc.**)

తుదకు యుద్ధమే నిశ్చయింప బడుట.

బార్లో చెప్పిన పైవాక్యములను బట్టి ఇంగ్లీషువారు యెంతదూరము పోదలచుకొన్నదియు తెలియగలదు—మరియు, పైన పెద్ద అక్షరములలోని వాక్యములను బట్టి చూడగ, నేడు ఇండియాలోనున్న దేశీయ సంస్థానములు అట్లు నిలిచియుండుటకు గల కారణముకూడ స్పష్టముగా గలదు.

బార్లో చెప్పిన యీ సలహావలన గవర్నర్ జనరల్ వెల్లస్లీ మనస్సుకు హుషారు కలిగెను. ఇక యుద్ధము ప్రారంభించవలసినదని చెప్పుచు అతడు లేక్ సేనానికి 1803-వ సం॥ జులై 18-వ తేదీన ఒక రహస్యపు టుత్తరమును వ్రాసెను:—

[పరాసువారితో యుద్ధము నుపక్రమించుటకు మనమిప్పుడు మహారాష్ట్రులతో యుద్ధము సాగించుటయే తగిన సన్నాహమని నాతలంపు. పీష్వా మనవాడే కాబట్టి, మనమిప్పుడు కవ్వించవలసినది సింధియా, భాన్స్లేలనే. కాబట్టి, నీవు

బహురహస్యముగ పని ప్రారంభించి యిదివరకు తయారుచేసిన ప్లానులనన్నిటిని అమలు జరుపుటకు నీశాయశక్తుల ప్రయత్నించవలసినది—క్లుప్తము].

ఇంగ్లీషువారు యీ రీతిగ యుద్ధమునకు కావలసిన సన్నాహముల నన్నిటిని చేసుకొనుచుండగ, పాపము, మహారాష్ట్రులకు యీ గొడవయేలేదు. తాము శాంతినే గోరుచున్నామని చెప్పుటయేగాక, వారు యుద్ధసన్నాహముల వేనినిగాని చేసుకొనక పోవుటనుబట్టి చూడగ, వారు పైకొకమాటయు లోపల నొకమాటయు లేక నిజాయితీగనే యున్నారని స్పష్టమగుచున్నది. సింధియా రాజ్యములో వెట్టి యుద్ధసన్నాహములుగాని లేవని రెసిడెంటు కాలిన్సే తన జూన్ 12-వ తేదీ ఉత్తరములో స్పష్టముగ వ్రాసెను. సింధియా యుద్ధమే చేయదలచుకుంటే, అతడు మిక్కిలి ఫలవంతమగు విశాల దేశమునకు అధినాథుడై యున్నప్పుడు, యుద్ధమునకు కావలసిన సైనిక దళములను, ధనమును, యితర సామగ్రిని ప్రోగు చేసుకొనలేక పోయెడివాడా? ఈతడిట్టి పనుల వేనినిగాని చేసియుండక పోవుటయే అతని శాంతి ప్రియత్వమును చాటుచున్నది. సింధియాయొక్క ఈ శాంతి ప్రియత్వమే—యితడు యుద్ధసన్నాహములు చేసుకొనకుండుటయే—తమకు బలేవాటమైన అవకాశమని చెప్పి ఇంగ్లీషువారు యితనిమీదికి దుముక సమకట్టిరి. పరులు యుద్ధసన్నాహములు చేసుకొంటే "అదుగో, వారు మామీదికి కాలు త్రవ్వు చున్నారు కాబట్టి, మేము ఆత్మరక్షణార్థము యుద్ధముచేయక తప్పినది కాద"ని ఇంగ్లీషువారు సాకు చెప్పుదురు. ఇక, పరులు యుద్ధసన్నాహములు చేసుకొనకుండ ఊరకుంటే, "వారు యుద్ధసన్నాహములోలేరు కాబట్టి, వారిమీదికి దుముకడానికి మనకిదే మంచివాటమైన తరుణమని" చెప్పి ఇంగ్లీషువారు పరులపైకి పోదురు. ఈ రీతిగ, యెట్లయినను, పరుల హింసించ వలయునను వారికి సాకులు దొరకకపోవునా?

మహారాష్ట్రులు "తయ్యార్"లో లేరు.

శాంతిని గోరుచూ సింధియా భాన్స్లేలు వ్రాసిన ఉత్తరము లేమియు గవర్నర్ జనరల్ వెల్లస్లీకిగాని, సేనాపతి అతని తమ్ముడు ఆర్థరుకుగాని యెంత మాత్రము నచ్చలేదు. ఈ జాబులకు ఆర్థర్ వ్రాసిన జవాబులు చాల పొగరు బోతు తనముగనుండి, అతని కయ్యపు స్వభావమును మహారాష్ట్ర నాయకులకు కరతలామలక మొనర్చెను. ఆర్థర్ దౌలత్ రావుకు వ్రాసిన ఉత్తరము యుద్ధ ప్రకటన యుత్తరముగ నుండెను. నీవు తక్షణము వెనుకకు మరలిపోవలసినది—లేనిచో నీతో యుద్ధము తప్పదన్నట్లు ఆర్థర్ సింధియాకు వ్రాసెను. కాని, యే తేదీ లోగా సింధియా దక్కనునుండి మరలిపోవలెనో ఆర్థర్ సదరు ఉత్తరములో తెలుప లేదు. ఈ మాట బుద్ధి పూర్వకముగ వదలిపెట్టబడినది — ఇట్లు వ్యవధిని నిర్ణయించకుండ తానేల వదలివేసెనో ఆర్థరే తాను జులై 17-వ తేదీన పూనా రెసిడెంటుకు వ్రాసిన ఉత్తరములో చెప్పియుండెను.

[దౌలత్ రావు సింధియా దక్కనునుండి యెప్పుడు మరలిపోవలెనో నేను ఖండితముగ చెప్పలేదు. ఒక కారణమేమనగ :—యుద్ధము సరిగ యే రోజున ప్రారంభమగునో శత్రువులకు తెలుపకుండ నామనస్సులోనే వుంచుకొన దలుచు కున్నాను. ఇందువల్ల, యెవరికి తెలియకుండ ఆకస్మికముగ మొదటి దెబ్బను నేనే కొట్టడానికి నాకు అవకాశముంటుంది. ఇది ఒక కారణము. ఇక రెండవ కారణ మేమనగ :—ప్రస్తుత స్థితిగతులనుగూర్చి గవర్నర్ జనరల్ నుండియు, యూరపు నుండియుకూడ, యేమైన కొత్త హుకుములు వస్తవేమో యని నే నెదురుచూచు చున్నాను. ఇది రెండవ కారణము. ఇట్టి హుకుము లేమైన వచ్చేటట్లయితే వాని ననుసరించి, నా నడకను యెట్లు వీలుగవుంటే అట్లు మార్చుకోడానికి సందు ఉంచు కోవలెననే తలంపుతోనే నేను తేదీని నిర్ణయించకుండ సింధియాకు ఉత్తరము వ్రాసినాను.—క్లుప్తము]

ఈ జాబునుబట్టి ఆర్థర్ యొక్క మోసబుద్ధి స్పష్టమగు చున్నది. తనకు వాటమైన సమయము చూచుకొని అప్పుడేదో మిషకల్పించి అజాగ్రత్తగనున్న మేక పిల్లమీద దూకవచ్చునని యితడు దొంగతోడేలువలె పొంచియుండెను. తామింత వరకు యెట్టి యుద్ధ సన్నాహములుగాని చేసుకొనక పోయినను, యీ సమయమందు, ఇంగ్లీషువారు బెదరించిన బెదరింపులకు భయపడి వెనుకకు మరలుట తమకు వీరలక్షణము కాదని మహారాష్ట్ర నాయకులు తలంచిరి. అందుచే వారును ఆఖరు నిమిషమందు త్వరత్వరగ యుద్ధసన్నాహములు చేసుకొనగడంగిరి.

మహారాష్ట్రుల అవ్యవధి సన్నాహములు.

సింధియా దర్బారులోనున్న రెసిడెంటు కాలిన్సు సింధియా మహారాజుతో చెప్పకుండగనే వచ్చివేసెనని పైన చెప్పితిమి. ఇదియే యుద్ధప్రకటన చిహ్నము.

ఇట్లువచ్చివేయునప్పుడు కాలిన్సు తన మనస్సులోని ఉద్దేశ్యములనుగాని, ఇంగ్లీషు గవర్నమెంటువారి యుద్దేశ్యములనుగాని యిదమిద్ధమని సింధియాకు యెంతమాత్రము తెలియజెప్పలేదు. తానెందుకు అక్కడనుండి లేచిపోవుచున్నాడో కూడ అతడు సింధియాకు తెలుపలేదు. తుదకు మామూలు మర్యాద చొప్పుననైనను సింధియానుండి అతడు శలవు తీసికొనకుండగనే — అమర్యాదగ — లేచిపోయెను. ఈ సంగతిని మొదట పీష్వా తరఫున వకీలుగను, తదుపరి సింధియా మంత్రిగను పనిచేసిన "బాలాజీ కూంగర్" అన్నీ యుద్ధానంతరము (అనగ సింధియా ఓడిపోయి ఇంగ్లీషువారి దయాపాత్రమునకు వేచియున్నపుడు) 1805 సం॥ సెప్టంబరు నెలలో ఆర్థర్‌కు వ్రాసిన ఉత్తరములో చెప్పియుండెను. ఈ ఉత్తరము రికార్డులలో అచ్చుపడి యుండలేదు. కాని, కూంగర్ చెప్పిన యీ మాట అబద్ధమని ఆర్థర్ 1803 సం॥ అక్టోబరు 5-వ తేదీన సదరు

సామాన్య రణనీతికి రాజనీతికి విరుద్ధముగ ఆంగ్లరాయబారి వర్తించుట.

కూంగర్‌కు వ్రాసిన ఉత్తరము మాత్రము ప్రచురమైనది. కూంగర్ వ్రాసిన ఉత్తరము ప్రచురము కాకుండుటకును, ఆర్థర్ వ్రాసిన ఉత్తరము మాత్రము ప్రచురమగుటకును కారణము పాఠకులు ఊహించుకొనగలరు. ఆర్థర్ మాటసత్యమో, కూంగర్ మాట సత్యమోకూడ, పాఠకులకు వేరుగ చెప్ప పనిలేదు. ఈ సంగతియే అబద్ధమై యున్నచో—సింధియా ఓడిపోయి, ఇంగ్లీషువారి దయాపాత్రముగ నున్న సమయములో అతని మంత్రి కూంగర్ ఇంగ్లీషు రెసిడెంటుపై యిట్టి అసత్యపు నేరారోపణనుచేయ సాహసించునా ?

యుద్ధమునకు ముందు సింధియా శాంతినేగోరుచు తనవద్దకొక రాయబారిని పంపినట్లును, ఆనాడట్లు కాలిన్సు సింధియా దర్బారునుండి వచ్చివేసి యుండక పోయినచో యుద్ధమే తటస్థింపదని సదరు రాయబారి తనతో చెప్పినట్లును ఆర్థర్ 1803 సం॥ నవంబరు 11-వ తేదీన అన్నకుపంపిన ఉత్తరములో వ్రాసెను — ఈ రాయబారి చెప్పినమాట అసత్యమని ఋజువుచేయుటకు ఆర్థర్ యెంతమాత్రము యత్నించలేదు.

వీనినన్నిటిని బట్టిచూడగ కాలిన్సు యిరుగుపొరుగు రాజ్యముల మధ్యనుండ వలసిన సామాన్య ధర్మములకు విరుద్ధముగ "మా ఇంగ్లీషువారు నీమీద యుద్ధము చేయబోవు చున్నార"ను మామూలు నోటీసునుకూడ సింధియా కివ్వకుండ, అతని దర్బారునుండి, అతనివద్ద శలవైన గైకొనకుండ, కేవలము అమర్యాదగ, పోగరుబోతు తనముగ, కృత్రిమముగ, యుద్ధ ధర్మమునకు విరుద్ధముగ ప్రవర్తించెనని స్పష్టమగు చున్నది. ఈ సంగతి పాక్షికులగు ఇంగ్లీషువారి వ్రాతలవలననే వెల్లడి యగుచున్నది.

నెయ్యమో, కయ్యమో తేల్చి చెప్పవలసినదని తొందరచేయుచు కర్నల్ కాలిన్సు 1803 సం॥ జులై 22-వ తేదీన సింధియాకొక జాబువ్రాసెను. అదిచాలక మరునాడే సింధియా, భాన్‌స్లేలకు చెరియొక యుత్తరమును మరల వ్రాసెను. అందుకు వారుభయులు ఇట్లని జవాబిచ్చిరి. "మేము ఉభయులము యింక కలుసుకొని మాట్లాడుకొనలేదు. మేముభయులము సంప్రదించుకొని గాని యే జవాబు చెప్పుటకును వీలులేదు. మేము మాట్లాడు కొనుటకు కూర్చున్నప్పుడు మీరు కూడ రావచ్చును. నాతో మాట్లాడదలచు కుంటే మీరు రేపు మాయింటికి రావచ్చును. మా యిల్లే మీ యిల్లు" అని సింధియా వ్రాసెను.

ఇందుపై సింధియాతో కాలిన్సు జులై 25-వ తేదీన కలిసి మాట్లాడెను. సింధియా డక్కనును విడిచి ఉత్తరమునకు పోవలెనని ఇంగ్లీషువారు అనేకమార్లు కోరియుండిన సంగతిని గూర్చి సింధియారొక్క మంత్రి అప్పుడిట్లని సమాధానము చెప్పెను.

[మా సింధియా, భోన్స్లే మహారాజుల సేనలు తమతమ రాజ్యములలోనే వున్నవిగాని, యెవరి పొలిమేరలలోనికి రాలేదు. తాము అజంతా కనుమలను దాటమనియు, పునహామీదికి రామనియు, మా మహారాజులిద్దరు యిదివరకే గట్టిగ వాగ్దానము చేసియున్నారు. బేసిన్ సంధిని తిరుగదోడమని వారు మీగవర్నర్ జనరలుగారికి యిదివరకే మాట యిచ్చియున్నారు. అది వారి మిత్రభావమును స్పష్టముగ వెల్లడించుచునే యున్నది.

మీ గవర్నర్‌జనరల్ యిచ్చిన * హామీనే, పీష్వాగారినుండికూడ నైకోనుటకుగాను మామహారాజు లిరువురు యిప్పుడు పీష్వాగారివద్దకు రాయబారుల నంపదలచుకొన్నారు. అదిగాక, మాసింధియా మహారాజావారికిని హోల్కారుగారికిని జరుగుచున్న రాయబారపు వ్యవహారము ముగియువరకు మా మహారాజావారు దక్కనును విడిచిపోవుటకు వీలులేదు.—(క్లుప్తము)]

ఈ మాటలు యెంతయు సమంజసముగ నున్నవి. ఈ మాటలను కాలిన్సు జులై 26-వ తేదిన ఆర్థర్ వెల్లస్లీకి తెలిపెను. ఆయుత్తరము ఆర్థర్‌కు జూలై 31-వ తేదిన చేరినది. అందుపై అతడు వెంటనే కాలిన్సుకు యిట్లని తిరిగి వ్రాసెను.

[ఈ మహారాష్ట్రనాయకులకు పీష్వానుండి హామీ కావలెనట ! హామీ యివ్వడానికి పీష్వాయెవడు? అతనికి మన ఇంగ్లీషు సేనల బలమేగదా గతి! అవిలేకపోతే, అతడు వారినేమి చేయగలడు? కాబట్టి, మన ఇంగ్లీషువారము హామీయిచ్చినది చాలదా వారికి? ఈరహస్యము వారికి తెలుసును. అయినప్పటికి వారువట్టి నటనచేయుచున్నారు. అదిగాక, సింధియా, హోల్కారు లింకను సఖ్యతకుదుర్చుకోలేదని వారే చెప్పిరిగద! కాబట్టి, నెయ్యమో కయ్యమో మనమిప్పుడే తేల్చుకోవలెను. ఆలస్యము చేయరాదు—ఇది గవర్నర్‌జనరల్ గారి హుకుము—(క్లుప్తము)]

జులై 31-వ తేదీన రఘోజీ భోన్స్లే మకాములో సింధియా, భోన్స్లేలకును, కాలిన్సుకును సంభాషణలు జరిగెను. ఈ సంభాషణల సారాంశము కాలిన్సు యెంతవరకు సరిగ పై యధికారులకు తెలిపెనో తెలియదు. కాని, ఆతడు 1803 సం॥ ఆగష్టు 3-వ తేదిన ఆర్థర్‌కు వ్రాసినఉత్తరములో నిట్లున్నది :—

[నైజాము పొలిమేరనుండి మీరు తక్షణమే మరలిపోనిచో, మాసేనాని ఆర్థర్‌గారు మీమీది కిక రాక మానరు! అని నేను సింధియా భోన్స్లేలతో చెప్పితిని—అంతట భోన్స్లే మంత్రియగు శ్రీధర్‌పంతు లిట్లని బదులుచెప్పెను:—మీ ఆర్థర్ గారు యుద్ధము ప్రారంభిస్తే—బ్రిటిష్ సేనలను అజంతా కనుమలవైపుకు నడిపిస్తే—మా మహారాజు లిద్దరు తమ సేనలను తమ యిష్టమువచ్చినవైపుకు నడిపించుకుంటారు.—క్లుప్తము.]

శ్రీధర్ పంతులు యిట్లు బెదరించిన మాట సత్యము కాదని తెలియుచున్నది. ఏలననగ యీసంభాషణ జరిగిన మరునాడే—అనగ ఆగష్టు 1-వ తేదీననే

---

* మహారాష్ట్రనాయకులలో చిరకాలమునుండియున్న పరస్పరపు టొడంబడికలను ఇంగ్లీషువారు భంగ పుచ్చరను హామీ............

—సింధియా, భాంస్లేలిద్దరును మిక్కిలి శాంతభావముతో ఆర్థర్‌కు ఉత్తరములు వ్రాసి యుండురి. వీనిని బట్టి చూడగ కాలిన్సు బుద్ధి పూర్వకముగ అబద్ధములు వ్రాసి యుద్ధము పురికొల్పదలచినట్లు స్పష్టమగుచున్నది.

యుద్ధ ప్రకటన

ఇందుకు నిదర్శనము అతడు సింధియాతో చెప్పకుండ మరునాడే ఆగష్టు 1-వ తేదీననే సింధియా దర్బారు నుండి వచ్చివేయుటతప్ప వేరేమి కావలెను? యుద్ధమికతప్పదు. కాలిన్సు 3-వ తేదీన వ్రాసిన ఉత్తరము చేరగనే—కాలిన్సు సింధియా దర్బారునుండి వచ్చివేసినాడను సంగతి తెలియగానే - ఆర్థర్ వెల్లస్లీ 1803 సం॥ ఆగష్టు 6-వ తేదీన యుద్ధమును ప్రకటించెను. ఆరోజుననే యితడు సింధియాకు మిక్కిలి అమర్యాదగ ఉత్తరమువ్రాసి తాను యుద్ధము చేయుటను సమర్థించుకొనుచు వేరొక 'మెమో'ను కూడ పంపించెను. ఇవి చాల ముఖ్యమైన వగుటచే వీనిని పాఠకులు మూలమందే చదువుదురుగాక. (Wellington's Despatches Vol. I Pp. 287-289 etc.)

తండ్రుల పాపము బిడ్డలకు చుట్టుకొనెనా?

ఇంగ్లీషువారు తమ రాజ్యస్థాపనకై యిచ్చట అవస్థపడుచున్న రోజులులో దౌలత్‌రావు, రఘోజీల పూర్వీకులగు మాధవరావు సింధియా, మధోజీభాంస్లే లిరువురు మహారాష్ట్ర సామ్రాజ్యముపట్ల ద్రోహులై ఆనాడు ఇంగ్లీషువారికి సహాయము చేసియుండిరి. తండ్రులుచేసిన పాపము బిడ్డలకు చుట్టుకొనునన్న సామెత సార్థకమగునట్లు ఆనాటి ద్రోహఫలము నంతను వారి సంతతి వారగు దౌలత్‌రావు సింధియా, రఘోజీభాంస్లేలు ఇప్పుడు అనుభవించవలసి వచ్చినది. ఇంగ్లీషువారు కృతఘ్నులై తమకు చిన్నప్పుడు పాలిచ్చి పెంచిన సింధియా భాంస్లేల కుటుంబీకుల రొమ్ములపై తన్న బూనుకొనిరి. వెనుక ఇంగ్లీషువారికి సహాయముచేసిన మాధవరావుసింధియా మధోజిభాంస్లేలు దూరదృష్టిలేక, తమ మహారాష్ట్ర రాజ్యమునకు ద్రోహముచేసుకొనిరి. ఇది ఆత్మవంచన యయ్యెను. ఆనాడు నానాఫర్నవీసు చెప్పిన సలహాను వీరు చెవిని పెట్టియుండినచో మహారాష్ట్రమున కిప్పుడింత ముప్పు వచ్చెడిదికాదు.

## రెండవ మహారాష్ట్ర యుద్ధమునుగూర్చి పార్లమెంటులో చర్చ—ఫ్రాన్సిస్ ఖండన.

ఇండియాలో యుద్ధము ప్రారంభమైన కొన్ని నెలలకుగాని యీసంగతి ఇంగ్లండులో తెలియలేదు. సర్ ఫిలిఫ్ 'ఫ్రాన్సిస్' అప్పుడు పార్లమెంటులో మెంబరుగ నుండెను. 1804 సం॥ మార్చి 14-వ తేదీన ఆతడు యీ విషయమును పార్లమెంటులో చర్చకు తెచ్చెను. "యుద్ధములు చేయుట, దేశముల నాక్రమించు

కొనుట మున్నగునవి ఆంగ్లజాతికి యేవగింపు పనుల''ని పార్లమెంటు చట్టములో స్పష్టముగ వ్రాసియున్న సంగతిని యితడు మహాసభవారికి జ్ఞాపకముచేసి యిట్లని చెప్ప దొడంగెను:—

[చట్టములు చేయుట మంచిదేగాని, వానిని అమలు జరుపుచున్నారా లేదాయని విచారించుట తప్పని యెవరుఅనరుగద. కాబట్టి, నేను మనవి చేయునదేమనగ :—యుద్ధములు పనికిరావని మన పార్లమెంటు చట్టములో స్పష్టముగనున్నప్పుడు, యే బ్రిటిష్ గవర్నర్ అయిన యుద్ధము ప్రారంభిస్తే, అతడు తక్షణమే ముద్దాయిస్థానములోనికి వచ్చినాడన్నమాటే. సమర్థించుకోవలసినపని—ఋజువు భారము—అతనియందేయున్నది...........ఇండియాలో యుద్ధములు పనికిరావని మనము చట్టముచేసిన 1783 సం॥ నాటినుండి యేటా మనకు ఇండియానుండి యుద్ధపు సంగతులు తప్ప యింకేమైనా వస్తున్నవేమో చూడండి! యుద్ధములు, విజయములు, క్రొత్త రాజ్యముల ఆక్రమణలు తప్ప మనకింకే కబురును ఇండియానుండి వచ్చుట లేదు. లేకపోతే, మధ్యమధ్యకొంచెము విశ్రాంతికూడ వినవచ్చుచున్నది. బహుశః చాలితీర్చుకొని, తిరిగి యుద్ధము ప్రారంభించడానికి కాబోలు యీ విశ్రాంతి! ఈ యుద్ధాలన్నిటిలో తప్పు బలహీనులగు మన శత్రువులదేయైనట్లు మనకు మనవారు కబురు పంపించుచున్నారు. ఇండియాలోనున్న రాజులందరి బలముకలిపినా, మన ఇంగ్లీషువారి బలమునకు చాలదని నానిశ్చయాభిప్రాయము. ఇట్టి బలహీనులగువారు బలవంతులగు మన ఇంగ్లీషువారి మీదికి వారంతటవారే కాలుద్రవ్విపచ్చినారట! మనవారిదేమీ తప్పులేదట! ఈ మాట నమ్మదగినదేనా?! ఎల్లప్పుడు మనవారు చెప్పేమాటలనేగాని, ఎగుటి పక్షమువారు చెప్పేమాటలు మన చెవిని పడకున్నవి. బహుశః మనవారు వారికే అన్యాయము చేశారేమో మనకెట్లా తెలుస్తుంది?...ఇండియా వ్యవహారములు నేనుపుట్టి బుద్ధియెరిగినప్పటినుండి ఒక్కమోస్తరుగానే వున్నవి. అక్కడవుండే మనవారికందరికి యుద్ధదాహముతప్ప వేరొండులేదు........కాబట్టి, మనవారు ఇండియాలో యీయుద్ధము యెందుకు ప్రారంభించవలసివచ్చిందో, యేపనికిగాను మనవారిట్లు యుద్ధములోనికి దిగినారో, యిందుకు కంపెనీ డైరక్టర్లయొక్కగాని, ప్రభుత్వ మంత్రివర్గమువారియొక్కగాని, అనుమతియున్నదో లేదో యీ పార్లమెంటు మెంబర్లు యిప్పుడైనా తెలుసుకోవడం అవసరమగునా కాదాయని నేను మిమ్ములనందరిని అడుగుచున్నాను........యుద్ధమునకు గవర్నర్‌జనరల్ జూన్ నెలలోనే అనుజ్ఞయిచ్చినట్లు కనుబడుచున్నది. మనమిప్పుడు మార్చి నెలలో వున్నాము. అనగ, యిప్పటికి 9 మాసములు గడచినది. కాని, యింతవరకు ఇండియానుండి దీనివిషమైన కబురే మనకురాలేదు. అవాంతరముగ యేదైన యుద్ధము తప్పనిసరిగవచ్చేటట్టయితే, తక్షణమే తిరుగుటపాలో ఆసంగతిని గవర్నర్‌జనరల్ సీమకు తెలియపరచవలయునని పార్లమెంటు చట్టము చెప్పుచున్నది. కాని, యీ వ్యవహారము ప్రారంభమై యిప్పటికి 8 మాసములైనప్పటికి వెల్లస్లీ దీనినిగూర్చి మాటమాత్రమైనను మనకు తెలిపియుండలేదు. దీనికితడు తగుసంజాయిషీ యివ్వవలసియున్నది. అంతవరకు దీనికెక్కడో లోపమున్నదనక తప్పదు.

ఈ దిగువ కాగితములను పార్లమెంటు మహాసభయెదుట పెట్టవలసినదని నేనిప్పుడొక తీర్మానము నుపాదించుచున్నాను. అవేవనగ (1) ఇండియానుండి గవర్నర్‌జనరల్‌ను, ఆయారాష్ట్రముల గవర్నరులును యీ మహారాష్ట్ర యుద్ధమునుగూర్చి యిక్కడికి పంపిన

డిశ్పాచిలు, ఉత్తరములు, వగైరా కాగితములు యావత్తున్నూ (2) ఆయారాష్ట్ర ప్రభుత్వములకును మహారాష్ట్ర నాయకులకు మధ్య యింతునుగూర్చి జరిగిన ఉత్తరప్రత్యుత్తరముల యావత్తును, (3) కంపెనీ డైరక్టర్లు ఇండియాకుపంపిన ఉత్తరవులు, సలహాలు వగైరా యావత్తు రికార్డున్నూ—వీనిని పార్లమెంటు సభ్యులయెదుట పెట్టగోరుచున్నాను. అని ఫ్రాన్సిసు కోరెను......క్లుప్తము.]

ఈ మహారాష్ట్ర యుద్ధమునుగూర్చి ఇండియానుండి యింకేమియు కాగితములు రాలేదనియు, అవి రాగానే పార్లమెంటు ముందు పెట్టెదననియు ఇండియా మంత్రి 'కాసర్లే' చెప్పిన మీదట ఫ్రాన్సిస్ తన తీర్మానమును ఉపసంహరించుకొనెను. తదుపరి మూడువారములైన తరువాతకూడ ఫ్రాన్సిస్ యిట్లే కోరగ మరల మంత్రి వెనుకటి జబాబునే చెప్పెను. మరల మే 7-వ తేదీనను, 1805 సం॥ మార్చి 15-వ తేదీనను ఫ్రాన్సిస్ యీసంగతిని జ్ఞాపకముచేసెను. కాని, అప్పటికిని ఇండియానుండి కాగితములు రాలేదని మంత్రి జబాబుచెప్పెను. అంతట ఫ్రాన్సిసుకు కోపమువచ్చి 1805 సం॥ యేప్రిల్ 5-వ తేదీన ప్రభుత్వచర్యను యిట్లని తీవ్రముగ విమర్శించెను:—

[మనము ఇండియాకు కేవలము వర్తకులుగ వెళ్లితిమి. ఆదేశపు ప్రభువులు మనలనప్పుడెంతో దయతో ఆదరించిరి. మన వర్తకమునకు వారు సకల సౌకర్యముల నిచ్చుటయేగాక, తమ దేశీయులకులేని హక్కులనుకూడ మనకు కొన్నింటి నిచ్చిరి. తమ విదేశవ్యాపారమును పెంపొందించుటకై వారిట్లు చేసియుండుట ఆనాడు సదరురాజుల|వివేకమునే తెలుపుచున్నది. వర్తకరీత్యా వారు తెలివిగనే—కండ్లు తెరచుకొనియే పనిచేసినను — రాచకీయాదృష్ట్యావారి కండ్లు అంధప్రాయమైయుండెను. చీనావారు మొదట మన యూరోపియనులను తమ దేశములో అడుగుపెట్టనీయకుండ ఆటంకపరచినట్లు, ఇండియావారు మనలను ఆటంకపరచియుండలేదు. 1765 వరకు ఇండియాలో మనకు పేరుప్రఖ్యాతులులేకుండెను. బెంగాలులో మనము మొదట దేశద్రిమ్మరులుగనుంటిమి. 1765 సంవత్సరమునకు దరిమిలా మనమక్కడ ప్రభువులమైచరింపసాగితిమి. కాని, అప్పుడైనను క్లైవు యేమిచెప్పియున్నాడు? మనరాజ్యము బెంగాలు, బీహారు ఒరిస్సాలకు మించి వ్యాపించుటకు వీలులేదు. ఇంతకుమించి పోవుట వర్తకపు కంపెనీయగు మనకు విపరీతమగును. కంపెనీ స్వభావమును సమూలముగ మార్చివేస్తేనేతప్ప యిది సాధ్యము కాదు. అని క్లైవు చెప్పియుండలేదా? అప్పుడు ఇంగ్లండులోనున్న ప్రభుత్వమువారుకూడ యీ పద్ధతినే అవలంబించుచుండిరి. 1773-సం॥ లో కంపెనీవారు ఇండియాకు క్లైవును పంపుచు అతనితోకూడ యీ మాటలనే చెప్పిపంపిరి............ఇండియాలో యుద్ధములు, దేశాక్రమణలు పనికిరావని 1784, 1793 సం॥ లలో పార్లమెంటువారు చేసిన చట్టములే స్పష్టముగ చెప్పియున్నవి... .....కాని, ఇండియాలో జరిగిన యీ యుద్ధములన్నియెట్లు జరుగుట తటస్థించెనో పార్లమెంటువారికే తెలియకున్నది. ఈ యుద్ధములు జరుగుటకు కారణములేమియో, వాని పుట్టుపూర్వోత్తరములేమియో, అందలి న్యాయాన్యాయములేమియో తెలిసికొనుటకు పార్లమెంటువారికి అవకాశములేకున్నది. ఎంతసేపూ, ఒకపక్షము వారుచెప్ప

మాటలే మనకు తెలియవచ్చుచున్నవి. కాబట్టి, యీ మాటలను నమ్ముటలో మనము బహు జాగరూకతతో నుండవలెను. ఫలాని యుద్ధములు జరిగినవని, ఫలాని దేశములు మనక్రిందికి వచ్చినవని మాత్రమే మనకు మొత్తము మీద కబుర్లు తెలియుచున్నవే గాని, యితర వివరము లేమియు మనకు తెలియుటలేదు. ఇట్టి కలహములలో తప్పెవరిదో-మన పక్షమందు న్యాయ మెంతవరకున్నదో-యీ యుద్ధము న్యాయముగ విధిలేక మనవారు చేసినారా-లేక అక్రమముగ, మనవారు కల్పించి, పరులపైపడినారా-యను విషయములను తెలుసుకొందమను కుతూహలము కూడ మనకు లేకపోయెను. 'ఇండియాలో మనవారు ఫలాని రాజ్యం సంపాదించి తెచ్చారంటే, 'సరే యింట్లో పడవేసికోండి' అనియే అన్నాము, గాని' అందలి న్యాయాన్యాయములను మనము కించిత్తయినను పరిశీలించుటకు పూనుకొనమైతిమి. తమగోడు చెప్పుకొనుటకు యెదుటి పక్షమువారగు దేశీయరాజులకు మన పార్లమెంటులో రాయబారులులేరు. వారికండ్లకేమి కనబడుచున్నది? ఎవరో పరాయి దేశస్థులువచ్చి తమ దేశమునంత కొల్లగొట్టుకొని పోవుచున్నట్లు తప్ప వారికింకేమియు కనబడుటలేదు.

'ఇదేమిటని ఎవరైనా అడిగితే,-'నోరుముయ్యి, నీపొగరుబోతుతనం చేతనే నీకీగతి పట్టినది, పో,-అని పైగా మనవారు దేశీయరాజులను డబాయించుచుండిరి......ఇండియాలో దేశీయరాజులకు మన ఇంగ్లీషు కంపెనీ వారికి వచ్చేతగాదలకన్నిటికి నిజముగ మూల కారణమెక్కడనున్నదో తెలుసుకోడానికి మన పార్లమెంటు మెంబర్లకెట్టి ఆధారములు లేకున్నవి. మనవారు మంచివారే యైనప్పటికి, యెదటి పక్షమువారగు దేశీయరాజులు చెప్పే మాటలేమిటో తెలుసుకోకుండ మనము మనపక్షమువారు చెప్పేమాటలే బలవంతముగ నమ్మి తీరవలసివస్తోంది. దేశములో యుద్ధములులేకుండా శాంతినే నెలకొల్పుకోవడానికి దేశీయ రాజులు పాపమెంత తంటాలుపడిరో తెలిసికొనుటకు మనకు అవకాశంలేకుండ పోయింది... ............మనకిప్పుడింత రాజ్యం వచ్చినా, మనదాహంతీరలేదు. 'నూతనరాజ్యములను ఆక్రమించుకోవద్దు' అని పార్లమెంటు చట్టము ఖండితముగ ఘోషిస్తున్నప్పటికి, దానిని లక్ష్యము చేయక ఇండియాలో మనవారు తిరిగి యిప్పుడు మహారాష్ట్రులతో పెద్దతగవు పెట్టుకొన్నారు. ఇందుకు మనవారు చెప్పిన కారణము నాకు శుద్ధ పనికి మాలినదిగ గన్పట్టుచున్నది. దానిలో నాకెంతమాత్రము సబబు కన్పట్టుటలేదు. మహారాష్ట్రులు మనరాజ్యము నెడ విరోధ భావము వహించియున్నారని మనవారు చెప్పుమాటకు నాకెక్కడను ఆధారము కన్పట్టుటలేదు.........దేశీయ రాజులందరు బహుదుర్మార్గులని, నీతివిహీనులగు రాక్షసులని మనవారు నిదించడం మామూలైపోయినది. కాని, వెల్లస్లీక్రింద పని చేయుచున్న మనతాబేదారులు వ్రాయువ్రాతలుచూస్తే, వారుచెప్పుమాటలు యెంతవరకు నమ్మవచ్చునో, వాని ముఖమే చెప్పక చెప్పుచున్నది..........పీష్వా దర్బారులోనున్న మన రెసిడెంట్లు కర్నల్ పామర్, క్లోజులు సదరు పీష్వాను గూర్చి వెల్లస్లీకి వ్రాసిన ఉత్తరములో యెట్టిదుర్భాషలతో వ్రాసిరో చూడండి. ఈ రీతిగ మన ఇండియా గవర్నమెంటువారు దేశీయ ప్రభువును తూలనాడుటయేగాక, 'నీ రాజ్యమంతా మాకిచ్చివేసెయ్యి' అని ఆయనను డబాయింపసాగిరి. ఇదంతా యెందుకట! అతనిని సుస్థిరముగ, శాంతముగ, సింహాసనముమీద కూర్చుండబెట్టుటకట! ఎంత హాస్యాస్పదము! ఎంతబూటకము!.........ఇట్లే సింధియాను గూర్చి కూడ మన కంపెనీ నౌకర్లు యెట్లు తూలనాడిరో చూడుడు. పౌరుషశాలియు, ప్రతాపవంతుడునునగు యీ దేశీయ ప్రభు

వును మనవారిట్లు తూలనాడవచ్చునా? అతడు ఇంగ్లీషువారియెడ విరోధభావము వహించి నట్లు యెక్కడను కనుపించదే!.........మహారాష్ట్ర నాయకులమీద మనవారు తరుచుగ మోపుచున్న నేరమేమో నాకు తెలుసును. వారు తమవద్ద ఫ్రెంచి ఆఫీసర్లనుంచుకొన్నారట! ఇది మన ఇంగ్లీషువారియెడ విరోధభావమును వహించుటయట! సింధియావద్ద 14 వేల పరాసు సైన్యమున్నదనికూడ మన వారనుచున్నారు. ఇందుకు కొంత నిదర్శనముకూడ యీ మహా సభవారి యెదుట గానరాదు.........నేను సమస్తమును పరిశీలించి చూచినాను. మొత్తము మీద మహారాష్ట్ర సేనలన్నిటిలో కలిపి 12 గురుకంటె యెక్కువమంది ఫ్రెంచి ఆఫీసర్లు నాకు కనుపించలేదు.........ఇక సింధియా ఫ్రెంచివారిని తనకొలువులో చేర్చుకోదలచు కొన్నాడని మనవారు చెప్పేమాటకు నాకు ఆధార మెక్కడను కనుపించలేదు. అదిగాక, పరాయి దేశస్థులను తనకొలువులో చేర్చుకోవడమంటే సింధియాకుగల అసహ్యాము, ఏవగింపు, లోక మందందరెరింగినదేకద.........కాబట్టి, యేవిధముగ చూచినను యీ మహారాష్ట్ర యుద్ధము నకు అవసరముగాని, న్యాయముగాని, నాకు కనుపించలేదు. ఇందుకు తృప్తియైన సమాధాన మును యెవరు యింతవరకు చెప్పలేదు. అవమానకరముగను, పొగరుబోతుతనముగను వున్న బేసిన్ సంధి షరతులయెడ మహారాష్ట్ర నాయకులు అయిష్టమును చూపినారంటే అందుతప్పే మున్నది? వారికట్టి అయిష్టముకలుగుట సహజమే. వారికట్టి అయిష్టముకలుగకపోతేనే నా కాశ్చర్యమయ్యేడిది. అంతేగాని, వారికి అయిష్టము కలిగినంటే నాకేమియు ఆశ్చర్యము గన్పట్టుటలేదు. ఈ స్థితిలోనే మీరుంటే మీ మనస్సులకు యెట్లావుంటుందో యీ సభలో కూర్చున్న పెద్దమనుష్యులందరు ఒకసారి ఆలోచించి చూచుకోండి. అంత అవమానకరములుగ నున్న సంధి షరతులను తన్నిపారవేయుట పౌరుషవంతుడగు సింధియాకు సహజముకాదా? ''మీ మహారాష్ట్ర సామ్రాజ్యమునకంతకు ప్రధాన కేంద్రస్థానమగు పునహా నగరము పరాయివారమగు మా బ్రిటిష్‌వారి చేతులలో వుంటుంది. మీరుకూడ దానికి మద్దతు చెయ్యండి,'' అంటే యే మహారాష్ట్ర నాయకునికైనా రోషమురాదా? ఇది గోరుచుట్టుమీద రోకటిపోటుకాదా? అవమానపరచినది చాలక, హానికూడ చేయుటకాదా?

మానవ స్వభావము ప్రపంచములో అంతట అన్నిదేశములలో ఒక్కరీతిగానే వుంటుంది. పరులొనర్చు పీడలను, అవమానములను ధీరతతో ధిక్కరించు యూరోపియను రాజులను జూచి మనము నిత్యము మెచ్చుకొనుచున్నామే! అట్టిమెప్పే మనము సింధియా యెడకూడ చూపరాదా? తనసామ్రాజ్యమునకు రాజధానీ నగరమగు పునహా నగరము పరాయి దేశస్థులగు ఇంగ్లీషువారి చేతులలో పడగా చూచినప్పుడు రోషక్రోధములు వహించిన పౌరుష శాలియగు సింధియాయొక్క పౌరుషగుణమును మనమేల మెచ్చుకొనరాదు? కాబట్టి, మహా సభ్యులారా! మీరందరీ సంగతులను బాగుగ ఆలోచించుకొనండి. దానికి సమాధానము మీ మనస్సులకే గోచరించును. నామట్టుకు నాకు సింధియాతోడి యుద్ధము యెంతమాత్రము న్యాయముకాదని, అవసరముకాదని, తోచుచున్నది. ఇందుకు యిక్కడనున్న కాగితములే సాక్ష్యములు.............మనము మొదట వర్తకులుగ వెళ్ళితిమి. వర్తకములోనుంచి గిడ్డం గులు వచ్చినవి. గిడ్డంగులలోనుంచి చిన్న చిన్న దండులు పుట్టుకువచ్చినవి. ఈచిన్న దండు

ల్లా, పెద్ద సైన్య వాహినులయినవి. సైన్యవాహినులలోనుండి యుద్ధ విజయములు వచ్చినవి. .........కాబట్టి, నేనిప్పుడీ తీర్మానమును ఉపాదించుచున్నాను.

యుద్ధములు, దేశాక్రమణలు, ఆంగ్ల జాతికి యేవగింపులని 1782 సం॥ మే నెల 28-వ తేదీన యీ మహాసభవారు యేకగ్రీవముగ అంగీకరించిన సూత్రమునకు యీ సభవారు బద్ధులగుచున్నారు.........క్లుప్తము.]

కాని, యీ తీర్మానమునకు అనుకూలముగ 46 గురును, ప్రతికూలముగ 105 గురును, చేతులెత్తినందువల్ల, యీ తీర్మానము ఓడిపోయినది—రెండవ మహారాష్ట్ర యుద్ధమును గూర్చిన పార్లమెంటరీ చర్చ యీరీతిగ అంతమొందినది.



# బ్రిటిష్ మహాయుగము

## ఇరువదియాఱవ అధ్యాయము.



### వెల్లస్లీ సింధియాపై పన్నిన కుట్రలు.

రెండవ మహారాష్ట్ర సంగ్రామమునకు నాందీప్రస్తావన కొంత జరిపితిమి. ఈ యుద్ధమును ప్రేరేపించిన సందర్భములను పేర్కొంటిమి. ఇట్లు పేర్కొనుటలో కేవలము ఒకపక్షమువారు చెప్పిన సాక్ష్యములనే యాధారము చేసికొనవలసి వచ్చెను. రెండవ పక్షమువారగు మహారాష్ట్రులు చెప్పుకొను సంగతులను వినమైతిమి. వీనినిగూర్చి తత్కాలమున వ్రాయబడిన రికార్డులేమియు మన కింతవరకు దొరకలేదు. అయినను, ఇంగ్లీషువారు వ్రాసిన వ్రాతలే యీ సంగ్రామమందలి న్యాయాన్యాయములను మనకు కొంతవరకు కరతలామలక మొనర్చుచున్నవి.

యుద్ధ ధర్మప్రకారము ఫలానిరోజున యుద్ధము ప్రారంభించుచున్నామని శత్రువులకు నోటీసు యివ్వవలసియున్నది. కాని, యీ యుద్ధమును ముందుగ ప్రారంభించిన ఇంగ్లీషువారు యిట్టి నోటీసును యెదుటిపక్షమువారగు మహారాష్ట్రుల కివ్వలేదు. శాంతికొరకు సింధియా యెంత ప్రయత్నించుచున్నను లక్ష్యము చేయక, ఇంగ్లీషు రాయబారి కాలిన్సు సింధియా దర్బారునుండి అతనితో చెప్పనైన చెప్పకుండ లేచిపోయెను. అంతటితో సింధియాచేయు శాంతిప్రయత్నము లన్నియు నిష్ఫలములయ్యెను. అతడును యుద్ధమునకు సిద్ధపడక తప్పదయ్యెను.

అయితే, ఇంగ్లీషువారెట్టి కుటిలస్వభావులో సింధియా పాపము— గ్రహించలేకపోయెను. ఈ సంగ్రామములో తుదకు మహారాష్ట్రులు ఓడిపోయినను, వారు పరులచే ధర్మయుద్ధమందు ఓడింపబడలేదు. మహారాష్ట్రులు అప్రతిమాన ప్రతాపమునుజూపి పోరాడిరి. కాని, ఇంగ్లీషువారు సింధియాచుట్టు పన్నిన కుట్ర పరంపరలచే ఆతడు యుద్ధరంగమందు తుదకు పరాజితుడగుట తటస్థించెను. ధర్మయుద్ధమందైనచో ఇంగ్లీషువా రెన్నడును జయముగాంచి యుండరు.

బయటపడినవి తొమ్మిది కుట్రలు.

ఏయే మాయోపాయములచే ఇంగ్లీషువారు సింధియాను సాధించిరో, వాని నిటకొంత వివరించుట అవసరము. సింధియాచుట్టు వెల్లస్లీ గజిబిజిగ అల్లిన కుట్రపాశముల చిక్కులనన్నిటిని విప్పితీసి లోకమునకు చూపించుటకు గవర్నమెంటు రికార్డుల* ఆధారముననే యీ యధ్యాయమందు ప్రయత్నింతుము. గవర్నమెంటు రికార్డులను పరిశీలింపగ

వెల్లస్లీ పన్నిన కుట్రలు తొమ్మిది మాత్రము యింతవరకు బయటబడినవి. ఈ తొమ్మిది కుట్రలు ఈ దిగువ తొమ్మండుగురుతో పన్నబడినవి. వారెవరనగా:—

(1) జస్వంతరావు హోల్కారు (2) అమీర్‌ఖాన్ (3) ఇండియాలోనున్న యితర రాజులు, ప్రజలు. (4) మొగల్ పాదుషా షాఆలమ్ (5) జేబున్నిసాబీగమ్ అను నామాంతరముగల బీగమ్‌సమ్రూ (6) సింధియాకు సామంతులగు ప్రముఖులు, ప్రజలు. (7) బంబూఖాన్ (8) శిక్కు నాయకులు (9) సింధియా కొలువులోనున్న యూరోపియనులు. ఒక్కొక్క కుట్రనే తీసికొని తప్శీలుగ విచారింతము.

## (1) హోల్కారుతో కుట్ర.

జస్వంతరావు హోల్కారును ఇంగ్లీషువారెట్లు కన్నుగిటి పీష్వాపై దండెత్తించినదియు పాఠకుల కిదివరకే తెలియును. ఇప్పుడీ యుద్ధమందు సైతము అతడు సింధియా భాన్స్లేలతో చేరునేమోయని ఇంగ్లీషువారికి లోపల అనుమాన మున్నది. అందుచే యితని నెట్లయిన వారితో చేరనీయకుండుటకై "సీపని నిమ్మ కాయవాటము చేతుమని" చెప్పి ఇంగ్లీషువారితనిని తియ్యని వాగ్దానములచే లాలించుచు, బుజ్జగించుచునుండిరి. సింధియా భాన్స్లేలను ఇంగ్లీషువారు పొడిచి రేపుచున్నను, యీ జస్వంతరావును మాత్రము వారు మంచిమాటలతో లాలించు చుండిరి.

ఇంగ్లీషువారు జస్వంతరావును తేనె నాకించుట.

అతనికి వారు తేనెలొలుకు మాటలతో ఉత్తరములు వ్రాయుచుండిరి. మచ్చున కొక ఉత్తరము చూడుడు. ఆర్థర్ వెల్లస్లీ 1803 సం॥ జులై 16-వ తేదీన యితనికి వ్రాసిన ఉత్తర మిదిగో:—

[మీవద్దనుండి జాబును బడయుభాగ్యము నాకుగలిగి చాలకాలమైనది. కంపెనీవారికిని మీకును మధ్యగల సఖ్యమును పెంపొందించు కొనవలయునని నేనెంతో సంబరపడు చున్నాను.

ఇందునిమిత్తమై మీకిప్పుడొక కాగితమును పంపుచున్నాను. ఇదే మా కంపెనీవారికిని పీష్వా బాజీరావుగారికిని యిటీవల బేసిన్‌వద్ద జరిగినసంధి పత్రపునకలు. దీనివల్ల ఇండియా యొక్క శాంతి భద్రతలకు స్థిరత్వమేర్పడినదని మీకే తెలియగలదు......

కాబట్టి, యితరులేమిచేసినను జేయుదురుగాక, మీరుమట్టుకు మీ శ్రేయమునకు అనుకూల ముగనే ప్రవర్తించుచు, కంపెనీవారితోడి సఖ్యమును కొనసాగించు చునే యుందురని నాకు గట్టిగ నమ్మకముగలదు. ఇందువిషయమై నాకెట్టి సందేహమునులేదు.

ఈ ఉత్తరమును మీకు ఖాదర్ నవాజ్ ఖాన్ ద్వారా పంపుచున్నాను. ఇతడు చాల మర్యాదస్థుడగు ఆఫీసరు. నాకు ఆంతరంగికుడు. నామనస్సులోని కోర్కెలనుగూర్చి అతడు మీకు సమస్తమును విప్పిచెప్పగలడు......క్లుప్తము.]

ఈ తేనె మాటలలో జస్వంతరావు హోల్కారు సులభముగ పడెను. పై యుత్తరములోని చివరి రెండు వాక్యములను పరిశీలించుడు. వాని అంతరార్థమేమి? "సింధియా భాన్స్లేలతో నీవు చేరకుండవుంటే, నీకేదో మెహర్బానీ చేస్తాము"ని యీమాటల అంతరార్థమై యుండుననుట స్పష్టము. దీనికి ప్రత్యక్షముగ రెండు ఋజువులు కనబడుచున్నవి. ఒకటి ఇంగ్లీషువారు సింధియా, భాన్స్లేలపై దండెత్తి, మహారాష్ట్ర దేశమునంతను నానాధ్వంసము చేయుచుండగ యీ జస్వంతరావు మెదలకుండ ఊరకుండెను. ఇది ఒక ఋజువు. ఈ యుద్ధము పూర్తియైన తరువాత "మీరు నాకు యిస్తామన్న లాభములు నాకివ్వలేదు — మీరు వాగ్దానభంగము చేసినారు. నన్ను మోసగించినారు" అనిచెప్పి యితడప్పుడు ఇంగ్లీషువారిమీద తిరుగబడినాడు. వారితో హోరాహోరీని పోరాడినాడు. ఇంగ్లీషువారి మీాదికి మీారురండి, మీారురండి 'అని అప్పుడు' యెంతో తీవ్రముగ తక్కిన మహారాష్ట్ర నాయకుల నందరిని యితడు పిలిచినాడు. ఇది రెండవ ఋజువు.

ఈ రెండు ప్రత్యక్ష ప్రమాణములను బట్టి చూచినచో, ఆర్థర్ తన ఉత్తరములో చివర వ్రాసిన గూఢమగు ఆ రెండు మాటలకు అర్థమిప్పుడు తేట తెల్లమగుచున్నది.

అంతయు అయిపోయిన తరువాత జస్వంతరావు హోల్కారు నాలుక కఱచుకొని యెంత మొత్తుకొన్న నేమిప్రయోజనము? ఇంగ్లీషువారు అతనిని పూర్తిగ టోపీవేసి తమ పని తాము చేసుకున్నారు. వారు తప్పించుకొని యెక్కిరించినారు. హోల్కారు తెల్లబోయినాడు — ఇది మద్రాసు వీధులలో జరుగు టక్కరి తనము కంటె టక్కరు తనముగనున్నది. ఇందు తాము గావించిన నీచప్రవర్తన ఇంగ్లీషువారి మనస్సునకు కించిత్తయినను కించగలిగించక పోవుట యేమనవలెనో తెలియకున్నది.

## అమిర్ ఖాన్‌తో కుట్ర.

(2) తామతనిని యిన్ని తియ్యని వాగ్దానములచే లాలించినను హోల్కారు అప్పటికిని సింధియా భాన్స్లేలతో చేరునేమోయని ఇంగ్లీషువారి కింకను భయమున్నది. కాబట్టి ఒకవేళ అతడట్లు చేరినను, తమకు ఉపద్రవములు లేకుండుటకుగాను, ఇంగ్లీషువా రతని బలమును గుంజివేయ దలచిరి. అందుకుగాను వారు హోల్కారు సేనలో నాయకుడుగనున్న "అమీర్‌ఖాన్" అనువానితో రహస్యముగ బేరములు సాగించిరి. తన యజమానియగు హోల్కారుకు స్వామిద్రోహము చేయవలసినదిగ ఇంగ్లీషువారితనిని ప్రోత్సహించిరి. ఇతడు తనవద్దనున్న 25 వేల సేనతో జస్వంతరావు హోల్కారునుండి చీలిపోయి వచ్చునట్లును, యితనిని నైజాము తన కొలువులో చేర్చుకొనునట్లును ఇంగ్లీషువారు యేర్పాటు చేసిరి. నైజాము

ఇంగ్లీషువారి చేతిక్రిందివాడే కాబట్టి, వారెట్లు చేయుమన్న అట్లు చేయుటకు ఆతడు సంసిద్ధముగ నుండెను.

1803 సం॥ ఏప్రిల్ 28-వ తేదీన ఆర్థర్ వెల్లస్లీ జనరల్ స్టూవార్టుకు వ్రాసిన జాబులో యిట్లున్నది :—

[హోల్కారుకొలువులో సర్దారుగనున్న అమీర్ ఖానుడు నైజాముతో యింకను బేరములు సాగించుచు నేయున్నాడు. మే నెల 2-వ తేదీతో మనకు పునహాలో అపారమగుబలము చేకూరగలదు. మనకోర్కె నెరవేరగలదు. అమీర్ ఖాన్ లేచిపోవుటయు, తద్వారా హోల్కారుబలము తగ్గిపోవుటయు ఒకవేళ జరుగకపోయినను, కనీసము హోల్కారుకు సదరు సర్దారునందు అపనమ్మకమైన యేర్పడితీరును—క్లుప్తము.]

ఈ అమీరాన్ ఖానును తన కొలువులోనికి తీసికొని తీరవలసినదని ఇంగ్లీషువారు నైజామును ఆజ్ఞాపించిరని కూడా 1803 సం॥ మే నెల 3-వ తేదీన వెల్లస్లీ నైజాము రెసిడెంటుకు వ్రాసిన యీ దిగువ ఉత్తరమువల్ల స్పష్టమగుచున్నది :—

[అమీర్ ఖాను వద్దనున్న సేన యెంతయైనప్పటికి అతనిని నైజాము తీసికొని తీరవలసినదే యని నేనుగట్టిగ శిఫార్సుచేయుచున్నాను. యుద్ధమువచ్చేటట్లయితే, ఆఖర్చులన్నియు నైజాముకును అతని ప్రజలకును ముదరా యివ్వబడును. అమీర్ ఖానువద్ద చాల పెద్దగుఱ్ఱపుదండు గలదు. అతడు చాలపేరు ప్రఖ్యాతులువహించినవాడు. విశేషించి జస్వంతరావు హోల్కారు యితనియందు యెక్కువ నమ్మకమును వుంచియున్నాడు. ఇట్టివానినిగనుక మనము కొనివేసినట్టయితే, మనకింకేమి కావలెను? మన మతనిని కొనివేసినామన్నమాట వింటేనే చాలును జస్వంతరావుకు అంతటితో అతనిసైన్యమందు నమ్మకము పూర్తిగ చెడిపోవును. అతడప్పుడు మనతో పోరాటమునకు దిగుటకే జంకును......క్లుప్తము.]

ఇందువల్ల యుద్ధము వచ్చేటట్టయితే సదరు యుద్ధపుఖర్చులు నైజాముకు ముదరా యిస్తామని పై ఉత్తరములో ఆర్థర్ చెప్పిన మాటకు తోడుగ అమీరాన్ ఖానును, అతనిసేనను నైజాము ఉంచుకునేటట్టయితే, అందుకయ్యే ఖర్చులలో సగమువంతుకూడ ఇంగ్లీషువారు భరిస్తారని కర్నల్ స్టీవెన్సు ఒప్పుకున్నట్లు తెలియుచున్నది. ఈ మాటపైననే నైజాము సదరు అమీరాన్ ఖానును ఉంచుకొనుటకు ఒప్పుకొన్నట్లు తెలియుచున్నది. కాని, తీరా వ్యవహారము ముగింపులోనికి వచ్చు వేళకు, మేమిందుకు ఒప్పుకోలేదు అని ఆర్థర్ 1803 సం॥ జూన్ 22-వ తేదీ ఉత్తరములో చెప్పెను. తత్ఫలితముగ కాబోలు, యెట్టకేలకు నైజాము సదరు అమీరాన్ ఖానును తనకొలువులోనికి తీసికొనుట తటస్థించలేదు. దీనికి అసలుకారణ మేమో రికార్డులలో యెచ్చటను గన్పించదు.

అమీరాన్ ఖానుడు నైజాము కొలువులోనికి బహిరంగముగ వచ్చి చేరకపోయినను, అతనికి ఇంగ్లీషువారు లోపాయికారీగ కొంతసొమ్మును ముట్టజెప్పుచు, జస్వంతరావుకు స్వామిద్రోహము చేయించుటకు అతనిని పురికొల్పుచునే యుండిరనుట

స్పష్టము. ఒకవేళ హోల్కారు తెలివితెచ్చుకొని సింధియా భాన్స్లేలతో చేరి యున్నప్పటికి, యీ అమీర్ ఖానుడు తీరా యుద్ధసమయమందు హోల్కారును విడిచి తన సేనతో ఇంగ్లీషువారి ముఠాలో చేరెడివాడే యనుటయు స్పష్టము. ఏల ననగ, నైజాముతో బేరములు సాగిననాటినుండి యితడు హోల్కారుకు శల్య సారథ్యము చేయుచు, ఇంగ్లీషువారికి అనుకూలముగనే ప్రవర్తించు చుండెను. ఇందుకు ప్రతిఫలముగ ఇంగ్లీషువా రితనికి 1818 సం॥లో "టాంకు" సంస్థానమును బహుమతిగ నిచ్చిరి. ఇతడు ఇంగ్లీషువారి కనుకూలముగ శల్యసారథ్యము చేసె ననుటకు యిదియే ప్రమాణము.

సరే, యేది యెట్లున్నను, తుదకు హోల్కారు సింధియా, భాన్స్లేల పక్షమున చేరనేలేదు. ఇంగ్లీషువారు భయపడవలసిన పనిలేక పోయెను. తాము పన్నిన పన్నాగము బలేబాగుగ పనిచేసినది.

### (3) ఇతరరాజులతో, ప్రజలతో కుట్రలు

మహారాష్ట్ర కూటమునుండి జస్వంతరావు హోల్కారును యీ రీతిగ చీల దీసినది చాలక, ఇంగ్లీషువారు ఇండియాలో తమకప్పుడు యెరుకలోనున్న యావ న్మంది యితర రాజులను, ప్రజలనుకూడ సింధియాపైకి పురికొల్ప వలయునని వెల్లస్లీ పూనుకొనెను. ఎవరెవరితో యేయే కుట్రలుపన్నవలెనో వెల్లస్లీ 1803 సం॥ జూన్ 28-వ తేదీననే లేక్ సేనానికి బహురహస్యముగ వ్రాసియుండెను. ఇవిచాలవని తలచి తిరిగి యేయే రాజులకు యెట్లెట్లు లంచము లివ్వవలయునో పేరుపేరున వివరముగ తెలుపుచు వెల్లస్లీ 1803 సం॥ జులై 27-వ తేదీన లేక్ సేనానికి మరియొక రహస్యపు టుత్తరము వ్రాసెను. వెల్లస్లీ ఇండియాలో అడుగుపెట్టిన నాటినుండి సింధియాను లొంగదీయ వలయునని అనేక యుపాయముల నాలోచించు చుండెను. అనేక కుట్రలను, తంత్రములను పన్నుచుండెను. కాని, యీ నాలుగైదేండ్ల ప్రయత్నముకూడ యింతవరకు ఫలించలేదు. సింధియా బలమేమియు క్రుంగలేదు. కాబట్టి, యెట్లయినను గట్టిగ ప్రయత్నించి అతని నీదెబ్బతో అణచివేయ వలయునని వెల్లస్లీ యిప్పుడు పెద్ద పట్టుపట్టెను. అందు నిమిత్తమయియే, యితడు తెగించి, ఇండియాలో తన యెరుకలోనున్న రాజులకందరికి లంచములను విరివిగ విరజిమ్మి వారి నందరిని సింధియాపైకి ఉసుగొల్ప సమకట్టెను. ఇందునుగూర్చి యితడు జులై 27-వ తేదీన లేక్ సేనానికి వ్రాసిన జాబును చదివినట్లయితే, అతడెంతటి నీచ కార్యములకు కూడ జంకక, తెగబడెనో తెలియగలదు. సింధియా కొలువులో చాలమంది పరాసువా రున్నారనియు, అచ్చట వారి పలుకుబడి హెచ్చుగనున్న దనియు, దానివల్ల ఇంగ్లీషువారికి ఉపద్రవము రానున్నదనియు, ఆ యుపద్రవము తొలగించుకొనుటకే తాము, సింధియామీదికి యుద్ధము చేయబోవు చున్నామనియు,

వెల్లస్లీ అందరితో ఒక మిష చెప్ప సాగెను. కాని, దీనినిగూర్చి యితడు సింధియా, భాన్స్లేలతో ఒక్కమాట మాత్రమైనను చెప్పలేదు. "మీావద్దనున్న ఫ్రెంచి సేనలను తీసివేయ వలసినదనిగాని, మీారు సదరు ఫ్రెంచి సేనలను ఉంచుకొన్న కారణముచేతనే మేము మీామీాదికి యుద్ధమునకు వచ్చుచున్నామ"నిగాని ఇంగ్లీషు వారు సింధియా భాన్స్లేలతో యెన్నడును చెప్పియుండలేదు.

ఈ ఫ్రెంచిగొడవయే సింధియా, భాన్స్లేలతోడి రాయబారములో యెక్కడను తగులలేదు. ఇదియొక కలహకారణముగ ఇంగ్లీషువా రెన్నడును సింధియా, భాన్స్లేలకు చెప్పలేదు — బహుశః యీమాట చెప్పితే తమవద్ద అట్టి ఫ్రెంచి సేనలేమైనావుంటే—వారు ఇంగ్లీషువారి కోర్కెప్రకారము తీసివేసెడి వారేమో!- కాని, అసలు కారణమదికాదు కావుననే వారీప్రశంసనే సింధియా, భాన్స్లేలతో తేలేదు. అయితే, తదితరలోకమును మోసపుచ్చుటకై ఇంగ్లీషువా రీమిషను కల్పించిరనుట యెట్టివానికైనను కనబడును. ఒకవేళ సింధియా, భాన్స్లేల వద్ద పరాసుసేన లుండుట నిజమే యైనను, ఇంగ్లీషువారి కోర్కెపై వారు వానిని తీసి పారవేసి యుండినను, వెల్లస్లీ అప్పటికిని సింధియా, భాన్స్లేలపై యెట్లయినను యుద్ధము ప్రకటించేవాడే. ఏలననగ, అతని అసలు ఉద్దేశము వేరుగద! వీరిని ఓడించి వీరిరాజ్యములను మ్రింగవలయునని గదా వెల్లస్లీకున్న దాహము. కాబట్టి, యిట్టి యల్పపు సర్దుబాటులవలన అతని దాహము తీరునా? సింధియా, భాన్స్లేలతో తానుచేయ బూనుకొన్న యుద్ధమువల్ల తా నాశించుచున్న ఫలితాంశము లేవియో వెల్లస్లీయే 1803 సం॥ జులై 27-వ తేదీ ఉత్తరములోనే లేక్ సేనానికి స్పష్టముగ విప్పి చెప్పెను.

[సింధియా భాన్స్లేలతోడి యుద్ధమువల్ల నేను ఆశించుచున్న ఫలితములివి:—

(1) యమునానదీతీరమున యేర్పడియున్న '<u>ఫ్రెంచిరాజ్యమును</u>' నాశనముచేసి, వారి తాలూకు సైనిక సామగ్రినంతను కాజేయుట ఒకటి—(ఈ ఫ్రెంచిరాజ్యము వెల్లస్లీ బుర్రలో తప్ప యింకెక్కడను లేదు.)

(2) కంపెనీరాజ్యమును యమునానదివరకు వ్యాపింపజేయుట రెండవఫలితము.

(ఆగ్రా, ఢిల్లీయేగాక యమునానదికి పడమటితీరము పొడుగునను, దక్షిణతీరము పొడుగునను తగినన్ని స్థానములుకూడ ఆక్రమించుకొని మనవశములో వుంచుకొనవలెను.)

(3) మొగల్ పాదుషాపై నామకః అయినాసరే మనము అధికారము వహించుట మూడవఫలితము.

(4) యమునానదికి పడమటను, దక్షిణమునను <u>జయ</u> నగరమునుండి బుందేల్ ఖండము వరకునున్న చిల్లరరాజ్యములవారందరితో మిక్కిలి గట్టిదైన స్నేహబంధ మేర్పరుచుకొనుట నాల్గవ ఫలితము.

(5) బుందేల్ ఖండును కంపెనీరాజ్యములో కలుపుకొనుట అయిదవ ఫలితము.

సింధియా భాంస్లేలతోడి యుద్ధమువల్ల నేను కోరుచున్న ఫలితములివ్వి :—క్లుప్తము.]

ఈ పైమాటవల్ల వెల్లస్లీని తీవ్రముగ పీడించుచున్న పరరాజ్య గ్రసన బుద్ధి తేటతెల్లముగ తెలియుచున్నది.

అందుచే అకారణముగ, దేశమందు శాంతి ప్రబలియున్న తరుణమున, యితడాశాంతిని చెడగొట్టి, చెప్పరాని దుండగపు పనులు చేయుటకు పూనుకొనెను. అతని మాటలను వినుడు :—

[దేశమందు సంపూర్ణముగ శాంతిప్రబలియున్ననుకూడ, సింధియా మనతో సఖ్యపడిననుకూడ, మనకు భయము గలిగించుచున్న ఆ * ఫ్రెంచిరాజ్యమును గనుక సింధియా తీసివేయక పోయినాడంటే, అందుకు మనమే చెయ్యిచేసుకొనక తప్పదు. కాబట్టి, సింధియామీదికిపోయే యుద్ధములో మనమెక్కువ వాంఛించవలసినదేమనగ; ఫ్రెంచిసేనానియగు 'పెరాక్' సేనను నాశనం చెయ్యడమే. అనగ, అతని ఫిరంగిదళమును, యుద్ధసామాగ్రిని, యావత్తు పట్టుకోవడం కూడ అందులో తప్పక వున్నదన్నమాటే"—(క్లుప్తము.)

(వెల్లస్లీ జూలై 2-వ తేదీన లేక్ సేనానికి వ్రాసిన ఉత్తరమునుండి)

ఈఉత్తరములో అడుగునగీతగీచిన మొదటివాక్యములను చూడుడు. సింధియా ఒకవేళ సఖ్యపడినను, యీ ఫ్రెంచి రాజ్య మిషపెట్టి వెల్లస్లీ యెట్లును యుద్ధము ప్రారంభించి దేశశాంతికి భంగము కలిగించేవాడనుట స్పష్టమగుటలేదా?

సింధియాపై బహిరంగముగ యుద్ధమునకు పోవుటకుముందు, అతని బలమును క్రుంగదీయ వలసియున్నది. అందుకొరకే వెల్లస్లీ అసంఖ్యాకములగు కుట్రలను పన్నసాగించెను. ఈ పనికి లేక్ సేనాని చాలలేదు. ఇతడు కేవలము క్రూరుడగు మోటపశువేగాని, తెలివితేటలు ఆట్టేలేవు. కాబట్టి, యీ కుట్రపనులలో యితనికి సహాయము చేయుటకుగాను, కుట్రలలో ఆరితేరిన ఒక మనిషిని యితనికి సప్లయి చేయవలసి యుండెను. ఇట్టివాడెవడా యని వెల్లస్లీ ఆలోచించి ఆలోచించి "గ్రామీ మర్సర్" అను డాక్టర్ నొకని పట్టుకొనెను. ఇతడు కుటిలతంత్రములలో చాణక్యునికి చదువు చెప్పగలవాడు. ఇతనిని వెల్లస్లీ లేక్ సేనానికి అసిస్టంటుగ నిచ్చెను. సింధియా యాశ్రయములో నున్నవారందరిని చీలదీయవలసిన పనిని వెల్లస్లీ యితనికి ప్రత్యేకముగ పెట్టెను. అనగ చంక బిడ్డను జారదీయుపని యితనికి పెట్టిరన్నమాట. వెల్లస్లీ తన శక్రటరీచేత యితనికి 1803 సం॥ జులై రెండవ తేదీన యిట్లని రహస్యపు టుత్తరములో వ్రాయించెను :—

---

* ఇది వెల్లస్లీపుర్రెలో తప్ప యింకెక్కడనులేదు. ఇది వట్టి బూటకపు బూచి.

[......ఆ ప్రముఖులందరు సింధియా యధికారమునకు ప్రతికూలముగ నున్నారట. ఆ యధికారమునుండి తప్పించుకొని బయటపడుటకు యేదైనా ఉపాయము దొరికితే వారు తక్షణమే బయటికివచ్చి వేస్తారట......క్లుప్తము.]

ఆ ప్రముఖులందరు సింధియాకు ప్రతికూలముగ నున్నారని ఇంగ్లీషువారికెట్లు తెలిసినది ? వారికేదో ఆశలుపెట్టి వారిని చీలదీయ వలసినదని చెప్పి వెల్లస్లీ స్పష్టముగ యీ "గ్రామీమర్సర్‌కు" ఆజ్ఞాపించెను—చూడుడు :—

[దౌలత్‌రావు సింధియా తాలూకుసేనలను చెదరగొట్టివేసే విషయములో వారు తమ శక్తికొలది ఇంగ్లీషువారికి సహాయపడేయెడలను, మరియు, సింధియాగాని, యే యితరులుగాని ఆయాప్రాంతములలో యికముందు తిరిగి తలయెత్తకుండ అణచిపెట్టి యుంచేయెడలను, వారికున్న హక్కులను వంశపారంపర్యముగ వారికిచ్చివేతుమని నీవు సదరు ప్రముఖులకు ఆశపెట్ట వలసినది.—క్లుప్తము.]

ఈ కుట్రలనన్నిటిని సక్రమముగ నెరవేర్చుటలో మర్సరుకు తోడ్పడుటకుగాను కొంతమంది మిలిటరీ యుద్యోగులనుకూడ వెల్లస్లీ అతనికి సహాయమిచ్చెను. మరియు, అతడు పంపిన బరాతముల ప్రకారము ఈ రహస్యపు పనులకన్నిటికి అతనికెప్పుడు యెంతడబ్బు కావలిస్తే అంతడబ్బు యిస్తూవుండ వలసినదనిచెప్పి వెల్లస్లీ అలహాబాదు, కాన్పూరు, ఇటావా జిల్లాల కలెక్టర్లకు కూడ హుకుములు బంపెను.

## (4) పాలంచక్రవర్తిని టోపీ వేయుట-కుట్ర

ఇవిచాలక వెల్లస్లీ ఢిల్లీ పాదుషాయగు పాలమ్‌నుకూడ టోపీవేయ సమకట్టెను. వెనుక వారన్ హేస్టింగ్సు ఢిల్లీ పాదుషాను మధోజీ సింధియా చేతులలో పెట్టియుండెను. సింధియా పాలంను యెన్నడుగాని హింసించినట్లు యెక్కడను ఫిర్యాదులు లేవు. అయినప్పటికి, యిప్పుడు వెల్లస్లీ సదరు పాదుషాకేవో ఆశలను పురికొల్పుచు ఒక ఉత్తరము వ్రాసి దానిని రహస్యముగ లేక్ సేనాని ద్వారా పంపించెను. ఆ ఉత్తరము నిట క్లుప్తముగ వివరింతుము :—

[ఘనతవహించిన మీ పాదుషాహారియెడ మా బ్రిటిష్‌గవర్నమెంటు కెట్టిప్రేమ, గౌరవముగలదో తమకెరుకయే. మీ సంరక్షణను మీరు దురదృష్టవశాత్తు ఇంగ్లీషువారి చేతులలోనుండి తప్పించి, మహారాష్ట్రుల చేతులలోనికి బదలాయించుకొన్న నాటినుండి, తమకు మహారాష్ట్రులవల్ల యెట్టియిక్కట్టులు, అవమానములు జరుగుచున్నవో తలచుకొని మా కంపెనీవారము నిత్యము విచారపడుచుందుము. మహారాష్ట్రులు మీయెడ చేయుచున్న అన్యాయము, క్రౌర్యము, అమానుషముచూచి, వానినుండి మిమ్ములను తప్పించవలయునని మేమెంతచూచినను మాకిన్నాళ్ళనుండియు యితరపని తొందరలవల్ల అవకాశము చిక్కలేదు. ఇందుకునాకెంతయో సంతాపముగనున్నది. అయినను ఫరవాలేదు. మాకిప్పుడు చెయ్యితీరుబడి యైనది. తమకు త్వరలోనే తిరిగి మాసంరక్షణభాగ్య మబ్బురోజులు వచ్చుచున్నవి. వీలైనంతవరకు నేను మీకు సహాయము చేస్తాను.

మీరిందుకు అంగీకరించేటట్టయితే, మీరువచ్చి మాసంరక్షణలో హాయిగనుండుట కొరకు చోటమంచి శరణాలయమును మీకొఱకై మా సేనాపతిచేత యేర్పాటు చేయించినాను. మీ కచ్చట సమస్త ఉపచారములు, సౌఖ్యములు జరుగగలవు. మీకు, మీభార్యాపిల్లలకు శక్కిన బంధువులకు అక్కడ తగిన పోషణ జరుగుటకు మంచి యేర్పాటులు చేసెదను.

ఇందు విషయమై మరికొన్ని సంగతులు మా సేనాపతి మీకు తగుసమయమున చెప్ప గలడు—క్లుప్తము.]

వెల్లస్లీ యీ యుత్తరములో పాదుషాపై యొలికించిన ప్రేమయంతయు వట్టి బూటకము. ఇదంతయు దొంగ వగలు. వెఱ్ఱిబాగులవాడగు పాదుషాను తన బుట్టలో వేసుకొనుటకై నెరపిన బోగము టక్కులు. ఇందలి అసత్యములు యెట్టి వారికైనను కండ్లకు గట్టినట్లే గాన్పించు చున్నందువల్ల వానినిట విప్పి చెప్ప పనిలేదు.

ఈ ఉత్తరమును నమ్మకమైన ఒకమనిషి ద్వారా బహురహస్యముగ మిక్కిలి జాగ్రత్తగ పాదుషాకు పంపవలసినదని 1803 సం॥ జులై 27–వ తేదీన వెల్లస్లీ లేక్ సేనానికి వ్రాసెను. ఈ ఉత్తరము తాము పాదుషాకు పంపినట్లు బ్రహ్మాకు తెలియ నీయవద్దని కూడ చెప్పెను.

[ఈ ఉత్తరమును నమ్మకస్థుడైన సయ్యద్ రజాఖాఁ చేత పంపవలెను. మీకప్పుడు అవసరమని తోచినమాటలను సహా మీరు రజాఖానుకు చెప్పి అతనిద్వారా మీరీయుత్తరమును పాదుషాకు పంపవలెను. మరియు యీ రజాఖానును ఢిల్లీలోనే వుండమని చెప్పి అక్కడ యెప్పుడేమి జరిగితే ఆసంగతులనన్నిటిని మనకు తు,చ, తప్పకుండ—ఎప్పటివప్పుడు—మనకు తత్క్షణము పంపుచుండునట్లుకూడ మీరు యీ రజాఖానుతో యేర్పాటు చేసుకోవలెను. ఢిల్లీ పాదుషాతో మనము చేసుకోబోయే సఖ్యము మనకు ముందు ముందు చాలా లాభిస్తుంది...... ఎట్టిషరతులనుగాని ముందుగ కోరకుండగనే, పాదుషా మనతో సఖ్యముచేసుకొంటాడని నా తలంపు—క్లుప్తము.]

ఇంగ్లీషువారితో సఖ్యము చేసికొన్నందువల్ల పాదుషాకు వచ్చు లాభము లేమియో యెవరుగాని యే ఉత్తరములోను సూచింపలేదు. అయినను రజా ఖానుతో చెప్పి పంపమన్న మాటలేమిటి? ఢిల్లీ పాదుషాకేవో ఆశలు పెట్టనిది అతడు ఇంగ్లీషువారితో ఊరికే యేల సఖ్యమును చేసుకొనును? "నిన్ను తిరిగి ఇండియా యావత్తుకు చక్రవర్తిని చేసి ఢిల్లీ సింహాసనముమీద కూర్చుండబెట్టుతా మనియో, లేక, మహారాష్ట్రులు లాగికొన్న రాజ్యభాగమును తిరిగి నీకు యిప్పిస్తా మనియో" ఇంగ్లీషువా రితనికి ఆశపెట్టియుండి యుండవలెను. రజాఖాను ద్వారా మూజువాణీగ చెప్పి పంపించమన్న మాట లివియే యైయుండవలెను. పూర్వపు మైసూరు హిందూరాజ కుటుంబమునకు తిరిగి రాజ్యమిప్పిస్తామన్న ఆశలుపెట్టి కాదా ఇంగ్లీషువారు లోగడ కుట్రలుపన్ని టిప్పూ రాజ్యమును హరించినది? ఢిల్లీ

పాదుషాయు యిప్పుడు సదరు మైసూరు హిందూరాజ కుటుంబమునే పోలి యున్నాడు. ఇతనికి తిరిగి రాజ్యమిప్పిస్తామన్న ఆశలుపెట్టి, ఇంగ్లీషువా రితనిని సింధియానుండి తిరుగతీసిరి.

కాని, తమపని తీరిపోయిన తరువాత వీరు ఢిల్లీ పాదుషాకు చేసిన వాగ్దానములనన్నిటిని యెగబెట్టి అతనిని—పాపము—నానాయేడ్పులు యేడ్పించిరి! ఇతని గోడును ఇంగ్లండులో చెప్పుకోనుటకే సుప్రసిద్ధ బ్రహ్మసమాజ స్థాపకుడగు రాజా రామ మోహనరాయలవారు అప్పుడు ఇంగ్లండు వెళ్లుట తటస్థించినది. ఆ నాడు 1803 సం॥ లో లేక్ సేనాని ద్వారా యీ పాదుషాతో జరిగిన ఒడంబడికనుగూర్చి 45 యేండ్ల అనంతరము 1848 సం॥ డిశంబరు 18-వ తేదీన కంపెనీ డైరక్టర్ల మీటింగులో పెద్దచర్చ జరిగినది. ఇందునుగూర్చి "థాంప్సన్" అను మెంబరు యిట్లు చెప్పెను :—

[మహారాష్ట్ర యుద్ధములో లేక్ సేనాని జయమొందినందుకు ఢిల్లీ పాదుషా అతనిని అభినందించుచు (రజాఖాన్ చేత) పంపించిన ఉత్తరములో తాము నాకు చేసియున్న వాగ్దానము చెల్లించవలసినదని కోరుచు సదరు పాదుషా 1803 సం॥ అక్టోబరు 5-వ తేదీన గవర్నర్ జనరల్ వెల్లస్లీ కొక ఉత్తరము వ్రాసెను. 1803 సం॥ డిశంబరు 2-వ తేదీన లేక్ సేనాని ఒక కరారునామాను వ్రాసి పాదుషా చేతికిచ్చెను.]

అంతట కంపెనీ ప్రెసిడెంటు యిట్లని జబాబు చెప్పెను.

['థాంప్సన్' గారు చెప్పిన కరారునామా కాగితము యిక్కడ కంపెనీ రికార్డులలో గాని, ఇండియా గవర్నమెంటు రికార్డులలోగాని, కనుపించుటలేదు. అట్టి కరారునామాను గవర్నమెంటువారు ఫైసలాగా అంగీకరించినట్లెక్కడనులేదు. ఏలననగ, ఢిల్లీ పాదుషాకు యెట్టి వ్రాతమూలకమగు ఖరారునామాగాని యివ్వవద్దని గవర్నర్ జనరల్ వెల్లస్లీ 1803 సం॥ మే 23-వ తేదీననే ఉత్తరు వోసంగెను............అయితే, పార్టీ లిద్దరిలో యెవరో ఒకరు ఒక కాగితము వ్రాసి దాఖలుచేసిన మాటమాత్రము వాస్తవమైయుండును. అంతమాత్రముచేత అది బైండింగుఅగు ఖరారునామాగా అంగీకరించుటకు వీలులేదు—క్లుప్తము.]

అత్యాశ్చర్యకరమగు యీ మాట వినగానే "సల్లివాన్" అను మెంబరు లేచి యిట్లని గర్జించెను :—

[ప్రెసిడెంటుగారు చెప్పిన సమాధానమువిన్నాను. నేనే గనుక జడ్జినైయుంటే, కంపెనీవారిట్లు చేసినందుకు నేను వారిపై పూరానష్టపరిహారమునకు (డ్యామేజీకి) డిక్రీయిచ్చియుందును. ఢిల్లీ పాదుషానుండి మోసముగ తీసికొన్న భూములకు దేశములకు అతనికి వాని ఖరీదు (కంపెన్ సేషన్) యిప్పించుటయేగాక, గత ఫలసాయమునుకూడ ఖరీదు కట్టించి నేను కంపెనీవారిచేత ఢిల్లీ పాదుషాకు యిప్పించియుందును. 'థాంప్సన్' గారు వేసిన ప్రశ్నకు ప్రెసిడెంటుగారు చెప్పిన సమాధానమేమి? లేక్ సేనాని మొగల్ పాదుషా పాలం చక్రవర్తికి వ్రాసి యిచ్చినాడన్న లిఖితపూర్వకమగు కరారునామా కంపెనీ రికార్డులలో యెక్క-

డను కనిపించలేదనియా? లేదు, మేమెరుగము అంటే పోతుందా? మీ రికార్డులలో కనిపించక పోతే యేమి? అది యెవరితప్పు? అసలు ప్రశ్నయేమి? అది మీ రికార్డులలో కనిపించినదా లేదా యనికాదు. అసలిట్టి ఖరారునామా జరిగినదాలేదాయనియే యిప్పుడు ప్రశ్న. గవర్నర్ జనరలుకు ప్రతినిధియై, సంపూర్ణాధికారములు పొందిన 'లేక్' సేనాని మొగల్ పాదుషా కట్టి ఖరారునామా వ్రాసియిచ్చినాడా లేదాయనునదే మన మిప్పు డాలోచించవలసిన ప్రశ్న. షాలమ్ చక్రవర్తి మనుమ డిప్పు డా కాగితమును బయటపెట్టి, దానిని లేక్ సేనాని మాతాతకు వ్రాసియిచ్చినాడని ఋజువుపరచితే, యీ ప్రెసిడెంటుగారేమంటారు? మీకంపెనీవారి కాగితమును రికార్డులలో భద్రముగ పెట్టుకొనకపోతే, అది షాలం చక్రవర్తితప్పా?.......... నాకు చూడగ, షాలం చక్రవర్తి విషయమై మనవారు అతిఘోరముగ వాగ్దాన భంగము చేసినారని స్పష్టముగ కన్పట్టుచున్నది.''......క్లుప్తము—(Asiatic Journal, January 1848 P p. 305-310.]

కంపెనీ డైరక్టర్ల మీటింగులో జరిగిన పైవిషయములను చూడగ, గవర్నర్ జనరల్ వెల్లస్లీ లేక్ సేనానిచేత ఢిల్లీ పాదుషాను బాగుగ టోపీ వేయించినాడని స్పష్టముగ కన్పట్టుచున్నది—అతనికేవో తియ్యని వాగ్దానములను చేయుచు 'ఖరారు నామా' వ్రాసియిచ్చి తమపని తీరిన తరువాత, ఆ కాగితము పోయినదని చెప్పి, ఆ వాగ్దానముల నన్నిటిని కంపెనీవారు బుద్ధి పూర్వకముగ యెగబెట్టిరి! పాపము-వెఱ్ఱిబాగుల ఢిల్లీ పాదుషా షాలం—యీ రీతిగ ఇంగ్లీషువారి టక్కరు తనముచే మోసపోయెను.

## (5) బీగమ్ సమ్రూతో కుట్ర

ఈమె 'సర్ధానా' యను చిన్న జాగీరును యెట్లో సంపాదించుకొని కాలక్షేపము చేయుచుండెను. ఈమెతో కుట్రపన్ని టోపీ వేయవలసినదని వెల్లస్లీ తన లేక్ సేనానికి 1803 సం॥ జులై 28-వ తేదీన ఒక రహస్యపు టుత్తరమును వ్రాసెను :—

[సర్ధానా జాగీరుదారిణియైన బీగమ్‌సమ్రూ (లేక) జేబున్నిసా బీగముతో యేయే యేర్పాట్లుచేయవలయునో నేనిదివరకే మన 'మర్సర్'కు వ్రాసినజాబులో వ్రాసియుంటిని. ఈ సంగతి మీకు తెలిసియేయుండును. ఈమె తాను మన బ్రిటిష్ గవర్నమెంటు క్రిందికివచ్చి చేరుటకు కుతూహలపడుచున్నట్లుగ ఆమె నా కిటీవల వ్రాసిన రెండు ఉత్తరములలో స్పష్టముగ తెలిపినది.

ఆమె జాగీరులోని పరిస్థితులు మనకు చాలా అనుకూలముగ కన్పట్టుచున్నవి. మన చట్టముల నచ్చట ప్రవేశపెట్టుటకు చాల వీల్లున్నవి. కాబట్టి, మన మామెతో చేసుకొను ఒడంబడికలో యీ షరతునుకూడ మీరు యిరికించండి. మీ ప్రయత్నమంతా యీ దృష్టితోనే చేయండి..........

ఆమె తాలుకు సేనలిప్పుడు దౌలత్ రావు సింధియా కొలువులోనున్నవి. ఆమెకు మన రక్షణకావలెనన్నట్టయితే—ఆమె మన సఖ్యమును ఆసించుచున్నమాట నిజమైనట్టయితే-అందుకు ఋజువుగ సదరు సేనలనన్నిటిని ఆమె తక్షణమే సింధియానుండి వెనుకకు పిలిపించి వేయవలయునని మీరామెతో గట్టిగ చెప్పండి. మరియు, గంగా, యమునా నదుల మధ్యనున్న జమీందారులపైనను, తదితర ప్రముఖులపైనను, ఆమెకున్న పలుకుబడినంతను పూర్తిగ వినియోగించి వారిని మనవైపునకు త్రిప్పునట్లు మీరామెతో మాట్లాడండి. వారినందరిని మన అధికారము క్రిందికి తెచ్చి, వారి వారికిగల బలములనన్నిటిని పూర్తిగ మన బ్రిటిషు గవర్నమెంటుకు మద్దతు యిచ్చునట్లును మీరామెతో మాట్లాడవలెను. ఇట్లయితేనే, తనకు మన స్నేహలాభము దొరుకుతుందని మీరామెతో గట్టిగ చెప్పండి........క్లుప్తము.]

## (6) సింధియా సామంతులతో, ప్రజలతో కుట్రలు

సింధియాకు లోబడియున్న సామంతుల తోడను, ప్రజలతోడను వెల్లస్లీ యెట్టి కుట్రపన్నెనో వానినన్నిటిని చిక్కువిడదీసి చూపుటకు వీలుగాకున్నది. అవన్నియు బీరకాయ పీచువలె పెనవేసుకొని పోయియున్నవి. వానిని విడదీయుటకు యెవరికిని సాధ్యము కాకున్నది. అయినను 1803 సం॥ జులై 30-వ తేదీన వెల్లస్లీ లేక్ సేనానికి వ్రాసిన ఉత్తరమును చూడుడు :—

[లోగడ నేను మీకును, మర్సర్‌కును వ్రాసిన ఉత్తరములలో సూచించియున్న మనుష్యులుగాక, యింకను దౌలత్ రావు సింధియాకు లోబడియున్న సామంతులును, ప్రజలును మరి కొందరుకలరు. వీరుబహుశః మన బ్రిటిష్ గవర్నమెంటు క్రిందికి రావలెనని కోరుచుండవచ్చును. ఈ రకం మనుష్యులు చాలమంది యుండవచ్చును. మనమిప్పుడు సింధియాతో యుద్ధము చేయబోవుచున్నాము. కాబట్టి, ఈ రకం మనుష్యులనందరిని మనము చేరబట్టడం అవసరము. సింధియాయెడ అసంతృప్తులైయున్న వారి నందరిని అతని యుద్యోగస్థులను, ప్రజలను, యావన్మందిని-అతనినుండి చీలదీసి, మనవైపునకు రాబట్టుకొనవలెను. ఇట్టి అవకాశములు మీకు కలిగినప్పుడల్లా-నాకు తెలుపడానికి వ్యవధిలేక కేసులనన్నిటిని-మీరే ఫయిసల్ చేయండి. ఎవరికి యెప్పుడు యే యే ఆశలు పెట్టితే బాగుంటుందో మీరే నిర్ణయించుకోండి.

సింధియా సఖ్యమును వీడి, మనవైపుకువచ్చి,మనకు మనః స్ఫూర్తిగ సహాయము చేసే సామంతులకు, తదితరులకు యావన్మందికి కంపెనీవారు గట్టిగ సంరక్షణ నొసంగెదరని మీరు వారికి కంపెనీ పేరట యెట్టి గట్టి వాగ్దానములనిచ్చినను యివ్వవచ్చునని నేనిందుమూలముగ మీకు అధికార మిచ్చుచున్నాను.

మన బ్రిటిష్‌రాజ్యమును యిటు గంగా యమున నదులనుండి అటు 'కుమాన్' పర్వతములవరకు విస్తరింప జేయుటయే నాపరమ సంకల్పమని నేను మీకిచ్చియున్న సలహాలనుబట్టి మీకిప్పటికి గోచరించియుండును. ఈ ప్రదేశములో కొంత భాగము 'గుజరుల'నబడు జాతివారి చేత ఆక్రమింపబడి యున్నది. వీరందరు దౌలత్ రావు సింధియాకు విరోధులైనట్లు తెలియుచున్నది. అందుచే వీరు తరుచు సింధియాతో 'సహరన్‌పూరు' వద్ద పోరాడియున్నట్లును తెలియుచున్నది.

కాబట్టి, యీ 'గుజరులకు' మనపక్షమునకు లాగికొంటే మనకు బలేవాటముగ వుంటుంది. వారికేవో ఆశలుపెట్టి, వారిని మనవైపునకు చేర్చుకొని గంగా యమునా నదుల మధ్య సింధియా పేరులేకుండ తుడిచివేయడానికి వారిని సింధియామీదికి ఉసుగొలిపితే బలే బాగావుంటుంది. కాబట్టి వీరితో యేమిఅనుకూలమైన యేర్పాట్లు చేస్తే బాగావుంటుందో మీరు ఆలోచించి, ఆప్రకారము చెయ్యండి. అయితే, మనకంపెనీ అధికారము పైచేయిగ నుండునట్లు మాత్రము మీరు చూడండి. క్లుప్తము.]

## (7) బంబూఖాన్‌తో కుట్ర

వెల్లస్లీ లోలోపల యిన్ని కుట్రలు, యుద్ధ సన్నాహములు చేయుచున్న దెప్పుడు? పైకి తమకును, సింధియాకును స్నేహమున్నదని? చెప్పుచున్నాడే! ఈ స్నేహ ప్రకారము సింధియా, భాన్‌స్లేలు శాంతినే కోరుచు, యెట్టి యుద్ధ సన్నాహములు చేసుకొనకుండ ఊరకుండగ, వెల్లస్లీ మాత్రము లోలోపల పాతాళ హోమము చేయుచుండెను. పోనీ, తమకు మహారాష్ట్రులపై యేమైన కోపకారణముగాని, కలహ కారణముగాని వుంటే "ఫలానిది మాకు కోపకారణముగ నున్నది—మీరు దానిని తొలగించవలసినది" అని ఇంగ్లీషువా రెన్నడును మహారాష్ట్రులతో మందలించి చెప్పి యుండలేదు. అవును, రాజ్యమును మ్రింగు దురాశతప్ప వేరొండు కారణము లేనప్పుడు వారు యేమని చెప్పుదురు? కాబట్టి, పైకి స్నేహమునే నటించుచు, ఇంగ్లీషువారు లోలోపల సింధియా కాళ్లక్రింద గుండము త్రవ్వసాగిరి. తమ సర్వ సన్నాహములు పూర్తియైన పిమ్మట, గిల్లి కజ్జా పెట్టుకొనుటకు గాను, తప్పు మహారాష్ట్రులదేయని చెప్పుటకుగాను దౌలత్‌రావు యెవరికో రహస్యముగ వ్రాసినాడన్న రెండు ఉత్తరములను వెల్లస్లీ, సాక్ష్యముగ చూపుచున్నాడు. * ఈ వుత్తరములు నిజముగ దౌలత్‌రావు వ్రాసినవో, లేక ఇంగ్లీషువారు కల్పించిన ఫోర్జరీలో, అందలి సంగతులు నిజముగ దోషయుక్తములో లేక నిర్దోషములో—యనుప్రశ్నల నటుంచి, యింకొక విషయ మాలోచింతము. మహారాష్ట్రుల తాలూకు యేతప్పువల్లనైతే, తాను యుద్ధమునకు దిగినానని వెల్లస్లీ చెప్పెనో, అట్టి తప్పును తనకు చూపించిన రెండు ఉత్తరములు వెల్లస్లీ చేతికెప్పుడు వచ్చినవి? అవి 1803 సం॥ ఆగస్టు 15-వ తేదీన వచ్చినవి. అతడు యుద్ధము నెప్పుడు ప్రకటించినాడు? ఆగష్టు 6-వ తేదీన! అనగ, యీ నేరారోపణచేయు ఉత్తరములు తనచేతికి వచ్చుటకు తొమ్మిది దినములకు పూర్వమే వెల్లస్లీ మహారాష్ట్రులపై యుద్ధమును ప్రకటించినాడు! కాబట్టి, యుద్ధము ముందును, కారణము వెనుకనా! ఈ ఒక్క అంశమును బట్టియే యివి ఫోర్జరీలని చెప్పవచ్చును.

---

* మహారాష్ట్రులపై దోషము నారోపించుటకు ఇంగ్లీషువారికి యీ రెండు ఉత్తరములు తప్ప వేరే సాక్ష్యములేమియు లేవు.

అక్రమముగ ముందుగ యుద్ధము ప్రకటించి, దానిని సమర్థించు కొనుటకు గాను వెల్లస్లీ ఈ రెండు ఉత్తరములను తదుపరి తయారుచేయించి తెప్పించినాడని చెప్పవలసియున్నది.

ఈ ఉత్తరములను సింధియా గులామ్ మహమ్మద్‌ఖాన్, బంబూఖాన్ అను వారికి వ్రాసెనట! ఈ ఉత్తరముల అసలు రూపములను యింతవరకెవరు బయట పెట్టలేదు. ఎల్లప్పుడు వానినకళ్లను మాత్రమే చూపుచువచ్చిరి. వెల్లస్లీ చేతికి వచ్చినవికూడ అసల్లుకాక, నకళ్లే వచ్చినవి. ఇవి నిజమైన కాగితములని వెల్లస్లీ గాని, ఆనాటి బ్రిటిష్ ప్రభుత్వోద్యోగులుగాని, నమ్మినట్లుకూడ కన్పట్టదు. ఏల ననగ, గవర్నమెంటు రికార్డులలో వీని తర్జుమాకు పైన ఆనాటి గవర్నమెంటు ఉద్యోగులే యీ దిగువ రీతిగ హెడ్డింగు పెట్టియుండిరి :— "దౌలత్‌రావు సింధియాచే గులామ్ మహమ్మద్‌ఖానుకు పంపబడిన ఉత్తరముయొక్క నకలని చెప్పబడిన కాగితముయొక్క తర్జుమా."

ఈ పై హెడ్డింగునుబట్టి, యీ ఉత్తరము నిజమైన ఉత్తరముకానట్లు ఆనాటి గవర్నమెంటు ఉద్యోగస్తులకే అనుమానము తగిలెనని స్పష్టమగుచున్నది.

సింధియా యీ యుత్తరములు వ్రాసెనన్న ఆ యిద్దరు పెద్దమనుష్యు లెట్టివారో చూచెదము. వీరిలో మొదటివాడు గులామ్ మహమ్మద్‌ఖానుడు రోహిలా నాయకుడు. ఇతడు 1794 సం॥ లో బ్రిటిష్ గవర్నమెంటుచేత ఓడింపబడి తన రాజధానియగు 'రామ్‌పురము'నుండి వెడలగొట్టబడి యుండెను. ఇక రెండవవాడు బంబూఖానుడు, కేవలము దేశద్రిమ్మరి. నానాదేశములు దిరిగి, ఆయారాజులను మెప్పించియు, మోసగించియు, యేదో డబ్బుసంపాదించుకొనవలెనని యితడు చూచుచున్నాడు. ఇతడు దౌలత్‌రావు రాజ్యములో సహరన్‌పురములో కొంత ఆస్థి సంపాదించుకొని యుండెను. ఇతడు చేసిన కొన్ని దుష్టకార్యములకుగాను దౌలత్‌రావు యితనిపైకి చిన్న దండుబంపి, యితని ఆస్థిని లాగికొనెను. అతడంతట అడవులకు పారిపోయెను. అప్పటినుండి యితనికి దౌలత్‌రావుపై ద్వేషముండెను. ఒకడు అనామకుడును, ఒకడు తనయెడ యీర్ష్యవహించిన అల్పుడును నగు వారికా దౌలత్‌రావు సింధియా యీ యుత్తరముల వ్రాసినది? ఇది అసంభవముగ నున్నది.

ఈ రెండు ఉత్తరముల నకళ్ళను కలిపి బంబూఖానుడు మురాదాబాదు కలెక్టరగు "లీస్టర్"కు పంపించెనట! ఈ కలెక్టరు వీనిని గవర్నర్ జనరలు వెల్లస్లీకి పంపించెను. అవి వెల్లస్లీకి 1803 సం॥ ఆగస్టు 15-వ తేదీన (అనగ యుద్ధము ప్రారంభమైన తొమ్మిది రోజులకు) చేరెను. ఈ రెండు ఉత్తరములు దాదాపు ఒకటే మాదిరిగ నున్నవి. గులామ్ మహమ్మద్‌కు వ్రాసిన ఉత్తరమును యీ

బంబూఖాను నెట్లు సంగ్రహించెనో తెలియదు. ఈ ఉత్తరములను మురాదాబాదు కలెక్టరు (లీస్టర్) గవర్నర్ జనరల్‌కు పంపుచు యిట్లు ఉపోద్ఘాతము వ్రాసెను:—

[బ్రిటిష్ ప్రభుత్వమువారివల్ల నే నెంతయో గౌరవమును పొందియున్నాను. అందుకు ప్రతిఫలముగ, యిప్పటిస్థితిలో నేను గవర్నమెంటుకు కించిత్తయినను సహాయముచేసి తీర వలెనను కోర్కె నన్ను తీవ్రముగ ప్రేరేపించుచున్నది. కాబట్టి, ఉచితాభక్తిగ నేను తమ కీరెండు ఉత్తరములను సమర్పించుకొనుచున్నాను. ఈచనవునకు తమరు నన్ను మన్నింతురు గాక. ఇవి తమకు ఒకవేళ పనికిరాకపోయినను, అనవసరమైనను, నాహృదయములోని సద్భావ మును తాము కనిపెట్టి, నేను తీసికొన సాహసించిన చనవునకు తాము నన్ను మన్నింతురని నాకు తెలుసును—క్లుప్తము.]

సింధియాపై కుట్రపరంపరలను పన్నుటకు నియమింపబడిన అసంఖ్యాకులగు యేజెంట్ల ముఠాలో యీ మురాదాబాదు కలెక్టరు ఒకడైనట్లు అతడు వ్రాసిన యుపోద్ఘాతపు మాటలవల్ల తెలియగలదు. వెల్లస్లీచే ప్రేరేపింపబడినవారై యీ యేజెంట్లు దేశమందు మూలమూలకు పోయి, యెక్కడ అవకాశముంటే, అక్క డల్లా దూరి, సింధియాకు విరోధులగువారి నెల్ల వెదకి వెదకి పట్టి, వారిచేత యిట్టి ఫోర్జరీ వగైరాలను సృష్టింపజేసి, వానినన్నిటిని తమ తమ పారితోషికములుగ వెల్లస్లీ మహాకాళీదేవత పాదారవిందములకడ సమర్పించుచున్నట్లు యీ మురాదా బాదు కలెక్టర్ మాటలు చెప్పుచున్నవి. ఈ రీతిగ యెవరిశక్తికి తగినట్లు వారు, చిన్నచిన్న కుట్రలను, పెద్దపెద్ద కుట్రలను పన్ని, చిన్నచిన్న ఫోర్జరీలను పెద్దపెద్ద ఫోర్జరీలను సృష్టించి, యీ యేజంట్లు "పత్రం పుష్పం, ఫలం, తోయం", అన్నట్లు ఎవరి శక్త్యానుసారము వారు వెల్లస్లీ మహాదేవత పాదారవిందములకడ సమర్పించు చుండిరి. ఇట్టి యేజెంట్లలో— చారగణములో-చేరినవాడు యీ మురాదాబాద్ కలెక్టర్ 'లీస్టర్'. ఇతడు సింధియాకు విరోధియగు యీ బంబూఖానును యెట్లో వెదకి పట్టుకున్నాడు. అతని కేవో ఆశలు పెట్టినాడు. ఈ ఆశలకు లోబడి ఇంగ్లీషు వారిని కౌగిలించుకొన వలయునని యితడెంత ఆత్రపడుచుండెనో యితడు సదరు కలెక్టరుకు వ్రాసిన ఉత్తరమే చెప్పక చెప్పుచున్నది. ఇంగ్లీషువారు యేపని చేయ మంటే ఆపని చేయుటకు యితడు సిద్ధముగ నున్నాడు. వేయేల, యేదో అఘాయి త్యము చేసి ముందుగ తానే వారిని సంతోషపెట్టవలెనను తొందరలో కూడ యీతడున్నాడు. ఏపనిచేస్తే బాగుంటుందని ఆలోచించినాడు. ఫోర్జరీ అంటే ఇంగ్లీషు వారికి బలే యిష్టమనుకున్నాడు. కాబట్టి, వెంటనే రెండు ఉత్తరములు సృష్టించి, కలెక్టరు ద్వారవారికి సమర్పించుకొన్నాడు. ఈ పారితోషికమును కలెక్టరుగారు గవర్నర్ జనరల్ గారికి పంపుకొన్నారు. జరిగినకథ యిది. దీనికి చుట్టుపట్టుల పరిస్థితులే సాక్ష్యము:

ఈ ఉత్తరములను సింధియా వ్రాసిన మాట వాస్తవమేయని వాదసౌకర్యమునకు ఒప్పుకొన్నను అందు తప్పేమున్నది? వీనిపైన * తారీఖులులేవు. ఇవే నిజమైన వైనట్లయితే, యిది 1803 సం॥ జూన్ నెల మధ్యమందు వ్రాయబడి యుండవలెను. అప్పుడు పరిస్థితు లెట్లున్నవి? ఇంగ్లీషువారు తాము కంఠమువఱకు కవచాదులను ధరించి, ఖడ్గాది సమస్త శస్త్రాస్త్రములను కేల ధరించి, తమసేనలనన్నిటిని, శత్రువుల పొలిమేరల చుట్టు నిలువబెట్టి, సర్వయుద్ధ సన్నాహములతో తయారుగనుండిరి. మరియు, శత్రువులను, చెఱుపుటకై శత్రుపక్షమందు కుట్రల లేవదీయుచుండిరి. ఎచ్చట చూచినను యుద్ధపు సవ్వడియే వినవచ్చుచుండెను. ఇంగ్లీషురాయబారి కాలిన్సు సింధియాతో మాటమాత్రమైన మాట్లాడకుండ, సింధియా కంటికి కనబడకుండ, లేచిపోతానని బెదరించుచు సింధియాకు కబురు పంపించెను. ఇంతటితో సింధియా మనస్ఫూర్తిగచేయు శాంతిప్రయత్నములన్నియు నిష్ఫలములయ్యెను. అతనికి శాంతియందు నిరాశ జనించెననుటలో ఆశ్చర్యమేమున్నది? శత్రువులు తనను ముక్కుపట్టుకొని యుద్ధములోనికి యీడ్చుచున్నప్పుడు కూడ అతడు యుద్ధప్రయత్నములు చేసుకోరాదా? ఇది తప్పని శత్రువు లెట్లు అతనిని నిందించగలరు? ఇంగ్లీషువారు నీతి నియమములు లేనివారని సింధియా అన్నాడంటే తప్పా?

'లీస్టర్' పంపిన యీ ఉత్తరములు చూచుకొని 1803 సం॥ ఆగస్టు 22-వ తేదీన వెల్లస్లీ లేక్ సేనానికి దిగువ ఉత్తరమును వ్రాసెను:—

[ఇప్పటిస్థితిలో మనము యీ బంబూఖానును మనలో చేర్చుకుంటే బాగుంటుంది. ఆప్రకారమే 'నిన్ను మాలో చేర్చుకుంటే బాగుంటుంది. ఆప్రకారమే నిన్ను మాలో చేర్చుకుంటామని' చెప్పి అతనికి నేనే నొక యుత్తరము వ్రాసినాను. దానినకలు మీకు యిందుతో పంపుతున్నాను.

.........అయితే మీరిప్పుడొక పనిచేయవలెను. ఆగులామ్ మహమ్మద్ ఖాను యెవడో వాణ్ణి పట్టుకొని మనకు అప్పగించవలసినదని మీరు బంబూఖానును ప్రోత్సహించండి. అది సాధ్యముకాకపోతే, కనీసము వాడుపోయి సింధియాతో చేరకుండాను, మనకంపెనీరాజ్యంలోగాని, నైజాము రాజ్యంలోగాని అల్లరులు సాగించకుండాను తగిన బందోబస్తుయినా చేయవలసినదని బంబూఖానుకు చెప్పండి. వాడికి యేదైనాకొంచెము డబ్బురుచి చూపిస్తే యెక్కువ చురుకుగ పనిచేసేటట్టు మీకుతోస్తే, మీరు యుచితమని తోచినంతసొమ్ము వాడిమొగాన వేస్తామని మీరు బంబూఖాన్‌గాడికి ఆశపెట్టండి......క్లుప్తం]

ఈ రీతిగ ఇంగ్లీషువారు తమకుట్ర ముఠాలో యీ బంబూఖానును కూడ చేర్చుకొనిరి. వీడిచేత వారు యేయేపనులు చేయించుకొన్నారో యెవనికెరుక? అవన్నీ పబ్లీకు రికార్డులలో ఉండునా? ఉండదగినవా?

* తొందరలో ఆ వుత్తరములమీద తారీఖు వేయడం మరచిపోయినాడు.

## (8) సిక్కు నాయకులతో కుట్ర

ఈ కాలమున పంజాబులో సిక్కులు పైకివచ్చుచుండిరి. వీరి నాయకులలో ప్రధానుడగు రంజిత్ సింగ్ కాబూల్ రాజును ధిక్కరించి లాహోరునకు నాయకుడై, దానిని స్వతంత్రముగ పాలించుచుండెను. ఇతడును, శివాజీ హైదరాలీల వలె నిరక్షరాస్యుడైనను, వారికున్న తెలివితేటలు యితనికి లేకపోయెను. సిక్కులు మిక్కిలి రణప్రావీణ్యము గలవారు. రంజిత్ సింగే గనుక ఆనాడు దూరదృష్టితో ప్రవర్తించి యుండి యుండినయెడల, తన బలమునంతను మహారాష్ట్ర బలముతో కలిపి, ఇంగ్లీషువారిని యెదిరించి, వారికి గుక్క తిరుగకుండ కొట్టి యుండెడివాడు. కాని, భరతవర్షపు దురదృష్టము చేతనోయన, అతడట్లు చేయుటకు మారుగ ఇంగ్లీషువారి పక్షమునకే మ్రొగ్గెను.

మహారాష్ట్రులతో యుద్ధమువచ్చే టట్టయితే, సిక్కులుతో తాను ముందుగ మంచిమాట చేసుకుంటేనే గాని వీలులేదని వెల్లస్లీ మిక్కిలి దూరదృష్టితో పారజూచెను. తదనుగుణముగ వారిని తన టోపీలో వేసికొనుటకై వెల్లస్లీ 1803 సం॥ ఆగష్టు 2-వ తేదీన 'లేక్' సేనానికిట్లు వ్రాసెను :—

[సిక్కు నాయకులలో మనకు బాగా ఉపయోగపడే వా రెవరనగ:—పాటియాలా రాజును, పాటియాలా యమునా నదుల మధ్యనున్న యితరచిల్లరరాజులును. అయితే, శిక్కులలో వీరందరికంటె యెక్కువ పలుకుబడి గలవాడు లాహోర్ రాజగు రంజిత్ సింగ్ అని తెలియుచున్నది. యావన్మంది శిక్కు చిల్లరరాజులపైనను యితనికి చాలా పలుకుబడి యున్నదట.

1800 సం॥ లోనే దౌలత్ రావు కొలువులోనున్న మన రెసిడెంటు, నాఉత్తరువు ప్రకారము సదరు రంజిత్ సింగు కడకును, యితరరాజులవద్దకును అంతరంగికుడగు యేజెంటు నొకని పంపియుండెను. "మీరందరు మా బ్రిటిష్ గవర్నమెంటుతో చేరి పరిషియానుండి వచ్చుచున్న జిమర్ షాను యెదిరించవలసినదని" యీ యేజెంటుద్వారా వారికి కబురు పంపితిమి. వారప్పుడు మన బ్రిటిష్ గవర్నమెంటుయెడ యెంతో అనుకూలభావమును చూపిరి. కాని, యీలోగా, సింధియా కొలువులోనున్న పరాసువాడు పెర్రన్—వారికి మనమీద యేమేమో కొండెములు చెప్పి వారిమనస్సును విరిచెను. మనమీద శిక్కులకు అనుమానము పుట్టించెను... ఈ రోజువరకుకూడ సదరు పెర్రన్ తన దుష్ప్రచారము చేయుచునే యున్నాడు.......... అయితే, మీకిందువెంట కొన్ని యుత్తరములను పంపుచున్నాను. మీరు వీనిని మీకు అనుకూలమని తోచినప్పుడు, అనుకూలమైన మార్గమున లోగడ మన యేజెంటు మాట్లాడివచ్చిన సిక్కునాయకులలో ప్రముఖులగువారికి పంపించవలెను.

..........లాహోరు మనకిక్కడికి చాలదూరములో నున్నది. మనము చేయబోవు యుద్ధరంగమునకు అది చాలదూరముగనున్నది. కొబట్టి, రంజిల్ సింగు మనకు చేయగలసహాయమొక్కటేయున్నది. పంజాబులోనుండి శిక్కునాయకులందరు మన బ్రిటిష్ గవర్నమెంటుకు

అనుకూలముగనుండేటట్లు అతడు మనతరఫున తనపలుకుబడిని వారిమీద ఉపయోగిస్తే చాలు. ............మహారాష్ట్రుల యధికారమునకు లోబడి, వారికి కప్పములు చెల్లించుచున్న శిక్కునాయకులను మనవైపుకు చీలదీసుకొనవలెను. వారు మహారాష్ట్రులనుండి చీలివచ్చే టట్టయితే, మన బ్రిటిష్‌గవర్నమెంటువారము వారివద్ద కప్పము పుచ్చుకొనకుండ, వారికి కావలసినంత రక్షణయొసంగుదుమని వారికి ఆశలుపెట్టవలెను. ఈ ఆశలుపెట్టి వారిని చీలదీయ వలయును.........ఒకవేళ యీసిక్కు ప్రముఖులందరువచ్చి మనలో చేరకపోయినప్పటికి వారు మహారాష్ట్రులతో చేరకుండ మధ్యతటస్థముగా నైనా వుంటే చాలును. మనకంతే చాలు.

మీరు శిక్కునాయకులకు వ్రాసేవుత్తరాలలో ఒక్క సంగతిమాత్రము వారికి జ్ఞాపకము చేస్తూవుండండి. అదేమనగ, "మీరు గనుక బ్రిటిష్‌గవర్నమెంటుకు యేమాత్రము విరోధ భావము చూపినప్పటికి, ముందుముందు మీకు చెప్పరానిచిక్కులు వచ్చును. అట్లుగాక, మహా బలవంతులమగు మాతోమీరు చేరినట్టయితే, మీకెట్టిలాభములు చేకూరగలవో మీరే ఆలో చించుకోండి—" అనిమాత్రము మీరు సదరుసిక్కునాయకులకు హెచ్చరించి చెప్పచుండండి ......సిక్కునాయకులకు తమ మనస్సులో మనమీద యెంతప్రేమ యున్నప్పటికి, అదిగో— ఆ పరాసువాడగు పెరన్ భయముచేత, వారాప్రేమను బహిరంగముగా వెలిబుచ్చ లేకున్నా రేమో! అదిగాక, మనమిట్లు సిక్కులతో రహస్యముగ బేరము చేయుచున్నామన్న సంగతి రవ్వంత పెరన్ కనిపెట్టినాడంటే, కొంపమునుగుతుంది—మన యీప్రయత్నమంతా వృధా అగుతుంది. కాబట్టి, యీ వ్యవహారమునంతను—సిక్కునాయకులతో మీరు నడపు యీ ఉత్తర ప్రత్యుత్తరములనన్నిటిని బహుజాగ్రత్తగ, అతిరహస్యముగజరుపుచుండవలెను సుమండీ —(స్పష్టము)]

ఈలేఖ భరతఖండ చరిత్రయందత్యంత ప్రాముఖ్యమును వడయ దగియున్నది. ఏలననగ, ఆనాడు రంజిత్‌సింగు పిరికివాడై ఇంగ్లీషువారి పక్షమున చేరెనని చాల మంది యనుకొన్న దానిలోని రహస్యమేమో యీ ఉత్తరమువల్ల బట్ట బయలగు చున్నది. 1800 సంవత్సర ప్రాంతముల శిక్కురాజ్యము స్థాపనయయి యుండలేదు. కాని, శిక్కు నాయకులు పెక్కండ్రు వ్యక్తిగతముగ మిక్కిలి శౌర్య పరాక్రమము లను జూపి, శత్రువులను దద్దరిల్ల జేయుచుండిరి. వీరి చిల్లర దండయాత్రలు దేశ మందు చెలరేగి, నలుముఖముల భీభత్సమును గలిగించు చుండెను. మొగల్ సామ్రాజ్య విచ్ఛిన్నా నంతరము ఢిల్లీ సింహాసనము నధిష్ఠించిన దుర్బలులగు నామ మాత్రపు మొగల్ పాదుషాల కాలములో కొందరు మహమ్మదీయులు చెలరేగి పంజాబులో శిక్కులను హింసించి యుండిరి. ఆ హింసలకు ప్రతీకార మొనర్చు టకై శిక్కునాయకు లప్పుడు పూనుకొనిరి. కాని, వెల్లస్లీ ఇండియాలో అడుగిడు నాటికి శిక్కు లింకను బలిష్టమగు జాతిగ విజృంభించి, సుస్థిరమగు రాజ్యము నేర్ప రుచుకొని యుండలేదు. వారప్పటి కింకను దోపిడీల దండులుగనే యుండిరి. కాబట్టి, ఒక ఇంగ్లీషు దండును పంజాబుకు పంపించినచో వీరిని సులభముగ జయించ వచ్చు

నని "జార్జి తామస్" అను ఆంగ్లేయుడొకడు వెల్లస్లీకి సలహా చెప్పెను. కాని, అప్పుడున్న పని తొందరలో యీ సలహా వెల్లస్లీకి నచ్చలేదు. భరతఖండమందున్న రాజ్యముల నన్నిటిని తనయద్దె సేనల వలలో పడవేసుకొని, వారిని నిర్వీర్యులను చేయుటకై వెల్లస్లీ ప్రయత్నించు చుండినను, శిక్కుల విషయమై మాత్రమిత జేపని చేయ దలచుకొన లేదు. పై పెచ్చు వారితో మంచిమాటల మీదనేయుండి, వారు క్రమక్రమముగ పైకివచ్చుటకుగాను, తాను వారికి తోడ్పడుట రాజ్యతంత్ర దృష్ట్యా అప్పుడవసరమని వెల్లస్లీ యూహించెను. మొదట కేవలము దోపిడీ గుంపులుగ నుండిన శిక్కులు క్రమక్రమముగ పెద్దవారై అచిర కాలములోనే గొప్పరాజ్యమును స్థాపించుకొన గలుగుటకు ముఖ్యముగ యిదియే కారణము.

ఆనాడు ఇంగ్లీషువారి సహాయమే లేనిచో, సిక్కులు, పైకివచ్చెడి వారు కారు. రంజిత్‌సింగ్ ఇంగ్లీషువారి నెప్పుడు యెదిరించక, వారు చెప్పినదాని కెల్ల ఒప్పుకొని, యూరకుండుటకు అతని పిరికితనమే కారణమని కొందరనుకొను చున్నారు. కాని, యిది సత్యముకాదు. ఇందుకు కారణము అతని కృతజ్ఞతా బుద్ధియేగాని, పిరికితనముకాదు. తనను, తన శిక్కుజాతిని యింతపైకి తెచ్చిన ఇంగ్లీషువారియెడ తనకుగల కృతజ్ఞతా బుద్ధిచేతనే, రంజిత్‌సింగ్‌కు ఇంగ్లీషువారి నెదిరించుటకు మనసొప్పక, అతడు అడుగడుగునకు వారు చెప్పినట్లెల్ల వినెను. కృతజ్ఞతా బుద్ధియను యీ మనోదౌర్బల్యము ప్రాచ్యదేశస్థులకు సహజమై యుండు టచేత, వా రమాయికులగు శత్రువుల చేతులలో చిక్కుట తటస్థించు చున్నది. మన ప్రాచ్యఖండస్థులు చూపరానిచోట కృతజ్ఞతా బుద్ధినిజూపి మోసపోవు చున్నారు. రంజిత్‌సింగ్‌గతి శిక్కులగతి యింతే యైనది. వెల్లస్లీ శిక్కులకు వేసిన యెర ఫలించినది—వారు మహారాష్ట్రులకు సహాయము చేయక తటస్థులుగ ఊరకుండిరి.

## (9) సింధియా కొలువులోనున్న యూరోపియనులతో కుట్ర

వెల్లస్లీ పన్నిన యితరకుట్రలు ఫలించి యుండనిచో, శిక్కులు తటస్థులుగ నుండినను కూడ సింధియాకంత ప్రమాదము లేకుండెడిదే. ఈ కుట్రలన్నిటిలో సింధియాకు యెక్కువ ప్రమాదమును గలిగించినది తన కొలువులోనున్న యూరోపి యనులతో వెల్లస్లీ పన్నిన కుట్రయే. వీరిని చీలదీయుటకై వెల్లస్లీ ఇండియాకు రాకపూర్వమే, దక్షిణాఫ్రికాగ్రపు మజిలీయం దుండగనే, నిశ్చయించుకొన్నట్లు నిదర్శనము గలదు. ఇతడక్కడ నుండగ, హైదరాబాదులో రెసిడెంటుగ పనిచేసి వచ్చిన మేజర్—"కర్కు ప్యాట్రిక్కు"తో సంభాషించుచు, వెల్లస్లీ ఒకనాడు అతని నీప్రశ్న యడిగెను. ఈ పరాసుదళమును నైజాముచేత తీసివేయించుటకై

మనమేమిచేస్తే బాగుంటుందో నీవు చెప్పగలవా? ఇందుకు కర్కు ప్యాట్రిక్కు నాలుగు ఉపాయములను జెప్పెను. వానిలో ఒకటి యిది:—

[ప్రధానులగు నేటివు ఆఫీసర్లకును, యూరోపియను సార్జంటులకును తగు ఆశలను చూపెట్టి, వారందరువచ్చి మనకంపెనీకొలువులో చేరునట్లు మనము వారిని ప్రేరేపించవలెను. ఈయెత్తుగనుక పారితే, యీ పరాసుదళము యావత్తు హరించి పోతుంది. లేదా, నామమాత్ర ముగనైన అయిపోతుంది—]

ఈ సలహాప్రకారమే వెల్లస్లీ సింధియా సేననుకూడ నిర్వీర్య మొనర్చుటకు పూనుకొనెను. ''సింధియా కొలువునుండి వచ్చివేసిన యూరోపియను లందరికి గొప్ప బహుమానములు చేయుస్తామహో!'' యని వెల్లస్లీ పెద్దప్రకటనను సాటింపించెను. ఈ సాటింపు వినగానే యిన్నాళ్ళనుండి సింధియా యన్నముతిని, అతనికి విశ్వాసముగ నుందుమని ప్రమాణములు చేసిన యూరోపియను లందరు కృతఘ్నులై సింధియా కొలువునుండి వచ్చివేసిరి. డబ్బు వాళ్ళకండ్ల పడగానే, తమ ప్రమాణముల నన్నిటిని వారు తుంగలో త్రొక్కివేసిరి.

శత్రువులతో పరికైనట్లు అనుమానము తగిలిన శిపాయిలను, సైనికోద్యోగులను, వెంటనే పట్టుకొని, ఫిరంగి మూతికికట్టి, ఎగురగొట్టివేయుట (Court Martial కోర్టు మార్షల్ చేయుట) ఇంగ్లీషువారికిని, తదితర యూరోపియను దేశస్థులకును అనుశ్రుతాచారమై యున్నది. ఈ పనినే సింధియాకూడ చేసియుంటే యెంతో బాగుండెడిది. యుద్ధము క్రమ్మరకు వచ్చుచున్నదని స్థిరమైపోయినప్పుడు తనవద్ద పొట్టకూటికై చేరిన యూరోపియనులు ఇంగ్లీషువారితో పరికై తనకు ద్రోహము చేయుచున్నట్లు అనుమానము తగులగానే, వారినందరిని తక్షణమే పట్టుకొని, ఉరిదీసియో, ఫిరంగి మూతులకు కట్టి కాల్చివేసియో యుంటే, యీ యుద్ధమందు సింధియాకీ యపజయము కలిగెడిదికాదు. ఇది యూరోపియను యుద్ధనీతికి అనుకూలముగనే యుండెడిది. కాని, సింధియా ప్రాచ్యఖండవాసి యగుటచే కిరస్తానీలగు పాశ్చాత్యులు చేయుటకు జంకని యీ క్రౌర్యమును యితడు చేయజాలకపోయెను! ఈ ధర్మబుద్ధియే యితని కొంపదీసినది!

వెల్లస్లీ సింధియాచుట్టు దట్టముగ అల్లిన కుట్ర పరంపర పాశముల చిక్కులను విడదీసి లోకమునకు చూపుటకై యిట కొంత ప్రయత్నించితిమి. ఈ ప్రయత్నమందు మాకు ఇంగ్లీషువారు వ్రాసిన వ్రాతలు తప్ప వేరు ఆధారములు లేకుండెను. ఇంగ్లీషువారు యెంతదూరము తెగబడుటకు జంకలేదో వారి వ్రాతలే చెప్పుచున్నవి. తెరమరుగున యింకను యెన్ని కుట్రపరంపరలున్నవో యెవనికెరుక? వానిని పూర్తిగ యింతవరకు యే చరిత్రకారుడును లోకమునకు విప్పి చూపియుండలేదు. ఈ పని అసలు యెన్నటికైన సాధ్యమగునో లేదో!



# బ్రిటిష్ మహాయుగము

## ఇరువదియేడవ అధ్యాయము.



### రెండవ మహారాష్ట్ర సంగ్రామము — దక్షిణ రంగము.

మహారాష్ట్రులతో యుద్ధము ప్రకటించుటకుగాని, సంధి చేసుకొనుటకుగాని, గవర్నర్ జనరల్ వెల్లస్లీ సర్వ ముక్త్యార్ నామాను తన తమ్ముడగు ఆర్థర్ సేనాని కిచ్చివేసెనని లోగడ చెప్పియుంటిమి. ఈ యధికారప్రకారము ఆర్థర్ 1803 సం॥ ఆగస్టు 6-వ తేదీన మహారాష్ట్రులపై రణభేరీని మ్రోగించెను. ఆ రోజులలో రైళ్ళు, టెల్లిగ్రాములు లేవు. ఆర్థర్ యుద్ధము నిట్లు ప్రకటించిన సంగతి గవర్నరు జనరలుకే కొన్ని రోజులకుగాని తెలియలేదు.

రణభేరీ.

### షట్ సేనా ముఖము

ఇంగ్లీషువారు సింధియా, భాన్స్లేల మీదికి యుద్ధరంగములోనికి తెచ్చిన సేనలు ఆరు ముఖములుగ నుండెను:—

(1) జనరలు స్టూఆర్టు ఆధిపత్యమున మైసూరు పొలిమేరలో ఒక సేనా ముఖము కాచుకొని యుండెను.

(2) గవర్నర్ జనరల్ తమ్ముడు ఆర్థర్ యాజమాన్యమున మరియొక సేనాముఖము పునహా నగరమం దుండెను.

(3) కర్నల్ స్టీవెన్సన్ యాజమాన్యమున నిజాముకిచ్చిన యద్దె సేనలు ఔరంగాబాదు వద్ద తయారుగ నుండెను.

(4) ఉత్తర హిందూస్థానముననున్న ప్రధాన సేనాముఖము "లేక్" సేనాని యాజమాన్యమున నుండెను.

(5) మద్రాసు రాజధానిలో ఉత్తర ప్రాంతమున కర్నల్ కాంబెల్ యాజమాన్యమున యింకొక సేనాముఖము భాన్స్లే తాలూకు ఓఢ్రరాజ్యమును కబళించుటకు సిద్ధముగ నుండెను.

(6) గుజరాతులో సింధియాకు గల రాజ్యభాగమును కబళించుటకు వేరొకసేనాముఖము కర్నల్ "ముర్రే" యాధిపత్యమున సంసిద్ధముగనుండెను.

ఈ రీతిగ ఇంగ్లీషువారు మహారాష్ట్రులను అన్ని దిక్కులను పొదివి కాచుకొని యుండిరి. మహారాష్ట్రులు షడాగ్ని మధ్యమందున్నట్లు తప్తులగుచుండిరి.

ఈ సంగ్రామములో ప్రధానమగు పోరాటములన్నియు దక్షిణమున ఆర్థర్‌న్ను, ఉత్తరమున లేక్ సేనానియు పోరాడవలసి వచ్చెను. ఈ యధ్యాయమందు ముఖ్యముగ దక్షిణమున ఆర్థర్‌చే పోరాడబడిన యుద్ధములగూర్చి చెప్పెదము.

## అహమ్మదు నగరము ముట్టడి-మోసపుగెలుపు.

ఆర్థర్ సేనాని పునహానుండి తన సేనను తీసికొని అహమ్మద్ నగరము వైపునకు నడచివచ్చెను. ఇచ్చట బలిష్టమైన కోటగలదు. ఇది పూర్వము 'నిజాం షాహీ' ప్రభువులచే కట్టబడెను. దీనిని సులభముగ పట్టుకొనుటకు వీలులేదు. శత్రువుల తాకిడీలకు యిది యెంతకాలమైనను తట్టుకొనగలదు. దీనిని గనుక పట్టుకుంటే ఇంగ్లీషువారికి మిక్కిలి వాటముగనుంటుననుట సందేహములేదు. ఏలననగ' యింత బలిష్ఠమైన కోటనే పట్టుకొన్నారే 'ఇంగ్లీషువారింకేమి చేయలేరు' అను అధైర్యము మహారాష్ట్రులకు కలుగును. కావున మొట్టమొదటగ దీనినెట్లయిన వశపరుచుకొనవలయునని ఇంగ్లీషువారు పూనుకొనిరి. దీనిని భుజబలముచే సాధింపరాదుగాన, ఆర్థర్ యిచ్చట మాయోపాయమును ప్రయోగించెను. ఈకోటకు సింధియా కాపుపెట్టిన ఖిల్లాదారుతో ఆర్థర్‌లోగడనే మంచిమాట చేసుకొని యుండెను. ఆగష్టు 7-వ తేదీన అహమ్మద్ నగరమునకు సమీపమున ఆర్థర్ మకాము వేసి అచ్చటనుండి చుట్టుపట్టుల ప్రజల కిట్లని యొక ప్రకటనను సాటించెను:—

[దౌలత్‌రావు సింధియా, రఘోజీ భాన్స్లేలు ఇంగ్లీషువారిపైనను, వారి మిత్రులగు బాజీరావు పీష్వా, నైజాములపైనను అక్రమముగ యుద్ధము ప్రకటించి మామీదికి సైన్యములను నడుపుకొనివచ్చుటచేతను, యీపని మానవలసినదని మేమెంత చెప్పినను వారు వినకపోవుటచేతను, మేమిప్పుడు, దేశశాంతిని కాపాడుటకై వారిలో యుద్ధమునకు విధిలేక దిగవలసివచ్చినది. అంతేకాని, దేశ ప్రజలగు మీపై మాకెట్టి పగయులేదు. కాబట్టి, మీరందరు మీ మీ చోట్లనుండి కదలక శాంతముగ నుండవలయును. మేమిచ్చు ఉత్తరువులకు మీరు విధేయులై యుండవలయును. మీరు మా బ్రిటిష్ సేనకు హానిచేయకుండవుంటే, మావల్ల మీకును యెట్టిహానియు రాదు. అయితే, ప్రజలందరు హెచ్చరిక గలిగియుండవలెను. ఎవరును మీమీ యిండ్లను వదలిపెట్టిపోకూడదు. మీరెవరుగాని మా బ్రిటిష్ సేనకు యెట్టిహానియు చేయరాదు. అట్లెవరైన యిండ్లువదలిపెట్టి పోయినను, లేక మా సేనకు హానిగలిగించినను, మేము మిమ్ములను శత్రువులుగ భావించవలసి వస్తుంది. మీకప్పుడు చాలాకష్టములు కలుగుతవి.........క్లుప్తము.]

ఈ ప్రకటన మంచిపని చేసినది. ఇంగ్లీషువారు తమకు మిత్రులుగ, దేశశాంతిని కాపాడువారుగ వచ్చుచున్నారేకాని, శత్రువులుగ వచ్చుచుండుట లేదని ప్రజలు—అమాయిక ప్రజలు—పాపము—నమ్మి యూరకుండిరి!

ఆర్థర్ ఆగష్టు 8-వ తేదీన అహమ్మద్ నగరువద్ద మకాము వేసి ఖిల్లాదారుకు కబురు పంపించెను. అతడిదివరకే ఆర్థర్‌తో పరికై యున్నాడు కాబట్టి, అతడెట్టి తీవ్రప్రతిఘటనము చేయలేదు. రెండు మూడురోజులు కొంచెము యెదిరించీ యెదిరించనట్లుగ నటించి 11-వ తేదీన అతడు కోటను ఆర్థర్ చేతులలో అప్పగించివేసి, తన మూట ముల్లెతో సహా బయటికివచ్చివేసెను. కోట గోడలో ఒక్క చిన్న పెచ్చయినను ఊడలేదు. "కోటచెక్కు చెదరక దిట్టమైన స్థితిలోవున్నద"ని ఆర్థర్ కోటలోపల ప్రవేశించిన పిమ్మట తన అన్నకు వ్రాసిన జాబులో వ్రాసెను. కొంచెమైనను చెక్కు చెదరకుండ ఒక్క ఫిరంగి వ్రేటునైనను కోటగోడమీదికి గురిపెట్టి కొట్టవలసిన పనిలేకుండ యింతబలిష్టమైనకోట ఊరికే ఇంగ్లీషువారికెట్లు చిక్కెను? ఈ ప్రశ్నకు సమాధానము గవర్నమెంటువారు ప్రచురించిన "అహమ్మద్‌నగర్ గెజటీరు" పత్రికలో 695 పేజీలో కలదు.

[ఆర్థర్ ఆగష్టు 9-వ తేదీన కోటచుట్టు పరీక్షించి చూచెను. కోటగోడలచుట్టునున్న జామీనులు దిట్టముగనుండి, సదరు గోడలను దుర్భేద్యముగ చేసివేసినట్లు ఆర్థర్‌కు కనిపించెను. ఏచోట కొట్టితే గోడపగులుతుందో ఆర్థర్‌కు తోచలేదు. అప్పుడు 'రఘురావుబాబా'యను దేశముఖుడు ఇంగ్లీషువారివల్ల నాలుగువేల రూపాయలు లంచము పుచ్చుకొని "యిదిగో యీ తూర్పు వైపునకొట్టితే గోడపగులుతుంద"ని వారికి సలహా చెప్పెను!—క్లుప్తము.]

కాబట్టి, కోట అంత సులువుగ ఇంగ్లీషువారికెట్లు స్వాధీనమయ్యెనో యిప్పుడు ఋజువైనది.

కోట నిట్లు సులభముగ స్వాధీనము చేసుకొన్న తరువాత ఆర్థర్ ఆగష్టు 13-వ తేదీన మరల యింకొక సాటింపు వేయించెను.

[దౌలత్‌రావు సింధియా, బీరారురాజులు ఇంగ్లీషువారిని, వారి మిత్రులను యెదిరించబూనినారు కాబట్టి, నేను ఆత్మరక్షణార్థమై యీ అహమ్మద్‌నగర్ కోటను ముట్టడించి పట్టుకొన్నాను. ఈ కోటకు సంబంధించిన దౌలత్‌రావు తాలూకు భూములనన్నిటిని స్వాధీనపరచుకొనుటకుగాను నేను "కెప్టన్ గ్రాహామును" నియమించుచున్నాను. కాబట్టి, అందుండు అమీల్‌దారులు, తదితరులు, యింతటినుండి మా 'గ్రాహాము'నకే విధేయులై వర్తించుకొనవలయును. ఇంకెవరి యాజ్ఞలను వారు పాటించరాదు. దీనికి విరోధులుగ వర్తించిన వారికి చాల యుపద్రవమువచ్చును. మా 'గ్రాహాము' అహమ్మద్ నగరములోనే యుండును.......క్లుప్తము.]

పిమ్మట ఆర్థర్ కొన్నిదినములపాటు అహమ్మద్ నగరముననేయుండి, ప్రజలను ఇంగ్లీషువారి మాయా యావరణములోనికి తెచ్చుటకు తగుయేర్పాటులగావించెను. అయితే యిక్కడ యింకొకసంగతి చెప్పవలసియున్నది. ఈ యుద్ధమును తామొక్కరేగాక, పేష్వా, నైజాముల కొరకు కూడ పోరాడు చున్నామనిగడ

ఆర్థర్ చుట్టుపట్టుల ప్రజలకు చాటించెను. ఈ కోటను స్వాధీనపరచుకొనుటలో సైతము తామొక్కరి పేరనేగాక, పీష్వా పేరకూడ దానిని స్వాధీన పరుచుకొను చున్నామనియు ఇంగ్లీషువారు చెప్పిరి. కాబట్టి, సదరు కోటకును, దాని తాలూకు భూములకును, సంబంధించిన యాజమాన్యమంతయు తనమనుష్యుల చేతులలో కూడనుండవలయునని పీష్వా కోరుట సహజమేగద. కాని, ఆర్థరుకీ బుద్ధిలేదు. పీష్వాను తియ్యనిమాటలతో మాత్రమే సంతృప్తిపరచి, యీకోటలోగాని, దాని చుట్టునున్న దేశములోగాని పీష్వాకు యేమాత్రము భాగము పెట్టకుండ యెగగొట్టి అంతయు తమ ఇంగ్లీషువారే దిగమ్రింగవలయునని ఆర్థర్ కడుపులోనున్న ఆలోచన. 1803 సం॥ ఆగష్టు 13-వ తేదీన యితడిందునుగూర్చి పునహా రెసిడెంటగు "క్లోజు" కిట్లని వ్రాసెను :—

[ఈ కోటను భూములను గూర్చి పీష్వా యెట్టి యాశగాని పెట్టుకోరాదని నాయుద్దేశము. నేనయితే యీ కోటను, యీ భూములను మనపేరను, పీష్వాపేరను కలిపియే స్వాధీనపరుచుకొన్నమాట వాస్తవమే. అయితే యేమి? దీనిపరిపాలనకంతకు నేను మన "కెప్టన్ గ్రాహాము" నే నియమించదలచుకొన్నాను. నీవు పీష్వాతో యిందు విషయమై మాట్లాడితే బాగుంటుంది. ఈ కోట మన (ఇంగ్లీషువార)కెంత అవసరమో నీవతనికి నచ్చజెప్పి ఇక్కడ మేనేజిమెంటుకు కంపెనీ తాలూకు మనిషివుంటే నేతప్ప దేశశాంతి నిలువదని కూడ చెప్పవలెను. అదిగాక, యీ భూములపైవచ్చు ఆదాయమునకంతకు సరియగు జమాఖర్చు లెక్క మేము వుంచుతామనియు, అందులో తనవంతును తనఖాతాకు జమకట్టుతామనియుకూడ నీవు పేష్వాతో చెప్పవచ్చును........క్లుప్తము.]

కాని, మరునాడే ఆర్థర్‌బుద్ధి మారిపోయి తిరిగి యిట్లని వ్రాసెను:—

[నేను నిన్ననీకు ఉత్తరము వ్రాసినతరువాత నాబుద్ధి మారిపోయింది. అహమ్మద్ నగరపు టాదాయములో సగంవంతు పీష్వాకిస్తామని అతనికి ఆశపెట్టడం మంచిదికాదని నాకిప్పుడు తోచింది. కాబట్టి, అతనికిట్లనిమాత్రము చెప్పవలసినది. "అంతమీద వచ్చేరాబడిని యుద్ధపుఖర్చులక్రింద ఖర్చుపెడతాము. ఆ లెఖ్ఖను మీకు పంపుతాము" అని మాత్రము ఆకును పోకను పొందకుండ యేవో పొడికబుర్లుమాత్రం పీష్వాతో చెప్పితేచాలు. అయితే ఒక్కసంగతి మాత్రము మనము ముఖ్యముగ చూచుకోవలెను. "ఈదేశం ఇంగ్లీషువాళ్లు కాజేశారే" యను అసంతృప్తిపీష్వాకు కలుగకుండమాత్రము మనము చూచుకోవాలి. ఇందువిషయమై అతనిమనస్సు చికాకుపడకుండ, దానికి శాంతిచేయుచుండవలయును. ఇట్లయితేనేగాని, మన వ్యవహారమిప్పుడునడవదు. ఈ అవసరంగడిస్తే తరువాత చూచుకుందాం"—క్లుప్తము.]

ఆనాడు క్లైవు ఒమీచందును మోసగించినట్లే యిప్పుడు ఆర్థర్ పీష్వా రాజీరావును మోసగించ సమకట్టెను. అయితే, యీయుద్ధము పూర్తియగులోగా అతడును, జాగీరుదారులును తమమీద తిరుగబడతారేమో యను భయము ఇంగ్లీషువారికి లోపల బాధించుచుండెను. అందుచే తియ్యనిమాటలచే వారిమనస్సులకు నిరంతరము శాంతిచేయుచుండుటకై వారు పూనుకొనిరి.

[యుద్ధములో జయించుకొన్న దేశాన్ని మిత్రమండలిలో అందరము పంచుకుందామని మొత్తముమీద యేదో ఒకబండమాట మనమిప్పుడంటే చాలు. యుద్ధము పూర్తియైనతరువాత అప్పటి పరిస్థితులనుబట్టి, యెటుపీలుగావుంటే అటుచూచుకుందాము. కాని, యీలోగా మాత్రము మనము పీష్వామనస్సును శాంతింపజేయుచుండుటకై బహుజాగ్రత్తగ పనిచేసుకొనుచుండవలెను. లేకపోతే, యితడు బేసిక్ సంధిని త్రోసివేసి లేచిపోతాడేమో! ఇతడు లేచిపోతే, దక్షిణముననున్న జాగీరుదార్లుకూడ యితనితోచేరి మనమీదికి దండెత్తుతారేమో! కాబట్టి, మనము బహు జాగరూకతతో నుండవలయును... ..క్లుప్తము.]

అని ఆర్థర్ ఆగష్టు 17-వ తేదీన క్లోజుకు వ్రాసెను.

తన కంఠమునకు ఇంగ్లీషువారు తగిలించిన ఉరినుండి తప్పించుకొని పారిపోవుటకై పీష్వా బాజీరావు ప్రయత్నించుచున్నట్లు ఇంగ్లీషువారికి తెలిసినది. అందుచే యీ యుద్ధము పూర్తియగువరకునైన అతనిని మంచిమాటలచే బుజగించి కూర్చుండబెట్టవలయునని వారు చూచుచుండిరి. ఆగష్టు 24-వ తేదీన ఆర్థర్ 'మేజర్ షా'కు యిట్లని వ్రాసెను:—

[అయినా, పీష్వా పునహానుండి పారిపోతాడని నేననుకోను. ఒకవేళ, ఆతనికట్టిబుద్ధి పుట్టినా, తన చుట్టునున్న మంత్రులకు తెలియకుండ ఆతడు పారిపోలేడు. అక్కడ జరుగు సంగతుల నన్నిటిని యెప్పటికప్పుడు మనకు చెప్పుచుండుటకుగాను, నేను పీష్వామంత్రులకు బాగా లంచమ్ములిప్పించుచున్నాను. పూనాలో వ్యవహారములేమియు బాగుండకపోయినను మనమిప్పుడేమిచేయుటకు వీలులేదు. వానినిప్పుడు సర్దుకోబోతే, అసలే చెడుతుంది. మనకు వెనుకప్రక్క పోరు కలుగుతుంది. దీనితో మనము నాశనం అవుతాము. కాబట్టి, యిప్పుడు వూరుకోవడమే మంచిది..........క్లుప్తము]

"పీష్వామంత్రులకు విరివిగ లంచము లిప్పించుటకు వెల్లస్లీ ప్రభువు (గవర్నర్ జనరల్) పూనుకొన్నాడు. పీష్వా రహస్యముగ యేమేమి ఆలోచనలు చేయుచున్నాడో ఆ రహస్యముల నన్నిటిని మాకు నిరంతరము చేరవేయుచుండవలసినదని ప్రోత్సహించుచు మనహామంత్రులకు కావలసినంత డబ్బు పారవేయుచుండవలెను. ఇది యిప్పుడు చాల అవసరం. ఈ మంత్రులకిప్పుడు యీకబుర్లు చేరవేయడంతప్ప వేరే రాజ్యాంగపు పనులేమియు నుండకూడదు. మిగతా రాజ్యాంగ వ్యవహారములనన్నిటిని వారు కట్టగట్టి మూలమూరంగా పారవేయవలెను. పీష్వాను యెప్పటికప్పుడు అదుపులోవుంచడానికి యీపని చాల అవసరం—]

అని ఆర్థర్ అస్సీ యుద్ధరంగమునుండి సెప్టంబరు 28-వ తేదీన పునహా రెసిడెంటు క్లోజుకు వ్రాసెను.

ఈరీతిగ యుద్ధము పూర్తియై తాము బయటపడువరకు ఇంగ్లీషువారు పీష్వాను యెట్టిట్టియ్యని మాటలచే, యెట్టి మోసకార్యములచే, పునహానుండి లేచిపోకుండ అణచిపెట్టి కూర్చుండబెట్టిరో పై యుత్తరములే చెప్పక చెప్పుచున్నవి.

కాని, యుద్ధమంతయుపూర్తియై తీరా పీష్వాకు భాగము పెట్టవలసిన సమయము వచ్చినప్పుడు ఇంగ్లీషువా రేమన్నారు? "నీకేమిటి యిచ్చేది. పో, పొమ్మన్నారు."

"జయించుకొన్న దేశాల్లో పీష్వాకుభాగం పెట్టవలసిన పనిలేదు. ఈమాట బేసిన్ ఒడంబడికలో లేదు." అని ఆర్థర్ 1803 సం॥ నవంబరు 11-వ తేదీన తనయన్న గవర్నర్‌జనరలుకు వ్రాసెను.

దక్షిణమున జరిగిన పోరాటములలో యింతవరకు అహమ్మదునగరపు ముట్టడినిగూర్చి చెప్పితిమి. ఇక మైసూరు పొలిమేరలో నిలిచియున్న జనరల్ స్టూఅర్టు కేమియు విశేషముపని తగులలేదు. అక్కడ పొలిమేరలను కాచుకొనుటకును, దక్షిణముననున్న మహారాష్ట్ర జాగీరుదారులను హడలగొట్టి వారు ఇంగ్లీషువారిపై తిరుగబడకుండ అణచియుంచుటకును మాత్రమే యీ స్టూఅర్టు నక్కడపెట్టినట్లు అతడు 1803 సం॥ ఆగష్టు 8-వ తేదీన గవర్నర్‌జనరల్‌కు పంపించిన రిపోర్టులో స్పష్టముగ వ్రాయబడియున్నది. దీనినిబట్టికూడ, బాజీరావును సింహాసనముమీద తిరిగి కూర్చుండబెట్టు విషయమున యీ జాగీరుదారులు సుముఖులుగనున్నారని నాడు ఇంగ్లీషువారు చెప్పినమాటలు టక్కరుమాటలని ఋజువగుచున్నవి—ఇది విషయాంతరము.

మైసూరు పొలిమేరను కాపు.

## అస్సీయుద్ధము—యూరోపియన్ ఆఫీసర్ల స్వామిద్రోహము.

దక్షిణమున జరిగినయుద్ధములలో పైన పేర్కొన్నవిగాక యింకొకయుద్ధము ప్రధానముగ పేర్కొనవలసి యున్నది. అదే అస్సీయుద్ధము. రెండవ మహారాష్ట్ర సంగ్రామములో యీ యుద్ధము చాల ప్రాముఖ్యమైనది.—మహారాష్ట్రులకు పరాజయమును, ఇంగ్లీషువారికి అఖండవిజయమును కలుగజేసినది యీ యుద్ధమే. ఈయుద్ధము అస్సీయను చిన్నగ్రామమువద్ద 1803సం॥ సెప్టెంబరు 23 తేదీన జరిగినది. ఈ గ్రామమిప్పుడు నైజాము రాజ్యమునకు వాయవ్య మూలను ఆనుకొని 'జాల్నా' యను రైలుస్టేషనుకు ఉత్తరముగ సుమారు 30 మైళ్ల దూరములో నున్నది. ఇప్పుడా గ్రామమువద్ద పాడైన మట్టి కోటగోడల దిబ్బలుతప్ప యింకేమియు కానరావు. అక్కడప్పుడు చనిపోయినవారి తాలూకు కొన్ని గోరీలుమాత్రము మామిడిచెట్లతోను, మర్రిచెట్లతోను నిండియున్న ఒకానొకతోపులో నేడుగాన్పించును. ఇంతకు మిక్కిలి యుద్ధచిహ్నములేమియు నేడచ్చట గాంభీర్యముగ కనిపించవు. గ్రామమంతయు బహు చిన్నదగుటచే నిశ్శబ్దముగ నిద్రపోవుచున్నట్లు నేడు గాన్పించును. ఆనాడక్కడ ప్రేలిన ఫిరంగిధ్వనులు యింకను తమచెవులలో మార్మ్రోగుచున్న ముసలివగ్గులు 1900 సం॥ వరకు ఒకరిద్దరు బ్రతికి యుండిరి. వారీయుద్ధమును చూచినట్లును,

అందులో ఆర్థర్ సేనానినికూడ తాము చూచినట్లును, ఆయుద్ధములో ఫిరంగులు ఎద్దులచే లాగబడి యుద్ధరంగమునకు కొనిరాబడినట్లును, వారుతమ చిన్ననాటి కబుర్లను చెప్పుచుండిరి. ఇప్పటికిని రైతులక్కడ పొలములదున్ను కొనుచున్నప్పుడు ఆనాడు ప్రేల్చబడిన ఫిరంగుల తాలూకు సీసపుగుండ్లును, యినుపముక్కలును వారి నాగలి కఱ్ఱులకు తగులుచుండును. వానిని రైతులు పైకితీసి "యివి ఆనాటి యుద్ధములో ప్రేలిన ఫిరంగుల తాలూకు గుండ్ల"ని చెప్పుచు బహువింతవస్తువులుగ వానిని దాచుకొనుచుందురు.

ఆర్థర్ ఆగష్టు 18 వ తేదీవరకు అహమ్మదు నగరమందేయుండి, ఆనాడు తనసేనలను వెంటదీసుకొని బయలుదేరెను. ఔరంగాబాదు వద్దనున్న స్టీవెన్‌సన్ సేనలతో కలియుటకుగాను యితడు 24 వ తేదీన గోదావరిని దాటివచ్చెను.

కుట్రచేసి ఇంగ్లీషువారు అహమ్మదు నగరపుకోటను పట్టుకొన్నారన్న సంగతి వినగానే, మహారాష్ట్రులును, తమ శిబిరములనుండి కదిలి నిజాము రాజ్యములో ప్రవేశించిరి. వీరికి వ్యవధి లేకపోయినప్పటికి, వీరు త్వరత్వరగ యుద్ధప్రయత్నముల నన్నిటిని చేసుకొని, తమతమ సైన్యవాహినులతో యుద్ధరంగమునకు దుముకగలిగి రనుట యెంతయు ప్రశంసార్హ్హముగ నున్నది. ఈ యుద్ధమునాటికి దౌలత్‌రావు సింధియా యిరువదిమూడు సంవత్సరముల వయస్సుగల పిన్నవాడే! ఈ చిన్నవయస్సునందు సైత మితడు చూపిన అపారమగు రాజనీతిజ్ఞత, దూరదృష్టి, యుద్ధరచనా నైపుణ్యము శత్రువులను సహితము దిగ్భ్రమ నొందించెను.

కాని, సింధియా సేనయంతయు చెదల పుట్టవలె కుట్రలచే చిల్లులుపడి యుండుటవల్ల, యితని సేనలోని రహస్యములన్నియు శత్రువులకు యెప్పటికప్పుడు తెలిసి పోవుచుండెను. ఇంగ్లీషువారు సింధియా కొలువులో నున్నవారికి బాగుగా లంచములుమేపి యెప్పటి కబుర్లప్పుడు తెలుసుకొనుచుండిరి. ఈరీతిగ దేశీయులు పరదేశీయులిచ్చిన లంచములకులోబడి తమస్వామికి, దేశమునకు, ద్రోహము చేసుకొనుట చూడ, వారి కానాడు సమగ్రమగు విశాల జాతీయభావము లేకపోయెనని చింతించవలసి యున్నది.

శత్రువుల నడకలిట్లు యెప్పటికప్పుడు తెలియుటచే ఇంగ్లీషువారు మహారాష్ట్రుల సేనలను యిరుకు సమయములో యెదిరించి, వారిపై సులభముగ జయము గైకొనగలిగిరనుటలో ఆశ్చర్యమేమి? దౌలత్‌రావు సింధియా హైదరాబాదు మీదికి పోవలయునను తలంపుతో తనగుఱ్ఱపు దండును తీసికొని ముందునడచి పోయెను. కాల్బలమును, ఫిరంగులును వెనుక వచ్చుచుండెను. వెనుక వచ్చుచుండిన కాల్బలమును, ఫిరంగులును 'అస్సీ' గ్రామమువద్దకు చేరియున్నవనియు, దౌలత్‌రావు అక్కడలేకుండ ముందు సాగిపోయినాడనియు, 1803 సం॥ సెప్టెంబరు

23వ తేదీ ఉదయమున ఆర్థర్‌కు యెవరోవచ్చి చెప్పిరి. ఇదేమంచి సమయమనిచెప్పి ఆర్థర్ అప్పుడు వెనుకచిక్కిన కాల్బలమును, ఫిరంగి దళమును యెదిరించెను. అంతట వుభయపక్షములకు జరిగిన యుద్ధపువివరముల నన్నిటిని యిటవివరింప పనిలేదు. వాని తప్పొళ్లు తెలిసికోనగోరువారు సెప్టంబరు 24 వ తేదీన ఆర్థర్ తన అన్నకు వ్రాసిన ఉత్తరములోను, తదుపరి పంపిన రిపోర్టులోను మూలమందు చూడనగును. సింధియా సైనికులుజూపిన అప్రతిమాన ప్రతాపము తమకే ఆశ్చర్యము కలిగించిన దని ఆర్థర్ వ్రాసిన రిపోర్టులవల్ల తెలియుచున్నది. కాని, ఆసమయమున దౌలత్ రావు స్వయముగ యుద్ధరంగమందు లేకపోవుటచేతను, సేనంతయు ద్రోహులతో నిండియుండుటచేతను, సింధియా బంటులు చూపిన ప్రతాపమంతయు నిరర్థక మయ్యెను. సింధియా కాల్బలములోను, ఫిరంగిదళములోను యూరోపియను ఆఫీసర్లే ప్రధానులుగ నుండిరి. వీరందరు తిన్నయింటివాసములు లెక్కపెట్టు స్వభావముగల వారని లోగడనే చెప్పియుంటిమిగద. వీరిలో కొందరు వెల్లస్లీ బహిరంగముగ ప్రకటించిన ఆశలకులోబడి యుద్ధము ప్రారంభించువేళకు లేచిపోయిరి. మిగతావారు బహిరంగముగ లేచిపోవక, నామకః సింధియాకొలువులో నిలిచియున్నను, వారు ఇంగ్లీషువారివల్ల రహస్యముగ డబ్బుపుచ్చుకొనుచు తమస్వామియగు సింధియాకు ద్రోహము చేయవలెననియే కూర్చుండిరి. ఇట్లుకానిచో, శత్రుబలముకంటె అధిక సంఖ్యాకులైన మహారాష్ట్ర కాల్బలమిట్లు అనాయాసముగ శత్రువుల కేల లోబడి పోవును? ఆర్థర్ పన్నిన వ్యూహములు అంతపటిష్ఠములైనవి కావని రణశాస్త్రిజ్ఞులే చెప్పియున్నారు. అట్టిచో సింధియా కొలువులోని స్వామిద్రోహుల సహాయమున గాకపోయినచో ఆర్థర్ సింధియా సేననెట్లు అంత అనాయాసముగ ఓడించగలడు.

దౌలత్‌రావు పూర్వీకుడగు మాధవరావు ఆనాడు వారన్ హేస్టింగ్సు దుస్సలహావిని, అవివేకియై, తన కొలువులో యూరోపియనులను చేర్చుకొన్నాడు. ఆయవివేక కార్యఫలము నిప్పుడు దౌలత్‌రావు అనుభవించవలసి వచ్చినది. మహారాష్ట్రులు యూరోపియను యుద్ధపద్ధతుల నవలంబింపక, తమ మామూలు యుద్ధపద్ధతులనే అవలంబించి యుండినచో, వారిని ఇంగ్లీషువారు జయించలేక పోయెడివారని కొందరు ఆంగ్లేయులే అభిప్రాయము నిచ్చియున్నారు. దేశీయుల యొక్క వింత యుద్ధపద్ధతులు, వింతవ్యూహరచనా రహస్యములు, మర్మములు అన్యదేశీయులగు ఇంగ్లీషువారికి తెలియక వారు చిక్కుపడేవారు. మహారాష్ట్రులన్ననో స్థానబలిమిచే తమకు చిన్నప్పటినుండియు బాగుగ తెలిసి ఆరితేరిన వ్యూహముల పన్ని నీటియందు మొసలివలె రణరంగమందు వారు వీరవిహారమొనర్చి శత్రువులను భీభత్స మొనర్చెడివారు. ఈ రహస్యమును వారన్ హేస్టింగ్సు గ్రహించి, మహారాష్ట్రులను వారి స్వధర్మమునుండి మరలించి పరధర్మములో పెట్టుటకు పూనుకొనెను. అనగ, వారి స్వంతయుద్ధ పద్ధతులను మాన్పించి, వారిని యూరోపియను

యుద్ధ పద్ధతుల లోనికి దింపించెను. ఈ మాయను గ్రహించలేక వారు వారన్ హేస్టింగ్సు టోపీలో పడిరి. మహారాష్ట్రులు తమపద్ధతులను మాని, పైకితళుకుగ గన్పించుచున్న యూరోపియను యుద్ధపద్ధతుల నవలంబించిరి. "స్వధర్మేనిధనమ్ శ్రేయః, పరధర్మో భయావహః" అను భగవద్గీతా వాక్యముగనుక మాధవ రావు సింధియా ఆనాడు బాగుగ మననము చేసికొనియున్నచో అతడీ టోపీలోపడే వాడుకాడు. వారన్ హేస్టింగ్సు మహారాష్ట్రులకిట్లు యూరోపియను యుద్ధపద్ధతుల నేర్పుచున్నప్పుడు, యిందువల్ల తమకేగో ఉపద్రవము వచ్చునని మిగతా యూరోపియనులందరు భయపడగ వారికి వారన్ హేస్టింగ్సు యిట్లు సమాధానము చెప్పెను :—

[ఫిరంగులను పోతపోయుట, ఫిరంగులను ప్రేల్చుట, తమ సేనలకు యూరోపియను యుద్ధపద్ధతులను నేర్పుట మున్నగు పనులలో మహారాష్ట్రులుచాల అభివృద్ధికి వచ్చుచున్నారు. దీనివల్లమనకు చాల ఉపద్రవము కలుగుతుందని మీాకు పడేభయము కేవలము నిరాధారమైనది. వారే గనుక మనయూరోపియను యుద్ధపద్ధతులలోనికి దిగితే, వారు మనలను రణరంగ మందెన్నడును జయించలేరు. తామెన్నడు నెగ్గలేని దోవలోనికి (పరధర్మములోనికి) మహారాష్ట్రు లిప్పుడు పడుచున్నారు. ఏది తమకు శ్రేయస్కరమో—వేనిని నమ్మికొని వివేకముతో నడుచుకుంటే వారికి లాభముకలుగుతుందో—అట్టి తమ సొంతపద్ధతులనుండి (స్వధర్మముల నుండి) వారిందుమూలముగ వెలియగుచున్నారు. (సర్ ఫిలిఫ్ ఫ్రాన్సిస్ పార్లమెంటు ఉపన్యాసమునుండి.)]

* సర్ ఫిలిఫ్ ఫ్రాన్సిస్ 1805 సం॥ ఏప్రిల్ 5-వ తేదీన (మహారాష్ట్ర యుద్ధానంతరము) పార్లమెంటు మహాసభలో నిట్లని చెప్పెను :—

[ఫ్రెంచి ఆఫీసర్లు మహారాష్ట్ర సేనలో యూరోపియను యుద్ధతంత్రములను ప్రవేశపెట్టుదురని కొందరనుచున్నారు. ఇందువల్ల మనకేమియు నష్టములేదని నా అభిప్రాయము. నష్టములేకపోవుటయేగాక, మనకిదియెంతో లాభకరమనికూడ నానమ్మకము. మహారాష్ట్రులతో మనకు పోరాటమే యింకను సాగవలసియుంటే, యీపద్ధతియే మనకు చాలా లాభకరముగ నుండును. తనసొంత యుద్ధపద్ధతులను (అవి యెంతవక్రముగనున్నను) వదలుకొనుట చేతనే మహారాష్ట్రులు మనచేతులలో అంత పెద్దదెబ్బతిన్నారు.—అంతనష్టపడినారు. వారికి అనాదినుండి అనుశ్రుతముగ వచ్చుచున్న యుద్ధపద్ధతులనే గనుకవారు వదలకుండ ఉండియుంటే వారు మనకు అభేద్యులయ్యెడివారు—ఇంతకంటె మహాఘోరముగ మనలను యెదిరించగలిగెడివారు. ఈ సత్యమును ప్రపంచచరిత్ర అనాదినుండి ఘోషించుచునే యున్నది. ఈ రహస్యమును వారన్ హేస్టింగ్సు బాగుగ గ్రహించెను—(**Cobbetto Parliamentary Debates Vol. IV. Page 232.**)]

---

* అనగ చేప నీటినివిడిచి ఒడ్డునకు వచ్చునట్లగుచున్న దన్నమాట. ఈరీతిగ వారన్ హేస్టింగ్సుకరి మహారాష్ట్ర మకరిని నీటినుండి ఒడ్డునకు లాగినది. కాబట్టి యేనుగ మొసలినిచంపుట యిప్పుడు తేలికయైనది.

"తమవద్ద అన్నిఫిరంగులున్నను మహారాష్ట్రులు వానినంత యెక్కువగ యేల ఉపయోగించలేద"ని 1899 సం॥ లో ఒక మిలిటరీ ఆఫీసరు అస్సీ గ్రామము వెళ్లినప్పుడు అక్కడనున్న ఒకముసలివాని నడుగగ, అతడిట్లు సమాధానము చెప్పెనట! " ఫిరంగులను ఉపయోగించుట మహారాష్ట్రుల కప్పుడు కొత్త. అదిగాక అప్పుడక్కడ మేతలేక పోవుటచేత, ఫిరంగిబండ్లు లాగుయెడ్లను మేతకొరకై దూరముగ పంపవలసి వచ్చెను. ఇంతలో ఆర్డర్ ఆకస్మికముగ వచ్చిపడెను. దూరముగనున్న యెడ్లను తోలుకొని వచ్చి, ఫిరంగి బండ్లకు కట్టి, యుద్ధరంగమున కీడ్చించుకొని పోవుటకు వ్యవధి లేకపోయెను. ఒకటి రెండు ఫిరంగులను మాత్రము యెట్లో శిపాయిలు లాగికొని పోగలిగిరి." అని ఆ ముసలివాడు సమాధానము చెప్పెనట. (**Pioneer**—1899 సం॥ మార్చి 3-వ తేదీ పాయనీర్ పత్రిక)

కాబట్టి, మహారాష్ట్రులు తమపాత పద్ధతులను వదలి, కొత్త పద్ధతుల నవలంబించుటవల్ల యెట్టి చిక్కులకు లోనైరో సదరు అస్సీ గ్రామవాసి చెప్పిన మాటలనుబట్టికూడ తెలియుచున్నది.

" అయితే, మంచిగనున్న కొత్త పద్ధతులను అసలే నేర్చుకోరాదా? మనమెల్లప్పుడు కూపస్థ మండూకములవలె పాతపద్ధతులనే పట్టుకొని వ్రేలాడవలయునా" యను ప్రశ్న వచ్చుచున్నది. దీనికి సమాధానమిది—యూరోపియను 'డ్రిల్లు' నందు, యితర రణశిక్షణమునందు మాధవరావు సింధియాకు అంత మోహము వుంటే, అతడు నిజముగ ఒక పనిచేసి యుండవలసినది. తన ప్రజలకు యూరోపియను రణవిద్య నేర్పుటకుగాను తన రాజ్యములో ఒక మిలిటరీ స్కూలును (సైనిక కళాశాలను) మాధవరావు సింధియా యేర్పరచి యుండవలసినది. అందు రణవిద్యయందు ప్రవీణులగు యూరోపియను యుద్ధశాస్త్ర పండితులను వేతనములిచ్చి నియమించి యుండవలసినది. అట్లు చేయుటకు మారుగ మాధవరావు సింధియా వారన్ హేస్టింగ్సు మాయ గ్రహించలేక అడ్డమైన యూరోపియను వాళ్లను ఆలోచనలేకుండ తన సేనలో చేర్చుకొని వారికి మిక్కిలి జబాబుదారితో కూడిన ఉద్యోగ పదవులనిచ్చెను. వీరిలో కొందరు వారన్ హేస్టింగ్సుకు అంతరంగికులగు వేగులు వారనికూడ మాధవరావు గ్రహించలేక పోయెను! వీరందరు చేరి తుదకు మాధవరావు కొంపను గూల్చిరి. కాబట్టి, యీ చరిత్రాంశమునుండి భావిభారత స్వరాజ్య ప్రభుత్వము వారొక గుణపాఠమును నేర్చుకొనవలసి యున్నది. యూరోపియను రణవిద్య మనకు అవసరమయ్యె టట్టయితే, మిలిటరీ కళాశాలలను పెట్టి, యూరోపియను పండితుల నందు నియమించి, వారి ద్వారా మన దేశీయులను తరిఫీయతు చేయించుకొనవలెనేగాని, యూరోపియనులను నమ్మి వారికి యెట్టి జబాబుదారీగల పదవులను గాని యివ్వరాదు. అట్లిచ్చినచో వెనుకటి మహారాష్ట్ర చరిత్రయే తిరిగి జరుగును. మనదేశస్థులను కొంతమందిని జర్మనీ,

అమెరికా, జపాన్, రష్యా మున్నగు దేశములకు పంపికూడ యీ రణవిద్యను మన దేశమునకు ఆకర్షించవచ్చును.

పరుల రణవిద్య శ్రేష్ఠమైనదైనచో, దానిని స్వదేశీయులకు నేర్పించవలయునే గాని—అనగ దానిని తమదిగ చేసుకొనవలెనేగాని—పరులను తీసికొనివచ్చి తమ స్వదేశీ సేనలో పెద్ద పదవులలో పెట్టరాదను సిద్ధాంతమును పాశ్చాత్య ఖండములలో ప్రచండ కుటిల చాణక్యుడుగ భావింపబడు "మ్యాక్ వెల్లీ" పండితుడు సైతము స్పష్టముగ సూత్రీకరించి యున్నాడు.

మహారాష్ట్రులు తమ పాతపద్ధతులను మార్చి కొత్తదియగు యూరోపియను పద్ధతుల నవలంబించి యున్నప్పటికి, వారిసేనలో యూరోపియనులు గనుక లేకుంటే, వారిని జయించుట ఇంగ్లీషువారికి సాధ్యమయ్యెడిది కాదని ఆర్థరే 1803 సం॥ నవంబరు 18-వ తేదీన మేజర్ షాకు వ్రాసిన ఉత్తరములో స్పష్టముగ వక్కాణించి యుండెను.

[సింధియా సేనలు మిక్కిలి దుర్భేద్యమగు తరిఖీయతులో నున్నవి. అతని సేనలోగల యూరోపియను ఆఫీసర్ల ప్రయత్నములవల్ల సింధియాబలము అపారమై పోయినది. కాని వారి కాల్బలములో ఒక యూరోపియనుకూడ లేకుండవుంటే సింధియాబలము కనీసము మనఇంగ్లీషు వారికైనను దుర్భేద్యముగ నుండియుండెడిది.—మరియు, మహారాష్ట్రులు తమ పాత్రపద్ధతి ప్రకారమే, తమ గుఱ్ఱపుదండుతోనే—పోరాడియుంటేకూడ—వారు మనకు వశమయ్యేవారు కారు...క్లుప్తము.]

కాబట్టి, యూరోపియను పద్ధతుల నవలంబించుటవల్ల సింధియాకు యిది వరకు కంటె యెక్కువ కొత్తబలము వచ్చినప్పటికి, అతని సేనలో యూరోపియను లుండుటవల్ల యీ కొత్తబలము, పాతబలము యావత్తు కూడ—కొత్తనీరువచ్చి పాతనీరును కూడ కొట్టుకుపోయినట్లు ఒక్కసారి తుడిచిపెట్టుకొని పోయినది! కాబట్టి, యూరోపియను పద్ధతులు మంచివైనను, యూరోపియను మనుష్యులు మనకు మంచివారుకారు. కాబట్టి, మంచిని గ్రహించి, చెడును వదలివేయుట యుక్తము. ఇదియే భావిభారత స్వరాజ్య ప్రభుత్వమువారు నేర్చుకొనవలసిన పాఠము.

యూరోపియను ఆఫీసర్ల ద్రోహముచేతనే అస్సీయుద్ధములో మహారాష్ట్ర సేనలు ఓడిపోవుట గలిగెననుటకు కొన్ని ఋజువులను ఇంగ్లీషువారి వ్రాతలనుండియే చూపెదము. 1803 సం॥ అక్టోబరు 3-వ తేదీన ఆర్థర్ తనతమ్ముడు 'హెన్రీ' కిట్లని వ్రాసెను.

[సింధియా తాలూకు ఫ్రెంచికాల్బలము టిప్పూ కాల్బలముకంటె చాల బాగున్నది. ఫిరంగులు, ఫిరంగిదళము మరింత బాగున్నవి. అవి సరిగ మనదళమువలెనే యున్నవి.]

ఇంత దిట్టమైన మంచి ఫిరంగిదళముండియు కూడ మహారాష్ట్రసేన యోడి పోయినది. ఆర్థర్ లెక్కప్రకారము అస్సీ యుద్ధరంగమందు ఇంగ్లీషు సేనలో 8 వేల కాల్బలము, 1600 గుఱ్ఱపుదళము, 17 ఫిరంగులు నుండెను. మహారాష్ట్ర సేనలో 50 వేల కాల్బలము, 128 ఫిరంగులు నుండెను.

ఇంగ్లీషుసేనలో చనిపోయిన తెల్లవారిసంఖ్య (ఆఫీసర్లు, సామాన్యసైనికులు సహా) 164; గాయములు తగిలినవారిసంఖ్య 411; కనబడని వారిసంఖ్య 8; ఇంగ్లీషు సేనలోని నల్లవారిసంఖ్య యీరీతిగ నున్నది. చనిపోయిన శిపాయిలు 245, గాయ పడిన సిపాయిలు 1211; కనబడనివారు 18.

ఇక మహారాష్ట్రసేనలో యీసంఖ్య లెట్లుండెనో నమ్మకమైన అంకె లెక్క డనులేవు. వారిలో 1200 మంది చనిపోయినట్లును, శవములును, గాయపడిన వారును నలుముఖముల చెల్లాచెదరుగ దిక్కులేక పడియున్నారనియు తనకు వేగుల వాళ్ళవల్ల తెలిసినదని ఆర్థర్ చెప్పెను * దీనినిబట్టి ఉభయపక్షబలముల దామాషా ప్రకారము సింధియా సేనలోకంటె, ఇంగ్లీషుసేనలోనే యెక్కువ నష్టము కలిగినట్లు తెలియుచున్నది. తమకింత తక్కువ నష్టముకలిగి, తమ మనుష్యులు ఫిరంగులు కూడ యింకను అసంఖ్యాకములుగనే యున్నప్పుడు మహారాష్ట్రసేన యుద్ధరంగ మును వీడి యేల చెల్లాచెదరగ పోవలసివచ్చినది? సింధియా కొలువులోనున్న యూరోపియన్ ఆఫీసర్లలోగాని, యూరోపియన్ కాల్బలములలోగాని, ఒక్కనికి కూడ ఒకదెబ్బ తగులలేదట? ఒకముకుండ చావలేదట? ఏల యీవింత? ఇది స్వామి ద్రోహము తెలుపుటలేదా? ఇందుకు నిదర్శనము 1803 సం॥ అక్టోబరు 23-వ తేదీన ఆర్థరు కర్నల్ ముద్రేకు వ్రాసిన ఉత్తరమే :—

[ఓడిపోయిన శత్రుకాల్బలము అస్సీక్ ఘుర్ నుండి యెటకో పోయినట. దానితాలూకు 16 గురు యూరోపియను ఆఫీసర్లును, సార్జంటులును మన కర్నల్ స్టీవెన్‌సన్ వద్దకు వచ్చివేసి నారు. సెప్టంబరు 23-వ తేదీ యుద్ధముతో నదరు శత్రుకాల్బలము పూర్తిగ నాశనమై పోయింది. వారికయెన్నటికి కొలుకోలేరని మన స్టీవెన్‌సన్ చెప్పుచున్నాడు........... ఏమైతేయేమి, యూరోపియన్ ఆఫీసర్లు అందరు వాళ్లను వదలిపెట్టి వేసినారు........... క్లుప్తము.]

---

* సింధియా సేనలోని వారి నెవరినిగాని ఇంగ్లీషువారు ఖైదీలుగ పట్టుకొనలేదను వింతసంగతిని పాఠకులు గమనించవలెను. గాయములచే నేలమీద పడిపోయినవారిని ఖైదీలుగ పట్టుకొనుటకు గాని, వారికి ఉపచారాదులచేయుటగాని, చేయక ఇంగ్లీషువారు వారిని నిర్దాక్షిణ్యముగ చంపివేసి, శత్రువులలో చచ్చినవారిసంఖ్యను లెక్కకు యెక్కువగ జూపియుందురు. ఈ 1200 లలో యిట్టి వారుకూడ నుండియుందురు.

అని ఆర్థర్ యెంతో సంబరముతో చెప్పెను.

సింధియా సేనలో ద్రోహులున్నారనుటకు మరియొక నిదర్శనము చూడుడు. 1803 సం॥ అక్టోబరు 24-వ తేదీన ఆర్థర్ తనయన్న కిట్లని వ్రాసెను:—

[మీరు ఆగస్టు 29-వ తేదీన గావించిన ప్రకటన ననుసరించి సింధియా కొలువులో నున్న 16 గురు యూరోపియన్ సార్జంటులును, ఆఫీసర్లును యివతలికి వచ్చివేసి మనకర్నల్ స్టీవెన్సన్ ముఠాలోచేరిరి. వారందరిపేర్లను మీకు త్వరలోనే పంపించెదను. వారిలో యెవ రెవరికి మనమెంతడబ్బు యివ్వవలెనోకూడ అప్పుడు వ్రాసెదను.]

అస్సీ రణరంగము-బీగమ్ సమ్రూ స్వామి ద్రోహము.

సార్ధానా జాగీరుదారిణియగు బీగమ్ సమ్రూ సేనలను కూడ ఇంగ్లీషువారు సింధియానుండి చీలదీయుటకు కుట్రపన్ని నట్లు లోగడ చెప్పియుంటిమి. 1803 సం॥ జూలై 18-వ తేదీన 'లేక్' సేనాని గవర్నరు జనరల్ కిట్లని వ్రాసెను:—

[......ఈమె తాలూకు నాలుగు సైన్యదళము లిప్పుడు సింధియా కొలువులోనున్నవి. కొబట్టి, ఆమెయిప్పుడు మనలోవచ్చి బహిరంగముగ చేరుటకివి ఆటంకముగనున్నవి. అయితే, యుద్ధము ప్రారంభముకాగానే, యీమె తాను మనకు చెప్పినప్రకారముతప్పక చేయగలదు. ఆ నాలుగుదళములువచ్చి మన ఆర్థర్ సేనానితో చేరుటకు తగు యేర్పాటులను మీరు చేయ వచ్చును.]

అంతట గవర్నర్ జనరల్ యిట్లని జవాబువ్రాసెను:—

[మీసూచన బలేబాగున్నది. ఇందునుగూర్చిన హుకుములనుయిప్పుడే కర్నల్ స్కాటుకు పంపుచున్నాను. ఈసంగతి మర్సర్‌కు పంపిన సలహాలలోకూడ చేరియేయున్నది.]

కొబట్టి, సమ్రూతాలూకు నాలుగు దళములును సింధియా తరపున వున్నట్లే వుండి, తీరా యుద్ధరంగమునకు రాగానే - యుద్ధమధ్యమందు - ఆకస్మికముగ శత్రు పక్షమునకు చేరిపోయెననుట యీ జాబులవల్ల కరతలామలక మగుచున్నది.

గ్రాంటు డఫ్ తన మహారాష్ట్ర చరిత్రలో యిట్లు వ్రాయుచున్నాడు :—

[బ్రిటిష్ గవర్నమెంటువారు ఆశలుపెట్టుచు చేసిన ప్రకటనవల్ల సింధియా కొలువులో నున్న యూరోపియనులలో ఇంగ్లీషువారు తీరాయుద్ధము ప్రారంభించువేళకు సింధియాపక్ష మునువదలి యెదుటిపక్షమున చేరిపోయిరి. ఇందువల్ల యుద్ధరంగమందు సింధియాసేనలకు చాల యిబ్బంది కలిగినది.........]

ఈ ప్రకటన ఫలితముగ కొందరు యూరోపియనులు బహిరంగముగ లేచి పోయిరి. మిగిలియున్న యూరోపియనులుకూడ లోలోన స్వామిద్రోహము చేయు టకే నిలిచియుండిరి. ఆ ప్రకారమే వీరు సింధియాకు అస్సీ రణరంగమందు స్వామి ద్రోహముచేసి అతని సేనలకు ఓటమిని గలిగించిరి.





వెల్లస్లీ (గవర్నర్ జనరల్)

దగా, దబ్బర, దౌర్జన్యములచే టిప్పూ, నైజాము, మహారాష్ట్రులను వంచించిన తుంటరి.



ఆర్థర్

వెల్లస్లీ తమ్ముడు— రెండవ మహారాష్ట్ర సంగ్రామములో దక్షిణరంగమున కంపెనీ సేనల నడిపించిన ఆంగ్లసేనాపతి.



బేగమ్ సమ్రూం

[వెల్లస్లీతో షరీకై దౌలత్ రావు సింధియాయెడ యుద్ధరంగమందే స్వామిద్రోహము చేసిన ఘాతుకురాలు......606వ పేజీ]

606B



దౌలత్ రావు సింధియా

(నానా మరణానంతరము మహారాష్ట్రము నెట్లయిన నిలువ బెట్టవలెననియు, బాజీరావు ఇంగ్లీషువారి వలపులలో పడకుండ చూడవలెననియు పెనగులాడిన మహారాష్ట్రవీరుడు.)



గ్వాలియర్ కోట—దౌలత్ రావు సింధియా రాజధాని



బాజీరావు

(తండ్రి రఘూబావలెనే, తనయావివేకముచే, ఇంగ్లీషువారి నాశ్రయించి, మహారాష్ట్రమును నష్టపెట్టుచుంచిన ఆఖరు పీష్వా—మహారాష్ట్రపు చెట్టు చెడుకాలమునకు పుట్టిన కుక్కమూతి పిందె. తుదకితనిని మూడవ మహారాష్ట్ర యుద్ధములో ఇంగ్లీషువారు ఖైదీగ పట్టుకొని, ఆ జన్మాంతము ప్రవాసముననుంచి, ఇంత పిండాకుడు పడవేయుచుండిరి. ఇతని పెంపుడు కొడుకు నానాసాహేబు, తదుపరి సైనిక విప్లవమును లేవదీసి దానికి నాయకుడయ్యెను.



మల్హార్ రావు హోల్కార్

(తండ్రి తుకాజీ సింహాసనమునకై సోదరుడు కాశీరావుతో కలహించి, యుద్ధమున చనిపోయినవాడు

—పేజీలు 498-499.)

# బ్రిటిష్ మహాయుగము

## ఇరువదియెనిమిదవ అధ్యాయము



### అస్సీయుద్ధానంతరము.

అస్సీ యుద్ధరంగమందు మహారాష్ట్ర సేనలోనున్న ఫిరంగు లన్నియు ఇంగ్లీషువారికి చిక్కెను. మనుష్యులు మాత్రము విశేషము నష్టము కాలేదు. యుద్ధరంగమును వీడిపోవుచున్న ఈసేనలను వెంబడించ వలసినదిగా ఆర్థర్ కర్నల్ స్టీవెన్‌సన్‌ను ఆజ్ఞాపించెను. కాని, మహారాష్ట్ర సేన అసంఖ్యాకముగ నుండుటచే నదరు స్టీవెన్‌సన్ వారిని వెంబడించుటకు పూనుకొనలేదు. "ఓడిపోయిన శత్రుసేన విశేషము చెక్కుచెదరలేదు. అందుచే కర్నల్ స్టీవెన్‌సన్ వెంబడించినను వారికి భయమేమియులేదు" అని 'మిల్లు' వ్రాసెను. 'ఓడిపోయిన శత్రుసేన చెక్కుచెదరలేదన్న'ప్పుడు వారు స్వామిద్రోహులచేతనే మోసపోయినారని గదా అర్థము. ఈ యభిప్రాయమును మిల్లు చరిత్రకారుని పైమాటలే చెప్పక చెప్పుచున్నవి.

సింధియాసేనలను వెంబడించుటకు మారుగ స్టీవెన్‌సన్ సింధియా దేశముపై పడెను. ఇందునుగూర్చిన వివరమును పిమ్మట తెల్పెదము.

సంధికి ఆర్థర్ ఒప్పుకొనక పోవుట.

అపార బలసంయుతమగు తనసేన యిట్లు అతిసులభముగ ఓడిపోవుటనుబట్టి తనసేనలో స్వామిద్రోహు లున్నారను మాట సింధియాకప్పుడు కరతలామలక మయ్యెను. అందుచే, అప్పటి పరిస్థితులలో ఇంగ్లీషువారితో సంధి చేసుకొనుటయే మంచిదని అతనికి తోచెను. తదనుగుణముగ సింధియా తన మంత్రులలో నొకనిని 'బాలాజీ కుంజర్' అను నతని ఇంగ్లీషువారి వద్దకు రాయబారము పంపించెను. ఇతనిని గురించి లోగడ కొద్దిగ చెప్పియుంటిమి. ఇతడు మొదట పీష్వా బాజీరావువద్ద మంత్రిగ నుండెను. ఇతనిచేతనే బాజీరావు దౌలత్‌రావుకు పునహాకు రమ్మని కబురు పంపించెను. ఇతడు పీష్వావద్ద నున్నప్పుడు యితనికి లంచములిచ్చి తక్కిన మంత్రులతోపాటు యితనిని కూడ తిరుగదీయవలెనని ఇంగ్లీషువారెంతో ప్రయత్నించిరి. కాని, యితడు స్వామిద్రోహిగాక, నిజాయితీ బుద్ధిగలవాడై, స్వదేశాభిమానము గలవాడగుటచే, ఇంగ్లీషువారి మాయలలో పడలేదు. అందుచే ఇంగ్లీషువారితని యెడ క్రోధము వహించి, యితడు పీష్వాకు ద్రోహియని నిందింపసాగిరి. కాని,

యీనింద కేవలము నిరాధారమైనది. తమవలలో యితడు పడలేదుగదాయను ఉక్కురోషముచేత ఇంగ్లీషు వారితని నిట్లు నిందింపసాగిరేగాని, వేరుకాదు. పిమ్మట కొంతకాలమున కితడు దౌలత్ రావుకు మంత్రియయ్యెను. ఇతడిట్లు పీష్వాకొలువును వీడి, దౌలత్ రావు కొలువులో యేల చేరెనో పిమ్మట వివరింతుము.

దౌలత్ రావు సింధియా కోరిక ప్రకారము యీమంత్రి 'కుంజరుడు' సంధిని కోరుచు ఆర్థర్ కొక ఉత్తరము వ్రాసెను. ఈ ఉత్తరమును ఇంగ్లీషువారెక్కడను ప్రచురింపలేదు. అయినను, దీనికి ఆర్థర్ యిచ్చిన జబాబునుబట్టి, అందలి విషయములు గ్రాహ్యములు కాగలవు. 'సింధియా యెల్లప్పుడును శాంతి సఖ్యములనే కోరుచుండెననియు, కాని, ఇంగ్లీషురాయబారి 'కాలిన్సే' అమర్యాదగ సింధియా కొలువు నుండి లేచిపోయెననియు, యీ మంత్రి కుంజరుడు ఉత్తరములో సూచించి యుండెననుట స్పష్టము.

అస్సీ యుద్ధరంగములో గలిగిన జయముచే ఆర్థర్ కు కండ్లు నెత్తిమీదికి వచ్చినవి. అందుచే సింధియా మంత్రి చెప్పు శాంతివాక్యము లతని మనస్సు కెట్లు నాటును? అస్సీరంగములో దొరికిన ఫిరంగులు వగైరాలవల్ల అతని దురాశ మరింత హెచ్చయ్యెను. ఇంకను యెక్కువ ధనము దోచుకొనవచ్చునను ఆశ అతనికి గలిగెను. అందుచే సింధియా మంత్రి చెప్పు శాంతివాక్యములను పెడచెవినిబెట్టి శత్రు సేనను వెంబడించవలసినదని ఆర్థర్ తన సహాయసేనాని స్టీవెన్ సన్ కు ఆజ్ఞాపించెను. కాని, అతడు ఆపని చేయుటకు జంకి యూరకుండెను.

ఈ సమయమున మహారాష్ట్రులు తమ సేనలను కూర్చుకొని, ఇంగ్లీషువారి నెదిరించియుండిన యెంతో బాగుండెడిది. కాని, స్వామిద్రోహుల భయముచే వారట్లు చేయుట కప్పుడు సాహసించక శత్రువుతో సంధిచేసుకొనగోరిరి. ఇది వారికి చాల నష్టదాయక మయ్యెను.

ఇంగ్లీషువారు సంధివాక్యములకు చెవియొగ్గక, మహారాష్ట్రులను వెంబడించ దలచిరి. కాని, యీ పనియందు ఇంగ్లీషువారు నెగ్గలేక పోయిరి. ఈ పనికి పూనుకొని మరునాడు బయలుదేరిన కర్నల్ స్టీవెన్ సన్ కొంతదూరము పోయి, శత్రువుల పొడగానక, యీ పని అసాధ్యమని చెప్పి వచ్చివేసెను. అంతట ఆర్థర్ "తానే ఆపనికి స్వయముగ పూనుకొందునని చెప్పి" 'నీవుపోయి 'బర్హాన్ పురమును' పట్టుకొనుమని,స్టీవెన్ సన్ నను నియమించెను. శత్రువులు ఆర్థర్ కుకూడ చిక్కక పోయిరి. కాని, స్టీవెన్ సన్ క్రింద పంపబడిన సేన అక్టోబరు 22-వ తేదీన బరహాన్ పురము కోటను, 18-వ తేదీన అస్సీర్ ఘర్ కోటను అతి సులభముగ పట్టుకొనెను. దీనికి కారణము మామూలు పాటయే—

బర్హాన్ పూర్, ఆస్సీఘర్ కోటలు ఇంగ్లీషువారికిస్వాధీన మగుట.

అనగ ఇంగ్లీషువారు లేవదిసిన స్వామిద్రోహులే. వీరిలో ముఖ్యులు యూరోపి యనులు. ఇందునుగూర్చి అక్టోబరు 23-వ తేదీన ఆర్థర్ పునహా రెసిడెంటుకిట్లని వ్రాసెను :—

[మన స్టీవెన్ సన్ క్రింద పంపబడిన సేన అస్సీర్‌ఘర్ కోటను 21-వ తేదీన పట్టుకొనెను. అస్సీర్‌ఘర్, బరహాన్‌పురము కోటలమధ్యనున్న శత్రుసేన నర్మదా నది వైపునకు వెళ్ళిపోయినది-అందులోనున్న యూరోపియన్ ఆఫీసర్లు, సార్జంటులున్నుగువారు పదహారు మంది మనము చేసిన ప్రకటన ప్రకారము మన సేనలోనికి వచ్చివేసినారని స్టీవెన్‌సన్ నారు 19-వ తేదీన వ్రాసినాడు. వీరిలో కర్నల్ డూపంటు, కెప్టన్ మర్సర్, కెప్టన్‌మాన్ అను వారుగలరు.........క్లుప్తము.]

కాబట్టి, యీ రెండుకోటలును సులభముగ ఇంగ్లీవారి చేతులలో పడుటకు మహారాష్ట్రులక్కడ కాపలా పెట్టిన సేనలోని యూరోపియనుల స్వామిద్రోహమే కారణమని ఆర్థర్ వ్రాసిన పైవాక్యములే స్పష్టముగ వక్కాణించి చెప్పుచున్నవి. యీ యూరోపియనులు సరిగ సమయమునకు తమ క్రిందనున్న సేన నెక్కడికో పంపివేసి, తామువచ్చి ఇంగ్లీషువారి సేనలో చేరిపోయిరి. ఇక ఆ రెండు కోటలు ఇంగ్లీషువారి చేతులలో చిక్కుటకేమి అభ్యంతరము? కంచయే చేను మేసినది!

ఈ రెండు కోటలు తనకు చిక్కినపిమ్మట, సింధియా, భాన్‌స్లేల సేనలను వెంబడించి పట్టుకొనవలయునని ఆర్థర్ తిరిగ యెంతో ప్రయత్నించెను. కాని, ఆపని అతనికి సాధ్యముకాక పోయెను. తన ప్రయత్నములన్నియు యిట్లు నిష్ఫలముకాగా, ఆర్థర్‌కు విసుగెత్తి సింధియాపంపిన రాయబార వాక్యముల కతడప్పుడు చెవియొగ్గ తలచెను. దీని ఫలితముగ సింధియా, ఆర్థరుల మధ్య తాత్కాలికపు సంధి (యుద్ధవిరామము) 'ట్రూస్' 1803 సం॥ నవంబరు 23-వ తేదీన యేర్పాటు చేసుకొనబడెను. ఈసంధి, సింధియా భాన్‌స్లేల కిరువురకు వర్తింప జేయవలయునని రాయబారు లెంతయో నొక్కి చెప్పిరి. కాని, ఆర్థర్ యిందుకు "ససేమిరా" యనెను. వీరిరువురను చీలదీసి కొట్టవలయునను దురాలోచన మనస్సులో నున్నవాడగుటచే ఆర్థర్ యీ సంధిలో భాన్‌స్లేనుకూడ చేర్చుటకు ఒప్పుకొనలేదు. ఈ సంగతిని యితడే 1803 సం॥ నవంబరు 23-వ తేదీన ఇండియా గవర్నమెంటుకు వ్రాసిన ఉత్తరములో స్పష్టముగ వక్కాణించి యుండెను.

యుద్ధవిరామము.

[బీరారు రాజగు భాన్‌స్లేను యిందులో చేర్చలేదు. ఇందువల్ల సింధియా, భాన్‌స్లేలకు విభేదమేర్పడును. భాన్‌స్లేకు సింధియాపై యిదివర కేమైనా నమ్మకముంటే, అదికాస్తదీనితో పోతుంది. వారిద్దరి సఖ్యము దీనితో తుడుచుకు పోయిందన్నమాటే!.........క్లుప్తము.]

ఆర్థరు సింధియాతో చేసికొన్న తాత్కాలికపు సంధిగూడ నిజమైనదికాదు. ఆర్థర్ యీ సంధిని నిష్కలంకమైన మనస్సుతో చేసుకొనలేదు. సింధియాను

టోపీ వేయుటకే చేసికొనెను. ఇందునుగూర్చి ఆర్థరే పైయుత్తరములో యిట్లని వ్రాసెను :—

[దౌలత్‌రావు సింధియాపై సేనిక యేమియుచేయజాలనని మీకిదివరకే తెలిపియున్నాను. రణరంగమందు సింధియా గుఱ్ఱపు దళమింకను నిలిచియున్నది. మన మెంతో కష్టపడితేనేగాని, దీనిని మనమేమియు చేయజాలము.........యిప్పుడే తాత్కాలికపు సంధి చేసుకొన్నందువల్ల మనకేమియు యిబ్బందిలేదు..........స్థిరమగు ఒడంబడిక యేర్పడువరకు పోరాటము మానరాదను మాట సర్వసామాన్యముగ మంచిదే.......కాని, ప్రస్తుత విషయములో మాత్రము యీ సూత్రమును తప్పించి నడచుటయే మనకు శ్రేయమని తలచితిని......
...క్లుప్తము.]

అనగ, పైకి పోరాటము మానినట్లు కన్పించి, కొంచెము వ్యవధి దీసికొని, శత్రువు యేమరుపాటునున్నప్పుడు మీద పడదమని ఆర్థర్‌యొక్క కుటిలపు టాలోచన ఈదిగువ వాక్యముల జూడుడు.

[స్థిరమగు సంధి యేర్పరుచుకొనుటకు ఆలస్యమయ్యేయెడల, యీ తాత్కాలికపు సంధిని, నేను నాయిష్టము వచ్చినప్పుడు అవసరమైతే మరునాడే అంత మొందించగలను. ఒక్కరోజు వ్యవధియేయున్నను మనకు నష్టమేమియులేదు. నావ్యూహముల నన్నిటిని పన్నుకొనుటకును, శత్రువులను చీలదీయుటకును నాకీ ఒక్కరోజు ఉపయోగపడుతుంది.......
క్లుప్తము.]

యుద్ధ విరామమునకు గాను చేసుకొన్న ఒడంబడికకు పదిరోజులు వ్యవధి యుండునట్లు సదరు ఒడంబడికలోనే ఒక షరతుకలదు. ఈ పదిరోజులలో యెవరుగాని శత్రువుపైకి పోరాదు. అనగా నవంబరు 23 మొదలు, డిశంబరు 3-వ తేది వరకు ఉభయ పక్షములు యుద్ధమును నిలుపుదల చేయవలసియుండెను. కాని, యీ లోపుగానే ఆర్థర్ మహారాష్ట్ర సేన మీదికి 'ఆర్గామ్' వద్ద దుమికెను. ఇది యుద్ధ ధర్మమునకు కేవలము విరుద్ధము. దీనికి ఆర్థర్ చెప్పిన సమాధానమేమి? ఈ ఒడంబడికలో గల రెండవషరతు ప్రకారము సింధియా నడచుకొన లేదట! అందుకని, తానీపని చేసినాడట. ఈ రెండవ షరతు యేమి? ఉభయ పక్ష సైనికులవల్ల యెట్టి ప్రమాదములు జరుగకుండ నుండుటకుగాను, రెండు సేనలకుమధ్య యిరవై కోసుల దూరముండవలయును. అందు నిమిత్తమై సింధియా మహారాజు తన సేనలను 'యెల్లిచిపురము' నకు తూర్పుగ నడిపించుకొని 20 కోసుల దూరము పోవలయును. సైన్యమునకు కావలసిన భోజనాది సామగ్రి కూడ యింకను అవతలనుండియే తెచ్చుకొనవలెను.

విరామ భంగము-రణనీతికి విరుద్ధము.

ఈ షరతు ప్రకారము సింధియా సేనలు నడుచుచుండగ, ఆర్థర్ వానిని వెన్నంట సాగెను. అట్లయినచో, ఉభయసేనలకు మధ్య 20 కోసులు యెన్నడైన

'ఆర్గాం'వద్ద తుంటరి యుద్ధము-మహారాష్ట్రుల ఓటమి.

యెట్లుండగలను? సింధియా యీ షరతు నెరవేర్చలేదను నేరమును అతని మీద వేయుటకుగాను ఆర్థర్ బుద్ధి పూర్వకముగ చేసిన తుంటరిపని యిది! బుద్ధి పూర్వకముగ తానే కల్పించిన యీ సాకును పురస్కరించుకొని, ఆర్థర్ నవంబరు 29-వ తేదీన ఒడంబడిక జరిగిన 6 రోజులకే-ఒడంబడికలో యిచ్చిన వ్యవధి పూర్తిగాక మునుపే-సింధియా సేనలను ఆర్గామ్ అనుచోట యెదిరించి యోడించెను. ఇది అధర్మకార్యమని సింధియా రాయబారులెంత మొత్తుకొన్నను ఆర్థర్ వినలేదు. ఇట్టి స్థితిలో మహారాష్ట్ర సేనలు ఓడిపోక యెట్లు గెలువగలవు?

తన తమ్ముడు చేసిన ఈ ద్రోహకార్యమునకు—యుద్ధ ధర్మ విరుద్ధ కార్యమునకు—అన్న వెల్లస్లీ గవర్నర్ జనరల్ చాల మెచ్చుకొనెను! యుద్ధ ధర్మమునకు విరుద్ధముగ తన తమ్ముడేల యీ యుద్ధ విరామకాలములో (ట్రూస్ సమయములో) శత్రువుపైకి దుమికెనో యను విచారణను వెలస్లీ చేయదలచుకొనలేదు. "నీవు చేసుకొన్న యుద్ధ విరామపు సంధికంటె, నీవిప్పుడు కొట్టిన యీ దెబ్బయే నాకు నచ్చినది—సరే కానిమ్ము. దేశీయరాజులతో యుద్ధము మన కెప్పుడైనా మంచిదే"—అని వెల్లస్లీ తన తమ్ముని పైపెచ్చు మెచ్చుకొనెను కూడాను.

గావిల్ ఘుర్ కోట ముట్టడి--ఖిల్లా దారుని స్వామిభక్తి—వీరశయనము.

ఆర్గామ్ యుద్ధమైన తరువాత, ఆర్థరును, స్టీవెన్‌సను కలిసి 'గావిల్‌ఘుర్' కోటను ముట్టడించుటకై బయలుదేరిరి. వారు డిశంబరు 6-వ తేదీకి 'ఎల్లిచిపూర్' చేరి ఆర్గామ్ యుద్ధములో గాయపడిన తమ సైనికుల కక్కడ ఒక ఆస్పత్రిని యేర్పాటు చేసిరి. అంతట అక్కడ నుండి కదిలి డిశంబరు 14-వ తేదీన గావిల్‌ఘుర్ కోటకు ముట్టడి వేసిరి. ఈ కోట బీరారు రాజగు భాన్స్లేది. అత డక్కడ యెట్టి యేర్పాటు చేసి యుండలేదు. అందుచే, అది ఇంగ్లీషు వారి చేతులో సులభముగ పడినది. కోటకు కాపున్న ఖిల్లాదారుడు మాత్రము స్వామి ద్రోహము చేయక, శక్తివంచన లేక, ఇంగ్లీషువారి నెదిరించి, వీరస్వర్గము నలంకరించి, కీర్తి కాయుడయ్యెను.

గావిల్‌ఘుర్ కోట ముట్టడితో దక్షిణమున ఆర్థర్ పని తీరిపోయినది. అటు పిమ్మట ఇంగ్లీషువారికిని, సింధియా భాన్స్లేలకును ఒడంబడిక జరిగినది. వివరములు ముందు తెల్పెదము.



# బ్రిటిష్ మహాయుగము

## ఇరువదితొమ్మిదవ అధ్యాయము.



### రెండవ మహారాష్ట్ర సంగ్రామము—ఘూర్జర రంగము.

గుజరాతు దేశములో బరోచికోటయు, దానిచుట్టు నున్న మరికొంత భూభాగమును సింధియాకు చెందియున్నది. వెనుక మాధవరావు సింధియా మహారాష్ట్ర రాజ్యమునకు ద్రోహమొనర్చి, ఇంగ్లీషువారిలో చేరుటచే, వారీ ప్రాంతముల నతనికి బహుమతిగనిచ్చిరి. ఇప్పుడీ ప్రాంతములను కాజేయవలయునని ఇంగ్లీషువారికి బుద్ధిపుట్టినది. అందుకొరకై వారిప్పుడు ధౌలత్ రావుకు చెందియున్న బరోచి కోటను ముట్టడించుటకు పూనుకొనిరి. దగ్గరలోనున్న గాయక్వారు రాజధానియగు బరోడాపట్టణము నుండి యీ కోటను ముట్టడించుటకు ఇంగ్లీషువారికి వాటమైన వీలేర్పడెను. ఏలననగ, గాయక్వారు ఇంగ్లీషువారికి చేలోకువైన వాడేగద! 'గాయక్వారు వద్దనున్న మనయద్దె సేనలను తీసికొని నీవు వెంటనే దౌలత్ రావుకు చెందిన బరోచీ కోటను ముట్టడించవలసినది. మధ్య యెట్టి సంధి మాటలతోగాని ప్రసక్తిపెట్టుకొనకుము' అని ఆర్థర్ 1803-వ సం॥ ఆగష్టు 6-వ తేదీన బరోడాలో నున్న ఇంగ్లీషు సేనానికి వ్రాసెను.

*బరోచికోటపై యింగ్లీషువారికన్ను*

కాని, "యీ యద్దెసేనలను సింధియా మీఁదికి తీసుకొని పోవడానికి వీలు లేదు. ఇది మన ఒడంబడికలో లేదు"—అని అప్పుడు బరోడా రాజుగనున్న ఆనందరావు గాయక్వారు అభ్యంతర పెట్టెను. కాని, యీ యభ్యంతరమును ఇంగ్లీషువారు లక్ష్యము చేయ లేదు.

*గాయక్వార్ అభ్యంతరము - ఇంగ్లీషు వారు త్రోసి వేయుట.*

అద్దెసేనల యొడంబడిక స్వభావమునుగూర్చి ఆర్థర్ 1803 సం॥ ఆగష్టు 22-వ తేదీన బొంబయి గవర్నమెంటు కిట్లని వ్రాసెను :—

*అద్దెసేనల నిజ తత్వము.*

[మనకు, గాయిక్వారుకు, '<u>నిజమైన స్నేహము మంచి సద్భావము</u>' వుండవలయునని గద ఒడంబడికలో చెప్పబడియున్నది. ఈ మాటలకు అర్థమేమి? మనముమాత్రము గాయక్వారును సంరక్షించవలయునుగాని, అతడు మనలను సంరక్షింప పనిలేదనియా యీ మాటల కర్థము? ఇది యెన్నడును కాజాలదు. మనము ఉభయులము పరస్పరము - ఒకరికొరకు -

సహాయము చేసుకొనవలయును. అట్లుకానిచో, యీ యొడంబడికవల్ల కలుగు ఫలితమేమి? గాయక్వారు రాజ్యరక్షణార్థమై, అతనివల్ల అద్దెడబ్బులు మాత్రం పుచ్చుకొనుచు, మనము నిరంతరము యుద్ధములు చేయవలసియే వచ్చుచుండును.

ఈ అద్దె డబ్బులుకోసమా మన మితనితో యీ యొడంబడిక చేసుకొన్నది? అట్లయిన చో యిది మన కంపెనీ కెంతమాత్రము గౌరవప్రదముకాదు.—క్లుప్తము.]

కాబట్టి, యద్దెసేనల తత్వమిప్పుడు బట్టబయలైనది. అప్పుకెట్టిన షాహుకారు, వడ్డీడబ్బులు కోసమేగాక, ఋణస్తుని యావత్కాలము తనక్రింద యావద్విషయములలోను బానిసగ చేసివేసుకొనుటకే చూచునట్లు యీ ఇంగ్లీషువారును తమ సేనలను దేశీయరాజులకు అద్దెకిచ్చుటలో కేవలము అద్దెడబ్బుల కొరకేగాక, సదరు రాజులను శాశ్వతముగ—స్నేహమను పేరుతో—తమకు బానిసలుగ కట్టిపడ వేసుకొనుటకే సంకల్పించిరని ఆర్థర్ సేనాని వ్రాసిన పైవ్రాతలవల్ల ఋజువగుచున్నది. ఈ యద్దెసేనల వలలోపడిన యితర రాజులవలెనే, ఆనందరావు గాయక్వారును యిప్పుడు తప్పించుకోలేక పోయెను. తానుచెప్పిన యభ్యంతరముల వేనినిగాని, ఇంగ్లీషువారు లక్ష్యముచేయక, తనకిచ్చిన యద్దెసేనలను వారుతీసికొని పోయి తనతోడి మహారాష్ట్ర సోదరుడగు దౌలత్ రావు సింధియాపై ప్రయోగించిరి! బరోడా శిబిరమునుండి బరోచీ కోటను ముట్టడించుటకు ఇంగ్లీషువారికి చక్కని అవకాశము దొరికెను. బరోచీకోటలోని రహస్యములును, దాని దౌర్బల్యస్థితియు ఇంగ్లీషువారికి లోగడనే తెలిసియుండుటచేత, దానినిప్పుడు ఆకస్మికముగ పట్టుకొనుట వారికి బహు సులభమయ్యెను.

భిల్లులతో మంచిమాట.

అయినను, యెటుపోయి యెటువచ్చునోయను భయము చేత ఇంగ్లీషువారు ఆప్రాంతములనున్న "భిల్లు" లనబడు కొండ జాతివారితో ముందుగ మంచిమాట చేసుకొనిరి. 1803 సం॥ ఆగష్టు 3-వ తేదీన ఆర్థర్ బొంబయి గవర్నరుకు యిట్లు వ్రాసెను :—

[భిల్లు జాతివారితో మనము మంచిగవుంటే, వారు మన కెంతోపనికి వస్తారు. వారితో గనుక మనము విరోధము, పెట్టుకుంటే, వారు మనకొంప దీస్తారు. కాబట్టి, వారితో ముందుగ మంచిగ వుండవలసినదని మీరు మన తాబేదార్లందరికి చెప్పి పంపండి. ఈ భిల్లులతో యెట్టి తగాదాగాని మనము పెట్టుకోరాదు. మనకు కప్పము కట్టవలసినదని వారిని మనము నొక్కియడుగరాదు. మనము వారితో తగాదా పెట్టుకుంటే, వారిలో ఒక్కరాజును కూడ లొంగదీయడానికి మన సేన చాలదు. కాబట్టి, ప్రస్తుతము వారివ్వవలసిన కప్పమును వదలుకోవడమే మనకు మంచిది.—క్లుప్తము.]

ఈ లేఖలో అడుగున గీతగీచిన వాక్యముల గమనింపుడు. ఇంగ్లీషువారు యీ దేశమును తంత్రములచే లోబరుచుకొనిరిగాని, కత్తిచే లోబరుచుకొన లేదని యీమాటలు చెప్పకయే చెప్పుచున్నవి.

బరోడాలోని యద్దెసేనలకు నాయకుడుగనున్న కర్నల్ ఉడింగ్‌టన్ తన సేనలను తీసుకొని 1803 సం॥ ఆగస్టు 21-వ తేదీన అచ్చటనుండి కదలి 'బరోచీ' కోటమీదికి వెళ్లెను. 29-వ తేదీకి సదరు కోటయు, పేటయు, అతనికి సులభముగ స్వాధీనమై పోయెను. ఈ కోటక్రిందనున్న భూములవల్ల సాలుకు పదకొండులక్షల ఆదాయము వచ్చుచుండెను. ఈ కోటను పట్టుకొనుటలో ఆనందరావు గాయక్వారు తాలూకు యద్దెసేన లింత సహాయము చేసియున్నప్పటికి, ఇంగ్లీషువారీ పదకొండులక్షల ఆదాయములో అతనికి చిల్లిగవ్వయైనను భాగము పెట్టరైరి! ఇది బలే స్నేహముకాదా! సేనలకు అద్దెయిచ్చుకొనునది గైక్వారును, దానిలాభముల పొందునది ఇంగ్లీషువారును!

బరోచీకోట స్వాధీనమగుట.

బరోచికోట తమచేతులలో పడిపోయిన తరువాత, ఇంగ్లీషుసేన దౌలత్‌రావుకు చెందిన 'పోవన్‌ఘుర్' కోటనుకూడ అక్కడనున్న ఖిల్లాదారుకును తదితరులకు బాగా లంచములిచ్చి అతిసులభముగ 1803 సం॥ సెప్టెంబరు 17-వ తేదీన పట్టుకొనిరి.

పోవన్‌ఘుర్‌కోట పట్టువడుట.

ఇక గుజరాతులో దౌలత్‌రావుకు చెందిన కోటలేమియు లేకపోవుటచే, అక్కడ యుద్ధమింతటితో ముగిసినది. లోగడ మాధవరావు చేసిన దేశద్రోహమునకు ప్రతిఫలముగ తామిచ్చియున్న భూములను సర్వస్వము యిప్పుడు ఇంగ్లీషువారు దౌలత్‌రావు హయాములో యీ ప్రకారముగ ఊడలాగికొనిరి! మాధవరావానాడు చేసిన ద్రోహమునకు అంత్యఫలితము అతని సంతతికి, దేశమునకుకూడ చిరతర దాస్యముతప్ప యిప్పుడింక నేమియు మిగులలేదు!

## రెండవ మహారాష్ట్ర సంగ్రామము—ఓఢ్రరంగము.

క్లైవు హయాములో కంపెనీవారు బెంగాలు, బీహార్, ఒరిస్సా (ఓఢ్ర) దేశములపై మొగలాయి పాదుషానుండి దివానీగిరిని సంపాదించుకొనియుండిరి. ఈ ఓఢ్రదేశములో అప్పుడింగ్లీషువారికి యీరీతిగ చెందినది ఉత్తరమును నున్న చిన్న తునకమాత్రమే. మిగతా ఓఢ్రదేశమంతయు నాగపురముననున్న మహారాష్ట్ర రాజులగు భాన్‌స్లే వంశమువారి చేతులలో నుండెను.

పూర్వకథ.

ఓఢ్రదేశము ఇంగ్లీషువారికి కొత్తదికాదు. కంపెనీవారు మొట్టమొదట తమ గిడ్డంగిని ఓఢ్రరాజ్యములో నున్న బాలసూరులో పెట్టుకొనిరి. సువర్ణరేఖ, నదిమీదనున్న 'పిప్లీ' నగరమున గిడ్డంగిని పెట్టుకొనుటకు షాజహాన్ చక్రవర్తి కంపెనీవారికి 1634 సం॥ ఫిబ్రవరి 2-వ తేదీన ఒక ఫర్మానా యిచ్చెను. బౌటన్ అను ఇంగ్లీషు వైద్యుడు చక్రవర్తిగారి కుటుంబములో చాలమందికి రోగములు నయముచేయుటవల్ల కంపెనీవారు హుగ్లీ, బాలసూరు పట్టణములలోకూడ గిడ్డం

గులు పెట్టుకొనవచ్చునని చక్రవర్తి ఫర్మానా యిచ్చెను. ఈ ఫర్మానా ననుసరించి కంపెనీవారు బాలసూరు పట్టణమువద్ద 12 * బట్టీల స్థలము సంపాదించుకొని అక్కడ తమ గిడ్డంగి నేర్పరుచుకొనిరి. ఆ స్థలమే యిప్పుడు బారాబట్టీ యను పేరుతో బాలసూరు పట్టణమునకు ప్రధానస్థానమైనది. మహారాష్ట్రులీప్రాంతము జయించినప్పుడు ఇంగ్లీషువారి కందువల్ల చాలనష్ట మయ్యెనట. అందుచే, పిదప క్లైవు హయాములో, దివానీగిరిని సంపాదించుకొన్న పిమ్మట, మహారాష్ట్రులపై దండెత్తవలయునని కంపెనీవారు తలంచిరి. కాని, మహారాష్ట్ర రాజ్యభాను డప్పుడు ప్రచండముగ వెలుంగు చుండుటచేత, క్లైవు మిడుగురుపురుగు ఆ భానునివంక చూడ లేక పోయెను. మహారాష్ట్రులతో సఖ్యముగనుండుటయే తమకప్పుడు వివేకమని తలచి, వారుకోరిన "చౌతు" (కప్పము) 13 లక్షల రూపాయలను కంపెనీవారు మహారాష్ట్రులకు కట్టుచుండిరి. ఇది 1767 సం॥ లో జరిగిన కథ.

ఓఢ్రదేశము మహారాష్ట్ర పరిపాలనలో సుభిక్షముగనున్నట్లు "జె. బీమ్సు" అను నతడు 1883 సం॥ (Journal of Asiatic Society of Bengal) అను పత్రికలో వ్రాసెను. రూపాయకు 70 శేర్ల బియ్యము దొరుకుచుండెనట. ఉప్పు, నల్లమందు చవకగనుండెనట! ఆ రోజులలో ఓఢ్రదేశములో కరువులే యెరుగరు. కాని, కంపెనీవారు కాలుపెట్టగానే, అచ్చట ప్రతియేటా కరవులేనని యీ "బీమ్సు" చెప్పుచున్నాడు.

మహారాష్ట్రుల పరిపాలనలో సుభిక్షము.

మహారాష్ట్రులపై దండెత్తుటకు 1767 సం॥ లో తమకు తాహతు లేకపోవుటచే అప్పటికి వారికి తలయొగ్గి కాలక్షేపము చేయుచున్నను, ఇంగ్లీషువారు లోలోన తమ వెనుకటి వంచనగుణమును మాత్రము మానలేదు. మహారాష్ట్రులు క్రూరులని, దుర్మార్గులని ప్రజలకు కొండెములు చెప్పి † వారిని మహారాష్ట్రులపై ఉసుగొలుప వలెనని ఇంగ్లీషు వారు లోలోన అనేకకుట్రలు పన్నుచుండిరి.

ఇంగ్లీషువారి. దుష్టప్రచారము

మహారాష్ట్రుల యేలుబడిలో నున్న ఓఢ్రరాజ్యముపై దండెత్తవలసినదని 1803 సం॥ అగస్టు 3-వ తేదీన గవర్నర్ జనరల్ సేనానియగు కర్నల్ క్యాంప్ బెల్‌కు వ్రాయుచు అందీ కుట్రల గూర్చి యిట్లు వ్రాసెను:—

---

* బట్టీ యనగ సుమారు 480 యకరముల భూమి.

† మహారాష్ట్రులు క్రూరులై ప్రజలను హింసించిరను మాట ఇంగ్లీషువారు తమ దుష్ట ప్రచారమునకై కల్పించిన మాటగాని వేరుకాదు. మహారాష్ట్రులే క్రూరులైయుంటే ఓఢ్రదేశమంత సుభిక్షముగ యెట్లుండగలదు ?

[నీవద్దనున్న సేనను, బెంగాల్ నుండి నీకు కుమ్మక్కుగ వచ్చు సేనను కలుపుకొని, నీవు కటకము రాజ్యములో ప్రవేశించి, జగన్నాథము మీదికి వెళ్ళవలెను. మహారాష్ట్ర రాజ్యములో ప్రవేశించునప్పుడు మాత్రము అక్కడనున్న ప్రజలను నీవు బహు జాగ్రత్తగ మంచిమాటలు చేసుకోవలెను. అందు నిమిత్తమై నీవొక ప్రకటనను సాటించవలెను. ఆప్రకటన నకలును నేనిందుతో నీకు పంపించుచున్నాను. "మా ఇంగ్లీషు సేన కేమియు యిబ్బంది కలిగించకుండ, వారి వారి చోట్లలోనే మెదలకుండ నున్నవారిని మేము సర్వవిధముల రక్షింతుమని" నీవు ప్రజలకందరికి అభయహస్త మివ్వవలయును.

మోసము, కుట్రలు.

జగన్నాథములో నీవు దేవాలయముజోలికి పోవద్దు. దేవాలయమునకును, అక్కడనున్న బ్రాహ్మణులకును మామూలుగజరుగు మర్యాదలకును నీవేమియు భంగముగ ప్రవర్తించవద్దు. అక్కడనుండు బ్రాహ్మణుల కెట్టిహానిజరుగకుండ నీవు వారికి తగు పారామనుష్యుల నివ్వవలెను. యాత్రీకులవల్ల అచ్చటి బ్రాహ్మణులకు చాల డబ్బువస్తుండట. ఆ వరుమానముల కేమియు నీవిప్పుడు ఆటంకము కలిగించవద్దు. మేము మీహక్కుల జోలికి రామనియు, లోగడ మీరు మహారాష్ట్రులకు చెల్లించేదానికంటె, మీరిప్పుడెక్కువ యేమియు నివ్వనక్కరలేదనియు, నీవా బ్రాహ్మణులకు నమ్మకము గలుగునట్లు చెప్పుము.

మహారాష్ట్రులకు నామకః లొంగియున్నవారును, మహారాష్ట్రులకు యెదురుతిరిగినవారును నగు జమీందార్లు చాలమంది కటకము రాజ్యములో నున్నారట. చుట్టుపట్టులకూడ యిటువంటివారే మరికొందరు సామంతులున్నారట. ఇటువంటివారి నందరిని మనము చేరబట్టితే బలే బాగుంటుంది. మన అధికారమునకు పూర్తిగ లొంగుట కిష్టపడనివారితో, మరిఏదో విధముగ వారికి లాభము చూపించి, తగు యేర్పాటు చేసుకోవడం మంచిది.........క్లుప్తము.]

కాబట్టి, ఇంగ్లీషువారు ఓఢ్రదేశమును కత్తితోకంటె యెక్కువగ మాయోపాయముచేతనే స్వాధీనపరుచుకొనిరనుటకు పై వాక్యములే సాక్ష్యము.

కపట నటన.

మతమందు నమ్మకములేక పోయినప్పటికి, నమ్మకమున్నట్లు నటించుటవల్ల అందరిని లోబరుచుకొనవచ్చునను తంత్రమును పాశ్చాత్య చాణక్యుడగు 'మ్యాకవిల్లీ' తన దేశస్థులగు ఇటాలియనులకు పూర్వము ఉపదేశించి యుండెను. ఆతనిమాటలివి:—

[దూరదృష్టిగల రాజ్య తంత్రజ్ఞులేమి చేయుదురనగా, తమకందు నమ్మకములేకపోయినప్పటికి, వారెల్లప్పుడు మతమును గౌరవింతురు. ఏలననగ, ఈ మతపిచ్చను కుటిల బుద్ధితో ప్రేరేపించినాసరే, ప్రజలు తన్మయులై తమ దేశరక్షణార్థ మెంతోగట్టిగ పోరాడుదురని ప్రపంచ చరిత్రలో అనేక నిదర్శనములు గన్పించుచున్నవి.

నీవు వారిని బలవంత పెట్టనట్లు యెంతయెక్కువగ నటిస్తే, అంత త్వరగ వారువచ్చి నీ ఒడిలో పడతారు. నీవు వారితో యెంత చనువుగ, యెంతదయగ వున్నట్లు నటిస్తే, వారంత సులభముగ నీయందు బెదురువిడిచి, నీదగ్గరకు చేరుతారు—నీవు వారి స్వాతంత్ర్యమును హరిస్తావేమోయన్న జడుపు వారికంత త్వరగ పోతుంది.]

'మ్యాక్ వెల్లీ' చెప్పిన యీ కుటిలతంత్రముల ప్రకారమే వెల్లస్లీ ఓఢ్రదేశములో వర్తించెను- 'మీ మతంజోలికి, మీ ఆచార వ్యవహారముల జోలికి రామని చెప్పి అక్కడి బ్రాహ్మణులకు ఆశబెట్టి వారిని వెల్లస్లీ మాయజేసి లోబరుచుకొన్నాడు. అట్లే, అక్కడనున్న జమీందారులయెడ ప్రేమను చనువును నటించి, వారిని తన టోపీలో వేసుకొన్నాడు. అందుచే, ఓఢ్రరాజ్యము ఇంగ్లీషు వారికి సులభముగ స్వాధీనమయ్యెను.

వంచన త్వర లోనే బయలైనది!

కాని, ఇంగ్లీషువారు చెప్పిన తియ్యని మాటలలోని తీపియంతయు, అచిరకాలములోనే ఓఢ్రులకు తెలిసివచ్చెను. మహారాష్ట్రులు పోయి, ఇంగ్లీషువారు వచ్చుట వీరికి ఓడ వీడి సముద్రములో దుమికినట్లయినది. ప్రజలు ఇంగ్లీషువారియెడ త్వరలోనే విముఖులైనట్లు 'బీమ్సు' చెప్పిన యీ దిగువ మాటలవల్ల తెలియుచున్నది:—

[దేశ పరిస్థితులు మన ఇంగ్లీషువారి కేమియు తెలియవను నిశ్చయముతో ప్రజలెవరుగాని మనకు సహాయముచేయక, దూరముగ కూర్చుండిరి. మనలను బహిరంగముగ యెదిరించలేక పోయినను, వారు మనకు సహాయము చేయనొల్లరైరి. కాగితముల నన్నిటిని వారు దాచివేసినారు. మనకే సమాచారములు అందకుండ చేసినారు. బండ్లను, యెడ్లను, పడవలను మనకు చిక్కకుండ చేసినారు. 'మీ వ్యవహారాలు పరిష్కరించుకోడానికి, మీరందరు కటకము రావలసినదని జమీందారులకు కబుర్లు పంపగ, వారెవ్వరు రారైరి. ఇండ్లలో వెదకితే, యెవరు కనిపించలేదు. ఎక్కడికి పోయినారని అడిగితే యెవ్వరు జబాబు చెప్పరైరి...(క్లుప్తము.)]

ఓఢ్రు లీ రీతిగ అచిరకాలములోనే ఇంగ్లీషువారియందు విముఖులై, వారి కెట్టి సహాయము చేయుటకును నిరాకరించిరని యీ ఆంగ్లేయుని వ్రాతలే చెప్పుచున్నవి.

ఇక ఓఢ్రదేశమును జయించు సందర్భమున ఇంగ్లీషువారు గావించిన యుద్ధకార్యముల నిట క్లుప్తముగా చెప్పి ముగించెదము.

మాణిక్యపట్నము, జగన్నాథ క్షేత్రములు వశమగుట.

మొదట నియమింపబడిన క్యాంబెల్ కు జబ్బుచేయుటచే, యీతని కర్నల్ హార్కోర్టుకు వచ్చెను. ఇతడు 1803 సం॥ సెప్టెంబరు 8-వ తేదీన గంజామునుండి తన సేనలతో బయలుదేరి 14-వ తేదీన మాణిక్యపట్టణమును, 18-వ తేదీన పూరీ జగన్నాథమును పట్టుకొనెను. జగన్నాథములోనున్న బ్రాహ్మణులతోను, పూజారులతోను తదితరులతోను తాను మంచిమాట చేసుకొన్నట్లు యితడు ఆలోజుననే తన యధికారులకు ఉత్తరము వ్రాసెను. అనగ, వెల్లస్లీ ఉపదేశించిన చాణక్యతంత్రము యిచ్చట బాగుగ పారినదన్నమాట.

ఇంకొక సేన కెప్టన్ మార్గన్, బ్రౌటన్‌ల యాధిపత్యమున కలకత్తానుండి బాలసూరుకు మూడు ఓడలమీద వచ్చెను. ఈ మూడు ఓడలు బాలసూరుకు ఆను కొని యున్న జంపడా గ్రామమువద్ద లంగరువేసెను. సైన్యమంతయు దిగెను. వీరికి కావలసిన భోజన సామాగ్రియంతయు బాలసూర్ జమీందారుడగు "ప్రహ్లాద నాయకుడు" సప్లయి చేసెను. అంతట సేన నదిఒడ్డుగ బయలుదేరెను. బాలీ ఘట్టము వచ్చునప్పటికి మరాటీ గుఱ్ఱపు దండొకటి వీరి నెదుర్కొనెను. ఒక్క యూరోపియను మాత్రము చనిపోయెను. ఇంగ్లీషుసేన అంతట ప్రక్కనున్న బాలసూరు కోటమీదికి ఒక్కపెట్టున త్రోసుకొని పోయెను. ఈ కోట వారికి అతిసులభముగ చిక్కెను. మహారాష్ట్రులు కొలదిగ యెదిరించి అంతలో అదృశ్యమైపోయిరి. అంతట, "ఇంగ్లీషువారీ రాజ్యమును స్వాధీనపరుచుకొన్నారు. శాంతముగ వర్తించే ప్రజలనందరిని రక్షిస్తా రహో"యని ఊరంతటను టమాటమా వేయించిరి. ఇది 1803 సం॥ సెప్టెంబరు 21-వ తేదీన జరిగిన కథ. ఈ రీతిగ బాలసూర్ కోటను పట్టుకొన్నందుకు పై యధికారులు కెప్టన్ మార్గన్‌ను మెచ్చుకొనిరి.

బాలసూర్ కోట ముట్టడి.

పిమ్మట 'హార్‌కోర్టు' తనవద్దనున్న సేనను తీసికొని కటకము మీదికిపోయి, సదరు పట్టణమును, కోట ప్రదేశమున్న బారాబట్టీని కూడ అక్టోబరు 12-వ తేదీనాటికి స్వాధీనపరుచుకొనెను. ఈ కోట మిక్కిలి బలిష్టమైన దైనను, అది సులభముగ ఇంగ్లీషువారికి స్వాధీనమగుటకు కారణము స్వామిద్రోహుల చర్యయే యని చెప్పవలసి యున్నది.

కటకము బారాబట్టీలు స్వాధీనమగుట.

కెప్టెన్ మార్గన్ సెప్టెంబరు 30-వ తేదీన రెండు సైనిక దళములను బాలసూరుకు దక్షిణముగ 30 మైళ్ళలో నున్న సోరో యను చోటికి పంపించి, అక్కడనున్న శత్రుసేనను ఓడించి సదరు పట్టణమును అక్టోబరు 3-వ తేదీన స్వాధీనపరుచుకొనెను.

సోరో ప్రాంతపు ఆక్రమణ.

ఇంకొక సైనికదళము అక్టోబరు 15-వ తేదీన బాలసూరుకు, కటకమునకు మధ్యనున్న 'బద్రక్' గ్రామమువద్ద మకాము వేసెను. ఈ గ్రామముచుట్టును రెండు చిన్నరాజ్యము లున్నవి. వానిపేరు మెహర్‌భంజ్, 'నీలగిరి' రాజ్యములు. ఈ సేనలతో యీరెండు పిల్లరాజ్యములవారిని ఇంగ్లీషువారు బెదిరించియు, మోసగించియు, స్వాధీనపరుచుకొనిరి.

మెహర్‌భంజ్, నీలగిరి రాజ్యముల కబళనము.

1804 సం॥ జనవరి 12-వ తేదీన 'శంబల్‌పూర్' కూడ ఇంగ్లీషువారికి వశమయ్యెను.

శంబల్‌పూర్ వశమగుట.

ఇంతటితో మహారాష్ట్రుల స్వాధీనములో నుండిన ఓఢ్ర దేశమంతయు ఇంగ్లీషువారి క్రిందికి వచ్చివేసెను.

## రెండవ మహారాష్ట్ర సంగ్రామము—బుందేల్ రంగము

బేసిన్ ఒడంబడిక జరిగిన చాలకాలమునకు అనగ 1803 సం॥ లోసదరుఒడంబడికకు అనుబంధముగ చేర్చబడిన క్రొత్త షరతులలో ఒకానొక షరతు ననుసరించి, బుందేల్ ఖండమును పీష్వా బాజీరావు ఇంగ్లీషువారికి ధారాదత్తము చేసెను. మొదట ఒడంబడికలో చేర్చబడిన దక్షిణ మహారాష్ట్రములోని సవనూరు, బెంకపూర్, ఊళపార్ యీమూడు ప్రదేశములకు పరటాగా యిప్పు డింగ్లీషువారు బుందేల్ ఖండమును కోరితీసికొనిరి. పైనపేర్కొన్న మూడుస్థలములకంటె, బుందేల్ ఖండము యింగ్లీషువారికి యెక్కువ లాభకరముగను, వీనుగను వున్నవి. యమునా నదీ ప్రాంతములనున్న తమభూములకిది దగ్గరనుండి, వానిలో కలియును. అందుచే, వారు పీష్వామెడను విరచి, యీబుందేల్ ఖండమును పరటాగా తీసుకొనిరి.

ఈబుందేల్ ఖండమును యింగ్లీషువారీరీతిగ పీష్వావల్ల వ్రాయించుకొన్నప్పటికిదానిని యింగ్లీషువారికి స్వాధీనము చేయుటకు ఇక్కడనున్న మొఖాసాదారులు, తదితర ప్రముఖులు ఒప్పుకొనక యెదురుతిరిగిరి. కాబట్టి, యీప్రాంతమును బలత్కారముగ స్వాధీన పరచుకొనుటకుగాను యింగ్లీషువారచ్చటికొక దండును పంపవలసివచ్చెను. అలహాబాదునుండి "కర్నల్ పవల్" యాజమాన్యమున ఒకసేన బయలుదేరి, యమునానదినిదాటి 1803సం॥ సెప్టంబరు 6 వ తేదీన బుందేల్ ఖండమును ప్రవేశించెను. "గోసెన్ హిమ్మత్ బహద్దూర్" అను ఒకానొకద్రోహి సహాయము తమకులేకుండినచో ఇంగ్లీషువారీ దేశములో ప్రవేశించుటయే దుర్ఘటమయ్యెడిది. ఇతని సహాయముతో ఇంగ్లీషువారు బుందేల్ ఖండములో ప్రవేశించి అక్కడనున్న ప్రముఖులను సులభముగ జయించగలిగిరి. వీరిలో ప్రముఖుడగు షంషేర్ బహద్దర్ అనునాయకుడు మిక్కిలి ప్రతాపమునుజూపి, ఇంగ్లీషువారియొక్కయు, ద్రోహిహిమ్మత్ బహద్దూర్ యొక్కయు సేనలను 1803 సం॥ అక్టోబరు 13 వ తేదీన అతితీవ్రముగ నెదిరించెను. ఇతనిని ఓడించుటకు ఇంగ్లీషువారెంతయో శ్రమపడవలసి వచ్చెను. ఎట్టకేలకు యుద్ధమందు షంషేర్ బహద్దర్ పరాజితుడై బుందేల్ ఖండమును విడచిపోవలసివచ్చెను.

ఈరీతిగ షంషేర్ బహద్దర్ వంటి చిన్ననాయకు నొకని ఓడించి, బుందేల్ ఖండమువంటి పిల్లరాజ్యమును వశపరచుకొనుటకూడ యింగ్లీషువారికి కత్తిచే సాధ్యముగాక, తుదకు కుటిలతంత్రము చేతనే సాధించుకొనవలసి వచ్చెను.



# బ్రిటిష్ మహాయుగము

## ముప్పదవ అధ్యాయము.



### రెండవ మహారాష్ట్ర సంగ్రామము—ఉత్తరరంగము.

రెండవ మహారాష్ట్ర సంగ్రామములో యింతవరకు దక్షిణ, ఘూర్జర, ఓఢ్ర రంగములలో జరిగిన యుద్ధముల వివరించి యుంటిమి. బుందేల్ ఖండ మెట్లాక్రమింపబడెనో జూచితిమి. ఇక ఉత్తర హిందూస్థానములో జరిగిన యుద్ధముల నీ యధ్యాయమందు క్లుప్తముగ వివరింతుము.

ఉత్తర హిందూస్థానమున గంగా యమునా నదుల మధ్యనున్న సారవంతమగు భూమి దౌలత్ రావు సింధియాకు చెందియుండెను. దీనిలో ఢిల్లీ, ఆగ్రా, ఆలిఘర్-పట్టణములు మిక్కిలి ప్రాముఖ్యమును చెందియున్నవి. ఈ దేశమును నామకః ఢిల్లీపాదుషా యధికారమునకు లోబడి సింధియా పాలించుచుండెను. ఇచ్చటజరుగు సివిల్ మిలిటరీ పరిపాలనను చూచుటకు దౌలత్ రావు 'పెర్రన్' అను ఫ్రెంచి సైనికోద్యోగిని నియమించెను.

ఉత్తర హిందూస్థానముననున్న ఆంగ్ల సేనలకు 'లేక్' సేనాని అధిపతిగనుండెను. రెండవ మహారాష్ట్ర సంగ్రామము బహిరంగముగ ప్రారంభము కాకమునుపే యీ రాజ్యమును సింధియానుండి లాగకొనుటకై ఇంగ్లీషువారనేక కుట్రలు రహస్యముగ పన్నుచుండిన సంగతిని యిదివరకే చెప్పియుంటిమి. ఢిల్లీపాదుషాను కూడ తమ వలలో పడవేసికొనుటకు వారు ప్రయత్నించుచుండిన సంగతి సైతము మనము చూచియున్నాము. ఈరీతిగ యిదివరకే ఇంగ్లీషువారు సర్వసన్నాహములను రహస్యముగ చేసుకొని తయారుగనుండుటచే, వారికీ రాజ్యమును జయించుట సులభమయ్యెనని వేరుగ చెప్పవలెనా?

సింధియారాజ్యముపై దండెత్తిపోయి దానిని స్వాధీన పరుచుకొనవలసినదనియు, ఢిల్లీ పాదుషా పాలమును చెరబట్టవలసిన దనియు గవర్నర్ జనరల్ వెల్లస్లీ ఆగష్టు 26 వ తేదీన లేక్ సేనాని కొక రహస్యపు టుత్తరమును వ్రాసెను.

అంతకు పూర్వమే లేక్ సేనాని ఆగష్టు 7 వ తేదీన కాన్పురమునుండి తన సేనతో కదిలి 28 వ తేదీన కంపెనీ రాజ్యపు పొలిమేరను దాటి సింధియా రాజ్యములో ప్రవేశించెను. అక్కడ నుండి త్వరిత గతిని సేనలను నడిపించుకొని పోయి సింధియారాజ్యపు సరిహద్దు

కోయల్ పట్టణం పట్టుపడుట

ననున్న 'కోయల్' పట్టణమును సులభముగ ఆక్రమించుకొనెను. దీనికి కారణము సింధియా యచ్చట కాపు పెట్టిన యూరోపియన్ ఆఫీసర్లయొక్కయు, సైనికుల యొక్కయు స్వామిద్రోహమేయని లేక్ సేనాని ఆనాడే గవర్నరుజనరలుకు రహస్యముగ వ్రాసిన యుత్తరములో స్పష్టముగ వక్కాణించి యుండెను. [పెర్రన్ తాలూకు రెండవదళములోనున్న ఆరుగురు ఆఫీసర్లు మన ప్రకటన వినక పూర్వమే అక్కడనుండి రాజీనామా నిచ్చివేసి, మనలో వచ్చిచేరిరి] అని లేక్ సేనాని వ్రాసెను. ఇది స్వామిద్రోహముకాదా?

అలీఘర్ కోట ముట్టడి -యూరోపియన్ ఆఫీసర్లద్రోహము.

కోయల్ పట్టణమిట్లు స్వాధీనముకాగా లేక్ సేనాని యిక అలిఘర్ కోటను పట్టుకొనదలచెను. 1803 సం॥ సెప్టెంబరు 1-వ తేదీన లేక్ సేనాని కోయల్ మకాంనుండి గవర్నర్ జనరలు కిట్లనివ్రాసెను.

[నేనింకా యిక్కడినుండి బయలుదేరలేదు. అలిఘర్ కోటనింకను పట్టుకొనలేదు. కోట లోనికి వారి లంచములిచ్చి వారిని బయటికి రప్పించి, మనము దాని నాక్రమించుకొనవలయునని చూచుచున్నాను. దీనికి కారణమేమనగ, డబ్బుఖర్చుపెట్టితే పనిఅవుచున్నప్పుడు వృథాగా మన మనుష్యులనేల నష్టపరచుకొనవలెను? పైగా డబ్బువల్ల పనిత్వరగ కూడ జరుగుతుంది. ఈకోట మిక్కిలి బలిష్ఠమైనది. దీనిని గనుక మనముసరిగ ముట్టడించి పట్టుకొనవలెనంటే, మనకు కనీసము ఒకనెలయైనా పట్టుతుంది. మనమనుష్యులు చాలమంది చచ్చిపోతారు. ఇది నాకిష్టములేదు............కాబట్టి, కొంచెము డబ్బు ఖర్చుపెట్టి యీ మనుష్యుల ప్రాణాలను నేను కాపాడదలచినానంటే, మీరందుకు నన్ను కోపపడరని తలచెదను. డబ్బు దుబారాగా ఖర్చుపెట్టితిననికూడ మీ రనుకొనరని తలచెదను..................
—(క్లుప్తము.)]

కాని, 'లేక్' సేనాని పన్నిన యెత్తు పూర్తిగ ఫలించలేదు. కొందరులంచములకు లొంగిపోయినను, మరికొందరు నిలువబడిరి. అందుచే, అతడు కోటను ముట్టడించక తప్పదయ్యెను. ఈ ముట్టడిలోసైతము యితనికి స్వామి ద్రోహులగు యూరోపియనులు సహాయము చేసియుండనిచో, అలిఘర్ కోట ఇంగ్లీషు వారికి చిక్కెడిదికాదు. సింధియా కిచ్చట స్వామి ద్రోహము చేసిన యూరోపియనులలో 'టాకన్' అను వాడు ముఖ్యుడు. అలిఘర్ కోటలోగల రహస్యముల నన్నిటిని యితడు లేక్ సేనానికి చెప్పివేసెను. ఇందునుగురించి లేక్ సేనాని 1803 సం॥ ఆగస్టు 4-వ తేదీన గవర్నరు జనరల్ కిట్లని వ్రాసెను:—

[మేమీరోజు ఉదయము అలిఘర్కోటను పట్టుకొన్నామని తమకు తెలుపుటకు నా కెంతో సంతోషముగనున్నది.

లంచములచే నేటివులను లోబరచుకొనవలెనని నేనెన్నియో రోజులు ప్రయత్నించితిని కాని, ఆప్రయత్నములేమియు ఫలించనందున నేను కోటకు ముట్టడిపెట్టవలసివచ్చెను......

అయితే, యీసందర్భమున మన ఇంగ్లీషుదేశీయుడగు 'టాకన్' అనువానిపేరును మీకు చెప్పక పోతే, నేను మిక్కిలి అక్రమము చేసినవాడ నగుదును. మన స్వదేశమునకు వ్యతిరేకముగ పోరాడుటకు యిష్టములేక, యితడు మొన్ననే సింధియాకొలువునుండి, మన వైపునకువచ్చి వేసినాడు. కోటకు యేప్రక్కనుండిపోతే వీలుగవుంటుందో ఆరహస్యమును యితడు మనకు చెప్పి, తాను స్వయముగ వెంటనుండి మన కర్నల్ మాన్‌సనునుకోట ద్వారమువద్దకు సేనతో సహానడిపించుకొని తీసికొనిపోయినాడు. ఇతనివల్ల తనకింక యెన్నియో రహస్యములు తెలిసె ననికూడ మన మాన్‌సన్ చెప్పినాడు. కాబట్టియిట్టివానికి మనము బాగా బహుమతి చేస్తే బాగుంటుంది ......(క్లుప్తము.)]

సేనలో యిట్టి ద్రోహులున్నప్పుడు, మిగతా మంచివా రెంతమంది యెంత ప్రతాపముతో పోరాడిన నేమి ప్రయోజనము. "సింధియా సైనికులు నే నెంతడబ్బు ఆశపెట్టినను లోబడక, యెంతో గట్టిగా పోరాడిరి—ఎంతో ప్రతాపమును గనపర చిరి." అని లేక్ సేనానియే గవర్నరు జనరలుకు వ్రాసిన ఉత్తరములో వ్రాసెను. కాని, యేమి ప్రయోజనము ? వారు చూపిన పౌరుష మంతయు యీ ద్రోహుల కారణమున బూడిదలో పోసిన పన్నీరయ్యెను. అలిఘర్ కోట ఇంగ్లీవారి చేతు లలో పడెను.

ఫ్రెంచి యుద్యోగి సింధియాకొలువుమాను కొనుట.

తన క్రిందనున్న యూరోపియను లిట్లు స్వామి ద్రోహము చేయుటచే, స్వామి భక్తి పరాయణుడగు ఫ్రెంచి సేనాని పెరన్‌కు అసహ్యము వేసి, అతడు యీకొలువును మానుకొని వెళ్లిపోయెను. ఇతడు ఇంగ్లీషువారివల్ల పెద్దలంచము పుచ్చుకొని, వారిలో చేరి పోవుట కెన్నియో ఆశలు కల్పింపబడినను, యితడు వానికి యెంతమాత్రము లోబడలేదని మిల్లు చరిత్రకారుడే తన గ్రంథము 352 పేజీలో వ్రాసియున్నాడు. అలిఘర్ కోట ఇంగ్లీషువారి చేతులలో పడిపోయిన తరువాత, పెరన్ సింధియా కొలువును యేలమానుకొనెనో యతడే యిట్లు చెప్పెనని గవ ర్నర్ జనరల్ వ్రాసెను:—

[తనస్థానమున యింకొకయుద్యోగిని దౌలత్ రావు సింధియా నియమించుకొన్నట్లును, ఆ యుద్యోగివచ్చి పనిలోప్రవేశించుటకు సిద్ధముగనున్నట్లును పెరన్‌కు తెలిసినదట. అందుచే తాను వెళ్లిపోవుచున్నాడట. అదిగాక, పెరన్ యింకొకసంగతినికూడ చెప్పినాడు. తన క్రిందనున్న యూరోపియను ఆఫీసర్లుచేసిన ద్రోహమువల్లను, కృతఘ్నతవల్లను, యిక ఇంగ్లీషు వారి నెదిరించుట నిష్ప్రయోజనమని తనకు తోచినదట.—క్లుప్తము.]

కాబట్టి, తానేల సింధియా కొలువును మానుకొని వెళ్లి పోవుచున్నాడో యీ పరాసు ఉద్యోగి—పెరన్‌నే—స్పష్టముగ వక్కాణించుచున్నప్పుడు మనకిక వేరు సాక్ష్యమేల ?

దౌలత్‌రావు సింధియా చేసెనన్న యన్యాయముకంటె, తనక్రింది యూరోపి యనులు చేసిన స్వామిద్రోహ కార్యములే పెరన్‌కు అసహ్యమును పుట్టించెనని అతని మాటలే చెప్పక చెప్పుచున్నవి. పెర్రన్‌కు సింధియాపై కోపకారణమున్నను అతడు స్వామిద్రోహము చేయదలచలేదని మిల్లు చరిత్రకారుడే స్పష్టముగ వక్కాణించి యున్నాడు. కాబట్టి, అతడు ఉద్యోగమునుండి మానుకొనుటకు ప్రేరేపించినది నిజముగ తనతోడి యూరోపియనుల స్వామిద్రోహమేగాని, సింధియా చేసెనన్న అన్యాయముకాదు.

అలిఘుర్‌కోట యీ రీతిగ పడిపోయి, పెరన్‌మున్నగు యూరోపియనులు సింధియా కొలువు వీడిపోయిన తరువాత, యిక లేక్ సేనాని పని తేలిక యయ్యెను.

కాంగా కోటలో ప్రవేశము.

అతడక్కడ నుండి కదలి సెప్టంబరు 8-వ తేదీన 'కాంగా' యను కోటను అతిసులభముగా ఆక్రమించుకొనెను. అక్కడి వారెవరును యితనిని యెదిరించనేలేదట! వారికితడు బాగుగ లంచములు మేపుటచే, వారు యితడు రాకపూర్వమే కోటను విడిచిపెట్టి వెళ్లిపోయి నారట. అంతట లేక్ సేనాని నిరాఘాటముగ కోటలో ప్రవేశించినాడట. ఎంత పాపము! అతడింతనుగూర్చి 1803 సం॥ సెప్టంబరు 8-వ తేదీన గవర్నరు జనరలు కిట్లని వ్రాసెను:—

[మేమిచ్చటికి—కాంగాకు—యీ ఉదయమే చేరినాము. ఈ కోటలోనున్నవారు అలిఘుర్‌కోట పడిపోయినదని విన్న మరునాడే కోటను కాళీచేసి వెళ్లిపోయినారు. మేము వచ్చి ముట్టడించువరకైనను వుండలేదు...... .....ఇక్కడ వ్యవహారముల నన్నిటిని మేము రహస్యముగ యెట్లు నడిపించుచున్నామో మీరువింటే మీకెంతో సంతోషమగును. ఇది యొక కొత్తపనిని మొదలుపెట్టినాము. ఇట్టిది యిదివరకెన్నడును సేనలోలేదు. ఈ పనిలో మేము యింతవరకు అత్యద్భుతముగ విజయము గాంచుచున్నాము. ఇకమూడు నడకలలో మేము ఢిల్లీ చేరగలము.........(క్లుప్తము.)]

ఈ రీతిగ ప్రజలు లంచములకు లోబడి పోవుట మన భారతజాతి కెంతయు తలవంపులుకావా? ప్రజలకానాడు విశాల జాతీయభావములేక వారు సంకుచిత నీచస్వార్థమునకు లోబడి 33 కోట్ల భారతజాతి నంతను యెట్లు చిరతరదాస్య పంకమందు పడవేసిరో తలచుకొన్నప్పుడు యెట్టి భారతీయుడైనను తలవంచుకొని, యేడ్వవలసినదేగాని, వేరొండు మార్గమున్నదా?

'కాంగా' కోట యీరీతిగా పట్టుబడిన తరువాత లేక్ సేనాని ఢిల్లీపైకి నడచెను.

ఢిల్లీపైకి నడక.

ఇంగ్లీషు సేనలు ఢిల్లీకి వెళ్లవలయునని గవర్నర్ జనరల్ తలంపుకాదు. ముందుగ సింధియా రాజధానియగు గ్వాలియరును, షహరన్ పురమును పట్టుకొన వలయునని గవర్నర్ జనరల్

కోరియుండెను. ఈ కోర్కె ప్రకారమే 'లేక్' సేనాని అప్పుడు గ్వాలియరు మీదికిపోయి యున్నచో, సింధియాబలము పూర్తిగ నాశనమై పోయెడిదే. కాని, లేక్ సేనాని యేలనో గవర్నర్ జనరల్ చెప్పిన ప్లానునుమార్చి కాంగానుండి సరాసరి ఢిల్లీమీదికి పోయెను. బహుశః లోగడ రహస్యముగ జరిగిన యుత్తర ప్రత్యుత్తరములవల్ల ఢిల్లీ పాదుషా తనకు సహాయము చేయునని లేక్ సేనాని తలంచెను కాబోలు! తానిట్లు ఢిల్లీ కేల నేరుగపోయెనో లేక్ సేనానియే 1803 సం॥ సెప్టంబరు 12-వ తేదీన గవర్నరు జనరలుకు వ్రాసిన ఉత్తరములో మూడు కారణముల చెప్పియుండెను :—

[(1) ఢిల్లీలో 'లూయీ' యను పరాసువాడొకడుచేరి, చక్రవర్తిని ప్రజలను మన ఇంగ్లీషువారిమీదికి తిరుగతీసి, మనరాజ్యమును కొల్లగొట్ట ప్రయత్నించుచున్నట్లు నాకువర్తమానము తెలిసినది. (2) అదిగాక యితడు పెర్రకంటె ఉపద్రవకరుడుగ కన్పట్టుచున్నాడు. ఇతనికి శిక్కులయందెక్కువ పలుకుబడిగలదు. వారితోచేరి యితడు కుట్రపన్నుచున్నట్లును తెలిసినది. కాబట్టి, యీకుట్రలనన్నిటిని పగులగొట్టివేసి, యీపరాసుదెయ్యమును వదిలించుకోడానికి మన బ్రిటిష్ సేన ఆకస్మికముగ ఢిల్లీనగరములో కనబడితేనేగాని వీలులేనట్లు నాకు తోచినది. (3) శత్రువుగనుక యిప్పుడు కొంచెము మేల్కొన్నాడంటే, ప్రక్కనున్న రోహిలాలతోచేరి మనదేశముమీదపడి, సర్వము నాశనము చేయగలడు. కాబట్టి యీమూడు కారణములచేతనే నిప్పుడు ఢిల్లీవచ్చుట తటస్థించినది......క్లుప్తము]

ఈ మూడు కారణములకంటె కూడ అసలు నిజమైన కారణము ఢిల్లీ చక్రవర్తి రహస్యముగ చేయనంగీకరించిన సహాయమేయని చెప్పవలసి యున్నది. ఈరీతిగ ఢిల్లీపైకి పోయిన ఆంగ్లసేనను అక్కడ 'బోగ్నన్' అను పరాసువాని యాధిపత్యమున నున్న సింధియా సేన యెదిరించెను. కాని పాలమ్ బుద్ధిహీనుడై సింధియా సేనలకు లంచములిచ్చి ఇంగ్లీషువారి పక్షమున పరీకగుటచే సింధియా సేన—1803 సం॥ సెప్టంబరు 11-వ తేదీన అతి సులభముగ ఓడిపోయెను. అంతట లేక్ సేనాని నామమాత్ర చక్రవర్తి బిరుదాంకితుడగు పాలమ్ పాదుషాను సెప్టంబరు 16-వ తేదీన దర్శించి తగు మర్యాదల జేసెను. కాని, రాజ్యమును మాత్రము అతని కివ్వలేదు. తనను మహారాష్ట్రుల చెరనుండి విడిపించి, తనకీ రాజ్యమునంతను ఇంగ్లీషువారు కట్టబెట్టుదురని వెఱ్ఱిబాగుల పాలం—పాపము—లోలోన ఉవ్విళ్ళూరు చుండెను. కాని, తీరా తమపని తీరగానే, ఇంగ్లీషువారీ రాజ్యమును తామే కాజేసిరిగాని, పాలంకొక్క అంగుళమైనను యివ్వలేదు—ఇక పాలం పనియేమున్నది?—లబాయిలు—దిబాయిలు—!

బాదుషా సింధియా చెరవీడి కంపెనీ చెరలో బడుట.

ఢిల్లీ కాపలాకై లేక్ సేనాని అక్కడ ఒకపెద్ద ఇంగ్లీషు సేననుపెట్టి, సివిల్ మిలిటరీ వ్యవహారముల నన్నిటిని జూచుటకు కర్నల్ ఆక్టర్‌లోనీ యను వానిని రెసిడెంటుగ నియమించెను.

ఆగ్రాకోట వశమగుట.

ఢిల్లీలో యీ యేర్పాటులు చేసినపిమ్మట, లేక్ సేనాని సెప్టంబరు 24_వ తేదీన ఆగ్రా మీదికి నడచెను. ఈకోటయు కొద్దిరోజులు యెదిరించినను, ద్రోహుల పుట్టయగుటచే ఇంగ్లీషువారికి సులభముగ లోబడిపోయెను. లేక్ సేనాని రహస్యముగ సాగించిన బేరములవల్ల సింధియా కొలువునుండి 2500 మంది వచ్చివేసి ఇంగ్లీషువారి సేనలో చేరిరి. ఈవిధముగ ఆగ్రాకోట అక్టోబరు 17-వ తేదీన ఇంగ్లీషువారి వశమయ్యెను.

లాస్వారీ యుద్ధము - సింధియా సైనికుల ప్రచండ
ప్రతాపము - కంపెనీవారి లంచపు గెలుపు.

ఇంకొక్క యుద్ధముతో ఉత్తర హిందూస్థానములోని యుద్ధములు పూర్తి యయ్యెను. ఇదియే సింధియాకు సంపూర్ణ పరాజయమును, ఇంగ్లీవారికి సంపూర్ణ విజయమును గలిగించిన "లాస్వారీ యుద్ధము." ఈ యుద్ధమందు............

["శత్రు సేనకు నాయకుడులేడు. వారందరు మనవైపునకు వస్తామని ఒకరోజు అంటున్నారు. మరొకరోజు మరొకవిధముగ మాట్లాడుచున్నారు. కాబట్టి, వీరిమాట యెటూ నమ్మడానికి వీలులేకుండవున్నది. వారైనను యెక్కువమంది లేరు. వారివద్ద మందుగుండు సామగ్రియులేదు. కాబట్టి, వీరిని జయించడమేమిలెక్క?........వీరితో బేరంకుదరగానే, అవసరమైతే, గ్వాలియరుమీదికి పోతాను."—[క్లుప్తము].

అని లేక్ సేనాని 1803 సం॥ అక్టోబరు 28-వ తేదీన వెల్లస్లీకి వ్రాసెను. ఇట్టి పరిస్థితులలో సింధియా గతిని నిర్ణయించిన లాస్వారీ యుద్ధము 1803 సం॥ అక్టోబరు 31-వ తేదీన జరిగినది. ఇక యిందులో ఇంగ్లీషువారికి జయము గలుగక యేమగును? లేక్ సేనాని రహస్య తంత్రముచే చీలిపోయినవారు పోగా, మిగతా భటులు మిక్కిలి ప్రతాపముతో పోరాడిరని లేక్ సేనానియే మెచ్చుకొనెను. ఇందునుగూర్చి అతడు 1803 సం॥ నవంబరు 2-వ తేదీన గవర్నర్ జనరలుకు వ్రాసిన యుత్తరములో నిట్లని చెప్పెను.

[ఆముండకొడుకులు దెయ్యాలలాగున పోట్లాడినారు. కాదు, వీరులలాగునపోట్లాడినారు. మనమెంతో గట్టిగపోరాడబట్టిగాని, లేకపోతే, మనతాడు తెగేదే!... అప్పుడు శత్రుపక్షములో ఆ ఫ్రెంచి ఆఫీసర్లేగనుక వుండివుంటే, మనపని యేమయ్యేదో దేవునికెయెరుక. అబ్బా! యింత సంకటస్థితిలో నాజన్మలో నేనెప్పుడూ ఉండలేదు. ఇట్టిఅవస్థ నాకీజన్మలో యికముందుకూడ

యెప్పుడూ తెచ్చిపెట్టవద్దురా బాబూ అని నేను దేవుడికి వెయ్యిమ్రొక్కులు మ్రొక్కుకుంటున్నాను.—(క్లుప్తము.)]

కాబట్టి, స్వామిద్రోహమే లేకపోతే, ఇంగ్లీషువారిగతి యెట్లు మారెడిదో లేక్ సేనానియే చెప్పుకొన్నాడు.

ఇక సింధియా రాజధానియగు గ్వాలియర్‌ను పట్టుకొనుటతప్ప, గవర్నర్ జనరల్ చేయమన్న యావత్తు పనులను లేక్ సేనాని ఉత్తర హిందూస్థానములో పూర్తిచేసివైచెను. గ్వాలియరు మీదికి పోవుటకు ముందుగ, రాజపుటానాలో నున్న రాజులనందరిని కట్టుకుంటేనేగాని వీలులేదని లేక్ సేనానికి తోచినది.

గ్వాలియర్ కోట-సశేషము.

అందులో జయపురము మున్నగు రాజుల కొందరిని తానులోపాయి కారీగ స్వాధీనపరచుకొన్నట్లు యితడు నవంబరు 14-వ తేదీన గవర్నర్ జనరలుకు వ్రాసెను. కాని దీని పిమ్మటనైనను లేక్ సేనాని గ్వాలియర్ కోటమీది కేల పోలేదో తెలియదు. యుద్ధములేకుండ ఖిల్లాదారునకే లంచమిచ్చి యీకోటను స్వాధీనపరచుకొన వచ్చునని యితడు తలచినట్లున్నది. అందుచే లాస్వారీ యుద్ధముతోనే ఉత్తర హిందూస్థానమున యితడు తన దండయాత్రను ముగించెను.

## సింధియా భాన్‌స్లే పర్వ సమాప్తి.

గవర్నర్ జనరల్ వెల్లస్లీ రహస్యముగ పన్నిన "మ్యాక్‌వెల్లి" (చాణక్య) తంత్రము లన్నియు చాలవరకు ఫలించినవి. సింధియా భాన్‌స్లేలను కూకటివ్రేళ్లతో సహా పెరికివేయవలయునని వెల్లస్లీ సంకల్పము. కాని, యీసంకల్పము పూర్తిగ నెరవేరలేదు. తనతమ్ముడు ఆర్థర్ యెంతలేసి కుట్రలు పన్నినను, యుద్ధ నియమములకు విరుద్ధముగ యుద్ధవిరామకాలమందు శత్రువుపైకి యెంత అక్రమముగ 'ఆర్గాము' వద్ద దూకినను - దౌలత్‌రావుసింధియా బలమును అతడు పూర్తిగ అణగద్రొక్కలేక పోయెను. ఇందునుగూర్చి ఆర్థర్ 1803 సం॥ నవంబరు 23 వ తేదీన గవర్నర్ జనరల్ కార్యదర్శి కిట్లని వ్రాసెను:—

సింధియా బల శేషము—ఇంగ్లీషు వారికి అసాధ్యము.

[నేనిక దౌలత్‌రావు సింధియాపై యేమియు చేయజాలనని యిదివరకే గవర్నర్‌జనరల్ గారికి వ్రాసియున్నాను. ముఖ్యముగ గుజరాతు ప్రాంతమున మనమేమియు చేయజాలము... .........యుద్ధరంగమందు సింధియా కిప్పటికిని గుఱ్ఱపు దండుమాత్రమున్నది. చాలదూరము, బహుకాలము వెంబడించినగాని, దానిని మనము కించిత్తయినను కదల్పజాలము. మనమట్లు చేసినచో, మనకు సప్లయిలు అందుబాటులేని బహుదూర ప్రదేశములకెక్కడికో పోవలసి వచ్చును. మరియు, బీరారు రాజగు భాన్‌స్లేపై మనమిప్పుడు చేయుచున్న పోరాటమునకు యిబ్బందికలుగును. మనకు నెమ్మది గలిగితే యీ భాన్‌స్లే యుద్ధమువల్లనే కలుగవలసియున్నది—ఇట్టిదానికి భంగము రాకూడదుగద.—క్లుప్తము]

మహారాష్ట్రులు శాంతి గావలెనని యెంత యాతురముతో నున్నారో, ఇంగ్లీషువారును అంత యాత్రములోనే యున్నారని ఆర్థర్ వ్రాసిన యీమాటలే చెప్పక చెప్పుచున్నవి. కాబట్టి, ఉభయ పక్షముల మధ్య రాజీమాటలు ప్రారంభమయ్యెను. 1803 సం॥ డిసంబరు నెలలో సింధియా భాన్స్లేల పక్షమున వారివారి మంత్రులు సంధి పత్రములపై సంతకములు చేసిరి. ఈయొడంబడిక వల్ల సింధియా భాన్స్లేలకు వారివారి తాలూకు మిక్కిలి ఫలవంతములగు ప్రాంతములన్నియు పోయెను. ఇంగ్లీషువారి దాస్య బంధము వారిమెడలకు పడెను.

సంధి.

1803 సం॥ ఫిబ్రవరిలో సింధియా ఇంగ్లీషువారి యద్దెసేనల నుంచుకొనుటకు అంగీకరించుచు వేరొక యొడంబడిక చేసుకొనెను. జస్వంతరావు హోల్కారు వచ్చి దుర్బలుడై యున్న తన నిప్పుడు హింసించునేమోయను భయముచేతనే దౌలత్‌రావు సింధియా యిప్పుడీరీతిగా ఇంగ్లీషువారిసేనల నద్దెకు పుచ్చుకొనవలసి వచ్చెను. ఆహా! మహారాష్ట్ర నాయకుల పరస్పర కలహములు యెంతటి ముప్పును తెచ్చి పెట్టినవి! పీష్వా బాజీరావు ఇంగ్లీషువారి వలలో పడకుండ చేయవలయునని తనశక్తి నంతను ధారవోసిన దౌలత్‌రావు సింధియా, నేడు తానే బుద్ధిపూర్వకముగ వచ్చి యీవలలో విధిలేక పడవలసివచ్చెనే-హా! హతవిధీ! నీవేమి చేయించలేవు? తనపంతమిట్లు నెగ్గినందుకు వెలస్లీ యెంత గర్వించి యుండును!

సింధియా కంపెనీ యద్దెసేనల నంగీకరించుట.

మహారాష్ట్ర కులమునకు ముసలమై పుట్టిన బేసిన్ ఒడంబడిక యెంతపని చేసినది! దీనివల్ల గలిగిన మొత్తము ఫలితమును గూర్చి ఆంగ్లేయుల పక్షమునుండి మిల్లు చరిత్రకారుడిట్లు చక్కగ ఒక్కమాటలో చెప్పియున్నాడు.

బేసిన్ ఒడంబడిక ముసలము యెంతపని చేసినది!

[ఈ బేసిన్ ఒడంబడిక కథ ముగించేటప్పుడు గట్టిగ ఒకమాట చెప్పవలసియున్నది. దీనివల్ల పుట్టిన మహారాష్ట్ర యుద్ధములకుగాను మనకెంతో డబ్బునష్టమైనది. ఈ మాట నిశ్చయము. ఇదికాదని యెవరును అనరు. ఇందువిషయమై అపోహలుగాని, అభిప్రాయ భేదములుగాని లేవు. అయితే, యీ ఖర్చంతా మనము దేశీయరాజులతో చేసుకొన్న యద్దె సేనల యొడంబడికలవల్ల మనకు ముదరా రాలేదాయని కొందరనుచున్నారు. వానివల్ల మనకు యీఖర్చంతా మళ్ళుతుందనే ఆశచేతనే గద మనమీ పెట్టుబడి పెట్టినాము అని కొందరనుచున్నారు. ఈ యాశయైతే యెంతవరకు నెరవేరినదో-లేక, యిదివరకున్న ఋణభారమే మరింత హెచ్చయినదో గట్టిగ చెప్పలేముగాని—ఒక్కమాటమాత్రము గట్టిగ చెప్పగలము. అసలీ యుద్ధములకన్నిటికి మూలకారణమైన యీ బేసిన్ ఒడంబడికను ప్రేరేపించిన మూలతత్వ మేదియో దానిని గురించి యెవరికిగాని, యెట్టి సందేహములుగాని లేవని మేము గట్టిగ చెప్పుచున్నాము. ఖర్చు మళ్ళినదాలేదాయను విషయమై ఎవరికైన అభిప్రాయ భేదములుండవచ్చునుగాని, ఈ బేసిన్ ఒడంబడికను ప్రేరేపించిన అసలు మూలతంత్రమును గూర్చి యెవరికిగాని, యెట్టి భిన్న

ప్రాయ భేదములుగాని, అపోహలుగాని, యుండజాలవు..............(క్లుప్తము) Mill's History Vol. VI, P. 392.]

కాబట్టి, బేసిన్ ఒడంబడికవల్ల ఇంగ్లీషువారు ఆశించిన ప్రతిఫలము రూపాయి అణాల, పైసలలోగాక, నిస్సందేహముగ దేశీయరాజుల స్వాతంత్ర్యహరణము లోనే గలదని మిల్లుపండితుడు కుండబ్రద్దలుగొట్టి చెప్పవేసినాడు. రూపాయి, అణాల, పైసల ప్రతిఫలము వచ్చిన వచ్చుగాక, రాకున్న మానెగాక, దేశీయరాజుల స్వాతంత్ర్య హరణ ఫలము మాత్రము తమకు దక్కి తీరవలయునని ఇంగ్లీషువారి అసలు యెత్తు. ఈ యెత్తే బేసిన్ ఒడంబడికను సృష్టించినది! ఇది నిస్సంశయము!

ఇంగ్లీషువారి జయము భగవల్లీల.

ఇంగ్లీషు వారికి యీరీతిగ జయములు గలుగుటకు భగవంతుడుకూడ తోడ్పడినట్లున్నది. విచిత్రముగ ఆ సంవత్సరము ఉత్తర హిందూస్థానములో మామూలుగ కురియు వానలు కురవ లేదు. అందుచే, యుద్ధకార్యములందీ యనావృష్టి ఇంగ్లీషు వారి కెంతయో తోడ్పడెను. ఈ సంగతిని లేక్ సేనానియే 1804 సం॥ మే 12-వ తేదీ ఉత్తరములో వ్రాసెను.

[మనము ఉత్తరహిందూస్థానమును జయించు నిమిత్తమై భగవంతుడే యీయేడు ఇట్లు వర్షములులేకుండ చేసినాడనిచెప్పి మూఢవిశ్వాసముగల నేటివులు అనుకొనుచున్నారు. భగవంతుడే ఇంగ్లీషువారి పక్షముననుండి పోరాడుచున్నాడు కాబట్టి, వారిని యెవరు యెదిరించ జాలరని దేశప్రజ లనుకొనుచున్నారు. నాకును అట్లే గట్టిగతోచుచున్నది. మనకు గలిగిన యీ అద్వితీయమగు విజయపరంపరలను జూడగ, మనకంటికి కనబడకుండ యేదో మహాశక్తి యొకటివచ్చి, మనకు సహాయము చేయుచున్నదని నాకుగట్టిగ తోచుచున్నది. ఇట్టి మహత్కార్యములు ఆ పరమేశ్వరుని సహాయమునగాని గాజాలవు. కాబట్టి, ఆ మహత్కార్యములనుగూర్చి తలచుకొనునప్పుడెల్ల, నేను పరమేశ్వరునకు కేలుమోడ్పక యుండజాలను. .........]

ఓ! సమగ్రమగు విశాల జాతీయ భావమును విస్మరించి, నీచ సంకుచిత స్వార్థములకు లోబడి, తెగిన హారములోని ముత్యములట్లు, దేశములు ప్రజాసమూహములు, ఖండ ఖండములుగ, ఛప్పన్నరాజ్యములుగ, అనేకరీతులుగ చీలి, చెదరి పోయి, ఒకరికొకరు ద్రోహము చేసికొనుచు, ఒకరికొకరు ముట్టక అంటక, మహాసంకుల పంకమున పడి కొట్టుకొనుచున్న యీ దౌర్భాగ్య భారత మానవ పాషాణ సమూహముల నన్నిటిని ఘోరదాస్య దవాగ్ని జ్వాలలందు బహుకాలము పడవైచి,

భారత సంహారక్రీడ- ప్రళయ తాండవము - నూతన సృష్టి.

తప్తమొనర్చినగాని, ఇవన్నియు కరిగి, దుర్భేద్యమగు యేక భారతజాతిగ చిక్కమొకట్టవను మహోత్కృష్ట సంకల్పముతోడనే పరమేశ్వరు డీరీతిగ మహాభారత ప్రజా సత్ర యాగమును సాగించి, తత్ప్రజాళినెల్ల యీ యాంగ్లరాజ్య

మహాగ్నికుండ మందా నా డట్లు పడవేయ బూనుకొనెనని నిస్సంశయముగా చెప్ప వలసి యున్నది. అట్లుగానిచో, అహో, యీ మహాభీభత్స దృశ్యమేమి ? అట్లు నిచో, యీ మహాఘోర సంహారమునకు పరమ దయాకరుడగు పరమేశ్వరుడేల పూనుకొనును ? ఇది పరమేశ్వరుని ప్రళయ తాండవకేళి—ఇది మహా విశ్వ సంహారక్రీడ—ఈ సంహారక్రీడలో ప్రళయ నృత్యమొనర్చు చండీశుని పాద ఘట్ట ములకు కఠినశిలలు, పాషాణ పర్వతములు, సమస్తము నుగ్గు నుగ్గయి, ద్వాద శార్కుల ప్రచండ కిరణాగ్ని జ్వాలలలోపడి, కరగి, నీరై పోవలసినదేగదా!— ఇక మహారాష్ట్రుల కోట గోడలేమిలెక్క! ఈ నీరంతయు తిరిగి సృష్టి కాలమందు చిట్టెము కట్టి సుందరమగు భూతధాత్రి కానున్నది. ఈ సంహార క్రీడకు భీతినొందని మార్కం డేయులు— యీ యేకార్ణవమందు వటపత్ర శాయియై చిరునగవుతో తేలియాడు చున్న బాలకృష్ణుని-ఆ చిన్నిగాంధిని— శరణుజొచ్చు మార్కండేయులు కావలెను. వారీ నూతన సౌమ్య సృష్టిని కన్నులార గాంచి ఆనందించగలరు! భయము లేదు! భయములేదు! ఈశ్వరుడీ ప్రళయ భీభత్సరూపము నిప్పుడే యుజ్జగించగలడు.

ఓం శాంతిః శాంతిః శాంతిః.

ప్రథమ సంపుటము

సమాప్తము.



కేసరీ ముద్రాక్షరశాల, చెన్నపురి.



## మనసు ఫౌండేషన్

## పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | REHBO2E192 |
| పుస్తకం పేరు | ఆదిపర్వ మహాభారతము |
| తారీఖు | 16/12/23 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 700 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI, XII, XIII, 4B, 66B, 214A |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Nandhu |
| పేజీలు విడదీసినది | Nandhu |
| స్కాన్ చేసినది | Prathyusha |
| పరీక్ష చేసినది | Lakshmi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |

Blank pages :- 296A, 306B, 348B
358A, 448B, 630